అప్పుడు వారు పూర్ణముగనే తెనిఁగించి యున్నను ఏలోకో కొంతభాగము ప్రక్షిప్తమగుటచే దరిమిలా ఆ ప్రక్షిప్తభాగములను శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పూరించుట తటస్థించినది. వీరు దివాకర్ల తిరుపతిశాస్త్రి గారి కుమారులు. శ్రీ ఆకొండి రామమూర్తిగారు నేటికిని సజీవులైయున్నను దీనిని వీరాంధ్రీకరించుటయేల? అనునొక ప్రశ్న కలుగు. దానికి వారి వాత్సల్యమే సరియైన ప్రత్యుత్తరమని నేను విశ్వసింతును. ఇది నవమస్కంధ వృత్తాంతము.

ఇఁక దశమస్కంధ మన్ననో? మా పినతాతగారి కొమరుఁడైన చెళ్లపిళ్ల చినవేంకటశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడినది. వీరు బాల్యమున మా తండ్రిగారి వద్దనే కవితాభ్యాసము గావించు సందర్భములోనే దీని నాంధ్రీకరించిరఁట. అనగా అర్హత నెఱింగి మా తండ్రిగారే వారికి ప్రోత్సాహ మొసంగిరనుట యోగదా? ఈ చినవేంకటశాస్త్రిగారు ముప్పదేండ్లను మైఁబడిన వయస్సుననే పరమపదించిన వారగుటచే వీరితర గ్రంథములేమియును వ్రాసియుండ లేదుగాని అవధానిగా పండితకవిగా మాత్రమా స్వల్ప జీవితముననే వన్నెకెక్కి యిందుఁ జిరస్థాయియగు ఖ్యాతి గడించుకొన్నవారు — ఇది దశమస్కంధ విషయము.

ఇట్లు బుధజనవిధేయుఁడు

విద్వాన్,

చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి,

గ్రంథపరిష్కర్త.

# విషయసూచిక.

## పంచమ స్కంధము



## షష్ఠ స్కంధము



## సప్తమ స్కంధము

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

శా. శ్రీయుం బార్వతియుం సరస్వతియు స్వశ్రీలేశసంజాత లా
క్షాయత్తుల్ హరిరుద్రనీరజభవాద్యాదిత్యసంఘమ్ము లే
మాయాతీతను నే జగజ్జనని కే మాత్రాస్వరూపాఢ్య కే
ధ్యేయప్రాభవ కట్టి శక్తి నతి భక్తిన్ గొల్తు మిష్టాప్తికిన్. 1

వ. ఇట్లు. 2

ఉ. అంబకు మ్రొక్కి మీఁద జలజాంబకులన్ గొనియాడి యంత హే
రంబుని సన్నుతించి గుణరాసుల మూర్తుల భార్యలన్ గృపా
లంబితచిత్తలన్ దగఁదలంచి యిహమ్ముఁ బరమ్ము నెంచి వం
శంబు తరింపఁజేయ నవిశంబు మనంబునఁ గాంచి యంతటన్. 3

వ. అష్టాదశమహాపురాణమ్ముల యందుఁ బంచమం బగు దేవీభాగవతంబు దెనిఁగింప నారంభించి శిష్టాచారంబగు కతన మామా వంశమ్ము లొక్కింత చెప్పుచు నాబాల్యప్రవర్తమానంబగు నస్మదీయోదంతంబు గొండొక విస్తరించెదము. 4

## తిరుపతిశాస్త్రి వంశము

సీ. సతతాగ్నిహోత్రదీక్షాశాలి ధన్యుఁ డం • తర్వేది యెవని ముత్తాతతాత
యెవని తాతకుఁ దాత యారేడు విద్యలఁ • బాటవమ్మున మించు పానశాలు
చదువుమైఁ దండ్రితో సముఁడు వేంకటయోగి • తతకీర్తి యెవ్వాని తాతతండ్రి
సాంగవేదాధ్యేత యనఘచర్యుండు సుం • దరరాముఁ డెవ్వాని తండ్రి తండ్రి

గీ. సర్వకర్మస్వతంత్రుండు శాస్త్రవేత్త • యనఘుఁడు త్రయీమయుఁడు వేంకటావధాని
యెవనిజనకుండు శేషమ యెవని తల్లి • నూగు రన్న లెవనికిఁ దమ్ముం డొకండు.

సీ. హరితసగోత్రంబు యాజుషశాఖ ది • వాకరవంశ మెవ్వాని కలరు
మప్పులూర్యన్వవాయుఁడు రామయోగి సి • ద్ధాంతివర్యుండు మాతామహుండు
జనకుండు శంకరశాస్త్రి సుబ్బమ తల్లి • సూర్యప్రకాశుండు సోదరుండు
గాఁ గలసాధ్వి వేంకటలక్ష్మి యనఘ చా • వలివంశజాత యెవ్వానితరుణి
గీ. గౌతమీమండలాంతరకలిత మెండ • గండియను గ్రామ మెవ్వాని కాఁపురమ్ము
నతఁడ వెలనాఁటివాఁడను వితతయశుఁడఁ • బేరు తిరుపతి పండితులార ! నాట*

## వేంకటశాస్త్రి వంశము

శా. భూమిన్ బ్రాహ్మణశాఖలం దొకటియై పొల్పొందు నెంతేని నా
రామద్రామిడశాఖ, దానఁ గవితారంభప్రియంభావుకం
బై మా వంశము వొల్చు యాజుషసుశాఖాంతర్గతంబై సదా
రామంబై తెగదెంపులేక తగు భారద్వాజగోత్రమ్మునన్. 7
గీ. అందుఁ బెద్దా మహామహు లవతరించి, పేరు గాంచిరి గుణరత్నపేటులనఁగఁ
దనరి దవ్వూరిలోన ముత్తాత లగుచుఁ, గామయాన్నయనరసయ ఘనులు నాట. 8
వ. గౌతమీమండలమ్మునఁ దుల్యాతటమునం దనరు కడియ మ్మను గ్రామమ్మున
వసించు మూర్తిత్రయమ్మునం దోని య మ్మహపూర్వరందు. 9
సీ. పెద్దకవీంద్రుఁడై పేరుచెందినవాఁడు • చిన్నముత్తాత నరసన్నగారు
ప్రతి లేని సంపత్తిఁ బరిఢవిల్లినవాఁడు • తాత వెంకన్న విఖ్యాతికరుఁడు
కామయమనుమఁడు రామాంబకొమరుండు • తండ్రి కామయ్య సత్య నిరతుండు
తదనుగుణప్రవర్తన గల్గి వర్తించు • సాధ్వి చంద్రమ్మ మత్జనని యేను
గీ. వేంకటేశుండ లక్ష్మి నా వెలఁది కులవి • ధమ్ము తెల్లను చిన్నముత్తాత తనదు
గ్రంథముల విస్తరించె నాకన్న నింటి • పే రెఱుఁగఁ జెప్పెదను చెళ్ళపిళ్ళవారు.

---

*పాఠాంతరము.

సీ. హరిదశ్వపూజాపరాయణత్వప్రపనం • గమువాఁడు తండ్రి వేంకటవధాని
అన్న మొన్నం దేరిరైన లే దనని యు • త్తమురాలు తల్లి శేషమ సుసాధ్వి
ఆజన్మధర్మవిద్యాధ్యాపకత్వ మిం • పగువాఁడు గురువు బ్రహ్మయ్యశాస్త్రి
గోచి పెట్టకమున్న కోమలకవిత చె • ప్పినవాఁడు సహపాఠి వేంకటకవి
తే. గీ. లలితగుణనిధి వేంకటలక్ష్మిపత్ని • కలితకవితావిలాసిని వలపుసావి
యుండు గ్రామంబు యల్లిళ్లో యెండగండి • పేరు తిరుపతి పండితులార ! నాట.

మ. అనఘుండై మదనాభిరామనృపకన్యాచిత్రచారిత్రముల్
జనసుత్యంబగు వేంకటేశ్వరవిలాసంబున్ దగన్ జెప్పి రా
మున కర్పించి పరంబు గన్న మహితుల్ ముమ్మాటికిం గొల్తు నా
పినముత్తాత నగణ్యపుణ్యవిభవాబ్ధి న్నారసింహాఖ్యునిన్. 11

వ. తిరుపతివేంకటేశ్వరుల మైన యీ మేము బాల్యమ్మునన పరదేవతా విరుపాధిక కరుణాధిరణకారణంబగు కవితావైభవమ్మునం బ్రబలి చిటిపొటి పద్యమ్ముల వల్లి కొనుచు వేర్వేఱ ననేకగ్రామమ్ముల ననేక గురుసాన్నిధ్యమ్మున సాహితీసంపాదనం బొనర్చికొని. 12

గీ. తెలివియును దేటయును బిక్కబలిమి కలిగి, చెలఁగియును నిష్ఫలండగుచీకుపగిది
డంబు మీఱియు హాస్యాస్పదంబ కాదె, శబ్దశాస్త్రవిహీనుని సరసకవిత. 13

వ. అని యెంచికొని తచ్ఛాస్త్రాభ్యాససమాదృతాంతరులమై కడియెద్ద యనునొక విఖ్యాత గ్రామమ్మున వసియించు పతంజలింబోని వాని ననఘచరిత్రు నాపస్తంబసూత్రు లోహితసగోత్రుఁ బాపమాంబాగర్భశుక్తిముక్తాయమాను వీరనపుత్రు పుల్లయార్య వేంకటార్య దుర్గయార్య భ్రాతృత్రితయానుజన్ము నన్నపూర్ణాపతిచిత్తజన్ము. 14

శా. స్వర్లీలారమణీమణీవినుతదీవ్యద్దానధర్ముండు ప్రా
తర్లక్ష్మీనదనాభిరామహృదయాంతస్సంభితశ్రీశుఁ డం
తర్లక్ష్యీకృతవేదశాస్త్రవివిధార్థజ్ఞానసంధానుఁడౌ
చర్లబ్రహ్మసుధీశ్వరున్ వివి మదిన్ సంతోషమెంతేఁదగన్. 15

వ. ప్రత్యేకంబ దైవవశమ్మునఁ దత్సన్నిధిం గలసి గురుకులవాసంబు సేయుచు సవయస్కత్వమ్మును సమానబుద్ధిమత్తయుం గలుగు కతన నిద్దఱమయ్యు నొక్కని పగిది సహాధ్యాయిత్వమ్మునం బొదలుచు నైదువత్సరమ్ముల కా భాష్యంబుఁ బఠించి, తన్మధ్యకాలంబునన కాశీసహస్రధాతురత్నాకరవీధినాటకశుకరంభాసంవాదాదికమ్ము లగు సంస్కృత గ్రంథమ్ములు రచియించియుఁ, దత్తద్దూరదేశమ్ముల కరిగి శతావధానాష్టావధానాదికంబు లొనర్చి తత్తన్నృపమణులచేఁ గనకకనక ఘోషణనాగమంటపారోహణాది సమ్మానమ్ములును జయపత్రమ్ములును తత్సూచకంబులగు బంగరు బిరుదమ్ములును నంది, పదంపడి గురుసాన్నిధ్యమ్ము విడిచి, యాంధ్రకవితాకుతూహలం బుప్పతిలఁ దత్సాధకమ్ములగు భారతాదుల వరసి శ్రవ

జానందం బను నొక కల్పితప్రబంధమ్ము రచియించి, యంతం దనివి సనక
యెద్దియేని యొక మహాపురాణం బాంధ్రీకరింప నుంకించు మాకు, 16

క. యోగము మంచిదనుచు వే, తే గొణగఁగ నేల వ్యాసఋషిరచితంబై
యోగమ మనఁదగు దేవీ, భాగవతము తెలుఁగుసేయు భాగ్యము గలిగెన్. 17

క. ఎన్ని పురాణమ్ములఁ దా, మన్నియు నాంధ్రీకరించి, యనుకంపను గా
కున్నన్ దీనిన్ విడుతురె?, నన్నయభట్టాదికవిజనమ్ములు మారున్. 18

మ. "ఇది వ్యాసుం డొనరింపలే దనియు శ్రీకృష్ణున్ బ్రశంసించు న
య్యదియేతత్కృత" మంద్రుగొందఱు; అటులే నౌఁగాక మాకేమి? భా
గ్యదముగా ముక్తిద మంచు దీనిఁ దెలుఁగుం గావింతు ముద్యద్దయా
స్పదుల న్నారదబాదరాయణుల విశ్వస్తుల్యులఁగా గొల్చుచున్. 19

ఉ. వ్యాసుఁ డొనర్చినట్టి యల భారత మన్యపురాణజాలమున్
రోసివమీఁద దీనిఁ దగ రోసితిరేనిఁ గవిత్వశైలి యొం
డై సరివచ్చు వేఱొకటి యన్యకృతం బని తోఁచుఁ గాని యీ
వ్యాసునిశైలిగా దిది మహాకవివేద్యము గాక యుండునే. 20

వ. అని యేతత్పురాణరత్నం బాంధ్రీకరించుచు నధునాతనభవిష్యన్మహాకవులంగూర్చి,

గీ. ఎచ్చటేనియుఁ దప్పుండు టేరికైన, ధర్మమే; భ్రాంతి పురుషుల ధర్మమగుటఁ
బటకు దెబ్బదిపదొకొండు తొటుకు లుండు, వారు వీరను నొకతీరువారు గారు.

గీ. భారతాదులలో యతిభ్రంశమాది, యైనదోషమ్ములును గల; వంతమాత్ర
వారిపాండిత్యమునకు లోపమ్ము రాదు, భ్రాంతి గడవంగ శక్యమే? బ్రహ్మకైన.

క. కోవిదులమంచుఁ గొందఱు, దేవానాంప్రియులు దమకుఁ దెలియక గుణముగా
గావింతురు దోషముగా, భావించి కనంగ రాదె! భారతమెల్లన్. 24

గీ. కేవలగ్రామ్యపదముల నేవగించి, జనులు వాడెడిపదములు సమ్మతములు,
"కలవు లే" వని పెనఁగ శక్యంబె? భార, తాదులను లేని పదములు నవనిఁగలవె?

క. వ్యాకరణ మొక్కత్రోవ, మ, హాకవు లొకత్రోవ, కోశ మఖిల మ్మొక త్రో
వై కనుపట్టెడి, నీ భా, షాకావ్యమ్ములను దఱచు చదివిన కొలఁదిన్. 26

క. కేవలసంస్కృతమర్యా, దావిదులును గేవలాంధ్రతత్పరులును గా
కేవార లుభయభాషా, కోవిదు లవ్వారు దీనిగురువులు జగతిన్. 27

ఉ. భారత సారవేదు లగు పండితు లిందలి దోషమున్ గుణం
బారసి నిశ్చయింపఁ గల; రన్యుల కిందలి సుప్రయోగవా
గ్ధోరణు లన్యథాగతినిఁ దోఁపకమానవు; వేయునేల! సా
ధారణు లీకృతిం గ్రమునఁ దప్పులు పట్టక యుండు టొప్పగున్. 28

ఉ. భారత మాంధ్రసత్కవులపాలిఁటి వేదము దాన నుండు వా
గ్ధోరణులెట్టివైన నవి ద్రోయఁగ రానివి "తప్పు" అంచు సా
ధారణరీతిగాఁ గుకవితండము లాడు ప్రయోగజాల మా
భారతమందుఁ గన్పడెడిఁ బండితు లయ్యవి స్వీకరింపరే? 29

ఉ. తా నొకకట్టు చేసి యది దాఁటెను నన్నయ కొన్నిచోట్ల; నా
పైని స్వతంత్రుఁడై తనదుపాండితి చూపెను తిక్కయజ్వ; యా
పై నొకకొంతసాహసము పన్ని రచించెను నెఱ్ఱనార్యుఁ; డే
మైనను భారతమ్మునకు నంజలి సేయక తీర దేరికిన్. 30

ఉ. మూగురియందు నన్నయ సమున్నతుఁడై కడు లక్షణంపుఁ ద్రో
వై గుదిగూర్చునేర్పుగలఁడై తగు; నించుక కేమి యజ్వయున్
లోఁగక యాతనిం జెనయు; న్యూనుఁ డనం దగఁ డెఱ్ఱనార్యుఁ డెం
తే గడునుందనమ్ము గలఁ డిర్వురకున్ సరివచ్చు నన్నిఁటన్. 31

మ. "అసిధారావ్రత మూని తిక్కన కవిత్వారంభముం జేసె" నం
చు నడిన్ విందుము కాని, నన్నయక యాశ్రోత్రమ్ము చెల్లన్ గదున్
రసవంతమ్మగుఁగాక శబ్దములచంద మ్మెన్నియో దోసముల్
పొసఁగున్ నన్నయకన్నఁ దిక్కనకు; నల్పుండౌనె? తన్మాత్రలోన్ 32

గీ. నన్నయకుఁదక్క నేఁటిదక్కను గవీంద్రు, లకట! శకటరేఫము యతులందుఁబ్రాస
ములను రేఫమ్ముతోడను గలుపుచుందు, రెవనిశక్యము? తిక్కనయే భ్రమించె.

ఉ. అప్పకవీంద్రుఁడున్ మఱియు నంతకుఁ బూర్వులు నవ్యులున్ గృతుల్
చెప్పిరి భారతమ్మున విశేషములం దిలకించి; వారి క
న్గప్పి విశేషముల్ శతము గన్పడుచున్నవి భారతమ్మునం
దిప్పటికిన్; సముద్రమున కెవ్వఁడు పారము నిర్ణయించెడిన్? 34

చ. తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది గ్రాహ్యమంచుఁ బె
ద్దలు కొనియాడు భారతము తప్పన శక్యము గాదు; దానిలోఁ

గలిగిన లక్ష్యభేదములు కాదన కాదృతి సంగ్రహించి వి
శ్చలగతి నిందుఁ గూర్చెదరు చక్కఁగఁ దిర్పతివేంకటేశ్వరుల్. 35

చ. ఒకటికి నొండుగ్రంథమున కుండు విరోధము దానికేమి ? వ్యా
స కృతములైన పొత్తములె సైఁప నొకం డొకఁడున్; మఱింత యే
టికి నొకపొత్తమేనియుఁ బఠించిన దానికి దానికే లగిం
పక పెఱరీతి గల్గు, నది బ్రహ్మకునైన లగింప శక్యమే ? 36

వ. అని నొక్కి వక్కాణించి. 37

క. నన్నయకుఁ దిక్కనకు నె, ఱ్ఱన్నకుఁ బోతన్నకుఁ మహాకవులని మా
కన్న మతిగన్న యితయల, కు న్నతుల న్నించి వేఁడుకొందుము పేర్మిన్. 38

క. మును పోతన భాగవత, మ్మును దెనుఁ గొనరించి రాజముఖ్యుల కిడి త
ద్ధనమును గొనకే శ్రీరా, మున కిడి తత్కృపను భుక్తిముక్తులు గొనియెన్. 39

వ. కావున, 40

క. గురువే బ్రహ్మయు విష్ణువు, గురువే దైవంబు శివుఁడు గురువె పరుండన్
పరమామ్నాయము చొప్పున, గురువునకే దీని నిచ్చికొందుము కృతిగా. 41

వ. అదియునుంగాక, 42

సీ. అ ఇ ఉణ్ మొదలు గాఁగ నాభాష్యపర్యంత • మే మహామహుండు మాకిచ్చె విద్య
కన్నసంతానమ్ముకన్న నెక్కుడుగాఁగ • నే దయాళుండు మ మ్మాదరించె
పెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి • యే గుణనిధి మమ్ము నాగు చేసె
తిండికై యిల్లిల్లు దిరుగ నీయక యన్న • మే యన్నదాత మా కింట నిడెనొ

గీ. సకలదిగ్దేశరాజన్య సభలయందు • డంబు మీఱ శతావధానం బొనర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె • నట్టిగురునకుఁ గృతి యిచ్చు టర్హము కద!

వ. అని యమ్మహానుభావునకు నభ్యుదయపరంపరాభివృద్ధిగా మే మాంధ్రీకరింపంబోవు
దేవీభాగవతంబునకుఁ గథాక్రమంబు :— 44

# గ్ర ం థా ర ం భ ము.



తే. గీ. సర్వచైతన్యరూపయు సర్వమునకు, నాదిభూతయు నగు విద్య యస్మదీయ
హృదయమున నిల్చి తను జపియించుమంటె, బుద్ధి ననయముఁ బ్రేరేపిప్రోచుఁగాక.

శా. సూతుం గన్గొని శౌనకుం డను మునీశుండైన వ్యాసుండు ప్ర
ఖ్యాతిం జెందఁ బురాణముల్ మును రహస్యమ్ముల్ వెలింజేసి యం
తో తాత్పర్యముతోడ నిన్ను మతిమంతుం గా విచారించి యా
యా తంత్రమ్ములు నూఱిపోసె భవదీయాదృష్ట మింతింతయే ? 2

క. ఈవఁట చెప్పెడివాఁడవు, పావను లీమునులు వినెడివారఁట; క్షేత్రం
బీ విధికిఁ దగిన దగునఁట, కేవల మిదియెల్ల మా సుకృత మనఁ దగదే ? 3

ఉ. కావునఁ బుణ్యదం బగు నొకానొక మంచి పురాణసంహితన్
నీ వలనన్ గ్రహింపఁగ మునిప్రకరం బిది గోరుచున్న దీ
భూవలయమ్మునన్ దగినపుట్టువు వృత్తియు నిట్టిగోష్ఠికిన్
భావముఁ జొన్ప నేరని యభాగ్యులజన్మ మదేల కాల్పనే ? 4

గీ. జిహ్వ కెలమి షడ్రసములచేతఁ దృప్తి, యగుపటులు, గర్ణములకు దివ్యప్రభావ
భాగవతవాక్యపరిపాటివలనఁ గాక, కల్గునే ? తృప్తి వేఱొండు కతలవలన. 5

ఆ. వె. చెవులు లేనియట్టి చిలువలు నయితము, సౌఖ్య మనుచు శబ్దసరణి వినఁగఁ
జెవులు గలిగి వినని చెనఁటుల కర్ణరంధ్రముల కేమి ఫలము ? విమలచరిత ! 6

క. కాన నొకానొక పుణ్యక, థానిగమము వినఁ గడంగెదము; సజ్జను లే
దేని యుపాయాంతరమునఁ, బూని కదా ? కాలనియతిఁ బుచ్చుట యెందున్ ? 7

వ. మఱియు మూర్ఖులు దుర్వ్యసనమ్ములం దవులుదురు; పండితులు శాస్త్రచింతన
మ్ములన్ బ్రవర్తింతు; రట్టిశాస్త్రములు సత్వరజస్తమోరూపమ్ములును వాదప్రధాన
మ్ములును నర్థవాదమ్ములును నగాథంబులును నై యున్నవి. అందు వేదాంతంబు
సాత్వికంబు, మీమాంస రాజసంబు, న్యాయంబు తామసంబు. 8

క. మున్ను ప్రసంగవశమ్మున, నెన్నియొ సత్కథలు చెప్పునెడ భాగవతం
బున్నది యటంచుఁ జెప్పితి, వన్నా ! యద్దాని మాకు నానతి యీవే. 9

క. విన్నారము పెను నీవల, న న్నానాసంగతుల ననంతముగా నో
యన్నా ! తృప్తింజెందక, యున్నారము; దీనఁ దృప్తి నొనరింపఁగదే. 10

గీ. అమృతపానమ్ముచేఁ దృప్తి నందనట్టి, యమరులనుబోలె నున్నార; మమృతపాన
మునఁ దటస్థముగావి యాముక్తిపదము, భాగవతకథామృతమునఁ బడయవచ్చు.

ఉ. జన్నము లెన్నియే నమృతసార నిమిత్త మొనర్చియుంటి; మా
జన్నము లిచ్చునట్టి ఫలసంపద స్వర్గము; యద్ది నిత్యమై
యున్నది కాదు; నిత్యమయి యొప్పెడిముక్తి నొసంగఁ జాలు న
త్యున్నత మైన భాగవతయుక్తులచేఁ దనియింపవే మమున్. 12

కం. వినిపింపుమయ్య మాకున్, మునులకు నిర్వ్యాజముగఁ బ్రమోదమ్మునై నో
యనఘా! దీర్ఘాయుష్మ, త్తను గొని వర్ధిల్లుమయ్య తద్జ్ఞుల కరుణన్. 13

వ. అని వినయమ్మునంబల్కు శౌనకుంగని సూతుం డిట్లనియె. 14

ఉ. నేనె మహాత్ముఁడన్, మఱియు నేనె కృతార్థుఁడ నేనె పూజ్యుఁడన్,
నేనె మునీంద్రసమ్మతుఁడ, నేనె బుధేంద్రుఁడ, నుత్తమోత్తముం
డైన మహామునీశ్వరుఁడు వ్యాసుఁ డొనర్చిన యట్టి దీని మీ
కేను వచించువాఁడనఁట! యేమనుకొందును నాయదృష్టమున్. 15

శా. శ్రీవాణీధవముఖ్యనిర్జరశిరస్సేవ్యంబు మౌనీంద్రచి
త్తావాసంబు ముముక్షుయోగిజనకామ్యంబైన తత్పాదరా
జీవం బాత్మను బాదుకొల్పి, రసపుంజీభూతమై యొప్పు నీ
దేవీభాగవతంబు నాయెఱుఁగు రీతి న్మీకు వాక్రుచ్చెదన్. 16

సీ. ఏదేవి విద్యయం చెల్లవేదమ్ములు, శేవశేవకు సన్నుతించుచుండు
నేయమ్మ తన్నాశ్రయించు వారల సంసృ, తిక్లేశపాశంబుఁ దెరలఁ జేయు
నేతల్లి తనకునై చేతులొగ్గినవారి, చిత్తాంబుజములందుఁ జెలఁగియాడు
నేమాత సర్వమౌనీంద్రసంభావనా, పాత్రీకృతాంఘ్రియై ప్రబలుచుండు

గీ. నే జనని జగములనెల్ల సృష్టిఁజేసి, ప్రోచి నమయించుచుండు నా పుణ్యరాశి
యైన పరశక్తి కరుణాకటాక్షములను, జిలికి నను బుద్ధిమంతునిఁ జేయుఁగాత. 17

చ. ప్రళయమునన్ విధాత్రునకుఁ బంకజనాభునినాభి, వానికిన్
జలవటపత్రశాయికి, నాతనికి నీరధియున్ శరణంబు; అట్టిదో
జలనిధి కాస్పదంబు పరశక్తియ కా యని విశ్వయించి, యం
జలి ఘటియింతు సర్వమయశక్తిసమేతకు లోకమాతకున్. 18

ఉ. యోగపునిద్ర నొప్పు పురుషోత్తము నాభిసరోజమందుఁ బెం
పౌ గతి నుండి ధాత పరమాతురుఁడై "జగదంబ! దేవి! నీ
వే గతి" యంచు నే జగదధీశ్వరికిం బ్రణమిల్లె నీ మహా
భాగవతమ్ము నా జననిపట్టునఁ దెల్పెద నాలకింపుఁడీ. 19

## స్కంధ సంఖ్యా వివరము

క. ఈ దేవీభాగవతం, బాదిపురాణములకెల్ల నత్యుత్తమ; మ
ష్టాదశసహస్రపద్యము, లాదియు నంతమ్ము దీన నారసి చూడఁగా. 20

మఱియునుఁ బండ్రెండు స్కంధమ్ములనుఁ మూఁడువందల పదునెన్మిది యధ్యాయమ్ములనుఁ గలిగి యొప్పుచుండు; నందుఁ బ్రథమ స్కంధమ్మునం దిరువదియు, ద్వితీయమ్మునఁ బండ్రెండును, దృతీయమ్మున ముప్పదియుఁ, జతుర్థమ్మునఁ బంచవింశతియుఁ, బంచమమ్మున ముప్పదియైదును, షష్ఠమ్మున ముప్పదియొకటియు, సప్తమమ్మున నలుపదియు, నష్టమమ్మున నిరువదినాల్గును, నవమమ్మున నేఁబదియు, దశమమ్మునఁ బదుమూఁడును, నేకాదశమ్మున నిరువదినాల్గును, ద్వాదశమ్మునఁ బదునాల్గును నధ్యాయమ్ములు గలవు. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితమ్ములను నీపంచలక్షణమ్ములుం గలయది పురాణంబు నాఁబరగు, నిందు సత్వరజస్తమస్స్వరూపిణు లగు మహాలక్ష్మి సరస్వతీ కాళికల జన్మప్రకారంబు సర్గమ్ము నాఁ బడు. పాలనోత్పత్తినాశమ్ములకై హరి విరించి రుద్రులసముత్పత్తి ప్రతిసర్గమ్ము నాఁబడు. సూర్యచంద్రవంశోద్భవులగు రాజుల చరిత్రమ్ములును, హిరణ్యకశిప్వాదిరాక్షసుల జన్మ ప్రకారమ్మును వంశమ్ము నాఁబడు. స్వాయంభువాదిమనుకథా వర్ణనమ్మును వారల కాలనియమమ్మును మన్వంతరమ్ము నాఁబడు. వారల వంశానుక్రమణిక వంశానుచరితంబు నాఁబడు. సపాద లక్షగ్రంథయుక్తమ్మును వేదసమ్మతమ్మును నగు భారతం బితిహాసమ్ముగాని పురాణమ్ము గాదని చెప్పు సూతుం గాంచి శౌనకుండు తత్తత్పురాణమ్ములను బద్యసంఖ్యయుఁ గర్తృవివేచనమ్మును దెలుపు మని మఱియును, 21

సీ. కలికాలభయసమాకలితులమై యున్న • మమ్ముఁ గాంచి విరించి మానస మగు
చక్ర మొం డిచ్చి "యీచక్రనేమికిని శై • థిల్య మెచ్చోట నాదేశ మతిప
విత్ర మచ్చోటఁ గలిభీతిలే" దని చెప్పి • చనియె నంతట నేము చక్రముఁ గొని
సకలదేశమ్ములు సంచార మొనరింప • నిచ్చోట నా నేమి విచ్చి పోయె

గీ. నది నిమిత్తమ్ముగా నైమిశాఖ్య మయ్యె, నయ్య! యీక్షేత్రరాజ మత్యంతపావ
నంబు యోగ్యతరంబు దివ్యంబు దానఁ, జేసికాదె? మే మిచట వసించుటయును.

గీ. చేసినారము కలిభీతిఁ జేసి మేము, జన్మములు పెక్కు వసియింప నలుపకుండఁ
గృతయుగము వచ్చుదనుక నీ క్షేత్రమంద, పుణ్యగోష్ఠినిఁ గాలంబుఁ బుచ్చవలయు.

శా. వ్యాపారమ్ములులేవు మాకు; వినఁగా నాసక్తియుఁ గా మెండు; నీ
వాఁ పాండిత్యము గల్గుపుణ్యుఁడ; వగణ్యం బైన మాపుణ్యరే
ఖాపారీణత లభ్యమైతివి; జగద్ధన్యంబు పుణ్యంబు సం
తాపధ్వాంతహరంబు భాగవతముఁ జా మాకుం గటాక్షింపవే! 24

ఆ. వె. వ్యాసమునికృతంబు నతిపవిత్రంబు మ, నోరమంబు పాపనోదనంబు
కామదంబు నైన కథ యెంత వినినను, జెవికిఁ దృప్తిగలుగు చెనఁటి కలఁడె?

క. సకలగుణములకుఁ బాత్రం, బకలంకం బఘవినాశ మఖిలజగన్మా
తృకచిత్రచరిత్రం బో, పికకొలఁదిన్ సూత! మాకు వినిపింపఁ గదే! 26

క. అనిన విని సూతుఁ డిట్లను, మునులారా! వినుఁడు వ్యాసమునిచంద్రుఁడు నా
కు నెఱింగించిన విధమున, వినిపించెద నాయెఱుంగు విధమున మీకున్. 27

## పురాణసంఖ్యాకథనము

వ. మాదిద్వయంబును భాదిద్వయమ్మును బాదిత్రయమ్మును వాది చతుష్టయమ్మును నాపలింగకూస్కాదులునుం గలసి పురాణమ్ములు పదునెనిమిది. అందు మాత్స్యమ్మునం బదునాల్గువేలును, మార్కండేయమ్మునఁ దొమ్మిదివేలును, భవిష్యమ్మునం బదునాల్గువేల యైదువందలును, భాగవతమ్మునఁ బదునెనిమిదివేలును, బ్రహ్మపురాణమ్మునం బదివేలును, బ్రహ్మాండమ్మునన్ బండ్రెండువేలును, బ్రహ్మకైవర్తమ్మునన్ బదునెనిమిదివేలును, వామనంబునం బదివేలును, వాయవ్యమ్మునం బదునాల్గువేల యాఱువందలును, వైష్ణవంబునన్ బదుమూఁడువేలును, నారదమ్మున నిరువది యైదువేలును, వారాహమ్మున నిరువదినాల్గువేలును, నగ్నిపురాణమ్మునం బదియాఱు వేలును, బాద్మమ్మున నేఁబదియైదువేలును, లింగమ్మునన్ బదునొకండువేలును, గారుడమ్మున నేకోనవింశతి సహస్రమ్ములును, కూర్మమ్మున సప్తదశసహస్రమ్ములును, స్కాందమ్మున నేకాశీతి సహస్రమ్ములును గలవు. సనత్కుమారమును

నారసింహమ్మును నారదీయమ్మును శైవంబును దౌర్వాసనంబునుం గాపిలంబును మానవంబును నౌశనసంబును వారుణంబును గాలికంబును సాంబంబును సౌరంబును నాదిత్యంబును మాహేశ్వరంబును మారీచంబును భార్గవంబును భాగవతంబును వాసిష్ఠంబు నను నివి యుపపురాణంబులు. సాత్యవతేయుం డష్టాదశమహాపురాణమ్ముల రచియించి పిదపం దదుపబృంహితం బగు భారతంబు రచియించె. ప్రతిమన్వంతరమ్మునకా ప్రతిద్వాపరయుగమ్మున నారాయణుండు వ్యాసస్వరూపమ్ముచే నల్పాయుష్కులను నల్పబుద్ధుల నగు భూసురులకొఱకు వేదంబుల విభజించి స్త్రీశూద్రద్విజబంధువులకు వేదమ్ముల శ్రవణార్హమ్ములుగామిం జేసి యీపురాణమ్ముల రచియించుచుండు నని చెప్పి మఱియును, 28

గీ. ఆఱు మన్వంతరములు మున్నరిగె నేడ, వది జరుగుచుండె నిదియ వైవస్వతంబు
ఇరువదియు నేడుజరిగె ద్వాపరయుగమ్ము,లిరువదియెనిమిదవదిదియెయిఁగుడయ్య.

క. ఇరువదియేడ్వురు వ్యాసులు, పురాణములు సేసి రిట్లు పూర్వం బస్మ
ద్గురుపగు సాత్యవతేయుం, డిరువదియెన్మిదవవ్యాసుఁ డిఁక వినుమీఁదన్. 30

వ. ఇరువదితొమ్మిదవ ద్వాపరయుగమ్మున ద్రోణపుత్రుం డగు నశ్వత్థామ వ్యాసుండు కాఁగలఁ డని చెప్పు సూతుం గాంచి శౌనకుం డిట్లనియె. 31

చ. ఇరువదియేడు ద్వాపరము లేగె నటంటివి; మున్నొకొక్కద్వా
పరయుగమందు నొక్కొకఁడు వ్యాసుఁడు పుట్టెనఁటంటి; వార లె
వ్వరొ? మఱి యేపురాణము లవారణకొదుణికత్వ మొప్పఁ జె
ప్పిరొ? వివరింపవే వినఁగ వేడుక గల్గెడి రౌమహర్షణీ! 32

క. అను మునుల రోమహర్షణ, తనయుఁడు గడు భక్తి యుక్తితాత్పర్యములన్
గనుఁగొని పల్కెను వ్యాసుల, వినిపించెద వినుఁడటంచు వేడుక మెఱయన్. 33

వ. ప్రథమద్వాపరమ్మున వేదములు స్వయంభువుచే వ్యస్తంబులయ్యె; ద్వితీయద్వాపరమ్మునఁ బ్రజాపతి యా వ్యాసకార్యం బొనరించె; నట్లు తృతీయమ్మున శుక్రుండును, జతుర్థమ్మున బృహస్పతియుఁ, బంచమమ్మున సూర్యుండును, షష్ఠమ్మున మృత్యుదేవతయు, సప్తమమ్మున దేవేంద్రుఁడును, నష్టమమ్మున వసిష్ఠుండును, నవమమ్మున సారస్వతుండును, దశమమ్మునఁ ద్రిధాముండును, నేకాదశమ్మునఁ ద్రివృషుండును, ద్వాదశమ్మున భరద్వాజుండును, త్రయోదశమ్మున నాకాశమ్మును,

చతుర్దశమ్మున ధర్మమ్మును, పంచదశమ్మునఁ ద్రయ్యారుణియు, షోడశమ్మున ధనంజయుండును, సప్తదశమ్మున మేధాతిథియు, నష్టాదశమ్మున వ్రతియు, నేకోనవింశమ్మున నత్రియు, వింశమ్మున గౌతముండును, నేకవింశమ్మున హర్యాత్మయు, ద్వావింశమ్మున వేనుండును, త్రయోవింశమ్మున వాజశ్రవుండును, చతుర్వింశమ్మున నాముష్యాయణుండగు సోముండును, పంచవింశమ్మునఁ దృణబిందువును, షడ్వింశమ్మున భార్గవుండును, సప్తవింశమ్మున జాతుకర్ణుండును, నష్టావింశద్వాపరమ్మున నస్మద్గురుండగు సాత్యవతేయుండును, వేదంబులు విభజించి పురాణంబులు రచియించి రవి చెప్పి మఱియు నిట్లనియె. 34

క. పారాశర్యమునీంద్రుఁడు, పారకృపారసము జనులపైఁ గల్గినవాఁ
డై రచియించెఁ బురాణము, లారయ నవి యన్నియును రసాంబుధులందున్. 35

సీ. జగదధీశ్వరిరూపు సారెసారెకుఁ జూపు • పరమాంబనము దేవీభాగవతము
ముక్తికాంతను దార్చు మూలమంత్రము నేర్చు • ప్రౌఢమాతృక దేవీభాగవతము
కామితమ్ము లొసంగఁ గల్పద్రుమ మనంగఁ • బ్రథితమైనది దేవీభాగవతము
దోషమ్ములను దుంపతోఁ గూడఁ దెగఁద్రెంప • వాఁడిగుద్దలి దేవీభాగవతము
గీ. పఠనపాఠన యోగ్యంబు భాగవతము • పరమమునులకు సేవ్యంబు భాగవతము
ఆగమాఖిలసారంబు భాగవతము • భారతికిఁ బ్రాణతుల్యంబు భాగవతము. 36

చ. అరణి జనించినాఁడు, తనయంతన విద్యల నేర్చినాఁడు, సం
సరణము రోసినాఁడు, మునిసమ్మతుఁ డంచు శుకుం గుమారు దు
స్తరవినయాధికుండయిన సాత్యవతేయుఁడు బుద్ధి నెంచి య
ప్పరమునకున్ వచించె రసవంతము భాగవతప్రబంధమున్. 37

క. కొడుకునకుఁ జెప్పునప్పుడు, గడు భక్తిశ్రద్ధ లలరఁగాఁ గై కొంటిన్
"గుడుచుట యల్లునిఁ గలిసియుఁ, గొడుకుఁ గలిసి చదు"వని యనుకొనుటలు వినరే!

మ. శుకుఁ డీ భాగవతామరాగమఫలౌత్కృష్ట్యంబుచేఁ దండ్రి ప్రా
పకుఁడై తా నుపదేశ మీఁగ బహుళోపాఖ్యానకర్ణామృతం
బకమై యొప్పెడి దీని విప్పఁ గొని సంసారాంబుధిం దాఁటెఁ; దే
వి కథాసారముఁ గ్రోలియున్ భవభయార్తిన్ మున్గువారుందురే! 39

శా. పాపాత్ముండగుఁగాక, కేవల కులభ్రష్టాత్ముఁ డౌఁగాక, శు
ద్ధాపాత్రుండగుఁగాక, యెట్టిఁడయినన్ వ్యాజమ్ముచేనైనఁ దా

నీ పౌరాణకథాసుధం గొని యిహాదృష్టమ్ములన్ గాంచి దు
ష్ప్రాపంబై తనరారు నా భగవతీసాయుజ్యముం జెందెడిన్. 40

చ. పలుకులు వేయునేల ? యొకపల్కు వచించెద ; నెవ్వఁడేని స
త్ఫలగతి నొప్పు నీ పరమభాగవతంబు వినంగలాఁడొ, వాఁ
డలఘుఁడు ; వానిచిత్తనిలయమ్మునఁ గాఁపురముండుఁ బేర్మితో
జలజభవాదులుం గనఁగఁజాలని యా జగదంబ నిచ్చలున్. 41

చ. తెలివియుఁ దేటయున్ గలుగు దేహముగల్గియు, నెక్కుడైన స
త్ఫలములొసంగు నీ పరమభాగవతంబు లభించియున్, వృథా
కలనలఁ గాలమున్ గడపు కష్టపుజన్మము గల్గునట్టి మూ
ఢులు విధివంచితుల్ గడుఁగఠోరులు గష్టులు దుష్టులిమ్మహిన్. 42

చ. కటకట ! పాపపుంగతలు కర్ణములొగ్గి గ్రహించు రాగలం
పటు లిటువంటి సత్కథల భావముఁ జొన్పుట కిచ్చగింప; రు
త్కట మగు పంకమున్ గని ముదంబు మదిన్ గను గ్రామసూకరం
బెటువలె నిచ్చగించు ? సుఖహేతుకమై తగు మంచిగంధమున్. 43

## వ్యాసుండు తపం బొనర్చుట

క. అని పల్కు పల్కులన్ విని, ముని లిట్లని రరణియందుఁ బుట్టెను శుకుఁ డం
చనుఁ జెప్పితి వాతఁడు వ్యా, సున కెట్లు తనూజుఁడాయె సూతా ! చెపుమా. 44

గీ. శుకుఁడయోనిజుఁ డంటి వీవకట ! గర్భ, యోగిగా మేము మునువింటిమో మహాత్మ !
గర్భగతున కయోని సందర్భ మెట్లు, తెలిపి యీ సందియము మాకుఁ దీర్పవలదె.

సీ. అని పల్కు మౌనులఁ గని సూతుఁ డిట్లను • మునులార ! వినుఁడు శుకునిచరితము
రమణ వ్యాసుండు సరస్వతీతటమునం • దుగ్రతపంబున నుండి యచటఁ
గలవింకదంపతుల్ గలిసి పిల్లలనోటి • కాహారమందిచ్చి యవి భుజించు
చందమ్మునకు మోదమందుట వీక్షించి • మనమునఁ గామంబు పెనఁగొనంగ

గీ. బళిర ! సంతానమందుఁ బక్షులకుఁ గూడ • నింత ప్రేమాతిశయమున్న దింక మనుజు
లైన వారల కుండుట యబ్బురంబె ! • యనుచు సంతానచింతాకులాత్ముఁడగుచు. 46

ఉ. సుందరి చేయునట్టి గడుసుందనపుం బలు ముద్దుసుద్దు లం
దంద ముదంబు నింపఁగ రసాంబుధి నోలల నాడవచ్చు; నా

నంద మొసంగఁజాలు, తగునందనులఁగా బడయంగ వచ్చు; సు
శీలం దలఁపోసి చూచినను బెండిలికిన్ సమ మొండు గల్గునే ? 47

ఆ. వె. కొడుకు గల్గనేవిఁ గొడుకునకును బెండ్లిఁ, జేసి కాఁపురమ్ముఁ జేయుచున్న
ముగుదయైన యట్టి ముద్దుకోడలి, మొగముఁ గనుటకన్న ముదము గలదె?

సీ. వార్ధకావస్థ సంప్రాప్తమైనను నతి • శ్రద్ధాళుఁడై పంచసేవ్య సేయు
ధనము సంపాదించి తగువస్తువులు తెచ్చి • తినిపించి మిగుల సంతసమొసఁగు
మృతిఁజెందినను బంగతికి సాధనమైన • ప్రేతకార్యమొనర్చి ప్రీతి నించు
గయను నేగి పితృసద్గతికినై విష్ణుపా • దంబుపైఁ బిండదానంబు సలుపు

గీ. సుతులఁ గనకున్నఁ బరలోకగతులు సున్న • పుత్రగాత్ర పరిష్వంగమున జనించు
సుఖముకన్నను వేఱొండు సుఖములేదు • కానఁ దగునట్టి పుత్రుఁ గాంచవలదె?

చ. కొడుకులు లేనివాఁడు తనకున్ మృతికాలము సంభవించిన
ప్పుడు తనద్రవ్యమున్ గృహము భూమియు నేమయి పోవునొక్కొ యె
వ్వఁ డపహరించునో యనెడిభ్రాంతి వహించి తనంతఁ దాన పె
క్కిడుమలఁ జెందుఁ గానఁ గొడు కేర్పడి యుండుట ముఖ్యమేరికిన్. 50

క. అని బహువిధములఁ జింతిలి, తనయునకై తపము సేయుతలఁపున ద్వైపా
యనమునిచంద్రుఁడు చనె హే, మనగాగ్రప్రథితసానుమండలమునకున్. 51

శా. ఏ దేవుం గొలియాడుదున్ మఱియు నే నే దేవుఁ బ్రార్థింతు నా
కే దేవుండు ప్రసన్నుఁడౌనొకొ మనోభీష్టంబు నే దేవుఁ డా
పాదింపం గలఁడో ! యటంచు మది సంభావించుచున్నంతలో
నా దివ్యాత్మునిఁ జూడ నారదుఁడు నిర్వ్యాజస్థితిన్ వచ్చినన్. 52

ఉ. వచ్చినమౌనిఁ గాంచి మునివల్లభుఁ డల్లన లేచి మ్రొక్కి యో
సచ్చరితా ! మనమ్మున విచార మొకం డొనరించుచుంటి ; నీ
విచ్చటి కేగుదెంచుట త దీప్సితసిద్ధికి ముఖ్యకారణం
బిచ్చఁ జరించు సన్మును లహేతుకజాతదయామయుల్ గదా ! 53

క. అను పలుకులు విని నారదుఁ, డను, సకలము నెఱుఁగునట్టి యనఘుండవు నీ
కు నసాధ్యం బొం డుండునె ?, యనుమానం బేల తెల్పుమన నతఁ డనియెన్. 54

చ. "కొడుకులు లేక యున్నఁ దనకుం బరలోకము సున్న" యంచుఁ జె
ప్పెడి వచనంబులన్ వెదికి పెట్టిన దాదిగ నాకు లోనఁ దుం

దుడుకు జనించెఁ గావున సుతుం గన నెవ్వని వేఁడుకొందు నె
వ్వఁడౌనఁగువాఁడు తెల్పు మటువంటి మహాత్ముని నాకు నారదా! 55

వ. అని తనకు శరణాగతుం డగుసాత్యవతేయుం గాంచి నారదుండిట్లను; నీ యడి
గిన యర్థమ్ము దెలిసికొనువాఁడై మున్ను మజ్జనకుండగు విరించి విష్ణులోకమ్ము
నకుం జని, 56

సీ. కోటిసూర్యులకాంతి గోటమీటఁగఁ జాలు • డంబు జిమ్మెడి కౌస్తుభంబువాని
శంఖచక్రగదాది సాధనమ్ములు దాల్చి • హవణించు నాల్గు బాహువులవాని
నీలనీరదసమ శ్రీలీలఁ దగుమేని • పై నొప్పు బంగారు వలువవాని
వింద్రనీలవిలాస మునుమడింపఁగఁ జాలు • హెచ్చుగల్గిన పుట్టుమచ్చవాని
గీ. కలుము లీనెడి కందోయి గలుగువాని • నెల్ల లోకమ్ములను లోన నిముడువాని
ధ్యానవిశ్చల మైన హృదయమువాని • విష్ణు బొడఁగాంచి తా నిట్లు విన్నవించె. 57

## విష్ణువు బ్రహ్మకు దేవీ మహత్త్వంబు చెప్పుట.

సీ. నీ యాజ్ఞచేఁగదా! నే సృజింతు జగమ్ము • హరియించుఁ బ్రళయమ్మునందు శివుఁడు
నీ యాజ్ఞచేఁగదా! నీరేజబాంధవుం • డుదయాస్తమయముల నొందుచుండు
నీ యాజ్ఞచేఁగదా! వాయుదేవుఁడు సుఖా • సుఖరీతిఁ దనశక్తిఁ జూపుచుండు
నీ యాజ్ఞచేఁగదా! యా యగ్నివెల్గఁ బ • ర్జన్యదేవుండు వర్షంబు గుఱియు
గీ. నీవె సర్వోత్తముఁడవు సర్వేశ్వరుఁడవు • సర్వభూతమయుండవు సర్వశక్తి
వట్టి నీ విట్టి ధ్యానసమాధి నుంటి, • వెవఁడు సంసేవ్యుఁడో తెల్పవే మహాత్మ! 58
గీ. నీకు బరుఁడున్న వాఁడని నే నెఱుంగ, నీకు శరణాగతుఁడ నైతి నీ కృపారస
సమ్ము నాపయిఁ జిలికి యీ సందియమ్ముఁ, బాపవే! భక్తులకును గోప్యములు గలవె!
క. అని పలుకు సరసిజాసనుఁ, గని విష్ణుం డను మనమ్ముఁ గడు నిశ్చలతన్
గనఁజేసి సావధానత, వినుమా! నా పల్కుపల్కు విధము కుమారా! 60

ఉ. ఈవు సృజింతువంచు, మఱి యేఁ గరుణించి భరింతునంచు గౌ
రీవిభుఁ డాగ్రహమ్మున హరించునటంచు, జనుల్ వచింతు; రీ
త్రోవలు తప్పుత్రోవలు; బుధుల్ "మనలన్ సృజియించె నొక్క తే
జోవతి యాదిశక్తి" యనుచున్ వచియింతురు కాదె పుత్రకా! 61

క. మృడునకుఁ దామసి తాఁ దో, డ్పడెఁ; రాజసి నీకుఁ దోడుపడెఁ; సాత్త్వికి తో
డ్పడె నా; కటుగాకుండినఁ, గొడుకా! యొకగవ్వకైనఁ గొఱగాము సుమీ! 62

సీ. పరతంత్రత మను జెంది ఫణిరాజశయ్యపై • శయనింతు శక్తి ప్రసాదముననె
ఆరామముల విహారార్థంబు లక్ష్మితోఁ • జరియింతు శక్తి ప్రసాదముననె
సతతంబును దపంబు వితతంబు గాఁగఁ బో • సంగింతు శక్తి ప్రసాదముననె
పోగరుపట్టిన రాక్షసగణమ్ములనుఁ బట్టి • చంపుదు శక్తి ప్రసాదముననె

గీ. నాఁడు మధుకైటభులను దానవులతోడ, నైదువేలేండ్లు సంగ్రామ మాచరించి
జయము గైకొంటి శక్తిప్రసాదముననె, యెఱిగి యెఱుఁగి నన్నడుగగ నేల! పుత్ర.

మ. సిరిసాంగత్యముఁ గోలుపోయి, సుఖముల్ చేసేఁత వర్జించి, సూ
కరకూర్మాంబుచరాదితుచ్ఛకలుషాకారమ్ములన్ దాల్చి, సం
గరముల్ సల్పుచు దాములన్ బడుచు నజ్ఞానాబ్ధి నోలాడఁగాఁ,
బరతంత్రుండను గాకయున్న నది నాప్రారబ్ధమా? పుత్రకా! 64

చ. మును పొకనాఁడు నాదుశిరమున్ హరియించె ధనుర్గుణంబు దా
నినిఁ గని నీవ యష్ట తగునేరుపు గల్గిన దేవశిల్పిప
ద్యుని బిలిపించి యొక్కతురగోత్తమశీర్షముఁ గూరిపించి తి
య్యనువున నేహయాననుఁడ నైతి నెఱుంగవె? పద్మసంభవా! 65

గీ. కాన నేను స్వతంత్రుఁడఁ గాను శక్త్య, ధీనుఁడను శక్తిసేవనాధీనమతిని
శక్తికన్నను వేఱొండు జగములందుఁ, బరము గలదని పలుకనాతరముగాదు. 66

చ. అనుచు విరించికిన్ సరసిజాక్షుఁడు దెల్పెను; దాని నాకు న
య్యనఘుఁడు దెల్పినాఁడు; జగదంబిక యై పరతంత్ర గాక యుం
డిన పరదేవతన్ హృదయ నీరజమందు వసింపఁజేసి, పే
ర్కొనఁ గదవయ్య! కోర్కె సమకూడు నదెట్టిది యైన నమ్ముమీ! 67

క. అను నారదువచనము విని, యనుమానం బుడిగి శక్తి యగుఁ బరదైవం
బని తపము చేసె వ్యాసుఁడ, విన సూతుం గాంచి యిట్లనిరి మును లెల్లన్. 68

## హయగ్రీవావతార ఘట్టము

ఉ. ఆగమవేద్యుఁ డైన పరమాత్ముశిరమ్మును కేలఁ గల్గె నీ
యోగము దాని కెట్లొకొకొ? తురగాననమీకథావిధం

వేగతి నమ్మువార మిదియెల్ల ననంశయరీతిఁ దెల్పు నీ
వే గతి, దెల్పవే యనుమునీంద్రులఁ గన్గొని సూతుఁ డిట్లనున్. 69

సీ. మును రక్కసులతోడ దనుజారి పదివేల • సంవత్సరమ్ములు సంయుగమ్ము
చేసి పరిశ్రాంతిఁ జెంది సజ్యంబగు • ధనురగ్రము నవలంబనముఁజేసి
కొని తానొకఁట నిద్రఁగొనియున్నతఱి దేవ • తలు యజ్ఞమొనరింపఁ దలఁచి విష్ణు
లోకమ్ములోఁ బద్మలోచనుఁ గానక • యోగమ్ముచే నున్న యునికి నెఱిఁగి

గీ. వచ్చి విద్రావణుం డైన వానిఁగాంచి • చేయునదిలేక యూరక చింతసేయ
వారిఁ గరుణించి వాగీశు వలను చూచి • పార్వతీపతి దెల్పె నుపాయ మొకటి. 70

శా. కీటంబున్ సృజియింపు మీ వొకఁడు పంకేజాసనా! యాధను
ష్కోటిన్ ఛిన్నముఁజేయఁజాలు నది; తత్కోట్యగ్ర ముచ్ఛిన్నమై
మీటున్ మీదికి; దాన నీతఁడును దా మేల్కాంచు; దాన న్నిలా
ఘాటంబౌ మఖ, మన్న మంచిదని వేడ్కన్ ధాత సృష్టించినన్. 71

క. పుట్టించిన ధాతన్ గని, నెట్టన నా కీట మిట్లనియె నో దేవా!
యెట్టు లొనరింతు నీపని, కట్టా! కడుఁ బాతకంబు గాదే నాకున్. 72

శా. తల్లిన్ బిడ్డలఁ బాయఁజేయుటయు, నిద్రాభంగమున్, భర్తతో
నిల్లాలిన్ విడఁదీయఁ బూనుటయు, దుష్కృత్యప్రవృత్తిన్ గథా
సల్లాపమ్ముల కంతరాయకృతులన్ సంధించుటల్, తుల్యమై
చెల్లున్ నిక్కము బ్రహ్మహత్య; కిది నాచేఁ జేయఁగాఁ జేతురే? 73

క. ఇటు లొనరించిన నాకుం, గటకట! పాతకము తక్కఁ గలదే ఫలమొ
క్కటి, దెల్పెద లాభము లే, కిటువంటి పనుల నొనర్తురే? యెందైనన్. 74

క. అని కటకటఁ బడు పురువున్, గని యిట్లనె ధాతయున్ మఖంబున నీ క
వ్వనఁ జేసెద మిది మొదలుగ, నవలహూతము కాని యప్పదార్థంబెల్లన్. 75

క. నావుడు వమ్రియు నంతో, షావిర్భావంబు వొదల నావింటికొనన్
వేవేగఁగొఱికె; ధనలో, భావిష్ణు లొనర్పరాని యమములు కలవే! 76

శా. దానన్ నాదమొకండు పిక్కటిలెఁ, బాతాళంబుఘూర్ణిల్లె; నా
శానాగమ్ములు సంచలించె; ధరణీచక్రంబు కంపించె; గో
త్రానీకంబు వడంకె; నుష్ణకిరణుం డస్తంగతించె; న్నభ
స్థానం బల్లల నాడె; దిక్కులు ప్రతిధ్వానమ్ములన్ గర్జిలెన్. 77

గీ. వింటికొన తాఁకుచేత న వ్విష్ణుదేవు, శిర మెగిరిపోయె దాన నిర్జరులు భీతి
జెంది యుత్సాహములు దక్కి చేవపీడి, చేయునది లేక మదిఁ జింతఁజేసిరిట్లు. 78
గీ. ఈవె సర్వోత్తరుఁడవు సర్వేశ్వరుండ, వీవె యభేద్యుండ వఖిలలోకైకకర్త
వీవె భర్తవు సంహర్త వీవె కావె, నీ కింతటి గతి గల్గెనే మహాత్మ! 79
గీ. యక్షరాక్షస దైత్యుల యందు నీకు, నిట్టి యపకార మొనరింప నెవ్వఁడోపు?
దిక్కుమాలిన యట్టి యీ దేవసంచ, యం బొనర్చిన పాపకర్మంబు కాదె. 80
గీ. మాయకుఁ బరుండ వైన నీ మస్తకంబు, మాయ హరియించె నన్న నసహ్యుఁ డగున య్యె?
యంచు నేమేమొ విలపించు నమరవరుల, కిట్టు లనియె బృహస్పతి యెసఁగ.
గీ. తగు నుపాయమ్ము యోజింపఁ దగును గాక, వ్యర్థముగఁ జింతఁ జేసిన ఫలము గలదె?
మన మొనర్చు నుపాయంబు మంచి దగును, దైవతంత్రమ్ము దానికిఁ దవిలెనేని.
వ. అనిన నింద్రుం డిట్లనియె. 83
గీ. దేవతలు చూచు చుండఁగా దేవదేవు, శిరము విస్ఫారణమ్ముగాఁ జెదరిపోయె
పౌరుషమ్మున సిద్ధించు పనులు కలవె?, దైవబలము బలిష్ఠమ్ముగాఁ దలఁప వలయు.
వ. అనిన విరించి యిట్లనియె. 85
చ. శివునకు లింగపాతము, శచీపతికిన్ భగలబ్ధి, యేను నా
భవుని శిరమ్మునన్ దలఁకుఁ బాయుటయుం, దలపోసి చూడఁ, గా
లవశము కాక వేఱొక బలమ్ము గిలమ్మును గల్గునే? సమ
స్తవిధములన్ సుఖమ్ము గొనసాఁగునె సంసృతి నీఁదువారికిన్? 86
ఉ. ఈ సకలంబు తాన యయి యే జగదీశ్వరి వెల్గుచుండుఁ దా
నే, సృజియించి తాన భరియించియుఁ దాన హరించు నే కృపా
భాసురశీల యా పరమపావని నా జగదంబ నా భవ
త్రాసహరన్ భజించిన ముదమ్ము లొనంగక మిన్నకుండునే? 87
వ. అని మఱియును. 88
క. ఆ జగదంబ నుతింపం, గాఁ జాలము మన మటంచుఁ గడువేగముగా
రాజీవభవుం డాగమ, రాజిం బిలిపించి వేడ్క రాజిల్లంగన్. 89
క. నుతియింపుఁ డాదిశక్తిని, శ్రుతులారా! మీర లెలమి చొప్పడ నని యా
నతి యిచ్చిన నది గైకొని, శ్రుతిసతు లిట్లని నుతింపఁ జొచ్చిరి కడఁకన్. 90
ఉ. తల్లి! జగత్త్రయీభరణదక్షకటాక్షకలావిలాస! యు
త్ఫుల్లసముల్లసత్కమలతుల్యముఖీ! ప్రకృతిస్వరూపిణీ!

పల్లవపాణి! నిత్యశివభాగ్యవిధాయిని! సర్వరూపసం
వేల్లితదేహ! దివ్యపదవీపరిభాసిని! మత్తకాశినీ! 91

గీ. భూతములకెల్ల నాధార భూమివైతి, ప్రాణవంతులకెల్లను బ్రాణమైతి
ధీముఖాకారములచేత దీప్తిగంటి, వంబ! గాయత్రికిని వాచ్య మైతి నీవ. 92

ఉ. పాపహరంబు సర్వపరిపాలనశౌండ మకాండసత్కృపా
దీపిత ముత్తమోత్తమము దివ్య మఖండ మజాండనిర్మితి
ప్రాపక మాద్య మాగమనిదాన మనంతవిలాస మైన నీ
రూపు పితామహాదులు నిరూపణఁ జేయఁగ లేరు శాంకరీ. 93

చ. సకలముఁ జేయు నిచ్ఛఁ గొని సారససంభవముఖ్యదేవతా
నికరము మున్నుగాఁ దగ జనింపగఁ జేసి తటస్థవై సమ
స్తకృతులు వీరిచేతఁ గొనసాఁగఁగఁ జేయుచునుందు; వంతె కా
క, కలవె నీకు సంసరణ కష్టసుఖమ్ము లొకించుకేనియున్? 94

శా. నీ నామమ్ములు లెక్కపెట్టుటకుఁ గానీ నీదు రూపం బొకిం
తేనిన్ వర్ణనఁ జేయఁ బూనుటకుఁ గానీ లేఁ డొకండేని; యెం
దేనిన్ ద్వచ్చరితంబు దెల్పుటకునై యెవ్వాఁ డగుం దేవి? కు
ల్యానీరమ్మున దాఁట భీతి పడువాఁ డంభోనిధిం దాఁటునే? 95

గీ. నీదు విభవంబు దేవతానికరమందు, నొక్కఁడేనియు నెఱుఁగమి నిక్కమంబ!
నీవ సకలంబునకు నియంత్రి వను పట్ల, నేము సాక్ష్యమొసంగి జయింపఁ గలము.

ఆ.వె. అస్థ లేనిదాన వయ్యును సకలంబుఁ, జేయుచుందు వనెడి చిత్రచరిత
మంబ! నీక దెలియ దన్నచో మాబోఁటి, జడమతుల కెఱుంగఁబడుట యెట్లు?

ఉ. ఈ దురవస్థ మాధవున కీ గతి నబ్బుటకేమి హేతు వం
బా! దయ మాలి నీవు పరిపాలన సేయ నుపేక్షఁ జేసితో?
నీదెస నెద్దియేని యవినీతి యొనర్చెనొ? లేక పూర్వసం
పాదితపాపకర్మపరిపాకమొ? శక్తి పరీక్ష సేయుటో? 98

ఉ. లేక దురాగ్రహమ్మున నిలింపు లొనర్చెడి పాతకమ్ము లీ
నీ కమలాక్షునం దిడిరొ? యీతని గర్వ మడంపఁ బూనితో?
కాక సురారు లిట్టి వరకాంక్షఁ దపం బొనరించి యుండిరో?
కా కితఁ డీగతిన్ బొగులఁగాఁ గను నిచ్ఛ జనించెనో మదిన్? 99

ఉ. "బహుప లందు నాకు సమమైన యదృష్టవిశేష మెచ్చటన్
లే" దని విఱ్ఱవీఁగు నల నీరధిపుత్రికి నగ్రధావ మా
పాదనఁ జేయఁ బూనితివొ? భక్తుల యం దిటువంటి నిర్దయా
హ్లాదము పూన మంచి దగునా? తగునా మగనాలివంచనల్? 100

గీ. ఇతని శిర మేడ కేగెనో యెఱుఁగరాదు, ప్రాణములొసంగుటకు నుపాయమ్ముఁగాన
మంబ! యీతని బ్రతికించి యమరవరులఁ, గరుణనీక్షించిలచ్చిసంతసము తీర్పు.

గీ. అనుచు నుతియించు వేదమ్ములందుఁ గరుణ, కలిగి జగదంబ పలికె నాకాశవలన
వినుఁడు సురలార! వేదముల్ విన్నవించు, విన్నపం బాదరించి ప్రసన్ననైతి.

క. ఈ నిగమ స్తవ మెవ్వం, డేని వినిన వాని కేన యిచ్చెదఁ దగు వి
జ్ఞానమ్మును దీర్ఘాయువు, నానంద మఖండ మైన యైశ్వర్యంబున్. 103

గీ. ఇతనిశిర మూడిపోవుట కేమిహేతు, వన్న సురలార! చెప్పెద నాలకింపుఁ
డహహ! కారణహీన కార్యములు గలవె?, సాంపేత్త్రల కెంతు సంసారమందు.

మ. ఒకనాఁ డీతఁడు కేశికాసదనమం దున్నట్టి వారాశి పు
త్రిక మోముం గని నవ్వె; నవ్వుటయు నారీరత్న మా లక్ష్మి "యే
మి కతంబో యితఁ డిట్లొనర్చుటకు. నేమీ! నామొగం బంతఁగా
వికృతాకారము చెందెనే" యనుచుఁదా వేమాఱు, చింతించుచున్. 105

శా. నాకన్నన్ మఱియొక్క చక్కనగు కన్యన్ జూచి మోహించెనో?
కాకున్నన్ వినుఁ జూడకున్న దినముల్ కల్పమ్ములౌఁ జుమ్మి నా
కో కల్యాణి! యటంచుఁ బల్కు నితఁ డోహో! యింతయొగ్గించునే!
నీ! కాంతుం డఁట! యెగ్గొనర్చె నఁట! తత్క్షేమంబు గామింతునే? 106

క. అని తామసమునఁ దనకాం, తుని శీర్షం బట్టిఁ బడఁగ దుడుకుమెయి శపిం
చెను; సవతిపోరుకన్నను, దనపతి మృతి కొంత సౌఖ్యదము మానినికిన్. 107

సీ. దయమాలి ప్రియుతోడఁ దప్పుఁ జేసియు నబ • ద్ధమ్ము లాడుట యాఁడుదానిసొమ్ము
ప్రాణమ్మునకు గడ్డిపరకంత వెలయైనఁ • దలఁపకుండుట యాఁడుదానిసొమ్ము
అత్యంతలోభమ్ము నంది యూరక మౌర్ఖ్య • మూని యుండుట యాఁడుదానిసొమ్ము
అవమానమునకు లోనై దురాచార ప • ద్ధతి వహించుట యాఁడుదానిసొమ్ము
గీ. కష్టసంసారమునకు లోఁగా నొనర్చి • దాఁట నీకుండు టది యాఁడుదానిసొమ్ము
లేనిపోని విలాసమ్ములూని మోక్ష • దశను జెడఁగొట్టు టది యాఁడుదానిసొమ్ము.

సీ. ఆ శాపవశమునఁ గేశవు శిరమున • కిట్టి దుర్దశ మూఁడె విదియుఁగాక
మును హయగ్రీవుఁడన్ దనుజుండు గడు నిష్ఠ • చే సరస్వతియొద్దఁ జేరి తపము
నాచరించె మదర్థమై వేయిసంవత్స • రములు సమస్తభోగములు వీడి
యతని కేఁ దామస మగు రూపము ధరించి • ప్రత్యక్ష మగుటయు బహువిధముల

గీ. సన్నుతించి ప్రసన్నమై యున్న నన్నుఁ • గాంచి "యెవ్వారిచేనైనఁ గానిచావు
బొరయ కుండెడి రీతిని వర మొసంగు" • మనుడు నవ్వానితోఁ డ విట్లంటి నేను.

గీ. పుట్టు జంతువు లెల్లను గిట్టుటయును, గిట్టు జంతువు లెల్ల మఱుట్టుటయును
పరమధర్మంబు వేఱొండు వరముఁ గోరు, మిచ్చెద నటన్న రక్కసుం డిట్టులనియె.

క. ఏను హయగ్రీవుండను, గాన హయగ్రీవుచేతఁగాని యొరులచేఁ
బ్రాణములు వీడ కుండం, గా నిమ్మన నట్టిపరము కరుణ నొసఁగితిన్. 111

ఉ. వాఁడిపు డెల్లలోకము లవారణ రీతిని బీడఁ బెట్టుచు
న్నాఁడిఁక వానిఁ జంపుటకు నాథుఁ డొకండ యినన్ జగత్త్రయిన్
లేఁ డటుగాన మీరు తగునేర్పున వాజిశిరమ్ముఁ దెచ్చి మా
పాదక యీ రమాధపు హయాననుఁగా నొనరింపఁగాఁదగున్. 112

క. అటుచేసిన నీతం డ, క్కుటిలుని హరియించు మీకుఁ గోర్కె ఫలించున్
దటుకున నొనరుపుఁడని యం, తట నంతర్ధానమందెఁ దజ్జనని వెసన్. 113

గీ. పిదప సురలెల్ల దేవశిల్పివరుఁ గోర, నతఁ డరుగుదెంచి యసికృత్తమైనవాజి
శిరము గైకొని నేర్పున హరికి నతికె, నీ విధమ్మున హరి హయగ్రీవుఁ డయ్యె.

గీ. ఈ హయగ్రీవుఁ డా రాక్షసేంద్రుఁ జంపె. దానిచే లోకములు ప్రమోదమ్ముఁగాంచె
నిట్టి శుభచరితము వినునట్టివారి, కతులితైశ్వర్యములు గల్గు నఘము లడఁగు. 115

## మధుకైటభోత్పత్తి.

క. అన విని మధుకైటభులను, దనుజులు గల రంటి వట్టి దనుజుల జన్మం ,
బును మరణంబును వినియెద, మనఘా ! నీవంటియోగ్యుఁ డబ్బునె మాకున్ ?

గీ. విషము దుర్జనుఁడును నొక విధమువారు, సుధయుఁ బండితుఁడును నొకవిధమువారు
బుధులు దొరకినయప్డు సత్కథలు వినవి, వార లెల్లరుఁ బశువుల వంటివారు. 117

క. అశనమ్మును నిధువనమును, బశువులకును మనుజులకు స్వభావ గుణమ్ముల్
పశువులకన్నను మనుజులు, ప్రశస్తతను గనుట తెలివిఁ బడయుటఁగాదే ? 118

గీ. వేదశాస్త్రాదిగోష్ఠి సాత్త్వికి యనఁబడు, సరససాహిత్యగోష్ఠి రాజసి యనఁబడు
నసమయుద్ధాదిగోష్ఠి తామసియనఁబడు, నందుఁ బుణ్యులు సాత్త్వికి యందు నుంద్రు.

వ. అట్టి సత్త్వగోష్ఠియు నుత్తమమధ్యమాధమ భేదమ్మున మూఁడువిధమ్ము. లందుత్తమంబు ముక్తిసాధనంబును, మధ్యమంబు స్వర్గప్రాప్తి సాధనంబును, నధమంబు భోగసాధనంబు నై తనరు. అట్ల పాణిగృహీతియం దుపచరించునది యుత్తమ రజోగోష్ఠియుఁ బాణిగృహీతయం దుపచరించునది మధ్యమంబును బరోఢయందు పచరించునది యధమంబు నాఁ బరఁగు; దుష్టశిక్షానిమిత్తంబగు యుద్ధం బుత్తమ తమోగోష్ఠియు దాయాదభాగనిమిత్తంబగునది మధ్యమంబును నిర్నిమిత్తం బగునది యధమంబును నగుం గావున మోక్షప్రదంబులగు పురాణగాథలు వినుటకన్న నొండు లాభం బుండునే? యను మునివరులం గాంచి సూతుం డిట్లనియె. 120

సీ. పాలమున్నీటి లోపల శేషశయ్యపై • వెన్నుండు నిద్రించుచున్న కాల
మునఁ గర్ణమలమువలన విడ్డ అన్నద • మ్ముల రీతిగా రక్కసులు జనించి
జలధి లోపలఁ గ్రీడ సల్పుచు నచట న • గ్గడల ఘూర్ణిల్లు న క్కడలిఁ జూచి
ఆధార మొండు లే కాధేయ ముండునే? • యనిమిత్తమైన కార్యములు గలవె?

గీ. యనుచుఁ దమజన్మమునకు శంకాకులత్వ • మంది చింతిల్లి యాశ్చర్యమంది మోద
మంది యేమియుఁ దోఁచనియట్టియెడల • గైటభుఁడు సెప్పె మధువుతోఁ గారణంబు.

క. వననిధిగాని మనముగా, ని నిమిత్తము లేక యుండనేర్తుమె? మనకుఁ
వననిధికిని నాధారం, బనఘా! యొకశక్తి యున్నదని యెఱుఁగవొకో? 122

వ. అను నవసరమున నాకసంబు నుండి యొక్క వాగ్బీజం బుద్భవింప నయ్యది గైకొని వారిరువురు దృఢమ్ముగ జపించుచుండ గగనంబున నొక మెఱుపు మెఱసి నట్లయ్యె. దైత్యు లద్దానిం గాంచి విధిగా నియ్యది దేవీతేజం బని విశ్వసించి యమ్మంత్రంబు మహామంత్రంబుగా భావించి జితేంద్రియులై యాహారంబు వర్జించి యొక వేయి వత్సరంబులు తపంబు సల్పుటయు. 123

క. వారల ఘోరతపం బెద, నారసి కరుణించి యంబ యశరీరిణియై
"కోరుకొనుఁడు వర" మనన, వ్వారును స్వేచ్ఛామరణము వాంఛించుటయున్.

క. మెచ్చితి నెద మీ తపమున, నిచ్చితి భవదీప్సితంబు నిటమీఁదన్ మీ
రెచ్చోఁ బోయినఁ బోవుఁడు, హెచ్చు గలుగుఁ గాని దైన్య మెనయదు మిమ్మున్.

క. అని చెప్పి యా పరాంబిక, చనిన పిదప జలమునందు చరియించుచు బ్ర
హ్మను గని యొకప్డు యుద్ధం, బునకుం రా రమ్మటనిరి పొగరు మిగులఁగన్.

గీ. యుద్ధ మొనరింపఁ జాలక యున్న వీర, భోగ్యమగు వీరజాసనమునకుఁ దగవు
కావ నాసనము డిగి యెందేనిఁ బొమ్ము, లేక యున్న యుద్ధమునకు లేచిరమ్ము.

క. అని దనుజులు వలుకుటయును, వనజాసనుఁడంత భీతివడి యోగసమా
ధినిఁ జెంది యున్న విష్ణుం, గని యిట్లని మొఱ్ఱవెట్టె గద్గదగళుఁడై. 128

సీ. రాకాసులకునై యనేకావతారముల్ • మేల్మిఁ దాల్చినతండ్రి! మేలుకొనుము
సృష్టిస్థితిలయ ప్రసిద్ధిచేఁ దనరారు • లీల గల్గినతండ్రి! మేలుకొనుము
ఆర్తులైనట్టి భక్తాగ్రగణ్యులఁ బ్రోవ • జాలి బూనినతండ్రి! మేలుకొనుము
సాత్త్వికంబైన తేజంబుచేతనె దుర్జ • నాళిఁ ద్రుంచెడి తండ్రి! మేలుకొనుము

గీ. శంఖచక్రగదా ముఖ సాధనములు • కేలదాల్చిన నా తండ్రి! మేలుకొనుము
దుర్దమంబగు విక్కట్టు దొలఁచునేర్పు • చాలఁగల్గిన నా తండ్రి! మేలుకొనుము.

క. చంపెద మంచు విరువురు వి. లింపారులు మీఁదఁ బడిరి; లే లెమ్ము; కటా
క్షింపుము కంపితునను, నను, కంపాకంపిత రసానుగతహృదయుఁడవై. 130

## బ్రహ్మ యోగనిద్రను స్తుతించుట.

క. అనుచు నుతియించినను మే, ల్కనవి జనకుపాటుఁ జూచి కార్యము లేదం
చును యోగనిద్ర నిట్లని, కొనియాడఁ దొడంగె మేలుకొలుపు మటంచుకా. 131

ఉ. అంబ! జగత్త్రయమ్మునకు నాదివి నీ వని నాకు వేదవా
క్యంబులు చెప్పె విక్క: మటుగావియెడన్, సచరాచరస్వరూ
పంబగు నెల్లలోకమును బాలనఁజేయు మహామహుండు ప
ద్మాంబకుఁడిట్లు నీకు వశుఁడై సుఖసుప్తి మునింగిపోవునే! 132

ఉ. దానవు లిత్తఱిన్ మిగులఁ దత్తరపాటొనరించుచున్నవా
రే నిఁక వారిబాధల సహింపఁగలే నటుగాన నాకు నీ
దానవవైరిచే నభయదాన మొసంగఁగఁ జేయుమమ్మ; లే
దా, ననుబాధలన్ జొనుపు దానవయుగ్మము నడ్డగింపుమా. 133

ఉ. నీ వశమై తనర్చు నితనిం గని దగ్గఱి మేలుకొల్ప సౌ
ఖ్యావహమైన లచ్చియు నసర్హ గదా! జగదంబ! నీదు లీ
లా విభవంబు లెల్లెడ నలంఘ్యము లేరికిగాని యున్నచోఁ,
గేవల మస్మదాదుల నకించనులౌ గణియింప నేటికిన్. 134

ఉ. వారు మహాప్రసిద్ధి గలవారు జగద్గణనీయవైభవుల్
వారు పురాకృతంబు గలవా రలవా రిల వేఱెఱుంగ రె
వ్వారు భవద్వరాంఘ్రియుగవారిరుహభ్రమరాయమాణు లె
వ్వారు భవామయాపహభవత్పవిత్రవ్యకటాక్షవీక్షితుల్. 135

ఉ. ఎక్కడదాఁగె నా తెలివి? యేమయిపోయె శుభప్రవృత్తి? యిం
కెక్కడఁ బోవె నా గుణము? లీ హరి యీ గతి నిద్రనొందె న
మ్మక్క! భవద్విలాసకల లక్కజముల్ జననీ! జగమ్ములో
నొక్కతె నీవు దక్క మఱి యొందొరు లిట్టిసమర్థులుండిరే? 136

ఉ. మొట్టమొదల్ జగమ్ముల సముద్ధతిఁ బ్రోవుమటంచు నీతనిఁ
బుట్టఁగఁజేసి యప్పనిఁ బూని చరించుచు నున్న వానిపైఁ
గట్టిఁడివై కదమ్ము కదకంటను జూడఁగ నియ్యకొంటి; నీ
కెట్టులు దోఁచునో యటులయేర్పడఁజేసెద; వడ్డువార మే? 137

గీ. పుట్టఁ జేసిన యట్టి నదా గిట్టఁజేయ, నిచ్చయే నీకు లేకున్న నిట్టి రక్క
సుల సృజింపఁగనేల? భీతిలెడి నన్నుఁ, గని హసించుటకై యేమొ జనని చెపుమ. 

ఉ. నీ చరితంబు నే నెఱుఁగనే? జగమెల్ల సృజించి పెంచి సం
కోచము లేక చంపఁ దొరకొందువు; నీ కెటు నన్నుమాత్రమున్
గాచుట కిచ్చవుట్టు? మృతి గల్గఁగఁ జేసిన నీవ చేయు, మీ
నీచులు చంపిరేనిఁ గడు నిందకుఁ బాత్రుఁడనౌదుఁదల్లిరో! 139

ఉ. అమ్మరో! లెమ్ము వేగమె మహాద్భుతమై తనరారు నీ స్వరూ
పమ్ము ధరించి నన్నయినఁ బట్టి వధింపుము; లేకయున్న న
న్నిమ్మెయి బాధలం జొనుపు నిక్కుటిలాత్ముల నైనఁ జంపు; క
ష్టమ్మనకోర్వఁజాల; నకటా! హరినైనను మేలుకొల్పుమా. 140

క. అని నుతియించెడి వనజా, సనుపైఁ గరుణించి, నిద్ర చనె సరసీజా
క్షుని విడిచి; సరసిజవిలో, చనుఁడును మేల్కాంచె, ధాత సంతసపడఁగన్. 141

## శక్తిస్వరూప కథనము

క. అన విని ముని లిట్లని రో, యనఘా! మా కొక్క సందియము కల్గెను; దా
నిని వినిపించెద; మది నీ, వినినంత యెఱుంగఁ జెప్పవే దయమీఱన్. 142

గీ. హరిహరబ్రహ్మలనఁగ మూఁగురు మహాత్ము, లందొకఁడు పెంచు నొకఁడు లయం బొనర్చు
నొకఁడు సృజియించుఁగాని యందుత్తముండు, హరి సమర్థుండు సర్వకార్యములయందు
గీ. అట్టి హరి యోగనిద్రచేఁ గట్టువడిన, యప్పు డాతని శక్తియు నతని తేజ
మెచటి కేగెను? శక్తికి నితని కన్న, నెక్కుడగు శక్తి కల్గుట యేల? చెపుమ. 144
గీ. నారదాది మహాత్ము లందఱును మాకు, హరియ కారణకారణం బనుచుఁ జెప్పి
రీవు మాత్రము శక్తియం చెఱుఁగఁ జెప్పి, తెద్దియో నిక్కువంబు మా కెఱుఁగరాదు.
వ. అనిన విని సూతుండిట్లను. మునీంద్రులారా! మీ యడిగిన యర్థంబు సావధాన మనస్కులరై యాలకింపుఁడు. మహామతి గోచరంబగు నీవిషయంబున బ్రహ్మపుత్రులగు నారదాదులును మోహమ్మునం జేసి దురవగాహంబగు శక్తిప్రభావం బెఱుఁగలేక జనార్దనుండు పరుండనియు సర్వకర్త యనియు సకలాగమవేద్యుం డనియు భ్రమియించుచున్నవారు. 146

ఉ. అంగజవైరి సర్వహృదయంగమచిత్రచరిత్రుఁ డద్రిజా
లింగితమూర్తి మూర్తిపరిలిప్తవిభూతి విభూతిదాత త్ర
య్యంగనమం ప్రియుండు రజతాచలవాసుఁడు శంకరుండు మా
కుం గులదైవ మంచు మఱికొందఱు సేవ యొనర్తు రెంతయున్. 147

ఉ. కొందఱు సూర్యుఁ డంచు మఱికొందఱు పావకుఁ డంచుఁ గొందఱా
యిందుఁ డటంచుఁ గొందఱు సురేంద్రుఁ డటంచు నదీంద్రుఁ డంచుఁ బే
ర్కొందురు; కొంద 'ఱెయ్యది యొకో' యని సందియమందు సుందరీ
చందమునన్ జగంబు పలుచాయల మాయలలోన మున్గెడిన్. 148

గీ. "ఎవఁ డెవనిఁగాని సేవించు నేమి కొదవ?, సకల నదులును జలధికిఁ జనుతెఱఁగున
సర్వదేవనమస్కృతుల్ సరసిజాక్షు, నంద పర్యాప్తము లటంచు" గొంద ఱంద్రు.
వ. కొందఱు ప్రత్యక్షానుమానోపమానంబులనియుఁ గొందఱు ప్రత్యక్షానుమానోపమాన శబ్దంబులనియుఁ గొందఱు ప్రత్యక్షానుమానోపమానశబ్దార్థాపత్తులనియుఁ బ్రమాణంబులు చెప్పుదురు. పౌరాణికులు మాత్రము సాక్షియు నైతిహ్యమ్మునుం గలియఁ బ్రమాణంబు లేదని యొప్పుదురు. తత్త్వప్రమాణాగోచరంబై యొప్పునది పరశక్తియు కాని వేఱొండు కాదు. అమ్మహాశక్తియందు సృష్టిరూపమ్మునను విష్ణునందుఁ బాలనరూపమ్మునను శివునియందు సంహారరూపమ్మునను సూర్యునియందు దీప్తిస్వరూపమ్మునను వాయువునందుఁ బ్రేరణస్వరూపమ్మునను వహ్నియందు దాహకతారూపమ్మునను వెలుంగుచుండు. 150

ఉ. శక్తివిహీనుఁ డేవనికిఁ జాలఁడు; శక్తియె సర్వభూతసం
నక్తకఁ జెంది సర్వకృతిసాధనమై తనరారుచుండు; నా
శక్తియె ముక్తికారణము; శక్తియె సర్వము; శక్తిలేనిచో
శక్తులు గారు రుద్రహరిసారసనంభవముఖ్యనిర్జరుల్. 151

గీ. అమ్మహాశక్తి సగుణయు నగుణయు నన, రెండుదెఱఁగులఁదనరారుచుండు;నందు
రాగులకు సగుణసేవ్య; విరాగులకును, నిర్గుణాత్మికసేవ్య; మునివరులారా! 152

క. ఈ కలికాలమునందు న, నేకు లనేకులను గొల్చి యిహమును బరమున్
బోకడఁ బెట్టుదు, రల దే, వీకారుణ్యమ్ముఁ గాంచువిధము నెఱుఁగమిన్. 153

ఉ. వేయి కదుస్తు లేల? యిఁక విష్ణువు గిష్ణు వటంచుఁ జెప్పుబల్
మాయలమారిపండితుల మాటలు నమ్మక, సర్వశక్తియై,
మాయకు లోను గాక, ప్రణమప్రణుత ప్రథితప్రభావసు
శ్రీయుత యైన యజ్జననిసేవయె పావన మంచు నెంచుఁడీ. 154

క. హరికతన విరించియు న, వ్విరించి కడ నారదుఁడును, విని రియ్యది; ము
ద్గురునకు నమ్ముని చెప్పెన్, గురుఁడిది యెఱిఁగించె నాకుఁ గోవిదులారా. 155

క. ఆ శక్తి యనుగ్రహమునఁ, గేశవుఁ డటు మేలు గాంచి కెలన నభయదా
నాఖండై తగువిధిఁ గని, పేశలఫణితి నిటు పల్కెఁ బ్రేమదలిర్పన్. 156

క. తపమును మాని యిచటి కే, నెపమున వచ్చితివి వత్స! నీ మనమిట్టుల్
దపియింప నేమి హేతువు, చెపుమా యన ధాత యిట్లు చెప్పఁ దొడంగెన్. 157

క. భవదీయకర్ణమల సం, భవులై మధుకైటభు లనఁ బరఁగెడి రక్షః
ప్రవరులు నను జంపెద మని, బవరమునకుఁ బిల్చి రిఁకఁ దపంబెటు తండ్రీ!

## మధుకైటభ యుద్ధము

వ. ఇవ్విధంబునఁ గుయి వెట్టుటయు జలజలోచనుండు,. 159

క. భయపడఁగ నేల? కడు దు, ర్జయు లగు దానవుల నెల్లఁ జంపెడి నాచే
వ యెఱుంగవె? యను వాలోఁ, బయిఁ బడి రద్దనుజవరులు పద్మజు నొంపన్.

ఉ. వచ్చి విరించిఁ గాంచి "వినుఁ బట్టఁగ లేమని పాఱి వచ్చి తీ
వెచ్చట డాఁగినన్ విడుతుమే? నినుఁ గావఁగ నీతఁ డోపునే?
వచ్చెడివాఁడ వొక్కఁడవె చావక యీతనిఁ గూడఁ జంపఁగా
వచ్చినవాఁడ; వింతగుణవంతులు లోకమునందుఁ గల్గిరే; 161

ఉ. చేసినఁ బాటిపోక యని సేయుము వీరుఁడ వేని; లేక మీ
దాసుఁడ నంచుఁ బల్కుము; వృథావచనంబుల లాభ మేమి?" యం
చా సురవైరు లిర్వురు రయమ్మునఁ బైఁ బడినంతఁ, గేశవుం
డోసరిలంగ నెంచు కమలోద్భవు వెన్కకుఁ జేర్చి యిట్లనున్. 162

ఉ. క్రిందను మీఁదునుం గనక ప్రేలెద రింత మదంబు హెచ్చెనే?
తొందర మాను డిప్పుడ కుతూహలము న్నెఱవేర్తు రం డటం
చుం దలపడ్డ దానికి ననూయమె యింక గవి యమ్మధుండు గో
విందుని మార్కొనెన్ సమరభీకర బాహుబలాభిశోభియై. 163

గీ. అంబ యాకసమందుండి యరయుచుండ, నంచ రౌతంబువిధినుండి కాంచుచుండ
హరియు నయ్యమరారియు నతిముఖిగఁ బె, నంగ సాఁగిరిసంభ్రమంబు పొంగిపొరల.

గీ. బాహుయుద్ధంబుచేఁ గొంత బడలి యున్న, యన్న వారించి కైటభుం డసమభుజబ
లంబు దీపింప మల్లయుద్ధం బొనర్ప, దలపడియె ధాత మది కొంత తల్లడిలఁగ.

ఉ. అన్నయుఁ దమ్ముఁడుం గలసి యా హరి నాహవలీల బాహుగ
ర్వోన్నతి మార్కొనన్, జలధు లూరక తల్లడిలంగ సాఁగె; ని
ట్లెన్నఁగ రాని విక్రమము నేఁబదివందల యేండ్లు సూప నా
పన్నగశాయికిన్ మిగుల భారముదోఁచెఁ గ్రమక్రమమ్మునన్. 166

క. ఏదియుఁ దోఁచక కడుఁ బెం, పేది ముదముఁ దక్కి యెట్టులీ రక్కసులన్
బాధింతు విచట వీఁకఁ ది, క్కేది? యనుచుఁ జింతసేయునెడ నాతనితోన్. 167

వ. ఉక్కు మిగిలి రక్కసు లిట్లనిరి. 168

చ. బవరము సేయఁ బూనుటకు బాహుబలం బుడివోయెనేనిఁ బెం
పు విడిచి 'మీకు దాసుఁడను బ్రోవు' మటంచును బల్కు; మట్టు ప
ల్కువిధికి నొప్పవేని, వినుఁగూల్చి, యనంతరమందుఁ బంకజో
ద్భవుఁ గడ తేర్తు మన్న బెడిదంబునకున్ హరి సామమొప్పగన్. 169

క. అలసినవారల మిక్కిలి, సొలసినవారలను భీతిఁ జొక్కినవారిన్
దలఁకి యిలఁ బడినవారిన్, దలపడ రిది వీరవరులధర్మమ యెందున్. 170

చ. అదియును గాక మీ రిరువు రొటను నే నొకరుండ నొట మీ
రదనుఁ బరిశ్రమాపహరణార్థముగా దొరకొంటి రేమునున్
గదన మొనర్తు నొక్క త్రుటికాలము దక్కను విశ్రమించి; యం
తదనుక నోపుఁడీ! కదనధర్మము మర్మము మీ రెఱుంగరే? 171

చ. అనుచ దనుజారిపల్కు విని యద్దనుజుల్ తగ విశ్రమింపు మం
చును సమరంబు మాని యొకచోటను దామును విశ్రమించి: 'వి
ద్దనుజులు శక్తిద త్తవరదర్పితు' లం చొగి దివ్యదృష్టిచే
తనత దెలిసింగి "చేసితి వృథారణ మేమి యుపాయమియ్యెడన్. 172

క. వీరలు స్వేచ్ఛామరణము, గౌరి వరంబంది యున్న రుమతులు ప్రాణం
బేరికినైనను జేదే ?, వీరికి మృతి యెట్లు" లనుచు విహ్వలమతియై. 173

ల. వె. ఎట్టి రోగియేని యెట్టి యాపన్నుండు, నేని యెట్టి రిత్తఁదేని బ్రమసి
నాసపేయుఁగాని, యాసింపఁదెంతటి, మందుఁదేని తాను మ్రందు తెలుపు. 174

వ. ఇట్లు, 175

క. సారెకుఁ జింతిలి "దేవీ, కారుణ్యము లేక వీరిఁ గడతేర్పఁగ రా
దేరికి" నంచును సద్దను, జారి నుతింపం దొడంగె నజ్జగదంబన్. 176

చ. జనని ! జగద్విరోధిజనసంహరణప్రవణ ప్రభావ ! మో
హిని ! పరతత్త్వరూపిణి ! మహేశ్వరి ! కామితదాయినీ ! జగ
జ్జననవిధాయినీ ! సతతజాగరిణీ ! కరుణానుసారిణీ !
నిను నుతియింపనేరఁ గరుణించుము నింపుము హార్మినాపయిన్. 177

క. నీ విచ్చిన వరమునఁ గడుఁ, గావరముం జెంది యనిఁ గాల్ ద్రవ్విరి త
ల్లి ! వీ రిరువు రొకరుఁడను, నే వాఁడిమి చూప నేర్తునే ? వీరలపై. 178

క. ఈయెడ వీరల జంపు ము, పాయము వేతొండు నీ సహాయము దక్కన్
నా యెఱిఁగినంతలో లే, దో యమ్మ ! యూరకుంట యుక్తమె ? నీకున్. 179

గీ. ఈ యుపేక్ష యొనర్చిన నిపుడ నన్నుఁ, బట్టి చంపెదరమ్మ ! యీ పాపకర్మ
లనుచు విలపించుహరిఁ గాంచి యంబ పలికెఁ, జెలునగపు నెమ్మొగమ్మునఁ జెంగలింప. 180

క. "నా మాయచేతఁ గప్పెద, నీ మానవ భక్షకుల జయింపు" మనుడు సం
గ్రామమున కభిముఖుండగు, దామోదరుఁ గాంచి మిగుల దర్పమెలర్పన్. 181

చ. 'జయముఁ బరాజయమ్ము సహజమ్ములు శూరులకున్ బరాజయో
దయమునకున్ గృశింపకుము; దానవులెందఱినేని మున్ బరా
జయమున ముంపవే ! జయము శాశ్వతమే ?' యనిపల్కు దానవ
ద్వయిఁగని మాధవుం డనుగతప్రణుతప్రథితప్రతాపుఁడై. 182

క. కడుఁ గర్కశ మగుగతి నె, క్కుడు కోపము గదుర నెదురుకొని ధీరత్వం
బడరఁగ దనుజులఁ బిడికిటఁ, బొడిచిన నబ్బాహుపువడియుఁ బొగరుమిగులఁగన్.

క. ఒక్కుమ్మడి నా యిరువురు, రక్కసు లార్పులు సెలంగ రక్తము తోడ్తోఁ
గ్రక్కుచు స్రుక్కఁగ నెక్కొని, యక్కమలాక్షుని యురంబు నదరన్ బొడువన్.

వ. హరియును మరలన్ బొడిచె నిట్లు పరస్పరజయేచ్ఛం గొంతవడి సంకులంబగు
సంగరంబు ప్రవర్తిల్లుటయు. 185

క. బొమ్మన నెత్తురు గ్రమ్మఁగ, సొమ్మసిలి రమాధవుండు చూడ్కుల దీన
త్వమ్ము గదురఁగాఁ దన కూ, ర్ధ్వమ్మునఁ గనుపట్టుదేవి భావనిఁ గాంచెన్. 186

ఉ. చూచినయంత నా త్రిపురసుందరి లో దయమీఱ, మార నా
రాచములో యనందగు నరాళకటాక్షపరంపరన్ దమి
ప్రాచరయుగ్మమున్ బొదువ రక్తిమెయిన్ దనుజన్ములా యమం
జూచుచుఁ గామబాణముల సొక్కిరి తక్కిరి యుద్ధపద్ధతిన్. 187

శా. ఆ మందస్మిత మా కటాక్షవిభవం బా భావ మాహావ మా
గోమున్నోమును ప్రేమ మీఱఁ గని సంకోచించుచున్ గామసం
గ్రామార్థంబు ప్రయత్నమున్ సలుపు రక్షస్స్వాములన్ మాధవుం
డామోదమ్మునఁ జేరి యిట్లనియె ధైర్యస్థైర్యసంపన్నుఁడై. 188

ఉ. ఎందఱినేని మున్ను దనుజేంద్రులఁ జూచితిఁగాని మిమ్ము బో
లం దగువారలే రణకలావిభవమ్మున? మీ రణంబు నా
డెందమునందు మోదము ఘటింపఁగఁ జేసె; భవన్మనోరథం
బుం దెలియంగఁ జేయుఁడది పూర్తి యొనర్తునటన్న రక్కసుల్. 189

తే. గీ. అ మ్మహామాయచే మోహితాత్ములైన, కారణంబున నభిమాన శూరులగుచుఁ
గల్లఁ గపటంబు నెఱుఁగక కంజనేత్రు, సీసడించుచు దరహాస మినుమడింప.

గీ. వి న్నడుగువారమే మేము? నీవు మాకు, దాతవే? చాలు నింత యంతరము లేదె?
వలసె నేనియుఁ గోరుకొమ్మెలమి మేమ, వరము నీకిచ్చెదము నాఁగ హరియు నెఱిఁగి.

క. ఏఁ గోరినవర మొసఁగెద, రేఁగా? నాయుద్ధ మంత యానందము మీ
కీఁగలిగెనేని వధ్యులు, గాఁగోరెద ననుడు వారు కళవళపడుచున్. 192

వ. కొండొక చింతించి, 193

గీ. సత్యపరిపాలనమ్మును సలిపెదేని, మాకు వర మిచ్చెద నటన్న మాటదలఁచి
జలములేని విశాలదేశమున మమ్ము, ద్రుంపు మట్లైన నీకు వధ్యులము మేము. 194

కి. అని దనుజులు పల్కిన న, వ్వనజాక్షుం డట్ల చేయువాఁడై నగి య
మ్మనుజాశనుల వధింపఁగఁ, దన యూరులు పెంచి "రండు దానవు" లనుచున్.

వ. వారును దదధికంబుగ శరీరమ్ము పెంచిన, 196

క. అసురారి యూరువులు ర, క్కసు లంగము లిట్లు పెనుఁపగాఁ దుదకా రా
క్షసుల శరీరమునకు వె, క్కస మయ్యెఁ దనూరువు లధికము లగుకతనన్. 197

వ. అంత, 198

క. తనయూరుభాగమును జెం, దిన హరియును వారలను వధింపఁగఁ జక్రం
బును దలఁచిన నది వైళము, దనుజన్ములఁ బ్రాణములకుఁ దక్కన్ జేసెన్. 199

ఆ. వె. వారిమెదడు జలధివారిలోఁ బడి పెద్ద, దిప్ప యయ్యె వసుమతికిని నాఁడు
మొదలు 'మేదిని' యనుపదము తటస్థించెఁ, దాన మన్ను తినఁగరానిదయ్యె.

గీ. నాయెఱిఁగినంత మీకు విన్నపము చేసి, కొంటి సగుణయొ లేక నిర్గుణయొ సేవ
నీయ పరశక్తియే యింత నిజము నిజము, వేదశాస్త్రంబు లియ్యెడ విశ్రుతములు.

## వ్యాసునకు హరుఁడు ప్రత్యక్షమగుట

క. అని చెప్పిన సూతుం గని, మును లిట్లని రట్లు వ్యాసమునిచంద్రుఁడు హే
మనగమ్మునకుఁ దపమునకై, చనె నని చెప్పియును దత్ప్రసంగవశమునన్. 202

గీ. ఇతరకథ లెన్నియో చెప్పి తీవు మాకు, మొదటివృత్తాంత మది తుదముట్టనయ్యె
నదియు మా కెఱిఁగింపవే యనెడి మునుల, కిట్లనియె సూతుఁ డాదరంబెసక మెసఁగ.

సీ. అట్లు హేమనగమ్మునందలి, కర్ణికా • ర వనమ్మునందు నారదుఁడు మున్ను
తనకుఁ జెప్పిన మంత్రమును జపించుచుఁ "బంచ • భూతపీఠ్యందగుపుత్రుఁడుద్భ
వింపఁగావలె" నంచు వేదాంతవేద్యుఁడై • తనయుశక్తిని జిత్తమునఁ దలంచి
శతవత్సరమ్ము లశనము వర్జించి త • పం బొనర్చుచునున్న వ్యాసమునికి

గీ. కెంజడలు గట్టె శిరము, శుష్కీభవించెఁ • దనువు, కంపించెభూనభోంతరములెల్ల
దాన నింద్రుఁడు భయమంది తామ సురలు • శివునిపాలికిఁ జని యిట్లుచెప్పికొనిరి

గీ. దేవ! దేవేశ! సత్యవతీ సుతుండు; తప మొనర్చుచు నుండె వత్సరములొక్క
నూఱు గతియించె దానఁ దుందుడుకు పుట్టెఁ, బ్రోవవే! యన నమ్మహాదేవుఁ డనియె.

గీ. తాపసుల కపచారముల్ దలఁప రాదు, వార లోరులను బాధించువారు కారు
ఇమ్మునిసుతార్థియై నన్ను వెదఁద శక్తి, సంయుతుని విల్ప జపియించు జంభభేది!

వ. అని చెప్పి యద్దేవుండు సశక్తికుం డగుచు మునికిఁ బ్రత్యక్షమై యతని మనో
రథంబు సఫలంబుగా వరం బొసంగినఁ గృష్ణద్వైపాయనుం డయ్యనఘునకు
నమస్కరించి తదాజ్ఞ వడసి స్వాశ్రమంబున కరిగి, 207

మ. అరణిం దెచ్చి మథించి యగ్నికయి యం దావిర్భవం బందున
గ్నిరుచిం గాంచి యొసంగు తేజమున వీనిం బోలు పుత్త్రుల్ యశ
స్కరు నే నేగతిఁ గాంచువాఁడ ? నుతసంస్కారమ్ము గావించున
య్యరణుల్ యోగ్యత గల్గుకామినులు నా కాభాగ్య మిప్డున్నదే ? 208

వ. అని మఱియును, 209

సీ. తనయిచ్చఁ బోవుజంత్రపుముద్దుకీల్బొమ్మ • విందుగాఁ దగుచేఁదువేముచెట్టు
అనుమానములకుఁ గట్టనికొంప ప్రక్కలో • నొఱపు వించెడి వాఁడికఱకుటమ్ము
పొల్లుగాఁ బన్నెముల్ జల్లించుజల్లెడ • భ్రాంతి పుట్టించు నభ్రంపుమందు
పెనుదోషములకుఁ బెట్టినపేరు దుఃఖంబు • సౌఖ్యమ్ముగాఁ జూపఁజాలువిద్య

గీ. కాలిసంకెల బొంతులకాలయంబు • మచ్చికఘటించుపాము కామములదీము
కోపములప్రాపు మిత్తిగైకొన్నరూపు • గాదె కామిని; యిట్టిసంగాత మేల ? 210

గీ. అనుచుఁ జింతించుచున్న యావ్యాసమునికిఁ, గన్పడె ఘృతాచి గగనభాగమ్మునందు;
దానిఁ గనుఁగొన్నమాత్రన గావనయ్యె, మదనుఁడును గోపఘూర్ణితవదనుఁ డగుచు,

క. కనుఁగొని యయ్యది తనువం, చనఁ జేయఁగ వచ్చినదని సందియపడి కా
మునిబారిఁ బడియుఁ గసుగం, దని తెలివికతమున నిట్లు తలపోసె మదిన్. 212

ఆ. వె. ధర్మచింత సేయుతఱి నేలవచ్చె నీ, కలికిమిన్న ? వచ్చెఁగాక దీనిఁ
గొని సుఖింపరాదె ? కొనిసుఖించిన మునుల్, నవ్వకుందురెట్లు నన్నుఁ జూచి ?

గీ. నగిన నేమగు ? నీకాంత నా కనంత, సుఖ మొసఁగి మది నావయఁ జొనుపునొక్కొ ?
మును పురూరవు నూర్వశివనితవిధము, చేసి వలవంతలకుఁ బాలు సేయునొక్కొ ?

క. అని వ్యాసుఁడు చింతాకుల, మనస్కుఁ డయ్యె నన మౌనిమణులెల్లరు సూ
తునిఁగాంచి యప్పురూరవుఁ, డనవెవ్వఁడు తెల్పుమనిన నతఁ డిట్లనియెన్. 215

## బుధోత్పత్తి.

ఆ. వె. కలదు తార యనెడికామిని యలబృహ, స్పతికి దార గుణవిచారదూర
విజితమారదార విపులకటీభార; కడునుదార చారుకాంతిపూర. 216

క. ఆరామ యొక్కదినమునఁ, దారాపతి యింటి కరుగ దానియొయ్యారం
బారసి యాసికాగ్రణి, మారశిలీముఖవిదార్యమాణుం డయ్యెన్. 217

క. ఆకాంత శశికాంతుని, యాకారముఁ గాంచి విస్మితాంతస్థితయై యు
ద్రేకంబుఁ గొని యయుఁ గొన, నా కామునిబారిఁ బడియెనఁట యేమందుఁగా. 218

మ. ఇటు లన్యోన్యమనోనురాగములపెం పేపార నాతారయున్
గుటిలాత్ముండగు చంద్రుఁడుం గలసి కోర్కుల్ మిన్నుముట్టంగ లం
పటులై సౌఖ్యము గోలుచుండిరి కటా! చెప్పన్ శక్యమే దైవసం
ఘటనానైపుణి, యాతఁడయ్యెడియొ! యక్కాంతాణిమేయాత్ముఁడో! 219

గీ. ఇటు లనేకదినమ్ము లయ్యెంతవఱకు, నుండి రాసున్న గురుఁడు సమయుక్తవేళను
శిష్యు నొక్కని నంపె దేశికుఁ డయ్యెడ. వాఁడు దెల్పిన వినఁడయ్యె వారిజాక్షి. 220

వ. పిదప నయ్యంతేవాసి గురుసమీపమ్మునకుం జని సకల వృత్తాంతమ్ము నెఱింగిం
చుటయు బృహస్పతి చింతాకులుండై మఱియొకరు నింకొకరు చేరువకు నంపి
యంపి విసివి విసివి తుదకు రోషారుణితాక్షుండగుచుఁ జంద్రునిపాలికిం జని తన్నుం
గాంచి మదమ్మున నగు నతని కిట్లనియె. 221

శా. ఔరా! చంద్ర! వివేకహీన! గురుభార్యన్ గైకొనన్ జెల్లునే?
యీతామన్ మరుకేళి కానపడిగా కిందెట్లు నీవుంచితో
రీ! రాత్రించర! యీవకే గృహమునం దీయింతిఁ బోషింతువే?
మేరదా మీఱిననీకు నేఁడ యగుఁ జామ్మి. శాస్త్ర దుష్టుఁడా! 222

గీ. బ్రాహ్మణునిఁ జంపువాఁడు కల్ద్రాగువాఁడు, కనకహారియు గురుకాంతఁ గవయువాఁడు
వీరలను వీరితోఁ జెల్మిఁ గోరువాఁడు, గలసి పంచమహాపాతకులు దలంప. 223

ఉ. కావున నిట్టిపాతకికిఁ గల్గునె స్వర్గనివాస, మోరి చం
ద్రా! విడు మీవెలందిఁ, గురుదారయుఁ దల్లియు నొక్కటౌ పకా
దే! వివరించి చూడుము మదిన్, మతిమంతుఁడ వీ వెఱుంగవే?
దేవతలెల్ల నవ్వరె? విధింపఁడె శిక్ష విలింపభర్తయున్? 224

వ. అని కోపోద్రేకంబునం బల్కు దేవమంత్రిం గని చంద్రుం డల్లన నిట్లనియె. 225

ఉ. కోపము బ్రాహ్మణోత్తములకున్ దగునే? యిదె శేముషీమహి! తా
నే పయనంబు పేయఁగల దిప్పుడ యంచొక ధర్మశాస్త్రమా?
కాఁపురముండునే! యిచటఁ, గాఁపుర మున్నను లోపమా! మన
స్తాపము చెందనేటికి? బుధప్రవరత్వ మదెల్లఁ బొల్లగన్. 226

క. వనిత పరపురుషుఁ గలిసియు, ననఘ యగు రజఃప్రసక్తి; నగ్రజుఁ డఘముం
బొనరించి వైదికకర్మం, బున శుద్ధుండగు; నటంచు మును నీ వనవే? 227

వ. అని నయుక్తికమ్ముగాఁ బల్కు శిష్యునికి మాఱాడం జాలమి మనమ్మున విషాదంబు పెనంగొనంగ నిజగృహమ్మునకుం జని కొన్ని దినమ్ములు ప్రతీక్షించి భార్య రాకుంటకుఁ జింతాక్రాంతుండై మదనప్రేరితుండై మరల శిష్యునిపాలికిం జనునెడ దౌవారికునిచే నివారింపం బడి కన్నుల విన్నదనంబు వొడమఁ గోపాటోపంబు దీపింప నెలుఁగెత్తి యిట్లనియె. 228

ఉ. ఓరి! దురాత్మ! యెంతటి దురాచరణం బొడిగట్టినావురా!
దారను చూడనేగు నను ద్వారమునం దొకఁడాఁగువాఁడె? నా
నీరజనేత్ర నా యతివ నీకు స్వతంత్రమె? నాకు దూరమే?
ధీరవినింద్య నిన్నుఁ గడతేర్చెద శాపమొసంగి నావుడున్. 229

చ. వెలఁది వెలంది యంచుఁ బలవించెదవేల! సమస్త లక్షణం
బులు గల యూనెలంత నినుబోటి దరిద్రునియింట నుండ రా
పలయునె? యింతి కావలసివచ్చిన నీ కెనయైన బోటితోఁ
గలిసి సుఖింపు, మీ జలజగంధినిఁ గూడి సుఖింప నేర్తువే? 230

క. చదివితివి సకలవిద్యలు, మదనాగమ మీ వొకింత మదినెఱుఁగవయో!
ముదిత తగువానిఁ బొందున్, వదలున్ దూరమునఁ దగనివాఁడగు నేనిన్. 231

ఉ. ఇంత విచార మేల? విను మే బహుభాషలవాఁడఁ గాను; నీ
యింతి నొసంగ; నీవిక యథేచ్ఛఁ జనం దగుఁ; గామబాధిత
స్వాంతుఁడవైన నీ వొసఁగుశాపము నన్ దగులంగఁ బోదు కా
వంతయు; నీకుఁ జేయఁదగునంతయుఁ జేయుము పొమ్ము నావుడున్; 232

వ. గురుండు చేయునది లేక యింద్రుపాలికిం జనుటయు. 233

ఉ. వచ్చిన దేవమంత్రిముఖుపై హరి వేఱొకరీతిఁ దోఁపఁగా
నెచ్చట నే యుపద్రవము నెవ్వరిచే నితఁడొందె నొక్కొ? యం
చచ్చపు భక్తిమై నతని నర్చితుఁ జేసి మహాత్మ! యెంతయున్
సచ్చరితుండ వీ విటు విచారము నొందఁగ నేల తెల్పుమా. 234

గీ. నాకు గురువైన నీకు బన్నం బొనర్పఁ, గా నెవఁడు సాహసించె? నవ్వానిఁ దెల్పు;
మీక్షణమ సంహరించెద; నిందు నాకు, హరిహరబ్రహ్మలును బాస దగుట ధ్రువము.

క. అన గురుఁడిట్లను నా భా, ర్యను జంద్రుం డపహరించె నకటా ! బతిమా
లిన 'నీను వోమ్ము పో' మ్మని, యెను నా గృహిణీలలామ నిప్పింపఁగదే. 236
సీ. అంగనామణిలేని యాశ్రమంబు శ్రమంబు • భార్య లేనున్న సంపత్తివిపత్తి
అర్ధాంగిపెట్టని యన్నంబు సున్నంబు • సహధర్మిణికిఁ గాని శయ్య కౌయ్య
గృహిణిపొందికలేనికేళిక తేలిక • యిల్లాలు లేకున్న యిల్లు ముల్లు
సహచారిణికిఁగాని సంగంబు భంగంబు • సతిచేతఁ బెరుఁగని సుతులు మృతులు
గీ. శిష్యుఁడవు గాన నీతోడఁ జెప్పికొంటి • నా తలోదరి నిప్పించి నా మనోం
తమ్ము నొడఁగూర్పు; మీరీతిఁ దలఁపవేని • సన్యసించెదఁగాని సంసారమొల్ల.
చ. అని వనఁటన్ మునుంగు గురు "నాతురతం గననేటికయ్య ? యా
పెను నొకయింతలోన విడిపించెదఁ, గాదని చంద్రుఁ డెంతయున్
వినక బలాత్కరించినఁ బవిం జవిఁజూపి మదం బడంతు దు
ర్జనుఁ డెటువంటి దుష్కృతము సల్పెనహో" యని చింత నొందుచున్: 238
వ. వక్తవ్యం బుపదేశించి దూతం బుచ్చుటయు వాఁడు శశిపాలికిం జని, 239
సీ. కన్నసంతానంబుకన్న నెక్కుడుగార • వించి పెంచుటయైన నెంచవైతి
గురుభార్య తల్లి కెక్కుడటంచు వచియించు • ధర్మశాస్త్రంబైనఁ దలఁపవైతి
మునులకెల్లను శిరోభూషణం బగుతండ్రి • పరు వోకింతైనఁ గాపాడవైతి
సరిగాఁ జదువుకొన్నసహపాఠు లగు మాద్రు • కుల ప్రతిష్ఠలనైనఁ జూడవైతి
గీ. ధర్మవిదుఁడవు నీతిశాస్త్రజ్ఞమతివి
రాజవు కలానిధివి ద్విజరాజటన్న
యశము గైకొన్న మేటి వయ్యయ్యొ ! చంద్ర !
గురుకళత్రంబుతోఁ బొందుఁ గోరఁదగునె ? 240
క. ఇరువది యెనమండ్రు తలో, దరులుండఁగ మేనకాది దనకామిను లు
ద్ధుర యౌవనవతు లుండఁగ, దొరకెనె గురుకాంత నీకుఁ ? దోయజవైరీ ! 241
క. నీవంటి తెలివి గలిగిన, కోవిదుఁ డిటువంటి పనులకుఁ జొరఁబడఁగా
నేవ్వాఁడు సంశయించును ? • నీవెఱుఁగవె, ధర్మనియతి నిలుచునె యింకన్ ? 242
క. పలుమాట లేల దేశికు, కళత్రమును విడిచి పెట్టఁగాఁ దగు, మనకుఁ
గలహమ్ము పాడియగునే ?, కలహమునకుఁ గాంత ముఖ్యకారణమకదా ! 243
క. తనపడఁతి నొకరుఁడంటఁగ, దనకున్ మన మెట్లు పొగులుఁ దా వన్యసతిన్
గొన వాని మనము నట్లే, యనుకొనఁదగు భార్య గోప్యయగు నెల్లరికిన్. 244

క. అని పలుకు మనియె నీతోఁ, దన పలుకులుగా బలారి తగ ననఁ జంద్రుం
డనుమానింపక దూతం, గని యిట్లనెఁ గనుల నగ్ని కణములు రాలన్. 245

చ. పరులకు బుద్ధులం గఱపవచ్చునుగాక, మతేమి ? కోడియై
పరమ పతివ్రతన్ దపసి భార్యను బట్టిననాఁడు బుద్ధిఁ జె
ప్పిరె తన కెవ్వరేనిఁ ? దన పెట్టి తమన్ మఱపించుఁగాక, యొం
డొరు మఱపింప నేర్చునె; యహో ! బలవైరియుఁ జెప్పనంపెనే ! 246

క. గురుభార్య తల్లి యనెడి ప్ర, కరణమ్మున భ్రాతృభార్యఁ గవయుట వేశ్యా
తరుణిం గూడుట యని తన, గురువునకున్ జెప్పె నేమొకో ! ధర్మమ్ముల్. 247

గీ. కాఁగదా ! యెల్లవారు బృహస్పతి ప్ర, ణీతమౌ ధర్మశాస్త్రమ్ము నూఁతఁ గొనుట
అతఁడ చెప్పఁడె" తనకుఁదానయివలచిన, తరుణిగవఁగూడకున్నఁబాతకమటంచు.

గీ. బలవిహీనుని కన్యవిభార్య యంచుఁ, దన కళత్రం బటంచు భేదంబు గావి
సొగసు గలదెల్లఁ దనచేతి సొమ్మ కాక, బలము గలిగిన వాని కేర్పాటు కలదె ?

క. రతి గుప్తేత నాయం దను, రాగాతిశయమ్ము మై భరంబిదె విఁక నే
నేగతి విడిచెద ధర్మం, బేగతి నొప్పికొను న్యాయ మేగతిఁ జెల్లన్ ? 250

క. న్యాయంబు విడిచి యీ యెల, ప్రాయంపుం గుబ్బలాఁడి వదలిన నన్నున్
బాయుటయు తక్కఁ దన్నుం, జీ యని రోయక సుఖింపఁజేయునె చెపుమా ?251

గీ. సోదరుని భార్యఁ దాఁ గూడు టాది గాఁగ, నీతలోదరి కెంతయు నేవ మొదపె
నేమి లాభమ్ము గురునియం దీవెలంది, మనము రమియింప దెందు కీ మమత తనకు?

గీ. పలుపలుకు లాడ నేల? యీ పలుకువినుము, దీనికై ప్రాణములకై నఁదెగుదుఁగాఁని
యొందుఁదలఁపనటంచుఁజంద్రుండుపెప్పె, ననుచునీరాజుతోఁజెప్పికొనుమువొమ్ము.

చ. అనుటయు దేవదూత చని యంతయు నింద్రునకున్ వచించె దా
విని విని "చంద్రుఁ డింతటి పవిన్ బొనరించియు నింత సాహసం
బొనరుప నెంచినాఁడె" యని యుద్ధురకోపవిఘూర్ణమానలో
చనుఁడయి చంద్రునిం బొదువ సన్నహనం బొనరించె సైన్యమున్. 254

క. శీతాంశునకును నింద్రున, కీ తీరుగఁ బోరుగలుగ నిజ్యాహితుఁ డా
దైతేయగురుఁడు శిష్య, వ్రాతముతోఁ దోడుపడెఁ గువలయ హితునకున్. 255

క. గురువైరి శుక్రుఁ డింద్రుని, బరికొల్పెఁగదా ! యటంచుఁ బరవైరి కృపా
కరమతి గురుపక్షమునం, దురమున్ బొనరింపవచ్చె దున్సహశక్తిన్. 256

గీ. వారలకు వీరలకుఁ బోరు ఘోరమయ్యెఁ, సంచలించెను సర్వ ప్రపంచములును
హంస వాహనారూఢుఁడై యజుఁడు వచ్చెఁ, బోరువారించికార్యంబు బొసఁగఁజేయ.
క. పదఁపడి చంద్రుం గనుఁగొని, "వదలుము గురుభార్య, నట్లు వదలవ యేనిన్
మద మడఁగించెదఁ జూమ్మీ, గదాధరునితోడఁ జెప్పి నిమలారాతీ!" 258
వ. అని శుక్రుం బిలిచి, 259
క. తగునె బృహస్పతిపైఁ గల, పగచేఁ జంద్రునకుఁ దోడుపడి యిప్పట్లన్
బగదీర్చుట? యిది విని యే, మగనిన్ విడనాడ దే రమణి వ్యాజమునన్? 260
క. అని చెప్పిన శుక్రుఁడు "నీ, జనకుఁడు నన్ గోరె గురుని బాయక సదయా
జనుఁ, దాత కూడఁ జెప్పెడి", నన విడిచెన్ గురుని సతిన్ సంతుష్టాత్మన్. 261
ఆ. వె. చంద్రముక్త యైనసతిఁ గొని యా బృహ, స్పతి గృహంబుఁ జేరి సంతసించె
శంకరాది సురలు చనిరి యథేచ్ఛను; గొమరుఁ గనియె నంత గురునిభార్య.
ఆ. వె. గురుఁడు మోదమంది కొమరునకును జాత, కర్మమాచరింపఁగడఁగుటయును
నాయుదంత మంత నాలించి కీలెంచి, శీతకిరణుఁ డొక్కదూత నంపె. 263
వ. దూతయు బృహస్పతి పాలికిం జని చంద్రు వచనమ్ములుగా నిట్లనియె. 264
గీ. వీఁడు నీదుకుమారుండు గాఁడు మామ, కీనతేజోభవుం డట్టి వీనికెట్లు
జాతకర్మాదికంబును సల్పెదీ వ, టంచుఁ బల్కినఁ దా నిట్టులనియె గురుఁడు. 265
గీ. నాతనూజుండు వీఁడు చిహ్నములచేత, గాని రూపమ్ముచేఁ గాని వానిఁబోలు
వాఁడుగాఁడు; మత్సదృశుఁడే, వాస్తవమిది, యనుడు; సకలమ్ము దెల్పెఁ జంద్రునకు దూత.
క. తెలిపిన సరసిజవైరియుఁ, గలహమునకు వచ్చె దైత్యగణములు గొలువన్
గలహం బీగతి బనరు, త్కలితంబై యెసఁగె దేవదానవతతికిన్. 267
వ. అంత, 268
గీ. సరసిజాసనుఁ డేతెంచి సంయుగమ్ము, వలదనుచు వారి వారించి కలహమునకుఁ
గారణంబగు గురుదారఁ గాంచి పలికెఁ, గోపమును బెద్దఱికము గొంత యెసఁగ.
క. పడుచుఁదనపుఁబనిచే నీ, గొడవం గొని తెచ్చి తీవు కోమలి! యీ కీ
కొడు కెవనివలనఁ గలిగెనొ, తడయంగా నేల చెప్పఁ దగదే మాకున్? 270
ఆ. వె. సిగ్గు చిన్ననాఁడ చెడిపోయెఁ బో! కొంత, కొంతపోయెఁ జంద్రుఁ గూడునాఁడు
కొడుకుఁ గంటిగాదె కోమలి? యిఁకనున్న, దియును లేనిదియును బయలఁ బడియె.
గీ. నీవలనఁగాని వీరి సందియము దీఱ, దతివ! గురుతేజమో? లేక యబ్జవైరి
తేజమో? తెల్పరాదె; యీ తీరు నీదు, తలన పుట్టెనే? తప్పునే దైవకృతము. 272

క. అను కమలాసను మొగమున్, గనలేక శిరమ్ము వంచి కడుసిగ్గున మె
ల్లన నిట్లనెఁ దారయుఁ "జం, ద్రునకే చంద్రునకె చందురునకే" యంచున్. 273

ఆ.వె. పద్మసూతి యంత బాలు నిశ్శంకఁగాఁ, దొగలఁజేని కిచ్చి తగవు దీర్చె
మిగుల సంతసించి మేలెంచి బుధుఁడంచుఁ, బేరుఁ బెట్టికొనెఁ దుషారకరుఁడు.

ఆ.వె. గురుకళత్రమందుఁ గువలయహితునకు, బుధుఁడు పుట్టె నిట్లు బుధుని వలన
నల పురూరవుండు కలిగిన చందంబు, నెఱుఁగఁ జేసెదను మునీంద్రులార! 275

## పురూరవశ్చరిత్ర.

క. ఖద్యోతతేజుఁ డతి సం, పద్యుతుఁ డుద్యద్యశః ప్రభాపుం డపర
ప్రద్యుమ్నుఁడు సుద్యుమ్నుఁ డ, ఖద్యోఖద్యోతమాన వీర్యుండలరున్. 276

వ. అతం డొక్కనాఁడు కతిపయామాత్య సహితుఁడై సైన్యసమేతంబుగా సైంధవం
బెక్కి ధనుర్బాణమ్ములు ధరియించి మృగయావినోదమ్మున నానావిధ మృగమ్ముల
నుక్కడంచుచుఁ గ్రుమ్మరువాఁడు ముందట, 277

చ. చని చని కాంచె నొక్కెడఁ బ్రశస్తతరస్తబకాభిశోభి నూ
తనకనదాగమాగమసదాగతి చాలిత మాలతీ లతాం
త నిబిడకుంజపుంజ సుభితప్రమదప్రమదావివందికా
స్వనమిళితాళికోకిలరవంబు కుమారవనంబు దంబుగన్. 278

క. కని యవ్వనముఁ బ్రవేశిం, చిన తత్క్షణమంద వింత చెలువున వనితా
జనతాఘనతారుణ్యం, బెనసిన యొక కన్నెరూప మెలమిన్ గాంచెన్. 279

గీ. తోడవచ్చిన సేనయు నాఁడురూపు, గాంచె నశ్వంబు బడబయై కానిపించె
నిట్లగుట కాత్మ నాశ్చర్య మినుమడింపఁ, గారణంబించు కేనియుఁ గానలేక, 280

సీ. సామంతరాజన్య సంఘంబుతోఁ గొల్వు • కూటమ్ములో నెట్లు గూరుచుందు
నంతఃపురీవసతాక్కాంతామణుల కొరెక్క • లెటుఁగి వారల చిత్త మెట్లు గొందు
గర్వించు శత్రువర్గంబు పైఁబడి రాఁగ • వారలతో నెట్లు పోరొనర్తు
పురుషయోగ్యంబైన భూపాలకత్వంబు • సిగ్గు లే కే రీతిఁ జేసికొందు

గీ. కటకటా! పూర్వకృత పాతకంబు గాక • పవికిమాలిన యీ యాఁడుతనముకన్నఁ
గలదెదురవస్థ? దైవంబు కరుణదప్పె•నంచుయోజించుఁ గడువిలపించు నృపుఁడు.

వ. అను సూతుం గాంచి మునీంద్రు "లోమహర్షా! యువ్విధుం డవ్వనంబున నేమి
కతంబున స్త్రీత్వంబునందె" నని యడుగుటయు నతం డిట్లనియె. 282

చ. సనకసనందనాదిముని సత్తము లొక్కెడ దేవదేవునిం
గనఁ జన, దేవదేవి తనకాంతుని డాతొడ వస్త్రహీనయై
మనసిజకేళి నుండి, యట మౌనిసమాజము గాంచి, సిగ్గు మే
కొన వసనంబు దాల్చెఁ గడుఁ గొంకెసఁగఁగా, ధరియించునంతలో. 283

గీ. కాముకులసౌఖ్యమునకువిఘ్నంబొనర్పఁ, దగదెవరికేనియనిమునుల్ త్వరయెలర్ప
నరిగి రటనుండి నారాయణాశ్రమంబు, పార్వతియు సిగ్గుచేఁ దలవంచి యుండె.

గీ. సిగ్గుచే గ్రుంగు సతిఁ గాంచి శ్రీగిరీశుండు, పలికె "నెవ్వఁడు గాని యీ వనముఁ జొచ్చు
నంతనే స్త్రీస్వరూపంబు నందు" నంచు, సదికతమ్ముగ స్త్రీత్వంబు నంచె నితఁడు.

క. అన విని మును లవ్వలికత, వినుపింపు మటన్న నట్లు వెలఁదియయి యతం
డనుఁగుం జెలికత్తెలతో, వనమున నిళ యనెడి పేర వర్తించునెడన్. 286

క. వనమునఁ దిరుగుచు బుధుఁ డ, వ్వనితామణి పసిఁడిబొమ్మ వడువునఁ దనలో
చనములకు ముదం బొసఁగుడు, వనజాతాంబకుని బారిఁబడి వగఁజెందెన్. 287

క. ఇళయును బుధునిం గని మేల్, బళి! యని తగ మెచ్చి తనకుఁ బతిగా నతనిన్
వలచె; నిరువురకు సుతుఁడై, వెలసెఁ బురూరవుఁ డనూనవిభవోజ్జ్వలుఁడై. 288

క. ఇళ కొమరుఁ గాంచి తనకుం, గుల గురుని వసిష్ఠుఁ దలఁచికొనె వగపునఁ గొం
దల మందెడి సుద్యుమ్నుని, కల తెఱఁగు నెఱింగి యతఁడు కరుణార్ద్రుండై. 289

వ. భగవంతుండగు నమ్మహాదేవుం గుఱించి తపం బొనరింప నతండు ప్రసన్నుండై
వరప్రదాత యయ్యె. నంత సుద్యుమ్నునకుఁ బుంస్త్వం బనుగ్రహింపు మని
ప్రార్థించుటయు శంకరుండు, 290

క. తనవాక్యము వ్యర్థంబై, చనకుండ వసిష్ఠమౌనిసత్తమునకుఁ గో
రిన వర మిదె నొకమాసము, వనితయు మాసంబు పురుషవరుఁడుం గాఁగన్. 291

క. ఈ సరణి వసిష్ఠువిదయ, నా సుద్యుమ్నుండు పుంస్త్వమంది పురికి వి
చ్చేసి యథాగతి రాజ్యము, శాసించెం గాని ప్రజకు సరిపడదయ్యెన్. 292

గీ. మగతన మ్మూనువేళలజగతి నేలు, నాఁడుతన మూనునెడల హర్మ్యములనొదుఁగు
తనుజునకు నీడు వచ్చెడిదనుక నిట్టు, లవని పాలించి యతఁ డరణ్యమున కరిగె.

వ. అట్లు చని నారదోపదిష్టంబగు నవాక్షర మంత్రరాజంబును జపించుచుఁ దపం
బొనరించునంత, 294

క. సింగముపై నెక్కి కదున్, సింగారం బడర వారుణీమదపూర్ణా
పాంగయగు సర్వమంగళ, ముంగలఁ గన్పట్టె నతనిపుణ్యముకలిమిన్. 295

క. కనుపట్టిన జగదంబం, గని మ్రొక్కెడి పేర్మిమీఱంగా నానందా
శ్రునయనుఁడయి మన మలరన్, వినుతింపఁ దొడంగె భక్తివివశత్వమునన్. 296

గీ. దివ్యమననోపు నీ రూపు తేట తెల్ల, మొగిఁ గనుంగొంటి నా పూర్వపుణ్య రేఖ
భక్తకల్పద్రుమంబు నీపాదపద్మ, యుగమునకు మ్రొక్కెదం బ్రోవుమో మదంబ!

ఉ. అంబ! సురాసురాదులు ననర్ఘ్యలు తావకదివ్యభవ్య తే
జంబు గనుంగొనంగ, మనుజన్ము లనంగ నిఁకెంతవారు? నా
కుం దొడకట్టి యీ పనులకున్ మది విస్మయ మందకున్నె? నీ
చుం బరమానురాగమునఁ జూచుట చోద్యము గాదె? శాంకరీ! 298

క. శంభుండును విధియును వి, శ్వంభరుఁడు సూర్యచంద్రవరుణాదులు నా
జంభారియు నినుఁ గనుఁగొను, దంభం బెఱుఁగ రన నాదు తరమే? జననీ! 299

గీ. జలధిజాపతి నీ సత్త్వశక్తి నెఱుఁగు, శారదాపతి నీరజశ్శక్తి నెఱుఁగు
చండికాపతి నీ తమశ్శక్తి నెఱుఁగుఁ, గాని నీ నిర్గుణత వారు గాంచువారె? 300

గీ. మూఢుఁడైనట్టి యే నేడ! పూర్ణమైన, యీకటాక్షప్రసార మదేడ! నీకు
భక్తజనులందుఁ గల్గిన పక్షపాత, మింత యని చెప్పఁ గలనె? లోకైకజననీ!

సీ. ఒకవేళఁ బ్రణయకోపోద్రేకమున శిరో • భాగమ్ముపై వామపాద ముంచి
ఒకవేళ ననురాగవికలీభవత్క్రోధ • వై యురఃపీఠమ్ము నధిగమించి
ఒకవేళఁ గడుఁ జాకచకి నొప్పు మెఱపు నా • జఘనప్రదేశమ్ము సంశ్రయించి
ఒకవేళ సింగార మొలుకు ముద్దులుగుల్కు • నంకభాగమ్ముపై వధివసించి

గీ. వాహనము నాఁగఁ దగు మధువైరి కీవ • లక్ష్మిపై మోద మిడెదు విలాసగతుల
నీ కటాక్షమ్ము లేకున్న నీరజాక్షుఁ • డంబ! యొక గవ్వయైనఁ జేయఁడు నిజంబు.

చ. జనని! భవత్పదంబు లనిశంబును గొల్చు విరించిముఖ్య లం
గన లెటుకారు? స్త్రీత్వమును గైకొనియుఁ బురుషస్వరూపమున్
మును భవదీయసత్కరుణఁ బొందిరికాదె? యెవం డెఱుంగు నీ
యనుపమశక్తి దీనిఁ గొనియాడఁ దరంబె? వరాంబ మాదృశుల్. 303

క. స్త్రీపుంసభేదశూన్యం, బై పరతత్త్వస్వరూపమై దుర్జ్ఞేయం
బై పూర్ణంబై యెసఁగెడి, రూపము నెవ్వాఁడు నేర్పు రూపింపంగన్? 304

గీ. నిను నిరూపింప నే నేర; నేర్చుకొలఁది, నీపదాంబుజభజనంబు నిర్వహింతుఁ
గానఁ బ్రాణాంతమందు ననూనమైన, భక్తినొసఁగుము నీపదద్వయమునందు 305

గీ. ఇట్లు నుతియించి సుద్యుమ్ననృపతివరుఁడు, శాంకరీకరుణాకటాక్షంబు కలిమి
మునిజనశ్లాఘనీయమౌ ముక్తిఁ గాంచె, నంబికాభక్తులకు నసాధ్యంబు కలదె?

క. సుద్యుమ్నసుతుఁడు ఘనసం, పద్యుతుఁడు పురూరవుండు పరిపాలించెన్
హృద్యనిరవద్యగుణకీ, ర్తిద్యోతితమై తనరుప్రతిష్ఠానపురిన్. 307

వ. అప్పురూరవుండు రాజ్యం బొనర్చునెడ సామాది చతురుపాయమ్ములను ప్రభుమం
త్రోత్సాహశక్తులను సర్వవర్ణాశ్రమ ధర్మంబులను నిరుపప్లవంబు లయ్యె. 308

క. జన్నము లొనర్చె నాతం, డెన్నేనియు విద్ధమతుల కిడె విప్రుల క
త్యున్నత మగుదానంబుల, నన్నన్న! నుతింపఁ దరమె? యాతని గుణముల్. 309

ఉ. ఆతనిరూపసంపదయు నానృపుతేజము నానృపాలు వి
ఖ్యాతియు నా ధరాపతియుదాత్తత యావిభుశీల మాజగ
న్నేత కృపాధికత్వమును నేర్పును నీతియు భూతియుఁ యశ
స్ఫూర్తియు నెంచి యూర్వశి వశీకృతయై వగఁ జెందు నంతటన్. 310

గీ. పంకజోద్భవుశాపంబువలనఁ బుడమి, కరుగుట తటస్థ మగుడు నయ్యమరవేశ్య
చిరమనఃకాంతుఁడైన యన్నరవరేణ్యు, నెంచి వరియించి యతనితో నిట్టులనియె.

చ. గొఱియలు రెండు నాకుఁ గడుఁ గూరుచు బిడ్డలకన్న నెక్కు; డీ
గొఱియలఁ బ్రోచుటొక్కటియుఁ, గూటమివేళలఁ దక్క నీవు ది
గ్గఱి వసనంబు లేని తఱిఁ గన్పడకుండుటయు, నేయిభుక్తికై
దెలుపఁగ నిచ్చుటొక్కయును దప్పవు; తప్పినఁగూడ వీడెదన్. 312

గీ. దీని కంగీకరించితివేని నన్నుఁ, గైకొని రమింపు మనెడి యక్కలికిమిన్న
ప్రతిన కెదురాడ వెఱచి చేపట్టి దాని, వలచి క్రీడించె నొకకొన్ని వత్సరములు.

సీ. తత్కటిస్థలమందుఁ దవిలి చిత్తము ధరా ◆ వలయమ్ముపై నాసఁ గొలుపదయ్యె
దానినూగారుపైఁ దవిలి చిత్తము కత్తి ◆ చేతఁ బూనుటకు వాంఛింపదయ్యె
తద్వచస్సంసక్తిఁ దవిలి చిత్తము కావ్య ◆ కలనా వినోదంబు దలఁపదయ్యె
దానికౌఁగిటియందుఁ దవిలి చిత్తము పరా ◆ ద్వైతభావంబుపైఁ బాఱదయ్యె

గీ. అహహ! యేమందు నప్పురూరవుచరిత, మఖిల మూర్వశియే యని యలరఁగాని
ధర్మ మర్థంబు మోక్షంబు దలఁపఁడయ్యెఁ, గాముకుల కన్యసంగతుల్ గానఁబడునె?

క. దుర్గముఁ దీనృపుఁ డంచు న, నర్గళరాగాతిశయమున నా మరగి పున
ర్నిర్గమ మెఱుఁగక యూర్వశి, స్వర్గమ్మను మఱచెఁ బాకశాసను మఱచెన్. 315

గీ. వార లిరువురు నీతీరు వార లగుచు, నున్న యంతటఁ బాకారి యూర్వశీ త
లోదరీమణి రప్పింప నూహఁజేసి, పలికె గంధర్వులను జూచి ప్రాభవమున.

గీ. రంభ మొదలుగ నప్సరోరమణు లున్న, వార లైనను, నూర్వశీ వనిత లేక
యున్న కారణమున, స్వర్గమున్న దిపుడు, చంద్రకళ లేని యంబరస్థలము పగిది.

వ. కావున నేదేని యొక నెపమ్మునఁ బురూరవు వంచించి గొఱియల నపహరించినఁ
గార్యమ్ము వొసఁగునని చెప్పి పంచిన, 318

క. గంధర్వులు రతికేళీ, బంధురుఁడగు నృపతి కెఱుఁగఁబడకుండఁగ ధౌ
రంధర్యపటిమ గొఱియల, నంధతమసమందుఁ జోరులై హరియింపన్. 319

క. ఆయురణమ్ములు మే మే, మే యని రొదసేయఁ దన్నిమిత్త మెఱిఁగి సీ!
సీ! యని రోయుచు నృపుతో, నా యూర్వశి శోకతప్తయై యిట్లనియెన్. 320

ఆ. వె. కొడుకులవలెఁ బెంచుకొనుచున్న నా గొఱి, యలను జోరులిట్టు లపహరింప
నాఁడుదానికన్న నధముండవై యూర, కుంట యుక్తమగునె? కువలయేశ.

క. రక్షించెద నీవంచు ను, పేక్ష యొనర్చితివి గాని యెఱుఁగనయితి నీ
దక్షత యిట్టిది యని యో, కుక్షింభర! నిన్నుఁ గూడి కుత్సితనైతిన్. 322

క. ఇటు కటకటఁ బడి తన్నుం, బెటిలి పడం దిట్టుచున్న ప్రియురాలికి న
క్కటికము చూపుటకై ని, ష్పటుఁడై తస్కరుల వెంటఁబడి పరుగిడియెన్. 323

గీ. నగ్నుఁడై నమ్ము నృపతిచందమ్ము నూర్వ, శీ వనిత కేఱుఁగఁ బడఁగఁ జేయువిద్యుఁ
జంచలాకాంతులను మెఱపించి రపుడు, ధరణిపతి గేహమందు గంధర్వపతులు.

వ. అంత, 325

క. ఉరణమ్ములఁగొంచు దిగం, బరుఁడై తోతెంచు నృపతిఁ బరికించి వియ
చ్చర వారవనిత యాతని, చరణములకు మ్రొక్కిపలికె సాధ్వస మెసఁగన్. 326

ఉ. చెప్పితిఁగాదె? మున్ను నృపశేఖర! నాదు ప్రతిజ్ఞ; దానికిం
దప్పిన యట్టి నీదు దరిదాపునఁ గాఁపుర మెట్లొనర్తు? నే
నిప్పుడ పోవలెన్ గరుణ యుంచుక నావయినుంచు; మయ్యయో
తప్పక తీరునే! విధివిధానము తప్పినపట్లఁ గూరుముల్? 327

వ. అని యూరడించి, 328

గీ. పార్థివోత్తము వలవంతపాలుఁజేసి, యరిగె నూర్వశి విభ్రాంతయై తనంత
స్వర్గమునుండి వచ్చినవచ్చుగాక, యమ్మరో! చెల్ల! లంతెల నమ్మఁదగునె. 329

చ. తను విడనాడి యూర్వశి యథాగతి నేగఁ, బురూరవుండు చిం
తను గొని, వెఱ్ఱిఁ బూని, మతిఁ దప్పి, తదీయవిలాసమై ఖరుల్
మనమునసెంచుచున్ విషయమగ్నతఁజెందుచు లోనఁగుందుచుం
జని చని కాంచె నచ్చటులచారుకటాక్షగతిఁదా గురుక్షితిఁగా. 330

గీ. చూచినంతన యాతని లోచనమ్ము, లతులితంబైన సంతోషగతి నెసంగెఁ
జిరవిరహసంగతులకు నెచ్చెలిని గనుట, కన్న వేఱొండు భాగ్యంబు గలదె తలఁప?

వ. అట్లుకని దగ్గఱి కరుణారసం బుట్టిపడ గద్గదగళుండై యిట్లనియె. 332

చ. కినిసి యెఱుంగ నెన్నఁడును; గీ డొనరించి యెఱుంగ; నీవు దా
సునిగతి నుంటిఁగాని యొకచోనయినన్ బ్రతిఁ జెప్పలేదు; నీ
పనిచిన కార్యమెప్పుడు నెపంబిడి చేయక యుండలేదు; హా!
ననువిడనాడి పోతివిది న్యాయమె? పికుఁగురంగలోచనా! 333

గీ. ఓసి! దుర్మార్గురాల! న న్నీసడించి, తేని యీ మేను నే భరియింపఁజాల
నా మన మెఱింగియును గఠినత్వమూనఁ, దలఁపుఁ బూనెద వెంతటిదాన వయయొ!

క. వలచి నమఁ గలయనేటికిఁ?, గలసి యిటుల్ విడిచి పెట్టఁగా నేటికి? నీ
వలపు సతమంచు నమ్మితిఁ, గలికీ! ననుఁ జింతపాలుగాఁ జేయుదువే? 335

సీ. రమణి! నీ యాలింగనమ్ము చొప్పడమి నాకు, రాత్రు లెల్లను శివరాత్రులాయె
పూఁబోడి! నీదు తాంబూల మబ్బమి నాకు, దినము లెల్లను హరి దినము లాయె
తెలవ! నీ కెమ్మోవి తేనెలబ్బమి నాకు, ఋతువు లెల్లను గ్రీష్మఋతువులాయె
కలికి! నీతోఁ బొత్తు గలిగి యుండమి నాకు, క్షణము లెల్లను గతక్షణములాయె.

గీ. లలన! నీవెన్నగవు వెన్నెలలకుఁ జొక్కు, భాగ్య మబ్బమి నాకెల్ల పక్షములను
గృష్ణపక్షమ్ము లాయె, నీరీతి నొప్పు, కాల మేగతి వేగింతునే? లతాంగి! 336

క. అని బహువిధముల విలపిం, చు నృపాలోత్తమునిఁ గాంచి సూనృత గతి న
వ్వనితామణి యతని విర, క్తునిఁ జేసి మరల్చు తలఁపుతో నిట్లనియెఁగా. 337

మ. వెలయాండ్రెక్కడ! గూర్మెలెక్కడ! దయావిశ్వాసభావమ్ము లె
క్కడ! లోలోఁ దలపోయ నేరకిటు మౌర్ఖ్యంబూనఁగా జెల్లునే?
కలలోనైనను వారకామినుల సాంగత్యంబు వాంఛింతురే?
కలదే సూత్రము గట్టినట్టి మగఁడొక్కండంచు మాజాతికిన్. 338

క. ఎవితల యెడఁ జోరులయెడ, జనపాలురు విశ్వసింపఁ జనదటుగానన్
నను( దలఁచి విచారింపక, చని రాజ్యం బేలుకొనుము జననాథమణీ. 339

ఆ. వె. అనుచు నొప్పఁజెప్పి యరిగె నా యూర్వశి, మనుజవిభుఁడు దాని మఱవ లేక
వంతఁ జెందె, నెంతవాఁడైన వారకాం, తలను జేరఁదీయ వలదు వలదు.340

గీ. వేద విస్తృత మీ కథావిధము దీని, జెప్పినాఁడను మీకు సంక్షేపగతిని
ఇట్టివలపంత తనకబ్బునేమొ ? యంచు, వ్యాసుడు ఘృతాచిఁగనిసందియమ్ముఁజెందె.

## శుకోత్పత్తి.

క. ఈ రీతి సంశయించెడి, పారాశర్యుఁ గని శాపభయ విహ్వలయై
చేర వెఱఁగంది శుక వని, తా రూపముఁ దాల్చి చనె ఘృతాచి యథేచ్ఛన్. 342

వ. అట్లు చనుటయు, 343

గీ. హరిహరబ్రహ్మ లెవని దాసానుదాసు, లెవని యావేశ మెట్టి జితేంద్రియులకుఁ
గనులు వొరఁగప్పఁ జేయు న క్షమలశరుఁడు, పట్టి పాలార్పఁదొడఁగెనావ్యాసమునివి

ఆ. వె. తపము లెన్నియేనిఁ దగ నొనర్పఁగనిమ్ము, జపము లెన్నియేవి సలుపనిమ్ము
కమల కింపుగల్గు కాంతఁ గన్గొనినంత, మారుబారిఁ బడనివారు లేరు. 345

వ. ఇట్లు ఘృతాచీగతం బగు మనమ్ము మరల్చియు భవితవ్యతానిమిత్తమున మరల్ప
నేరక చింతించుచు నరణి మథించుచున్నంత, 346

క. అలపంచశరుని శాఁకునఁ, గలకలముం జెంది యున్న కతమున వీర్య
స్ఖలనము గల్గి యరణిలో, పలఁ బడె నది యెఱుఁగ కతఁడు పట్టి మథించెన్. 347

గీ. అరణి జనియించె నంతట వ్యాస సదృశుఁ
డై యనలకాంతి భాసురుండై శుకుండు
కాంచి "యిది యేమి వింతయో" యంచు "శివుని
వర మహిమ," యంచు మది నెంచి వ్యాసుఁ డంత, 348

క. గంగానదికిం దన తన, యుం గొని చని యచటఁ బావనోదకములఁ బూ
తుం గావించి ముదం బెసఁ, గంగా వాతనికి జాతకర్మ మొనర్చెన్. 349

గీ. నభమునం దంత దేవదుందుభులు మ్రోసెఁ, బుష్పవర్షోదయమ్మునఁ బుడమి నిండె
నారదాది మునీంద్రు లందఱును గూడి, పాడి రాడిరి రంభాది వారసతులు. 350

ఆ. వె. చిలుకరూపుఁ గనిన చెలువ కారణమునఁ, బుట్టె నీతఁ డంచుఁ బెట్టెఁ బేరు
శుకుఁ డఁటంచు మౌని సుతునకుఁ గ్రమముగా, వృద్ధిఁజెందె నతఁ డభేద్యగతిను.

గీ. అంబర స్థలినుండి కృష్ణాజినంబు
దండము కమండలువు తదర్థముగఁ బడమిఁ .
బడియె నొకనాఁడు మునులార! వ్యాసుఁడంతఁ
గొమరున కొనర్చె నుపనయనముఁ గ్రమముగ. 352

గీ. జనకునకుఁ బోలె నితనికి జన్మకాల, మంద వేదవేదాంగాదు లయ్యె వశము
లైనను బృహస్పతిం గొల్చి యాగమ వ్ర, తమ్ము సల్పుచు నవి యెల్లఁ దవిలి చదివె.

వ. ఇట్లు సంపూర్ణుండై గురుదక్షిణ నొసంగి తదాజ్ఞ వడసి తండ్రి పాలికిం జనుటయు,

ఉ. వ్యాసుఁడు కౌఁగిలించుకొని "వచ్చితివా! తనయా" యటంచుఁ బే
రాసఁ బ్రియమ్ము పల్కుచు "బృహస్పతియొద్ద సమస్త విద్య ల
భ్యాసమొనర్చితే?" యనుచు నాదరముం బచరించి పుత్రు భా
ర్యానముపేతుఁ జేయుటకునై మనమందుఁ బ్రయత్న మందుచున్. 355

వ. పుత్రుండు విరక్తుండగు నని యెఱింగిన వాఁడుంబోలె సత్వరంబుగ నొక్కెడ కరిగి సత్కుల ప్రసూతయు మనోహారిణియు నగు నొక మునితనయన్ వివాహార్థంబు నిశ్చయించి యాశ్రమమ్మున కేతెంచి శుకుం గాంచి యిట్లనియె. 356

చ. చదివితి వెల్ల వేదములు; శాస్త్రములున్ బఠియించినాఁడ; వి
ద్యదను వివాహయోగ్య మగునట్టిది గావఁ, గళత్రమున్ వరిం
పఁదగు; మఖక్రియల్ పొనరుపందగుఁ; బుత్రులఁగాంచఁగాఁదగున్
ముదమలరన్ మమున్ ఋణవిముక్తులఁ జేయఁ దగుం గుమారకా! 357

సీ. పుత్రసంతానంబు పొరయనినరునకు • సద్గతి లేదు యశంబు లేదు
గావున నొకకన్నెఁ గైకొని తనయులఁ • గాంచి నన్నానందకలితుఁ జేసి
పితృదేవతలకు సంప్రీతి యొనర్పుము • మాటాడకుము నాదుమాట వినుము
నీ నిమిత్తము తపం బేనొనర్చితిఁ బెక్కు • వత్సరమ్ములు తపఃఫలమ వీవు
గీ. నీవలనఁ గీర్తిఁ గనవలె నీవలనన • సద్గతిని బొందఁగా వలె సౌఖ్య మందఁ
గావలెను నీవలన నంచుఁ గాచియుంటి • ననుచు జనకునితోడ నిట్లనియె శుకుఁడు.

క. పరిణయమొల్లను నన్నుం, గదుణింపుము తత్త్వబోధఁ గావింపుము దు
స్తరసంసారాంభోనిధి, నరసి యరసి నన్నుఁ ద్రోయుటర్హమె? తండ్రీ! 359

వ. అను పుత్రుం గాంచి వ్యాసుం డిట్లను. 360

మ. వినుఁ గంటిన్ శతవత్సరమ్ముల్ తపోనిష్ఠన్ బ్రవర్తించి; నా
కనుకూలుండవు గమ్ము; యౌవనము నీ కావిర్భవం బందె; భా

ర్యనుగై కొమ్ము; సుఖమ్ములం బడయు; మేరాజేంద్రునో చూచెదన్
ధనమున్ దెచ్చెద; నీ కొసంగెదను; నాఁ దత్త్వజ్ఞుఁ డాతం డనున్. 361

చ. వనితను జేరి తద్వశత వర్తిలి దుఃఖము సౌఖ్యమంచు భ్రాం
తిని గొని సంసృతిం బడి గతిం గన లేక కృశించువారలం
గనుఁగొనియున్ వివాహము సుఖం బనియే నెటు సమ్మతింతు? దుః
ఖనియతమైన సౌఖ్యము సుఖం బనఁ గూడునె? మౌనిసత్తమా! 362

గీ. శృంఖలాబద్ధులు విముక్తిఁ జెందఁ గలరు, గాని కాంతాకటాక్షపాశానుగతుల
కబ్బునే ముక్తి యెన్నటికైన నిట్టి, నిట్సుఖం బేమనుచుఁ బైని వేసికొందు? 363

గీ. మలమయంబైన కామినీమణులదేహ, మందు బుధుఁడైనవాని కెట్లాసపుట్టు?
యోనిసందర్భ మొక్కింతయును నెఱుంగ, నట్టి నాకేల యీ హేయమైన గొడవ?

క. కర్మములను నెపమున దు, ష్కర్మంబగు హింస సలుపఁగాఁ జేయుచు సం
తర్మదము పెంచునాగమ, మర్మంబుల నామనంబు మనలదు తండ్రీ! 365

గీ. వేదవేదాంగములకల్మి విస్తరించెఁ, గాని వాక్పతి తత్త్వంబు గఱవఁడాయె
పుత్రదారానుషక్తిమైఁ బొరలుగురుని, గొలిచి తరియించు వెజ్జులు గలరె? యెందు.

గీ. అట్టిగురునకు నొక్క ప్రొక్కాచరించి, తత్త్వవేత్త వటంచు నీదరికిఁ జేర
దుష్టసంసారమునఁ బడద్రోయ నగునె, భవ మెవరికైనఁ గాలసర్పంబ కాదె? 367

క. పురువులు హేయంబగు ని, ట్సరణిం జరియించుపగిది జడమతులను సం
సరణమునఁ బడెద రకటా!, పరికించిన భవము సౌఖ్యభాజన మగునే? 368

గీ. వేదశాస్త్రాదికంబెల్ల వెదకి తెలిసి, కొనియు సంసారవార్ధిని మునిఁగితేలు
బుధునికన్నను మూఢుండు పుడమిఁ గలఁడె?, యతఁడవో! మూకరాదులయట్టివాడు.

గీ. పుత్రదారానుషక్తుని బుధుఁ డటంచు, గారవించుటకన్న నజ్ఞానమున్నె?
వాఁడవో బుద్ధిమంతుఁడు వాఁడ బుధుఁడు, వాఁడ శాస్త్రజ్ఞుఁ డెవ్వాఁడవంచితుండు.

క. భవబంధకరం బయిన చ, దువు చదు వగునే? సమస్త దుఃఖధ్వంస
ప్రవణం బగునద్దానిఁ జ, దు వనం దగు; దాన ముక్తి దొరకును దండ్రీ! 371

క. ఎందుం జన నీయక తన, యందుం బంధించుటన్ గృహం బయ్యెఁ దా
నిం దపులాట బంధనగృహ, మందుంటయ భేద మించుకైనం గలదే? 372

క. మందులు విధి ప్రకారిత, లుం దగులఁగనిమ్ము గృహము లోపల వారిన్
నిందింపనేల మనుజత, నందియుఁ జదువుకొని యిందు నడుగంటుదునే? 373

ప. అను కుమారునకు వ్యాసుం డిట్లనియె. 374

క. మన మతినిర్మల మైనం, దనకు గృహం బెట్లు బంధనం బగు మనముం
దనయిచ్చఁబోవనీయక, యునికి గృహస్థునకు ముక్తి నొసఁగుఁగుమారా. 375

గీ. న్యాయ్యముగ ధనసంపాదనం బొనర్చి
యనృతమాడమి యశుచిత్వమాచరింప
మియును విధిచోదితంబుగా మెలఁగుటయును
గలిగి వర్తించు గృహి ముక్తిఁ గాంచుఁ బుత్ర. 376

సీ. వేదవ్రతముల నాపాదించి చరియించు • బ్రహ్మచారుల కెల్లఁ బట్టుఁ గొమ్మ
అతిథులై యేతెంచునట్టి గృహస్థుల • నాదరింపంగఁ గల్పాగమంబు
భార్యైకయుక్తులై వనమునఁ దిరుగు వా • నప్రస్థులకు రక్షణ ప్రసక్తి
సంసారహింసారిరంసావిరక్తులౌ • సన్న్యాసులకును విశ్రాంతిభూమి

గీ. యైనగార్హస్థ్యమున నుండి యఖిలధర్మ • ముల నొనర్చి తుదకు ముక్తిఁబొందవచ్చు
నట్లు కాదేని యవ్వసిష్ఠాదిమునుల • కేల గార్హస్థ్యమున నుండు టెఱుఁగఁ జెపుమ.

గీ. ఆగమోక్తకర్మంబుల నాచరింపఁ, దనరఁచి వర్తించుగృహి కెల్లధర్మములును
గరతలామలకమ్ములు గాన లాఁతి, యాశ్రమమ్ములు సరియె గార్హస్థ్యమునకు ? 378

ఉ. ఆదిని బ్రహ్మచర్యము వనంతరమందు గృహస్థధర్మ మా
మీఁదవనప్రవాస మటుమీఁద యతిత్వ మటంచు బ్రహ్మవి
ద్యాదరు లంద్రు గాదె తనయా ? వినయమ్ముగలాఁడ వాగమా
పాదితమైన ధర్మము నెపమ్మున వమ్మొనరింపఁ బాడియే ? 379

గీ. కాన గార్హస్థ్యధర్మమ్ముఁ బూని పుత్ర, వంతుఁడవుగమ్ము పితృదేవవర్గములకుఁ
బ్రీతి సేయుము నామాట వినుము సన్న్య, సించు టిప్పుడుగాదు యోజించుకొనుము.

క. మనమును బంచేంద్రియములు, తనయా ! కడుఁ జంచలములు దారవిహీనుం
జెనకి యధోలోకమునకుఁ, జనుచుఁ వాఁ డెంత పెద్ద పండితుఁ డైనన్. 381

గీ. ఇంద్రియజయమ్ముకొఱకునై యింతి నెంతఁ, బాఁడయినఁగాని వరియింపవలయుఁబార్థ
కమ్ము సంప్రాప్తమైనఁ దపమ్ము సేయ, వలయుఁ గాని వేఱొకగతి వలదు తనయ.

సీ. మేనకాతరుణిసమ్మోహనమ్మునఁ గాదె ? • గాధిపుత్రుతపమ్ము గంగఁ గలిసె
దాశపుత్రికతోడఁ దగులు చెందుటచేతఁ • గాదె ? నీతాత భంగమ్ము గనియె

నలఘృతాచ్ఛిని జూచి యాసించుటను గాదె? • నాకుఁ దేజస్స్ఖలనంబు గలిగె,
తనపుత్రికను మోహమున వరించుటచేతఁ • గాదె విరించి ప్రమాద మందె
గీ. గాన నొకకన్నె వరియించి దాన నింద్రి • యముల నిర్జించి మీఁద నియమము గాంచి
తపము సేయఁగఁబూనుటు త్తమముగాని • యుభయతో భ్రష్టతనుగాంచుటుచితమగునె?

## శుకుఁడు సంసారమును నిందించుట.

క. అని యుపదేశము నొనరుచు, జనకుం గని శుకుఁడు వల్కు సౌఖ్య విహీనం
బును వాగురాసమానం, బును నగు గృహమందు బుద్ధిపుట్టదు తండ్రీ! 384
క. ధనహీనులు స్వజనులచే, ననయము బాధింపఁ బడుచు రది గాక ధనా
ర్జనచింతావ్యాకులు లగు, జనులకు నెచ్చోటనైన సౌఖ్యము కలదే? 385
సీ. ఈజగత్త్రియమేలు నింద్రునకైన న • న్యాసి కున్నంత సౌఖ్యమ్ము లేదు
పాణిస్మహాలక్ష్మి వక్షమందున్న వి • ష్ణునకైన యతి కున్నసుఖము లేదు
త్రిజగత్కుటుంబియౌ నజునకైనను విర • క్తుల కున్న యంత నిశ్చలత లేదు
అణిమాదియుక్తుఁడౌ హరునికైనను గోఁచి • పాఁతరాయని కున్నభాతి లేదు
గీ. తపములకు విఘ్నము లొనర్పఁ దలచుటయును
దైత్యుల హరింపఁ దలఁచి ఖేదంబు గొనుట
యుమగదా వీర లొనరించుపనులు; నే నె
టింగియును సంగమునఁ బడి బ్రుంగనేల? 386
క. ధనవంతునకే సౌఖ్యం, బనిశ్చితప్రాయ మన్నయప్పుడు ధనహీ
నునకు సుఖమెట్లు చేకుఱు?, జనకా! సంసారమందు సౌఖ్యము కలదే? 387
ఆ.వె. నన్నయోనిజన్మ నయ మొకింతయు లేక, ఘోరదారరూప కూపమునను
బట్టి త్రోయ నగునె? భవమేది? సుఖమేది?. రక్తియేద బంధముక్తి యేద!
ఆ.వె. మొదల జన్మదుఃఖమును మీఁద ముదిమిచే, నైనదుఃఖమును ననంతరంబు
మరణకాలదుఃఖ మరయ నాపైఁ బున, ర్జననదుఃఖ మిందు సౌఖ్యమేది? 389
శా. ఆశాపాశముచేతఁ జిక్కువడి ప్రాణాచారముం బూని యా
ఘ్రాశంకణ విడనాడి బుద్ధిబలవైశద్యంబు వోనాడి ని
త్రైశద్వారనివాసఖిన్నమతియై యేతెంచుసంసారికిన్
లేశంబైనను సౌఖ్యమున్నయదియో లేదో విచారింపుమా! 390

క. కొడుకులుఁ గూఁతులు మొదలగు, గొడవ పెరిఁగెనేని వారి కుడుపునకై యె
ట్కడు కష్టము పడవలె, నొక, కడుపుకుడుపుచెప్పుకొనుట కష్టమె? తండ్రీ! 391
వ. కావున యోగశాస్త్రంబును సుఖకరం బగు జ్ఞాన శాస్త్రంబును నా కుపదేశింపు మని
మఱియును, 392
క. దయ గలిగి నాకుఁ గర్మ, క్షయ మగు పద్ధతి వచించి సంసారము నా
పయిఁ బెట్టక విజ్ఞానా, శ్రయ మగు మార్గమ్ముఁ జూపఁ జనదే తండ్రీ! 393
చ. జలగ శరీరముం బొదివి చయ్యన నెత్తురు గ్రోలుభంగిఁ, గాం
తలు తమ వీర్యముం దమ ధనంబు మనంబు హరింతు రంచు మూ
ర్ఖు లెఱుఁగ రక్కటా! మిగుల రోఁతలపోఁతలవైన యీ వెలం
దులు సుఖమీఁగఁ జాలుదురె దుఃఖము దక్క మునీంద్ర యేరికిన్? 394
క. వేయేటికి విద్రాసో, ధ్యాయతి చెడఁగొట్టుకొనుట కంగనఁ జేర్చున్
టో! యెఱుకలేని మనుజుఁడు, నాయన! యిది యెల్లగతుల నరకంబుకదా! 395
వ. అని సంసారంబు రోయు కుమారుం గాంచి వ్యాసుండు దుఃఖాక్రాంతుం డగుటయు,
సీ. వేదమ్ములెల్ల దుర్వేదంబులై యున్న • విభజనఁ జేసిన విశ్రుతుండు
జనులకు విజ్ఞానమును దేటపఱప వే • దాంతశాస్త్ర మొనర్చినట్టి ఘనుఁడు
అలమహాభారతం బష్టాదశపురాణ • ములు రచించిన మహాబుద్ధిశాలి
మునులలోపలఁ బెద్దతనము గర్గిన యశః • ప్రతిభ నొప్పినగొప్పపండితుండు
గీ. దివ్యవిజ్ఞాని సత్యవతీసుతుండు • మాయవలలోనఁ బడి పెదమార్గములకుఁ
గాలువెట్టుచునుండెనోఁ గలరె! యింక • నొరులనుచునెంతయును వింతనొందెశుకుఁడు.
గీ. హరిహరబ్రహ్మలకును దురావ యగుచు, జగములన్నియుఁ దనమాయఁ దగులఁ జేయు
నేమహాదేవి సకలలోకైకజనని, యమ్మహాదేవి వర్ణింతు నాశ్రయింతు. 398
గీ. విష్ణునంశమ్ముచే భువి వెలసి సకల, ధర్మము లెఱింగి వ్యాసువంతటి మహాత్ముఁ
డిట్టిప్రాకృతచింత పైఁబెట్టుకొనియె, నకట! చిత్రంబు కాదె మాయాబలంబు. 399
ఆ. వె. నేను నీవు నాది నీయది నాతండ్రి, నాతనూజుఁ డని యనారతంబు
ప్రీతి గొంద్రు పంచభూతమయంబు దే, హం బటం చెఱుంగ రకట! జడులు. 400
క. వ్యాసుండఁట వేదాంత, వ్యాసంగ మొనర్చినట్టి యనఘుండఁట తా
నీపరణిఁ జింతఁ గొనునఁట, ఛీ! ఛీ! మాయాబలం బిదేయుసు కాదే? 401
క. అనుచుఁ గా మాయాబలవిల, సనమున కచ్చెరువుచెంది జనకుం గని శా
స్త్రవిదావష్ముగ శుకుఁ డి, ట్లనెఁ దన విజ్ఞాన మహిమ యతనికిఁ దెలియన్. 402

గీ. సకలము నెఱుంగునట్టి బోధకుఁడ వీవు, దివ్య విజ్ఞాన, సత్యవతీ తనూజ!
వీఁడు నావాఁ డనెడి భ్రాంతి వీడలేక, ప్రాకృతునిఁబోలె శోకాబ్ధిఁ బడుదురయ్య.

ఉ. ఎందఱికీవు తండ్రివొ సుతెందఱి కేఁ దనుజుండనో మదిన్
గొందల మందనేల? కనుఁగొమ్ము విచారణసేయు మయ్యయో
తుందుడు కింతచెల్లునె? బుధుండవు కావె? యెఱుంగవే? ధృతిం
జెందక చిత్తవృత్తి నిటు చిందఱ వందఱఁ జేయ నాయమే? 404

సీ. ఆఁకలి దీర్పంగ నన్నమ్ము కలదు పి • పాసఁ దీర్పుటకునై వారి కలదు
ఘ్రాణతృప్తికినై సుగంధమ్ము గలదు క • ర్ణములఁ దన్పంగ శాస్త్రములుగలవు
కామ నివృత్తికై కాంతలు గలరు ద్ర • వ్యమ్ము నార్జింప భూపతులు గలరు
విజ్ఞానమునకుఁ దత్వజ్ఞులుగలరు మో • క్షమ్ము పొందుటకుఁ దపమ్ము గలదు

గీ. గాని కొమరునిచేఁ బొందఁగలుగునట్టి, దొక్క సుఖమైన లేదుని క్కమరయ
నట్టి కొమరులకై మది నానఁజేయు, వానికన్నను వెఱ్ఱి లెందేనిఁ గలరె? 405

గీ. ఎంచి వలసిన విత్త మార్జించికొనుము, సుతునికన్నను విత్తంబు సుఖకరంబు
ము న్నజీగర్తుఁ డనుముని కన్నసుతుని, యజ్ఞపశువుగ నమ్మివేయఁడె మహాత్మ!

క. నను సంసారాంబుధిలోఁ, జొనుపక తత్త్వమ్ము గఱపి సూనృతరీతిన్
మనుపుము నే నింకఁ బున, ర్జనన భయంబనుభవింపఁ జాలను దండ్రీ. 407

గీ. జన్మములలోన మానవజన్మ మధిక, కష్టసాధ్యం బదియుఁగాక కర్మభూమి
యందు ద్విజుఁడై జనించు టత్యధిక కష్ట, సాధ్య మది గాంచి సంసారసరణియేల?

క. అని తిరుగని వైరాగ్యం, బును గొని సన్యాసమందు బుద్ధిఁ జొనుపు పు
త్రునిఁ గని సత్యవతీసుతుఁ, డనుమానం బుడిగి యిట్టు లానతియిచ్చెన్. 409

మ. తనయా! మున్నొనరించినాఁడను మునీంద్రస్తుత్యమై సత్యమై
ఘనపాపౌఘవినాశమై సకల దుఃఖధ్వంసమై యొప్పు ము
క్తినొసంగం దగునట్టిభాగవత మెంతే శ్రద్ధ మీఱంగ దీ
నిని నిత్యమ్ము పఠింపు మియ్యదియ పొందించున్ మనోభీష్టముల్. 410

ఆ. వె. అతిసుఖప్రదంబు నాతివిస్తీర్ణంబు, బ్రహ్మసమ్మితంబు భాగవతము
వినిన యంతమాత్ర విజ్ఞాన మబ్బు న, ద్దానిఁ జదువుకొనుము జ్ఞానినగుము.

## దేవీభాగవతావతరణము.

గీ. ద్వాదశస్కంధయుక్తమై పంచలక్ష, ణయుతమై పుణ్యమై పురాణముల కెల్ల
భూషణం బయి యొప్పునప్పుస్తకంబు, పఠన సేయుము సంసారబాధ లుడుగు.

సీ. వటపత్రమున బాలుడై హరి నుండి తా, నీప్రపంచస్థితి నెఱుఁగ లేక
యే నిటు బాలుండ నేకతమ్మున నైతి. నేవిధమ్మున దీని నెఱుఁగువాఁడ
నిటు నన్ను నిర్మించె నెవ్వఁడో యని చింత, నొందుచు నున్న ముకుందునందుఁ
గరుణించి భగవతి పరమరహస్యంబు, గాఁగ శ్లోకార్ధంబు గాఁగ దీని

గీ. దెలిపి "యియ్యది సకలంబు దీనిదెలిసి, కొనుటయే నన్నెఱుంగుట" యనియెనంత
విష్ణుఁడయ్యది విని దానివిధము దెలియ, నేర కిట్లని చింతించె నెమ్మనమున. 413

శా. శాంతంబై యకలంకమై సహజమై సత్యంబునై నిత్యమై
యెంతే మోదమొసంగఁ జాలునిది దా నేమూర్తి నాకుఁ గృపా
స్వాంతంబై యిడెనో? పదార్థమది పుంస్త్రీలంబియో? షండమో?
కాంతాకారమొ? యెట్టిదో యని తదాకారమ్ము నూహించుచున్. 414

వ. శ్లోకార్ధ రూపమ్మగు నట్భాగవతంబు పఠించుచున్నంత, 415

సీ. శంఖచక్ర గదాది సాధనమ్ములు దాల్చి, హవణించు నాల్గు బాహువులతోడ
క్రొక్కారు మెఱుఁగునాఁ గొమరారు పదియాఱు, వన్నె బంగారు దువ్వలువతోడ
మగరాలవత్తుపెన్నిగనిగల్ నగఁజాలు, సొగసు గల్గిన చిన్ని నగవుతోడ
తవతోడఁ దుఱఁదూఁగఁ దగు వొయారము గల్గి, యలరారు నెయ్యంపుఁ జెలులతోడ

గీ. తొగలవగకావిఁ దెగడు నెమ్మొగములోడ, నునుమెఱుంగు పెదందకందోయితోడ
దంబుచెన్నారు సత్త్వరూపంబుతోడ, నాతనికి శక్తి మ్రోలఁ బ్రత్యక్షమయ్యె. 416

వ. మఱియు రతియు భూతియు బుద్ధియు మతియుఁ గీర్తియు స్మృతియు ధృతియు
శ్రద్ధయు మేధయు స్వాహాయు క్షుధయు నిద్రయు గతియు దృష్టియుఁ బుష్టియు
క్షమయు లజ్జయు జృంభయుఁ దంద్రయు ననుశక్తులతోడ నెదుటం బొడకట్టిన
మహాలక్ష్మీస్వరూపిణి యగు శక్తింగాంచి విస్మయావిష్టచిత్తుండై. 417

మ. సలిలం బెక్కడ? మట్టి యెక్కడ? విని స్తంద్రుండనై తచ్ఛద
స్థలమం దేను వసించు టెక్కడ? మహాశక్తి స్వరూపంబు ముం
గలఁ గన్పట్టు టిదేడ? నాకు నెదుటం గన్పట్టు నీసర్వముం
గలయో? మాయయొ? లేక మజ్జనని పేద్కన్నాకుఁ జూపట్టుటో? 418

వ. అని నానాప్రకారంబుల శంకించుచు మౌనంబూని యున్నంత జగజ్జననియు మంద
హాసకందళిత ముఖారవిందయై యతనికిట్లనియె. 419

గీ. మఱచితివి నన్నుఁ బరశక్తిమాయకతనఁ, బ్రళయమునయందు నిర్గుణప్రతిభ నొప్పు
నమ్మహాశక్తి; సగుణుండవై యెసంగె, దీవు నను సత్త్వశక్తిగా నెఱిఁగికొనుము.

క. నీనాభికమలమునఁ జతు, రాననుఁ డుదయించి యతఁడ యఖిలజగమ్మున్
బూనియొనర్పు రజోగుణ, మూనినవాఁడై నకతన నుజ్జ్వలరీతిన్. 421

గీ. అతఁడు సృజించినట్టి బ్రహ్మాండమునకు, నీవు పరిపాలకుఁడ వయి నెగడఁ గలవు
అ న్నళినగర్భుభ్రూమధ్యమందుఁ గ్రోధ, వశముచే రుద్రుఁడును నుద్భవంబునందు.

గీ. అతఁడును ఘోరమగుతపం బాచరించి, దానఁ దామసి యగుశక్తినూని ప్రలయ
కాలమునయందు సంహర్త కాఁగలాఁడు, బ్రహ్మనిర్మితమైన ప్రపంచమునకు. 423

వ. ప్రపంచ రక్షణంబునకు నాసాహాయ్యకం బావశ్యకంబు గాన సత్త్వశక్తి నగు
నన్నుం గైకొమ్ము. భవద్వక్షస్థలంబున నెల్లప్పుడును వసింతు నన నతం డిట్లనియె.

క. ప్రాకటవర్ణయుతంబగు, శ్లోకార్ధం బొకఁడు వింటి సుందరి! యది నా
కేకతమున వినఁబడియెనొ, నీకతమునఁ దెలియవలయు నిక్కమనవుడున్. 425

వ. మహాలక్ష్మియు నెలనగ నలర నిట్లనియె. 426

ఉ. నాపలుకాలకింపుము యనంత గుణాలయ నైనయట్టినా
రూపముమాత్ర మొప్పఁగ నిరూపణఁ జేయఁగ నేర్తు నీవు దు
ష్ప్రాపము నీకు నిర్గుణత భాసిలు నవ్వరదేవతామహా
రూపము తెల్పె నాపె యిది రూఢిగ భాగవతాఖ్యమంత్ర మౌ. 427

ఆ. వె. వేదసార మైనవిద్యయై సుభగమై, పుణ్యమై సమస్తగణ్య మగుచు
నొప్పుభాగవతము నొసఁగెఁ బరాంబిక, నీయదృష్ట మేమొ నేనెఱుంగ. 428

క. నీయందుఁ గృపామతియై, యాయంబిక నీకుఁ జెప్పె ననఘా! నిత్య
ధ్యేయంబు నమేయం బన, పాయంబు నటంచు దీని నరయుము మదిలోన్. 429

గీ. దీని మఱవక పఠియించితేని శుభము, లబ్బు ననులచ్చిపలుకుల నాలకించి
హరియుఁ బరమోత్తమం బగునట్టిమంత్ర, మంచు నద్దాని జపియించు ననవరతము.

వ. ఇట్లమ్మహామంత్రంబు జపించుచుఁ గొండొకకాలమ్మునకు మధుకైటభ భయ
మ్మునఁ దనకుశరణాగతుం డగువిరించి ననుగ్రహించి యద్దనుజుల వధించి విష్ణుఁ

దదత్యర్థితుండై యతని కుపదేశించె నతఁడు నారదునకు నతండు నాకును నుపదే
శించిరి దానిం గొని యేనష్టాదశ సహస్రసంహితారూపమ్ముగా విస్తరించితి. 431

సీ. పంచలక్షణయుక్త మంచితజ్ఞానదం • బజ్ఞానతిమిరమార్తాండబింబ
మాగమాఖిలసార మనుపమ మఖిల ధ • ర్మప్రతిపాదక మప్రతిఘాత
ముక్తిసాధనము ముముక్షుసేవ్యము దివ్య • మాఖ్యానబహుళము వ్యాప్తమహిమ
మాయుష్యవర్ధనం బతిశాంతిదంబు ధ • న్యంబు పుణ్యంబు గణ్యంబు శివము

గీ. సంశయచ్ఛేదకంబు సంసారతార
కం బయిన భాగవతపురాణంబు రోమ
హర్షణాత్మజుతోఁ గూడి హర్ష మెసఁగఁ
జదువుకొనుమయ్య దాన మోక్షంబు దొరకు. 432

క. అది తనయునకుం జెప్పెడి, యనువునఁ గైకొంటి నేను నాతఁడు దానిం
గొని పఠియించుచు నాశ్రమ, మున నుండెన్ సకలసౌఖ్యయుక్తుండగుచున్. 433

వ. ఇట్లు ఋణగ్రస్తునివగిది నిర్ధనునిచందంబున వైకల్యంబున శూన్యహృదయుండై
వేతోకభంగిఁ జింతావిష్టుఁడగు కుమారుం గాంచి సాత్యవతేయుఁడు సంశయ
గ్రస్తుండై యిట్లనియె. 434

క. జ్ఞానాభ్యాస మొనర్చుట, మాని వృథాచింతఁ జేసి మన మజ్ఞానా
ధీనముగఁ జేయ నేల? సు, ఖానుభవము గాంచి ముదము నందఁగరాదే? 435

గీ. నాకుఁ గొమరుడవయ్యు విజ్ఞానమునకు, నింతగాఁ జింత సేయ నీకేల? నాదు
వచనములు నీమనమ్మునఁ బట్టవేని, వేఱొక యుపాయ మెఱిఁగింతు వినుము పుత్ర!

వ. మిథిలానగరమ్మున జనకుం డనునొక్క పృథివీపతి గలఁడు. 437

గీ. అతఁ డతిశాంతుఁ డతిదాంతు డమలహృదయుఁ
డుత్తమజ్ఞానసంపన్నుఁ డూర్జితుండు
అతని దర్శించి నీసందియముల నెల్లఁ
దీర్చుకొనుమయ్య సత్యము దెలుపఁ గలఁడు. 438

వ. అనిన శుకుం డిట్లనియె. 439

గీ. రాజ్య మదమత్తు లైనట్టి రాజు లేడ
సకలముని దుర్లభంబగు జ్ఞానమేడ
దంభ మగుగాక నిజ మని తలఁప నగునె?
కలఁడె? వంధ్యాసుతుండు లోకమున నెందు. 440

## శుకుండు మిథిలా నగరమ్మున కరుగుట.

క. పాపములకు మూలంబు ధ, రాపాలన వృత్తి దాన రక్తుండై యీ
భూపాలుఁడు విజ్ఞాన, ప్రాపకుఁ డని చెప్పె దిది యబద్ధము కాదే? 441

గీ. పద్మపత్రము జలమునఁ బరిఢవిల్లు, చందమున నీతఁ డెట్లు సంసారమందు
నంటి యంటని విధమున నమరి యున్న, వాఁడొ? యాతనిఁ గనుఁగొన వలదె నాకు?

వ. సంసార చక్రమ్మునఁ బరిభ్రమించు వానికి నిది మాత యనియు నయ్యది భార్య యనియు వీఁడు పుత్త్రుండనియు నది సోదరియనియు నిది కులట యనియు నది చేఁ దనియు నిది మధురం బనియు నది క్షారంబనియు నిది శీతమనియు నది యుష్ణ మనియు నానాభేదంబులు చొప్పడక తప్ప దట్టి భేదజ్ఞానంబు కలవాఁడు ముక్తుం డెట్లగు? నంతియగాక రాజ్యభార నిర్వాహకుండగు నరపాలునకు శత్రు మిత్రాది పరిశీలనం బావశ్యకం బిన్నిటం దవిలియు జీవన్ముక్తుండగు పురుషుం డదృష్టచరుం డగుటం జేసి యాతని దర్శింపఁ గుతూహలంబు పొడమెఁ బోయి వచ్చెద నాజ్ఞ యిమ్మనుటయు వ్యాసుండు. 443

చ. అరిగెదవే కుమార! శుభ మబ్బెడుఁ గావుత నీకు నెల్లెడన్
దిరిగియు వైళమే యరుగు దేఁగదవయ్య! భవన్ముఖంబు నే
నరయక తాళఁజాల విపులాయువు నీ కగుఁగాక యొండుచో
నరిగెదుసుమ్ము బాసయిడు మానయి నిచ్చోటువీడు మిమ్మెయిన్. 444

క. జనక నృపుఁ గాంచి సంశయ, వినివృత్తిం బొరసి మరల వేగమ యిటకున్
జనుదెమ్మీ, ప్రాణము నీ, వని నమ్మిన నన్ను వంగలార్పింపకుమీ. 445

వ. అని మాటి మాటికి ననునయించు తండ్రికి నమస్కరించి యనుజ్ఞాతుండై ధనుర్ముక్తంబగు శరంబు వడువున నతిశీఘ్రగమనుండై యరుగుచుఁ ద్రోవ నక్కడక్కడ ననేక విధమ్ములగు దేశమ్ములను వనములను బర్వతమ్ములను క్షేత్రమ్ములను నానా ప్రకారులగు మునులను శైవ వైష్ణవ శాక్తాదులను గాంచుచు ననేక ప్రకారంబు లగు వారి వారి ధర్మంబుల కత్యాశ్చర్య పర్యాప్తుండగుచు రెండు వత్సరంబులకు మేరువును నొక వత్సరమునకు హిమనగంబును నతిక్రమించి మిథిలానగరంబు చొచ్చి యచ్చటి విశేషంబు లాలోకించు చున్నంత దౌవారికుండు వారించి "నీ వెవ్వండ వేమి కార్యంబున నరిగెద" వనుడు నవ్వాని కేమియుం జెప్పక మరలి నగరద్వార

బహిఃప్రదేశమ్మున స్థాణువుంబోలె నచలుండై కూర్చుండుడు వెండియు దౌవారికుం డిట్లనియె. 446

క. మూకునివలె లోనికిఁ జన, నీ కెవ్వఁ డానతిచ్చె నృపు దర్శింప న్నీ కేమి కార్య మబ్బెనొ ?, నీ కులధర్మ స్వభావ వియతులు సెపుమా. 447

గీ. బ్రాహ్మణుండవు నాగమ పారగుండ
వంచుఁ దోఁచెడి నిన్నుఁ జూచినంత నాకు
నైనఁ గులమును గార్యంబు నరయఁ దెల్పి
యేగవలె న్యాయ్య మియ్యది యిట మునీంద్ర. 448

వ. అనిన శుకుం డిట్లనియె.. 449

క. ఏ కార్యమ్మునకేఁ బ్బ, ధ్వీకాంతునిఁ జూడ నరుగుదెంచితినో నా కా కార్యము నీకతమున, వాఁకిటనే యెదురు వడియె వగపిఁక నేలా ? 450

మ. హిమవన్మేరు నగమ్ములజా గడచి నే నీరాజు దర్శింపఁ గ
ష్టము నొక్కింతయు లెక్క సేయక దురాశన్ దండ్రివాక్యంబు ని
క్కముగా నెమ్మది నమ్మి వచ్చుటది నాకర్మంబు గా కింద దో
షము వేఱొండును గల్గ నేర్చునె ? మదజ్ఞానంబ యీ సర్వమున్. 451

క. విను దేశ పరిభ్రమణం, బునకు ధనాశయ ప్రధాన మూలము నాకుఁ జా ధనలోభము లేకుండియుఁ, జనుదెంచితిఁ గర్మ గతి యసాధ్యమ కాదే ? 452

ఆ. వె. ఆశ లేనివాని కధికంబు సౌఖ్యంబు, మోహవార్ధియందు మునుఁగఁదేని
యాశ లేనివాఁడ నయ్యును మోహంబు, బాయఁ దవిలి వెదలఁ జాలకుంటి. 453

గీ. మేరుపర్వత మది యేడ ? మిథిలయేడ ?
కాలినడలన యిటకు రాఁ గలుగు టేడ ?
అహహ ! యిది యెల్లఁ బ్రారబ్ధ మహిమ కాక
యెంచి చూచిన ఫల మొకింతేనిఁ గలదె ? 454

క. వేదమొ శాస్త్రమొ పుణ్యా, పాదక మగుతీర్థమో నృపాలునిఁ జూడన్ రాఁ దగునె ? యిటకుఁ బ్రార, బ్ధాదేశముఁ దప్పఁ ద్రోయనగునే యెందుఁజా ? 455

క. పరిశీలింపక యే విట, కరుదెంచినవనికి లాభ మబ్బెను బరిలోఁ జొరఁబోకను భోమ్మంచుక్కా, జరిచారకుఁ దడ్డపెట్టుపాటియె తలఁపఁజా ? 456

క. ప్రారబ్ధకర్మవశమునఁ, దారసిలు శుభాశుభములు దప్పికొనంగా
నేరికిఁ దరమౌ నని శుకుఁ, డూరక మౌనంబు నూని యుండెఁ దనంతన్. 457

వ. ప్రతిహారియు నీతండు మహానుభావుం డని విశ్వయించి వినయమ్మున దగ్గఱం
జని సామపూర్వకంబుగా నిట్లనియె. 458

క. నీయిచ్చ కడ్డువెట్టిన, నాయపచారంబు సైఁచి నావచనంబుల్
రోయక పురిలోనికిఁ జను, మా! యేరికినైన నిమ్ము వద్దందరమే? 459

క. అన శుకుఁ డిట్లను నీదగు, పని నీవొనరింప దీనఁ బాతక మగునే?
విను పరతంత్రుఁడ వగు ని, న్నను ననుచిత మధిపునాజ్ఞ యట్టిద కాదే? 460

క. నరపతియును దూష్యుఁడు గాఁ, డరయక యిట కేగుదెంచు టది నాతప్పే
పరిశీలించిన నెందుం, బరగేహగమనము గౌరవప్రదమగునే? 461

క. అన ద్వారపాలకుం డి, ట్లను సుఖ మన నెద్ది? దుఃఖ మన నెయ్యది? శో
భన మిచ్చగించునరుఁ డె, వ్వని సేయఁగ వలయు హితుఁ డెవం డెవఁ డరి యౌ?

వ. నాపుడు శుకుం డిట్లను లోకమ్మున జనుఁడు రాగి యనియు విరాగి యనియుఁ దగు
నందు విరాగి జ్ఞాతాజ్ఞాత మధ్యమభేదంబులు గలవాఁడు రాగియును మూర్ఖుండుఁ
జతురుండునా ద్వివిధుండు శాస్త్రప్రయుక్తమ్మును మతిప్రయుక్తంబును నని చాతు
ర్యంబును ద్వివిధంబు, మతియును యుక్తాయుక్తభేదంబున ద్వైవిధ్యంబుగలయది
యన విని ప్రతిహారి మహాత్మా! నీ చెప్పిన వచనంబులయందలి యర్థంబు నా కబో
ధ్యంబై యున్నది. న న్ననుగ్రహించి తెల్లంబుగాఁ జెప్పుమని వేఁడుటయు. 463

గీ. ఎవఁడు సంసారమునయందు నిచ్చగలడొ, వాఁడపో రాగినాఁబడు వాని కఖిల
సౌఖ్యములు దుఃఖములుగూడ సంభవించు, నందు మగ్నుండు పరగతి చెందఁబోఁడు

క. ధనదారమానవిజయము, లను గొని సుఖ మందునట్టిలాభము లేకు
న్నను దుఃఖము గనుఁ గావున, నొనరుచు యత్నము నతఁడు సుఖోదయమునకున్.

గీ. వానికి సుఖమ్ము నొదఁగూర్చువాఁడ హితుఁడు;
విఘ్నము నొనర్చువాఁడ పో! విద్విషుండు
చతురుఁ డెల్లెడ మోహసంగతుఁడు గాఁడు
మూర్ఖుఁ డన నెల్లెడల మోహమును వహించు. 466

గీ. ఇఁక విరక్తున కగు సుఖ మెట్టిదనిన, తత్త్వబోధయు నాత్మవిత్త్వమును, దుఃఖ
మనఁగ వానికి సంసార మనుగమించు, వారి చరితంబు విని వలవంతఁ గొనుట.

క. పరతత్త్వవిదుఁ డగున, ప్పురుషునకున్ గ్రోధలోభములు మోహంబున్
బరికింప శత్రువు లగుం, బరమానందంబ వానిబంధువు దలఁపన్. 468

వ. ఇట్లు బోధించుచున్న విజ్ఞానమ్మున కచ్చెరువంది ద్వారపాలకుండు యథేచ్ఛాగమనం
బున కంగీకరించుటయు నతండు ద్వారమ్ము నతిక్రమించి రాగద్వేషాదిసంకులమ్మును
క్రయవిక్రయోపలక్షితంబును విపణిద్రవ్యమనోహరంబును వివదమానజనసంకులం
బును వసుపూర్ణంబును నగు నప్పురంబు నల్గడల నాలోకించుచుఁ జనువాఁడు రాజ
మందిరద్వారమ్మున దౌవారికుచే నివారింపంబడి శీతోష్ణాదికంబుల సమదర్శనుండై
మోక్షోపాయంబుఁ జింతించుచు నచలుండై స్థాణువుం బోలి నిలిచి యున్నంత
నమాత్యుం డొక్కఁ డేతెంచి బద్ధాంజలిపుటుండై లోనికిం దోడ్కొని పోయి దివ్య
పాదపలతాశోభితం బగు నొక్క రాజోద్యానమ్మున నతిథి సత్కారమ్ము నెఱపేర్చె.

సీ. సంగీతసాహిత్యసరసవిద్యలయందు • నేర్పు గల్గి చరించునిపుణమతుల
వాత్స్యాయనాది దివ్యకామకలలందుఁ • బ్రజ్ఞ గల్గినమహాభిజ్ఞకృతుల
రంభాముఖాప్సరోరమణీమణులకన్న • నందంబు గల్గిన యతులగతుల
రాజసేవాసమారాధన క్రియలందుఁ • బ్రోడలై వర్తించుభోగవతుల

గీ. వారసతులను రావించి ధీరుఁడైన • శుకమునీంద్రునిసేవ కుత్సుకలఁ జేసి
మంత్రిసత్తముఁ డేగె నమ్మౌనిపుత్త్రుఁ • డట నతంద్రితుఁడై తనయంత నుండె.

క. ఆనెలఁత లమ్మునీంద్రుని, నానావిధ భక్ష్యభోజనంబులఁ దగ న
మ్మానించిరి యాతం డ, త్యానందము చెందె వారి యారాధనలన్. 471

శా. నూనూఁగున్ వయసొప్పు పూవిలుతుచెన్నుం దన్నఁగాఁ జాలు న
మ్మౌనీంద్రాత్మజుఁ జూచి కామినులు కామగ్రస్తలై పుష్పితో
ద్యానమ్మందుఁ జరింపఁజేసి తమమోహాసక్తి సూచింపఁగా
లో నూహించె నతండు తల్లులని యాలోలేక్షణల్ సిగ్గిలన్. 472

గీ. కామిను లొనర్చునట్టి వికారములకుఁ, గాముకుల మానసమ్ములు గరఁగుఁగాక
పుట్టకయమున్న సంసారమునకు భీతి, వడెడి మునిసుతుమది మెత్తఁబడునె యెందుః

వ. అక్కాంతలును నాతని జితేంద్రియుండని నిశ్చయించి భక్తితాత్పర్యమ్ము లిగు
రొత్తఁ దత్తదుపచార కల్పనమ్ముల సేవించుచుండిరి. శుకుండును నిర్వికార
చిత్తుండై యాత్మారాముండై యథావిధిగ సాయం సంధ్యోపాసనం బొనర్చికొని
యామమాత్రంబు ధ్యాననిశ్చలుండై పదఁపడి తదంగనాదర్శితంబగు నొక మనో

హారతల్పంబున శయనించి వేగుజామున మేల్కాంచి యుషఃకాలంబు దనుక ధ్యానవిష్టుండై పిదపఁ గాల్యకృత్యమ్ములు నెఱవేర్చికొని మరల సమాధియుక్తుండై యున్నంత, 474

## శుక జనక సంవాదము.

క. శుకముని యాగమనమ్ము జ, నకుఁడెఱిఁగి పురోహితుం దనకు ముందుగఁ జే
సికొని శుకునిఁ దగ నర్ఘ్యా, దికమున నర్చించి కడు విధేయుం డగుచున్. 475

వ. కుశలం బడిగి యొక గోవును సమర్పించి వినయవినమితుండై యున్నంత శుకుం
డును జనకునిఁ దగు గౌరవ భాషణంబుల గారవించె నంత జనకుండు, 476

ఆ. వె. నిస్పృహుండవైన నీ వేమికతమున, నిటకు వచ్చినాఁడ వెఱుఁగఁ జెపుమ!
యనుడు నన్నరేంద్రు నాదరమ్మునఁజూచి, యారణేయుఁ డిట్టులనియెఁ గడఁగి.

వ. రాజేంద్రా! మా తండ్రి యగు వ్యాసుండు నాకుపనయనాదికం బొనరించి సమాప్త
వ్రతుండనైన నన్నుం దారపరిగ్రహం బొనరింపుమనుడు సంసారబంధమ్మునకు
భీతిల్లి యే నొల్లనైతి నాయనయు గృహస్థాశ్రమం బుత్తమం బనియు నవశ్య
గ్రాహ్యంబనియు ధర్మార్థకామమోక్షసాధనంబనియు నుపదేశించి యంగీకరింపని
నన్నుం గాంచి మిథిలానగరమ్మున కేగితివేని నీ సంశయంబు నిర్గతంబగు నని
చెప్పినకతమ్మున నిన్నుం గనవచ్చితి. మోక్షకామినగు నాకుం గర్తవ్యం బెయ్య
దియో యానతీవలయుననిన నతని కాతం డిట్లనియె. 478

గీ. వినుము విప్రేంద్ర! మోక్షంబుఁ గొనఁగ నిచ్చ
కలుగువారలు వర్తించు క్రమము మొదట
నుపనయన మంది వేదంబు నొంది దేశి
కునకు దక్షిణ నొసఁగి మీఁదను దదాజ్ఞ. 479

క. దారం గైకొని విమలా, చారుండై న్యాయరీతి జనదాఁటక క
ర్మారంభ మ్మొనరించుచు, సారగతిన్ మెలఁగుటొప్పు సంసారమునన్. 480

సీ. పుత్రులఁ బౌత్రులఁ బొడఁగాంచి మీఁద వా • నప్రస్థుఁ డగుచు వనమ్మునందుఁ
దప మాచరించి షడ్రిపుజయం బొనరించి • యగ్నుల నాత్మ యం దావహింపఁ
జేసి భార్యను వీడి చిత్తము వైరాగ్య • మనుగమింపంగఁ దుర్యాశ్రమంబు
నంగీకరించి శుద్ధాంతరంగుండయి • చరియించుటిది వేదసమ్మతంబు

గీ. గాని మొదలనె సన్న్యాసమూనుటది వి
రుద్ధము విరక్తికలన సంశుద్ధుఁడైన
యనఘుఁడేకాని సన్న్యాస మధిగమింపఁ
దగఁడు తగఁ డియ్యదియె నా మతము మునీంద్ర. 481

క. నలువది యెనిమిది సంస్కృతు, లిల వేదాపాదితమ్ము లిందు గృహి కగున్
నలువది తుర్యాశ్రమవం, తుల కెన్మిదియగు ననుచు శ్రుతులువచియించున్. 482

క. అనిన శుకుఁ డిట్టులను నో, జనపాలవరేణ్య! మానసమ్ము విరాగం
బున కెనసినంత సన్న్యా, సవియతి గొనుటొప్పకున్నె పారజ్ఞానకున్. 483

వ. అనిన జనకుం డిట్లనియె. 484

గీ. ఇంద్రియమ్ము లజేయమ్ము లెంత పెద్ద, పండితునకైనఁ గాని లోఁబడకయుండు
నాటితేఱవివారల కడుగవలెనె?, ప్రతిపదమ్మను మదివికారమ్ము గ్రమ్ము. 485

గీ. భోజనాసక్తి శయనేచ్ఛ భోగరక్తి, పుత్ర సంసక్తియును మదిఁ బొడమెనేని
యతియయినమీఁదఁ దన కెటు లనుభవింప, వచ్చుఁ? గోరిక లనఁగ నవారితములు.

గీ. కావఁ గ్రమమున సర్వభోగములు ననుభ. వించి త్యజియించి గ్రహించిమించవలయుఁ
గాని యున్మత్తుగా వీడఁగాఁ దరంబె?, యూర్ధ్వనుప్తుండు పతనమ్ము నొందకున్నె.

క. ఎవఁడు యతియయ్యు వైరా. గ్య వివేకం బెడలి భోగమం దాసక్తిం
దవులునొ భ్రష్టుండై వాఁ, డవల నిరంతరము నరకమంద కృశించుజా. 488

గీ. చీమ మెలమెల్లఁగాఁ జని చెట్టు తుదకు, నేగు కరణిఁ గ్రమమ్ముగా నెఱుక గలిగి
సన్యసింపఁగవలెఁ గాని సన్యసించి, రెంటికిం జెడ్డ రేవడ రీతి చనునె? 489

గీ. వడివడిగఁ బోవు పక్షుల వడువు గనక, మందగతి నంది యరుగు చీమల వడువునఁ
గ్రమముగా నుత్తమ పదంబు గాంచవచ్చుఁ, గాని తత్తఱపాటు సుఖప్రదంబె? 490

గీ. మన మజేయంబు దానిఁ గ్రమక్రమమున
యుక్తమార్గమ్ములకుఁ జొప్పి యుడుప వలయు
ననుభూతేంద్రియసుఖాత్ములైనవారి
కింద్రియమ్ములు శత్రులై యెదురుకొనవె? 491

మ. గృహమం దుండియు శాంతిగల్గి తగుభంగిం బోవుచుజా లాభసం
గ్రహసంతృప్తుఁడు లాభ మబ్బమిని దుఃఖగ్రస్తుఁడుం గాక స

ద్విహితంబుల్ హొనరించుచుఁగా సతత మావిర్భూతమోదోదయుం
దహితత్యాగియునై చరించుపురుషుం డందుం దుదిన్ మోక్షమున్. 492

చ. సముఁ గనుఁగొమ్ము భోగము లనంతముగాఁ గొనుచున్ జనానురం
జన మగురీతి రాజ్యమును సల్పుచు నిచ్చఁ జరించుచుండియుఁగా
మన మతినిర్మలంబుగ నొనర్చి చెలంగుటచే విదేహము
క్తిని గొనువాఁడ నీ వనుమతింపగ రాదె? సుఖమ్ము లిమ్మెయిఁగా. 493

గీ. ఆత్మవస్తు వెవ్వరికైన నక్షిగోచ, రంబుగా దను మేయ మరంజనంబు
నిర్వికారంబు దానికి నెగడు టెట్లు, బంధనం బింత దెలియంగఁ బడదె మౌని! 494

ఆ. వె. సలుపవిమ్ము తపము జప మొనర్పఁగ నిమ్ము, తిరుగనిమ్ము సర్వతీర్థములను
చిత్తశుద్ధి లేని చెనఁటులు చేయు న, నులు దలంప వ్యర్థములు మునీంద్ర 495

ఆ. వె. నేను నీవు నాది నీయది యనెడి సం, బంధ కారణంబు మనము నిసుము
మనము శాంతమైన మునినాథ బంధమ్ము, కలుగు నెట్లు? ముక్తి గలుగదెట్లు?

గీ. శత్రు మిత్రాదిభేదమ్ము సకలమును మ
నోగతమ్ము నవిద్యా వినోదమును న
టంచుఁ దెలియుము విద్యోదయంబు వొడమె
నేని యివి యన్నియును నశియింప కున్నె? 497

క. విద్యఁగా దెలియుట కొఱకు న, విద్యా కార్యముల ననుభవింపఁగా వలె సూ
ర్యద్యుతిఁ బడలని వానికి, హృద్యంబై చెట్టునీడ యొనకం బిడునే? 498

/గీ. భూతములు భూతములయందుఁ బొరలెనేని
గుణములు గుణమ్ములను గూడికొనియెనేని
ఇంద్రియము లింద్రియార్థమ్ము లెనసెనేని
యాత్మ కరయఁగ దోష మింతైనఁ గలదె? 499

క. వేదము లోకములకు మ, ర్యాదాపాదకము దాని నవమానింపఁగా
రా దవమానించిన ధ, ర్మాదులు నశియించు సౌగతాదులకు బలెన్. 500

గీ. ధర్మ మడఁగినయంత నధర్మ మెసఁగు, దాన వర్ణాశ్రమాదిపద్ధతు లడంగుఁ
గాన వేదోదితములగు కర్మములను, దగ ననుష్ఠించుటయ సమ్మతము మునీంద్ర.

క. అని జనకుం డువదేశిం, చిన విని శుకుఁడనియె నీవు చెప్పినవిధమున్
మనమలరన్ వింటిని నా, యనుమానము తీఱదయ్యె ననఘవిచారా. 502

గీ. వేదధర్మంబు లన హింసవిధము దెలుపు. తలఁపు గలయవి హింస యధర్మమకద
అట్టి ధర్మేతరము దెల్పునట్టి యాగ, మమ్ము లవియును ముక్తిప్రదమ్ములగునె ? 503

గీ. పశులఁ జంపించుటయు మాంసభక్షణంబు, సోమపానమ్ము ప్రత్యక్షసురతవిధి యొ
నర్పఁజేయుట మొదలు జన్నములయందు, సలుపుమర్వ్యృత్తులివియు మోక్షప్రదములె?

సీ. ధర్మరతుండు వదాన్యుండు శిష్ట సం • రక్షకుండును దుష్టశిక్షకుండు
ననఁ దగు శశిబిందు వసురాజు మను దా నొ • నర్చిన మేటిజన్నమ్ములందుఁ
జంపిన పశువుల చర్మంబు లవి వింధ్య • పర్వత సదృశభావంబునందె
రక్త మంతయును జర్మణ్వతి యను నొక • నది యయ్యె నట్టి మానవపతికిని

గీ. గతి దివంబాయెఁ గాని మోక్షంబు దొరక • దాయె; నాతని యశము సాశ్వమ్మెనంగు
నాగమోక్త కర్మంబుల నాచరించు • వారలకు మోక్షపదము దుష్ప్రాప మనుచు.505

గీ. కావ నీదృశధర్మముల్ గలవు నాగ, మముల నాకించుకయు బుద్ధి మనల దనఘ
సంసృతికిఁ గారణంబు స్త్రీ సంగమంబు, దానిఁ గమవాఁడు ముక్తుఁ డెట్లౌను? చెపుమ.

ఉ. ఆగమధర్మ మూనఁగ గృహవ్రతియే యధికారి వానికిన్
సాఁగదు దారతోడ సుఖసంగతిమై వసియింపకున్న నా
భోగము చేకుఱన్ మనము పొంగును జేకుఱకున్న ఖిన్నుఁడై
తాఁగృశియించు నిట్టివరతంత్రుఁడు మోక్షముఁజెందనేర్చునే ? 507

వ. అనిన జనకుం డిట్లను; మునీంద్రా! యజ్ఞాదికంబుల వేదోదితంబగు హింస యుపా
ధిభేదమ్మున నహింసయ యగు నది యెట్లంటేని ? 508

మ. ఫలముం గోరి యొనర్చుహింస తనకుం బాపమ్ము సంధించుఁ గా
ని లవమ్మైన ఫలమ్ము గోరనియెడన్ లేదట్టి పాపమ్ము ని
ర్మలమై యొప్పెడివహ్ని కింధనపుసంబంధమ్ముచేఁ గాక తాఁ
గలుగన్నేర్చునె ధూమ మూరకయ. నిక్కంబింత యూహింపుమా. 509

గీ. రాగి కాక యొనర్చు కర్మమ్ము లవి కృ, తమ్ములయ్యును విను మకృతమ్ము లగును
గాన మోక్షేచ్ఛ నొనరించుకర్మములకుఁ. బాతకము లేదటంచు విద్వాంసు లంద్రు.

వ. అనిన శుకుం డిట్లనియె. 511

గీ. సందియం బొక్కఁడు మనమ్మునందుఁ దోచు
చున్నయది మాయలో మున్గి యున్నవాఁడు

విస్పృహత్వం బెట్టు లగు ? మోహనియతులకును
గేవలము శాస్త్ర మగునె ము_క్తిప్రదంబు ? 512

ఆ. వె. దీపవా_ర్తచేతఁ దిమిరంబు వాయని, యట్లు శాస్త్ర మబ్బినంతమాత్ర
లోనమున్నతమము లోకొవి యడఁగునే ?, యనుభవమునఁ గాక జనకభూప ! 513

క. పరహింస నలుపకుండుట, పరమహితంబ కద ! మోక్షపదగామికి సం
సరణమున మునిఁగి తేలెడి, నరులకు నది యెట్లు జరుగు నరనాథమణీ. 514

క. ధనవాంఛయు సుతవాంఛయు, వనితావాంఛయును రాజ్యవాంఛయు నీ నె
మ్మనమున వదలపు నీకుఁ ద, గునె జీవన్ము_క్తపదము ? కువలయనాథా ! 515

గీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణమ్ము, నవనిపతివైన నీ కవశ్యములు కావె
యిట్టి భేదమ్ము చొప్పడునట్టి నీ వి, దేహముక్తికి నే నమ్మతించు టెట్లు ? 516

మ. కటుతిక్తామ్ల కషాయభేదము లెఱుంగన్ లేవా ? యిష్టార్థలం
పటభావమ్మును బొందవో ? కడు నరమ్యంబైన వస్త్రక్రియా
ఘటనకాహ్లాయతఁగాంచకుంటివొకొ ? జాగ్రత్స్వప్నసుప్త్యాదులం
దటులే మగ్నతనొందకుందువొ ? తురీయావస్థ నీకొప్పునే ? 517

మ. ఇది నాసేన, మదీయరాజ్య మిది, నాయేణాక్షి యీనాతి, యి
య్యది నాపుత్రిక, వీఁడు నాసుతుఁడు, నాకాహ్లాదకం బిద్ది, యి
య్యది నాకుంప్రతికూల మంచు మది నూహల్ సేయు నీవెట్లు ము
_క్తదశం జెందెదు ? నీకు లోష్టమును బంగారమ్మునుం దుల్యమే ? 518

సీ. సేవింప గతి లేదు చేయంగఁ బని లేదు • విలిచి వసింపంగ నీడ లేదు
కామింప సతి లేదు గణియింప మతి లేదు • దుఃఖించుటకు లోవదుడుకు లేదు
తిట్ట శత్రుఁడు లేఁడు దీవింప హితుఁడు లేఁ • డేలంగ నొకపల్లెయేని లేదు
మానమ్ము లే దవమానమ్ము లేదు క • ష్టమ్మును లేదు సుఖమ్ము లేదు

గీ. పుష్పఫలమూలములఁ బొట్టఁ బోసికొంచు
నరయ నాయంతవాఁడనై యడవిమృగము
వడువునఁ జరింతు నావంటిబడుగు చెందు
వాఁడు కాఁడె ? జీవన్ము_క్తపదము నధిప ! 519

చ. వనిత గృహమ్ము వి_త్తమనువాంఛలతోఁ బనియేమి నాకు నా
పని పెఱవారి కేమి ? గుణవర్గము వీడి చరింతు; నీవనన్

పవిత గృహమ్ము విత్తమనువాంఛ మదిఁగా వదలంగ లేవు నీ
కనువగునేని ముక్తిపద మన్యులు పొందనివార లుందురే? 520

క. ఒకవేళ ధనము లేమి మ, ఱొకవేళను సేన లేమి నొకవేళను శ
త్రుకృతభయం బెడఁబాయమి, నకదా! చింతించుచుందు వవనీపాలా! 521

తే.గీ. అనఘులు జితవ్రతులు మితాహారులైన, యట్టి వైఖానసులు దీని నత్యసార
మంచు గుర్తించియును నడుగ్గంటుచుంద, నీవు సంసారివై ముక్తి నెట్లు గంటి?

వ. భవదీయవంశోత్పన్నులగు రాజులకందఱకు వమూచానంబుగా విదేహపదంబు
చెల్లంబోలుఁ; గాదేని మీపూర్వుండగు నిమి జన్నంబొనరింపఁ గులగురుం డగు
వసిష్ఠుం గాంచి విన్నవించిన నతండునో "సురేంద్రుండు యజ్ఞం బొనరింప నున్న
వాఁడు తదధ్వరమ్ము సమాప్తి నొందించి నీమఖంబు నెఱవేర్చెద" ననుడు వేఱొ
కని వశమ్మునఁ దనజన్నంబు నెఱవేర్చికొని కుపితుండగు వసిష్ఠుచే "నీశరీరంబు
భూపతితం బగుఁ గాక" యని శపింపఁబడి "నీకును నియ్యదియ శాపం" బని
యెదురు శపించె నని వింటి. విదేహముక్తు లగువా రిట్టివను లొనర్తురే? యని
మఱియును, 523

క. విను మీవిదేహబిరుదం, బనఘా! ఘృతకోశమట్టులయ్యె దరిద్రున్
జనునే లక్ష్మీధరుఁడన?, నసువే విద్యాధరాహ్వయము మూర్ఖునకున్? 524

వ. నావుడు జనకుండిట్లను, 525

మ. భవదుక్తం బన్నృతమ్ము గాదు విను విప్రా! నీవు నీతంద్రియా
జ్ఞ వృథా చేసి వనాంతరమ్మునకు వేడ్కన్ బోవనుంకించె ద
య్యవనిన్ మాత్రము సంగముం గనక యేలా యుక్కి నీకొవ్వున
య్యా! విలోకింపు మరణ్యమందు మృగనిత్యవ్యాప్తి లేకుండునే? 526

క. దండం బేమయ్యెడినొ క, మండలు వేమగునొయంచు మాటికి నెట్టుల్
గొందాడె దీవు. నే భూ, మండలభరణమును నట్లె మది నంధింతున్. 527

గీ. నిత్యమును బొట్టకై చింత నీకుఁ దప్ప. దట్టులే రాజ్యచింత నాకభిమతంబు
నందియముఁ జెంది యీపు విచార మొందె. దేను నిన్పంశయుండనై యొనఁగువాఁడ.

మ. అనుమానం బొకయింత లేక సుఖినై యాహారముం గొందు ని
ద్రనుగై కొందు సుఖమ్ములం బడయుదున్ రాజ్యమ్ము శాసింతుఁ గా

ని విబద్ధుండ నటంచు భీతిని గొన నీవ్వి వన్నియున్ వీడి ని
త్యవిబద్ధుండ నటంచుఁ జింతిలెదు నీకా! ముక్తి సిద్ధించుటల్. 529

గీ. కాన నీవు విబద్ధుండఁ గా నటంచు, సకలము నొనర్పు మదియ మోక్షమ్మునమ్ము
బద్ధబుద్ధిని నీ వెంత పాటువడిన, ముక్తిఁ గాంచుట సున్న యోమునివరేణ్య. 530

ఆ. వె. మమతవీడి యెట్టిక్రమమున వర్తించె, నేని వాఁడు ముక్తి కేగువాఁడు
మమత నొందువాఁడు మఱి యెట్టిక్రమమునఁ, బోయెనేనిముక్తి బొరయలేఁడు.

గీ. అనఘ! రాజ్యాదికంబు నాయది యటంచు, నిచ్చ గలిగి ప్రవర్తింప నింత నిజము
గాన నేను జీవన్ముక్తగతిని గంటి, వెఱ్ఱిఁబడ నేల? నామాట వినఁగదయ్య. 532

క. అని జనకుం డుపదేశం, బొనరించిన శుకుఁడు మోద మొంది తనంతన్
జనె నాశ్రమమ్మునకు సుతుఁ, గని వ్యాసుండును ప్రమోదకలితుండగుచున్. 533

క. తనయా! జనకునివలనన్, మనమునఁ గలసందియమ్ము మానెఁగదా! నీ
కనుడు శుకుఁడిట్టులనె న, జ్జనకునివలె మునికి నాకు సమ్మత మనఘా! 534

వ. అట్లు సమ్మతించిన వ్యాసుండు సంతుష్టాంతరంగుఁడై పీవరి యను నొకకన్నియం
దెచ్చి వివాహం బొనరించె. 535

క. ఆ రమణియందు శుకుఁ డా, త్మారాముండయ్యుఁ గనియె ననఘుల సుతులన్
గౌరప్రభు దేవశ్రుతు, భూరిన్ గృష్ణున్ సమస్తబుధమానితులన్. 536

గీ. నలువురకు వెన్క నొక్కకన్యకను గీర్తి, యనెడి దానినిగని దాని నణుహుఁడనఁగ
నెసఁగు విభ్రాజపుత్రున కిచ్చె నతఁడు, బ్రహ్మదత్తునిఁ గనియె నప్పడఁతియందు.

క. శుకకన్యాతనయుం డ, త్యకలంకుఁడు బ్రహ్మదత్తుఁ డవనీపతియై
సకలముఁ బరిపాలించుచు, నొకతఱి నారదుని మునికులోత్తముఁ గాంచెన్. 538

వ. తదుపదిష్టం బగు మాయాబీజోపదేశమ్ముకతన నిరర్గళజ్ఞాన సంపన్నుండై విరక్తిం
గాంచి రాజ్యభారంబు పుత్రునం దిడి బదరికాశ్రమమ్మునకుం జనియె. శుకుండును
పితృసాన్నిధ్యంబు విడిచి కైలాస శిఖరంబున కరిగి యచ్చట నిరంతరధ్యానసంప
న్నుండై కొండొకకాలమ్ము వసియించి పిమ్మటఁ దద్గిరి శిఖరమ్మునుండి యోగబల
మ్మున నుత్పతనం బొనర్చి సకలయోగిజన దుష్ప్రాపం బగు సిద్ధిం బొరసి యంబరతల
మ్మున రెండవ భాస్కరుం బోలె వెలుంగుచుండె. 539

క. వ్యాసుండును సుత విరహా, యాసమ్మునఁ బెచ్చుపెరుఁగు వగలన మిగులన్
గాలిసి యట విలపోపమి, హా సుత! యనుచుం జనె రజతాచలమునకున్. 540

ఆ.వె. అచట వంగలార్చు నమ్మహాభాగుని, యందుఁ గరుణ గలిగి యఖిల గతుఁడు
ప్రతి రవం బొనర్చెఁ బరముఁ డిప్పటికి న. వ్పర్వతమున నెగడుఁ బ్రతి రవంబు.

చ. అటు విలపించు వ్యాసుకడ కంగజ మర్దనుఁ డేగుదెంచి "నీ
విటు దిగులొంద మంచిదగునే! భవదీయ సుతుండు యోగ దు
ర్ఘటమగు మోక్షముం గనె నఖండుఁ డతం డిఁక వాని కింత య
క్కటికము పూని దుఃఖపడఁగాఁ దగునయ్య! పరాశరాత్మజా. 542

క. అని యోదార్చు శివుం గని, యనియెఁ వ్యాసుండు పుత్రు నరయకయున్నఁగా
గనులకుఁ జల్లన గలుగదు, చినఁబోవు మనంబిఁకేమి సేయుదు దేవా! 543

వ. అని పునఃపునర్విషాదంబునం దిగులొందు వ్యాసుం గరుణించి శంకరుండు "నీ
సుతుండు ఛాయారూపమ్మున నెప్పుడును నీ సన్నిధి నుండు" నని వరంబిచ్చి
యంతర్హితుండయ్యె. 544

క. హరుఁ డటువో యినమీఁదఁగ, బరాశరాత్మజుఁడు దుఃఖభరమగ్నుండై
యరుదెంచె నాశ్రమమ్మున, కరయఁగ శుకచరిత మిది మహామునులారా! 545

వ. అని చెప్ప సూతుంగాంచి శౌనకాదులో మహాత్మా! శుకుండట్లు సిద్ధిం గాంచిన
పిదప వ్యాసుం డేవిధమ్మున వర్తించె వివరింపుమన నతఁ డిట్లనియె. 546

సీ. వ్యాసుని శిష్యులై పైలు దేవలుఁడు వై • శంపాయనుండును జైమినియును
నసితుండును సుమంతుఁ డంతకమున్న యా • తని యాజ్ఞఁ గైకొని చనిరి వ్యాసుఁ
డటు శిష్యు లరుగుట కిటు పుత్రుఁ డంతరిం • చుటకును నెమ్మది శోక మంది
తానును నెందేనిఁ బో నుద్యమించి యం • తటఁ దన తల్లి యా దాశరాజ

ఆ. వె. సుతను సత్యవతిని శుభగుణ సంపన్న • నంతరాత్మఁ దలఁచి యచొటు వీడి
జన్మభూమి కడకుఁ జని విషాదులఁ గాంచి • యాపెజాడ వారి నడుగుటయును.

## ధృతరాష్ట్రాద్యుత్పత్తి.

వ. వారు సత్యవతిని శంతనున కిడిన వార్త తెల్పిరి. పదఁపడి దాశరాజు తగు సత్కా-
రమ్ముల నాతని గారవించి స్వాగతం బడిగి వినయ వినమిత శిరస్కుండై బద్ధాం
జలిపుటుండై, 548

క. దేవా ప్రాప్యం బైతగు, తావక సందర్శనం బొదవు కతమున నేఁ
బావనుఁడనైతి జన్మము, పావనమై యెసఁగెఁ గులము పావనమయ్యెఁగా. 549

వ. భవదాగమనకారణంబు వినవలతు ననుడు వ్యాసుండు మతేమియుం జెప్పక యట నతిదూరమ్మున నున్న సరస్వతి యొద్దున నాశ్రమం బేర్పఱచుకొని తపం బొనరించుచుండె. బదఁపడి శంతనుండు సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులను గొమరులఁ బడయుటయు నయ్యది విని వ్యాసుం డమితానందంబు నందె. ఇట్లు తనయులం గాంచి వారి కారణమునఁ దన్ను ధన్యుంగా నెంచికొనుచుఁ గొండొకకాలమ్ము రాజ్యమ్ము శాసించి కాలగతిం బొంసిన పిదపఁ బ్రథముండగు గాంగేయుండు తన తండ్రికిఁ గాలోచితంబు లొనరించి పైతృకంబగు రాజ్యం బొల్లక దేవవ్రతుండై తనతమ్ములలో నగ్రజుండగు చిత్రాంగదునకుఁ బట్టంబుగట్టె.

శా. ఆ చిత్రాంగదుఁ డొక్కనాఁడు మృగయావ్యాపారలీలన్ మృగ
ప్రాచుర్యంబున నొప్పు నట్టడవిత్రోవం బోయి క్రీడించుచో
నాచెంతన్ నృపు నాత్మనామధరు డాయం జూచి నారాచవి
ద్యాచాతుర్య మెలర్పఁదాకె నొకగంధర్వుం డవార్యమ్ముగన్. 551

క. ఆ యిరువురు నొక మూఁడేం, డ్లాయతగతిఁ బోరుసల్పి రా ఖచరుఁడు గాం
గేయానుజన్ము స్వర్గ, స్థాయిగ నొనరించె నిశితశరపాతములన్. 552

వ. భీష్ముం డయ్యుదంతంబు విని తమ్మున కుత్తరక్రియ లొనర్చి విచిత్రవీర్యుని రాజ్యమ్మున నభిషిక్తుం జేసె. సత్యవతి పుత్రశోకోపహత యయ్యుఁ గనీయఃపుత్రరాజ్యలాభమ్మునకు సంతసించె. వ్యాసుం డియ్యది విని యామోదించె నంత విచిత్రవీర్యుండు క్రమముగా సంప్రాప్తయౌవనుండై రాజ్యమ్ము శాసింప గాంగేయుం డతనికిం బరిణయం బొనర్ప నుంకించుచుండె. 553

ఆ. వె. అంతఁ గాశిరాజు సంతసమ్మునఁ దన, యాత్మజాతలకు స్వయంవరమునఁ
బెండ్లి సేయ నిచ్చఁ బిలిపించె రాజన్య, వరుల నెల్లఁ దగినవారిఁ బంచి. 554

వ. భీష్ముఁ డచ్చటి కేఁగి నిఖిల రాజన్యుల జయించి యంబాంబాలికాంబికలను నమ్మువ్వురఁ గన్యకలం దనరథమ్మున నిడికొని మాత్రాది భావమ్మున వారిం జూచుచుఁ బురమ్మున కరుదెంచి తల్లికిఁ గన్నియలఁ జూపి దైవజ్ఞనిర్ణీతంబగు నొక్క సుముహూర్తమ్మునఁ దమ్మునకుం బరిణయం బొనర్ప సమకట్టియున్నంత వారిలోఁ బెద్దయగు నంబ లజ్జావనతాననయగుచు శాంతనవున కిట్లనియె. 555

శా. నాకున్ సాల్వునియందు నానృపతికిన్ నాయందు నెయ్యంబు దా
నేకాకారముఁ జెంది యున్నయది. నీ వెంతే బలాఢ్యుండవై

యాకర్షించితి నీ యధీన వగు నా కారాజు ప్రాపించునే?
నీకుం దోఁచని ధర్మముం గలదె? మన్నింపంగదే నావుడున్. 556

వ. దేవవ్రతుండును వృద్ధబ్రాహ్మణజననీసచివానుమతంబున నద్దాని యథేచ్ఛాగమనమ్మున కంగీకరించిన నయ్యువిదయు సాల్వు నికేతనమ్మునకుంజని యతనితో నిట్లనియె. 557

క. నీయం దనురాగము గల, నా యాథార్థ్యమ్మెఱింగి నను విడిచెను గాంగేయుం డో నృపవమ్మథ, న్యాయముగఁ బరిగ్రహింపుమా నాకరమున్. 558

ఉ. నావుడు సాల్వుఁ డిట్టులను నాతిరో! నేఁ గనుచుండ నాఁడు విన్నేవలమంటె భీష్ముఁ డెటు నే గ్రహియింతు? నెవండు గైకొనున్బో! వెలఁదిన్ బరుండు గొనిపోయి త్యజించిన దానిఁ, బౌరుష శ్రీ వెలిద్రొక్కి స్రుక్కవడదే? చనుమీ చనుదెంచినట్లుగన్. 559

గీ. అట్లు త్యజియింప నయ్యంబ "యకట! చెడితి"
నముచు విలపించుచును వెస నరుగుదెంచి
భీష్ముఁ గని పల్కె "ధర్మజ్ఞ బేలనైతిఁ
జెడితి సాళ్వుండు న న్నిరసించె నురక. 560

క. ననుఁ గైకొను మీ" వని కడు, వినయము దైన్యంబు దోఁప వేఁడుకొనుడు శాంతనవుం "డన్యాసక్తన్, వినుఁగొన రా దేగు మిపుడ నీ తండ్రిఁ గనన్. 561

గీ. అమటయును జేయునది లేక యంబ పుట్టి, వింటి కేగక వనమేగి యొంటి నచటఁ దపము సేయఁగఁబూనె శాంతనవుఁ డంత, దమ్మునకుఁబెండ్లిచేసె న త్తరిరుఁబోండ్ల.

క. ఆ యిరువురు భార్యలతో, నా యవనీపాలుఁ డుపవనాది క్రీడా వ్యాయామ గతిఁ జరించుచు, న్యాయంబుగ భూమిపాలనం బొనరించెన్. 563

గీ. అట్లు నవ వత్సరములు భార్యలను గూడి, కేళి సల్పుచు నా భూమిపాలుఁ డంత రాజ యక్ష్మార్తుఁ డగుచు మరణము నందె, వతివిధువనంబు మృత్యుసంగతముకాదె?

వ. సత్యవతి సుతుండు మృతుం డగుటకు దుఃఖించి మంత్రులవలనఁ గాలోచిత కృత్యమ్ము లొనర్పంజేసి గాంగేయుం బిలిచి యేకతమ్మున నిట్లనియె. 565

క. శంతను మహీపతి కీవును, సంతానము వగుటఁ బృథివి శాసింపుము నా వంతఁ దొలఁగించి నాకున్, సంతానపుఁ గొఱఁతఁ దీర్పఁ జనదె? కుమారా!

క. అంబాలి కాంబికల యం, దుం బడయుము పుత్రకుల, సుతుల లేమిని వం
శం బడఁగు నకట ! యిది విం, ద్యంబని తలపోయ నగునె, ధర్మమకాదే ? 567

వ. అను తల్లికిం గొడు కిట్లనియె. 568

శా. తల్లీ ! నాదు ప్రతిజ్ఞ నీవు వినలేదా ? రాజ్యభారంబు నే
నొల్లన్ దారఁ బరిగ్రహించుటకు నే నొప్పన్ కులీనుం ద్విజుం
దల్లీలావతులందుఁ గూర్చి తగు సంతానంబు నందింపఁగాఁ
జెల్లన్ శాస్త్రము లిట్టి ధర్మమును శాసించున్ గులార్థంబుగా. 569

గీ. ఇట్లు మనుమనిఁ బడసి మహీతలమున, కతని నభిషిక్తుఁ గావింపు మంబ ! వాని
శాసనంబు నాకెంతయు సమ్మతంబ, యనుడు వ్యాసునిఁ దలఁచె సత్యవతి మదిని.

క. స్మరియించి నంతమాత్రన, యరుదెంచి నమస్కరించి యట నిల్చిన య
ప్పరమున్ వ్యాసుని భీష్ముం; డరసి తగినరీతిఁ బూజలర్పించె వెసన్. 571

వ. సత్యవతియు వ్యాసుం గాంచి యిట్లనియె. 572

క. తనయా ! నాయనుమతి నీ, యనుజుని క్షేత్రమ్మునన్ నయంబుగఁ బుత్రుం
గనుమా నా శాసనమున్, వినుమా వంశంబు నిల్పి విశ్రుతి గొనుమా. 573

క. అను తల్లిమాట లాప్తవ, చనములుగా నెంచి వ్యాసనంయమి యనుజాం
గన ఋతుకాలమ్మును గను, దనుకం దా నట వసించెఁ దద్దయు నెమ్మిన్. 574

వ. అంబికయుఁ గొండొకకాలమ్మునకు ఋతుస్నాతయై యత్తయానతికతన వ్యాసుం
గలయుట కంగీకరించిన, 575

ఆ.వె. వ్యాఁడు దా విలాసవతిఁ గూడి క్రీడింప, వనిత యంధు నొక్క తనయుఁ గాంచె
నతఁడు రాజ్యమునకు నర్హుండు గాకున్కి, సత్యవతియుఁ గడు విచారమంది. 576

వ. రెండవ కోడలగు నంబాలికం బిలిచి యంగీకరింపంజేసిన నామెయును యోగ్య
కాలమ్మున వ్యాసుం గలిసి పాండురోగగ్రస్తుండగు నొక కుమారుం బడసె. అతం
డును రాజ్యమున కర్హుండుగామి నంబికం బిలిచి మరల నొక్క కుమారుం గను
మనిన నామెయు నత్తమాట కుత్తరం బీఁజాలక వల్లె యని తన దాసిం బనిచె. 577

క. దాసియు వ్యాసునిమది కు, ల్లాసం బొనరించి తగు విలాసములొప్పం
జేసినకతమున దానికి, వ్యాససముఁడు విదురుఁ డనెడివాఁ డుదయించెన్. 578

వ. ఇవ్విధమున ధర్మవేదియగు వ్యాసునివలన ధృతరాష్ట్ర పాండురాజ విదుర లుద్భ
వించి భరతవంశం బుద్ధరించిరని నుడువుటయు: 579

## స్కంధాంత పద్యములు.

శా. సారాచార విలాస ! విస్తృతయశస్సంభార ! గంభీర ! సం
సారాత్యంతవిరక్తచిత్త ! త్రిజగత్సంస్తుత్య ! షడ్దర్శనీ
పారావారవిశారదత్ర ! కరుణాపారీణచారిత్ర ! లీ
లారాజీవభవావతార ! గురువర్ల బ్రహ్మవిద్వన్మణీ ! 580

క. హృద్యానవద్యవిద్యా, విద్యోతితసకల దేశవిభుమండల సం
సద్యోషాభూషాయిత, విద్యార్థివిశేష ! బ్రహ్మవిద్వద్భూషా. 581

మాలినీవృత్తము. ధవళగిరి నివాసా ! ధర్మరాజద్విలాసా !
శివతరసుచరిత్రా ! శీలవద్భాత్రపుత్రా !
భవపరిచితచిత్తా ! బ్రహ్మసూత్రార్థవేత్తా !
త్రివిధమతవిహారీ ! దేశిక బ్రహ్మసూరీ ! 582

### గద్య.

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీ భాగవతంబను
మహాపురాణంబునందుఁ బ్రథమస్కంధము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పర దేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## ద్వితీయస్కంధము

శ్రీచర్ల కులాంబుధి రా, కాచంద్ర! సమస్తయాచకసురద్రుమ! ధీ
వాచస్పతి! దుర్మత దు, ర్వ్యాచాదుర్వల్లిశస్త్రి! బ్రహ్మయశాస్త్రీ! 1

గీ. అవధరింపు మనంతరం బఖిలమునులు, సూతుఁ గన్గొని హర్షసమేతులగుచు
"సత్యవతి నెట్లు కైకొనె శంతనుండు, మున్నె యామెకు వ్యాసుండు పుట్టుటెట్లు?

వ. వ్యాసుని జన్మంబును సత్యవతి యాథార్థ్యమ్మును సవిస్తరముగా నెఱిగింపు" మన
వుడు సూతుండు, 3

ఉ. అంబ! నినుం దలంచు జనులందఱు ధర్మము నర్థకామమో
క్షంబులు గాంతు రీవకద సర్వనియంత్రివి నీదు మంత్రరా
జంబు పఠించువారలకు శాశ్వతసిద్ధి ఘటించు మత్కృతా
ఖ్యంబును సేకరించి నను మాన్యవచోవిభవుం బొనర్పుమా. 4

క. అని యంబకు మ్రొక్కిడి యో, యనఘులు వినరయ్య మును బృహస్పతితేజుం
డనఘుం డుపరిచరవసుం, డను చేదిధరాధినాథుఁ డలరుఁగా ధరణిన్. 5

గీ. అతని తపమున కెద మెచ్చి యమరనాథుఁ, డొక్క దివ్య విమానంబు నొసఁగె దాని
నెక్కి యుప్పరవీథుల నేగుచుండు, కతన నుపరిచరాఖ్యను గాంచె నతఁడు. 6

క. అతని సహధర్మిణి తరు, ణీతిలకము గిరిక యనఁగ నెగడు ఘటి తనూ
జాతులు గల రాతనికి గు, ణాతతు లైదుగురు వార లధిక బలాఢ్యుల్. 7

క. వారలఁ దత్తద్దేశ ధ, రారమణులఁగా నొనర్చి రమణీమణి త
న్నారాధింపఁగ సుఖియై, స్వారాజుంబోలె నుపరిచరవసు వుండెన్. 8

వ. అంతఁ గొండొక కాలంబున నొక్కనాఁడు గిరిక ఋతుస్నాతయై తనరాక కెదురు
చూచుచుండె నయ్యవసరమ్మున, 9

గీ. శ్రాద్ధ మొనరించుకొనఁదగు సమయ మిపుడు
గావఁ గానకు నేగి మృగములఁ గొట్టి
తెమ్మనుచుఁ బితరులు గడు నెమ్మి మెయి వి
ధించుటయు లోనఁ గొంత చింతించి యతఁడు, 10

క. పితృవాక్యం బొనరింతునొ, సతివాక్యం బొనరుతునొ విచారించినచోఁ
బితృవాక్యము పేఁతయ స, మ్మతమని తాఁ దుట్టతుదకు మది నూహించెఁగా. 11

క. బిత్తరిపైఁ జిత్తము కడు, హత్తినవాఁడయ్యు మృగయ కరిగెన్ వనికిన్
జిత్తము సాంబశివునిపై, బత్తి మఱొక్క యెడ నించి పార్థివుఁడంతన్. 12

వ. ఇట్లు చని కానం జరించుచున్నంత, 13

క. ఆ లావణ్యవతీమణి, పైఁ లోలుఁడైనకతనఁ బంచాస్త్రుఁడు పూఁ
గోలలు నాటిన రేత, స్ఖాలిత్యము వొడమె నుపరిచరవసువునకున్. 14

క. అటువొడమిన శుక్లమ్మును, వటపత్రమునందుఁ బట్టి వ్యర్థము గాకుం
డుటకై ఋతుమతి యగు తన, కుటిలాలకయొద్ది కనుపఁగోరి కడంకన్. 15

వ. ఎదుటం జరించు నొక డేగం బిలిచి పత్రపుటనిక్షిప్తంబగు వీర్యంబభిమంత్రించి
యిట్లనియె. 16

గీ. దీని గొనిపోయి గిరికాసతీమణికి నొ, సంగు మమ్ముద్దియకు ఋతుసమయమిప్పు
డియ్యది యమోఘవీర్య మెందేని దీనిఁ, బాఱవైచెదవేమొ యో పక్షిరాజ! 17

వ. అని యద్దానిం బనిచిన నదియు నవ్వటపత్రపుటంబు ముక్కునం గఱచుకొని
యుప్పరమ్మున కెగసి యరుగునెడ ముందట, 18

గీ. దానిఁ గనుఁగొని మఱియొక శ్యేన మామి, షభ్రమంజేసి వేవేగ సమరమునకు
డీకొనిన నయ్యదియు దానిఁ దాఁకి యోపి, నంతపాటిగఁ బోరాడు నవసరమున, 19

వ. చంచూపుటవిక్షిప్తంబగు నప్పత్రపుటంబు యమునోదకమ్మునం జాఱి పడిన నద్దాని
విప్రశాపోపహతయై మత్స్యమై పడియున్న యద్రిక యను నొక యచ్చర మ్రింగె
నని చెప్పు సూతుం గాంచి తచ్ఛాపకారణం బెఱింగింపు మనవుడు నాతం డిట్లనియె.

మ. యమునాతీర్థమునం ద్విజుం డొకఁడు సంధ్యావందనాసక్తిఁ దో
యములోనం దిగి వార్చుచున్న సమయంబం దద్రికాకాంత తో
యములాడం జనుదెంచి ముగ్ధ ద్విజు డాయం బోయి తత్పాదయు
గ్మము హేలాగతిఁ బట్టి లాగుటయుఁ దత్కంజాక్షిపై నాతఁడున్. 21

క. అలిగి విసారాంగనవై, జలమునఁ బడియుండు మనుచు శపియించిన న
వ్వేలఁదియు నాతనిచరణం, బులఁ బడి దీనాస్య యగుచుఁ బురపుర పొక్కెన్. 22

వ. దానిం గరుణించి కొండొకకాలమ్మునకు నీగర్భంబున నొక బాలుండును బాలికయుఁ బుట్టుదు రాక్షణంబ నీకు నిజస్వరూపంబు ప్రాపించు నదియ శాపాంతం బని చెప్పి యరిగె నయ్యచ్చరయుఁ దచ్ఛాపవశమ్మున నయ్యమునాజలమ్ముల మత్స్యమై యుండి. 23

క. ఉపరిచరవసువువీర్యం, బు పరిగ్రహియించి గర్భమును దాలిచి యం
దుపచితగర్భయగుచు ను, న్నపుడు వలం బడియె దాశయంత్రిత యగుచున్. 24

వ. వాఁడు నద్దానిగర్భంబు భేదించిన నొక బాలుఁడును నొక బాలికయుం బొడమిరి. వారిం గొని వసురాజునొద్దకుం జని సకలం బెఱింగించిన వసువు విస్మయావిష్టుండై బాలకుం గ్రహియించి బాలికను మత్స్యజీవి కొసంగె. అబ్బాలిక కాళికయనియు మత్స్యోదరి యనియు మత్స్యగంధి యనియు నామత్రయమ్మున నొప్పి తద్గృహమ్మున వర్ధిలుచుండె. బాలుండు మత్స్యుండను నామమ్మున వసురాజగృహమ్మున సర్వవిధములఁ బిత్రుకల్పుండై వృద్ధినందె. 25

గీ. మత్స్యరూపమ్ము వదలి యమరవరాంగి, యగుచుఁ దనయిచ్ఛ నరిగె నయ్యద్రికయును
మత్స్యగంధియు దాశసమ్మతిని వాని, పుత్రికయుఁబోలె వృద్ధిని బొందెఁ బిదప. 26

ఉ. జవ్వన మంది యెన్నదగు చక్కఁదనంబును మేల్మి చెక్కులుఁ
మవ్వపుఁగన్నులున్ మురుపుమాటలు గుబ్బపిసాళిగుబ్బలున్
నవ్వుల తేటలున్ బొలపునం దగు మేటివిలాసపున్నడల్
నివ్వటిలంగ నక్కలికి నేరుపుకూరుపు నాఁ జెలంగుచున్. 27

## వ్యాసోత్పత్తి.

గీ. ఉన్నయెడఁ దీర్థయాత్రార్థ మొక్కనాఁడు, యమున కేగి పరాశరయతివరుండు
దాఁటునిచ్ఛను వక్షన్నెతండ్రిఁ బిలువఁ, గూడుఁగుడుచుచుఁ దనచిన్నికూఁతునని పె.

క. మునివరుఁ డీతం డీతని, ననుపు మవలియొడ్డునకు రయంబుగ నని చె
ప్పినఁ దండ్రిమాటఁ గొని య, వ్వనజాక్షియు వచ్చె మౌనివరు దాఁటింపన్. 29

వ. వచ్చి యుడుపం బెక్కించుకొని నడుపుచున్నంత. 30

ఉ. ఆయువతీమణిం గలసి యా యమునం దరియించుపట్టునన్
గాయజుఁ డాగ్రహించి మునికాంతునిపైఁ జిగురాకు బాఁకులం
గోయవి యార్చి యేయఁ దనకుం గల ధైర్యముఁ దక్కి యాతఁ డ
త్తోయజనేత్రచారుకరతోయజ మల్లన ముట్టె ముట్టుడున్. 31

క. సకియ యెలనగవు నగుచుఁ ద, నకరం బెడఁజేసికొని యనఘ! మీబోఁట్లిం
చుకయును సందేహింపక, యకటా! నాబోఁటిబోటి నంటం దగునే? 32

ఉ. నీవు వసిష్ఠుమన్మఁడవు; నేను నిషాదునికూఁతురన్; దగన్
భావమునందుఁజూడు; మిది భావ్యము గాదిటు చేసినన్ గులం
బా! వెలిఁజెందు; మౌనివరులా! హసియింత్రు; తపంబు నష్టమై
పోవు; భవాదృశుల్ వెడఁగుఁ బోకలకుం దగువార లౌదురే? 33

క. తపమునకును వంశంబున, కుపద్రవము సంభవించు నూహింపక యి
ట్టిపనికిఁ జొరఁబడ నగునే, తపసుల కెందేని యిట్టి తగులము లున్నే? 34

మ. అనఘా! మానవజన్మ మెత్తుట యసాధ్యం; బగ్రజత్వంబు గై
కొనుటన్నం గడు దుర్లభం; బదియు నీకుం జేకుఱెఁ; మీఁద గా
సిని లెక్కింపక మౌనివై తపము వాసిం జెంది పెంపొందు నీ
వనిమిత్తంబుగ మారుబారిఁబడి న న్నాసింపఁగాఁ జెల్లునే? 35

వ. అదియునుం గాక, 36

ఉ. చేఁవల కంపుచే నెగడి చెప్పఁగరాని యసహ్యభావముం
జూపెడి నా శరీరమును జూచి పయిం బడ నిచ్చగించె దీ
వోపిక మాని; దీనసుఖ మున్నదొ లేదొ గ్రహింపవయ్యయో!
పాపపు మారుబారిఁ బడి పండిత భావము రిత్తపుత్తురే? 37

వ. అట్లు బోధించెడి తన పలుకులు వినని వానిం బోలె నటించి మరలఁ గరగ్రహణం
బొనర్చుటయు నయ్యతివ తన మనంబున, 38

ఉ. ఈతఁడు పంచబాణశిత హేతిపరంపరచే గృహీతుఁడై
యాతురుఁ డయ్యె, నిక్క మిఁక నాఁగఁడు; కాముకులైన వారికి
న్నీతియుజాతియుం దెలియనేర్చునె? యంచుఁ దలంచి యెంతయుం
జాతురి మీఱ నచ్చటుల చారువిలోచన మౌని కిట్లనున్, 39

ఉ. తుందుడు కింత చెల్లునె? బుధుండవుగావె? మనంబునన్ ధృతిం
జెందుము; చిత్తవృత్తి విఁకఁ జిందఱ వందఱఁ జేయఁబోకు; నా
యందము నీ మనమ్మునకు నందినదేని, భవన్మనోరథం
బుం దగఁ దీర్తు; నొడ్డునకుఁ బోవఁగ ని మ్ముడుపంబు నావుడున్. 40

క. హితమగు నమ్మాటకు స, మ్మతిఁ జెంది, పరాశరాఖ్య మౌనివరుఁడు నా
సతికరము వీడి యవ్వలి, కతిరయమునఁ జేరి, మరల నాకర్షించెన్. 41

మ. అటు పైపైఁ బడు నమ్మునీంద్రుఁగని యయ్యబ్జాక్షి యాకంపితో
త్కట భీత్యుద్భటదేహయై మునివరుం గామాతురుం జూచి తా
నిటు వల్కెన్; విను నాదు దేహమిది యెంతే మీనదుర్వాసనా
ఘటితం; బీదృశ మైన వస్తువులు భోగ్యం బౌనె! మీ జాతికిన్? 42

గీ. అదియునుం గాక సంయోగ మన సమాన, రూప యౌవన వంతులకే పొసంగు
ననుఁడు నమ్మౌనివర్యుఁ డత్యాదరమునఁ, గాంచి యద్దాని యోజనగంధిఁ జేసె. 43

మ. మృగనాభీఘుమఘుంఘుమార్భటుల పేర్మిన్ మించు మైతావితో
సొగసుం గుల్కెడి ముద్దు నెమ్మొగముతో, సొంపారుకెమ్మోవితోఁ
దొగల న్నవ్వు మెఱుంగుఁ గన్నుఁగవతోఁ, దోరంపుగారాముతోఁ
దగు నత్తన్వికరంబు వట్టె ముని కందర్ప జ్వరావిష్టుఁడై. 44

క. కరముం బట్టెడి యమ్ముని, వరునిం గని పల్కెఁ: మౌనివర విను లజ్జా
విరహితమతివై నయముం, బరికింపక పట్టపగలు పట్టం దగునే! 45

గీ. అరయుచున్నాఁడు నాతండ్రి యవలియొడ్డు, నందు; నదిగాక మార్గస్థు లరుగుదెంచు
వారొ యేమొ? యిటుల్ పశువై ధరిని ర, మింపుటకు నామనము సమ్మతింపదనఘ.

గీ. కాలనియమము పశులసాంగత్యమున క, నవసరము గాని మనుజుల కట్లుగాదు
కాన నామాట విని రాత్రికాలమబ్బు, దనకఁ దాళుము పాపకృత్యం బిదేల? 47

గీ. నీకుఁ బ్రతి చెప్పఁగా నోవ; నీ వెఱుఁగని, యట్టిధర్మంబు కలదె? కామాతురత్వ
మింతగా నీ మనము నలయించెఁగాక, పట్టపగ లిట్టి పనిఁ జేయఁబాడి యగునె? 48

గీ. దాశపుత్రికతోడఁ బరాశరుండు, పట్టపగలు నదీతటీభాగమందు
తగు లొనర్చె నటంచు నింతగ జనమ్ము, లాడుకొనుమాటలు సహింపనగునె పిదప?

క. అని పలుకు నత్తలోదరిఁ, గని యుక్తమ పల్కి తీవు; కల్పించెద మం
చు; నిదియ చీఁకటివలె మన, కనుకూలం బగు నటంచు నటులొనరించెన్. 50

గీ. మంచు నాలుగు దెసల వ్యాపించి తమము, గలుగఁ జేయుదు నమ్మౌనికాంతుఁ డంత
వించువిల్తావికేళీ కాసించుటయును, బలికె నత్తన్వి మధురసంభాషణముల. 51

గీ. కన్నియను నేను; నాతోడఁ గలసి సుఖము
వడయ నుంటి వమోఘ వీర్యుఁడవు నీవు
దేవ నీయిచ్చకొలఁది నెందేనిఁ జనెద
వయ్యయో! నాదుబ్రతు కేమియగునొ పిదప. 52

మ. తలిదండ్రుల్ దలలెత్త లేక కడువంతన్ మున్గి యెగ్గింతు; ర
వ్వలఁ దమ్ముల్ పెఱవారిమోములు గనన్ శంకించి లజ్జింత్రు; నె
చ్చెలు లన్నం గడు గేలి సేయుదురు; వాసిన్ బెండ్లిగాఁబోదు; క
న్నెలకున్ జారుఁ డొనర్చువేఁకటు లవెంతేఁ జింతఁ గల్పింపవే? 53

గీ. గర్భవతినైదునేని నీకతన నేను
నీవు నీత్రోవఁ బోవ నానేర మెట్లు
తండ్రి యెఱుఁగని విధమున దాఁచికొందు?
ననఘ! యోజించి చెప్పు ముపాయంబు నాకు. 54

వ. అని వట్టరాని భయమ్మునఁ గొంకు నద్దాని కాతం డిట్లనియె. 55

గీ. నీకు నాప్రొంపుఁజేసి కన్నెఱికమునకు, హాని వాటిల్ల కుండెను నదియుఁగాక
గోరుకొను మిచ్చెదను నీదుకోర్కెలెల్ల, ననుడు ముని కిట్టులనియె నవ్వసజనయన.

సీ. తల్లిఁదండ్రుల కీయుదంత మించుకయేనిఁ • దెలియకుండంగ సంధించు టొకటి
విన్నుఁ బోలంగల్గు చిన్నారిపొన్నారి • చిఱుతపాపని దయసేయుటొకటి
కన్యాత్వమున కించుకయు నిందు నందు లో • పమ్ము లేకుండఁ గాపాడు టొకటి
యక్షయం బగునట్టి యౌవనం బెపేళ • మించురీతిని గటాక్షించు టొకటి

గీ. మీనగంధంబు వాపి నామేని కిప్పు • డీ వొనంగిన కస్తూరితావి దేవ
చెడక వాసించుపద్ధతి చేయుటొకటి • నాకు దయచేసి యామీఁద నన్నుఁ గొనుము.

వ. అనునద్దాని కతం డిట్లనియె. 58

మ. నిగమమ్ముల్ విడఁదీయువాఁడు సొబగున్ నేర్పున్ దయాళుత్వముం
దగువాఁ డుత్తముఁ డూర్జితాత్ముఁడు పురాణంబుల్ వెలిం జేసి యీ
జగతిం బేరును గాంచువాఁడు హరితేజస్స్ఫూర్తిమన్మూర్తి నా
దు గుణంబుల్ గలవాఁడు నీ కొకసుపుత్రుం డుద్భవించుం జెలీ! 59

వ. తక్కిన నీకోర్కెలెల్ల నట్లయగునని మఱియును, 60

ఉ. అచ్చరమచ్చెకంటుల యొయారము లారసి యూరకున్న నా
కిచ్చ జనించె నేఁడు కమలేక్షణ! దైవవశంబుఁ జేసి, నీ
మచ్చెపుఁదావి యేడ? విను మన్నన చేసి వరించుటేడ? నా
సచ్చరితం బదేడ? తనశక్యమె దైవకృతంబు దాఁటఁగన్? 61

గీ. నీకు నాకారణమున సుశ్లోకుఁడైన, పుత్రుఁ డుదయింపఁగాఁగల పుణ్యముండెఁ
దప్పఁ జేయఁగ నెవ్వరితర మటంచు, దాశపుత్రిక నెపసెఁ బరాశరుండు. 62

క. తనవశమగు నక్కన్నియ, నెనసి పరాశరమునీంద్రుఁ డెంతయు సుఖలీ
లను దేలి యమున లోపల, మునిఁగి శుచియగుచుఁ దనంతఁ బోయినపిదపన్. 63

క. ఆగుణవతియును దా స, ద్యోగర్భము దాల్చి మిగుల నుజ్జ్వల తేజ
శ్శ్రీ గలిగి చెన్నుమీఱు మ, హాగుణనిధియైన యొక్క యనఘుం గనియెన్. 64

గీ. పుట్టినంతన యామహాపురుషుఁ డంబ, కెఱఁగి యిట్లను: నీవు యథేచ్ఛఁ జనుము
నేను దపమునకేగెద; నీవు నన్ను, నెపుడు దలఁచిన నప్పుడ యేగుదెంతు. 65

వ. అనవుడు సత్యవతి నిశ్చింతయై తనతండ్రి పాలికిం జని సుఖంబుండె; నతండును ద్వీపమ్మునఁ బుట్టినకతమ్మున ద్వైపాయనుం డనియు వేదంబులు విభజించిన కతన వ్యాసుం డనియుఁ బరఁగి యష్టాదశపురాణమ్ములను మహాభారతమ్మును రచియించి సుమంతజైమినిపైలవైశంపాయనాసితదేవలముఖ్యులగు శిష్యులకును సుతుండగు శుకునకును నుపదేశించె. 66

గీ. సత్యవతి పుట్టె నట్లు, వ్యాసముని పుట్టె, నిట్టు లిట నందియ మొకింతయేని వలవ
దనఘులగు వారిచరితలయందు గుణము,గ్రాహ్యమగుఁ గానిదోషంబుగ్రాహ్యమగునె.

గీ. కారణం బిట్టు లుండిన కతన సత్య
వతికి మత్స్యోదరమ్మునఁ బడుటయును బ
రాశరునిఁ బొందుటయును సంప్రాప్త మయ్యె;
నట్లు గాకున్న మునియుఁ గామార్తుఁ డగునె? 68

గీ. శంతనునృపాలుఁ డామీఁద సత్యవతిని, దా గ్రహించి సుఖించి సంతతిని బడసెఁ
జిత్రముఁ బవిత్ర మిక్కథఁ జెప్పినాఁడ, దీని వినువారలకు శుభస్థితులు గలుగు. 69

వ. అని నుడువు సూతుం గని మహాత్మా! నీ చెప్పిన సత్యవతీ జన్మంబును వ్యాసో
త్పత్తియును సంతోషదాయకంబులయ్యె నింకొక సందియంబు గలదు. పురువంశ

జుండును ధర్మాత్ముండును మహాభాగుండును నగు శంతనునృపాలకుండు కుల హీనయగు నిషాదపుత్రిక నెట్లంగీకరించె ? నతనికిఁ బ్రథమపత్ని యెవ్వతె ? ఇతని కొమరుం డగు భీష్ముఁడు వస్వంశసంభూతుం డగు కతంబేమి ? సకలగుణసంప న్నుఁడును జ్యేష్ఠుండును నగు భీష్ముండు రాజ్యంబు సత్యవతీతనయుల కేలయిచ్చె? సత్యవతి తన కోడండ్రయందు గోళకుల నెట్లు జనియింపం జేసె ? భీష్మునికి దార సంగ్రహంబు లేనికతంబేమి ? ఇది యిట్లుండ, 70

సీ. వేదముల్ విభజించి మీఁద వేదాంతసూ • త్రము లొనర్చినయట్టి బ్రహ్మవేత్త
పదియునెన్మిది యనంబడు పురాణమ్ములు • పచరించినట్టి సర్వజ్ఞమౌళి
అదిగాక భారతంబన నొప్పు పంచమా • గమ మొనర్చిన కహోకవిపరుండు
ఇది పుణ్యకృత్య మియ్యది పాపకృత్యం బ • టం చెఱింగి చరించునట్టి తపసి

గీ. వ్యాసుఁ డాసించె భ్రాతృభార్యాసుఖం బ • టంచుఁ జెప్పితి వకట ! పరాంగనాసు
ఖంబె పాతక మన, భ్రాతృకాంతతోడఁ • గ్రీడసల్పుట కెట్టు లంగీకరించె ? 71

## శంతనూపాఖ్యానము.

గీ. వ్యాసశిష్యుండ వైన నీ కఖిలధర్మ, సూక్ష్మత లెఱుంగవచ్చు నో సూత ! దీని
కుత్తరము సెప్పు మాదరాయత్తమతి న, టంచుఁ బల్కెడి మునుల కిట్లనియె నతఁడు

క. కలఁడు మహాభిషుఁ డను భూ, తలనాథుం; డతఁడు సత్యతత్పరుఁడు; ధరా
తలనాయకమకుటమణీ, విలసితచరణుండు; బ్రహ్మవిద్యాధికుఁడున్. 73

గీ. అశ్వమేధసహస్రమ్ము లాచరించి, దాన నింద్రుని సంతుష్టుఁగా నొనర్చి
స్వర్గమున కేగి యచ్చట సకలసౌఖ్య, ములను రెండవయింద్రుఁడై పొందుచుండి.

వ. ఒక్కనాఁడు దేవతలతోడఁ జతురాననుసేవించుటకై సత్యలోకమ్మునకుం జనియె.

క. గంగానదియును బరమే, ష్ఠిం గని కొనియాడ నచ్చటికి వచ్చి, విరిం
చిం గాంచి మ్రొక్కి, యొక్క యె, డం గాలూఁది నిలువంబడం దెమ్మెరయున్.

చ. బలువడి వీవ వాపెతొడపైఁ గల చీరచెఱంగు దూఁగి యా
వల కొకకొంత యొరసిలె; వస్త్రము దూలుటఁ దా నెఱుంగ క
క్కలికియు మిన్నకుండె; నటు గాంచుట తప్పని యొక్కపెట్ట నొ
దలలను వంచి రీనృపుఁడుదక్క సభాసదులెల్ల నవిర్జరుల్. 77

ఉ. తన్ను మహాభిషుం డతిముదమ్మునఁ గన్గొనుచుండ, గంగయుఁ
గన్నులవిల్తు బారిఁ బడి కన్గొన సాగె నృపాలుమోము; వి
శ్లైన్నఁగరానిమోహమున విద్దఱు గాఢతరానురాగులై
యున్నతఱిం, గనెం గమలజోద్భవుఁ డెక్కుడు తామసమ్మునన్. 78

క. పెద్దలు గల యీసభ వీ, రిద్ద ఱపత్రపఁ ద్యజించి యిటు విర్భయులై
మొద్దులవలె నటియించెద, రిద్దాని సహించుటొప్పునే? సుజనులకున్. 79

వ. ఇట్లెంచి వారలం గాంచి "మంచిచెడ్డ లెఱుంగక వర్తించితిరి గావున మీరిరువు
రును మర్త్యలోకమ్మునం బుట్టుం" డని శపించె; నంత వారును శాపంబునకుఁ
జింతిల్లుచు నచ్చోటు వీడి వెడలిరి. 80

గీ. ఆ మహాభిషనరపాలుఁ డంత మర్త్య, లోకమున నెవ్వనికులమ్ములో జనింతు
ననుచుయోజించిపురువంశమునఁబ్రతీపుఁ, డనునృపుని దండ్రిగానెంచె నాత్మయందు.

వ. ఇది యి ట్లుండె. 82

గీ. అష్టవసువులుఁగూడ భార్యాసమేతు, లగుచు విహరించుచును వసిష్ఠాశ్రమంబు
నందుఁ జరియింప నందొక్క యతనిభార్య, నందినీధేనువును జూపి నాయకునకు.

వ. ఇది యెవ్వరిది? యని యడుగుడు నత్తన్వి కాతం డిట్లనియె. 84

గీ. చెలియ యిది గలవాఁడు వసిష్ఠమౌని, దీని నెల్లరు నందినీధేను వండ్రు
దీనిపా లిన్ని గ్రోలినఁ దెవులు జరయు, మృతియు దరిఁ జేర వని తనపతి వచింప.

వ. ఆసతియు ముదం బంది "నాకుశీనరరాజకన్యక కడు నెయ్యంబు గలయది. ఆపె
మర్త్యలోకనివాసిని యగుకతన జరామరణాదికంబుఁ బొరయఁ గలదు. తన్ని
వృత్తికై యీధేనువు నద్దాని కొసంగి యుపకృతి నొనర్ప వలయు విద్దాని నాకై
తెమ్మ"నుడు. 86

గీ. ఆవసువు భార్యమాట పథ్యమ్ముఁ జేసి, తక్కుఁగలవసువులఁ గూడి దాని నపహ
రించె; రాబోవు నాపద నెంచఁ డయ్యె, నంగనాసక్తు లాపత్తు లరయఁ గలరె? 87

వ. పిమ్మట వసిష్ఠుండు తనధేనువుం గానక వెదకించి విని తన యోగబలమ్మున
వసువు లపహరించుట యెఱింగి మనుష్యయోనిం బుట్టుం డని వారలకు శాపం
బిచ్చె. పదఁపడి దాని నెఱింగి వార లతని కడ కేతెంచి శాపమోక్షం బనుగ్రహిం
పవే యని వేఁడుడు మునివరుండు కరుణించి యిట్లనియె. 88

మ. అనుసంవత్సర మొక్కొక్కళ్ల కగు శాపాంతంబు; నాధేనువుం
బనిగా భార్యకునై హరించె నెవఁ డా పాపాత్ముఁ డా కష్టుఁ డ
మ్మనుజత్వమ్మును దీర్ఘ కాలము వహింపంగాఁ గలాఁడంచు న
మ్మువి శాపాంతము సెప్ప, నవ్వసువు లిమ్ముల్ చేరుచున్ ముందటఁగా. 89

వ. విధిశాపవశమ్మున దీనాననయై భువికేతెంచు గంగం గాంచి తమ శాపప్రకారం
బెఱింగించి "తల్లీ నీగర్భమున జనించెదము మమ్మనుగ్రహించి శంతనునృపాల
కున కీవు పత్నివగు మదియును గాక, 90

క. పుట్టినతోడన మమ్ముం, గిట్టింపుము నీట వైచి కీడెంచక నీ
విట్టు లొనరించుకతమున, నెట్టన మాశాప మది విముక్త మగున్. 91

క. అని వసువులు తనుఁ బ్రార్థిం, చిన నంగీకరించి చెచ్చెర గంగా
ధుని తనయిచ్ఛం జనియెన్, జనిరి వసువులును గడంగి స్వర్గమ్మునకుఁగా. 92

వ. పిమ్మట ప్రతీపుఁ డొక్కనాఁడు గంగాతటమ్మునకుం జని సూర్యోపాస్తి యొనర్చు
చున్నంత. 93

ఉ. ఆ సలిలమ్మునఁగా వెడలి యంకురితప్రథమానయౌవనో
ల్లాసిని చారుహాసిని విలాసిని పేచని రాజ శేఖరుం
దాసి యశంకితాత్మయయి దక్షిణపుందొడఁ గూరుచుండఁగా
నాసరసీరుహాక్షిఁ గని యాధరణీపరిణేత యిట్లనున్. 94

ఉ. ఎవ్వతె వీవు? నాదు కుడి వెక్కుట కేమి కతంబు? వల్కుమో
జవ్వని! యన్న, నచ్చటుల చారువిలోచన ముద్దు లొల్కఁగా
నవ్వుమొగమ్ము వంచి, నయనమ్ము లొకానొకవింత చెల్వునన్
నివ్వటిలంగఁ బల్కెఁ దగునేరుపు తోరపుఁదీరుపుం దగన్. 95

ఉ. ఎవ్వతెనైన నేమి పృథివీశ! సుమాస్త్రసమానరూప! నా
జవ్వన మంత నీకయి వశం బొనరింపఁ దలంచి వచ్చితిఁగా;
యివ్వకు వచ్చు నమ్మదనుచెయ్యుల కోరువఁ జాల నక్కటా!
నవ్వులు గాఁ దలంపకుము నావచనమ్ము లటన్న నిట్లనుఁగా. 96

క. కన్నెరో! యపత్యమునకుం, దన్నశినాఁటికు యోగ్యతగల కుడి తొడన్
గ్రన్న నధిష్ఠించితి కా, న న్నిను నేఁ గొనఁగఁ దగదు నాః కటుమీఁదన్. 97

ఆ.వె. భార్యఁదక్క నొండు పడఁతిఁగూడ నటంచు, వ్రతము గలదు; నాయపత్యమునకుఁ
బత్నిపై సుఖమ్ము వడయుము; నాకు నం, తానమొదవెనేని దలిరుఁబోఁడి. 98

క. సంతానహీనుఁ డితఁ డని, వంతం గొనఁబోకుమీ ః భవత్పుణ్యమ నా
సంతానకారణం బగు, నింతయు నిక్కమన నాపె యేగెఁ దనంతన్. 99

వ. అంతఁ గొండొక కాలమ్మునకు మహాభిషుండు ప్రతీపునకుఁ దనయుండై శంత
నుండు నాఁగ వర్ధిల్లుచుండెఁ బ్రతీపుఁడును, 100

క. గంగకుఁ దనకుం జరిగిన, సంగతి కొమరునకుఁ జెప్పి చనియెం దా రా
జ్యాంగమ్ము విడిచి యడవి న, సంగుండై యుండి తపమునలుపు నెపమునన్. 101

వ. శంతనుండు పైతృకంబగు రాజ్యమ్ము నేలుచు నొక్కెడ మృగయార్థంబు వనమ్ము
నకుం జని వ్యాఘ్రాదిమృగమ్ముల నుక్కడంచుచు గంగాతటకుంజపుంజమ్ములం
జరించువాఁడు ముందట, 102

సీ. మృగశాబములకు నేర్పెడి నేర్పుగలచూపు • సోయగం బొలుకు కందోయిదాని
కుంభికుంభములయుక్కును ద్రొక్కి నిక్కి నీ • ల్గెడిగుబ్బ చందోయి బెడఁగుదాని
మాటమాటకు ముద్దు మూటఁగట్టఁగఁ జాలు • సొగసుచే నెగడు నెమ్మొగముదాని
ముకురమ్ములకుఁ జాకచక్యఁ దీర్పఁగాఁజాలు • తళ్కుఁజెక్కుల తళత్తళలదాని

గీ. తొగలవగకావిజిగిబిగి నగ దొనర్చు • నిగనిగలఁ దగు నగవుసోయగముదానిఁ
దావులకు దీవి యగు కావిమోవిదానిఁ • గనియె నొకకన్నెఁ గన్నులకబ్బుదీఱ.

క. సురకన్యవోలె యయ్యం, బురుహాననఁ జూచి తండ్రి మున్నుతనకు నే
విరిబోఁణిఁ జెప్పె నీసుం, దరి యయ్యతివయొకొ యంచుఁ దనమది నెంచున్. 104

ఉ. సుందరుఁడైన యానృపతిసూనునిఁ జూచి తదంబుజాక్షి "యీ
యందపుటిక్కు నిక్కము మహాభిషుఁడే" యని రాగమగ్నయై
కందె మనోజతాపమునఁ గ్రాఁగి పునఃపునరాదరోదయా
నందమునం దదీయవదనంబునఁ జూడ్కి నిగుడ్చి యున్నెడన్. 105

క. శంతనుఁడు దానిరీతిం, గొంత గనుంగొని రసమ్ము గులుకఁ బలికె "నో
యింతీ ః మరుదంతీ ః విరి, బంతీ ః నీవెవ్వతెవొ ? కృపం బలుకఁగదే. 106

ఉ. ఎవ్వతె వైన నేమి కమలేక్షణ ః నిం గనుఁగొన్న మాత్ర న
వ్వవ్వెలు కావికైన భ్రమ పుట్టక మానదటన్నఁ బ్రాకృతుం

దెవ్వఁడు నిన్నుఁ జూచి సహియించు? ననుంగరుణించి నాకు నీ
జవ్వనపున్ వినోదము లొసంగఁగదే తగదే యలంచుటల్. 107

వ. అని మదనశరదళితహృదయుండై పల్కు నజ్జనపతిని మహాభిషునిఁగా నెఱింగిన యది గావునఁ బూర్వసంఘటిత ప్రేమవశమ్మునఁ గించిత్స్మితపూర్వకంబుగా నిట్లనియె. 108

చ. తెలియఁగ నయ్యె నీవల ప్రతీపునిపుత్త్రుఁడ వత్యుదారస
త్కులుఁడవు; నిన్ను బోఁటినృపకోటిశిరోమణి నెట్టికామినీ
తిలకములైనఁ గోరుదురు; దేవసమానుఁడవైన నిన్ను నే
వలచియ యుంటి; నైన నొకపల్కు వచించెద నాలకింపుమా. 109

ఉ. ఏ నొనరించు కార్య మది యెట్టిది యే నగుఁ గాక, నీవు న
ద్దానికి నడ్డురాఁ జనదు; దాని నటుండఁగ నిమ్ము; విప్రియం
బైన విధమ్మున న్నను నొకప్పుడు గాని వచింపఁ బోల; ది
ట్లైన నినుజా వరించి సుఖ మందెదఁ గోర్కులు మిన్నుముట్టఁగన్. 110

క. ఈనియతి కెపుడు ప్రత్యా. ఖ్యానం బొనరింతు నపుడ యరిగెదఁ జుమ్మీ
భూనాధ నిను విడిచి నా. పై నేరము మోపవలదు పలికితి నిపుడే. 111

క. అని వసువులప్రార్థన నె. మ్మనమునకుం దెచ్చుకొని క్షమానాధుని పే
ర్మి నెఱిఁగి సమయం బొనరిం. చిన నందుల కొప్పె నెదురు చెప్పక యతఁడున్.

వ. గంగయు నతనియందుఁ జిరకాలలబ్ధానురాగయైన కతమ్మునఁ దన్నృపమందిరమ్ము నకుం జని సుఖభోగమ్ము లనుభవించుచుండె. 113

## భీష్మోదయము.

సీ. నవరత్న ఖచితసుందరతరా ప్రతిమాన • వైచిత్ర్యయుత సౌధవాటులందు
కోకిలాకాకలీ కేకిలీలాకల • ధ్వని కవదుద్యాన వనములందు
హంసాది సంశోభితానమానాంభోజ • షండ మండిత సరస్తతులయందు
గంభీరరంభా విజృంభమాణ నవీన • ఘనసారఘన కుంజగణములందు

గీ. శంతనునృపాలకుండు నక్కాంతయును స • దా శచీంద్రులమాడ్కిఁ బద్మాహరుల వి
ధమ్మున నఖండభోగ భాగ్యమ్ము లనుభ • వించు కాలంబు పెద్దయ్యు వించు కయ్యె.

ఉ. తా నెవఁడో ప్రపంచపువిధాన మ దెట్టిదొ యన్యు లెవ్వరో
తా నివసించు వాసమువిధం బది యెట్టిదియో యెఱుంగ క
మ్మానవనాథుఁ డక్కలికిమక్కువలోఁ బడి యున్నయంత న
మ్మానిని దాల్చె గర్భ మనమానవసుప్రవరాంశమై తగన్. 115

వ. గర్భంబు నవమాసపూర్ణంబై యొక్క బాలకుం దుద్భవించుడుఁ దత్క్షణంబ వానిం గొనిపోయి నీటం బడవైచె; ని ట్లేటేటం బొడమిన బాలుర నేడ్వుర నేటం బడ వైచిన శంతనుండు మనమ్మున నిట్లు విచారించె. 116

మ. అకటా! యేడ్వురుపుత్రులన్ గుసుమబాణాకారులన్ నిర్దయా
త్మకయై యేటికి నప్పగించె నిఁక వృద్ధిం జెందు టెట్లొక్కొ? మా
మకవంశం, బిది కూడదన్నను వనుఁగా మన్నింప కీకాంత లే
చి కడు న్వేగమ పోవు; నిట్లగునె దుశ్శీలాంగనాసంగముల్! 117

క. అష్టమగర్భం బిది మద, దృష్టముకతనన్ లభించె నిపుడైనను నీ
దుష్టాత్మురా లొనర్చెడి, కష్టపుఁబని నాకు వాఁగఁగాఁ జెల్లదొకో? 118

వ. కావున నేవిధంబుననైన వంశరక్షణంబు కర్జం బని నిశ్చయించి యున్నంత, 119

క. అంగనకై మునివరు గో, వుం గొనిపోయినవసుండు పుత్రుండై పు
ట్టం గని గంగయు వైశమ, గంగం గలుపంగ నెంచఁగా నృపతి వెసన్, 120

వ. అడ్డమ్ము నొచ్చి వినయమ్మున నబ్బాలెంతరాలి కిట్లనియె. 121

ఉ. దాసుఁడనైతి, నా పలుకు దప్పుఁజేయక; కన్నపుత్రు వ్య
త్యాసినివై వధింపు టిది న్యాయమె? జాలి యొకింత లేదె? యే
దోసము నీకొనర్పనిసుతుఁగా వధియించెడి గొడ్డురాల! నీ
బాసలకుఁగా మదిం దలఁకి వంశము నాశ మొనర్ప నెంతువే? 122

క. అకటా! యేడ్గురఁ జంపితి, విఁకనైనఁగా జాలిలేదె? యేకాకిరొ! యీ
యొకనిం బ్రతికింపుము తా, నకచరణయుగంబుమీఁదఁ బడి మ్రొక్కెడుదున్. 123

క. సుతులం బొరయనియెడ స, ద్గతి లే దని పెద్ద లంద్రు గావున వంశ
స్థితికై యీసుతు నొక్కని, బ్రతికించిన నీవ్రతంబు భగ్నంబగునే? 124

క. అని బహువిధములఁ బ్రార్థిం, చిన వినకా వనిత చిన్ని శిశువుం జంపం
గొనిపోవుచుండ నిట్లనె, జనపతియుఁగా గనుల వహ్ని జలజల రాలఁగా. 125

గీ. ఓసి పాపాత్మురాల ! నాశాసనం బు, తిక్రమించియు నరకభీతియును లేక
కన్నకొడుకుల గంగలోఁ గలుప నగునె?, యకట! వినఁ గనినట్టి దుష్టాత్ము డెవఁడొ.

వ. ఉందువుగాక పోదువుగాక యీ శిశువుం జంప నీ నని యడ్డమ్ము సొచ్చెడిశంతనునుం
గాంచి యక్కోమలి యిట్లనియె. 127

చ. సమయము నెంచవైతి, విఁక సాగదు నీకును నాకుఁ గూట; ము
త్తముఁడవు నీవు; విన్విడు టధర్మము కాని, వచింతుఁ దన్నిమి
త్తము; ననునొక్కకాంతఁగ నెదఁగాగణియింపకు గంగఁగా నెఱుం
గుము సురకార్యముగా నలుపఁ గోరి వినుగా వరియించితిం జుమీ. 128

క. వసువులు మునిశాపమ్మున, వసుమతిఁ బుట్టుటకు నన్నుఁ బ్రార్థించిన నేఁ
బ్రసు వైతి వారలకు నీ, కు సతినయి నృపాల ! దెలిసికొను మిదియెల్లన్. 129

క. చిరకాలము మర్త్యులమై, ధరణిన్ వసియింప లేము తత్క్షణమ మృతిం
గరుణింపు మన్న నే నీ, దురితం బొడిఁగట్టి నీటఁ ద్రోచితి సుతులన్. 130

క. ఈతం డష్టమవసుకళ, చేతగా జనియించె నధిప ! చిరకాలము నీ
చేతము గుఁగించెడి ప్ర, ఖ్యాతిం జెందం గలాఁడు కాఁగలఁడు సుమీ ! 131

గీ. ఈడువచ్చెడి దనుక నీఁడు నా న, మీపమందె వసించు నామీఁద నీకు
నప్పఁజెప్పెద దీనికి నొప్పికొనుము, తల్లి లేకున్న బ్రతుకు వృథా నృపాల ! 132

క. అని నుడివి గంగయును దన, తనయుం గొని చనినమీఁద ధరణీపతి య
వ్వనితావిరహమ్మునకుం, దనయ విరహమునకుఁ జాలఁ దల్లడపడుచున్. 133

వ. ఒకభంగి రాజ్యం బొనర్చుచుఁ గొండొకకాలమ్మున వేఁటఁ జని మృగమ్ముల
హింసించుచు విరహభరమ్మునఁ జిక్కినయదియుం బోలె నున్నగంగానదింగాంచి.

శా. ఆ కల్లోలినిమధ్యరంగమున దీవ్యద్బాణబాణాసన
శ్రీశైపేయ విరంకుశప్రతిభమైఁ గ్రీడించుచుగా జావని
ద్యాకౌశల్యముఁ జూపు నొక్కరువి గంధర్వున్ విడంబించు ది
వ్యాకారంపు బెడంగు వానిఁగనిశా నాశ్చర్యపర్యాప్తుఁడై. 135

క. తన తనయుండని యనుకొనుఁ;, దన తనయుఁడు గాఁడటంచుఁ దలఁచున్ మరలన్
దనయాసక్తిం గను శం, తనుఁ డబ్బాలకునిఁ గాంచి తద్దయుఁ బేర్మిన్. 136

క. కరలాఘవమును దుష్కర, శరలాఘవమును నమానుషత్వముఁ దెలుపగా
నరపతి దరి కరిగి మహా, దర ముట్టిపడంగ నిట్లతనితోఁ బలికెగా. 137

ఆ.వె. తల్లి యెవతె నీకుఁ? దండ్రి యెవ్వఁడు? నీదు, నామధేయ మెద్ది? నగర మెద్ది?
చెప్పు మనుచుఁ బల్కి చెవినిబెట్టక తన, యంత నాడుచుండె నతఁడు పేర్మి. 138

వ. అంతఁ గొంత తడవు క్రీడించి యాతం డంతర్హితుం డగుడు జనపతి చింతాకు
లుండై గంగం గొనియాడి తొంటిరూపునఁ బొడసూపిన నాపె కిట్లనియె. 139

సీ. చిన్నారిపొన్నారి చిఱుతప్రాయమువాఁడు • ముద్దు లొల్కెడినవ్వు మొగమువాఁడు
కళలసీనెడి గొప్ప కనుల నొప్పెడి వాఁడు • కరికలభాకార గరిమవాఁడు
ఆజానులంబిబాహాసౌష్ఠవము వాఁడు • హరి నీనడించు మధ్యమ్ము వాఁడు
శరశరాసనవిభాసురకరమ్ములవాఁడు • దంబు చెన్నారు వక్షంబువాఁడు

గీ. నాకుఁ బొడకట్టి యంతట నన్ను మొఱఁగి
చనియె నొకముద్దులాఁడు వాఁడనఁగ నెవఁడు
తెలిపి పైశము యవ్వానిఁ దెచ్చిచూపి
గారవింపుము నాపుడు గంగ నగుచు. 140

క. ఎనిమిదవ వసుని యంశం, బునఁబుట్టినవాఁడు నీకుఁ బుత్రుఁడు గాంగే
యునిగా వెలుఁగుమువానిన్, గనఁజేసెదఁ గనుము కనులకఱ వెడలంగన్. 141

వ. అని యద్బాలకుం దెచ్చి చూపి యితండు సకలవేదమ్ములను వసిష్ఠునియొద్దఁ
బఠించె. వేమేల నీబాలుండు పరశురామునికి గూడ శిష్యుండును సర్వథా యయ్యే
నఘునకుఁ దుల్యుండును భవత్కులోద్ధారకుండును నని చెప్పి యంతర్ధానంబుఁ గనుడు
శంతనుండు పుత్రుం గౌఁగిలించుకొని రథముపై నిడికొని రాజధానికిం జని మంత్రి
పురోహితానుమతంబుగ సుముహూర్తమ్మున యౌవరాజ్యాభిషిక్తుం జేసి గంగా
వియోగజంబగు దుఃఖమ్ము మఱచి సుఖం బుండె. 142

క. ఇయ్యది వసువులచరితం, బియ్యది శుభదంబు; దీని నెంతయు నాపై
నెయ్యమ్మున ద్వైపాయనుఁ, డయ్యరణీజాతోడఁ గలిపి యానతియిచ్చెన్. 143

వ. అనిన సూతుం గాంచి ముని లవ్వలికథ చెప్పు మనవుడు నతం డిట్లని చెప్పం
దొడంగె.

గీ. యౌవరాజ్యమ్ము గాంగేయునందు నిలిపి, శరవణోద్భవుచే మహేశ్వరుఁడువోలె
సర్వసుఖములు కైకొంచు శంతనుండు, నాలుగేఁడు లానందాబ్ధి నోలలాడె. 145

వ. పదఁపడి యొకనాఁడు మృగయాసక్తుండై నిరంతరకుంజపుంజ మండితంబగు
కాళిందీతటమ్మునకుఁ జని యచ్చట, 146

సీ. ఏన్గుగున్నలవంటి యెనకమ్ము గల్గుకా • రడవిపందుల బీర మడఁచియడఁచి
భూధరమ్ములపాటి పొడవుగల్గిన యేనుఁ • గుల మొత్తముల నేలఁగూల్చికూల్చి
శమవాహనమునైన నమయింపఁగాఁ జాలు • పులులగుంపులతోడఁ బోరిపోరి
విక్రమాటోపదుర్వేధమ్ము లగు సింగ • ముల గములెల్లను గలఁచికలఁచి

గీ. జవముమెయి గాలితోఁ బోలఁ జాలులేడి • కదుపులన్ బ్రదరమ్ములఁ జదిపిచదిపి
ప్రళయకాలకిరాతుని పగిది జంతు • మండలమ్మును వేటాఁడి మగిడి యతఁడు. 147

వ. ఒక్కశీతలతరుచ్ఛాయాతలమ్మున విషణ్ణుండై యున్న యెడ, 148

క. ఆనందోద్దీపకమై, నానాపరిమళవిశేషనవసౌరభమై
జానొప్పఁజాలు నొకగం, ధానిల మేతెంచి నరవరాగ్రణి నెనసెన్. 149

వ. అతండును దత్పరిమళమ్మున కచ్చెరువంది, 150

మ. మృగనాభిం బురణించి, యబ్జముల పేర్మిం గ్రిందుగాఁజేసి, సం
పెఁగలం డీకొని, కేతకీసుమములన్ బిట్టేచి, కుందమ్ములం
దిగు లొందించియు, మాలతీసుమములం దీంద్రించి, నిర్హేతుకం
బుగ నేతెంచు పరిమళం బిది సుఖాంభోరాశిలో ముంచెడిన్. 151

క. దీనికిఁ గారణ మేమొకొ, కానఁగవలెనంచు వేడ్క గడలుకొనంగా
నానాపుష్పాకీర్ణం, బై నెగడు వనాంతమెల్లనరయుచుఁ జనుచున్. 152

చ. అమరిన వేడుకం గనియె నబ్జముఖిన్ నవసౌరభోజ్జ్వల
ద్ఘుమఘుమ విగ్రహన్ గమలకుట్మలచారుపయోధరద్వయన్
యమితశిరోజభార మలినాంబర నాతివిభూషణాంచితం
దములపుటాకువంటి యొక తామరసప్రతిమానలోచనన్. 153

క. ఆకలికి నాతలోదరి, నాకలకంఠీలలామ నాకనకాంగిన్
భూకాంతుం డిటు గన్గొని, యీకన్నియ మేనితావియే యిది యనుచున్. 154

ఉ. దాని పిసాళి గుబ్బలును దాని యొయారపుఁ జూపుఁదీపులున్
దాని వళిత్రయీగరిమ దాని శరీరపరీమళంబు న
ద్దాని వయోవిలాసమును దాని పదక్రమసౌష్ఠవంబునున్
దేవికి నగ్గలం బనుచుఁ దీరనికూరిమిగారవంబునన్. 155

## శంతనుండు సత్యవతిం బెండ్లియాడుట.

వ. డగ్గఱి సిగ్గరితనమ్మునన్ మ్రొగ్గు నగ్గజగమనం బునఃపునరాదరోదయమ్మునం
గనుఁగొనుచుఁ దన మనమ్మున, 156

క. ఈ మగువ దేవతాకాంత, తామౌళియొ! కిన్నరాంగనామణియొ! ఫణి
స్త్రీమూర్ధన్యయొ! కాక, భూమిన్ గలపొలఁతి కిట్టి పొలుపుంగలదే? 157

క. అని తలపోయుచు నా శం, తనుజనపతి తొల్లి దైవతధుని దనువరిం
చినభంగిఁ దలఁచుకొని య, త్తనుమధ్యన్ బేర్మిఁజూచి తగనిట్లనియెన్. 158

ఉ. ఎవ్వతె వీవు? నీజనకుఁడెవ్వఁడు? జవ్వని! యవ్వనమ్మునం
దెవ్వనికై చరింతు? కులమెయ్యది? నీ విటు లొంటిపాటునన్
మవ్వపుమేనికాంతి కనుమాయఁ జరింపఁగ నేమి వచ్చె? నీ
కెవ్వఁడు భర్త? దెల్పఁగదవే? మదవేల్లితదంతిగామినీ. 159

క. నీసొగసు నీవిలాసము, నీ సౌరభ్యంబుఁ జూచి నేనెంతయు నీ
కాసించి మదనభూత, గ్రాసీభూతుండ నైతిఁ గరుణింపఁగదే. 160

వ. అన నక్కాంత చిఱునగవలర నిట్లనియె. 161

ఉ. కన్నెమగాని వేఱొక ప్రకారము దానమగాను; దాశరా
జన్నయభిఖ్యగన్న సుగుణాత్ముఁడు నాజనకుండు; నన్ను "నా
వ న్నడిపింపుచుండు మిదె వచ్చెద" నంచు వచించి డించి పో
యె న్నరనాథ! యింటి; కదియే యతఁడుండెడితావు నావుడున్, 162

చ. నరపతియిట్లు పల్కె నరనాథుఁడ నేఁ గురువంశజాతుఁడన్
దరుణి ప్రతిక్షణప్రబలితం బగుజవ్వనమున్ వృథాగతిం
బొరయఁగఁ జేయ నేల? నను బొందు మసంశయరీతిఁబత్నివై
పరమసుఖమ్ములం గొనుము పత్నియు గిత్నియు వేఱులేదిఁకన్. 163

ఉ. ఓసరసీరుహాక్షి విను మొక్కలతాంగి ననున్ వరించి పే
రాసలు గొల్పిపోయె; నది యాదిగ నేను మఱొక్కలేమపై
నాస నిగుడ్పనైతి; నిను నారసినంతన బుద్ధి పుట్టె; నీ
దాసుఁడనైతి; నావిధురతం బెడఁ బాపుట కిచ్చగింపుమా! 164

వ. అని సరసంబుగాఁ బల్కి నజ్జననాయకునియందు బద్ధానురాగయయి యత్తొయ్యలి
లజ్జించుచు నిట్లనియె. 165

క. వినుమేఁచెడి యమ్మదనుఁడు, ననుమాత్రము విడిచిపెట్టునా? యెందేనిన్
వినుమొక్క మాట ధర్మ, మ్మునకుం గట్టువడవలదె పూవుంబోఁడుల్. 166

ఉ. పెద్ద లెఱింగి కన్నెలకుఁ బెండిలిసేయుట పాడిగాని తా
గద్దరియై తనంతన యొకానొక నాయకుఁబెట్టవట్టినన్
బెద్దఱికంబు వాయదొకొ! పెద్దలకుం దలవంపు నింపదో!
హద్దు నతిక్రమించుట కులాంగనకు న్విహితప్రచారమే? 167

ఉ. ఈపరతంత్రురాలి నిటు లీవు వృథా మొగమోటవెట్టి సం
తాపము నొందఁజేయకుము. ధర్మముమర్మ మెఱింగి యించుకే
నోపిక చేసి మజ్జనకునొద్దకు నేగి తదాజ్ఞఁ బూని న
న్నాపయి స్వీకరింపు; మతఁ డన్నిఁట ధీవరుఁ డింత యొప్పదే. 168

గీ. ఇట్టు లొప్పఁగఁ జెప్పనయ్యింతి కెదురు, మాటచెప్పఁగలేమి, నమ్మనుజ విభుఁడు
దాశగృహమునకేగెఁ దత్కన్య నతని, యనుమతింగొని వరియింప నాత్మనెంచి,

ఆ.వె. వచ్చుచున్న నృపతివరుని దౌదవ్వుల, నరసి ధీవరుఁడు గృతాంజలి యయి
యెదురువచ్చి వినయ మెసఁగంగ నిట్లనె, గౌరవప్రపత్తి గడలుకొనఁగ. 170

వ. ఏనుభవద్దాసుండ నిచ్చోటికి మీరు విచ్చేసిన కతన ధన్యుండ నైతి నావలనికార్యం
బానతిమ్మనుడు నతం డిట్లనియె. 171

క. నీ కనుమతి యగునేనిన్, గైకొనియెద ధర్మపత్నిగా నీతనుజన్
రాకాచంద్రనిభానన, నాకోరిక చంద మిది యనన్ మనమలరన్. 172

చ. అనఘుడు బల్కె నాతఁ; డధిపా! కడుభాగ్యముగాదె నాతనూ
జను వరియించి నాకులము.శస్తముగా నొనరింపు మెన్న; నీ
కు నొసఁగు వాఁడ, నైన నొకకోరికఁ గోరెద; మత్కుమారికా
తనయుఁడు నీ యనంతరము ధారుణికిం బతి గావలెం జుమీ! 173

వ. అనుదాశునివచనంబులు విని శంతనుండు గాంగేయుం దలంచుకొని నిరుత్తరుండై
చింతాక్రాంతుండై యచ్చోటు విడిచి తన గృహమ్మున కేతెంచి దాశకన్యాగతమన
స్కుం డగుచు నశనాదికంబు వర్జించి యున్నంత, 174

క. గాంగేయుఁ డెఱిఁగి దనతం, డ్రింగని యిట్లనియె, బేలరీతిని నిటు గుం
దం గతమెయ్యదియొకొ! త, త్సంగతి యొక్కింతనాకు దయఁ దెల్పఁగదే. 175

గీ. దుర్జయుండగు శత్రుండు దొడరె నొక్కొ. నలుపఁగా రానికార్యంబు గలిగెనొక్కొ
యేను గలుగఁగఁ గొదవ నీకెట్లు గల్గు, నేల చింతింప ? వచియింపవే మహాత్మ !

క. జనకుని చింతం దీర్పని, తనయునిఁ దనయుఁడని చెప్పఁదగ దండ్రుబుధుల్
మనమున డాఁపక చెపుమా, యనఘా ! నీకున్న కోర్కెయది నేఁ దీర్తున్. 177

సీ. తండ్రియాజ్ఞనుగదా ! దశరథాత్మజుఁడు భా • ర్యానుజోపేతుఁడై యటవికరిగె
నలహరిశ్చంద్రభూపాత్మజుండగు రోహి • తాస్యుండు జనకాజ్ఞ నమ్ముడుపడె
యజ్ఞపశువుగాఁగ నంగీకరించె శు • నశ్శేపుఁడు దనజనకునియాజ్ఞఁ
బరశురాముఁడు తల్లిశిరము దొల్లఁగనేసె • జనకాజ్ఞ దాఁటరాదనియకాదె

ఆ. వె. చేయఁదగని చెట్టసేఁతయైనను బూర్వ • లాచరించు రెండు వరయఁ దండ్రి
యాజ్ఞకన్న ముఖ్యమైనది వేరొండు • గాదటంచుఁ దెల్పఁగాదె యధిప ! 178

క. తాను సమర్థుండయ్యును, బూనికమై జనకుకోర్కెఁ బూరింపని య
వ్వానిది జన్మమె ? వాఁడును, మానిసియే ? పశువుగాక మానవనాథా ! 179

ఆ. వె. తండ్రి కోర్కెఁదీర్చి తనియింపఁగాలేని, పుత్త్రకుండు జగతిఁ బుట్టనేమి ?
గిట్టనేమిఫలము ! గిట్టవా ! పుట్టవా !, స్వేదజములు మఱియు భేదమేమి ? 180

క. అని పల్కుతనయుఁ గని శం, తనుఁ డిట్లను లజ్జ మనము దరికొనఁ దనయా !
గనుఁగొనుము చింతగాదే ?, తనయుండొక్కరుఁడ యైనఁ దండ్రికిఁదలఁపఁగా. 181

క. ఒకకొడుకు కొడుకునింగాఁ, దొకకన్నును గన్నుఁగాదయో ! పుత్రా ! దై
వికగతి వాఁడందినఁ దం, డ్రికి వేఱొండుగతి గల్గనేర్చునె యెందున్ ? 182

వ. ఇట్లు చింతాక్రాంతుండై యున్న తండ్రి యుదంతంబు పొంతంబుగాఁ దెలియంగోరి యమాత్యులం బనిచిన వా రున్నయునికి నెఱిఁగి భీష్మునకుం జెప్పిన నతండు తద మాత్యులతోడం గలసి దాశరాజసదనమ్మునకుం జని యతనితో నిట్లనియె. 183

ఆ.వె. ఓయి ! దాశరాజ ! యొసఁగు నీపుత్రి మ, జ్జనకుఁడైన శంతనునరపతికి
మాతయైన నీదుకూఁతున కే నెల్ల, యెడల భక్తుఁడనని యెఱుఁగు మనఘ ! 184

క. అన దాశుం డిట్లను నో, యనఘా ! నీ కిచ్చెదను మదాత్మజ నతిగాఁ
గొను మీవుండఁగ నేత, త్తనయుం డీనేల నేల ధర్మమె ? చెపుమా ! 185

క. అనుదాశరాజునకు శం, తనుతనయుం డిట్లు పల్కెఁ దగ నీసుత మా
తను జేయుము నా కేత, త్తనయుఁడ రాజ్యమ్ము నేలఁదగుఁగా కనఘా ! 186

వ. అమడు మహాత్మా! నీవు రాజ్యం బొల్లమియ నిశ్చయంబైనను నీతనయుండు మద్దౌహిత్రు రాజ్యమ్మునకు సమ్మతించునే యన భీష్ముండతని కిట్లనియె. 187

గీ. ఏను దారపరిగ్రహం బిచ్చగింప, నిట్టి నా కేల పుత్రుఁడుపుట్టుఁ జెపుమ
నావలని శంక మనమునఁ బోవఁ ద్రోచి, తల్లిగాఁజేయు బొవ్వ నీతనయ నాకు.

వ. అనుగాంగేయుపల్కులకు సమ్మతించి దాశుండు శంతనునకు సత్యవతి నొసంగి పరిణయం బొనరించె. 189

ఆ.వె. సత్యవతిని ధర్మసతిగాఁగఁ గైకొని, సంతసించెఁ గాని శంతనుండు
పెండ్లి గాకమున్నె బిడ్డఁడు వ్యాసుండు, కలిగె ననెడిమాటఁ దెలియఁ డయ్యె. 190

వ. పిదప నతండు కొండొక కాలమ్మునకు నాసతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులను తనయులంగాంచె. వా రిరువురును గాలవశమ్మున మృతులగుడు విచిత్రవీర్యపత్ని యగు నంబిక యత్తయాజ్ఞ వ్యాసుం గలయునెడ నేత్రనిమీలనం బొనర్చుకతనఁ బుట్టంధుండగు ధృతరాష్ట్రుం డుదయించి రాజ్యార్హుండు గాఁడయ్యెఁ బిదప రెండవది యగు నంబాలికం బనుప నాపె వెలవెలఁ బాఱుకతనఁ బాండురోగగ్రస్తుండగు పాండురా జుదయించె నతండును రాజ్యార్హుండు గామి సత్యవతి పెద్దకోడలిఁ బిలిచి మరల వ్యాసుంగవయు మనుడు నాపె యొల్లక కామకలావేదినియగు తన దాసిం బనిచిన దానికి ధర్మాంశమ్మున విదురుం డుద్భవించె. 191

క. ధృతరాష్ట్రుం డంధుండగు, కతనన్ విదురుండు దాసికొడుకగుటను స
మ్మతిగాక సత్యవతియూ, నతి భీష్ముం డిడియెఁ బాండునకు రాజ్యంబుల్. 192

వ. అతండు విదురుండు మంత్రిగా రాజ్యం బేలుచుండె. 193

క. అలధృతరాష్ట్రుండును సౌ, బలియగు గాంధారి యొకతె వైశ్య యొకతె భా
ర్యలుగా సుతశతమును సౌ, బలియందున్, వైశ్యయందుఁ బడసె నొకరునిన్.

ఆ. వె. శౌరపేని కుంతి సదమల మద్రభూ, పాలపుత్రి మాద్రి భార్యలుగను
బాండుభూవిభుం డఖండసౌఖ్యంబుధి, నోలలాడి రాజ్య మేలుచుండె. 195

క. పుట్టింట నున్నయప్పుడ, పట్టి నొకనిఁ గనియెఁ గుంతి పాండునృపతి యా
గుట్టెఱుఁగమి నావడఁతిం, గట్టికొనియె నేమి చెప్పగల మునులారా! 196

క. అన విని మును లిట్లని రో, యనఘా! కన్నెతికమునన యక్కుంతికి నం
దనుఁ డెట్లుగల్గెనో? పాం, డునృపతి దానెట్లుకొనియెనో? తెల్పఁగదే. 197

వ. అవిన సూతుం డిట్లనుఁ దొల్లి శూరసేనాత్మజయగు కుంతినిఁ గుంతిభోజుండను

వాఁడు సంతానంబు లేమిం జేసి పుత్రింగాఁ గైకొని పెంచికొనుచు నొక్కెడ దుర్వాసుండు తనగృహంబేగుడు నతనికిఁ బరిచర్యార్థంబుగాఁ గూఁతు నియోగించె.

క. కుంతియు దుర్వాసున క, త్యంతము భక్తియును బేర్మి దనరఁగ సేవల్
గొంతవడిఁ జేయ నాతం, డెంతయు సంతసము లోన నిమమడి గాఁగన్. 199

ఆ. వె. కన్నె! వేల్పునెవనిఁ గామించి మనమున, దలఁచి కొనెదో వాఁడు తత్క్షణంబ
వచ్చి నీదుకోర్కె ఫలియింపగాఁజేయు. మం దటంచు నొక్కమంత్ర మొసఁగె.

క. ఇటులొసఁగి యతఁడు సనె న, క్కుటిలాలక యొక్కనాఁడు కుతుకమ్మున న
జ్జటిలుఁ దొసంగిన మంత్రపుఁ, బటిమం దిలకింప నెంచి పఠియించి వెసన్. 201

వ. ఉదయించుచున్న సూర్యునిం బిలుచుటయు నతండు మనుష్యరూపమ్మునఁ జను దెంచె; నంతఁ గుంతియు వేపమానయగుచు రజోదోషసంగతయై యతనిం గాంచి కృతాంజలియై యిట్లనియె. 202

క. దేవా! తావకదర్శన, మీవగ నొకమా తొనర్ప నే నెంచి తగన్
భావించి వేఁడితిని నా, భావము ఫలియించె నీవు వచ్చినకతనన్. 203

వ. కావున మదపచారమ్ము కతన దేవరకుఁగల్గిన పరిశ్రమంబుపైఁచి కోపింపక భవ దీయమండలమ్మునకు దయసేయుమని ప్రార్థింపుడు నహర్పతి మదవిహ్వలుండై యత్తలోదరి కిట్లనియె. 204

క. పిలిచితివి వచ్చియుంటిని, గలయకయే నన్నుఁబంపఁగాఁదగునే? యో
కలికీ యలరుల ములుకుల, కులుకంగాఁ జేయ నీకు నొప్పిద మగునే? 205

ఆ.వె. ఎవతెకైనఁగాని యేఁ దటస్థింతునే?, మంత్రపాటవమున మగువ! నీకుఁ
జిక్కినాఁడ నన్నుఁ జిక్కుల వెట్టక, కలయు మబల! పేర్మి దొలకరింప. 206

వ. అనవుడుఁ గుంతి సిగ్గున గ్రుగ్గుచు నిట్లను, 207

గీ. కన్నియను గాని పేఁటొండు గాదు; నిజము
తెలియవే? సర్వసాక్షివి దేవదేవ!
నిన్ను నేఁ గోరుటయుఁ దప్పె; నన్ను నీవు
గలయ నుంకించుటయుఁ దప్పె; కను మొకింత! 208

చ. అనవుడు సూర్యుఁ డిట్టులను; నంగన! నిన్ గవఁగూడ కేను బో
యినయెడ నన్ను దేవత లిహీ! యని గేలి యొనర్పరోటు! కా

దని గికురింతువేని నిను నమ్మని విద్దళినిన్ శపింతు; నే
మని యిటువంటిమంత్ర మబలా! కులబాలిక కిచ్చెఁ జూచెదన్. 209

వ. నన్ను మన్నింతువేని మత్సంపర్కమ్మున నీకన్యాత్వంబు వాసి చెడకుండఁ గాపాడు భారము నాయదియ. 210

క. ఒరు లెవ్వ రెఱుఁగకుండఁగ, వర మొసఁగెదఁ గోర్కెఁదీర్చి వగలాఁడిరో! నన్
బురణించు ముద్దులొలుకు కొ, మరునిం గనరాదె? మరునిమాఱగువానిన్. 211

క. అని పేర్మి గడలుకొనఁ బ, ల్కిన నచ్చెలి మెత్తవడియెఁ గ్రీడారతులం
దనిపి వర మొసఁగి రవియును, జనియెం దివమునకు మనము సంతస మెనయన్.

## కర్ణయుధిష్ఠిరాదుల జననము.

వ. పిమ్మట నక్కుంతి చూలుదాల్చి దాదికిందక్కఁ దక్కఁగలవారికిం దెలియనీక యంతఃపురమ్మున నుండునెడ సహజకర్ణకుండలకవచాభిరాముండును నర్కప్రతిమానుండును సర్వలక్షణోపేతుండునునగు కర్ణుం డుద్భవించిన లజ్జితాననయయి చింతించు నక్కుంతికి ధాత్రేయి యిట్లనియె. 213

* క. కడచినపనికిం జింతగా, గడలుకొలుపనేల? భావికార్యమ్మునకుం
బడఁతిరో! యాలోచింతము, తడఁబా టేలయనఁ గుంతి తత్తఱపడుచుఁగా. 214

వ. ధాత్రేయికావీతం బగు మందసమ్మునందు, 215

క. బాలునిడి కన్నుఁగొనలం, గాలువలై నీరు పాఱఁగాఁ గడుఁ బేర్మిన్
బాలిండ్లు స్రవింపఁగఁ జిం, తాలోలమనస్క యగుచు నడలుచుఁ బలికెన్. 216

ఆ. వె. ఏమి సేయుదాన నే మాచరించెడి, దాన నేమి నలుపుదాన మంద
భాగ్య నైననాకు బహులక్షణయుతుండ, వీవు దక్కవాఁడవే కుమార! 217

మ. తనయా! యేజగదంబ లోకము లనంతంబుల్ కృపం బ్రోచి వృ
ద్ధిని బొందించు మహానుభావ నిమఁ బ్రీతిం గాచు నాశక్తి; నీ
కనయం బాఁకలి దీర్చు సారెకును స్తన్యం బిచ్చి యమ్మాత; నే
జననిం గాను, గుమార! నీకఖిలమున్ సర్వాత్మ యద్దేవియే. 218

* ఈ విషయమును ఈ స్కంధమునందలి 'మఱికొన్ని' విషయములను విపులముగాఁ జూచువారు మా పాండవజననమునఁ జూడఁదగు.

గీ. మరల నీమొగ మింక నొక్కమాఱుఁ గాంచు, భాగ్య మబ్బని నాకిట్టి పాపజాతి
కకట ! స్వైరిణిఁబోలె ని న్నడవిఁ ద్రోచు, నంతగతి వచ్చె నేమని యందుఁబుత్ర!

చ. కవియును విన్నువంటి తగుకానుపు, నెన్నఁడుఁగాని సంతతిన్
గనని యనాథవోలెఁ, గొడుకా ! యుడుకారెడివంత నెంతయున్
గనవలసెన్; బురాభవమునన్ సుతసంపద పెట్టిపుట్టకుం
డిన ననువంటి దాని కిడునే ? జగదంబ సుతున్ భవాదృశున్. 220

వ. పిదప దాది యామె నోదార్చి మంజూషం గొని రహస్య ప్రకారమ్మునఁ జనునెడ వంధ్యయగు రాధయను సూతగృహిణి తన కిమ్మని యడుగ నద్దాని కొసంగె. రాధయు నతనిం గన్నకుమారుంబలెఁ బోషించుచుండె. 221

క. అమీఁదఁ బాండునరపతి, యామగువం గొనియెఁ దా స్వయంవరమున న
త్తామరసాప్తవరమ్మున, నాముదితయుఁ గన్నెవన్నె నతనికిఁ దోఁచెన్. 222

క. ఒకనాఁ డాపాండునృపా, లకుఁ డడవిన్ వేఁట లాడ లాలసుఁడై యే
గి కడుం దుష్టమృగములఁ జె, నకి చెనకి యనంతరమ్మునన్ మృగరీతిన్. 223

క. క్రీడించెడి జడదారుల, జోడుం గని యందు మగని సూటియెలర్పన్
గాడంగనేయ శరసం, తాడితుఁడై కుపితుఁ డగుచుఁ దాపసి నృపునిన్. 224

క. కనుఁగొని యగ్నికణంబులు, కనుఁగొనలన్ రాలఁ బలికెఁ గటకట ! పాపా
త్ముని నిన్నేమనఁ గల ! ని, ష్పని యే మని చేసి తీ వపాస్తనయుఁడవై. 225

క. క్రీడించు నన్ను శరసం, తాడితుఁ గాఁ జేసి తీ యధర్మమ విన్నుం
బీడించు మృత్యువై విరి, బోడుల కూటములవంకఁ బోయితివేనిన్. 226

క. అని శపియించిన నాపాం, డునృపాలుండును మనం బమానవిషాదం
బును జెంద నయ్యరణ్యం, బున రాజ్యము వీడి వాసమును బొనరించెన్. 227

ఆ. వె. అంత నతనిభార్య లైన కుంతియు మాద్రి, యును బతివ్రతాత్వ మనుగమించి
చని రరణ్యమునకు; నతులకుఁ బతిసేవ, కన్నభాగ్య మొండు గలదె తలఁప ! 228

గీ. గంగ యొద్దునఁ బాండుఁ డఖండతపముఁ, జేయుచు మునీశ్వరులసేవఁ జేసి పుణ్య
కథలు వించును గాలమ్ము గడపుచుండె, రాజ్యసంగతి మఱచి విరాగి యగుచు. 229

వ. ఒక్కనాఁ డతం "డపుత్రస్య గతి ర్నాస్తి" యను ధర్మశాస్త్రవచనంబు విని తనకుం గతి యేమి యని వారి నడుగుడు మును లిట్లనిరి. రాజా ! యౌరసుండును దౌహిత్రుండును క్షేత్రజుండును గోళకుండును గుండుండును సహోఢుండును గాపి

మండును గ్రీతుండును వనప్రాప్తుండును దత్తుండును నా దశవిధపుత్రు లుత్తరోత్తరంబు లొచ్చుగా గణియింపం బడుదు రిట్టి పుత్రులలో నొక్కండేనిఁ గల్గినఁ బున్నామనరక ప్రాప్తి లే దని చెప్పిన విని యొక్కెడఁ గుంతి కిట్లనియె. 230

శా. సౌదాసుండు వశిష్ఠమౌనివలనన్ సంతానముం గాంచి యా
మోదం బందె నటంచు వింటిఁ దరుణీ! మోమోటమిం దక్కి దా
యాదప్రాప్తికి నొక్కమౌనివరు నీ వారాధితుంజేయఁగా
రాదే? యన్వయ ముద్ధరించుట యధర్మంబౌనె నాయూనతిన్. 231

క. పతియానతిఁగొని సతి పర, వతియై యక్కతన సుతులఁబడసియు దోషా
న్వితగా దొక్కింతయు నని, శ్రుతి స్మృతివిదుల్ వచించు సూక్తులు వినవే. 232

వ. అనవుడుఁ గుంతి మున్ను మంత్రంబొక్కండు నేర్చియుంటి నయ్యది పఠించి యే వేల్పుంగోరిన నతం డేతేరకతీరదు. తద్బలమ్మున దేవతల నారాధించి తనయులం బడయుదాన. 233

క. అని పతియానతి ధర్ముని, మనమునఁ దలపోయ నతఁడు మంత్రబలమునం
జనుదెంచె నతనివొత్తున, జనియించెజా ధర్మరా జనమతేజుండై. 234

క. ఒకయేట వాయుదేవు ను, నొకయేటన్ దేవనాథు నొగి మంత్రబలం
బు కతన రప్పించి తగన్, వృకోదరార్జునుల నప్రవిదులం గనియెజా. 235

గీ. ఇట్లు గుంతికి సంతాన మెసకమెసఁగఁ, గని సహింపక మాద్రి భర్తను గనుఁగొని
తనయు నొక్కని దయసేయఁ దగదె? నాక, టంచుఁ బ్రార్థింపఁ గుంతికినాజ్ఞయిడియె.

క. పతియానతిచే మాద్రీ, సతికిజా మంత్రం బొసంగెఁ జయ్యనఁ గుంతీ
సతి తన్మంత్రంబున నా, సతి నాసత్యులను బొంది సంతస మెసఁగన్. 237

గీ. నకుల సహదేవు లనెడి తనయులఁ గాంచె, నిట్లు పాండున కాత్మజులేవు రుదయ
మంది రవ్వారు పాండవులనఁగఁ బరఁగి, రంత నొకనాఁడుపాండుభూకాంతుఁడెలమి.

చ. వల దని మాటిమాటికి నివారితుఁ డయ్యును గామబాణసం
చలితమనస్కుఁడై తపసిశాపము నెంచక మద్రరాట్సుతం
గలసి గతాసుఁడై చనియెఁ; గాముకు లాత్మతనూవినష్టికిన్
దలఁక రటన్న, వేతొక విధంబగు హానికి జంక నేర్తురే! 239

గీ. చెట్టువడినంతఁ జెట్టును జుట్టుకొన్న, తీవయును బోలె నపుడు మాద్రీలతాంగి
యానృపాలునిపైఁ బడి యడల సాగెఁ, గాంతలకు నింతకన్న దుఃఖంబు కలదె!

గీ. కుంతియు వగం బొగల సాగెఁ; గొమరులెల్లఁ
గరముఁగుందిరి; మునివరు లరుగుదెంచి
వారి వారించి పాండుభూపతికి నుత్త
రక్రియలు దీర్చిరంత విధిక్రమమున. 241

వ. మాద్రియుఁ దనకొడుకులం గొంతి కప్పగించి సహగమనంబొనర్చెఁ బిమ్మట మునులు సంతానసహితంబుగాఁ గుంతి నూరార్చి దంతిపురంబున కనిపిరి. ధృతరాష్ట్ర విదుర గాంగేయాదు లాయమ నోదార్చి వీరలెవ్వ రని యడుగఁ గురుకులోద్ధరణార్థంబుగా మత్పతి యానతి సురలవలనం గన్నసంతానంబని చెప్పి విశ్వాసార్థంబుగా వారల నప్పుడు రావించుటయు, 242

క. ధృతరాష్ట్రప్రముఖులు స, మ్మతి నాయమ నాదరించి మమత మెయిం ద
త్సుతుల నమస్తవిధమ్ముల, నతులగతులఁ జూచుచుండి రణుమరలేమిన్. 243

ఆ.వె. పాండుభూమిపతికిఁ బత్నులయం దిట్లు, సుతులు సంభవించి రతులమతులు
వారిచరితఁ జెప్పవాఁడ నాకర్ణింపుఁ, డాదరం బెసంగ ననఘులార. 244

గీ. వారి కేవురకును నొక్కవనిత ద్రుపద, పార్థివునిపుత్రి ద్రౌపది పత్నియయ్యె
నేవురకు నక్కలికియందు నేవు రుద్భ, వించిరి తనూజు లత్యంతవిమలమతులు.

క. నరునకుఁ గృష్ణుని చెలియలు, పరమోదారగుణరూపభద్ర సుభద్రా
తరుణి సతియగుచుఁదగె న, త్తరుణికి నభిమన్యుఁ డనెడితనయుఁడు వుట్టెన్. 246

ఆ.వె. అతఁడు సమరరంగమందుఁ గాలవశంబుఁ, జెందె; ద్రుపదపుత్రి నందనులును
నతనిపోలె మడిసి రాయుద్ధమునన సౌ, భద్రుభార్య మత్స్యపతితనూజ. 247

## పరీక్షిత్తు పుట్టుట.

వ. ఉత్తరయనునది యప్పటికి గర్భవతియై యుండి ద్రౌణిశరాగ్ని దగ్ధుండగు నొక్కకుమారుం గనుటయుఁ గృష్ణుం డనుగ్రహించి కురుకులాంకూరమ్ముగా నక్కుమారుం బ్రతికించె. 248

గీ. కులము క్షీణించునప్పుడు గలుగుకతన, నా కొమరుఁడు పరీక్షిదాఖ్యుఁడ డయ్యె
పాండవులచేతఁ దనసుతుల్ పడినకతన, నాంబికేయుండు పుట్టంధుఁ డడలుచుండె.

గీ. అతనిభార్య గాంధారియు నట్ల పుత్ర, శోకమునఁ్రుగ్గె నిరువుర కేక రీతి
ధర్మతనయుండు పరిచర్య తగ నొనర్చి, వారియనుమతి రాజ్యంబు వడసి యలరె.

క. విదురుండును ధృతరాష్ట్రుని, మదికింపగురీతి ధర్మమార్గంబులు స
మ్మదమున బోధించుచుఁ గడుఁ, బదిలముగా నతనియొద్దఁ బాల్పడియుండెన్. 251

క. తనయులు మడిసిన దుఃఖం, బును మఱపించుచును ధర్మపుత్త్రుఁడు పితృసే
వన మొనరింపఁగ భీముం, డనుదినమును నతనియెదుట నను నీరీతిన్. 252

సీ. దుర్యోధనునితోడఁ దునియలు సేసి దు • శ్శాసనునల్లఁ బేరాసఁ ద్రావి
తక్కినసుతుల నందఱ నుగ్గుగావించి • తినఁ దిండిలేమిఁ జేసినకతమున
మాయింటఁ బడి యభిమానవిహీనుఁడై • కాకంబువలె సిగ్గులేక భుక్తి
నలుపుచున్నాఁడు జనుషాంధుఁ డితనికిఁ • బిండము మేమింత పెట్టకున్న
గీ. వేఱుగతి లేదటం చిటుల్ వినుపుమాట • లెన్నియో భీముఁ డాయమ్మ లెత్తిపలుక
వంతఁగొనునట్టి ధృతరాష్ట్రు చింతఁ దీర్పుఁ • దమ్మునికి బుద్ధిచెప్పుచు ధర్మసుతుఁడు.

వ. ఇట్లష్టాదశవత్సరమ్ము లటవసించి ధృతరాష్ట్రుండు ధర్మతనయు నానతి వనమ్మున
కరుగం దలఁచి వృకోదరుని కారణమ్మున వింత దనుకఁ దనపుత్త్రుల కౌర్ధ్వదైహి
కంబులు జరుగమి నమస్మరించి వారలకు నివాపక్రియార్థంబుగాఁ గొంతధనంబు
నడుగుడు విదురానుమతంబున నట్లొనర్పనుంకించి తమ్ములతో యోజించు నన్నం
గని వృకోదరుం డిట్లను. 254

సీ. నీకారణముననే నెలఁతతో మనమెల్ల • వనవాసమున ద్రుంగవలసివచ్చె
ద్రుపదపుత్త్రి కనేకదుఃఖము లందంద • నీ నిమిత్తముననే నెఱిఘటిల్లె
నల విరాటునికి దాస్యం బొనర్పుట మన • కబ్బె నీమూలాన నందఱికిని
నీవగ్రజుండవు గావేని నమ్మగా • మనకధికార మెమ్మాడ్కిఁ బోవు
తే. గీ. పుట్టినదిగోలెఁ జేసినచెట్టలెన్నఁ • దరముగాని సుయోధను తర్పణమున
కనఘ! ధన మీఁదలంచెద వక్కటకట! • యెంత వెఱ్ఱి వోయన్న! విన్నెమియందు.

క. మును గంధర్వుఁడు దుర్యో, ధనునిం జెఱఁగొన్న నతనిఁ దప్పింపఁగఁ జే
సిన నీ వెఱ్ఱితనం బది, మనమునఁ దలపోయ మంటమండును వాకున్. 256

క. నీవెఱుఁగకుండఁ గీచకు, లేవిధమునఁ జంపఁబడిరి నృప! యావిధి దు
ర్భావుల సుయోధనాదులఁ గావలుల వధింపకునికిఁ గష్టము లబ్బెన్. 257

వ. వేయేల దుర్యోధనహితార్థంబుగా నీతనికి ధనం బొసంగుటకు నేనొల్ల; నింతనిక్క
వంబని సామజాండై భీముండు పలుకయు నది లెక్కింపక యుధిష్ఠిరుండు ధనం
బొసంగి తత్కృత్యంబులు నెఱవేర్పించె. 258

ఆ.వె. తర్పణములొనర్చి తనవారికుత్తమ, గతులు గలుగఁ జేసి కౌరవాధి
నాథుఁ డరిగె వనము నాతితో విదురసం, జయులతోడఁ బ్రాహ్మణయులతోడ. 259

వ. కుంతియు వారిపిఱుందన చనియెఁ బాండవు లాయమ మరలించు దలఁపునఁ దోడ
చని వ్యర్థప్రయత్నులై పురికేతెంచి రంతవారలు, 260

క. పాపాపహమగు గంగా, ద్వీపవతీతీరమున యతిప్రవరగణ
ప్రాపకమై యలరెడిశత, యూపాశ్రమమందు నుండి రుటజములందున్. 261

వ. ఇట్లాఱుసంవత్సరమ్ము లటఁ దపంబున నుండినపిదప యుధిష్ఠిరుండొక్కనాఁ
డనుజుల కిట్లనియె. 262

గీ. నాకు విన్నటిరేయి స్వప్నమునఁ గుంతి, కడుబడలి యున్నవడువునఁ గానుపించె
నమ్మహాసాధ్వి గాంధారి నటుఁగుఁ దండ్రి, నరసి రా మనసాయె నోయన్నలార.

వ. మఱియు నయవిదుత్తములగు సంజయవిదురులం గూడఁ గన మనసయ్యెడి. వల
సినరండు మీరలును ననుడు వల్లెయన ద్రౌపదియు సుభద్రయు నుత్తరయుఁ
దక్కుంగల పౌరులును బలసి కొలువ నతండు శతయూపాశ్రమమ్మునకుం జని
కుంతీగాంధారీధృతరాష్ట్రులఁ గని విదురుఁగనరామికి శంకించి తండ్రితో మహాత్మా!
విదురుఁడెక్కడ, నని యడుగుడు నతండు విరక్తుండై యియ్యెడనే యొకచోట
నేకాంతంబుగఁ దపం బొనరించుచున్నవాఁ డనిన మఱునాఁడు గంగాతట మెల్ల
నరసి, 264

గీ. ఘోరతపమాచరించు నాధీరుఁ గాంచి, ధర్మజుఁడ నని చెప్పి వందన మొనర్చి
యెదుట నిల్చిన నుత్తరం బీక మిన్న, కుండె నీగతి నొకక్షణ ముందునంత. 265

ఆ.వె. విదురు మొగమునుండి వెడలి యఖండతే, జం బొకం డజాత శత్రుముఖము
నందుఁ దగఁ బ్రవేశ మందె నాతండు ధ, ర్మాంశమున జనించినట్టిఁ డగుట. 266

వ. ఇట్లు విదురుండు గతాసుం డగుటకుఁ జింతించి యతనికి దహనాది సంస్కారం
బొనర్ప నుంకించుడు నశరీరవాణి యిట్లను. 267

గీ. ఈతఁడు విరాగి గాన నీవితని కిట్టి, కృత్య మొనరింపుటకు మది నెంచఁబోకు
మనుడు ననుజులతో గంగ నతఁడు స్నాన, మాడి చని ధృతరాష్ట్రుతో నది వచించె.

గీ. మీఁద నయ్యాంబికేయు సమీపమంద, పాండవులు గొంతకాల మిట్లుండ నటకు
వ్యాసనారదమునివర్యు లరుగుదెంచి, రనుగమించు మహాముని జనులతోడ. 269

క. వ్యాసుం గనుఁగొని తగఁ గుం, తీసతి యిట్లనియె నో మునివరేణ్యా! నా
కానజనియించెఁ గర్ణుని, నాసుతు నొకసారి గన్గొనం జేయఁగదే. 270
ఆ. వె. కన్నెప్రాయమందుఁ గంటిని గనుఁగొంటి, నంతెకాని యతని యభ్యుదయము
చూడ నోఁచనైతి నేఁడైన నొకపరి, వేగ వానిఁ జూపవే మహాత్మ. 271
వ. గాంధారి యిట్లనియె. 272
ఆ. వె. కడుపు పగుల వింతకానుపుఁగంటిని, గాని యొకని చేతిలోననైన
వెడల నోచఁనైతిఁగొడుకుల నూర్వుర, నొక్కసారిచూపు మో మహాత్మ. 273
వ. సుభద్ర యిట్లనియె. 274
గీ. చిన్నతనమున వీరుఁడై వన్నెకెక్కి, తుదకుఁ గడుపునఁ జిచ్చిడి తొలఁగిపోయె
నక్కటా! యభిమన్యు మదాత్మజాతుఁ, బ్రాణసముఁ జూపుమిఁక నొక్కపరిమహాత్మ.
చ. అని కరుణంబు వొంపిరిగ నయ్యమ లందఱుఁ దన్నుఁ గోర న
మ్మునివరుఁ డాత్మ నిట్లు దలపోసె జగజ్జననిన్ సనాతనిన్
సనక సనందనాదిమునిసన్నుత మున్నత దేవదేవమూ
ర్ధవిహితపాదపద్మఁ బ్రసరత్కరుణారసపూరపూరితన్. 276
గీ. అష్టదిక్పాలకులును బ్రహ్మాది దేవ, తలు సహమ్మును బంచభూతములు నింద్రి
యాదికమ్మును లేకున్నయపుడు నొప్పు, నేజనని యామె నీవని యే నుతింతు. 277
సీ. దేవదేవిని మణిద్వీపవాసినివి ప్ర • కృతివి బ్రహ్మాదికాకృతివి సకల
జీవలోకమ్మును జిత్తమునం దిడి • గుణములచే లింగకోశమందుఁ
జొనిపి సమాధినిష్ఠను జెంది కల్ప ప • ర్యంతమ్ము స్వాతంత్ర్యమనుగమించి
యుండెడి నీశక్తి యొరు లెఱుంగఁగ లేరు • మాదృశు లెట్లు నీమాయఁ దెలియ
గీ. నేర్తు రోయమ్మ! వీర లత్యార్తు లగుచు, మృతులఁజూపింపు మనెదరుమృతులఁ జూప
నీకటాక్షంబు లేకున్న నే సమర్థ, తం బొరయు పాటివాఁడనా? తల్లి చెపుమ. 278
క. అని సంజప్రోద్ధునం దను, వినుతింపఁగ లోకజనని విస్మయగతి నా
కనివాసులైన వారలఁ, గనుపింపఁగఁ జేసె గనులకఱ వెడలంగన్. 279
వ. గాంధారీప్రముఖు లవ్వారిం గాంచి సంతసించిరి. పిదప సత్యవతీతనూజుండును,
క. వారల మరలన్ దివికిం, జేరం జేయుటయు నట్టిచెయిది మహాశ్చ
ర్యారోపకమై చూచెడి, వారలకు మహేంద్రజాలవైఖరిఁ దోఁచెన్. 281

## ధృతరాష్ట్రాదుల మరణము.

వ. ధర్మజుండును వ్యాసున కెఱఁగి సపరివారంబుగా హస్తిపురి కేతెంచి సుఖంబున్న మూఁడవదినంబున గాంధారియుఁ గుంతియు ధృతరాష్ట్రుండును దావానలంబుకతనఁ గాలధర్మంబుఁ జెందుటయు సంజయుం డంతకు మున్న తీర్థయాత్రయందు గతుం డగుటయు నారదుని వలన విని దుఃఖితుండై యుచితక్రియ లాచరించె. కౌరవ క్షయంబయిన ముప్పది యాఱు వత్సరములకుఁ బ్రభాసతీర్థమ్మున యాదవు లందఱును విప్రశాపవశమ్ముకతన మదిరా పానమత్తులై యన్యోన్య కలహమున మడిసిరి. బలరాముండును దేహత్యాగం బొనరించెఁ, గృష్ణుండు శాపంబుకతనఁ గిరాతబాణ తాడితుండై పరమపదం బలంకరించె, వసుదేవుండు పుత్రశోకమ్మున భువనేశ్వరిఁ డెందమ్మునఁ బొందుపఱచి పరలోకగతుండయ్యె. పిదప నర్జునుండరిగి దుఃఖితుండై బలరామకృష్ణులకు సపత్నీకంబుగా సంస్కారమ్ము నిర్వర్తించి ద్వారకాపురం బుదధిచే నాక్రమింపంబడకయున్న యందలి జనంబులతో హస్తిపురం బరుదెంచు నెడ మార్గమధ్యమ్మునం జోరులు గోపికలం గొట్టి ధనం బంతయు నపహరింప నిస్తేజుండగుకతనఁ జేయునదిలేక మిన్నక యింద్రప్రస్థమ్మున కరుదెంచి యనిరుద్ధ పుత్రుండగు వజ్రునకు నప్పురంబు పట్టంబు గట్టి పదఁపడి సాత్యవతేయునకుఁ గడచినవృత్తాంతమ్మునొడివి దుఃఖించుటయు నతండు భవిష్యద్యుగమ్మున నీవును గృష్ణుండును నవతరింతు రయ్యెడ నీతేజంబు యథాపూర్వమ్ముగ విలసిల్లునని వచించిన నిమ్మట హస్తిపురమ్ముఁజేరి యుధిష్ఠిరున కేతద్వృత్తాంతమ్ము జెప్పిన నతండు దుఃఖించి షట్త్రింశద్వత్సరుం డగు నభిమన్యుసుతు రాజ్యాభిషిక్తుంజేసి భార్యానుజోపేతుండై హిమాచలమ్మున కరిగి యట దేహత్యాగం బొనరించె నని చెప్పి సూతుండు మునుల కిట్లనియె. 282

గీ. ఔత్తరేయుండు పాండురాజ్యమును ధర్మ, మింతయును దప్పకుండఁగ నేలుచుండ
నరిగె నొకరీతి షష్టివత్సరము లిట్టు, లొప్పుగతి రాజ్యమేలుచు నొక్కనాఁడు, 283

వ. మృగయావ్యసనమ్మున వనమ్మున కరిగి మృగంబులం బరిమార్చుచుఁ గొంత తడవు గ్రుమ్మరి విద్ధంబై పలాయితం బగు నొక మృగము వెంటఁ జనిచని మధ్యాహ్నం బగుటయు, 284

క. ఆఁకలియును దప్పికయును, మేకొన నిలుపోవలేక మిక్కిలి వెతచే
నాకులుఁడై యచటఁ దప, శ్శీకరమగు నాశ్రమంబు చేరం జనియెన్. 285

వ. చని తపం బాచరించు నొకమునివరుం గాంచి జలం బడుగుడు సమాధినిష్ఠుం డగు కతన నతండు పలుకం డయ్యె. దానఁ గుపితుండై కలిసమావేశ వికలచిత్తుండై మృతసర్ప మొకండు ధనుష్కోటిం దగిల్చి యతని మెడం బడవైచి పురంబున కరిగె; మునియు యథాపూర్వమ్ముగ నిశ్చలుండై యుండె. 286

క. ఆతని తనుజాతుఁడు గవి, జాతుఁడు నా బాలమౌని జనకు నుదంతం
బాతటి మిత్రుల కతవన్, బూతాత్ముఁడు విని యమర్ష పూరితుఁడగుచున్. 287

వ. జలంబు కరంబున ధరియించి "మజ్జనకు గళంబున నెవ్వండీ మృతసర్పంబు దగిల్చె నా దుష్టుం డేడు దినమ్ములకుఁ దక్షకదష్టుండై మృతుండయ్యెడు" మని శాపం బిచ్చినఁ దద్వృత్తాంతంబు ముని శిష్యుం డొక్కఁడు నరేంద్రునకు విన్న వించుడు నతండును నవివార్యంబగు మునితనయు శాపమ్మున కులికి మంత్రి వృద్ధుంజూచి యిట్లనియె. 288

ఆ. వె. మునికుమారుఁ డొకఁడు కనలుచు శపియించె, సర్ప విషముకతనఁ జచ్చునట్లు
గాన దాని దాఁటగాఁ గల యొక్క యు, పాయముండెనేని బ్రతుకు గలదు.

గీ. మృత్యు వెన్నటికైనను నిత్యమైన, దైనఁ బౌరుషయత్నంబు మానదగద
టంచుఁబెద్దలు వచియింతు రరసి యిపుడు, తగినయత్నంబొరన్పఁగాఁదగదె మనకు.

వ. మణిమంత్రౌషధ ప్రభావమ్ము లగణ్యంబులు, ము న్నొక్క మునివర్యుని భార్య సర్ప దష్టయై యమ్ముని యాయుర్వుపం దర్ధమ్ము గొని పునర్జీవితయయ్యెనని విందు; మిట్లు ప్రత్యక్ష దృష్టాంతమ్ము లనేకమ్ము లుండ నౌదాసీన్యంబున మిన్నకుండు టయుక్తంబు, సర్వంబు దైవాధీనం బని యెవ్వండు నిరుద్యోగి యగు నతం డల సుండు నాఁబడు. 291

క. దైవాధీన మటంచును, గేవల మూహింపఁదగదు; గృహి భిక్షుకుం
దా వాత నన్నమిడుఁగా కావల ప్రింగుటకు నతని యత్నము వలదే. 292

వ. అనుపరీక్షిత్తుం గాంచి మంత్రులు మహాత్మా! సర్పదష్టయైన మునిభార్య పునర్జీవిత యయ్యెనని నుడివితి వాపె యెవ్వతె యేకతమ్మున సర్పంబు గఱచె మాకెఱింగిం పుము నావుడు రా జిట్లనియె. 293

## ప్రమద్వరా వివాహము.

సీ. మంత్రులారా! పులోమ యనెడిభృగుభార్యకుదయించెఁ జ్యవనుఁ డత్యుగ్రమూర్తి
యతనికి శర్యాతి యనుఁగుఁగూఁతురు సుక న్యానతి భార్యయై యలరె; నాపె

యందుఁ బ్రమతి యనునందనుఁ డుదయించె॰నతనిభార్య ప్రతాపి; యామె కొక్క-
రుఁడు కుమారుఁడు పుట్టె రురు వనువాఁ డతం • డత్యుగ్ర మగు తపం బాచరించె

గీ. నయ్యవసరమునంద మాన్యమతి స్థూల
కేశుఁ డనుమౌనియును హృషికేశుఁ డగుచుఁ
దపము సల్పుచు నుండె న త్తఱిని మేన
కయును విశ్వావసుకతన గర్భ మంది, 294

క. అలస్థూలకేశునాశ్రమ, తలమున కేతెంచి యొక్క- తనుజన్ జగతీ
తలమునఁగల కన్నెలకున్, దలమానికమగుచుఁ దవరుదానిం గనియెన్. 295

క. బిడ్డం గని యట నొకనది, యొడ్డున నక్కాఁతు విడిచి యుగ్మలిచనియెన్
గొడ్డుదినా; "లంజెలకుం, బిడ్డలు తెవు" లన్నపలుకు వృధవోకుండన్. 296

క. ఆ పసిబిడ్డంగని యా, తాపసి తా నె త్తి పెంచి దానికిఁ బేరుఁ
బ్రాపించెఁ బ్రమద్వరనా, నా పాపయు వృద్ధిచెందియంతఁ గ్రమమునన్. 297

క. సుమశరుని బాణమో నాఁ, గొమరారుచు మిగుల వలపుఁగొలుపుచు దృక్సా
ర్గమునం బడ నా రురువుం, బ్రమద్వరం గాంచి కామబాణార్దితుఁడై, 298

క. తనయాశ్రమమునకుం జని, యనుగతచింతాభరార్తుఁడై యొక్కెడ సు
ప్తువిధమున నున్నరురుం, గని జనకుం డడుగ నతనిఁ గని యతఁడనియెన్.299

గీ. స్థూల కేశుండనెడి మునీశువివనమున, నబలు నొక చంద్రముఖి ప్రమద్వర యనంగ
నాకు నక్కన్నెమిన్న యందంబు గవిన, యది మొదలు భార్యగాఁ గొన నాస పుట్టె.

వ. అనుడుఁ బ్రమతియు నయ్యాశ్రమమ్మునకుం జని యమ్మునికి నమస్కరించి ప్రస
న్నుఁగాఁజేసికొని యక్కన్నియం దనతనయున కిమ్మని ప్రార్థించుటయు, 301

గీ. అతఁ డంగీకరించె ననంతరంబు, వార లిరువురుఁ గలసి వివాహమునకుఁ
దగినయత్నం బొనర్చిరి తదవసరము, నంద సర్పమ్ము గఱచె నయ్యబ్జముఖిని.302

గీ. అంతకంతకు విష మెక్కి- యవ్వరాంగి, ప్రాణములు వీడి పరలోక మనుగమించె
నంత మునులందఱును జేరి యార్తు లగుచుఁ, జింతచేసిరి చేసెడి చేఁత లేమి.303

వ. రురువు నవ్వార్తవిని యట కరిగి యామృతకళేబరముం జూచి దుఃఖార్తుండై
కొంచె మావలకుం జని యిట్లు విలపించె. 304

క. నాదుసుఖమునకు విఘ్నా, పాదకుఁడై యిట్లొనర్చెఁ బాపపువిధి నా
గాదిలి నామతి నాధృతి, నాదగుజీవితము పోయెనా, యకటకటా ! 305

సీ. దౌదవ్వులన చూచి మోద మందితిఁగాని, దరిఁ జేరి మాటాడఁ దలఁపనైతి
మోము నాలోకించి మురిసి మించితిఁగాని, కెమ్మోవిరుచు లారగించనైతి
కులుకుగుబ్బలు గాంచి యులుకుఁ జెందితిఁగాని, చెలినొక్కపరి యక్కుఁజేర్పనైతి
మేనికాంతికి మిఱుమిట్లు గొంటిని గాని, యంగన నంతగా నరయనైతి;

గీ. పాణిమాత్ర గ్రహణమైనఁ బడయనైతిఁ, బరమపాపికి నా కట్టి భాగ్యమెట్టు
లక్కటా! దైవ మెటువంటి చిక్కు దెచ్చె, జీవితం బేల ప్రియురాలి చావు గంటి.

క. చనుమా! జీవనమా! యిఁక, ననుమానం బేల? నీకు నఖిల విధములన్
జనుమాన మొనఁగఁ దగు చెలి, కనుమూసెను దానికన్న ఘనమయ్యెదవే. 307

చ. జలమునఁ బోదువో? యనలసంగతిఁ బోదువా? ఘోరపాశమున్
గళమునఁ బూనిపోయెదవొ? కా దిది తప్ప దలంచినాఁడ నా
వలపులదీవి తా విషమువల్ల మృతిం గనినప్పు డీవు న
ప్పొలఁతుకపోవుమార్గమునఁ బోఁదగు నెమ్మెయి నట్లొనర్పుమా. 308

వ. అని మఱియును, 309

ఆ.వె. చచ్చుమీఁద నేమిసాధింపఁదగు జీవి, తమ్ముగల్గుపై సుఖమ్ములబ్బుఁ
దరలి పోవఁ దల్లిదండ్రులు చింతింత్రు, గాని దైవమునకుఁ గరుణ గలదె? 310

క. ఒకవేళ నాదుమరణము, నకు నెల్లరు సమ్మతించినను నాప్రియు రా
లికి నేఁ బరలోకమున ను, పకార మే మాచరించువాఁడ మృతుఁడనై? 311

గీ. ఆత్మహత్య నొనర్చి యే నటకు నేగఁ, బాతకుం డని యచ్చెలి పరిహరించు
"వెనుక కేగిన నూయి ముందునకుఁ జనిన, గోయి" యక్కట! యే నేమి సేయువాఁడ.

వ. ఇట్లు విచారించుచు నమ్మునితనయుండు గృతస్నానుండై యంజలి పుటమ్మున
జలంబులు గొని, 313

ఉ. ఇంచుకయేనిఁ బుణ్యలవ మే నొనరించితినేని గౌరవా
ఖ్యంచితులైనవారలకు భక్తుఁడనేనిఁ దపఃప్రసక్తిఁ గా
వించితినేని వహ్నులను వ్రేల్చితినేనిఁ ద్రయీప్రవృత్తిమై
మించితినేని యిక్కలికిమిన్న దటాలున లేవ కుండునే. 314

గీ. లేవకుండిన జీవనం బేవగింతు, ననుచుఁ గృతనిశ్చయుండయి మునిసుతుండు
కరగతంబగుజలమును ధరణి విడువఁ, బోవు నాయంతలో నొక్క దేవదూత.

ఆ.వె. రోదనం బొనర్చురురునియొద్దకు వచ్చి, యేల చింతఁగొనెద వేలయింత
సాహసం బొనర్ప సమకట్టె దయ్యయో!, చచ్చినట్టి కాంత వచ్చు టెట్లు? 316

క. కావలసిన మఱియింకొక, పూవుంబోఁడిం గ్రహింపఁ బోలదె? మరణం
బేవారు తప్పఁద్రోయుదు, రో వెఱ్ఱిమునీంద్ర! చింతనొందఁగఁదగునే? 317

వ. అనువతని కతం డిట్లనియె. 318

ఆ.వె. బ్రతికెనేని దీనిఁ బాణిగృహీతగాఁ, జేసికొనెద, బ్రతుకుఁ జెందదేని
దీనిలోకమునక యేనును బోయెదఁ, గాని యింకనొక్కకన్నె నొల్ల. 319

వ. అనవుడు దేవదూత యతని నిశ్చయ మ్మవంధ్యమ్మని యెంచి మునీంద్రా! దేవకల్పితంబగు నొక్కయుపాయం బెఱింగింతు నీయాయువునం దర్థ మిడఁ గలవేని యిక్కన్నె పునర్జీవిత యగు ననిన నతండు వల్లె యని యట్లు సేయ నుంకించుడు విశ్వావసుండును దనపుత్రి మృతయగుటఁ దెలిసి యట కేతెంచె నంత దేవదూత యతనిం గలసి యమ్మునిపాలికిం జని యిట్లనియె. 320

ఆ.వె. ధర్మరాజ! రురునితరుణి ప్రమద్వర, యితనిపుత్రి విషముకతన మృతిని
జెందె, రురుఁడు మృతిని జెందఁగ నున్నవాఁ, డతని యాయువందు నర్ధమొసఁగి.

క. బ్రతికింపు మిత్తలోదరి, నతిశయమున ననుడు ధర్ముఁ డట్టులె యాపెం
బ్రతికించిన నక్కన్నెన్, సతిగాఁ గైకొనియె రురుఁడు సంతస మెసఁగన్. 322

చ. ఇటు సదుపాయయోగమునసే కద! జీవన మావహించె న
చ్చటులమృగాక్షి కట్లగుట సాధ్యముగాఁ గనుపట్టుదన్క న
ప్పటి కనుకూలమై తగు నుపాయములన్ మణిమంత్ర ముఖ్యసం
ఘటనములన్ బొనర్చుటయె కర్జము ప్రాణమురక్షసేతకున్. 323

వ. అనిచెప్పి సచివానుమతమ్మున సాప్తభూమికంబగు ప్రాసాదం బొక్కండు నిర్మించి యందు మంత్రులతో వసించె. 324

గీ. దానిచుట్టును మణిమంత్రధరులు శూరు, లును వయినవారు కాఁపుండి జనవరేణ్యుఁ
గాచుచుండిరి నృపతి యక్కడవ భోజ. నాదికంబులు నెరవేర్చునట్టియెడల. 325

గీ. కశ్యపుండను నొకమునికాంతుఁ డర్థి, యగుచు నేతెంచె శాపోపహతు నృపాలుఁ
దనదు మంత్రబలమ్మునఁ దక్షకవిష, ముక్తుఁ గాఁ జేసి తగ ధనమ్మును గ్రహింప.

వ. మార్గమధ్యమ్మున వృద్ధబ్రాహ్మణస్వరూపుండై తక్షకుం డరుదెంచి వీ వెందుల

కేకతమ్మున నరిగె దని యడుగుడుఁ దక్షకోపహతుండగు పరీక్షిత్తు బ్రతికింపం
బోయెద ననిన నతండును, 327

గీ. తక్షకుండను నేనె యాతనిని గఱచు, వాఁడ మద్విషనిహతుల బ్రతుకఁజేయ
మంత్రముల్ గింత్రముల్ మహిమఁ గనఁజాల. వింత నిక్కువ మీకష్ట మేలఁ జనుము.

గీ. అనినఁ గశ్యపుఁ డిట్లను నస్మదిష్ట, దేవతాప్రాప్త మంత్రప్రభావగరిమ
బ్రతుకఁజేసెదఁ ద్వద్విషబద్ధు మునికు, మారశాపోపనిహతు నమ్మనుజవిభుని. 329

క. అనుడు భవదీయశక్తిం, గనుగొందుంగాక యనుచుఁ గఱచెం దంష్ట్రల్
చొనిపి యొక మఱ్ఱిచెట్టున్, ముని సూచుచునుండ భస్మముగఁ దక్షకుఁడున్, 330

వ. కశ్యపుఁ డద్దానిం బ్రోవుచేసి మంత్ర బలమ్మున యథాపూర్వమ్ముగా నొనర్చిన నక్క-
జంపడి యతం డతని కిట్లనియె. 331

క. మెచ్చితి నీ మంత్రమ్మున, కచ్చెరువుం జెందితిని మహాత్మ! యిపుడు నీ
వచ్చోటి కరుగు కార్యము, నొచ్చెములేని గతిఁ బేర్మి నొసఁగం జెపుమా. 332

వ. అనుడుఁ గశ్యపుం "డస్మన్మంత్రవిద్యాపాటవమ్మున నతనిం బ్రతికించి ధనంబు
సంపాదింపం బోయెద" ననిన నతండు నీవలసినధనం బే నీనోపుదు నిచ్చెదఁ
బుచ్చికొని మరలు మనుడు నతండిట్లు యోజించె. 333

గీ. మును హరిశ్చంద్రుఁడును రఘుభూమిపతియుఁ, గర్ణుఁ డాదిగఁగల ధరాకాంతు లఖిల
ధనము యశమునకై విడిచినది వినమె. యశమునకుఁ గాని ద్రవ్యంబు వ్యర్థమరయ.

గీ. మంత్రబలమున నమ్మహీమండనునకు, జీవితంబు నొసంగినఁ జెప్పికొంద్రు
ధనమునుం గల్గుఁ; బ్రజలకు జనవరుండు, గల్గుఁ; రాజ్యమ్మునకు మేలు గల్గుఁ దలఁప.

ఆ.వె. లోభగుణమొకండు లోన నూనితినేని, రా జడంగు, మీఁద రాష్ట్ర మడఁగుఁ
బ్రజయు నాశ మందుఁ బాపంబు ననుఁ జెందు, నపయశం బవార్యమై నొసంగు.

వ. అని తనలోఁ గొంతతడవు విచారించి దివ్యదృష్టిం గాఁగల తెఱం గెఱింగి తక్షక
దత్తంబగు ధనంబు సంగ్రహించి మరలి చనియెఁ దక్షకుండు సప్తమ దివసమ్మున
హస్తిపురికిం జని నృపతి దుర్గమ ప్రదేశమ్మున నుంటయు మణిమంత్రౌషధజ్ఞులచే
రక్షింపఁ బడుచుండుటయుఁ గని యిట్లు వితర్కించె. 337

శా. ఏరూపమ్మున లోని కేగుదునొ యే నేరీతి వంచింతునో
కౌరవ్యాన్వయమందుఁ బాతకములం గావించు వాఁడీతఁ డీ
దూరాజ్ఞా క్షమియింతునే సుజన సంతోషమ్ము వాటిల్లునే?
ప్రారంభించిన కార్యమియ్యది యొనర్పం జెల్లునో చెల్లదో. 338

గీ. గర్వితమొనర్చియును గాలగతి నెఱింగి
రక్షకులు చుట్టువాఱ హర్మ్యమ్మునందు
మృత్యువును దాఁటు నిచ్ఛమై మెలఁగుచుండెఁ
గాని యనివార్య మని యెఱుంగఁ డితఁ డకట! 339

గీ. కోటియత్నము లొనరించుకొనినఁ గాని, దైవ కృతమగు మృత్యువు దాఁటఁ దరమె
యంతకన్నను దాన ధర్మాదికమ్ము, చేసికొనరాదె యందైనఁ జెందు సుఖము. 340

గీ. విప్రశాపమ్ము తప్పునే? పెట్టిఁబడక, యతిరయమ్మున దాన ధర్మాదికంబు
చేసికొను మని యొకఁడైనఁ జెప్పఁ డకట!, విప్రు లున్నారు సన్నిధి వేనవేలు.

వ. అని తన కడనున్న సర్పమ్ములం గాంచి మీరు విప్రవేషమ్ముల ఫలమూలాదులు గ్రహించుకొని రాజదర్శనంబునకుం బొండని తా నొకకీటరూపమ్మునఁ దత్ఫలమ్ముల నొదిఁగియుండె. వారును రక్షకులంగాంచి యేము కురుకులాభరణంబగు పరీక్షిత్తు రక్షింపవచ్చితిమి గాన మీరాజునకుం దెలుపుఁడు నావుడు "వా రిది సమయంబు గాదు విప్రశాపభయమ్మున నృపాలుం డేకాంతంబగు దుర్గంబున నున్నవాఁ డట కేరికిం జన నశక్యంబు రేపకడ రం" డనుటయు. 342

క. భారతకులమున మున్నెపు, డారయ మిటు ద్వారమందు నభ్యంతరముల్
ధీరులగు విప్రవరులకు, నీరాజన్యుని ప్రభుత్వ మిదిగల్పించెన్. 343

క. అనవుడు నృపుతోఁ జెప్పిరి, విని నరపతి వారికేమ వినయమున నమ
స్సొనరించి రేపు వచ్చుట, కును బ్రార్థించుట వచించి కొనుఁడు ఫలాదుల్. 344

వ. అనుటయు దౌవారికు లట్లొనర్చిరి. రాజు తత్ఫలమ్ములు వేఱువేఱమంత్రుల కొసంగి కాలవశమ్మునఁ దక్షకాధిష్ఠితంబగు ఫలంబు దాను భక్షింపుటకుఁ జిదుముటయు. 345

క. అరుణమును గృష్ణదృగ్భీ, కరముును నగు కీటకంబు గనుపట్టఁగ న
చ్చెరు వంది పరీక్షిన్నర, వరుండు తనమంత్రివరులవంకం గనుచున్. 346

ఆ. వె. అరుణుఁ డస్తగిరికి నరుగుచునున్నాఁడు, తక్షకార్తి యింక దాఁటిపోయె
విప్రతనయుమాట వితథ మేయఁగా రాదు, గానఁ గీటమిదియ కఱచుఁగాత. 347

వ. అని యప్పురువుం దనగళమ్మున నిడికొనిన నయ్యది భయంకరంబగు తక్షక స్వరూపమ్ము ధరియించి చుట్టికొనియె, నంతఁ బరుగిడు వారును నచ్చెరువందు

వారును హాహాకారమ్ము లొనర్చువారునై యెల్లరును జెల్లాచెదరై రి, మహీపతియు
దుర్వారితశకభోగిభోగావృతగళుండగుచు మిన్నకుండె. 348

క. తత్తక్షకవదనవివి, ర్యత్త్రీవ్రవిషానలంబు రాజన్యు మహో
ద్యత్తాప మడర బొరిగొనె, నత్తాపసురాప మది యథార్థముగాఁగన్. 349

వ. ఇట్లు పొలియం జేసి తక్షకుండు గగనమార్గంబునం జని యదృశ్యం బగుడు మంత్రులు పురోహితపురస్సరంబుగా నతని కౌర్ధ్వదైహికంబులగు క్రియలు నెఱపేర్చి. 350

క. జనమేజయు శుభలగ్నం, బున రాజ్యమ్మునకుఁ బట్టముం గట్టి నిన
త్కనకమణిమండితం బగు, ఘనసింహాసనము నెక్కఁగాఁ జేసి రొగిన్. 351

జనమేజయునకు రాజ్యప్రాప్తి.

గీ. రాజ్యవిహ్వాంకితుఁడు జనమేజయుండు, క్రమముగా దాని శిశువు గలుపుకతన
నిపుణుఁడై వర్ధమానుఁడై నేర్చె రాజ్య, తంత్రములనెల్ల మంత్రిసత్తములు పొగడ.

గీ. అంత నేకాదశాబ్దంబు లరుగు సమయ, మునఁ బురోహితుఁ డాన్నప్రాశనము
వేదవేదాంగములు ధనుర్వేద మాది, యగు సకలవిద్యలును నేర్పె నతిరయమున.

గీ. సకలవిద్యలు నేర్చి యాజనవరుండు, క్షితిని బాలించె ధర్మరాజు వోలెఁ దనంగ
నతని కిడిమె సువర్ణవర్మాఖ్యుఁ డనెడి, కాశిరాజు సపుష్టమాఖ్యాతఁ దనయ. 354

వ. ఇట్లు కాశిరాజసుతం గైకొని ప్రమోదజం జేకొన్నయింద్రుఁడు నా సుమన్తసుఖమ్ము
లనుభవించుచు రాజ్యం బొనర్చుచున్నంత. 355

క. తత్తక్షకపరిభూతిం, జిత్త మెఱియ బదులు సేఁత సేయింపంగా
నుత్తంకుండను నొకముని, దత్తఃమున నేగుదెంచె దంతినగరికిన్. 356

వ. వచ్చి జనమేజయుం గాంచి యిట్లనియె. 357

ఉ. ఎప్పుడు చేయునట్టిపను లెయ్యవియో యెఱుఁగంగ లేవు నీ
విప్పటి చిన్ని బాలకుఁడ వేమనువాఁడ? సమాత్యులైన నీ
కొప్పదమైన కార్యముల నొప్పుగఁ జెప్పరు తప్పుకార్యముల్
చొప్పడుగాఁక పిన్నలకుఁ జొప్పడునే? విహితప్రచారముల్. 358

వ. అనుడు వినయమ్మున నా యకృతంబును గర్తవ్యంబు నెఱింగింపవే యని జన
పతి కిట్లనియె. 359

క. నీ తండ్రిం బరిమార్చిన, యాతక్షకు నెడల వైర మణుమాత్రమ్ముం
జేతోగతిఁ దలపోయవు, నీతియె యిది నీకు ధారుణీవరతిలకా! 360

వ. ఈ యుదంతంబు నీ వెఱుంగవేని నీ యమాత్యులం బిలిచి యడుగు మనుడు వా
రున్న యున్కి నెఱింగించిన. 361

క. జనమేజయుఁ డిట్లను నో, మునివల్లభ! విప్రశాపమున మృతి గనె మ
జ్జనకుఁడు, తక్షకుపై మన, మనిమిత్తంబైన వైర మందం దగునే? 362

గీ. అనిన నుత్తంకుఁ డిట్లను నధిప! తప్పు, దలఁచుచున్నాఁడ వేమనఁ! దక్షకుండు
ధన మొసఁగి కశ్యపుని మరల్చినకతమునఁ, జచ్చె నీతండ్రి లేకున్కఁ జచ్చువాఁడె?

వ. తొల్లి రురువను నొకముని తనభార్య సర్పదష్టయై మృతిం గనుడుఁ దనయాయు
వున నర్థం బొసంగి పునర్జీవితం జేసి ప్రతినంబూనె నది యెట్లంటేని, 364

క. కాకోదర మేదేనియు, నాకంటం బడియె నేని నాళ మొనర్తుం
గాక యని దండమొక్కటి, గైకొని దేశములు తిరుగఁగాఁ జనియె నృపా! 365

వ. ఇట్లు దేశంబులం గ్రుమ్మరుచుఁ గనుపట్టినంతవట్టును సర్పమ్ములఁ బరిమార్చుచు
నొక్క యరణ్యంబున ముదుసలి కొండచిలువం గాంచి వధింప మంకించుడు నది
మనుష్యభాషణంబుల నిట్లనియె. 366

క. నాచేసిన తప్పేమి! య, య్యో! చంపఁగ నేమివచ్చెనో? తెల్పు మటం
చా చిలువరాజు వేఁడిన, నాచతురాననుఁ డీసుఁ డాగ్రహ మెనయన్. 367

క. నీజాతిసర్ప మొక్కఁడు, నాజాయం గఱచు కారణంబునఁ గోపో
ద్వేజితుఁడ నగుచు నమయం, బేఁ జేసితి సర్పజాతినెల్ల హరింపఁగా. 368

వ. అనుడు డుండుభమ్ము నే నెవ్వరిం గఱవఁగల దానఁగాను; కఱచు భుజంగమమ్ము
లవి వేఱు, దేహ సామ్యంబునం జేసి నన్నుం జంపఁబోకు మనపరాధుల దండిం
చుట ధర్మమే? నావుడు నద్దాని మనుష్యభాషణంబులకు సంతసిల్లి నీ కీజన్మం బెట్లు
ఘటించె నుడువు మన నది యిట్లనుఁ దొల్లియేను బ్రాహ్మణుండ, ఖగముఁ డను
నొక్క ధరణీసురుండు నాకు మిత్రుం డతని నొక్క నాఁడు తృణమయంబగు
సర్పంబు నొనర్చి జంకించితి నతండు భయంపడి యగ్నిహోత్రగృహమ్మున డాఁగి
వేపమానుండగుచు "సర్పంబవగు" మని నన్ను శపించె, నది నిమిత్తంబుగ నేను
సర్పంబనై "నాయపరాధంబు సైఁపు" మని వేఁడినఁ "బ్రమతి పుత్రుండగు రురుని

వలన నీకు శాపమోక్షణంబగు" నని యనుగ్రహించె నాతండవునీవకా యని తలం
చెద ననుంగరుణింపవే ? యనుడు రురువును నట్లొనర్చిన పిదప స్వస్వరూపమ్మున
నతం డిట్లనియె. 369

క. రురుమునివర ! పాముల నీకఁ, బొరిగొనఁజూడకుము పరమమునులకు యష్టే
తరకార్యముల "నహింసా, పరమో ధర్మ" యని ధర్మపద్ధతి కాదే. 370

వ. అనుడు నదిమొదలు రురు వకృత్యంబు విడిచె. నీవు క్షత్రియుండవయ్యు బ్రాహ్మ
ణుని పాటియైన వైరంబు సాధింపవైతి. 371

క. పితృవైరము దీర్పని దు, ర్మతులకు సద్గతులు లేవు రాజేంద్రా ! య
ప్పతితుఁడు బ్రతికియుఁ జచ్చిన, గతివాఁడే తండ్రి నరకగతుఁడగుకతనన్. 372

ఉ. కావున నీదుతండ్రికి సుఖంబగు సద్గతి గల్గునట్లుగా
భూవర ! సర్పయాగమును బూని యొనర్చి సమస్త సర్పవి
ద్రావము చేసి వైరము కరంబు తిరంబుగ నిర్వహింపు మ
ద్దేవికిఁ దృప్తిగా ననుమతింపుము మద్వచనంబు నావుడున్. 373

క. జనమేజయుండుఁ దనజన, కుని దుర్మరణమున కడలు గొల్పుచుఁ గనులం
గొనకొని బాష్పము లొలుకఁగ, మనమునఁ జింతించె మాటిమాటికి నిట్టుల్. 374

క. ఏ నా యనుఁగుంజనకుఁడు, ప్రాణములం గోలుపోయెఁ బాముకతన న
ద్దానికి బదు లొనరింపని, యీ నాజన్మంబు కాల్పనే ? యేమిటికిన్. 375

వ. అని సంజాతక్రోధుండై మంత్రుల రావించి యిట్లనియె. 376

ఉ. ఆగడ మూని మజ్జనకు నత్యమలున్ సుగుణాంచితున్ మహా
భాగు వధించినట్టి ఖలపన్నగజాతిని బట్టి యంబికా
యాగమిషమ్మునన్ హుతవహజ్వలదుగ్రశిఖావరంపరం
గ్రాఁగఁగఁ జేసి ధన్యతను గాంచి పితౄణవిముక్తిఁ జెందెదన్. 377

ఉ. అంకితుఁడైన తక్షకుఁడు యాగపశుత్వము గాంచునంట ! యు
త్తంకుఁ డశంకితుం డగుచు దానికి హోతృతఁ గాంచునంట ! రు
ద్ధ్యంకిలచిత్తుఁడైన జనపాలకుఁ డీజనమేజయుం డనా
తంకుఁడు కర్తయంట ! ఘనతజా జగదంబ ముదంబుఁ జెందదే. 379

క. పిలువుఁడు భూసురవర్యుల, నలుపుఁడు యజ్ఞార్థమైన సంభారమ్ముల్
విలుపుఁడు గంగాతీర, స్థలమున నొకశాలయున్ శతస్తంభముగన్. 379

వ. మంత్రులును యజ్ఞసంభారమ్ములు సన్నద్ధపఱచుడు నుత్తంక పురస్సరంబుగా వేద
వేదాంగాదిపారగులగు విప్రులు ఋత్విక్కులుగా సర్పయాగం బొనర్చునెడఁ దక్షకుం
డింద్రుపాలికిం జని శరణంబు వేఁడిన నింద్రుం డభయం బొసంగి తనయాసన
మ్మునఁ గూర్చుండఁ బెట్టికొనుడు నంత నుత్తంకుండును, 380

క. అనుగతకోపభరమ్మునఁ, గనలుచును "సహేంద్రతక్షకాయస్వాహా"
యని యభిమంత్రించిన భయ, మున వాఁ డాస్తీకుఁ డనెడి ముని సఖుఁ దలఁచెన్.

క. అకలంకుండు జరత్కా, రుకుమారుఁడు మౌనిజనవరుఁడు యోగ్యుఁడు త
క్షకహితుఁ డాస్తీకుఁడు రా, జకుమారుని జన్నమునకుఁ జనుదెంచె వెసన్. 382

వ. జనమేజయుండమ్ముని నర్చించి భవద్వాంఛితం బే మని యడుగుడుఁ దక్షకహితం
బాచరించువాఁడై యియ్యాగంబు విరమించుటయ మదభీష్టం బనుడు సత్యసంధుఁ
డగు జనమేజయుం డా జన్నంబు విరమించి పదఁపడి సాత్యవతేయశిష్యుండగు
వైశంపాయనునివలన మహాభారతంబు వినియె. 383

క. వినియుం దృప్తిం జెందక, జనమేజయ నృపతి వ్యాసనంయమి వరునిం
గనుఁగొని యిట్లను "నసఘా!, మనమునకున్ శాంతి గల్గు మార్గము సెపుమా!

గీ. క్షత్రియుం డగు వానికి సంగరమునఁ, గాని గృహమునఁ గాని యుక్తమగు రీతి
మరణ ముత్తమ మారీతి మరణ మబ్బ, దయ్యె మజ్జనకునకు సౌఖ్యంబు కలదె?

క. కావున మజ్జనకునకు సు, ఖావిర్భావంబు పరమునం దొదవ యశ
శ్శ్రీ వర్ధిల్లఁగ సదుపా, యావహ మగుదాని నాకు నానతి యీవే. 386

వ. అని ప్రార్థించు జనమేజయునకు సత్యవతీ తనుజుం డిట్లనియె. 387

ఉ. పాపహరంబు మోక్షదము భద్రకరంబు పురాణరత్న మ
ధ్యాపక శిష్య నిత్యసుఖదం బగు భాగవతంబు మత్సుతుం
డోపి పఠించె నయ్యది మహోత్తమ మాగమసార మాత్మనం
తాపహరంబు దాని వినవన్ దుదముట్టు సమస్తమున్ నృపా! 388

వ. జనమేజయుం డద్దాని నా కెఱింగింపు మని మఱియు నిట్లనియె. 389

గీ. అనఘ! యాస్తీకుఁడన నెవ్వఁ డతని నెవఁడు, గన్నవాఁడు! మహాత్ముఁ డేకారణమున
సస్మదీయాహియాగంబు నాఁగె నతఁడు, దగఁ దెలిపి మీఁద భాగవతంబుఁ జెపుమ.

వ. వ్యాసుం డిట్లను జరత్కారు వను నొక ముని దారపరిగ్రహం బొల్లక యస్ఖలిత బ్రహ్మచర్యవ్రతంబు పూని యున్నంత నాతని పితరు లొక్కవనమ్మునం దొక్కెడ నొక గర్తమ్మున వ్రేలుచుం గననై యిట్లనిరి. 391

క. దారం బరిగ్రహింపుము, నారకబాధాపనోదు నందనుఁ గని మ
మ్మారాధింపుము స్వర్గ, ద్వారకవాటమ్ము విప్పఁదలఁపుము నాఁగన్. 392

ఆ.వె. నా కయాచితముగ నాపేరు గలయట్టి, కాంత దొరకెనేని గారవించి
పెండ్లి చేసికొనెదఁ బెఱరీతు లేఁక నొల్ల, ననుచుఁ దీర్థయాత్ర కరిగె నతఁడు. 393

వ. ఇది యిట్లుండ నొక్కెడఁ గశ్యపునిభార్య లగు కద్రువ వినతయు ననువార లాదిత్యరథాశ్వంబుం గనుంగొని నలు పనియుఁ దెలుపనియుఁ గొంతవడి చర్చించి యిట్లు పణబంధంబు సల్పికొనిరి. 394

గీ. నలుపయిన నాకు దాస్యంబు సలుపు మీవు, తెలు పయిన నీకు దాసినై కొలుతు నేను
వాద మిట్లొనరించి యవ్వనిత లింటి, కరిగి యథార్థ్యము మఱునాఁ డరయ నెంచి.

వ. ఆనాఁటిరాత్రి కద్రువ తనయులగు సర్పమ్ములం బిలిచి రవిరథాశ్వరోమంబుల నాక్రమించి కృష్ణవర్ణంబులుగా నొనర్పుఁడని యాజ్ఞాపించిన నంగీకరింపనివారిం గొందఱి జనమేజయ యాగహుతాశనమ్మునం బడుండని శపియించెఁ గొంద ఱా శాపమ్మునకుఁ దలఁకి శ్వేతవర్ణం బగు నవ్వారువంబును గృష్ణవర్ణంబుగా నొనర్చిరి. మఱునాఁ డా సవతు లిరువురు నట కేగి హయమ్ముం జూచునంత నల్లనై యున్న వినత యోడి విన్ననై యప్పటు దాస్యం బొనర్చుచుండెఁ గొండొక కాలమ్మునకుఁ గద్రువ తన్నును దన కుమారులను వీఁపున నెక్కించుకొని మోయు మనపుడు శోకార్త యగుచుఁ గుందుచున్న తల్లిం జూచి గరుడుం డిట్లనియె. 396

క. రవిసారథి యరుణాహ్వయుఁ, డవిరళ బలశాలి యగు మదగ్రజుఁడుండన్
నవయఁగ నేటికి? నే నుం, డ వచింపుము శోకకారణము నాతల్లీ! 397

ఆ.వె. తనయు లున్నతల్లియును పెనుదుఃఖంబు, బొందెనేని వారు పుట్టనేల?
శోకకారణంబు నా కెఱిఁగింపుము, వేగతీర్తు నన్న వినత పలికె. 398

క. ఏమని చెప్పదుఁ దండ్రీ!, స్వామినిగదః నాకు సవతి సతతం బేనా
భామినికి దాసి నాపెఱ, దా మోయుము నన్నటంచుఁ దరుణి విధించెన్. 399

వ. అని దుఃఖించు తల్లికిఁ గొమరుం డిట్లనియె. 400

క. అమ్మా! నీబదులుగ నే, నమ్మానిని మోయువాఁడ నడలకు మిఁక నం
చమ్మానశాలి సుతసహి, తమ్ముగ నమ్మగుప భుజగతయయి చెలంగన్. 401

వ. మోయువాఁడు సముద్రతీరమ్మున కరిగి పెదతల్లికి వినయమ్మున మ్రొక్కి యిట్లనియె.

క. తల్లీ! నీదాస్యము మా, తల్లికి నేరీతిఁ బాయు దయఁ దెల్పుమటం
చల్లన మ్రొక్కుడు గరుడున, కల్లన విధించె నమృత మర్పించుటకున్. 403

క. గరుఁడుం డెంత యటంచు న, మరలోకం బరిగి బాహుమద మడర సుధా
పరిపూర్ణంబగు కుంభ మ, మరుల గెలిచితెచ్చె గగనమార్గామగతిన్. 404

వ. తెచ్చి యయ్యమృతకుంభంబు పెదతల్లి కప్పగించి తల్లిదాస్యంబు వాపె నంతఁ దద్భక్షణార్థంబు కాద్రవేయులు స్నానం బొనరింపనేగు నీలోన నింద్రుం డయ్యమృతకుంభంబు నపహరించె. దాని కాస్తరణంబుగాఁ బఱచినకుశలయం దంటిన యమృతలేశము నాస్వాదించిన కతన వారలకు నాలుకలు చీలికలై రెండయ్యె. 405

గీ. జననిశాపంబు దవిలిన సర్పములు భ, యమున వాసుకి మొదలుగ నజునికడకుఁ
జని శరణుఁ జెంద నిట్లనె జలజభవుఁడు, కరుణ నెమ్మదినెంతయుఁ గడలుకొనఁగ.

వ. జరత్కారుం డనుముని తనకు సనామికయగు కన్నెందక్క నొండు పడఁతి వరింపనని ప్రతినపట్టినవాఁ డతనికి వాసుకిచెలియలగు జరత్కారు వనుదానిం బెండ్లి సేయుఁడు; వారిరువుర కాస్తీకుం డనువాఁ డుదయించి మిమ్ము రక్షింపం గలాఁ డనవుడు వాసుకియు నతని వెదకి తన చెలియలి నర్పించిన నమ్మునివరుం డును వాసుకిం గని నీ చెలియలు నాకెన్నం డప్రియం బాచరించు నప్పుడ వీడం గలవాఁడ నని సమయం బొనరించి పరిగ్రహించి వనాంతరమ్మునఁ బర్ణకుటీరం బేర్పఱచుకొని యందు సుఖమ్ము లనుభవించుచు నొక్కనాఁడు కృతభోజనుండై.

క. నను లేప వలవ దని తన, వనితకు బోధించి యాతపస్వివరుఁడు భా
వి వియతి నయ్యేడఁ దా ని, ద్రను జెందుడు నస్తగిరికి రవియుం జేరెన్. 408

వ. ఇట్లు సంధ్యోపాసనాసమయం బగుడు నాపె యిట్లని వితర్కించె. 409

గీ. నిదుర లేపిన భర్తకు నెదురుసేఁత. లేపకుండినచోఁ గర్మలోప మొదవు
కర్మలోపమ్ము సేయుటకన్న భర్త, కెదురుసేఁతయ వరమని యెంచి కడఁక. 410

ఆ.వె. అరుణుఁ డస్తగిరికి నరుగుచు నున్నాఁడు, సంధ్య వార్చుకొనెడి సమయ మయ్యెఁ
గాన నిదుర లేచి కాల్యకృత్యంబులు, దీర్చుకొనుఁ డటంచుఁ దెలుప లేపె. 411

వ. లేపిన నమ్మునివరుండును గోపోద్రేకమున నాకెదురుచేసితివి గాన నీకన్నయింటికిం
బొమ్ము నాయిచ్చ నే నేగెద ననవుడు భయసంభ్రమాక్రాంతహృదయ యగుచు
నమ్మునిం జూచి యయ్యతివ మెల్లన నిట్లనియె. 412

క. మాయన్న నీకిడిన నదు, పాయం బిట్లేని నెట్లుఫలియించు వృథా
పాయక న్యాయమె యను నా, ప్రోయాలికి భర్త "యస్తి పో" మ్మనిపలికెన్. 413

వ. అయ్యతివ పుట్టినింటి కరిగి కొండొక కాలమ్మున కాస్తికుంగనియె నాతం డిక్ష్వాకుర
ణమ్మున భవస్మృతంబున కేతెంచి సర్పపక్షపాతి యగుట నీయాగం బాఁగె నీవు
నయ్యాగంబు విరమించి మంచి చేసితివని ప్రశంసించి మఱియు నిట్లనియె. 414

గీ. భారతం బఖిలము విన్నపావనుఁడవు, నీయదృష్టం బొరులకు వర్ణింపఁదరమె
నీజనకుఁ డొక్కరుఁడ కాఁడు నీసుకృతము, వలన నన్వయమది యెల్లఁ బావనంబు.

క. దేవీయజ్ఞము పేర్మిన్, గావింపుము భాగవతపుగాథల నెల్లన్
వావలన వినుము శ్రీపర, దేవతకున్ మించినట్టి దేవత గలదే? 416

క. దేవీపూజకులగు కుల, పావనులకు వృద్ధిచెందు బాహుళైశ్వర్య
శ్రీవిజయాయుర్దాయసు, భావిర్భూతులును నఖిలమగు భోగములున్. 417

వ. కావున శ్రద్ధావంతుండవై దేవీభాగవతంబు వినుము. 418

గీ. ఎవరు పరదేవతాపూజ నేవగింత్రు, వారవో దుఃఖభాక్కులు వారమూర్ఖు
లెవరు పరదేవతాపూజ కిచ్చగింత్రు, వారవో సౌఖ్యభాక్కులు వార కృతులు. 419

గీ. బ్రహ్మ మొదలగు దేవతల్ భక్తి నేజ, గజ్జనని సేవ లొనరించి కాలయాప
నం బొనర్తురో యీజగదంబ పూజ, కిచ్చగింపని మానవుఁ డెవఁడు జగతి? 420

క. మును భగవతి శ్రీనారా, యణునకు వచియించె నే మహాభాగవతా
ఖ్యనెనఁగు దివ్యచరితము, వినుమా! యద్దాన నీయభీష్టము లొలయున్. 421

వ. అని సాత్యవతేయుండు జనమేజయునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం
జెప్పిన వారును వ్యాసుం డెట్లు చెప్పె నెఱింగింపు మనుటయు. 422

## స్కంధాంత పద్యములు.

క. వీరనవి ప్రేశానకు, మార ! ధరారమణమౌళి మండిత పదపం
 కేరుహ ! గౌరవధీరను, తారామ ద్రావిడాన్వయాభరణమణీ. 423

క. దుర్గయశాస్త్రి సహోదర !, భర్గపదాంభోజ యుగళబంభర ! రిపుష
 డ్వర్గ జయజనితకీర్తి వి. దర్గళ ధారామరావ గాంచితభువనా. 424

స్రగ్విణీవృత్తము. పాపమాంబోదరప్రాజ్యపూజ్యోదయా
ప్రావకీభూతభూపాలదీవ్యద్దయా
దీపితాశాంతకీర్తిస్తుతప్రాభవా
వ్యాపృతాన్నప్రదానాన్నపూర్ణాధవా. 425

### గద్య.

ఇది శ్రీ ........తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను
మహాపురాణమునందు ద్వితీయస్కంధము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ మత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## తృతీయస్కంధము.

శ్రీకర కడియెద్ద శుభా, ఖ్యాక గ్రామాభిజనవ। హారనీహార
శ్రీకలిత దివ్యకీర్తి।, ప్రాకటగుణ చక్రవర్తి। బ్రహ్మయశాస్త్రీ. 1

వ. అవధరింపు మక్కథకుండు మునుల కిట్లను నట్లు భాగవత కథనాభిముఖుండగు సాత్యవతేయునకు జనమేజయుం డిట్లనియె. 2

గీ. వ్యాస। సత్యవతీసుత। భగవతీమ, ఖంబటంచుఁ జెప్పితివి తద్భగవతి యెట్టి
దో యెవరొ యెట్టి గుణములతో నెసంగు, నో తదీయ మఖం బెట్టిదో వచింపు. 3

వ. బ్రహ్మాండోత్పత్తియు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల స్వతంత్రత్వా స్వాతంత్ర్యములును సురాసురల కాలవశగత్వా వశగత్వమ్ములును వారల యుత్పత్తులును వారల శరీర విచారమ్మును సవిస్తరమ్ముగా నానతిమ్ము నావుడు సాత్యవతేయుం డిట్లనియె. 4

గీ. కఠినమగు ప్రశ్న మొనరింపఁ గడఁగి తీవు, దీని కుత్తరమును సావధానముగ వ
చించెదను మున్ను నారదుచెంత కరిగి, యడగితివి గంగ యొద్దున నమ్మహాత్మ. 5

క. ఈ సకల బ్రహ్మాండము, చేసినవాఁడెవఁడు ? తెలియఁ జేయు మసత్యం
బో ? సత్యమొ ? బహుకర్తృక, మో ? సకలమ్మునకుఁ గర్త యొకఁడో మహాత్మా।

వ. కొందఱు శంకరుండనియుఁ గొందఱు నారాయణుండనియు విరించియనియు సూర్యుండనియు వాసవుండనియు వరుణుండనియు యముండనియుఁ గుబేరుం డనియుఁ బావకుండనియుఁ బవమండనియు సోముండనియు గణేశ్వరుండనియు ననేకు లనేక ప్రకారమ్ముల జగత్కారణుఁబు వచియించుచుందురు. మఱికొందఱు వారాహియు నారసింహియు మహాలక్ష్మియు శాంకరియు బ్రాహ్మియు వాసవియు వారుణియు నా ననేక నామంబులు గల యదియు సనాతనియు ననాదినిధనయు సర్వ వ్యాపినియుఁ బురుషానుగతయు నాదిమాయయుఁ ద్రిగుణాతీతరూపయు గుణవిస్తార కారిణియు నిర్గుణయు సగుణయు నగు పరదేవతయ సకల కారణంబని చెప్ప

దురు. మఱికొందఱు నిరంజనమ్మును నిరాకారంబును నిర్లేపమ్మును నిర్గుణంబును
నగు తేజంబని చెప్పుదురు. మఱికొందఱు వేదోపనిషత్ప్రతిపాదితుండగు తేజో
మయుండని యందురు; కొందఱు సహస్రనయనుండును సహస్ర శీర్షుండును
సహస్రకరకర్ణుండును సహస్రపదుండును నగు పురుషోత్తముం డనియుఁ గొందఱు
విరజంబును విరాజంబును శాంతంబునగు నాకాశంబని యందురు. మఱికొంద ఱవి
శ్చిత బ్రహ్మవాదులును గొంద ఱనీశ్వరవాదులును కొందఱు స్వభావవాదులును
గొందఱు ప్రకృతి కర్తృత్వ వాదులును నై యుంటంజేసి సందిగ్ధంబగు నిమ్మహావిష
యమ్మున మనంబు డోలాయమానంబగుచున్నయది ధర్మాధర్మంబులు నిర్ణయింప
నశక్యమ్ములు ధర్మవంతులును సత్త్వగుణోత్పన్నులు నగు దేవతలు పాపాత్మ
లగు రక్కసులచేఁ బీడింపఁబడుటయు ధర్మాత్ములును సదాచారులును నగు పాండ
వులు కష్టముల పాలగుటయుఁ గనుంగొన ధర్మమ్మునకు వ్యవస్థ గానరాకున్నయది.
నా సంశయచ్ఛేదం బొనరింపు మనవుడు, 7

క. నారదుఁడు వచించిన తెఱ, గారసి వివరింతు నీకు ననఘా! చేతో
ధీరత నాకర్ణింపుము, పారంగతుఁడైన యట్టి పండితుఁ డున్నే? 8

క. నారదుఁడు శంక మదిఁ జె, న్నారఁగ నొకనాఁడు నీరజాసను నడుగన్
గారాబ మెసఁగ నతఁడు గు, మారునకుం జెప్పినట్టి మార్గము వినుమా. 9

వ. కుమారా! భవదీయప్రశ్నంబు దుర్బోధం, బయ్యది వివరింప నస్మదాదులకే కాక
విష్ణువునకుఁ గూడ నసాధ్యం బైనను నాయెఱింగి నంతవట్టు వివరించెద విను మని
యిట్లనియె. 10

గీ. మున్ను సకలంబు సంద్రమైయున్నతఱిని, భూతములు పుట్టె నేను గంజాతమందుఁ
బొడమితిని బొడమియు నలుగడలు చూడ, నర్ణవముదక్క వేఱొక్కఁడరయరాదు.

క. నను బుట్టించినపుమ్ఁ డే, యనఘుఁడొ యిప్పంకజమున కాధారంబే
మని నిశ్చయింతు నీజల, ము నిలుచుకత మేమొ! యనుచు మోహమయుఁడనై.

గీ. పుడమిపై నీరు నిల్చుట పొసఁగు నట్టి, పుడమి నల్గడలను జూడఁబడ దటంచు
వనధి నీఁదుచు నొకవేయివత్సరములు, వెదకుచున్నంత నాకాశవీథియందు 13

గీ. "తప తప" యటంచు నొకమాట దరలుటయును
వేయిసంవత్సరమ్ము లత్యాయతముగఁ

దపము సల్పితి నొం డేమి దలఁపకుండ
జలగతంబగు నల జలేజాతమందు. 14

వ. పిదప "సృజ" యను నొకపలు కంబరమునుండి వెడలె దానిని విని "యే నేమి సృజింతు ?" నని యాలోచించుచున్నంత మధుకైటభు లను రక్కసులు యుద్ధసన్నద్ధులై నను భయపెట్టుడుఁ బద్మనాళం బవలంబించి తజ్జలమ్మున మునిఁగి. 15

సీ. కారుకమ్మల నేలఁగల డాలు గలవాని • బంగారువల్వ మైఁ బరఁగువాని
నెల్లలోకము లేలునెనకంబు గలవానిఁ • జల్లచూపులు వెదఁజల్లువాని
పాపరాపాన్పుపైఁ బవ్వళించినవాని • వనమాల గళమునఁ దనరువాని
యోగనిద్రామహాభోగంబు గలవానిఁ • జలన మింతయులేక యలరువాని
గీ. శంఖచక్రగదాముఖసాధనములఁ • దవిలి చెలువారు నాల్గుబాహువులవాని
నద్భుతమ్మున కాస్పదం బైనవానిఁ • గంటి నొకదివ్యపూరుషుఁ గలువ దీఱ. 16

వ. కని యోగనిద్రాస్వరూపిణి యగు నద్దేవిని నినుతించిన నామెయు నతని శరీరంబు విడిచి దివ్యవిగ్రహయై నభమ్మున నిలిచె నంత నతండును మేల్కాంచి సన్నద్ధులగు రక్కసులఁ దనయూరుభాగమ్మున వధించునంతలో రుద్రుండును నట కేగుదెంచుడు నేము ముగురము నప్పరదేవతం బ్రార్థించుటయు నామె దయాంతరంగయై యిట్లనియె. 17

గీ. హరిహరబ్రహ్మలార! మీయంత మీ వ, నులను నెఱవేర్చి కొమరుఁడు చనుండుమీరుఁ
దగువిమానమ్మలను జెందఁదగు నశేష, జగము సృష్టింపనగు నాల్గు తెగలు గాఁగ.

గీ. అనెడి జగదంబ పలుకుల నాలకించి
యిట్టు లంటిమి నందియం బినుమడింప
భూమి లేదయ్యె జలము ప్రభూత మయ్యె
నంబ! యేగతి సృజియింప నగునొ? చెపుమ. 19

గీ. భూతములు గుణతన్మాత్రములును నింద్రి, యమ్ములును వలవడినఁ జేయంగనగును
గాని యూరక సృష్టింపఁగాఁ దరంబె?, యనుడు జగదంబ చిఱునగ వినుమడించె.

ఆ. వె. అంత నరుగుదెంచె నటకు విమానంబు, గగనతలమునుండి కడురయమున
నంబ చిత్రమొకటి యగునటఁ జేసెద, దీని నెక్కుఁ డనుచుఁ దెలుపుటయును.

వ. ఏము నామె యానతిం జేసి నవరత్నమండితంబును ముక్తాదామ భూషితంబును

గింకిణీసంకులితంబునగు విమానం బధిష్ఠించిన నంబిక యద్దాని మనోవేగంబున నడువంజేసె నంత నయ్యది జలధిభిన్నంబై మనోజ్ఞంబైన కొండొక ప్రదేశమ్ము నకుం జనియె నచ్చట. 22

## బ్రహ్మాది దేవతలు భువనేశ్వరిం గాంచుట.

సీ. కోకిలాకాకలీవ్యాకులీకృతఫల • త్ఫలవినమ్రోద్యానపాదపములు
సుందరీసుందరానందబంధురమంది • రప్రాంతదీర్ఘసరఃప్రతతులు
ప్రాకారశోభిదివ్యాకారమణిమండి • తాకాశతలచుంబిహర్మ్యతతులు
సంగీతభంగీమృదంగరంగద్రంగ • కోటిభాసురవేశవాటికలును

గీ. యజ్ఞశాలలు మఱియు దేవాలయములు • గలుగు పురవరమును దానికెలన వనము
నందు వేఁటాడు నొకరాజనందనుఁడును • గానఁగా వచ్చెఁ గన్నులకవు దీఱ. 23

వ. మా మనంబున నయ్యది స్వర్గంబను ప్రత్యభిజ్ఞ యుదయించె. వదఁపడి యయ్యది యెవరిచే నిట్లు నిర్మితంబయ్యెనని యెంచు నాలో విమానంబు మఱియొక్కెడ కరుగుడు. 24

క. నందనమను వనమును దా, నం దగు కల్పకముకడఁ గనందగు నందం
బందిన నందిని తల్లియు, నందంద చరించునట్టి యైరావణమున్. 25

గీ. అచ్చరలఁ గూడి తమ యిచ్చవచ్చినట్లు
సంచరించెడి గంధర్వ సంచయంబు
సురలును పులోమజను గూడి సొక్కు నింద్రుఁ
డును యమ కుబేరముఖులును గనఁగనైరి. 26

వ. అత్యాశ్చర్యపర్యాకులచిత్తులమై యచ్చోటు విడిచి యరుగుటయు బ్రహ్మలోకంబు గనవయ్యె. హరకేశవులు నన్నుంజూచి యిచ్చట బ్రహ్మ యొక్కఁడు గవ్వట్టి విశం డెవ్వఁ డనవుడు నిట్లంటి. 27

క. ఆ వేదయు నా వేదము, లావిభవము లెట్టివియొ మహామహారాలా!
యీవంతయు నెఱుఁగను నే, నే వాఁడనొ తెలియరా దిఁకేమనవచ్చున్. 28

వ. పిదప విమానంబు మఱి యొక్కెడ కరుగుటయు. 29

ఉ. నారద! యేమి చెప్పుదుఁ గనంబడె నచ్చట వెండికొండ సు
శ్రీరుచిరంబుగా నచటఁ జెన్నలరారు మణీనికేతన

ద్వారమునుండి శంఖుఁడు సదారసుతప్రమథుండు కృత్తివా
సోరుచిరుండు వెల్వడియె సొంపగురీతిని గోతురంగుఁడై. 30

తే. గీ. మాతృకలతోడ సంశయమగ్నమాన, సుండనై యయ్యెడల నేను జూడఁబడితి
"నింతకన్నను జిత్ర మొండేమికల" ద, టంచు విస్మయపడునంత నదియు మరల.

గీ. అరిగె నిఁక నొక్కయెడ కట వరయనయ్యె, నిందిరా సుందరీనాథు మందిరంబు
నిరుపమానంబు వైకుంఠపురవరంబు, దానిఁగని విస్మయంబందె దానవారి. 32

క. అతసీ కుసుమశరీరుఁడు, చతుర్భుజుఁడు శంఖచక్రశార్ఙ్గగదాభూ
షితుఁడు రమారమణీ పే, వితుఁడు విరాడ్వాహనుండు విష్ణువగుపడెఁగా. 33

ఆ వె. అతనిఁ జూచి యతులి తాశ్చర్యకలితుల, మగుచు నొక రొకళ్ళ నరసి కొనుచు
నున్నయంత నదియు నున్నత వేగంబు, గడలుకొనఁగఁ బాలకడలి కరిగె. 34

సీ. యాదోవిశేష దీవ్యత్తుంగ తరతరం • గాపశీకరా సేవితంబు
నానావిచిత్ర చిత్రానూనదివ్యాస్త • రణరంగ వేదికారాజితంబు
కలితముక్తాదామ కలనాభిరామ భా • మహిత మందిరకోటి మండితంబు
పారిజాతాది విభ్రాజమాన లతాంత • దంతురానంత పాదపయుతంబు

తే.గీ. గంధలోభభ్ర మన్మధుకర విరావ • భరిత మగు దీవియొండు దృక్పథము నందె
నందు సుమనోహరము శివాకృతియు నునై న పర్యంకమును గంటి మవల నొకఁట.

గీ. మణిమయం బగు పర్యంక మధ్యమందుఁ
జెలులు చెలువారఁ గొలువున్న యలరుఁబోఁడి
ననుపమానంత దివ్య కళ్యాణ రూపఁ
గంటి మా రూపమును జెప్పఁగాఁ దరంబె. 36

సీ. అరుణాంబరమువఁ జెన్నలరారు వగలాఁడి • యెఱుపైన యధరోష్ఠ మెసఁగుబోటి
కావిపూల్ గల మాలికలు ధరించిననాతి • రక్త గంధంబూను రంగులాఁడి
శోణంబులగు నేత్రకోణముల్ గలకొమ్మ • యౌవనమధ్యస్థ యైనబాన
తొలకరిమించుతోఁ దులదూఁగునెలనాగ • యర్కబింబస్ఫూర్తి నలరుకలికి

గీ. యిందిరాకోట్ల నెదురించు మందయాన • ప్రతిపదమ్మును దయఁ జిష్ణు పద్మనయన
మందమందస్మితం బొప్పు సుందరాంగి•యెన్నఁడును జూడఁబోని దయ్యంబువదన.

క. బిసరుహముకుళమ్ముల వన, గనిమసఁగెడి గుబ్బదోయి గడలుకొనఁగ సొం
పెసఁగు మణిభూషణము లిం, పెసలార నెసంగె సర్వశృంగారముగన్. 38

గీ. అరసి "హృల్లేఖ భువనేశి" యని జపించు, నమరకన్యక లిరుగడ నమరఁగా న
నంగకుసుమాది దేవీసనాథ యగుచుఁ, దనరె షట్కోణ యంత్రమధ్యమ్మునందు. 39

క. వదలక హ్రీంకార జపం, బెదఁ బొదల నెనంగు పక్షిబృందము చుట్టుం
గదియఁగఁ జాపాది మహా, యుధమ్ములు ధరించి యెసకమొప్పెడిదానిన్. 40

చ. కనుఁగొని విస్మయం బొదవఁగా "నెవరో" యని సంశయించు నం
తన యొక వేయివేయి నయనంబులు మోములుఁ జేతులుం దగన్
గనుపడె నామహామహిమ కన్నది విన్నది గాదు దాని నే
మనియును జెప్ప గిప్పఁ దగదయ్య యొకించుకయేని నారదా! 41

గీ. అచ్చరయుఁ గాదు వేలుపుటచ్చెకంటి, గాదు గంధర్వియును గాదుగా! యటంచు
సంశయించెడి మముఁ గాంచి సరసిజాక్షుఁ, డిట్లనియెఁ గొంత విజ్ఞాన మెసకమెసఁగ.

ఉ. ఈ జగదంబయే మనల నెల్ల సృజించినతల్లి, యీ మహా
తేజము యల్పబుద్ధులకుఁ దెల్లము కానిది, మాయ యన్న యీ
శ్రీజనయిత్రియే, జగమశేషము నిండిన దీ పరాంబయే
తేజులకెల్లఁదే జొసఁగుతే జన నీజగదేకనేత్రియే. 43

గీ. ఈమెయే సర్వలోకంబు సృష్టిఁ జేసి, పెంచి హరియించు నీమెయే వేదగర్భ
యీమెయే సర్వబీజమయియును విశ్వ, నాయికయు నీమెయే సదానందమూర్తి.

క. ఇరుగడలన్ బరిచర్యా, పరత మెఱయ భూషణములవలల విభూతుల్
వరఁగెడి గోట్లకొలఁది నా, సరణిం జూడుఁడు విరించిశంకరులారా! 45

క. ఎంతతపము చేసితిమో, యెంతటి ధన్యులమొ కాని యీభగవతి న
త్యంతముఁ గనుఁగొని ముదిత, స్వాంతుల మైనార మిదియు సామాన్యంబే. 46

చ. తపసులు గాంచ లే రతివదాన్యులు చూడఁగ లేరు భార్గవీ
చపలమృగాక్షి యాదియగు సర్వనిలింపసతుల్ శతాంశమం
దుపమరు రారు తత్ప్రకృతయోగము నెన్నఁ దరంబె? పూర్వపు
ణ్యపుఁబరిపాక మెట్టిదొ కదా! కన నయ్యెఁ బ్రపంచమాతృకన్. 47

గీ. మున్ను బొటనవ్రేలుగుడిచెడి చిన్నవాఁడు, వన్నుమయ్యెలలో నుంచి పన్నమైన
యెలుఁ గలరఁ బాటలను బాడి యేడ్వకుండఁ, గాచి ప్రోచినతల్లి యీకన్నతల్లి. 48

గీ. ఇంతసేపు పరీక్షించి యేనరయఁగ, వెనుకఁ గనుగొన్నసంగతి విశదమయ్యె
మాట లిఁక వేయునేల యీమాత మనలఁ, గన్న జగదంబ లే రీమెఁ గన్నవారు.

వ. అట్లగుట మన మీ పరదేవతా సమీపమ్మునకుఁ బోయి ప్రణుతించిన మన యభీష్టమ్ము లొసంగుఁ; గాదని దౌవారికులు వారించిన ద్వారముందు నిలిచి నుతింపం గడంగుద మను పలుకులకు సమ్మతించి విమానంబు డిగ్గి తద్ద్వారసమీపమ్మునకుం బోవుడు మమ్ముం గాంచి జగదంబ చిఱునగ వొలయ్పుటయు మూగురము స్త్రీలమై తత్సన్నిధికిం జని నమస్కరించి యన్యోన్యవనితారూపమ్ము లరసికొనుచుఁ గోటిసూర్యప్రతీకాశంబును నానా మణిస్థగితంబునునగు తత్పాదపీఠమ్ము నవలోకించుచున్నంత. 50

క. కొందఱు రక్తాంబరలును, గొందఱు నీలాంబరలును గొనకొని యాపెన్
సుందరులు గొల్చుచుండిరి, కొందఱు పీతాంబరలును గోట్లకొలఁదిగన్. 51

క. ఈడును జోడునుగల విరిఁ, బోఁడులు నానావిచిత్రవిభూషణముల సొం
పీడేర నాపె ముందటఁ, బాడుదు రాడుదురు కనులపండువు గాఁగన్. 52

ఉ. వారద! యేమి చెప్పుదు వినన్ గనరాని విచిత్ర మంబికో
దార రుచిప్రసన్ననఖదర్పణమందు వినుమా ననున్ శివున్
నీరజనాభునిన్ ధరణి నీరజమిత్రుని నీరజారినిన్
వారిధిపర్వతాదుల నవారణఁ జూచితి మొక్కపెట్టుగన్. 53

వ. మఱియు మజ్జన్మకారణంబగు తమ్మియుఁ దన్నాభి యగు నచ్యుతుండును నతని శయ్యయగు ననంతుండును త్రయస్త్రింశత్కోటి దేవతలును మధుకైటభులును తుంబురుఁడును హాహాహూహూ ప్రముఖగంధర్వులును రంభాదులగు నచ్చరలును గైలాసాది లోకంబులును మున్నుగాఁగల యావద్బ్రహ్మాండముం జూచి పరమాశ్చర్యభరితులమై యేము జగజ్జననిఁగా నామె నిశ్చయించుకొంటిమి. 54

గీ. అమృతమయమగు నాద్వీపమందు లోక, జననిఁ గనుఁగొని మోదాబ్ధి మునుఁగుమాకు
క్షణముగా నొకనూఱువత్సరము లరిగెఁ, దత్సుఖంబును వర్ణింపఁ దరము గాదు.

క. మముఁ జెలికత్తెల మని యా, ప్రమదామణులెల్లఁ బేర్మి బయలుపడఁగ శం
క మనములం దుంచక కూ, ర్మిమెయిన్ గారవము చేసి మెలఁగిరి పిదపన్. 56

## హరిహరబ్రహ్మలు భువనేశ్వరిని నుతించుట.

క. ఒకనాఁడు భక్తి నా యం, బిక నాలోకైకమాత విశ్వజగత్ప్రా
పకమహిమఁ గాంచి విష్ణువు, ప్రకటగతి నుతించె నిట్లు బద్ధాంజలియై. 57

సీ. కామదాయిని ! దేవి ! కల్యాణి ! ప్రకృతి ! వి • ధాత్రి ! లోకేశ్వరి ! దండమమ్మ
సచ్చిదానందాత్మ ! సంసారకారిణి ! • కలుషహారిణి ! నమస్కారమమ్మ
పంచకృత్యవిధాత్రి ! పరదేవి ! యర్థమా • త్రార్ధభూతాత్మ ! జోహారులమ్మ
హృల్లేఖ ! సంసిద్ధి ! వృద్ధి ! కూటస్థ ! నా • నాస్వరూపాత్మ ! వందనములమ్మ
తే.గీ. జగముసృష్టించి పురుషుని కగపడంగఁ • జేసి యానందమొనగూర్తు శ్రీమహేశి!
తల్లి ! యిరువదిమూఁడుతత్వముల నెల్ల • దింద్రజాలంబు నా మాకు వింపుగూర్ప.
గీ స్వప్రభావమ్ముకలిమి విశ్వమ్ముఁ బ్రోతు, వాత్మతేజమ్ముచే జగ మలరఁజేయు
దంబ ! కల్పాంతకాలమ్మునందుఁ గూడ, నుందు వెవ్వఁడెఱుంగు నీచందమెల్ల. 59
గీ. జనని ! మధుకైటభాఖ్యరాక్షసులచేత, మదియు కుండఁగ రక్షించి మాకు లోక
మెల్లఁ గనుపడఁ జేసిన తల్లివీవ, నీదుదర్శనమదియు వర్ణింపఁ దరమె ? 60
క. ఏమును బ్రహ్మయు రుద్రుఁడు, గానంగా లేము నీయఖండమహత్త్వం
బే నరునకు శక్యం బగుఁ, బూని కనుంగొనఁగ నీయపూర్వపుఁజరితల్. 61
క. హరిహరకమలజులను హరి, హరకమలజులకును జూపి తంబరో ! నీదౌ
చరితం బెఱుఁగం దరమే, పరమాద్భుతసుప్రభావభావ్యము తల్లీ. 62
గీ. కోరఁగాఁ బోను వేఱొందుకోరికలను, నీదురూపంబు నామది విడుచు టొకటి
నోట భవదీయనామంబు నుడువు టొకటి, యంబ యాచింతు నిన్నెపుడరయుటొకటి.
గీ. వీఁడు నాభృత్యుఁడను బుద్ధిపెట్టి నన్నుఁ, బాలనము సేయవలెనమ్మ పరమకృపను
పామరుఁడ నేను పచియించు పలుకులందు, నీమదికి వచ్చినంత మన్నింపుమమ్మ.
సీ. ఏము సృష్ట్యాదికం బొనరించుట కల్ల • భవదిచ్ఛ మామీఁదఁ బ్రబలకున్న
ధాత్రి సమస్తంబు ధరియించు టది కల్ల • యాధారశక్తి ప్రాపందకున్నఁ
గంజాతహితుఁడు ప్రకాశించుటయుఁ గల్ల • పావక తేజంబు దవులకున్న
సకలజంతువులును సంచరించుట కల్ల • నీశక్తియొక్కింత నెగడకున్న
గీ. బ్రహ్మమొదలుగ సకిలప్రపంచములు న • నిత్యములుగాన నెల్లప్డు నెగడనేర
వఖిలమైనట్టి ప్రళయమ్ములందుఁగూడ • నిత్య వీ వొక్కతెవె భవాని ! మదంబ !
గీ. విద్యగల బుధవర్యులవిద్య వీవ, కీర్తిగల పుణ్యమూర్తుల కీర్తి వీవ
శక్తిగల దివ్యశక్తుల శక్తి వీవ, యంబ ! పలుమాటలేల గాయత్రి వీవ. 66
ఉ. ఆగమముల్ ద్విజామరహితార్థము చేసినతల్లి వీవ మో
క్షగమమూల మీవ జగదాదివి నీవ స్వధాస్వరూప మీ

వే గతివీవ సర్వమువహించెడిదానవు నీవ స్వాహ వీ
వాగమవేద్య వీవ జగదంబ ! మదంబ ! కదంబవాసినీ. 67

తే. గీ. అబ్ధికిఁ దరంగములయట్టు లాదిపూరు, షాంశములు జీవులగుట లోకాంబ! వారి
బంధనిర్ముక్తి కఖిలప్రపంచసృష్టి, సల్పుదువు స్వార్థమిందు లేశంబు లేదు 68

గీ. జీవుఁ డెప్పుడు తెలివిని జెందు నపుడ, లేనియట్లొనరింతు వీ లీలలెల్ల
నాట్యమొనరించి యామీఁద నర్తకుండు, మించు తత్తత్కృతుల విరమించునట్లు. 69

ఉ. ఎల్లపుడున్ భవచ్చరణమే శరణం బని నమ్మినాఁడ నో
తల్లి ! దురాపమైన పరితాపము తీరన మయ్యెనేని న
న్నుల్లమునందు వేఱొకనియోజ గణింపక యుద్ధరింపు ము
త్ఫుల్లసరోజలోచనసముల్లసమచ్ఛదయాసుధాఝరిన్. 70

క. అంబ ! భవచ్చరణాబ్జయు, గంబునకున్ మ్రొక్కెడుదు నఖండతరప్లా
వం బొసఁగి కన్న తనుజా, తుం బలె రక్షింపుమీ కుతుక మొప్పారన్. 71

వ. అని నానాప్రకారంబుల నుతించి విరమించుడు హరుం డిట్లని నుతింపం దొడంగె.

గీ. త్వత్ప్రభావజుఁడై హరి తనరెనేని, బ్రహ్మయును నీదుకార్యమై పరఁగెనేని
నేనుమాత్రము నీకుఁ దాదృశుఁడఁగాక, యన్యుఁడనె తెల్పుముమ్మ లోకైకజనని.

గీ. జనని ! భూమ్యాదిభూతపంచకము నీవ, త్వక్కు మొదలగు నింద్రియపంచకంబు
నీవ బుద్ధియుఁ జిత్తంబు నీవ మనము, నీ వహంకార మఖిలంబు నీవ కావె ? 74

గీ. హరిహరాదులు జగమున కాదిభూతు, లనుచు నేవారు వచియింతు రల్ల వారు
తెలియనేరని మూర్ఖులో దేవదేవి !, వారు జనియించుటెల్ల నీవలనఁ గాదె ? 75

గీ. సవిషయమ్ములు సగుణమ్ము లవని మొదలు, గాఁ గలుగు భూతములచే జగంబు పుట్టు
నది స్ఫుటంబగుటకు భవదంశ మొక్క, యించుకేనియు లేకున్న నెట్లు పొసఁగు ?

క. నీ వజవిష్ణుశివాకృతి, భావమునం జేసి జగము ప్రబలించియు నా
పై వేఱుగ మతిగల్గిన, నావర్జించెదవు నీకు వర్ధము కలదే ? 77

గీ. ఏను సృష్ట్యాదుల కొకింతయేని శక్తి, గనుట కూహింపఁగా ముఖ్య కారణంబు
సకలలోకాంబ ! తావకచరణనళిన, రాజమానాసమాన పరాగగరిమ. 78

క. భవదీయదయావైభవ, సువిహితము తమోగుణంబు చొప్పడె నాకున్
శివదాయిని ! సత్త్వము కే, శవునకును రజోగుణంబు జలజభవునకున్. 79

క. ధనికు లధనికులు నృపులు త, దనుచరులు మొదలుగ నగు ననంతంబగు భే
దనియతిఁ జొప్పడు జగమిది, జననిరొ ! భవదీయమతి విషమ మగుటఁ గదా ?

గీ. జనని ! యెన్నంగ సత్త్వరజస్తమములు, త్వద్గుణములు సృష్ట్యాదినిదానములగు
హరిహరవిరించుల మము సృష్ట్యాదులకు ని, మిత్తమాత్రమ్ముగా వినిర్మించి తీవు.

ఉ. అంబ ! విమానసంగతులమై చనుదెంచిన మా త్రయంబులో
నంబుజనాభుఁ డీజగమునంతయుఁ జేసినవాఁడొ ! లేక యీ
యంబుజసూతి చేసెనని యందునొ ! నే ననుకొందునో ! నమ
స్తంబు భవద్విలాసకలితంబు నవం బొకయింత యున్నదే ? 82

గీ. ఈవ సృజియింతు పాలింతు విచ్చవిడమె, నేవి యఖిలమ్ము సంహరింతు వెల్లవేళ
స్వపతియగు పూరుషుని మోదసంగతునిఁగఁ, జేయుదువు నీవిలాస మజ్ఞేయ మంబ!

ఆ.వె. అఁదుజన్మమైన నది యభీష్టమమాకు, నీదు సేవనంబు నెగడెనేని
గాన నెల్లవేళఁ గరుణించి యిటులుంచు, మంబ ! పురుషభావ మధికమగునె ? 84

ఉ. తల్లి ! భవత్పదద్వయము దక్క మఱొక్కటి నొల్లఁ ద్వత్పదో
త్ఫుల్లసరోజషండమధుపూరము గ్రోలకయున్నచోఁ ద్రుటుల్
కల్లలుగావు కల్పములుగాఁ గనుపట్టు నహర్నిశంబు ని
న్నొల్లక యన్యులం గొలుచుయోగులు విక్రమ దైవవంచితుల్. 85

క. అంబ ! వృథామాటల లా, భంబేమి ? యనుగ్రహించు భావంబది నీ
కుం బొడమెనేని నీ మం, త్రంబు నవాక్షరము నాకు దయసేయఁదగుజా. 86

క. అను శివుఁ గరుణించి జగ, జ్జనని నవాక్షర మఖండసత్త్వము మంత్రం
బును నుచ్చరించె దానిం, గొని ప్రణతిం గొలిపి ముదముఁగొని యతఁడుండెన్ 87

వ. అంత నేనును భక్తిపరవశుండనై యిట్లు మతించితి. 88

క. విను నిర్వచింప శ్రుతి నే, ర్చనదేవిన్ జెప్పకున్నె ? శ్రీకరి ! స్వాహా
యనుట మఖాదుల నిను, గూర్చినదే సర్వజ్ఞవీవె త్రిభువనజననీ ! 89

ఉ. "ఏ నొనరించువాఁడ జగమెల్లను నాకుఁ బరుండు లేఁడు వి
జ్ఞాని ననంగ నేనె" యని శాంకరి ! శంక యొకింతలేక లో
నూనితి ధన్యతాగరిమ మూరక సంసృతిసాగరంబునజా
జ్ఞానవిహీనతన్ బడితిఁ గావఁగదమ్మ కదంబవాసినీ. 90

ఉ. ఇంతకుమున్న ధన్యుఁడను నే ననుకొన్న దసత్యమైన నీ
చెంతకు వచ్చి నీచరణసేవ యొనర్పఁగ గల్గెఁ గాన నా
వంతయుశంకలేదిఁకఁ గృతార్థుఁడ ధన్యుఁడ మాన్యుఁడగా భవ
ధ్వాంత మడంచి నీదుపరభక్తి ధ్రువం బొనరింపు మంబరో! 91

క. నీవలనఁ గల్గు నొక రా, జీవమ్మునఁ బొడమితిని విశేషించి భవ
త్సేవకుఁడనైతి నఙ్ఞా, నావృతిఁ దొలఁగించి ప్రోవు మఖిలాంబ! దయఁగా. 92

ఉ. నీచరితం బెఱుంగని వినీచులుదక్కఁ బరాత్పరుం దటం
చీచతురాననుం దలఁప రీశ్వరి! స్వర్గము గోరి జన్నముల్
నోఁచెడి వారు నిట్టిరె జనుల్, నను నీవ సృజించి తిట్టి యా
లోచన నాకె తోఁచదిఁక లోకులకున్ గతియేమి? శాంకరీ. 93

క. పరతత్త్వంబంచును వి, న్నరయక యోగంబులంచు నన్న్యయముగాఁ
బరమేశ్వరి! కొందఱు చెడు, దురు త్వద్భక్తితరులకు దొరకునె ముక్తుల్. 94

ఉ. ఎందుల కంబ! పొట్లువడి యెన్నిటనో కృశియించు టోమహా
నందవిధాత్రి! సారెకుమనంబున "శాంకరి! యీశ్వరీ!" యటం
చుం దగుభక్తి నీజపము చూఱగొనం గలవాఁ డెవండు వాఁ
డందు నొకింతలోన జగదంబ! యిహంబుఁ బరంబు సర్వమున్. 95

తే.గీ. కావలెనె వీఁడు సృష్టికై కమలభవుఁడు?
హరియు రక్షింపవలెనె? లయంబు శివుఁడు
లేనిచో నెఱవేఱదే? లీల నివి స
మస్తమును జేయఁజాలు దోయంబ! నీవు. 96

చ. హరి మధుకైటభాసురుల కందిన నేమగు? నట్టివేళ నీ
కరుణయకా! సముద్ధరణ కారణమయ్యె నతండు నేను శం
కరుఁడు మదుద్భవుండఁట! జగజ్జన నాదులయందు శక్తతా
నొరయుదుమేని యెవ్వరికిఁ బొందనివారు వచింపు మంబరో! 97

క. అందఱికి జన్మకారణ, ముం దెలియఁగవచ్చు సర్వ మోహిని! యది నీ
కుం దెలియరాదు వినరా, దెందును వఱ వనఁగ వగుదు నీవ నిజముగా, 98

ఉ. ఏ సృజియింతు నీహరి వహించును రుద్రుఁడు సంపు నిక్కమే
కాపునకేనిఁ గాని మముఁ గార్యవిశారదులం బొనర్తు వం

బా। సకలేశ। నీకళయె మాకు సహాయము గానిచో వృథా
యానమె కావి మే మొక రవంతయుఁ జేయఁగ లేము శాంకరీ. 99

వ. మఱియు నకర్తయు నగుణుండును ననుపాధియు నకలుండును నగు పురుషుండు భవదీయంబగు వినోదంబు నీక్షించి సంతోషించుచుండునని తద్జ్ఞులు చెప్పుదురు. ఈతం డొక్కరుండు దక్క నీకన్న బరుండులేఁడు. ఇదియ నిక్కంబైనచో "నేకమేవాద్వితీయం బ్రహ్మ"యను వేదవాక్యంబునకు మిథ్యాత్వంబు పొసంగుఁగావ నన్ననుగ్రహించి యీ యన్యోన్యవిరోధ పరిహారం బొనర్చి యవ్వాక్యంబునకు వాచ్యంబునీవో లేక యప్పురుషుండో విస్పష్టంబొనర్పుము; నీవు స్త్రీవో పురుషం డవో యెఱింగింప వలయు; మత్పుణ్యయోగమ్మునంజేసి భవదీయసాన్నిధ్యంబు చేకూరె నని ప్రార్థించునన్నుం గాంచి మృదుమధుర గంభీర సంభాషణంబుల వజ్జగ దంబ యిట్లనియె. 100

ఆ.వె. అతఁడ యేను నేన యాతఁడు భేదం బొ, కింతయేని యుండ దిరువురకును
బుద్ధిమంతులైన పురుషు లెఱుంగుదు, రెఱుఁగలేరు బుద్ధిహీనజనులు 101

క. మాయిరువుర యంతర మ, జ్ఞేయం బద్దాని యెఱుకఁ జెందిన పురుషుం
డే యోగియు ముక్తుఁడు నన, పాయుం డాతనికి లేవు భవబంధంబుల్. 102

## బ్రహ్మాదులకు దేవి తనరూపం బుపదేశించుట.

వ. మఱియు దీపం బుపాధిభేదంబున ద్వైవిధ్యంబు గాంచునట్లును నాదర్శమ్మునం దోఁచు ప్రతిబింబమ్మువగిదివి వ్యవహారకాలమ్మున ద్వైవిధ్యంబు కల్పితంబయ్యుఁ బరమార్థావస్థయం "దేకమేవా ద్వితీయంబ్రహ్మ" యను వేదవాక్యంబ నిక్కం, బిది యునుంగాక స్త్రీరూపంబు నాకు సృష్టికాలంబునఁ గల్పితం బైనదికావి కల్పాంత మ్మున స్త్రీపుంనపుంసకభేదంబులు లేక యుండుదు. బుద్ధిశ్రీధృతి కీర్తిస్మృతులును శ్రద్ధామేధాదయా లజ్జాక్షుధాతృష్ణలును కాంతిశాంతిపిపాసలును నిద్రాతంద్రాజరలును విద్యావిద్యాస్పృహావాంఛాశక్త్యశక్తులును వసామజ్జాత్వక్కులును బుతానృత వాక్కులును పరామధ్యాపశ్యంతులును వివిధమ్ములగునాడులును నేనకావి వేరొండు కాదు. వేయేల, సంసారంబందు మద్వియుక్తంబగు పదార్థం బొక్కండులేదు. నానాదేవతలందు గౌరీబ్రాహ్మీవారాహీరౌద్రీవైష్ణవీశివావామనీకౌబేరీనారసింహీవాసవీ ప్రముఖ నానాశక్తిస్వరూపమ్ములఁ బరాక్రమించుచు సర్వకార్యమ్ము లొనర్చుచుందు.

జలమ్ముల శైత్యమ్మును, వహ్నియం దౌష్ణ్యంబును, దివాకరునందు దేజంబును,
జందురునందు హిమంబును నేన మత్త్యక్తంబగు వస్తువిషచ్ఛలనంబున కేని సమ
ర్థంబుకాదు. మీరు మువ్వురును మదీయశక్తి విముఖులైనచో రాక్షసాదిహననంబున
నశక్తులకా నిశ్చయింపుము. మఱియుఁ బతితుండును స్ఖలితుండును శాంతుండును
భీతుండును శత్రువశగతుండును నశక్తుం డనఁబడునుగాని యరుద్రుండనియు
నవిష్ణుండనియు వ్యవహరింపఁబడఁడు. శక్తియుక్తుండ వగుటంజేసియు యీవు
జగంబు సృజియింతువు. విష్ణురుద్రులును సూర్యచంద్రులును నష్టదిక్పాలకులును
శక్తియుక్తులగుటంజేసియ తమతమ కార్యంబులు నిర్వహించుచుందురు. భూమియు
శేషుండు నాదికూర్మంబును దిగ్గజంబులును శక్తిగలుగుటంబట్టియ ధారావాహకంబు
లగుచున్నవి. కానిచోఁ బరమాణువహనంబునకును గొఱగావు. 103

శా. హంసాగ్రేసరవాహ! నీరమును నాఖ్యాశేషమౌ నట్లు ప్ర
ధ్వంసంబుం బొనరింతు నయ్యనలు నార్పంబూనుదున్ గాలి నా
శంసామాత్రముగా నొనర్తు మది నిచ్ఛామాత్రముం జేసి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావము నొనర్పన్నేర్తు నన్నింటికిన్. 104

ఆ. వె. అంతమాత్రమున సమస్తతత్త్వములును, బోయెననెడి బుద్ధిఁ బూనరాదు
ఘటకపాలరీతిఁ గాఁ బరమాణువు, లందుఁ బృథివి నిల్చు నబ్జసూతి! 105

వ. మఱియు శాశ్వతంబును క్షణికంబును శూన్యంబును నిత్యానిత్యంబును సకర్తృ
కంబును నహంకారాగ్రిమంబును మహత్తను ననునీయేడు భేదంబులం జొప్పడు
మహత్తత్వంబు. దీనికతన నహంకారంబుపుట్టె; నీ విమ్మహత్తత్వంబు వలన
సమస్తభూతంబులును యథాపూర్వంబగుగతి రచియింపు మని చెప్పి. 106

ఉ. చారుహసన్ముఖిన్ విమలఁ జందనగంధి సితాంబరన్ మనో
హారిణి రాజసిన్ సరసిజాసన దివ్యసరస్వతిన్ మహో
దారవిభూషణన్ గొనుము దారను గా నని నాకొసంగె విం
పారఁగ నొక్కశక్తిని మహాసుగుణన్ జగదంబ కూర్మితో. 107

క. ఒసఁగి యిటులనియె నోయి స, రసిజాసన! యేగు మీసరస్వతితో స
ర్వసుఖముల ననుభవించుచుఁ, బొసఁగఁగా వసియింపు సత్యభువనమునందున్. 108

వ. మద్విభూతియగు నీ సరస్వతి నెన్నండు నవమానింపక యథేష్టసుఖమ్ము లనుభ
వించుచు స్వకర్మానుయాతంబులై జీవసహితంబులగు లింగకోశంబులం గొని

చతుర్విధంబుగఁ గాలకర్మస్వభావానుగుణంబుగ సచరాచరంబగు జగంబు సృజి యింపుము. సత్త్వగుణప్రధానుండగుట విష్ణుండు నీ కెక్కుడు; దుస్సహమ్ములగు విషయమ్ములందు మానవప్రకృతులందును దదన్య ప్రకృతులందునుం బుట్టుచు దాన వులం బరిమార్చుచుండు శంకరుండును నట్లె సహాయుం డగుచుండు. 109

క. దేవతలం జేయుము భూ, దేవాదిద్విజులు మిమ్మధికదక్షిణలన్
భావింపఁదగిన యాగ, శ్రీ వెలయఁగ నెపుడుఁబూజసేయుదు రెలమిన్. 110

వ. తత్తద్యాగమ్ములయందు మన్నామోచ్చారణ మాత్రమ్మునన్ జేసి మీరును సంతుష్టిఁ జెందుదురుగాక. మీలోఁ దమోగుణప్రధానుండగు శంకరుండు విశేషించి పూజ నీయుండు; దైత్యులవలనిభయంబు మీ కేరికిని దుస్సాధంబగునెడ వారాహీప్రము ఖావతారంబుల మదీయ శక్తు లుత్పత్తినొందుచు సంహరించెదిఁ గాక. మంత్ర రాజంబగు నవాక్షర మంత్రంబు సబీజంబుగా నెల్లప్పుడు జపియించిన నీకు సర్వార్థ సిద్ధి కాఁగలదు బొమ్మని చెప్పి హరిం జూచి యిట్లనియె. 111

ఉ. ఈరమణీలలామఁ గమలేక్షణ నిందిరఁ జందిరాననన్
దారనుగా గ్రహించి త్వదుదారభుజాంతరసీమ కేళికా
గారముగా నొసంగు మొకకాలమునందయినన్ విమానితం
గా రచియింపకే మిగుల గారముగాఁ గనఁగాఁ దగుంజుమీ. 112

క. దేవతల జీవికకునై, యావశ్యకములు సమస్తయాగంబులు భూ
దేవతల కవి విధించితి, నావిషయంబున మెలంగుఁ డవిరుద్ధగతిన్. 113

క. మీరలు ముగురు మదంశో, దారు లగుటఁజేసి జగము తగ మిము నెంతే
నారాధించు సమమ్ముగ ;, నారయ భేదంబు నెవ్వఁ డతఁ డడుగంటున్. 114

గీ. హరిహరబ్రహ్మలకు భేద మరయరాదు, గాని గుణభేద మొక్కింత గలదు మీకు
సత్త్వము ప్రధానమగు నుపసర్జనంబు, తక్కిన గుణద్వయము నీకుఁ దమ్మికంటి.

క. ఈవు రజోగుణ మూనెడి, యావేళలయందు నుపవనాదికమున ను
శ్రీవెలయఁగ నీభార్గవి తో, విహరింపుము మదిం గుతుకమలరారన్. 116

వ. వాగ్బీజమాయాబీజకామబీజసంపుటీకృతంబును బరమార్థదంబునగు విష్ణుహోమం త్రంబు గైకొమ్మని యమ్మనురాజం బుపదేశించి యిట్లనియె. 117

ఉ. నాకెపు డిచ్ఛ పుట్టునో వినాశమొనర్తుఁ బ్రపంచమవ్వ, నా
యాకృతియందు మీ ముగురు నైక్యముఁ జెందెద రట్టివేళ, నౌ

ఖ్యాకరమై జయప్రదమునై తగు నీ వరమంత్రరాజమును
జేకొని పేర్మిమైఁ బఠనసేయుము నీ మ్ము శుభంబు లీకగున్. 118

వ. వైకుంఠంబు నీకు నివాసంబగుఁ గాక యని శంకరుం జూచి యిట్లనియె. 119

గీ. సత్త్వము రజోగుణము నుపసర్జనములు, తమము ముఖ్యము నీ కస్మదంశజనిత
యగు మహాకాళి యీ గౌరి తగు కళత్ర, ముగ వసింపుము కైలాసభూధరమున.

ఉ. గౌరిని గూడి సంతతసుఖమ్ములు చెంద రజోగుణంబు దే
వారులతోడఁ బోరుల జయంబు గొనంగఁ దమోగుణంబు సం
సార మహార్ణవోత్తరణసాధన మస్మదభిఖ్య యాగమా
ధారము సంస్మరింపఁగ నుదారము సత్త్వగుణంబు నీకగున్. 121

గీ. ముగురకును మూఁడుగుణములు ముఖ్యములు గు
ణంబులకు వెలియగుపదార్థంబు లేదు
అట్టివాఁ డొక్క-పరమాత్మ యతఁ డదృశ్యుఁ
డేనుఁ గాలానుగతి గుణ మూనుదాన. 122

వ. సర్వంబునకుఁ గారణంబకాని యేమ గార్యంబుగాను; నావలన సత్త్వరజస్తమో గుణాత్మకంబగు పరాహంతయు దానివలన * మహత్తత్వంబును దానివలన నహంకారంబును దానివలనఁ బంచతన్మాత్రలును వానివలనఁ బంచభూతమ్ములును యథాక్రమంబుగ నుద్భవించె భూతపంచకంబును గర్మేంద్రియపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబును మనంబును నను నీ పదియాఱును కార్యంబులును గారణంబులునై యొప్పు. మహత్తత్త్వాదిసప్తకంబును నిట్టిదియ. పురుషుండు కార్యకారణోభయ కోటిప్రవిష్టుండు గాకయుండు; నిదియంతయు సంక్షేపమ్ముగా వివరించితి నిఁక మీ మీవాసమ్ములకుం బొండు; విషమంబగు కార్యంబు దటస్థించినచో శబలితుండగు పరమాత్మను స్మరించునది. స్మరణమాత్రమ్మునంజేసి యేను గోచరింపఁ గలదాన నని మా ముగురకుం జెప్పి పనిచిన నేమును నా స్థానంబు వదలి చను దెంచువారము. 123

క. స్త్రీరూపమెదలి పురుషా, కారము సంప్రాప్తమగుడుఁ గలరీతిగ నా
యారీతులెంచుచు నిమా, నా రూఢులమగుచు నేగు నా సమయమునన్. 124

---

* ఈ మహత్తత్వ బుద్ధియనియుఁ జెప్పఁబడు.

చ. కనుఁగొన నాసుధాజలధిగాని మహామహిమానుభావ యా
జననియుఁగాని యా చెలుల సంఘముగాని మణిఘృణీ కన
త్కనకమయంబు ద్వీపమదిగాని మఱొక్కటిగాని లేద యే
మనఁగల ! శుద్ధశూన్యముగ నయ్యెడ నెయ్యెడఁదోఁచె నారదా, 125

వ. పిదప నేమును మును మధుకైటభుల వధించిన చోటి కేతెంచి విమానంబు డిగితి
మచ్చటన మజ్జన్మ పంకజంబునుం బొడసూపె. 126

## బ్రహ్మాండోత్పత్తి.

ఆ.వె. దేవియనఁగ నిట్టి దివ్యస్వరూప మ, హానుభావ యట్టి యనఘచరితఁ
గన్నులార నేను గాంచితి ననుచు నా, రదుఁడు దండ్రి కనియె ముదము దనర.

వ. తండ్రీ ! నీ చెప్పిన దేవీ మహత్త్వంబు నా మనమ్మునకు వచ్చె. నిఁకఁ బురుషుం
డన నెట్టిఁడో వివరింపు మదిగాక యింత వట్టును సగుణయగు శక్తి ప్రభావం
బెఱింగించితి వింక నిర్గుణశక్తి ప్రభావంబు వినఁగోరెద. నేను శ్వేతద్వీపమ్మున
నే తదర్థంబు దపంబొనర్పుడు సిద్ధులగు తపస్వి గణంబులు పొడసూపిరి గాని
తద్రహస్యంబు గోచరింపదయ్యె. 128

క. కావున నిర్గుణశక్తి ప్ర, భావము నయ్యాదిపురుషు పారమ్యంబుఁ
నీవ యనుగ్రహమున నం, భావించి యెఱుంగఁ జేయవలయు మహాత్మా ! 129

వ. అను నారదునకుఁ జతురాననుం డిట్లనియె. 130

క. నిర్గుణుఁడగు పూరుషునిన్, నిర్గుణయగు శక్తినిన్ మునివరులు నిత్యం
సర్గమునఁ గాంతు రౌరులకు, దుర్గమము నిరూప మెట్లు దోఁచుం జెపుమా ! 131

గీ. జ్ఞానభావ్యులు విశ్వాసగమ్యులును న, నాదినిధనులుఁ బ్రకృతియు నాదిపురుషుఁ
డును జగద్వ్యాపకులు వీరి నెనయునట్టి, వస్తువొక్కింతయును లేదు వాస్తవముగ.

వ. సర్వభూతగతంబగు తేజంబు పరమాత్మకంబని యెఱుఁగునది. ప్రకృతిపురుషులన
నెల్లప్పుడు దేహమందు మిశ్రీభూతులై యేకరూపులై యవ్యయులై నిర్గుణులై,
నిర్మలులై, నిర్మములై, చిదాత్మకులై యొనంగుచుందురు. 133

క. పరమాత్ముఁడనగ శక్తియు, పరికింపఁగ శక్తియనఁగఁ బరమాత్ముఁడ యీ
యిరువురకుం జొప్పడు నం, తరమెఱుఁగఁగరా దదెట్టి తత్త్వజ్ఞులకున్. 134

క. విరతిగలుగు మహనీయుల, కరయఁగ నగు విశ్వమన నహంకారకృతం
బు రహి నదియేరికైనన్, విరతిం గలుగంగ నీదు వేజన్మములన్. 135

గీ. సగుణుఁడగువాఁడు నిర్గుణచర్య నెఱుఁగు, వాఁడె? పైత్యాదికంబునఁ బరుసనైన
రసన కలపడునే? రసారసవిచార, మతికెనయునె? పీతనీలాదికములు. 136

క. కనుఁగొనఁగ నహంకారం, బునఁ బుట్టియు సగుణమగుచుఁ బొల్చెడి చేతం
బున కెట్లలపడు? నిర్గుణ, మన వన్నెకు నెక్కు నారహస్యము చెపుమా. 137

గీ. అనుడు నారదుఁ డిట్లను నసఘ! సత్త్వ, మనఁగ నెట్టిదియో? రజంబనఁగ నెట్టి
దో? తమోగుణ మన నెట్టిదో? వచింపు, వేఱువేఱ నిరూపించి విస్తరముగ. 138

వ. అని యడిగిన విరించి యిట్లను. కుమారా! సత్త్వరజస్తమంబులను గ్రమంబుగ జ్ఞానశక్తి క్రియాశక్త్యర్థశక్తులను మూఁడు శక్తులు గలవు. అందర్థశక్తి వలన శబ్దస్పర్శ రూపరసగంధంబులను తన్మాత్రంబు లుత్పవించె. ఇందు శబ్దగుణక మాకాశంబు స్పర్శగుణకంబు వాయువు రూపగుణకం బగ్ని రసగుణకంబు జలంబు గంధగుణకంబు పృథ్వి అర్థశక్తిసమాయుక్తంబులగు నీ పదియును తమస్సర్గంబు నాఁబడు. శ్రోత్రత్వక్చక్షూరసనాఘ్రాణంబులను జ్ఞానేంద్రియపంచకంబును వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకంబును ప్రాణాపానవ్యానోదాన సమానమ్ములను వాయువులైదుం గలసి యీ పదియేనును రజస్సర్గంబు నాఁబడు. ఇవి క్రియాశక్తి మయంబులును జిదుపాదానకంబులునగు కరణంబులు. మఱియు జ్ఞానేంద్రియపంచకమ్మునకు దిగ్వాయుసూర్యవరుణాశ్వినేయు లేగురును నధిష్ఠాన దేవతలు. వీరు జ్ఞానశక్తియుక్తంబగు సత్త్వంబువలన జనించిరి కాన వీ*రాఱుగురును బుద్ధ్యాదికంబగు నంతఃకరణ చతుష్టయంబును తదధిష్ఠానదేవతలగు చంద్ర బ్రహ్మరుద్రక్షేత్రజ్ఞులు నలువురును మనంబును గలిసి యీపదియేనును సాత్త్విక సర్గంబునాఁబడు. మఱియుఁ బరమాత్మకు స్థూలంబనియు సూక్ష్మంబనియు రెండు రూపంబులు గలవు. అందు స్థూలం బుపాసకులకు ధ్యానయోగ్యంబు, నాశరీరంబు సూత్రంబు నాఁబడు. ఇకఁ బరమాత్మనిస్థూలశరీరం బెట్టిదన పంచీకృతసూక్ష్మ భూతంబులవలన మహాభూతోత్పత్తియగు. అందుఁ బంచీకృతోదకంబునఁ బ్రతిబింబితమధ్యమాధికారిచైతన్యమునకు దేహమున "నహ" మనుతాదాత్మ్యం బుదయించు. అందు విశేషాభిమాని యగు చైతన్యంబ యాదినారాయణ సంజ్ఞకంబు,

* ఇందశ్విను లిద్దఱుగాఁ జూడఁదగు.

పంచీకరణంబుచే నాకాశాదిమహాభూతవిభాగము దృఢీకృతమగు. పదఁపడి శబ్దాది గుణంబు లేకైకవృద్ధిక్రమంబున నిందు వఱలుచుండు నదియెట్లన్న నాకాశంబునకు శబ్దంబొక్కటియె గుణంబు. వాయువునకు శబ్దస్పర్శమ్ములును నగ్నికి శబ్దస్పర్శ రూపమ్ములును జలమ్మునకు శబ్దస్పర్శరూపరసమ్ములును బృథివికి శబ్దస్పర్శరూప రసగంధమ్ములైదును గుణమ్ములై చెల్లు; నిట్టిగుణమేళనంబున బ్రహ్మాండముద్భ వించె. సమస్తజీవమ్ములును బ్రహ్మాండాంశసముద్భవమ్ములుగా నెఱుంగునది; జీవ రాసుల సంఖ్య యెనుబదినాల్గు లక్షలు. ఇక సత్త్వాదిగుణంబుల స్వరూపం బెఱిం గించెద నని యిట్లనియె. 139

## సత్త్వాది గుణస్వరూపము.

సీ. ప్రీత్యాత్మకంబుగా వెలయు సత్త్వము సుఖ • మువలనఁ బ్రీతి సంభూతమగును
నార్జవం బొకటి సత్యంబు శౌచంబు శ్ర • ద్ధాక్షమా సంతోష ధైర్యములును
శాంతియు దయయు లజ్జయునను వీనిచే • సత్త్వప్రతీతి నిశ్చయము సుమ్ము
మఱియు సత్త్వమ్ము ధర్మ ప్రీతికరమును • శ్వేతవర్ణమ్మునై చెలఁగుచుండుఁ

గీ. దనరు సాత్త్వికరాజసతామసమ్ము • లనఁగ శ్రద్ధలు; మూఁటిలో నాద్యమైన
దాని వృద్ధి యొనర్చు సత్త్వమ్ము; తక్కుఁ • గల యసచ్ఛ్రద్ధల నడంచి కలఁచుఁ బుత్ర.

వ. రజోగుణంబు రక్తవర్ణంబును దుఃఖజంబగు ప్రీతిం గలుగఁజేయు నదియు నవి యెఱుంగునది. ద్వేషంబును మాత్సర్యంబును ద్రోహంబును నుత్కంఠయు నిద్రయు రజశ్శ్రద్ధయు మానంబును దమమ్మును గర్వమ్మును రజోగుణ జన్యంబులు విచక్షణులగువారు వీనింబట్టి రజోగుణంబు నిశ్చయింతురు. 141

సీ. మఱియుఁ దమోగుణం బెఱుఁగుము కృష్ణవర్ణముగ; మోహము విషాదము నెసంగఁ
జేయు నియ్యది దీనిచేష్ట లాలస్య మ • జ్ఞానమ్ము నిద్రయు దీనతయును
గార్పణ్యము భయమ్ముఁ గౌటిల్యము వివాద • రోష వైషమ్యముల్ దోషదర్శ
నంబును నాస్తికత్వంబును తామస • శ్రద్ధయు, వీనిచే నత్పురుషులు

ఆ. వె. తమము నిర్ణయింత్రు తద్దయు శుభముల • నిచ్ఛగించువార లిందు సత్త్వ
మెసగఁ జేసి రజముపనఁ గసిమసఁగుచుఁ • దమము సంహరింప దలఁపవలయు

చ. అరయఁగ నొక్క టొక్కటికి నాశ్రయమై కనుపట్టుటన్ బర
స్పరము విరోధభావమును బాల్పడనీయక వీని మూఁటినిఁజా

గర మనుకూలరీతిఁ గనఁగాఁదగు వియ్యవి మాటికిన్ బర
స్పరము విరోధముల్ సలుపుఁ బట్టకయుండిన ముప్పుమూఁడెడిన్. 143

వ. మఱియు నింక నిద్దానిన విస్తరించెద నాకర్ణింపు మెయ్యదియైన విననంత మాత్రన ఫలంబు చేకూర దెట్లంటేని కామక్రోధాదిపర్జితుఁడు గానివాని తీర్థయాత్రాదికంబును బోలె ననుభవరహితంబగు శ్రవణంబు వ్యర్థంబు. కామక్రోధలోభమోహమదమాత్సర్యతృష్ణాద్వేషాసూయేర్ష్యాక్షమాక్షాంతులను వియ్యవి యెందాఁక నాశ్రయించి యుండు నంత దనుకఁ బురుషుండు పాపాత్ముండు; వాఁ డెయ్యది యొనర్చిన నిష్ఫలంబు. కర్షకుఁడు శ్రమంపడి తగుకాలమ్మున బీజావాపంబొనర్చి యహోరాత్రిష్ఠులు గాచి తుదకు ఫలకాలమ్మున నిద్రవోయిన ఫలంబు మృగాధీనంబగుభంగి నెంత శ్రమమ్మున దీర్థయాత్రాదికం బొనర్చినను గామాదుల జయింపఁదేని ఫలమ్ముఁ జెంద నేరఁడని చెప్పి మఱియును. 144

మ. పరవిన్ శాస్త్రవిచారణంబు కతనన్ సత్త్వంబు వర్ధిల్లుఁ ద
త్పరతంజేసి క్రమక్రమమ్మునఁ దగుణా వైరాగ్య; మద్దానిచే
త రజంబున్ దమముం ద్యజించి కడు విద్యావంతుఁడై బ్రహ్మవి
ద్వరుఁడై ముక్తినిఁగాంచు మానవుఁడుతత్త్వంబింతయుణా నారదా! 145

వ. లోభయోగంబున రజం బుత్కటం బయ్యేనేని సత్త్వతమంబుల నణంచు; నట్ల తమంబును మోహయోగమ్మునంజేసి ప్రవృద్ధంబై సత్త్వరజంబుల నణంచుఁ; దత్ప్రకారంబు వేఱ్వేఱ విస్తరించెద. 146

సీ. సత్య ముత్కటమై రజస్తమోభవములొ • బాహ్యార్థముల డిందుపఱచి పేర్మి
యాజ్ఞాదికమ్ముల నానక్తిగొల్పి సా • త్త్వికభోగములయందుఁ బ్రీతిఁ జొనిపి
మోక్షమ్మవ మనమ్ము దీక్ష వహించు; న • ట్ల రజోగుణము వృద్ధినందె నేనిఁ
దగుననాతనములొ ధర్మంబు లడఁగు ద • జశ్శ్రద్ధ పొసఁగు నెసంగు నర్థ

గీ. మనుసరించును భోగంబు లఖిలములను • సత్త్వతమములు మొదటికి సమసిపోవు;
నట్ల తమమును మత్కటం బయ్యేనేనిఁ • బ్రథమమున వేదశాస్త్రవిశ్వాస మడఁగు.

గీ. మఱియుఁ దామస మగు శ్రద్ధ మదివి దవిలి
వ్యయ మొనర్చు ధనంబు ద్రోహములు సేయు
శాంతిఁ గనఁ దెన్నటికి నైన సత్త్వరజము
లడఁగు మొదటికి స్వేచ్ఛావిహార మమరు. 148

క. క్రమమున సత్త్వము రజమును, దమమును నన్యోన్యమిథునధర్మంబున క్షీ
రమునీరముఁ బలె నన్యో, న్యము కలసియ యుండు విడిచి యలవడ కుండున్.

గీ. రజము సత్త్వంబు సత్త్వమ్ము రజము, తమము
సత్త్వరజముల విడిచి యెచ్చటను నొక్క-
టొక్కటిఁగ గానరావు సంయుక్తధర్మ
కలితములు జన్యజనకతాకలితములును. 150

క. సత్త్వము రజస్తమములకు, సత్త్వరజంబులకుఁ దమము జనకంబగు నా
సత్త్వతమములకు రజమును, దత్త్వముగ జనకమగు విను తత్త్వజ్ఞనిధీ. 151

చ. జనకత వృద్ధటక్రియ నెసంగు గుణంబులు మూఁడు బుద్ధి నె
క్కొని పతితంబుఁ గామములకుం బరికొల్పుచు నుండు నాదికిం
గనఁగ రజంబు జాయ, యొనకఁబున నిద్దియు దానిజాయ యై
చను నివి రెండునుం దమము జాయ లిటుల్ దగు యుగ్మభావముల్. 152

వ. అనుడు నారదుం డిట్లను మహాత్మా! నీచెప్పిన గుణలక్షణంబుకతన నాకు దృష్టి
చొప్పడదు. నన్ననుగ్రహించి యీగుణపరిజ్ఞానంబు తెల్లమగునట్లు బోధింపు మన
నతం డిట్లనియె. 153

క. ఏనెఱిఁగి నంతవట్టును, బూని యెఱింగింతు వినుము పుత్త్రా! సమ్య
గ్జ్ఞానము నాకును నలవడ, దైనను వచియించువాఁడ నాలింపుమొగిన్. 154

చ. పతికివి బంధుసంతతి కపారముదం బొడఁగూర్చునట్టి య
య్యతివయ యెల్లవేళ సవతాలికి నప్రియయౌఁ గదా! యటుల్
మతిఁబరికింప సత్త్వముఁ దమంబు రజంబును బీడఁబెట్టు నీ
గతియ రజస్తమంబులకుఁ గన్పడు స్వేతరమందు నారదా! 155

వ. సత్త్వంబు స్వభావసుభగంబయ్యు స్వేతరసంపర్కమ్మునం జేసి వికృతిం గొలుపు
నది యెట్లంటేని, 156

ఉ. జానగు జవ్వనంబుఁ గడుఁ జక్కదనంబు నయంబుఁ గామశా
స్త్రానుగతప్రచార మొలయం దగు జవ్వని సత్త్వరీతులం
బూని చెలంగుచున్ సవతిపోరునఁ దాను దుఃఖమొందు చం
దానఁ దదన్యభావమును దాలుచు సత్త్వము వైకృతస్థితిన్. 157

క. కనుగొనుము జోరులకు భీ, తిని గొల్పెడిసేన చోరధిక్కృతులగు స
జ్జనులకు సుఖదం బగున, య్యనుపునన గుణమ్ములకును నగుభిన్నగతుల్. 158

మ. ఘనవిర్ఘోషవిశేషమై తిమిరయుక్తంబై కనచ్చంచలా
జనితత్విడ్యుతమైన దుర్దినము భీజం బూడ్చి నిశ్చింతఁ గై
కొని కూర్చుండిన కర్షకావళికిఁ గుల్కన్ గూర్చియుఁగా దున్నఁజొ
చ్చిన తక్కుంగల వారికిఁగా శ్రమదమై చెన్నారదా నారదా. 159

చ. అదియునుఁగాక వర్షబుతు వచ్చి సుఖమ్ములుగల్గువారి నె
మ్మదికి ముదం బొసంగియును మన్ననఁజేయు ప్రియుండు దూరమై
కదలినవారికిన్, పిలువఁగాఁదగు గేహము కాష్ఠజాతమున్
మొదలుగ లేని గేస్తులకు మోదమిదందగునే! గ్రహింపుమా. 160

చ. మనము విని ర్మలంబయి సమంబుగ నింద్రియముల్ పదార్థముల్
గొనఁగ సమర్థతం బొంసికోలు ఘటించి శరీరమందుఁ జా
ల్కన గనుపట్టి కాంతి పొదకట్టుతతిన్ జనుఁడెన్నఁగాఁ దగున్
దనయెడ సాత్త్వికంబగు విధం బధికం బయి చెన్నుమీఱుటల్. 161

గీ. రజమునకు లక్షణములు నిద్రావిజృంభ, ణంబు జృంభాతిరేకతంద్రావిశేష
చిత్తచాంచల్యపరదేశజిగమిషలును, బాపబుద్ధివివాదతాత్పర్యములును. 162

క. కాయము బరువగు పక్షివి, కాయమును మనంబు శూన్యగతిఁగను నిద్రా
పాయ మ్మెనయుఁ దమం బ, త్యాయతమై యేరికేనిఁ దల కెక్కుతతిన్. 163

చ. అనవిని నారదుం డను మహాత్మ! గుణంబులు భిన్నభిన్న వ
ర్తనములు గా వచించి తొక తావునకున్ సమకూడెనేనిఁ గ
ల్గనె మతికార్యసిద్ధి? రిపుకూట మదొక్కెడఁ గూడుకొన్నఁ జే
సెనయున కాని కార్యగతి యొచ్చటనేని ఫలింపనేర్చునే? 164

వ. అనవుడు విరించి యిట్లను, 165

క. తైలము వర్తియు నగ్నియు, లోలోన విరుద్ధరీతులగ నుండియుఁ దా
మేలీలఁ గార్యమొనరుపఁ, జాలునో గుణములును నట్లచాలెడిఁ బుత్రా. 166

వ. అని పితామహుండు తనకుం జెప్పిన చొప్పున నారదుండు నా కెఱింగించె నయ్యది
నీకెఱింగించితి. గుణంబులన విశ్వకారణంబులు శక్తియన జగద్వ్యాపికయై సగుణ
యనియు నగుణయనియు రెండు తెఱంగులనొప్పు. పురుషుండనఁగ విరిహుండును

నవ్యయుండును బూర్ణుండునై కార్యకారణభావమ్ములు లేక చెన్నారు. సదసదాత్మకంబగు నీ ప్రపంచం బంతయు మహామాయయగు శక్తియ నిర్వహించు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును సూర్యచంద్రులును అష్టవసువులును అష్టదిక్పాలకులును గుమార వినాయకులు మొదలగు దేవతలును శక్తి సంయుక్తులగుటం జేసియ తత్తత్కార్య నిర్వాహకు లగుచుందురు. కాన నమ్మహాశక్తి నారాధింపుమని చెప్పి వ్యాసుండు మరల జనమేజయున కిట్లనియె. 167

ఉ. ఆ జగదంబ నా కలుషహారిణి నాజగదంతరాత్మ నెం
తే జపియించి సద్గతుల నెందఱు వొందరు నీవుఁ గూడ నా
యోజ నఖండభక్తి చెలువొందఁగ నా వరదేవతాంఘ్రులన్
బూజ లొనర్చి యేరికిని బొందఁగరానిఫలంబు నొందుమా. 168

వ. మఱియు నద్దేవి మహత్త్వంబింతింతయే! వ్యాఘ్రాది సందర్శన భయంబునఁ దదీయబీజాక్షరంబగు నైకారంబు బిందురహితంబుగ నేని యెవ్వం డొక్కపరి యాదృచ్ఛికంబుగ నుచ్చరించు నవ్వాఁడు పూర్ణకాముండగు నిందులకు దృష్టాంతంబుగ నిరక్షరకుక్షియగు సత్యవ్రతుండను ద్విజకుమారుండు కిటిముఖోద్గతంబగు నైకారంబు బిందురహితంబుగ ననుకరించినంత దయార్ద్రహృదయయగు పరమేశ్వరి యతనిం గవిరాజుగ నొనర్చెననుడు, జనమేజయుం డతని కిట్లనియె. 169

క. సత్యవ్రతుఁ డన నెవని యు, వత్యంబవ్వాని కెట్లు పరమేశ్వరి సం
ప్రీత్యనుగతయై వరమిడె, సత్యవతీతనయ! నాకు సత్యము చెపుమా. 170

గీ. కిటిముఖంబున బీజంబు గెరలుటేమి, దాని సత్యవ్రతుఁడు మది నూనుటేమి
జగదధీశ్వరి కానంద మగుటయేమి, చిత్రమియ్యది వివరించి చెప్పు మనఘ. 171

వ. అనవుడు వ్యాసుం డిట్లనియె. నే నొక్కనాఁడు తీర్థయాత్రకై వెడలి సకలముని శరణ్యంబగు నైమిశారణ్యంబునకుం జని యట లోమశాది మునీంద్రులకుం బ్రణమిల్లి కథాప్రసంగంబులఁ గాలక్షేపం బొనర్చుచున్నంత జమదగ్ని మహాముని యొక ప్రసంగంబున నమ్మునులం గాంచి యిట్లనియె. 172

చ. మునివరులార! రుద్రహరిముఖ్యులు దేవతలో! దిగీశులో!
యినుఁడో! నిశాధినాయకుఁడో! యింకమఱెవ్వరు పేర్మిలో ఘనం
బునఁ దగఁ జర్చ చేసి యనుభూతగతిన్ వచియింపుఁ డంచుఁ బ
ల్కిన విని లోమశుండు పలికెఁ జమదగ్ని మహామునీంద్రుతోఁ. 173

క. శుభ మిచ్చుఁ గించు వారల, కభయ విధాయినియుఁ బాపహారిణియు మహా
విభవయు నభవ యునగు నల, యిభరిపువాహ యగు జననియే సేవ్యసుమీ. 174

వ. స్మరణమాత్రమ్మున సర్వసౌఖ్యములిచ్చునది యాపె కాని తక్కొరులుగా రిందుల
కితిహాసం బొక్కండుకల దాకర్ణింపుము. 175

క. కోసలదేశంబున నొక, భూసురుఁ డనపత్యుఁ డగుచుఁ బుత్రునికొఱకై
చేసెను దమసాతటమునఁ, దా సవ మొక్కయెడ దేవదత్తుఁడు పేర్మిన్. 176

## సత్యవ్రతోపాఖ్యానము.

సీ. వేదవేదాంగవిద్యాదర్శనాపర • బ్రహ్మ సుహోత్రుండు బ్రహ్మయయ్యె.
వేదంబునకు మాఱువిధి యొనర్చిన యాజ్ఞ • వల్క్యమౌనీంద్రుఁ డధ్వర్యుఁడయ్యె
నమరేంద్రునకు గురుత్వ మొనర్చెడి కళాధి • నేత బృహస్పతి హోతయయ్యె.
నాగమతంత్రవిఖ్యాతుండు పైలుఁ డ • త్యూర్జితాత్ముండు ప్రస్తోత యయ్యె

గీ. మనుఁడు గోభిలమౌని యుద్గాతయయ్యెఁ • దక్కుఁగలవారు దక్కుఋత్విక్కులైరి
సుతునిఁ బడయఁగఁ గోరి భూసురుఁడు దేవ • దత్తుఁ డొనరించునట్టి సత్రంబునందు.

క. ఆతఁడె సామాగమ వి, ఖ్యాతంబు రథంతరంబు నల గోభిలుఁ డు
ద్గాత సుసప్తస్వరసము, పేతముగా నుచ్చరించె వేల్పులు మెచ్చన్. 178

వ. తత్సమయంబున నాతనికి దైవికంబుగ నిశ్శ్వాసంబు వొడమి స్వరభంగం బగుడు
యజమానుం డతని కిట్లనియె. 179

ఆ. వె. సుతునికొఱకుఁ జేయుక్రతు విది మత్కామ్య. కర్మమునకు విఘ్నకర్త వగుచు
శ్వాసమెడలఁ జేసి స్వరభంగమొనరించి, తేమనం గలాఁడ వింకమూర్ఖ! 180

క. అని యజమానుఁడు తనుఁ ది, ట్టిన గోభిలమౌనియున్ గడింది యలుక నె
క్కొన దేవదత్తు నేత్రెఱఁ, గనుఁగొని యనెఁ గనుల నగ్నికణములు రాలన్. 181

వ. సర్వప్రాణిసాధారణంబగు నిశ్శ్వాసం బరికట్ట నొకరి తరంబే? యనపరాధినగు
నన్ను మూర్ఖ యని తిట్టితివి గాన నీకుం బొడము తనయుండు నిరక్షరకుక్షియు
మూర్ఖుండును గాఁగలఁ డని శపియించె; నంత దేవదత్తుండు పశ్చాత్తప్తుండై
గోభిలుం గాంచి. 182

క. అపరాధ మేమి? యింతనె, శపియింతురె! మూర్ఖసుతుఁడు జనియించిన నా
కుపకార మేమి తనఁగ న, నపత్యతయ దానికన్న నధికముగాదే? 183

ఆ.వె. ఎవఁడు గాని మూర్ఖుఁడేనిఁ బూజ్యత లేదు, విప్రుఁడైన వేఱ వెదక వలెనె?
పశుపురీతి భూప్రభాతి మూర్ఖుండైన, బ్రాహ్మణుండు కర్మబాహ్యుఁడరయ. 184

క. ఏరా జేలెడి భువిఁ బెం, పారఁగ మూర్ఖుండు పూజ్యుఁడై విప్రుఁడు; భూ
దారుం డాతఁడు విందుం, డా రాజ్యము విడుచు టొప్పు ననఘులు విబుధుల్. 185

క. తన దేశమ్మునఁ గలమూ, ర్ఖుని విప్రుని రాజు దున్నుకొనువానిఁగఁ జే
యనగున్ బన్నిదుశూద్రుని, గనుగతి నవ్వానిఁ జూడఁగాఁ దగునెందున్. 186

క. భూసుర శూన్యంబుగఁ దా, జేసినను శ్రాద్ధమొకటఁ జేయఁగవచ్చుఁగా
దో! సేయరాదు మూర్ఖుని, బోసేయఁగఁబెట్టి యెట్టి ముప్పునవేవిన్. 187

క. జడుఁడైన విప్రునకు నె, వ్వఁడు నేమియు నీయరా దవశ్యమయే నె
క్కుడుగ నిడక పొట్టకు సరి, పడునన్నము పెట్టి పంపవలయున్ బ్రాజ్ఞుల్. 188

క. తాను మూర్ఖుండగువాఁ, డేనియు నవ్వానిధనము నెవ్వండు దినం
గానేమి కొఱఁత! వింబఫ, లానీకము కాకభోగ్యమగుటయుఁ దగదే? 189

ఉ. భూపతిచేత మన్ననలు పొందఁగ నర్హుఁడుకాఁడు దేవతా
శాపరిపూర్తికిం దగిన సత్కృతికిం గొఱగాఁడు పైతృకో
ద్యాపన మాచరించుటకుఁ దద్జ్ఞులు పిల్వఁగ సంశయింతు రిం
కేపని సేయఁగా వలయు! విట్టిసుతుం గని మౌనిసత్తమా. 190

తే.గీ. అయ్య! గోభిల! సంసారమందు మూర్ఖ,
పుత్రతకు మించు కష్టమ్ము పుడమిఁ గలదె?
అంతకన్నను జావు మే లన్యమేది
యేనియు భరింపనగుఁ గృపఁ బూను మనఘ! 191

క. అని చరణంబులఁ బడు న, య్యనఘాత్ముని దేవదత్తు ననుకంపాదృ
ష్టిని గనె గోభిలుఁ డెందున్, మునులకుఁ గోపంబు క్షణముకన్న నిలుచునే? 192

ఆ.వె. సహజశీతలంబు జల మది యగ్నిచే, గాని యాతపమునఁగాని క్రాఁగు
దానిపొత్తు విడిచి తనగుణంబును గాంచు, నట్లె శాంతులకును వచ్చు శాంతి. 193

క. శాంతుఁడయి గోభిలుఁడు ధీ, మంతుం "డో దేవదత్త! మఱి నీపుత్రుం
డెంతయు మూర్ఖుండయ్యు న, నంతరమున బుద్ధిమంతుఁడగుఁ గవియు నగుఁగా."

ఆ.వె. అనుడు దేవదత్తుఁ డతిమోదమంది యు, ష్టిని సమాప్తిచేసి యనఘులైన
ఋత్విజులను సత్కరించె నంతకుఁ, గొంత కాలమునకు సతినికాంతయెలమి.

క. రోహిణి యను పేరి వరా, రోహ కలితగర్భ యగుచు రోహిణిగల పు
ణ్యాహమ్మున సుతుఁ గనెఁ గడు, మోహమ్మున జాతకర్మము నతఁడొనర్చెన్.
వ. పిదప నక్కుమారునకు శుభ దినమ్మున సుతథ్యుండను పేరుపెట్టి విధిచోదితం
బగు కాలమ్మున మవనయనం బాచరించి వేదంబుఁ జెప్ప నారంభించుటయు, 197
ఉ. 'ఓ' మని తండ్రిచెప్ప నతఁడూరక చూచు, "నిదేమి పాపమో
రీ! మఱుమాట లే" దనిన నేఁడున సాఁగు మఱేమియందు నా
సోమరిపోతు నా వెడఁగు కుంతఁ, జనెజా బదిరెండు నేడు లి
ట్లామెయి సంధ్యవార్చువిధమైన నెఱుంగఁ డిఁకేటి వేదముల్? 198
క. ఇటు మూర్ఖైన కుమారున్, గటకటపడి జననియుఁ జనకుఁడుఁ లోలో
మటమట లాడెదరఁట! య, క్కట! యితరుల కెన్న నతఁడు గర్వ్యేఁడ కాఁదే?
క. జననీజనకులయాదర, మెనయపిజన్మంబు జన్మమే? వైరా
గ్యనియతుఁ డగుచు సుతథ్యుడు, వనమున కేతెంచె లోన వగ గడలుకొనన్.200
ఆ. వె. మూర్ఖుఁ డైనకొడుకు పుట్టుటకన్నను, గ్రుడ్డియైన మఱియుఁ గుంటియైన
మే లటంచు నతనిమేలు గణింపక, తల్లిదండ్రులు మదిఁ దలఁప రైరి. 201
వ. అతండును గంగాతీరమ్మున నొకపర్ణశాల నేర్పఱచుకొని వసించుచు బ్రతిదినంబును
ఘాద్రుమింబలె నమంత్రకంబుగ స్నానంబాచరించుచు ఫలమూలాదులఁ గాలక్షేపం
బొనర్చుచు నత్యంబుదక్క వేఱొండు పల్క నని వ్రతం బూని యట నున్నంత
జనులందఱు నాతని సత్యతపుండని పల్కిరి. 202
క. అపకారంబొనరుపఁడఁట! యుపకారం బంతకన్న నొనరుపఁడఁట; యా
తపమునకన్న మఱింకొక, తప ముండునె యెంచిచూడఁ దత్త్వజ్ఞులకున్? 203
సీ. తగురూప మలవడి సుగుణంబుల నెనంగి ♦ వంధ్యయై యొప్పుజవ్వని విధమునఁ
గొమ్మలనొప్పి పూగుత్తులఁ జెలువారి ♦ సఫలముగాని వృక్షమువడువున
బలుపెక్కి మిగులఁ జూపుల గుబ్బమై కొంచె ♦ మైనను పా లీని యావు పగిది
ధనధాన్యములు గల్గి తగు రాజ్యముండి దా ♦ తృత్త్వము లేని పార్థివుని మాడ్కి
గీ. నుత్తమ ద్విజకులమున నుద్భవించి
చదువు సంధ్యయు లేక విప్రులఁడనైన
వాకు మరణంబుకన్న నన్యంబు శరణ
మున్నదె? యటంచు నతఁ డిట్టు లూహ సేయు. 204

చ. వెనుకటి జన్మమందు నొక వేదపుఁ బుస్తకమైన విప్రునం
దనునకు దాన మిచ్చు సుకృతమ్మునఁ బోవవినాకు విద్య ర
మ్మనిన నదేలవచ్చు నకటా! విరిబోఁడియు విద్యయున్ ధనం
బును దొలిజన్మమం దిడని మూర్ఖులకున్ లభియింప నేర్చునే? 205

క. నా తోడివా రఖిల వి. ద్యా తంత్రమ్ముల సమర్థులై యుండఁగ నా
కీతీరు గలుగు టెన్నఁగ. నా తొలిజన్మంపు ఫల మనంగాఁ దగదే? 206

క. ఏవారి దూఱ నేమగు. దైవాధీనములు సకలతంత్రమ్ములు నా
దైవగతి దాఁటఁ దరమే?. యీ వారిజభవునికైన నభవునికైనన్. 207

వ. అనివిచారించుచుఁ బావనోదకంబగు నవ్వనమ్మున జపతపము లెఱుంగక కాలయా
పనం బొనర్చుచున్నంత నతని మునులెల్లరు సత్యవ్రతుం డనిరి. ఇట్లు పదునాలు
గేండ్లు గతించు పిమ్మట నొక్కనాఁడు. 208

చ. యమనను దేహుఁడున్ వనవిహారియు బాణధనుర్ధరుండు దు
ర్గమభుజశాలి యొక్కఁడు కిరాతుఁడు వేఁటకు వచ్చి యొక్కకో
లముఁ బడనేయ నయ్యది తలంకుచు భూసురపుత్రునగ్రభా
గమునఁ బలాయితంబగు చొకానొకరావ మొనర్చె నార్తిమై. 209

వ. దైవవశంబున నయ్యది సారస్వతబీజం బయ్యెఁ దత్ప్రభావం బెఱుంగనివాఁ డయ్యు
నతండు. 210

క. కోలము కిరాత బాణ, వ్యాలోలం బగుచు నిట్లు పలికె నటంచున్
జాలిమెయిఁ దదనుకరణము, వాలాయము సలిపెఁ దపమువడువున నంతన్. 211

వ. అయ్యడవిపందియుఁ దత్పమీపస్థంబగు నొక్క పొదరింటం డాఁగుడుఁ దదన్వే
షణంబునకుఁ గిరాతుం డేతెంచి సత్యవ్రతునకు మ్రొక్కి యిట్లనియె. 212

ఉ. తీవ్రశరంబు దాఁకి చనుదెంచెను గోల మ దేడ కేగె నో
సువ్రత! చెప్పి యాఁకటను జొక్కుకుటుంబము నుద్ధరించి స
త్యవ్రతనామధేయము యథార్థము సేయఁగదయ్య! మా కిరా
తవ్రజ మిట్లుగా బ్రతుక ధాత విధించిన ధర్మమే కదా. 213

క. తనకులవృత్తి విడువఁ దగ, దని మీవిప్రులె వచింతు రది గాకేవృ
త్తినిసైనఁ దనకుటుంబం, బును బోషించు టది తగదె? భూసురవర్యా! 214

ఆ. వె. అనుకిరాతుపల్కు లాలించి సత్యవ్ర, తుండు చెప్ప కూరకుండెఁ జెప్ప
కున్నఁ దనవ్రతంబు బన్నంబు జెందుఁ జె, ప్పిన నఘంబు జంతుపీడవలన. 215

వ. అవి ప్రాణిసంరక్షణార్థంబగు ననృతంబున వ్రతభంగంబు గామి నిశ్చయించి నిరుత్తరుండై తత్కిటిముఖోద్ధంబగు సారస్వతబీజం బుచ్చరించుచున్నంత. 216

క. అంబ కృపగలిగి ప్రత్య, క్షంబై యవ్విప్రసుతునిఁ గవితావాల్మీ
కిం బొనరించె నంట। తద్బీ, జంబు పఠించిన నరులకుఁ జమస్రులు కొదవే. 217

వ. ఇట్లు పరదేవతా నిర్హేతుక కటాక్షమ్మునం జేసి నిరంకుశకవితాప్రభావమ్ముఁ జెందిన యాసత్యవ్రతుం దక్కిరాతుంజూచి యీశ్లోకంబు నుడివె. 218

*శ్లో. యా పశ్యతి న సా బ్రూతే, యా బ్రూతే సా నపశ్యతి
అహో వ్యాధ స్వకార్యార్థిన్, కింపృచ్ఛసి పునః పునః, 219

వ. అనుడు వ్యాధుండు నిరాశుండై యరిగె సత్యవ్రతుండును మహాకవియై తద్బీజమ్ము జపించుచు విఖ్యాతింబడసె. 220

చ. అతని కవిత్వమున్ విని యహా। యని మెచ్చెడివారుఁ బండితుం
డితఁడొకఁడే యటంచు నుతియించెడివారు నమస్కరించువా
రతులవిభూతిఁ గానుకల నంపెడివారు సరస్వతీదయా
గతకవితానుభావులకు గౌరవసంపద లబ్బు టబ్రమే. 221

ఆ. వె. అట్టితనయుఁగాంచి యానందమందిరి, తల్లిదండ్రులెంత ధన్యతముల్లో
ముందు మూర్ఖుఁడైన పుత్రుండు తుదకు జ, గత్ప్రసిద్ధమైన కవితఁగాంచె. 222

ఉ. కావున నంబికాకరుణ గాంచినవారికి నెందు విద్య గా
నీ, విభవమ్ముగాని, మఱి యెద్దియుఁ గాని, యసాధ్యమే? మునీం
ద్రా! వినుమంచుఁ జెప్పె జమదగ్నికి లోమశమౌని, నీవునున్
భూవర! యంబికాకరుణఁ బొందుము చెందుము సర్వసంపదల్. 223

క. ఆ యంబ ప్రీతిఁ జెందుట, కై యజ్ఞ మొనర్పు మఖిలమగు కామంబుల్
శ్రీయును సంపదయును విపు, లాయుర్దాయాదికంబు వలవడు నీకున్. 224

ఉ. దీనులు రోగపీడితులు దృగ్వికలుల్ క్షుధితుల్ శఠుల్ పరా
ధీనులు మూర్ఖులున్ విగతతేజులు రిక్తులు నాదిగాఁగ నీ

---

* క. ఏదిచూచునో యది చెప్పదు, విదితముగాఁబల్కు నేది వీక్షింపని ద
య్యది పారెసారె నేమడి, గెద? వెవ్వరు చెప్పవా? రొగిన్ జనుమృగయా!

మానవులన్ గ్రహింపు మనుమానమునన్ దొలిజన్మమందుఁ ద
ద్ధ్యాన మొనర్పకున్కఁ బరమాతురులై రిపుడంచు భూవరా. 225

సీ. తులలేని యైశ్వర్యముల నెసంగెడివారు • పుత్రపౌత్రులకల్మిఁ బొల్చువారు
వేదవేదాంగాది విద్యలుకలవారు • భోగమ్ములను దులఁ దూఁగువారు
పుష్టికల్గినగాత్ర యష్టిఁబొల్చెడివారు • సామ్రాజ్య విభవ మెసంగువారు
పదిమంది బందుగుల్ బలిసి కొల్చెడివారు • సర్వథాసౌఖ్యముల్ జరుగువారు

గీ. నెల్లకాలము శుభముం నెనయువారు, మొదలుగాగలవారలు మున్ను జగద
ధీశ్వరివి దేవ దేవిని దెలివికలిమి • నెఱిఁగి కొల్చినవారని యెఱుఁగు మధిప। 226

## దే వీ య జ్ఞ వి ధా న ము.

క. కావున దేవీమఖముం, గావింపుమటన్న వ్యాసుఁగాంచి పరీక్షి
ద్భూవరతనయుఁడు జనసుత, భావుఁడు జనమేజయుండు వలికెం బేర్మిన్. 227

క. దేవీయజ్ఞ విధానం, బేవిధమునమందు దాని కేయేపస్తుల్
గావలయు నాకు నానతి, యీవే। కృప ననుడు వ్యాసుఁ డిట్లని తెలిపెళా. 228

వ. రాజేంద్ర। సాత్త్వికంబును రాజసంబును దామసంబును నిర్గుణంబును జ్ఞానమయం బును నన దేవీయజ్ఞం బైదువిధమ్ములు గల యది; యందు మునులకు సాత్త్వికం బును, రాజులకు రాజసంబును, రాక్షసులకు దామసంబును, జ్ఞానులకు నిర్గుణంబును ముక్తులకు జ్ఞానమయమ్మును గర్తవ్యంబులు; సమీచీన దేశకాలమంత్ర బ్రాహ్మణ ద్రవ్యంబులు గలుగునది సాత్త్వికంబు నాఁబడు. ఏ యజ్ఞంబు కాని ద్రవ్యశుద్ధి క్రియాశుద్ధి మంత్రశుద్ధులు లేనిచో సంపూర్ణఫలం బీనేరదు. అన్యాయార్జితంబగు విత్తమ్ముచేఁ జేసిన జన్నంబు పరలోకమ్మునకు వెలియగు, నిద్దానికిఁ బ్రత్యక్ష దృష్టాంతంబు మన పాండవుల రాజసూయం బది యెట్లంటేని, 229

మ. రమణీయుండగు శౌరి తోడుపడ భావద్వాజముఖ్యుల్ మహో
త్తము లార్త్విజ్యమొనర్పఁ బూర్వమున మీతాతల్ తగఁ రాజసూ
యము గావించి ప్రసిద్ధిఁ గాంచి నెలలో నాత్మీయమౌ సర్వరా
జ్యముఁ గోల్పోవుటకున్ గతంబు ధన మన్యాయార్జితం బౌటయే. 230

గీ. ద్యూతమాడి పరాజయోపేతులైరి, నాతి పాంచాలి సభకు నానీతయయ్యె
సిరి సమస్తము శత్రులచేతఁ జిక్కె, దమ కరణ్యంబు రాజ్యమై తారసించె. 231

క. అటఁ బంద్రెండేఁడులు మి, క్కుట మగుకష్టములఁ జెంది కోమలితోఁ వి
మ్మట విరటుఁ గొల్వ నేగిరి, కటకట ! మఱి యింతకన్నఁ గష్టముకలదే. 232

ఉ. పాతకుఁడైన కీచకుఁ డపాత్రుఁడు ద్రోవదిఁ బట్టి యెంతయున్
యాతనపా లొనర్చనపు డాసతికష్టము మాన్చపుణ్యపున్
జేఁతకు నొక్కరైన దయ పేయ రిసీ ! యదురాట్కటాక్షసం
పాతము లేదఁ జొచ్చెనొకొ ? పాఱులదీవన లేదఁ బోయెనో. 233

ఉ. గణ్యుఁడు కర్త ధర్మజుఁడు, కంజదళాక్షుఁడు తోడునీడ, బ్ర
హ్మణ్యులు బుత్విజుల్, గడు సుభావహమౌ క్రతు విందు ధర్మపై
గుణ్యము లేక యున్న సమకూడెనె యిట్టిదొసంగు; లెందునన్
బుణ్యపుసేఁతయైనఁ జెడిపోయిన మువ్వలు మూఁడకుండునే. 234

గీ. ధర్మవికృతియు లేక సత్రంబొనర్చు
వారలకు భంగపాటు చేకూరెనేని
మంత్రములు వ్యర్థములు వేదమతము తప్పు
మను లసత్యులు తపములు ముప్పు లధివ. 235

క. కావున నేకర్మంబేఁ, గావించినపిదప దొసఁగు గలిగిన దానన్
గేవల లోపము కల దని, కోవిదు లూహింప వలయుఁ గురుకులతిలకా. 236

వ. కర్తృభేద ద్రవ్యభేద మంత్రభేదమ్ములఁ గర్మవైపరీత్యంబు గల్గుచుండు. మున్ను దేవేంద్రుండు విశ్వరూపుని గురునిగాఁ గైకొని జన్నంబొనర్చిన నతండు మాతృపక్షీయులగు రక్కసులకు గూడ నుపకరించెఁ బిదప నింద్రుండు కుపితుండై తన వజ్రమ్మున నతని శిరంబు ద్రొల్లనేసెఁ గావున నెవ్వండేనిఁ గర్మవైపరీత్యం బొదవకుండఁ గాపాడికొనవలయు. పర్వంబు దైవాధీనంబనుట పరికాదు. 237

క. మును ద్రుపదనృపతి ఘటజ, న్మునిఁ బరిమార్పంగ జన్నమున ధృష్టద్యు
మ్నుని ద్రోవది యను కూఁతుం, గని ధన్యుండయ్యె వికృతిగననికతమునన్. 238

గీ. దశరథుం డనురాజు సత్రంబొనర్చి, సుతుల నల్వురఁ గని జగద్ధిత మొనర్చె
నేదియేనియు సఫలమై యొసఁగుఫలంబె; కర్మలోపంబు లేమియ కారణంబు. 239

వ. సాత్త్వికం బగుజన్నం బొనర్చుట యేరికిని గష్టతరం బయ్యది వైఖానసవ్రతనిష్ఠులును సాత్త్వికభోజనులును నగు మహామునులు సేయువారు. రాజసం బభిమానవంతులగు క్షత్రియులకున్ను వైశ్యులకును విహితంబు. తామసయాగంబు మదమత్తు

లగు దానవులకు యోగ్యంబు. మోక్షకాములకు మానసంబు కర్తవ్యంబు తత్ప్రకారంబు వినుము. 240

సీ. మనము నిర్మలముగ నొనరించి గుణములు • వర్జించి యింద్రియవర్తనముల
నణఁగించి దేహంబు నతిశుద్ధముగఁ జేయఁ • గలవాఁడు తగునధికారినుమ్మ
మంటపమ్మును వేది మహితాగ్నులను ఋత్వి • జులను దక్షిణల నచ్చుగ మనమునఁ
గల్పించుకొనవలెఁ గడఁగి దీనికి హోత • యజమానుఁడునుగూడ నరయమనము;

గీ. నిర్గుణబ్రహ్మ మధిదైవనియతిఁ దనరు • నాద్యయును నిర్గుణయు నగునట్టిశక్తి
ఫలద, బ్రహ్మైక్య మిద్దానిఫలము, మునులు•దీనిసేఁతకుఁ దగువారు తెలియు మధిప!

క. ఏవంవిధ మగుజన్నం, బేవారు రచింతురో మహీయశ్శ్రద్ధా
ధీవిభవు లగుచు వారే, జీవన్ముక్తు లని చెప్పఁ జెల్లును రధిపా! 242

వ. తక్కిన జ్యోతిష్టోమాదికంబునకు ఫలంబు స్వర్గంబు, అయ్యది యస్థిరంబు. ఐనను మానసంబు రాజన్యులకు దుష్కరం బగుటంజేసి తాదృశంబులగు యాగంబులు కర్తవ్యంబులు. అందుఁ దామసంబగు యాగం బొనరించి పర్వవైరంబుఁ దీర్చికొంటివి. ఇఁక రాజసంబగు జన్నం బొనర్చి ధన్యుండవు కమ్మని మఱియు నిట్లనియె. 243

శా. దేవీబీజవిధానవేత్తలగు భూదేవాగ్రణుల్ ఋత్విజుల్
గా వేదోక్తవిధానరీతిగ జగద్గణ్యంబుగా వేడ్కమై
దేవీయజ్ఞ మొనర్చి దుర్మృతిగతిం దీంద్రించు నీతండ్రి స్వ
ర్గావాప్తిం గనఁగాఁ బితౄణమును బాయం జెల్లదే? భూవరా! 244

మ. ఘనసంగ్రామమొ! పుణ్యభూతలమొ! గంగాతీరమో! కాక నీ
జనకుం డున్నతసౌధరాజమున దుస్సర్పమ్ముచే దుర్మృతిం
గని ఘోరంబగు రౌరవమ్మునఁ బడెఁగా, గాశిమహాయజ్ఞ సం
జనితానంతవిశేషపుణ్యమున నుచ్చైర్లోకమున్ గూర్పుమా. 245

ఉ. చెందితి సర్వసౌఖ్యములఁ జేసితిఁ బుణ్యములన్ జిరాయువుం
బొందితిఁ గర్మబద్ధ మగుబొంది విఁకన్ ద్యజియించి యాత్మతోఁ
బొందఁగరానిసౌఖ్యములఁ బొందఁగఁజెల్లదె? యంచుఁ దృప్తిఁ జె
న్నొందినవానికిఁగా గలుగు నుత్తమలోకము పార్థివోత్తమా. 246

వ. భవజ్జనకుం డిట్టి తృప్తిగల్గి దేహత్యాగం బొనరించినవాఁడు కాఁడు. కావున మున్ను

మహావిష్ణువుచే నొనర్పంబడినదియు ననర్గళ ఫలదంబును నగుదేవీయజ్ఞం బొనరించి యకృతనం గృతార్థు నొనర్చి పితృత్రాణవిముక్తుండవు గమ్మనుడు జనమేజయుండు సాశ్రుకంఠుండై సాత్యవతేయున కిట్లనియె. 247

మ. హరి జన్నంబొనరించె నంటి వొగి నాయజ్ఞంబున న్నాధులె
వ్వరో ? యద్దానివిధాన మెట్టిదో ? జగద్వంద్యుండు విష్ణుండు త
త్పరతం జెందుట కేమికారణమొ ? సర్వమ్ముల్ గుదింగూర్చి స
త్కరుణాదృష్టివచించి మీఁద మఖమున్ గావింపఁగాఁ జేయుమా. 248

క. అనుజనమేజయుఁ గనుఁగొని, యనువ్యాసుం డధిప ! విను మహాద్భుతమగున
ట్లొనరించె మున్ను జన్నం, బును విష్ణుం డంబ మిగుల మోదము చెందెన్. 249

వ. హరిహరవిరించు లట్లు దేవీ నికటంబునుండి శక్తియుక్తులై విమానం బధిష్ఠించి స్వస్వరూపమ్ములు ధరియించి యర్ణవ నికటమ్మున కేతెంచినపిమ్మట, 250

గీ. ముగురకును మూఁడు వానముల్ తగుగతిని నొ
నర్చికొని యున్న యంత ననంతకరుణ
యైన యా యంబచే ముక్తమయ్యె నచల
యైన యాధారశక్తి యద్దాని నూని, 251

సీ. ధర పుట్టె, నద్దానిఁ దగ మధుకైటభ • మేదోభరమ్ముతో మిళితమైన
కతమున మేదినిగా వచింతురు; ధార • ణముఁ బొనర్చినకారణమున ధర య
నియు,మహీయత్వంబెనయుటను మహి యని•యును,విస్తృతంబగుటను బృధివి యు
నియు,వచింతురు దాని నెటిమోయుటకుఁ బర్వ•తములఁ జేసిరి విస్తృతములు గాఁగ

గీ. నందు మేరువు కనకమయంబు రత్న • శృంగసంశోభితంబు; మరీచినార
దాత్రిపులహక్రతుపులస్త్య లవసిష్ఠ • దక్షులును బ్రహ్మపుత్రులై తనరు మునులు.

గీ. అలమరీచికి సుతుఁడు గశ్యపుఁడు దక్షు, నకుఁ త్రయోదశకన్యకల్ ప్రకటమతులు
పుట్టి; రమరులు దైత్యు లిర్వురును దక్ష, కన్యకలయందుఁ గల్గిరి కశ్యపునకు. 253

డీ. దానఁ గాశ్యపి సృష్టి యత్యధికమయ్యె, మనుజులును బశువులును గ్రహముగ విస్త
రించునంతటఁ బుట్టె విరించి దక్షి, ణాంగమువనుండి మనుఁడు స్వాయంభువుండు.

వ. ఆవిర్భవించి వామభాగమ్మునుండి శతరూపయను నొకకన్నియ పుట్టె వీరివురకుఁ బ్రియవ్రతోత్తానపాదులను నతిసుందరులగు మువురు కన్యకలను మదయించిరి.

క. ఏవంవిధముగ సృష్టిని, గావించి సరోజభవుఁడు గాంచనగిరియం
దావెనుక బ్రహ్మలోకము, గావించుకొనె న్నివాసగతికై తనకున్. 256

వ. విష్ణువునకు నత్యుత్తమంబు వైకుంఠలోకంబును శివునకు రజతమయంబగు కైలాస నగరంబును నివాసంబులుగాఁ గల్పించె. 257

క. నానారత్న విరాజిత, మై నగానోత్సవకరంబునై తగునాక
స్థానము మేరుగిరిస్థము, గా నొనరిచి దేవతలకుఁగా నొసఁగె వెసన్. 258

సీ. మఱియు సముద్రంబు మథియించునప్పుడు • నుచ్చైశ్శ్రవంబను నొక్క యశ్వ
మును నాల్గుదంతమ్ము లెసఁగిన యైరావ • ణంబను గజము విన్నాణమైన
పారిజాతంబను పాదపంబును గామ • ధేనువు సామ్యంబులేవి సొబగు
గల రంభ మొదలుగాఁగల యచ్చరలు నందుఁబొడమినఁ గైకొనె గడఁగియింద్రుఁ

గీ. డుదయమందిరి జలజారియును భిషగ్వ • రుండు ధన్వంతరియును నఖండమైన
యర్ణవమునుండి వీరు దేవాంశభవులు • స్వర్గవర్తులు సృష్టి యీ సరణిఁజెలఁగె.

వ. మఱియు నండజస్వేదజోద్భిజ్జజరాయుజంబులను నాల్గుభేదమ్ములు గలిగి కర్మవశమ్మున ననేకజీవరాసు లుత్పన్నంబు లయ్యె. ఇవ్విధంబున కృతకృత్యులై బ్రహ్మ విష్ణుమహేశ్వరులు తమతమస్థానంబుల సుఖంబుండి రంత విష్ణువు లక్ష్మితో నమ స్తసుఖంబు లనుభవించుచు నొక్కనాఁడు సుధాసింధుగతం బగు మణిమండిత ద్వీపమ్మును నటఁ బొడకట్టినమహాశక్తియుఁ దన్నిమిత్తమ్మున దొరకొన్నమంత్రం బును దమకు స్త్రీరూపప్రాప్తియు మున్నుగాఁ గలసంగతులు మనమ్మునకుం దెచ్చుకొని యంబికాయజ్ఞంబొనర్పఁ గృతనిశ్చయుండై. 260

చ. తనభువనంబు వెల్వడి ముదంబున నంబుజసంభవున్ భవున్
ధనదు సురేంద్రుఁ బావకుని ధర్ముఁ వసిష్ఠుని దక్షుఁ గశ్యపున్
ఘనుఁడగు వామదేవమునికాంతు బృహస్పతిఁ దక్కువారలన్
బని గొని పిల్చి యత్నము నపారముగా నొనరించి యంతటన్. 261

వ. సమర్థులగు సప్తవింశతిఋత్విజులఁ గూర్చుకొని సువిస్తరంబు లగు వేదులఁ గల్పించి యథావిధిగ నగ్నుల నాసాదించి దేవీబీజ సమన్వితంబులగు మంత్రమ్ము లచే వ్రేల్చిన సంతసించి జగదీశ్వరి యశరీరిణియై యిట్లనియె. 262

ఉ. ఎంతయు సంతసించితి రమేశ! భవత్కృతమైన యజ్ఞ మిం
తింతగ నొప్పునే! భవదభీష్టములెల్ల ఫలించుఁగాక వా

క్కాంతుఁడు వింద్రుఁడుఁగా మొదలుగాఁగల దేవతలెల్ల విన్ను న
త్యంతము పూజసేయ వరదాతవుగాఁగల వెల్లవారికిన్. 263

సీ. జన్నములను నీకు సకల దేవతలలోఁ • బ్రాముఖ్య మెంతేనిఁ బరిఢవిల్లు
రాక్షసభీతి గీర్వాణులెల్లరు విన్ను • శరణుఁగైకొనిపారె సంశ్రయింత్రు
వేదమ్ములఁ బురాణవాదమ్ములను నీవ • యధికుండ వంచుఁ బ్రఖ్యాతి వచ్చు
ధర్మమ్మునకు నుపద్రవ మబ్బుతఱిఁ ద త్త • దవతారములు దాల్చి యవనియందు

గీ. వివిధయోనుల యందు నావిర్భవించి • భూభరమ్మును దీర్చెడి పుణ్యమూ ర్తి
వై నెగడఁగలవు సిరి నిన్ననవరతము • వదలకుండెడి నాదగుపరము కలిమి. 264

క. వారాహి నారసింహియు, నా రాజియరూపముల నెనసి శక్తులు నీ
కారయ సహాయలై కా, ర్యారంభములఁగా సమాప్తి నందింతురొగిన్. 265

వ. అట్టిశక్తుల నెన్నండును నీ వవమానింపక తగుగతి మన్నింపు చుండుము. భూలో
కంబునను స్వర్గలోకమ్మునను నీమహిమం బమేయమై యొప్పు నని చెప్పి విరమిం
చిన విష్ణుండు నమందానందంబు చెంది క్రతుసమాప్తి నొందించి యెల్లర గౌర
వించి మరల వైకుంఠంబున కరిగి సుఖం బుండె. 266

క. అనిచెప్పినవ్యాసునిఁ గని, జనమేజయుఁ డిట్లు వల్కె సాత్యవతేయా!
మును దేవీయజ్ఞం బిం, క నెవరొనర్చిరొ వచింపఁగాఁదగుఁ బేర్మిన్. 267

వ. అనవుడు నాతండొక్క యితిహాసం బిట్లని చెప్పందొడఁగె. 268

## ధ్రు వ సం ధ్యు పా ఖ్యా న ము.

మ. అలరారున్ సరయూతటమ్మున నయోధ్యాపట్టణం బద్ది కో
సల దేశమ్మునకెల్ల భూషణము కంజాతాప్తవంశ్యుండు కీ
ర్త్యలఘుం డప్పురి నేలుచుండు ధ్రువసంధ్యాఖ్యుండు రాజాఖ వి
ప్రులురాజన్యులు వైశ్యులుంగలరు శూద్రుల్ తత్పురిన్ ధార్మికుల్. 269

ఉ. ఆతని రాజ్యమందు నొకఁడైనను జోరుఁడు గాని జారతా
ఖ్యాతుఁడుగాని సూచకుఁడుగాని వసింపఁడు రాజ్య మీగతి
న్నీతిగ నేలు నాదరణి నేతకు విద్దఱు ముద్దరాండ్రు, త
జ్జాతియు నీతిరీతియును జందము నందము నందనీయముల్. 270

క. ఆవిధి మనోరమయు లీ, లావతి యనఁ దనరు నా విలాసవతులతో
ధూవిభుఁడు సుఖంబుండఁగ, నా వెలఁదులు చూలు దాల్చి యంతఁ గ్రమముగన్.

వ. * సుదర్శనుండును శత్రుజిత్తు నను నిరువురు పుత్రులం గనిన రాజు వారలకు జాత కర్మాదికం బాచరించి యథావిభవంబుగ విప్రులకు ద్రవ్యంబు లొసంగి సమసౌహార్ద మ్మున వారలం జూచుచు మనోహరులగు నక్కుమారుల కతమున నానందమ్మగఁ గాలక్షేపం బొనర్చుచుండె. 272

ఉ. వారలలోన జ్యేష్ఠుఁ డనవద్యతనుండు సుదర్శనుండు, వి
స్తారవిలాసరూపసముదారవచోవిభవాభిరాముఁడున్
ధీరుఁడు శత్రుజిత్తవని తెల్వికిఁ దండ్రియు మంత్రులుం భటుల్
పౌరులు సంతసించి కడుఁబక్షమునం గనుచుండు రాతనిన్. 273

వ. అంతనొక్కనాఁడు ధ్రువసంధి మృగయావినోదార్థం బడవి కేతెంచి యనేకమృగ మ్ముల నుక్కడంచుచు నొక్కనికుంజమ్మునందలి సింహముం గొట్టుడు. 274

మ. సట లింతింతలు చేసి యూర్ధ్వముగఁ బుచ్ఛంబున్ దుటాయించి వి
స్ఫుటవర్షాభ్రవటత్పటధ్వని సభోభూభాగముల్ నిండ మి
క్కుటమౌ కోపభరమ్మునన్ భయదమై కుంజం బొకంజన్ సుదు
ర్ఘటవేగమ్మున వెల్వడె న్నృపవరున్ గ్రాసంబుగాఁ గైకొనన్. 275

వ. చనుదెంచునాహర్యక్షంబు నీక్షించి యతఁడు వాలును బలకయుఁ దాల్చి చలింపక రెండవసింగంబై నిలిచె. తద్భటులు తమతమ యాయుధమ్ములతో సన్నద్ధులై యనేకశరమ్ము లద్దానిపై విడుచుటయు, 276

ఉ. చెచ్చెర వచ్చి యానృపతిసింహునిపైఁ బడె ధైర్య మెంతయున్
హెచ్చఁగనాతఁడున్ గడఁగి యేపెఁగరాసి మృగేంద్రుఁడంతటన్
నొచ్చి మఱింత హెచ్చి తన నూతనశాతనఖాగ్రధారలన్
వ్రచ్చినఁ జచ్చె నానృపతివల్లభుఁ డేమనవచ్చు దైవమున్. 277

క. ఆ నృపతి ఖడ్గనిహతిం, దా నొచ్చినదగుటకతనఁ దత్క్షణ మదియుం
బ్రాణములు వీడి యానృపు, పై నొరిగెన్ మృతులగతులు బహుభంగులుగా. 278

వ. అంత రాజభటు లేతెంచి జరిగిన వృత్తాంతంబెల్ల మంత్రుల కెఱిఁగించిన వారును

---

* సుదర్శనుఁడు శత్రుఁజిత్తుకన్న 1 మాసము పెద్ద.

వసిష్ఠ పురస్సరంబుగాఁ గరణీయంబులు నిర్వర్తించి సుదర్శనునకుఁ బట్టాభిషేకం
బొనర్ప నుంకించిరి. 279

ఉ. దానికి సమ్మతించిరి ముదమ్మునఁ బౌరజనుల్, వసిష్ఠుఁడుం
"భూమితుఁ డీతఁ డీతనికిఁ బోలును రాజ్య మొసంగుఁ" డంచు స
మ్మానము చూపె నంత నభిమానధనుండు యుధాజిదాఖ్యుఁ డ
న్యాయ్యుఁడు శత్రుజిత్తున కమంగగు తాత రయంబెలర్పఁగన్. 280

వ. జామాతృ మరణంబు విని యుజ్జయినీపురంబు నుండి యేతెంచె నాకోసల మనో
రమాజనకుం డగు కళింగాధిపతి వీరసేనుండు తన మనుమఁడగు సుదర్శనునకు
హితం బాచరింప నటకు వచ్చె నిట్లు యుధాజి ద్వీరసేను లిరువురును తమతమ
దౌహిత్రులకుఁ గూర్చువారై మంత్రులతో నాలోచించుచున్నంత యుధాజిత్తు వీర
సేనున కిట్లనియె. 281

క. నీదుమనుమఁడు సుదర్శను, డాదరణీయుండు జ్యేష్ఠుఁడగు కతమున నా
పాదికమున జ్యేష్ఠుం డగుఁ, గాదే మా శత్రుజిత్తు గనుఁగొను మింతన్. 282

వ. లోకమ్మున వయోజ్యేష్ఠులకన్న గుణజ్యేష్ఠుల గారవింతు రట్లగుట నా మనుమఁడ
రాజ్యార్హుం డనుటయు, 283

గీ. వీరసేనుండు పల్కె "నీ వెట్టిమాట, తగదు నాసుతయే కదా! ధర్మపత్ని
తత్తనూజుఁడు రాజు సుదర్శనుండు, జ్యేష్ఠుఁగాదని ధర్మముల్ సెప్పు టెట్లు?" 284

వ. అనుడు వీరసేనునకు మంత్రు లెదురాడక సుదర్శనునక పట్టంబుగట్ట నుంకింపుడు
యుధాజిత్తు మంత్రులం జూచి, 285

ఉ. మీరును మీరు నేకమయి మేదినికిం బతిగా సుదర్శనున్
వారకచేయ నొప్పికొనువాఁడె యతండు! బలాన్వితుండు వి
స్ఫారవివేకశాలి గుణవంతుఁడు నా మనుమండు మద్బలో
దారత మిమ్ము గీటడఁచి తప్పక రాజ్యము సంగ్రహింపఁడే? 286

క. కరమున నే నసిఁ బూనిన, ధరణియు బ్రక్కలగు నవిరఁ దక్కొరులకు నన్
బొరయఁగఁ దరమే? మనమున, నరసికొనుఁడు మీఁద జరుగునట్టిది యెల్లన్. 287

వ. అని వీరాలాపమ్ము లాడిన వీరసేనుండు యుధాజిత్తున కిట్లను, 288

క. నా మనుమఁడు నీమనుమఁడు, నీమెయిని సమానులగుట యేర్పడె మఱియున్
నా మనుమఁడు జ్యేష్ఠుం డతఁ, డీ మహి నేలంగఁ గర్త యెన్నివిధములన్. 289

వ. ఇట్లు వారెడతెగని వైరమ్మున వాదించుచుంటకు నచటివా రందఱును వ్యగ్ర
మానసులైరి. 290

క. ధ్రువసంధి నృపతిమరణం, బు వినితగన్ శృంగబేరపురవాసులు చౌ
ర్యవిధి ధనంబు హరింపఁగ, తవతవ నప్పురమునకు హుటాహుటినడలన్. 291

వ. వచ్చి యతికోలాహలంబుగా నలుప్రక్కల వ్యాపించియుండి రంత యుధాజిద్వీర
సేనులు తమతమసైన్యములను గూర్చుకొని యుద్ధ సన్నద్ధులైరి. 292

## యుధాజిద్వీరసేనుల యుద్ధము.

క. ధృతశస్త్రహస్తులును నం, గతసైన్యసమేతులును నఖండరుడావే
శితులును నగు నయ్యిరువుర, కతులితమగు తుములయుద్ధమయ్యె నృపాలా! 293

క. దండిమెయి వీరసేనుఁడు, కొండవయిన్ గిరియు మొగులుకొమరున నత్యు
ద్దండంబుగ బాణంబుల, తండంబులువరపె నాయుధాజిత్తుపయిన్. 294

క. వీఁక నిటు వీరసేనుఁడు, దాఁకి ప్రయోగించుశరవితానము గడు ను
ద్రేకమున యుధాజిత్తు, త్రేక మెలర్చెడిశరముల ఛేదించె వడిగా. 295

క. తురగంబులుఁ దురగంబులు, కరులుఁ గరులు భటులుభటులు గాసి పెనఁగ నం
బరచరులును భయపడిన వి, తరులకు నానంగరంబు దరమే పొగడన్. 296

వ. అట్టి యెడఁ జూర్ణంబులగు రథంబులును ఖండితంబులగు వారణంబులును భగ్నం
బులగు తురగంబులును పాతితులగు పదాతులును ద్రెళ్ళునశిరమ్ములును దెగినకరమ్ము
లును బగిలిన వక్షమ్ములును దగిలినబాణమ్ములును నై సంగరమ్ము ప్రవర్తిల్లె. 297

క. పిశితంబుగా గ్రహియించెడి, యశనాయాపీడితమ్ము లగు బహు కంకా
ది శకుంతమ్ముల యార్పుటి, దశదిశ లొక్కుటగ మ్రోసె ధరణీనాథా! 298

క. కొండల కెనయగు మాంసపు, ఖండపుఁ బ్రోవులను వెడలఁగాఁ జొచ్చె మహో
ద్దండము లగు పెలయేఱుల, తండములన రక్తములు పదంపడి యచటన్. 299

చ. అరదమునుండి చచ్చిపడినట్టి శవమ్ముల పైపయిన్ దివిన్
గరమును మాంసముం గొనెడికాంక్షఁ జరించెడిగ్రద్ద పెద్ద వి
ద్దురగతియుండియున్ సొబగుతోఁ దులఁదూఁగునిజాంగకమ్ములన్
బొరపెడి దేహమందుఁ జొరబోయెడిజీవుఁడు నాఁగఁ జొప్పడెన్. 300

చ. అవిఁ దెగటారి యాకసమునందు విమానమునెక్కి యంకమం
దెవసి విలాసముల్ గొలిపి యింపుఘటించెడి యప్సరోంగనన్
గని యొకవీరుఁ డిట్టులను "గాంత ! మదీయశరీర మెంతచ
క్కనిదొ గతాసువయ్యెఁ గనుగందదు కన్గొనుమా ! రణావనిన్." 301

చ. ఇఁక నొకవీరుఁ డప్సరయు వింపుగ ముచ్చటలాడుచుండ జక
చ్చకితవిమానమెక్కి చనఁ జయ్యన నాతనిధర్మపత్ని య
గ్నికి నెరఁజేసి దేహము నొగి న్నవదేహముఁ దాల్చి వేగఁ ద
న్నికటముచేరి యాసవతినిన్ బడఁగొట్టె మగండు నవ్వఁగన్. 302

మ. అవిలోమారొక్కనియుద్ధబద్ధభటుల్ ప్రాణంబుగోల్పోయి నె
ట్టన నొక్కమ్మడి నేగియేగి యట మింటన్ దమ్మునంటంగ వ
చ్చిన వేల్పుంజవరాలిమిన్నఁ గని యాచిన్నారిపొన్నారి యం
గనకై పెన్కొటికన్న నెక్కుడుఁ రుషన్ గొట్లాడి రత్యంతమున్. 303

సీ. నాభార్యకన్న విన్నాణంబు గలదాన ! యంచు నప్సర గౌరవించె నొకఁడు
ఏకపత్నీవ్రతం బేమిసేయుదు ముట్టు ! దగదు బొమ్మనె వేల్పుమగువ నొకఁడు
కలికి ! నాచెలిమిన్న కన్న నెక్కుడుదాన ! వా ! బొమ్మనియె వేల్పువనిత నొకఁడు
తవప్రతాపము చెప్పి తన కనుకూలఁగాఁ ! గావించుకొనె దేవకాంత నొకఁడు
గీ. అయినవా రెందరో ! యిప్పుడగుచునున్న ! వారలెందరో ! కాబోవువారలెంద
రో ! యొకండంచుఁ గలఁడె మీరో యువిదల ! కనుచు నిరసించె నప్సరోవనిత నొకఁడు.

ఉ. ఒక్కని చెట్టవట్టి మఱియొక్కనికిన్ విడె మిచ్చి ముద్దు వే
ఱొక్కనికిచ్చి చల్లనిమృదూక్తుల వేఱొకనిన్ నగించి యిం
కొక్కని చెక్కుఁగొట్టిపోలుపొందె నొకప్సరలేమ; యొక్క విం
జికుక్కటనున్న గాదె వెలచేడెలు స్వర్గముపొంత వోయినన్. 305

మ. బలవాహాతిరేఁగు ధూళి దిశలన్ వ్యాపించి పై నంబర
స్థలి కేతెంచి సరోజబాంధవుని తేజంబు న్నివారించి ని
శ్చలమై రే బవ లన్నమాట లవలేశంబైన లేకుండఁ జే
సి లలద్రక్తపయోధిలోఁ బడుదుఁదోఁచెన్ సూర్యుఁడామీఁదటన్. 306

క. అట్టియెడ వీరసేనుని, బెట్టిదమగు తూపులేసి బిట్టడఁచె జగా
జెట్టి యుధాజిత్తతఁడును, జెట్టువలెన్ గూలె సేన చెదరెన్ దిశలన్.. 307

వ. మనోరమ తన తండ్రి మృతిన్ విని దుఃఖితయై, 308

చ. పతి చనిపోయెఁ దండ్రి నరపాల శిరోమణి మన్నిమిత్తమై
మృతిఁగనె నాఁటిలో, సుతుఁడు మేలును గీడు నెఱుంగరాని చి
న్నతనమువాఁడు; దిక్కెవరు నాకిటఁ। బాతకుఁడైన యాతఁ డీ
సుతుని వధించి రాజ్యమును సొమ్మును మన్మని కీఁదలంపఁడే. 309

ఉ. పాపముఁ బుణ్యమంచుఁ దనవార లటంచును నన్య లంచుఁ గో
పోపహతుల్ నిరస్తవినయుల్ కడులోభులునైన వార లా
హా। పరికింప నేర్తురె? భయం బెదఁ బాపి యనుగ్రహించులో
కోపకృతి స్వభావులు మహోత్తము లిక్కడ నెవ్వ రిమ్మెయిన్। 310

గీ. మొదలనుండియు నే నన మదినిమండు, సవతి లీలావతియుఁ గృపసలుపునొక్కొ।
శీఘ్రముగ వచ్చి యయ్యుధాజిత్తు మమ్ము, బంధనాగారమునఁ బడవైచు నిజము.

వ. మున్నింద్రుండు కోపావిష్టుండై మాతృగర్భగతుండగుబాలకుం దన వజ్రమ్మున నేడు ఖండమ్ములుగా ఖండించి పిదప నయ్యేడింటి నేడేడుఖండమ్ములుగా నొనర్చిన నవి యేకోనపంచాశత్ఖండంబులై మరుత్తులనం బరఁగె. మఱియొకనృపకాంత తన సవతి గర్భవతియగుటకు సహింపక విషమ్మువెట్టిన విషదగ్ధుండగు బాలకుం డుద యించె నతండకాఁడె సగరుండు? 312

క. మును దశరథభూపా లాం, గనయౌ కైకేయి తనదుగాదిలి సుతు రా
జును జేసి సవతికొడుకున్, వనమున కంపించె ననెడి వార్తలు వినమే? 313

గీ. అరయ నాసుతు రాజ్యమ్మునందు నిల్పి, మంత్రులెల్ల యుధాజిత్తుమాట కడ్డు
చెప్పలే రన్నదమ్ములు సేయఁదగిన, వారు లేరైరి యింకెట్లు వర్తనంబు. 314

వ. అని బహుప్రకారమ్ములఁ జింతించి సకలకార్యనిపుణుండగు విదల్లుం దను మంత్రి వరు నేకతంబ రావించి యిట్లనియె. 315

చ. తనయుఁడు చిన్నవాఁడు తగు తంత్రవిధిజ్ఞుఁడు నాదు తండ్రి యు
ద్ధనిహతుఁడాయె మీప్రభువుధార్మికుఁడంతకుమున్న యంతమున్
గనెఁగద। శాత్రవుల్ ప్రబలి గర్వ మెలర్పఁగ మానభంగముల్
బొనరుపనుండి రిప్పుడిలఁ బోలు నుపాయ మొకండొనర్పఁగన్. 316

వ. నావుడు మంత్రి యిట్లనియె. 317

క. చలపట్టి యుధాజి ద్భూ, తలనాథుఁడు మిగుల మిష్ఠు దండించు నతం
దలఘుం డియ్యెడ పిటుపై, నిలుచుట యుచితంబు గాదు నిక్కము తల్లీ ! 318

క. బలవంతుండును గాక, తలనాథుం డెంత కేనిఁ దగు నన్మన్మి
తులుఁడు సుబాహుం డతఁడు మ, నలఁ బ్రోచు నచటికినేగ నాహిత మనినన్. 319

వ. వల్లె యని యారాజపత్నియు రణనిహతుఁడగు తన తండ్రికి నర్ధ్వకృత్యంబులు నెరవేర్పంజేసి సైరంధ్రీ విదల్ల సహితంబుగాఁ గుమారుం దోడ్కొని భాగీరథీ తటమ్మున కరుగుటయు, 320

ఉ. క్రూరులుచోర లచ్చట నకుంఠితదుర్నయలీల రాత్రి య
వ్వారలఁ గొట్టి మేనఁ గల వస్తువులుఁ ధనమున్ సమస్తమున్
గారణమాత్రులై బలిమిఁ గైకొని యేగిరి "యూరు విడ్చి పై
గ్గూరికిఁ బోయినఁ జలమునూనినకర్మము మానసేర్చునే ? 321

వ. ఇట్లు చోరోపహృతయై ప్రతికూలమ్మగు దైవమ్మునకు వగచుచు వస్త్రమాత్రావశేషం బుగ నచ్చోటుగదలి సైరంధ్రి సహాయగ నుడుపం బెక్కి గంగానదిం దాఁటి భార ద్వాజాశ్రమంబునకుం జని కొంత ధైర్యమ్ము చెంది యమ్మునియెదుట నిలువం బడుడు నమ్మహానుభావుండు కరుణార్ద్రుండై యామె కిట్లనియె. 322

క. నీ వాసస్థల మెయ్యది ?, నీవల్లభుఁ డెవఁడు ? దుఃఖనీరధి మునుఁగం
గావలసె నేమికతమున !, దేవతవో ! మర్త్యసతివో ! దెలుపుము మాకున్. 323

వ. అను మునివరునకు మాతాదక శోకించుచున్న విదల్లుం దమ్మునివరున కిట్లనియె.

మ. ధ్రువసంధ్యాహ్వయుఁడొక్కరాజు సుజనస్తుత్యుం డయోధ్యాపురీ
ధవుఁ డాతం డొకనాఁడు వేఁటకయి కాంతారమ్మునం గ్రుమ్మఱన్
గవిసెన్ సింగ మఖండ చండిమమహాకారామితారావదు
ర్వ్యపసాయాతిరయప్రకృష్టభయనారంభాతిసంరంభమై. 325

వ. అట్టియెడ నాతండును పిఱుతివియక యద్దాని కెదురై పోరె నయ్యదియు, 326

క. అక్షీణగతిని నృపహ, ర్యక్షునిపై కుఱుక నతఁ డహంకృతి వైచెన్
గౌక్షేయకంబు పదఁపడి, యాక్షణమ గతాసులైరి యన్యోన్యమ్మున్. 327

క. ఆతనిసతి యీసతి తను, జాతుం డీతండు వేఱుసతియును నాథా
నేతకుఁ గల దాపెకుఁ దను, జాతుం డొక్కరుఁడుగలఁ డసాధ్యుఁడు బలిమిన్.

వ. ఇట్లిరువురకు రాజ్యంబుఁ బట్టంబు గట్టుపొం చెనిరువురి మాతామహులుం బోరాడి

రా సమరమ్మున నీతనితాత పరేతయయ్యెఁ. బిదప నీరాజపత్ని తనపుత్రునిం గాపాడు
కొన గతిలేమి వనమ్మునం గ్రుమ్మరునది పుణ్యవశమ్మున భవద్దర్శనంబొనరించె.
భయాతురులగు ననదల సంరక్షణంబు కోటియజ్ఞఫలదంబని భవాదృశులకు వక్కా
ణింప నలయునే? అనవుడు భారద్వాజుం డమ్మనోరమ కిట్లనియె. 329

క. సచ్చరితవైన నీకున్, వచ్చినభయమేమి! పుడమి పాలించు నిజం
బి చ్చిఱుపాపఁ డభయం. బిచ్చితి నిచ్చోట నిలువు మిచ్ఛామగతిన్. 330

వ. అని యొక్కపర్ణకుటీరముం జూపించిన నాపెయు నిదల్ల సైరంధ్రీ సహితంబుగఁ
గుమారుండును దానును సుఖంబుండె. నట యుధాజిత్తును, 331

ఉ. సంగరరంగమున్ విడిచి సైన్యసమేతముగా నయోధ్య కు
ప్పొంగుచువచ్చి మంచిదగుమూర్తమునం దలశత్రుజిత్తు న
త్తుంగతరోత్సవం బెలయ దుందుభినిస్వనముల్ సెలంగ రా
జ్యాంగమునందు నిల్పెఁ బురమంతయు మంగళసంగతంబుగన్. 332

వ. అట్టియెడ ధర్మాధర్మవిచక్షణులగు కొందఱు జనంబులు. 333

గీ. అల మనోరమ యెచ్చటి కరిగెనొక్కొ!, యేడకేగె సుదర్శనుం డిద్ధచరితుఁ
డకట! వీరసేనుఁడు మృతుడైన కతనఁ, గాదె? యిటువంటి కష్టంబు కలిగె ననుచు.

గీ. వగలఁ బొగిలియు శత్రుజిద్వశగులైన, కతన నేమియు ననక సమ్మతిగనుండి
రిట్లు పున్మని రాజ్యమ్మునందు నిల్పి, యయ్యుధాజిత్తు తనపురి కరుగునెడల. 335

## యుధాజిత్తు భారద్వాజాశ్రమమ్మున కరుగుట,

వ. సుదర్శనుండును దల్లియు భారద్వాజాశ్రమమ్మున నున్నవారని యెఱింగి యతనిం
జంప నూహించి చిత్రకూటపర్వతమ్మున కరిగి నిషాదాధిపతియగు బలుఁడను
వానిం బురస్కరించుకొని శృంగిబేరపురాధిపతియగు దుర్దర్శు నికటమ్ము కేగుటయు,

చ. విని మనమందు భీతి గడు విస్తరిలంగ మనోరమాంగనా
జనతిలకంబు కన్నుల నజస్రము నశ్రులు గ్రమ్మ నమ్మునీం
ద్రునిదరిఁజేర్చి "యీసుతుని ద్రోహమునం గడతేర్ప శత్రుజి
జ్జనకుని దండ్రి మాకుఁగడుశత్రుఁడు వచ్చె మునీంద్ర వింటివే? 337

వ. మున్ను పాండవులు పాంచాలీసహితులై మున్యాశ్రమమున నున్నయెడ వారలేవురు

నొక్కనాఁడు వనంబున కరుగుటయు ద్రౌపది ధౌమ్యాదిమునులతో నాశ్రమమ్మున నుండె నయ్యవసరమ్మున, 338

శా. ఆమార్గమ్మున నేగుదెంచె వెన సైన్యంబుల్ తనుంగొల్వ దు
ష్కామార్తుండు జయద్రథుం; డతఁడు వేడ్కన్ వేదనిర్ఘోష ము
ద్దామప్రక్రియఁ గా నొనర్చుమునులం దర్శింప నేతెంచి యి
చ్చో మాద్యత్కరియాన యానఁగనె మించుంబోడి నాద్రోవదిన్. 339

చ. కనుగొనినంత నెమ్మది వికారము దొట్రిల మాటిమాటి క
వ్వనజదళాక్షిపై వల పవారితమై చన ధౌమ్యుఁ గాంచి యి
ట్లను "మునివర్య! యీజలరుహాననయీతనుమధ్య యీకన
త్కనకనిభాంగియెవ్వతెయొ! గ్రక్కననాకెఱిఁగింపు నావుడున్. 340

క. పాండుతరకీర్తియుక్తు ల, ఖండులు పాండవులు వారి గాదిలిసతి యీ
యండజయాన నెఱుంగవె?, పాండవులన నీకుఁ గూర్చుబంధులుకారే? 341

గీ. వారలేవురు మృగయకై వనముపొంతఁ, బోయి రిప్పుడో యిఁకనో రాఁబోవు వార
లనిన విని సైంధవుండు నయ్యతివఁ గాంచి, యిట్టులని పల్కె నాదరంబినుమడింప.

చ. కుశలమె నీకుఁ బాండవులకున్! బతులెచ్చటికేగి! రెంతయున్
గృశవయి తీ వరణ్యమున కేగుకతంబున; మీకు నింత దు
ర్దశఘటియించెఁగా! యనుచుఁ దద్దయుయోగ్యుఁడునాగఁబల్కెఁబం
చశరవికారదూషితుఁడు సైంధవుఁ డెక్కడు బంధువుంబలెన్. 343

వ. వదఁపడి ద్రోవదియు బంధునత్కారంబొనర్చె నంత నతండును. 344

క. పశువుగతి మంచిచెడ్డల, ప్రశంస విడనాడి ఋషులఁ బరికింపక దు
ర్వశుఁడై హరించె నామె వి, వశులగు దుష్టులకు వావివరుసలు గలవే? 345

వ. పిదపఁ బాండవుల వలన నామె విముక్త యయ్యెనని విందుఁగాన వేరిని విశ్వసింపఁ దగదు. మున్ను వైరోచనసుతుండును బహుళ యజ్ఞకర్తయు ధార్మికుండును బ్రహ్లాదపౌత్రుండు నగు బలిచక్రవర్తిని హరి కపటవామనాకారమ్మున నింద్రహితార్థంబుగా వంచించె. 346

ఉ. వామనమూర్తి లోభమున వచ్చి తమం ద్రిపదప్రమాణ మౌ
భూమిని గోరినన్ గపటభూసురుఁ డంచు నెఱింగియున్ మహో

ద్దాముఁ డఖండదాత బలి దా నఖిలమ్మును ధారవోసెఁ గా
నీ మఱుమాట పల్కఁ డతఁ డెంతటిసత్యవదాన్యుఁడో కదా. 347

వ. సత్త్వగుణప్రధానుండగు సాక్షాన్మహావిష్ణు విట్లొనరింప నీఁక నన్యులన నెంత ! కావున లోభోపహతచిత్తులకుఁ జేయరాని కార్యంబుండదు. 348

మ. పరహింసన్ బొనరింతు రొడ్లధనమున్ బ్రాణంబులం గొంద్రుము
ష్కరులై యన్యవధూరతిన్ దిరుగుచున్ గార్యం బకార్యం బటం
చరయన్నేరరు లోభు; లెయ్యెడల నన్యాయంబు లేతత్కృతుల్
పరలోకం బని భీతి చెందరు మనోవాక్కాయకర్మంబులన్. 349

ఉ. దేవతలన్ యజింత్రు పరదేశములన్ జరియింత్రు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము; లల్పలోభులో !
జీవుల హింససేయుదురు చేయుదు రెంతయుఁ జౌర్యమున్ దగన్
భావనసేయఁగాఁ బరధనంబు హరించెడిత్రోవ లిన్నియున్. 350

వ. కావున మన యాశ్రమవికటమ్మునఁ గాచియున్న యయ్యుధాజిత్తు నవ్వలికవ్వి నన్ను నిర్భయుం జేసి నా పుత్రుం గాపాడు మనవుడు ముసివసుండు వల్లెయని యుధాజిత్తు కడకేగి నీ రాకకుం గతమేమియని యడుగుడు నతండు మనోరమానయనంబున కని నుడివె నంత మునియును, 351

క. పతిశోకముఁ బితృశోకము, నతిభరమై తన్ను నేచ నాత్మజుతో న
య్యతివ మము శరణుఁజెందె వి, గతభయయై యిచటనుండి కదలునె మరలన్.

వ. అనవుడు యుధాజిత్తమ్ముని కిట్లనియె. 353

క. క్రమముగ నవిపిన నముపుము, క్రమమునకుం దక్కఁ తేనిఁ గడఁగి బలాత్కా
రముగఁ గొనువాఁడ నిజమునఁ, గ మునివరుఁడు కనుల నగ్నికణములు వెడలన్.

ఉ. ఓరి దురాత్మ ! యోరికలుషోదర ! యోరి జఘన్య ! వో బలా
త్కారముగా గ్రహింపఁదగు దార్ఢ్యము గల్గిన వట్లొనర్ప రా
దే ! ఋషులన్న రాజులకు నెల్లి దమే ? మును మా వసిష్ఠుతోఁ
బోరెను గాదె ధేనువును బొందఁగ గాధిసుతుం డెఱుంగుదే ? 355

వ. పిదప మంతనమ్మున యుధాజిత్తు మంత్రి కిట్లనియె. 356

క. మునివల్కులు వింటివికద !, మనోరమను సుతునితోడ మనము హరింపం
గ నుపాయమేది ! రిపువృ, ద్ధిని పైఁపఁగరాదు సూపె ధీమంతులకున్. 357

ఆ. వె. రాజయక్ష్మవగిది రాజన్యులకు రిపు, శేషమున్న బాధచేయుఁగానఁ
దవిలి వీనిఁ జంపి దౌహిత్రురాజ్యంబు, విగతశత్రుకముగఁ దగనొనర్తు. 358

క. ఇటనన్ను నెదిరికొని పో, రుట కెవ్వఁడు లేకయుంట రూఢియకద ! యీ
జటిలుని పల్కులకుం జం, కుట యుచితమె యనుచు మంత్రి కోవిదుఁడనియెన్.

చ. నరవర వింటివే ! మునులనన్ మహనీయులు సాహసించు ము
ష్కరుల నొకింతలో వణఁకగా గల రెందును వారు పూన దు
ష్కరమగు కార్యముండ దదిగాక మునీంద్రుఁడు "గాధిపుత్రునిన్
గరము నెఱుంగుదే" యనిన కారణమున్ విను మే వచించెదన్. 359

క. మును విశ్వామిత్రుం డను, జనవరుఁ డొక్కెడ వసిష్ఠసంయమిఁ జూడన్
జనుటయు నమ్మౌని తగు నా, ననమిడి గౌరవము సలిపి సంతస మెసఁగన్. 361

వ. సైన్య సహితంబుగా విందునకు నిలువుమనుడు నతం డట్లొనర్చె. 362

ఉ. నందినియుణా వసిష్ఠమునినాయకునానతి తెప్పపాటులో
వందల కన్నిభంగుల ననంతములై తగుభక్ష్యభోజ్యముల్
విందులొనర్ప సైన్యసముపేతముగా నలగాధిపుత్రుఁ డా
విందును దృప్తిగా ననుభవించె నుతించుచుఁ దన్మహత్త్వమున్. 363

వ. పిదప నమ్మునివరు నడిగి యాధేనువుం గొనువాఁడై సవినయమ్ముగ నిట్లనియె.

ఉ. ధేనులఁ జూడమో ! మునుల దివ్యమహోమహిమానుభావులం
గానమొ? యెన్నఁడేని యిటు గాంచితిమే ? యొకరెప్పపాటులో
సేనలతో నృపాలురకుఁ జెచ్చెర విందులొనర్చి తృప్తులం
గా నొనరించు ధేనువులఁ గన్గొన నీమహిమంబు శక్యమే. 365

క. అని మెలమెల్లన నిట్లను, వనఘా ! ధేనువుల దశసహస్రంబులు నీ
కు నొసంగెద నా కిద్దా, నిని దయసేయఁగదె కోర్కె నెరవేర్పఁగదే ? 366

క. అనుడు వసిష్ఠుండను నో, జనవర ! యెన్నేని దీనిసరిగా నిది నం
దిని యనుధేనువు హోమం, బున కిక్షీరములు మాకు ముఖ్యము లరయన్. 367

వ. గాన దీని నీనేరననుడు నతం డిట్లనియె. 688

క. ఈకుంటివేని యెట్లేఁ, జేకొనియెద నెల్లినేఁట నిద్ధ మనుడు నెం
తో కోపియై వసిష్ఠుఁడు, గైకొందువుగాక చూడఁగాఁగల నేమణా. 369

వ. నావుడు విశ్వామిత్రుండు బలిష్ఠులగు భటులం బిలిచి నందినిం బట్టుకొనుఁడనుడు
వారును నద్దాని నట్లొనర్ప భయకంపితయగుచు నయ్యది వసిష్ఠున కిట్లనియె. 370

ఆ. వె. ఏమి తప్పుగలిగె? నేకారణంబున, నన్ను విడిచెదీ? వనయులు భటులు
పట్టికొనఁగనేల? బాధింపఁగానేల?, యనుడు మునియు ధేనువునకు ననియె. 371

మ. బలవంతుండగు రాజు దుర్నయమునం బాధించుచున్నాఁడు నేఁ
గలకార్యంబు మఱేమి? నిన్ను విడువంగా నోప నాశక్తికిం
దలఁదాఁచెన్, దపమేడ? యుద్ధమునకుం దార్కొలు తానేడ? నీ
తలమైనన్ విడిపించుకొమ్ము ననువొందఁగా రమ్ము మమ్మాటికిన్. 372

మ. అని మౌనీంద్రుఁడు పల్క నందినియుఁ గ్రోధావేశమొప్పార హం
మ్మను నాలోనన రాక్షసుల్ ప్రబలదర్పాహంకృతుల్ మీఱఁ ద
ద్ఘన కాయమ్మునఁ బుట్టి విల్వ్యమని తత్సైన్యంబు వారించి గ్ర
క్కునఁ గాఁ జేసిన నెట్టులో మిగిలెఁ తత్క్షోణీశ్వరుం డొక్కఁడుఁ. 373

ఉ. అంతయుఁ గాంచి నెమ్మనమునం దతిభీతియు సంతసంబును
జింతయుఁ దొట్రిలంగఁ గడు సిగ్గిలి సీ! నృపపౌరుషంబు గో
రంతయుఁ గాదు బ్రాహ్మణతపోధికతాధిగతప్రతాప మిం
తింతఁగ నొప్పునే? ముని జయించుట కేమియుపాయ మిత్తఱిన్. 374

మ. అని దీర్ఘంబగు చింత నెమ్మనమునం దావిర్భవింపన్ ధిగం
చును క్షాత్రంబును ధిక్కరించి తప మస్తోకంబుగాఁ జేసి వా
రని కిన్కం ద్విజుఁడై మునీంద్రుఁడగుచున్ బ్రహ్మర్షి యంతయ్యు న
మ్మునికింజాలకపోయె * బ్రాహ్మణులతోఁ బోరాడుటల్ మాటలే. 375

క. కులనాశకరంబగు వి, ప్రులతో వైరంబుగాన భూవర! మనమున్
జఁ పట్టి కొఱవితోడన్, దలఁగోకికొనకయ చనఁగఁదగు మనపురికిన్. 376

ఉ. దీనుఁడు వృద్ధుండు గత తేజుఁడు బాలుఁడు తోడు లేదర
ణ్యాల వసించువాఁ డనదనాఁదగువాడు సుదర్శనుండు నీ
పై నెటు రాఁగలాఁ డటులు వచ్చినఁ జూడఁగవచ్చుఁ గాని యీ
మౌనివరేణ్యునిం జెనకి మానముఁ బ్రాణముఁ గోలుపోకుమీ. 377

* తాపసులతో.

ఆ. వె. తృణము వజ్రమగును దృణమగు వజ్రంబు, దోమ యేన్గుగున్నతో నెదుర్చు
శశకమైనఁగాని శార్దూలమును జంపు, దైవయోగ మొకటి దప్పనేని. 378

క. కాఁదగినది కాకుండదు, కాఁ దగనిది కాదు దైవకారణమున నా
మోదము ఖేదముఁ దుల్యం, బ్రాదుర్భావమ్ము లిందు వగవరు తద్జ్ఞుల్. 379

వ. అను మంత్రివచనమ్ములకు సమ్మతించి మునీంద్రుపాలికిం జని నమస్కరించి నానే
రమి సైఁపుమని వేఁడుకొని యనుజ్ఞాతుండై యుధాజిత్తు తనపురమ్మున కరిగె
నంత మనోరమయు స్వస్థచిత్తయగుచు నయ్యాశ్రమమ్మున నుండె శుక్లపక్షచంద్రుం
బలె దినదినప్రవర్ధమానుండగు సుదర్శనుండు సవయస్కులగు ఋషిపుత్రులతోడం
గ్రీడించువాఁ డొక్కనాఁడు విదల్లుం గుఱించి మునిపుత్రుం డొకఁడు క్లీబయని
యామంత్రించుటయు, 380

## సుదర్శనునకు కామబీజప్రాప్తి.

క. విని యందు నాదివర్ణము, ననుపుగ బిందువునుగూర్చి యనుదినముఁ బఠిం
చెను భావిభాగ్య వశమునఁ, జనె నొక యైదేడులిట్లు జననాథమణీ! 381

ఉ. న్యాసమునున్న ఛందమునసట్టిది లే దిఁక ధ్యానమన్న స
న్న్యాసము సర్వశూన్యముగ నాతఁ డదృష్టమహోదయమ్మునన్
జేసి మనమ్మునన్ నిలిపి శ్రీకరమై తగు కామబీజ మ
ధ్యానము చేసె నెన్నటికినైనను విస్మృతిఁ జెందకుండగన్. 382

గీ. అంత నేకాదశాబ్దంబునందు నుపన, యనము గావించి ముని వేదమభ్యసింపఁ
జేసె నా రాజసుతుఁడు సుశ్రీవహించె, వేదమున శాస్త్రమున ధనుర్వేదమందు. 383

మ. ఒకనాఁ డంబిక రక్తవర్ణయును రక్తోద్యద్విభూషాంబరా
దిక బాహాసురచారుగాత్రయును నై దివ్యస్వరూపంబుతో
సకలంకుండగు నా సుదర్శనునిపై సత్యాదృతస్వాంతయై
సుకృతంపుంగవియై ఖగేశరథయై చూపట్టెఁ బ్రత్యక్షమై. 384

ఆ. వె. ఆ సుదర్శనుండు నాయంబ వైష్ణవిఁ, గాంచి మ్రొక్కి భక్తి గడలుకొనఁగ
సేవ సేయుటయు దయావతి యాతల్లి, శరశరాసనాది సకలమొసఁగె. 385

గీ. శరశరాసన కవచముల్ శరధియుగళ, మాదిరిగాఁగొని దేవీకృపామృతమున
కాటపట్టయి మిగులఁ బ్రఖ్యాతి నెసఁగి, యతఁడు నవమన్మథుండయి యలరునంత.

శా. కాశీరాజతనూజ రూపమునకుం గాణాచి, విద్యావయః
ప్రాశస్త్యంబుల కెల్ల, మొల్లమునకుం బ్రాణంబు, బల్ చాతురీ
సౌశీల్యంబులప్రోవునౌ శశికలాశ్యామాశిరోరత్న మ
య్యాశానాస్త్రతనూజతుల్య వినె వందీడ్యప్రభావాస్పదున్. 387

చ. విని తదధీనచిత్తయయి వేఁగుచు వేకువ నొక్కనాఁడు చ
య్యనఁ గనుమోడ్చునంత జగదంబ ముదంబున స్వప్నమందుఁ జే
ర్మినిఁ దొడసూపి యిట్లను "పరింపుము, నిన్ను సుదర్శనుండు గై
కొనుఁ గనకాంగి! నీదయినకోర్కె ఫలించు నవంచితంబుగన్." 388

క. అని పలికి చనియె నంతట, వనజాక్షియు మేలుకాంచి స్వప్నము తన చిం
తనమున కనుగుణమగుటకు, మన ముబ్బఁగ మోము మాటిమాటికిఁ జెలఁగన్.

వ. హర్షనీరధి మునుంగుడుఁ దల్లి యిందుల కేమికారణం బనవుడు సిగ్గునఁ దలవంచె.

ఉ. పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మి నొకించుక చెప్పరాదె! మీ
యమ్మకుఁ జెప్పమించుము రహస్యమునన్ దను మాటిమాటికిన్
గ్రమ్మిన రాత్రి స్వప్నమునఁ గల్గినముచ్చట లచ్చుగాఁగ న
క్కొమ్మ వచించె; నెచ్చెలులకున్ వినరాని రహస్యముండునే. 391

ఉ. అంత వసంతమందుఁ జిగురాకులచేఁ బొగరెక్కి కోయిలల్
బంతులు సేయఁ జూప్మనుచు నంపిలి తుమ్మెదదిమ్మరీండ్లు బల్
గంతులువేయ నాశశికలాలలితాంగి సఖీసమేతయై
కంతుసఖిన్ వివాస మనఁగాఁదగు పుష్పవనమ్మునం దొగిన్. 392

క. బహుఫలభరితకుసుమధూ, ర్వహపల్లవకలితలలితపాదపవల్లీ
విహృతిమెయిఁ బ్రొద్దుపుచ్చుచు, నహర్పతిసమాను నొక్కయగ్రజుఁ గనియెన్.

చ. కని వినయమ్మునం జరణకంజములం బడి మ్రొక్కి యిట్లనున్
వనజభవావతార! తమవాస మదెక్కడ? నేడనుండి యీ
వ్వని కిరుదెంచుటో! తమరువచ్చిన కారణమేమొ! పేర్మి నె
క్కొన వచియింపుఁడా! యనుడుఁ గోమలికిన్ ద్విజవర్యుఁ డిట్లనున్. 394

శా. భారద్వాజ మునీంద్రునాశ్రమము మద్వాసంబు కార్యార్థినై
దూరం బేగుచు నుంటి నావలన నెంతో కార్య మున్నట్లు న

పూసెజ్జ కత్తులబోనుగాఁ గనుపట్టు • రాతిరి మృత్యువురాణ నెసఁగుఁ
బగలన్నఁ బగవాని పగిది బీరము చూపు • గీతాదికంబన్న భీతి పుట్టు

గీ. విడె మడలుగొల్పు పూఁదోఁట వెట్టిఁజేయుఁ
జెలులపైఁ గోపమొదవుఁ జాపలము హెచ్చుఁ
దల్లిదండ్రుల కిదిచెప్పఁ దప్పు, చెప్ప
కున్న నేగతినబ్బు నవ్వన్నెలాఁడు. 404

మ. అనురాగం బది కన్నుగానదు మనంబా! మిట్టపల్లమ్ములన్
గన కెచ్చోటకునైన నేగు నిఁక వేడ్కల్ మంచియుం జెడ్డయుఁగా
మును పే నేరవు మన్మథుండు చపలాత్ముం డెంతయున్ మూర్ఖుఁ డం
గనలన్ లోఁకువఁజేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగా ? 405

మ. మదనుం దిట్టఁగ రాదు కోయిలలతో మా తొద్దఁగా రాదు నె
మ్మది వారింపఁగ రాదు కోర్కెలపనగా మర్దింపఁగా రాదు దు
ర్మదముగా గ్రిందుగఁ జేయ రాదు తనకామం బమ్మలో వారితో
మొదలే చెప్పఁగ రాదు కష్టమకదా! పూఁబోఁడినై పుట్టుటల్. 406

క. కులకాంతనైన కతనం, గలుగదు స్వాతంత్ర్య మేమిగానున్నదొ! నె
చ్చెలి! వెలవెలఁదుక లేనో, ములునోఁచిరొ! వెట్టిమాటవోఁపిఁగదవే. 407

ఉ. అతఁడు రాజ్యహీనుఁడు వనాంతరవాసియు నంచు వింటిఁ బ్ర
ఖ్యాతులు రాజ్యసంపద లఖండముగాఁ గలరాజపుత్రు లీ
భూతలమందు లేరొ! వను బోటికి వారలు తగ్గవారు కా
రో! తరుణీ! యదేమొ యతఁడొక్కఁడ నామదిఁజిక్కినొక్కెడున్. 408

క. అనృపుఁ డుండినయెడ నా, కానతి యిడె నొక్కవిప్రుఁ డట కేగుటకున్
మానసము తొట్రుపడు న, వ్వానికి నావంతఁ దెల్పువా రెవ్వరొకో ? 409

చ. అలరెడివేడ్కఁ దండ్రియు స్వయంవరముం బొనరింపఁ డాయె నె
చ్చెలు లొకరైన బిట్టినయుచింత వడంపఁగఁ జాలరైరి నా
కలఁ గనుపట్టి చెప్పినజగత్ప్రసు నాపరదేవియైన బా
ము లెనఁగఁజేయు నాకుఁగలమోహముమేర యెఱుంగ దక్కటా. 410

వ. ఇట్లు తదధీనచిత్తయై యక్కన్నెమిన్న యుండె, నట సుదర్శనుండు స్వప్నాద్య
వస్థల దన్మహామాయాసందర్శనం బొనర్చుచుఁ దదేకధ్యానపరాయణుండై కాలమ్ముఁ

న్నారాధించి ప్రశంసఁ జేసితివి నీ యాంతర్యమున్ దెల్పి నీ
వే రాజన్యుని పుత్త్రివో నుడువుమా! యిందిందిరాభాలకా! 395

వ. అను నవ్విప్రకుమారున కక్కమలి యిట్లను మహాత్మా! యేను గాశిరాజు కూఁతుర శశికల యనుదానఁ దమరు పూజ్యులగుటంజేసియు భవద్దేశమందలి విశేషమ్ములు వినఁ గోరియుఁ బ్రశంసించితి. భవదాశ్రమమ్మునం గల చక్కని యొక్క విశేషంబు వక్కాణింపుఁడన నక్కమలాక్షి కతం డిట్లనియె. 396

క. కలఁడు ధ్రువసంధిఁ డను భూ, తలపతి యానృపసుతుఁడు సుదర్శనుఁ డను వాఁ
డలఘుఁడు మా యాశ్రమమునఁ, గలఁ డాతం డెంత కేనిఁ గలఁడు కుమారీ! 397

ఉ. అంబురుహాక్షి! యాతఁడు గుణాలయుఁ డాకృతిపంచబాణుఁడా
యంబకు భక్తుఁ డెంతయు నయంబునఁ బొల్చెడిముద్దులాఁడు వా
నిం బలె నొప్పువేఱొకరివిన్ గనఁ బోము మఱేమి! బ్రహ్మ నీ
కుం బనిఁ బూని చేసె ననుకొందు వినుంగని సుందరీమణీ! 398

క. పూవుం దావియుఁ గొమ్మయుఁ, జేవయు బంగారు మణియుఁ జేర్చిన విధి యో
పూవుంబోఁడిరో! నీ కా, భూవరమన్మథుని బొందు పొసఁగింపఁడొకో? 399

క. అనుభూసురవచనములకు, మన మలరఁగ మోము మందముందరుచిని హా
సవిఁయుతిఁ బొదల శరీరం, బునఁ బులకలు వొడమ నొప్పెఁ బూఁబోఁడి పెనఁగా. 400

గీ. భూసురుం డేగె నంత నాభాసురాంగి, పూర్వమునకన్న ననురాగమును వహించి
చచ్చిచావనివానిబల్ హెచ్చునకు న, హింపనేరక చెలిమిన్న కిట్టులనియె. 401

చ. చెలియరో! యేమనోహరుని చెల్వము విన్నది యాదిగాఁగఁ జం
చలతయు బల్వికారము విచారముఁ దోరముగా నెసంగు న
చ్చెలువుఁడెవండొ? గోత్రమును జెయ్యువలు దేశముఁ దల్లిదండ్రులుం
గులము నెఱుంగ రాదెటులొకో! యిటు మన్మథుఁ డార్తిపెట్టెడిన్? 402

చ. కలఁ గనుఁగొంటి నాతని వికాసము హాసము భాసమానని
స్తులతర హావభావములు సుందరి! యేమని చెప్పుదాన నా
కొలఁది యదృష్టహీనలకుఁ గోరినఁ బైఁబడి మ్రొక్కి వేఁడినన్
గలుఁగునె? యట్టివాఁడు కలఁగన్నదియే యొకలాభ మంగనా! 403

సీ. చందనంబు విషంబు చందంబుగాఁ దోఁచుఁ, బూలమాలిక పాముపోల్కి నుండు
వెన్నెల నిప్పులకన్న వేఁడిమి చూపు, హర్మ్యంబు యమకూప మనఁగవచ్చు

సీ. అంబార్చనాసక్తులగు వారలకుఁ గలు • గవిళుభమ్ములు లేవు, కావరమున
నెవ్వ రంబార్చన నీసడింతురొ వారు • మాతృకాద్రోహులు మందమతులు
దుష్టులు రోగులు దుఃఖపీడితులనుఁ • గా నెఱుంగుము దేవమానసీయ
యై యాదిశక్తియై యమరు నాయంబయే • యఖిల జీవులయందు నలరుచుండు

గీ. బుద్ధి ధృతికీర్తి లక్ష్మీసమృద్ధి శక్తి • శ్రద్ధ స్మృతి లోనుగాఁగల సకలమగుచు
నామె నెఱుఁగనివారల యజ్ఞులనఁగ • నెఱుఁగువారల పండితు లెఱుఁగు మధిప ।

ఉ. బ్రహ్మ మొదల్ పిపీలికలు పారముగాఁ గల జీవసంతతుల్
బ్రహ్మవచోవిధేయము నపార మనాద్య మమేయమౌ పర
బ్రహ్మము గాఁగ నే పరమపావని నే జగదంబఁ గొల్తు రా
బ్రహ్మముఁ దానెఱింగె నొకపాటి యనందగునే సుదర్శనున్ ? 422

శా. దేవారాధితయై మహామహిమయై దివ్యస్వరూపాఢ్య వి
ద్యావిద్యాకృతియై జగం బఖిలమున్ వ్యాకీర్ణమున్ జేసి స
ద్భావాతీతుఁ బురాణపూరుషుని సంభావించు నేదేవి యా
దేవిన్ గొల్చి సుదర్శనుండు సుఖమందెన్ రాజ్యమున్ బాసియుణా. 423

క. శశికలయు నా సుదర్శన, వశగతహృదయ యయి వలపు పద్దికిఁ బాఱుణా
గృశయయి భృశచింతనయై, యశనాయాదికము మఱచె నధిప వతంసా । 424

చ. కొమిరె విచారణాంశమున గొంత యెఱింగి సుబాహుఁ డాపెతం
డ్రి మురువుమీఱఁ బుత్రిపయి నెమ్మి దలిర్ప స్వయంవరం బొన
ర్ప మదిఁ దలంచి యెల్లనరపాలురకున్ దెలియంగఁ జేసె, న్యా
యమకద రాజపుత్రులు స్వయంవరమందు వివాహ మాడుటల్. 425

వ. స్వయంవరమ్మను విచ్ఛాస్వయంవరంబు పణస్వయంవరము శుల్కాస్వయంవరము
నా మూఁడు తెఱంగులందు శ్రీరాముండు శివధనుర్భంగం బొనర్చి సీతం గైకొన్నది
పణస్వయంవరంబు తక్కుఁగల రెండును బ్రసిద్ధమ్ము లందాద్యమగు విచ్ఛాస్వయం
వరంబు చాటం బంచుడు, 426

ఉ. ఘూశపచోశమద్రవరమాగధవంగకళింగసింధుబం
గాశకరూశలాటకురుకాశమరాటవరాటగౌళనే
పాళవిదర్భబర్బరనృపాలకుమారకు లానుబాహంభూ
పాలుని పట్టణంబునకు వచ్చి రనేకు లుదంచితస్థితిణా. 427

బుచ్చుచుండె నతనికడ కొక్కనాఁడు శృంగిబేరపురాధ్యక్షుండగు నొక నిషాదపతి
యేతెంచి సర్వోపస్కారయుతంబును జతుస్తుంగయుక్తంబును బతాకాదిశోభితం
బుననగు నౌకారథం బుపాయనంబుగా నొసంగిన మిత్రభావమ్మునం గారవించి
యయ్యది గైకొనియె. అట్టియెడ, 411

క. భారద్వాజాశ్రమగతులై రాజిలుమునులు వల్కధారులఁ గని యో
వీరాగ్రేసర ! యిఁక భూ, భారధురంధరుఁడవగుచుఁ బ్రబలెదవు గదన్. 412

ఉ. ఏపరదేవతామహిమ మించుక గల్గినవారు పాపముల్
తాపము లావదల్ గడచి ధన్యులు మాన్యులునై జగజ్జను
వ్యాపృతులై చెలంగెదరొ ! భద్రవిధాయిని యామె ముఖ్యమౌ
ప్రాపక మట్టినీకు దురవాపము గల్గునె ముజ్జగమ్ములన్ ? 413

వ. అని మనోరమం గాంచి, 414

క. ఓ వీరమాత ! విను మా, లావారపరీతమౌ మహారాజ్యశ్రీ
కేవల దేవీకృపకున్, దావలమగు నీకుమారునకు సంధిల్లున్. 415

చ. అనిన మనోరమాసతియు నట్లులె మీవచనంబు నిక్క మౌ
ననఘచరిత్రులార ! యొకఁడైన సహాయము లేని నాతనూ
జునకెటు రాజ్యభారమది చొప్పడుఁ దప్పునె మీనుడుల్ మహా
జనులగువారిదీవనలె సర్వము నిర్వహణం బొనర్చెడిన్. 416

క. ఈదశదిశ లొకటైనను, మేదిని రజమైన జలధి మిట్టైన నగున్
భూదేవత లిడు నాశీ, ర్వాదములకుఁ దిరుగులే దవార్యము లగుటన్. 417

క. అని నెమ్మది యుబ్బఁగ నా, ముని సేమముఁ గోరి యామనోరమయుండెన్
మనుఁడు సుదర్శనుఁడు జగ, జ్జననికటాక్షంబు తనకు సంతస మొసఁగన్. 418

ఆ.వె. ఆరథం బు నెక్కి యలరెడివేడ్క నెం, దేనిఁ జనెడివేళఁ గానుపించు
దక్షమై తనర్చు నక్షౌహిణీసైన్య, మద్యమం దెలర్చు మహిపుమాడ్కి. 419

ఉ. శోభనదాయియై సకలశోకవినాశకమైన కామరా
జాభిధబీజమున్ గురుదయావశతన్ దగ సంగ్రహించి శ్ర
ద్ధాభరితంబు గా నెవఁడు తద్దయుఁ దజ్జప మాచరించు వాఁ
డాభగవత్యనుగ్రహము నంది పురందరసన్నిభుం డగున్. 420

వ. అంతకు మున్న యన్నలినాక్షి తద్వృత్తాంతం బెఱింగి సఖింగాంచి కుంచితాస్యయై కనుఁగొనల వక్రులురుల మంతనంబున నిట్లనియె. 428

ఉ. నెచ్చెలి! నా మదిం గలుగు నెవ్వగ నెవ్వగ నాఁపికొందు? నా
నచ్చిన చెల్మికాఁడు జననాధ శిరోమణి నాఁటిరాత్రి భూ
భృచ్చయరాజపుత్రి కడుఁ బేరిమి నాకిడినట్టికోర్కె యు
ద్యచ్చరితుండునై తగు సుదర్శనుఁడక్క నొరుఁ వరింతునే? 429

మ. ధనముల్ కాల్పనె? రాజ్యసంపదలు కాంతారమ్మునన్ జేర్పనే?
గొన మందంబును జాతురీగరిమయుఁ గూలంకషప్రజ్ఞ యో
వ్వనికిం జొప్పడు వానిఁ గోరఁదగు నవ్వాఁడెన్నఁగా నా సుద
ర్శనుఁడే యింతకు నొక్కకండొక తెకుఁ జక్కంగఁ గన్పట్టెడిన్. 430

క. అని త్రిప్పరాని పేర్మిఁ, దనతోడం బల్కు రాజతనయవచనముల్
వనిఁగొని జననికిఁ దెల్పఁగఁ, జని యావైదర్భితోడ సఖి యిట్లనియెన్. 431

వ. అమ్మా! మన శశికల సుదర్శనుండను రాజపుత్రుందక్క నన్యుని వరింపనని నిశ్చయించుకొని యున్నయది. 432

క. భారద్వాజాశ్రమమున, నారాజ తనూజువాసముఁట! యాతనికిన్
ధారాళముగఁ ద్రికరుద్ధిగ, ధారాదత్తంబుజేసెఁ దననెమ్మనమున్. 433

వ. అనుడు వైదర్భియు నయ్యుదంతంబు తన పతికెఱింగించిన నతం డమ్మగువ కిట్లనియె. 434

ఉ. వాని నెఱుంగుదే చెలియ! వాఁడన రాజ్యముఁ గోలుపోయి య
న్నానకు లేక కాననమునన్ మునిపల్లె వసించుఁ దల్లితోఁ
బూని యుధాజిదాహ్వయుఁడు పోరునఁ జంపెను వీరసేను న
వ్వానికతమ్మునన్ గడు నభాగ్యుఁడు వానికిఁ బుత్రి నిత్తునే? 435

క. కావున నచ్చఁగఁ జెప్పుము, నీవేగి తనూజ కిపు దవిందృచరిత్రుల్
కోవిదులు భాగ్యవంతులు, వేవేలు స్వయంవరమున విడిసిరి నృపతుల్. 436

వ. అని భర్తపల్కిన వల్లెయని యావైదర్భి పుత్రికడ కరిగి బుజ్జగించి శిరమ్ము మూర్కొని తొడపై నిడుకొని యల్లన నిట్లనియె. 437

మ. ఫలమూలాశి వనప్రవాసి కృశుఁడున్ బంధుప్రజత్యక్తుఁడున్
బలకోశాదివియుక్తుఁ డెంతయును విర్భాగ్యుం డతం డున్నతుల్

గలవా రూర్జితు లార్జితోత్కటయశః ఖ్యాతుల్ నరేంద్రాత్మజుల్
దలఁప నీకయి వచ్చిరందఱు సౌందర్యమ్మునన్ మన్మథుల్. 438

తరల. అల సుదర్శను తమ్ముఁడుం గడునందగాఁడు మహాబలుం
డలఘుఁ డాతఁడు శత్రుజిత్తు ధరాధిపత్యము గల్గు వాఁ
డెలమి నీకనుకూలుఁడై తగు నేతదర్థమ కాదె తాఁ
గలన నీతవితాత చంపెఁ బగన్ గళింగధరాధిపున్. 439

క. అదియునుగాక యుధాజి, త్తదనగు నెడ నితనిఁ జంపు నాకతమున నే
కద! భారద్వాజునికడ, సుదర్శనుండుండు టరయ సుదతీ! వినుమా! 440

క. నీతండ్రి సుదర్శనునక, పేతవిభవుఁ డనుచు నిన్నుఁ బెండిలిసేయఁగా
జేతోగతి వాంఛింపం. డాతలఁ పిఁక విడిచి పెట్టుమమ్మ కుమారీ! 441

వ. అనుడు నక్కోమలి తల్లి కిట్లనియె. 442

చ. వనమున నుండుఁగా కతఁడు పట్టణమందు వసించుఁగాక వి
ర్ధనుఁడగుఁగాక మేటిధనధాన్యములం దులఁదూఁగుఁగాక నా
మన సలవానిఁ దక్కఁ బెఱమానిసి నొల్లదు ధాతయైన పా
లనిహితమైన వ్రాఁతలకు లాఁతిగతుల్ పొసగింపనేర్చునే? 443

క. శర్యాతి వచనమున మును, నార్య సుకన్యాభిధాన చ్యవనునిఁ గొని వ
ట్లార్యావచనమ్మున శుభ, చర్య సుదర్శను వరింతు సత్యవ్రతనై. 444

క. కైతవ మెఱుఁగక భర్తకుఁ, జేతోమోదమున సేవఁ జేసెడి సతికిన్
బ్రీతియు స్వర్గము మోక్ష వి, భూతియునుం గలుగు నిక్కముగ నోతల్లీ! 445

క. మచ్చిత్తభిత్తి భగవతి, విచ్చలవిడి వ్రాసె నావిధమంతయు నా
నచ్చినవాఁ డతఁ డొక్కఁడ, పొచ్చెములేదిందుఁ గూర్మి పొసఁగె నతనిపై. 446

క. అని శశికల వివిధ విధ, ర్శనములు చూపించి తనకు రమ్యుండు సుద
ర్శనుఁ డొక్కఁడ యని చెప్పిన, జననియుఁ బతి కెఱుఁగఁజేసెఁ జవి సకలంబున్.

వ. అంత స్వయంవర మహోత్సవం బాసన్నం బగుడు శశికల సుదర్శనురామికిఁ
జింతించి యత్యాప్తుండగు నొకవిప్రుఁ బిలిపించి రహస్యమ్ముగ నిట్లనుః నోయయ్యా!
మాయయ్య యెఱుంగకుండ భారద్వాజాశ్రమమ్మున కరిగి సుదర్శనుం గాంచి
నా వచనమ్ములుగా నిట్లనుము. 448

ఉ. అంబ వినున్ వరింపుమని యానతి నాకిడె నామనంబు స
త్యంబుగఁ జిక్కె నీపయి స్వయంవరమౌ నిఁక నెల్లి; రాజసం
ఘంబు పురంబునన్ విడిసెఁ గాని త్వదాగమనంబు లేదు న్యా
యంబె యనాదరంబు విషమాంబకదర్శన! యో సుదర్శనా! 449

ఉ. నే నినుఁ దక్క నన్యుని గణింప వరింప మదిం దలంప నా
మేను నిజంబు నీయదిసుమీ వినుమీ! నను మానితేని నిం
గానమి వహ్నిలోఁ బడుదుఁ గానియెడన్ విషమాహరింతుఁ బ్రా
ణానకు వెన్కఁజూతునని నఁ దలపోయకు ప్రాణవల్లభా! 450

చ. మనకుఁ బరాంబికాకృప సమస్తశుభమ్ములు గల్గు దైవముఁ
మనమున నమ్మి రావలెఁ జుమా! శివకేశవముఖ్యు లేజగ
జ్జననికి వశ్యు లాజనని సత్యము దప్పనితల్లి యాపె వా
క్కును వితయౌనె నాథ! కయికొమ్ము ననుంబ్రతికించి పుణ్యమున్. 451

చ. అని వచియింపు మా నరవరాగ్రణి కిట్టులె యంచు శాస్త్రమా!
యనఘ! సమస్తమున్ దెలిసినట్టిమహాత్ముఁడ వీవు కార్య మే
యమునఁ జక్కనౌనో యటు లాతనితోవచియించి పున్నెమున్
గొనుము పరోపకారమునకున్ సమమైన విశేషమున్నదే? 452

ఉ. అక్కరుణాకరున్ గడు రహస్యమునం గను మట్లు కాంచి నా
చక్కఁదనం బొకింత సరసంబుగఁ జెప్పుము చెప్పి నాదు పె
న్మక్కువ మేరలేని దని మాటికిఁ దెల్పుము చేతు లెత్తి నే
మ్రొక్కితినంచుఁ బల్కుమిక ముంచినఁ దేల్చిన నీవ నావుడున్. 453

వ. తద్దత్తంబగు దక్షిణన్ గ్రహించి యాతండును సుదర్శను కడ కేగి సకలమ్మును వచియించి యతనిచే స్వయంవరమ్మున కేతెంచెదనని యనిపించుకొని తత్క్షణమ వచ్చి యక్కన్నెతో నంతయు నుడివె. నట సుదర్శనుండు స్వయంవర గమనోన్ముఖుండగుటయు. 454

క. తల్లి మనోరమ శోకం, బుల్లమ్మునఁ గడలుకొనఁగ నొగి గుండియలున్
జల్లన నల్లన నశ్రులు, వెల్లివిరియఁ బల్కె నిట్లు విహ్వలమతియై. 455

చ. పలువురు రాజు లున్నెడకు బాసట లేకయ పోఁ దలంచె ద
ప్పలుగు యుధాజిదాఖ్యుఁ డతివైరి నినుం గడతేర్ప నెంచి తా

వలయెడ కేగుదెంచు, నను నాత్మజశోకపరీత జేయఁగాఁ
దలఁపకుమయ్య! నావలుకు దబ్బఱసేయకు మయ్య నావుడున్. 456

ఉ. అంబికయానతిన్ శిరమునం దిడి యేగెడి నాకు నెందు న
డ్డం బొకడుండునే? యొరులధాకకు జంకుమనే? మదంబ శో
కం బుచితంబె క్షత్రియకుఁ! గాఁదగుకార్యము కాకపోవు దుః
ఖంబును సౌఖ్యముం జగతిఁ గావడికుండలు ప్రాణికోటికిన్. 457

వ. అని తల్లికి ధైర్యంబు చెప్పి విషాదదత్తంబగు రథం బధిష్ఠించి చన నుద్యుక్తుం డగు కుమారునింగాంచి మనోరమ యిట్లనుఁ నోయన్నా! విజయార్థం బేగెడి నిన్ను నగ్రమ్మున నంబికయు వెనుకఁ బార్వతియు విషమమార్గమ్ముల వారాహియు దుర్గమ్ముల దుర్గయు ఘోరకలహమ్ములఁ బరమేశ్వరి యగు కౌశికయు స్వయంవరమ్మున సౌమ్యయగు మాతంగియు భూపమధ్యమ్మున భవానియు గిరిదుర్గంబుల గిరిజయుఁ జత్వరమ్ములఁ జాముండయుఁ గాననముల సనాతని యగు కామగయు వివాదమ్ముల వైష్ణవియు శత్రుసమాగమమ్మున భైరవియు సర్వదేశంబుల జగద్ధాత్రియగు భువనేశ్వరియుఁ గంటికి ఱెప్పచందమ్మున రక్షింతురుగాత మని దీవించి మఱియును. 458

శా. అన్నా! నిన్నొడనాడి యిట్టెడ క్షణంబైనన్ వసింపంగఁ జా
లన్నిన్నున్ గనులారఁ గాంచికద కాలంబెల్ల హేలాగతి
న్విన్నాణంబుగఁ బుచ్చుచుందు నదియున్ విఘ్నంబుగావింప నీ
కు న్యాయంబె? రథంబుపై నిడి ననుం గొంపొమ్ము నీతోడుతన్. 459

వ. సుదర్శనుండు వల్లెయని ధాత్రేయీసహితంబుగఁ దల్లిని రథం బెక్కించుకొని శీఘ్రగమనమ్మునఁ గాశీపురమ్ము చేరిన సుబాహుం డెదుర్కొని తగినవిడిది యొసంగి యుపచారమ్మునకుఁ దగువారి నియోగించె దౌహిత్రసహితుండగు యుధాజిత్తును దక్కఁగల రాజన్యులును సుదర్శనుంగాంచి తమలో నిట్లు ప్రశంసించుకొనిరి. 460

## సుదర్శనుండు స్వయంవరమున కేగుట.

ఉ. తా నిట కేగుదెంచెను సుదర్శనుడుం దగువానిఖంగి రా
ట్సూనుల రాజరాజసుత సుందరు లందఱినిం దృణించి త
న్మీనవిశాలాక్షి కోరుననియే మనమందుఁ దలంపఁ బోలు నే
మో! వగినట్టియూకు లగు నొక్కెడఁ బట్టణముల్ గ్రమమ్ముగన్. 461

క. అనిన యుధాజిత్తిట్లను, గనుఁడీ! మీరెల్ల నామకడిమి నిట సుద
ర్శనుఁ గడతేర్చెద ననపుడుఁ, బనిఁగొని యనుఁ గేరళాధిపతియాతనికిన్. 462

మ. ఇది యిక్ష్వాకువరణార్థ మేర్పడియె నయ్యేణాక్షి యిందొక్కరున్
మది కింపై తగువాని సంగభవుసామ్రాజ్యమ్మునం గూర్చు న
య్యది తక్కుంగల యస్మదాదుల కవార్యం బట్లు కాదేని ధ
ర్మదు లీరాజులటందు రెల్లరును మర్యాదావినాశంబుగన్. 463

చ. అది యటులుంచు న్యాయ్యమగు నాతనిరాజ్యము దుర్నయమ్మునన్
మొదల హరించి యిచ్చితివి ముద్దులమున్మని; కాతనిన్ వరిం
పఁదగదె? యీ సుదర్శనుఁడె పట్టముగట్టెనె! బేలరీతి నె
మ్మది నిటు కుందనేల వినుమా! యితఁడే వినుఁ జక్కఁ జేసెడిన్. 464

క. విను మెన్నఁడేని ధర్మ, మ్మునకున్ జయమబ్బు సత్యమునకగు వృద్ధుల్
చనకుముదౌర్మార్గ్యమునకు, ఘనుఁడందటి నేలువాఁడుగలఁడో! లేఁడో! 465

ఉ. అందటినిన్ వరింపదు కదా! యొకరాజతనూజ యిందఱున్
సుందరు లిందఱున్ మిగుల శూరు లుదారులు వీరిలోన నా
సుందరి యొక్కవింగొన నసూయమెయిన్ మనమెల్లఁ బోరినన్
విందకు మూలమౌ నిది యనీతియొ! నీతియొ! నిర్ణయింపుమా. 466

క. అనుడు యుధాజిత్తను నీ, వనిన ట్లిక్ష్వాకుకృతస్వయంవర మిది యొ
క్కని నవవద్యచరిత్రుని, ననఘుని వరియించెనేని హర్షము మాకున్. 467

చ. పలుపు రఖండతేజులు నృపాలకుమారకు లుత్తమోత్తముల్
గలయెడ నెవ్వఁడో యొకఁ డగణ్యుఁడు కన్యఁ బరిగ్రహింప యో
గ్యులుగని యూరకుండుటదియున్ గడుయుక్తమె! సింహభోగ్యమౌ
పలలము నక్కకున్ విడుపఁబాడియె! యేడని! నీతివాక్యముల్! 468

గీ. అగ్రజాతికి వేదమ్ము లధికబలము, చాపమెక్కుడుబలమగు క్షత్రియులకు
బలము గలవానిరాజ్య మీపడఁతిమిన్న, బలమ శుల్కంబు రాజవివాహములకు. 469

వ. అయ్యది సుదర్శనునకుం గలిగెనేని యతండ పరిగ్రహించు నితరులకుఁ గలదేని
యితరులు పడయుదు రని యన్యోన్యకలహమ్ము లొనర్చు నవనీపతులకడకు
సుబాహుం డాహూతుండై వచ్చుటయు. 470

క. అవనీపాలుర కెల్లను, వివాదము తటస్థమాయె వింటివికద ! యో
యవనీవర ! నీవియ్యెడ. వ్యవస్థనేర్పరచి వీరివా దడఁపఁదగున్. 471

వ. అన నతం డిట్లనియె. 472

చ. జనవరులార ! నాకొమిరె చాల సుదర్శనునిన్ వరింపఁగా
ననయము నెంచుచున్న దతఁ డర్హుఁడు గాఁడవి యెంతచెప్పినన్
విన దతఁడున్ స్వయంవరపువేడుక వచ్చె బహూక్తు లేల దై
వవియతి కన్యథాకరణపాటవ మేరికినైనఁ గల్గునే. 473

వ. అనుడు నాతని చిత్తవృత్తి నెఱింగి సంపన్నులగు రాజన్యులందఱును సుదర్శనుం
బిలువంబంచి యిట్లనిరి. 474

ఉ. ఓయి నృపాలపుత్ర ! యిటకొక్కరుఁడై చనుదెంచి తీవు సే
నాయుతు లెందఱో నృపతినందను లాహవమాచరించి య
బ్జాయతనేత్ర నీశశికలాబ్జముఖిన్ గ్రహియింప నున్నవా
రీయెడ నీకుఁ జేయగల దించుకయున్ గనుపట్టనేర్చునే ? 475

శా. నీకుం దమ్ముఁ డఖండశౌర్యవిధి వర్ణింపంగ యోగ్యుండు లో
కైకస్తవ్యుడు శత్రుజిత్తును సహాయీభూతుఁడై తాతయున్
వీఁక న్నిన్ను వధింప నియ్యెడ కొఁగిన్ విచ్చేసియున్నారు నీ
రా కత్యంతము శోచనీయము కదా ! రాజన్యవంశాగ్రణీ. 476

గీ. ఎవరు పిల్చిరొ నిన్ను ! నీ వేకతమున, వచ్చియుంటివొ కలిగిన వాస్తవంబు
చెప్పితిమి మీఁద నీదగుచిత్తవృత్తి, కర్హ మగున ట్లొనర్పు మటన్న నతఁడు. 477

ఉ. వారలఁ గాంచి యిట్లను నృపాలకులార ! కృపాళులార ! మీ
పేరమి యింతయొప్పనొకొ భీతిలియిప్పుడు లాభమేమి, నా
భారము దేవదేవి దిటఁ బంపిన దాఁగదంబ నాకు నై
శ్రీరమొ నీరమో యొకటి చేయదె శత్రులచేతి కిచ్చునే ? 478

చ. ఎలమి సమస్తమందుఁ బరమేశ్వరినే కనుఁగొందు నాకు శ
త్రులనుమ మిత్రు లంచుఁగలరో ! యలరారెడివేడ్క నంబ నా
కలఁగనుపట్టి బొమ్మనిన గన్గొన వచ్చితి నీస్వయంవరం
బలుక నెవండు వ న్నెదురు నాతని కంబిక శత్రు వయ్యెడున్. 479

మ. బలమిచ్చుఁగా యశమిచ్చు సంపదలిడుఁగా బాలించుఁ దేలించు దు
ర్బలులఁగాఁ జేయు దరిద్రులం బొనరుచుఁగా ఖండించు గుంటించు నే
యలఘుప్రాభవ యేజగజ్జనని యేయార్యామహాదేవి త
ద్బలమే నాకు బలంబు తక్కఁబలమున్ బాటింప నే నెన్నఁడున్. 480

క. శక్తు లశక్తులు గలరే, శక్తియనుగ్రహము గల్గు జనులే శక్తుల్
శక్తికృపలేనివార లశక్తులు బ్రహ్మాదులైన జనవరులారా! 481

చ. జయమయినం బరాజయము సంభవమైనను నాకుఁ గాదు త
జ్జయ మజయమ్మునున్ యశ మసద్యశమున్ జగదంబ, కట్టి నా
కయి పగవంగఁ బోకుఁడు మహామహులార! దయాళులార! ని
శ్చయముగ నేను శక్తుఁడ నశక్తుఁడ నేమిటి కీవిచారముల్. 482

వ. అను నాతని వచనమ్ములకు సంతసించి కొందఱు రాజు లిట్లనిరి. 483

క. నీపలుకులెల్ల నిక్కము భూపకులవతంస! నీవు పుణ్యాత్ముఁడ వెం
తో పగఁ బూని యుధాజి, ద్భూపతి యున్నాఁడు మఱచి పోయెదుసుమ్మీ! 484

వ. నావుడు సుదర్శనుండు రాజేంద్రులారా! మీకు నాయం దనుగ్రహం బింత యొప్పి
నకతనం గదా యింతవట్టు నాకెఱింగించితిరి. దైవాధీనం బగు నీచరాచరాత్మక
ప్రపంచంబున మృత్యువనునది తనంతన సంఘటించునుగాని యొకని నొకఁడు
చంపువాఁడు లేఁడు. జీవుండు కర్మాధీనుండుగాని స్వతంత్రుండుగాఁడు. కర్మంబును
సంచితవర్తమాన ప్రారబ్ధభేదమ్మున మూఁడుదెఱంగులై యొప్పుఁ గాలకర్మస్వభావ
వ్యాప్తంబగు నీజగంబునఁ గాలంబాసన్నంబుఁ గాదేని దేవుడకైనఁ జంపఁనశ
క్యంబు. కాలవశంబున మృతులగుప్రాణులకు యముండు నిమిత్త మాత్రంబుగా
నెఱుంగునది. సింహంబు కతన మజ్జనకుండును యుధాజిత్తు కారణంబున మన్మా
తామహుండును మృతులగుటయు నిట్టిదకా తెలియుఁడు. తానెంత ప్రయత్నం
బొనర్చినను దైవయోగంబు మీఁదినఁ జావక తీరదు. 485

గీ. ఎవ్వఁడో తన్ను రక్షింపనేల? దైవ, బలమొకటి తప్పకుండిన వాఁడు శత్రు
భయము రోగాదిభయమును బాసి వేయి, వత్సరమ్ములు జీవించు వంత తగునె?

క. శుభమును నశుభమును నీ, యుభయమును బురాకృతమున నొడఁగూడును దా
ను భయంబందినఁ దప్పద, నుభవించియ తీరవలయును నరుల కెల్లన్. 487

గీ. తా నొనర్చిన కర్మంబు తనకుఁ గష్ట, మొసఁగుతఱి తెల్విఁగలవాఁడు వ్యసనపడఁడు
అన్య లపకారమును దన కాచరించి, రనుచు నజ్ఞుండు వైరమ్ముఁగని కృశించు.

ఉ. దైవము నమ్మి వచ్చితిని దైవమ సైన్యము తోడు నీడయున్
దైవమ తల్లిదండ్రులును దైవమ వైరియునాకు సర్వముఁ
దైవమ తద్బలంబు సుఖదాయియొ కష్టము నిచ్చునట్టిదో
భావిఫలం బెఱుంగ మనపాటి మనుష్యుల కర్హ మెట్లగున్? 489

గీ. అయ్యుధాజిత్తు సుఖములనందుఁ గాక, యతఁడు శత్రుండుగాఁడు నే నతనికైన
నగుదుఁ గాక మఱేమి, లోకైక జనని, కలదు నా పాలిటికిఁ గల్పకంబు పగిది.

వ. అనుచు నెల్లరు సంతసించిరి. సుదర్శనుండును దన యెడ కరిగి సుఖంబుండె. మఱునాఁడు సుబాహునిచే నాహూతులై రాజన్యులందఱును దదాస్థానమ్మున విమాన సంగతు లగు నమరులంబోలె మంచంబుల నధిష్ఠించి శశికలాగమనమ్మున కెదురు చూచుచు వక్కలికి యెవ్వని వరించునో యని సందేహించువారును సుదర్శనుం దక్క నొరుల వరింపదను వారలును నట్లైన నన్యోన్య కలహంబు దప్ప దనువా రును నై యుండునెడ, 491

ఉ. మంగళ వాద్యముల్ సెలఁగ మజ్జనమాది విభూషితాంగియై
యంగజుపూవు బాణమన నా లలితాంగియుఁ బట్టు పుట్టమున్
రంగుగఁ గట్టి యొప్పుగఁ గరంబునయందు మధూకమాల వ్రే
లంగ నృపాలపుత్రులు కలంగఁ జెలంగి సఖీసమేతయై. 492

వ. తత్సభానికటమ్మున నొక మణిస్తంభంబు చాటునఁ దలవంచుకొని చింతించుచున్నం గని స్మితపూర్వకంబుగ సుబాహుం డిట్లనియె. 493

శా. అమ్మా! కన్గొనుమమ్మ! రాజసుతు లత్యంతోన్నతుల్ మేటిరా
పమ్మందుఁ మదనుల్ యశోన్వితు లతిప్రౌఢుల్ వినుఁ గైకొన
న్నెమ్మిన్ నేఁడిట వచ్చియుండి రొకరుఁ నీకిష్ట మౌవాని నే
ర్కొమ్మా! రూపవయఃకులోన్నతి కలాకూలంకషాలంకృతుఁ. 494

వ. అనుడుఁ దండ్రికి నక్కుమారిక యిట్లనియె. 495

ఉ. కాముకు లన్మదుల్ శఠులు కశ్మలచిత్తులు పాతకుల్ జగ
త్పాపములు వీరియగ్రమున సాధ్వులు వర్తిలరాదు "సాధ్వియా

భామిని భర్తఁదక్క నొరుఁబాఱఁగఁ జూడఁగ రా" దటంచు వి
ద్యామహితుల్ వచింతు రిది ధర్మ విరుద్ధ మొనర్ప నేర్తునే ? 496

క. పలువుర దృగ్విషయంబై, కులకన్యక చనిన దాని కొఱ లెల్లరునుం
దలపోయుదు రెల్లి దమగు, వెలపొలఁతుకభంగి దానివిభవంబెల్లన్. 497

ఉ. మాలిక చేతఁ బూని తగుమానివిభంగి స్వయంవరస్థలం
బేలలితాంగి త్రొక్కు నదియే వెలభామిని వేఱ యున్నదే
చాలగనున్న యానృపతిసంఘములోఁ బొఱఁబాఱ నాకునుం
బోలునె తండ్రి ! యేను వెలబోటినె యిప్పని నాచరింపఁగన్ ? 498

క. ఏను సుదర్శను బొమ్మా, దానన కద ! సభకు నేగి తక్కొరుఁ జూడం
గానేమి మానమున శివ, మానం బొనరింపఁ దగునె మానిని వయ్యున్. 499

మ. వనధుల్ పట్టిన భూమి ప్రక్కలయినన్ భాస్వంతుఁ డస్తాచల
మ్మువ నావిర్భవమందినన్ శశిదుహూస్పూర్తిన్ బ్రవర్తించినన్
విను మే నల్లసుదర్శనున్ విడిచి పృథ్వీనాథు వేతొక్కవిన్
గవ ముట్టనావినఁ బేర్కొనన్ మవమునన్ గాంక్షింప మున్మాటికిన్. 500

క. కావున నాతనికి నను, న్నీవిచ్చి వివాహ మెల్లి నేఁటఁ దగు గతిన్
గావింపుము కాదేనిన్, జీవితమున కిపుడ విడుతుఁ జేరెఁడుపీటన్. 501

## సుబాహుఁడు చింతించుట.

వ. అనువచనంబు లాలించి సుబాహుం డితికర్తవ్యతామూఢుండై తనమనమ్మున. 502

ఉ. వచ్చినవారు రాజు లనవద్యచరిత్రులు వేనవేలు వీ
రిచ్చకమాడినన్ వెడల రేమియొనర్తు ? మదాత్మ జాతకు
న్నచ్చిన యాసుదర్శనుఁడనన్ బలహీనుఁడు, నాకు వీరిచేఁ
జచ్చుట సంభవించె నిది శత్రువు పుత్రిక గాదు గా ! తుదిన్. 503

వ. అని గొండొకసేపు విచారించి ధైర్యమ్ము దెచ్చుకొని పలువురతో గలహించుట
యెట్టిబలవంతునికేనిఁ దగదని వారినొప్పించువాఁడై వినయవినమితుండై బద్ధాం
జలిపుటుండై దీనుండై డగ్గఱఁ జని యిట్లనియె. 504

ఉ. ఓనరపాలురార ! కరుణోదధులార ! మహాత్ములార ! నా
పై నెవరుంచి వాదుపోరపాటు క్షమించి యనుగ్రహించి నా

మానముఁ బ్రాణమున్ మిగుల మన్ననఁజేసి యొసంగి కూర్పుస
న్మానములెల్ల గ్రహించిచనుమానమునన్ దయసేయు టొప్పగున్. 505

ఉ. ఎన్నివిధంబులన్ వెఱచి యే బతిమాలిన వానిఁ దక్క మా
కన్నియ యన్యునొల్ల నని గట్టిగఁబట్టుచు బట్టియున్న దే
మన్నను మాఱువల్కదది యన్నెముఁ బున్నె మెఱుంగనేర ద
న్నన్న! మదర్థమై శ్రమమునందితి రిందఱునెల్ల వృథాగతిన్. 506

మ. కరులన్ రత్నములన్ దురంగమములన్ గ్రామంబులన్ గాంతలన్
సిరులన్ సౌధములన్ మహాంబరములన్ శ్రీమించుపూఁదోఁటలన్
ధరణీరాజ్యమునెల్ల నిచ్చెదను నాతప్పొప్పులన్ సైఁచి కూఁ
తురుగా నాదుకొమార్తనెంచి నను విద్విష్టున్ బొనర్పందగున్. 507

వ. అని బహుభంగులం బ్రార్థించు నాసుబాహునకు కొక్కరును మాఱాడక మిన్నకుం
డిరి. యుధాజిత్తు క్రోధతామ్రాక్షుండై పండ్లు పటపటఁ గొరుకుచు నిట్లనియె. 508

ఉ. ఏమివచించెదీవు మది నింతవివేకము లేక పుత్రికన్
సోమరివై సుదర్శనుని సొమ్ముగఁ జేయఁదలంచి యోగ్యులన్
భూమివరేణ్యులన్ వెడలిపొమ్మనలేకిటు నక్కజిత్తులన్
వేమఱు పన్నినన్ దెలియనేరమె తక్కరు లంత మూర్ఖులే. 509

చ. మొదలన సంధియం బయిన మూర్ఖుఁడవై యిటులెల్లరన్ వృథా
విధిమెయిఁ బిల్వఁబంచి పలవించినఁ బోవునె! నన్నుఁ జూడు నీ
మదమడఁగించి చక్కడఁచి మందుని నింద్యుని నీసుదర్శనున్
బదిలము చేసి మన్మనికిఁ బట్టముగట్టెద నీకుమారికన్. 510

క. అవిలో నాకొక్కసుద, ర్శనుఁ డుబ్బో! యూరుఁగాయొ! సకలనరేంద్రుల్
పసిగొని యెదురుకొనిన నొ, క్కనిమిషమునఁ జక్కడంపఁ గలనెఱుఁగవొకో.

శా. భారద్వాజమునిం గణించి మును తత్ప్రాణం బుపేక్షించితి
న్వీరుల్ వీరలుమెచ్చ నేఁడదఁతు నీనేర్పింకఁ జాలించి యా
నీరేజాక్షిని నాదుమన్మనికిఁ బెండ్లింజేసి రక్షించుకో
మీ! రాజ్యంబు మదాశ్రయంబుకలిమిన్ మేలెంచి కీలెంచుమీ. 512

తే.గీ. రాజ! 'నీవాశ్రయోవకర్తవ్య' యనఁగ, ననవొ? యేమని యీ సుదర్శనుని కిత్తు
వాత్మజాతను; మహదాశ్రయంబు గోరి, తేని నామనుమని కిమ్ము మానవేంద్ర!

క. ఒక్క సుదర్శనుఁ దక్కఁగఁ, దక్కొరుల వరించెనేనిఁ దగులాటంబుల్
పొక్కవు మంటపమునకున్, జక్కఁగ నీతనయఁ బిలువఁ జనుము నృపాలా!

వ. అనిపల్కు నయ్యుధాజిత్తున కుత్తరం బీనేరక కాశిరాజు చింతాక్రాంతుండై తలవంచుకొని యంతిపురమ్మున కరిగి భార్యం గాంచి యిట్లను "నోతరుణీ! యెట్లైన సుదర్శనున్ విడిచి మనకన్నియ యన్యుని వరించునట్లొనరింపవలయుఁ గాదేని మానంబుదక్క" దనవుడు వల్లెయని యాపె శశికల పాలికిం జని మెల్లన నిట్లనియె. 515

ఉ. అమ్మరో! యీసుదర్శనునికన్న బలాఢ్యులు రూపవంతులున్
సొమ్ములు గల్గువారలును జూడఁగ వేలకొలంది వచ్చి ర
ర్థమ్మును బ్రాణమానములు దక్క విఁకాతనిఁ గోరితేని మా
యమ్మ! వినంగదమ్మ! పదవమ్మ! స్వయంవర రంగభూమికిన్. 516

క. వినుము సుదర్శనుఁ గోరిన, ఘనుఁడు యుధాజిత్తు వానిఁ గడతేర్చి క్షణం
బున నిన్ను నన్ను నీ జన, కుని నట్లొనరించు నంత క్రూరుఁడుఁ గలదే. 517

క. అని నయమున భయమున న, వ్వనజముఖికిఁ దెల్పి నా యవసరంబునఁ ద
జ్జనకుఁడు సుబాహు భూపతి, చనుదెంచి మఱియును జెప్పెఁ జనుపున బలిమిఁగా. 518

క. వెస నాశశికలయును దా, నసిధారావ్రతము పూని యగ్ని నుఱికెదన్
విసముఁగా మెసవెద నన్యుఁడు, విషమాంబకుఁడైన నొల్ల వేయేమిటికిఁకా. 519

చ. వినుము నృపాల! నా మనవి వీరలకుఁ మది జంకెదేని న
న్ననువుగ నా సుదర్శనున కర్పణఁజేసి రథమ్మునందు వ
మ్మునిచి మహోత్సవం బలర నూరికి నావల నిడ్వు మట్లొన
ర్చిన నెదిరించు శత్రుల హరింపఁ గలాఁ డతఁ డాహవమ్మునన్. 521

వ. అను వక్కాల కతం డిట్లను. 521

చ. వలువురితో విరోధమది బ్రహ్మకునైనఁ దరంబుగాదు నా
పలుకు గణించి పంతమును బట్టకు మెవ్వరికైన సాహసం
బలవడ దన్ని కార్యములయందును "వెట్టి యడంగె రోఁకలిఁగా
దలకును జుట్టుమం" చనువిధమ్మునఁ బల్కుదురమ్మ పుత్రికా! 522

చ. వదలుమటంచుఁ జెప్పెదవు వారలు వీరలు వైరయుక్తు లు
న్మదులు నృశంసులెల్ల నరనాయకులున్ మిముఁజుట్టి యేకమై

కదిసిన మీరొసర్పఁగల కార్య మొకించుకయేని లేదు నా
మది యెటులొప్పు దుర్మదులు మానక యెంతకునైన నొప్పరే? 523

వ. నా కొక్క యుపాయంబు దోఁచుచున్నయది. మున్ను సీతావివాహమ్మున జనకుం
బలెఁ బణం బేర్పఱతు నట్లైన నిర్వివాదంబుగ సమర్థుఁడగు వేరొకడుగాని సుదర్శ
నుండుగాని నన్నుం గైకొను ననుడు శశికల యిట్లను నోయయ్యా! సమర్థుండైనం
గాకున్న నాకు సుదర్శనుండ భర్త కాని యన్యుండు గానేరఁడు. 524

ఉ. ఈవు పణంబు నేర్పఱచితేని ధనాంగనరీతి నేనుగా
గావలె పీఠికిన్ సమముగా వశనై; యొకఁడెవ్వఁడో ననుం
జేవ గలాఁడొ పేదొకఁడొ చేకొను నప్పుడుమాత్ర మెల్లరున్
భూవిభు లూరకుందురె? సముద్ధతు లెంతురె ధర్మపద్ధతుల్. 525

క. ఏవిధినైనను గలహము, భావియ లోకైకజనని భావించి నన్నున్
దేవేరిగ నొనరింపు య, థావిధిగ సుదర్శనునకుఁ దలఁకకుమింకన్. 526

వ. స్వయంవర మంటపమ్మున కరిగి రాజులం గాంచి యుపాయమ్ముగ నిట్లనుము.
"నేటిదినమ్మున కీ సభం జాలింత మెల్లైన నీ కార్యంబు నెల్లి సమర్థించెద నిది
నిక్కువ" మని యవ్వారిని విడిదల కంపించి యీరేయి గుప్తంబుగ నాతని
రావించి విధివిధానంబుగ నన్ను సమర్పింపుము. పిఁద నాతండు నన్నుఁ దన
రథంబునం దిడికొని పోవనేర్చు రాజులు సంగరోన్ముఖులై దుర్మదమ్మున నడ్డుపడి
రేని యస్మదుపాసితయగు శక్తియ నివారించుఁగాక. కాదేని సుదర్శనుతోడి లోకంబ
నాకును జేకుఱునింత నిశ్చయంబని మఱియును, 527

క. ఒసఁగిన నొసఁగుము విధిగా, నొసఁగంగా నేరవేని యొగి నాయంతన్
బ్రసవశరుఁడు సాక్షిగ దే, వి సహాయగ నతని వెంట వెడలెద ననుడున్. 528

## శశికలా వివాహము.

వ. సుబాహుండును గుప్తంబుగా సుదర్శనునకు వివాహంబు సేయం దలంచి చని
సభ్యుల కిట్లను. నేఁటి కీ సభ చాలింతము రేపు భవదిచ్ఛాను సరణంబుగ స్వయం
వరంబగుఁ దడవొనరింపక ప్రకృతము విడుదులకు దయసేయుం డనుడు నంగీక
రించి రాజన్యులందఱును శిబిరమ్ముల కేగి పురంబు నల్గడల రక్షకుల నియోగించి
సుఖంబుండి రంత నతండును వివాహంబునకుఁ దగు సంభారం బొనరించి

యార్యుల రావించి యొరులెఱుఁగకుండ సుదర్శనుని బిలిపించి మంగళ స్నానాది కృత్యంబులు నిర్వర్తించి యిరువుర నేకవేదిఁ గైసేయఁ జేసి యాచమనీయార్ఘ్య పాద్యమ్ము లాచరించి యనర్ఘ్యవస్త్రద్వయం బొసంగి మధుపర్కంబిడి గోవును సమర్పించి కుండలమ్ము లలంకరించి విధివిధానమ్ముగఁ గన్యాదానం బొనరించె.

ఉ. అంత సుదర్శనుండు దగ నాలలితాంగి సుధాకరాస్య సు
స్వాంత ననంతరమ్యగుణ నంబుజపత్రవిశాలనేత్ర ని
శ్చింత రమాసమున్ హరి శచీసతిఁ బోలె గ్రహించె మేదినీ
కాంతుఁడు గాశిరాజు పలుకానుకలన్ దనియించె నల్లునిన్. 530

ఉ. పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మిమెయిన్ దళుకారుబంగరుం
బొమ్మయుఁ బోని యానృపతిపుత్రిక నెత్తి యలంకరించి పొం
కమ్మగు యానమందు నెనకమ్మున నుంచియు మంటపమ్ము మ
ధ్యమ్ము నలంకరించిన సుదర్శనుపాలికిఁ దెచ్చి రిమ్ముగన్. 531

వ. అంత బురోహితుండు నగ్న్యాధానం బొనరించి లాజావిసర్గంబు నిర్వర్తింపఁజేసి ప్రదక్షిణాదికం బొనరింపఁ జేయుడుఁ గాశీరాజు సంతుష్టాంతరంగుఁడై సర్వోపస్కరయుతంబు లగు రెండువందల రథమ్ములును నానాలంకారయుతంబులగు ననేకపసహస్రమ్ములును విహంగమరాజవేగమ్ములగు తురంగాయుతమ్ములును గ్రమేళక శతంబులును కాంచన భూషితంబులగు దాసీశతంబులును వివిధచిత్రవిచిత్రంబు లగు వాసగృహమ్ములును పూఁదోటలును ప్రకటమ్ము లగు శకటమ్ములును తక్కం గలుగు నానావిధవిశిష్టపదార్థమ్ములను నుపాయనంబుగా నొసంగి యల్లునిఁ గారవించి వియ్యపురాలగు మనోరమం గాంచి విహితాంజలిపుటుండై యిట్లనియె. 532

క. అమ్మా! యీసుత నీసుత, సొమ్మయి నప్పు డిఁక నీదుసొమ్మననేలా
నెమ్మిగలిగి యెంతయు గా, రమ్మున నేల్కొమ్మ నే గరములు మొగుడ్తున్. 533

వ. అనుడు మనోరమ సంతోషపూర్వకంబుగ నిట్లను. 534

గీ. ఇంతకన్నను వృద్ధిచే నెసఁగుమయ్య, రాజ్యహీనుండనక మహారాజవయ్యు
నిచ్చితివి మత్కుమారున కిగురుఁబోఁడి, రత్నపుంబొమ్మవోని గారాపుఁబుత్రి. 535

ఉ. ధీరులయందు నుత్తముల ధీవరులందుఁ గృపాళులన్ మహో
దారుల వీరులన్ మఱియు ధన్యుల మాన్యుల నన్యులందు నిం

కేరు భవత్ప్రమాణము ? మహీంద్రమహేంద్ర ! సుబాహుభూప ! మా
భారము నీది నీ కొమిరెభారము మాయది నేఁటివరమే. 536

ఉ. ఏరికినైనఁ బుత్రికలవిచ్చెడిచో ధనధాన్యసంపదా
ధారవిహార పుష్పవనతల్పము లాదిగఁ గల్గుభాగ్య వి
స్తారము నెంతు రెంతటి వదాన్యశిరోమణు; లట్లుఁ గాక సా
ధారణు మత్కుమారకు సుతాపతిఁ జేసితి వింత యొప్పునే. 537

మ. ధనధాన్యంబులు గల్గి యెక్కుడగు విద్యాబుద్ధులం బొల్చి వ
ర్తనలం బెద్దలమెప్పుఁ గాంచిన మహాధన్యాత్ములౌ రాజనం
దనులన్ జూడక నీకుమారి తనయంత న్నాతనూజాతు ని
ర్ధనునిం గోరుట కేను మెచ్చ నిమ నాంతర్యమ్మునన్ మెచ్చెదన్. 538

వ. అనవుడుఁ బ్రీతుండై సుబాహుం "డోయమ్మా! నీకొమరుండు రాజ్యవిహీనుండని
విచారింపనేల ? మద్రాజ్యం బఖిలం బతనిది కాదే" యని మరియును. 539

శా. నారాజ్యం బఖిలంబు నిచ్చెదను సేనానీత్వముం బూనెదన్
నీరాజ్యం బిది యేను సేవకుఁడ నా నీభేదమేలా ? పయో
నీరన్యాయమునన్ వసింపుదము మన్నీలున్న వారింకఁ ద
ద్వైరం బెట్టులొ సామదానములనో వారింతు భేదాననో. 540

క. ఆమూఁట జిక్కఁబడరే, నేమాయెన్ సంగరంబె యే నొనరింతున్
బో ! మానిని ! జగదంబిక, యే మన కన్నిఁటికిఁ గలఁ ది కేటికిఁ జింతల్. 541

వ. నావుడు మనోరమ యిట్లను. 542

ఉ. నీవచనంబుచేతన జనించె ముదంబు మదంబ నీకు సౌ
ఖ్యావహమయ్యెడున్ సుఖములందుము పుత్రులతోడఁగూడి యీ
భూవలయంబు నీవ తగుపోణిమి నేలుకొనంగదయ్య ! మ
ద్దేవియ మత్కుమారునకుఁ దెచ్చి యొసంగును దంద్రిరాజ్యమున్. 543

చ. కరమున మన్నుపట్ట నది కాంచనమౌఁ దనయత్న మింతయుం
బొరయకయే సమస్తమును బూర్ణమగున్ బ్రజలందఱున్ మహా
దరము వహింత్రు నెమ్మది ముదమ్మునఁ బొంగు సమస్త కార్యమున్
సరిపడు నొక్కపెట్ట గ్రహచారము చాలిన యప్పుడేరికిన్. 544

ఉ. చింత యొకింత లే దఖిలజీవులకున్ సుఖవేళఁ గష్ట మొ
క్కింతయు రాదు కష్టమున నించుకయుం సుఖమబ్బఁ బోదు లె
మ్మింతకు నాతనూజునకు విప్పటికాలము మంచిదౌట నా
వంతయు వంతరాదిఁకఁ బ్రయత్నమొనర్పుము కూఁతునంపఁగన్. 545

వ. అని యన్యోన్యకష్టసుఖప్రచారమ్ముల నారేయిఁ గడపుచున్నంత నగరమ్మున విడిసి
యున్న రాజకుమారులు మంగళతూర్యాదివిస్వనమ్ము లొక్కింత యాలించి. 546

ఉ. కొందఱిదేమి హేతువనుకొందురు కొందఱు పెండ్లి కాదు మీ
చందముసం జెలంగు నని యందియ మందరు కొందు రీనృపుం
డందఱ మోసపుచ్చి తనయాత్మజ నాతనికిచ్చి పెండిలిం
దొందరగా నొనర్చెడివినోదము గాఁదగు నందు రమ్మెయిన్. 547

ఉ. అంతటఁ గాశిరాజు వినయమ్మున రాజులఁ బిల్వ నేగ భూ
కాంతులయం దొకండను గౌరవమున్ బొనరింపఁ డంతయున్
స్వాంతమునం దెఱింగియు సుబాహుఁడు వెల్వెలఁబోక "యోధరా
కాంతులు ! పెండ్లి విందునకుఁగా దయసేయుఁడు మీర లెల్లరున్. 548

క. నాపుత్త్రి యెంత చెప్పిన, మావలుకులు వినక తనదుమది కెక్కిన యా
భూపతనూజు సుదర్శను, నే పెండిలియాడెఁ జెప్పు దేమి యొనర్తున్ ? 549

తే.గీ. మిమ్ము వియ్యోడ దయఁజూపి మించుపేర్మి, నించి నా గౌరవమును ద క్షించుపొంటె
వేఁడుకొనియెద" నావుడు ఱేఁడులెల్లఁ, దలలు వంకించి యీరీతిఁ బలికె రతని. 550

క. భోజనములాయె నొకరును, రాజా ! రాఁజాల రకట ! రాత్రి వివాహ
శ్రీ జరిపి బడలియుంటివి, భోజనమునకేమి ! పొమ్ము బోదుము మేముం. 551

వ. నావుడు సుబాహుండు వారలమనంబు గ్రహించి వంతయించుచు, నగరికరిగె నంత
వారాజులలోఁ గొందఱు సుదర్శనుం జంపి కన్యకన్ గైకొందమనువారును నది
న్యాయంబుగాదు మిన్నక యుత్సవంబు వాలోకించి పోవుదమనువారును మఱియు
నానాప్రకారంబులఁ బ్రసంగించువారునునై యాయామార్గమ్ములం గాచియుండిరి.
సుబాహుండు తక్కుఁగార్యంబుల నలక్షణమ్ముగా నెఱవేర్చి యల్లుని పతిసమేతమ్ముగా
నంపువాఁడై పారిబర్హం బొసంగుచున్నంత, 552

## సుదర్శన యుధాజిత్తుల యుద్ధము.

క. దూతలువచ్చి సుబాహుం డ, రాతలపతి కిట్టులనిరి రాజా! నీ జా
మాత నిపుడంపఁబోకు మ, రాతులు గలరయ్య త్రోవ రక్కసుల క్రియన్. 553

వ. నావుడు సుబాహుం డంతకుమున్న రాజులచందం బెఱింగిన వాఁడగుటం జేసి సంశయించుచుండ సుదర్శనుం డిట్లనియె. 554

చ. నృపవర! వారలేమి యొనరింపఁగలా రొనరించిరేని స
త్కృపగల తల్లి యా జగదధీశ్వరి నాకు సహాయభూతయై
రిపుల వధింపకున్నె తగురీతిఁ బ్రయాణమొనర్పుమయ్య మా
తపసుల యాశ్రమమ్మున ముదంబున నుండెదమయ్య! తద్దయున్. 555

మ. తగువాసం బది గాదటంచు మదిఁ జింతం జేయఁగాఁబోకు మె
ప్పగు మా యాశ్రమమందు దివ్యమణి దీవ్యత్కందరాజాతమా
సొగసుంగుల్కెడి బావులా చెఱువులా సొంపారుపూఁదోఁటలా
నగరుల్ మీనగరంబులుం దగవు విన్నాణంబునన్ దావికిన్. 556

వ. అనవుడుఁ గాశిరాజును నసంఖ్యమ్ముగా ధనం బొసంగి సతీసమేతంబుగా నంపుచుఁ దానును బలసమేతంబుగాఁ బిఱుందన వెడలె. 557

ఉ. అంత సుదర్శనుండు దనయంకమునందలి కాంతతో రతీ
కాంతుఁడు నాఁగ నిర్భయముగాఁ జనుదెంచెడివేళ రాజు న
త్యంత "మదే రథం బదె సుదర్శనుఁ డేగెడుఁ గాంతఁ గూడి మీ
రంతములెల్లఁ జెల్లఁ జని పట్టుఁడు కొట్టుఁ" డ టంచు రేఁగినన్. 558

వ. సుబాహుండు వారల కడ్డపడియె నంత సుదర్శనుండు నిశ్చలచిత్తమ్మున నేకాక్షరమ్మగు కామరాజమహామంత్రంబు జపించుచు నంబాపదసరసిజంబులు మనంబున గుఱిగొల్పియుండె నాలోనన యుధాజిత్తును శత్రుజిత్తున్ దాఁకిన. 559

ఉ. వీఁక సుబాహుఁ డాత్మభుజవీర్య మెలర్పఁగ శంఖదుందుభి
ప్రాకటరావముల్ సెలఁగ బాణపరంపరలన్ యుధాజిదా
ఖ్యాకు నెదిర్చె నిర్భర కఠోరముగాఁ బొసఁగెన్ రణంబు! ని
ర్భీతి నంబపై మనము వెట్టె సుదర్శనుఁ డప్పు డొప్పుగన్. 560

ఉ. దారుణరీతిగా రణము తద్గతి నొప్పుచునుండ దీవ్యదా
కారముతో మహాయుధనికాయముతోఁ దగువల్వతో నలం

కారముతోడఁ గల్పసుమకాండ పరీవృత దివ్యమాలికా
ధారముతో మృగాధిపతివాహనయై జగదంబ గ్రక్కునన్. 561

వ. ప్రత్యక్షం బగుడు సుదర్శనుండు హర్షపులకితగాత్రుండై మామకుం జూపుచు, 562

ఉ. ఇంక భయమ్ము చెంద మన కేమిటి కంచు రథమ్ము డిగ్గి యే
ణాంకముఖీలలామ యగు నంగనతోఁ దనమామతోడ ని
శ్శంకఁ దదంబికాంఘ్రి జలజమ్ములకుం బ్రణమిల్లె నేస్తులా
తంకము చెంద సింగమును ధ్వాన మొనర్చె ననూనరీతిగన్. 563

వ. మఱియు ఘోరవాయువులు వీచె దిక్కులు మిక్కిలి దారుణప్రకారంబులయ్యె దానంజేసి రాజులందఱును ఛీతిల్లి విశ్చేష్టులై మహాశ్చర్యపర్యాకులులై చూచుచున్నంత సుదర్శనుండు సేనాధిపతి కిట్లను. అస్మదుపాసితయగు జగదంబ శరణమై యేతెంచె నింక నీ వారులకుఁ దలంకక రాజసంకులమ్మగు పథమ్మున నవర్గళమ్ముగ సైన్యమ్ముఁ బోనిమ్మనవుడు నతం డట్లచేసె యుధాజిత్తు భయగ్రస్తులై బ్రమాప్పడి చూచుచున్న రాజులం గని యిట్లనియె. 564

ఉ. సింగముమీఁద నెక్కి యొక చేడియ వచ్చినయంత భీతులై
క్రుంగగనేల ? రాజు లధికుల్ గలచో నొక దుర్బలుండు త
న్వంగిని జేకొనంగ నదియారసి యూరకయుండఁ జెల్లునే ?
వెంగలి వీనిఁ జంపి బృధివీపతిపుత్రికఁ దెత్త మిత్తఱిన్. 565

క. అని తాను శత్రుజిత్తును, గినిసి సుదర్శనుని వంకఁ గీలించె శరా
సనమాకర్ణాంతంబుగ, ననేక బాణముల వాని నాతఁడు ముంచెన్. 566

వ. అంత నంబికయు, 567

చ. కనులను మిణ్గుఱుల్ బెదరఁగా నృపులందఱు కన్నిరూపులై
కనలి యనేకబాణముల గాఁడఁగనేసిన నంకులక్రమం
బునఁ దగె యుద్ధరంగము సముజ్జ్వలదేతదనూనబాణవ
ర్షనమున శత్రుజిత్తనితాతయుఁ గూడఁ బరేతులై రాగిన్. 568

వ. తక్కింగలవార లందఱు నద్దానికిఁ బరమాద్భుతం బందిరి. సుబాహుండు పరమప్రీతుండై యానందబాష్పములు వెల్లివిరియ నవ్వరశక్తి నిట్లని వినుతించె. 569

ఉ. పేరిమి సర్వశక్తి జనపీడ లడంచెడి తల్లిరో ! నమ
స్కారము, శాంతి విద్య శివ కామద నాఁణను తల్లిరో ! నమ

స్కారము, కొల్చువారలకు సంపద లిచ్చెడి తల్లిరో! నమ
స్కార, మకారణంబ యుపకార మొనర్చుట నీక చెల్లెడిన్. 570

పంచచామరము. సమస్త జంతుజాలముగా ప్రశస్త సత్కృపాకటా
క్షమరంగళోజ్జ్వలత్తరంగ సంగతిం బొసంగఁ జే
సి మేలుఁగూర్చి బ్రోచుతల్లి! శ్రీకరీగా నిమన్ సదా
నమస్కరింతుఁ బ్రోవుమమ్మ! నన్నుఁ బేర్మిమీఱఁగన్. 571

క. అగుణవగు నిన్నుఁ గొనియా, డఁగలనె? మూఢుండ నగుణుఁడన్ దుష్టుండగా
భగవతి! నీ యాథార్థ్యం, బు గనం జాలరు విరించి ముఖులగు సురలుగా. 572

గీ. ఈవ వాగ్దేవతవు, బుద్ధి వీవ మతివి, నీవ జంతువులకు గతి నీవ, నిన్ను
నుతి యొనర్పంగఁ దరమె? మనోనియంత్రి, వగుచు నెల్లెడ వర్తింతు వఖిల జనని!

ఉ. తావకభక్తముఖ్యుఁడు సుదర్శను సంగతిఁ జేసియేకదా!
భావుకమై యశేష జనపావనమై యజముఖ్యదుర్లభం
బై వెలుగొందు త్వత్పదనవాంబురుహద్వయి సూడఁగంటి నీ
సేవకకోటిలో నొకనిఁ జేసి నమం గరుణించు మమ్మరో! 574

ఉ. అంబ! రిపున్ హరించి భవదంఘ్రి రజోలవలేశధారి బా
లుం బఁహీనునిన్ విజయలోలు ననాథు సుదర్శనుగా గృపా
లంబితచిత్తవై శశికలానతితోఁ గరుణించి తింత పూ
ర్ణం బగునమ్మ! నెమ్మి నిను నమ్మి భజించెడి భక్తకోటిపై. 575

గీ. మంత్రతంత్రమ్ము లెఱుఁగ నీ మహిమ యెఱుఁగ
మూఢభక్తిని వినుతింతు మొఱకు నన్నుఁ
బాలనము సేయుమమ్మ! నీవాఁడ నమ్మ!
కిల్బిషమ్ము లడఁచి రక్షింపుమమ్మ! 576

వ. అని బహుభంగుల నుతించు సుబాహు గరుణించి యంబ భవదభీష్టం బేమనుడు
బద్ధాంజలిపుటుండై యానంద పులకితగాత్రుండై యిట్లనియె. 577

శా. తల్లీ! పెదగు దర్శనంబుకతనగా ధన్యుండనై యున్న నే
నొల్ల న్వేఁడఁ దేదియేని కరుణాయోగమ్మునం జేసి నా
యుల్లమ్మందు వసించు టొక్కటియ లోకోత్తంస మీకాశి న
దృల్లీలగా వసియించు టొక్కటియు వి న్నర్థింతు నత్యంతమున్. 578

క. దుర్గమ మగు రిపువర్గ మ, నర్గళకృప సంహరించి న న్నేలిన యో
సర్గవిధాయిని! నా పురి, దుర్గాభిఖ్య నివసింపు త్రుంపుము రిపులన్. 579

గీ. ఈపురం బెంతదనుకఁ దా నిల వెలుంగు, నంబ! నీవంతదనుక మా కభయధాత్రి
వగుచు వసియింపవలయు మహానుకంప, దనర నిచ్చోట; నిదియ నాకును వరంబు.

వ. నావుడు జగదంబిక యంగీకరించెఁ బిమ్మట సుదర్శనుం డామె నిట్లు వినుతింపఁ
దొడఁగె. 581

గీ. సృష్టిరక్షావిలయములు సేయఁ జాలె, దంబ! యొక్కింత యివ్వ నీకమరెనేని
యట్టినీ విట్టిదీను న న్నాదరించి, కాచితి వటన్న నిదియు దుష్కరమె నీకు? 582

గీ. ఏమికార్య మొనర్తు? నే నెచటి కేగు, వాఁడ? మూర్ఖుఁడనయ్యు భవత్ప్రసాద
బలముచే సర్వ మొనరింపఁ గలను దేవి!, కృప దలిర్పంగ నా కానతి మ్మనవుడు.

ఉ. చేసెడిదేమి నాకు నృపశేఖర! యీ లలితాంగితోడ సు
ఖ్ఖాసనముఁ వహించి విలసన్మతివై చని మీయయోధ్య సిం
హాసన మెక్కి నమ్మఱవ కంచితరీతిని రాజ్య మేలుకొ
మ్మా! సురనాథవైభవుఁడవై విను నేఁ బయి నుండి కాచెదన్. 584

క. బలిదాన విధానం బది, యలరఁ జతుర్దశిని నవమి నష్టమిని నను న్
గలకాలమ్మును శ్రద్ధా, కలితుఁడవై పూజ సేయఁగా వలెఁ జుమ్మీ. 585

క. అదిగాక, శరత్కాలము, మదభీష్టం బెంతయేని మత్పూజలు నె
మ్మది నవరాత్రవిధానము, పొదలఁగఁ దత్కాలమందుఁ బొనరుపు వత్సా. 586

గీ. మాఘ చైత్రాశ్వినాషాఢ మాసములను, నొప్పుగాఁ జేయుమయ్య మహోత్సవములు
కృష్ణపక్ష చతుర్దశి కేవల నవ, రాత్రములు నష్టమియును బాత్రములు మిగుల. 587

చ. అని వివరించి యంతటఁ బరాంబ యదృశ్యతఁ గాంచె నాసుద
ర్శనుదరిఁ జేరి యెల్లరును రాజులు భక్తియు నమ్రభావముం
దనర సురల్ సురాధిపు విధమ్మున మ్రొక్కి నుతించి రంబికన్
మనమున నమ్మువారు జనమాన్యత గాంచుట కేమి శంకయో. 588

క. మామయగు సుబాహుండును, భూమీపాలకులతోడఁ బోయి యతనికిం
జేమోడ్పు ఘటించెను దే, జోమూర్తులయందు వయసు చూడం బడునే. 589

వ. పిమ్మట రాజన్యులందఱును సుదర్శనుం గాంచి మహాత్మా! నీవిఁక నయోధ్యాపుర
మ్మునఁ బైతృకంబగు సింహాసనమ్ము నధిష్ఠించి మమ్మందఱఁ బాలించుచు మాచే
వలయుపనులం గొనుచు వింతకు మున్న జ్ఞానవశమ్మున నొనర్చిన యస్మదపచార

మ్ముల నైరింపవలయు సంసారకూపమ్మునం బడి సారాసారవివేకంబు దక్కి పశు
వులగతిఁ దిరుగు మాకు నీయనుగ్రహమ్మునం గదా! జగదీశ్వరీసందర్శనంబు
గలిగె నిట్టి నీకేమి యాచరింపం గలవార మని బహువిధముల ననునయించి మఱి
యును. 590

చ. అడిగెద నొక్కమాట వినయమ్మున; సర్వ మెఱుంగునట్టియో
యొడయఁడ! దేవి నాఁగ నెవరో! యిట కెచ్చటనుండి వచ్చెనో!
కడుముద మయ్యె మా కెఱుఁగఁగా నొనరింపు మనన్ సుదర్శనుం
డెడపక వారి కిట్టులనియెన్ జగదీశ్వరి నాత్మ నెంచుచున్. 591

ఉ. చెప్పెడిదేమి యోనృపతిశేఖరులార! త్రిమూర్తులాత్మ నె
ల్లప్పుడు నేజగజ్జనని నంబిక నెమ్మి భజింతు రాపె యే
యిప్పరశక్తి సాత్త్వికి మహీముఖలోకములెల్లఁ బ్రోచుఁ ద
న్నెప్పుడుఁ గొల్చువారలకు నిచ్చు నిరామయభాగ్యసంపదల్. 592

గీ. వెలఁగుచు రజోగుణమ్మున సృష్టిసేయు, సత్త్వగుణమునఁ బాలించు సంహరించు
నఖిలము తమోగుణంబూని; యక్షతమున, సగుణయననొప్పు నీశక్తిజగమునందు.

క. ఈ సగుణ శక్తియే యగు, దాసులకెల్లరకు సౌఖ్యదాయినియును సే
వానక్తులకున్ సేవ్యయు, నీసంబునెఱుంగ నగుణవిధ మే ననుడుఁ జా. 594

ఉ. చిన్నతనమ్మునంద వనసీమకు వెళ్వడి భీతి గ్రమ్మ బల్
విన్నఁదనంబుదోఁప నొకవిద్దెయు బుద్ధియు లేనిప్రాయమం
దెన్నఁగ నిట్టి శక్తికృప యేగతిఁగల్గెనటంచు మాకు న
న్నన్న! కడుఁజావిచిత్రమగు నాతెఱఁగుఁజా వివరించి చెప్పుమా. 595

గీ. అనుడు నతఁ డిట్టులను బాల్యమంద నాకుఁ, బట్టువడె నొక్క బీజంబు భాగ్యవశతఁ
బేర్మి నయ్యదియే కామబీజ మయ్యె, నదియనాకు నొసంగె విద్యాదికంబు. 596

క. మునులకతన నప్పప్పుడు, వినియుంటిని దేవినాఁగఁ బిదప నదియె యం
బను జూడఁగ సాధనము, య్యేను బీజావృత్తి కెంతయేనియుఁ దోడై. 597

వ. నాపుడు రాజులందఱును బరశక్తి ప్రభావమ్మునకును సుదర్శను నదృష్టమ్మునకును
సంతసించి తమతమపురమ్ముల కేగి సుఖంబుండిరి. సుబాహుండు నల్లు నంపించి
తనపురమ్మున కరిగి యయ్యెడ దుర్గాలయమ్ముగట్టించి ప్రతిష్ఠాదికంబొనర్చి విశ్వేశ్వ
రుతోఁబాటు పూజాదులు జరపుచుండె. సుదర్శనుండు పరమోత్సాహమునఁ గోసల
దేశమ్మున కరిగి యయోధ్యానగర సమీపమ్మున విడిసె. 598

## సుదర్శనుఁ డయోధ్యకరుగుట.

ఉ. సంగతి యంతయున్ దెలిసి సంగతులై సచివుల్ మృదంగ స
న్మంగళరావముల్ సెలఁగ నాగరకాంతలు లాజ లొప్పువే
డ్కం గురియింప వందులు గడంగి నుతింప నెదుర్కొనఁగా జయా
భంగురుఁడై సుదర్శనుఁడు పత్నియుఁ దాను నేగెఁ బ్రోలికిన్. 599

వ. ఇట్లు పౌరజనసమర్పితనానోపాయనగ్రహణ పురస్సరంబుగ నంతఃపురంబు సొచ్చి
పుత్రశోకమ్మునం గుందుచున్న సవతితల్లిం గాంచి నమస్కరించి వినయమ్మున
నోదార్చుచు నిట్లనియె. 600

క. నీతనయుని నీతండ్రిని, నీతివిహీనుండ నగుచు నేఁ జంపఁగ లే
దో తల్లి! భవత్ప్రదకం. జాతమ్ములు సాక్షి శక్తి చంపె నిరువురన్. 601

గీ. ఒకరుచేసినకర్మంబు నొకరు పొంద, నేర్తురే యిందులకు నింత యార్తియేల
తగ నవశ్యంబు కాఁదగుతంత్రములకు, శోకమంద రొకింత తద్జ్ఞులు నిజంబు.

ఉ. దాసుని నన్ను నీసుతునిగ నమ్మునఁ జూడఁగదమ్మ! శోకముం
జేసి కృశింపనేల? దయచేసి మనోరమకన్న నెక్కుడై
వాసియు నన్నెయుం గలిగి వర్తిలవమ్మ! యొకింతభేదమున్
జేసెడివాఁడఁ గాను జననీ! పరిచర్య యొనర్తు నిచ్చలున్. 603

క. తన చేసిన కర్మముచేఁ, దన కాపద సంభవింప దైవము దూఱన్
జన దన్యుల నిందింపన్, జన దయ్యది యనుభవమునఁ జక్కం బడెడిన్. 604

గీ. దారుమయకాంత నర్తకప్రేరణమునఁ, జేసి నటియించు విధమున జీవుఁడాత్మ
కర్మవశమున సుఖదుఃఖములను జెందు, నందుఁదద్జ్ఞులు దుఃఖించు టనుచితంబు.

గీ. చిన్నతనమున నీతండ్రి చెట్టఁదలఁచి, నన్ను రాజ్యవిహీను నొనర్చునప్పు
డేను గర్మానుభవమని యెంచుకొంటిఁ, గాని శోకింపలేదు నిక్కంబు తల్లి. 606

క. నీతండ్రి వీరసేనున్, నాతాతన్ జంప నాజనని నన్నుఁగొని దుః
ఖాతురయై కాంతారం, బేతెంచెడి త్రోవ దొంగలేతెంచి వడిన్. 607

క. కట్టినపుట్టము మొదలుగ, నెట్టన హరియింప దుఃఖనీరనిధికిఁ దాఁ
గట్టెఱుఁగక పడుకష్టము, లెట్టి రిపునకైనఁ గూడ వెప్పటికైనన్. 608

వ. అట్టియెడ నిదల్లిందును ధాత్రేయియు మమ్మును విడువక కష్టసుఖమ్ములకోర్చి
వెంటన్ జనుదెంచిరి. 609

ఉ. పిమ్మట నెట్టకేలకుఁ దపించితపించి సురాపగానమీ
పమ్మున నున్న యొక్కముని పల్లెకుఁ జేరితి మామునీంద్రులున్
మమ్ముల గారవించియుఁ గ్రమమ్మున నింతకుఁ దెచ్చిరమ్మ! నా
కమ్మెయి దుఃఖ మిమ్మెయి ననంతముదమ్మును లేదు తల్లిరో! 610

వ. ఇప్పటికైన నేరియందు మాత్సర్యంబుగాని వైరంబుగాని లేదు. రాజ్యభోగంబు కన్న నీవారాన్నభక్షణం బొనర్చుచు నింద్రియజయమ్మొనరించి ధర్మాచరణంబు కర్తవ్యం బని తోచెడి. సకలజన్మంబుల మనుష్యజన్మంబు దుర్లభం బదియును భారతఖండంబున నగుటెక్కుడగు. నట్టి జన్మంబునొంది సర్వసాధారణంబులగు నాహారాది సుఖంబులందుచు మందుఁడై వర్తించుటకన్న స్వర్గమోక్షప్రదంబగు ధర్మసాధనం బొర్చుట లెస్సగాదె! యను సుదర్శనువచనమ్ములు విని లీలావతి లజ్జితయై పుత్రశోకంబు పరిత్యజించి యిట్లను. 611

చ. విను విటుచేయునప్పు డవినీతి యొనర్పకు మన్న నన్ను మ
జ్జనకుడు లెక్క పెట్టక యసత్కృతి నీకొనరించి తాను జ
చ్చినయదిగాక మత్సుతువిజీవముఁగూడ హరించెఁ దా నొన
ర్చినకృతి దన్నడంచె నొకరిన్ జెఱుపన్ విధి తన్ను మాపదే. 612

క. నీతాత వీరసేనుం, డే తాదృశుఁడే తలంప నితని నాకై
నాతండ్రి చంపెనకటా!, యోతండ్రీ! తప్పునాది యొరు లెవ్వరిటన్. 613

క. నీ తల్లి నాకు సోదరి, నాతనయుఁడ నీ వకారణంబుగ దుఃఖా
న్వితవయి కుందనేల! మ, హీతల మేలుకొమమీ మహేశ్వరికరుణన్. 614

గీ. వారొనర్చినకర్మంబు వారిఁ జంపె, నిన్ను నిందింపఁ బాపంబు నేనెఱుఁగనె
చచ్చినకుమారునకు నేడ్వ సజ్జనుండ, వైన విన్నలయించుట కడల వలదె. 615

వ. అని యామె యానతిచ్చుటయు నతండు మంత్రులం బిలిచి దైవజ్ఞ నిర్ణీతంబగు శుభముహూర్తమ్మున హేమసింహాసనంబు నిర్మింపంజేసి మణిమండితంబగు నొక్క ప్రాసాదమ్మునమంచి తత్సింహాసనమ్మున యథావిధిగ జగదంబిక స్థాపించి, సర్వకాలమ్ముల నీయంబిక నర్చింపుఁడని పౌరులకాజ్ఞాపించి పిమ్మటఁ బట్టాభిషిక్తుండై సుఖమ్ముగ రాజ్యభారమ్ము వహించె. 616

గీ. ఆ సుదర్శనుకతమున నంబ జగద, ధీశ్వరి కృపావలంబ లోకైకజనని
యలరి కోసలదేశమ్మునందు నిలిచి, యెల్లవారికి శుభముల నిచ్చుచుండె. 617

సీ. ధర్మజ్ఞుఁడై నీతిఁ దప్పక ప్రఖ్యాతిఁ • బొందిన యలదిలీపునివిధమున
ప్రజలఁబిడ్డలరీతిఁ బాలించి యశముచేఁ • బ్రబలిన రఘుమహారాజు పగిది
సత్యంబు దప్పక జగతిఁ బాలించి ప్ర • శస్తి కెక్కిన హరిశ్చంద్రుమాడ్కి
శిష్టరక్షణదుష్టశిక్షావిశేషముల్ • సలిపి యేలిన రామచంద్రుపోల్కి
గీ. శుద్ధవర్ణాశ్రమాచార పద్ధతులను • ప్రతిగృహమ్మున నంబాసపర్యలును నె
సంగ శశికల సౌఖ్యంబొసంగ సంగ • తముగ రాజ్యం బొనర్చె సువర్ణుండు.
క. మామయు నల్లుఁడుఁ దమతమ, సీమల నంబాసపర్య చేయు కతమునన్
గ్రామాదులలోఁ బండిత, పామరసాధారణముగఁ బ్రబలెఁ బూజల్. 619

## నవరాత్ర పూజా విధానము.

క. అన జనమేజయుఁడనుఁ గ్ర, న్నన శరదాగమమునందు నవరాత్రమ్ముల్
చనుదెంచిన నేవిధి నం, బను బూజింపంగ వలయుఁ బరమమునీంద్రా. 620
క. నరపతి జనమేజయుఁ డా, దరమున నిట్లడుగ మౌనితల్లజుఁ డనియెన్
శరదాగమ మందు వసం, తఋతువునందును యజింపఁదగు జగదంబన్. 621
మ. అరయన్ సర్వజనౌఘనాశకములై యత్యంతఘోరమ్ములై
పరమవ్యాధికరమ్ములయ్యుఁ గడు శోభాస్ఫూర్తి నొప్పారి శాం
కరికిన్ బ్రీతికరమ్ములై మిగుల వేడ్కల్ సేయు లోకాళికిన్
శరదారంభవసంతముల్ శమనదంష్ట్రాప్రాయముల్ భూవరా. 622
క. కావున నీ ఋతువులను శు, భావహనవరాత్రముల సముచిత భక్తి
శ్రీవిభవము లలరఁగఁ బర, దేవత నర్చింతు రెల్ల ధీరులు నధిపా. 623
వ. నవరాత్ర విధానం బెఱింగించెద సావధాన మనస్కుండవై యాకర్ణింపుము. చైత్రాశ్వయుజమాసమ్ములయందు సితపక్షమునఁ బ్రతిపత్తిథి మొదలుకొని నవరాత్రంబులును దేవి నారాధించు నరుండంతకు మున్నమవసయందుఁ దత్తత్పూజాద్రవ్యంబులు సంగ్రహించుకొని యా దినమ్మున హవిష్యాశనంబున నేకభుక్తంబొనర్చి సమప్రదేశమ్మున షోడశహస్త ప్రమాణమ్మును స్తంభధ్వజ సమన్వితంబును నగు నొక మండపం బేర్పఱచి గౌరమృద్గోమయమ్ములచేఁ జక్కఁగా నలికి ముగ్గుపెట్టి తన్మధ్యమ్మునఁ జతుర్హస్త విస్తృతమ్మును నేక హస్తోన్నతంబును నగు నొక వేదికఁ బీఠార్థంబు నిర్మించి విచిత్రతోరణ వితానాదికంబులచే నలంకరించి మఱియును, 624

క. ఆనాఁటిరాత్రి మంత్ర వి, ధానజ్ఞుల సకలవేదతత్త్వజ్ఞుల స
న్మానించి పిలువవలయు ను, హాసియుపమునుగల్గు బ్రాహ్మణాగ్రేసరులన్. 625

వ. మఱునాఁ డుదయమ్మున నదీనదవాపీకూపతటాకంబులం దొండె గృహమ్మునం
దొండె స్నానం బాచరించి సంధ్యావందనాదులు దీర్చికొని పూర్వోద్దిష్టులగు బ్రాహ్మ
ణుల నర్ఘ్యపాద్యాదికమ్ముల నర్చించి శక్త్యనుసారంబుగ వస్త్రాలంకరణాదుల
సంతుష్టి గావింపవలయు. 626

గీ. ద్విజులు తొమ్మండ్రు వలయుఁ గాదేని నేఁడు, రైన మూఁగురునైన మహోపహారం దొ
కఁదగుఁ గావలయుఁ బూజలొనరుపను, చండికామూలమంత్రజపంబు పొంతె

గీ. మఱియుఁ బారాయణమునకై సుహితు లొంతు,నవఘు నొక్క పరియింపనగు ద్విజస్తు
స్వస్తివాచనపూర్వంబు శక్తిఁ బూజ, మొదలు వెట్టంగవలయు సమ్మోదమలర. 628

వ. పూర్వోక్తంబగు వేదియందు క్షౌమవస్త్ర సమన్వితంబగు సింహాసనంబు స్థాపించి
యందుఁ జతుర్హస్తయు నాయుధ సమంచితయు రత్నాలంకార విరాజితయు
ముక్తాహారభాసురయు దివ్యాంబర ధారిణియు సౌమ్యయు సర్వలక్షణ సంయు
తయు శంఖచక్రగదాపద్మాన్వితయు సింహవాహనయు నగు జగదంబిక నాగ
మోక్త విధానంబున స్థాపింపవలయు. 629

క. తగ నష్టాదశభుజ యగు, జగదంబికఁ బీఠమున సంస్థాపనఁ జే
యంగవలయు నంచుఁ గొందఱు, పొగడు విధానజ్ఞులండ్రు నృపతిలకా. 630

వ. విగ్రహాభావమ్మున నవాక్షర మంత్ర సంయుతంబగు యంత్రంబును బీఠపూజకై
స్థాపించి దాని పార్శ్వంబునఁ * బంచపల్లవసంయుతంబును వేదమంత్ర సంస్కృ
తంబును బుణ్యతీర్థజలపూరితంబును కనకరత్నసమంచితంబును నగు కల
శంబు నిలిపి యయ్యంత్రంబుతోఁ బాటు పూజింపవలయు నని మఱియును, 631

క. మంగళ మృదంగ నిస్వన, సంగత వారాంగనా సుసంగీతకళా
రంగితనటన వ్యా, సంగాదికములను బ్రొద్దు జరపఁగవలయున్. 632

వ. హస్తానక్షత్రయుక్తం బగు ప్రతిపత్తిథిని బూజారంభం బొనర్చుట మిగుల శ్రేయ
స్కరంబు. మఱియును, 633

శా. అంబా నక్తములుండి యొండె మఱి యేకాన్నంబుచే నొండె దీ
క్షం బూజించెడి యీ దినంబు లుపవాసంబుండి యొండెన్ మఖం

* మేడి, మఱ్ఱి, రావి, జువ్వి, మామిడి.

ఖం బూర్ణం బొనరింతునంచు నియమంబున్ శక్తికల్మిఁ దద
గ్రంబందున్ వచియించి పూనఁదగు నార్యాపూజకుం దొప్పగన్. 634

సీ. మందార కరవీర మాలతీచంపకా • శోక కరజదివ్య సుమచయములఁ
జందనాగురుకచ్చూరు కర్పూర బి • ల్వదళార్ఘ్యపాద్యాది లక్షణముల
నారికేళ కదళీనారంగదాడిమీ • పనసాదితరుజాత ఫలవితతుల
నన్నపానముల దివ్యభక్ష్యభోజ్యచో • ష్యాదికంబులఁ బాయసాదికముల

గీ. ధూపముల దీపముల మహాస్తుతుల నతుల•నతులగతుల వ్రతంబు నున్నతు లొనర్చి
నతుల నుతుం సుమతుల సద్గతుల నలరి • వెతలఁ బాయుచు రిదియ దేవీవ్రతంబు.

క. ఎన్నిక శక్త్యనుసృతిగా, నన్నంబిడవలయు భూసురాదులకు వ్రతం
బెన్నివిధంబులఁ జేసిన, నన్నంబిడఁదేని వ్యర్థమగు నరనాథా. 636

గీ. మాంసము భుజించువార లంబన్ యజింతు, రేని, బశువుల బలిదాన మీఁగవలయు
నజవరాహమహిషము లత్యంతముఖ్య, ములు బలివిధానమున నవి మునులమతము.

గీ. అంబికకెదురుగను జంపినట్టిపశువు, లెల్ల స్వర్గమ్ము నకు నేగు హింస నింద్య
మయ్యు యజ్ఞాదికముల దేవ్యర్పనాది, కముల నింద్యమ్ముగాదు స్వర్గదముగావి.

వ. మఱియుఁ ద్రికోణంబగు కుండంబేర్పఱచి యందు హోమంబొనర్ప వలయుఁ ద్రికాలమ్ములయందును నృత్తగీతవాద్యమ్ములు సెలంగ మనోహరమ్ములగు పూజా ద్రవ్యమ్ములచే నర్చింపవలయు భూమిపై శయనింపవలయు వస్త్రాలంకారాదికం బొసంగి కుమారికల నేకైకవృద్ధి క్రమంబునఁగావి యంతకు ద్విగుణమ్ముగఁ గావి త్రిగుణంబుగఁగావి నిత్యంబును నారాధింపవలయుఁ గుమారీ లక్షణం బెట్లంటేవి,

గీ. రెండువత్సరముల నలరెడునదియ కు, మారి; మూఁడేడు లైనచో మహిప! యది త్రి
మూర్తి; నాల్గేనిఁ గళ్యాణి. మొనపెనేని, యైదు రోహిణి; కాళిక యాఱు మొనయ.

గీ. సప్తవర్షంబులైనచోఁ జండిక యనఁ, బరగు నెన్మిదియైన శాంభవి యనంగ
నలరుఁ, దొమ్మిదియైన దుర్గాఖ్య నెసఁగుఁ, బదియయిన దావి నెంత్రు సుభద్రయనుచు.

గీ. ఇంత కెక్కుడు వయసాయెనేని శక్తి, సంతసింపదు తత్తదర్చనమునం గు
మారిలోనగుపట్టినామములు వాడ, వలయు నద్దాన నంబకుఁ గలుగుఁ బ్రీతి. 642

సీ. మాటిమాటికిని గుమారిఁ బూజించిన • దుఃఖదారిద్ర్యముల్ తొలఁగిపోవు
పూర్ణభక్తిని దాఁ ద్రిమూర్తిఁ బూజించిన • నాయుస్త్రివర్గముఖ్యఫల మబ్బు

ననుపుమీఱంగఁ గళ్యాణిఁ బూజించిన • విద్యావినయరాజ్యవిభవ మెనయు
నకలంకభక్తిఁ గాళికఁ బూజచేసిన • శత్రుసంతతికి నాశనము పొసఁగు
గీ. చండిక యొసంగుసంపదల్, శాంభవి యిడుఁనృపుల నలరించు శక్తి, నెంతే వసాధ్య
కార్యములు నెఱవేర్చు దుర్గయు, సుభద్ర • వాంఛితము లిడు, రోహిణి వ్యాధులడఁచు.
వ. మఱియు వీరలనర్చించుపట్ల శ్రీరస్తనుమంత్రంబున నొండె శ్రీయుక్తంబులగు మం
త్రంబులనొండె బీజమంత్రమ్ములనొండె నుపయోగింపవలయు. 644
క. అరయఁ గుమారతత్త్వము, లారాజీవభవముఖ్యు లగు సురలను లీ
లారీతిగా సృజియించు కు, మారిం బూజించెదన్ సమాహితభక్తిగా. 645
క. సత్త్వాదులచేతఁ ద్రిమూ, ర్తిత్వమ్ము న్నిఖిలరూపధేయత్వము వ్యా
ప్తత్త్వమును గాంచుశక్తిగా, దత్త్వనిధిఁ ద్రిమూర్తి భక్తి దనర యజింతుగా. 646
గీ. తనుభజించెడి భక్తసంతతికి నెపుడు, నఖిలకళ్యాణములను సమస్త కామ
ములు నొసంగెడి కళ్యాణి నెలమిఁ బూజ, చేసెద నఖండ భక్తి సుశ్రీలు వెలఁగ.
గీ. సకలభూతమ్ములను బూర్వజన్మ మందు, గూడఁబెట్టిన బీజముల్ కొమరుమిగుల
వెలువరించెడి రోహిణి విపులవిభవ, గారిణిఁ దలంతుఁబేర్మి నఖండభక్తి. 648
గీ. చండముండాదిహారిణి చండరూప, చండికకుఁ బూజలిడుదుఁ బ్రచండభక్తి
కారణములేని యుత్పత్తిగలుగు శాంభ, విని శుభప్రద భజియింతు విపులభక్తి. 649
క. ఏవంవిధమంత్రమ్ముల, నేవంవిధపూజలను సమిద్ధములగు నా
నావస్త్రాలంకృతుల కు, భావహలగు కన్యకలను నర్పింపవలెగా. 650
వ. మఱియు హీనాంగియు దుర్గంధబంధురయుఁ గుష్ఠయుక్తయు వ్రణాంకితయు దుష్ట
లభవయు జాత్యంధయుఁ (1) గేకరయుఁ (2) గాణియుఁ గురూపయు బహురో
మశయు రజశ్చిహ్నద్యంకితయు క్షామయు (3) గర్భసముద్భూతయు గోళకయుఁ
గన్యకోద్భూతయు లోనగు కన్యకల వర్జించి యరోగిణియు సురూపాంగియు
సుందరియు వ్రణవర్జితయు (4) నేకవంశసముద్భూతయు నగుకన్యక నర్పింప
వలయు సర్వకార్యమ్ముల బ్రాహ్మణియు జయార్థంబు నృపవంశజయు లాభార్థంబు
వైశ్యకులోత్పన్న గాని శూద్రవంశసంభవగాని పూజనీయ లని యెఱుంగునది.
బ్రాహ్మణ క్షత్రియులకు బ్రాహ్మణియు వైశ్యులకుఁ ద్రివర్ణజయు శూద్రులకుఁ జతు
ర్వర్ణసంభవయుఁ గారులకు స్వకులోద్భవయు నారాధ్యలని యెఱుంగుము. 651

(1) మెల్లకన్ను గలది. (3) 1 వత్సరము దాటని వయస్సుగలది.
(2) ఒక కన్ను గ్రుడ్డియైనది. (4) ఒక్క తండ్రికి జన్మించినది.

క. నవరాత్ర విధానమున వి. భవము కొలఁదిఁ బూజసేయఁ బరమహితము శ
క్తివిభవ శూన్యం డష్టమి. ని విశేషంబుగ యజించె నేవియుఁ జాలన్. 652

గీ. అష్టమిని మున్ను దక్షయజ్ఞాపహంత్రి, యగుచుఁ దను యోగినీకోటు లనుసరింప
భద్రకాళి జనించె నృపాల। తన్ని. మిత్తమున నష్టమిఁ బూజ మేలుఁ గూర్చు. 653

క. నవరాత్రకాల మెల్ల ను. పవాస మొనరింపలేని వారికి నుపవా
సవిధులు సప్తమి యష్టమి. నవమియు నివి మూఁడు విశేషములు లపరి నృపా।

## నవరాత్ర మహాత్మ్యము.

క. ఈ మూఁడు దినములను దగు. హోమంబులఁ బూజనములఁ బొగి సలరింపన్
గామములిడు నవరాత్ర మ. హా మహార్థంబుఁ బలెఁ బరాంబిక కరుణన్. 655

క. నవరాత్ర వ్రతమున కీ. యుపవసిన్ చేతొందుసాటి యనుకొనుటను వై
భవమిదు నాయుష్య విడు విడు. శివమున్ విద్యయును యశముఁ జేపట్టుఁ బరమున్.

క. విను రాజ్యభ్రష్టునకున్, దనయంతన రాజ్యమబ్బు ధరణీశ్వర। వి
ద్యమగోరి పూజచేసిన. మనుజకు విద్య లవియెల్లఁ గరగతములగున్. 657

క. వెనుకటి జన్మమ్మున నే. జను లీ నవరాత్రపూజ సలుపరొ వారే
యవపత్యులు రిక్తులు రో. గ విధులు దుర్జను లగుణులుఁ గష్టుల గ్రష్టుల్. 658

గీ. విధవలును వంధ్యలును ధనవిరహితులును, నైన కాంతలఁ గన్గొని నప్పు "డీయ
భాగ్యలెల్లరుఁ బూర్వభవమ్మునందు, నీ వ్రత మొనర్పలే" దని యెఱుఁగు మధిప.

గీ. ఘనతరంబుగ రక్త చందన విమిశ్ర. బిల్వదళముల నెవఁ డతిప్రీతి దనర
వంబ నవరాత్రములఁ బూజనం బొనర్చు. నతఁడు భూపతి యగును భూపతిపతంప।

చ. హరిహర పద్మగర్భులును నష్టదిగీశ్వరు లెల్ల దేవతల్
వరమమునీంద్రు లందఱును భక్తి దలిర్పఁగ నేపరాంబికా
చరణములన్ యజించి విలసద్గతి నొందుదు రమ్మహేశ్వరిన్
నరులు యజించు టబ్బురమె। నారక మేగెడివారు దక్కఁగన్. 661

గీ. బ్రహ్మ సర్గంబు విష్ణువు పాలనంబు, హరుఁడు లయమును జేయ నేయంబకతన
నా జగద్ధాత్రి సర్వ పాపాపహంత్రి, నమ్మహేశ్వరిఁ బూజించు టబ్బురంబె. 662

గీ. పలువలుగ లేల విను మహాపాతకము లొ. నర్చు దుర్మార్గుఁడైన నెవ్వఁడగనొక్క
సారి నవరాత్రముల జగజ్జనని పూజ. సేయఁ బాపమ్ము లెల్లను బాయు నిజము. 663

వ. రాజేంద్రా! మున్ను కోసలదేశమ్మున సుశీలుండను నొక్క వణిజుండు ధనధాన్య విహీనుండు గలఁ డాతనికి సంతానంబధికంబు బిడ్డలఁ బోషింపనేరక యొక్కనాఁ డొక్క విప్రసత్తముం గాంచి నమస్కరించి యిట్లనియె. 664

క. ఓ విప్ర! మహాభాగ! కృ. పావంతుఁడవగుమ నాయుభాగ్యదశను నీ వేవిధినైన హరింపం, గావలయుఁ గుటుంబభృతియుఁ గలవైతోఁచుకా. 665

క. ధనికుఁడఁ గావలెనని నె, మ్మనమున నాకిచ్చలేదు మన్నించి కృపం గని నా కుటుంబభరణ, మ్మునకు సుపాయం బొకండు బొనరుపుమనఘా. 666

క. నాకొడుకులు నాకూఁతులు, నాఁకలికిం దాళలేక యన్నంబడుగన్ లేక యొనర్చెడి దేమియు, లే కిటుఁచ్చితిని జూఁడలేక మహాత్మా! 667

క. ఆదిగాక, పెండ్లికిదై, సది గలదొకకూఁతు రది దశాధికవర్షం బొదవినఁ గన్యాదానో, త్సదశకుఁ జెడుఁ బెండ్లియగునె ధనహీనులకున్. 668

గీ. దానిఁ దలఁచిన గుండె బ్రద్దలగు నాకు. నేమిసేయుదు? దారిద్ర్యమెట్లు విడుచు నరసియేదేని నొక్క యుపాయమున్నఁ, బూని యొనరించి పుణ్యమ్ముఁ బొందుమయ్య.

వ. అని బహుభంగులం బ్రార్థించిన నవ్వైశ్యుంగాంచి సంశ్రితవ్రతుండును దేవీ మహత్త్వవేత్తయు నగు నావిప్రుండు పల్కు "నోయనఘా! శరత్కాలమ్మున నాశ్వయుజసితపక్షమ్మునఁ బ్రతిపదాది నవరాత్రవ్రతం బొనర్చు దేవినారాధించితేని నీదారిద్ర్యంబు దొలఁగు విద్దానికి వేఱొండు తుల్యమ్ముగాదని చెప్పి మఱియును.

ఉ. జ్ఞానమువిచ్చు మోక్షమునొసంగు నెపనవ్నవరాత్రకాలమం దేనరుఁడైన నంబ జగదీశ్వరిఁ బూజనభోజనంబులన్ ధ్యానములన్ జపంబులను దద్దయు హోమములన్ ధనాంగనా గాన వినోదనృత్యములఁ గ్రన్ననఁ దుష్టియొనర్చి మించినన్. 671

వ. మున్ను శ్రీరామచంద్రుం డరణ్యమ్మున సీతావియుక్తుండై కిష్కింధానగరమ్మున సుగ్రీవసాహాయ్యమ్మున నీ నవరాత్రవ్రతం బొనర్చియ కాదే సముద్రంబు బంధించి పుత్రమిత్రపరివార సహితంబుగ రావణ కుంభకర్ణుల హరించి విభీషణునకు రాజ్యం బిచ్చి సీతంగైకొని యయోధ్యకేతెంచి నిష్కంటకంబుగ రాజ్యం బొనర్చెఁ గాన నీవ్రతంబు శత్రునాశకరంబు సంపత్కరంబు సంతాన దాయకంబని చెప్పి యా వైశ్యునకు మాయాబీజాభిధంబగు తన్మంత్రం బుపదేశించిన నతండు తన గృహమ్మునకరిగి యథాశక్తిగ నీవ్రతంబు తొమ్మిదివత్సరమ్ములొనర్చె నంత. 672

ఆ.వె. నవమవత్సరమున నవరాత్రముల నష్ట, మీదినమున రాత్రి మేదురాద
రం బెసంగ నతని కంబ ప్రత్యక్షమై, పెక్కువరము లిడియెఁ బేర్మిమీఱ. 673

వ. అనుడుఁ బరాశరాత్మజునకుఁ బరీక్షిదాత్మజుం డిట్లనియె. 674

క. శ్రీరాముఁ డేకతమ్మున, దారం గోల్పోయె నతనితండ్రి యెవ ? రతం
డేరాజ్యమేలు ? రాజ్యం, బేరీతిఁ ద్యజించి యడవికేగెనొ ? చెపుమా ! 675

వ. నావుడు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె. 676

గీ. దశరథుండను రా జయోధ్యాపురమ్ము, నేలు నినవంశజుండు సుశీలుఁ డతని
సతులు మూగురు పెద్ద కౌసల్య రెండ, వయది కైకేయియును మూఁడవది సుమిత్ర.

## శ్రీ రా మ చ రి త్ర.

వ. అతండు సంతానవిహీనుండై పుత్రకామేష్టియొనర్చి ముగురియందు నలువురుకొడు
కులఁ గనియె నందు, 678

క. కౌసల్యకొడుకు రాముఁడు, భాసురుఁడాతండు మిగుల భరతుఁడు కైకే
యీసుతుఁడు సుమిత్రకు రిపు, శాసకులగు లక్ష్మణుఁడును శత్రుఘ్నుండున్. 679

గీ. జాతమాత్రంబునన ధమశ్శ్రుప్రాణు, లయిన నలువురు కొమరుల కానృపాలుఁ
దర్హసంస్కృతు లొనరించి యలరునంతఁ, గౌశికుం డేగుదెంచె మఖం బొనర్ప.

గీ. వచ్చి మఖరక్షణకు ననవద్యు రాముఁ, గోరె షోడశవార్షికుఁ గువలయేశుఁ
డిచ్చె లక్ష్మణు జతఁజేసి; యేగి రిరువు, రను మునీశ్వరు వెంట దారి నొకచోట.

గీ. మునుల బాధించు తాటకఁ దునిమి కదుపి, నీచుని సుబాహుఁ జంపి మారీచు విహత
కల్పుఁగాఁ బాఱఁదోలి మఖంబొనర్పఁ, జేసె రాముండు కౌశికుచేత నంత. 682

చ. ఎలమిని మూగురుణ్ మిథిల కేగెడిచో రఘురామపాదస
జ్జలజపరాగసంగతిని శాపము వాపె నహల్య శైవమౌ
విలు విఱుగంగఁ జేసి యట విక్రమధుర్యుఁడు రామమూర్తి మై
థిలి జనకుం డిడన్ గొనె సతీమణిగాఁ గమలాంశసంభవన్. 683

గీ. లక్ష్మణున కిడె నూర్మిళ లలితగాత్రిఁ, దగఁ గుశధ్వజతనుజాతల గుణవతుల
భరతశత్రుఘ్నులకు నిడెఁ బార్థివుండు, సపరివారముగఁ బురికిఁ జనిరి వారు. 684

గీ. అంత దశరథనృపతి రాజ్యార్హుఁడైన, రామునకు రాజ్య మీ నెంచులాణ నెఱిఁగి
పూర్వదత్తవరంబులఁ బొందెఁ గేక, యాత్మజ వకుండయిన భర్త నడిగి పిదప.

క. ఒక వరమున రాముఁడు జా, నకితో లక్ష్మణునితో వనంబేగెను వే
ఱొక వరమున భరతునకున్, బ్రకటగతిఁగా రాజ్యమబ్బెఁ బదునాల్గేఁడుల్. 686

గీ. చండరాక్షసయుత మగు దండకావ, నమ్మునకు రాముఁ డేగఁ దాపమ్ముఁ జెంది
దశరథుఁడు పూర్వశాపమ్ము దలఁచి తలఁచి, పరగతికి నేగె నంతట భరతుఁడాత్మ.

గీ. మిగుల శోకించి తన తండ్రి మృతికిఁ దల్లి, తన కిడిన రాజ్యమని మనమ్మున నెఱింగి
సకల రాజ్యంబు విడిచె నన్నకుఁ బ్రియం బె, సంగునను బుద్ధి శ్రీరామచంద్రుఁడచట.

క. పంచవటికేగి మదనో, దంచితయై కోరు రావణానుజ నెంతే
వంచించె శూర్పణఖ నది, గాంచి ఖరాదు లతికోప కలుషితులగుచున్. 689

క. ఒకనరుఁ డధముఁడు చెలియలి, ముకు చెవులను గోసె వింతపుట్టె నమచు మే
టికడిమి యుద్ధం బొనరిచి, యొక పెట్టన ద్రెళ్ళి రందఱొగి రామునిచే. 690

క. మునిహితముగ రాముఁడు గ్ర, న్ననఁ దానిటుచేయ శూర్పణఖ లంకాప
త్తనమేగి రావణునకుఁగా, దన పరిభవమంతఁ జెప్పి తద్దయు నార్తిన్. 691

క. శోకించిన రావణుఁడు రు, డాకలితుండగుచు వెడలి యరదము డిగి మా
యాకరుఁడగు మారీచా, ఖ్యాకునిఁ గాంచనమృగంబుగాఁ జేసి వెసన్. 692

క. పనిచిన జానకిఁ గని కాం, చన మృగమని భ్రాంతిఁజెంది చర్మంబును జ
య్యనఁ దెచ్చి యిమ్మనుచు రా, మునిఁగోరెఁగా దైవము కతమున నాతండున్. 693

శా. ఆలోచింపక లక్ష్మణుస్విడిచి చాపాస్త్రమ్ములం దాల్చి హే
లాలోలంబగు నమ్మృగమ్మునకునై లక్షించి లక్షించి వృ
క్షాళిన్ గ్రుమ్మరి కొండలన్ గడచి కర్ణాంతంబు రాఁదీసి శౌ
ర్యాలంకారుఁడు బాణమేయ నదియుఁగా హా! లక్ష్మణా! యంచొగిన్ 694

క. ఉచ్చైస్స్వనం బదరఁగఁ, బచ్చినఁ దద్విపులరవము జానకి విని బల్
హెచ్చిన భయమున లక్ష్మణు, నచ్చరితుంగాంచి యను వనవనయెసంగన్. 695

క. పీయన్న విహతుఁడాయెఁ గ, దోయీ! వేవేగ నేగవోయీ! జాగున్
జేయక యోపినకొలఁది న, హాయ మ్మగుమోయి! "లక్ష్మణా!" యనెనోయీ!

చ. అన విని లక్ష్మణుండు జనకాత్మజ కిట్లను "రాముఁ జంప నో
పునరులు పుట్టువారలును బుట్టిన వారలు బుట్టఁబోవు వా
రును మఱిగారు రాఘవుని రూఢి నెఱుంగవె? యాజ్ఞఁదప్పి నేఁ
జనిన సహించునే? తనదుచావున కొప్పును గాని మానినీ. 697

ర్పణఖాఖ్యక మదీయసోదరి విసున్ వర్ణించి వర్ణించి చె
ప్పి వనుం బంచె ఖరాదిరాక్షసులఁ జంపెఁగా రాముఁడంచుఁగా వడిన్. 708

మ. హృతరాజ్యుండు వనప్రవాసి విగతశ్రీకుం డపూర్ణుం డపం
గత సైన్యుం డబలుండు మానవుఁడు వేడ్కల్ సేయునే నీకు నీ
పతి కొంతల్ మగఁ డెట్టివాఁడయిన సంభావింప రన్యార్థినుల్
వతు నత్యున్నతు దాసు నన్నుఁ గొనుమీ నారీశిరోరత్నమా! 709

క. మందోదరి యని చెప్పఁగ, విందువకా! యాపె నాదు ప్రేయసి విన్నా
సుందరి కన్న నధికముగ, నందల మెక్కింతు రాజ్ఞి వగు మెల్లరికిన్. 710

చ. సురపతి నోంచితిన్ జముని చొప్పడఁగించితి శ్రీదు మాపితిన్
వరుణుని గెల్చితిన్ శశిదివాకరులఁగా బనిగొంటి నాకు నీ
నరుఁడొక లెక్కయే! యొక యనంగుని కోపఁగఁజాల వింక నీ
చరణములాన యింతదయ నల్పఁగరాదె? త్రిలోకసుందరీ! 711

ఉ. నేఁటిది గాదు నీ యెడల నేస్తము నాకుఁ; గటాక్షముంచు మో
పాటలగంధి! నీజనకుఁ బల్మరు వేఁడిన శైవచాప మన్
గాటపుటడ్డు దెల్పెఁ జెలి! నా కది గూడనిదౌట నేను నా
నాఁట స్వయంవరంబును గనఁగా జనఁదేరఁగలేదు సుందరీ! 712

గీ. నాఁటనుండియు విరహమ్ము నాటె నాకు, నెట్లు సంప్రాప్తమగుదువో యీ వటంపు
ననుకొనుచునుండ నేఁటికి నబ్బి తింక, జాగుసేయకు నా యనురాగ మెఱిఁగి. 713

క. అను రావణువచముల క, వనిజ భయము చెంది మనముఁ బాదుకొలిపి "యో
జననింద్య! మదనపీడిత!, యనుచితములు ప్రేలఁబోకు పరుగు మవలకున్. 714

ఉ. స్వైరిణిగాను నే జనకసత్కులసంభవఁ గాని నామనో
ధీంత గుర్తెఱుంగ కిటు దెప్పరమౌగతిఁ బల్కు నీకు నా
కారణమై మృతిం గనెడికాలము చేరువ గాకయున్నె? యే
వీరుఁనకైనఁ గాని రఘువీరునితో నెదిరింప శక్యమే. 715

క. ఘోఘొన్మని వచియించుచుఁ, గోపమ్మునఁ బర్ణశాలకుం జను నాలోఁ
బాపాత్ముఁడు రావణుఁడు స్వ, రూపము గనుపఱచి భీకరుం డగుచు వడిఁగా. 716

ఉ. హా! రఘురామ! యంచు, సుగుణాకర! లక్ష్మణ! యంచుఁ బిల్చుచున్
బోరననేడ్చు నాజనకపుత్రి బలాత్కృతి నెత్తిపట్టి బల్

దారుణరీతి నంబరపథంబునఁ బో నరుణాత్మజుండు దుః
ఖారవ మాలకించి వడి నడ్డమువచ్చె జటాయు వుగ్రుఁడై. 717

ఉ. అతని ఘోరయుద్ధమున నక్కటిలాత్ముఁ డడంచి మించి దుః
ఖాతురయైన సీతఁ గొని యంబుధిదాఁటి చెలంగి లంకలో
నా తరుణీమణిన్ భయదమైన యశోకవనమ్మునన్ గన
ద్దేతులు రాక్షసాంగన లహేతుకకోపలు చుట్టువారఁగన్. 718

క. ఉనిచిన నా జనకాత్మజ, యునుఁ బాతివ్రత్యగరిమ నొక్కింతేవిన్
ఘనత చెడకుండ రాముని, మనమున నిడి యవ్వనమున మ్రాన్పడి యుండెన్. 719

క. అంత నట రామచంద్రుం, డెంతయు మోదమున మృగము నీడిచికొని యొ
క్కింతవడి వచ్చుటయుఁ ద, త్ప్రాంతమ్మున లక్ష్మణుండు వగ గడలుకొనన్. 720

క. ఎదురైనఁ జూచి యిట్లను, సదయుఁడవై జానకీలతాంగి నొకర్తున్
వదలి యిటు రాఁదగునె ? దు, ర్మదరక్షప్రచుర మీయరణ్య మెఱుఁగవే. 721

క. అన విట్లను నేమని నే, మనవి యొనర్పంగలాఁడ మైథిలివలుకుల్
వినలేక వచ్చితిని మా, వినుల వివేకంబుపట్ల నేర్తురె యెందున్. 722

గీ. కాలయోగంబు దాఁట శక్యంబు గాద, టంచు వృత్తాంతమును విన్నవించె నంత
విరువురును బర్ణశాలకు నేగి జనక, తనయఁ గానక శోకించి తద్వనమున. 723

క. నలుగడల వెదకి యొక్కెడ, నలుఁగులు దీంద్రింపఁ బ్రాణ మవశేషముగా
విలఁ బొరలు జటాయువుఁ గన, నెలుఁగు బయలుపడమి మెల్ల విట్లను పార్థిన్.

ఉ. సీసతిఁ గొంచు రావణుఁడు వింధితుఁ డేగఁగ నడ్డునొచ్చి నే
నోపరిలంగఁ జేసిన మదోద్ధతుఁడై పడవైచి యేగెఁ ద
ద్వానము లంకయన్పురము ప్రాణము నిల్వదు పోవుచుంటి నీ
వానరసీరుహాక్షి కయి యత్న మొనర్పుము వేగ రాఘవా. 725

క. అని మృతిఁగన నాతనికి ద, హనాదిక మొనర్చి తద్గహనమునఁ జనుచుఁ గా
ఘనకాయు నొక్కెడఁ గబం, ధుని శాపవిముక్తుఁ జేసి తొలఁగి కడంకన్. 726

గీ. అతఁడు చెప్పిన తెరువున నరిగి సూర్య, పుత్రుతో మైత్రిఁ జేసి యపూర్వ బలుని
వాలిని వధించి సుగ్రీవువంతఁ దీర్చి, యంతఁ గిష్కింధ నాతని కాతఁ డొసఁగె.

క. ఆ సుగ్రీవుఁడు గొలువఁగ, హా ! సీతా ! యనుచు సీత కడలుచు నచటన్
మాసములును వత్సరములు, చేసె నివాసంబు మైత్రిఁ జేసి యతఁడొగిన్. 728

క. నెమ్మది తన్మయమై తా, నమ్మ గదలుకొనఁగఁ గనులఁ బలుమరు నశ్రుల్
గ్రమ్మఁగ రఘురాముఁడు తన, తమ్మున కిట్లనియె ననుగతమ్మగు పేర్మిన్. 729

ఉ. తమ్ముఁడ ! జానకిం గనువిధమ్ము గనంబడ దెట్లుసైఁతు దై
వమ్ము మ నమ్మకన్నఁ బలవత్తి గదా ! జనకాత్మజావిహీ
నమ్ముగ నేనయోధ్యకుఁ జనం బనిలేదు బహూక్తు లేల ప్రా
ణమ్ములు విల్వనోప విఁక నాకయి సారెకుఁ గుందఁబోకుమీ. 730

ఉ. శ్రీకరమైనరాజ్యము హరించె నరణ్యమునందు వాసమున్
జేకుఱఁ జేసెఁ దండ్రి మహనీయునిఁ జంపె మఱింతఁ జేసియుఁగా
బోక మదర్ధగాత్రమును బోకడ వెట్టె విఁకేమిసేయు ? దు
ష్పాకము దైవ మన్నిటికిఁ బాల్పడి యుంటిని ప్రాను కైవడిగా. 731

చ. పరిపరిరీతులఁగా మనసు పొడగు బంగరు చేతఁబట్టఁగా
నెరువయితోఁచు దేహమున కెంతయు నార్తి తటస్థమౌ మఱె
వ్వరు తమనాదరింప రెటువంటిమహాత్మునకైన నేదియున్
సరిపడ దించుకేని గ్రహచారము చాలనినాఁడు తమ్ముఁడా. 732

చ. మనుకులమందు ముందు జనమాన్యులు రాజకుమారు లెందఱో
జననమునందరో ! మిగుల సౌఖ్యములొందరొ ! మందభాగ్యులై
మనవలెఁ గుందిరే ? మనువు మన్నవయుం జెడఁ బుట్టినార మే
మనఁదగు విద్దఱిద్దఱము యందొక భేదములేదు తమ్ముఁడా. 733

చ. వనమున భార్యఁగోలుపడి వంతలఁ జెందుచు నుంటి నేను నీ
వన గృహమందు వీడి తకటా ! వికటంబుగ నెంచినాఁడ నీ
వనితఁ గనందగుఁగా, గనఁగవచ్చునె వానతి ? నాకు సాటి యీ
మనుకులమంద కాదు మఱి మానవనాయకు లంద లేదుగా. 734

క. మనువుమొద లింత దనుకన్, జనియించిన రాజులం దశక్తుండు నకిం
చనుఁ దక్షముండు నా క, న్నను లేఁడిఁకఁ బుట్టఁబోఁ డవదయు నదయుఁడుఁగా.

ఆ.వె. ఎవరి దూఱువాఁడ నేమనువాఁడ ధ, నంబు బలము రెండు నాకు లేవు
తావుద గ్గఁ తోడిఁకెవ్వరు లేరు పూ, ర్వకృత మనుభవింపవలయుఁ గాదె.

గీ. ఇంద్రపదవికిఁ దుల్యమై యెసఁగురాజ్య, మాగతించె వనంబు సంప్రాప్తమయ్యె
వగవ విందుల కొక్కింత వనజనయన, సీత లంకేశు చేతిలోఁ జిక్కె నకట. 737

చ. వలఁబడు చక్రవాకిగతి వానికిఁ జిక్కెఁడివేళ నెంతఁగాఁ
గలకల మందెనో, తను నొకర్తుగ డించిన నన్ను నేగతిం
దలఁచెనొ ? కాదుకాదు, కడుఁదప్పొనరించిన నేమిచేసినన్
బలుక దొకింతయేనిఁ బతిభక్తికి లోప మొనర్ప నెంచునే. 738

ఉ. లంకకు నేగి వానికిఁ దలంకి కలంకిని యౌనటంచు నా
శంకఁ గొనంగరాదు విను స్వైరిణియే జనకాత్మజాత ! యా
తంకము గల్గెనేని విహితమ్ముగఁ బ్రాణములం ద్యజించు న
ప్పంకజగంధి యిట్లయిన పక్షమునం బ్రతుకంగ నేర్తునే. 739

క. అని బహువిధముల, శోకం, బున గ్రుంగెడి యన్నఁ జూచి పొరిఁ బొరిఁ జింతం
గననేల ? రాక్షసాధముఁ, దునిమి జనకజాతఁ దెత్తుఁ దూర్ణతరముగన్. 740

గీ. ఆపదలయెడ సంపద లబ్బునప్పు, డేకరీతిని ధీరత్వ మెవనికొదవు
నతఁడ ధీరుఁ, డధీరుఁ డయ్యవసరములఁ, దన్మయుండగు నదియ చింతాకరంబు.

గీ. యోగము వియోగమును దైవయుక్తిఁ జేసి, కలుగు నియ్యవి సతములుగావు సూవె
ఇందులకు నింతవగవగనేల? యవియు, మనమునకుఁజొప్పడవు దేహమునకుఁగాని.

క. కాలవ్యత్యాసంబున, నే లలనయు రాజ్యభరము నిటులాయె నిఁకన్
గాలము నరియగు రాజ్య స, తీలాభము లబ్బుఁ జెడ్డదినములు వోవున్. 743

క. ప్రారబ్ధం బనివార్యం, బేరికయినఁగాని యింత యేలా ! ధీరుల్
వీరులు వానరు లవనికు, మారిన్ వెదకంగఁ గడు సమర్థులు దిశలన్. 744

ఆ. వె. సీత యున్నచోటుఁ జెప్పెర వానరు, లేగి చూచివత్తు రేమ వానిఁ
జంపి క్షణములోన జానకిఁ దెచ్చెద, నింక వగలఁ బొగలనేల చెపుమ. 745

క. మనకు సహాయులు లేరని, యనుకొనకుము భరతుఁ బిలువ నంపించిన సే
నను గొని వనుదేరఁడె ? శ, త్రుని దునుమఁగలేమె ? యింత తుందుడుకేలా.

గీ. రఘుమహారాజు తానేకరథముఁ గొని స, మస్త దిశల జయించె నీ వట్టివాని
వంశమునఁ బుట్టియును శత్రువధకు నిట్లు, తలఁక నేటికి నావంటి తమ్ముఁడుండ.

ఉ. ఏ నొకరుండనే జగమునెల్ల జయింతు సహాయులేల ? కా
దేని విదేహభూమిపతి కించుక యీస్థితిఁ దెల్పినన్ మహా
సేనఁ దతండు వచ్చు నిఁకఁ జేయఁగరాని దొకండు గల్గునే ?
మానవనాథ ! రావణునిమా టటులుంచు మెవం డెదుర్కొనున్ ! 748

గీ. సుఖము దుఃఖము నను నివి సుస్థిరములు, గావుగా! చక్రనేమి వైఖరిని దిరుగు
చుండు ధీరుండు దీన మగ్నుండు గాఁడు, తప్పునే యెరికైనను దైవకృతము. 749

సీ. మును దేవతలు నహుషుని నింద్రపదమున • నిల్ప నింద్రుఁడు దైవనియతికి నెద
భయమంది కుందుచుఁ బంకజాంతరమున • నజ్ఞాతవాసంబు నమరఁజేసె
బహువత్సరము లంత నహుషుఁ డింద్రునిభార్య • యగు శచిఁ గోరి విప్రావమాన
మొనరింపఁగ నగస్త్యుఁ డుద్ధతకోపుఁడై • సర్పంబ వగుమని శాపమిచ్చె

గీ. నహుషుఁ డహియయ్యె నింద్రుఁ డానంద మెసఁగఁ
దన పదంబును గైకొనె ననఘ! వ్యసన
మబ్బుతఱి శోకమందిన నగునె, యోర్చి
కొనిన సకల సుఖమ్ములు గొనఁగవచ్చు. 750

గీ. ఈవు సర్వజ్ఞుఁడవు చెప్ప నెవరితరము, ప్రాకృతుని మాడ్కి శోకింప ఫలముగలదె?
యనెడి లక్ష్మణుపలుకుల నంత రామ, చంద్రుఁడును సమ్మదము చెందె జనవరేణ్య.

గీ. అపుడు వారలసన్నిధి కరుగుదెంచె, నారదుఁడు కాంతినిర్జితపావకుండు
రామలక్ష్మణు లామునిరాజు గార, వించి యెంతయుఁ బూజఁగావించి రెలమి. 752

క. మునియును శోకార్తుని రా, మునిఁ గని యిట్లనియె నీదు ముదితన్ సీతన్
దనచే నెఱుఁగక రావణుఁ, డనయుండై యపహరించెనని వింటి దివిన్. 753

క. శోకింపనేల విను మో, కాకుత్స్థకులావతంస! కలనంగతి నీ
వాకుటిలాత్మునిఁ జంపుట, కేకద! యవతారమంది తినవంశమునన్. 754

క. ఆకతమున జనకాత్మజ, నాకుటిలాత్ముఁడు హరించె నహినెఱుఁగక కా
దే! కంఠమునం దిడికొనె, నీకావలఁ డింక మనుటయెట్లు ఘటించుఁగా. 755

సీ. పూర్వజన్మమ్మున భూతమూజాత ము • నీశ్వరకన్యక యీమె తపము
నాచరించుచునుండ నతిదుష్టుఁ డగురావ • ణాసురుఁ డొక్కనాఁ డడవికేగు
దెంచి యక్కన్నియఁ గాంచి మోహించి త • నకు భార్యఁగాఁ గోరిన వినక తను
నెదిరింపఁ గచభరం బెనసిపట్టిన నా త • లోదరి "యోమత్త! యోదురాత్మ!

గీ. యనఘ నగునన్ను ముట్టినయట్టి నీదు • చావునకు భూస్థలి నయోనిజాత నగుచుఁ
బుట్టెద" నటంచు శపియించిపొలిసియిపుడు• మైథిలియనంగఁబుట్టెఁదన్మరణమునకు.

క. ఈవును హరియంశమ్మున, దేవప్రేరణముచే నిదే నవనిగా న
ట్లావిర్భవ మందితివి గ, దా! వగపేల! వధియింపు మాదుష్టాత్ముఁగా. 757

ఉ. జానకి రావణాసురు వశమ్మును బొందక యింద్రుఁ డంపునా
ధేనువు పాలునున్ సుధయు దేహము విల్చఁగ నీదు నామమే
ధ్యానముఁజేయుచున్ బ్రతిపదమ్ము నినుం గొనియాడుమున్ దగ
బ్రాణముతోడ నున్నది నృపాలక ! నేఁ గనుఁగొంటి నింతయున్. 758

ఉ. వాని జయింప నీకొక యుపాయముఁ దెల్పెద నంబికన్ జగ
త్ప్రాణనదక్షమైన నవరాత్రవిధానమునన్ బలిన్ విధా
నానుగతంబుగాఁ దగినయట్టిపశుప్రజముం బొనర్చి య
ద్దాన దశాంశ మగ్నికిడి తన్పుము హోమవిధానసత్క్రియన్. 759

క. ఈగతి నొనరించిన శర, దాగమమునఁ గార్యసిద్ధి యలవడు దీనిన్
భోగీశశయనుఁ డింద్రుఁడు, నాగమవిహితముగఁ జేసి యందిరి సిద్ధుల్. 760

గీ. తనదుభార్యనుజంద్రుండు గొనఁగగురుఁడు, నీవ్రతమొనర్చి తాఁగృతకృత్యుడయ్యెఁ
గశ్యపవసిష్ఠభృగుమునిగాధిసుతులు, చేసి రిద్దాని నిది కార్యసిద్ధిదంబు. 761

గీ. వృత్రుని జయింప నింద్రుండు త్రిపురవిజయ
మునకు శంకరుఁడును దామధుని హరింప
హరియు నొనరించి రీవ్రతం బఘహరంబు
జయకరము సౌఖ్యకరము యశస్కరంబు. 762

క. అనఘ ! యిది సుఖితులను జే, యనగుఁ జామీ వ్రతము ! మఱియు నతిదుఃఖితు లౌ
మనుజులు దీని నొనర్చిన, జనవికి దయగలుగుఁ జెలఁగు సౌఖ్యముతెల్లన్. 763

క. అనవిని శ్రీరాముం "డో, మునివర ! యావ్రతవిధానముం దద్దేవీ
ఘనచరితంబుఁ బ్రభావం, బును నాకుం దెల్పు" మనుడు ముని యిట్లనియెన్. 764

గీ. శక్తియన నిట్టిదని చెప్ప శక్యమగునె, హరిహరబ్రహ్మలందు రక్షావసాన
సృష్టిరూపమ్ముల మెలంగు జీవరాసు, లందుఁ దత్కాళ యనుగత మై చెలంగు.

గీ. బ్రహ్మమొదలు పిపీలికారాశి దనుకఁ, దత్స్వరూపం బితరమొకింతయును లేదు
ఆమె విహరించుఁ గల్పాదియందుఁ బరమ, పురుషుతోఁగూడి నిర్గుణస్ఫూర్తి మెఱయ

గీ. మీఁద సగుణాత్మయగుచుఁ బేర్మిమెయి నఖిల
భువనములు సృష్టిఁజేసి త్రిమూర్తులను ని
మిత్తమాత్రమ్ముగా వీనిమీఁద నుంచు
నామె నెఱిఁగిన బంధమ్ము లడఁగిపోవు. 767

గీ. అపె నామములన నకారాదియును క్ష, కారమంతంబు గల వర్ణగణము వర్గ
యుక్తముగ గుణకర్మాదియుక్తిగూర్చి, వెలయు నెన్నెని యనరాముఁడెలమి దనర.

క. దేవీపూజాకృతి క్ర, ద్ధావంతుఁడనగుచుఁ జేయఁ దలఁచెద నాకున్
గేవలము తద్విధానం, బీవానతి యిమ్మనన్ మునీంద్రుం డనియెన్. 769

చ. సమమగు దేశమందు విలసద్గతిఁ బీఠమువెట్టి వేదయు
క్తముగఁ బరాంబిక న్నిలిపి తన్నవరాత్రములం దుపోషణ
క్రమమున నుండి యీ వ్రతవరంబుఁ గరంబు నొనర్చు మే గురు
త్వ మొనరుతున్ జగత్త్రయహితంబగు కార్యముగాన నావుడున్. 770

క. రాముం డాశ్వయుజమ్మున, నా ముని చేయింపఁ దన్మహావ్రతమును ద
ద్భూమీధరమునఁ దమ్ముని, తో మోద మెలర్పఁ జేసెఁ దొమ్మిది దినముల్. 771

ఆ. వె. అష్టమీదినమ్మునందు విశీథమ్ము, నందు సింహవాహ యగుచు జనని
దర్శనంబొసంగి దయఁజిల్కుచూపుకో, నిట్టులనియె రాఘవేశ్వరునకు. 772

క. రామా! జగదభిరామా!, నా మది సంతోషపెట్టినాఁడవు నీకుం
గామము లొసంగవచ్చితి, నీ మానినితోడఁ బొత్తు నీకబ్బు వినఁకన్. 773

సీ. మత్స్యమై మున్ను సోమకుఁ ద్రుంచి వేదముల్ • బ్రహ్మకిచ్చిన జగత్ప్రభుఁడ వీవ
కూర్మంబవై యబ్ధిఁ గ్రుంకి మందరమెత్తి • రహి నొసంగిన మహామహుఁడ వీవ
కోలమై యిలఁదాల్చి కుత్సితుం డగు హిర • ణ్యాక్షుఁ జంపిన దానవారి వీవ
నరహరివై హిరణ్యకశిపుఁజంపి ప్ర • హ్లాదు నేలిన కృపాపాది వీవ

గీ. కపటవామనరూపంబుఁ గాంచి బలిని • ద్రోచి యింద్రున కిచ్చిన దొరవువీవ
పరశురాముఁడవై భూమి పాలకులను • రూపు మాపినయట్టి ముక్కోపి వీవ. 774

క. నీ యవతారము లన్నియు, నా యంశముతోడఁ గూడిన యవియ మఱి నీ
కాయాయి వానరులును న, హాయులగుదు రందఱును మదంశోపేతుల్. 775

క. ఇపు డాచరించినట్టులె, నవర్య రాఁబోవు నీవనంత ర్తువునం
దపరిమితశ్రద్ధాభ, క్తిపరీతుఁడ వగుచు సలిపి దీప్తిం గనుమా. 776

క. రావణుఁ బరిమార్పఁగ నమ, రావళులకు మేలుఁగూర్ప వనము దశరథ
జ్మావిభుఁ గృతార్థుఁజేయఁగ, నావిర్భవ మందితివ్వు దర్కకులమునన్. 777

ఉ. ఈతఁడు లక్ష్మణుం డలఫణీంద్రుని యంశము రావణాత్మజున్
బాతిఁకుఁ జేయు దేవమునిబాధకు రావణుఁ జంపి మీఁద సా

కేతపురమ్ముఁజేరి చిరకీర్తి ననేక సహస్ర వర్షముల్
భూతల మేలి పైఁ ద్రిదివమున్ గనఁగాఁ గల వంచు నేగినన్. 778

క. శ్రీరామమూర్తియుమ విజ, యారాధనచేసి దశమియందు వితరణ
శ్రీ రంజిల్లఁగ భూసుర, వారము దనియించి లంకపైకరిగె వెసన్. 779

ఉ. వారధిగట్టి రావణునిఁబట్టి వధించి తదీయ రాజ్యముం
గూరిమి నవ్విభీషణునకున్ దగనిచ్చి ధరాత్మజాత సు
శ్రీరహిమీఱఁ గైకొని సుశీలురు వానరు లాశ్రయింపఁగా
ధీరుఁడు రామచంద్రుఁ డరుదెంచె నయోధ్యకు సుప్రమోదుఁడై. 780

క. దేవీచరితము వినిన ను, భావహమగు యశముగలుఁగు నైశ్వర్యాయు
ర్భావమ్ము లెనయు నిట్టిది, భూవలయమ్మునను లేదు భూపవతంసా. 781

వ. అని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లకథకుండు శౌనకాదులకుం జెప్పుటయు, 782

## స్కంధాంత పద్యములు.

క. రాజాధి రాజనతపద !, రాజారామాఖ్య విబుధరాజచ్ఛాత్రా
తేజోభిభూతమిత్రా !, భూజనహిత ! సకలలోక పూజ్యచరిత్రా. 723

చ. సతత మహాన్నదాన విలసత్పరిపూర్ణ కళాప్రదాన వ
ర్ధిత నిరవద్యకీర్తివిశదీకృతవాగ్రమణీమణీకర
స్థితసితనీరజాతరససేవనలోలుపమత్తబంభర
ద్యుతి ! మతిమద్గతీ ! బుధవిధుస్తుత ! బుద్ధిబృహస్పతీ ! కృతీ. 624

మాలినీవృత్తము. సుకవి వినుత శిష్యా ! సూరివంద్య ప్రశిష్యా !
సకలమత విహారీ ! సాధులోక ప్రచారీ !
అకపటమతిలీలా ! వ్యాప్త సాద్గుణ్యహేలా
ప్రకట విబుధశంసా ! బ్రహ్మవిద్వద్వతంసా. 725

## గద్య.

ఇది శ్రీ.........తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను
మహాపురాణంబునందుఁ దృతీయస్కంధము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## చతుర్థస్కంధము.

నిర్లిప్తహృదయకమలాం, తర్లక్షీకృత సమస్తతత్త్వ। కుకవితా
దుర్లతికావిచ్ఛేదక!, చర్లబ్రహ్మాయసుధీ। యశస్పత్త్వనిధీ. 1

వ. అవధరింపు మనంతరంబు మునులు "మహాత్మా! యవ్వలి కథ వినిపింపు మన
వుడు సూతుం డిట్లను నట్లు పురాణకథనోన్ముఖుండగు వ్యాసునకు జనమేజయుం
డిట్లనియె. 2

క. అస్మత్కులాభివర్ధన!, విస్మయకరదివ్యచరిత। వేదవ్యాసా।
భస్మీకృతపాపౌఘ! శ్రుతి, స్మృతితత్త్వజ్ఞ! యొకటి దెల్పుము నాకున్. 3

ఆ.వె. శూరసేన సుతుఁడు సుగుణుండు వసుదేవుఁ
డనఁగ నిందు హరియుఁ దనుజభావ
మందె నేవని; కాతఁ డంగనామణితోడఁ
గంసుచేత నెట్లు కట్టఁబడియె. 4

ఆ.వె. హరియు బంధనాలయమ్మున దేవకీ, కుదయమంది మీఁద నొదిగి గోకు
లమున కేగ నేల? అలితుఁ గృష్ణుఁ గన్న, వారు పూర్వమం దెవరొ వచింపు. 5

గీ. దేవకీ వసుదేవులు తెలిసి తెలియ, కాచరించిన దేమి కంసాధమునకుఁ
గృష్ణునన్నల నార్గుర నేల చంపెఁ, బుట్టినప్పుడ కంసుండు పట్టఁబట్టి. 6

ఆ.వె. బాల కంసుచేతఁ బట్టువడియు నత్ర, పథముఁ జేరుటేమి? పరమపురుషుఁ
డైన హరికి గొల్ల యలరుఁబోణులతోడఁ, గాఁపురం బొనర్పఁ గలుగుటెట్లు. 7

క. ఆ కృష్ణుం డొనరించిన, ప్రాకృతకార్యముల నెల్లఁ బరిశీలింపన్
నాకే కా దెవ్వరికిం, జేకుఱు నాశ్చర్య మిట్టిచేఁతలు కలవే. 8

క. కర్ణా కర్ణికగాఁగ సు, పర్ణధ్వజు చరిత విని యపరిమిత సందే
హార్ణవగతమగు నామది, నిర్ణయము వచింపుమీ మునివరేణ్య! కృపన్. 9

ఆ. వె. ధర్మపుత్రు లగుచుఁ దనరెడి నరుఁడు నా, రాయణుండుఁ గడుఁ బురాణఋషులు
బదరికాశ్రమమున బహుకాలము తపమ్ముఁ, జేసి రనుట సుప్రసిద్ధము కద. 10

తే. గీ. విద్యమానశరీరులై వెలయు వీరు, మరలఁ గృష్ణార్జునులు గాఁగ మాఱుపెట్లు
ముక్తిఁ గోరికదా వీరు మున్ను తపము, నాచరించిరి మఱి జన్మ మంద నేల.

క. తన కులవర్తనమును ద, ప్పని శూద్రుఁడు వచ్చుజన్మపరిపాకమునం
గను క్షత్రియత్వమును జె, ప్పిన శుచి మసలిన నతండ విప్రతఁ గాంచున్. 12

క. అనువుగ వర్తించిన వి, ప్రునకుఁగా జన్మంబు లేదు యాధిగ వీరల్
మునులు మహాత్ములు విపరీ, తవియతి క్షత్రియభవంబుఁ దాల్పఁగనేలా. 13

గీ. అవనిసుకళావ మెల్లయాదవులఁ గసిమ, సంగె గాంధారి శాపంబు సరసిజాక్షు
నన్వయము మాపెనని వింటి; హరితనూజు, మంచి యల శంబరుండు హరించుటేమి

గీ. శక్తిమంతుఁడు హరి యుండ శంబరుండు, సూతికాగార మేరీతిఁ జొచ్చి పిన్న
బాలు హరియించె నొక్కొ! యిప్పలుకు వినిన, దుర్ఘటంబని మనసునఁ దోఁచసన్నె.

గీ. ఆత్మజు హరించె శంబరుండన్నమాట, దివ్యచక్షుష్కుఁడగు హరి తెలియలేఁడె
యరయ నీ సందియంబుల నన్నిఁ బాపి, తెలియఁజెప్పవె సాత్యవతేయ! నాకు. 16

క. సరసిజలోచను తదనం, తరమునఁ దద్భార్యలెల్ల దస్యులచేతం
బరిపరి బాధలు పడుటకు, నరయఁగఁ గతమేమొ చెప్పుమా! యనఘమతీ! 17

గీ. విష్ణువంశమ్ముచేఁ బృథివీభరంబు, నడఁపఁ బుట్టిన యద్దానవారి మధుర
భయముమై వీడి ద్వారకాపట్టణంబు, నందు సకుటుంబముగ నుండు టబ్బురంబు.

వ. అదియునుంగాక మహాత్ములును జగద్విదితంబుగ రాజసూయం బొనర్చి విప్రుల
కనేకదక్షిణ లొసంగినవారును ధర్మతత్పరులును కృష్ణాశ్రితులును నగు పాండవుల
కేల దుఃఖంబు సంభవించె! వేదీమధ్యంబునం బొడమిన మహాభాగయు రమాంశ
జయునగు ద్రౌపది యంటరానిసమయమ్మున దురాత్ముండగు దుశ్శాసనునిచే
గృహీతకేశయై సభామధ్యమ్మునం గస్తి పడనేల? మఱియు విరాటునింట దాసి
యగుటయుఁ గీచకునిచే నవమానిత యగుటయు నాయమ కేపాపంబున ఘటించె?
సదాచారులగు పాండవులు ధనలోభమ్మున భీష్మద్రోణులం జంపనేల? మఱియు,

క. హరి ప్రేరేపింపఁగఁ దా, మరయక పాండవులు వంశమంతయు నష్టం
బురముగ నొనర్చి రన్వయ, హరణమ్మునకన్న బిచ్చమైనను దగదే. 20

క. మును భారతవంశము నా, శన మగుడున్ నీవు మాతృశాసనమున నె
కొ్కని గోళకులగు పుత్రులఁ, గని విర్పితి వేమి సార్థకంబు మహాత్మా! 21

గీ. తుదకు వరిముల్లురీతి నద్భుతముగాఁగ, బ్రతుకుఁ గాంచిన మాతండ్రి బ్రాహ్మణువిగ
శమ్మునం దేల వైచె నర్వమ్ము! నెంత, రాజయినఁ గాని విప్రవైరమ్ము చనునె.22

క. ఆయీ సందేహంబులు, పాయవు నామదిని సత్కృపామతివై వి
జ్ఞేయగతిఁ దెలుపుమనుడు ద, యాయతమతి యగుచు వ్యాసుఁడాతవి కనియెన్. 23

## వ్యాసుండు కర్మవిధము తెలుపుట.

క. నరపాల! కర్మగతి యన, సురలకు దుర్జ్ఞేయ మధికసూక్ష్మమ్మును ద
త్పరిపాక మెఱుఁగ శక్యమె, నరులకుఁ గర్మంబ కారణం బన్నిటికిన్. 24

గీ. కర్మమను బీజమున జీవగణము లఖిల, యోనుల జనించు నశియించుచుండు జీవుఁ
డాదియును నంతమును లేకయలరువాఁడు, గాని విధనంబుఁ గనువాఁడు గాఁడు సూవె

గీ. కర్మవశమున జీవుండు గాంచుచుండుఁ, గాయసంబంధ తద్వియోగములు కర్మ
మమరు సంచితమని భవిష్యంబనియును, దెలియఁ బ్రారబ్ధమనిమూఁడు తెఱఁగులగుచు.

చ. చను సుఖదుఃఖముల్ జరయుఁ జావును బుట్టువుఁ గామశోభముల్
గనుఁగొనఁ గర్మసంస్కృతివికారములై యజరుద్రముఖ్యులై
నను విడ లేరు కర్మము ఘనం బది యన్నిటికన్నఁ దత్ఫలం
బనుభవరీతిఁ గాక మఱి యన్యవిధమ్మునఁ బోవ నేర్చునే. 27

గీ. రుద్రుఁడు కపాలి చంద్రుఁడు రోగి యౌట, సూర్యుఁడు పరిభ్రమించు టింతకయు నన్య
కారణమ్మునఁ గా దది కర్మఫలము, సకలజగమును గర్మవశంబు సుమ్ము. 28

గీ. జగము నిత్య మనిత్యమనా సంశయంబు, మునులకెడ తెగదన్న నెవ్వనికిఁ దెలియు
మాయచొప్పడునంతకు పీయఖిలజ, గమ్ము నిత్యప్రవాహమై కానిపించు. 29

క. నానాయుగముల నానా, యోనుల నానావిధాభియోగంబుల జ
న్మానుగతి హరికిఁ గర్మా, ధీనతఁ గాకున్నఁ గలుగునే నరనాధా! 30

శా. వైకుంఠమ్ముఁ బరిత్యజించి కమలాబాంధవ్యమున్ వీడి లీ
లాకాంతావిహారముల్ విడిచి హేలానృత్యవాద్యాది సు
శ్రీకల్యాణము లుజ్జగించి హరివాంఛింపన్ గతం బేమి! మో
రాకార మ్మగుగర్భనారకముఁ గర్మాధీనుఁడే కానిచో౯. 31

క. మలమూత్రపానమునఁ బం, కిలమగు గర్భంబునఁ దలక్రిందుగ భీత్యా
కలితుఁ డగుటకన్నను వీ, యిల వేఱొకదుఃఖ ముండునే నరనాథా! 32

గీ. గర్భమున కెక్కుడగు నరకంబులేదు, పురువు లంగమ్ములను బట్టి పొడుచు నాఁక
లి యధికంబుగఁ బీడించు లేవరాదు; పదినెలల కష్టమియ్యది పార్థివేంద్ర! 33

క. ఈ కష్టములకుఁ దలఁకి య, నేక సుఖమ్ములను విడిచి యేకాంతగతిం
గైకొని మునీశ్వరులు తప, మాకాంక్షించెదరు గర్భ మతిదుఃఖదమౌ. 34

క. ఒక కల్పమేనియును నా, రకమున వసియింపవచ్చు గాఁడా! గర్భం
బకటకట! దుఃఖబహుళం, బొక క్షణమేనియును దాన నుండుట భరమౌ. 35

గీ. దారుణంబగు యోనియంత్రమ్ము వెడలి, పడుట యొకకష్ట మామీఁద బాల్యమం ద
నేకములు గష్టములు సెప్పనేల దీని, నేవగింతురు తత్త్వజ్ఞు లెఱుకకలిమి. 36

గీ. యజ్ఞ దాన తపోజన్యమైన సుకృత, కలన స్వర్గంబు గల్గుఁ జంచలముగాని
యదియు నిత్యంబుగాదు పుణ్యంబు క్షీణ, మైన నటనుండ నింద్రునకైనఁ జనదు.

గీ. కృతశుభాశుభకర్మముల్ కేవలాను, భావ్యములు దాఁటఁగా రావు బ్రహ్మకైన
విష్ణు వెత్తిన యవతారవిధ మదెల్లఁ, గర్మవశ మని యెఱుఁగు నిక్కము నృపాల.

క. రామావతారమునఁ గపు, లై మహి నావిర్భవించి రమరులు; కృష్ణుం
డౌ మధుసూదనునకుఁ దో, డై మెలఁగిరి యాదవులయి యాహవభూమిన్. 39

గీ. బ్రహ్మచేఁ బ్రేరితుండయి పద్మనేత్రుఁ, డెత్తు నవతారములు ధర్మ మెసఁగఁజేయఁ
బ్రతి యుగమ్మున నవతార ఫలము హరికి, రాక్షసవినాశమును ధర్మరక్షణంబు. 40

క. శ్రీకృష్ణుని చరితము సు, శ్లోకము పుణ్యప్రదంబు శోభనము లస
చ్ఛ్రీకము శృంగార రస, వ్యాకీర్ణము సర్వలోకవంద్యం బధిపా! 41

గీ. యదుకులమునందు వసుదేవుఁ డవతరించెఁ, గశ్యపుని యంశమున శాపకారణమునఁ
గలిగె గోవృత్తి; కశ్యపుకాంత లదితి, యును సురసయును శాపానుయుక్తిఁ జేసి.

గీ. దేవకియు రోహిణియు నాఁగ భూవలయము, నందు నక్కయుఁ జెల్లెలునై జనించి
రనుడు, జనమేజయుం డను మునివరేణ్య!, కశ్యపున కేల శాపంబు కలిగెఁ జెపుము.

ఆ. వె. అతని భార్యలైన యదితియు సురసయు, శాప మందనేల జగదధీశుఁ
డైన హరియు మానుషావతారం బెత్తి, గోకులమున నేల కోర్కెఁ జెందె. 44

క. వైకుంఠవాసుఁడగు హరి, గోకులమునఁ బుట్టి వింతకోర్కెల శుద్ధ
ప్రాకృతచర్యల మెలఁగుట, కేకారణ మెఱుఁగఁ జెప్పవే మునివర్యా. 45

ఉ. మానవజన్మమున్నఁ గడు మాన్యము గాదది గర్భదుఃఖ ము
ఖ్యామగతంబు దానికి మహామహుఁడౌ హరి సమ్మతించి యె
న్నో నవతారముల్ గొనుచు నెంతయుఁ గుందఁగనేల రాముఁడై
కాననమందు మున్ వడిన కష్టముకన్నను గష్టమున్నదే! 46

ఉ. గోవులఁ గావఁడో వెడఁగు గొల్లల కొంపలలోఁ జరింపఁడో
చావునకుం దలంకి తన జన్మగృహంబు పరిత్యజింపఁడో
చేవ గలట్టి కంసుని వశింపఁగఁ జేయఁగఁ గష్ట మందఁడో
యేవగఁ జూచినన్ సుఖము కృష్ణునికిం గనుపట్ట దింతయుజా. 47

వ. అనవుడు వ్యాసుం డిట్లనియె. 48

క. హరి యవతరించుటకు నో, నరపాల! యనేక కారణంబులు గల వా
దరమున విను వసుదేవుని, చరితమ్మును నతని నతుల చారిత్రమ్మున్. 49

వ. ఒక్కనాఁడు కశ్యపుఁడు యజ్ఞార్థంబుగ వరుణు ధేనువుల నవహరింప నతండు గుపితుం డగుచుఁ బరమేష్ఠికడకుఁ జని యిట్లను. "నా ధేనువులు కశ్యపాపహృతమ్ము లగు కతనఁ దదీయతర్ణకంబు లడలెడి మాతృహీనమ్ములైన యీ వత్సంబు లంబోలె నీతని భార్యలును దుఃఖింతురు గావుత" మని మఱియు నదితిం గుఱించి "మృతవత్సవై కారాగార నివాసినివై యుండు" మని శపించిన విని నీరజాసనుండు గశ్యపు రావించి యిట్లనియె. 50

గీ. ఈవు లోభగుణం బూని యితని ధేను, వుల హరింతువె? ధర్మంబు వొలియదే? యె
ఱింగియును నింద్యమైన పనిం గణింప, లేని నీ బుద్ధి కేమన నౌను మౌని! 51

వ. యుక్తాయుక్తంబు లెఱింగియు నెఱుంగనిగతి ననుచితం బొనరించితివి గాన భార్య లిరువురితోఁగూడ యదువంశమ్మునం బుట్టి గోపాలకత్వం బొనరింతువు గాక యని శపించి మఱియు నిట్లనియె. 52

క. ధరణీ భారంబెల్లను, హరియించెడివాఁడు పరముఁ డాద్యుఁడు హరి య
ష్టంవైభవుండు నీకుఁ గొ, మరుఁడై జనియించు లోకమాన్యండగుచుజా. 53

వ. దితియు నొక్కెడ నదితిం గాంచి "నీకుం గుమారు లేడ్వు రుదయించి వశింతురు గావుత" మని శపించె; ననవుడు వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. 54

క. దితి యేల శపించె మరు, త్ప్రతిజనని నదితిని దనదుభగినిన్ నాకుం
గత మెఱిఁగింపు మనుడు మూ, పతి కిట్లని చెప్పఁ దొడఁగె వ్యాసుఁడు పేర్మిన్.

వ. రాజేంద్రా! దక్షునికొమిరెలగు దితియు నదితియుఁ గశ్యపునకు భార్య లందు నది
తికి నింద్రుం డుదయించిన దితి తనపతి యగు కశ్యపుం గాంచి "ఇంద్రతుల్య
పరాక్రముఁడగు కొమరుం గరుణింపవే" యని ప్రార్థించుచు నతండు నట్లనుగ్ర
హించె నంత దితియు సంపూర్ణగర్భవతియై యున్నెడ నదితి దానికి సహింపక తన
పుత్రుండగు నింద్రున కిట్లనియె. 56

క. దితికడుపున నొకతనయుం, డతివీరుం డుద్భవించు నని కడుఁ జింతా
న్వితనైతి వైరమే త, త్ప్రతిక్రియ యొనర్ప మనకు వలయుఁ గుమారా. 57

గీ. గర్భవతియగు సవతాలి గాంచి నా మ, నంబు చింతాకులంబయ్యె నాఁడునాఁటి
కలరెనే శాత్రవుఁడు రాజయక్ష్మపగిది, నుపశమింపఁగరాదు సు మ్మరివేత. 58

క. అనవుడు నింద్రుఁడు దితికడ, కనువుగఁ జని యొక్కనాఁడు సాష్టాంగ నమ
స్కరించి వినయమధురం, బును విషగర్భితముఁ గాఁగఁ బోరి నిట్లనియెన్. 59

గీ. అమ్మరో! నీవు వ్రతపరాయణతఁ జాల, బడలి కృశియించితివి నీకుఁ బాదసేవఁ
జేయ వచ్చితిఁ బెద్దలసేవకన్నఁ, గలదె సుకృతంబు సకల లోకమ్ములందు. 60

వ. అని పాదమ్ము లల్లన నొత్తుచున్నెడ నాపె నిద్రించె నతండు వజ్రంబు గొని. 61

గీ. యోగబలమున గర్భంబు వేగఁజొచ్చి, యేడు తెఱఁగుల ఖండించె, నట్లొనర్ప
వజ్రధారాభిఘాతంబు వలనిబాధ, తాళఁజాలక శిశువు రోదనము చేసె. 62

వ. మఱియు నతండు మెల్లన "మారుద" యని నుడువుచు నొక్కొక్క ఖండం
బేడేడుతునుకలు గాఁ దునిమిన నాపెగర్భం బేకోన పంచాశత్ఖండంబు లయ్యె నంత
నదితియు మేల్కాంచి సపత్నియే యిందులకుఁ గారణం బని యెఱింగి కోపించి
యిట్లు శపియించె. 63

ఉ. పాతకురాల! గర్భమును భంగ మొనర్చినయట్టి నీతనూ
జాతుఁడు రాజ్యహీనుఁడగు సత్యము గల్గినదాననేని నీ
వాతురవై భవాంతరమునందును నిష్ఠను బంధనాలయా
పాతమునం గృశించి సుతభంగమునం దపియింప కుందువే. 64

వ. నావుడుఁ గశ్యపుం డాలించి దితిం గాంచి యిట్లను "నోలతాంగి! కోపింపకు
మీఖండమ్ము లన్నియు మరుత్తులనఁ బరఁగి బలాధికమునఁ బురందరసామ్యమ్మున
నెగడెడి, భవద్వితీర్ణంబగుశాపం బిత్తలోదరి యష్టావింశమ్మగు ద్వాపరమ్మున మను
ష్యాంశమ్మున ననుభవించునని చెప్పి మఱియును, 65

చ. వరుణుఁడు శాపమిచ్చె మును వారనికోపము నూని నీవు నా
వరుసన శాపమిచ్చితి వవంధ్యము లియ్యవి తప్ప నేర్చునే
యిరువుర శాపహేతువున నీ సతి మానుషయోనిఁ బుట్టు నో
తరుణి! కృపామతిఁగా గను వృధాకలహమ్ము లడంచు శ్రేయమున్. 66

గీ. అని పతి వచింప నక్కాంత యద్దు చెప్ప
కూరకుండె నరేంద్ర! యయ్యువిద యదితి
దేవకీదేవి యగుచు మేదిని జనించె
నెఱుఁగు మిది శాపకారణం బింత నిజము. 67

క. అన విని జనమేజయుఁ డి, ట్లనియెఁ జా నీచెప్పినట్టి యాఖ్యానము వి
న్నను బాపరూపభవబం, ధనమునకుం దలఁకు నామనంబు మునీంద్రా! 68

గీ. కశ్యపుని పేర్మికొడుకు లోకముల నేలు
వాఁడు దేవేంద్రుఁ డిట్టి యపాత్రకర్మ
మొనరిచె నటన్న నకట! తక్కొరులు పాప
ములకుఁ దలఁకుదురే! భవాంబుధి మునింగి. 69

వ. సంసారకారణంబుననకదా! మత్పితామహులగు పాండవులు శ్రీకృష్ణప్రేరితులై యధర్మబహుళంబును దారుణంబునునగు సంగ్రామం బొనర్చి మహాత్ములును వేదవేదాంగపారంగతులును దేవాంశసంభవులునునగు భీష్మద్రోణాదులఁ బలువురఁ బరిమార్చిరి. 70

క. సారవిహీనంబగు సం, సారం బని యెఱిఁగి దేవసములును ధర్మ
ప్రారంభులు నగువారలు, నీరీతి నధర్మవృత్తి నెనయం దగునే. 71

## సంసారవిముక్త్యుపాయము.

ఆ.వె. ధర్మ మనఁగ నేది దానికిఁ దగు నాస్థ, యెట్టి? దది ప్రమాణమెట్టు లగునొ?
తెల్పుమయ్య వ్యాస! తెల్లమ్ముగా నిట్టి, కతల కతన మనము గలఁక చెందె.

గీ. ఆప్తవాక్యంబు విశ్వాస్య మంటివేని, యాప్తుఁ డెవ్వఁడొ తెలియఁగ నలవి యగునె
విషయసక్తతఁ జెంది పూరుషుఁడు రాగి, యగును రాగంబు ద్వేషంబు ననుసరించు.

క. తనకార్యము సాధింపం, గను ద్వేషం బనృత మొదవఁగాఁ జేయును వి
ప్రునిరూపము నెపమునఁ గొని, చనఁడె జరాసంధుఁ గూల్ప జలజాక్షుఁ డొగిన్.

క. అతఁడు త్రివిక్రముఁడయ్యె న్నృపతివర! యీకతనఁ గాదె వామనుఁడన్ వి
శ్రుతిగాంచె ద్వారపాల, స్థితి కగ్గం బయ్యెఁ దద్వశీభూతుండై. 75

గీ. ధర్మమున కాదిపదము సత్యంబు రెండ, వపద మెన్నంగఁదగు శుచిత్వంబు మూఁడ
వపద మెన్నఁగ దయ నాల్గవపద మెన్న, దాన మనిచెప్పు నెల్ల బుధప్రజంబు. 76

వ. అట్టి నాల్గుపాదమ్ములం దక్కున ధర్మంబు నిలువదు ధర్మహీనంబగు కర్మంబు ఫలప్రదంబు గానేర; దందు నిశ్చలుండు మృగ్యుండని పలికి మఱియు నిట్లనియె.

ఉ. దాత మహానుభావుఁడు శతక్రతుకర్త నయానయాది వి
జ్ఞాత జితేంద్రియుండు రమణీయచరిత్రుఁడు వేదమార్గసం
స్థాత ధరాసురాదిజనతానుతుఁడౌ బలిచక్రవర్తి నా
రీతి నధర్మమార్గమున శ్రీహరి వంచన సేయ టొప్పునే. 78

వ. ఇం దధికుండు బలియో హరియో తెల్పుమనవుడు సాత్యవతేయుం డిట్లనియె. 79

గీ. మాయ నన్నిన కపటవామనుని కన్న, నాడి తప్పక మేదిని యఖిల మతని
కిడిన బలి యుత్తముం డని యెన్నఁ దగదె, ధర్మమున నొండుగలదె సత్యంబుదక్క.

గీ. తీర్థములు సారెసారెకుఁ దిరుగుఁ గాక, జన్నములు తేపతేపకు సలుపుఁగాక
దానమతి మాటిమాటికిఁ బూనుఁగాక, సత్యవంతున కేవాఁడు సాటివచ్చు? 81

వ. త్రిగుణాత్మికయగు మాయ బలవతి యగుకతన సాంసారికునకు సత్యంబు దుర్లభంబు నిస్సంగులును నిష్ప్రతిగ్రహులును వైఖానసులును నగు మునులకు సత్యంబు సుసాధం బట్టివారల యిట దృష్టాంతంబుగాఁ గలరు. తద్భిన్నంబగు నఖిలజగంబును మాయాశబలితమ్మగుచు మోహంబునిధిం దరింపరామి భ్రమించుచుండుఁ గార్యార్థి యగు సంసారికిఁ గపటం బవశ్యకర్తవ్యంబు; దానం బాపంబుసంభవించుఁ, గామక్రోధలోభాదులు బలవంతంబు లగుకతనఁ గర్తవ్యాకర్తవ్యమ్ముల నెఱుంగనీవు. విభవమ్మువలన నహంకారంబును నహంకారంబువలన సంకల్పవికల్పమ్ములును నాశాతృష్ణాదైన్యదంభంబులును నసూయయు మున్నగాఁ గల దుర్గుణమ్ములు పెక్కు సంభవించుఁ గాన సంసారికి మహామోహమ్మునం బడక తీరదు. 82

గీ. మనము పరిపక్వమై శుద్ధి గనదయేని, ధనము న్యాయార్జితం బయి తగదయేని
శత్రుషట్కంబు దూరమై చనదయేని, వాఁ డొనర్చిన కర్మంబు వమ్ము సుమ్ము. 83

గీ. కర్త ద్రవ్యంబు దేహంబు కారయితయు, శుద్ధులై యున్నఁ గర్మంబు శుద్ధిఁ జెందుఁ
గాని విపరీతము లయినఁ గర్మఫలముఁ, గూడ విపరీత మగుఁ జూవె కురువరేణ్య!

క. తన వృద్ధియుఁ బరహానియుఁ, గనఁ గర్మం బాచరించు ఘనులందఱు నె
కొన్ని తత్తద్గుణ శుద్ధిని, గనకున్నఁ బ్రమాద మొదవుఁ గర్మమ్మునకున్. 85

వ. ప్రాజాపత్యు లగు దేవదానవులు కార్యార్థులగు కతన సదా పరస్పర విరోధమ్మునం బ్రవర్తింతురు. గుణత్రయ సముద్భూతులగు దేవ మనుష్యతిర్యగాదులకుఁ బరస్పర జాతివైరంబు స్వాభావికంబు. అహంకార సముత్పన్నంబగు నీ సంసారమ్మునందు రాగ శూన్యం బుదయించుట కల్లయని మరియు నిట్లనియె. 86

ఆ.వె. వేయి మాటలేల విశ్వంబు సర్వంబు, మోహనుయము రాగమూల మగుచు
నాదియుగమునంద యలరారె నింక నీ, కలియుగమ్ము చెప్ప నలవి యగునె! 87

క. ద్రోహ మొనర్చిన వానికి, ద్రోహం బొనరింప నిరువురున్ సములే య
ద్రోహికి ద్రోహ మొనర్చిన, ద్రోహాత్మునికన్న జగతి దుష్టులు కలరే? 88

వ. సుకృతవంతులకుఁ గృతయుగమ్మును గలిపురుషులకుఁ గలికాలంబును మధ్యములకు మధ్యయుగంబులును నిర్ణీతంబులు. అందు నొకానొకఁడు వాసనావశమ్మునఁ గలియందును ధర్మాత్ముఁడు కాఁగలఁడు. ఏ యుగమ్మునను ధర్మంబునకుఁ బూర్వజన్మవాసనయ కారణంబు. 89

గీ. సత్యసంధులు మును లతిశాంతు లగుచుఁ, గాననమ్ములఁ దపములు పూనియుండ
మఘవు నంతటివాఁడు పెన్మచ్చరమున, వారి నియమమ్ములకు భంగపా టొనర్చు. 90

వ. ఇందులకుఁ బురాతనంబగు నొక యితిహాసంబు గలదు. 91

గీ. ధాతమానసపుత్రుండు ధర్ముఁ డనెడి, బ్రాహ్మణుఁ డొకండు వేదసంపన్నుఁ డతుల
ధర్మతత్పరుఁ డలరు నాతఁడు పదుగుర, దక్షసుతలను బెండ్లాడె ధర్మరతల. 92

వ. వారితో గృహస్థధర్మమ్ములం బ్రొద్దుపుచ్చు హరి కృష్ణ నరనారాయణులను నలువురఁ దనయులఁగాంచె నందు హరికృష్ణులు యోగాభ్యాసరతులైరి. నరనారాయణులును, 93

## నరనారాయణులు తపం బొనర్చుట.

శా. మంచుంగొండకు నేగి చేసి రచటన్ మందాకినీ తీరమం
దం చన్మంజులకుంజభాగముల నధ్యక్షించి లోలోన 'నో'
మంచున్ మించుగతిం దపంబొక సహస్రాబ్దంబు లద్దాన గం
పించెన్ సప్తకులాచలంబులును క్షోభించెన్ దిశాచక్రమున్. 94

క. ఘోరంబగు తప మా నర, నారాయణు లి ట్లొనర్ప నాకవిభుఁడు పెం
పారు భయమ్మున మనమున, వారి తపశ్శ్రీలు భంగపఱుపం దలఁచెన్. 95

వ. తలఁచి యైరావతం బెక్కి గంగాకూలమ్మునకుం జని యచట నరుఁడు ద్వితయంబు వడువున బ్రహ్మవిష్ణువుల చందంబున వైశ్వానరద్వయంబుపగిదిఁ దపంబొనర్చు ధర్మతనయులం గాంచి గజంబు డిగ్గి డగ్గఱకుం జని యిట్లనియె. 96

ఉ. ఏమి మనంబునందలఁచి యిట్లు తపం బొనరించుచున్న వా
రో మహనీయులార ! మదినున్న వరంబు వరింపుఁడయ్య సు
త్రాముఁడ నేను వచ్చితి భరంబని యెంచక, చాలు నింక మీ
భీమతపంబు మాకు నొదవించెను సంతస మెంతయేనియున్. 97

ఆ. వె. కోరఁ దగనిదైనఁ గోరుఁ డొసంగెద, ననుచుఁ బల్కి హరివచనములకును
మాఱు పలుకరైరి మహనీయు లతి జప, ధ్యానగరిమ మదిని దపులు కతన. 98

క. పలుకని మునులంగని బి, ట్టలుకం బాకారి వారి ధ్యానాసక్తిన్
బొలియింపఁగ నొకమాయకు, గలుగంగాఁ జేసె నంతఁ గలుషితమతియై. 99

క. పులులుం బాములు సింగం, బులునుం దోఁడేళ్ళుఁ జిఱుతపులులుం బెలుచన్
గలిగెను దన్మాయాబల, విలసనమున వేలకొలఁది వెఱఁగొదవంగన్. 100

గీ. పుష్కలావర్తకంబుల బోరుకొలిపె, దావదవమును నట్టెసల్ దవులుకొలిపె
నంధతమసంబు నల్గడ నాక్రమింపఁ, జేసె జా ల్గరిపించె విశేషరీతి. 101

క. నరనారాయణు లీగతి, మరుదధిపతి గడలుకొల్పు మాయకు భయముం
బొరయక తమయంతన సు, స్థిరమతులై యుంట చూచి చెచ్చెర నతఁడున్. 102

గీ. కోరువర మిచ్చెద నటన్నఁ గోరరైరి, వానకును నెండకును, భీతిఁబూనరైరి
పులులకేనియు మదిలోనఁ దలఁకరైరి, వీరితపమున కెట్లుకో విఘ్నమనుచు. 103

వ. వితర్కించి తత్తపోతిశయమ్మున కచ్చెరువంది సనాతనియు జగదీశ్వరియునగు నంబ వాగ్బీజమాయాబీజకామబీజంబులు జపియించు మహాత్ములతపంబున కంత రాయం బొనర్ప నెవ్వండు సమర్థుండని యోజించి నాకమ్మునకుం జని వసంత మన్మథులం పిలిపించి యిట్లనియె. 104

క. స్ఫాయత్సత్త్వులు నరనా, రాయణు లనువారు బదరికాశ్రమమం ద
త్యాయతరీతిఁ దపంబుం, జేయుచున్నారు మనకుఁ జేటొదవంగన్. 105

ఉ. వారితపంబు భంగపఱుపం జని యేను "వరంబు లిచ్చెదన్
గోరుఁ" డటన్న నాదువలుకుల్ చెవిఁ బెట్టక వోయి రంత దు
ర్వారమదీయమాయఁ గమపట్టిన వానకుఁ బెద్దగాలికిఁ
గ్రూరమృగాలికిన్ మదివిగొంక రొకింత యదేమివింతయో. 106

ఆ.వె. అంతనేను వారిద్దైన తపంబును, భంగపఱుప లేమి బెంగఁ గొనుచు
నేగుదెంచి దీని నేరు సాధింప లే, రంచు మిమ్ము బిలువ నంపినాఁడ. 107

క. కావున నిర్జరకార్యము, గావింపఁగ నీవు దక్షుఁ గలవా రేరున్
భావింప లేరు నీయను, భావం "బిదమిద్ధ" మనఁగ వచ్చునె మదనా! 108

గీ. హరిహరబ్రహ్మముఖులు నీయంపగముల, దాడి కోర్వక దాసానుదాసులైరి
జగము లన్నియు గెల్చిఁజాణ నీవు, మనుజు లన నెంతవారలో మదన! నీకు.

ఉ. సంతస మూని వే మనవసంతునితోఁ దగునట్టియప్సరః
కాంతలతోడఁ గూడి చనఁగావలెఁ గావలె సిద్ధి; వేల్పురా
వంత రవంత నీమది కవశ్యము రావలెనయ్య మార! నీ
యంతటివాని కెంతఘనమైనది యింతటికార్య మెంచఁగన్. 110

గీ. రంభ మొదలగు నప్సరోరమణులందు, నొక్కరిత యిట్టిపని చేయనోపు నట్టి
దండు నీకు సహాయమై యుండ నెంత, లేసి తపములకైనను వాసి చెడదె. 111

వ. అని యనునయ పూర్వకమ్ముగఁ బల్కు నతనికి మదనుం డిట్లను. 112

క. దేవా! దేవరయానతి, గావింపఁగఁ గింకరుండు గలఁడైనను నా
భావమ్మునఁ గల భయనం, భావన తెల్లముగఁ దెలియఁ బలుకెద వినుమీ. 113

గీ. హరిహరబ్రహ్మలను జిత్తమందు నిలిపి, తపమొనర్చెడి తపసుల తపము పాడు
చేయఁగలఁ గాని దేవిని జిత్తమందుఁ, దలఁచు తపసుల వంచింపఁ దరము కాదు.

శా. ఏవారైన మదీయబాణములఁ బేర్చెత్తించి యుంకించి త
ద్భావమ్ముల్ గలఁగించి తత్తపములన్ భంగంబు గావింతుఁ గా
నీ వాలాయముఁ గామబీజ మెదలో నిత్యంబు ధ్యానించు నా
దేవీభక్తులవంకఁ బోవుటకు సందేహింతు దేవాధిపా! 115

క. నరనారాయణులను ముని, వరు లీయిరువురును శక్తిభక్తులు వినుమో
మరుదీశ్వర! వాశరముల, కరయం గుఱిగా రనన్ బలారాతి యమన్. 116

క. మాయాబలముననైన ను, పాయముచేనైన నీ వపాయము గన కే
యే యమవున నైనను సుమ, సాయక ! యీ దేవహితము సాధింపఁదగున్. 117

వ. నావుడు మదనుండు మాతాదక రంభాదులతో బదరికాశ్రమంబు వొంతకుం జను
నంత వసంతుండును మున్న తదాశ్రమంబు ప్రవేశించె. 118

మ. చివురుం గొమ్మలతో రసాలములు పుష్పించెఁగా ద్విరేఫాళి 'జుం
జువు' మంచున్ బ్రతిసూనగుచ్ఛముపయిం జూడందగెఁగామించి వం
దువు గావించెను గర్ణయుగ్మములకుం బుంస్కోకిలారావ, మొ
క్కొ వసంతుండు తదాశ్రమావనితటిం గాలూఁదు నాలోపలన్. 119

## వసంత ప్రవేశము.

క. వొగడలు తమాలములు మో, దుగులున్ దిలకాగములు మధూకమ్ములు గెం
జిగురుం బూవులతోఁ ద, వ్నగమున వింపుం దనర్చె నయనమ్ములకున్. 120

సీ. లతలన్నియును బుష్పవతులై నగంబుల • వంచితంబుగఁ గౌఁగిలించుకొనియె
మందమ్ములై మంచిగందంపుఁదావితోఁ • జెలరేఁగి సుమగాడ్పు లలముకొనియె
రాలముగ్గినవందు గాలించి మెసవుచుఁ • గొదమ చిల్కలదండు కూయఁదొడఁగెఁ
బండుటాకులమీఁదఁ బడెడి పూవులదాలు • పండువెన్నెలభాతిఁ బరిఢవిల్లె

గీ. నాలుమగలెల్ల మొల్లమౌ పూలఁజాల • లీల నొదవఁగఁజేయు నీ రాలలోన
వించు విల్కాని చెయ్యు లగ్గించుకొనుచు • నంతసింపఁగ సాగి రా సమయమందు.

గీ. ఇటు వసంతుండు మున్న యచ్చటను జెలఁగఁ
బంచ బాణమ్ములను గేల వించువిల్లుఁ
దాల్చి యప్సరసలు వెన్నుఁ దన్ని రాఁ ద
దాశ్రమము సేరె సుమబాణుఁ దభయుఁ డగుచు. 122

ఉ. ప్రాకులు మోసులెత్త గరిమ న్నెలతా ల్గరఁగంగఁ గోటరా
నీక వివానమై తగు ఫణిప్రకరంబు కరంబు వేడ్కతో
మూఁకొనఁ గోకిలల్ ప్రతి రవోదయముం బొనరింపఁ బాడి ర
వ్యాకులలీల నప్సరస లయ్యెడ రమ్యలయస్వరంబుగఁగా. 123

వ. ఇట్లకాలవసంతోజ్జృంభణంబున మంజులతర గీతంబును గోకిలాగమంబును జగి

ముఖద్వనంబును జెవులకుం దవిలి తెప్పలు విప్పి నలుదెసలు చూచి నరనారాయణు
లిర్వురును గాలధర్మ విపర్యాసమ్మునకు విస్మయం బందుచుండిరి. 124

గీ. కుజము లన్నియుఁ బుష్పించెఁ గోకిలార, వమ్ములును దుమ్మెదల విరావమ్ములును భ
రమ్ములై వింటె నీ భూధరమ్మునింద, నన్న! చూచితె యిది యెంత యద్భుతంబొ!

గీ. శిశిరఋతువను గజరాజు శిరముఁ దన ప, లాశ కుసుమమ్ములను గోరులం గలంచి
యరుగుదెంచె వసంతసింహం బటంచు, దోఁచుచున్న దిదేరి చాతుర్యమొక్కొ.

సీ. అరయ రక్తాశోకకరయుఁ బలాశాంఘ్రి • కయును నీలాశోకకచయు నీల
నీరజనయనయు వారిజవదనయుఁ • గుందద్విజయు బిల్వకుచయు మంజ
రీకర్ణయును జపాశ్రీకాధరయు నీప • వసనావిత్వయు సిందువారనఖయు
గోకిలాలాపయుఁ గేకికలాపయు • సారసస్వననూపురారవయును,

గీ. రమ్యవాసంతికాబద్ధరశనయు మద • హంసగమనయుఁ బుత్ర జీవాభిధాన
లోమలతయును నగుచు నీలో వసంత • లక్ష్మిసంప్రాప్తమయ్యె సలక్షణముగ.127

చ. సమయము గాదిచో నిటు వసంతము వొల్పుటఁ జూడ నస్మదీ
యమగు తపంబు వో నడప నాకవిభుం డొనరించినట్టి కృ
త్రిమగతి తోఁచుచున్న దమరీ మృదుగానరవంబు విన్కిఁజే
సి మది గలంగఁబాఱెఁ బరిశీలన చేయకయుంట పాడియే. 128

ఉ. శీతలవాతపోతములు చేతము దన్పఁగఁ జొచ్చెఁ గోకిల
వ్రాతము గీరసంతతి మరాళసమూహముఁ గేకి బృందమున్
గూఁతల మెప్పొనర్చె మనకుం గడు మోస మొనర్ప నెంచి స్వ
ర్ణితయ వంపఁబోలుఁ దరుణీతతి నింతయు విక్కవం బగున్. 129

వ. అనుచు నారాయణుండు ప్రశంసించుచుండు నెడ. 130

సీ. పదియాఱువేల యేఁబది మంది మేనకా • ముఖ లచ్చరలు వెన్క ముందు నడువ
నళిమయంబగు నారి యారజంబున మించు • నించువిల్లు బుజాన నంచువించ
మకరందరసము చిమ్మఁగఁ జాలు సుమబాణ • ములగముల్ దూణీరములఁ జెలంగఁ
గుల్కుకోయిలదండు చిల్కతేజీబారు • కలకలమనుచుఁ జక్కటి నటింప;

గీ. వచ్చి తమకట్టెదుట నిలఁబడిన మదను • నచ్చెరు వొకింత మనమున నాదుకొనఁగఁ
గాంచి రొనరించుతపముఁ జాలించి ధర్మ • తనయు లిరువురు సంతస మినుమడింప.

గీ. దివ్యభూషణరుచి దశదిశలు వెలుఁగ, మునుల కెలుఁగుచు సురధన వనజముఖులు
మానవులు వినదుర్లభమైనపాటఁ, బాడ సాగిరి కామవివర్ధనముగ. 132

వ. వారి యాటపాటలకు విస్మితులగుచు వారిట్లనిరి. 133

ఉ. మిమ్ము వసంతమన్మథుల మీపతియైన బలారి మామువి
త్వమ్ము గలంచి మాతపము భ్రష్టము సేయఁగఁ బంపినాఁడు చి
త్తమ్మున నీసుతో; నవితథంబుగ గుర్తెఱుఁగంగవచ్చెఁ గా
ర్యమ్మెటులైన మాపలుకు లారయుఁ డాదరమేదురంబుగన్. 134

ఉ. దూరమునుండి వచ్చితిరి తొయ్యలులార! పరిశ్రమంబు చే
కూరెడిఁ గాన మాయొసఁగు కొంచెపు విందుల సేదదేరి యిం
పారఁగ నస్మదాశ్రమమునందు వసింతురుగాక యూరకే
మీరిట కేగుదెంతురె తమిన్ ద్రిదశేశ్వరుఁ డంపకుండినన్. 135

క. పాకారి మాతపమ్ముం, జీకాకొనరింపఁ జేసి చెఱుపఁగ నంపెం
గాక మిము గణికలార! వ. రాకలు మీరెంత! తపము భ్రష్టమొనర్పఁగా. 136

క. మాసామర్థ్యం బరయుఁడు. మీసౌందర్యమ్ముకీవి మించందగు బల్
వాసి కలదాని గలుగం, జేసెద మొకతన్వి మీకు సిగ్గు పుటింపన్. 137

వ. అని నారాయణుండు కుడితొడ కేలం జఱచినమాత్రన యప్సరోమణియగు నూర్వశి చెలులతోడం బుట్టె నిట్లనన్యసామాన్య లావణ్యంబునం బొదలు నక్కన్నెం జూచి దేవసామాన్య లందఱును మాన్యంబగు నమ్మునిమహిమమ్మున కచ్చెరువడుచు నిట్లనిరి.

చ. ఎఱుఁగక మీమహామహిమ కెగ్గొనరించి తపంబు భంగము
బఱుపఁగ వచ్చియున్న మము మన్నన సేయుఁడు తొల్లి యొందఱెం
దఱొ మహనీయులైన మునినాథుల నస్మదపాంగపాతముల్
చెఱుపఁగ లేదె! మీదరికిఁ జేరవు; మీమహిమమ్ము లింత లే! 139

వ. అపియునుంగాక నారాయణాంశసంభూతులగు మహానుభావులని యెఱింగియు నింద్రుండు భవత్తపోభంగమ్మునకు మమ్ముంబనుచుట యస్మదీయపురాకృత భాగ్యోదయంబ కాని యొండు గాదు భవాదృశులిట్టి తుచ్ఛసుఖంబులకుఁ జిరకాలార్జితంబగు తపంబు వమ్మొనరింతురేయని నుతించు దేవవేశ్యలం గాంచి చిఱునగ వంకురింప విజితపఃకాంతులు శరీర మలముకొన జితకామలోభంబగు మనమ్మున సంతసమ్మున్పతిల నరుండు విన నారాయణుం డిట్లనియె. 140

క. వేగమ మీలోకంబున, కేగి మదీయోరుజాత నీయూర్వశి మీ
రాగోత్రారికిఁ గానుక, గాఁ గై సేయుండు శుభముగాఁ దగు మీకున్. 141

గీ. "దేవతలకెల్ల శుభ" మంచు "దేవవిభున, కతులితానంద" మంచు నారాయణుండు
నరుఁడు దీవించి రంచు విన్నపము సేయుఁ, డేగుఁ డచ్చరలార! మీయెడకు ననుడు.

క. పలుకుల విన్నాణపుఁ దీ, వొలుకఁగఁ బయ్యెదలు మూయ నుంకించుచు న
చ్చెలలోచనాంత లిట్లని, రెలమిన్ గేల్మోడ్చి యమ్మునీంద్రుని తోడన్. 143

ఉ. తావకపాదపద్మములదాపునఁ గాఁపుర ముండి త్వత్ప్రమా
సేవనమాచరించుచును శ్రీల రహింపఁగ వచ్చినట్టి మే
మావల కెట్లు వోయెద మహా! యిటు లాడగఁజెల్లునే మునీం
ద్రా! వదరించి మాహృదయతామరసమ్ము లెలర్పఁ జేయవే. 144

క. భవదూరుజాత లగునీ, యువతీమణులెల్ల మేల్మి నూర్వశితో నా
కవిభుం గన నేగెద రే, ము వసింతుము నీసమీపమునన మునీంద్రా! 145

వ. నాపుడు భవదభీష్టం బెయ్యది యనుడు వారలిట్లనిరి. 146

చ. చదలును భూమియుం గలిసి చన్నఁ దపోధనులాడి తప్ప రీఁ
గఁ దలఁచితేని మాకుఁ బతిగా వినుఁ గోరెద మొప్పుమయ్యఁ! యే
మదవతిమాటకైనఁ బెలుమాట వచించుట పాడి గాదు మే
మదియునుఁ గాక మన్మథశరానలదగ్ధల మాదరింపవే. 147

ఉ. కమ్మనివింటిజోదు చెలికాని హిమాంశునిఁ గూడిచూడి దే
హమ్ము నహమ్ము మీఱఁ బువుటమ్ముల నెమ్ములు గాఁడఁ జించి గా
యమ్ము లొనర్పఁ జొచ్చె హృదయమ్ముల నీచరణాబ్జమూలమున్
నమ్మినదేవకాంతల ననాథలఁ బ్రోవఁగ నెంచు టొప్పదే. 148

క. నాకమ్ము విడిచి మిమ్ముల, జేకొని సుఖవార్ధిలో మునింగెద మంచున్
మీకాళ్ళఁ బడిన వేలుపు, రోకామినులన్ గ్రహింపరో మునిచంద్రా! 149

క. అని పనటం బడు వేలుపు, వనితల సరసానులాపమ్మైశరి చిత్త
మ్మును గలఁకపఱుప నారా, యణ మునిచంద్రుండు పల్కె నవ్వారలతోన్. 150

క. సీతునకుఁ గాలి కెండకుఁ, జేతంబు సహింపఁజేసి చేసిన తపమున్
మీతారుణ్యమ్ముల పా, ల్సేఁత యుచితమగునె వేల్పు చేడియలారా! 151

## తత్త్వ విచారము.

వ. అదియునుంగాక మతిమంతు లగువా రేశాదృశగ్రామ్య ధర్మంబులం బ్రవర్తింతురే యను నారాయణున కచ్చర లిట్లనిరి. 152

మ. విను మోహో! మునిరాజ! మాపలుకు, స్వర్వేశ్యాకుచస్పర్శనం
జనితానంద వశీకృతుండ వయి స్వేచ్ఛావర్తనన్ గంధమా
దనభూమీధరమందు సంతతసుఖాద్వైతమ్ము మై నుండు మ
య్యనిమేషాలయమైన వింతకుఁ గడున్ హాళిం బొసంగించునే. 153

వ. నావుడుఁ దద్వచఃప్రసంగంబుల కచ్చెరువడుచు నమ్మౌని యిట్లు తలపోసె. నహంకారంబు సంసారవృక్షమ్మునకు మూలంబును ధర్మహారిణమ్మునకు బ్రధమకారణమ్మును నని తెలిసి యీ వారాంగన లస్మత్తపోభంగమ్మున కేతెంచిరని యెఱింగియు మౌనమ్మున నుండక ధర్మవినాశంబుగఁ దదధిక సుందరంబగు సుందరీగణంబు సృజించుటయుఁ దదీయ సరసాలాపగోష్ఠి నుంటయు నన్నింతకుఁదెచ్చె నీ మహామోహపాశమ్మున బద్ధుండనై యూర్ణనాభిచందమ్మునఁ గదలలేక కష్టమ్ములకుం బాలైతి, నకటా! యిఁకనైన నీ విచారంబుడిగి శాంతంబుఁ బరిత్యజించి కోపావిలుండనై యీ సుందరులం దఱిమెద నని యనుకొనియు మరలఁ గోపమ్మునకన్న వైరంబు వేఱొండు గనుపట్ట దగోద్దీకంబగు ననలంబద్దాని దహించునట్లు దేహంబునం బుట్టు గోపంబు దేహంబు దహియించు నెట్టి హింసకునైన వెఱవదు. నరకాదులకు సాధనం బగు నని తలపోసి యతికర్తవ్యతా శూన్యుండై యుండుచున్న యతనిం గని యయ్యనఘు తలంపెఱింగి నరుం డిట్లనియె. 154

క. కోపము చీఁకటికూపము, కోపము పాపముల కాదిగురువగు హింసా
ధూపము కోపము గావునఁ, గోపింపం గూడ దేరికొఱకైన సఖా! 155

వ. మున్నహంకార దోషమ్మున సహస్రదివ్యవత్సరమ్ములు ప్రహ్లాదునకు మనకుఁ బోరగుట యెఱుంగవే? శాంతంబునన యీ సుందరులం బనుపుము నావుడు నారాయణుం డతిశాంతుండయ్యెనని చెప్పిన పాత్యవతేయుం గాంచి జనమేజయుం డిట్లను. సుకృతియు ధర్మాత్ముఁడునగు ప్రహ్లాదునకును దపోనైష్ఠికులగు ధర్మతనయులకును సంయుగంబు గలుగఁ గతంబేమి? తపోధర్మంబులం బరిశ్రమంబు దక్క నిట్టులైన నొండు గలుగనేర్చునే? క్రోధలోభ మాత్సర్యాదులకు మూలం బగు నహంకారంబు సత్యయుగంబునందును మహాత్ముల చిత్తంబు నాయత్తం

బొనర్చిన నింక జపతపమ్ములు కలవే। సూర్యుని యెదుటఁ దముంబుభంగి నహం
కారమ్మున కెదుట సుకృతంబు నిలువ నేరదు. లోహనిగళబద్ధులకైన విముక్తి
గలుగుఁగాని యహంకారావృతులకుఁ గలుగదని మఱియు. 156

మ. నరనారాయణు లట్టి పెద్ద మును లన్నా! యిట్లహంకార దు
ర్భరులై యుండఁగ నస్మదాదుల విచారంబేల ? చిత్త మ్మహం
కరిణాయత్తము గాకయున్నవరు లేకాలమ్మునఁజా లేరు సం
సరణం బాహమికంబు దీనఁ బరమజ్ఞానంబు చేకూరునే। 157

వ. చరాచరాత్మకంబగు నీ యజాండం బంతయు నహంకారదోషదూషితంబగుచు
మూత్రపురీషమయంబగు సంసారమ్మునం బడి పరిభ్రమించుచున్నయది. రాగశూన్యు
లును మహానుభావులును నగు వారు నయితము కామక్రోధాదులకు లోనై చరించు
చుందు రేతాదృశంబగు కలికాలమ్మున నస్మదాదులకుఁ దరణోపాయం బానతి
మ్మనుడు సాత్యవతేయుం డిట్లనియె. 158

క. యావదజాండ మహంకా, రావిర్భూతంబు గాన నందలిగుణముల్
సూవె సమస్తబ్రహ్మం, డావృతిఁదగుఁ గార్యభేద మగునె నరేంద్రా। 159

క. పటమునకుఁ దంతుగుణమును, గటకాదులకును సువర్ణగతమగు గుణమ
ట్లెటులే మాయాగుణలం, పటమగుచు నజాండమెల్ల మనలుచునుండున్. 160

వ. హరిహరాదులగు దేవతలును వసిష్ఠాదిమునులును నగాథంబగు నీ సంసారకూప
మ్మునం బడి వనధివీచీగతంబగు నౌకచందమ్మునఁ దడఁబడుచుందురు. ఈరేడు
లోకమ్ములందును దేహి యగువాని నహంకారసంభూతమ్ములగు కామక్రోధాదు
లాశ్రయింపక మానవు. 161

గీ. సకలవేదాంతసంహితల్ చదువుఁగాక, నిఖిలశాస్త్రప్రసంగముల్ నేర్చుఁగాక
పుణ్యతీర్థమ్ము లెన్నేనిఁ బోవుఁగాక, విషయసక్తుఁ దొవర్పని విధులు లేవు. 162

వ. కృతాదియుగత్రయమ్మునందును గామమోహమదాన్వితులకుఁ బూర్వాపరవిచారంబు
లేదు. కలియందు విశేషంబుగ స్పర్ధాద్రోహమదమాత్సర్యాదులు పాదుకొని దేహిం
బాశనిబద్ధుని చందమ్మున భ్రుంగఁజేయుచున్నవి. ఏతాదృశంబగు సంసారమ్మున
పరిషట్కంబు జయించిన మహాత్ము లసదని చెప్పు పారాశర్యునకు జనమేజయుం
డిట్లనియె.

క. వా రతిధన్యులు వా రవి, వారణకృతసుకృతఖనులు వారు కృతసదా
చారులు వారు జితేంద్రియు, లేరిన్ మోహాదికమ్ము లెమరక యుండున్. 164

మ. కలఁకన్ జెందు మనంబు మజ్జనకుఁ దల్కాన్ మౌని కంఠమ్మునగా
గలిదోషమ్మున నొక్కపాము వసుహీనంబుం బడన్ వైచె నగా
బలుకుం బాపకరంబు లోఁ దలఁచుకొన్నన్, దండ్రి యేరీతిఁ ద
త్ఫలమున్ జెందకయుండు నట్టి తరణోపాయంబుఁ జింతింపవే. 165

వ. అని దంధహ్యామాన మానసుండగుచుఁ గొంతవడిఁ జింతించి మరల సుప్రసన్న మనస్కుండగుచుఁ దదుదంతంబు సొంతంబుగ నానతిమ్మనుచుఁ దన్మనంబు నర నారాయణ కథానక కథనంబునం బ్రసన్నం బొనర్పనెంచి యిట్లనియె. 166

క. మును నరహరిరూపంబున, దనుజారి హిరణ్యకశిపు దానవు ఖండిం
చినపిదపఁ దత్తనూజా, తునిఁ బ్రహ్లాదుని నవిందితుని దనుజేంద్రున్. 167

గీ. జనకు నగరమునకు నొగి స్వామిఁజేసి, "ధర్మరక్షణ మింతేనిఁ దప్పకుండ
నేలుకొను" మన నాతఁడు నేలుకొనియెఁ బైతృకంబగు రాజ్యంబు ప్రభఁదలిర్ప.

ఉ. వారక పాలు లాదియగు వర్ణము లన్నియు స్వస్వవృత్తి సం
చారముతోడ సేవ్యపరిచర్య యొనర్చుచునుండి రెచ్చటన్
జారులుఁ జోరులున్ ఖలునసంతతివారును లేరు కారణీ
పూరకుఁ డా హిరణ్యకశిపుప్రభువుం డిల యేలుపట్టునన్. 169

సీ. ఇటు కొన్నినాళ్ళు పైతృకరాజ్యపాలనం • బాచరించి నృసింహునాజ్ఞ కతనఁ
బాతాళలోకంబు పాలింపఁగా నేగి • యచట నాతండున్న యంత నొక్క
దినమున భృగుమునితనుజాండు చ్యవనుండు • నర్మదానదికి స్నానంబొనర్పఁ
గా నేగి దిగి మున్గఁగా నందు విషభయం • కరమగు నొక్కనాగంబు గడఁగి

గీ. తవసికాయంబు పట్టి పాతాళమునకుఁ • దీసికొనిపోవ మౌని భీతిల్లి దీన
రక్షకుండగు సరసిజాతాక్షు మదిని • బాదుకొల్పి నుతించె 'మాంపాహి' యనుచు.

చ. ఇటు నుతియించు నమ్మునివయిజా దయగల్గి సరోజనేత్రుఁడ
క్కటికము సూపఁ దద్విషవికారము దాపసికెక్కదయ్యె నం
తట "మునిశావ మిచ్చు" నమదందడిఁ బా మతనిన్ ద్యజించెఁ ద
జ్జటి యురగాంగనల్ ముద మెసంగఁగఁ గొల్వ వసించె నయ్యెడన్. 171

వ. ప్రహ్లాదుం డొక్కనాఁ డతనిం గాంచి యుచిత సత్కారంబొనర్చి రాక్షసవైరియగు

వింద్రుండు తన మర్మంబులు నెఱుంగుట కంపిన దూతగా శంకించి వినయమ్మున "నీ రాకకుం గతం బే" మనుడు నతం డతని సందియం బెఱింగి యిట్లనియె 172

మ. దనుజేంద్రా! వినవయ్య! న న్నమరదూతంగాఁ గనంబోల దిం
ద్రునితోడం బని యేమి నాకు? భృగుపుత్రుండకా బలారాతి పం
పె నటంచుకా మదినెంచఁబోకు మిదె పేర్మిం జెప్పెదకా నాచరి
త్రము, నిక్కంబగు బుద్ధితోఁ గని సుహృద్భావంబు చూపందగుకా. *173

ఉ. ఏ నొకనాఁడు నర్మదకు నేగి జలమ్ములఁ గ్రుంకుచుండ నా
మే నొకపాము పట్టికొని మీ భువనమ్మున కీడ్చి తెచ్చె న
న్నూన రమాధినాధ కరుణోదయ ముండుటఁ జేసి తద్విష
గ్లానియు నా కొకించుకయు, గన్పడకుండె సురారివల్లభా! 174

ఆ.వె. నాఁటఁగోలె నీదునగరమ్మునన యుంటిఁ, గాన వలదు వేఱుగాఁ దలంపు
విష్ణుభక్తులందు విమలుండ వైన నీ, దర్శనంబు గలిగె దానఁగాదె. 175

వ. నాపుడు హరిభక్తసందర్శనజనితానందపరవశుం డగుచుఁ బ్రహ్లాదుం డిట్లనియె.176

గీ. సకలలోకాటనంబును సలుపునట్టి, దివ్యముని వీవు గావున దేవలోక
మందు భువియందుఁ బాతాళమందుఁ గాని, వెలయు తీర్థమ్ము లానతీవే మహాత్మ!

వ. మీ తిరుగని తీర్థమ్ములును మీ గ్రుంకని నదులుం గలవే యను వానికిఁ జ్యవనుం
డిట్లనియె. 178

క. ప్రతిపదమునఁ దీర్థము వి, శ్రుతమగు వాఙ్మనసకాయశుద్ధులకు మనో
యతిలేని మలినమతులకు, దితిజాధిప! కీకటంబు దేవాపగయున్. 179

ఆ. వె. మొదలఁ జిత్తశుద్ధి యది కలదేనిఁ దీ, ర్థమ్ములెల్లఁ బావనమ్ములగును
జిత్తశుద్ధిలేని చెనఁటుల కెట్టి తీ, ర్థములు నమ్మటంచుఁ దలఁపు మధిప! 180

గీ. పట్టణములెన్ని! యూళ్లెన్ని! పల్లెలెన్ని!, గంగయొడ్డునఁగల వటఁ గాఁపురంబు
లున్న కైవర్తక నిషాద హూణ యవన, ముఖ్యులకునెల్ల దొరకునే ముక్తిపదవి.

క. గంగోదకపానము సే, యంగానేకాదు గంగ కరిగి యచట ము
స్గంగానే కాదు మనం, బుం గావలె నిర్మలంబు మునులకు నైనన్. 182

గీ. తీర్థవాసంబు శిష్ట మాతీర్థములను, బాతకము కొంచెమేసి యపారమగును
ఎచటఁజేసిన పాపమ్ము లెడలుఁగాని, తీర్థకృతమగు పాపము త్రెంప వశమె! 183

గీ. సర్వతీర్థాటనముకంటె సకలభూత, దయయు సత్యంబు శౌచంబు దప్పకుండ్క-
యధిక; మిది యున్నవారికి నఖిలతీర్థ, రాజములు ప్రతిపదమునఁ దేజరిల్లు. 184

వ. జనమ భవదీయంబగు సంప్రశ్నంబున కుత్తరంబు వినుము నైమిశంబును జక్ర
తీర్థంబును బుష్కరంబు నను నివి పుడమియం దధికమ్ము లితరతీర్థమ్ములు
లెక్కింప నలవిగా దనవుడుఁ బ్రహ్లాదుఁ డా తీర్థమ్ము లాలోకింప నపరివారమ్ముగ
వెడలి నైమిశంబుం బ్రవేశించి యచట స్నానదానాదికంబు లాచరించి యదిమొదలు
తీర్థ సంసేవనంబు గావించుకొంచుఁ జనువాఁడు ముందట. 185

## ప్రహ్లాద నరనారాయణ యుద్ధము.

చ. కనియె సరస్వతీనది నకారణపాతకహారివారిమ
జ్జనకృదపారతాపసవశంవదతీరవిరాజమానకుం
జనమదనూనసూనచయసౌరభవాసిత నీరజాతసం
జనితమరందపానవశసంకులనిత్యరణద్ద్విరేఫమున్. 186

ఆ. వె. కాంచి యచట పర్ణకర్మముల్ నెఱవేర్చి, తత్తటమ్మునొంతఁ దరలి చనెడి
దైత్యరాజసుతుని దారి కిడ్డమ్ముగా, నొకటఁ గానవయ్యె నొక్క మట్టి. 187

వ. దానం గొన్ని నైకరూపమ్ములగు నంపగములం గాంచి పావనంబగు ఋష్యాశ్ర
మంబున వీని కవకాశంబేమని విచారించుచున్నెడ. 188

సీ. దండ దండంబుఁ గమండలువును దగ • నమ్ములపొదియు శరాసనంబు
నెదుట నింపెనలారఁ గృష్ణాజినమ్ముపై • యోగమ్మునైఁ గూరుచున్న మునులు
పరతత్త్వవిధ్యానపరులు మున్నతజటా • భారమ్ముచేఁ గప్పఁబడినవారు
గన్పట్టి దైత్యుండుఁ గడు నల్కతోఁ గను • లదయదర్కప్రభాయుక్తి దెలుప

ఆ.వె. నిట్టులనియె "నేల యీదంభ తపము ? ధ
ర్మమున కిదియె తెలవు ? మునులె మీరు ?
తపముసేఁత విల్లు ధరియించు టెచటేని
ధరణిఁ గలదె దంభ ధర్ములార !" 189

వ. అని పలుకుదైత్యేంద్రుంగని మందహాసమ్ముతో నెకసక్కెమ్ముగ నరనారాయణు
లిట్లనిరి. మాతపంబు గొడవ నీకేల ? యేము బ్రాహ్మక్షత్రముల విష్ఠాతుల మైనకతన
నిట్లుంటిమని యెఱుంగరాదె, కోపోష్మ మిన్నక విప్రవైరంబునకు దాకుము. 190

చ. అన విని యాతఁ డిట్లను నహంకృతి మీఱఁగ "మందబుద్ధులా
రః నను గణింప కీవెడఁగుఁ బ్రల్లదముల్ పలుకన్ దపంబు పెం
పున సుకృత ప్రచారమునఁ బోలదురే నను; సంగరంబు సే
యన మదియేవిఁజేయుఁడు రయమ్మున మీగరువంబుమాపెదన్." 191

క. అలుకమెయి నిట్లు దైత్యుఁడు, పలుకఁగ నరుఁ డిట్టులనియె బవర మొనర్పం
దలఁపేని రమ్ము తల వ్ర, య్యలు సేసెద ననుచు భ్రుకుటి యదర నసురయున్.

శా. హుంకారమ్మ చెలంగ హస్తమున విష్ఫారంబుఁ గైకొంచు జ్యా
టంకారమ్మున దిగ్గజశ్రుతులు బీటల్ వాఱ పెంపేద వి
శ్శంకన్ బాణము దొడ్గి యేసె నరుఁడున్ జాపంబు చేఁ బూని సా
హంకారుం డయి తున్మెఁ దచ్ఛరము బాణానమ్ముతో నమ్ముగన్. 193

ఉ. కొండొకవిల్లు పూని మునికుంజరు వక్షమునందు నేయ నా
తండును వాఁడికోలఁ గొని తద్భుజమధ్యము గాఁడ నేసె దై
త్యుండొగి సొమ్మసిల్లి మఱియుం బెనుతూపుల నమ్మునీంద్రు మై
నిండఁగనేయఁ ద్రుంచెఁ దపనీయశరమ్ముల వాని నన్నిటిన్. 194

ఆ. వె. గర్జితములతోడఁ గాలాంబుదమ్ములు, గుములు గట్టి సోనఁ గురియు పగిది
నరునిమీఁద దైత్యనాథుండు హేమపుం, ఖమ్ములైన యాశుగములు వఱపె.

వ. ఇట్లు పరస్పరజయాకాంక్షులగు మునీంద్రదైత్యేంద్రుల బవరమ్మునఁ దత్ప్రమాలో
కనసమాగతామరీన్వయంగ్రాహపముదితానందదుర్ఫరాయమాణమానసులు దివౌక
సులు కుసుమ్మంబులు గురిసిరి. 196

క. ఇరువురుఁ బఱపెడిశరములు, నరుణునిమండలము గప్ప నంబరభూమీ
చరులగు నమరులు నరులును, జిరమజ్ఞాడంగఁ గటికిచీఁకటి గప్పెన్. 197

క. నారాయణమునియున్ దే, వారిశరాసనము నొక్క యాశుగమునఁ బెం
పారం దునిమిన దైత్యుఁడు, వారక యుఁక నొక్కవిల్లు వడిఁ గైకొనినన్. 198

క. మరలన్ నారాయణుఁడా, శరాసనము ద్రుంచెఁ దునుమఁ జయ్యన నతఁడున్
బరిఘమ్ము నేసె నాతని, యురమునఁ ప్రేటువడి యతఁడు సుక్కు పొనంగన్.

వ. ఒక్కవాఁడితూపున నప్పరిఘంబు ద్రుంచెః దైత్యుండు గద గైకొనుడు నయ్యే
దియుఁ దునియలుగా నేసె నేతాదృశంబగు ఘోరయుద్ధంబు దివినుండి దేవగంధ
ర్వాదు లగ్గించిరి. నారదుండును దారకాసురకుమారసంగరంబు పగిది వృత్రామ

రేంద్రుల యుద్ధంబువడువున మధుమాధవుల బవరంబుచాడ్పున నానందంబు సంధించెనని పర్వతునితోఁ బ్రశంసించె. నిట్లు సహస్ర దివ్యవత్సరమ్ము లహోరాత్రమ్ములు ప్రహ్లాదునకును శార్ఙ్గజగపధరులగు నమ్మునులకును బోరు ఘోరంబయ్యె.

సీ. శంఖచక్రగదాది సాధనంబులు నాల్గు • కరములఁ దవరార గళమునందు
వనమాల వ్రేలఁ బచ్చని పైఁడిపుట్టంబు • గట్టినదొరి కారుకమ్ము గ్రమ్ము
వగిది వైకుంఠుండు ప్రత్యక్షమైనఁ బ్ర • హ్లాదుండు మది బత్తి పాదుకొనఁగ
బవరంబు మాని తత్పాదద్వయంబుపైఁ • బడి యెరఁగిన రమాపతియు నతనిఁ

గీ. గాంచి "వీరు మదీయులు గాన నీ క • జేయు"లని తెల్ప దైత్యుండు సిగ్గుగొనుచు
ముగురకు నెరఁగి చనియె నమ్మునులు సూడ • బుండరీకాక్షుఁడును దిరోభూతుఁడయ్యె.

క. అని చెప్పిన వ్యాసుం గని, జనమేజయుఁ డనియె "నిట్లు చనునే యని నె
క్కొనని పేయఁగ నరనారా, యణ మునులకుఁ దపముకల్మి వ్యర్థముగాఁగన్. 202

వ. వీ రేకతమ్మున నహంకారంబు వాయరు? కందమూలాశనంబుల వనమ్ములం గృశించి యనేకదివ్యవత్సరమ్ములు తపంబు సాధించిన యిమ్మహాత్ముల కింత యహంకారం బొప్పునే యనుడు వ్యాసుం డిట్లను నహంకారంబు శరీరంబునకుఁ గారణం బట్టిశరీరధారుల కహంకారంబు వాయదు హరిహరాదులకు నయిత మహంకారంబు దుస్తరంబు తొల్లి తద్దోషమ్మునన కాదె పురుషోత్తమునకు భృగుశాపమ్మున నానాయోనులందు జన్మంబు ఘటించె ననుడు జనమేజయుం డిట్లనియె. 203

క. భృగుశాపము హరికిం గ, ల్గఁగఁ గారణమేమి? యతఁడు గలిగిన చోటుల్?
జగమున నెయ్యవి? వివిపిం, పఁగదే యనుపాండవునకు వ్యాసుండనియెన్. 204

వ. అట్లు ప్రహ్లాదుండు కయ్యమొనర్చి పరాజితుండై నిర్వేదమ్మునఁ బౌత్రుండును విరోచనసుతుండునునగు బలికిం బట్టమ్ముగట్టి గంధమాదనమ్మునకుంజని తపము సేయుచున్నంత బలియయ్యమరుల జయించిన విష్ణుసహాయులగుచు వా రబ్బలి నోడించి స్వస్థానం బేలికొనిరి. అమరపరాజితు లగు దైత్యులు తమ గురుండగు శుక్రాచార్యు పాలికిం జని యిట్లనిరి. 205

శా. అంతేవాసుల మైన మమ్మమరు లత్యంత ప్రతాపమ్మునన్
వంతం బొందఁగఁ జేయుచుండి రిది సంభావ్యంబు గాదేవిఁ బ్రా
ణాంతం బౌ నిఁక మాకు; నీమహిమచే నాదిత్యులం గెల్చి మా
వంతం బాపఁగదే సురారులను బ్రోవం జూడవే భార్గవా! 206

క. గురుఁడవు బహుమంత్ర విదు, త్తరుఁడవు మాపాలి దైవతమ వీసురలం
బరిమార్పకున్న బ్రతుకం, దరమే? పరమాపదబ్ధి దరిఁజేర్పఁగదే. 207

క. అనుడున్ గావ్యుఁడు దైత్యుల, కును నభయం బిచ్చి నెమ్మి గొలిపినఁ దద్వా
ర్తను విని సుర లింద్రునితో, ననిరి భయం బెదకు సందియమ్ము ఘటింపన్. 208

వ. శుక్రమంత్రప్రభావమ్ముకలిమి నసురులు మన కజేయులగుదురు కాన నేఁడ చని
యనిం దెగటార్చి హతశేషులం బాతాళమ్మున, కనుచుట కర్జంబనిన నింద్రుం డను
మతించె. సురలును బరాక్రమించి యసురులం దాఁకిన వారు సంత్రస్తు లగుచు
శుక్రుని శరణుఁజొచ్చిరి. అతండు మంత్రప్రభావమ్మున సురలం దఱిమి యసురుల
కిట్లనియె. 209

సీ. అసురులు! వినుఁడు సరసిజాతభవుఁడు దా • ముసు నాకుఁ బేర్మిఁ జెప్పినవిధంబు
సురపక్షపాతియై హరి దైత్యుల నడంచు • ననియె నప్పల్కు తథ్యమ్ము గాఁగ
మునహిరణ్యాక్షు నవ్వనజాతనేత్రుండు • కోలరూపముఁ దాల్చి క్రొవ్వడంచె
నరసింహరూపమ్మున హిరణ్యకశిపుని • నమయించె నాతఁ డసమబలుండు

గీ. మంత్రబలమునఁజేసి యమరుల గెల్తు • నీశ్వరుని దృప్తుఁజేసి యభీష్టసిద్ధి
నంది వచ్చెద మీ రంద అంతదనుక • నాపదల కోర్చికొనుఁడన నసురు లనిరి.

క. బలియును ద్రెళ్ళిరి యిఁక దు, ర్బలులము యుంటిమి సుపర్వబలముల యెదుటన్
నిలువఁగ నోపుదుమే! యీ, చలుకఁ దనమ్మునకు నోర్చి శుక్రాచార్యా! 211

వ. నావుడుఁ గావ్యం డిట్లనియె. మహాదేవు వలన నేను మంత్ర విద్యాభ్యాసం బొనర్చి
వచ్చునంతకు మీరలు వనమ్మున శమదమాన్వితులై తాపసుల పగిది నుండునది.

తే.గీ. దేశకాలబలమ్ములు తెలిసి సామ, దాన ముఖభేదము లెఱింగి తాను యుక్తిఁ
జేసి పగఱకుఁ బరిచర్య చేసియైన, నశుభకాలంబు గడపఁద్రోయంగవలయు. 213

ఆ.వె. పగఱ గెల్వఁజాలు బలముగల్గిన నాఁడు, పగఱతోడఁ బోరు పఱపవలయు
లేనినాఁడు సామదానాద్యుపాయమ్ము, లాచరించి యశుభ మాఁగవలయు. 214

క. కావున మీరలు మీమీ, తావులకుంబోయి సామదానాదులఁ గా
ర్యావసర మెఱిఁగి కపట, ప్రావీణ్యము దాల్చుఁడేను వచ్చెడి దనుకన్. 215

వ. అని యొడం బఱిచి శుక్రుండు తపంబునకుఁ జనియె. నసురులును దమ వంశ
వృద్ధగు ప్రహ్లాదుపాలికింజని యిట్లనిరి. 216

ఉ. తాతవు సత్యవాదివి సధర్ముఁడ విచ్చట నచ్చటన్ దట
స్థాతవు ప్రత్యయమ్మునెడఁ దద్దయుఁ బెద్దవు నీవు నిర్జర
వ్రాతమువంకఁ బోయి యసురప్రకరంబు కరంబు మీయెడన్
బ్రీతిఁ జరించుఁ బాపము ధరింపదు కేల వచించుఁ దెల్పుమా. 217

క. అని వేఁడినఁ బ్రహ్లాదుం, డనిమిషు లున్నెడకు నరిగి యసురులు నీతో
"వనిఁ జేయము పాపము చే, తను దాల్పము వైరబుద్ధి దలఁప" మటంచున్. 218

క. తెలుపు మనిరి వారలు వ, ల్కలములు ధరియించి వనములం దాపసులై
తలఁపుల నైనను వైరము, దలఁపక యుండుటిది యెల్లఁ దథ్యం బనుడున్ 219

వ. నిర్జరులును దదీయవచనప్రత్యయమ్మునం గతమత్సరులై యుండిరంత రక్కసులు
దంభతపోనియమమ్ము లాచరించుచుఁ గశ్యపాశ్రమమ్మున సుఖం బుండి రిట
శుక్రుండు మహాదేవుంగుఱిచి తపమ్మొనర్చిన నమ్మహాత్ముండు దృగ్గోచరుండుగా
నమస్కరించి యిట్లనియె. 220

క. సురలకుఁ బరాజయమ్మున, సురులకు విజయంబొనర్చు శుభమంత్రము నా
దరమున నా కిమ్మనవుడుఁ, బరమేశ్వరుఁ డిట్లు మదిని భావించె వెసన్. 221

క. క్రతుభుక్కులయెడ నితఁ డప, కృతి సేయఁ దలంచె వారి కేగతినైనన్
గతి కల్పించు టుచితమని. యతిదయ గలఁడగుచు నిట్టులనె నెప మొదపఁగా. 222

క. తలక్రిందుగఁ బొగఁద్రావుచు, నలయక వేయేండ్లు కడు నియమమునఁ దపమున్
బలువిధిఁ గావించిన నీ, తలఁపు న్నెరవేర్తుఁ బొమ్ము తడయక శుక్రా! 223

వ. శుక్రుండును దదాజ్ఞప్తవిధానంబున ధూమపానం బొనర్చుచు నధోముఖుండై తపంబు
సేయుచున్నంత నమరులు కర్ణాకర్ణికగా నీవృత్తాంతమ్ము విని దంభతాపసులగు
రక్కసులపైఁ గవిసిన వారు చేయునదిలేక శరణుఁ జొచ్చిన వారిట్లనిరి. 224

గీ. పశుపతి గుఱించి మేటితపం బొనర్చి, మంత్రసిద్ధిని గైకొని మమ్ము గెల్వ,
వలయునని యెంచి గురునటుపంచి కపట, మగు గతిఁజరించుటదియు మాకరయరాదె?

వ. మీరు నిక్కపు శరణార్థులుగారు గాన మీ యుక్కడఁగించెద మనుడు నసురులు
భీతులై కాలికొలఁది పలాయమానులగుచుఁ గావ్యమాత నభయంబు వేఁడిరి. సుర
లును వారి పిఱుందన చనువారు ముందఱ శుక్రజననీరక్షితులగు వారింగాంచి
యాపెచే వారితులయ్యు బలాబలమ్ములు గణింపక చుట్టుముట్టిన నామె నిద్రయను

నొకదేవత నంపించె నదియుఁ గడఁగి మోహాయత్తులం జేయ నింద్రుండు భయం పడి విష్ణుశరీరమ్మునం డాఁగిన నిద్రయట కరిగి క్రోధతామ్రానన యగుచు నిట్లనియె.

క. ఓరి దురాత్మక! విష్ణు శ, రీరమునకా డాఁగినంత మృత్యువు నిన్నుం
జేరక పోవునె పీని శ, రీరముతోఁ గూడ నిన్ను మ్రింగెద ననుచున్. 227

వ. కవిసిన నింద్రుండును భయమందుచు మహాత్మా! తపోబలమ్మున గరీయసియు ననివార్యయునగు నిక్కావ్యమాతం గడుకొని వైశమ సంహరింపుమి మన కుపద్రవంబు వాటిల్లు నని హరిం బ్రార్థించి నంతభక్తవత్సలుండగు ముకుందుండు చక్రంబుం బ్రయోగించిన, 228

క. భగభగ మని మంటలు గ్ర, మ్మఁగనాచక్రంబు గావ్యమాతశిరమ్ముం
దెగనఱికె నిద్రతోడన్, విగతజ్వరులైరి దివిజపీయులు నంతన్. 229

## భృగువు హరిని శపించుట.

క. భృగుసతి తనచే మృతిఁ బొం, ద గదాధరవజ్రధరులు తద్దయు మదిలో
మగువం జంపినకతమున, భృగుఋషి శపియించు ననుచు భీతిలుచుండన్. 230

క. సురనాథుని కారణమున, హరి తనమగువను వధించె ననువార్తను ని
ర్జరవైరులు దెల్పగ విని, కరమాక్రోశించి భృగువు కడు నల్క మెయిన్. 231

వ. వచ్చి సరోజాక్షునిం బిలిచి "పెక్కు యోనులం బుట్టి జనన మరణదుఃఖమ్ము లనుభవించుచు నగలఁ బొగులు" మని శపించె ననుడు జనమేజయుండు భృగుమునికి మరల విధురత్వంబు వాసిన కత యెఱింగింపవే యని యడిగిన ద్వైపాయనుం డిట్లను. అట్లు శపియించి భృగుమునియుఁ దన కమండలూదకం బంజలి పుటమ్మునం దాల్చి యిట్లనియె. 232

ఉ. ఏను దపోబలాన్వితుఁడ నేని మదీయ కమండలూదకా
హీనబలంబు పెంపునన యీ వనితామణి యింతలోన స
ప్రాణ యగున్ దపోనియమవర్తనధర్మముతమ్ములన్ గనుం
డో సురులార! దైత్యసురయోధపతంపములార! యంచొగిన్. 233

క. తలయును మొండెము నేక, స్థలమునకుం జేర్చి మంత్రజల మొక్కింతం
జిలికిన మాత్రన యాభృగు, లలనామణి బ్రతికె దైత్యులన్ ముద మెనయన్. 234

వ. ఇట్లు లబ్ధజీవయగు కళత్రముం గైకొని యతండుండె. నింద్రాది సురలు తాపసుం డగు శుక్రునివలని భయమ్మునకు వగచుచుఁ దమతమ యధిష్ఠానమ్ములకుం జనిరి. ఇంద్రుండు తన కూఁతురగు జయంతిం జూచి యిట్లనియె. 235

క. తనయా! విను శుక్రాచా, ర్యున కిచ్చితి గంధమాదనోర్వీధర మం
దు నతండు తపంబున నుం, డినవాఁ డన్నగమునకుఁ గడిందిరయమునఁ జా. 236

క. చని యతని మనమునకు న, చ్చిన యుపచారములఁ దనిపి చేతఃప్రియుగా
నొనరించుకొని తపోనియ, తి నడంచి మదీయభయము తీర్పుము తల్లీ! 237

చ. అను తనతండ్రి మాట వినయమ్మున నూఁకొని యాజయంతి గ్ర
క్కున విబుధారిదేశికుఁ దకుంఠితలీల వసించు గంధమా
దనమున కేగి యచ్చట నుదారగతిం దపమాచరించు నా
తనిఁ గనియెన్ మహాముహూని దత్త్వవిచారపరాయణాంతరున్. 238

సీ. క్రమమునఁ దొడరుపూర్ణజలంబు వోవంగఁ • గదళీదళమునఁ జక్కఁగ విసరి
మధురసుగంధి నిర్మల వారి పూరంబు • తివిరి పానార్థంబు దెచ్చి యిచ్చి
భగభగ మను పట్టపగ లింటియెండ పైఁ • బడకుండ వసనంబు గొడుగుఁ జేసి
యాఁకటికై పక్వమైన వన్యాహార • ములను సంపాదంచి ముదము గొలిపి

గీ. దర్భలు చివుళ్లఁ బఱచి మెత్తందనమ్ము•దవిలి యొసకం బొనర్చు తల్పంబు గూర్చి
దేశకాలమ్ము లెఱిఁగి విదేశ మెఱిఁగి • కవికి శుశ్రూష చేసె నక్కన్నెమిన్న. 239

గీ. తత్తదుపచారములను సందర్శ మెఱిఁగి. తపసి సేవించెఁ గాని యత్తన్వి శాప
భయముమెయి మదికి మదనభ్రాంతి గలుగఁ, జేయు శృంగారచేష్టలు సేయ దాయె.

వ. మఱియు సుభాషిణియగు నజ్జయంతి సమయానుకూలంబుగఁ బ్రీతిజనకమ్ములగు వచనమ్ముల నుతించుచు మునిమనోవృత్తి దెలియ నాతురుండగు తన తండ్రి యని పిన దూతల నేకతంబ వినితవృత్తాంతులంజేసి యనుపుచు బ్రహ్మచర్యపరాయణయై యనేకవత్సరమ్ము లద్దైతేయగురునకు శుశ్రూష కావించుచున్నంతఁ బరమేశ్వరాజ్ఞప్త ప్రకారంబుగ నక్కావ్యు నియమమ్మునకు సహస్రవత్సరమ్ములు సంపూర్తియగు టయు మహాదేవుండు కరుణాతరంగితాంతరంగుండగుచుఁ బ్రత్యక్షమై వరంబు వరింపు మనవుడు సురవిజయంబు మున్నగు నభీష్ట వరమ్ములను తత్సాధకమ్ములగు మహామంత్రమ్ములను నర్థించిన నతం డనుగ్రహించి యంత ర్హితుఁ డగుడు భార్గ

వుండు సమీపవర్తినియు శుశ్రూషాపరాయణయునగు జయంతింగాంచి మందస్మిత మధురభాషణమ్ముల నిట్లను. 241

చ. ఎవతెవునీవు? నీదు కుల మెయ్యది? నీజనకుం డెవండు? ము
గ్ధవు నవయౌవనంబు కలదానవు మత్పరిచర్య సేయుచుం
టివి కత మేమి తెల్పుము? కఠిందిపునోరథమైన సిద్ధిఁ జెం
దు వర మొసంగువాఁడఁ బరితుష్టి యొనర్చితి నీవు మా కొగిన్. 242

క. నీ మనమునఁ గల కోరిక, మేమెఱుఁగుదు మైనఁ దెలుపునీ యన నా సు
త్రామతనూజ మనమ్మున, నామోదము చెంది లజ్జితానన యగుచున్. 243

క. దేవవిభు కూఁతుర జయం, తావరజన్మను జయంతి యందురు నన్నుం
గావించె భవదధీనగ, దేవవిభుఁడు నాఁటఁగోలె దేవరయొద్దన్. 244

క. పరిచర్య సలుపుచుంటిని, గర మనురాగంబు గలదు గార్హస్థ్యవిధిన్
దిరముగ నిను సేవింపఁగఁ, గరుణించి పరిగ్రహింపఁగాఁదగు ననుడున్. 245

క. ఏరికిఁ గనుపడకుండఁగ, మారాగమవిహిత సూత్రమార్గమ్మున సం
చార మొనర్చుచుఁ గ్రీడా, పారమ్యము గొనెద నొక్క పదివత్సరముల్. 246

ఆ.వె. అని జయంతితో గృహమ్మున కేతెంచి, పెండ్లి యాడి మిగులఁ బేర్మిదనర
దేవదానవుల కదృశ్యుఁడై తన్మయ, త్వంబుఁ జెందియుండె భార్గవుండు. 247

వ. అసురులును గురుండు తపస్సిద్ధిం బడసి వచ్చిన తెఱంగు విని, 248

క. చని శుక్రునిఁ గానక చిం, తను గొని వెదకుచు మనంబు తద్దయు సందే
హనిమగ్నము గాఁగఁ దమ భ, వనములకుం జనిరి త్రిదశభయశంకితులై. 249

క. దైతేయగురువరుఁడు తన, కూఁతుం గొని సర్వదృష్ట్యగోచరుఁడై శ్రీ
తాతతుఁడై యుండుట పురు, హూతుఁడు తనయాత్మ నెఱిఁగి యుత్సాహమునన్.

క. తమగురువగు గురునిం గని, యమరుల కుపకృతి యొనర్చునవసర మిది గా
న మహితభవదీయమతిమ, హిమ సూపఁగ వలయునంచు నెంతయు వేఁడన్. 251

క. వాచస్పతియును దన మా, యాచాతుర్యమునఁ జేసి యంతటదైతే
యాచార్య రూపమునుంగొని, పే చనె నవ్వారియెడకు వేడుక మెఱయన్. 252

వ. రక్కసులును దమ యాచార్యునిరాక విని యెదుర్కొని నమస్కరించి ముకుళిత కరకమలులై యున్నంత నమ్మాయాశుక్రుండగు వాచస్పతి వారలంగని కుశలం బడిగి యిట్లనియె. 253

చ. పురమథనుం దలంచి తపముం బొనరించితి ధూమపాయినై
వరము వరించితిన్ త్రిదశవర్గము గెల్వఁగఁజాలు మంత్రముం
గిరిశుఁ డనుగ్రహించె విఁక గీటడఁగింతము నిర్జరాళికిం
బరమహితుండు చక్రికివి బ్రాణభయంబు మదిం గలంపఁగన్. 254

క. హరుఁడును నా కొసఁగిన మం, త్రరాజములు మీ కొసంగెదను గ్రక్కున ని
ర్జరుల వలన భయపడకుఁ డ, సురులార! యటంచుఁ గపటశుక్రుఁడు గడఁకన్.

క. అభయం బొసఁగిన రాక్షసు, లు భయము విడనాడి సౌఖ్యలోలుపులై స్వీ
య భవనము లేగి రనఁ గురు, విభుఁడున్ ద్వైపాయనమునివిభునకు నవియెన్.

గీ. కపటశుక్రాకృతిని గాంచి ఘనుఁడు గురుఁడు, చేసిన విశేషమేమి యచ్చెరువు తాదె!
సకల మెఱిఁగిన యాతఁ డిట్టి కృతి కియ్య, కొనఁగ నన్యులు సత్యవ ర్తనులు గలరె.

క. ఫలకర్మవ ర్తనుని గురు, నలఘుం దను పెట్టు! లమరులన సత్యోద్భూ
తులు తద్గురుఁ డిట్లయినన్, గల రాజసతామసులకుఁ గలుగునె బుతముల్. 258

గీ. హరివిరించిదేవేంద్రముఖ్యామరులు మ, హాత్ములు మునీంద్రులును ననత్యప్రవ ర్త
నంబు గైకొన్న, మనుజులు నాఁగ నెంత?, సత్య మన నెద్ది? యద్దానిచర్యయెట్లు?

చ. గురుఁడును వామదేవుఁడు నకుంఠితతేజుఁడు గాధిపుత్రుఁ డు
ద్ధురుఁడు వసిష్ఠుఁడున్ మొదలు తొల్లిటిమౌనులు పాపకృత్యను
స్థిరమతు లైరి యింద్రుఁడును శీతకరుండును వహ్నియున్ వెసన్
బరతరుణీమణీసురతభాజను లైరిఁక ధర్మ మెట్టిదో! 260

గీ. ఎఱుక లేక చరించెడి హీనమతుల, కెల్ల జ్ఞానోపదేశంబు నీఁ గడంగు
పెద్దలిట్లైన నెవ్వరీపృథివియందు, నదుపదేశకులగు సత్యసంధు లనఘ! 261

చ. హరిహరు లేమి పద్మభవనాకవిభుప్రముఖామరుల్ మునీ
శ్వరులు మఱేమి రాగమను సంద్రమునం బడియున్నవార లో
నరవర! రాగి యయ్యును గనంబడు నేరుపుకల్మి నొక్కొకం
డరయ విరాగి నా, వికృతు లబ్బమె దేహము దాల్చువారికిన్! 262

చ. అరయఁ బరోపదేశకృతులందు సమర్థుల కావి యెందు నొ
క్కరుఁడును గానరాఁడు తన కార్యమువట్ల వివేకి దేహముం
బొరసిన వారికెల్లరకు మోహము తప్పమి నిక్కవంబు సం
పరణపుఁజర్య లీగతి నెసంగు ననాదిగ నెల్లవేళలన్. 263

చ. హరి యొకవేళఁ దాఁ దపమునందుఁ జరించు మఱొక్కవేళ య
జ్ఞాంతి నెనంగు నొక్కపుడు సాగరజావశుఁడై చెలంగు సం
గరపరుఁడౌ నొకప్పు డొకకాలమునన్ జయమందు వేఱొక
ప్డరయఁ బరాజయమ్ము గొను నన్నియు సంసృతిరీతులౌఁగదా! 264

గీ. హరిహరవిరించిముఖ్యు లౌనమరులు ముని
వరులుఁ దమతమయాయువు వఱలుదనుక
నెగడి మృతిఁ జెంది మరలఁ బుట్టఁగలవార
లెఱుఁగు మిట సందియ మొకింతయేని వలదు. 265

వ. దేహ మెంతున కెన్నటికినిఁ గామక్రోధాదికం బెడతెగదు. సంసారంబు తత్వంకు లంబు దాని నతిక్రమించు పురుషుండు మృగ్యుండు సంసారభీతుండు పరిగ్రహణంబున కేని నొల్లఁడని చెప్పి మఱియు. 266

చ. గురుతరుణీమణిం గలసెఁ గోరికమై హిమరశ్మి; భ్రాతృసుం
దరి రమియించె నగ్గురుఁడు తక్కొరులెగా గణియింపనేల సం
సరణము రాగలోభమదసంకుల మయ్యెడ సంచరించు నొ
క్కరుఁడును ముక్తికేగఁ డటుగానఁ ద్యజింతురు దాని నుత్తముల్. 267

గీ. కాన సంసారమున లేశమేని సార, మరయక త్యజించి జగదంబ ననుసరింప వలయు నేయంబమాయలోఁబడిజగంబు, మదిరఁజవిగొన్నభంగి నున్మాద మేవయు.

చ. చిరమతి నంబికార్చనము చేసి గుణంబుల త్రుళ్లడంచు న
న్నరుఁ డెనయుఁగా విముక్తిని జనస్తుతమౌ నరజన్మ మెత్తి శాం
కరిని యజింపఁడేని కడఁకం దుదిదాఁకమ విచ్చె నెక్కసు
స్థింత యెలర్పమిం బడినతీరగు వానివిధంబు భూవరా! 269

క. కావున నప్పరదేవీ, సేవామతులైన వారు జీవన్ముక్తి
శ్రీ వెలయుదు రనవుడు "సురుఁ, డావిధి శుక్రుఁడు వంచనాయత్తమతిగా. 270

వ. ఏమి చేసె" నావుడు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె. 271

గీ. గపట మెఱుఁగక శుక్రునిగాఁ దలంచి, యమరగురువాక్యములఁ గడు నాస్థఁ దవిలి
దైత్యు లున్నెడ శుక్రుఁడు తాఁ దలంచెఁ, దనదు శిష్యుల నార్తుల దయ దలిర్ప.

క. అమరు లొనరించు బాధల, శ్రమంపడుచు సారె నాదురాకకుఁ జింతా
భిముఖతఁ గుందెడి శిష్యుల, నమలినబుద్ధులను జూచు టర్హమకాదే. 273

## శుక్రుండు దైత్యులకడకు వచ్చుట.

వ. అని జయంతిం గాంచి తరుణీ! యేను సమయంబొనర్చిన వత్సరమ్ములు పదియు సంపూర్తిఁ జెందెఁ గావున నేఁడు శిష్యులం గనఁబోయి కొండొకకాలమ్మునకు మరల నిన్నుం గనవచ్చెద నస్మత్పుత్రులు దేవతలయందు సంక్రమింపంగలరు నావుడు జయంతి వల్లెయనిన నతండు తనయాజ్యులకడ కరుదెంచువాఁడు ముందట, 274

మ. కవియెన్ దైత్యులయొద్ద వేదమతముం ఖండించుచుం జైన వ
ర్తనమే శ్రేయ మటం చహింస మిగులన్ ధర్మంబటంచుం బలా
శనసక్తుల్ పశుహింస ధర్మమనుచుం శాసించి రంచున్ గ్రమం
బున బోధించు గురున్ స్వకాకృతిధరున్ బొంగారుకోపమ్మునన్. 275

చ. గురుఁడటఁ! సర్వశాస్త్రములకుం దెరువౌ నఁట! పాపబీజ లో
భరతి నసత్యవాక్యములు పల్కి సురారుల మోసపుచ్చు సు
స్థిరమతి యున్నవాఁడఁట! యిసీ! కడుఁబాపులోభ మెంతయుం
బరకపుఁద్రోవ దాని గనినన్ నరుఁ డెప్పని జేయకుండునే. 276

క. అని దైత్యులఁ గని యెలవగ, వున నిట్లను "నాదురూపు వొరసిన కపటా
త్ముని గురునిఁ దెలియ నేరక, యనఘులు వంచింపఁబడితి రకటా! మీరల్. 277

గీ. ఏను నిక్కపు శుక్రుఁడ నితఁడు దాంభి, కుఁడు మదాకృతిఁ బొరసిన గురుఁడు నమ్మఁ
డితని పలుకుల నాస్థ మీ రెనయఁ బోకుఁ", డనిన దైత్యులు సంభ్రాంతులైరి పిదప.

వ. బృహస్పతియు సంశయడోలాయమానమానసులగు రక్కసులఁ గాంచి విశ్వాసార్థంబుగ నిట్లను. 279

ఉ. దానవులార! నమ్మకుఁ డతం డమరప్రియ మాచరింపఁగా
లోనఁ దలంచి మిమ్ములను లోభమునం గ్రికురింప వచ్చినాఁ
డేను భవన్నిమిత్తమున నీశునిఁగొల్చితి విద్యఁగొంటి వి
ద్యానికతమ్మునం సురలదర్ప మడంతుదు మీర లొప్పఁగన్. 280

క. అను కపటశుక్రువచనం, బున మోహితులగుచు దనుజపుంగవులాశు
క్రుని నమ్మరైరి కపటం, బునఁ బడువారలు యథార్థమును గనఁగలరే. 281

క. పది వత్సరముల నుండియుఁ, బదిలముగా విద్యఁగఱపు పరమగురుని బల్
సదయునిఁ గాదననేర్తుమె, మదిలో నెఱిఁగితిమి నీదు మాయల నెల్లన్. 282

వ. కొమ్మ కొమ్మని యనాదరించిన శుక్రుండు కోపించి మీప్రియంబు గోరినయథార్థ

వక్తసగు నన్నవమానించితిరి గావునఁ బ్రణష్టసంజ్ఞులై పరాభవమ్ము నొందుదురు గాక యని శపించి వెండియు, 283

క. నను నవమానించినఫల, మును వైశను వొందఁగలరు మునుకొని యీతం దొనరించినకపటం బది, యును నప్పడ తెలియు నంచు నొగి నతఁ డరిగెన్. 284

గీ. దైత్యులకు శుక్రశాపంబు దవులు టెఱిఁగి, శక్రుకడ కేగి యలబృహస్పతి రయమున శాపహతులగు దైత్యుల సంహరింపఁ, దివురు మన సంతసించె నదితిజవ్రైరి. 285

వ. దేవతలును యుద్ధసన్నద్ధులైరి. అంతట రక్కసులు చింతాక్రాంతులై యిట్లు వితర్కించిరి. 286

చ. తెలియక భ్రాతృభార్యరతిఁదేలిన పాతకు మాయఁజిక్కి వి
ష్కలుషు గురుం ద్యజించి యిటు శాపహతిం గనినట్టి బుద్ధిహీ
నుల మనలన్ జయింపఁగ మనోగతి నెంచి సురల్ రణేచ్ఛ పెం
పలరఁగ నున్నవార లకటా! మన కిప్డు సహాయు లెవ్వరో. 287

గీ. మనల వంచించి చనియె నమ్మాయగురుడుఁ
దైత్యగురునకు నెప్పాట దయ యెసంగు
ననుచుఁ బ్రహ్లాదుఁ గలిసి చయ్యన గురువరు
కడ కరిగి పాదములకు మ్రొక్కఁగ నతండు. 288

మ. కడుఁ గోపమ్మునఁ గాంచి పల్కు "హితముంగావింపఁగా నున్న నా
యెడ విశ్వాసము లేక ప్రల్లదము లెన్నేనాడి యిచ్చోటి కి
ప్పుడు రాఁ గారణమేమి! సత్వరగతిం బో రాదె యవ్వంచకుం
దొడయండై యుపకారముం గనలవలేఁడో! మీకు విప్పట్టునన్. 289

వ. నావుడుఁ బ్రహ్లాదుం డనునయవచనమ్ముల నిట్లను. మహాత్మా! యస్మద్హితమ్మున కీవు తపం బొనరింపఁ జనినమీఁద నమ్మాయికుఁడు భవద్వేషంబు దాల్చి మమ్ము మోసపుచ్చె నజ్ఞానదోషమ్మున నేము కల తెఱం గెఱుంగక విన్నాడిన ప్రల్లదమ్ములు వైరించి మమ్మనుగ్రహింపుము. 290

చ. తెలియక చేయుతప్పులను ధీవరులొప్పి సహింత్రు మౌనివ
ర్యులు క్షణకోపు; లగ్గలపుఁగ్రోధమునన్ శరణార్థులం విడం
దలఁచుట న్యాయ మయ్య! మమతన్ మముఁగై కొనకుంటివే రసా
తలమున కేగువార మిది తథ్యము నావుఁడు శుక్రుఁ డిట్లనున్. 291

క. కనుగొంటి జ్ఞానదృష్టిం, గొని మీ యాథార్థ్యమెల్లఁ గూర్మిమెయిన్ మి
మ్మనురక్షింతు రసాతల, మునకుంజననేల మానమును విడనేలా ? 292

వ. బ్రహ్మవలన మున్ను నావినిన రహస్యం బొకండు గల దవశ్యముగాఁదగుశుభా
శుభమ్ముల నొక్కని కడ్డ నశక్యంబు దైవంబుకతన బలహీనులగు మీర లిప్పుడు
దేవతల కోహటించి పాతాళమ్మున కరుగునది. ఇంతదనుక దైవసాహాయ్యమునం
జేసి మీరు త్రిలోకరాజ్య మనుభవించుచుండఁ బది యుగమ్ములనుండి రాజ్యపద
భ్రష్టులగు దివిజులకు నేఁటికి భోగకాలం బయివించె. సావర్ణికమన్వంతరమ్మున భవ
త్పౌత్రుండగు బలి త్రిలోకవిజయం బొనరింపఁగలఁడు. మున్ను హరి వామన
రూపమ్మున నీ మనుమని రాజ్యమ్ము హరించునప్పుడు "సావర్ణి మనుపుకాలమ్మున
నీకు నింద్రత్వంబు గలుగు" నని వచించె; నది మొదలు బలి గూఢరూపమ్మునఁ
బ్రవర్తించువాఁ డొక్కయెడ గార్దభరూపమ్మున నొక శూన్యాగారమ్మున నింద్రు
నకుం గన్పట్టిన నతం డతని నెఱింగి యిట్లను. 293

క. దానవులకెల్ల భర్తవు, ధీనిధివి జగమ్ములకు నధీశుఁడవగు నీ
కౌనే ! గార్దభరూపం, బూనుట; యి ట్లేల భీతి నొదిగెదు చెపుమా. 294

వ. నావుడు బలి యిట్లను. 295

చ. జలచరరూపమునం గొనఁడె సారసనేత్రుఁడు ! బ్రహ్మహత్యమై
బలమఱి నీవు గూఢముగఁ బంకజమందు నడంగవో ! తగఁజా
దలఁపుము కాలశాసనము దాఁటఁగ నెవ్వఁడు శక్తుఁ ! డేను నీ
దలఁకి ఖరాకృతిం బొరసి దైవగతిన్ జరియింతు నీగతిన్. 296

వ. ఇట్లు వార లన్యోన్యమ్మును సంభాషించుకొని దైవమ్ముకతన సర్వమ్ము ప్రవర్తిం
చుట యెఱింగి తమతమ వొందుపట్లకుం జనిరి. 297

క. కావునఁ గష్టసుఖమ్ములఁ దైవాధీనము లటంచు దైత్యగురుఁడు వి
ద్యావిదునకుఁ బ్రహ్లాదున, కీ విధి నెఱిగింప నాతఁ డెఱిఁగి తనంతన్. 298

వ. దైత్యులం గాంచి యిట్లను. ఇప్పుడు కాలానుకూల్యంబు లేమి మనకు సంగరంబున
జయంబు దుర్లభమ్మగుట మిన్నకుండుట శ్రేయంబు నావుడు మదగర్వితులగు
రక్కసు లిట్లనిరి. 299

చ. దైవ మనంగ నెట్టిదగు దానిని జూచినవాఁ డెవండు కా
ర్యావసరంబునట్ల నలసాత్ములు పల్కెడిరీతి గాక మా

కీ వొడయండవై నిలిచితేని క్షణమ్మునఁ దున్మకుందు మే
దేవతలం? గడంగు మిఁకఁ దెంపరివై యరులన్ హరింపఁగన్. 300

వ. అనినఁ బ్రహ్మాదులు సేనాధిపత్యంబుఁ బూని యనికి సురలం బిలిచిన నింద్రపురో
గములై వారును బోరితంబునకుఁ గట్టాయితం బైరి. 301

క. సురపతికినిఁ బ్రహ్మాదున, కు రణం బతిముతి నెనంగె ఘోరమ్ముగ వ
త్సరములు నూఱు గతించెను, బరమాశ్చర్యంబు వొడమెఁ బైవారలకున్. 302

వ. పిదప నెట్టకేలకు దైత్యులు జయంబంద నింద్రుండు వాచస్పతి యానతిం గొని
జగదంబిక నిట్లు నుతింపఁ దొడఁగె. 303

సీ. శూలధారిణి! నిత్యసుఖదాత్రి! శంఖచ • క్రగదాది కాయుధరాజమాన
హస్త! మహామాయ! యఖిలజగద్ధాత్రి! • దశతత్త్వరూపిణి! తల్లి! పంచ
కోశ సంస్థాయిని! కుండలినీరూప! • దీపశిఖాత్మిక! దేవి! దివ్య
శక్తి! బింద్వాత్మ! పుచ్ఛబ్రహ్మరూపిణి! • యానందకలిక! వేదాంతవేద్య!

గీ. దానవులతోడఁ బోరాడి దర్ప మెడలి • దీనదశఁ జెందియున్న మా దిక్కొకింత
సహజశీతలదృష్టిప్రసార మెసఁగఁ • జేసి రక్షించి ధన్యులఁ జేయఁ దగదె? 304

## సురలు దేవిని స్తుతించుట.

గీ. సహజసుఖవంతులకుఁ గడు సౌఖ్యమబ్బు, దుఃఖితులకెల్ల దుఃఖముల్ తొలఁగిపోవు
ముక్తిఁ గోరినవారికి ముక్తిగల్గుఁ, దల్లి! నిన్ను మనమ్మునఁ దలఁచిరేని. 305

గీ. సృష్టిరక్షాప్రళయములు చేయు నీదు, చరిత మెఱుఁగరు బ్రహ్మాదిసకలసురలు
పాపసంసారతారకపటిమ నలరు, త్వత్పదమ్ములు గొలుతురు ధన్యమతులు. 306

క. శరదిందుముఖులు చామర, లిరుప్రక్కల వీవ శిబిక లెక్కి మహానం
దరసాబ్ధి నోలలాడెడి, నరులెల్లఁ బురాభవమ్మున న్నీభక్తుల్. 307

క. కరులు గలవారు నిలన, త్తరుణీసంభోగనియతతారుణ్యమదో
ద్ధురత గలవారు నరవర, పరిచితచరణులును నీదుభక్తులు తల్లీ! 308

చ. అని నుతియించు నింద్రునకు నంబ చతుర్భుజయై మృగేంద్రవా
హన యయి రక్తపత్త్రధరయై విలసత్సుమమాల్యభూషణా
ఖిలవిశరీరయై కిరణపెంపున నింపెసలారు చాయలో
చనములదీప్తి లొప్పఁగ నెసం బొడసూపె మనంబు పొంగఁగన్. 309

వ. ఇట్లు వొడకట్టి సురల కభయం బొసంగి యసురు లున్నకడ కరుగుటయు భయ
గ్రస్తులై వార లన్యోన్యముఖంబులు గనుఁగొనుచు, 310

గీ. వక్రదృష్టిని మధుకైటభవధ చేసి, చండముండాదులను జంపి చండకోప
మడర మహిషాసురు వధించినట్టి శక్తి, మనల హరియింపవచ్చె నేమనఁగ వచ్చు.

వ. పిమ్మటఁ బ్రహ్లాదుండు పిఱుతివియక సంగరం బొనర్పుఁడని యెనకొల్పిన నాతని
వచనంబులు వినక భయమ్మునఁ బరుగిడు రక్కసుల నిలువరించి నముచి
యిట్లనియె. 312

క. ఎదిరించిన వంబిక మన, మదమడఁచుట నిక్క మాపె మన్ననమై ప్రొ
ఖక్కదము తదనుగ్రహమ్మునఁ, గదలి రసాతలమునకుఁ దగం జనుద మొగిఁగా. 313

వ. ప్రహ్లాదుండును నముచివచనంబు లియ్యకొని యంబికనిట్లు సన్నుతించె. 314

శా. మూలాసర్పముఖంగి సర్వజగ మంబా! యొప్పు నీయంద నీ
హేలల్ సర్వము నిర్వహించు విధిపిష్ణీశాను లన్నిఁకా భవ
ల్లీలాకల్పిత హేతుమాత్రు లరయకా లేశంబు సన్యంబు లే
దేలాపలుక్కఁలు వేయి! మ్రొక్కులిడుదుకా హ్రీంమూర్తికి న్నీకొగిన్, 315

ఉ. అందఱ కీవ తల్లి వికదా! జగదంబ! సురారులందు నీ
కుం దయ దప్పుటేమి! కొడుకుల్ పదిమందిగఁబుట్టి తల్లికిం
గొందఱు దుండగుల్ మఱియుఁ గొందఱు సాధులు గావు టబ్రమే!
నందనులందుఁ బక్షములు న్యాయమె బిడ్డలఁగన్న యమ్మకుకా? 316

గీ. ఉభయులము స్వార్థపరులము యుభయులమును, గశ్యపోద్భవులము ధనకనకవస్తు
వాహనమ్ములకొఱకు సుభయుల మని నొ, నర్ప నొక్కెడఁ బక్షమూనంగఁ దగునె?

గీ. అన్నదమ్ముల మైనమే మనికిఁ బొరఁగ, నేమి కారణ, మిరువుర కిట్టిభేద
మెవరు కల్పించి రీవు కా, కేము సురలు, కలహ మొనరింప నీ కిచ్చ కలుగఁబోలు.

వ. కాదేని యన్నదమ్ముల కెన్నండేని వైరంబు గల్గునే! సర్వకారణంబవగు
నీకెఱుఁగఁ బోలని దొండుండునే! ఇంద్రుండు ధర్మాత్ముం డగుటకు మారును
సమ్మతంబ యైనను భాగార్ధంబు మాకీ కలహంబు దప్పదు దీని వారింప నీకుఁ
దక్క నొరులు వలంతులుగారు. 319

ఉ. అంబురుహాక్షి నిర్వితికదా! జగ మేలు మటంచు; నాతఁ దే
కంబుగ రెండుపక్షములు గన్గొనఁ దేమనవచ్చు నా! నము

ద్రంబును ద్రచ్చునప్పుడు సుధన్ మణి వారల కిచ్చి తాను ల
చ్చిం బడసెన్ వృధా యెరుసు చేసి మమున్ గలహంబు దప్పునే? 320

వ. మఱియు నైరావతంబు నుచ్చైశ్శ్రవంబును గామధేనువును వతని యనుమతిం జేసి యింద్రుని పాలయ్యెఁ బక్షపాతియగు కతన ననయులగు సురలరాజ్యమ్మునకిచ్చి మమ్ముం బరాజితులఁ జేయుచున్నవాఁడు. 321

క. ధర్మం బిదియే కద! మా, షక్రమ్ములకున్ జయ మొసంగఁగాఁ దగునే? యీ
మర్మమ్ము నీ వెఱుంగవె, దుర్మతు లసురులొ దితిజులొ మఱిసహ స్రాక్షీ! 322

వ. వేదశాస్త్రమ్ముల కైనను నేకవాక్యత గన్పట్టదు. స్వార్థపరులగుటం జేసి తత్పరీక్షకులకును సామానాధికరణ్యంబు గానరాదు. సంసారమునం దొక్కరు.డును గాంతా కనకవిరక్తుండు లేఁడు కావున ధర్మాధర్మంబులు నీవుం దక్క నన్యులు నిర్ణయింప నసర్హు లది యట్లుండె. 323

గీ. శశి బలాత్కారముగ గురుసతి హరించె, ధర్మ మెఱిఁగియు గౌతమతరుణిఁ గలసె
నింద్రుఁడు, గురుం డనుజుభార్యనెనసె గర్భ, వతి నరసి చూడ నిది ధర్మవర్తనంబె?

గీ. ఇంచుకేనియు నపరాధ మెఱుఁగఁ డట్టి, రాహుకంఠంబు దెగఁగొట్టె రాక్షసారి
సత్త్వగుణమున్నవాఁడఁట జనని! యాతఁ, డకట! మిత్రపుత్రురాజ్యంబు నపహరించె.

క. దేవతలు చేయు దుష్కృతు, లేవారు గణింప నేర్తు, రింతింతలె! యీ
దేవతలు ధర్మవర్తులె!, కోవిదు లిప్పాటఁ జెప్పుకొనఁ జెల్లునొకో! 326

క. సురలు సధర్ములు, లధర్ములు, సురారు లని చెప్పునట్టి చోద్యపుఁ గతలన్
బరిశీలించినఁ బుక్కిటి, పురాణములు గాని నిక్కములు గావుసుమీ. 327

గీ. నీ కెఱుఁగరాని గోప్య మెందేనిఁగలదె?, తెలుప వలసి వచించితి దేవదేవి!
శరణుఁజెందిన మమ్ము రక్షణ మొనర్చ, నెంచెదో చంప నెంచెదో యే నెఱుంగ.

వ. నావుడు జగదంబ రక్కసుల కిట్లను. మీరలు గతక్రోధులై విశ్వయమ్ముగఁ బాతలమ్మున కరిగి యట ననుకూలకాలపరీక్షణ పరాయణులై యుండునది. 329

గీ. ఎంతరాజ్యము కల్గిన నేమి సుఖము, కలుగనేరదు లోభసంక్రాంతమతుల
కది యెఱిఁటి లేనివారల కన్ని యెడలఁ, గలుగు సౌఖ్యంబు నా యాజ్ఞగైకొనుండు.

క. నావుడు దానవు లా యమ, భావమ్ము నెఱింగి నతులు పచరించి చనన్
దేవియు నదృశ్య యయ్యెన్, దేవతలును జనిరి కథ యిది మునిముఖ్యులిదున్. 331

## విష్ణుని యవతారములు.

వ. నావుడు జనమేజయుం డిట్లనియె. 332

గీ. భృగువు శాపంబు కతన నవ్విష్ణువునకు, నెన్ని యవతారములుగల్గె, నిద్ధచరిత ।
యే మనువు కాలమున నతఁ డిలజనించె, నెఱుఁగఁజెప్పుమనవుడుమునీంద్రుఁడనియె.

క. నరనారాయణులన నవ, తరించె శ్రీ విష్ణువెలమి ధర్మునకును భూ
సురునకుఁ జాక్షుషమన్వం, తరమున; నిది చెప్పినదియె ధరణీనాధా ! 334

వ. తృతీయ యుగమ్మున వైవస్వతమన్వంతరమ్మున నత్రిభార్యయగు ననసూయకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మువ్వురును బుత్రులై జనించి; రందు బ్రహ్మసోముండు, హరి దత్తాత్రేయుండు, హరుండు దుర్వాసుం డని యెఱుంగునది. 335

గీ. నాలవ యుగమ్మున జనించె నారసింహుఁ, డగుచు హరి దేవహితకారియై హిరణ్య
కశిపు వధియింపఁ ద్రేతాయుగమ్మునందు, వామనుండయి జనియించె బలి నడంప.

వ. అట్లు కపటవామనుండై కశ్యపున కుద్భవించి బలిని బాతాళమ్మున కనిపి పందొమ్మిదవ త్రేతాయుగమ్మున మరల జమదగ్నికి సుతుండయ్యె. 337

ఆ.వె. అతనిఁ బరశురాముఁ డందు రాతఁడ కాఁడె, క్షత్రకులము నెల్ల సంహరించి
పుడమియెల్లఁ గశ్యపునకు దానం బిచ్చె, నఘహరంబు విక్రమ మతని చరిత. 338

వ. త్రేతాయుగమ్మునన రఘువంశప్రదీపకుండగు దశరథునకు శ్రీరాముఁడై జనియించె.

క. అష్టావింశయుగమ్మున, దుష్టుల హరియించి పుడమి దురు కడఁపంగా
శిష్టులు నరనారాయణు, లిష్టులు కృష్ణార్జునులయి యెనఁగిరి జగతిన్. 340

వ. వారు కురుక్షేత్రమ్మునఁ గౌరవులతోడ ఘోరయుద్ధం బొనర్చి జయంబుగొని రిట్లు తత్తద్యుగమ్ములఁ బ్రకృతివశమ్మున ననేకావతారమ్ములు హరికి గలుగుచుండు. జగమ్మఖిలంబును బ్రకృతివశంబని యెఱుంగుము. సర్వాదియు సర్వగుఁడును నవ్యయుండును నగు పురుషుం డీ యఖిలమ్మును సృష్టించి యే యుపాధి కతనఁ ద్రివిధుండై యొప్పు నా ప్రకృతి యుత్పత్తి కాలయోగమ్మున భిన్నయై ప్రకాశించుచుండు నయ్యాదియ సృష్టిస్థితిలయమ్ము లొనరించు, నది యెట్లంటేని. 341

ఆ.వె. ప్రకృతియుక్తులగుచు బ్రహ్మయు విష్ణువు, శివుఁడుఁ జేయుచుండ్రు సృష్టిరక్ష
ణలయకృతులనెల్ల నరులకుఁ బ్రకృతి యొ, సంగుఁ గష్టములను సౌఖ్యములను.

వ. ఆ ప్రకృతియకదా మున్ను కాకుత్స్థుండను నొక రాజున్ను సృష్టించి రాక్షస వినాశమ్మున కొక్కెడ నుంచె. 343

క. ఒకఁడనఁగనేల యెల్లరుఁ, బ్రకృతికి వశులగుచు భవముపాలై సౌఖ్యా
దిక మనుభవించుచుందురు, వికలము గాకుండునట్టి విధితంత్రమునన్. 344

వ. నావుడు జనమేజయుం డిట్లను, మహాత్మా! నరనారాయణాశ్రమమ్మున కేతెంచి యచ్చరలు నారాయణుం బతిగా వరించిరని నుడివితి వాతండు పిదప నేమి యొనర్చె నక్కథ వినవలతు ననిన సాత్యవతేయుం డిట్లనియె. 345

తే. వె. శాపమీఁగ నెంచి చయ్యన నరుఁడు వా, రింప నుడిగి యా విలింపవార
సతులఁ గాంచి స్మితమెసంగ నారాయణుం, డానతిచ్చె మధురమైన భణితి. 346

క. కృతసంకల్పుఁడనగు నా, కతివలతోఁ బొందుఁ జెందు టర్హమె! మీరల్
ప్రతిచెప్పక త్రిదివమ్మున, కతిరయమున నిప్పు డరుగుఁ డంగనలారా! 347

వ. మనోహరంబగు నీ శృంగారమునకు స్థాయిభావమ్ము రతినాఁబరగు నయ్యది లేకున్న నే నెటు మిమ్మువలంబింతు మీపాటిబోటులకు వరణీయుండ నగుటంజేసి నాభాగ్యస్వరూపమ్ము లనన్యసామాన్యంబులు నాయందు దయగలిగి వ్రతభంగంబు గాకుండ నిప్పటికిఁ జనుండు మీ కోరినయట్ల యష్టావింశంబగు ద్వాపరయుగమ్మునఁ బ్రవర్తించువాఁడ. 348

క. సురవాక్యం బొనరింపఁగ, నరుదెంతు ధరాతలమున కయ్యెడ మీరల్
నరపతి తనూజలై నన్, వరియింతురు భార్యలగుచుఁ బరిపరిగతులన్. 349

వ. అని యొప్పంజెప్పిన నయ్యచ్చరలు దివమ్మున కరిగి కలతెఱంగెఱిఁగించి శక్రునకు సఖీసమేతయగు నూర్వశిం జూపిన నతండును దల్లావణ్యమ్మున కచ్చెరువంది మునుల ధైర్యమ్మునకు మెచ్చి వేనోళ్ళ సన్నుతించెః నరనారాయణులు నెప్పటి యట్ల తపోనిష్ఠాగరిష్ఠులై యుండి రియ్యది వారి చరితంబని మఱియును. 350

క. వా రిరువురుఁ గృష్ణార్జును, లై రమణ జనించి పుడమి కానందము చే
కూరఁగఁ జేసిరి భృగుశా, పాదంభము కారణముగ వసుధానాథా! 351

వ. నావుడు జనమేజయుండు మునీంద్రా! కృష్ణావతార చరిత్రంబు విస్తరించి వచింపుము, హరియును ననంతుండును నెవరికిఁ బుత్రులట్టి దేవకీవసుదేవులఁ గంసుం డెట్లు బంధనాగారమ్మున నుంచె? మధురయం దుదయించిన హరి గోకులమ్మునకు రానేల? కంసవధానంతరమ్మునఁ గృష్ణుండు ద్వారకయందు వసియించుటకుఁ గతం బెయ్యది? 352

క. తన పిత్రార్జిత దేశ, మ్మున నుండక యన్యదేశమున కేగుట యె
వ్వనికి ననర్థాంబన న, య్యవిమిషవంద్యునకు నెట్టు లది తగుఁ జెపుమా. 353

వ. అదియునుంగాక ద్విజశాపమున యాదవకులంబు రూపఱుటయు, గృష్ణనిర్యాణాన ంత
రంబున వతిని భార్యలం దోచిన దొంగలఁ బార్థుండు సంహరింపకుంటయు న క్షి జం
బయి కన్పట్టెడి. 354

క. గాంగేయుండును ద్రోణుం, డంగపతియు మొదలు వీరు లతిభాసురులై
క్రుంగం జేసిరె! పుడమికి, దొంగలభావం బొకింత దోఁచదె చెపుమా! 355

వ. మహా పతివ్రతలగు శ్రీకృష్ణుని భార్యల కిట్టి భంగపాటును వసుదేవుండు పుత్ర
దుఃఖమ్మున మృతుండగుటయుఁ గృష్ణాశ్రితులగు పాండవులకుఁ గష్టమ్ములు దొర
రుటయు మహాభాగయగు ద్రోపది పడిన బన్నంబు లట్లుండఁ దత్పుత్రు లశ్వత్థామచే
నన్యాయముగ హతులగుటయు సౌభద్రుండగు నభిమన్యుండు బాల్యమ్మునను యుద్ధ
యుద్ధమ్మునఁ దెగుటయు దేవకీతనయు లార్గురునుఁ గంసునిచేఁ జంపఁబడుటయు
నాకు మిక్కిలి వ్యసనం బొసంగెడి నది యిట్లుండ 356

గీ. యాదవులు ప్రభాసమ్మున హతు లగుటయు, వారి పత్నులు దొంగలబారిఁ బడుట
యిట్టులుండఁగ నాదినారాయణుండు, కృష్ణుఁ డుగ్రసేనుని సేవ కెట్టు లొప్పె! 357

గీ. హర్షశోకాదికములు లోకాధ్యుఁడైన, హరియు సామాన్యులంబోలెఁ బొందు టెట్లు?
చోరభాతిని రుక్మిణీసుదతిఁ గొని వ, లాయనం బొనరింప నేలా! యతనికి. 358

వ. మధురాపురమ్మునుండి హరి ద్వారక కేగుతఱి వ్రజగోపనం బొనర్చుచు నవ్విధముం
డగుట యెట్లు వివరింపుమని వెండియు. 359

ఉ. పాయక సందియమ్ము లతిపారముగాఁ గనుపట్టుచుండు న
న్యాయతబుద్ధిఁ దీర్పఁ దగునట్టి మహాత్ముఁడ వీవు, కోరఁగా
నాయెద గొంకెదుణా ద్రుపదనాధతనూజ నొకర్తు నేవురున్
జాయగ నెట్టు లొప్పిరి? ఏనజ్ఞులు పాండవు లెగ్గెఱుంగరే! 360

గీ. ధర్మమతులు సమర్థు లుద్ధతులు పాండ
వులు మహాత్ములు వా రెట్లు కలికి నొక్క
రిఁ బహుప్రాయు లగుచు వరింప నెంచి
రియ్యదియు ధర్మమేని నా కెఱుఁగఁ జెపుమ. 361

గీ. దేవసముఁడైన గాంగేయుఁ డేవిధమున, గోళకులచేతఁ గులవృద్ధి గొనుట కొప్పెఁ?
నకట! "యెట్లైన సంతాన మర్హ" మనుచు, జెప్పు ధర్మమ్ము లెంత కుత్సితములనఘ!

వ. నావుడు వ్యాసుం డిట్లనియె. 363

క. దేవకి కొమరుని చరితము, పావనము సమస్తలోకపాపాపహముఁ గా
దేవ శ్రావ్యము మిగుల శు, భావహ మద్దానిఁ బ్రీతి నాలింపు నృపా! 364

## కృష్ణావతారకారణము.

క. ఒకనాఁడు పుడమి భారం, బుకతన స్వర్లోక మేగి పురపుర పొక్కన్
సకరుణుఁడై యింద్రుండు ధ, రకు గోరూపధరం కాదరమ్మునఁ బలికెన్. 365

గీ. నెట్టనంటగ శోకింప నీకు నేమి, వచ్చె? నావుడుఁ బుడమి యవ్వాసవునకుఁ
గల తెఱఁ గెఱిఁగించె విక్కురణి దీన, వదనయై యశ్రువులుచాలు వఱద గాఁగ.

వ. సురేంద్రా! దుఃఖకారణం బడుగు నీకు నే నేమని చెప్పుదు జరాసంధుండును శిశు
పాలుండును గంసుండును రుక్మియును నరకుండును సాల్వుండును గేశియు ధేనుక
వత్సకులు మొదలగు దుర్మార్గులు కేవలాధర్మవర్తనులై పరస్పరద్వేషమ్ము పూని
చరించువారు వీరల భారమ్ము నే సైరింప నోప నని వెండియు. 367

చ. హరి కిటిరూపధారి యయి యక్కనకాక్షు వధించి నన్ సము
ద్ధరణ మొనర్చి నిల్పిన విధం బది నీవు నెఱుంగుదే కదా
మరల నిదొక్కబాధ సురమండలనాయక! భూరిదుఃఖమే
దురతఁ దరంగరింగణపు దుందుడుకుం గను నెన్ని భంగులన్. 368

వ. హరి మున్నట్లొనర్పనినాఁడు పాతాళమ్మునకుం జని యీ బాధల కవిషయమనై సుఖ
ముండుఁ గదా యని చింతించి మఱియును. 369

క. అష్టావింశయుగం బతి, దుష్టప్రచురమయి కడకఁ దోతెంచుఁ గటా!
శిష్టవిగర్హితు లగు నా, కష్టాత్ములు నాకు భారకారులు కారే? 370

ఆ. వె. భరము మోయఁజాలఁ బాతాళమున కిష్ట, పోవు దానఁ బేర్మి పొలుపు మీఱ
నానతిమ్ము భారమైన హరింపుము, తాళఁజాల నీకు దండ మిడుదు. 371

వ. నావు డింద్రుండు నీ భారమ్ము హరింప నే నెంతవాఁడ బ్రహ్మలోకమ్మున కరిగె
దేనిఁ జతురాననుం డియ్యెడ నుపాయంబు గల్పించు. 372

క. నీ వెంట నేను వచ్చెద, దేవీ! యచ్చోటి కిపుడ తెరలిచనుట యొ
 ప్పేవిధినైనను నావిధి, నీవలవంత నెడఁబాపు విక్రమం బలినన్. 373

వ. పుడమియు నియ్యకొన నింద్రుం డాపె వెనువెంటనరిగె నంత దుఃఖాక్రాంతయగు
 ధరణిం గాంచి చతురాననుం డిట్లనియె. నీ వేకతమ్మున నిట్లు దుఃఖింతు, వెన్ని
 వ్వఁడు పీడించె? నావుడుఁ బుడమి యిట్లనియె. 374

ఉ. చెప్పెడిదేమి నాకుఁగల చేటు పితామహా! భార మాఁగఁగా
 దెప్పర మాయె; నింకఁ జనుదెంచుఁగదా కలి; దాన భూపతుల్
 తప్పుదు రెల్లధర్మము, లుదారగుణమ్మును మాని చౌర్యముల్
 చొప్పడ సంచరింతు, రిది చూడఁగ భారము గాక యుండునే? 375

క. ఈ కలుషాత్ముల నెల్లర, నాకై వధియింపు మయ్య నానావైన్యా
 నీకముల కోపఁ జాల వ, రాకిని నేనెంత ప్రోవ రాదె మహాత్మా! 376

వ. నావుడు విరించి యోదేవీ! నే నీకృతి కసమర్థుండ జగన్నాథుండగు శ్రీహరికిది
 కరుగఁదగు నని యంచ నెక్కి సురపరివృతుండై ధరణీసహితమ్ముగ వైకుంఠ
 మ్మున కరిగి సనాతనుండగు నద్దేవు నిట్లని నుతించె. 377

ఉ. వేయిశిరమ్ములన్ మఱియు వేయికరమ్ములు వేయికన్ను ల
 త్యాయతరీతి నొప్పు పరమాత్ముఁడ! యావదజాండసంతత
 ధ్యేయుఁడ! వేదపూరుషుఁడ! దివ్యము నీమహిమంబు నీవ కా
 వే యమరత్వ మిచ్చితివి విశ్వవిధాయక! మాకు సత్కృపన్. 378

వ. ఇట్లు సన్నుతించునాతనియెడఁ గరుణించి గరుడధ్వజుండు ప్రసన్నుండై యంచలు
 వేర్వేఱఁ గుశలంబడిగి యాగమనకారణంబే మనవుడు విరించి యిట్లనియె. 379

మ. ధర భారమ్ము సహింపఁజాల నని వంతం బొందు మాకున్ దురు
 ద్ధర మీకార్యము ద్వాపరాంతమున దుర్ధర్షస్థితిన్ భూభరో
 ద్ధరణార్థం బవతార మెత్తుము నిరాతంకంబుగా భూస్థలిం
 గరుణింపం దగదే యనాథులకు నీకన్నన్ బరుల్ గల్గిరే! 380

వ. నావుడు నతం డిట్లను. 381

ఆ.వె. నేను నీవు రుద్రుఁ డితరులు నమరులు, నస్వతంత్రులనుచు నరయు మఖిల
 జగము యోగమాయసంగతి గుణసూత్ర, కలిత మగుచునుండుఁ గంజసూతి! 382

వ. అనె దా నెట్లొనర్ప నిచ్చగించు నట్లు చేయుదము మనమందఱమును తద్వశగతు

లమ, అట్లుకానినాఁడు మున్ను నేను మత్స్యకచ్ఛపాదితుచ్ఛయోనులన్ జనింతునే?
యని వెండియు. 383

క. ఆర్యములు గావినింద్యపుఁ, దిర్యగ్యోనుల జనింపఁ దివురుట సుఖరా
త్పర్యమొ పుణ్యమొ కీర్తియొ, శౌర్యమొ భోగమొ ఎఱేమి సారస్యంబో? 384

వ. కిటినృసింహవామనరూపప్రపులు ధరించుటకును నయ్యంబయ నిమిత్తం బది
యునుం గాక, 385

క. ఘనుఁడగు జమదగ్నిమహా, మునికిఁ బరశురాముఁడనఁగఁ బొడమి నృపతులన్
దునిమి తటాకంబులు గా, నొనరించితి రక్త మిదియు నొకసుకృతంబే? 386

వ. మీఁద రాముఁడనై జటావల్కలంబులు ధరియించి దండకారణ్యమ్మునం దిరు
గుచు నన్నపానాదులు లేమిఁ గృశించి రాజచిహ్నంబులు విడిచి సిగ్గఱి పాదచారినై
గ్రుమ్మరుచు మాయాపిహితుండనైన కతనఁ గాంచనమృగంబు కలతెఱం గెఱుం
గక యొక యీరమ్మున నప్పుడమిచూలిం ద్యజించి యరుగుడు నంత లక్ష్మణుం
డును గొండొక పేపునకు వెన్నడి వచ్చె. 387

ఉ. పిమ్మట భిక్షురూపమునఁ బేశలగాత్రిని సీత నెత్తికొం
చమ్మెయి రావణుండరిగె నంత లతాంగిని గాన కేను శో
కమ్ము గడల్గొనంగ నల కాననమెల్లను జూచి యేతద
ర్థమ్మున మైత్రిఁ జేసితిఁగదా! రవిపుత్రునితోడ వారయుఁ. 388

శా. వాలిం జంపితి ధర్మబాహ్యముగ నాపై వానరానీక ము
ద్వేలంబై వెనువెంట రా దనుజులన్ దీంద్రింపఁగా లంక కా
భీలప్రక్రియ నేగి యచ్చట నగంభీరుండనై నాగపా
శాళిం జిక్కితి సామజుండ నయి, యన్యాధీనతల్ కూడునే. 389

గీ. పాశములఁ జిక్కి చింతపాల్పడిన యన్న, దమ్ములను మమ్ము విడిపించెఁదతబలుండు
గరుడుఁ డప్పుడు నామదిఁ గలుగుచింత, యింత యని చెప్ప శక్యమె యేరికేని?

సీ. రాజ్యమ్ము పోయె నరణ్యంబు గతి యాయె • భార్యయు రక్కసుపాలఁ బడియె
నతికష్టమగు రణస్థితి పొసంగె నిఁకేమి • పేయువాఁడ వనమ్ముచెంత కనుచు
నప్పుడు తండ్రి గప్వైనను నాకీఁడు • ధనహీనుఁడఁ బదాతి నవద నకట!
యెంతటి ధనికున కేనియు వనవాస • మతిభరంబగుఁ జెప్ప నలవి యగునె

గీ. మాదృశునకంచు క్షత్రధర్మంబు విడిచి • బోయవడుపున నవ్వనంబునఁ జతుర్ద
శాబ్దములు వేఁగి మీఁద జయమ్ముఁ గొంటి • దైవవశమున. నాకు స్వాతంత్ర్యమేది?

వ. మీఁద జానకిం గైకొని యయోధ్యకరిగి కొంతకాలమ్ము సంసార సుఖంబు లనుభ
వించుచుఁ బ్రజలఁ బాలించుచున్నంత. 392

గీ. కడలుద్రొక్కిన పడఁతిని విడువలేక, మరలఁ గైకొనె వితఁ డనుమాట కోప
లేక విడిచితి సీత సుశ్లోక నటవి. నకట। లోకాపవాద కేమనఁగవచ్చు. 393

క. పిమ్మట న త్తరుణీవిర, హమ్మున సంప్రాప్తమయ్యె నతిదుఃఖ మ్మ
క్కొమ్మ రసాతలమున కరి, గెమ్మహి భేదించుకొని యొగిం దనయంతన్. 394

ఉ. ఏనుఘ దమ్ములం బిదప నేగితి మొక్కమొగిన్ విలింపసం
స్థానము నిట్టి నాకుఁ బరతంత్రత గాక స్వతంత్రభావ మెం
దేనియుఁ గల్గుబెట్లు। విను మీవును రుద్రుఁడు నిట్టివారలే
జ్ఞానములేమి మాయకు వశమ్ముగ నిమ్మగ నుందు మెమ్మెయిన్. 395

వ. అని మఱియు నిట్లను. 396

ఉ. ఏ మహనీయ మాయ మనకేరికి గోచరిగాక యుండు ను
ద్దాముని శాంతుఁ దత్త్వమయుఁ దారకు నప్పరపూరుషున్ గనన్
లే "మహ" మంచు గర్వమున నిక్కుదు మప్పరవస్తు వాస్తవ
స్థేమము నాఁడు చూచితిమి దెప్పరమౌగతి నీ వెఱుంగవే. 397

వ. అని సురల కిట్లనుఁ గల్పాదియందు సుధాసముద్రమ్మున మణిద్వీపమ్మున రాసమండ
లమ్మున మాచే నదృష్టపూర్వయు నప్రకృత చరియునగు జగదంబ చూడఁబడియె.
సర్వకామప్రదయగు నాపెన్ భజించిన మీ మనోరథమ్ముసిద్ధించు ననపుడు బ్రహ్మాదు
లాయంబను మనమ్మున నిలిపి వేఁడికొనిన నాపె ప్రత్యక్షంబయ్యె. 398

క. పాశాంకుశధారిణియు జ, పాశంకాకరణకాంతిపాటవకలనా
పేశలగాత్రియు నగు జగ, దీశానిం గాంచి యమరు లెనసినభక్తిన్. 399

వ. ఇట్లు నుతించిరి. 400

ఆ.వె. తలఁప నూర్ణనాభివలనఁ దంతువులు వి, భావసునివలన నపారగతి స్ఫు
లింగములును బొదములీలగా నీ జగ, మెచటఁ బుట్టు నాపె దెలుఁగవలదె? 401

## దేవీ స్తుతి.

క. ఏ మాయాశక్తికి లో, నై మను నఖిలప్రపంచ మా భువనేశా
నీమహిమ నెన్నఁ దరమా, నేః మౌనులకైన మఱి నెవ్వరికైనన్. 402

వ. అని పెక్కుభంగుల నుతియించి తల్లీ! కంసాది దుష్టులచే జగంబెంతయుఁ బీడింపఁ బడుచుఁ తన దద్భారం బోర్వక పుడమి నిన్ను శరణంబు వేఁడెడి, హరిహరాదుల కసాధ్యులగు రక్కసులు నీచే సాధింప నగుదురు కావునఁ దత్సంహారం బొనరించి భారంబు దీర్పు మనవుడు సింద్రుండిట్లనియె. 403

ఉ. ఏరును శక్తిశూన్యులయి యెవ్వనిఁ జేయఁగలేరు బ్రహ్మకున్
భారతి, లచ్చి విష్ణునకుఁ, బార్వతి శూలికి, నుంటఁజేసి వీ
రారయ నాత్మకార్యములయందు సమర్థులు తత్సహాయతా
ధారములేమి వీరు ప్రభుతాగతికిం దగువారలౌదురే. 404

వ. హరి యిట్లనియె. 405

గీ. నీదు కళ మాకు నొక్కింత నెగడదేని,నేము ముగుర మశక్తుల మింత నిజము
నీవు తోడింతయును లేక నిఖిలకృతుల, యందు ధారాశగతి నూని యుందువంబ!

వ. నావుడు జగదంబ సంతుష్టయై సురలఁగాంచి యాగమనకారణం బేమనవుడు వార లిట్లనిరి. 407

క. భూపాలకు లెల్లరుఁ గడుఁ, బాపాత్మతఁ దన్నుఁ గ స్తిపడఁ జేయఁగ న
య్యాపద కోపక భార, వ్యాపృతయై పుడమి వగచు నరయుము తల్లీ! 408

వ. తద్భారంబు దీర్పుటయ మాకభిమతంబని వెండియు. 409

సీ. దానవకోట్లతో దర్పించి యెదిరిన • మహిషాసురుని రూపు మావలేదొ
శుంభనిశుంభుల గాంభీర్య మెడలించి • రక్తబీజుని నేల రాయలేదొ
చండముండాది రాక్షసుల నుక్కడఁగించి • ధూమ్రలోచనుతల ద్రుంచ లేదొ
దుర్ముఖదుస్సహాదులఁ దునుమాడి క • రాళు నంతకపురిఁ దోల లేదొ

గీ. జనని నీచేతఁ ద్రెళ్ళినదనుజు లెంద
ఱో వచింపఁగఁ దరమె? భూదేవి భార
మును హరింపఁగదమ్మ మామ్రొక్కులను గ్ర
హింపఁగదవమ్మ నీకన్న నెఱుగమమ్మ. 410

క. నావుడు జగదంబ మొగం, బావిర్భూతస్మితోదయంబుగఁ బలికెన్
దేవతలతో నదభ్రకు, భావహకాలాభ్రగర్జి తాకృతి చెలఁగన్. 411

గీ. అవి జరాసంధముఖ్యుల నన్యదుష్ట
నరపతుల నందఱ హరింప నా మనమ్ము
నందు యోజించి యుంచితి నమరులెల్లఁ
బుడమిఁ బుట్టుండు స్వస్వాంశముల రయమున. 412

గీ. యాదవకులమ్మునను బుట్టు ననఘుఁడైన, కశ్యపుఁడు వసుదేవుఁడై కాంతతోడఁ,
బొడము భృగుశాపమున విష్ణువు నతనికి, బుత్రుఁడై యేను నందునిపుత్రి నగుదు.

క. నందునకు యశోదకు నే, నందనినై పొడమి యొకఁ డనఁగనేల పొసం
గందగు నన్నికృతుల నా, నందముమై నిర్వహింతు నవనవగతులన్. 414

గీ. బంధనాగారగతుఁడగు పద్మనేత్రు, గోకులమ్మున కనిపెద గూఢవృత్తి
దేవకీగర్భగతు శేషుఁ దిగిచి రోహి, ణీలతాతన్వికడుపున నిలుపుదాన. 415

క. బలరామకృష్ణు లిద్దఱు, నలయక మచ్ఛక్తియుక్తులగుకతన దురా
త్ముల ద్వాపరాంతమున ని, శ్చలగతి భూపతుల నెల్లఁ జంపుదు రెలమిన్. 416

గీ. ఇంద్రువంశమ్మునన్ జనియించు నర్జు
నుం డతఁడు మాపు నరివర మండలంబు
యముఁ డనిలుఁ డశ్వినులు కారణముగ ధర్మ
జుఁడును భీముండుఁ గవలును బొడముఁ గలరు. 417

వ. వీరును వస్వంశసంభూతుండగు భీష్ముండును దుష్టహరణంబు విశేషించి యొనర్తు
రింతేల వీరు నిమిత్తమాత్రులుగా నిఖిలంబు నేన నిర్వహింతు మీరు మీమీపొందు
పట్ల కరుగుండని మఱియును. 418

ఉ. క్షత్రియజాతినెల్లఁ బెలుచన్ హరియింతు రణావనిన్ గురు
క్షేత్రమునం దమంతన నశింతురు యాదవులున్ క్షణమ్మునం
జిత్రగతిన్ బ్రభాసమునఁ జేటగుతృష్ణయు నోర్వలేమియున్
ధాతృనిదేశమున్ ధరణిదైవతశాపము నేకమై తగన్. 419

క. పిమ్మటఁ గృష్ణుండును దే, హమ్ము విడుచు శాపకలన, నఖిలసురలు! మీ
రిమ్మెయి గోకులమున మధు, రమ్మహిళలతో జనింప రమణం బనుఁడీ. 420

వ. అని యానతిచ్చి యోగమాయారూపిణియగు నజ్జననియుఁ గనుమొఱఁగినంత నమ

రులు స్వస్థానమ్మున కరిగిరి. ధర సర్వసస్యోపేతయై సుస్థిరమ్ముగనుండెఁ బ్రజ
లెల్లరు సుఖులైరి ద్విజులును మునులును సంతుష్టాంతరంగులై స్వధర్మనిర్వహ
ణంబున జాగరూకులై యుండిరి. 421

క. విను జనమేజయ! యదుకుల, మున సరసిజలోచనుండు పొడమునిమిత్తం
బనివార్యంబగు శాపం, బును మాయాబలము క్షితిసముద్ధరణంబుగా. 422

గీ. ఎల్లరకు నెల్లశక్తుల నే పరాంబ, గలుగఁగాఁజేయు నాశక్తిబలము కలిమిఁ
గలిగె విష్ణువునకు గర్భకష్ట మింక, నితరు లీమాయ దాఁటువారేమొ చెపుమ. 423

వ. రామావతారమ్మున నతని మునుపడ్డ బన్నములు వినియుంటివి కదా! వేయునేల,
యోగీంద్రులును "నేను నాయది" యను మహాపాశమ్మునఁ దవులుకొని తన్ని
వృత్తికై యాజగజ్జనని నారాధింతురు. 424

క. లవలేశమేని నరుఁ డే, భువనేశ్వరి భక్తివలనఁ బొగడిన ముక్తి
స్థవిరతఁ గాంచునొ యాపె వి, భవ మేరికి నేని వినుతిపాత్రము కాదే! 425

వ. విద్యయు నవిద్యయునని యప్పరశక్తికి రెండు రూపమ్ములు గలవు. విద్యకతమున
ముక్తియు నవిద్యకతమున బంధమ్మును గలుగునని యెఱుంగునది. 426

క. అవతారము లన్నియు న, య్యవిద్యచే యంత్రితమ్ములగుకతమున వి
ష్ణువు తత్తద్బంధనములఁ, దవిలి సుఖాసుఖము లనుగతములుగ మెలఁగుణా. 427

క. హరిగాని హరుఁడు గానీ, సరసిజసంభవుఁడు గాని చంద్రార్కసురే
శ్వరధనదయమధనంజయ, వరుణాదులు గాని యెఱుఁగు పరతంత్రులుగాన్. 428

వ. మఱియు వసిష్ఠవామదేవ సనకసనందనాది మహామునులందఱును దద్వశులకా
యెఱుంగుము. 429

గీ. హర్షశోకాది భావమ్ము లమరుచుండు, దేహమున్నంతదనుక సందేహమేల?
సురల నమరులటంచు నిర్జరులటంచుఁ, బల్కుదురు కొంద ఱది సరిపడునె యెందు?

గీ. ఆయు వధికంబు నల్పంబు నగుటదక్క, బ్రహ్మమొదలుగ మశకంబు పారముగ స
మానగతి నొప్పు మరణ; మమరులనంగ, నిర్జరులనంగ నెవ్వరో నృపవరేణ్య!

క. జననము మరణము ననువివి, జనవర! చక్రక్రమంబు చందంబున నొ
ప్పు నొకనికిని శాశ్వతమనఁ, జనునే మాయాకృతంబు సకలంబరయన్. 432

వ. అమ్మాయ యెంతదనుక నలవడు నందాఁక నెవ్వండును ముక్తుండుగానేరఁ

దుత్పత్తికాలమ్మునఁ బుట్టువెట్లగు నట్లు నాశకాలమ్మున యథాక్రమంబుగ నందఱకును నాశం బొదవు నిట్లుండ. 433

గీ. ఎవ్వఁడు నిమిత్త మాత్రమై యెవనిఁ జంపు
నతనిఁ దత్కర్తగా లోకు లంద్రు, విధివ
శమ్మని యెఱుంగఁజాలరు సౌఖ్యమేని
గష్టమేనియు నొక్కఁడీఁ గలుగు టెట్లు! 434

ఉ. పండితులున్ సుఖప్రదు లటంచు వచించెడి సూర్యచంద్రు లే
కుండను ఱెండరేమొ కనుఁగొమ్ము దినేంద్రునిపుత్త్రుఁ డిప్పరో!
మందుఁడు, చంద్రుఁ డంకమున గ్రుగ్గు క్షయామయబాధఁ జెందు నే
మందు! విధి ప్రభావము మహాత్ములకేనియు దాఁటరాదుగా! 435

ఉ. వేదములన్ రచించిన వివేకి చతుర్ముఖుఁ డాతఁ డాత్మదా
యాద సరస్వతింగని స్మరాతురుఁడయ్యెః హరుండు దక్షదా
యాద మృతింగనంగ మదనాగ్నికిఁ దాళఁగలేక సూర్యదా
యాదజలమ్మునం బడఁగ వానది పల్లవడెన్ దదాదిగన్. 436

వ. ఆతం డొక్కనాఁడు క్రీడాసక్తుండై నగ్నభావమ్మున భృగువనమ్మున కరిగిన నమ్ము నీంద్రుండు కవలి నిర్లజ్జుండవగు నీలింగంబు పతితం బయ్యెడుమని శపించెఁ బదంపడి యతండు దానవపరిమితంబగు నమృతవాపీరసంబు పానంబుచేసె నిది యిట్లుండ నింద్రుండు వృషరూపమ్మున నొక భూపతికి నొక్కెడ వాహనంబయ్యె మఱియు. 437

క. పరమపురుషుఁడఁట! హరియఁట!, కరము వివేకంబు గల్గు ఘనుఁడౌనఁట! బం గరు మృగము నిజంబెఱుఁగక, త్వరపడి యద్దానివెంటఁ దవులుట తగవే? 438

క. మాయాబల మేరికి దుర్, జ్ఞేయం బక్కటవఁగాదె శ్రీరాముఁడు కా మాయత్తుండై సతిఁ గో, ల్పోయిఁ యడుగఁదొడఁగె వృక్షముల నవ్వనిలో. 439

ఆ. వె. "నాదు భార్య జనకనందిని సౌందర్య, నిధి సుశీల సీత నిరుపమాన
నెవ్వఁ డపహరించె నేయెడ కరిగెఁ జె, ప్పంగరాదె పాదపమ్ములార! 440

ఉ. తమ్ముఁడ లక్ష్మణా! యవితథమ్ముగఁ బ్రాణములం ద్యజింతు నే
నిమ్మయి నీవు నట్లత్యజియింతువు నీ యనుజుండుమం ద్యజిం
చు మ్మనతల్లులుం దెగుట చోద్యమె కైకయు నా పెపుత్రుఁడున్
నమ్మదలీల రాజ్యమును నల్పుదురక్కట సీతవోయెనే! 441

ఉ. రాఁగదవే మృగాక్షి! నను రంజనసేయఁగదే లతాంగి! నా
రాగ మెఱుంగవే! తరుణి! రాముఁడఁ గానఁటవే నెలంత! వే
వేగ ననుగ్రహింపఁగదవే మదవేల్లితదంతిగామినీ!
యీగతి నన్ దృజింపఁదగవే నగవే యిది నీకు మానినీ! 442

గీ. విన్ను విడనాడి బ్రతుకంగ నేర నంచు, నీ వెఱుంగవె నీ యెడ నేమి లోప
మాచరించితిఁ ద్వదధీను నరసి నన్ను, దీను నోదార్చ నిట కరుదేరఁ దగదె. 443

ఉ. ఈగతి నవ్వనాంతరము నెల్లను జూచి ధరాత్మసంభవన్
దాఁ గనలేక సర్వజనతాగతి యా రఘురామమూర్తి వే
వేగఁ గపీంద్రువిన్ శరణువేఁడి తదీయసహాయతన్ రయం
బౌగతి వార్ధిఁగట్టి రణమందు జయించె నవధ్యు రావణున్. 444

ఉ. రావణ కుంభకర్ణులను రాక్షసవీరులఁ జంపి జానకిన్
బావనశీలఁ జూచి యలపాతకుఁ బొందితి వంచుఁ బల్కె నౌ
రా! విధి! సర్వముం దెలియునట్టి మహాత్మున కెంతవచ్చెఁ ద
ద్భావ మెఱింగి తా విడియెఁ బావకశోధ ధరాత్మజాతయున్.

క. పిమ్మట నవ్వనితం గొని, సమ్మదమున నుండె రామచంద్రుఁడు మాయన్
బొమ్మసిలి యిట్టు లవతా, రమ్ముల విష్ణుండు మిగుల భ్రాంతిం బొరయున్. 446

క. విను శ్రీకృష్ణునిచరితం, బును వచియించెదను నతవి పుట్టువునకు నో
జనమేజయనరవర! య, య్యనిమిషకార్యంబ ముఖ్యమగు ఫలముసుమీ. 447

శా. కాళిందీపులినమ్మునన్ విపులశాఖాశోభివృక్షావళీ
హేలాలోలత నొప్పెడి న్మధువనం బిందిందిరానందమై
కాలాఖిలబలాధికుండు లవణాఖ్యాకుండు నాజన్మదు
శ్శీలుం డమ్మధుపుత్రుఁ డవ్వనమునం జేయు న్నివాసంబొగిన్. 448

మ. ధరణీదేవుల బాధ పెట్టుచు నితాంతమ్మున్ వరప్రాప్త దు
ర్భరగర్వమ్మున నిక్కు నద్దనుజు నత్త్రాణుండు శత్రుఘ్నుఁడు
ద్ధురుఁడై త్రెళ్ళఁగ నేసి యవ్వనమునందుం బట్టణ మ్మొక్కఁడున్
ధరణీరత్నము నాఁగఁగట్టె మధురానామంబు చెన్నారఁగన్. 449

వ. అమ్మధురాపురమ్మునకుఁ బదంపడి తన పుత్రులఁ బుష్కరాక్షుల నిరుపుర నొద

యలుఁగఁ జేసి యరుగుడుఁ గొండొక కాలమ్మునకుఁ దద్వంశంబు క్షయంబగు
కతన నప్పురి యాదవులకు వశమయ్యె. 450

గీ. ముక్తిదంబగు నప్పురమ్మును యయాతి, తనయుఁడగు శూరసేనుఁ డుద్ధతబలాఢ్యుఁ
డేలు నతనికిఁ బుత్రుఁడై యెసఁగెఁ గశ్య, పుఁడు వరుణశాపమునఁ జేసి భూపరేణ్య.

వ. అతండు వైశ్యవర్తనుండగు కతన నమ్మధురాపురంబు మధువంశసంభవుండగు
నుగ్రసేనుం డేలుచుండె నతని కొమరుండు కంసుండు, కశ్యపుభార్యయగు నదితి
దేవకతనూజయై దేవకినాఁబరఁగి కశ్యపాంశంబున జనియించిన వసుదేవునకు
భార్యయయ్యె. 452

క. దేవకుఁడు దేవకిని వసు, దేవున కిడి పెండ్లిచేసె దేవహితముగా
నావేళ నంబరమ్మున, నావిర్భవ మందె నిట్టు లభ్రవుఁబలుకుల్. 453

"విను మీదేవకి కుదయిం, చిన సంతానమున మిగులఁ జేవందగువాఁ
డెనిమిదవ కొమరుఁడాతఁడు, వినుఁ దునుమునుజమ్ము కంస! నిర్దయహృదుఁడై."

అను నయ్యాకాశవాణి పలుకులకుఁ దలరి కంసుండు చింతాక్రాంతుండై తన మర
ణం బిక్కోమలిం జంపినఁ దప్పునని యట్లొనరింప నుంకించి నిజాంతర్గతంబున.

గీ. చెలియ లుత్తమురాలు నాచేయు మన్న
నలకుఁ దగుఁగావ యిబ్బంగి నణుకులకును
దగునె యని కొంత యోజించి తన మరణము
కన్న నొక్కింత యిది లెస్సగాదె యనుచు. 456

క. కాయము గలిగినఁ బాపము, ప్రాయశ్చిత్తమున నైనఁ బాయందగు నా
త్మీయశరీరము పాసినఁ, పాయంబుననైన నిలువఁ బాడియకాదే. 457

అని నిశ్చయించి,

ఎల్లవారుఁ జూచి యిది యేమి యనుచు నా, శ్చర్యమంద రయమెసంగఁ గత్తి
కరమునం దమర్చి కడఁగి యద్దేవకి, కొప్పు వట్టెఁ బెండ్లికూఁతు రనక. 458

గీ. చెలియలంట యించుకేనియుఁ జెట్టదలఁచి, యోటుఁగదంట కంసునకుఁ జేతు లెట్లువచ్చె
గడగడ వడంకు నక్కన్నెగళము వణుకఁ, గఠినచిత్తుల కెక్కడఁ గరుణ గలదు.

మ. కరవాలమ్మున నిట్టు లాపెగళమున్ ఖండించు నాలోన నా
తురుఁడై యవ్వసుదేవుఁ డడ్డపడియెం దోడ్తోన తత్పత్నిను

స్థిరులో యాదవవీరులెల్ల నకటా, చింతింపు మోఁదేని యి
క్కిరణిం జేయుదురే దురాత్మ! యని సంగ్రామాభిముఖ్యమ్మునన్. 460

వ. తలఁపడి హాహాకారమ్ము లొనర్చుచుఁ బోరాడునయ్యెడఁ గంసుం డబ్బాలిక విడిచి వారల మార్కొనియె నంత సంగరం బభంగురం బగుచు వృద్ధులెల్లరుఁ గంసు వారించి యనునయించి యిట్లనిరి. 461

చ. లలన వధించు టన్న మొదలం గడుఁ బాతక మంతఁబోక నీ
చెలియలు పెండ్లికూఁతు రొకచెట్ట యెఱుంగదు నీకు నెంతయుం
దలఁపఁగ మాననీయ యిటు దారుణకృత్యమొనర్పఁ జెల్లునే
చెలియలిఁజంపు దుర్మతులు శ్రేయముఁ జెందుట యెందుఁ గందుమే! 462

ఉ. అంబరవాణివాక్య మిది యంచుఁ దలంపకు మెవ్వఁడో యస
త్యంబునకుం దలంకక వృథా వసుదేవునియిల్లు గూల్ప నీ
కుం బహుదుర్యశంబు నొదఁగూర్పఁగ మాయలమారియై యిటుల్
పంబినయింద్రజాల మిది పాటిగఁ జూతు రఁటయ్య! ధీధుల్. 463

వ. అవశ్యమ్మునుఁ గాఁదగుకార్యమ్ము కాకతీర నొకవేళ నిది నిక్కంబుగ నంబర వాణియ పల్కిన నీకుం దప్పింప వచ్చునే యని బహుభంగులఁ జెప్పినఁ గంసుం డునుఁ జేయునదిలేక మిన్నకున్న వసుదేవుం డతని కిట్లనియె. 464

చ. తలఁకకు మందరున్ వినఁగఁ దథ్యముగాఁ బ్రతినం బొనర్తు నీ
లలనకుఁ బుట్టినట్టిశిశులం దగ నీకిడువాఁడఁ దక్షణం
బిఃమి హరింపు మిట్టి మరియాదకుఁ దప్పితినేని నాదుపూ
ర్వులు నరకాలయంబునకుఁ బోయెదివార లటంచుఁ బల్కినన్. 465

క. వసుదేవుఁ డాడి తప్పఁడు, వసుధాస్థలి గ్రుంగినన్ విభావసుఁ డస్త్రా
ద్రిసమీపమ్మునఁ బొడమిన, నసత్యమిది గా దటంచు నందఱుఁ గంసున్. 466

వ. తల విడిచి యొప్పించిన నతం డతనివాక్యమ్ము విశ్వసించి గతక్రోధుండై మిన్న కుండె. వసుదేవుండు భార్యతోడఁ దనగృహమ్మున కరిగి నిర్భయుండై యుండె.

క. పిమ్మట నద్దేవకి గ, ర్భమ్మున ధరియించి పూర్ణభరనముపేత
త్వమ్మునఁ గనియెఁ గొమరుల, గమ్మవివిలుకానికన్న ఘనుఁ డగువానిన్. 468

## దే వ కీ సు త వ ధ.

వ. అంత వసుదేవుండు దేవకింగాంచి తన ప్రతిన నెఱపందలఁచి యిట్లనియె. 469

క. వనితా! యీబాలునిఁ గం, సునిచేఁ జంపింతు ననుచు శోకింపకు మె
వ్వనివశమగుఁ బ్రారబ్ధ, మ్మును దాఁటఁగ ననుడు నిట్లు వొలఁతి వచించెన్. 470

క. తనదు పురాకృతకర్మం, బునకుం దీర్థాటనంబు మొదలగు సుకృత
మ్మున నాశ మబ్బకుండునె?, వినమే ధర్మవిధులైన పెద్దలపలుకుల్. 471

క. గురుతల్పగుండు కనకము, హరియించినవాఁడు బ్రహ్మహంతయు మద్యా
దరుఁడును బంద్రెండేఁడులు, కరము వ్రతం బెనసి శుద్ధిగాంచుట వినమే? 472

క. మనువు మొదలుగాఁ గలిగిన, మునులెల్లను జెప్పు ధర్మములు వమ్మలె? శా
స్త్రనియతిఁ బ్రాయశ్చిత్త, మ్మును బొనరుచునరుఁడు పాపముక్తుఁడ కాఁడే? 473

చ. అగునది కాకతీర దనుటంత వివేకము కాదు యత్న మొ
ప్పగుగతిఁ జేసి తత్ఫలము నందుట కానమె? యిట్లు కానిచో
నిగమములున్ మఖమ్ములు మునిప్రవరుల్ వరమౌషధమ్ము లా
దిగ నఖిలం బసత్యమ, మదిం దలపోయు ముపాయ మిత్తరిన్. 474

క. కేవలదైవాధీనత, భావమ్మున నెంచి చిన్నిపాపని విడువం
గావచ్చునె? ధర్మ్యమ్మగు, త్రోవన్ బ్రదికింపుమింత దుందుడు కేలా? 475

వ. నావుడు వసుదేవుం డిట్లను. 476

క. లలనరో! యత్నం బొనరుప, వలె నను టొప్పితివి దైవవశమగు యత్నం
బులఫల మనియెఱుఁగుము కే, వలయత్నమువలన ఫలము వడయుట కలదే? 477

వ. ఈ సంసారమ్మున సంచితప్రారబ్ధవర్తమానభేదమ్మునఁ గర్మంబు మూఁడు తెఱంగు లందు సంచితవర్తమానంబులకుఁ బ్రాయశ్చిత్తంబు నివర్తకం బగుఁ గాని ప్రారబ్ధం బునకుఁ గానేరదు. జీవుండు పూర్వదేహంబు విడిచి శుభాశుభకర్మానుసారంబుగ దివ్యదేహంబొండె యాతనాదేహం బొండె ధరియించి స్వర్గనరకమ్ముల ననుభవించి పదంపడి మరలఁ బుట్టుసమయమ్మునఁ గర్మబద్ధుఁడై జనియించి ప్రారబ్ధం బనుభ వించుఁ గావున నిబ్బాలుం డవశ్యమ్మును గంసున కీఁదగువాఁ డని మఱియును.

క. అరయ నసారమగు సం, సారమ్మున సత్య మొకటి సార మ్మగు నె
వ్వా రద్దానిఁ ద్యజింతురు, వారల జీవచ్ఛవములు వవరుహనయనా! 479

వ. కష్టసుఖమ్ములు లెక్కింపక సత్యమ్మునఁ బ్రవర్తించువారలకుఁ గ్రమమ్మున శుభ మ్ములు చేకుఱు నిక్కం బింత యెఱింగి యిబ్బాలునిఁ గంసున కిడ సమ్మతింపు

మనవుడు దేవకి శోకసంతప్తయై వేపమానయగుచుఁ గొమరుని వసుదేవున కిచ్చిన నతండు కంసునదవమ్మునకుం జను సమయంబున. 480

క. బాలకునిఁ గేలఁ గొని చిం, తాలేశము లేక కంసు దరి కరిగెడి న
చ్ఛీలుని వసుదేవునిఁ గని, వాలాయము మెచ్చి రెల్ల పౌరులు నధిపా! 481

క. ఇతఁడ మహాత్ముఁడు సత్యం, బితని యధీనంబు సఫల మీతని జన్మం
బితనికి నితరుల కెన్నఁగ, శతాంశ మంతరము సత్యసమ మొకఁడున్నే? 482

క. ఒడలి తడియైన నాఅని, కొడుకుం గంసునకు ఘాతుకున కిడుటకు నీ
తఁడు తడఁబడఁ డక్కట! యె, క్కడనేనియు నింత సత్యకర్ములు గలరే! 483

వ. అదంపడి వసుదేవుండు కంసునకు బాలకు నిచ్చిన నతం డతని ధైర్యమునకును సత్యమ్మునకును మెచ్చి నాకీబాలుండు మారకుండుగాఁ "దష్టమగర్భం" బనికదా యంబరవాణి వచియించె; నిర్నిమిత్తంబుగ నీని వధింపనేల? గృహమ్మున కరిగి నీవిం బోషించుకొమ్ము నావుడు వసుదేవుం డట్లొనరించెఁ. బిమ్మటఁ గంసుండు మంత్రుల కీ యుదంతంబు చెప్పిన వారును లెస్సచేసితివని సంతసించి యాత్మగృహముల కరిగిరి. 484

ఆ.వె. అంత నతనికడకు నరుదెంచె నారదుం, డమ్మునీంద్రునకుఁ గ్రమమ్ముగఁ దగ
నర్ఘ్యపాద్యకృతుల నర్పించి వచ్చిన, కారణంబు నడుగఁగా నతండు. 485

మ. పలికెం జిర్నగ వొప్పఁ గంస! వినుమీ బ్రహ్మాదు లెల్లందగన్
గలయం జేరి నిమన్ హరించుటకునై కంజాక్షునిన్ దేవకీ
తలునీపుత్రునిఁగా నొవర్త మని మంత్రం బాచరింపంగ నే
నెలమిన్ నింటి శిశున్ వధింప వకటా, యేమందు నీ తెల్వికిన్! 486

వ. నావుడుఁ గంసుం డష్టమగర్భంబు మన్మృతికింగారణంబని యాకాశవాణి నుడివెఁ బ్రథము వధింపనేల? యన నారదుండిట్లనియె. 487

మ. అరయం జాలవు దేవతల్ మిగుల మాయాకోవిదుల్ శత్రువుం
బరిమార్పం దగుఁగాని యల్పుఁ డనుచుం బాటింపఁగారాదు త్వ
న్మరణం బష్టమగర్భజాతవశ మైనన్ దక్కువారెద్దు రొం
దొరులంగూడి సహాయులైన భరమౌనో కాదో యూహింపుమా! 488

వ. అని యతం డరిగె నంతఁ గంసుండు మరల బాలకు రప్పించి యొక పాషాణ

మ్మునం బడవైచి సుఖం బుండె నావుడు జనమేజయుండు దుఃఖాక్రాంతుండై యిట్లనియె. 489

ఉ. పుట్టినతోడనే మరణముం గన నాశిశు వంతలోనఁ దాఁ
గట్టిన పాప మేది ? మునికాంతుఁడు నారదుఁ డిట్టి పాపసం
ఘట్టనకుం దలంక కిటు కంసునిఁ దాఁ బురికొల్పనేల ? యె
వ్వట్టునఁ గర్త, కారయిత, పాపమునన్ సమభాక్కు లేకదా ? 490

వ. నావుడు వ్యాసుఁడిట్లనియె. 491

ఉ. అమ్ముని సత్యవాది కలహప్రియుఁ డంతియకాని దీనఁ బా
పమ్ము గణింప లే దనుచుఁ బల్కఁగరాదు నరేంద్ర ! బాలష
ట్కమ్మిటు కంసుచేత మృతిఁ గాంచెను శాపము కారణమ్ముగా
బమ్మకునైనఁ గర్మపరిపాకము మిన్నక పోవ నేర్చునే. 492

వ. స్వాయంభువమన్వంతరమ్మున మరీచికి నూర్ణ యను భార్య యందార్వురు పుత్రులు గలిగిరి వారు కొండొకకాలమ్మునఁ గోమిరె యగు సరస్వతిం గవియ నుంకించిన విరించిం గాంచి పరిహసించుడు నతండలిగి "దైత్యయోనిం బుట్టుం" డని శపించిన నాషడ్గర్భులును కాలనేమికి సుతులై రెండవజన్మమ్మున హిరణ్యకశిపునకుం బుట్టి విజ్ఞానంబు కతన విరించి గుఱించి తపం బొనరించుటయు. 493

గీ. అతఁడు ప్రత్యక్షమై వారి కనియె నాఁడు, కోపయుక్తుఁడనై మీకు శాపమిచ్చి
తిని భవత్తప మిప్డు నామనము గరఁచె, వర మొసంగెదనన గర్భు లరసి యతని.

క. వర మిడఁగ నీకు నిచ్చ య, మరిన నమరదనుజసిద్ధ మానవులు మముం
బొరిపుచ్చలేమి యొసఁగుము, స్థిరజీవుల మగుదు మనుడుఁ జెచ్చెర నొసఁగెన్. 495

వ. అంత హిరణ్యకశిపుండు కొమరులంగాంచి నన్ను విడిచి మీరు చతురాననుం గుఱిఁచి తప మ్మొనరించి వరంబు వడసి యవమానించితిరి కావున మీరు నాకడ నుండఁదగరు. పాతాళమ్మునకుం బోయి యెల్లవేళ నిద్రాధీనులై చిరముండి పదంపడి దేవకీగర్భమ్మునం బుట్టునది. 496

క. వెనుకటి జన్మమ్మున మీ, జనకుండగు కాలనేమి జనియించును గం
సునిరూపముగొని యాతఁడ, జనియించిన యప్డ మిమ్ముఁ జంపెడు మనుచున్.

తే. శాపం బొసంగె నది కారణంబుగ షడ్గర్భులు దేవకి కుదయించి కంసునిచేఁ జచ్చిరని మఱియు నిట్లనియె. 498

గీ. కంసుచెలియలి సప్తమగర్భ మంతఁ, దాల్చె శేషాంశమున, దానిఁ దాఁబమా తొ
నర్చె నయ్యోగమాయ, జనంబు లాపె, గర్భ మెడలె నటంచు విక్లాంతులైరి. 499

వ. కంసుఁడును నైదవమాసమ్మున దేవకికి గర్భపాతంబొదవె ననుమాట విని సంత
సించె, నా శిశువును రోహిణీగర్భమ్మున వృద్ధిబొందుచుండె, నంత దేవకియు
మరలఁ జూలుదాల్చె. 500

క. ఎనిమిదవగర్భమున న, త్తవనిధి సరోజాక్షుఁ డెలమి ధరణీభారం
బును దీర్చి దేవకార్యం, బొనరింప వసించె నంతతోజ్జ్వలదీప్తిన్. 501

వ. అట్లు దేవతలందఱును దమతమ యంశమ్ముల నుద్భవించి రీ తెఱంగు సంక్షేపమ్ముగ
నాలింపుము. 502

క. వసుదేవుఁడు కశ్యపుఁ డ, వ్వసుదేవుభార్య యదితి పార్థివ! శేషాం
శసముద్భూతుఁడు బలరా, మసమాహ్వయుఁ డింక నొక్క మర్మము వినుమీ. 503

క. నరుఁడును నారాయణుఁడును, నరయఁగ ధర్ముని కుమారులని తెల్పితి న
న్నరుఁ డర్జునుఁడై పుట్టె, న్నరవర! కృష్ణుఁ డయి పుట్టె నారాయణుఁడున్. 504

వ. మఱియు ధర్మాంశమ్మున విదురయుధిష్ఠిరులును ననిలాంశమ్మున భీముండును నశ్వి
నుల యంశమ్మున నకులసహదేవులును సూర్యాంశమ్మునఁ గర్ణుండును బృహస్పతి
యంశమ్మున ద్రోణుండును యమరుద్రకామక్రోధమ్ముల యంశమ్మున నశ్వత్థా
మయుఁ బుట్టిరి. శంతనుండు సముద్రాంశమ్మునఁ బొడమె. 505

గీ. శంతనుండు సముద్రాంశ జనితుఁ డైన
కతనఁ బతి గాఁగ వరియించె గంగ యతని
వసువు భీష్ముండు, గంధర్వవరుఁడు దేవ
కుఁడు, మరుద్గణ మవ్విరాటుఁడు, నృపాల! 506

వ. కృపాచార్యుండును గృతవర్మయు మరుద్గణాంశసంభవులకా యెఱుంగునది. అరిష్ట
నేమిసుతుండగు హంసుండు ధృతరాష్ట్రుండు, కలి దుర్యోధనుండు, ద్వాపరంబు
శకుని, సోమప్రరువను యాదవుఁడు సువర్చుండను సోమపుత్రుండు, ధృష్టద్యు
మ్నుండనలాంశ సంభవుండు, శిఖండి రాక్షసాంశసంభూతుండు, ప్రద్యుమ్నుండు
సనత్కుమారుండు, వరుణుండు ద్రుపదుండు, లక్ష్మి ద్రౌపది పాంచాలీపుత్రు లేవు
రును విశ్వేదేవాంశజులు. 507

క. కుంతియు మాద్రియు నను నీ, యింతులు సిద్ధియును ధృతియు నృప ! గాంధారీ
కాంత మతి, వేలుపులరో, యింతులు పదియాఱువేలు కృష్ణునిభార్యల్. 508

వ. ఇంక నసురాంశజుల వివిపింతు. హిరణ్యకశిపుండు శిశుపాలుండు, విప్రచిత్తి జరా
సంధుండు, ప్రహ్లాదుండు శల్యుండు, కాలనేమి కంసుండు, హయశిరుండు కేశి,
గోకులమ్మున వధింపఁబడిన కకుద్మి యనువాఁడు బలిపుత్రుండగు నరిష్టుండు, అను
హ్లాదుండు ధృష్టకేతుండు, బాష్కలుండు భగదత్తుండు, లంబుండు ప్రలంబుండు,
ఖరుండు ధేనుకుండు, వారాహకిశోరులను నీ యిరువురు రక్కసులను జాణూర
ముష్టికులను మల్లులు, దితిపుత్రుండగు నరిష్టుండు కువలయాపీడంబను గజము,
బలిపుత్రి బకి, తదనుజుండు బకుఁడిట్లు సురాసురుల యంశమ్ములు ననేకు లుద్భవించి
రని వెండియు. 509

చ. అమరులు బ్రహ్మఁగూడి తను నారసి ప్రార్థనఁజేసి భూమిభా
రము హరియింపు మన్నపుడు రాక్షససూదనుఁ డిచ్చె రెండు కే
శములు సితాసితమ్ములు వెసఁ; హరి శ్యామలవర్ణుఁ డయ్యెఁ దె
ల్పమరెఁ దదగ్రజాతునకు నయ్యది హేతువుగాఁగ భూవరా. 510

వ. ఈయంశావతరణం బెవ్వారలు భక్తిభావమ్మునఁ జదువుదు రవ్వారికి సమస్త శుభ
మ్ములు కరతలామలకమ్ము; లట్లు దేవకీపుత్రుల నార్వురఁ జంపి యేడవగర్భంబు
పతితం బగుట యెఱిఁగి యష్టమగర్భమ్మును బ్రయత్నమ్మున హరింపఁ గంసుం
డున్నంత. 511

క. హరి దేవకికడుపున ను, స్థిరుఁడై వసియించె నపుడు దేవహితముగా
వరుదెంచి యోగమాయయుఁ, గర మలరారెఁ యశోదగర్భము నందుఁ. 512

ఆ. వె. గోకులమున రోహిణీకాంత కుదయించె, రాముఁ డంతఁ గాంతిధాముఁడగుచుఁ
గంసుఁ డతిభయమునఁ గారాగృహమ్మున, నుంచె దేవకిని మదోద్ధతుండు. 513

వ. అట్లుంచి భృత్యుల నట గావలియోగించె. వసుదేవుఁడును భార్యాస్నేహాయత్త
చిత్తుండై యాపెతో నక్కారాగారమ్ముఁ బ్రవేశించి కుమారోదయమ్ము చింతించు
చుండె నంత దేవకార్యార్థియగు విష్ణుండు దేవకీగర్భమ్మున నమరసంస్తూయమానుం
డగుచుఁ గ్రమమ్మునఁ వృద్ధిఁ జెంద దశమాసస్ఫూర్తి యయ్యె. 514

## శ్రీ కృష్ణో ద య ము.

గీ. శ్రావణమ్మునఁ గృష్ణపక్షమున రోహి, ణీకలితమైన యష్టమి నాకులత్వ
మడరఁ గంసుండు దైత్యుల నరసి పల్కె, "నష్టముం బిది గర్భంబు కష్టదంబు.

ఉ. దీన జనించుబాలకుఁడు తెల్లముగా ననుఁజంపు నిక్క మె
లైనను వీనిఁ జంపవలె నప్పుడు నిద్దుర పట్టఁగా వలెన్
లేనియెడన్ సుఖమ్ము లిఁక లేవు శ్రమంపడి మీర లందఱున్
బూనికఁ గాచి యుండవలెఁ బుట్టినతోడనె చెప్పఁగావలెన్." 516

వ. అని వారల నియోగించి గృహమ్మున కరిగి చింతావిష్టుండై నిద్రాదికం బెఱుంగక యొకభంగి నతఁడుండె. రక్కసు లందఱును దమతమ యాయుధమ్ముల ధరియించి జాగరూకులై కాచుచుండి రయ్యెడ దేవకి వసుదేవున కిట్లనియె. 517

క. అసహాయ నైననాకును, బ్రసవసమయమాయెఁ జేయుపని యే మిట ర
క్కసులు నలుగడలఁ గాపుగ, నసమానబలాఢ్యులుండి రకట! మహాత్మా! 518

వ. మున్ను నందునిపత్నియగు యశోదకును నాకును నొక్క సమయంబు గల దెట్లంటేని "నీకుం బొడము నపత్యంబు మన్మందిరమ్మున కనుపుము. మదపత్యంబు నీగృహమ్మున కనిపెద" నావుడు వల్లెయని యే నొప్పితి నిప్పు డప్పని యెట్లు సేయనగునని చింతించుచు గర్భభరం బాఁగఁజాలమి సిగ్గుఱి పతికిట్లను. 519

క. భరమాయె గర్భవేదన, యరుగుము సిగ్గాయె నిన్ను నరయఁగ నని న
త్వరమున మొగ మటుచేసి కొ, మరునింగనె మరుని నగు కొమరుగలవానిన్. 520

ఆ. వె. చెప్పనలవిగాని చెలువున నొప్పారు, చిన్నిబాలుమోము చెలువ గాంచి
పులకితాంగి యగుచు నెలమిని వసుదేవుఁ, బిలిచి శిశువుఁ జూపి పలికె నిట్లు.

క. కనుఁగొను మాముఖకాంతియుఁ, గనులవిశాలతయుఁ జెలువుగల మృదుకాయం
బును నెన్నఁడేని యిట్టిఁడు, జనియించెనె యేరికేని సదమలహృదయా. 522

ఉ. వచ్చెడివానికిన్ మిగులఁ జందము నందముఁ గల్గు నంచు ని
ద్వచ్చయ మాడుమాటలు వృథాయగునే యెటు లీఁగనేర్చె దీ
నిచ్చిఋతఁ జగమ్మఖిల మేలెడి తేజము వొల్చువానిఁ గా
ర్చిచ్చననొప్పుకంసునకు జీవవిఘాతికిఁ జేతులారఁగన్. 523

వ. అనవుడు వసుదేవుం డక్కొమరుమొగం బాలోకించుచు నితి కర్తవ్యతామూఢుండై యున్నంత నాకాశవాణి విశదాక్షరంబుగ నతనిం బిలిచి యిట్లనియె. 524

ఉ. అందఱు రక్షకుల్ నిదుర నందిరి నా పెనుమాయశక్తి, దీ
నందగు తల్పులిట్లు విడియె నా వలనన్, వినుమింక నడ్డు లే
దెందును; వేగ నీ శిశువు నెత్తి యురమ్మునఁ బట్టి గోకులం
బందు యశోదగేహమున యందిడు మేటికి సందియంబిఁకన్. 525

వ. నాపుడు వసుదేవుండు బాలకు నెత్తికొని విశ్వంభరుండై విస్మృతమ్ములగు నా యష్ట ద్వారమ్ములు దాఁటి యోగమాయాప్రభావమ్మున నేరికి నలక్షితుండై జవుజవ్వనఁ గాళిందీతటమ్మున కరిగి యది యెట్లు తరింపనగునని యెంచు నాలోన నయ్యది యా మోలబంటి యగుడుఁ జయ్యన గోకులమ్మున కరిగి నిర్జనంబగు మార్గమ్మున నందుని మందిరంబు సొచ్చి తద్ద్వారమ్మునఁ బశువిభూతిం జూచుచుండె. 526

గీ. అంత నందుని భార్యయం దవతరించె, యోగమాయాంశసంపన్న యొక్కబాల
దాని వసుదేవునకు నిచ్చి తనయుఁ గొనియె, దాదినెపమున వజ్జగదాదిదేవి. 527

వ. పిమ్మట వసుదేవుం డబ్బాలం గొని కారాగారమ్ముననున్న దేవకిప్రక్క నునిచి తానును సమీపమ్మునఁ జింతావిష్టుండై యుండునంత. 528

క. ఆ కొమిరె మెల్ల మెల్లన, ప్రాకృతబాలికయుఁ బోలె బహుమధురరవ
శ్రీకలితంబుగ నేడువ, నే కళవళమంది లేచి భృత్యులు గడఁకన్. 529

ఆ.వె. కంసుకడకు నేగి కనియె దేవకి పుత్రు, నరుగుదెమ్ము వేగ మనుడు నతఁడు
నరిగి తలుపుఁ దీయు మనుచు నవ్వసుదేవుఁ, బిలిచి యిట్టులనియె నలుక వొదవ.

క. ఎనిమిదవ గర్భ మియ్యది, వసుఁ జంపఁగ నెంచి దీన నారాయణుఁడే
జనియించు నంచు వింటిన్, దునుమంగా వలదె యిట్టి దుష్టుని శిశువున్. 531

వ. జాగుసేయక తెమ్మనుడు భయత్రస్తుఁడుంబోలె వసుదేవుండు చింతించుచు నబ్బాలం దెచ్చి కంసుని హస్తమ్మునంబెట్టిన నతండు సూచి సంశయగ్రస్తుండై నిజాంతర్గతమ్మున, 532

ఉ. ఏమిది! క్రొత్తపుట్టె మృష యెట్లగు నంబరవాణిపల్కు? మి
థ్యామతి నారదుం డనృతమాడునె! యివ్వసుదేవుమాయ నాఁ
గా మన మెట్టు లొప్పికొనుఁ? గాచెడివారలు చుట్టునుండఁ గ
వ్వామణి యేడవచ్చె! సుతుఁడక్కట యెక్కడికేగెఁ జిత్రమౌ! 533

క. కాలగతి విషమ మని చిం, తాలోలుం డగుచు బాల నంభ్రమునఁ గొని యా
ఖీలగతి బిట్టు వైచెన్, దూలి యుపలమందుఁ బడఁగఁ దుందుడుకు మెయిన్. 534

వ. అక్కలపాంసమం డిట్లొనర్చిన నబ్బాల కరమ్మునుండి జాతినంతన యుప్పరమ్మున
ఎగసి దివ్యరూపధారిణియై మృదుస్వరమ్మున నిట్లనియె. 535

క. ననుఁ జంపినంత నేమగు, వినుమో దుష్టాత్మ ! మిగుల వీరుఁడు నీకై
జనియించినాఁడు వృద్ధిం, గనుచున్నాఁడతఁడు నిజము గడతేర్చు నినున్. 536

వ. అని నుడివి తనంత నరిగెఁ బిమ్మటఁ గంసుం డతివిస్మితుండై తన గృహమ్మున
కరిగి బకధేనుకవత్సకప్రలంబముఖులం గాంచి యిట్లను. 537

ఉ. గోకులమందుఁగాని మఱి కొంకక యెచ్చటఁ గాని పుట్టు దు
ష్ప్రాకులఁ బాకులన్ విగతసంశయులై వధియింపుఁ డింపఁగ
న్నాకయి జాగరూకతఁ గనందగుఁ బూతన బాలహంత్రి దా
నీ కృతియందు నేర్పుగల దెంతయు నయ్యది మీకుఁ దోడగున్. 538

వ. ఇట్లు నియోగించి చింతావిష్టుండై యతం డుండె నంతఁ బ్రాతఃకాలంబయ్యెఁ
బదంపడి నందుండు సంతుష్టాంతరంగుండై పుత్త్రోత్సవం బొనరించె. 539

క. నందుఁడు పుత్త్రోత్సవ మా, నందగతి నొనర్ప నదియు నాలుగు దెసలం
బొందుపడెఁ గింవదంతిగ, నందంద చరించువారు లతిరభసముగన్. 540

వ. కంసుకడ కరిగి నుడివిరి. అంతకుమున్న యతండును నారదునిచే బోధింపఁబడిన
వాఁడగుట గోకులమ్మువంక నతిక్రోధమ్ముగలఁడై యుండె నంత, 541

## శ్రీ కృష్ణ లీలలు.

ఉ. పూతనఁ జంపె, ధేనుకు నపూర్వబలుగా వధియించె, వత్సకుఁగా
బాతకు నద్బకాసురునిఁ బట్టి యడంచెఁ, బ్రలంబుఁ జెండె, గో
జాతసురక్షపేఁతకు పెనగా గిరి యెత్తె నటంచు వించు న
త్యాతురుఁడయ్యెఁ గృష్ణునెడ నాత్మవధంబున నిశ్చితాత్ముఁడై. 542

వ. పదంపడి కేశియనురక్కసుం గూడ దునుమాడుట యాలించి యుపాయమ్మునఁ
గృష్ణు వధింప నెంచి ధనుర్యాగంబు నెపమ్మున బలరామ కృష్ణుల రప్పించువాఁడై
యక్రూరుం బనిచిన నతం డరిగి రథం బెక్కించుకొని వారలం దోడికొని వచ్చె
నంత, 543

గీ. ధనువు ఖండించి రాజుల దర్ప మడఁచి, గజము వధియించి చాణూరుఁ గనిమనంగి
ముష్టికునిఁ జంపి కలుని నిర్ఘూలఁజేసి, తోశలు హరించి రిపువు యుద్ధరతమెఱయ.

మ. సిగచేతం గొని పట్టి యీడ్చి సమరస్థేమాభిరామత్వ మొ
ప్పగఁ గంసుం బరిమార్చి లీలమెయి నంబాళ్ళంఖలల్ వాపి బం
ధగతుఁగా దండ్రి వదల్చి రాజ్యమునకు న్నాధుండుగా నుగ్రసే
నుఁ గడున్ వృద్ధు నలంకరించె హరి తన్ను న్నిర్జరుల్ మెచ్చఁగన్. 54

వ. పిదప వసుదేవుం డబ్బలరామకృష్ణుల కుపనయనం బాచరించి సాందీపనునొద్దకు విద్యాభ్యాసమ్మున కనిచెఁ బిదపఁడి వారు గురుకుల వాసమ్ము చేయుచు సమస్తవిద్యఁ నభ్యసించి ద్వాదశాబ్దమ్ములవారయి మధురాపురమ్మున సుఖమ్మున నున్నయెడ నల్లుని మరణంబు విని కలుషితాంతరంగుండైన జరాసంధుండు మధుర నరికట్టి ఘోరంబగుసంగరం బొనర్చి పరాజితుండై యరిగె నిట్లతం డేడుమార్లు కృష్ణునితో నెదిరి యోహటించి మ్లేచ్ఛాధిపతియగు కాలయవనుం బురికొల్ప వాఁడును యాదవ భయంకరుండై మధురపై నెత్తివచ్చినఁ గృష్ణుండు యాదవసమక్షమ్మున బలరాము నకిట్లనియె. 54

క. పాతకుఁడు జరాసంధుం, డీతని నంపించె వీఁడు నెంతయు బలవి
ఖ్యాతుండు ప్రబలపైన్యో, పేతుం డిత్తుఱవతోడఁ బెనఁగుట భరమౌ. 54

క. ధనమును గృహమును వీడియుఁ, దన ప్రాణము రక్షసేఁత ధర్మంబగు సౌ
ఖ్యవియతిఁ జొప్పడు నెయ్యెడఁ, దనకది పిత్రార్జితముగఁ దలఁపఁగ వలయున్.

వ. పూర్వార్జితంబగు దేశం బెల్లప్పుడుఁ దనకు భయజనకంబేనిఁ గులోచితం బని యట వసించుటకన్న శైలసాగరనికటంబున నేని నిష్కంటకంబుగ వసించుట సమంజసం బని పెద్దలు వల్కుదురు. 54

చ. హరి శయనించు నంబునిధియం దహితల్పమునన్ భయమ్మునన్
హరుడు వసించు రాజతకులాచలగహ్వరమందు నింకఁ ద
క్కొరుల గణింపనేల ? మన మొక్కమొగిన్ బురి వీడి ద్వారకా
పురమున కేగి సౌఖ్యముల పొందుట లగ్గని నాకుఁ దోఁచెడిన్. 55

వ. అప్పురవరంబు రైవతాచలంబుకడ సముద్రతటమ్మునఁ గలదనియు నతిమనోహరంబనియును గరుఁడుండు చెప్పె ననుడు యాదవులు సమ్మతించి సకుటుంబమ్ముగఁ దరలి బలరామకృష్ణపురస్సరులై కతిపయదినమ్ములకు ద్వారవతి కరిగి యప్పురమ్మునఁగల జీర్ణగృహమ్ములఁ బునరుద్ధరణం బొనర్చి సుఖం బుండిరి. పిదప బల

రామకృష్ణు లిరువురును నిర్జనమ్ముగు మధుర కేతెంచియటవసించు చున్నంత యవ
నుండు మరల నప్పురంబు ముట్టడించె. 551

చ. హరి పురి వీడి వైళ మసహాయతఁ దాఁ బదచారియై వెసం
బరుగిడె నంత వాఁడు వసమానరయమ్మునఁ బాదచారియై
యురిగెఁ బిఱుంద నీవరుస నయ్యదువీరుఁడు రక్కసుండు నో
కురువర! యేగిరంత ముచికుందుని యాశ్రమపుణ్యభూమికిన్. 552

వ. హరియు నయ్యెడ నంతర్ధానంబుచేసె నయ్యవనుండునట నిద్రించుచున్న ముచి
కుందుం గాంచి శ్రీకృష్ణుండని యెంచి తనకాలఁ దన్నుటయు నారాజర్షి మేల్కాని
క్రోధతామ్రాక్షుండై యవను భస్మసాత్కరించి కెలనఁ గృష్ణుం గాంచి నమస్క
రించి సన్నుతించెఁ బిదపఁ గృష్ణుఁడు బలరామసహితమ్ముగ ద్వారవతికరిగి యుగ్ర
సేనునిపై రాజ్యభార మ్మునిచి తాను యథేష్టమ్ముగ సంచరించుచుండె. 553

క. అసహాయశూరుఁడగు హరి, వెస నా శిశుపాలువలన విడిపించి సమం
జసగుణయగు రుక్మిణి రా. క్షసోపయమవిధి గ్రహించె జగములు వొగడన్. 554

గీ. జాంబవతి మిత్రవిందయు సత్యభామ, నాగ్నజితి భద్రయును లక్షణాతరుణియు
బేర్మిఁ గాళిందియును గృష్ణుఁ బెండ్లిచేసి, కొవిన భార్యలు సౌందర్యభమలు భూపః

క. ఆ రుక్మిణి శ్రీకృష్ణుని, గారామునఁ గూడి కొంతకాలమ్మునకున్
జారుతరగాత్రుఁ గవియెఁ గు, మారున్ బ్రద్యుమ్నుఁ గాంతిమహితాకారున్. 556

వ. అయ్యర్భకునకు జాతకర్మాదికం బొనర్చినపిదప మాయాకోవిదుండును బలిష్ఠుం
డునునగు శంబరుండు సూతికాగృహమ్మునుండి యా చిన్నిబాలు హరియించి
మాయావతి కొసంగిన హరి చేయునదిలేక చింతార్తుండై జగదంబ నిట్లు నుతించె.

క. మును బదరికాశ్రమమ్మున, మనమునఁ దగ నిల్పి భక్తిమై నిన్నుం గొ
ల్చినవాఁడ గానె, నాపైఁ, గనికరముగ మఱవఁ బాడిగా, జగదంబా! 558

ఉ. ఏ నెటు నిల్వనేర్తు జగదీశ్వరి! యెవ్వఁడొ గానరాదు నా
సూనుని సూతికాగృహముచొచ్చి హరించె, మదీయమాన మి
ద్దాన నడంగదే జననీ! దాసులదీనతఁ జూచి యోర్వఁ జ
న్నే! ఏగరే వినుమా జనులు! నీకు నొకింతయు లజ్జ పుట్టదే! 559

చ. నగరముచుట్టు కోటయుఁట! నాగృహ మెన్నఁగ మధ్యమందు నొ
ప్పగునఁట! సూతికాగృహము నారయువార లనేకులుండ నె

వ్వగ హరియించె బాలకు నవారణలీల ? మదీయపూర్వక
ర్మగతియ కాక వేఱొకటి గావఁగ రాదు నిమిత్త మియ్యెడన్. 560

గీ. ఏను బొరుగూరికింజన నెల్లయాద
వులను గాచుచు నున్నారు తెలివికలిమి
నెవఁడు హరియించె మత్పుత్రు నెంచి చూడ
నంబ ! నీమాయ యొక్కింత యమరదేవి. 561

గీ. మందమతులగు మాబోఁట్లకుం దరంబె
జనని ! నీదుచరిత్రంబు చందమెఱుఁగ
బాల గొనిపోవు చోరుండు పట్టువడక
యుండఁ గల్పించితివి మాయ యొరుల వశమె ? 562

చ. పతి పరదేశవర్తియగు పట్టున రోహిణి విక్రమౌ పతి
వ్రత బలరాము నెట్లుగనెఁ ? బాపవిదారిణి యన్యగర్భసం
గతు శిశువుం దగం దిగిచికాదె తదంగనయందుఁ గూర్చి పెం
చితివి జగత్ప్రసిద్ధము విశిష్టము నీమహిమం బొకింతయే ! 563

చ. సకలము చేసి పెంచి పెలచన్ హరియించెడితల్లి ! నాకుఁ బు
త్రకునిడి సంతసం బిడివదావవు తక్షణ మిట్టివేదనా
వికలమనస్కుఁ జేయఁ దగవే? సగవాఁడనె ? కాక నీకు వి
ట్టి కృతులు బల్ముదంబును ఘటింపఁగఁబోలు నెవం డెఱింగెడిన్ ! 564

క. దేవి ! తనూజాఁడు సుఖముల, తా వవియుమ సుతువిదావు తలిదండ్రులకున్
బ్రే వెడలటయని చెప్పుదు, రే వెఱవున విత్తు మొదలనే యిటులైనన్. 565

ఉ. ప్రీతిఁ ద్యజింప లేక కురరీగతి రోదన మాచరించు త
న్మాత గతిన్ దలంపు దయమాలినదానవు కాకుమమ్మ ! ప్ర
ఖ్యాతికిఁ జేటు దెచ్చుకొనఁగా మది నెంచకుమమ్మ ! నీవు గా
కీ తరుణిన్ భరింప నిఁక నెవ్వరు దిక్కు ? వచింపు మమ్మరో ! 566

ఉ. జన్న మొనర్తునో ? వ్రతము సల్పుదునో ? భవదంఘ్రులెంతయుం
దిన్నవిభక్తి సూనములు తెచ్చి యజించి ముదంబు గూర్తునో ?
కన్నసుతుం డొకించుకయుఁ గందుడు జెందక యుండెనేని నీ
కు న్నిఖిలాంబ ! యేమి యొడఁగూర్పఁగనేర నశక్య మేనియుణా. 567

చ. తనయునిఁ దెచ్చి నా కొసఁగి తద్దయు మోదము గూర్చు మమ్మ ! నీ
వని యగుఁగాని వేఁడౌకరు పాల్పడ రింతటిసేఁత కంచు మ
న్ననమెయిఁ గృష్ణుఁ డెంతయు ననాథగతిఁ బిలపింప నజ్జగ
జ్జనని కృపానుషంగయయి చయ్యన దర్శన మిచ్చె శౌరికిన్. 568

వ. అట్లు ప్రత్యక్షంబై యభయం బొసంగి నీకొమరుండు శాపకారణంబున శంబరునిచే హరింపఁబడి తద్గృహమ్మున నున్నవాఁడు మదనుగ్రహమ్ముకతనఁ బదియాఱవ యేట నవ్వానిం జంపి నీకడ కరుదెంచు నిఁక శోకింపకు మనవుడుఁ గృష్ణుండును రుక్మిణియు సంతసమ్మునఁ జెలంగిరని చెప్పిన వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. 569

క. నారాయణాంశమునఁ జె. న్నారెడి హరి కెఱుకపడని యనువున గుప్తా
గారముననున్న బాలుని. నేరీతి హరించె నిక్కమే విది చెపుమా. 570

వ. నావుడు వ్యాసుండిట్లను. 571

గీ. మనుజులు సురాసురు లోకింత మాయఁ గడవఁ, జాల రది యెంత కేనియుఁజాలు నెట్టి
బుద్ధిమంతునికైనఁ బొర యెసంగఁ, జేయు శాంభవి యేరి కజేయ నిజము. 572

## శ్రీరామాదులు కించిద్జ్ఞులనుట.

వ. క్షుత్తృణ్ణిందాతంద్రాభయశోకసంశయమోహహర్షాభిమానజరామరణాజ్ఞానగ్లానీర్ష్యాప్రీతిమదశ్రమమ్ములను నియ్యవి దేహజమ్ములగు భావమ్ములు. 573

ఉ. రాముఁ డెఱుంగఁ జాలెనె యరణ్యమునం దన కగ్రవర్తియౌ
హేమమృగమ్ము రాకయు మహీసుతపోకయు వజ్జటాయు వా
లో మృతిఁ జెందు టాదిగః బలుండగు రావణుఁ జంపి రాజ్యసు
శ్రీ మితిమీఱునాఁడు మును చెందిన బాముల నెవ్వ నేర్చెనే. 574

గీ. మాయ బలవతి గాదేని మనుజనాథ !, యెఱుఁగఁజాలెనె తన తండ్రి మృతిని నాతఁ
డింతయేటికి సీత యున్నెడఁ దెలియఁగ, వనచరుల నలుదిక్కుల కనుపనేల ?575

గీ. నాగపాశమ్ములను బడి నవయనేల ?, సీత నిర్దోష యనక కార్చిచ్చు నందుఁ
బడుట కొప్పఁగ నేల ? యూపై జనాప, వాదకుఁ దలంకి తా విడువంగ నేల ? 576

వ. పిమ్మటఁ దన పుత్రులగు కుశీలవులఁ గుశలవులని ముని చెప్పకున్న నెఱింగెనే ? ఇది యిట్లుండ జానకి పాతాళమ్మున కరుగుటయుఁ దమకుఁ గాలం బాసన్నం బగు టయుఁ దెలియ నేర్చెనే ? అట్లైన దమ్మునిం జంప నుంకించునే యని వెండియు,

క. మానవదేహము గైకొని, మానవరీతులఁ జెలంగె మహిమ మెదలి యా
శ్రీనాథుఁడు సందేహం, బూనఁగఁ బనిలేదు దీని కుర్వీనాథా! 578

క. మొదలం గంసునిబయమున, యదుకులమణి యరిగె గోకులావాసంబుం
బదఁపడి ద్వారవతిని దా, నొదిగె జరాసంధుభీతి యొదవినకతనన్. 579

గీ. ఎంత యన్యాయ మొనరించెఁ గృష్ణుఁ డకట!
యెఱిఁగి శిశుపాలుచే హరియింపఁబడిన
దాని రుక్మిణిఁ గైకొనె ధర్మవిదులు
మెచ్చుకొందురె విని జనమేజయనృప! 580

వ. మాయాయుక్తుండగు కతనఁ గదా! శంబరుఁడు హరించిన పుత్రు నెఱుంగఁజాలక దుఃఖించి పదంపడి దేవికతనఁ దెలిసి యానందించె నిదియునుంగాక, 581

ఆ.వె. సత్యయాజ్ఞఁజేసి స్వర్గమ్మునకు నేగి, యింద్రుతోడఁ బోరి యెలమిఁగల్ప
వృక్ష మల్ల సత్యగృహమునఁ బెరటిచె, ట్టుగ నొనర్చె శ్రీజితగతి నతఁడు. 582

వ. సత్యభామయు నానందమ్మునఁ దద్వృక్షంబు తన తోఁట నాఁటించి పతియగు శ్రీకృష్ణుని నారదునకు దానం బొసంగి పిదపఁ గనకమయంబగు కృష్ణ విగ్రహం బమ్మహామహుని కిచ్చి విడిపించె. 583

గీ. అరసి ప్రద్యుమ్నుఁ డాదియైనట్టి సుతుల, జాంబవతి తన్నుఁ బుత్రలాభంబు కొఱకు
దైన్యగతి వేఁడఁ గృష్ణుఁడు తపమొనర్పఁ, జనియె నుపమన్యునాశ్రమమునకు నధిప!

క. శివభక్తుండగు నమ్మౌ, ని వలనఁ బాశుపతదీక్ష నెఱిఁ గొని సన్న్యా
సవిధిమెయిఁ దపము సలిపెన్, బ్రవిమలుఁడై శివుని మదినిఁ బాదుకొలుపుచున్.

వ. ఇట్లు ప్రథమమాసమ్మున ఫలాశియు ద్వితీయమ్మున జలపాయియుఁ దృతీయమ్మున వాయుభక్షియునై పాదాంగుష్ఠాగ్రమ్మున నిలిచి పుత్రార్థియై తనుంగుఱిఁచి ఘోర తపం బొనర్చు నా హరికి హరుం డాఱవమాసమ్మునఁ జంద్రకళాధరుండై వృషభారూఢుండై యింద్రాదిసురలు పరివేష్టింపఁ బార్వతితోఁ బ్రత్యక్షంబై, 586

ఆ.వె. "వాసుదేవ! నీతపమ్మున కెద మెచ్చి, వర మొసంగ నిటకు వచ్చినాఁడఁ
గోరుకొమ్ము వలయుకోరికలెల్ల నే, నిచ్చునప్డు కొదవొకింత కలదె." 587

వ. అనవుడు గృష్ణుండు భక్తినమ్రుండై యద్దేవు పాదమ్ముల కెఱఁగి మేఘ గంభీర భాషణమ్ముల నిట్లు నుతించె. 588

గీ. దేవదేవ! జగన్నాథ! దివ్యమూర్తి!, సర్వభూతార్తినాశన! సకలలోక
కారక! సురారి హర! నీలకంఠ! శైల, జామనోహర! యజ్ఞఘ్న! శరణునీకు.

ఉ. ధన్యుఁడనైతిఁ బావనతఁ దాల్చితి జన్మము గణ్యమయ్యె సౌ
జన్యముగల్గె నీదుపదసారసముల్ గనుఁగొంటఁ జేసి; యే
నన్యముగోర ప్రీమయముల్లైన మహత్తరపాశజాలముల్
దైన్యమునొందఁజేసె నివి దాఁటఁగఁ జేయఁగదే! కృపామతిన్. 590

క. మానవజన్మంబెత్తిన, దానికిఁ గా నాకుఁ గష్టదశ చేకూరెన్
దీనఁ గృశియించు నాదగు, దీనతఁ బావంగఁ దగదె దీనశరణ్యా! 591

ఆ. వె. మొదట గర్భదుఃఖమును బొంది కంసు భ, యమునఁ బిదప గోకులమున కరిగి
గొల్లనగుచు నడవి గోవులఁగాచుట, కన్నఁగష్టమొందు గలదె గిరిశ! 592

గీ. గోపజన్మంగతింజేసి కొమరు దఱఁగి, యాలఁగాచుచు బృందావనాంతరమున
మంద భయపెట్టె మ్లేచ్ఛనాథుండు దానఁ, జేసి ద్వారవతీపురిఁ జేరినాఁడ. 593

వ. పిత్రార్జితంబగు మధురవిడిచి ద్వారవతి కేతెంచి యయాతి శాపంబుకతన రాజ్యం
బొల్లక యుగ్రసేనునియంద యునిచి యతనికి దాసుండనైతి. 594

క. ఎన్నిటఁ జూచిన సంసృతి, కన్నఁ జాదుఃఖంబు, ప్రీలకన్న నధర్మా
భ్యున్నతియుఁ, బారతంత్ర్యము, కన్నన్ బంధం బొకండు గలదే గిరిశా! 595

గీ. జాంబవతి రుక్మిణీతనూజాతులఁ దగ, నరసి సంతాన మిమ్మనివంత నేను
దనయునికిఁగా నొవర్చితిఁ దపము లజ్జ, వొదముచున్నది దీనిఁ జెప్పుటకు నాకు.

గీ. ముక్తినిడఁజాలు నిన్నుఁగాంచి మూఢబుద్ధి, నెవఁడు గోరెడిఁ దుచ్ఛమౌ నిట్టి ఫలము
కామినీప్రేరితుండనై గళితలజ్జుఁ, డ నయి కోరెద సంతానమునఘ! నిన్ను. 597

క. సంసార మెంతకేనియు, హంసాకర మంచు నెఱఁగి యేను విరతి నా
శంసింపఁ జాల గర్మ, ధ్వంసము భోగమునఁ గాని వఱలునె యెందుఁగా? 598

వ. శాపమ్ముకతన మాయానియంత్రితుండనై నారాయ ణాంశమ్మునఁ బుట్టిన నాకుఁ
గర్మానుభవం బింతతోఁ దీఱునేయని వగచు మాధవున కుమాధవుం డిట్లనియె.

క. పదియాఱువేలపై నేఁ, బదిమంది ముదితలు నీకు భార్య లగుదు ర
మ్ముదితల కొక్కొక్కరితకుఁ, బదిమంది కొమరులు గలిగి ప్రబలెదరు హరీ. 600

వ. అని నుడివి శంకరుండు విరమించినఁ బార్వతి ప్రణతుండగు నమ్మధుసూదనున
కిట్లను. నీవు లోకమ్మున నున్న గృహస్థులకెల్ల నొజ్జవై శతవత్సరమ్ములు సుఖ

మ్ముల ననుభవించి ద్విజశాపగాంధారీశాపమ్ములఁ గులక్షయం బగుడు దేహమ్ము
పరిత్యజించి బలరామసహితమ్ముగ దివమ్మునకు రాఁగలవు. 601

క. శోకింపఁదగునె ? విధివరి, పాకాగతమైన పనులపట్లః నవశ్యం
బే కార్యము గానున్నదొ, యాకార్యం బడ్డుపెట్ట నగునే యెందున్ ? 602

వ. నీ వవతారమ్ము చాలించి త్రిదివమ్మున కరిగిననమీఁద నష్టావక్రశాపమ్మునంజేసి
నీభార్యలు చోరులచేఁ బీడింపఁబడుదురని చెప్పి యదృశ్యులైరి. పిదపఁ గృష్ణుఁ
డును మునుమన్యునకు నమస్కరించి ద్వారక కరిగి సుఖం బుండె. 603

క. నరవర ! బ్రహ్మాదులకును, దర మని యెంచకుము మాయ దాఁటఁగఁ గర్మో
ద్ధరితఁ బరికొల్పుచుండుఁగా, బరరూపిణి మాయః పక్షపాతము కలదే ? 604

ఉ. ఇంతియకాని యాజగదధీశ్వరి కొక్కెడఁ బాక్షపాత మొ
క్కింతయు లేదు "జీవులకు నేగతిఁ గల్గినొ ముక్తి" యంచుఁదాఁ
జింతిలుచుండు లోకము సృజించియు మాయకులోనుజేయదే
వంతయుఁకున్ జడంబగుఁ దదర్థము యిట్లొనరించు భూవరా ! 605

క. మాయాయత్తులు దివిజులు, మాయామయు లసురులెల్ల మాయాధీన
ప్రాయులు త్రిమూర్తులును స్వే, చ్ఛాయత్తత నొప్పు నొక్క యంబికయ నృపా !

ఆ.వె. దేవికన్నఁ బరము దెలియంగరా దెందు, నామెపూజకతన నఖిలమొదవుఁ
దత్పదాబ్జభక్తి దవులని కులమునఁ, బొడమరాదు వినుము పుడమిఱేఁడ. 607

శా. జ్ఞానాసక్తి గురున్ భజించి వియతిం గావించి వేదాంత వి
ధ్యానం బొప్పఁగ నప్పరాంబిక మనమ్మందుఁగా దగ న్నిల్పి సం
ధానంబుం బచరించి విశ్వలవిధానజ్ఞానసంసక్తిమై
'నేనే దేవియు నేన బ్రహ్మ' మను దా నెవ్వండు వాఁడల్పుఁడే ! 608

వ. దీనికిం దక్కినఁవా దెన్ని కర్మంబు లొనర్చినను ముక్తుండుగాఁడు శ్వేతాశ్వతర
మహర్షులందఱు నిట్ల భవబంధవిముక్తులైరి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును తత్క
శ్రతమ్ములను సచ్చిదానందరూపిణి యగు నద్దేవిన యెల్లప్పు డారాధింతు రని చెప్పి
మఱియును, 609

క. నరవర ! ప్రశ్నంబుల కు, త్తరమిచ్చితిః భవభయమునఁ దగ నెయ్యేది నీ
వరసి యడుగం దలంచెదొ, పురాణములు వినుట కన్నఁ బుణ్యము గలదే. 610

ఆ.వె. సర్వపాపహరము సకల శుభప్రదం, బనఘ ముత్తమం బహర్నిశంబు
భక్తి వినెడివారి భవబంధములు వాపు, నిది పురాణములకు నెల్ల మిన్న. 611

వ. అని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లక్కథకుండు శౌనకాదులకుఁ
జెప్పుటయు. 612

క. లోహితసగోత్రభవ ! వి, ద్యాహితసుమనోమనోజ్ఞతత్త్వజ్ఞ ! మృదు
వ్యాహార ! హారహరస, న్నీహారయశోవిహార ! నిరుపమసారా ! 613

ఉ. కారుణికాగ్రగణ్య ! నృపకాంతశిరోమణికాంతిరంజిత
శ్రీరమణీయపాదయుగసేవనబంధురితాంతరంగ వి
స్ఫారయశోనుషంగపరిచారితసర్వదిగంతతుంగ వి
ద్యారతశిష్యసంగవితతాదర ! దుర్గయశాస్త్రినోదరా ! 614

విచిత్రవృత్తము. మహీయశ్చరిత్రా ! బహుస్తోత్రపాత్రా !
గృహస్థాత్మధన్యా ! బృహత్కీర్తిమాన్యా ! 615

గద్య.

ఇతి శ్రీ........తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను
మహాపురాణంబునందుఁ జతుర్థస్కంధము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము



## పంచమస్కంధము.

అసమానతేజ! పాండిత్యసద్భృశవిరతాన్నదానతత్పర! విద్యా
ర్థిసమేతపంక్తిభోజన!, కుసుమితసంతోష! బ్రహ్మగురుపోష్యా! 1

### శివకేశవతారతమ్యము.

వ. అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుం గాంచి, 2

క. శ్రీకృష్ణుని చరితమ్మును, మా కెఱుఁగం జెప్పితివి సమంజసముగ నే
మాకర్ణించితి మాను, శ్లోకునికథయందు శంక చొప్పడు ననఘా! 3

చ. హరి యవతారమైన జగదాద్యుఁడు కృష్ణుఁ డరణ్య మేఁగి శం
కరుని యజింప నాతఁ డెనకమ్మునఁ బార్వతితోడ వచ్చి మే
ల్వర మిదె యంటి శంకరుఁడు వారిజనేత్రుని కన్న నెక్కుఁడే!
పరమవిరుద్ధ మియ్యది కృపన్ వచియింపుము మాకు శాస్త్రమున్. 4

చ. మునులు మహామహుల్! వినుఁడు మున్ను పరాశరపుత్త్రుఁ డట్లు చె
ప్పిన చరితం గ్రహించి పృథివీపతి యాజనమేజయుండు వ్యా
సునిఁ గని పల్కె "నేల మధుసూదనునంశము కృష్ణుఁ డాచరిం
చెను దపమున్ శివుం గుఱిచి చెప్పుము సంశయ మయ్యె నమ్మునీ. 5

గీ. సృష్టిరక్షాప్రళయములు సేయఁజాలు
దేవదేవుండు సర్వసిద్ధిప్రదుండు
ప్రాకృతునిఁబోలెఁ గృష్ణుఁ డెప్పాటఁ జేసెఁ
దపము హరుఁగూర్చి యితని కతండు లొచ్చె?" 6

చ. అనవుడు వ్యాసుఁ డిట్లను జనాధిప! నీవనినట్లు కృష్ణుఁ డెం
దును నధికుండు శక్తుఁడు సమానమహామహిమాసుధాబ్ధిఁ దై

వను మనుజత్వ మంతకతనకా దన కయ్యెని సంభవించె, నొ
వ్వనె మనుజత్వ మందియును బాధ్యపురీతిని సంచరింపఁగన్‌॥ 7

మ. గురులం గొల్చుట, వృద్ధసేవనము, మ్రొక్కుల్ విప్రులం, దవ్విను
చ్చరపూజారతి, హర్షశోకనులు, స్త్రీసంసర్గము, న్నిత్యసం
సరిణవ్యాప్తియు లోభమోహము లవశ్యమ్మున్ ఘటించున్ గుణో
ద్ధురమౌ దేహమునందు నిర్గుణత యెందుం జొప్పడంబోలునే. 8

వ. మఱియు శ్రీకృష్ణ విధనమ్మునకును యాదవనాశనమ్మునకును నగ్రజగాంధారీ శావ
మ్ములు కారణమ్ములు, చోరకృతలుంఠన హరణాదికంబును నయ్యెడ నర్జును
ననమర్థతయుఁ బ్రద్యుమ్నానిరుద్ధహరణం బెఱుంగుమియు నివి మానవజన్మ సంభ
వమ్ములు. 9

క. హరి నారాయణముని య, ప్పరముని యంశంబు యాదవశిరోమణి సా
దరుఁడై యీతఁడు శివత, త్పరుఁ డగుటయు నబ్బురంబె॥ పార్థివముఖ్యా. 10

క. హరికి హరుఁడు కారణ మని, పరమామ్నాయమత మట్టి పరమాత్మ శివుగా
హరియంశ మవతరించిన, పురుషుఁడు కృష్ణుండు గొలువఁబోలదె యధిపా॥ 11

శా. ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యం డౌ నజుం, డయ్యుకా
రాంకుం డాతవితంద్రి విష్ణువు, మకారాంకుండు శంభుండు, త
త్సంకేతమ్మున మత్తరోత్తరము ప్రాశస్త్యంబు వాటిల్లు ని
శ్శంకగా బైఁ దగు నర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్. 12

వ. దానంజేసి శక్తికి సర్వోత్కృష్టతయు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కుత్తరోత్తరాధి
కతయుఁ గలుగు కతిన హరికి హరపూజనం బావశ్యకంబ యని వెండియు, 13

గీ. మూలరుద్రుని యంశంబు మూలముగను, బ్రహ్మవక్త్రంబునుండి సంభవము చెందె
నిచ్చమై నింక నొకరుద్రుఁ; డెల్లరకును, బూజ్యుఁ డీతఁడు వరములు పొందుపొంచె.

క. ఈ రుద్రుఁడె త్రిజగమ్ముల, కారాధ్యుం డనిన మూలమగు రుద్రుఁడు కాఁ
డే॥ రాజేంద్రా॥ యితనికి, సాంత దగు శక్తితత్త్వసాన్నిధ్యమునకా. 15

క. హా- యోగమాయితమునఁ, బరతంత్రుం డగుచు నెత్తు బహుజన్మము ల
ప్పు దృవ్యమగు మాయకు, హరియు హరుఁడు పజుఁడు దాను నఖిలామరులున్.

క. కనితెప్ప వేయునంతకు, జననము రక్షణము లయము సంధించెడి మో
హి యోగమాయ యద్దా, వినిఁ గనుఁగొన నేర రెంత నేర్పరులు నృపా॥ 17

క. హరి సూతికాగృహమ్మును, దఱలుట నందునిగృహంబు తనవాసముగాఁ
బొరయుట మధురాపురమున, కరుగుటయును యోగమాయ యలవరిఁచె నృపా. 18

వ. పిదప భీతుండై మధురాపురమ్ము విడిచి ద్వారక కరుగుటయు నయ్యోగమాయా బలంబని యెఱుంగునది. 19

క. పదియాఱువేలపై యేఁ, బదిమంది లతాంగులకును పై భార్యల కె
న్మిదిమందికి దాసుండై, మధుసూదనుఁ డుంట యోగమాయకతమునన్. 20

చ. నరవర! యొక్కకాంత తగునైపుణి గల్గినదయ్యెనేని య
బ్బురపువిలాసముల్ గొలిపి పూరుషు బద్ధునిఁ జేయుఁ జాలు నుం
దరులు పదాఱువేలకును దక్కినపూరుషుఁ డెట్టిఁడేని ద
త్పరుఁ డయి తత్ప్రతీవికరపంజరకీరముగాక తీరునే. 21

చ. అరయఁగ సత్యభామకయి యాహరి యాహరిధాము మేగి యు
ద్ధురగతి యుద్ధరంగమునఁ దొయ్యలి మెచ్చఁగ దేవనాథు నో
పరిలగఁ జేసి కల్పకము చయ్యనఁ దెచ్చి,ముదంబు గూర్చి సు
స్థిరముగ నాటునే పెరటిచెట్టుగ నట్టిఁడు కాకయుండినన్. 22

చ. అదియునుగాక చైద్యునకు నంగనగా గురుదత్తయైన య
మ్మదవతి రుక్మిణిం గలన మర్దితశాత్రవుఁడై హరించి యా
త్మదయితఁ జేసికోలు నొకధర్మమె? యన్యకళత్ర మెంత ధ
ర్మదళకుఁ దప్పువాఁడును గ్రమమ్మెదఁ జేసి హరింపఁ బోలునే? 23

గీ. ప్రకృతిజన్యంబు హరిహరబ్రహ్మమూల, మగు నహంకారమున జగ మవతరించెఁ
దద్వశుండయి మోహంబు దవిలి ప్రాణి, చేయుఁ దత్తత్కృతులు మంచిచెడ్డయనక.

గీ. బ్రహ్మయైన నహంకారవశుఁడు కాక, యున్నవేళ విముక్తుఁడై యుండు దానిఁ
దవులుచో సంసరణకృతితత్పరత్వ, మంది తత్తద్విశేషము లలవరించు. 25

చ. అది విడువాఁడె ముక్తుఁడు, మహామహుఁడైనను నయ్యహంకృతిం
బొదలెడివాఁడె బద్ధుఁడగుఁ బూరుషమాత్రున కంగనాదిసం
పదలును గేహముం సుతులు బంధము లందురు నేని కెక్కుడై
నది యని చెప్పఁగాఁదగు నహంకృతి నిక్కము పార్థివోత్తమా. 26

గీ. ఏ నొనర్చెదివాఁడ నాచే నొనర్పఁ, బడియె నింతటికార్యంబు బలియురందు
నధికుఁడను నేనటంచు నహంకృతిం ద, వలి నరుఁడు బంధనమునఁబొరలు నరేంద్ర.

వ. మృద్విహీనంబగు ఘటంబుపగిది నహంకారశూన్యంబగు వస్తువు దుర్లభంబు; కారణవిముక్తంబగు కార్యంబు లేమి శాస్త్రప్రసిద్ధంబకదా ! యని మఱియును. 28

గీ. అస్మ్యహంకారసంపర్క మందు కాదె, యెల్లజగములు పాలించు నిందిరేశు డట్లుకాకున్న నతఁడు దుఃఖాబ్ధి మగ్నుఁ డగునె యవతారముల నెత్తి యవనినాథ !

వ. అహంకారనిర్ముక్తులరు మోహంబును సంసారమ్మును లేకుండు మఱియు బ్రహ్మాదులగుపురుషు లెల్లరును సాత్త్వికరాజసతామస భేదమ్ముల మూఁడు దెఱఁగుల వారు. వీరియం దెల్లప్పుడును త్రివిధంబైన యహంకారంబు వర్తింపఁ దవ్వద్దుండై మాయామోహితుండై యనేకావతారమ్ములఁ దవిలి తత్తదనుగుణమ్ముగ హరి గ్రుమ్మరు నట్లు కాదేని యెట్టి మందుండును వాంఛింప నొల్లని పరమసంకటమ్మగు గర్భవాసమ్మున కతఁ డియ్యకొను టెట్లు ? 30

క. అతివిష్ఠామూత్రాసం, గతి హేయంబైన దేవకసుతాగర్భ స్థితికిఁగా హరి యాత్మపద, చ్యుతుఁడై రానేల తాన యొడయం డైనన్ ? 31

ఆ.వె. బ్రహ్మమొదలు స్తంబపర్యంతము జగంబు, యోగమాయవశత నొప్పు దావి నుడిపి యుడుపలేక యూర్ణనాభియుఁబోలె, హరిహరాదులందు రవనినాథ. 32

క. అనవుడు జనమేజయుఁ డి, ట్లను యోగీశ్వరి మహామహాత్మత నాకుఁ మునివర ! చెప్పితి వద్దా, విని వెండియు వినఁగవలతు నీదగుకరుణన్. 33

ఆ. వె. మూఁడుమూర్తులకును మూలభూతంబయి, యఖిలజగము తానయై వెలుంగు దేవదేవిమహిమఁ దివిరి వినకయుండు, చెనఁటి యెందుఁగలఁడె చెప్పు మనఘ.

వ. నావుడు వ్యాసుండిట్లను రాజేంద్రా ! యియ్యది శ్రద్ధగలశాంతునకు నుడువఁదగినది యని యెఱుంగుము. మున్ను మహిషుండను రాక్షసరాజు కాలమ్మున దేవదానవులకు ఘోరంబగు యుద్ధంబు జరిగె నది యెట్లంటేని. 35

క. కనకగిరి కేగి మహిషుం, డనిమిషులకు నెల్ల విస్మయము గదురఁగఁ జే సెను వర్షాయుతము తపం, బును బరదేవతను హృదయమున నిల్పి నృపా. 36

## మహిషాసురోత్పత్తి.

క. ఆ తపమున కెద మెచ్చి కృ; పాతత్పరుఁడై విరించి వర మిడుటకునై యేతెంచి కోరుకొ మ్మన, నాతని కమ్మహిషుఁ డిట్టు లనె భక్తి మెయిన్. 37

వ. మహాత్మా ! నాకుం గూర్తేని మృత్యువులేమిఁ బ్రసాదింపు మనవుడు నతం డిట్లనియె. 38

క. పుట్టినవారలు, గిట్టుట, గిట్టి మరలఁ బుట్టుటయు నిఖిలజీవుల కె
ప్పట్టునఁ దప్పనియది వీ, కెట్టుగ నీవచ్చు మృత్యు వెడఁజేయంగన్. 39

వ. భూభూధరసముద్రాదికంబులకైనను గాలవశమ్మున నాశమ్ము దప్ప దట్లుండ నీకెట్లు మృత్యుభయంబు లేకుండ వరం బొసంగుదు? నొక్క యుపాయమ్ము చెప్పెద మరణమ్మున కొకింతయేని యవకాశం బునిచి కోరుకొమ్మనవుడు వాఁ డిట్లనియె.

క. సురదైత్యమానవులలోఁ, బురుషుఁడు ననుఁ జంపకుండఁ బూరింపుము నా వరమాఁడుది నను జంపం, దరిమే యద్దాని నొక్కతన్ విడువు మొగిజా. 41

క. అనవుడు నీకెప్పటికే, విని మానినివలనఁ దొడరు నిధనం బిఁకఁ ద క్కినవారివలన భీతిం, గొనకుము నీవంచు నేగెఁ గువలయనాథా! 42

వ. అంత నా రక్కసుండును సంప్రాప్తమనోరథుండై నిజనికేతనమ్మున కరిగె నావుడు "వాఁడన నెవ్వఁ డేకతమ్మున మహిషాకారంబు సంపాదిల్లె, నెవ్వనికొమరుం డెఱింగింపవే" యనుడు వ్యాసుం డిట్లను. 43

క. రంభకరంభులు మహితా, రంభులు నిరుపురును సుతులు ప్రబలుదు రతి సం రంభునకు దనుపునకు వా, రంభోజాప్తునికి నెక్కు డగుదురు దీప్తిజా. 44

వ. అయ్యిరువురును సంతతిలేమిం జేసి బహువత్సరమ్ములు తపంబొనర్చి రందుఁ గరంభుఁడు పంచనదమ్మున జలమగ్నుండయ్యును రంభుండొక్కయూరుహం బాశ్రయించియు ఘోరంబగు తపం బొనర్చుచున్నంతఁ దత్తపోభీతుండగు నింద్రుం డటకేతెంచి మొసలియై యప్పంచనదంబు సొచ్చి కరంభుని పాదమ్ములం బట్టి వధింపిన రంభుండు భ్రాతృమరణదుఃఖితుండై, 45

క. మన మెరియఁగఁ దన శీర్ష, మ్మును వహ్నికి నీఁగ నెంచి మొగిఁ దెగనఱుకం గను దక్షిణకర మాయుధ, సనాథముగఁ జేయుడుజా గృశానుఁడు పేర్మిన్. 46

చ. ఎదుటికి వచ్చి "శీర్ష మిటులేటికిఁ ద్రుంచెద వాత్మహత్య చే
యఁదగునె? చేయుడున్ బరమునందు సుఖం బెదయో భవత్తపం
బెదకు సుఖం బొసంగెఁ గోను మిచ్చెద నీకు వరంబు, వచ్చి యె
ద్యేది గోనువాఁడ వీ" వనుడు సద్దనుజుండు నిమ్ముక్తశీషుఁడై. 47

గీ. దే॰ నాయొక నీకు సంతృప్తియేని, కామరూపియు నఖిలలోకవిజయియును
అమరదానవమానవాద్యఖిలవీరు, లకు జయింపఁగరాని పుత్రకుని నిడుము. 48

వ. నావుడుఁ బావకుం డట్లగుంగాకేమి యిఁక మరణోద్యోగంబు విరమింపుము, నీ

కెయ్యది గూర్చి సద్దానియంద యిట్టి పుత్రుండు వొడము ననుచు రంభుం డప్పీతి హోత్రున కెఱఁగి వీడ్కొని యరుదెంచువాఁడు ముందట యక్షరక్షితంబగు నొక్క మనోహర ప్రదేశమ్మున నున్న మహిషి నతిమత్త నందంబగుదానిఁ జూచి కామించిన నయ్యదియు రంభుం గలయుట కియ్యకొనియె నంత భావికార్యవశమ్మున రంభుండద్దానితో రమించి గర్భియగు దానిం గొని యితర మహిషంబులవలని భయము దొలఁగించుచుఁ బాతాళమ్మునకుఁ దోలికొని చనియె. 49

క. ఒకనాఁడమ్మహిషిని వే, తొకమహిషము చూచి మోహయోగమ్మునఁ దా
శకపైకొన నుంకించినఁ, బ్రకోపనుఁడు దానిఁ గొట్టె రంభుఁడు కడఁకన్. 50

వ. అంత మహిషంబును దనకు విఘ్నకారియగు నద్దనుజుని శృంగంబులం బొడిచి యెత్తి మృతునిం గావించిన నమ్మహిషియు భర్తృ మరణమ్మునకు శోకించుచుఁ దనపూర్వనివాసమ్మునకుం జని యక్షుల శరణుఁ జెందె; నవల దానిపిఱుందన యమ్మహిషంబును గామార్తంబగు కతన నరిగి యయ్యక్షులతోఁ బెనంగి తచ్ఛరతాడితంబయి ద్రెళ్లె. పిదప యక్షులు నమ్మృతదనుజకళేబరముం గొని తెచ్చి యమ్మహిష శవంబుతోఁ జితాసంస్కారంబు చేయనుంకించిన నమ్మహిషియు సహగమనపరాయణయై యక్ష నివారితయయ్యు వెనుఁదీయక యయ్యనలమ్మునం బడియె. మీఁదఁ జితామధ్యంబునుండి మహిషుండును రక్తబీజుండు నను నిరువురు రక్కసులుదయించి రందు మహిషుండు రాక్షసులచే రాజ్యాభిషిక్తుండయ్యె రక్తబీజుండును మహాసురుల కనధ్యుఁడై చరియించుచుండె నిట్లు చతుస్సముద్రముద్రితంబగు ధరామండలంబు నమ్మహిషుం డేకచ్ఛత్రమ్ముగ నేలుచుండి మహాబలుండగు చిక్షురుండును సేనాయుతసమావృతుం డగు తామ్రుండును నసిలోముండును మదర్కుండును బిడాలుండును బాష్కలుండును ద్రిణేత్రుండును గాలబంధకుండును దనకు సేనానాయకులుగా రాజవర్గంబు లరిపెట్ట విపుల జన్మమ్ములు కలఁచును మదోద్ధురుండై యొక్కనాఁడు. 51

మ. వరదానోద్ధతగర్వుఁడై యతఁడు స్వర్వాసంబు వశ్యంబుఁ జే
యురహిన్ సేవకుఁ బంచె "యింద్రుఁడువమన్ యుద్ధమ్మునన్ గెల్చునో
శరణం బంది దివంబు నా కిడునో నిస్సందేహ మారీతి నా
సురనాథుం గని నిశ్చయింపఁ దగు" నంచున్ జెప్పి విప్రీతిమై. 52

వ. అంత దూత దివమ్మున కరిగి యింద్రున కిట్లనియె. 53

చ. విను సురనాథ! నే మహిషవీరునిదూత నతండు పంప విన్
గమఁగొన వచ్చినాఁడ నిఁక గర్వము చెందక వీడు వీడి మా
జనపతి సేవకుండ వయి చక్కఁగ నుండెద వొండె యుద్ధముం
బనుపడి చేసె దొండె నొకపద్ధతి సేయుము నాఁగ నింద్రుఁడున్. 54

ఉ. వానికి నిట్లు పల్కు బలవద్రుష "నోరి మదాంధ! యిట్లు క
న్గానక నీవిభుం డనిపెఁ గా విను! మంచిది వానిరోగ మె
ట్లేని యడంతు నాయెదుట నిట్లనఁ జెల్లునె నీకు? దూతయౌ
వానినిఁ జంప రామి విడువంబడి నీపతి కిట్లు చెప్పుమా. 55

ఉ. ఓమహిషీకుమార! నను యుద్ధమునందు జయించు నిచ్చ నీ
కీమెయిఁ బుట్టెనే! తృణము లెంతయు మెక్కుటచేత మిక్కుటం
బై మద మెక్కెనే! జడుఁడ వంచు నెఱుంగుదు నిన్ను నీకు ను
ద్దామత నిచ్చశృంగములఁ ద్రవ్వి తగం బొనరింతుఁ జాపమున్." 56

వ. అనవుడు దూత వైళంబ చని మహిషుం గాంచి నమస్కరించి యిట్లు విన్నవించె.

క. విను గణియింపక సురపతి, పనిచిన పలుకులను జెప్ప భయమొదవెడి నా
విని విడిచి నీకుఁ బ్రియమగు, ననృతము వచియింప నర్హమగునె తలంపన్. 58

క. ప్రియమును సత్యముఁ బల్కుట, య యుచిత మగు భృత్యునకు నృపాగ్రమ్మున నేఁ
బ్రియమఁగ వినిచితి నేని య, దియు నీకార్యమ్మునకుఁ బ్రతిఘటించు నొగిన్. 59

చ. ఇఁక రిపుఁడెట్లు పల్కె నటులే వచియించెద నన్న నెందు సే
వకునకు శోభనార్థి కిది భావ్యము గాదు రిపుల్ వచించు ఫ
క్కిక యన మిత్తి పల్కులను గేలి యొనర్చు నెటుల్ వచింతు న
ట్టి కుటిలవాక్యముల్ గలన డీకొను మార్తురమాడ్కిఁ దెంపునన్. 60

క. అని హేతుగర్భముగఁ జె, ప్పిన పల్కుల యర్థమును సవిస్తరముగఁ గై
కొని పెచ్చు పెరుఁగు కోపం, బున మహిషాసురుఁడు గర్వమూర్ఛితుఁ డగుచున్.

శా. లాంగూలమ్మును బృష్ఠదేశమున వాలాయమ్ముఁ గీలించి భ్రూ
భంగం బొప్పఁగ నెఱ్ఱనౌ కనులు కోపం బంతటన్ గ్రుమ్మరిం
పం గై పెక్కడు మూత్రము న్విడుచుచున్మత్తాత్ముఁడై యింద్రుఁడి
బ్బంగిం బల్కుట వింటిరే యిఁక వధింపం బోలదే దుష్టునిన్. 62

ఉ. వాఁడన నెంత, వానిబలవైభవ మెన్నఁగ శాంతులందు, మా
రాడవిశాపనోత్తములయందుఁ బరాంగనలందుఁ జెల్లఁ బో
రాడుట కప్పరోంగనల కౌనె తపమ్ము లడంచు భంగిఁ? దూ
టాడెదఁ గోటియింద్రు లొకటైన యని నన్నెదిరించిరేనియున్. 63

క. నముచిం జంపెను విశ్వా, నము చొప్పడ సంధిఁజేసి శపథమ్ములకుం
గ్రమ మెడలి; యట్టి దుష్టున్, క్షమింప సజ్జనుఁ డెట్లు సంతసమెసఁగున్. 64

వ. ఇది యిట్లుండఁ దత్సహాయుండగు హరియు నిట్టిఁడ యది యెట్లంటేని, 65

క. కపటాచార్యుఁడు కుహకుఁడు, శపథాంతరుఁ డతఁడు మున్ను చంపఁడె కిటి య
న్నెపమునఁ గనకాక్షుని సిం, గపుమానిసియై హిరణ్యకశిపు బలాఢ్యున్. 66

వ. కావున నింద్రోపేంద్రులయెడ విశ్వాసం బెగ్గగు నాకీ దేవపతి యన నెంత? మహా
దేవుం డెదురైనను నాకిఁ గడంగుదు. 67

ఉ. కావున నష్టదిక్పతుల గర్వమడంచి నిలింపసంతతుల్
చేవకుఁదక్కి దైన్యమునుఁ జెంది కృశింపఁగ నాకలోకసు
శ్రీవిభవంబు గైకొని యశేషమఖమ్ముల విప్రభాగముల్
కేవల రాక్షసార్థముగఁ గీల్కొనఁజేసి చరింతు నెంతయున్. 68

క. సురనరకిన్నరు లాదిగఁ, బురుషులు నముఁ జెనకఁ దగరు పూఁబోఁడికి నన్
బొరిఁగొనఁ దరమే? నాదగు, వర మెఱుగరె, యొకఁడు మనకు వశ్యుఁడు కాఁడే.

వ. మీరు పాతాళమ్మునకును బర్వతమ్ములకును జని యచ్చటచ్చట నున్న దానవులం
బురికొల్పికొని యచికిఁ గడంగునది యని వెండియు, 70

ఉ. ఏనొకరుండనే సురలనెల్ల జయించెద మత్తుఘాహతిం
బూనియు నాదుశృంగములపోటుల నాటియు నెవ్వఁడేనియుం
బ్రాణములం ద్యజింపఁడె? దురమ్మున జానటయేల? నిక్కమో
దానవులార! మీరలును దక్కటియోధులు నాకలంకృతుల్ 71

మ. నవమందారసుమస్రగావళులతో నాకాంగనాసౌఖ్యవై
భవలీలన్ దులఁదూఁగుచున్ నిరతసంపద్ధాత్రియౌ కామధే
నువుపాల్గ్రోలుచు నాకలోకమునయందున్ మీరు క్రీడల్ నెవ
ర్పవలెన్ రక్కసులార! సంగరసమారంభస్థితిన్ నిల్వఁడీ. 72

చ. విరతము నాటపాటలకు నేర్పరులై గడిఁదేఱినట్టి సుం
దరులగు రంభ యూర్వశి ఘృతాచి తిలోత్తమ మేనకాప్రమ
ద్వరలును విప్రచిత్తియును దక్కటి యచ్చరలున్ బ్రమోదబం
ధురలయి మిమ్ముఁ గొల్వఁ దమలం దూఁగుఁడు నందనమందు దానవుల్ । 73

వ. అని చెప్పి సేనాసంరక్షణార్థంబుగాఁ బురోహితుండగు భార్గవుం బిలిచి పూజించి మహిషుండున్నంత. 74

చ. దివిజవిభుండు సత్వరగతిన్ దిగధీశులఁ బిల్వఁ బంచి వా
రు వినఁగ నిట్లు పల్కెఁ. మదమూర్ఖుఁడు రంభసుతుండు బ్రహ్మద
త్తవరమహోద్ధతుండు సురధామము గైకొన నెంచి సేనకుం
బవరముసేఁతకై పిలువఁబంచె వినుం డతఁడాడుమాటలన్. 75

చ. ప్రమద మెలర్ప మామహిషరాజునకున్ శరణాగతుండవై
యమరులతోఁ బనిఁగొనుచు నాతనిభృత్యుఁడవౌటయొండె యు
ద్ధమునకు వచ్చుటొండె నొకదానికిఁ బూనుము మావిభుండు కో
పమెఱుఁగడెప్డు భృత్యులను బాలనసేయు దయాంబురాశియై. 76

## ఇంద్రుఁడు విమర్శించుట.

వ. అని చెప్పి యమ్మహిషదూత చనియె నియ్యెడ మనకుఁ గర్తవ్యంబు నిర్ణయింపుఁడు శత్రుండు దుర్బలుండైనను క్షమింపఁదగదు జయాపజయమ్ములు దైవాధీనమ్ములయ్యును యత్నంబు నవశ్యకర్తవ్యంబు. 77

గీ. సంధియోగంబు ముఖ్య మాసంధి యిట్టి
ఖలునియెడ విషమించు విక్రమముగ యాన
మైన యోజింపక యొనర్పు టనభిమతము
తన బలముఁ బరబలమును దలఁప వలయు. 78

వ. కావున వాని సైన్యాదివివేచనం బొనర్ప నొక్కనిం బుచ్చి తెలిసికొనుట యుచితం బని యొక్క ప్రణిధిం బంచిన వాఁడును నతి త్వరితగమనమ్మునం జని మగుడ వచ్చి యవ్వాని బలవిశేషమ్ములం జెప్పిన వాసవుండు విస్మితుండై మంత్రవేదియగు పురోహితుం బిలిచి యిట్లనియె. 79

క. దానవుఁడు మహిషుఁ డున్నత, సేనావృతుఁ డగుచు మనకుఁ జెట్ట దలఁచి తా
రా నుండె నిట, నుపాయము, దీనికి యోజించి యొకటిఁ దెలుపుము దేవా! 80

వ. దానవులకు శుక్రునట్లు మాకీవు సర్వకార్యప్రవర్తకుండవు విఘ్నపరిహర్తవు ననుడు
బృహస్పతి సురేంద్రా! వ్యసనంబు సంప్రాప్తంబగుడు బుద్ధిమంతులు ధైర్యంబు
వీడ రిట్లగుట నీవు ధైర్య మవలంబింపుము. 81

క. అగునది కాకుండదు దై, వగతికిఁ బ్రతిసేయఁగల్గు వారమె? చేయం
దగునైనను దోఁచిన య, ట్లగణితమగు యత్నమును సురాధిప వింటే. 82

వ. దీని నెఱింగియే కదా మునులు ముక్త్యర్థంబు సంతతధ్యానయోగమ్ముల యత్నింతురు.
పురుషకారంబు లేకున్నఁ గేవల దైవంబు కతనఁ గార్యంబు నెఱవేఱ దది యెట్లన్నఁ
జీఁకును బిచ్చుకుంటును నన్యోన్యసాహాయ్యంబు లేమి నకించిత్కరులయ్యు నది
గల్గినఁ గృతకార్యులగుట రా కెట్లగుఁ, బురుషకారంబు గల్గియుఁ గార్యసిద్ధి యల
వడకుండు నచ్చోట దూషింపఁదగ, దయ్యది రథసైన్య మంత్రాదికంబుల నుండక
దైవాధీనంబై యుండు నెట్లంటేని. 83

చ. బలియుఁడు క్లేశ మందుట యపాస్తబలుండు సుఖమ్ము చెందు టు
జ్జ్వలమతిగల్గుధీజనకు సంపద లేమియుఁ దెల్విలేనివాఁ
డలఘుగతిన్ మహావిభవ మందుట శూరపరాభవంబు భీ
తులవిజయంబు నన్నది బుధుల్ పరికింతురు దైవికంబుగా. 84

సీ. కాఁదగు దానికి గతి దైవ మని యత్న • మొనరింపు మవల నయ్యుద్యమమ్ము
ఫలియించు నొండె విఫలమగు నొండెఁ గా • కయ్యెడ హర్షశోకాప్తి గనఁగఁ
దగ దధైర్యంబు సంతాపకారణమగు • దుఃఖయోగం బాత్మఁ దొడరు నవ్వి
డెయ్యది దుఃఖమే నెవ్వఁడ నిరువది • నాలుగు పీడిన నాకు నిర్గు

ఆ. వె. ణాత్మకునకు దీన నయ్యెడిదేమి? యాఁకలియు దప్పి ప్రాణగతములు సుఖ
దుఃఖములు మనమ్ముతో నుండు జరయు మృత్యువు శరీరమునకుఁ దొడరుమఱియు.

వ. షడూర్మిరహితుండనగు నేను శరీరంబొండెఁ దత్సంబంధి నొండెఁ గాను, చతుర్విం
శతితత్త్వభిన్నుండనగు నేను సదానందుండఁ బ్రకృతివికృతిభిన్నుండ నని తలంచు
కొని నిర్మమత్వంబునొందు మియ్యది దుఃఖనాశమ్మునకుఁ బ్రథమోపాయంబని
వెండియు. 85

గీ. మమత దుఃఖమ్ములకు నెల్ల మనికిపట్టు, దాని విడిచినవాఁడె తద్దయు సుఖాత్ముఁ
డమరనాయక ! సంతోష మన్నిగతుల, సౌఖ్య మొనఁగూర్చు దానికి సవతులేదు.

ఉ. నీకు మమత్వము వ్విడుచునేరుపు చాలకయున్న భావికా
ర్యాకలనంబునం దగిన యత్న మొనర్పుము బుద్ధియున్ సురా
నీకము తోడు గాఁగఁ బయి నీవొ రిపుండొ జయమ్ముగాంచి సౌ
ఖ్యాకరులై యొసంగఁగల రయ్యది దైవముచేఁత గాఁ దగున్. 88

వ. ఎవ్వరికిని సుఖంబు పుణ్యక్షయ మ్మనియు దుఃఖమ్ము పాపక్షయమ్మనియు నెఱుంగు మింతయేల నీబుద్ధికిం దోఁచి నట్లొనర్పు మనపుడు సురేశ్వరుండు, మహాత్మా ! దుష్టుండగు నమ్మహిషు నశింపఁజేయుటయ నాకుం దోఁచినవిధం బగుట యుద్ధో ద్యోగం బొనరించెద నుద్యమంబు లేకున్నఁ గార్యంబు సిద్ధింపదు విజ్ఞానంబు యతులకును సంతోషంబు విప్రులకును శత్రుహననంబు ప్రభువులకును భూషణంబులు.

క. మును త్వష్టకుమారుని నము, చినిఁ జంపితి నుద్యమంబు చేసి యటుల యి
ద్దనుజుఁ బరిమార్తు నీ మం, త్రనియోగముఁ బవియు విజయదాయకములుగా. 90

వ. నాకు నెల్లసంగరమ్ముల నీవును వజ్రాయుధమ్మును హరిహరులును సహాయులు. రక్షోఘ్నంబులగు మంత్రమ్ములం బఠించి దీనికి నీ వనుకూలుండవు గమ్మనవుడు స్మితపూర్వకంబుగ నతం డతని కిట్లనియె. 91

కి. సురనాథ ! విన్ను యుద్ధా, దరునిగా వలదనియుఁ బోవఁదగు ననియును నే
విరుదెఱఁగు చెప్పనోప నె, వరికిన్ జయము నజయంబు న క్తవ్యములే. 92

మ. భవితవ్యంపు విధంబు నాతరమె చెప్ప న్నాకలోకేశ ! యే
ది విధేయం బది యాచరింపు మెవఁడేఁ దీర్పన్ సమర్థుండె దై
వవిధిగాబైఁ బడు మంచిచెడ్డలః నమన్ వంచింపఁదే మున్ను మ
ద్భవశాక్షిం గొని చంద్రుఁః దప్పు డతిచింతగా జెందనేయేనొగిగా. 93

వ. నన్ను మీర లందఱును బుద్ధిమంతుండని కదా కొనియాడుచుందు రయ్యెడ నాబుద్ధి యేమయ్యెఁ గావున నోపినకొలఁది నుపాయంబు చింతింపుఁడు. సిద్ధ్యసిద్ధులు దైవా ధీనంబు లనవుడు బ్రహ్మకడకుఁ జని శరణంబు వేఁడి యిట్లనియె. 94

చ. మహిషుఁ డనంగ నొక్కరుఁ డమర్త్యవిరోధి మదోద్ధతుండు నా
కహితమొనర్చి నాకమున కాపద గూర్పఁగ దైత్యవాహిని

సహితుఁడు సంగరమ్మునకు సన్నహనం బొనరించువాఁడు వా
వి హతికి భీతి చెందితి గణింపుము నాదువస్థ నావుడున్. 95

వ. పితామహుండు హరిహరులం బురస్కరించుకొని సంగరం బొనర్చుట కర్తవ్యంబగు మనమందఱ మియ్యెడఁ గైలాసమ్మున కరుగుదమని చెప్పిన నింద్రుండు చతుర్ముఖపురస్సరంబుగాఁ గైలాసమ్మున కరిగి వేదమంత్రమ్ములచే నతని నస్నుతించి ప్రసన్నుఁడగు నద్దేవుఁ బురస్కరించుకొని వైకుంఠమ్మున కరిగి యబ్జనాభు శరణంబు వేఁడి మహిషాసురుం డొనర్చు దుర్ణయమ్ములు చెప్పిన నతం డింద్రపురోగముల కిట్లనియె. మనమెల్లఁ గలసి యద్దానవు నిర్జించుట కర్తం బయ్యెడి నాహవ సన్నద్ధులరగుఁ డనిన వారు వారివారి వాహనమ్ము లధిష్ఠించి సంగరాభిముఖులైరి.

గీ. అంచనెక్కె విరించి ఖగాధిపునయి, హరి వెలిఁగె వృషవాహనుఁడయ్యె శూలి నెమ్మిపై నుండె గుహుఁడు గజమ్ము దేవ, పతి యధిష్ఠించె సంగరప్రమద మొదవ.

వ. ఇట్లు సన్నద్ధులై హరిహరవిరించి ప్రముఖవిబుధులు వెడలిన నమ్మహిషుండును దైత్యవాహినీసహితుఁడై యుక్కు మిగిలి ధరణీతలంబు గ్రక్కదలఁ జనుదెంచె, నిట్లయ్యిరువాఁగును గలసి యెదిరిన సంగరంబు బెట్టిదం బయ్యె. 98

మ. గదలన్ బట్టసశూలతోమరములన్ గార్చిచ్చునుం బోని బె
ట్టిదమౌ శస్త్రపరంపరన్ విపులధాటిన్ మేటిగాఁ బోరి రు
న్మదులై యాజి సురాసురుల్ భువనసంపాతంబుగాఁ దారకల్
చెదరన్ దిక్తతి యేకమై పొదల నిప్పేసుప్రతాపోన్నతిన్. 99

ఉ. మానితశౌర్యధుర్యుఁ డసమానపరాక్రముఁ డైన వాని పే
నాని గజాధిరూఢుఁ డయి నాకపుఁ జిక్షురుఁ డేపె శస్త్రవి
ద్యానిపుణుండు బాణముల నైదిట; నింద్రుఁడు వానిబాణసం
తానముఁ ద్రుంచి వక్షమున నాటె నవంబగు నర్ధచంద్రమున్. 100

వ. చిక్షురుండును దదాశుగమ్మున మూర్ఛవోయి యేనుఁగుపై నొరగుడు సురపతి శతకోటిం గొని యుక్కరికరంబు ద్రెళ్ళనేసిన సంగరరంగంబు విడిచి పలాయనం బొనర్చె నంత మహిషుండు క్రోధతామ్రాక్షుఁడై. 101

శా. కాలాభీలు బిడాలనామకుని సంగ్రామైకవీరున్ మరు
త్పాలాద్యష్టదిగీశులన్ క్షణములో భంజించి రమ్మంచు దు

శ్శీలుం బంచిన వాఁ "డిదెంత" యని జేజేరాజుపై నేగె నా
ఖీలోన్మత్తగజంబు నెక్కి సురలున్ బెంపేది యల్లాడఁగన్. 102

ఉ. వచ్చెడివానిఁ గాంచి సురవల్లభుఁ డెక్కుడు శౌర్యమొప్ప మే
నుచ్చిచనంగ నేసె నుగ్రోగ్రము లైన శరమ్ములన్ పదిన్
హెచ్చిన తీవ్రకోపమున నింద్రుశరమ్ములు ద్రుంచి వాఁడు పై
పెచ్చుగ నొక్క యేఁబది గభీరశరమ్ములు నించె నేర్పుతోన్. 103

చ. వడుపున వాని శస్త్రములు నాకవిభుండు మరల్చి క్రోధ మె
క్కుడుగను వాఁడియైన శరకోటి వెసన్ బఱఁగింప వాఁడునుం
బొదిగ నొనర్చె దేవవిభుపూనిక వమ్ముగ శస్త్రసంతతిన్
దదయుక యమ్మరుత్పతి గదంగొని యేసె గజమ్ము మక్కలన్. 104

గీ. ఆ గదాఘాతమునఁ గరి యాహవావ, నీతలము పాసె నార్తంపు నిస్వనంబు
చెలఁగ; నవ్వేఁడు క్రోధ మగ్గలము గాఁగఁ, దివిరి యరిసేసె నేద్రైటఁ దేరి నెక్కి.

చ. సురరిపుతేరు చూచి బలసూదనుఁ డాహవకోపితుండు దాఁ
గురిసె నుదగ్రమార్గణపుఁగోటులఁ; దానికి వాఁడు నల్గి మే
దురముగ శస్త్రముల్ గదకతోఁ బరఁగించె ననంతసంఖ్యఁ; ద
చ్ఛరముల కజ్జయైషులకు సంగర మద్భుతమయ్యె నయ్యెడన్. 106

వ. పిదప నింద్రుం డవ్వానికో త్తలకు శంకించి జయంతుం దనకగ్రమ్మున నిడికొని బాన
టయై తామను బోరుచుండె నట్టియెడ, 107

మ. కడఁకన్ మార్గణపంచకమ్మున మహోగ్రప్రక్రియాధుర్యుఁడై
పడిమై వేసె జయంతుఁ డయ్యసురు దుష్ప్రారంభు; వాడున్ మహా
బడబాగ్నిప్రబలైన తచ్ఛరతతుల్ వక్షమ్మున న్నాటి కీ
ద్వడి యత్తేరున మ్రొగ్గతిల్లఁబడె దుర్వారంపు మూర్ఛాగతిన్. 108

వ. అంత సారథి రథంబు దోలికొని వేతొక్కయిమ్మున కరిగిన జయశబ్దంబు లొక్క
పెట్టఁ జెలంగ సురలు తనుజనహితంబుగ సురపతి నగ్గించిరి. 109

ఉ. ఆ జయశబ్దముల్ విని మహాగ్రహవిగ్రహుఁడై హయారి త
త్తేజము పైఁపలేక కడుఁ దెంపరి వజ్రవిదున్ మహామహో
భాజనుఁ దామ్రు నంపె నతిపాటవమొప్పఁగఁ దామ్రుఁడ భ్రవి
భ్రాజనమొప్ప నస్త్రములు వర్షముగాఁగ విగిడ్చె నింద్రుపై. 110

వ. అంత, 111

చ. వరుణుఁడు పాశముం గొని సవాహనుఁడై యెదిరించెఁ బాశికిం
దురమునఁ దోడుగా మిగుల దోర్బల పేర్బడ దండధారియై
యరిగె జముండు వెంటనె మహామహిషార్భటి మిన్ను ముట్టఁ దా
నిరువుర కొక్కఁడయ్యుఁ దనియించె సురారి శరాళిపెంపునన్. 112

శా. ఘోరంబై విలసిల్లు నారణమునన్ గోపమ్ముమై ధర్ముఁ "డో
రోరీ! రాక్షస పోకుపోకు" మని దండోద్యత్కరుండై బల
స్ఫారున్ దామ్రుని వైచుడున్ జలమునన్ బాటింప కిష్మేటి యు
ద్ధారంభుండయి యింద్రుఁబొట్టి సురలాహా! నాఁగజృంభించినన్. 113

చ. నిలు నిలు పోకు మంచు సురనేతకుఁ దోడయి దేవతల్ సుని
శ్చలులయి మార్గణమ్ముల ససంఖ్యగతిన్ బరఁగించి రక్కసున్
బల మఱఁ జేసిరన్ బడియె వాఁడును మూర్ఛ మునింగి సంగర
స్థలమున రక్కసుల్ మిగుల దైన్యమునొంది కలంగి పాఱఁగన్. 114

క. తామ్రుఁడటు మూర్ఛఁ జెందిన, నామ్రేడితకోపఘూర్ణితాక్షుల కాంతుల్
తామ్రప్రక్రియఁ బర్వఁగఁ, దా గ్రమింగెడి భాతి సురలఁదాఁకె మహిషుఁడున్. 115

## దేవదానవ యుద్ధము.

వ. ఇట్లు గజారూఢుండై గదం గైకొని పోకుమని యదల్చి సురనాథునేపిన నతం
డును బిట్టలిగి వజ్రమ్మున నగ్గదం బొడిచేసె. 116

చ. తనుఁ దునుమంగ బెట్టిదపుదండడి మీఁదికి వచ్చు నింద్రు నా
య్యనగని యెక్కుడౌ నలుక నార్చి ఫణీక్ష్ణిశితమైన ఖడ్గముం
గొని మహిషుండు దా నెదురుకోలు ఘటించిన నంత నిర్జరున్
గనుఁగొనువారు మెచ్చఁగ నఖండముగా నని చేసె యుద్ధతిన్. 117

గీ. అంత దైత్యుండు శాంబరి నఖిలలోక, మోహకరి గాఁగ మాయఁ దామొనయఁ జేసె
నధిప! యెయ్యెడఁ జూచిన నాత్మసదృశు, లొప్పి రొకకోటి యమ్మాయఁ గుప్పలుగను.

వ. ఇట్లు మాయాప్రభావమ్మున నెల్లెడఁ దానయై మహిషుండు విజృంభించి తమ పేనల
రూపడంచుటకు నింద్రుం డత్యాశ్చర్యపర్యాప్తుండై చేయునది లేక పల్లవడియె. 119

ఆ. వె. వరుణుఁడును జముండు సరసిజాప్తుండు వ
హ్నియు శశాంకుఁదొట్టి యితరు లమరు
లధికభయము దొడర నందంద మ్రాన్పడి
పాఱఁ జొచ్చి రసురబారి కెరలి. 120

ఉ. ఈగతి నార్తులై యమరులెల్లఁ ద్రిమూర్తుల నాత్మ నిల్పి మా
కాఁగఁగ రాదు వీని నని యంచు మొఱన్ బచరించుమాత్ర న
య్యాగమవేద్యు లయ్యెడకు హంసఖగేశవృషాధిరూఢులై
మూగురు నేగుదెంచిరి సముద్ధతులై మహిషున్ వధింపఁగన్. 121

వ. పదంపడి చక్రి చక్రంబు వైచినఁ దత్తేజమ్మున నవ్వాని మాయపంచబంగాళంబై
విరిసె. దానికి సహింపక మహిషుండును, బిక్షురుండును, నుగ్రాస్యుండును, నుగ్ర
వీరుండును, నసిలోముండును, ద్రినేత్రుండును, బాష్కలుండును, నంధకుండును,
దక్కంగల రక్కసులును నొక్కటై పరిఘాద్యాయుధమ్ములు ధరించి ప్రతిఘటించినఁ
బోరు ఘోరంబయ్యె నయ్యెడ. 122

ఉ. రక్కసులెల్ల నుక్కునఁ గరమ్ములఁ జాపము లొప్ప దిక్తతుల్
గ్రక్కదలంగఁ దాఁకి యమరప్రతతిన్ వృకముల్ గడంగి దా
మెక్కటి వత్సపంఘముల నేపునఁ దోలినభంగిఁ దోలి రి
ట్లుక్కఱియుణా సురల్ వాడిచి రోదక యోపినవట్టు పోరుచున్. 123

క. కడు నడరు బాణవర్షము, పుడమియు నాకసము గప్పఁ బోరు భరంబై
దొడరిన నయ్యెడ నంధకుఁ, డుడుసంఘము రాల నార్చి యోధులఁ దలఁకన్. 124

శా. ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ములన్ వీఁక నా
శీకాక్షుం గుఱిఁజేసి యేసిన విషాలీఢమ్ము లౌ వాని నా
లోకారాధ్యుఁడు బిట్టు దున్మి సుర లాలోకించి యగ్గింపఁ దీ
క్ష్ణాకారమ్ముల నైదుబాణముల దేవారాతిపై వించినన్. 125

వ. దానఁబోరు ఘోరంబయ్యె నిట్లుహరితోఁ బెనంగి యంధకుండు హరుం దాఁకెఁ
బదంపడి యిరువురకును నేఁబది దినమ్ములు సమస్తలోకలోమహర్షణంబగు నాహ
వంబు ప్రవర్తిల్లె నయ్యెడ బాష్కలుం డింద్రుం దాఁకియు మహిషుండు రుద్రు నద
ల్చియుఁ ద్రినేత్రుండు జము మార్కొనియు మహాహనుండు గుబేరునిపైఁ గవి

సియు నసిలోముండు వరుణుపై నురవణించియు నతిదారుణంబుగఁ బిఱుసనక
సంగరం బొనరించి రట్టియెడ నంధకుం డుక్కుమిగిలి, 126

క. గదఁ గైకొని యమరులు గ్ర, క్కదలఁగ హరి నురవడించి కడు బెట్టిదమై
యదరిపడ గరుడు నేసిన, మదమఱి యాతండు గొంత మ్రాన్పడె నధిపా. 127

ఉ. అంత జనార్దనుండు విహగాధిపుమేని నొకింత దువ్వి వి
క్లాంతిఁ దొరంగఁజేసి విశిఖమ్ముల నంధకుఁ గూర్చి యేయ వాఁ
డంతఁ దదీయమార్గణము లన్నియు నుగ్గుగఁ జేసి యబ్ధిజా
కాంతుని నేసె నేఁబది యఖండశరమ్ముల శౌరి పెల్చనన్. 128

ఆ. వె. వాని బాణములను వమ్ముగాఁ జేసి వే, యంచు లొప్పి దీప్తిమించు తన సు
దర్శనంబు వాని తల గుఱిచేసి వై, చిన సురారి మిగులఁ జేవ దవిలి. 129

మ. అనివార్యమ్మగు శౌరిచక్రమును వార్య మ్మొనటుల్ చేసెఁ గై
కొని చక్రంబొకఁడేసి; దాని కసురుల్ గోలాహలం బొప్పఁ బెం
పున నగ్గించిరి యంధకున్; సురవరుల్ పొల్పేది 'యేమీ! సుద
ర్శన మిట్లాయె!' యటంచు నొక్కుమొగి నాక్రందించి రత్యార్తులై. 130

క. సుర లాక్రందించిన నా, హరి కనలి యమర్చి యేసె నయ్యంధకుపైఁ
ద్వరితగతిఁ గౌమోదకి, శిరమునకుం దాఁకునట్లు చేకొలఁది వెసన్. 131

వ. పిమ్మట నగ్గద శిరమ్మునకుం దాఁకుడు దిమ్ముగదిరి యమ్మానవామండు సొమ్మసిలిన
నమ్మహిషుం డమ్మధుసూదనుం దాఁకుటయు. 132

ఉ. చాపము కేలఁబూని పెలుచన్ గుణనాదము మ్రోయ మజ్జ్వల
త్కోపపరీతుఁడై యెదురుకోలు ఘటించెడివానిపై మహో
టోపత బాణవర్షము గడున్ వెలయించిన వర్షధారలఁ
జోపెడి దున్నపోల్కి మధుసూదనుఁ డాఁకె హయారి ధీరుఁడై. 133

వ. ఇట్లు నిరంకుశుండై మహిషుండు హరికార్ముకనిర్ముక్తశరపరంపరలఁ గ్రమ్మఱిం
చుచుఁ గదిసిన నిరుపురకును సంకులక్రమమ్మునఁ గొంతవడి ద్వంద్వయుద్ధంబు
ప్రవర్తిల్లె. 134

చ. హరి గద కేలఁ దాల్చి రయమారఁగ నమ్మహిషాసురున్ రణా
దరు మదమత్తు మొత్తినఁ బదంపడి శీర్షము వ్రయ్య మూర్ఛరా

ధరణిపయిం బడెన్ సురలు దైన్యము దక్కఁగ రక్కసుల్ వర
ప్పురవదనమ్ములన్ గళలు జాఱఁగ వందురి కందు నొందఁగన్. 135

శా. మాత్రఁ జాద్దైత్యుఁడు మూర్ఛఁదేరిహరిపై మాత్సర్యమొప్పారఁగా
నేత్రమ్ముల్ గదు నెఱ్ఱఁగాఁ బరిఘమున్ శీఘ్రమ్మునఁజైవ దే
వత్రాణుండును దాని త్రాఁకునకుఁ దత్పక్షీంద్రుపై మూర్ఛిలెన్
సుత్రామాదులు సూడనొందెడకుఁ గొంచుంబోయెఁ బక్షీంద్రుఁడున్. 136

చ. అమరుల దైన్యముం గని "భయంపడకుం" డని చెప్పుచున్ మహో
ద్యముఁడయి శంకరుండు మహిషాసురుపైఁ దనశూలము న్నిగు
ద్ప మహిషుఁడే డ్తెఱన్ విడిచెఁ బ్రాకటమైతగు శక్తిపక్షమం
డు; మదనహారి తద్ధతికి నోవక హెచ్చినతామసమ్మునన్. 137

గీ. తన త్రిశూలమ్ముగొని వాని దాఁకి యేయఁ, దొడఁగె వాఁడును బోరాడఁగడఁగె విట్టు
లున్నయెడ హరి మూర్ఛఁదా మడిగి శంక, రునకుఁ దోడ్పడెఁ జక్రమ్ముగొని కరమున.

వ. ఇట్లు చక్రశూలమ్ములం గొని హరిహరులు సంగరసన్నద్ధులై విజృంభించుటయు
మహిషుండు పేఁచెత్తిన కోపమ్మున, 139

మ. మహిషాకారము దాల్చి పుచ్ఛ మతిసంపాతమ్ముగాఁ ద్రిప్పుచున్
మహిభృచ్ఛృంగసమున్నతంబయి యసామాన్యంబునై భీతిధూ
ర్వహమై దేహమెసంగ శృంగముల భూధ్రమ్ముల్ వెసంగూల్చుచున్
విహ్వృతిందాఁకె హరిన్ హరున్ విపులగంభీరధ్వనం బొప్పఁగన్. 140

ఉ. దానికి నల్గి యుర్వురును దారుణబాణపరంపరల్ ధను
ర్ధ్వానపురస్సరంబుగ విదాఘురవిప్రభ లొప్ప నేయ న
మ్మానవభాది బిట్టలుక మార్కొని భూధరశృంగ మాత్మపు
చ్ఛానుగతంబుగా విసరె నాహరిపై హరుపై రయమ్మునన్. 141

క. ఉరవడిఁ బఱతెంచెడి త, ద్గిరిశృంగము గాంచి హరి యొగిన్ దీక్ష్ణములౌ
శరముల నుఱుముగఁ జేసి యు, సురపైఁ దనచక్ర మపుడు జొనిపెఁ జొనిపినన్.

ఉ. ఆహరిచక్ర మద్దనుజు నయ్యెడఁ దాఁకిన మూర్ఛవోయి తా
నాహవరంగమందుఁ బడి యంతన లేచి మనుష్యదేహియై
బాహువు నప్పళించి గదఁ బాణి ధరించి వితాంతసంగరో
త్సాహమునన్ మహాభనినదం బొనరించె గిరుల్ చలింపగన్. 143

వ. అమ్మహానాదమ్మునకు నమరులెల్లఁ దలంకి రట్టియెడఁ గమలాక్షుండు పాంచజన్యంబు పూరించిన దానవులెల్లరును సురలంబలె విశ్శేష్టులైరి. 144

## దేవతలు పాఱిపోవుట.

గీ. పాంచజన్యారవమ్మున భయము చెంది, కుందునసురుల వీక్షించి కోపమడర
మానవాకార మెడలి యమ్మహిషుఁ డంత, సింహరూపమ్ముదాల్చి గర్జించి మించి.

చ. అసురులనెల్లఁ దీవ్రనఖరాగ్రముఖం బొడి జేయుచుక్ గ్రమ
క్రమమున శ్రీహరిం గదిసి గ్రన్న ఖగేంద్రునిఁ బట్టి చీరి యు
గ్రముగ రమాధినాథభుజకాండము వ్రయ్యఁగఁ జేసెఁ గ్రోధవే
గమున సుదర్శనంబు గొని కంజదళాక్షుఁడు విక్రమించినన్. 146

క. అతనిచక్రము తనపై, కేతెంచిన నంతలోన మృగరాడ్రూప
స్ఫీతి విడనాడి శృంగా, ఘాతమ్ముల నతని నొంచెఁ గాఱెనుపోతై. 147

వ. హరియును వానికోల్తలఁకుఁ దలఁకి సంగరరంగమ్ము విడిచి పలాయనం బొనర్చి వైజభువనమ్మున కరిగె. శంకరుండును వాని నవధ్యుఁగాఁ దలంచి పిఱుందన కైలాసమ్మున కేగె. బ్రహ్మయు నట్టు లొనరించె. 148

క. కరమున వజ్రముం గొని యొకండును విల్చె బలారి; శక్తి దా
వరుణుఁడు దాల్చి యొప్పె. బలవంతుఁడు దండసహాయుఁడై రణ
స్థిరత నెసంగె ధర్ముఁ; డనిఁజేయఁ గుబేరుఁడు నగ్నియున్ బర
స్పరముగఁ దోడు వచ్చిరి వెనక్ బఱతెంచిరి సూర్యచంద్రులున్. 149

ఉ. వీరలకన్న నెక్కుడగు వీరులతోడ బలాయరూపియై
ధీరుఁడు దానవుం డరుగుదెంచెఁ బరస్పరముక్తమార్గణా
సారపరంపరల్ ప్రబలె జ్యావినదమ్ములు సింహనాదముల్
ఘోరన భూనభోంతరము బూరటిలంగఁ జెలంగి మించఁగన్. 150

గీ. శృంగములచేతఁ బర్వత శృంగములను, ముక్షుమైఁ జిమ్మికొంచుఁ గ్రైపెక్కి మహిషుఁ
డెల్ల యమరులఁ దాడించె విద్ధబలుఁడు, పుచ్ఛసంఘాతముల ఖురస్ఫోటనముల.

శా. ఉగ్రుండై పఱతెంచు నమ్మహిషయుద్ధోద్యోగముం జూచి భీ
తిగ్రస్తుండయి పాఱె నింద్రుఁడు; జవాధిక్యమ్మునన్ బాశియున్

వ్యగ్రుండై చనె; ధర్ముఁడుం బరుగిడెఁ; యక్షేశవహ్న్యర్కులా
శాగ్రంథిన్ విడనాడి యేగి; రరిగెన్ జంద్రుండు సాంద్రత్వరన్. 152

వ. ఇట్లు మహిషాసురుండు నూఱువత్సరమ్ములు పరమదారుణంబగు సంగ్రామం బొన రించి విలింపులనెల్లఁ దఱిమి జయాధిక్యమ్మునం బొలిచి దైత్యసహితుండై స్వర్గం బాక్రమించుకొని వలయు దైత్యుల వలనగునెడల వియోగించి యమరపరిత్యక్తమ్ము లగు ధనాగారమ్ములను నైరావతోచ్చైశ్శ్రవః కామధేను కల్పవృక్షమ్ములను నాత్మా యత్తంబులుగ నొనర్చి యింద్రాసనమ్ము నధిష్ఠించి యథేష్టంబుగఁ బరిపాలనం బొనర్చుచుండె. 153

గీ. వాని ధాటికిఁ దాళక వాఁడి దఱిఁగి, యరిగి గిరిగహ్వరమ్ముల నాశ్రయించి
యచటఁ బెక్కులు వర్షమ్ము లార్తి గూర, నమరులు వసించి కృశియించి రవనినాథ.

వ. పదంపడి యొక్కనాఁడు దేవతలందఱును బ్రహ్మలోకమ్మున కరిగి వేదవేదాంగ పారంగతులగు మరీచిప్రభృతిమహామునులు సేవింపఁ బద్మాసనం బలంకరించి యున్న వేదగర్భుఁ జతుర్ముఖు ననంతతేజోనిధి రజోమూర్తిం గాంచి సన్నుతించి యిట్లు చెప్పకొనిరి. 155

చ. అమరుల మయ్యు నొక్క మహిషాధముచే నిటు లెక్కుడక్కు వి
క్రమ మొనరింప లేక గిరిగహ్వరముల్ గృహసీమలై పొసం
గ మహిమమేది నట్టి మముఁగాంచఁగరాదె మహాత్మ! తండ్రి యే
క్రమమున నున్నఁ బుత్రులఁ గరమ్ము ననుగ్రహబుద్ధిఁ జూడఁడే. 156

మ. అమరస్థానము వానిరాజ్యముగఁ గల్పాగప్రసూనమ్ము ల
య్యమరారాతి పరమ్ముగా మఖము లయ్యశ్వారి పాల్గాఁగ నం
ద్రమువం బుట్టినగోవు వానిదిగ నద్దైత్యుండు పెంపొంద దై
న్యమునన్ మున్గి సురేంద్రు లిట్లగుటయుక్తా న్యాయంబె లోకేశ్వరా. 157

వ. సర్వజ్ఞుండవగుసీ కెఱుఁగ రాని దొండుండదు. మా పడెడి యవస్థ యే మని చెప్పి కొందు మట్లు స్వర్గంబు వాని పాలొనర్చి యద్రిగహ్వరమ్ముల నచ్చటచ్చట వసి యించు మమ్ముల నెద్దియే నొక నిమిత్తంబు గల్పించి పీడించుచున్నవాఁ డట్లగుటం జేసి రక్షకుండవని నీ పాదమ్ములం బడితిమి. మా కెద్దియేని గతి గలుగం జేయు మని మాటికిం బ్రార్థించు నమరులకుఁ గృతాంజలులకుఁ బితామహుండు ప్రేమా ర్ద్రుండై యిట్లనియె. 158

ఉ. చేసెడిదేమి ? దానవుఁ డశేషసురాసురమర్త్యులందుఁ ద
న్నోసరిలంగఁ జేయ నొరుఁ డుండమి మత్తత పిట్లొనర్చు వా
డీసరణిన్ వరమ్ము గొనె నెవ్వఁడునుం బురుషుండు త న్నవిం
జేసి వధింపకుండ వికఁ జేడియ వాని వధింపఁగావలెన్. 159

వ. కావున మనమందఱమును గైలాసమ్మున కరిగి కార్యవిశారదుండగు శంకరుతో యోజించి తత్సహితులమై మాధవునొద్ద కేగి కర్తవ్యాకర్తవ్యమ్ములు విర్ణయింత మని చెప్పి హంసారూఢుండై దేవతలం గలిసి కైలాసమ్మునకుఁ జనిన నంత నద్దేవదేవుండు ప్రసన్నుండై యెల్లర నుచితసత్కారమ్ముల గారవించి కుశలప్రశ్న పూర్వకముగ నాగమనకారణం బడిగినఁ జతురాననుం డిట్లనియె. 160

చ. తెలియనికార్యమే యిదియు దేవరకున్ ; మహిషాసురుండు వీ
రల విరసించి స్వర్గము కరంబు తిరంబుగ నేలుచున్న వాఁ
డలఘుఁడు యజ్ఞభాగముల నన్నిటి దైత్యులతోడ వాఁడ యి
మ్ములఁ గొనుచున్న వాఁడు వనముల్ గతియయ్యె విలింపపాళికిన్. 161

వ. వాసవుఁ దొట్టి యీ గీర్వాణులెల్ల నన్ను శరణంబు వేఁడిన విన్నుం గన వచ్చితి. నీ కార్యభారంబు నీయంద విలిచినది నావుడు మందహాసకందళితముఖారవిందుండై శంకరుండు విరించి కిట్లనియె. 162

తెచ్చితి వీయనర్థమును దేవతలందఱకున్, వరంబు ము
న్నిచ్చి, యిఁకేమి సేయనగు నెవ్వనికేనియు వాఁ డవధ్యుఁ డౌ
నచ్చపలున్ వధింపఁదగు నంగన లెవ్వరు ? నీ సతీమణిం
బుచ్చెదొ ? మత్తలోదరినిఁబుత్తునొ ? పుత్తుమొ వాసవాంగనన్ ? 163

మనభార్యలందు నొక్కతె, యమ యుద్ధమునందు నేర పొప్పెడి సతి లే
దనఘా ! కర్తవ్యం బ, వ్వనజాక్షునివలన వినఁగ వలయుఁ గడంకన్. 164

అతండు బుద్ధిమదగ్రేసరుం డగుట నిప్పట్ల వలనగు నుపాయంబెఱిఁగించు నయ్యెడ కరుగుద మని శంకరుఁడు తత్సహితుండై విష్ణులోకమ్మున కరుగునెడ ననుకూల వాతమ్ములు వీతెంచె మార్గమ్మున నెల్లెడఁ బక్షులు శుభసూచకములయ్యె నాకాశంబు విర్మలంబుగాఁ దోఁచె దిక్కులు తెలివొందె నిట్లు శుభోదర్కమ్ముగా వెడలి యమ్మ హాదేవుండు ముందట. 165

సీ. హంససారసచక్రసంసేవితములైన • కమలాకరమ్ములు గలుగుదాని
మందారవకుళచంపకమల్లికాశోక • వనము లెల్లెడ నొప్ప వఱలుదాని
నవరత్నఖచితసుందరసౌధభాసుర • వీధీశతమ్ములు వెలయుదాని
నిగమముల్ సెప్పు మునివరేణ్యులును గాయ • కులు నచ్చరలు గల్గి కులుకుదాని

గీ. నలఘులు సునందనందనాదులు వితాంత • భక్తిశీలురు నలుగడఁ బరఁగుదాని
విష్ణుభువనంబు గని యందు వెలయు నమ్మ•హాత్ముభవనంబు గనియె ననంతరంబు.

వ. ఇట్లు దేవత లందఱు నయ్యెడ కరిగి ద్వారపాలకుం గాంచి మే మేతెంచితి మని మధుసూదనున కెఱిఁగింపవలయు ననిన నందొక్కరుండగు విజయుం డరిగి యమ్మధువైరికిం జెప్పె నంత విష్ణుండు సదనంబు వెలువడి వార లున్నయెడ కేతెంచిన నందఱును నమస్కరించి వేదవాక్యమ్ముల నన్నుతించిరి యద్దేవుండును గరుణార్ద్రహృదయుండై యెల్లరఁ గుశలం బడిగి యాసనమ్ముల నుండ నియోగించి యాగమనకారణం బేమన వార లిట్లనిరి. 167

మ. వరదానమ్మున దృప్తుఁడై మహిషుఁ డాపద్హేతువై మాకు న
ధ్వరభాగమ్ములు ముట్టకుండ నివముం దా నేలుచున్ మమ్ము భూ
ధరదుర్గమ్ములపాలు చేసెఁ బుమవధ్యప్రక్రియం బొల్చునా
సురవైరిం బరిమార్పఁగా వలను సంశోధింపు మేదేవియున్. 168

వ. మహాత్మా! యవ్వాని వధించు పాటి సామర్థ్యం బుమారమాసరస్వతీశచ్యాదులం దే యంగనకుం గల్గు నయ్యది విచారింపుము శరణాగతుల మమ్ము దరిచేర్పు మన వుడు విష్ణుం డవ్వారల కిట్లనియె. 169

గీ. అమ్మహిషుశోడ మనము మున్నాహవం బొ, నర్చితిమికాదె వాఁడు మనకు నవధ్యుఁ
డెల్ల సురల యంశమ్ములు నేకముగఁ బొ, సంగు నట్లొకకాంతఁ జేయంగవలయు.

క. మనమనయంశమ్ములఁ బు, ట్టిన యవ్వామాక్షి వాని డీకొని పోరన్
దునుము ననంశయముగ న, వ్వనితకు మన మాయుధములు వలయు నొసంగన్.

## దేవీ ప్రాదుర్భావము.

వ. అని యతండు వలుకు నయ్యెడఁ జతురాననుని మొగమ్ము నుండి యొక్క తేజమ్ము రక్తవర్ణమ్మును గించిచ్ఛీతంబును గించిదుష్ణమ్మును శుభాకారమ్మును మరీచిజాలకీలితంబును నై వెడలె నద్దాని వీక్షించి శివకేశవులు పరమాశ్చర్యపర్యాప్తులైరి. 172

గీ. రౌద్రవర్ణంబు మిగుల దుర్దర్శ మధిక, తీవ్రము భయంకరంబునై దేవతలకు
విస్మయం బిచ్చు తేజంబు వెలికి వచ్చె, నద్రిసమముగు రుద్రుదేహంబునుండి. 173

వ. పిదప విష్ణుశరీరంబు నుండి సత్త్వగుణోపేతంబై శ్వేతవర్ణంబైన తేజమ్మును పురందరుకాయమ్మునుండి సర్వగుణాత్మకంబై చిత్రవర్ణంబగు తేజమ్మును వహ్నియమకుబేరవరుణాదులగు తక్కటి సురల శరీరమ్ములనుండి భిన్నభిన్నమ్ములగు తేజమ్ములునుం బొడమి మహాతేజోరాశియై హిమవత్పర్వతసన్నిభంబగు నద్దానింగాంచి యెల్లరును విస్మయం బందుచుండి రంత నత్తేజఃపుంజ మ్మొక్క దివ్యసుందరియై పదునెనిమిది భుజమ్ములను దెల్లనగు మొగమ్మును నల్లనినేత్రమ్ములను నరుణంబగు నోష్ఠమ్మును నెఱ్ఱని పాణితలమ్ములును గలిగి నానావిధ భూషణమ్ములు దాల్చి సన్నద్ధయై యమ్మహిషాసురుఁ జంప నుంకించె ననుడు జనమేజయుండు మహాత్మా! యమ్మహాదేవి స్వరూపమ్ము సంక్షేపమ్మున వచించుట గాదు విస్తరించి యేయే దేవతలయంశమ్ము లేయే యంగమ్ములుగాఁ బరిణమించె వినవలతు నావుడుఁ బారాశర్యుం డమ్మహాలక్ష్మిస్వరూపం బిట్లు వక్కాణించె. 174

శా. ఆరూపం బిదమిద్ధ మంచు మునుపున్ హర్యాదులున్ జెప్పఁ గా
లే రూహింపఁగ నాకు శక్యమగునే! లేశంబుగాఁ జెప్పి వా
చారంభం బొనరించితిన్ శుభదమై యజ్ఞానవిధ్వంసమై
సారంబై సతమై చెలంగు నది విశ్వం బెల్లెడన్ వ్యాప్తమై. 175

వ. నరేంద్రా! యద్దేవి యేకరూపిణియయ్యుఁ దత్తత్కార్యమ్ముల కనుగుణమ్ముగ నటునిపడువున నానారూపమ్ముల నెసంగుచుండు నయ్యయిరూపమ్ములకుఁ గార్యకర్మానుసారమ్ముగ నామంబులు దనరు, నయ్యవి సగుణమ్ములును నిర్గుణమ్ములునై యనంతమ్ములుగా నుండు నైనను నా యోపిన తెఱంగున వివరింతు నాకర్ణింపుము.

క. హరుతేజమ్మున వక్త్రం, బురుహాము కడు వెల్లనగుచుఁ బొలిచెఁగా, గురు ల
భ్రరుచిం జెలువారెఁ బరే, తరాజతేజమ్ము పొలుపు దవిలిన కతనన్. 177

వ. ఆ జగన్మాతృక నేత్రత్రయంబు పావకాంశంబగు కతనఁ గృష్ణరక్తశ్వేతవర్ణమ్ములం బొలిచెఁ గనుబొమ లుభయసంధ్యలవలన నగుటంజేసి వక్రమ్ములును గృష్ణవర్ణమ్ములును స్నిగ్ధమ్ములునునై యొప్పె. నాతిదీర్ఘమ్ములును నాతిహ్రస్వమ్ములుం గాక డోలాసమమ్ములగు శ్రవణమ్ములు వాయుతేజస్సముద్భూతమ్ములు. 178

సీ. తిలపుష్పముం బోలి యలరెడునాసిక • ధనదుని తేజంబు, మొనలు గల్గి
తనరారు తళుక్కు దంతములు ప్రాజాపత్య • తేజంబు, కావివాతెఱ దినేంద్రు
తేజంబు, మీఁదివాతెఱ కార్తికేయుని • తేజంబు వొల్పారు, దీప్తినలరు
పదియును నెన్మిదిబాహులు విష్ణుతే • జం, బంగుళులు వసుసంభవములు,

గీ. స్తనయుగళ మంబుజారి తేజంబు, త్రివళిసంయుతము మధ్య మింద్రు తేజంబు జంఘ
లూరువులు వరుణుఁడు, కటి యుర్వి, యిట్లు • పుట్టె నద్దేవి శుభరూపమున నరేంద్ర !

క. ఆయమఁగాంచి సురలు మో, దాయత్తత మించి "మహిషు నడఁచు మనకుఁ దా
నై యిచ్చు స్వర్గరాజ్యం, బీయంబిక" యంచు భయము నెడలిరి తమలోఁ 180

వ. అంత విష్ణుండు సురలం గాంచి యీ యంబికకు మీ మీ భూషణంబు లొసంగి
మీమీ యాయుధమ్ముల తేజమ్ములవలన నాయుధమ్ము లుత్పాదించి యొసంగునది,
యనిన నిర్జరులు సంతుష్టులై యట్లొనరించిరి. 181

సీ. పాలసంద్రము మేల్మిచేలమ్ములను మంచి • దైనరత్నపుహారముఁబ కొసఁగె
నాపాదమస్తకం బమరఁదాల్పఁగ విశ్వ • కర్మ రత్నపుమేల్ నగల నొసంగె
మరిమున శిరమున ధరియింపఁ దగుమాలి • కలు రెండు వరుణుండు కానుకిచ్చెఁ
దనరారు వివిధరత్నమ్ము లిచ్చుటె కాక • హిమవంతుఁ డర్పించె నేస్గు గొంగ

తే.గీ. హరియు హరుఁడును వరుణుండు నాత్మచక్ర • శూలశంఖమ్ములవలన నొలి సృష్టి
జేసి యొసఁగి రయ్యంబకు శ్రీకరములు • చక్రశూలశంఖమ్ములు జనవరేణ్య. 182

వ. మఱియుఁ బావకుండు మనోజవమ్మును శతఘ్నియనగు నొక శక్తియు, వాయువు
బాణపూర్ణంబగు నంబులపొదియును జాపంబును, నింద్రుండు దనవజ్రమ్మునుండి
యుదయించిన వేఱొక వజ్రమ్మును, నైరావతమున కలంకరించెడి గంటయును,
యముండు దనదండమ్మునఁ బొడమిన దండంబును, బ్రహ్మ దివ్యగంగాజల పూరి
తంబగు నొక్క కమండలువును గాలంబు ఖడ్గమ్మును వలకయును, విశ్వకర్మ
తీక్ష్ణంబగు పరశువును, గుబేరుండు సురాపూర్ణంబగు కనక పాత్రంబును, వరు
ణుండు దివ్యపంకజమ్మును ఘంటానాదవినాదితంబగు కౌమోదకి యను నొక
గదయుఁ ద్వష్ట యభేద్యకవచంబును నానావిధాస్త్రమ్ములను దివాకరుండు స్వకిరణ
ములను నొసంగిన నవి దాల్చి వెలుంగు నజ్జగన్మాతృకం గాంచి వార లందఱు
విట్లు నుతించిరి. 183

మ. శివవై శాంతివి పుష్టివై సుఖదవై సిద్ధిస్వరూపంబవై
భవసంహారిణి ! కాళరాత్రి వయి యంబాదేవివై వృద్ధివై
యవనిం బొల్చియు దానిచే నెఱుఁగ రా కంతస్థితిం దొల్చి పూ
య వెలింగింపుచు దానికిం దెలియ రా వత్యంత గోప్యస్థితిన్. 184

వ. అట్టి వైష్ణవీరుద్రాణీంద్రాణ్యాత్మికవగు నీకు నమస్కరించెద మెట్లేని మమ్ముం బీడించు నీహయారిని రయమ్మునం దునిమి కళ్యాణము లొసంగు మని మాటి మాటికి నుతించి చరణంబులం బడు నయ్యసురుల కయ్యంబిక యిట్లనియె. 185

చ. వినుఁడు సురల్ ! సురారి నొకవ్రేల్మిడిఁ ద్రుంచెద దీని కింత భీ
తినిఁ గొనువారె బ్రహ్మముఖదేవత లందఱు ? కాలపర్యయ
మ్మును గడవంగ నేరికినిఁ బోలునె ? యెంతటివింత యంచు నా
ననము సమందహాసముగ నాచ మొనర్చె రిపుల్ భయంపడన్. 186

ఉ. మేరువు సంచలించె వడి మిన్నదరెఁ జలధుల్ గలంగె దు
ర్వారతరంబుగా ధరణి గ్రక్కదలెన్ దశదిక్కు లొక్కటై
బోరన మ్రోసె నా రవ మపూర్వగతిన్ విని యాహయారియుఁ
ధీరతఁ దక్కి రక్కసుల దిక్కు మొగం బయి యుల్కిపెంపునన్. 187

వ. ఇయ్యది కడుఁగ్రొత్తయై యున్నయది దీనికిం గత మేమొకో ! యని శంకించి వెండియు, 188

ఉ. ఈరవ మాచరించు రిపుఁ డెవ్వఁడొ ! గన్గొని వానిఁ గట్టి దు
ర్వారత వాదుసన్నిధిఁ గరంబు తిరంబుగఁ బొందఁజేయుఁ డ
ద్దారుణు మందబుద్ధి గతదర్పు నొనర్చి యమాలయాతిథిం
గా రచియింతు నెవ్వనికిఁ గాలము చేరువయయ్యె నియ్యెడన్. 189

క. సుర లిట్లొనరించిరొకో, పరమాపద దప్పి నాదుభయమున గిరిగ
హ్వరములపాలై విర్ఫి, తి రవం బొనరింప నింత తెగువ గలుగునే ! 190

వ. అని పనిచిన దూతలు నవి సర్వాంగసుందరియు నష్టాదశభుజయు సర్వాభరణభూషితయు నాయుధసంపన్నయు హస్తమ్మునఁ జషకమ్ము గొని పారెసారెకు మధుపానం బొనర్చుచున్నదియునగు నప్పురాంబ వీక్షించి భయత్రస్తులై మహిషుపాలికిఁ జని యిట్లనిరి. 191

ఉ. సింగము నెక్కి యెక్కుడగు చెల్వునఁ బొల్చెడి యొక్క కాంత స
ర్వాంగసముజ్జ్వలన్మణిమయస్ఫుటభూషణ విస్తులాయుధా
భంగురహస్త విత్యమధుపానమదాలస చారుచంచలా
పాంగ గవంగ వయ్యెఁ గనినంతన భీతి యెనంగె మాకొగిన్. 192

వ. అత్తలోదరి సురకాంతయు నసురకాంతయు నని నిరూపింప రాక యపూర్వప్రక్రియ నొప్పుచున్నయది. తత్తేజంబు దుర్దర్శంబగు కతన నిలువ నోడి యిట కరుదెంచితి మంతరిక్షమ్మున నుండి విలింపు లాయంగనామణి నెక్కుడుగ సన్నుతించుచుండి రవ్వరారోహ యేమి కతమున నిట కేతెంచెనో తెలియుట మాకసాధ్యంబు తద్దర్శనమాత్రవలాయమానులమై దేవరకు విన్నవింపవచ్చితిమి. 193

క. శృంగారాదిరసమ్ముల, పొంగాధీనములు గాఁగ నంగజశత మా
రంగ సృజియించు చెల్వున, వంగన రంగారు నేమి యనఁదగు నధిపా. 194

వ. ఇంక నెయ్యది కర్తవ్యం బానతిమ్ము నావుడు మహిషుండు మంత్రి దిక్కు మొగంబై సాభిలాషమ్ముగ నిట్లను. 195

మ. అమరాగిల్లితి నత్తలోదరికి నే, నయ్యంగనారత్నముం
గొని రమ్మేక్రియనైన సామమున నాకోర్కుల్ ఫలింపంగ నే
నొనరింతున్ బ్రియమారఁ బట్టమహిషీయోగంబు, తత్కన్యకా
జనచూడామణి కింతకన్నఁ గలదే! సంతోష మెంతేనియున్. 196

గీ. సామదానభేదమ్ముల సమ్మతించి, వచ్చెఁగాకేమి రాకున్న మచ్చెకంటి
విటకు రప్పింపుమీ బలాత్కృతిగ నొప్పె, నేవి రసభంగ మొనరింతువేమొ మొదల.

ఉ. ఆనరసీరుహాక్షి జలజాసన యాతనుమధ్య లేని యీ
వాసవలోకసౌఖ్యములు వ్యర్థము; లచ్చెలిమిన్న విన్న నా
కాస జనించె పైశమ తదంగన నియ్యెడఁ దేవలెన్ రసా
భాసము గాకయుండ నొకపక్కిక నీదగు నేర్పుకూర్పునన్. 198

వ. అని యనిపిన నమ్మంత్రివరుం డరిగి దొదవ్వుల నిలిచి వినయావనతుండై యిట్లను.

ఉ. ఎందులదాన! నియ్యెడకు నేమికతమ్మున వచ్చియుంటి! నీ
యందముఁ జందమున్ విని స్మరాతురుఁడై ననుఁబంపె మావిభుం
డందుల కేగుదెంచెదొ! రయమ్మున నాతనిఁ దోడి తెచ్చి నీ
కిందు నొసంగువాఁడనొ, మృగేక్షణ! యీ తడవేల చెప్పుమా. 200

మ. సరసీజాసనదత్తమౌ వరమునఁ జా స్వర్గమ్ము నిర్జించి యె
వ్వరికిన్ వధ్యుఁడు గాక యిచ్చ కనురూపంబైన రూపమ్ము దా
ల్చి రసజ్ఞత్వము గల్గి మావిభుఁడు విస్పష్టప్రతాపాదిభా
స్వరుఁడై వర్తిలు వేఱొకండు మహిషస్వామిస్థితిన్ బోలునే. 201

చ. అనవుడు లేఁతనవ్వు నగి యజ్జగదంబిక పల్కె "దేవతా
జననిగ నన్నెఱుంగుము ప్రశంస యొనర్చితి కాన నంతయున్
వినిచెద మీవిభుం డిడెడివేదన కోపక నన్ను వేఁడినన్
బనిఁ గొని వచ్చితిన్ మహిషుఁ బట్టి వధించి సురాళిఁ బ్రోవఁగన్. 202

వ. ఇంతవట్టును నీయందలి వినయవిధేయతలకు మెచ్చి వచించితి వేఱొక్క తెఱఁ
గేని యిప్పుడ నిన్ను వధింతు నింకఁ జాగు సేయక పోయి మీ రాజునకు నారాక
యెఱిఁగించి యిటు వచియింపుము, 203

## దేవీ మహిషదూత సంవాదము.

శా. "జీవింపన్ వలతేనిఁ దత్క్షణమ స్వశ్శ్రీ వీడి పాతాళముం
బోవం జూడు మనుగ్రహించి విడుతున్, బో నేరకున్న న్నినున్
దేవప్రీతిగ యుద్ధరంగమున మద్దివ్యాస్త్రపాతమ్ములం
గావింతున్ మృతుఁగా మదగ్రమున నీగర్వంబు దుర్వారమే. 204

చ. ప్రతియుగమందు దుర్మదులు పల్వురు నీవలె దేవపీడ సం
తతగతిఁ జేసి మచ్ఛరశతమ్ముల రూపఱి పోయి రింక నీ
గతియును నట్లకాఁ దలఁచి గర్వము వీడుము ధాత నీకు మె
చ్చి తివిరి యిచ్చినవ్వరము చెల్లదు పొల్లగు మచ్ఛరమ్ములన్. 205

ఉ. కావున దేవసద్మమును గర్వముతోడన వీడి పొమ్ము లే
దా, పెలుపేది శస్త్రములఁ దాల్చి రణమ్మున కేగుదెమ్ము నీ
కావర మింతలో నడఁచి కాలునిప్రోలికిఁ బంపి స్వర్గ మా
దేవతలందు నిల్పెద విధేయులఁ బ్రోచుట నాకుఁ జెల్లదే." 206

వ. అని మహిషునకుం జెప్పుము పొమ్ము నావుడు మంత్రి యయ్యంబిక కిట్లను. 207

ఉ. ఎక్కడిమాటలివ్వి ! మృగేక్షణ ! యౌవనగర్వసంపదన్
మిక్కిలి మీఱి పల్కెదు సమిద్ధపరాక్రమశాలి మావిభుం

దెక్కడ । బాల నీ పతని నెక్కటివోరున నిగ్రహించు లా
వెక్కడ । నమ్మ శక్యమగునే । విను మాతని శౌర్యసంపదల్. 208

ఉ. ఆతని సైన్యమొక్కవిధమైనది కాదు రథాశ్వనాగము
ఖ్యాతతమై పదాతినిచయాకులమై తగుఁ గామరూప వి
ఖ్యాతుఁ డతండు నిన్నడఁచు టబ్బురమే । లలితాంగి । దుర్మద
ప్రీతగజంబు మాలతి నశింపఁగఁ జేయుటయున్ భరంబొకో. 209

ఉ. నీయెడ మావిభుండు గడు నెయ్యము గల్గి చరించునప్పు దే
మో యువతీలలామ । కఠినోక్తులు పల్కి రసంబు భంగముం
జేయఁగ రామి నీకిటులు చెప్పుచునుంటి మఱింత యేల నీ
ప్రాయము సార్థకమ్ముగఁ గృపజా గనుఁగొమ్ము వరింపు మాతనిన్. 210

గీ. అతనిరాజ్యము ధనమును నఖిలమునుఁ ద్వదీయమగు భృత్యుఁడై సేవఁ జేయుఁబట్ట
రాజ్ఞివై మమ్ముఁబాలింప రాదె । భక్తి, భావమున నీకు మ్రొక్కెదఁ బంకజాక్షి.

వ. అనిఁ బహుభంగుల సామపూర్వకమ్ముగాఁ బోధించు వానికి నయ్యంబ యిట్లను,

ఉ. నీదగు తెల్వితేటలను నేర్పును నింతియ నిన్ను మంత్రిగా
నూఁదినవానికిం దెలివి యొప్పునె । యోపకబుద్ధి । యుద్ధ బు
ద్ధ్యాదులు నిద్దబుజా హతమనస్కులు నిద్దబు నిద్దతే వృథా
వాద మిదేల । ధాత తగువారిని గూర్చె జగమ్ము నవ్వఁగన్. 213

వ. ఏను స్త్రీ స్వభావమ్మునం జేసి వాని బలపరాక్రమంబు లెఱుంగనని కదా ప్రేలితి
వయ్యది నిక్కంబ. ఏను బురుషుం నొందెఁ దదనుగుణస్వభావ నగు స్త్రీ
నొందెఁ గాకుందునని వెండియు. 214

మ. అతిమూఢుండయి మున్ను మీప్రభువు శాసించె స్త్రీచేతఁ బం
చత నద్ధాతకతమ్మునన్, వినుము తచ్చాతుర్య, "మెంతే జాగు
స్త్రీతమౌ నంగనచేతఁ జచ్చు" టని తాఁ జిత్తమ్మునన్ రోయఁడ
మ్మతిహీనుం డిపు డవ్వరం బెదిరెఁ దామైమైఁ జనం బోలునే. 215

చ. "పురుషుని నన్ను నివ్వనిత పోర నెదిర్చి వధించునే" యటం
చరయక మృత్యు వీ నెపము నందినదంచు నెఱుంగునట్లు మీ
నరపతితోడఁ జెప్పు మొకనాతియ కాదు, తృణంబు వజ్రమై
పొరిఁగొనుఁ గాలపర్యయము మూఁడిన నెంతటివానికేనియున్. 216

వ. కాలంబు సమంజసం బగునప్పుడు వజ్రంబేనియుఁ దూలంబగునట్లగుటఁ దనకుం గల సైన్యమ్ములును నాయుధమ్ములుమఁ దక్కటి సాధనమ్ములును వమ్మగు నిక్షువంబని మఱియును. 217

ఉ. కాయము దాల్చువారలకుఁ గాదొకొ మృత్యువు ; నిక్కమేరికే
నాయువు నిశ్చలంబె ; జలజాసనుఁ డాదిగ నొక్కఁడేని ని
త్యాయుతుఁ డున్నె ; చావు లరయన్ బహురీతులు, దైవనిర్మితం
బై యిటు తన్ను మృత్యువు రయమ్మున మ్రింగఁగవచ్చు దుర్మతీ. 218

వ. ఎప్పని కెవ్విధమ్మున విధించి యుండు వాఁ డవ్విధమునఁ బొలియు, నిట్లుండఁ గొందఱు మూఢులు 'మాకు మరణమ్ము గలదు మే మెవ్వరికేని నవధ్యుల' మని విఱ్ఱవీఁగుదు, రట్లు గర్వించినవా రెవ్వరేని శాశ్వతులై యుండిరే ; యింతవట్టు నీప్రభువునకు బోధించి జీవింపఁగలఁడేని హవిర్భాగమ్ములను దివమును దేవాధీనం బొనర్చి తన వారితోఁ బాతాళమ్మున కరిగి యందు సుఖమ్ముగ నుండునట్లొనరింపుము నావుడు మంత్రి నిజాంతర్గతంబున. 219

ఉ. ఎక్కువ తక్కువల్ తెలియ కియ్యబలామణి ప్రేలుచున్న దీ
చక్కెరబొమ్మయుక్కడఁపఁ జాలియుఁ జాలకపోతి రాజు పె
న్మక్కువఁజేసి దీనిఁ దన మానినిఁగాఁ గొన నెంచి పంపిన
న్దిక్కములాక్షి యేమనిన నెల్లిదమై చన దింత నిక్కమౌ. 220

వ. కాదని యిత్తరుణితో నవికి నంతవకట్టితినేపి రసాభాసంబగు నట్లు విరసంబొనర్చి ప్రభుసన్నిధి కేగుటెట్లు నసుంజసంబగు ; అదియునుంగాక కామాతురుం డగుకతన నతండు నాకాక కెదురు చూచుమండు, నట్టియెడ నే నిద్దాని జయించినను నిద్దాని సమరమ్మున నోడినను విరుదెఱంగు నతని కప్రియంబ యగుంగాకేమి యాతనికడ కేగి చక్కఁగా బోధించి పిదప నతని యభిప్రాయాను సరణమ్మునఁ గార్యంబు నిర్వహించెద నిదియ లగ్గని యతండు మహిషపాలికిం జని కృతాంజలియై యిట్లనియె. 221

శా. నీయాజ్ఞం గొని యేగి కంటి నచటన్ నీరేజపత్రాక్షిఁ దే
జో యుక్తిన్ వెలుఁగొందు దాని శరసంపూర్త్యంచితాష్టాదశ
స్ఫాయద్బాహువిలాస సింహగత నవ్యాలాశిరోమౌళితో
నీ యందమ్మునఁ జందముం దెలుపుచు న్నే నిట్లు బోధించితిన్. 222

ఉ. మావిభుఁ డీత్రిలోకముల మన్నన కెక్కినవాఁడు విన్ను సు
శ్రీ వెలయంగఁ బట్టమహిషీపదమం దొగి విల్చి సేవకుం
డై పళవర్తియై మెలఁగు నాతనిఁ బొందుము మూడులోకముల్
నీ వశ యేలుకొమ్ము రమణీ! యెలప్రాయము సార్థకమ్ముగన్. 223

వ. అను నా పలుకుల కక్కామిని కనలి స్మితం బొనర్చి యిట్లనియె. 224

మ. మహిషీగర్భసముద్భవుం డులవ నమ్మందున్ సురప్రీతిధూ
ర్వహనై యేబలియిత్తు శక్తి కకటా! పాపాత్మ! నాబోఁటికిన్
మహిషుండా పతి! యెంత హీన యయినన్ మానంబుపెంపేది త
త్పహవాసం బొనరించునే? మహిషియోఁదద్యోగ్య తుల్యాకృతిన్. 225

చ. సురలకు వైరియై మిగుల నోలుచు మత్తిలి దుష్టుఁడై యహం
కరణమునన్ జరించు జనకంటకు నమ్మహిషాధమున్ వధిం
తు రయము మీఱ దైత్యతతికోడ రసాతల మేగెనేవియున్,
గరుణ దలిర్పఁగాతు" నవి కావర మెత్తి వచించెఁ బెల్పనన్ 226

వ. అంత నేనాదుర్భాషణమ్ములకు పైఁపక యుద్ధమ్మునకు నుంకింప నెంచి రసభంగం
బగు నవి యోజించి దేవరకు విన్నవింప నిట కరుదెంచితి. 227

ఉ. అంగనయయ్యు నెక్కుడు మదాలసయై బలముల్ జలంబు ను
ప్పొంగ నిరంకుశంబుగ రణోత్సుకయై చెలువారుదానితో
సంగర మాచరించుట యసాధ్యమ కా వగతున్ జయంబుఁ ద
ద్భంగము నన్ను పెయ్యెడల దైవవిధేయము లెంతవారికిన్. 228

వ. నావుడు మహిషుం డితిక ర్తవ్యతామూఢుండై వృద్ధులగు మంత్రుల రావించి యీ
యంగన దేవప్రేరితయై చనుదెంచిన శాంబరియగుమాయ యగుం గాకేమి మీర
లుపాయజ్ఞుల రిందు సామాదులయం దెయ్యది ప్రయోజ్యంబగు నిశ్వాసార్హంబుగా
వచియింపుఁ డనిన వార లిట్లనిరి. 229

గీ. పత్యమై ప్రియమైనవచనము పతికిఁ
దెలుపు టుచితంబు రెంటికిఁ దొలఁగకుండు
మాటదొరకదు రుచ్యమై మందు రోగ
హారి యగు పెందు దుర్లభం బంద్రు బుధులు. 230

గీ. అనృతమునఁ బ్రీతి పుట్టించు నతికపటులు, వేనవే లుంద్రు సత్యమ్ము వినుచువాఁడు
వినెడివాఁడును దానిని మననచేయు, వాఁడు మూగురు దుర్లభుల్ పార్థివేంద్ర. 231

వ. కావున నెడతెగని యిమ్మహాకార్యమ్మునందు నీ కెట్లు ప్రీతికరుల మయ్యెద మది
యునుం గాక రాఁబోవు శుభాశుభమ్ము లెవనికి వేద్యమ్ము లనవుడు మహిషుండు
మంత్రుల కిట్లను. 232

క. తప్పేమి మీకుఁ దోఁచిన, యొప్పున వచియింపుఁ డిందు యుక్తియుతంబై
చొప్పడువానివచనమున్, గొప్పఁగఁ జేసి కయికొందుఁ గోర్కె దలిర్పన్. 233

## మహిషుండు దేవికడకుఁ దాూఁముం బంపుట.

వ. నావుడు విరూపాక్షుం డను మంత్రిశ్రేష్ఠుం డతని కిట్లనియె. 234

చ. అనృతము సాహసమ్మును మృగాక్షీ నొ మ్మని నీవెఱింగి యి
వ్వనిత ప్రగల్భవాక్యములఁ బ్రౌఢిమ గోల్పడఁ జెల్లునే ? యొకం
డనక ననున్ వెసం బనుపు మవ్వనితన్ వధియింతు నొందెఁ గా
దనినను నాగపాశముల నంటఁగఁ గట్టెద, నిన్నుఁ జేర్చెదన్. 235

వ. పిదపఁ జేయునదిలేక వశవర్తినియై నీకోరినయట్లు వివిధ భోగమ్ములం దేల్చి
నీయం దనురక్తయై యుండు నిది నాకుం దోఁచిన తెఱంగు, త్రిలోకవిజయం
బొనర్చిన నీబోఁటి కొక్కబోటికై యింత తలంక వలయునే ? యిది బిభీషికా
మాత్రంబ కాని వేఱొండు గాదు నావుడు దుర్ధరుం డనుమంత్రి యిట్లనియె. 236

మ. అనుమానమ్మునఁ జూడ నవ్వనిత కామాసక్తగాఁ దోఁచె నం
గనలం దిట్టి బిభీషికల్ గలవు వక్రప్రక్రియం బూరుషుం
గని లోఁగొందురు హావభావవిదు లాకర్షింతు రీచెయ్వు, లి
వ్వనజాక్షీమణి నిన్నుఁ గోరి యిటు పైపై వక్రతల్ సూపెడున్. 237

చ. "శరముల నిన్ జయింతు" ననె సారసగంధి, తదర్థ మన్యగో
చర మగు బెట్టు ! లమ్మదనశాస్త్ర మెఱింగినవాఁకుఁ దక్క, భూ
వర ! శరముల్ కటాక్షములు, వ్యంగ్యవిధిన్ గ్రహియింపు తత్పరం
పరలు విగిడ్చి నిన్ను వశవర్తిగఁ జేయుతలంపు గాఁ దగున్. 238

వ. అమ్మగువ వచియించిన వాక్యమ్ముల కెల్ల నర్థం బిట్లన యోజింపవలయు నట్లు
గాదేనిఁ ద్రిలోకమ్ములం జయించి హరిహరాదులఁ జీరికిం గొనక నిష్కంటకమ్ముగ

రాజ్యంబు శాసించు నీవయి నొక్క యబల బాణపాతం బొనరించు టది యేటి మాట? ఇఁక నొక్కటి యవధరింపుము. "బాణప్రయోగం బొనరించి నిన్నుం బడ వైచెద" నని కదా, యత్తలోదరి వలికె! "పడవైచెద" ననుటకు వ్యాఖ్యానం బవ ధరింపుము. 239

చ. మొదలఁ గటాక్షపాతమున మోహితుఁగా నొనరించి మీఁద దు ర్మదమున యుద్ధరంగమను మంజులశయ్య బలాత్కరించి విన్ జదురుగఁ బండబెట్టి పురుషాయితబంధమునన్ గరంతు నం తదనుకఁ దాఁకు" మంట యది తత్త్వము దూతకెఱుంగఁబోలునే. 240

వ. మఱియు నిన్ను విగతప్రాణుఁగా నొనరింతుననుటకు నర్థంబు వినుము. ప్రాణం బనఁ దేజంబు దాని నపహరింతుననుట, యుత్తమాంగనలు వ్యంగ్యప్రదాన మ్మగాఁ గాముకు వరియించుట గామశాస్త్రసమ్మతంబు. నీ పట్టుండగువానిం బంచిన వాని కీ యర్థంబు గోచరం బగునే యని వెండియు. 241

ఉ. సామము దానముం గొలిపి చందనగంధినిఁ బొందు మొందు లే దీమెయి నీకుపాయ, మది యెంతటిగర్వము నేనిఁ దాల్పఁగా కేమి నుతెంత కోపవతియే నగుఁగా కిటు చేసినఁ జా వశం బై మరగున్ గ్రమమ్ముగ, మృగాక్షులభంగులు వక్రవక్రముల్. 242

క. పలుమాట లేల యచ్చిలు, కలకొలికిం దెచ్చి నీకుఁ గానుక సేయం గల నన్నుఁ బనుపు మావలఁ, గలవని నేఁ జూచికొనెదఁ గా కసురేంద్రా. 243

వ. అని పలుకునతని కద్దంబై తామ్రుం డిట్లను, "మహాత్మా యిట్టి కామాతురయు వ్యంగ్యార్థచతురయు నీయందనురక్తయుంగామి నిశ్చయంబు. 244

ఉ. ఆదర మూఁది నాపలుకులందలి యర్థము సంగ్రహింపు మ ష్టాదశబాహువుల్ నిశితసాయకముల్ గల దీనివంటి బల్ గాదిలివన్నెలాఁడి నొకకాలమునందును నెందుఁ జూడఁగా రా దిది యెద్దియో కదు భరంబుగఁ దోఁచు నరిష్టహేతువై. 245

వ. దీని కనుగుణమ్ముగ నాకుఁ బెక్కులు దుస్స్వప్నమ్ము లింతకుమున్న ప్రతిదినమ్మును బొడముచున్నయవి. నేఁటి యుషఃకాలమ్మున నొక కాంత కృష్ణాంబర ధారిణియై యేడ్చుచు గృహాంగణమ్మునఁ బొడకట్టె నిది యిట్లుండ. 246

క. ప్రతిదినమును వికృతములగు, రుతు లడర విలక్షణంపు రూపునఁ దగు ప
క్షితతులు గృహములపై రా, త్రితతిన్ గూయంగఁ దొడఁగె దేవర ! వింటే. 247

వ. ఈదుర్నిమిత్తమ్ముల కెద్దియేని నొకకారణం బేర్పడవలయు. నియ్యెడ యుద్ధరంగమ్మున సన్నద్ధయై యున్నయంగన గంధర్వియు మానుషియు నాసురియుఁ దదన్యయుం గామి తెల్లంబు. దేవప్రేరితయైన యొకమాయ గావలయు నెట్లేని నగుఁగాక సంగరమ్మునకు సంతనకట్టి వెడలుట కర్జంబు జయాజయమ్ములు దైవాధీనమ్ములగుట బుధుండప్పట్ల నిర్భయుండు గావలయు శుభాశుభమ్ము లేరికిని వార్యంబులు గావు" నావుడు మహిషం డతని కిట్లనియె. 248

ఉ. నీ వచనమ్ము లింత తగునే చను మిప్పుడ యుద్ధమందు బల్
చేవ యెలర్ప నవ్వనిత లీలమెయిన్ వశఁగా నొనర్చియుం
దే వెర వయ్యెనేని యటుతె మ్మటు దక్కనఁ దీవ్రబాణముల్
ప్రోవులు గా నిగిడ్చి జము ప్రోలికి దాసి నొనర్చు మేత్తైఱన్. 249

ఉ. వీరుఁడవై స్మరాగమవివేకివి నాఁ గర మొప్పు నీదుగం
భీరత నేఁడు చూడవలె నే చని వేగిరపాటు దక్కి యం
భోరుహనేత్ర యియ్యెడకుఁ బోరఁగ వచ్చెనొ, పొందవచ్చెనో !
నేరుపుమైఁ గనుంగొనుము నిక్కమెఱింగి దొడంగు మాజికిన్. 250

గీ. కేవలము పెర్దయుండవై కినియ కత్త, లోదరీమణి నెమ్మది నున్న తెఱఁగు
నరసి యప్పటి కనుకూలమైన వలని, ననుసరింపుము పొమ్ము జయమ్ముఁగొమ్ము.

వ. అని యానతిచ్చినఁ దామ్రుండు కాలవశుండై సైన్యమ్ములు గొలువ మహిషునకు నమస్కరించి వెడలి యెడనెడఁ బొడము దుర్నిమిత్తములు గణింపక చని ముందట.

క. హర్యక్షముపై నెక్కి య, వార్యాయుధహస్త యగుచు వచ్చిన యుద్యద్
ధైర్యఁ గనె లోకనాయిక, నార్యన్ దివిజావళీసమారాధ్యపదన్. 253

వ. ఇట్లు కాంచి దౌదవ్వుల నిలిచి నయుక్తికమ్ముగ వినయపూర్వకమ్ముగ నిట్లనియె.

ఉ. శృంగి నెఱుంగుదే ! యతఁ డజేయపరాక్రముఁ డెల్లరూపు లా
రంగొన నేర్చువాఁ డబల ! రాక్షసశేఖరుఁ డావిభుండు నీ
కుం గడు లోఁగి నీదుగుణకోటి గుణించుచు రూపమెంచి పా
ణిం గ్రహియింపఁ గోరెడు గణింపఁ దరంబె భవద్విశేషమున్. 251

## తామ్రుండు దేవితో సంభాషించుట.

క. మాయేలిక కేలికవై, నీ యిచ్ఛకు వచ్చినట్లు నిర్జరభువన
స్థాయినివై నందనమునఁ, బాయక విహరించుకంటె భాగ్యము కలదే. 256

ఉ. సుందరమైన దేహ మిటు చొప్పడె నీకుఁ బురాకృతంబు మే
లందినదాన వౌట నకటా యిది యెట్లు ఫలించు మావిభుం
బొంది సుఖింపవేవిఁ బువుఁబోఁడిరొ! కల్పకసూనవిస్ఫుర
త్కందుకముల్ ధరింప కిటు కత్తులఁ బూనఁగ నేల పాణులన్. 257

ఉ. మానిని! యేలొకో, తెలివి మాలి ధరించితి చాప మత్ప్రసం
ధానముతోడ? భ్రూలతలు నాణెపుఁజూపులఁ దత్తదర్థ సం
ధాన మొనర్పఁ జాలవొకొ! తన్వి! సుమమ్ములఁ బూని యైన నె
వ్వానికిఁ బ్రీతి గావి యవి పల్లవపాణికి నీకుఁ జెల్లునే. 258

వ. అదియునుంగాక నింకొక్కఁడు వచియించెద యుద్ధమ్మునకన్న సంసారికి వేఱొండు దుఃఖమ్ము లే దైనను లోభావృతులై యుద్ధానికి మదాంధులు నడుకట్టుదురు, నీబోఁటి బోటి కియ్యది యేల? అనుగ్రహించి దేవదానవపూజితుండై లోకమ్ములెల్లఁ దాసయై యతిశయించు నస్మదధిపతి మహిషాసురు వరియించి పట్టమహిషివై యిష్టోపభోగమ్ము లనుభవింపుము సంగరమ్మున నేరికేని జయంబు సంశయగ్రస్తం బింతయు నీతివేదిని వగు నీకుఁ దెల్లంబయుని వెండియు. 259

చ. అతని వరించి యౌవనమునందు సుఖమ్ములు గూడఁ బెట్టి ని
ర్జితసురనాథుఁడై మహిమచేనకు మించెడివాని లోకసం
స్తుతు సుతుఁగాంచె దీవు కడు సుందరుఁ దత్తనుజుండు మీఁద దై
త్యతతికి రా జగుం దనదుధాటి సురాసురులెల్ల మెచ్చఁగన్. 260

వ. అను తామ్రునివచనమ్మును విని మేఘగంభీరభాషణమ్ముల నయ్యంబిక యిట్లనియె.

శా. ఓరీ తామ్ర, కటుప్రలాప! విను మీ యుక్తుల్ సహింప న్మనం
బేరం బంచినవానితల్లివలె గేదె న్నేను గా, వట్టి దు
ష్ప్రారంభున్ యవసాశి న మ్మహిషుఁ గామార్తున్ వరింపంగ నా
కేరీతిం దగుఁ బుచ్ఛముం దురుదరం బేలీల నేఁ దాల్చెదన్. 262

క. హరిహరనీరజాసనుల వష్టదిగీశులఁ గోర కక్కటా!
మరుచిరమూర్తియించుఁ దమ మానశరార్తుఁ దృణాశి శృంగి నే

వరువిఁగఁ బొంది లోకమున వారని దుర్యశ మంద వెట్టినుం
దరినె ! పతుఁడా వరింపఁదగు తన్వియుఁ గల్గెనె యేయుగమ్మునన్. 263

వ. అదియునుంగాక నిర్గుణుండును నిర్మముండును సర్వసాక్షియు సర్వకర్తయు నక
ర్తయు సర్వజ్ఞుఁడును సర్వగుఁడునుఁ బూర్ణుండునుఁ బూర్ణాశయుండును శివుం
డును శాంతుండును సర్వభావమండు నగు పురుషుండు మద్భర్త. అతనిఁ ద్యజించి
హేయతాభాజనమ్మగు దేహమ్మునం బొల్చుమందాత్ము నధముఁ ద న్నే మని వరి
యింప నుంకింతు నని వెండియు. 264

ఉ. శాతశరాశిఁ గాలుమహిషంబుగఁ జేసెద మీవిభున్ మరు
ద్భూతికిఁ దక్కి భీతిమెయిఁ బోయి రసాతల మంటియున్న వ
క్కాతరుఁగాతు వింతయును గ్రక్కునఁబోయి వచించి యుద్ధపుం
జేఁతకుఁ బిల్వు మత్తులవఁ జెచ్చెర వచ్చినఁ ద్రుంతు వ్రేల్మిడిన్. 265

శా. భగ్నాశుండు ననున్ వరించునె ! మదప్రాగ్భారదుర్వారధీ
మగ్నాత్ముఁడా మహిషాధముం దను వికామప్రోజ్జ్వలన్మామకా
స్త్రాగ్నిజ్వాలలఁబ్రేల్తు నంచెఱుఁగఁడౌరా ! తామ్ర ! యంచున్ రిపుల్
భగ్నప్రాభవులై కలంగ రవముం బూరించె ఘోరమ్ముగఁడా. 266

శా. స్వర్భూదుర్భర మైనయారవమునన్ సప్తాంబుధుల్ దూలె నం
తర్భారంబు సహింప కద్రులు ప్రతిధ్వానమ్ము లిచ్చెన్ భయా
విర్భావమ్మున దైత్యసంఘములు కంపించెఁడా దదీయాంగనా
గర్భమ్ముల్ పగిలెన్ దిశావలయ మేకంబాయె నొక్కుమ్మడిన్. 267

ఉ. ఆ రవ మాలకించి భయమంది పలాయనశాలి తామ్రుఁడెం
దే రయ మార నమ్మహిషధీరుని సన్నిధి కేగె. మున్న త
త్ప్రారులకర్ణముల్ బధిరభావము దాల్చె ననంతరంబు నా
గారియు గర్జిలెఁడా ద్విగుణ మయ్యె భయమ్ము సురారికోటికిఁడా. 268

వ. పిమ్మట మహిషుండు భయత్రస్తుండై తన కడ కరుదెంచిన తామ్రుం గాంచి నచి
వులదిక్కు మొగంబై చింతాదంతురం బగు చిత్తమ్మున నుత్తలపాటుగదుర
నిట్లనియె. 269

మ. గరువం బేది రసాతలమ్మునకుఁ బోఁగా నెంతుమో దుర్గ మె
వ్వరికిం భేద్యము గానిరీతి నొనరింపం జూతుమో లేక సం

గరరంగమ్మున నత్తలోదరిఁ గడుఁ గారింతుమో యెంచి మీ
ర్వరబుద్ధుల్ వచియింపుఁ డియ్యెడల శాస్త్రప్రక్రియాధుర్యులై. 270

గీ. మంత్రమూలంబు రాజ్యంబు మహిపతులకు, నదియు గుప్తమ్ము గావలె నట్లు గాని
చో వినాశమ్ము గలుగు నిచ్చో ననుగుణ, మైనవలను విచారింపుఁ డయ్య మీరు. 271

ఉ. వచ్చినకాంతగా దబల, వైశమ వీథి జయింప రాదు తా
నచ్చపలాక్షి యొక్కటిగ నాహవకేళికి నిర్భయమ్ముగా
వచ్చుట కొంత చింత్యమగు వారక వోరితి మేని మీఁద మే
ల్వచ్చునొ! కీడు వచ్చునొ! శుభం బశుభం బెవఁ డోపుఁ జెప్పగన్. 272

వ. ఉపాయవాదులు కొందఱు దైవం బన నెద్ది యెవ్వఁ డెఱుఁగు నోపినవట్టు యత్నం
బొనరించుట కర్జం బండ్రు. కొందఱు దైవమ్మును నుద్యమంబును గార్యసిద్ధి
ప్రదంబు లని చెప్పుదురు. మీమీ బుద్ధిబలమ్మున నిం దెయ్యది శ్రేయమో వివరింపుఁ
డనుడు బిడాలుండను మంత్రి యతని కిట్లనియె. 273

సీ. మహిషేంద్ర వింటె! యిమ్మహిళ సురప్రేర, ణంబున నిటకు యుద్ధంబొనర్ప
నేతెంచె నిక్కాంత యెల్లసురలయంశ, ములఁ బుట్టుటయు నిక్కముగ నెఱుఁగ
నయ్యె. త్రిభీతు ని న్నమరులు వంచింప, నిప్పాట యోజించి రిక్కతమునఁ
గాదె దౌదవ్వులఁ గదిసి యెల్లరు సహా, యులు గాఁగ నుంకించుచున్నవారు

గీ. మనము రణమున కేగిన వనజనేత్రుఁ
దొట్టి సురలెల్ల నసురులఁ గిట్టఁ జేయఁ
గడఁగుదురు నిమ్నమాత్ర మక్కాంత చంపు
వెఱిఁగి తగుయత్న మొనరింపు మింత నిజము. 274

వ. నా బుద్ధికిఁ దోఁచిన విధమ్మునఁ జెప్పితి భవితవ్యం బెఱుంగ నంత సమర్థుండనే!
నీ కెయ్యది సులభంబగు నట్లు పచరించునది యేకాకినియై కామిని యుద్ధార్థిని యగుట
యెంతకేనియు నక్కజంబగు ననునంత దుర్ముఖుండను సచివుం డిట్లనియె. 275

చ. జయ మిఁక నీకు లే దనుట సత్యము నావచనంబు తప్ప ద
ట్లయినఁ "బలాయనంబు వర" మన్నసురావళినెల్ల నోర్చి యొ
క్కయువతి కిట్లొనర్పుటయుఁ గాదు, రణం బొనరించి చచ్చినన్
బయి నెగడున్ యశంబు జయపక్షమునన్ సుఖ మప్రమేయమౌ. 276

వ. అనిన బాష్కలుం డిట్లనియె. 277

ఉ. ఏ నొకరుండనే చని జయించి యమాలయ మేగునట్లు ల
మ్మానివిఁ జేయు వాఁడ ధృతిమంతుఁడ వయ్యు నధీరుఖంగి నీ
కౌనె భయమ్ము చెంద; నమరాధిపుఁ దొట్టి దిగీశులెల్లరన్
దీనులఁజేసి యిక్కరణిఁ దేఁకువ దక్కుదురయ్య! కాంతకుల. 278

గీ. ఈవు సంగ్రామమునకు రానేల! నన్నుఁ, బంపు మొక్కింతమాత్ర నప్పడఁతిఁ జంపి
మగుడ నీకడ కరుదెంతు మహిషరాజ!, మామకీనబలంబు సామాన్యమయ్య! 279

వ. అంత దుర్ధరుండు వినతుండై యిట్లనియె. 280

ఉ నీ కయి దేవతల్ మిగుల నేర్పునఁ బన్నినయాలతాంగి మా
యాకృతి నొక్కఁ్రేల్మిడి శితాస్త్రపరంపరలన్ వధింతు నా
నాకుల కాకుఁత్వము రయమ్మునఁ గూర్తు బిభీషికార్థ మీ
రాక యెఱుంగు, మింతయుఁ గరంబు తిరంబుగ నిర్వహించెదన్, 281

వ. అంతియకాని రాజనీతివిరుద్ధంబగు తెరువునఁ బోవలదు. మఱియొక్కటి వినుము లోకమ్మున సేవకులు సాత్త్వక రాజస తామస భేదమ్మున మూఁడు తెఱంగులవా, రందు సాత్త్వికులు స్వామికార్యమ్ములు సాధించుచుఁ దదవిరోధమ్మునం దమ కార్యమ్ములు నిర్వహించుదురు రాజసులు స్వకార్యతత్పరులై యొక్కొకతఱివి స్వామికార్యంబులను యదృచ్ఛగా నిర్వహించుదురు, తామసులు స్వామికార్యంబు దిగఁద్రొక్కి స్వకార్యతత్పరత్వమ్మున వలనగునెడ మార్తురం గలసి ప్రభుచ్ఛిద్రమ్ములు వెలిఁజేయుచుఁ గోశగుప్తంబగు వసివడువున భీతిం గొలుపుదురు. 282

క. కావునఁ దాదృశులగు దు, ర్భావుల నమ్మంగఁజనదు ప్రభువులు, మంత్రం
బా! వెలికిఁ బోవు కార్యం, బా! విపరీతించు నట్టియదయుల కతనల. 283

## బాష్కలదుర్ముఖులు దేవితోఁ బోరుట.

వ. అట్లగుట నీవు నిశ్చింతమ్ముగ నుండు మేమును బాష్కలుండునుం గలసి యరిగి యక్కామినిం జయించి నీకడకుం దోడితెత్తుమని యిరువురును గృతనమస్కారులై దిక్కులు గ్రక్కదలఁ బిరమ్ము వెలువడి దేవింగాంచి యిట్లనిరి. 284

ఉ. ఓ నళినాయతాక్షి! వినుమొక్కఁడు వంచెద మేము విన్ను, మా
దానవనాయకున్ మహిషుఁ దత్పరతన్ వరియింపు మాతఁడుల
మానవరూపమునంది విను మన్ననఁజేయు రహస్యమందు; దు
ర్మానముమైనవిం గడఁగి మానముఁ బ్రాణముఁ గోలుపోదురే. 285

వ. కామరూపుఁడగు మారాజుతో సకలభోగమ్ము లనుభవించుచుఁ ద్రిలోకమ్ముల కేలి
కపై యేలికొమ్ము నావుడు దేవి యిట్లనియె. 286

గీ. ఎంత కామినియయ్యుఁ దా నేలతాంగి
యధముఁ బఱుపు వరింపఁగ నాత్మ నెంచుఁ
గులము శీలమ్ము గుణమును గలుగు తగిన
వరుని వరియించుఁ దన కంత వలయునేని. 287

చ. వెడవెడ మాటలాడుచు విభీషిక లియ్యెడఁ జూప కింక మీ
యొడయనియొద్ద కేగి సమరోన్ముఖుఁడై చనుదెంచునో, రయం
బడర రసాతలమ్మునకునై చనునో తెలియంగఁబల్కు యి
య్యెడ కఱదెంచి నొద్దుఁ డిఁక నే సహియింప దురుక్తు లాడినన్ 288

ఉ. ఆ కఠినోక్తులన్ విని దురాత్ములు దైత్యులు బాణవృష్టి పెం
జీఁకటి గ్రమ్మఁగాఁ గురియఁ జెచ్చెర నజ్జగదంబ సింహనా
దాకులులై రిపుల్ బెదర నంపగముల్ విగిడించి నంత దు
ర్దీకుఁడు బాష్కలుండు చనుదెంచెఁ జమూతతి కగ్రగామియై. 289

క. ధట్టుండై యస్త్రమ్ముల, నెట్టన నద్దేవిమీఁద విగిడించిన న
ప్పట్టున నయ్యంబయుఁ దా, బిట్టేసె శరములు వేనవేలు గడంకన్. 290

వ. ఇట్లు బాణపరిఘాసిఘాతమ్ముల విఱువురుం దుములమ్ముగాఁ బోరుచుండి, 291

శా. ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ము నద్దేవి య
స్తోకాహంకృతి వానిపై విడువ నా సోఁ కన్నిటిం ద్రుంచి వి
ర్భీకుండై యొకయేడు బాణముల దేవిం గొట్టి బిట్టార్చె రౌ
ద్రాకారమ్మున నంబయున్ దశశితాస్త్రావిద్ధు జేసెన్ రిపున్. 292

ఉ. వానిశరమ్ములం దునిమి వాఁడిశరమ్ముల నోవ నేసి య
మ్మానవఖాదిచాప మవమానరయమ్మునఁ ద్రుంచి సింహనా
దానుగతిం జెలంగె జగదంబ, సురారి గదాత్తహస్తుఁడై
పూనిక నేగుదెంచె వలపుష్పసుగంధివిఁ బిల్కుమార్పఁగన్. 293

మ. అటు లేతెంచెడి బాష్కలుంగని గదన్ హస్తమ్మునం బూని యొ
క్కటి కయ్యమ్మున మూర్ఛవోనడఁచె నక్కంజాక్షి; వాఁడంతలోఁ

బటువేగమ్మున మూర్ఛఁ దేఱి గదవైవన్ దాని వారించి మి
క్కుటమౌ శూలమున న్నిలింపరిపునక్కుంజించె నయ్యంబయున్. 294

ఉ. శూలముదాఁకి బాష్కలుఁడు సోలి యమాలయగామియై మరు
జ్జాలమువంత దీర్చె నది పైఁపక దుర్ముఖుఁ డాగ్రహమ్మునం
దూలఁచుఁ దేరి నెక్కి 'విను తొయ్యలి! యెక్కడకేఁగ వచ్చు ని
న్నాలములోఁ బొరింగొనెద' నంచు శరమ్ముల ముంచి యెత్తినన్. 295

ఉ. వక్త్రము జేవురింప సురవైరులు భీతిల శంఖనాద సం
సక్తములై దిశల్ గలఁగ శక్తి గుణారవ మాచరించి త
న్మక్తములైన మార్గణసమూహములన్ బొడిచేసి వానిపై
శక్తిముఖాయుధమ్ముల నసంఖ్యముగాఁ బరఁగించె నుద్ధతిన్. 296

వ. అంత దుర్ముఖుండు తత్తదాయుధమ్ముల నాత్మసాదనమ్ముల మరలించుచు నుక్కుమిలిగి యంబికపై ననేక శరమ్ముల విగిడించుచుఁ బోరాడు నవసరమ్మున నంగరమ్ము దుర్భరంబయ్యె. 297

గీ. అంబచే నవిఁ జచ్చిన యమరశత్రు, వికరముల గాత్రముల నుండి వెగసి రక్త
మేఱు గట్టె శివాకాకగృధ్రసార, మేయములకెల్ల సంతోషమాయతముగ. 298

ఉ. దుర్ముఖుఁడిట్లు బ్రకోపగతి దోఁచఁగ హస్తము నెత్తి పల్కె దు
ష్కర్ముఁడు "వింటె యోజలజచారువిలోచన! మాన్నృపాలు నం
తర్మద మేది పొందు మటు దక్కిన నిన్ బరిమార్తు నుజ్జ్వల
ద్ధర్మవిముక్తతీవ్రవిశితప్రదరమ్ముల పాలు సేయుచున్." 299

ఉ. దుష్కరమైన కోపమునఁ దోఁగుచు నంబయు వానిఁబల్కె 'మీ
బాష్కలుఁ డేమియయ్యెర యపాత్ర! యపత్రపఁదక్కి దుర్మదా
విష్కరణంబు సేయఁగలవే యిఁకఁ గాలము డగ్గఱయ్యె నీ
శుష్కవచఃప్రసంగములు చూచెదఁ జక్కఁగ విల్వ మాజికిన్. 300

ఉ. శాత్రవుఁ డంబ పల్కులకు పైఁపక కోపకరాళవక్త్రుఁడై
మాత్రవ వించె నెక్కుడగుమార్గణముల్ ధృతిఁబూని యా జగ
న్మైత్రి శరమ్ముల న్నఱికి పీఱుగఁజేసి యొకంట వాని దు
ర్గాత్రము గ్రుచ్చె విక్కరణిఁ గర్కశ మయ్యె రణమ్ము వారికిన్. 301

ఉ. శూరులు మెచ్చఁ గాతరులు సోలి భయంపడ నొక్కట న్నిలిం
పారి శరాసనమ్ము ధనుమాడి శరమ్ముల నేవిటన్ వెసన్
దేరు బడల్పడ న్నజికి దేవి భయంకరమూర్తిగాఁగ దే
వారి గదన్ గ్రహించి రయమారఁగ సింగముఁ గొట్టె బిట్టుగన్. 302

శా. తత్తాదృక్షగదాభిఘాతహతమూర్ధంబయ్యు హర్యక్ష ము
న్మత్తప్రక్రియ నీడఁ బోక నిలువ న్మర్త్యారి కోపించి యు
ద్యత్తీవ్రస్థితిఁ బైకి రాఁ గని కనత్ఖడ్గంబు చేఁ బూని సం
కృత్తస్ఫీతకిరీటమస్తకునిఁ గా నేసెన్ సురల్ మెచ్చఁగన్. 303

వ. ఇట్లు దుర్ముఖుండు సమసిన హతశేషులైన రక్కసులు పలాయమానులై యరిగిన మహిషుండు వారలం గాంచి "యేమియయ్యె" నని యడిగి కలతెఱం గెఱింగి క్రోధమ్మును సంతాపమ్మును బెనఁగొనఁ దక్కటిమంత్రులం గాంచి. 304

గీ. అక్కటా ! బలవంతులై యమరవరుల, నోర్చి పెం పెక్కనట్టి యీయోధు లిట్లు
నత్తరే యీఁడుదానిచే ! శక్యమగునె, కాలయోగమ్ము దాఁట నొక్కనికినేని ? 305

## చక్షురతామ్రముల యుద్ధము.

వ. అని వనటం గుందు రాజు నాలోకించి చక్షురుండు దేవా ! యింత వగవ నేల నే నేగి యీ క్షణంబ యమ్మానినిం బొరిగొందు నని యాజ్ఞం గొని తామ్రుండు దనకు బాసటగా దిక్కులు పిక్కటిల్ల సింహనాదమ్ము లొనర్చి పేర్చు దైత్యచమూసమూహమ్ములతోఁ గదలి చను దెంచుచుండె; నవ్వాని దొదవ్వులం గని, 306

ఉ. అంబిక ఘంటికానినద మారఁగ శంఖరవం బొనర్చి మ్రో
యం బిగలాఁగ శింజినియు నద్భుతరావ మొనర్చె దాన భీ
తిం బడి పాఱు దైత్యులగతింగని చక్షురుఁ డాఁగి పల్కె వై
శంబ వధింతు నియ్యబల లా వఱనేటికి నిల్వుఁ డుద్ధతిన్. 307

మ. అని చాపమ్మును గేలఁ బూని జవితాహంకారదుర్వారుఁ డ
య్యువు నద్దేవినిగాంచి యిట్లను మహోద్యోగమ్మునన్ మ్రోయు నిం
గని భీతిల్లెడి వాఁడఁ గాను వినుమీ కంజాక్షి ! నిం జంప నె
మ్మన మెంతే వెనుదీయుచున్నయది సంభావించి దోషస్థితిన్. 308

ఉ. అక్కట! వారనేత్రలు గటాక్షములన్ గురిపించి సంగరం
బెక్కటిఁ జేయుటల్ గలుగునెమ్మెయి నో సరసీరుహాక్షి! నీ
వెక్కడ! కర్కశాస్త్రముల నేయుట లెక్కడ! పుష్పమేనిఁ బై
మిక్కిలి దెబ్బ నీదు మనుమేనిపయిఁ బడె నేని యుగ్మలీ. 309

గీ. క్షాత్రధర్మానుజీవుల జన్మ మెంత, నిర్దయాత్మక మెమ్మెయి నెమ్మి గలిగి
పెంచుకొను దేహమును గడుఁ బేశలమ్ము, గాఁ దలంపక ఖండింత్రు ఖడ్గతతుల.

గీ. ధనలోభమ్మునఁ గత్తులు, గొని పశులం బొడిచి తృప్తి గొందురు లోకం
బున మూర్ఖు, లెంత కేనియుఁ, జొనుపం దండనము ధనము సుందరి! యెందున్.

చ. తెలిసినదాన వయ్యు నిటు తేఁకువఁ దక్కి లతాంగి! భోగజ
మ్మగు సుఖమ్ములన్ విడిచి పో రొనరింపఁగ నేల పేర్మి నా
పలుకులు సమ్మతించి సురపాలుర నొంచి దివంబు గొన్న ధీ
రలలిత మానిభుం గొని కరంబు సుఖింపుము నీకు మ్రొక్కెదన్. 312

ఉ. కత్తులు హత్తి శస్త్రములు గాఁడి శరీరము భిన్నభిన్నమై
మిత్తికిఁ బాలుగాఁగఁ బయి మిక్కిలి నక్కలు కంకగృధ్రముల్
నెత్తురు గ్రోలి మాంసమును నెమ్మిమెయిం దిని యాడ్చు నక్కటా!
మెత్తురు సత్కవీంద్రు లవి మేటిగ నేమిగుణంబు చూచిరో! 313

క. అనిఁ దెగినవారలకు నా, కనివాసము గలుగునండ్రు గా కే మది యెం
త నిజమొ తెలియదు నా బు, ద్ధిని విని మారాజు నెనయఁ దివురు మృగాక్షీ. 314

చ. అన జగదంబ పల్కుఁ గడు నాఅడికూఁతలు గూయఁబోకు శా
స్త్రనిధివి వోలె నీల్గెదవు రాజులనీతి యెఱుంగుదే? మహా
జనసహవాస మెయ్యెడల సల్పక కాననవీథు నేస్తమం
దిన నినుఁబోటికిం దెలియునే! శ్రుతిగమ్యములైన ధర్మముల్. 315

చ. సురలకుఁ జెట్టచేసి కడుశూరుఁడువోలె మదించినట్టి ము
ష్కరు మహిషాధమున్ జముని సద్మము చేరఁగఁజేసి శాసనా
క్షరములతో జయార్థమగు కంబము నియ్యెడ నిల్పుదాన సు
స్థిరత యెలర్ప నిల్పి యవి సేయుము నిన్ మొదలన్ వధించెదన్. 316

వ. జీవితేచ్ఛాగ్రంథిగ్రస్తుండ వయ్యేదేని నీ రాజునకు బుద్ధి సెప్పి హతశేషులతోఁ బోవ

శమ్మనకుం బోపునట్లు పేయు మనవుడు దానవుండుఁ గ్రోధమూర్ఛితుండై ఘనా
ఘనాసారమ్ములు వోని శరంబులు గురిసిన, 317

ఉ. ఆ జగదంబ వాని ప్రబలాస్త్రములన్నియు మగ్గుచేసి స్వా
రాజముఖామరుల్ వొగడ రక్కసుపైగదవైచె దానఁ దా
రోఁజుచు మూర్ఛవోయెఁ గడురోషము గల్గియుఁ బక్షురుండు; బ్రో
త్తేజితశౌర్యుఁడంత నరుదెంచెను దామ్రుఁడు చాపధారియై. 318

ఉ. వచ్చిన తామ్రుఁగాంచి రిపుభంజని యజ్జగదంబ "రమ్మ నీ
మచ్చర మేద నజ్జముని మందిరముం జొరఁజేసి పుత్తు మీ
వచ్చినవార్తఁదా విని వెసం జనుదెంచెడిఁ గాక దుర్మదుం
డచ్చపలుండు మీకుఁ బ్రభువైన హయారి రణంబుసేఁతకుణా, 319

క. మీరెందఱు వచ్చిన నా, క్రూరుఁడు మహిషుండు చావు గూరకయున్నన్
గోరిక తీరదు సురలకు, రా రమ్మను మద్దురాత్మ రణమొనరింపన్. 320

శా. మా యన్యోన్య పరాక్రమమ్ములవసల్ మా యుద్ధచాతుర్యతే
జోయుక్తుల్ గనుఁగొందుగాక చని తుచ్ఛున్ బుచ్ఛవిభ్రాజితుణా
డాయంబంపుము మీ విభున్ జమువిఁగూడం జేసెద న్నాఁగ 'నో
హో' యంచుణా వడినార్చి యేసెశరముల్ యుద్ధార్థితామ్రుండొగిణా. 321

మ. శరవృష్టిణా శరవృష్టి నేర్చి కడఁకణా శౌర్యం బవార్యంబుగా
విరుగేల విగిడించె భల్లములు దేవేంద్రాదు లగ్గింప న
య్యరవిందావన, మూర్ఛదేఱి తగఁ దా వయ్యంబికం బక్షురుం
డురుఁడై మార్కొనె విర్వరం బదిపెఁ గ్రోధోత్సాహయై యంబయుణా, 322

వ. దానికిం గనలి రక్కసులెల్ల నొక్కపెట్టన చుట్టుకొని పరశుపట్టిసఖడ్గముసల
భిండివాలాద్యనేకాయుధమ్ము లయ్యంబ పయిం గిలించినఁ బోరు ఘోరంబయ్యె.

ఉ. తాళసమంబు లోహజము దారుణమై విలసన్మణీఘృణుల్
గ్రాల వెసంగు నొక్కముసలంబు కరంబునఁ బూని తామ్రుఁ డా
భీలత దోఁప సింగముమ బిట్టుగఁ గొట్టె శిరమ్ము రక్తధా
రాళము గాఁగ దానికిఁ గరమ్ముమ నంబిక తీక్ష్ణమూర్తియై. 324

క. అసివెటికి వానిశిరమున్, వెన నణకిన మొండె మొక్క వ్రేల్మిడిఁగేలణా
ముసలంబడర నటించి ర, ణసరణి నంతంతఁ బడియె నాక లలరఁగణా. 325

వ. అంతఁ జక్షురుండు తామ్రమురణమ్మునకు నవుడుగఁదలిచికొని ఖడ్గమ్ము కేలం బూని సింహనాదం బొనర్చి యురువడించిన జగదంబ కోపాకులయై, 326

మ. ఒకబాణమ్మున ఖడ్గము న్నలకి వేఱొక్కంట హస్తంబు భూ
మికి హత్తించి మఱొక్కటన్ శిరముపే ర్మిన్ దొల్లఁగా నేసి ది
జ్నికరాఖిలముగాఁగ గర్జిలిన భగ్నీభూతమై దైత్యపై
న్యకదంబం బుడివోయె నొల్కిరి ప్రసూనంబుల్ సురల్ దేవిపై. 327

వ. అట్లు చక్షురతామ్రు లిరువురుం జచ్చుట విని శోకించి మహిషుఁడు దురాగ్రహ గ్రస్తుండై యసిలోమబిడాలాదుల ననేకుల ననేకసేనలతోడం జతఁజేసి పనిచిన వార లరుదెంచి యష్టాదశభుజాగ్రజాగ్రదాయుధమండలయగు చండికం గాంచి విస్మయాకులులగు నెడ నసిలోముండు వారలకుఁ గన్నాకై సేనాముఖమ్మున నిలిచి వినయమ్మున నయ్యంబ కిట్లనియె. 328

శా. దేవీ కొండొక చెట్ట నీయెడల నెందేఁ జేయఁగారావి న
ద్భావుల్ దైత్యులు వీరలిట్లు బొలియం దార్థ్యోలు నీకేల ? నీ
రావేశమ్మున దుఃఖదంబగు రణం బాసింతురే ! సంధిమై
నావెంటం జనుదెమ్ము నీవలయు నానావస్తువుల్ గైకొనన్. 329

ఉ. సారము లేని సంసరణసాగరమందు సుఖంబు గ్రాహ్య మె
వ్వారికి, శాంతిమై నదియుఁ బొల్పదు, దానికిఁ దక్క మార్దవ
శ్రీ రుచిరంబు కాయము కృశించి నశింపఁగ నేల చెప్పుమా
ఘోరరణమ్మునం దిటులు గోరికచెందితి దుష్కరమ్ముగన్. 330

## అసిలోమ బిడాలాదు లనికి వెడలుట.

క. అసుఖము రెండు తెఱఁగుల, భాసిలు నిత్యం బనిత్యపదనియు నా, ని
ద్యాసంగతిఁ బరు నెఱుఁగుట, యే సుఖమగు నిత్య మది, తదితర మితరమౌ. 331

వ. ఇందు నాశాత్మకంబగు భోగసంభూతసుఖంబు తత్త్వజ్ఞులు త్యజించి నిత్యంబగు నాత్మజ్ఞానంబు వడయనుంకింతు రదియట్లుండె. 332

ఉ. సౌగతధర్మ మూనుటయు సమ్మతమేని మృగాక్షి ! శస్త్ర సం
త్యాగము చేసి జవ్వనము సార్థకమై తగ నిచ్చ కైవ సం

భోగములన్ మెలంగు విరిబోఁడిరో! ప్రాయము రేపు విల్చనే
ప్రేఁగగునిట్టి తాపమున వేఁటురె పుష్పముఁ బోనిదేహముల్! 333

చ. అదియునుఁ గాక యొద్దను విరాగసులన్ బరితాపపెట్టి యి
ట్లదయతమైఁ జరించు టది హాని యగున్, దయకన్న ధర్మము
న్నదియె? తదీయరక్షణమునందు మనం బిడి సత్య మిష్ట చె
ప్పఁ దగదె దైత్యవర్గములఁ బట్టి వధింపఁగ నేమి వచ్చెనో. 334

వ. సత్యంబువలనన కదా ప్రాణమ్ములు నిలుచుట దానికిం దప్పుట కొప్పమియు ధర్మం బనఁబడు నట్టి ధర్మమునకుం గట్టువడి కల తెఱంగు చెప్పు మని ప్రాంజలియై యడిగిన వసిలోమునకు నంబ కరుణించి యిట్లనియె, 335

ఉ. నీదువినీతి యింత దగునే! కరుణించి వచింతు నాదు యు
ద్ధాదరకారణంబు; జగమంతయుఁ ద్రిమ్మరుదాన దుష్టులం
గాదని చంపి సజ్జనులఁ గావఁగ; నొండు ప్రయోజనంబు నా
కేదియు లేదు దీని కయి యెత్తుదు నే నవతారముల్ మహన్. 336

మ. భయభక్తుల్ విడనాడి దేవతల నొంపం బూనె మీరాజు దు
ర్జయుఁడై; వాని నడంప వచ్చితి యథార్థం బింత; నీ వేగి దు
ర్నయువిం దన్మహిషీతనూజు నిట నే రమ్మన్న చందంబు దె
ల్పి యవింజేయఁగఁ బంపు మన్యుల వృథా ప్రేరేపఁగా నేటికిన్. 337

ఆ. వె. జీవితేచ్ఛఁ దనదుచేతమ్ము నొలసిన, బంధుజనులతోడ బయలు వెడలి
యీఁగకాలియంత యేవియు ద్రవ్యంబు, గొన కధోభువనము జనుట యొప్పు. 338

వ. అరపాతలమ్మునంద మీకులవృద్ధగు ప్రహ్లాదుండు వసించు వాఁ డాతనిం గొలిచి యట నుండునది యని చెప్పు మట్లయిన మీరలందఱును బ్రతికి పోవుదు రనవుడు వసిలోముండు బిడాలు దిక్కు మొగంబై ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 339

ఆ. వె. వింటివే భవాని వివిచినవిధము ద. యార్ద్రహృదయ నంధి కనుమతించె
వి ట్లొనర్చి బ్రతికి యేగిన నేమగు, నా రసాతలమ్మునందయుండ. 340

వ. నావుడు బిడాలుం డిట్లనియె. 341

ఉ. అంబిక చెప్పినట్టి విధ మందఱకున్ సుఖదంబ రాజు నం
ధిం బడయంగనొల్లఁ డెటు వెల్వఁగ వచ్చు నెఱింగి మూర్ఖ రీ

తిం బడువాని ? మృత్యువది దెప్పర మాఁగఁ దరంబె యుద్ధరం
గంబునఁ జచ్చువారిఁ బొడఁగాంచియుఁ దక్కటివారి నంపఁడే. 342

గీ. కదఁగి పాంచాలికలరీతిగా నతనికి, వశులమై యాజ్ఞఁ దప్పఁగ వశమె సత్య
ముగ వచించిన పల్కు లెవ్వగఁ బ్రియంబు, గలుగఁజేయు నృశంసులొ కావఁపలకు.

చ. "ధనమును రాజ్యముఁ బా విడిచి దర్పము నేదియుఁ గట్టుగుడ్డతో
ననికిఁ బొలంగి యేగుము భయమ్మున నీవు రసాతలమ్ము" నా
విని యతఁడాదరించెడి వివేకము గల్గినవాఁడె ? కోపముం
గని మనలన్ 'వధింతు' ననుఁగాక దురాత్ములు కీడు నెంతురే. 344

ఉ. కావున స్వామికార్య మెనకమ్మునఁ బూని చరింత మెమ్మెయిన్
జావది సిద్ధమౌ చెఱఁగి చావఁగనేల దురాత్ముచేతిలో
నా విని యాతఁడియ్యకొవినం జెలరేఁగి బిడాలుఁ డేత్తెఱన్
దేవిని నొంచె సప్తపటు తీవ్రశరమ్ముల నేసి యాసునన్. 345

వ. అసిలోముండును ధనుఃపాణియై యంతంత నిలిచి చూచుచుండెఁ బదంపడి యంబిక
తన్మత్తమ్ములగు బాణమ్ముల నెడనెడఁ బొడిచేసి, 346

గీ. మూఁడు భల్లమ్ములను జాపమున నమర్చి, సింహనాదమ్ముచేసి పేర్చిన రయమునఁ
బఱపె; వాఁడును దద్బాణపాతమునకుఁ, దొడరి మూర్ఛిల్లి పెద్ద నిద్దురయుఁ జెందె.

వ. ఇట్లు బిడాలుండు నమసిన నసిలోముండు సన్నద్ధుండై రణరంగమ్మునకు వచ్చి
కరంబెత్తి యయ్యంబిక కిట్లను, 348

చ. ఎఱుఁగుదు దేవి ! నీకతన మృత్యువు నా కగునంచు; బుద్ధులం
గఱపిన నొల్ల వట్టి విభుఁ గాదన లేక రణంబుపేఁత కే
తెఱ విటు లియ్యకొంటిఁ గడుఁదెంపరినై మరణంబు భీతిమైఁ
బఱచుటకన్న లగ్గగుశుభం బశుభంబును దైవలభ్యముల్. 349

ఉ. ఇందఱు దానవుల్ చదిసి యేగిరి కాలునిప్రోలి కిందునే
నెందఱఁబోలువాఁడ ! విధియెవ్వఁడు దాఁటఁగనేర్చుఁ ! బౌరుషం
బెందును దైవముం గడచి యుంచుకయుం బనిసేయ దంచు ని
న్నందఁగ నార్చి యేసె నిశితాస్త్రము లజ్జగదంబ దిక్కుగన్. 350

శా. ఆ బాణమ్ముల నంతరాళమున శాతాస్త్రమ్ములం ద్రుంచి పై
పై బాణమ్ములు గొన్నిటిఁ జెన నిగుడ్పన్ వాఁడు తచ్ఛస్త్రధా

రాజాహంకృతముచే ప్రవర్ధమానధిరుఁడై రాజిల్లెఁ బుష్పాళిలీ
లాజాభాసురకింశుకాగమము హేలన్ జూప అగ్గింపఁగన్. 351

ఉ. పిమ్మటఁ గోప మెక్కుడుగఁ బేర్చి గదంగొని యార్చి సింహమూ
ర్ధమ్మున మొత్త నయ్యది కరమ్ము భరమ్ముగ ఘోరభంగి నా
దమ్మొనరించి శస్త్రములు దాఁచెడి తీవ్రనఖమ్ములన్ దదీ
యమ్మగువక్షముం దివిజులందఱు మెచ్చఁగఁ జీల్చె నుక్కునన్. 352

ఉ. దానికి లోఁగ కయ్యసుర దారుణభంగి నెదిర్చి యార్చి యా
త్మానుచరుల్ నుతింప రయమారఁగ నాహరిశీర్షమందుఁ గా
లూని పరాక్రమించి గద నుద్ధతుఁడై జగదంబ నొంచె న
మ్మానిని ఖడ్గధార దునుమన్ దల యూడిపడెన్ సురారికిన్. 353

ఉ. రక్కసుఁ డిట్లు లక్కఱ సురల్ గుసుమమ్ములు గ్రుమ్మరింపుచున్
దిక్కులు పిక్కటిల్ల "జయ దేవి" యటంచు నుతించి మించి తా
రొక్కట దుందుభిధ్వనుల నుర్వియు నాకనముం గలంచి రిం
పెక్కఁగ నప్సరోయువతులెల్లరు నాడిరి దేవి మెచ్చఁగన్. 354

క. హతశేషమైన దైత్య, ప్రతతిఁ సింగమ్ము పట్టి భక్షించె నము
న్నతవేగ మదరఁ గొందఱు, నతికిఁగతి దెలియఁ బఱవఁ బఱచిరి కడఁకన్. 355

వ. ఇట్లరిగి రోదనపూర్వకమ్ముగఁ గల తెఱఁగు చెప్పిన నమ్మహిషుండు ప్రళయకాల రుద్రుని చందమ్మున మండిపడి దారుకుండను సారధింజూచి సహస్రఖరసంయుతంబును నానాయుధ సమన్వితంబును బతాకాధ్వజవిరాజితంబును నగు తన రథంబు దోడికొని రమ్మనవుడు వాఁడట్లొనరింపఁ గామార్తుండగు కతన నద్దేవి తన్ను వరించునకాఁ దలంచి హేయంబగు నీ మహిషదేహంబు కాదని త్యజించి స్త్రీలు రూపచాతుర్యమ్ములం జూచి మోహింతురని కృతనిశ్చయుఁడై. 356

## దేవీ మహిష సంవాదము.

ఉ. మానవరూపముం గొని సమంచితభూషణభూషితాంగుఁడై
దానవసైన్యముల్ గొలువ ధాటిఁ గ్రక్కదలన్ రథస్థుఁడై
మానినులెల్ల మెచ్చఁదగు మంజులమౌ చెలువొప్ప నేగె న
వ్వానిని దవ్వులం గని రవం బొనరించెఁ బరాంబ దంబుగన్. 357

వ. ఇట్లు శంఖంబు పూరించినదైత్యవాహిని కనుకవిం జఱచె వారల నివారించి మహిషాసురుం డామె కళిముఖుండై చిఱునగవు మొగమ్మునం దనర నిట్లను 358

గీ. దేవి! సంసారమున యందుఁ దిరుగు పురుషుఁ, డేనిఁ గామినియేని సుఖానుభవము నొందఁగోరుదు రదియు సంయోగజంబు, గా నెఱుంగు మదియు భిన్నగతి నెసంగు.

వ. ఎట్లంటేని మాతృపితృలకుఁ బుత్రునితో నగునది యుత్తమం, బన్నదమ్ముల సంయోగంబు మధ్యమంబు, వివిధావృతచిత్తులును బ్రసంగపరవర్తులును నగు నాపికుల సంయోగంబు సహజంబై యత్యల్ప సుఖదం బగుట నధమంబు. 360

ఆ.వె. సమవయస్కులైన జంపతులకుఁ దుల్య, రూపశీలగుణవిరూఢిఁ బ్రోపు మిగులు యోగ మది యమేయసుఖోదయం, బొనఁగుకతన నుత్తమోత్తమంబు.

వ. ఇట్లు సంయోగమ్ములు పరస్పరం బుత్కర్షాతిశయమ్మునం బొల్చు కతన, 362

ఉ. వీరుఁడనైన నాయెడ వివేకము గల్గిన దానవై సుధా
సారము వోవిచూడ్కులఁ బొసంగఁగఁ జేసి కరంచి తేని దు
ర్వారసుఖంబు దాననగు బాలరో! యిర్వుర కీసుఖంబుతో
నారయ నేసుఖమ్ములును నంద వనుత్తమ మౌ కతమ్మునన్. 363

చ. సురపతిఁ దొట్టి నిర్జరుల నొంపఱఁ జేసితిఁ గామరూపచా
తురి గలవాఁడ నిట్టి ననుఁ దొయ్యలి! దానునిఁ గాఁగ నేలి యా
దరముగఁ బట్టరాజ్ఞివయి దానవులెల్ల విధేయులై మెలం
గ రమణ నాదు వైభవము గైకొని పొందఁగరాదె భోగముల్. 364

ఉ. ఆనతి యిచ్చితేని విను మ య్యమరావళితోడ వైరమున్
మానెద నెద్ది పంచినను మానక చేసెదఁ బ్రేముడించు మె
ల్లేని భవత్పదాంబుజములే శరణమ్ములు సేవకుండ ధ
ర్మానుగతుల్ వచింత్రు శరణాగత రక్షణ మొప్పదే చెలీ. 365

ఉ. పుట్టినకోలె దైన్యమునఁ బోవ నొకప్పుడు నాజి నెంతయున్
దట్టుఁడ నా విశేషములు తామరచూలి మొదల్ సురోత్తముల్
గట్టిగఁ దామెఱుంగుదురు కామశరమ్ముల దాడి కోర్వక ని
ప్పట్టున దైన్యమూనితిఁ గృపన్ గను మాయుధముల్ త్యజించితిన్. 366

క. మరణావధి నెన్నఁడు ద, త్పరత న్నీ కెదురుపెప్పఁ దన్వంగిరో! నీ
గురుకుచము లాన మన్మథ, మరయుము శృంగారభంగితాపాంగములన్. 367

చ. అనవుడు దేవి వల్కె మొగ మంకురితస్మితకందళంబుగా
దనుజవరేణ్య! నాకుఁ బతి తత్పరమాత్ముఁడు; వాని యిచ్ఛనై
యొనరుతు సృష్టి; యప్పురుషయోగమునన్ జడనైన నాకుఁ జే
తనము ఘటిల్లుఁ గాంతశిల దాఁకిన యిన్ముసకుం బలెన్ లలిన్. 368

వ. ఇట్టి నాకు గ్రామ్యసుఖవాంఛ యెన్నండును లేదు నీవు మూర్ఖుండవై వన్నొక సామాన్యాంగనగాఁ దలఁచి మత్సంగం బపేక్షించు చున్నవాఁడ వదియునుం గాక.

చ. నరునకు బంధనార్థముగ నాతి సృజింపఁ బడెన్ దురాత్మ! య
ప్పరమరహస్యముం దెలిసి ధంగుఁడమై కడు హేయమైన సౌ
ఖ్యరసమునం జరింపకుము గల్గ నొకప్పుడు ముక్తి శృంఖలా
స్థిరులకునేని; నీరలకుఁ దీరదు ముక్తికినేగ నెన్నఁడున్. 370

మ. శమ మిచ్చున్ స్థిరసౌఖ్య: మద్ది హృదయ స్థానమ్మునంజేర్చి యీ
యమరావాసము వీడి జీవమును నీవాసింతువేనిన్ వివా
స మొనర్పంగ రసాతల మ్మరుగు; మీచందమ్ముగా కొండు చం
దమయేనిన్ రణమాచరింపుము విమున్ దర్పాంధుఁ దున్మాడెదన్. 371

ఉ. నీ వినయమ్ము నిక్కముగ నెమ్మది కెక్కుటఁజేసి యింత నీ
కై వచియించితిం గడు దయాపరతన్; వలతేని విన్ము లే
దా! వెనుదీయ కాజి నముఁ దాఁకుము వన్ ఖురికొల్పినట్టి దే
వావళి యప్పుదీర్తు విను నాత్మశరమ్ములపాలు పేయుచున్. 372

వ. నావుడు మదనమోహితుం డద్దురాత్ముండు మరల నిట్లను. 373

ఉ. పూలకు మించి యెక్కుడగు పొల్పునఁ బొల్చెడి మేనిదాన! నే
నాలము సేసి విన్నడఁచునంతటి సాహస మూన విప్పిరో!
బేలనె! నీకృపం బడని పెండిలిఁ జేసికొనంగ నుంటి వి
న్నోలలితాంగి! యిట్టి కఠినోక్తులు వ న్నన నీకు న్యాయమే? 374

చ. హరిహర వీరజాసనుల నాహవభీరులఁజేసి పుచ్చి సుం
దరివయిఁ జూపువాఁడనె ప్రతాపము లోకులు నవ్వ? నీయెడం
గర మనురక్తికల్మి భయకంపిత మయ్యెఁ గరంబు పొల్తి! యి
ర్వ్వరమును మిత్రభావమును బొందితి మేటికిఁ దక్కు సంగతుల్. 375

క. ననుఁబేర్మిఁ జూచి పెండిలి, యొనరిఁచికొన నొప్పెదేని యొప్పెదఁ గాదే
నిని వలసిన యెడ కరుగుము, వినునేఁ బ్రహరింపఁ జాల విశితాస్త్రములన్. 376

గీ. సప్తపది మైత్రి యని బుధజనులమతము, గాన నాచెల్మికత్తె నిన్‌గనిమనంగి
పై ననుభవింపఁగల్గు నైశ్వర్య మొక్కఁ, డున్నె యింతటి పాపంబు నోవఁగలనె.

గీ. బాలహత్యయు స్త్రీహత్య బ్రహ్మహత్య, పాతకము లందు నెక్కుడు పాతకములు
గాన నెట్లేని నీదయ గాంచి జన్మ, మునకు సాఫల్యమొనరింతు వనరుహాక్షి. 378

గీ. విను బలాత్కృతిఁగొనియేగ నేర్తుఁగాని, దాన నేమి సుఖంబగుఁ దలిరుబోఁడి
స్త్రీపురుషులు పరస్పరస్నేహ మడరఁ, గూటమికి నియ్యకొన దానఁ గుతుక మెసఁగు.

చ. తెలియవుగాక పూరుషుని ధీరునిఁ బొందని కాంతకుఁగా సుఖం
బులు వెలిఁగావె తాఁ దగిన వీ ర్తికిఁ దక్కనిపూరుషుండునుఁగా
వెలియగు, నెవ్వఁ డిక్కరణి వేఁదుఱు పుట్టఁగఁజేసె నీకు; వి
స్తులమగు జవ్వనమ్ము గడుసుందన మక్కట ! వమ్మొనర్తురే. 380

ఉ. వైరి యెవండొ విన్నిటులు వంచనఁజేసి మరల్చెఁ గాక సం
సారసుఖమ్ము లిక్కరణిఁ జాగము సేయుదె తత్త్రిమూర్తు లం
భోరుహనేత్రలన్ విడిచి పోయిరె యెంతటివేలనైతి వే
చారుముఖీలలామ పతిసంగతిఁ బాసి సుఖించఁ జెప్పుమా. 381

చ. నన్నుఁ బువుఁగోలలం బఱపి నాఁచికొనం గమకించు చందకా
ననుఁడు మరుండు నీయెడలఁ జాలఁ గృపం గలఁదేమొ, కాక యు
న్నను విటు విల్వ విచ్చునె ! కనంబడె హేతువు వైరులైన దు
ర్మనసులు దేవతల్ మరు మరల్చిరి నీదరిఁ జేరకుండఁగన్. 382

ఉ. ఆదర మేది నన్నిపు డహంకృతి నీడితివేని మున్ను మం
దోదరి సుందరు న్నృపుని ద్రోచి పదంపడి ధూర్తు నాథుఁగా
నూఁది స్మరార్తయై వగల నొందిన చందమునం గృశింతు సు
మీమ్మ ! దరిలేని తాపమున, మీఁదటిబాధ గణింప నిమ్మెయిన్. 383

## మందోదరీ వృత్తాంతము.

వ. అనవుడు నమ్మందోదరీవృత్తాంతమ్ము వినవలతునన దేవికి మహిషుం డిట్లనియె. 384

శా. దేవీ ! సింహళ దేశ మెల్లగతులన్ దేజమ్మునం బొల్చు న
ద్భావుం డయ్యెడఁ జంద్రసేనుఁడను భూపాలుండు పాలించఁ బా

రావారావృత మైన మేదిని కొకండై యేలు నవ్వాని కిం
పై వర్తించుఁ బతివ్రతామణి యొక ర్థాంగియై యిమ్ములన్. 385

గీ. ఆపె గుణవతి యనుపేర నలరుఁ దద్గు, ణములు వర్ణింప నలవి యెన్నటికిఁ గాదు
కవియె నొక యుత్పలాక్షి నకా్కంత మొదటి, చూలుగాఁ బతి సుఖవార్ధి నోలలాడ.

వ. పిదప నమ్మనుజపతి యక్కన్నెకు మందోదరి యని నామకరణమ్ము చేసి తోరం బగుగారమ్మునఁ బెంచుచుండ నబ్బాలికాజన చూళికారత్నంబు శశికలతెఱంగునన్ దినదినప్రవర్ధమానయై పదియేండ్ల ప్రాయమ్మునం బొలుచుటయు నరేంద్రుండు వివాహం బొనరింప నెంచి యనుకూల వరాన్వేషణపరాయణంబగు చిత్తమ్మున మన్నయెడఁ గొందఱు బ్రాహ్మణు లరుదెంచి. 387

గీ. తనరు మద్రదేశమున సుధన్వుఁడనెడి, రాజవర్యుం డతని కుమారకుఁడు నీదు
కొమిరె కీ డగువాఁడు సద్గుణవిశేష, రూపరేఖావిలాసనిరూఢి నెందు. 388

శా. కంబుగ్రీవుఁడు వాని పే రనుడు భూకాంతుండు పుత్రిం దదీ
యంబౌసొమ్ముగ నిశ్చయించి తన భార్యం జూచి యిక్కన్నె లో
కం బెల్లం గొనియాడ శీలమున నాకారమ్మునన్ మేటి యా
కంబుగ్రీవున కిచ్చి పుత్తమె యనంగా నాపె సంతుష్టయై. 389

వ. పుత్రి యున్నెడకరిగి యాదరమ్మున నమ్మా। విమ్ము నీ జనకుండు మద్రదేశాధీశ్వరుండగు సుధన్వ తనయునకు సమస్తలక్షణలక్షితునకుఁ గంబుగ్రీవునకిచ్చి పెండిలి యొనర్ప మన్నవాఁ డనవుడు మందోదరి యిట్లనియె. 390

శా. కౌమారవ్రత మూని స్వేచ్ఛగఁదపఃకాంక్షన్ఁ బ్రవర్తింప నే
నామోదింతుఁ జిరమ్మునుండి, యిఁక నాకన్యన్ వరింపంగ నే
లా। మేలా యొకమానవుం దవిలి వాలాయమ్ము నవ్వానితో
గామాసక్తిని బారతంత్ర్యమున మోక్షప్రాప్తిఁ బోఁ గొట్టుటల్. 391

క. స్వాతంత్ర్యమ్మున నెప్పుడుఁ, జేతోమోదమునఁ దిరుగఁ జేకూరుట వి
ద్యాతత్త్వజ్ఞులు మోక్షక, లాతాదాత్మ్యమునఁ జూచి లలిఁ బొగడరొకో. 392

సీ. అత్తమామలయెడ నడఁకువ గొలుపుట • బావలయెడ భక్తిపరతగనుట
మఱఁదులయెడఁ దగు మన్ననఁ జూపుట • తోడికోడండ్ర వొత్తున మెలఁగుట
యాఁడుబిడ్డల చిత్త మరసి వర్తించుట • సవతి గల్గిన దాని చన వెనయుట
పతికి నెవ్వేళలఁ బరిచర్య సలుపుట • సంతతి గని పెనువంతఁ బడుట

గీ. అకట! బాలిక యగుటకు నతిశయించుఁ, గాదె యొక్కవివశమునఁ గాలమెల్లఁ
గడపు విల్లాలి బ్రతుకు నిక్కముగ నాడు, జన్మ మధమాధమమ కాదె జననియెందు.

వ. ము న్నుత్తానపాదాత్మజుండును ధ్రువుని తమ్ముండును నుత్తముండును సర్వధర్మజ్ఞుండును నగు నృపాలుం డొకండు పతిభక్తిపరాయణ యగు తనభార్య ననపరాధ నరణ్యమ్మున విడిచెనని వినమె కావున, 394

చ. తరుణికి భర్త పొందిదు మదమ్మున కంటెను గష్టమెక్కు డ
ప్పురుషుఁడు కాలధర్మమును బొందినచో విధవాత్వ మెంతయుఁ
ఖరమగు నారికేగిన నపారమగుఁ విరహాగ్ని యిట్లు వం
దురుటయు నొక్క సౌఖ్యమె మనోగతి చిక్కఁగఁ బట్టుటొప్పదే. 395

వ. అను నాపె నిశ్చయంబు మరల్పనేరక జనని చిన్నవోయిన మనమ్మున నృపాలుని కడ కరిగి యంతయుం దెలిపిన నతండును నౌఁగాదనక సమ్మతించినవాఁడునుం బోలె మిన్నకుండె నంత నక్కన్నె మిన్నకుఁ గొండొకకాలమ్మునకు జవ్వనం బంకురించినఁ జెలికత్తియలెల్ల మెల్ల మెల్లన వివాహమ్మునంగల సుఖమ్ములు బోధించి యొప్పింప నుంకింపుడు నప్పడఁతి యెప్పాట నొప్పదయ్యెఁ బదంపడి యొక్కనాఁడు, 396

చ. కుసుమిత కుంజపుంజములకు న్నెలవై తగు పూలతోఁట కే
గి సఖులుఁదాను మయ్యెలఁ గ్రీడలొనర్చుచుఁ బూలుగోయుచున్
గిసలయజాలముల్ పుణికి గీటునఁ బుచ్చుచుఁ గేళకూళులన్
బిసరుహకాండముల్ చిదిమి వేయుచు నిట్లు చెలంగుచున్నెడన్. 397

క. కోసల దేశాధీశుం, డా నరణికి నొక్కఁడగుచు నరుదెంచెఁ గళా
భాసురుఁడు వీరసేనుఁడు, దానజనులు కొందఱు తన దాపున మెలఁగఁగా. 398

వ. రథారూఢుండై దవుదవ్వుల నరుదెంచువాని మదనసుందరు నా రాజును దూరదూరమ్మున నరుదెంచు సైన్యముం గాంచి చెలికత్తెలయం దొక్కరిత యమ్మందోదరి కిట్లనియె. 399

క. కనుఁగొంటివె యల్లదె దై, వనియతి నొకరాజసుతుఁ డపరమన్మథుఁడీ
మనయున్న తెరువునకు రా, గ నున్నవాఁ డతని చెలువు గాదనవశమే. 400

వ. అని వచించునంతన యంతంత నరుగుదెంచి యన్నృపాలుండు పుత్తడిబొమ్మం

బోవిదావి నమ్మందోదరి వీక్షించి విస్మయావిష్టుండై రథంబు డిగ్గి దగ్గఱకుం జని యొక్కరిత కయ్యంగనం గేలం జూపి యిట్లనియె. 401

క. ఈలలితగాత్రి యీమధు, రాలాపిని యెవతె, యెవ్వం డగు నొకొ ధరణీ పాలుం డీచెలి జనకుండు, వాలాయము నాకుం దెలుప వలయు మృగాక్షీ. 402

వ. అనవుడు సైరంధ్రి 'నరేంద్రా! నీ వడిగినదెల్లం జెప్పెదం గాని మునుమున్న నీవృత్తాంతంబు విన వలతు' నావుడు 'లతాంగీ! కోసలంబను దేశం బొండు గల దద్దానికి నే నాయకుండ నాపేరు వీరసేనుండు మార్గ వశమ్మున నరుదెంచుచుం ద్రోవ దప్పి యియ్యెడ కరుదెంచితి దొదవ్వుల సైన్యంబును రాం గల' దనవుడు సైరంధ్రి యిట్లనియె. 403

క. మందోదరి యనందగు నీ, సుందరియుం జంద్రసేనసుత యీయెడ కా నందమునం గ్రీడసల్పెడి, దందడిం జనుదెంచె నాంగ ధరణీపుండవియెఱా. 404

క. సైరంధ్రి! నాకు నీచెలి, పై రాగము పుట్టె ధర్మపత్నిగం జేయం గోరెద నీచాతుర్యం, దారత కిది పెద్ద గాదు తలంపు వొడమినఱా. 405

వ. నా కింతకుమున్నె వే శోకభార్య లేకుంటం జేసి మీ చెలియ పట్టమహిషిగాండగుం జిరమ్మునుండి యే ననురూపశీలవయోగుణభాసురయగు కన్నియ నన్వేషించుచున్న వాండ నేటికి దైవమ్ము సమకూర్చె నని వెండియు, 406

గీ. ఏం గకుత్థ్సకులోద్భూతి వింపు గన్న, రాచకొమరుండ నిట్టి నా రాణ నెఱింగి తండ్రియైనమ నాకిడం దక్కువాండె, వల నెఱింగి చేయు మిందు నుపాయమునుడు.

శా. ఆసైరంధ్రి లతాంగి కిట్లనుం జెలీ! యీరాజుం గన్గొంటె! నీ కౌ సౌందర్యము పేర్మిం బ్రాయమున విద్యాబుద్ధులం దెల్ల నా రాముండు కరంబు నీయెడలం దా రాగిల్లె నవ్వావి వి శ్వాసార్హుం బతిం జేసికో యుచిత మీ చందంబు నీ కొప్పదే. 408

క. నీవైరాగ్యపుం జందం, బేవము పుట్టింప జనకుం దెంతయు వగకుం దావలమై యందురు నా, భూవిభు నిప్పాటం దేల్పం బోలదె నీకున్. 409

వ. అతం డెల్లవేళల మమ్ముం గాంచి మీచెలికత్తియకుం గఱదలు తఱపి పరిణయమ్మున కియ్యకొలుపుం డని వినువక వచియింపుచుండు వింతదనుక విన్నుం బ్రబోధింప నేర మైతి మియ్యది తగు వల నగుటంజేసి చెప్ప వలసి వచ్చె నని మఱియును, 410

గీ. వ్రతము లెన్నైన భర్తృతత్పరతఁ దవిలి, చేరి శుశ్రూష యొనరక చేయుదానిఁ
బోలఁజాలవు విను మట్టి పూవుఁబోఁడి, యరుగు స్వర్గమ్మునకు నిక్క మండ్రు బుధులు

వ. నావుడుఁ గోపించి యామందోదరి సైరంధ్రి కిట్లనియె. 412

ఆ. వె. సిగ్గులేక నన్నుఁ జెనఁటిచందమ్మున, నరయ నంతఁ జూడక సైతి నొక్కొ ;
తపము చేసికొనెడి తన్వికి నా కేటి, భర్త ; పొమ్మటంచుఁ బలుకు మతవి 413

వ. నావుడు సైరంధ్రి మెల్లన నిట్లను నమ్మా ! కాలం బెప్పుడు నొక్క చందమ్మున నుండదు, మన్మథుఁడు దుర్జయుండు, నా పలుకు లంగీకరింపవినాఁడు నీకు నాపద ఘటిల్లక తీర దనవుడు రాజపుత్రి యిట్లను. 414

ఆ. వె. ఎంతయేనిఁ జెప్పు మేను వివాహ మం, గీకరింప వచ్చుకీడు తొలఁగఁ
జేయ నెవరితరము చెలియరొ ; దైవ వ, శంబు తప్పఁ జేయఁ జనునె నీకు.

వ. ఇట్లు వైరాగ్యమ్మున నీడంబోక పుయిలోట దక్కి యూసడించిన సైరంధ్రి వీర సేనుం జూచి, 416

గీ. ఎన్ని చెప్పిన వినవేర దీ లతాంగి, గుణగణాఢ్యుండు కాకుత్స్థకులుఁడు మిగుల
రూపసి యటంచు నొక్కి నీరూఢి దెలిపి, విసివితి నిఁ కేమి సేయుదు వెడలు మధిప.

వ. నావుడు నృపాలుండు విమనస్కుండై తనయంత నరిగెఁ బిమ్మటఁ గొంతకాలమ్మున కమ్మందోదరి చెలియ లిందుమతి యనుదానికిఁ దండ్రి స్వయంవరమ్మునఁ బెండ్లిసేయం దలంచి చాటం బంచిన నప్పురంబున కఖిలధరాకాంతు లరుదెంచి మంటపమ్మున వలయు నెడల వసియించి రం దొక్కరునిఁ దనకనుగుణుండగు రాసూను నయ్యిందుమతి వరియించి కృతకృత్య యయ్యె. 418

క. మందోదరి యాపెండిలి, చందము వీక్షించి యందెనఁగు నృపతులయం
దందమునఁబొల్పు విటు శతు, వెం దగఁగని కలఁగి దైవనియతి వరించెకా. 419

వ. ఇట్లు కలంగి మదనవేదనాదోధూయమానయై తండ్రికిఁ దనకోరిక తెలం గెఱింగించిన నతండును సంతసించి తగుఁదగదనక యతనివి గారవించి యథావిధిగ నక్కూఁతు నిచ్చి పెండ్లి యొనర్చి పారిబర్హంబొసంగి వీడ్కొల్పెః నాచారుదేష్ణుండును మందోదరీసహితుండై సంతసమ్మునఁ దనపురి కరిగి యవ్విలాసినితో వివిధోపభోగమ్ములం బ్రొద్దుపుచ్చుచు నొక్కనాఁడు. 420

క. తనదాసితోడఁ గామ, మ్మునఁ గ్రీడాగోష్ఠి నున్నపొంకము తద్రా
ట్తనయకు సైరంధ్రిఁ గనుం, గొనిచెప్పెన్ దాన మిగులఁ గోపన యగుచున్.

వ. వా రిరువురం బట్టికొనఁదలంచి రంధ్రం బరయుచు నంత నొక్కెడ నేకాంత
మ్మునఁ గ్రీడించువారి వారిం గాంచి యిట్లు చింతించె. 422

గీ. అక్కటా! శఠుఁడంచు మున్నరయనేర, నైతిఁ గడుఁ జెట్ట చేసి యీయధమువంచ
నం బడితినిట్టి నిర్లజ్జునిం బతిగ గ్ర, హించి జన్మమ్మునకు హాని నించుకొంటి. 423

క. అవి యమ్మలిక మనమ్మునఁ, బెనఁగొన నిఁక నిట్టివానిఁ బెంపేది హృదీ
శునిఁగాఁ గొని ప్రేముడి నిం, చిన కంటె నఘంబు చెట్ట చేఁతయుఁ గలదే. 424

మ. పతిసంగంబు పరిత్యజించి మృతికై పాటింతునో! దాన సం
గతమౌ నాత్మవధోద్ధితం బయినబల్ కాలుష్య మట్లౌట ను
త్పితృగేహమ్మున కేగుదెంతునొ! నఖిల్ పీడింతు రెగ్గించి దు
ర్మతినై యింతటిచేటు దెచ్చుకొని మైమైఁ బోవఁగా దీఱునే. 425

క. వీరిఁబోరి సంతాపము వోం, పిరివోవఁగ నిట్లు పగలపెల్లునఁ గడు వం
దురి తుదకు నచట మంటయ, పరమోత్తమ మంచు నెంచి పతిసంసర్గఁ. 426

వ. విడిచి వ్రతపరాయణయై పశ్చాత్తాపమ్మునం గుందుచుండె నట్లు గావున, 427

## దేవీ మహిషాసుర యుద్ధము.

ఆ. వె. ఇపుడు నన్ను నిట్టు లెదఁజేసి పిదపఁ గా, మార్తి దొడరెనేని నధము నొక్క
శఠు వరించి వాని సంసర్గమునఁ బ్రోపుఁ, దక్కనేల వినుము తలిరుఁబోఁడి. 428

చ. అనవుడు దేవి కోపమున నమ్మహిషాధముఁ జూచి పల్కె దు
ర్వినయ! వివేక మేది పలవింపక సంగర మాచరింపు లే
కునికి రసాతలం బరుగు మొండొక రీతి వొసంగ దెంత చె
ప్పిన విననేర కూరకయ ప్రేలెదు పీఁటఁడివే తలంపఁగన్. 429

గీ. జన్మ మెఱుఁగని నా కిట్లు జన్మలబ్ధి, రూపమెఱుఁగని నా కిట్లు రూపలబ్ధి
గలుగు దుష్టుల వధియించు కారణమున, నిక్క మమరహితమ్ముగ వి న్నదంతు.

వ. కావునఁ బాతాళమ్మున కరుగు మొండె ధనుర్ధరుండవై సంగరం బాచరింపు మన
వుడు మహిషుం డక్షీణక్రోధరూక్షుండై. 431

ఉ. కర్దముదాఁకఁ జాపమును గాఁడఁగ లాగి శరమ్ములన్ రయో
దీర్ణత నేయ నంబ వెనుదీయక యంతరమంద యన్నిటిన్

జూర్ణము చేసె విర్వురకుఁ జూపఱు భీతి మునుంగ నిట్లు సం
పూర్ణరణంబు వాటిలె నపూర్వము ఘోరము నై పొరింబొరిన్. 432

వ. ఇట్లిరువురుం బోరాడుచుండ నంతరమ్మున దుర్ధరుం డరుదెంచి యంబం దలపడి.

క. కొన్ని శరమ్ములు వించినఁ, దన్నిచుని యెడలఁ గనలి దారుణ శరపా
శి న్నిగిడించిన వాఁడును, దన్నికొనుచుఁ జచ్చి పడియె దర శృంగ మనన్. 434

ఆ.వె. వానిచావుఁ జూచి వగ గూరఁగఁ ద్రినేత్రుఁ, డరుగుదెంచి దేవి నస్త్రన స్త
కంబుఁ జొనిపి నొంపఁగా వాని నయ్యంబ, యంతరాళమునన యడఁచిపై చి. 435

వ. త్రిశూలమ్మున వానిం బిలుక్కుమార్చ నద్దానికి సైఁపక యంధకుండు గోపమ్ము పిరి
గొనం దాఁకి, 436

మ. గద చేఁటూని గజారిమ స్తకముపై గాఁడంగ నేయంగ న
య్యది క్రోధాకులమై వెనం గడఁగి తీవ్రాస్త్రమ్ములం బోని బె
ట్టిదపుం గోరులఁబట్టి చీల్చి కడు గోంఁద్రింపంగఁ దన్మాంస ము
గ్రదశం దాఁ దివియెన్ సురారులకు భీకంపంబు సంధిల్లఁగన్. 437

మ. అటు లయ్యంధకుఁ డీల్గఁ గినుక్కమెయి నయ్యశ్వారి తీక్ష్ణుఁగా
ర్పటి రోదోంతరమెల్లఁ గప్పుచు రణప్రారంభుఁడై మించు న
ప్పటి యత్యాహిత మాఁగ్గ నజ్జనని యప్పాపాత్ముపై నొక్క మి
క్కుటమౌ పెన్గద వైవ దానఁ బడె నోఁకు న్మూర్ఛమైవ్రేల్మిడిన్. 438

క. అంతంత లేచి దానవుఁ, డంతకుఁడై గదమఁ బూని హర్యక్షుం బొ
క్కింత గువలువడ నేసిన, దంతివయిం గవియునవ్విధం బడరంగన్. 439

చ. ఖరనఖరావళిం బొడిచి గ్రక్కదలన్ బడఁ జీల్చె నంత నా
హరిరిపుఁ డార్చి తాను హరియై సరియైన పరాక్రమక్రమో
ద్ధురనఖరాళి నుక్కఱఁగఁ దోడన వచ్చిన దాని కల్గి కాం
కరి ఫణిరాణ్ణిభంబులగు కాండపరంపర నిండఁ జెండినన్. 440

మ. హరిరూపంబుఁ దృజించి యమ్మహిషుఁ డేన్గైవేగఁ దానొక్కటూ
ధరశృంగంబు కరంబునం బొడిచి క్రోధం బెక్క విట్టార్చి కాం
కరిపై నేయ శిలాశితమ్ములఁ గనత్కాండమ్ములం ద్రుంచె న
గ్గిరిశృంగం బొకియింత యంతగ సురల్ గీర్తించి యగ్గింపఁగన్. 441

ఉ. తోఁదన యార్చి సింగ మెదఁ దోష మెలర్పఁగఁ గుంభపాళి నా
రూఢిగ మించి కీడ్వఱిచి రూక్షనఖంబుల వ్రచ్చివ్రచ్చి వేఁ
టాడఁగ రక్కసుండు శరభాకృతిఁ దాల్చి మరల్చినన్ సురల్
వోఁడిమిఁ దక్కి రంబికయుఁ బ్రోపఱఁ జేసె శితాస్త్ర సంహతిన్. 442

వ. అంత నా శరభాకారుండగు మహిషుండును, 443

ఉ. తుండమునం గడుం బొడిచి తోఁదన పుచ్ఛముఁ జుట్టి భూమిభృ
న్మండలముం బెకల్చి యొకమాత్రన బంతులు ఱువ్వువోల్కి న
చ్చండివయి న్నిగుడ్చుచు హసన్ముఖుఁడై యెలుఁగెత్తి విక్రమో
ద్దండత మిన్ను ముట్టఁగ మదమ్మున నజ్జగదంబ కిట్లనున్. 444

మ. మదముం ద్రిప్పఁగలేక నా పలుకుల న్మన్నింప కీరీతి బె
ట్టిదపున్ సంగర మియ్యకొంటివి ననుఁ డీకొంట నీబోఁటి యాఁ
డుదియు న్నేర్చునె ; యింద్రుఁదొట్టి సురలాటోపంబు వాటిల్ల ర
య్యెది నీకుం దెలియంగ లేదొ, వినవో యస్మత్ప్రతాపస్థితుల్ ; 445

చ. వినుఁ బరికొల్పినట్టి సురనేతృముఖామరులెల్లఁ మేల్మిఁ ద
క్కనవి వధించి నాదుః భుజగర్వము దుర్వహమై జగమ్ములం
దనుకఁగఁ జేయుదుఁ వెనుకఁదారక విల్వము నాఁగ వానిక
జ్జనవి వచింపఁ గోప మొక చాడ్పు మెయిన్ గనుపట్ట నవ్వుచున్. 446

ఉ. తత్తఱపాటు మాని తగు దర్పమున న్నిలమిష్ట మాధవీ
హత్తినవేడ్కఁ ద్రావి సురలందఱునుం గొనియాడ దుర్మదో
న్మత్తుని విన్నుఁ జంపెద రణమ్మున నంచు సువర్ణపాత్ర మా
యత్తము చేసి త్రావెఁ దగ నాసవముం జల ముప్పతిల్లఁగన్. 447

క. ద్రాక్షాసవపానం బిటు, లక్షీణగతిం బొనర్చి యయ్యంబిక బల్
దక్షత మెఱయఁగఁ దా హ, ర్యక్షారావం బొనర్చె నసురులు బెగడన్. 448

క. జయ పెట్టుచు నమరులు పే, ర్మి యెలర్పఁగఁ బూలు గురియ మేకొని జగదం
బయు మహిషు నెదిరి పోరెన్, హయారియు ననేకమూర్తు లందుచుఁ గడఁకన్,

చ. కపటపుఁబాండితిన్ మెఱసి కావలుఁడై పలుమైల నంబతో
నపగతభీతిమై నని నహంకృతిఁ జూపఁగ వాని కల్గి చం

డి పెలుచ శూలముం గొని కడిందిగ వక్షము నందు నాట మూ
ర్ఛపడి హయారి యంతట వెనకా బునరుద్గతుఁడై మహోద్ధతిన్. 450

శా. చాముండం దన పాదఘాతముల నుచ్చైర్నాదపూర్వమ్ముగా
నామైఁ దన్ని హసన్ముఖుం డగుచు శంఖారావముం జేయ ను
ద్దామక్రోధపరీతయై జనని హస్తంబందుఁ జక్రంబు వి
స్ఫీమారంబు ధరించి యుద్ధతిమెయిన్ సింహారవంబొప్పఁగన్. 451

ఉ. ఓరిమదాంధ! చక్ర మిది యోడక నీదు శిరంబు దీసి దు
ర్వారత నయ్యమాలయనివాసము నీకొనరించు నెమ్మెయిన్
బోర నొకింత నిల్వు మని ఘోరన నెత్తురు మీఁది కొల్క న
వైర్యరిశిరమ్ముఁ ద్రుంచినఁ గబంధము భూద్రము నా భువింబడెన్. 452

మ. సురలెల్లన్ జయవెట్ట నమ్మహిషుఁ డచ్చోఁ గూల సింగంబు దు
ర్భరవేగమ్మునఁ బాఱుసేనల వెనకా భక్షించి విశ్లేషతం
బొరయం జేసెను గొంద అందుఁ జని రేపుం దక్క పాతాళ మి
క్కరణిన్ దేవి యొనర్ప దేవతలు వేడ్కంజేతులన్ మోడ్చుచున్. 453

## ఇంద్రాదులు దేవిని నుతించుట.

వ. అయ్యంబికం గని యిట్లు సన్నుతించి "ఓ యంబా! సృష్టి స్థితిలయకారిణివై కీర్తి మతి స్మృతిగతికరుణాదయాశ్రద్ధాధృతి వసుధాకమలాజయాపుష్టికలావిజయాగిరిజా తుష్టిప్రమా విద్యాక్షమాదికంబులు నీవయై మెలంగుదు నీ యీ శక్తుల సాహాయ్యమ్మునంజేసి వారువారు తత్తత్కార్యమ్ములకు సమర్థులగుచుందు రది యెట్లనిన, నీవు ధారణవై యుండవేని నాగకూర్మమ్ము లిద్ధారుణి ధరించుటయు నీవు వృథివివై వెలఁగకున్న నంబరంబు నిలుచుటయుం బొసంగ దిట్లుండఁ గొందఱు హరిహర ప్రముఖులమగు మమ్మెంతయు నారాధింతురు. వారు మూఢు లనుట కేమి సందియంబు? జన్నం బొనర్చువారు చేయు హోమమ్ములెల్ల నీవు స్వాహవై యుంటం జేసియకదా మాకు ముట్టుచున్నయవి. కావునఁ జరాచరాత్మకంబగు ప్రపంచంబున కెల్ల భుక్తిముక్తిప్రదాయినివగు కతన నితరులట్ల మమ్మునుం బాలించుచుందు విది యిట్టిదయేని రక్కసు లిట్లుక్కు మిగులుచుండ వారల మూలచ్ఛేదం బొనరింప కుంట లోకమ్మున మహారణ్యంబులం బుట్టిన కటువృక్షమ్ములఁ బలాశరహితమ్ముల

నేవియు నుత్తములగు వారు ఖండింపక మిన్నకుండుట వంటిది. కరుణారసవియత వగు నీ వొక్కొక్కయెడ రణాంగనంబుల శితశర పరంపరలంజేసి యొరుల శిక్షించుటకుఁ గతంబు వారలకు దేహాంతరప్రాప్తింజేసి యందు సురాంగనాకేళీ ముఖసౌఖ్యం బొడగూర్చుట కని యూహింపనయ్యెడి. దేహరహిత వయ్యును రక్కసుల నుక్కడంప నయ్యయికాలమ్ముల దేహంబు గైకొంట క్రీడామాత్రంబ యగు నిట్టి యమేయప్రభావవగు నీవుండ ధూర్తులును బురాణచతురులును నగు కొందఱు హరిహరాదుల సేవింప వలయునని విధించుట యసమంజసంబు గాకుండు నొక్కొ! జగజ్జననివగు నీకు వశులమై యిట్లు రాక్షసబాధల వీఁగుచునుండు మమ్మెవ్వరు పూజింప నెంతురు వారు కరమ్మున దీపంబు గలిగియుఁ గూపమ్మునఁ బడు వారిలో నొక్కరుగాఁ దగుదురు. నీవు విద్యావిద్యాస్వరూపిణి వగు కతన మోక్షార్థులకు గతివై యుండుదు గావునఁ ద్రిమూర్తులును భవత్పాదపంకేరుహంబు భజింతు రిట్టి నిన్నుఁ గొందఱు మూర్ఖులు భజింపనేరక భవసాగరమ్మున బ్రుంగుడుపడి-నవయుచుందురు. తల్లీ! యింతేల? నీవు వాగ్దేవతా స్వరూపిణివై వక్త్రమ్ముల వసియింపవేని హరిహరాదులగు సురలుగాని మానవులు గాని యెట్లు ముఖరితవక్త్రులగుదురు? 454

మ. భృగుశాపమ్మున మీనమై కమఠమై పెంపేది. కోలాకృతిం
దగి సింగంబయి వంతలంబడి యశ క్షత్రప్రక్రియం బొల్చి దు
ర్భగుఁడై యుక్కునపుంగతిన్ మెలఁగు నప్పద్మాక్షు సేవింప మృ
త్యుగతంబైన భయంబు రూపఱునె, సంతోషంబు వాటిల్లునే? 455

క. ఎవఁడు భృగుశాపమున వన, నవిధమ్మునఁ దనకు లింగసంపాతముగా
నవపెనొ తాదృశుఁ డగు నా, శివునిన్ సేవింప సౌఖ్యసిద్ధులు కలవే? 456

గీ. అట్టి హరునకుఁ గొమరుఁడై నట్టి గజము, ఖని గణాధిపు సేవించి కోర్కివడయ
నెంతు రతిమూర్ఖులంబః నిన్నెఱిఁగి కొలువ, రాదొకో కార్యసిద్ధిసంప్రాప్తిపొంచె.

వ. అని పెండియు, 458

చ. అరిజనతన్ వధించుట కృపాకులతన్ విరయంబు మాన్పి ని
ర్జరభవనం బొనంగుటయ నమ్మత మంచు వచింపు నంబ! నీ
చరిత మెఱుంగ లేరు హరసారసలోచనముఖ్యులైన; నొం
డొరుల లెఱుంగువారె భవదుజ్జ్వలమోహవశంవదాత్ములై. 459

గీ. వేదముల నెవ్వియేని భావింత్రుగాక
కొంద ఱజ్ఞులు మునులు నీచంద మెఱుఁగఁ
జాలమిని సూర్యుఁ గొల్తు రా జ్వలనుఁ దలఁతు
రాగమమ్ముల సారంబు నరయఁ దరమె. 460

చ. స్వరచితముల్ శ్రుతుల్ గఱపి సారసనంభవముఖ్యదేవతా
వరుల కనుత్తమత్వము నవారణ బోధ యొసర్చి వ్యాజమ
ర్భరత మెలంగుచున్ జగము వంచనచేసెడి వారి నీవు ప్రే
మరసమునం గనుంగొనెదు మాయికులంచుఁ బ్రసిద్ధిదెచ్చుచున్. 461

క. రాఁదగు కలియుగమున జగ, దాదిన్ నిను డాఁచి సుకవు లంబరో ! నీ వా
పాదించిన సురగణముల, నాదరముమెయి న్నుతింతు రయ్యయి విధులన్. 462

క. మును లెవ్వరు పరవిద్యన్, జనని న్నినుఁ దలఁతు రట్టి జ్ఞానులు గర్వ
మ్మునఁబడక నిన్నుఁ జెంది సు, ఖనియతి వర్తింతు రెల్ల కాలము తల్లీ. 463

క. కేవల పరమాత్మయు నీ, తో విరహితుఁడై యొకింత తొడఁగఁ జాలం
డావిభుఁడు నీదు చిచ్ఛ, క్త్యావిర్భావమునఁగాదె యట్టిండగుటల్. 464

వ. అట్లు కాదేని జడమ్ములగు తత్త్వమ్ములను గుణకర్మయుతమ్ములగు నింద్రియమ్ములును జిద్విరహితమ్ములై తత్తత్కృతుల కెట్లు సమర్థమ్ములగు ? సర్వమ్మును సృజించి నమయమ్మునఁ బాలించుచు హరించుచుండు నీ మహామహిమంబు మాక కాదు హరిహరాదులకు నయిత మగమ్యంబై యుండు. 465

శా. లోలాత్ముండయి దుష్టుఁడై త్రిజగతీకంటకుఁడై యొప్పు దు
శ్శీలుం గాసరరూపు నీ తులువ నిర్జిపుం బొవంగించి మ
మ్మేలంజొచ్చిన నీ మహామహిమ మింకేమంచు వాక్రుత్తు మం
బా ! లీలాజితదుష్టదానవకదంబా ! సత్కదంబాలయా. 466

క. మాకార్యము సేఁతయ కా, కాకల్పంబైన కీర్తి యలవడె నీ కీ
లోకాపకారిదానవుఁ, బోకార్చినకతన విపులముగ జగదంబా. 467

వ. "అంబా ! మమ్మెల్లవేళలఁ గృపాకలితవై యిట్లు పాలించుచు నేడు గడపై యుండం బ్రార్థింతు" మనవుడు మహిషాసురమర్దని వారల కిట్లనియె. 468

క. సురలార ! కార్య మొం డిపు, డరయంబడెనే నిఁ దెల్పుఁ డది తీర్చెద దు
ష్కరమేని మీకు నాపద, వొరసినయపుడెల్ల నన్నుఁ బొలుఁదలంపన్. 469

చ. అనవుడు దేవతల్ ప్రణిహితాంజలులై జగదంబఁ గాంచి యి
ట్లనిరి భవత్పదాబ్జ మనయమ్మును గొల్చెడియచ్చ మాకు ని
చ్చినఁ బదివేలు వేఱొకటి చేయఁ గొఱంతయు గల్గెనే రసా
యన మగు నీదుపల్కు మహిషాసురమర్దని ! లోకవర్ధనీ. 470

వ. ద్విసువర్ణ సంవృతంబగు నీ దేహమ్మున నపరాధసహిష్ణుండు తృతీయుండు లేఁడు
గావున సఖీభూతవగు నిన్ను విడిచి జీవుం డొనర్చెడి దింపుకయు లేదు. పాపా
త్ములు దుష్ప్రాపంబులగు సురాసురమనుజయోనులం బుట్టియును నిన్నెఱుంగఁ
జాలరు సుఖమ్మున నొందె దుఃఖమ్మున నొందె నీ చరణంబులు దక్కఁ దక్కటి
శరణము లేదని మనోవాక్కాయ కర్మమ్ములం ద్రికరణ శుద్ధిగ వచియించు మమ్ముం
దయాంతరంగవై పాలించుభారమ్ము నీదై యున్నయది యను నమరులందగుగతి
వీడ్కొలిపి యంతర్ధానంబు చేసె నమసాత్యవతేయునకు జనమేజయుం డిట్లనియె.

సీ. దురితంపు సంసృతిఁ దొలగించు పదుపాధి • సజ్జనకర్ణరసాయనంబు
పటుతరామయభారపాషాణటంకంబు • భక్తలోకైకకల్పద్రుమంబు
సుఖకరశ్రీలోకసోపానవిశ్రేణి • సంపత్కదంబపర్జన్యబుతువు
కాతరీకృతభూతభేతాళవిచయంబు • సకలదక్షస్వప్నమున్చాటనంబు

గీ. చారులీలాకదంబసంచారభూమి • తనుతరేతరమోదసంధాయకంబు
హరిహరవిరించిముఖ్యదేవావధృత్య • ధీయమానంబుగాదె ! శ్రీదేవిచరిత. 472

వ. ఇట్టి చరిత్రంబు కృతజ్ఞుం డెవ్వండు వినసోపండని వెండియు. 473

ఉ. ముందటి జన్మమం దెవఁడు మోదవిధాయిని యైన దేవి కిం
పొందెడి భక్తిఁ బూజలిడునో కృతకృత్యుఁ డతండు భోగి యా
నందియునై ధరాతలము నాల్గుచెఱంగులు నేలఁ జాలు న
స్పందితకీర్తిశాలియగు పార్థివుఁడై జనియించు మీఁదటన్. 474

ఉ. అంబ నెఱుంగఁ జాలువినయంబు వివేకములేని పెఱాలులా
యంబులు వచ్చునట్టి జననాంతరమందు రుజాభిభూతిమైఁ
బంబిన దుఃఖవేదనలఁ బొల్పెడి రిక్తతఁ గాంచి కష్ట వ
ప్రంబు భుజింపఁ గూడు గొనఁజాలక సంతతి లేక కుందవే. 475

క. కావున నిఖిలార్థదమై. పావనమై ముక్తిదమయి భద్రప్రదమై
కోవిదమాన్యం బగున. ద్దేవీచరితంబు నాకుఁ దెలుపంగదవే. 476

గీ. అమరరిపుఁడైన మహిషుఁ దునిమినమీఁద, నంబ యెచ్చటి కేగె, నే మాచరించె ?
నేవిధమ్మున వర్తించె ? నిదియు విస్త, రించి వలతు నెఱుంగ నా కెంచిచెపుమ.477

## దేవ్యంతర్ధానోత్తరవృత్తాంతము.

క. అనవుడు సాత్యవతేయుం, డను జనవర ! మున్ను హరిహరాదుల ప్రీత్యం
బును గొని రెయ్యెడఁ నయ్యెడఁ, జనియె మణిద్వీపమునకుం జగదంబ వెసన్.478

వ. పిమ్మట నమరులు జగదంబ పీడ్కొలిపి యమ్మహిషురాజ్యమ్మున రవివంశనము
ద్భూతుండును నయోధ్యాపతియునగు శత్రుఘ్నుండనురాజు నభిషిక్తుం జేసి తమ
తమ పొందుపట్లకుఁ జనిరి. శత్రుఘ్నుండును యథోక్తంబుగ రాజ్యంబు శాసించు
చుండునెడ, 479

సీ. నెల మూఁడువానలు నియతిమైఁగురియుచు • ధనధాన్యములకల్మి తఱుగకుండు
ఫలపుష్ప సంపత్తిఁ దులదూఁగువృక్షముల్ • వట్టనిజలముల వఱలునదులు
కుండలకొలఁదిగా గోవులు పాలిచ్చు • ద్విజులు శ్రుత్యుక్తవిధినిఁ జరింత్రు
నృపు లస్త్రవిద్యల నేర్పువాటింతురు • పొంపొచ్చెములు లేవు భూతములకు

గీ. జంకుగొంకులు లేక నిరంకుశగతిఁ, బ్రజలు ధర్మానువర్తులై పార్థివాజ్ఞ
మెలఁగుచుండు రతని భూమితలమునందు, నెల్లరు సుమాళమునఁ బొల్తురెల్లవేళ.

ఉ. అన్నరనాథుదేశమున నారసి యెచ్చటఁ జూచెనేనియున్
జన్నపుశాలలా ! మఱియు సత్రములా ! శుభమంటపమ్ములా !
కన్నులపండువై యెసఁగఁగాఁ దగుచక్కని దేవళమ్ములా !
యెన్నిటఁ జూచినం దనివి యెన్నటికిం గనఁ బోల దేరికిన్. 481

సీ. పాషండమతము స్వప్నమ్మునఁగనరా ద • ధర్మంబు మొట్టమొదటికిలేదు
మిత్రవియుక్తి యమిత్రవృద్ధియు నవ • మృత్యు భయంబు దుర్భిక్షబాధ
మారిమసంగుట మరియాద దప్పుట • రోగంబు దైన్యంబు భోగవిరతి
దాంపత్యవిరహంబు దాంభికత్వంబు చౌ • ర్యంబు పైశున్యంబు రాజకలహ

గీ. మాగమద్వేష మనునవి యరయ మందు • నకును గానంగ రావు తన్నరవరేణ్యుఁ
డాడితప్పనివాఁడు మహానుభావుఁ • డప్రమత్తుం డతంద్రాళుఁ డనఁగఁ దగఁడె !

ఉ. ఆవగరిన్ ద్విజుల్ త్రివిధులై పొలుపొందుదు రందు సాత్త్వికుల్
దానములన్ గ్రహింప రవధర్మములన్ జరియింప రధ్వరం

బేవియు జీవహింసకు సహింపక పిష్టపశుం బొనర్చు ర
మ్మానధనుల్ త్రికర్మముల మన్నన( జేయుచు నుందు రాజిటన్. 483

క. నృపపౌరోహిత్యము క, ర్మపరత విధివిహితమైన మాంసాదనమున్
గృపణతలేమియు నై శ్వ. ర్యపటుత్వము గలిగి యుంద్రు రాజసులందున్. 484

గీ. కించిదధ్యయనము నృపకింకరత్వ
మధికకోపము ద్వేషరాగాభియుక్తి
గలిగి యొకటంగి వర్తింత్రు కర్మబాహ్యు
లగుచు( దామసు లైన బ్రాహ్మణజనములు. 485

గీ. మహిపతులు దానపరులు బ్రాహ్మణనిరతులు, యాగసంసక్తు లవనిరక్షానురక్తు
లస్త్రశస్త్రవిశేషజ్ఞు లనఘమతులు, తెలివిగలవారు కలిమియు బలిమి గలరు. 486

క. విడుమరదొడరని సిరియును, నుడుకువ కెడలేనికృషియు నొగి గోరక్షన్
మడవకచేయుట యనువివి, యెడపక చరియింతురందు నెందును వైశ్యుల్. 487

వ. ఇట్లు మహిషవధానంతరమ్మున రామరాజ్యంబై ప్రపంచంబు సుమాళమ్ముగా( గొంత
కాలం బుండ( బిమ్మట జగద్ద్రోహం బొనర్చ నమకట్టిన శుంభనిశుంభులను జండ
ముండులను రక్తబీజ ధూమ్రలోచనులను బరిమార్చి సురపక్షపాతినియై జగదంబ
జగమ్ములకు మేలువాటించెనన, వార లెవ్వరేవిధమ్మున వారే కతమ్మున వధించె
నుడువుమనుడు రాజునకు ముని యిట్లనియె. 488

క. మును శుంభ నిశుంభులు నా(, జనుదానవు లిరువురుణా రసాతలవాసుల్
జనవర! తపముండి రకన, మున కుదకమునకుము( గాక మొదలులభంగిన్. 489

మ. పదివేలేం డ్లిటు లాచరించుటయు నప్పద్మాసనుం డేగుదెం
చి దయాంతఃకరణుండు వేడు( దన నీచే నొడ్లచే నేరిచే(
దుదిలేకుండ నొసంగుదే యనుడు నా దుష్టాత్ములంగాంచి యొ
ప్పదు వేడొండువరంబు గోరు(డన నవ్వా రంజలిన్ మోడ్చుచున్. 490

మ. జననం బందినవారికిన్ మృతి యవశ్యంబేవి మా కొక్క యం
గనచే( దక్క నపాయ మొండొరులచే( గాకుండ( గావిమ్ము మ
మ్మెనెదుర్పంగల కాంతయుం గలుగునే( బో! యాతమస్లైన నా
గ నొసంగెన్ వర మట్లుకాక యనుచుం గంజోద్భవుం డొప్పుగన్. 491

వ. అన్నదమ్ము లిట్లు వరమ్ములం బడసి తమకు భృగువుం బురోహితుంగాఁ గైకొని రందు జ్యేష్ఠుండగు శుంభుండు శుభదినమ్మున సుముహూర్తమ్మున సింహాసనాభిషిక్తుండుగా నిశుంభుండు మంత్రియై సకల తంత్రమ్ములు నడుపుచుండె. మహావీరులగు చండముండు లిరువురును సేనాధిపతులై వారిం గొలుచు చుండిరి. ధూమ్రలోచనరక్తబీజు లనువారు పాతాళమ్మున నుండి వచ్చి రెం డక్షౌహిణులతో నాశుంభుఁ గొలుచుచుఁ దదనుమతులై రందు, 492

గీ. రక్తబీజుం డసాధ్యసంగ్రాముఁ డతఁడు, పోరునెడ నస్త్రహతిఁ జేసి పొడమునట్లు పుడమిఁ బడి నంతలో వానిఁ బోలఁజాలు, వీరులుదయింతు రొక్కట వేనవేలు.

వ. కావుననవ్వానికి రక్తబీజుం డని పేరు సార్థకంబు మరియు ననేకులు రక్కసులు చతురంగబలసమన్వితులై యా శుంభుం గొలువవచ్చిన శుంభుండును వారల నెల్లర లోఁగొని రాజ్యం బేలుచుండె నంత నిశుంభుం డొక్కనాఁడు, 494

చ. అమరపతిన్ జయింప నమరాలయ మేగిన వజ్రి విర్గరుల్,
గుమిగొని తోడురా నెదురుకొల్పచరించి దురంబు చేయ లో
కము బెగడొందె నంత లయకాలుఁడు వోలె సురేశ్వరుండు వ
జ్రముఁగొనియేసె నయ్యసురవ్రాలెఁ బడల్పడుమూర్ఛపెంపునన్. 495

క. చారులు తమ్ముఁడు మూర్ఛం, గూరిన విధమెఱుఁగఁజెప్పఁ గ్రోధాకులుఁడై
ధీరుఁడు శుంభుఁడు సంగ్రా, మారంభుండయ్యె నమరు లటునిటుచెదరన్. 496

వ. ఇట్లు శుంభుండు విక్రమించి యింద్రాదుల జయించి, 497

చ. అమరపదంబు చేకొని సురారిమయమ్ముగ నేలుచున్ గ్రమ
క్రమమున నష్టదిక్పతులగద్దియలం దనపాలుచేసి వి
క్రమమున మూఁడులోకములు రాజ్యము సేయుచు నందనమ్మునం
దు ముదముమీఱ నచ్చరలతో విహరించె నవార్యచర్యుఁడై. 498

చ. అనవరతంబు కల్పకసుమాంచితుఁడై, సుధ గ్రోలుచున్ సురాం
గనలఁజెలఁగ దవిల్చి కడుఁ గంటకుఁడై మఖభాగముల్ హరిం
చి నిఖిలదేవతల్ తనదు సేనయకాఁ బచరించి తత్కృతుల్
పొనరుపఁజేయుచు న్నెగడెఁ బొంపిరివోయిన మేటిసంపదన్. 499

చ. ఒకఁడు జముండు శ్రీదుఁ డిఁకనొక్కఁడు వహ్నిమతొక్కఁడింకవే
తొకడుఁ దినేశ్వరుండు శశియున్ మఱియొక్కఁడు వాయుదేవుఁడిం

కొకఁడు నొకండుపాశి యిటులొక్కొకఁడొక్కొకరుండుగాఁ దదీ
యకృతులు సేయ నేర్పఱిచె నాత్మకు నచ్చిన దానవేంద్రులకా. 500

వ. అంత నమరులు విరాలంబులై దానవుల ధాటికి నోడి యరణ్యంబు శరణ్యంబుగా గుహలు గృహమ్ములుగా నలందురుచు నక్కడక్కడఁ బంచబంగాళమ్ముగాఁ జరించుచు సుఖం బెఱుంగక విమనస్కులై యుండి రని వెండియు. 501

చ. నరవర! కాలపర్యయమనం గడు దుర్భరః మెంతవారు త
త్పరత సుఖంబు దుఃఖమును దాల్తురు భిక్షుకు రాజుఁజేయు భూ
వరు నతిథిం బొనర్చు బలవంతుని దుర్బలుఁ జేయు దుర్బలుకా
స్థిరబలుఁజేయు నయ్యది యజేయము దాఁటగరాదు బ్రహ్మకున్. 502

ఉ. శూరు లశూరులన్ మిగుల సూరు లసూరులనం గలారె? యె
వ్వారికి నెన్నియే స్గతు లవారణఁ గాలముగూర్చుఁ గాక యెం
తే రహి నూఱుజన్మముల నిష్ఠమెయికా బచరించి యింద్రుఁడై
పారములేవి దుఃఖముల బాల్పడునే? యటుగానిచో నృపా! 503

క. హరుఁడు కపాలం బూనట, హరి నానాతుచ్ఛయోనులందుఁ బడుటయు
న్నరనాధ! కాలగతి దు, ర్భర మియ్యది యిట్టి దనుచుఁ బలుకం గలదే. 504

ఉ. ఈగతి దేవతల్ వనములే శరణమ్ముగ నేగ శుంభుఁడు
ద్యోగము చేయుచుండె నటు లొక్కసహస్రము నిండె వర్షముల్
భోగములేమి నెంతయును బొల్పఱి యింద్రముఖామరుల్ దివం
బేగతిఁ గొందు మెట్లు వధియింతుము వీని నటంచు నెంచుచుకా. 505

వ. ఒక్కనాఁడు బృహస్పతిం గని మహాత్మా! నీవు సర్వజ్ఞుండ వీ సంకటమ్మున నొనర్పం దగు నుపాయమ్మొండుయోజించి సురలం బారమేదింప ననుగ్రహింపుము. మంత్రమ్ముల ప్రభావమ్ము లప్రమేయంబులు తద్బలమ్మున నభిచారహోమం బొండె విష్ణుల నొండెఁ జేయించి మాపదంబు మాకుం జేకూర్పుము నావుడు బృహస్పతి యిట్లనియె. 506

ఉ. వల్లవొ! మంత్రతంత్రము లనన్ విధిచోదిత రీతిఁ గార్యముల్
చెల్లఁగఁ జేయు నెక్కటిగఁ జేయఁగ నేరవు తత్త్వదాధిప
త్యోల్లసితుల్ సురేశ్వరు లహో! యిటుమీరలు దుర్దశాహతుల్
పెల్లగ నున్నవార లెటు పెం పిడు నయ్యవి కేవలస్థితిన్. 507

వ. అదియునుం గాక యవశ్యభావ్యంబులగు కార్యంబులకుఁ బ్రతీకారంబు లేకుండు నైనను దనకొలఁది నుపాయం బొనర్చుట శిష్టానుమతంబు దైవంబు ప్రధానం బని కొందఱు చెప్పినను దాని నుపాయవాదు లంగీకరింపరు కొంద ఱుభయమ్మునను గార్యసిద్ధి యని నుడువుదురు గావున సర్వంబు నేకం బొనర్చి, 508

క. కేవలము దైవము యనక, కేవలము నుపాయమన కొగిన్ బ్రతికారం
బేవెంట నెచటఁ దగు నది, యేవభియించెద నొనర్పుఁ డీరు కదంకన్. 509

క. మును మహిషాసురునిం జం, పిననాఁ డయ్యంబ సురలఁ బ్రేముడిఁగని చె
ప్పిన విధము మఱచితిరె చ, య్యన నజ్జననిం దలంపుఁ డాపద దొలఁగుఁగా. 510

## ఇంద్రాదులు హిమాలయమ్మున కరుగుట.

వ. కావున హిమాచలమ్మునకుం జని మనోహరంబగు నప్పర్వతమ్మున నప్పరాంబ మాయాబీజపురశ్చరణం బ్రవర్తించినఁ గార్యసిద్ధియగు నయ్యెడ నప్పరశక్తి యెల్లప్పుడు వసియించు ననియుఁగా వింటి నావుడు నిలింపులు తద్గిరిశిఖరమ్మునకుం జని మాయాబీజమ్ము జపియించుచు నిట్లు నుతించిరి. 511

## ద ం డ క ము.

శ్రీమన్మహాదేవి ! విశ్వేశ్వరప్రాణనాథే ! సదానందరూపే ! సురానందదే ! తే ! నమో, దానవాంతప్రదే ! మానవానా మనేకార్థదే ! భక్తిగమ్యస్వరూపే ! నతే నామ సంఖ్యాం నతేరూప మీదృక్తథాకోపివేదాదిదేవాదిరూపే ! త్వమేవాసి సర్వేషు శక్తిస్వరూపా, ప్రజాసృష్టి సంహారకాలే సదైవ స్మృతి స్త్వం ధృతి స్త్వం త్వమేవాసి బుద్ధి ర్జరాపుష్టితుష్టీ ధృతిః కాంతిశాంతీ సువిద్యాసులక్ష్మీర్గతిః కీర్తిమేధే త్వమేవాసి విశ్వస్య బీజం పురాణం యదాయై స్స్వరూపైః కరో షీహ కార్యం సురాణాం చ తేభ్యో నమో మోఽద్యశాంత్యై క్షమా యోగనిద్రా దయాత్వం నివస్తా స్థితా సర్వభూతేషు శస్తై స్స్వరూపైః కృతం కార్య మాదౌ త్వయా యత్సురాణాం హతోసౌ మహారి ర్మదాంధో హయారి ర్దయా తేనదా సర్వదేవేషు దేవీ ! ప్రసిద్ధా పురాణేషు వేదేషు గీతా కి మత్రాస్తి చిత్రం యదంబా సుతం స్వం ముదా పోషయే త్తోషయే త్సమ్యగేవ ప్రసూ స్త్వం యతోనిర్జరాణాం సహాయాకురు ష్వైకచిత్తేన కార్యం సమగ్రం నవా తే గుణానా మియత్తాస్వరూపం వయం దేవి జానీమహే విశ్వవంద్యే కృపాపాత్ర మిత్యేవ మత్వా తథాఽస్మాన్ భయేభ్య స్సదా పాహిపాతుం

ఉ. చక్కనిచీరఁ గట్టి విలసన్మణిభూషణభూషితాంగియై
యెక్కటి నేగుదెంచె సురలెల్లరుఁ జూచి "యిదేమొ, యిప్పు డీ
చక్కెరబొమ్మ గంగ కిటు చయ్యన నాడఁగ నేగుదెంచు నం
చొక్కమొగి న్నమస్కృతుల నొయ్యనఁజేసి తను న్నుతింపఁగన్. 522

వ. గిరిగహ్వరమ్మునుండి గంగ కేగునెపమ్మున వచ్చి సురలంగాంచి యిట్లనియె. 523

క. ఏమీ దేవతలా! యిం, దేమి పనికివచ్చిరొక్కొ! యీగతిఁ గదుఁ జిం
తామగ్నులగుటకుం గత, మేమొకొ! నా, సురలు జగదధీశ్వరి కెలమిన్. 524

ఉ. కేలు మొగిడ్చి యంబ! మముఁ గీడ్పడకుండఁగఁ బ్రోవనెంచు మే
మాలములో సురారులకు నడ్డముగా నిలువోపలేక మా
బాలమి విన్నవింప నిటు చయ్యన వచ్చితి మేపుడక్కి మా
పాలన నీదికాదె! మును వల్కినపల్కు స్మరింపకుందువే. 525

మ. జననీ! శుంభనిశుంభులన్ దనుజు లిచ్చామాత్ర మమ్మెల్లఁదా
మవిలో గీటడఁగించి యేలుదురు స్వర్గావాస మాదుష్టు లె
వ్వనికిన్ వధ్యులుగారు బ్రహ్మవర మప్పాటన్ బొసంగించె నం
గనచేఁ జచ్చెద రా హయారిబలె, నేకంజాక్షికిన్ శక్యమౌ. 526

క. మాపా టిట్టిది యని నీ, కేపాటం జెప్పనేర్తు మేదుగడయు లే
కాపదలకుఁ బ్రాపై దు, ష్ప్రాపంబగు నడవి విడుమ పడఁగావలెనో. 527

క. మును మహిషుఁ జంపి పిమ్మట, "వనయులు మిము బాధ పెట్టునప్పుడు నన్నున్
మనమునఁ దలఁపుడు కార్యం, బును దీర్చెద" నన్నమాట వొల్లగు వంబా! 528

వ. శుంభనిశుంభు లట్లుండ రక్తబీజచండముండు లను వారు గమ మొఱకులై వారికి బాసటగా నున్నవారలు. వేయేల వష్టదిక్పాలకులును నిప్పుడు రక్కసులకా నెఱుంగుము. 529

క. అనదలమై నీపాదం, బునఁ బడు మముఁ గరుణఁజూచి పొగరుమిగులు వ
ద్దనుజులఁ బరిమార్పక యు, న్నను నిటు లెన్నాళ్ళు వనమునం బడుదు మింకన్.

## దేవి శుంభ నిశుంభుల పురమ్మున కరుగుట.

వ. ఇట్లు మాటిమాటికి సన్నుతించి పనటంబడు నమరులయెడఁ గరుణ గలిగి యప్పా
ర్వతి తన శరీరమ్మునుండి యిచ్చామాత్రమ్మునఁ గౌశికి యను నొక శక్తిం బుట్టిం

సమర్థే। వినా బాణపాత్రై ర్వినాముష్టిఘాతై ర్వినాశూలఖడ్గై ర్వినాశక్తి దండై రిపూన్ హన్తు మేవాసి శక్తా వినోదా త్తథాపీహ లోకోపకారాయ లీలా ఇమా శ్శాశ్వతం నైవ జానంతి మూఢా నకార్యం వినా కారణం సంభవే ద్వా వయం తర్కయా మోఽనుమానం ప్రమాణం త్వమేవాసి కర్త్రా స్య విశ్వస్యధాతా భవే త్సృష్టికర్తా ముకుందోఽవితాయం హరో నాశకృద్వై పురాణప్రసిద్ధా వకిం త్వత్ప్రసూతా స్త్రయ స్తేయుగాదౌ త్వ మేవాసి సర్వస్య తేనైవ మాతా త్రిభి స్త్వం పురానాధితా దేవి దత్తా త్వయా శక్తి రుగ్రాచ తేభ్య స్సమగ్రాత్వయా సంయుతా స్తే ప్రకుర్వంతి కామం జగత్పాలనోత్పత్తి సంహారకార్యం త్వదీయాంఘ్రి యుగ్మాశ్రయాన్ కుంభ దైత్యార్దితాజా విర్జరాన్ దేవి పాయా స్త్వదన్య న్న తే జానతే దేవి దుర్గే। నమస్తే నమస్తే నమస్తే నమః. 512

వ. అని వినుతించి వెండియు. 513

గీ. విబుధబృందమ్ములెల్ల నీ వెంట నంటి, యెల్లవేళ విమం గొల్తు రెఱుకకలిమి
వట్టి త్వత్పదపద్మమ్ము లరసి భక్తి, మననెఱుంగని యతుఁ లతిమందమతులు. 514

గీ. కమలవై కీర్తివయ్యును గాంతివయ్యు, లజ్జవై స్థితివైన జగజ్జనని వి
ను మది భజియింప కకట దంభముననుంద్రు, వైష్ణవులుసౌరులునుబాశుపతులుదేవి।

క. హరిహరు లేదుగడగ విన్, బరమాదరమున యజింప వల నెఱుఁగమి నీ
చరణములు విడుచు దుర్మతు, లరయఁగ విధివంచితాత్ము లనఁదగు వంబా. 516

క. హరి జతురసముం గొని సా, గరజాపదరంజనమ్ము గావించున్ శం
కరుఁ డగజాపదపంకజ, పరాగరతుఁ డింక నొరుల వాకొనఁగలదే. 517

క. సారవిహీనంబని సం, సారము వర్జించి జన్మసాఫల్యంబున్
గోరి నిను యతులు దలఁతు రు, దారంబగు భక్తి కలిమి దాంత హృదయులై.

గీ. పలుపలుకులేల నీ పదభక్తి లేని, చెనఁటులెల్లను రోగులై శ్రీ దొలంగి
సంసరణకూపమునఁ బడి సౌఖ్యలేశ, మెఱుఁగక వశింతు రఖిలలోకైకజనని। 519

గీ. కట్టియలు మోచికొని గడ్డికట్ట లమ్మ, కొనుచు సేవపు గతిని జీవనము చేయు
హీను లందఱుఁ దొల్లి నిన్నెఱుకకలిమి, గొలవని తులువ లింత నిక్కువముతల్లి.

వ. అని పలువిధమ్ముల సన్నుతించు నమరులఁ గరుణించి జగదంబ ప్రత్యక్షంబుగా నుంకించి, 521

చిన నయ్యంబిక నీలవర్ణ యగు కతనఁ గాళిక యనియుఁ గాళరాత్రి యనియుం బరఁగి మహాఘోరాకారంబు గలిగి సర్వకామప్రదయై చెలువారె; నప్పరాంబయు సర్వభూషణభూషితంబగు రూపమ్మునఁ బరిఢవిల్లుచు నమరుల కానంద సంధాయినియై యిట్లనియె. 531

ఉ. శుంభనిశుంభులన్ దివిజసూదనులం బరిమార్చి సంపదా
రంభము మీ కొనర్తుఁ దలరం బని లే దిఁక నాకులార ! దు
ర్దంభమునన్ జగమ్ముల నదల్చెడి దుష్టులయార్తిఁ జేసి వి
శ్వంభర కింత పుట్టెనె యపాయము బ్రహ్మవరంబు పెంపునన్. 532

వ. అని యభయంబిచ్చి జగదంబ స్వాంశసంభవయగు కాళిక దనకుఁ బార్శ్వవర్తి నిఁగా సింగంబు నధిష్ఠించి శత్రుపురంబున కుద్దవిడిఁ జని యుపాంతోపవనమ్మున విడిసి, 533

చ. అమరులు మోదమందఁగ మృగావళి మత్తిలఁ బక్షిబృందముల్
గుమిగొని యాలకింపఁగఁ జిగుళ్ళుగురింప జగంబు మోహవా
ర్ధిమునిఁగి దొప్పదోఁగఁ గడుఁ దియ్యదనమ్మున నింపు పెంపు నొ
క్కమొగిన యంకురింప మృదుగాన మొనర్చె ననేకభంగులన్. 534

వ. పదంపడి యెడనెడ నుపవనమ్ములఁ గ్రీడార్థంబు గ్రుమ్మరు చండముండు లిరువురును దద్గానరసంబు కర్ణపేయం బగుటఁ గొంతవడి నాలించి దొదవ్వుల నిలిచి త్రిజగన్మనోహారిణి యగు నంబికను దత్సమీపవర్తిని యగు కాళికను గాంచి పెచ్చు పెరిఁగెడి యచ్చెరువునఁ బురి కరిగి శుంభుంగాంచి మ్రొక్కి యిట్లనిరి. 535

ఉ. ఎక్కడనుండియో యొక మృగేక్షణ సింగము నెక్కివచ్చె న
మ్మక్క యనన్ వశం బగునె యచ్చెలువంబు వచింప నట్టి బల్
చక్కెరబొమ్మ ముజ్జగములన్ గనఁగా వినఁగా నెఱుంగ మా
టక్కరి గానవిద్య నొకటందగుఁ దక్కిన పట్టె యుండఁగన్. 536

క. మన యుద్యానమ్మున న వ్వనితారత్నమ్ము గాన వైఖరుల దనం
తన మృగముల మెచ్చించుచుఁ, దన కొక చెలి తోడుగాఁగఁ దనరెడివింటే. 537

వ. పెయ్యేల యవ్వాలికారత్నం బెవ్వతెయో కల తెఱం గెఱింగి తోడికొని వచ్చి భార్యగాఁ గైకొని సుఖింపు మింతకన్న నీ సంసారమ్మున సౌఖ్యం బొం డుండునే యని వెండియు, 538

మ. సరసైరావత పారిజాతములునున్ సప్తాస్యమౌ నశ్వ మం
బరయానోచితమౌ విమానము సురస్వామిన్ విసర్జించి నీ
పరముం జేసితి పట్టి బల్మిగల సంపత్కామతన్ మేల్మి పొం
పిరివోవం జనునీకు నీయబల దేవేరిం గొనం బోలదే. 539

చ. వరుణుని ఛత్ర మీవు గొని పాశము తమ్ముని కిచ్చి తద్ధనే
శ్వరునిధి చూఱకో ల్గొలిపి సాగర మిచ్చిన నిత్యకాంతిని
స్ఫురదురుపుష్పమాలయు నపూర్వపురత్నములన్ గ్రహించి ని
త్యరుచి వెలుంగు నీకిదిగదా! తగు నెచ్చెలి యెన్నిభంగులన్. 540

గీ. దండు మీతెడి యమునిదండంబు మృత్యు, శక్తియుఁ బరాక్రమస్థున సంగ్రహించి
కామధేనువుపాల్గ్రోలఁగల యదృష్ట, వంతునకు నిట్టి కాంతతో నలదె పొందు.

గీ. స్వర్గ మర్త్యాది నిఖిలభువనములందుఁ, గలుగు నిఖిలరత్నమ్ముల బలిమిఁగొనిన
యస్వరఃకాముకునకు నీ కమర వలదె, యట్టి రత్నముతోడి పొం దెట్టులేని. 542

క. నీగృహమునఁ గలరత్నము, లీగజగామినికిఁ దక్కెనేనియు రత్న
శ్రీ గొఱఁత చెందు నీతరు, జీగణరత్నంబు నాని నెగడించుఁజుమీ. 543

వ. అని కైపెక్కించిన నమ్మదోన్మత్తుండు నమ్మతించి కెలననున్న సుగ్రీవుం దను
వానిం బిలిచి యిట్లనియె. 544

గీ. దూతవై వేగమిప్పు డత్తొయ్యలికడ, కేగి కార్యంబు పొసఁగించి రాఁగఁదగుదు
వాద్యుపాయద్వయంబ యర్హంబు దీని, కంద్రు శృంగారరసవిదు లగు రసికులు.

ఉ. సామము దానమున్ విడిచి చయ్యనఁ గొందఱు భేద మిట్టిచోఁ
గాముకు లాచరింతు రది కర్జముగాదు రసంబు భంగరూ
పామయదూషితంబగు నహంకృతి దండమయేనిఁ దద్రసం
బేమియుఁ గానరాక మొదలే చెడుఁగావ ద్వయంబు నింద్యమౌ. 546

క. రా నిచ్చ గలుగు కామిని, యే వది నేరుపున మదికి నింపు గొలిపినన్
దానమున సామమున నొగి, దానై చనుదేరకున్నె తక్కినవేలా. 547

వ. అని యనిపిన సుగ్రీవుండు నని సింగంబు నెక్కి సర్వ శృంగారంబుగ నొప్పు
నజ్జగదంబం గని మ్రొక్కి వినయమ్మున నిట్లనియె. 548

చ. త్రిదశుల జీరికిం గొనక దేవపదమ్మును గొన్న శత్రుడు
ర్మదపరిహారి శుంభుని స్మరప్రతిమాను నెఱింగి యుందుదే

మదవతి! దూత నే నతని మన్ననకుం దగువాఁడ; నీదు మే
ల్విధము విన్కిఁ జేసి స్మరపీడితుఁడై ననుఁ బంపె నియ్యెడన్. 549

వ. అతండు నీయెడల మోహమ్ముకతన వివశుండై పలికినపలుకులు వినుము. 550

చ. అమలినగాత్రి! దేవతల నందఱ గెల్చితి సర్వయజ్ఞభా
గములుమదీయముల్ త్రిదశపున్మరుఁ డన్బిరు దొంది నాకలో
కమునఁ గలట్టి రత్నములఁ గైకొని ముజ్జగమెల్లఁ జేతిలో
నమరఁగ రాజ్యమున్ వలయున ట్లొనరించుచు నుంటి మద్ధతిన్. 551

గీ. ఇట్టి దట్టుఁడనైన నాకిగురుఁబోఁడి, నీదుచెలువంబు వీనుల విండి కాఁగ
బారి కోర్చుట పెద్దయు భార మయ్యె, నెరవుచేయక పేర్మి నీవరయ వలయు. 552

ఉ. దాసుఁడ నైతి నీకది ముదం బెటులొందు నటుల్ చరింతు నా
సాసలఁ జిక్కుచున్నను నాఱడి పెట్టక యేలుకొమ్ము నా
వాసి యెఱుంగు మెవ్వరికి వధ్యుఁడగాను ననున్ వరించి నీ
కేనతు లీడులేక చరియింపుము నిత్యసువాసినీగతిన్. 553

వ. అతని పల్కుల చందంబియ్యది దీనంగల సారం బరసి ప్రత్యుత్తరం బొసంగి త్రిలోకీరాజ్యంబు నీవయై యెల్లదానవుల నేలికొనం దగదే! నాపుడు జగదంబ మందహాసం బిగురొత్త నిట్లనియె. 554

ఉ. జేతగ దాతగా సుగుణసింధువుఁ గాఁగ నఖండలక్షణో
పేతునిఁగాఁగ సుందరుఁగ నే వినియుంటిని శుంభునిఁ గా యశ
స్స్ఫీతుఁ దదీయసోదరు నశేష జగమ్ములయందు; వానిపైఁ
బ్రీతి జనించియే యిటకుఁ బేర్మి మెయిం గా జనుదెంచితిం జామీ. 555

మ. సురయక్షాసురమానవప్రముఖులం జూడంగఁ జూడంగ నె
ల్లరు మీరాజున కోడియుంటి మని రల్పప్రజ్ఞులం బొందరా
మి రసజ్ఞోత్తరుఁడైన మీ విభునిపై మేల్పట్టి నారాక; బం
గరు రంగారెడి రత్న మెవ్విధమునం గాంక్షింపదే మేల్మికై. 556

క. అదిగాన మీవిభుని బలె. మదినను మన్నించి నాదుమాట లతని నె
మ్మది కెక్క నొంటిపాటునఁ, గదిసి వచింపు మిటులైనఁ గార్యము పొసఁగున్ 557

ఉ. సుందరు లందు మేల్మిగల సుందరుఁ డంచు వదాన్యుఁ డంచు మ
ధ్యందినసీరజాప్తకిరణావళిఁ గాదనఁ జాలుతేజ మిం

పొందెడివాఁ డటంచు విను నోపినవట్టును బూని వింటి నీ
యందు మనమ్ము పుట్టి వశనై చనుదెంచితి నేమి చేసెదో. 558

వ. ఇంక నొక్క-కొఱంతగలదు వినుమది యెట్లంటేని మున్ను కొండికనాఁడు సఖీజన సమక్షమ్మున నొకవ్రతంబు పూనితి. 559

క. బలమున నాతో నెవ్వఁడు, గలనం గాలూఁది నాదుగర్వ ముడుప న
య్యలఘునిఁ బతిగాఁ గైకొన, దలఁతు ననన్ సఖులు నగిరి తద్దయు నన్నున్.

క. అది మొదలు నేఁడు తుద నా, మద మడఁచెడి వీరవరుఁ డమరముఖ్యులయం
దొదవఁడు నీ వికఁ బిది స, మ్మదముగ నను గొనుము ధైర్యసిద్ధి యగుకతనన్.

వ ఇట్లంటినని మీ ప్రభువుతో నేకాంతమ్మునఁ బలికి యెత్తెఱంగున నైనఁ గార్యసిద్ధిం బొనర్పు మనవుడు సుగ్రీవుండు విస్మయావిష్టుండై యయ్యంబ కిట్లనియె. 562

ఉ. చందనగంధి! యిట్లనుట సాహసమాత్రము స్త్రీస్వభావ మీ
చందము గాక, యెల్ల దివిషద్గణ మెవ్వని పేరు విన్న నా
క్రందన మాచరించుఁ గడుఁ గావలఁ దట్టి యఖండు శుంభు నీ
వెందు జయింపనేర్తె! చటులేక్షణపాత్రముచేతఁ దక్కవఁగా. 563

వ. కావున స్త్రీస్వభావమ్మువం దొదరు మూర్ఖత డిందుపఱచి శుంభు నొండె నిశుంభు నొండెఁ బతిగాఁగొని సుఖం బందు మదియునుంగాక శృంగారం బెల్లరకును మెత్తదనమ్మున ననుభావ్యమ్మగాని వేఱొండు విధమ్మునఁ బదనుపడదు. నావచనమ్ము లనాదరించి గర్వించితేని యతండు గ్రుద్ధుండై దుర్మదులగు భృత్యులం బిలిచి నిన్నుం బలాత్కారమ్మునఁ దన సన్నిధికి రప్పించికొన నేర్పు నట్లు కేశాకర్షణాదికమ్మునకుం లోనై సిగ్గఱ నుంకించుటది నీబోఁటి బోటికిం దగు పాడియే! వినుమదియునుంగాక, 564

క. రతిసుఖ మెక్కడ, యుద్ధా, దృతి యెక్కడ, మిగులదవ్వు! తెలిసి యిరువురం
దతివరో! యొక్కనిఁ గైకొని, మితిమీఱు సుఖములఁ దవిలి మెలఁగుట తగదే.

వ. నావుడు జగదంబ యిట్లను, 566

క. శుంభనిశుంభులు బలియురు, నంభోధిగభీరులంచు నరయుదు నీవుం
దంభ మెఱుంగక తెలిపెడి, గంభీరత గలవు వ్రతము గాదన దగునే. 567

ఉ. సంగరరంగమందు ననుఁ జక్క నెదిర్చి జయించి నాదు పా
ణిం గొను టొప్పు నా ప్రతిన నిక్కమకాక యలంతిఁబోవ ది

బృంగి వచించి యొప్పమిని బంధుసమేతముగా రసాతలం
బుం గయికోలు మే లనుచుఁ బూవికదెల్పుము మీ యధీశుతో. 568

వ. మచ్ఛూలాఘాతమ్మునకుం బెగడొంది కాతరువిం గొవ నేనంత బేలనే। సంగరమ్మున కియ్యకొననినాఁడు స్వర్గమ్మును మర్త్యమ్మును ద్యజించు టొప్పు నీవు భరం బని యెంచక నాపలికిన చందంబు సత్యంబుగా వచియింపుము. 569

క. తనరాజు నెడల శాత్రవ, జనులయెడల సత్యరీతి జవదాఁటక యుం
డినదియ దూతల ధర్మం, బని యెఱిఁగి యథార్థ తత్పరాత్ముఁడ వగుమీ. 570

వ. అని యిట్లు నీతియుక్తమ్మును బ్రగల్భమ్మును సహేతుకమ్మునుగా నుపన్యసించిన నయ్యంబిక వచనమ్ముల కుత్తరం బీ నేరక సుగ్రీవుండు విస్మయం బంది తన రాజు సన్నిధి కరిగి నమస్కరించి యిట్లనియె. 571

గీ. సత్యము ప్రియంబు నై నవచనము దొరక, దని యసత్యంపుఁ బలుకు నాకనభిమతము
గావునఁ బ్రియంబుగాకుండుఁగాక నిజము, పల్కెదఁ గృపానుగతి వినవలయు నధిప.

వ. అక్కన్నియ నివాసం బెద్దియో యెయ్యెడ నుండి యియ్యెడ కరుదెంచెనో నిక్కువమ్ముగఁ దెలియదు; తెలిసినంతవట్టును వివరించెద. 573

క. మదమున సంగరమున ని, న్నెదిరింపఁ దలంచియున్నదెంతయు గర్వా
న్వద మక్కమలానన నె, మ్మది యాపె వచించినట్టి మాటలు వినుమీ. 574

వ. బాల్యమ్మున సఖీసమక్షమ్మున సంగరరంగమ్మున నెవ్వఁడు నా కెదురై పోర జయించు నవ్వానిం బతిగాఁ గైకొందుఁగాక యని వ్రతంబు పూనినదఁట। అయ్యది యవంధ్యమ్ముగాఁ దుదముట్టింప సమకట్టి యున్నదాన ననియు మీరాజు లందులకు సమ్మతించి యట్లొనరింప వరింతుననియు వచించి నన్నుఁ బుత్తెంచె దేవర కెయ్యది హితం బట్లొనరింపఁ దగునని వెండియు, 575

క. సింగంబు వాహనం బొక, యంగన బాసటయుఁ గాఁ దనంతన కడు ను
ప్పొంగుచు నెంతయు నీతో, సంగర మాపించి యుండె సఖి రాజేంద్రా। 576

వ. నావుడు శుంభుం డనుజుని దిక్కు మొగంబై. 577

గీ. అబల యొక్కతె తోడఁట। యతివయంట
పోరుటకు వచ్చెనఁట। నీవు పోయి వత్తొ,
యేఁ జనుట యొప్పొ, వచియింపు మేది మేలొ?
నావుడు నిశుంభుఁ డిట్లను నయము మెఱయ. 578

గీ. ఈవు చన నేల నే నట కేగ నేల, ధూమ్రలోచనుఁ బంపు సత్తోయజాక్షి
నిటకు నిర్జించి తెచ్చు నొక్కింతతడవు, కాకమున్న వరించు నక్కాంత నన్ను.

వ. పిదప వివాహం బొనరించుకొని సుఖం బుండు మనుచు శుంభుండు వల్లె యని ధూమ్రలోచనుం బిలిచి యిట్లనియె. 580

గీ. ఎవ్వఁ డడ్డంబు వొచ్చిన నీడఁ బోక, పట్టి కలఁగించి తత్పార్శ్వవర్తిని యగు
సంగవం జంపి చంచలాపాంగి నత్త, లోదరిని దెమ్ము నాకు నామోద మిమ్ము. 581

క. మృదుమార్గణములు నీపై, నది విడిచినఁ గనలి సునిశితాస్త్రమ్ములఁ గొ
ట్టెమనూ ! యెడ లెఱుఁగక య, మ్మదవతి నా కెంతయేని మాన్యయగుఁ జుమీ.

క. దానికిఁ దోడగువారల, పై నెన రించుకయు లేక పరిమార్పుము నా
ప్రాణంబు ప్రాణమగు న, మ్మానినిఁ గాపాడి యిట కమరఁ దేరవగున్. 583

వ. నావుడు సేనాసహితుండై ధూమ్రలోచనుం డరిగి దౌదవ్వుల నయ్యంబిం గాంచి వినయపురస్సరంబుగా నమస్కరించి మృదుమధురంబులగు వచనమ్ముల నిట్లనియె.

చ. వినుము మృగాక్షి ! కామశరవేదన కోర్వక మానిభుండు దూ
త ననిపె వాఁడుమఱి సరసతఁ గదు సామవిధంబు నీయెడం
బొనిపిన నీవు వానియెడఁ బొక్కపు వ్యంగ్యపు రంగులీనఁ జె
ప్పినవచనంబులెల్ల మది వేఱుగ నెంచె రసం బెఱుంగమిన్. 585

వ. పిమ్మట వాఁడు మారాజునకుఁ దనయెఱింగిన విధమ్మునఁ జెప్పిన నతండు చింతాతురుండై ననుం బనిచె నీయందుఁ బ్రేమం బగ్గలం బగుకతన నీ వట్లాడుటకు సహింపక విరహాతురుఁడై హృదయ మొక్కింత చేసికొని వందురుచున్నవాఁడు "నన్నెవ్వాఁడు సంగ్రామమ్మున జయించు నవ్వాని వరియించెద" నను నీపలుకుల కర్థం బిట్లుగా యోజించె నెట్లంటేని, 586

గీ. సంగరం బన రెండు దెఱంగు లందొ, కండు రతిజంబు తక్కనొకండు బవర
మొకటి సుఖమిచ్చుఁ దక్కిన దొకటి దుఃఖ, దాయి శత్రుపురస్కృతత్వంబు కలిమి.

వ. అం దనంగసంగరంబున నన్నెవ్వఁడు జయించు నవ్వాని వరియింతు ననుట గాకేమి యని కృతనిశ్చయుండై సకలార్థవేది యగు నన్ను మరల ననిపె. 588

క. నీ చాతుర్యమ్మును విని, నీ చనవుం గోరు శుంభునిం బొందుము నీ
ధీచాకచక్యమునకుఁ, వాచానైపుణికి పార్థవైభవ మొదవన్. 589

వ. కామశాస్త్రవేత్తయగు మారాజు నీ హావమ్ములకుం దగు భావమ్ము లాచరించి ని
న్నొక్కటి జయింప నేర్చు నియ్యెడ నిక్కాళికయ సాక్షిణి యగు నని వెండియు.

చ. వినుము సుఖశయ్యపై శ్రమ జనింపఁ గరంచి నఖక్షతమ్ములన్
దనువున రక్తిమున్ గొలిపి దంతముల న్నునుమోవి నొక్కి గా
సి నొనరఁ జేసి చెమ్మటలు చిమ్మఁగ బేర్మిఁ గలంచుమా విభుం
గనుఁగొన నేగుదె మ్మతఁడు గాంచినతోడన నీకు దాసుఁడౌ. 591

ఆ.వె. సురతయోగ్యమైన సొంపును మెంపును, బొలుపు గలిగి చెలఁగు పూవుఁబోఁడి
కకట! నీకు సునిశితాస్త్రపరంపర, సైపఁ బాడియగునె చంచలాక్షి. 592

## కాళిక ధూమ్రలోచనునితో యుద్ధముచేయుట.

వ. కావున హితంబును రుచ్యంబునునగు నాపలుకు విశ్వసింపు మెవ్విధంబునను సుఖం
బీఁజాలని పెనఁకువకుం జోరకుము నావుడుఁ గోపాటోపంబు దీపింపఁ గాళిక వాని
కిట్లనియె. 593

క. రోషం బుడిగి వృథా శై, లూషునిగతి బెట్టిదమ్ములుం గొఱగామల్
భాషింతుఁ వౌర, మత్త! వి, దూషక! పోరిత మొనర్పఁ దొడరుము కదఁకన్.

క. విను విన్నుం బంపిన శుం, భనిశుంభులఁ దునిమి యమునిభవనమ్మునకుం
బనుపఁగ మన్నది మాదే, వి నెదిరిపోరాడు మింత వేరము లేదే. 595

చ. అనుచితరీతి మాజనని కాశలుషాత్ముల కేటిపెండ్లి! న
వ్వనగునుగాక, నక్కపయి వాంఛ జనించునె సింహి కక్కటా!
యను వగునేమొకో, కరిణి కోరయ గర్దభసంగ! మెందు నే
వివి గవయంబు నొందఁ జనునే! మొద వంగజతాపసంగతిన్. 596

వ. కావున దురాత్మా! నీ దురాలాపమ్ముల కంటిక సైఁచినను నేను సహించెడిదానఁగాను
జీవింప వలతేని పైళంబ చని యాదుర్మదులం గలసి పాతాళమ్మున కరుగుము
వేఱొండు బ్రతుకుతెఱవు నీకుం జొప్పడదనవుడు ధూమ్రలోచనుండు తామ్రలోచ
నుండై. 597

మ. కలహంబన్నను గాలుఁ ద్రవ్వెదవె! నీ గర్వం బడంపంగ నే
వలఁతిం గాకయ యింతవట్టు నిటు సంభాషింతునే! కాళి! కే

వలము న్విమ్ము వధించి సింగమును జావన్మొత్తి యిబ్బాలికన్
బలిమిం గైకొని యేగి మా విభునకుం బట్టంబు గట్టించెదన్. 598

క. రసభంగభయమ్మునఁ గా, దె సహించితి నింతవట్టుఁ దెలియక నాతో
డ సమర మొనరింపఁగఁ దా, మన మూనెద విపుడ విన్ను మాయింతుఁ దగన్.

క. నావుడుఁ గాళిక కోపం, బావిర్భవ మంద నిట్లు "అనదవగిది నే
లా, వెఱపుమాలుకూఁతలు ?, కావల మదఁగింతుఁ బోఁగాఁ బొదరు" మనన్.

ఉ. ఆ పలుకుల్ శితాస్త్రములయట్టులు కర్ణములం బగుల్ప న
ప్పాపపురక్కసుం డదరి బాణపరంపరల న్నిగుడ్ప ను
ద్దీపితకోప కాళికయుఁ దీవ్రశరమ్ముల వానిఁ ద్రుంచి దు
ర్లేపుని ధూమ్రలోచను 'బలే' యని మెచ్చఁగఁగొట్టె నిర్జరుల్. 601

ఆ. వె. అంతఁ బోక వాని యరదమ్ము నుగ్గుగాఁ, జేసె సింహనాదభాసురముగ
నసుర వేయితేరి నాయిత మొనరించి, కాండవృష్టి గురిపెఁ గాళిమీఁద. 602

ఉ. ఆవిశితాస్త్రసంతతుల నన్నిటి నంతరమంద త్రుంచి వి
ట్టూనిన కోపవేగమున నొక్కటఁ బెక్కులు గాఁగ నస్త్రసం
తానము గ్రుమ్మరింప నొకతండముగాఁ బడి రెల్ల రక్కసుల్
వాని రథంబు రథ్యములు వమ్ముగ సూతుని దున్మి ప్రేల్మడిన్. 603

మ. ధనువున్ భగ్నముఁజేసి దేవతలు మోదంబంద శంఖంబుఁ బ
ట్టినఁ దన్నాదమునం దిశల్ పగులమాడ్కిన్ మాఱుఘోషించె న
ద్దనుజుండున్ బరిఘంబు దాల్చి పటువాగ్దంభమ్మునన్ 'బింగలో
చన ! యోకుత్సితరూప ! నిన్నిపుడ పంచత్వంబు నొందించెదన్' 604

శా. హుంకారమ్మున నిట్లు ప్రేలుచు జగం బల్లాడ నుంకించి యే
కొంకున్ లేక తటాలునన్ విడువ దిక్కుల్ వ్రయ్య నక్కాళి దా
హుంకారారవమాత్ర భగ్నముగ మద్యోగించినన్ దైత్యు లే
వంక న్నిల్వక పాఱిరంత సుమముల్ వర్షించి రాదిత్యులున్. 605

చ. నరవర ! ధూమ్రలోచనుఁ డనాథగతి న్నిజసైన్యదానవో
త్కరసహితమ్ముగాఁ బడె నఖండగతిం జెలరేఁగి మాంస మూ
దరమున నాహరింప నడిఁ దద్దయు మూఁగిన కాకగృధ్రజా
తిరవములున్ శివారవము దెప్పరమయ్యె రణాంగణమ్మునన్. 606

వ. తత్సైన్యమ్ము నందలి యశ్వమ్ములయు ఖరమ్ములయు వారణమ్ములయుఁ బలలంబు
మెక్కి క్రైపెక్కి భూతప్రేతంబులు నాట్యంబు లొనర్ప దొడంగె నంత నయ్యెడ
మునకు సైఁపక యంబిక దొదవ్వఁగాఁ జని. 607

ఉ. బిట్టుగఁ జిందముం దిశలు బీఁటలు వాఱఁగ నొత్త శుంభుఁ డ
బ్బిట్టిదమౌ రవమ్ము విని పేర్చినశంక గృహమ్మువీడి యే
మిట్టి విరుద్ధ మంచు నెద నెంచెడిలోనన యేగి సైన్యముల్
గిట్టినవార్త కొంతవడికిన్ హతశేషుఁ డొక్కఁ డెప్పినన్. 608

చ. తెగిన కరమ్ములన్ సగము ద్రెళ్ళిన మేనులు వింతలింతలై
పగిలిన మూర్ధముల్ వడిన పార్శ్వము లొల్కెడి నల్ల పట్టులై
మగఁటిమి కోహటించి తనమానము దూలఁగ నేడ్చు సేన నె
వ్వగఁగని శుంభుఁ డిట్టులను వక్త్రమునన్ వెనుఁబాటు దొట్రిలన్. 609

గీ. ధూమ్రలోచనుఁ డేమాయెఁ దోయజాక్షి, యేల రాదొక్కొ మన సైన్యమేడ కేగె
భగ్నులై మీర లీగతి బడల నేల, మందమతులార ! వివరించి మాకుఁ జెపుఁడ.

క. కడు బెట్టిదముగ గిరులును, బడమియు నాకసము సంభ్రమములు గ్రక్కదలన్
దొడరఁగ శంఖరవ మ్మొక, క్కఁడు వినఁబడు దాని కేమి కతము నుడువుఁడా !

వ. నావుడు రక్కసులు "చెప్పెడి దేమి ! యక్కాళిక ధూళిగా మన సైన్యమ్ముల త్రుళ్ళ
డంచి ధూమ్రలోచను గిట్టించె. 612

క. సురహర్షదాయకంబు న, సురశోకవిధాయి యగుచుఁ జొప్పడు నాభీ
కరశంఖరావ మెఱుఁగుము, పరదేవీరచిత మనుచు భవ్యవిచారా. 613

క. మనధూమ్రలోచనుఁడుఁ సై, న్యనికాయముతోడఁ ద్రెళ్ళ నమరులు మోద
మ్మునఁ బుష్పవృష్టి గురిసిరి, మనమున భయ మంది మేము మగిడితి మిటకున్.

క. ఏకాకినియై రూఢ. లోకమ్ముల నాల్గు దిక్కులున్ బిట్టుగ నా
లోకించుచు సింగముపై, నాకామిని వెలయుచున్న దాహవకాంక్షన్. 615

వ. ఇంక సంగరంబొండె సంధియొండెఁ గర్తవ్యంపు తెఱం గెఱింగి వర్తింపు మయ్యం
గనకుఁ దోడుగా నెవ్వరును లేకున్నను సురలు బార్ష్ణిగ్రాహులగుదురొకో ! యని
శంకింతు నయ్యాహవసమయమ్మున హరిహరులును, లోకపాలురును, దక్కిన
యమరులును, గంధర్వులును, దౌదవ్వుల నంబరంబునుండి సుమాళమ్ముగ నీక్షించు
చున్నవారని వెండియు. 616

గీ. అత్తలోదరిసాహసం బమ్మృగాక్షి, యుక్కు నగ్గజగమన మహోద్యమంబు
గనఁగ సురలను గిరలను గొనక తాన, మనలఁ బరిమార్చు నవి తోఁచె మాకు నధిప.

చ. మనమొకలెక్కయే ? విను మమానుషశక్తి నెసంగు నజ్జగ
జ్జనని చరాచరమ్ములు వెసం బొడి చేసి యొకింతలోన న
ల్పనయినఁ జాలు నీ కెటులు పొల్పడు నట్లొనరింపు మింత న
ట్టును విజ మింక నీమతిపటుత్వము, దైవము, మాయదృష్టముగా. 618

వ. నావుడు శుంభుఁడు నిశుంభుదిక్కు మొగంబై. 619

క. మనధూమ్రలోచనుని పై, న్యనికాయముతోడ యమపురాతిథిగాఁ బె
ల్పనఁ గాళి చేసె నాశం, జనినాదం బప్పరాంబ గావించెఁ జుమీ. 620

గీ. తృణము వజ్రమ్ము వజ్రమ్ము తృణము బలవి, హీనుఁడు బలాఢ్యుఁడిట్టిందునట్టిఁడగుట
కాలగతి కారణమ్ముగఁ గలుగు నకట !, జ్ఞానులకును దుర్జేయముల్ కాలగతులు.

గీ. ఎట్టులైనను నయ్యంబ నెనయుటొప్పొ ?
కాక యీనెప మూని రక్కసులఁ జక్కఁ
జేయవచ్చెనొ ? మన మేమి చేయఁదగునొ ?
యెల్లవిధముల యోజించి యెఱుఁగఁ జెపుమ. 622

క. కొండికవయ్యును మతి నా, ఖండలగురు నన్నిభుఁడవు కాల్కొలఁదిగ నీ
మండలము విడిచి పాఱుట, ఖండనమునకన్న లగ్గె పరికింపు తగన్. 623

వ. ఇట్టి యెడతెగని సంకటమ్ముల నీకు మిక్కిలి బుద్ధిమంతులు లేరు చక్కఁగ నొక
దిక్కు విచారించి గ్రక్కున నుడువు మనుడు నిశుంభుం డన్న కిట్లను. 624

క. మనకేటి పలాయన మేఁ, బనివినియెద నిపుడ దైత్యబలములతో న
వ్వనజాక్షి గెల్చితెచ్చెద, ననఘా ! దైవంబుకతన నట్టిదైనన్. 625

వ. మన్మరణమ్మునకు శోకింపక తగుగతి యోజించి యప్పుడు నీబుద్ధికొలఁది నొన
రింపు మనవుడు శుంభుం డియ్యకొనక పలాయనంబుకన్న ఖండనంబు పరం
బయ్యేనేని, 626

క. ఖండనకోవిదుల మహో, ద్దండులఁ బంపెదను జెక్కుదళముల వ్రేఁగై
గండు మిగిలి కొలువఁగ మన, చండుని ముండునిని నీవు చనఁబోకు మొగిన్.

గీ. చండముండులు మిగులఁ బ్రచండు లద్ద, వీడి నరిగి యత్తలోదరి నొడిచితెత్తు
రింత విక్రమ నీకుఁ బోనేల యుడుగు, మెవఁడు శశమునకై కరి విచ్చునయ్య!

వ. అని శుంభు నరికట్టి చండముండులం గాంచి, 629

ఆ.వె. సిగ్గు లేక యొక్క సింగపుఁగొదమపై, నెక్కి యుక్కు మిగిలి యెక్కటిగ ర
ణంబొనర్పు నన్న యంబికాసహచరిఁ, గాళిఁ ద్రుంపఁ జనుఁడు కడఁక మీరు.

వ. పింగళాక్షి యగు నవ్వెంగలి కాళి ముంగలయై బిభీషికల్ చూపినఁ దలరక చెల
రేఁగి తల దఱిగి పిదప నయ్యంబికం గొని వచ్చునది, యొడంబడక బెడిదమ్ము
లాడినఁ గడుకొని యుడిగించునది, యని యానతిచ్చినఁ జండముండులును, 631

క. బడబాగ్ని పిడికిలింతుమొ, పుడమియు నాకసము దెసలు భూభ్రమ్ములు న
జ్జడవిధు లొక్కుమ్మడి న, ట్టడవిం గల్పుదుమొ యనుచు నార్పులు పెలఁగన్.

వ. సైన్యసమేతమ్ముగాఁ గట్టాయితంబై యరిగి ముంగల దేవహితకారిణి యగు
నజ్జగదంబం గాంచి సామపూర్వకమ్ముగా నిట్లనిరి. 633

## చండముండాసురుల యుద్ధము.

చ. సురవిజయమ్మునం బొదలు శుంభనిశుంభుల బాహుగర్వదు
ర్భరత నెఱుంగవే యబల! పైకొన నెంచెద వేరికేనియున్
దరమె, దురమ్ములో నెదిరి దర్ప మొనర్పఁగ వెఱ్ఱివాకొ? యి
త్తరుణి సహాయఁగాఁగొని వృథాగతిఁ బోరికి మీఱఁబోలునే. 634

క. తగుఁ దగ దని మతి చెప్పఁగ, నగుపురుషుం డేని యొక్కయంగన యేనిన్
మగువరొ! లేరొకొ విను దే, వగణము పురికొల్పు, దైవవశ మట్లుండెన్. 635

మ. విను మష్టాదశబాహువుల్ గలవు న న్వేధింతురే యొద్దులం
చను మిత్తెక్కకు శుంభునే దెలుకు నీశుండో, సురేంద్రుండొ! నీ
ఘనగర్వమ్మును బాహుసంపదయు నీకాండమ్ములు న్నీహిత
మ్మునకు న్నొక్క వచించు నాపలుకు లంభోజాక్షి! పాటింపుమా. 636

ఉ. ఓ వనజాక్షి! శుంభుఁ డన నొక్కనిపాటియె యెవ్వఁడేని యై
రావణపుష్కరమ్మును దురమ్మునఁ ద్రుంచుట వింటివే! వృథా
కావలులై సురల్ తనకు గర్వనివర్తకుఁడైన శుంభుపై
నీ వెడఁగుందనంబు గని నిం బురికొల్పిరి యీసు పెంపునన్. 637

క. నీవేమియైనను న్భర, మేవారికి? స్వార్థపరుల కెందునుఁ బరకా
ర్యావేక్షణ ముండునె? యిక, నావాక్యము లిచ్చగించి నడువుము పురికిన్. 638

ఉ. సుందరులందు సుందరుఁడు శూరులయందును శూరుఁ డెంతకే
నిందగువాఁడు నేర్పరి మనీషి స్మరాగమవేది మావిభుం
డందఱవంటివాఁడె ? జగదాధ్యుఁడు నీకుఁ దదీయసంగమా
నందముకన్న వేఱొకటి నాకుఁ గనంబడ దెన్ని భంగులన్. 639

గీ. హిత మిచ్చగించి దుఃఖ, స్థితికిం జొరఁబడక నీ వశేషజగము లు
న్నతి నేలఁగ మా కుంభుని, బతిగాఁ గొను మింతకన్న భాగ్యము కలదే. 640

ఉ. గండున నిట్లు ప్రేలదు జగత్పరిమాత్రి యజాండమెల్లయు
న్నిండఁగ నార్చి యోరి యవినీత ! నయస్థితి దెల్పెదేమి ! యా
ఖండలమంత్రివేమొ ! కడికండలు చేసెదఁ జక్కఁనిల్వు నీ
చండత వాని ముండతయు సంగరరంగమునం గనంబడున్. 641

చ. హరుహరులం ద్యజించి దితిజాధము కుంభు వరింతునేమి ? నా
కొరుఁడు ధవుండె ? యీ జగము లొక్కట నేలదు నే ననాదినై
హరిహరులెంద, ఱెందఱు సురారులు, కుంభనికుంభు లెంద ఱే
గిరి మునుమున్న నాయెదురఁ, గేవలమూర్ఖత మీఁదెఱుంగునే. 642

క. ప్రతియుగమున నీగతిఁ బం, చత భూతమ్ములకుఁ దొడరు సంరక్షింపం
గతి గలదె మీ కిపుడు సం, హృతికాలము వచ్చె యత్నమే లొనరింపఁగా. 643

చ. మరణము నిక్క, మెట్లయిన మానము గీర్తియు రక్షణీయ తా
శరణము లంచు నమ్మిఁతక సంగరరంగమునం దెదుర్చుఁ డి
వ్వరుసున కుంభుఁడే కొలది ! భ్రాఁతియుఁగాఁదగు నే నికుంభుఁ ! డె
వ్వరితర ! మాజి నీలిగి దివమ్మున కేగుఁడు వీరపద్ధతిన్. 644

ఉ. వచ్చినవట్టు రక్కసు లవారణఁ బోరుఁడు నాక మేగుఁ డు
ద్యచ్చతురంగసైన్యములదండడి కుంభనికుంభు లంతతో
వచ్చియెదిర్చి చచ్చి సురవర్త్మమునన్ మిముఁ గూడికొందు రీ
మచ్చికమాటలేల శరమండలి నింపుఁడు ప్రొద్దు వోయెడిఁగా. 645

చ. తొలితొలి నిమ్న నీయనుజాతో మడియించి మురారిసంఘవి
స్తులులయి వచ్చినట్టి యలకుంభనికుంభుల రక్తబీజ ని
మ్ములఁ గడతేర్చి ప్రేల్మిడిన మూడుజగమ్ముల దైత్యులన్న పే
రొలయక యుండఁ జేయవలె నోపినవట్టునుఁ బోరుఁడే దైఱఁగా. 646

ఉ. ఉర్వియు నాకసంబు కదియొక్కటికై యిటు లెల్ల సైన్యముం
జర్వణ మాచరింపుడును జండుఁడు ముండుఁడు నీడఁ బోక దు
ర్గర్వమదాంధులై శరపరంపరలన్ బరఁగించి యెంతయుం
ధూర్వహులై యెదిర్చి రని "దుండగు లింతటివారు లే" రనన్. 655

మ. ఇటు లక్కాళిక నేసియేసి యొకఁ డం "దిద్దానఁ బో" మ్మంచు బల్
పటువౌ విష్ణునిచక్రముం గరమునం బాటించి బిట్టార్చి యే
యుటయున్ బాణమొకంటఁ దున్మి హతకాయుఁ జేసె నచ్చండు; నం
తట ముండుండు శిలాస్త్రముల్ గురిసెఁ దద్దం గాళిపైఁ గేళిమై. 656

వ. ఇట్లు మూర్ఛితుండగు నన్నపాటున కోర్వక ముండుండు దలకడచుటయు. 657

ఉ. చండిక ముండము క్తశరజాలము లోలిన త్రుంచివైచి బ్ర
హ్మాండము వ్రయ్యనార్చి యొకయర్ధశిలీముఖ మేసి వాని బల్
గండడఁగింప మూర్ఛపడి గ్రక్కున వ్రాలెఁ దదంతరమ్మునన్
జండుఁడు లేచి కాండములఁ జండికఁ జూపుట మాని యుద్ధతిన్. 658

మ. గద కేలం గొని యొంటిమై నదరి యక్కాళీభుజాగ్రంబు బి
ట్టదరం గొట్టిన బాణపాశమున నయ్యంబా మహాదేవి మం
త్రదశన్ వానిని బద్ధుఁజేసె, మరలం దా లేచి ముండుండు వా
ని దశన్ సైఁప కెదిర్చి శక్తిఁగొని, వానింబోలెఁ గట్టం బడెన్. 659

గీ. బద్ధులగు చండముండులఁ బట్టి బిట్టు, దిట్టయై యట్టహాసంబు దీటుకొనఁగ
నంబ కట్టెదుటకు వచ్చి 'యరయుమమ్మ, యాజి యజ్ఞపుఁ బశువుల నమరరిపుల.

వ. అనుచు నిట్లు వృకములం బోలె ననాయాసమ్ముగఁ గట్టి తెచ్చిన సంతసించి
పరాంబ యిట్లను, 661

క. ఇంపలరు నీదు శక్తిని, లింపారులఁ దెచ్చి తింక లీలగా జంపీ
చంపక వేతొక భంగి ని, లింపులకున్ మెచ్చొనర్ప లేవె చతురవై. 662

వ. నావుడుఁ గాళిక యిట్లను, నీ దానవపశుద్వితయంబును బ్రసిద్ధంబగు యుద్ధయజ్ఞ
మ్మున ఖడ్గయూపమ్మునం గట్టి యాలంభించినచో నయ్యది హింసయయ్యు
నహింసాప్రాయంబగు నని పల్కుచు, 663

క. కరమునఁ గరవాలముఁ గొని, యిరువురి శిరములను నఱకి యాశ్వరి మోదో
ద్ధురత రుధిరమును ద్రావి య, మరవరులన్ మోదవార్ధిమగ్నులఁ జేసెన్. 664

వ. ఇంక వృథాలాపమ్ములాడ వలవదని పురికొల్పి ప్రేరేపిన నా చండముండు లఖండ
చండిములై. 647

శా. జ్యాటంకారము దిగ్గజశ్రుతిభిదాసంపాదకంబై విరా
ఘాటాటోపము మిన్నుముట్ట నెదురై కాలూఁద నయ్యంబ స్వ
ర్వాటీవాసులు మెచ్చ నొత్తె దరమప్పాటఁగా రిపుల్ గుండియల్
బీఁటల్వాఱ బడల్పడఁగా హరియు నాభీలధ్వనిఁగా గర్జిలెన్. 648

ఉ. కాతరభీతిదంబును నకాతరభూతరసోత్తరంగసం
పాతము గాఁగ సంగరమభంగురమై తగెఁ జండచండికా
శాతమహాస్త్రపాతముల సంకులమయ్యె నభోంతరంబు నీ
రీతిగ బీఱుపోక యెదిరించిరి రక్కసు లొక్క పెట్టునఁగా. 649

శా. అన్యోన్యప్రవిముక్తశస్త్రతతు లన్యోన్యమ్ము ఖండించుచుఁగా
మన్యుప్రేరితులై పెనంగునెడ సామర్షుండు ముండుం డసా
మాన్యుండై తనయన్న వెన్నడి పరాంబం దొప్పదోఁగించె "వీ
రన్యాయంబు బలే" యటంచు సమరారంభాతిసంరంభయై. 650

మ. కదళీపుష్పవిడంబినేత్రరుచి వక్త్రం బెఱ్ఱఁగాఁజేయ పై
రిదవాగ్నాకృతియై లలాటమును విర్భేదించి యావిర్భవిం
చె దయాదూరయు వ్యాఘ్రచర్మధర దుస్తేజస్క నాగాజినా
వృదయై కాళిక ముండమాల్యధరయై పాశాదికోపేతయై. 651

వ. ఇట్లు ఖట్వాంగధారిణియు నతిభీషణయు శుష్కవాపీసమోదరయు భ్రుకుటీకుటిలేక్ష
ణయు విస్తారజఘనయు విస్తీర్ణవక్త్రయు ఖడ్గాది సంశోభినియునై కాళరాత్ర్యపరావ
తారమ్మనం బోవి ఘోరరూపమ్మున నావిర్భవించి జిహ్వాచాలనమ్మునం బెచ్చు
పెరిఁగి, 652

ఉ. ఓహరిసాహరిం బెనఁగుచున్న సురారులఁ బట్టి బిట్టు పూ
ర్ణాహుతిఁజేసి వక్త్రమను నగ్నిముఖమ్మున, నంతఁ గొందఱన్
బాహులఁ బిప్పిజేసి యిటుపల్వర భక్షణఁ జేసి కాళి య
య్యాహవరంగ మొక్కమొగి నాహృతిఁజేసి పరాక్రమించుచున్. 653

గీ. అట్టహాసంబొనర్చి ఘంటాన్వితముల, గజఘటలఁ గేలఁ గొని వక్త్రగహ్వరమునఁ
బెట్టికొని పిండిపిండిగా బిట్టునమలు, మస్త తురగాదులకు గతి యొండు గలదె. 654

వ. ఇట్లతిఘోరంబుగఁ జండముండుల వధియించినకతమున నాయంబికకుఁ జాముండ యను బిరుదనామంబు పరాంబవలనఁ గలిగెనవి చెప్పి వ్యాసుండు మరల నిట్లనియె.

ఉ. పిమ్మట భిన్నకాయములఁ బెల్లుదొరంగెడి రక్తమై గుబుల్
గ్రమ్మి రణావనిన్ విడిచి కాల్కొలఁదిం జని శుంభుఁగాంచి 'మా
యమ్మలికంబు దీర్పుము మహోదయ! పెందయ' నంచుగాళికా
ప్రమ్ములు చండముండులకుఁ జావుఘటించుట విస్తరించుచున్. 666

వ. హతశేషు లిట్లనిరి, రాజేంద్రా! యాహవరంగమ్మున నకాళి విక్రమించిన తెఱంగు దలంచుటకును భీతి యేతెంచెడి. రౌద్రాకారమ్మున నడరి కొందఱ భక్షించియుఁ గొందఱఁ బిడికిలించియు గొందఱఁ గాలఁ జమరియు నిట్లు సైన్యంబుల రూపుమాపినఁ దద్రంగస్థలంబు నెత్తురువఱ్ఱుగా మాంసంబు కర్దమంబుగాఁ గేశమ్ములు నాఁచుగా భగ్నరథచక్రమ్ములు చక్రమ్ములుగాఁ ద్రెళ్లిన బాహువులు మత్స్యమ్ములుగా శీర్షంబులు తుంబీఫలమ్ములుగా నొక మహానదిచందమ్మునం బొల్చె. 667

ఉ. కాళిక చంపఁగా మిగులఁగాగల రక్కసులం గడంగి యా
భీలరవమ్మొనర్చి యొకపెట్టున సింగము మ్రింగుచున్న దీ
యాలము మాను మయ్యతివ యల్ప యటంచు దలంతువక్కటా,
కాలము చేరువయ్యె నొకొ! కావలమున్ విడజాల వెమ్మెయిన్. 668

క. ఏ లలనఁగోరి నీ విపు, డాలమ్మునఁ గులవినాశ మందించెద వా
లోలాక్షి కాలరూపిణి, గా లోనఁదలంపు మెఱుకగలఁదగు మధిపా. 669

గీ. జయపరాజయములు దైవసంగతములు, గాన నల్పార్థమునకు విస్ఫారణముగ
నెల్లబంధుల నమయింపఁ జెల్లునయ్య, వెనుక ముందును దెలియుట చనదె యింక.

వ. రక్కసులకెల్ల నొక్కకాంతచే మృతిగలుగుటకన్నఁ జిత్రం బొండెద్ది! లోకపాలుర జయించిన నీబోఁటి నాబోటి యాహవమ్మునకుఁ నిలుచుట కెంతకేనియుం జాలక తూలిపోయెడిదే! యదియునుంగాక మున్ను పుష్కరమ్మున నీవు తపం బొనరించి యమరత్వంబు ప్రార్థించిన విధాత యీ నోడుటయు నీవు క్రమ్మఱదేవమనుష్యసర్ప కిన్నరయక్షప్రముఖులగు పురుషులచే మృతి గలుగకుండ ననుగ్రహింపు మన నన్ను లువ యట్లొసంగె నది కారణంబుగ దేవప్రేరితయై, 671

క. జననావన మరణమ్ముల, నొనరించెడి మాయ సంగరోల్లాసినియై
దనుజులతో నినుఁ బోరిగొనఁ, గ నేగుదెంచుట నిజమ్ముగావలె నధిపా. 672

వ. మఱియుఁ ద్రిగుణయుఁ దామసయు సర్వశక్తిసమన్వితయు నక్షయయు సర్వజ్ఞయు సదోదితయు వేదమాతయు గాయత్రియు సంధ్యయు సర్వసురాలయయు సగుణయు నిర్గుణయు సిద్ధయు సర్వసిద్ధియు ప్రదయు నవ్యయయు నానందప్రదాయినియు నగు పార్వతి దేవహితార్థినియై నిన్ను నిక్కువం బడఁపగ నేతెంచినదని యెఱింగి జీవింపవలతేని వైరంబుడిగి పొలివోక శరణంబు గొనుమయ్యంబిక కరుణార్ద్రయై హతశేషులగు రక్కసులతో నిన్నుఁ జిరాయుష్మంతుఁగా ననుగ్రహింపఁ గలయది నావుడు శుంభుండు క్రోధాకులుండై వీరోచితంబగుగతి ననుకరించి, 673

ఉ. మౌనము మాని ప్రేలకుఁడు మందులరై యని కోపటించి నా
పై నెనరున్నఁ బంగి నిటు, ప్రాణము తీపగునేని వేగ మీ
మీ నెఱిచుట్టలన్ సుతుల మిత్రులఁ గూడి రసాతలంబుఁ బో
నానతి యిచ్చెదన్ వెడలుఁ డాహవభీతులతోడ నేమగుణా. 674

చ. జయముఁ బరాజయమ్ము మనశక్యమె దైవము కర్తగాక వి
శ్వయముగ బ్రహ్మవిష్ణుగిరిశప్రముఖుల్ తదధీను లన్నచో
బయిఁ బడు మంచిపెద్దలకుఁ బొల్పడ కొడ్ల వశంబె దీనికిం
త యఱుక సన్నుబోఁటి కొకదర్పమె, యెట్లగు నట్ల యయ్యెడిన్. 675

క. భవితవ్యానుగుణం బగు, వ్యవసాయ మొనర్చు జ్ఞానవంతులు తెల్విం
దవిలి ధృఢకప్పుడుఁ జింతా, విపశులుగాకుండు రేను వెఱతునె మృతికిఁజా. 676

వ. మానవంతు లగువారలు మరణభయమ్మువలని యాత్మధర్మపరిత్యాగమ్మున కోపటింతురు. సుఖదుఃఖాయుర్జీవితమరణాదికమ్ము లెల్లరకునుఁ గాలచోదితమ్ములయి యనివార్యమ్ములై పైకొనుచుండు. హరిహరవిరించులును దక్కటివేల్పులును దమతమ యాయురవసానమ్మునం గిట్టువార కాని యుట్టిగట్టికొని యుండఁగువారుకారు. 677

శా. దైవాధీనతఁ జేసి యేను జయమో దైన్యంబో వేఱొండో నేఁ
డీ వాఖ్యాతికతమ్మునం గొనుదుఁగా కేలింత చింతింప, ని
స్పృః వీరుల్ గడునవ్వఁ బాఱి యెటులే జీవింతునే? యింతకుం
జావే యెక్కుడు, వీరధర్మ మగునే సంగ్రామభీరుత్వముల్. 678

వ. అది యట్లుండె విద్వాంసులు దైవంబు మిథ్యయనియు సద్యమంబు కర్తవ్యంబనియు దానఁ గార్యసిద్ధి యవశ్యంబగు ననియుం జెప్పుదురు. యుక్తియుక్తంబగుకతన నిత్తెఱంగు బుద్ధిమంతులకు గ్రాహ్యం. బదృష్టంబ బలవంతంబను కాత

రులవచనమ్ములు గ్రాహ్యమ్ము లయ్యేనేవి యదృష్టసత్త్వమ్మునకుఁ బ్రమాణంబేమి?
యదృశ్యంబెన్నఁ దేని దృశ్యం బగునే యని పెండియు, 679

గీ. లే దదృష్టపదార్థంబు లేశమేని, బుద్ధిమంతులు దుఃఖసముద్రమగ్ను
లైనవారల నూరార్ప దీవిఁ గల్పి, తంబుగాఁ జేసి రిది సిద్ధిదంబుగాదు. 680

వ. ఇష్టకారిణియగు *చక్రిసమీపమునసున్నను నుద్యమంబు లేకున్న నిష్టసిద్ధి గాని
తెఱంగున నుద్యమశూన్యులు సిద్ధిమంతులు గాకుంట ప్రత్యక్షంబ యని మఱియును,

క. తనబలము నెదిరిబలమును, గని కాలాదిక మెఱింగి కార్య మొనర్పన్
మునుకొను సిద్ధియనుచుఁ దా, ననఁడె బృహస్పతి ప్రయత్న మన్నిట ఘనమౌ.

వ. ప్రయత్నం బొనర్చినను గార్యసిద్ధిగాకుండినచోఁ దన్న్యూనత యుద్యమంబున
విడుట యుక్తి యుక్తంబై యుండునని కృతనిశ్చయుండై రక్తబీజుం గని నీబల
మ్ములతోఁ గట్టాయితంబై సంగరమ్మునకు వెడలు మనుడుఁ వాఁడిట్లను, 683

ఉ. ఏఁ గలుగంగఁ జింత మది నించుకయున్ వల దిప్డ యేగి నీ
రాగము చెప్పి యుత్తరుణి రా గమకించెదఁ దక్కనేని బెఁ
ద్రేఁ గగు నాజిలోనఁ దలరించి జయించి వశన్ బొనర్చి దా
నీగతి నీకు నెల్లపుడు సేవ యొనర్పఁగఁ జేయ నేర్చెదన్. 684

వ. అని కృతనమస్కారుండై యాజ్ఞఁగొని హస్త్యశ్వరథసంకులంబగు బలంబు పరి
వేష్టింప రథారూఢుండై సంగరమ్మునకు వెడలుటయు, 685

క. దొదొదవ్వుల వంబిక, యాదానవుఁ గాంచి శంఖ మతిభీషణరా
వోదారమ్ముగ నొత్తిన, భేదిల్లిరి రిపులు మది దివిజు లలరంగన్. 686

## రక్తబీజయుద్ధము.

వ. అంత నద్దరరవంబునకుఁ దలరక రక్తబీజుండు సమీపమ్మున కరిగి మృదుభాషణ
మ్ముల నిట్లను, 687

గీ. శంఖనాదమ్ములకు నేను జంక ధూమ్ర, లోచనుఁడఁ గాను వినుము నీపేఁచ మడఁతు
నరయవాకొ నన్ను రక్తబీజాభిధానుఁ, బఱచు వారల పంక్తినేఁ బడితినొక్కొ?

వ. మున్ను నీబిభీషికలకు దొంకి కాందిశీకులగు రక్కసులలో నొక్కఁడఁగా నన్ను
విచారింపక సుస్థిరత్వమ్మున రణస్థలమ్మున నిలువుమని వెండియు, 689

---

చక్రియన పిండినూఱికొను సాధనము.

గీ. వృద్ధసేవ యొనర్చితి విద్యలెల్ల, నేర్చితి వటంచు వింటి నీనేర్పు చూత
మొక్కమాట వచించెద నువిద! దాని, తెఱఁ గెఱుంగుమ యదికదా తెలివికలిమి.

క. ఋతమై పథ్యంబై సా, హితిగల మావినుల కెల్ల హితమగు ననినేఁ
బ్రతినం జేసి వచించెద, మతి గలవేని విను మిన్నిమాటలు కలవే. 691

గీ. నవరసమ్ముల విద్వజ్జనముల మెచ్చు, గనురసమ్ముల వినుము శృంగారశాంత
రసము; లందును శృంగార మనమ మగుట, రసములకు నెల్ల నయ్యది రాజుసుమ్ము.

మ. సిరితో విష్ణువు గౌరితో శివుఁడు జేజేపెద్ద యవ్వాణితో
సురనాథుండు పులోమజాతరుణితో సూనాంకు సేవింత్రు సుం
దరి! వృక్షంబు లతన్ గపోతిని గపోతంబుగా మృగం బమ్మృగీ
గర మాసించుఁ జరాచరమ్ములకు శృంగారాప్తి నేఁడబ్బెనే. 693

గీ. ఎవ రసంప్రాప్త భోగులై దివుల దవులు, వారలో వారలే దైవవంచితులు య
తీశ్వరులు; సంసరణసుఖ మెఱుఁగ లేక, వంచకుల వంచనలకు లోఁబడిన నరులు.

క. మనమునఁ గామక్రోధము, లనయము గిటికొనుచునుండ నంగజుఁడును లోఁ
గొని యేచుచుండ శాంతం, బును వైరాగ్యమును జ్ఞానమును గలుగునొకో. 695

వ. కావున నీయౌవనసంభావనకై శుంభునొండె నిశుంభునొండెఁ బతిగా వరించి సమస్త సుఖమ్ము లనుభవింపు మని బోధించు రక్తబీజప్రలాపమ్ములకు నంబికయుఁ గాళికయు నగిరి. పదంపడి దేవి హాసం బొనరించి మేఘగంభీర భాషణంబుల నిట్లను. 696

క. మును చెప్పితి రూపాదిక, మున నాకుం దుల్యుఁ డేని మోహించెద నం
చును మాటిమాటి కీగతిఁ, జనునే వెడమాటలాడఁ జతురునివగిదిగా. 697

వ. నాప్రతిజ్ఞ యిట్టిది యని శుంభనిశుంభులకడ కేగి చెప్పుమొండె నొండె సంగరం బొనరించి నన్నుం జయించి విధిచోదితంబుగ వివాహం బొనరింపుము. 698

క. భయ మొదవె నేని నిప్పుడ, రయముగఁ జని పతికిఁ జెప్పి రక్కసులెల్లఁగా
బయలు వెడలి వెంబడి రాఁ, బయనం బొనరించు బొప్పఁ బాతాళమ్మున్. 699

వ. అనవుడు రక్తబీజుండు క్రోధతామ్రాక్షుండై. 700

శా. ఎట్టెట్టా! యని యార్చి యంపగము లెన్నేనిం బ్రయోగించి బల్
ధట్టుండై మృగరాజు నొంచినఁ గనత్తామ్రాక్షియై దేవి పె

స్గుట్టంబోని తదస్త్ర శస్త్రచయముం గూల్చెఁగా శితాస్త్రమ్ములన్
రెట్టింపం దగునట్లు రక్కసుని మర్దించెఁగా వెసఁగా మూర్ఛిలన్. 701

వ. ఇట్లు రక్తబీజుండు రథమ్మువయిం బడిన దైత్యసైన్యమ్ముల హాహాకారంబు విస్తరించె. 702

క. బుంభారవమున సేన ల, హంభావం బుడుగుపెటిఁగి యసురులఁ గవి యా
శుంభుండు దైత్యులను సం, రంభమ్మునఁ బనిచెఁ బొండు రణమున కనుచుఁగా.

వ. ఇట్లు కాంభోజకాలకేయాదిదానవప్రపంచమ్ము నొక్కటనెనకొల్పిన భీషణాకారభాషణాడంబరమ్ముల నద్దవిడి నద్దనుజులు రణాభిముఖులగుటయు నంతంత నేతెంచు వారలం గవి కాళి ఘంటానాదంబొనరించెఁ బరాంబికయు శంఖంబు పూరించి జ్యాటంకారం బొనరించి యక్కాళి కుక్కెక్కింప మింటికి మంటికిఁ దాసయై యాపె ప్రబలి సింహారావం బొనర్చిన నంత సింగంబును గర్జిల్లె. 704

ఉ. అవినదమ్ములన్ విని మహావినదమ్ములు నింగిముట్ట న
ద్దానవులెల్ల శస్త్రములతండములం బరఁగించి ముంపఁ బో
రీవియతిం దనర్చెనవి యెన్న నపర్వముగా విలింపు లం
బానుచరత్వ మందఁ దమయందలి శక్తుల నంపి రంపినన్. 705

గీ. బ్రహ్మ మొదలుగలట్టి దేవతలశక్తు, లాత్మ దేవోచితమ్ముగ నస్త్రశస్త్ర
భూషణంబులు ధరియించి పోరొనర్ప, నరుగుదెంచిరి జగదంబ ననుసరించి. 706

వ. అట్టియెడ వరటారూఢయు శంఖచక్రగదాధరయుఁ బీతాంబరభూషితయు బద్మహస్తయునై వైష్ణవియు నర్ధచంద్రధరయు నహివలయయు శక్తిహస్తయు శిఖివాహనయునై కౌమారియు, శ్వేతగజవాహనయు వజ్రహస్తయునై యింద్రాణియుఁ, బ్రౌఢప్రేతాసనయు సూకరాకారయునై వారాహియు, నృసింహసదృశాకారిణియై నారసింహియు, దండహస్తయు భయప్రదయు మహిషారూఢయునై యామ్యయు, వారుణియుఁ గౌబేరియు లోనుగాఁ గలయనేకశక్తులు స్వస్వబలసహితమ్ముగ నరుదెంచిన దేవి యత్యానందభరిత యయ్యె. 707

శా. తత్తచ్ఛక్తిపరీతుఁడై హరుఁడు తత్సంగ్రామరంగమ్ము ద
క్కొత్త న్నిల్చి పరాంబఁ గాంచి యను "లోకోద్రేకసంపాదనా
యత్తుల్ శుంభనిశుంభు లాదిగల దైత్యానీకముం ద్రుంపు మీ
సత్తుల్ తోడుగ నెల్లలోకములకున్ సంతోష మెంతేఁదగఁగా. 708

సీ. యజ్ఞ భాగమ్ముల నమరులు మునువోలె • గతభీతులై పొందఁగాంత్రుగాక
స్థావరమ్ములకును జంగమమ్ములకును • సంతోషమెంతే నెసంగుఁగాక
ఉడుగక వెడలెడి యుత్పాతములు నీతి • బాధలు నేటితోఁ బాయుఁగాక
యియ్యయికాలమ్ములం దనుగుణముగ • మంచి మేఘములు వర్షించుఁగాక
గీ. కృషి బహుఫలప్రదంబయి కెంలుఁగాక • గోద్విజాంగన లభయమ్ము గొంద్రుఁగాక
పిదప శత్రులు తమతమ వెడలుచోట్ల • కేగ జగదంబ నీ యాజ్ఞ యొసఁగుఁగాక."

వ. అని శంకరుండు పచియించునాలోనన చండికాశరీరమ్ము నుండి ప్రచండయు నద్భుత శక్తియు శివాశతనినాదినియు భీషణయు ఘోరరూపయు నగు నొకశక్తి యుద్భవించి సస్మితాననయై శంకరుంగాంచి యిట్లనియె. 710

ఆ.వె. దేవదేవ! యీవు దితిజులకడ కేగి, దూతవై వచింపు తొలఁగి యమర
పదము వీడి యిపుడు పాతాళమున కరు, గుండు బ్రదుకుదెలవు గోర్కెయేని. 711

వ. పిదప సురేంద్రుండు తనపదమ్ము నందికొని సుఖంబుండ నమరులెల్ల యజ్ఞభాగమ్ము లనుభవించువారు. 712

క. మరణంబు గోర్కెయేని బ, వరమునకుం బలము గొలువవచ్చునది పరం
పరలై మానక్కలు పిశ, తరసాస్వాదనముచేసి తనియనొనర్తుణ్. 713

వ. ఇట్లు మద్వచనమ్ములుగా నుడువు మనుడు హరుఁడును శూలపాణి యగుచు శుంభ నిశుంభులకడ కరిగి యిట్లనియె. 714

ఉ. ఏను బురాంతకుండ జగదీశ్వరి మీకడ కంపె నాపె మీ
దానవులం దనుగ్రహముదాల్చి వచించినచొప్పు చెప్పెదన్
మానము ప్రాణము న్నిలుప మానసమేని దివంబు వీడి మీ
మీనెఱిచుట్టలం గలిసి మేకొనుఁడేగి రసాతలమ్మునన్. 715

క. కాదేనిఁ బోరితమునకు, రాఁదగునని చెప్పెనమడు రక్కసులు మహో
న్మాదులు మీఁదు నెఱుంగక, యాదేవి నెదుర్చ వచ్చి రవిమొనకు వడిన్. 716

వ. రక్కసులకడకు శివు నంపినకతన నయ్యంబ శివదూతినాఁబరఁగె నిట్లుక్క మిగిలి రక్కసు లొక్కుమ్మడి సంగ్రామరంగమ్మునకుఁ దెగి విశితమ్ములగు శరశతమ్ములు వఱపిన నక్కాళిక శూలపాతమ్ముల నేలం గలిపియు, బ్రహ్మాణి కమండలుజల పేకమ్మున రూపు మాపియు, వైష్ణవి చక్రగదాపాతమ్ముల నుగ్గుచేసియు, మాహేశ్వరి శూలమ్మునఁ దూలించియు, నైంద్రి వజ్రప్రహారమ్మునఁ గసిమసంగియు,

వారాహి తుండఘాతమ్ములం జెందియు, నారసింహి నఖ వికరమ్ముల వ్రచ్చియుం బరాక్రమించునెడ నాశివదూతి బవరమ్మునకుం దవిలి యట్టహాసం బొనరించి ఖండించు దానవులంబట్టి కాళికయుం జాముండయు భక్షించుచుండ దద్బలార్ణవమ్మున నతిఘోరంబగు బంభారవమ్ము సంభూతంబయ్యెం; దదారవంబు విని రక్తబీజుండు తక్కటి దానవులం గలసి సంగరమ్మున కభిముఖుండై, జ్యాటంకారం బొనర్చెనవి వెండియు. 717

గీ. రక్తబిందువు లెన్ని యా రక్కసుని శ, రీరముననుండి వెడలు నారీతి నంద ఱుద్భవింతురు రక్కసు లొక్కమొగి న, టంచు వరమిచ్చె వానికి నభవుం డధిప.

క. తాదృశవరదానాయా, తోదారబలంబు కలిమి నుక్కుమిగిలి మాం సాదనుఁడు వేగమునం గా, శీ దేవులం గవిసె వీర్యలీల చెలంగన్. 719

మ. గెరటాసంతునిపై జగద్విలయభంగిన్ జేస్సు నవ్వైష్ణవిం బరశక్తిం గని దైత్యుఁడల్కమెయిం దాప్రంబైన నేత్రద్వయిన్ బొరిం జూపట్టు కృశానుకీలలు జగమ్మున్ మండఁగాఁ జేయు రీ తి రవుల్పం బొలుపారు నొక్క పటుశక్తిం బైఁ బ్రయోగించినఁ. 720

క. శక్తియు నొకగత గొవి యా, శక్తిం దునుమాడి మఱియుం జక్రము గొవి యా నక్తంచరుపై విసరిన, రక్తమయశరీరుఁ జేసె రక్కసు నదియున్. 721

వ. ఇట్లు చక్రాభిహతంబగు తదీయశరీరమ్మునుండి గిరిశిఖరమ్మునుండి సెలయేఱుల వడువున నల్లకాలువలు తండోపతండమ్ములై వెడలినకతమున ననేకరక్తబీజు లుద్భవించి యొక్కపెట్ట దేవిం బొదువుడు నైంద్రి వజ్రప్రయోగమ్మునను బ్రహ్మాణి బ్రహ్మదండంబునను మాహేశ్వరి త్రిశూలంబునను నారసింహి నఖాఘాతమ్ములను వారాహి తుండఘాతమ్మునను గౌమారి శక్తిప్రయోగమ్మునను నద్దానవులం దఱి మినం దదాయుధాపాతజనితరక్త బిందుపాతమ్మునంజేసి రక్కసులు వేనవేలావిర్భ వించి పిఱువనక పోరిన నవ్వోరు ఘోరంబై దివి వైమానికులగు సురలకు ఖేదంబు నొనగూర్ప వార లిట్లు వితర్కించిరి. 722

క. ఇది యేమి వింత! మాల్లికొ, లఁది దైత్యులు వొడమి రకట! లావున వీరిం బొదువుట కష్టం బేవెఱ, వు దలంచునొ దేవి, యేమి పోఁలనొ చేయఁ? 723

క. అని కిది నమయం బవి శుం, భనిశుంభులు గూడ వచ్చి మార్కొందురు వా రున బలియు రనుచుఁ జింతా, మనస్కులయి భీతి వడి రమర్త్యులు పెలుచఁ.

వ. దేవియు సంగరరంగం బంతయు రక్తబీజమయం బగుట యెఱింగి కాళికం బిలిచి యిట్లనియె. 725

ఉ. మార్తుర నెల్లరం బిలుకుమార్చు నుపాయము చూడు మిట్టు లీ
ధూర్తులు నెత్తు రుర్విఁ బడఁ దోరముగా జనియించుచుండ్రు నీ
నోర్తగ విచ్చి రక్తమదనుం గని ద్రేల్మిడిఁ ద్రావు మేము వి
మ్మార్తుర నింతలోనఁ బరిమార్చెద ముగ్రరణాంతరమ్మునన్. 726

క. ఇదియ యుపాయం బీరీ, తి దనుజులన్ గసిమసంగి దేవేంద్రుని వ
య్యదితిజులం బ్రోచి మదిం, బదిలముగాఁజేసి సుఖముఁ బడయుట తగదే. 727

వ. అని యానతిచ్చిన వకాళికయు నట్ల వదనంబు తెఱచి రుధిర మొక్క చుక్కైన నేలంబడనీక త్రావుచున్నంత నంబికయుఁ దదాపాతజాతులగు కృత్రిమ రక్తబీజుల నందఱ నొక్క నిముసమ్మునఁ జక్కడంచి, 728

మ. అసిచేతంగొని "రక్తబీజ ! నిలురా" యంచుణా బలప్రాభవం
బు సురల్ సన్నుతిచేయుచుండ రుధిరంపు బిందు వొండైనఁద
ద్రసపైనిన్ బడకుండఁ గాళికయుఁ దత్పార్శ్వమ్మునందుండి త్రా
వ సురారీశ్వరు కంఠముం దునిమె రంభాస్తంభ మట్టుల్ పడిన్. 729

వ. హతశేషులగు రక్కసు లొక్కమొగి రణాంగనంబు విడిచి కుంభపాలికింజని, దేవా ! రక్తబీజుం డక్కాంతచే నిహతుండయ్యె. తదీయుంబగు శోణితంబెల్లఁ దత్సహచారిణి చాముండ యనునది త్రావె నింత యక్కజంపుఁ బరాక్రమంబుగల కామిని నెయ్యెడం గాన మింతయేల తదీయ వాహనంబగు సింగంబును ననేకుల రక్కసుల నుక్కడంచె నింక దేవర ప్రమాణంబని చెప్పి మఱియు నిట్లనిరి. 730

ఉ. కొందఱు కాంతలామెకు సఖుల్ రణసీమ సహాయలైరి వా
రందఱు లావుఁ జేవ గలయట్టిరు చక్కనివారు వారి గె
ల్వందర మౌనె ! యోదనుజవల్లభ ! యంతటి రక్తబీజు చా
వుందలపోయఁ గొందలము వొందదె నెమ్మది నేరికేనియున్. 731

ఉ. అలము మాని పౌరుషము లాయమ కప్పనఁజేసి మీఁదఁ బా
తాళమువంకఁ బోవు టుచితం బని తోఁచెడి మాకుఁ జూడ స
త్పాలికరూపుఁ గన్గొనఁగఁ బ్రాకృతమాత్రముగామి దోఁచు, దే
వాళిపిఁ బ్రోవ మాయ యిటు లాకృతి దాలిచె రాక్షసాధిపా. 732

చ. అను మొనవారిపల్కులు సురారికులేశ్వరుఁ డాలకించి చ
య్యనఁ గనుదోయికెంపు జిగి యానన మంతయుఁ బర్వఁ జేసి వె
చ్చ విగుడఁ బల్కు "క్షితిలి రసాతల మేగిన నేగుఁ డీరు కా
మినికిఁ దలంకి యేఁ జనిన మీఁద యశంబు నశింపకుండునే। 733

గీ. దేవనాయకు నోడించి దేవలోక, మేన పాలించినాఁడ నీ మేనితోడ
నొక్క కాంతకు రణమున నోహటించి, పాఱిపోదునె యింతటి బ్రతుకు బ్రతికి।

ఉ. నాదు బహిర్గతాసువులు నాయెడ భక్తి గలారు రక్త బీ
జాదులు నానిమిత్త మొక యంగనచేత రణావనిన్ బలం
బేది గతాసులైన నది యెంచక యయ్యబలన్ జయింపఁగా
రా దని భీతిమైఁ జెనఁటిప్రాణము డాఁచిన నుర్వి మెచ్చునే. 735

మ. జననం బందినవారి కేరికయినం జా వున్న, దెప్పాటఁ బో
యిన రా నున్నది రాక తీఱదు, భయం బేలా వివేకంబు క
ల్గిన వానిం బెగడొందఁ జేయుఁ? దగు భంగిన్ దెచ్చుకొన్నట్టి కీ
ర్తివిఁ బ్రాణాశకు జంకి వ్యర్థముగ వార్ధిం గల్పఁగా వచ్చునే. 736

చ. బవరమునన్ జయమ్ము లిరువాఁగునకుం గలుగంగఁ బోవు నే
దివి భువియున్ బలమ్మున నెదిర్చి జయమ్మను గొన్ననాఁడు రెం
డవయెడవారునుం జయము నందిరె। కాన మనుష్యయత్నసా
ధ్యవిధి యొనర్పఁగావలయు నావల దైవము చేయుచేఁతకున్." 737

గీ. అని నిశుంభునివంకఁ గన్గొనుచుఁ బలికె, నీవు సేనానివై వెంట నేగుదెమ్ము
సురనికాయము మనముల క్షోభమంద, నిపుడ యానాతిమిన్న జయించి తెత్తు. 738

వ. అని విక్రమించుచున్న యన్నం గని యనుజుం డిం తేల, గదెలో నే నా వనితన్
జయించి తెచ్చెద ననుమానమ్ము విడిచి సుఖమ్ము లందు మని వెండియు, 739

గీ. సకలజగముల నొకసారి జయముగొన్న, మద్భుజాదండబల మేది మార్దవంపు
ముద్దయగు ముద్దరాలితో మొనసి పోరు, చేయుటేడఁ గటా! యెంత చేసెనజుఁడు.

ఆ. వె. ఇట్టినీచకృతికి నేమండ దేవర, గమన మనుచితంబు గడియలోన
మానినిని జయించి మగిడివచ్చెద నమ్ముఁ, బనుపు మయ్య పెక్కుభాషలేల.

క. అనుచుఁ గృతనిశ్చయుండై, యనికిం గాల్ ద్రవ్వుచున్న యనుజునిఁ గని నె
మ్మనమున ననుమానించుచుఁ, జను మని పెలవిచ్చె దనుజచంద్రుఁడు పేర్మిన్. 742

## నిశుంభయుద్ధము.

వ. నిశుంభుండు జయం బొండె మరణం బొండెఁ గానిమ్మని సేనాసమేతమ్ముగా సమ్మం
బికం జుట్టుముట్టుడు శుంభుండు సహోదరసంగరసమాలోకనకుతూహలమ్మునఁ
దన బలమ్ములతోడ వెనువెంటం జని యంతంతఁ జూచుచుండె నట్లు నిశుంభుం
డయ్యంబికం గదిసి శార్ఙ్గమ్మగు చాపమ్మున నారిం బూరించి ప్రళయకాలకాలాంబు
దమ్మవడువున శరాసారమ్ములు గురిసె నంత. 743

క. దేవియుఁ గాళినిఁ గని యీ, దేవారులమౌర్ఖ్య మింతదెప్పర మగునే
చావునకుఁ దలఁకరు జయా, శావలమానాంతరంగసంభ్రమ లగుచున్. 744

క. ఆశాపాశముకన్నను, బాశంబు జగానఁ గలదె! బలియురు తనవా
రాశమనపురికిఁ జనిన జ, యాశాఘాతంబు వదల దౌరా! వీరిన్. 745

వ. అని ప్రశంసించుచుఁ గాలమ్ము సమీపించినవారు యుక్తాయుక్తమ్ము లెఱుంగుదురే
యని శరాసనంబు సారించి నిశితంబులగు శరమ్ములు దొడిగి యన్నిశుంభు
మేనెల్లం గప్పిన నప్పిశితాశనుండును బదియాఱు వ్రేఁడితూపుల నమ్మానవతి లలా
టంబు గాఁడనేసె; నిట్లు పరస్పరంబును సమాలోకమానాలోకభీకరంబగు సంగరంబు
కరంబు ప్రవర్తిల్లుచుండఁ దద్వాహనం బగు సింగంబును దనయోపినకొలఁదిఁ
గేసరమ్ముల విదుర్చుచు నఖఘాతమ్ముల గ్రుచ్చియు దంతమ్ములఁ గఱచియు సైన్య
సాగరమ్ము నల్లకల్లోలంబుగాఁ బిలుకుమార్చె. 746

క. శుంభుండును దేవీసం, రంభము గని యోర్వలేక రణభూమికి సై
న్యాంభోధి గొలువవచ్చి ని, శుంభునకుం దోడువడియె శుంభల్లీలన్. 747

వ. ఇట్లువచ్చి. 748

సీ. రౌద్రరసమ్మును భ్రమరసమ్మును • నిరుదెసఁ గాన్పింపఁ, గరుణ యొక్క-
వైపున నలు కొక్కవంకను దైవారఁ • జూడ్కులు కనుదోయి సొగసు దెలుప
జగదతీతంబైన సౌందర్యగరిమఁ గ్రొ • మ్మించు చాడ్పున మిఱుమిట్లు గొలుప
బవరంబు సేయునప్పరశక్తిఁ గన్గొని • విస్మయమ్మున నాపెవిధమునెల్లఁ

తే. గీ. జూచుచును మిన్నకుండ నాసుదతి మోము
నందుఁజిఱునవ్వు వొలయ దైత్యద్వయంబు
గాంచి, పామరులార! నిక్కముగ నెచటి
కేని పోఁగుఁడు జయకాంక్ష లింక విడుఁడు. 749

క. అభయం బిచ్చెదఁ; గాదే, ని భయము విడనాడి యీయనిన్ బ్రాణము వా
సి భటస్వర్గముఁ గైకొనుఁ, డుభయులు నన శుంభుఁ డల్క యుదయించి వెసన్.

మ. కని ఖడ్గంబున సింహశీర్షమును మొక్కల్ వోవఁగా నేయఁ ద
ద్ధనపాతంబు సహింప కద్ది నఖపాతచ్ఛిన్నకాయుం బొన
ర్చిన వాఁడో గదఁ బూని దేవియును గాసిం జెందఁగా నేసె దై
త్యునిబాహాంతరమందు, మింట సుర లోహోయంచు నగ్గింపఁగన్. 751

వ. అంతం బోక బాహుమూలమ్మును ఖడ్గతాడితమ్ము చేసి యయ్యంబ విజృంభించిన.

క. వ్రేటువడి వాఁడు వేదన, నూటాడక మాటుపడిచి యొక బాణమునన్
గాటముగ నేసెఁ బవిలి ల, లాటము పాలాశసుమవిలాసము దాల్చన్. 753

వ. పిదప నత్యంబిక నిశుంభవధారంభసంరంభయై పునఃపునఃపానంబునం బొదలి
ఘంటానాదం బొనర్చుచు నెదిర్చె; నిట్లు ఘోరంబుగ సంగరంబు చెల్లనంత. 754

క. కుక్కలొకపెట్టఁ గూసెను, నక్కలఱచెఁ గాకి గ్రద్ద నాఁజను పక్కుల్
దిక్కులద్రువఁ బఱతెంచెను, రక్కసుల యొడలిపలము గరంబు భుజింపన్. 755

వ. అంత నిశుంభుండు దైత్యమారణంబునకు పైఁపడ గదం గొని భీషణాకారమ్మున
నదరి హరింగొట్టి యట్టహాసం బొనరించి యయ్యంబం దాడించిన. 756

ఉ. ఆపెయు వల్గితభ్రుకుటియై మొగమంతయు జేవురింప 'దై
త్యాపశదా ! చలింపకు' మటంచుఁ గరాళతరాసి పూని య
ప్పాపుని కంధరంబు తెగవైచెఁ దటాలున, మింటిపైఁ దదీ
క్షాపరులైన దైవతనికాయము శోకముతోడ వ్రేల్మిడిన్. 757

ఉ. నెత్తురు కాల్వలై పరఁగె నింగి వియచ్చరిసంచయంబు పూ
ల్మొత్తిరి సోఁకుమూఁకలు నమోనమ యంచును గాల్మొక్కలంది ప
ర్వెత్తిరి కొంద ఱందు బలహీనతఁ బాఱుమొన స్మరల్చుచున్
రిత్తకు రిత్తపేయు రజనీచరవల్లభుఁ గాంచి యీసునన్. 758

క. దేవా నీయనుజన్మని, చా వాలోకింతె మెట్టచాడ్పునఁ బడె ! గృ
ధ్రావళి మాంసముఁ బొడువగ, నేవారిక నవికిఁ గదఁగి యిటు కారాక్కో ? 759

క. అనిలోన నీకు జయ మ, బ్బు ననుట గడు సందియంబు బుధకార్యము పే
యను వచ్చినమాయయ కా, మినిగా దది నిజము చావమికి మనతరమే. 760

క. కలకాల మొక్కవిధమున, నిలఁగాలము చనునె తనక హితముగ నొకచో
బలవంతుని దుర్బలు డు, ర్బలునిన్ బలవంతుఁ జేయు రాక్షసనాథా. 761

క. ఇంద్రాదినిర్జరులును ను, పేంద్రుఁడుశంభుఁడు విరించి యముఁడు జముండున్
జంద్రుఁడు మొదలగువా రీ, సంద్రము కాలమ్ము దాఁటఁజాలరు తల పన్. 762

చ. మును పృథివీశు లెందరు సమున్నతిమై నకివెట్టి సర్వమే
దినియు నిరంకుశం బగుగతిన్ బరిపాలన చేసినట్టి పీ
వని నొక కాంత కోడుదె! కటా! యిది కాలమురీతిగాక; త
క్కిన వానరింపఁ జాలునొకో! కీడును మేలును ప్రాణికోటికిన్. 763

క. కావునఁ బాతాళమునకుఁ, బోవుదమిప్పటికి; బ్రతుకఁబోలదె! రాజ్యం
బేవారికి శాశ్వతమగు, నే! విధిచోదితము గడవ నేర్తురె యెవరున్. 764

ఉ. అను సేనామఁఁపలుక్కులు, విని దైత్యవిభుండు కోపపిప్పులీకృతలో
చనుఁడగుచుఁ గటములదరఁగ, ననలజ్వాలాకరాళ మగుగతిదోఁపన్. 765

చ. చెవు లవియంగ నిప్పయతఁ జెన్నటిపలుకులు పల్కువారె! యీ
రవమున జాల్మలార! యని భ్రాతృసుహృద్గణమంత్రిరాజబాం
ధవతతి నొక్కయాఁడుది మవమ్మమెయిం దెగటార్పఁజూచి యే
బవరము మాని యీకటికిప్రాణము దాఁచికొనంగ నవ్వరే. 766

వ. శుభాశుభమ్ములు చక్రనేమిక్రమమ్మునం దిరుగు నీ సంసారమ్మున భవితవ్యాభవిత
వ్యమ్ములకుఁ దజ్జ్ఞులు చింతింపరు పర్జన్యుం డప్పటప్పటి యోగ్యకాలంబగు శ్రావ
ణమ్మునఁగురియక తదితరంబగు మార్గశీర్షపౌషమాసమ్ములం గురియుట గనుఁ
గొన్నఁ గాలం బెద్దానికిని గారణంబుగామి తెల్లంబగు. దైవనిర్మితంబగు గతి
కెన్నండు నన్యథాత్వమ్ము గలుగదని మఱియును 767

గీ. జగములెల్ల జయించి యశంబు గొన్న, శూరవర్యులు రక్తబీజుఁడు నిశుంభుఁ
డోహటించిరి రణమున నొక్క యబల, కకట! దైవము కారణమనుట తగదె.

వ. పదార్థద్వయసమ్మితం బగుకాలంబు సంప్రాప్తం బగుడు విరించియుఁ దద్ద్విగుణితం
బగుకాలమ్మునకు హరియుఁదద్ద్విగుణితమగు కాలమ్మునకు శంకరుండును నశిం
తురు. బ్రహ్మ కొక్క దివసం బగు నంతకుఁ బదునాల్గురింద్రులు చెల్లుదురు; సూర్య
చంద్ర మహీమహీధరసముద్రాది సకలచరాచరములకును దైవ నిర్మితం బగునాశంబు
తప్పదు కావున మృతికిఁ జింతింపక రణమ్మునకుం బోదుఁగాకేమి విధిచోదితంబై

జయంబైన నయ్యెడినని తే రాయితఁబు చేయించి చతురంగబలమ్ములు పరివే
ష్టింపంజని. 769

సీ. జగదతీతంబగు సౌందర్య మొప్పార • నఖిలభూషణభూషితాంగియగుచు
దివిసుంది ముదమున దేవతల్ మందార • కుసుమవర్షమ్ముల గురియుచుండ
కిన్నరీబృందంబు కిన్నెరల్ మీటుచుఁ • జిన్నారిగానముల్ సేయుచుండ
శంఖనినాదంబు నల్పుచు ఘంట వా • యించుచు సింగార మెసకమెసఁగ

గీ. సింహవాహనయై యున్నచెలువ చెలువ • మారఁ గన్గొని దైత్యుండు మారబాణ
తాడితాంతరుఁడగుచు యుద్ధప్రసక్తి • తిగిచి మనమున నిట్లు చింతింపఁదొడఁగె. 770

క. ఒయ్యారం బయ్యారేఁ, తియ్యందన మౌర ! రూపుతేట బళీ ! యీ
యొయ్యారి పంచబాణుని, కయ్యానకుఁ గాక వోరఁగాఁ దగినదియే. 771

ఉ. చిక్కనిచన్నుదోయి యెదఁ జీమకుఁదూఱఁగ రాదు మేనినుం
జక్కని జవ్వనంపురుచి చందలకుం బయిపెచ్చు పచ్చు న
మ్మక్క గదే ! మనోభవునిమానికన్నను జుక్క డీని నా
యక్కునఁ జేర్చుకోఁగ నుపాయము సేయుదు నేఁడుదేనియున్. 772

వ. మంత్రాది ప్రభావమ్ములు సర్వమంత్ర స్వరూపిణి యగు నీ జగన్మోహినియందు విఫ
లమ్ములు సామదానభేదమ్ములు వమ్ములట్లు గాదేని. 773

ఆ.వె. వెలఁదిచేతఁ జచ్చె విశ్వైకవీరుండు, వితతకీర్తి శుంభుఁ డతులుఁ డనుచు
గేలి సేయ కుండునే లోకః మకట, దం, దమున మనముఁ జొన్పిన నిది నిజము.

వ. తన కెనయగు యోధవరు నెదిరించి చచ్చియుఁ బుణ్యలోకమ్ము దెస కరుగుదు రని
పెద్దలు వచింప వింతుము గాని యబలాకర్తృకంబగు మరణం బుత్తమలోకావ
హంబు గానేరదు. వేయేల యస్మత్కులనాశమ్మున కివ్వెలఁది యేతెంచె ననియెఱుం
గుదునైనను మరణంబ యుత్తమంబు కాని పలాయనంబు కర్తవ్యంబు గాదని నిశ్చ
యించుకొని యమ్మేటి యద్దేవి కభిముఖమ్ముగ నరిగి యిట్లనియె. 775

క. అని పేయఁగ మదియే నో, వనబోఁడి ! కడంగు, వీరు నాతికిఁ దగునా !
యనియును నీ యత్నము వితి, యనియును మదిఁ గొంకుచుంటి నంతియ తరుణీ.

సీ. కనుబొమల్ విల్లు లోచనములె శరములు • హావభావాదులె యాయుధములు
వరసచర్యుండు విచక్షణుఁ డగుపురు • షుండె లక్ష్యము మనోజుండె తేరు

గడపునేర్పరి, భేరికానినాదమె మధు • రంపుఁబల్కులు మనోరథమె రథము
మదనాగమమ్ములె మంత్రతంత్రమ్ములు • పీణావినాదంబె వింటిమ్రోఁత

గీ. మదనయుద్ధంబె యుద్ధంబు మానవతుల • కెదిరి మగనేఁత సేయుట యేజయంబు
గాని వాలును బలకయుఁ బూని కడఁగి • బవర మొనరించు టది విడంబనము కాదె.

క. మందగమనంబు గలనీ, కుం దలమే కేల గదనుఁ గొని తఱుముట । చ
న్నుందోయికి నానందం, బొందింపనె । వింటిత్రాటిమొఱపులు తరుణీ. 778

సీ. అనిసేయు తలఁపేని మనమున నోసన • బోణి । బింబోష్ఠంబు పుప్పిగోళ్ల
లంబపాదంబులు లంబ స్తనంబులు • కాకిరూపును బిల్లికనులు గార్ద
భారావము వ గర్కశాలాపములుఁ గీర్తి • ముఖమున కెనయగు మొగముగల్గు
చెలువవై యుద్ధంబు సేయుము గాకున్న • పీతోడఁ గడఁగి యనిని బొసంగఁ

గీ. జేయఁగాఁ జేతులాడవు కాయజాత • కామినీతులితాకృతి గలవు నాఁగ,
నగుచు శ్రీదేవి వానియానన ముఖంకఁ • జూచి యిట్లనెఁ దీయని సూక్తు లలర.779

గీ. పంచబాణహతుండవై వనఁటఁ గుంద, మందబుద్ధివి నాతో సమరము సేయఁ
గలవె చాముండతో నొండెఁ గాళితోడ, నొండెఁ బోరుము నేను బైనుండు దాన.

వ. అని కాళివంక గనుంగొని యిద్దురాచారు సంహరింపుమని యానతిచ్చిన నాపెయు
గదాదండంబు కేలం గొని గిరగిరం ద్రిప్పివైచిన వాఁడు తదాఘాతంబు దప్పించు
కొని తద్భుజాంతరంబు గుఱిగా గదాదండంబు వైచిన నసిచేతం దునిమి. 781

క. తుడిచేయి నఱికి వానిం, బొడిచిన వెన్నీక రుధిరపుంగాల్వలు మైఁ
దుడిచికొనుచు నావంతయు, జడియక యొకకేలఁ గడఁగి సాహసలీలన్. 782

చ. గద గొని యామెపక్షమున గాఢఁగ నేయఁగఁజూచి యల్కమై
గుదురుగఁ దద్భుజాంతరముగూడఁ దటాలున ద్రుంచెఁ గాళి; దు
ర్మదుఁడయి వాఁడుమఱి రయముమైఁ దల దన్నఁగవచ్చినంతఁ ద
త్పదయుగ ముర్విపైఁ బడఁగ వైచెఁ గరాళతరాసిఁ బెల్చనన్. 783

క. కాళులు జేతులు దెగియుం, జాలింపక వాఁడు కాయజుం బగుగతి న
క్కాళికపై కుఱికిన నవ, లీలం దచ్ఛిరము దూఁటలీలం దఱిగెన్. 784

క. మించుగతి సురలు దివి వా, యించిరి దుందుభులు పేర్మి యింపారఁగ న
గ్గించిరి విరిసోనలు వ, ర్షించిరి భయ ముడిగి సంతసించిరి మతియున్. 785

వ. హతశేషులగు రక్కసు లద్దేవికిఁ బ్రణమిల్లి యభయంబు వడసి పాతాళమ్మునకుఁ జనిరి. 786

క. ఇది శుంభవధ యనం జనుఁ, జదివిన వ్రాసినను విన్న జనులకు సౌఖ్య
ప్రదము సుతప్రదము జయ, ప్రదము ధనప్రదము కడుశుభప్రదము నగున్. 787

వ. అని విని జనమేజయుండు మహాత్మా! మహామహిమ యగు నప్పరశక్తి నారాధించి మఱియు మున్నెవ్వరు వరంబులం బడసి రనవుడు సాత్యవతేయుం డిట్లనియె. 788

## సురథోపాఖ్యానము.

సీ. పుడమివేల్పులయెడఁ బున్నెంపుసేఁతయు • యజనంబు నిత్యసత్యవ్రతంబు
గంభీరభావంబు కరుణాపరత్వంబు • నీతియు నేకపత్నీవ్రతంబు
చాపకౌశలమాదిసర్వశాస్త్రప్రవీ • ణత్వ మాశ్రితరక్షణంబు శుచియు
గురుభక్తి మొదలగు గుణములు గల్గి సు • రథుఁడను నొకమహారాజు మున్ను

గీ. నేల నాల్గు చెఱంగులు నేలుచుండ • నద్రివాసులు మ్లేచ్ఛు లత్యధికబలులు
కొంద ఱతనికిఁ బగతురై కొండగుహల • నుండి తమదండుతోడ నుద్దండు లగుచు.

క. తాఁకిన నాతండును దన, మూఁకలతో నెదిరి కదనమున నాయవనా
నీకమున కోడి దుర్గ, ప్రాకారముఁ జేరి మదికి వగ వాటిల్లన్. 790

క. పగతురకుం బ్రగడలు లో, నగుటయు దైవమ్ము తనసహాయము గామిన్
మగతనము వృథా యగుటయుఁ, దగ నాలోచించి యిట్లు దలపోసె వెసన్. 791

శా. పాపాచారులు మంత్రు లక్కట! నను న్వంచించి యేనాటికే
నాపాపాత్ములవారిఁ ద్రోయుదురు సత్యం బింత యవ్వారిఁ బైఁ
గావుం జేసి మెలంగ రాను పిశునక్రౌర్యంబు నంబంధిక
త్యాపాతమ్మునకుం దలంకునె! శుచివ్యాపార మగ్గించునే! 792

క. తాతలుఁ దల్లులుఁ దండ్రులు, భ్రాతలు స్నేహితులుఁ జుట్టపక్కలని తా
మేతాదృశసంబంధము, చూతురె యెందేని లోభశూరులు పుడమిన్. 793

వ. పగతురఁ జేరి వారి నదుపాయమె చూచు ప్రధాను లెందు న
మ్మగఁ దగువారె? యంచు గతిమత్తురగంబు నొకండు నెక్కియెం

టిగఁ వనసీమకుం జనెఁ గడిందిగ ధైర్యముపూని యక్కటా,
జగతిఁ గుటుంబవైరము పొసంగిన నెవ్వరికార్తి గూరదే! 794

వ. ఇట్లు చని చిమ్మచీఁకటిఁ జీమకుం జొరరాని యయ్యరణ్యానిం ద్రియుగగవ్యూతి
మాత్రంబగు పథంబు గడచి. 795

సీ. వలిగాడ్పు విసరు తీవల నల్లిబిల్లిగాం • చిన చెట్లు తటముల జెలఁగు నదుల
నానందమ్ముగ రజతాద్రులవోలి పై • కత్తములఁ దిరుగు సింగములఁ బులుల
హరిణంబు లేన్గుల నాదిగ మృగముల • చదువుసంతల బ్రహ్మచారులనెడి
ప్రాఁబల్కులను హోమపక్వనీవారాన్న • గంధంబు పతితపక్వఫలములను

గీ. నింద్రియమ్ముల కెంతయు నింపునింపఁ
దగిన యొకముని యాశ్రమస్థలము గాంచి
పైందవము నొక్క భూరుహచ్ఛాయ నునిచి
వినయమునఁ జనె నమ్మునివిభుని యెదకు. 796

సీ. చని తపఃకృశు మృగాజిననివష్ణుని శాంతు • దాంతు నిర్మత్సరు ద్వంద్వరహితు
నఖిలాగమాంతరహస్య మర్మమ్ముల • నొగి శిష్యులకుఁ దెల్పుచున్నవాని
గని కుండజలవోలెఁ గన్నీరు కాల్వలై • పాఱ నిమ్ముని పురోభాగమందు
సాష్టాంగ మెఱఁగి దండాకృతి నొందిన • లెమ్ము లెమ్మని ముని లేవ నెత్తి

గీ. శిష్యుఁడొక్కరుఁ దగుమృగాజినము దేరఁ•బనిచి పఱిపించి కూర్చుండఁబనిచి యతని
నుచితవిధిఁ బూజపేయించి వచనరచన•శాంతి యిగురొత్తఁగఁబు తదుదంత మడిగె.

క. ఎటనుండి వచ్చి తిటకుం, గటకటపడ నేమివచ్చెఁ గలతెఱఁ గెల్లన్
దటుకునఁ దెల్పుము నాచెం, గటి కరుదెంచియును వగవఁగా నిఁక నేలా? 798

వ. నీమనోవాంఛితంబు దుస్సాధంబైనను సాధింతు ననవుఁడు గద్గదికతో నతం
డిట్లనియె. 799

క. సురథుఁ డనుపేరి ధరణీ, వరుఁడను శత్రులకు నోటువడి వారల దు
ష్పరిభావము కతమున మీ, చరణద్వంద్వమ్ము గొంటి శరణు మహాత్మా! 800

క. ఇల్లా లిల్లును రాజ్యం, బెల్లర్థఁ ధనయులను విడిచి యీ వనమున మీ
కాళ్లఁబడి శరణుఁజెందితిఁ, దల్లియుఁ దండ్రియును నీవ దైవము దేవా. 801

వ. మీకు దాసుండనై మీ పనిచిన కార్యంబెల్లఁ జేయుచుండు ననన నగు నన్నుం గరు
ణించి శత్రుభయంబు వాపి నాక్షూర్పు వారిం గూర్పవే యని కటకటంబడు నన్నర
పతి కభయం బొసంగి ముని యిట్లనియె. 802

క. వనవృత్తిని నీవారా, శనమున శుచివగుచు హింస సలుపక నీయం
తన యాశ్రమమున విహరిం, పు నృపాల! లభించు సౌఖ్యములు నీకు నొగిన్.

వ. అను మునివచనమ్ములకు సంతసిల్లి మునివృత్తి నట వసించుచుఁ గొండొకకాల మ్మున కొక శీతలతరుచ్ఛాయ నాశ్రయించి దైవికంబగు నాపదకు వందురుచు రాజ్యపరిత్యాగమ్మును దారపుత్రవియోగంబును వైరికృత పరాభవమ్మును దల పోయుచున్నంత దీనుండగు నొక బచ్చుచోటికి వచ్చినం గని యుపవిష్టుం జేసి నీ వెవ్వండ? వేకతమ్మున నిటరాక? శోకకారణం బేమి? నావుడు వతం డతని కిట్లనియె. 804

ఆ. వె. బచ్చుకులమువాఁడ బహుధనవంతుఁడ, సత్యరతుఁడఁ గడుయశంబు నీసు
లేమి యూగి దుఃఖిగామియు గల్గిన, వాఁడు నాఁగవినుతి వడయువాఁడ. 805

వ. ఏను ధనలుబ్ధులును నసాధులును నగు పుత్రదారాదులచే నిరస్తుండనై యున్నవాఁడ నమ్మున కేతెంచితి నా పేరు సమాధి యందురు భవదీయోదంతంబు విననలయు దేవర యానసంబు గాంచిన భాగ్యవత్త ప్రకటం బగుచున్నయది యని వినయవినమితుం డగు వకోక్కమటికి సురథుం డిట్లనియె. 806

క. సురథుఁ డనుపేరి ధరణీ, వరుఁడను బగతురకుఁ జిక్కువడి నీవలె దు
ర్భరణభయమ్మున నిటఁ గ్రు, మ్మరు విర్భాగ్యుండ విరథిమానుఁడ బడుఁడన్. 807

వ. దైవయోగమ్మునం జేసి మన కిరువురకుం బరిచయంబు వాటిల్లె నిఁక శోకంబు విడిచి యిట సుఖమ్ముగ వసింత మనవుడు సురథున కక్కురాటుం డిట్లనియె. 808

సీ. భార్య మేన సుఖంబు వాటిల్ల దనియుఁ గు • టుంబంబు గడువిరాలంబ మనియు
నప్రయోజకులయి యాత్మజు లే మప్పు • లేని యవాగువునైనఁ ద్రావి
కూడఁబెట్టిన సొమ్ము కొల్లపెట్టి దరిద్రు • లై యాపదలకుఁ బా లగుదు రనియు
మనము శాంతింపదు మానవనాథ భా • ర్యను బిల్లలను నేమరల బ్రతికియుఁ

గీ. గాంతునో లేదొ యంచు దుఃఖమ్ము వార్ధి • భంగిఁ దరఁగలు గట్టి లోపల నిముడక
పొంగుచున్నది నే నేల పొలియ నంచుఁ • గడవల కొలంది కన్నీరుగాఁగ నేడ్చె.

క. అని యేడ్చుకోమటిం గనుఁ, గొని నీ! వి న్నిల్లువెడలఁ గొట్టినవారిం
దనుజాల దమజాకారులఁ, గనుఁగొనినను సుఖము నీకుఁ గల్గునె చెపుమా. 810

వ. అని యేనును రాజ్యవిహీనుండఁగదా యని చింతింతు. దైవికమ్ము లగునాపద లను భవమ్మునంగాని తీఱ వైనను మనమిరువురము నేగి యిటనున్న మునినాథుం గాంచి

సవినయమ్ముగా శోకనాశోపాయం బడిగి తెలిసికొందు మని రాజు మాటల కక్కొ-
మటియు వల్లెయని యతనిఁ గలిసి యమ్మునికడ కేగి మ్రొక్కి వినయం బడి
యున్నంత సురథుండు మునికిట్లనియె. 811

ఉ. ఐ చ్చొకఁ డీతఁ డివ్వనముపజ్జనె నాకును మిత్రుఁ డయ్యె నీ
సచ్చరితుండు దారతనుజాతులచేత నిరస్తుఁడై గడుఁ
హెచ్చినశోకవారినిధి నీఁదుచు ని మ్మభయంబు వేఁడఁగా
వచ్చినవాఁ డనాథుఁ డగువాఁడు ననుంబలెఁ గావవే మునీ. 812

వ. ఏనును భవదీయపాదసేవాసమాసాదితసుఖాతిశయమ్మునంజేసి కాలంబు గడప
నుంకింతు నైనను నాపద్దయిడుమలు తలంపునకువచ్చి నిద్రాసుఖమ్ములు దూరమ్ము
లగుచుండు మహాత్మా! మమ్మనుగ్రహించి శోకనాశోపాయం బానతీవే యను
సురథునకు మునివరుం డిట్లనియె. 813

గీ. హరిహరబ్రహ్మలైన మాయకుఁ దలంకి, మోహవారాశిలోపల మున్గుచుంద్రు
మనుజమాత్రులు మీర లామాయఁ గడచి, యుండనేర్తురె మోహంబు గండడంచి.

వ. ఇందుల కొక్క యితిహాసంబు దెల్పెద నాలకింపుఁడు; కృతయుగమ్మున నారాయ
ణుండు సితద్వీపమ్మున ననేక దివ్యవత్సరమ్ములు దపం బొనరించుచున్నంత నచ్చో
టన విరించియు మోహనివృత్తికై తపంబు సేయుచుండె నిట్లు కొంతకాలమ్ము కడ
చినపిదప నిరువురు నత్తావు వదలి చనుదెంచుచు నొక్కయెడఁ దాఁ సిల్లి పరస్పర
జిజ్ఞాసంజేసి యీవెవ్వం డీవెవ్వండ వని యడిగికొని రందు విరించి చరాచరాత్మకం
బగు జగమ్మంతయు నిర్వర్తించినవాఁడ ననుచు నారాయణుం డతని కిట్లనియె.

## భువనసుందరీ మాహాత్మ్యము.

శా. ఏనాఁటం జగమెల్లఁ జేసితిని నేనే యంచు నాయొద్ద నీ
యానై పుణ్యము గట్టిపెట్టుము బలే! యీవెంత! యీ సర్వమున్
నానిర్మించినవిశ్వ మచ్యుతుఁడ నే; నాఁ డామధుం గైటభుం
బ్రాణాపేతులఁ జేసి నిన్నరసి సంరక్షించుటల్ వోయెనే! 816

గీ. రాజసుఁడ వేల యింతగర్వమ్ము నీకు, నిన్నుఁ గని పెంచి దానవానీక మనికిఁ
గడఁగిపొదువంగ వారిధాకలకుఁ గొంకు, హైనఁ దలఁపక యిటువల్లి వగునె మూర్ఖ.

చ. అనిన విరించి యిట్లనియె నౌర ! సురారులతోడఁ బోరునాఁ
డెనసి వరాంబ తోడగుట యించుకయుం దెలియంగరాదె ! యీ
యనువునఁబల్కఁ నీకునెటులాడెడి నాలుక, యిట్టులిద్దఱుం
బనిఁగొని వాదుసల్పఁ గనవచ్చెను లింగ మొకండు వారికిన్. 818

క. ఓ నారాయణ ! యోచతు, రానన ! మీరిరువురుఁ గలహము మాని వినుం
డేనొకపల్కు వచించెదఁ, బూనికమైఁ పక్షపాతమును గనకుండన్. 819

వ. ఈ ద్వీపమ్మున నిపు డుద్భవించిన యీ మహాలింగమ్మున కగ్రమ్మొక్కండును నాదియొక్కండును జూచి రయమ్మున నెవ్వఁడరుదెంచు వాఁడు మీ యిరువురం దధికుండు నావుడు వల్లె యని హరి పాతాళమ్మునకును విరించి యాకాశమ్మునకును జని రందు. 820

మ. హరి పాతాళము నేగియేగియును లింగాదిన్ విలోకింప జె
క్కరణిం గాంతునటంచుఁ జింత గొనె; నక్కంజాననుండుం దదం
బరవీధిం బడి యేగి లింగమునకుం బారంబుఁ బోరామి ను
ద్ధురలజ్జాధికశోక దైన్యముల లోఁతుం గాంచి యట్లాడుచుణ్. 821

వ. ఒక్కచో నుపవిష్టుండై దైవికమ్ముగాఁ దదీయశిరమ్మునుండి భూమివయిం బడు నొక్క మొగలిపూవుం గాంచి దానిం బరిగ్రహించి సంతసమ్మున నయ్యసురాంతకుపాలికిం జని యేను లింగాగ్రంబు గాంచి యచ్చట నున్న మొగలిదళంబు గొని వచ్చితినని చూపిన హరి యక్కేతకి కిట్లనియె. 822

క. నిజముగ లింగశిరం బీ, యజుఁడు గనుంగొనెనె ? నీవు వచ్చోట సుర
వ్రజపూజితమవె ? నావుడు, నిజ మని యమ్మొగలిపూ వనృతము వచించెణ్. 823

వ. హరియును దానిపలుకు విశ్వసింపక లోకంబునం గొందఱు ధనాశంజేసి కూటసాక్ష్యం బిత్తురని పలికి యివ్విషయమ్మున నాకు మహాదేవుండ ప్రమాణం బనినఁ దిరోహితుం డగుచు శివుం డతని కిట్లనియె. 824

గీ. అనృతవాదిని కేతకి యకట ! నాదు, మస్తకమునుండి పడుచు నమ్మార్గమధ్య
మందుఁ గంటఁ బడఁగఁ జతురాననుండు, చేతఁగొనివచ్చెఁగాని మచ్చిరముఁగనఁడు.

వ. అని పలికి కోపమ్మునఁ గేతకిం గాంచి యనృతం బాడితివిగాన నిది మొదలు నాకుఁ బూజింపఁదగవని శపించెఁ బిదప వారిరువురును యథేచ్ఛఁ జనిరి. 826

క. కావున మోహము జగమున, నేవారును దాఁటలేరు నృపవర! మిగులన్
బ్రావీణ్యము కలవారి మ, నోవృత్తులనైన మాయ నూల్కొనఁజేయుఁగా. 827

గీ. అట్టిమాయకు లోనుగా కంబ యొకతె, సర్వమును సృష్టిఁజేసి రక్షణమొనర్చి
లయము గావించు నాయంబ లక్షణములు, తెలిసికొన్నను మోహవార్ధినిఁ దరింపఁ

వ. నావుడు సురథుండు తల్లక్షణంబు నెఱింగింపు మనుడు. 829

సీ. రాజేంద్ర! విను శుభప్రదమును గామద • మును నగు నంబికాపూజ చొప్పు
వినియతేంద్రియుఁడయి మునిఁగి తెల్లనిపదుంగు • గట్టి వార్చియు శుభాగారమందు
గోమయలిప్తమై గోముఖాలంకృత • మై యొప్పుగను మంటపాంతరమునఁ
దనశక్తికొలఁది నెంతయుఁ బూజకై తగు • ద్రవ్యమ్ములను గొని భవ్యరీతి

గీ. ధరణి నాత్మను గాఁబుదగ విశుద్ధి • చేసి చిత్తంబు శుద్ధంబు చేసి పిదపఁ
దామ్రమయ మగు నొక్కపాత్రమ్మునందు • ద్విజులతోఁ గూడ వేదచోదితముగాఁగ.

వ. షట్కోణంబగు యంత్రమ్ము లిఖియించి దాని కెలన నష్టకోణయంత్రమ్ము వాసా
దించి పదంపడి నవాక్షరమంత్రబీజమ్ములు యథాన్యాసమ్ముగా వ్రాసి ప్రాణప్రతిష్ఠ
యొనర్చి షోడశోపచారమ్ములం బూజించి శక్త్యనుసారమ్మునఁ దన్మంత్రజపం
బొనర్చి తజ్జపసంఖ్యాదశాంశమ్మున హోమమ్మును దద్దశాంశమ్మున దర్పణమ్మును
దద్దశాంశమ్మున బ్రాహ్మణభోజనమ్మును గావించి చరిత్రత్రయపాఠం బొనరించి
విసర్జింప వలయునని చెప్పి వెండియు. 831

క. సువ్రతు లగువారికి వి, త్యవ్రత మాశ్వయుజమాసమందు న్నవరా
త్రవ్రత మది చెప్పెద విను, ధ్రువజమతముగ విధి విని తనియుఁడు మీరల్. 832

వ. అశ్వయుజ చైత్రమాసమ్ము లను నీరెంట నాది యాదిగ నవరాత్రమ్ములు జితాహా
రుండై జప్యమంత్రమ్ములచే శర్కరామధు ఘృతయుతమ్మగు పాయసమ్మునొండె
ఛాగమాంసమ్మునొండె బిల్వపత్రమ్ములనొండె హోమంబు గావించి ద్విజభోజనం
బొనర్చిన వారికి నొకండన నేల సమస్త కామమ్ములును గరతలామలకమ్ములగు
నిందుజాతిభేదంబును స్త్రీపుంసభేదమ్మును నకించిత్కరమ్ములు విధిచోదితంబుగ
నెవ్వదేవి మండలం బొనరించి పుష్పమాలాలంకృతంబగు వితానంబు బంధించి
కలశస్థాపనం బొనర్చి యంత్రప్రతిష్ఠితయగు నద్దేవిని త్రికాలమ్ములయందు ధూప
దీపాదికమ్మున నర్చించుచు గీతాదికమ్ములును వేదపారాయణంబులును విస్తరింపఁ
జేయుచు యథామతి యథాశక్తిగ విత్తశాఠ్యం బొనరింపక సుగంధతైలచందనభూష

జాదులచేఁ గన్యకల నర్చించుచు నవరాత్రమ్ములు గడపి ద్విజభోజనపురస్కార
మ్ముగా దశమీదినమ్మునఁ బారణంబొనర్చి క్రతుసమాప్తి గాంచిన వాఁ డుత్తమలోక
మ్మున కేగి దేవిసాయుజ్యమ్ము గాంచు నని వెండియు. 833

క. నవరాత్రవ్రతమున కెన, యవ్వ్రతము మఱొండు గాన మవనీశ్వర! యీ
యవనిన్ బంధుల నందఱ, నవశ్య మందెదవు దేవి నర్చింపు మిటుల్. 834

వ. అని సమాధిం గాంచి. 835

క. ఓవైశ్యోత్తమ! నీవును, గావింపుము దేవిపూజ, క్రమముగ నీడుః
ఖావేశమడంగుచు ధని, వై వర్ధిల్లెద వటంచు నానతి యీఁగఁగా. 836

వ. వారలిరువురును హర్షోత్ఫుల్ల లోచనులై మ్రొక్కి దేవరదర్శనంబునఁ జేసి యస్మ
త్తాపంబు వాసె ధన్యుల మయ్యెద మమ్మంత్రరాజం బుపదేశింపవే యనఁడు ధ్యాన
బీజపురస్సరమ్ముగా నవాక్షర మంత్రమ్ముపదేశించిన మునిపతి కెఱఁగి చని యొక్క
నదీతీరమ్మున విజనప్రదేశంబు నాశ్రయించి శుష్కపర్ణాశను లగుచు రెండు వత్సర
మ్ములు జపించి నంత నొక్కనాఁడు స్వప్నమ్మున రక్తాంబరధారిణియై దేవి వొడ
గట్టినం గాంచియుఁ దపఁబు చాలింపక తృతీయవత్సరం బంతయు జలాహారం
బుగఁ గడపి పదంపడి దేవీసాక్షాద్దర్శనంబు గానక. 837

మ. ఒకకుండమ్మును ద్రవ్వి పావకుని నందూఢాత్ముఁ గావించి పా
యక దేహంబు త్యజింపఁగాఁ దెగువ నేయంబూని మాంసంబు పా
వకునందుం దెగఁ గోసి హోమమొనరింపన్ దాన శ్రీదేవి య
య్యకలంకాత్ములకుం గనంబడియె ధ్యేయాకార మేపారఁగఁగా. 838

వ. ఇట్లు చూపట్టి మీసాహసంబువలన నేను బ్రసన్ననైతి వరంబు గోరుఁ డనవుడు
సురథుం డిట్లనియె. 839

మ. జననీ! మాఱ్తురచేతఁ జిక్కువడి రాజ్యం బేది యీకాననం
బున నిన్నాళ్ళు వసించి నాదు వితతంపుంబుణ్యముంజేసి నీ
మనురాజంబు జపించి నీకరుణ సమ్మానంబు గైకొంటిఁ గా
వున నాతొల్లిటిరాజ్య మిచ్చి యశుభంబుల్ వాపుమా నావుడున్. 840

సీ. వగతురు నీచేతఁ బడుదురు బల మేది • నీమంత్రులెల్లరు నిన్నుఁగొల్వ
నేతెంతు రీవు నీయిల వేయి సంవత్స • రములు మహాప్రాభవమున నేలఁ

గల వింటి కేగుము కళ్యాణములు సమ • కూరుకాలము నీకుఁ జేరునయ్యె
నని యంబ సెలవీఁగ నవనీపతియు మద • మంది తొల్లింటిహయమ్ము నెక్కి

గీ. పగతురను గొట్టి పృథివి చేపట్టి మంత్రి • వరులతోఁ గూడ రాజ్య మవార్యలీలఁ
బాలనమొనర్చి వేయిసంవత్సరమ్ము • లుండి తుది దేవదేవిసాయుజ్య మందె. 841

వ. కోమటియు నాపె కెఱఁగి యిట్లనియె. 842

క. తల్లీ! ధనధాన్యమ్ముల, నొల్లన్ వేఱొండునొల్ల నుల్లాసములం
దెల్లను నశింప నేరని, యుల్లాసము గోరువాఁడ నుల్లమున దనియఁగా. 843

వ. అనిన దేవియు నతనికి దివ్యజ్ఞానం బొసంగి యంతర్ధానంబుచేసెఁ బదంపడి వాఁడును తీర్థాటనాదిపుణ్యకార్యమ్ములచేఁ గాలయాపనం బొనర్చి ముక్తసంగుఁడై తుదకు దత్సాయుజ్యంబు వడసె నియ్యది భూపవైశ్యుల చరితంబు దేవ్యారాధనఫల ప్రాప్తిదృష్టాంతంబు దీనిం జదివినను విన్నను బురుషార్థమ్ములు గలుగు నని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లక్కథకుండు మునులకుం జెప్పుటయు.

## స్కంధాంత పద్యములు.

క. కడియెద్దపురవిరాజిత!, మృడపాదాంభోజచంచరీకహృదయ! ద్రా
విడశాఖాభాషాయిత!, జడవిజ్ఞానప్రదాన! శాస్త్రవిధానా! 845

క. నానాతీర్థాటనసం, ధానాపారాన్నదానతతవిద్యాదా
నానూనపుణ్యసంభృత, మానాతీతోరుకీర్తి! మద్గురుమూర్తీ! 446

భుజంగప్రయాతము. సదానందచిత్తా! ప్రశస్తార్థవేత్తా!
వదాన్యాగ్రవర్తీ! శుభఖ్యాతకీర్తీ!
పదాలంబిభూపా! కృపాధూతపాపా!
నిదాఘార్కకాంతీ! మునిశ్లాఘ్యశాంతీ! 847

## గద్య.

ఇది శ్రీ......తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను
మహాపురాణంబునందుఁ బంచమస్కంధము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## షష్ఠస్కంధము.

విమలతరహృదయ సరో, త్తమచిత్రచరిత్ర శాస్త్రతత్త్వజ్ఞ కలా
ర్థి మహిత సుమహిత సతత, భ్రమరహిత మనోజ్ఞమూర్తి బ్రహ్మయశాస్త్రీ. 1

వ. అవధరింపు మనంతరంబ శౌనకాదులు సూతుంగాంచి. 2

గీ. పరమవిజ్ఞానియైన ద్వైపాయనమునిఁ
గొలిచి శ్రమచేసి విద్యలఁ గొంటి వనఘ
నీదు వచనామృతంబుమన్నించి త్రావు
కొలఁది మా కాదరంబెక్కెఁ గొసరికొసరి. 3

చ. మరల నినున్ మహామహా సముంచితబుద్ధివిశాలు నిమ్మునీ
శ్వరులు శ్రుతిప్రసిద్ధమగు సత్కథనొక్కఁడు గోరనెంచి రా
దరమునఁ జెప్పుమయ్య మును త్వష్టకుమారుఁడు వృత్రుఁ డప్పురం
దరునికతమ్మునన్ రణమునజా మృతుఁడౌట ప్రసిద్ధమేకదా. 4

వ. సురపక్షీయుండగు త్వష్టకుఁ గొమరుండైన వృత్రుని వధించుటకు సత్త్వగుణో
త్పన్నుం డగుశక్రుం డెట్లంగీకరించె? విష్ణుం డీకృత్యమ్మునకుఁ దోడ్పడి పవిమ
ధ్యమ్మున నెట్లు డాఁగె? వియ్యది సత్త్వమూర్తియగు నతనికిం దగునే? యని
మఱియును, 5

క. ఇరువురు హరులును సత్యం, బరయక జలఫేనమున మహామహా వృత్రున్
హరియించిరికద ధర్మువు, మరియాద యొకింత వలదె మహనీయులకుజా! 6

క. కేవలమిషగతి విశ్వా, సావహ నొనరించి వృత్రుహరియించిన య
ద్దేవపతి బ్రహ్మహత్యా, ప్రావృతుఁడై లోకనిందఁ బడయఁగ లేదే. 7

వ. ఇది యిట్లుండ నీవు వృత్రుండు దేవిచే నిహతుండయ్యెనని మదివితి వదియెట్లన
వుడు, సూతుండు మునులంగని యిట్లనుః మునులారా! సావధానులరై యాలిం
పుఁడు మీయట్లు జనమేజయుండు పరాశర సూతి కిట్లనియె. 8

క. హరి హరిసాహాయ్యమ్మునఁ, బొరిగొనె వృత్రు నని దేవి పొరిగొనెనను చె
క్కెరణి లగియించు నొక్కరుఁ, డిరువురవళ కెట్లు విషయుఁ దెఱిఁగింపు మొగిన్.

క. పరమోత్తము లనఘులు స, త్త్వరతు లగణ్యప్రభావధన్యులు లోకో
త్తరులగు పుణ్యాత్ములు స, చ్చరితలు వినుకతన జన్మసాఫల్యమగున్. 10

వ. నావుడు వ్యాసుం డిట్లనియె. 11

క. నరవర! ధన్యుఁడ వీ వొ, క్కరుఁడవె, సచ్చరిత లిట్లు కాంక్షింతువె! త
త్పరులై వినువారుండినఁ, బరమప్రీతి యగు నొడువువారికి నెందున్. 12

ఉ. వేదములం బురాణముల విశ్రుతమై తగుఁ ద్వాష్ట్ర ధర్మమ
ర్యాదకుఁ దక్క విష్ణుని సహాయునిఁగాఁ గొని పాకవైరి దా
భేదిలఁజేసి దుఃఖమును బెల్లుగ నందె నటంచు; మాయఁ బెం
పేది మునీంద్రులే కుటిలకృత్యములం బడ నొల్ల శక్యమే! 13

గీ. ఈతఁ డొక్కరుఁ డన నేల, కృష్ణుఁ డకట!
సత్త్వవిగ్రహుఁ డయ్యు మిషగతిఁ దునిమె
రక్కసులనెల్ల; జ్ఞానంబు నుక్కడంచు
మాయ భగవతి యేరి కజేయ గాదె. 14

క. వేలకొలఁదియుగముల మా, యాలీలన్ జలచరాదికాకారమ్ముల్
దాలిచి విహితావిహితము, లోలిం దెలియకయ విష్ణు వొనరుచు ననఘా. 15

చ. హరి యన నొక్కఁడేమి! జను లందఱు మాయకతమ్మునన్ బరా
పరము లెఱుంగ లేక నదుపాయము గానక "వాధనంబు నా
తరుణి," యటంచు మోహమునఁదద్దయు మున్గుచుఁదేలుచుం బొన
ర్తురు సుకృతమ్ము దుష్కృతము తుంపుడుకొప్పఁ బరీక్షిదాత్మజా. 16

క. నరుఁ డొక్కరుఁడును మాయా, తరణోపాయం బెఱుంగఁ దగఁడు హరిపురం
దరు లావృత్రాసురునిం, బొరిఁగొనుటయుఁ దన్మయత్వమునన నృపాలా. 17

గీ. స్వార్థసాధనతత్పరతాత్ములగుచు, హరిపురందరులు నెపము నవవరించి
పోలియఁజేసిరి వృత్రునిఁ బూర్వవైర, కారణంబు వచించెద ధారుణీశ. 18

గీ. దివిజులకు నెల్ల ఘనుఁడు భూదేవహితుఁడు, కలఁడు త్వష్టృప్రజాపతి కడుఁదపస్వి
యతఁడు సృజియించెఁ ద్రిశిరస్కుఁడైన పుత్రు, విశ్వరూపుని నింద్రవిద్వేషమెనయ.

## విశ్వరూపుఁడు తపమ్ము సల్పుట.

క. వదనమ్ములు మూఁడింటన్, బదపడి వేత్తైనపసుల పచరించుచు స
ద్విదితగతి వృద్ధిఁజెందెన్, ముదమునఁ దనుఁజూచి యెల్లమునులు నుతింపన్. 20

గీ. ఒక్క మొగమున వేదమ్ము నొగిఁ బఠించు
నొక్కమొగమున సురఁద్రావు నొక్క మొగము
నన్ సమస్త ప్రపంచమ్మునం గలుగు వి
శేషములు చూచు నతఁడు మనీషిహితుఁడు. 21

క. తపమాచరింపెఁ బంచా, గ్నిపరీతుండగుచుఁ దగ నకిల్బిషబుద్ధిన్
విపరీతశ్రద్ధా ధ, ర్మపరాయణుఁడగుచుఁ దన్ను మాన్యులు మెచ్చన్. 22

గీ. పాదపాగ్రమ్ముపై నొకపరి వసించి, పుండువంటి చలిని నీటనుండి మండు
వేసవిని జుట్టు నగ్నుల విసువకునిచి, యతఁడు దపమాచరించు నాహారమెడలి. 23

గీ. అట్లు తపమాచరించు నయ్యనఘుఁగాంచి, తనపదవి నీతఁడు హరించుననుచునెంచి
తపము విఘ్నంబొనర్చెడి తలఁపు మించి, యింద్రుఁడు సభాస్థలమునకు నేగుదెంచి.

వ. కామమ్మునఁ దపం బడంగు నని రంభోర్వశీమేనకలం బిలువం బంచి తారుణ్య
మదగర్వితలగు నక్కాంతల కిట్లనియె. 25

ఆ. వె. మూఁడుతలలతపసి మునుకొని నాదుసిం, హాసనముహరించు నబలలార!
యెట్టులైన మీరు నెట్టన వాని త, పమ్ము చెఱిచి విలపవలయు నన్ను. 26

క. సింగారములూని కన, త్సంగీతరవముల నాట్యసంగతులఁ గలా
భంగుల రంగుల నతని న, నంగుని కొల్పింపవలయు నంగనలారా. 27

వ. అని కవికరం బుట్టివడఁ దమ్మం గోరు శచీపతి కచ్చరలిట్లనిరి. 28

చ. తలఁగనేల? యప్పురపుఁదళ్కులఁ గుల్కులఁ బల్కులన్ ఝళం
ఝళితవిరావమాపురలసత్పదసంగతి నొప్పు లాస్యరీ
తుల మృదుగానపద్ధతుల దొరపునేరుపు గల్గు బెళ్కుచూ
పుల వివశుం బొనర్చి మునిపుంగవు దాసునిగాఁగ నేలమే! 29

వ. అని చెప్పి యమ్ముని యాశ్రమమ్మున కరిగి. 30

క. పాడుదురు సుస్వరమ్ముగ, నాడుదురు లయానుగతుల నభినయమున బల్
పోఁడిమి నెఱపుదురు మునిన్, దూడిగఁ గరఁగింప వేల్పురోయింతు లొగిన్. 31

క. నాకాంగన లతినైపుణి, మేకొనఁగ నొనర్చునట్టి మేళవుఁగృతులన్
మూకాంధబధిరపద్ధతి, గైకొని యతఁడింపుకేవిఁ గనఁగఁడు వింతే! 32

వ. అచ్చరలును నచ్చటఁ గొన్ని దినమ్ములుండి యతని ధైర్యమ్మున కచ్చెరువడి మరలి యింద్రునికడ కరిగి దీనాననమ్ములతో నిట్లనిరి. 33

ఉ. చేసితి మిన్నినాళ్లతనికెంత శ్రమంపడి హావభావవి
న్యాసములన్ రసాభినయనాట్యమృదంగరవానుషంగవీ
ణాసరసస్వరానుమతనవ్యగుణోల్బణగాన మాదిగాఁ
జేసెడి చేష్టలన్నియును; జెక్కుచెదర్పదు మౌనికింతయున్. 34

గీ. ఎన్నిచేసిన నాతనియెడల "బూదెఁ, బోయు పన్నీరు" లాయెమానోయుగములు
శాపహతిఁగందకే నీదు సన్నిధికి న, దృష్టమున వచ్చితిమి దేవదేవ మరల. 35

క. నావుడు దివిజేంద్రుం డ, ప్పావనుఁడగు మౌనివరునిఁ బరిమార్పఁగఁ జిం
తావిష్టుఁడయ్యె నది యశు, భావహమగు కృత్యమనుచు నారయఁ డధిపా. 36

వ. ఇట్లింద్రుఁడు దుర్మనస్కుండై గజమ్ము నధిష్ఠించి తపస్సమాధి దీక్షితుండగు నమ్మునివరు వీక్షించి. 37

చ. తపసి మహానుభావుఁ డతిదాంతుఁ డటంచన కింతఁ డాత్మకున్
రిపుఁ డగు నంచు వజ్రమలరించి కరమ్మున వైచెఁ దద్గతిన్
వ్యపగతజీవుఁడై పడియె నమ్ముని, మౌనులు శోకమంది "దే
వపతి ఋషీ తపస్వుల నపాపులఁ జంపఁగనేల యక్కటా." 38

క. అని యాక్రోశింపుచు ని, య్యనఘునిఁబొరిగొన్నయాతఁ డచిరమ్మున దుః
ఖనియతుఁ డగునని పల్కిరి, చనియె సురేంద్రుండు తనదు సదనమ్మునకున్. 39

వ. అంత నమ్ముని వజ్రనిహతుండయ్యును జీవసహితుండునుంబోలె ననర్గళతేజమ్మునన్ బొల్చుడు నింద్రుం డితండు పునర్జీవితుం డగు నొకో! యనిశంకించి తక్షునిం బిలిచి యిట్లనియె. 40

ఆ.వె. అనఘుఁ డితఁడు వజ్రహతుఁడయ్యు జీవన, హితునివడువు చెంది యెసఁగుచున్న
వాఁడు మరల బ్రతుకువడయనిగతి శిర, ములను జెక్కుమనుడుఁ బలికె నతఁడు.

చ. అకట యితండు వజ్రహతుఁడై మృతిఁజెందె మృతున్ వధించి పా
తకమునఁ బోవనేర్తు వృథాగతి నిమ్మునిఁ జంపఁజొచ్చి తే

మికతనినో యెఱుంగ విమమీ యిది పెద్దకళేబరంబు మా
మకపరశుప్రచారము సమగ్రతమైఁ దఱుగంగ నేర్చునే. 42

క. మృతుఁడయ్యె వీతఁడు నిక్కము, వితఁగా దలఁ దఱుగనేల వినుమింతకు నీ
వితనికతన భయమందిన, వితముం దెలియంగఁ జెప్పవే? నా కనుడుఁ. 43

వ. ఇంద్రుండిట్లను వితండు మహానుభావుండగు మునియయ్యును నాకు శత్రువగుటం
జేసి యెట్టింగినైన వడివధ కర్జంబగుట వితని వధించితి. 44

క. హతుఁడయ్యును బ్రతుకుంగను, వితమునఁ గన్పట్టె ధర్మవిదు లగ్నిఋణ
ప్రతివీరశేష ముంచిన, కతనన్ మువ్పొదవు నంద్రు గాదే యెందున్. 45

వ. అవిన నతండిట్లను నిట్టినిరపరాధి యగు బ్రహ్మతేజస్కుఁ దపస్వి వధింప నుంకిం
చిన నీకు బ్రహ్మహత్యాభయంబు లేదె? నావుడు నింద్రుం డిట్లనియె. 46

ఆ. వె. బ్రహ్మహత్య కేనుభయపడ శత్రుశే, షమ్ము కతననామనమ్ము కలఁక
చెందఁజొచ్చెఁ బాపచేష్టఁ బ్రతిక్రియ, వలనఁ బాపికొనఁగవచ్చు ననఘ! 47

వ. ఎట్టి ప్రాయశ్చిత్తం బొనర్చినను శత్రుశేషంబు నశింపమగావఁ బాపపుణ్యమ్ము
లెంచక యేగతినైన శత్రుండు వధ్యుండు నావుడుఁ దక్షుం డిట్లనియె. 48

గీ. ఈవు లోకాఖిహతిఁ జేసి యిట్టిపాప, కృత్యమున కియ్యకొంటి వొక్కింతయేని
లోభమెవయని నా కెట్టులు హితమిట్టి, యహితకృత్యంబటన్న నిట్లను బలారి. 49

వ. అట్లేని నీకిది మొదలు జన్నముల భాగంబేర్పఱచెద యజ్ఞార్థంబగు పశువుశిరంబు
నీయది నావుడు సమ్మతించి తక్షుం డతనిశిరమ్ములఁ దనపరశువున నఱికె నంతట.

క. శిరములు ధరఁబడు నాలోఁ, గరమాశ్చర్యంబు వొడమఁగా వేలకొలం
ది రహిఁ జనించెం బక్షులు, తరతరమ శిరములనుండి ధరణీనాథా. 51

వ. శ్రుత్యధ్యయనమ్మును సోమపానమ్మును నొనర్చు ముఖమ్మునఁ గపింజలమ్ములును
సర్వదిఙ్నిరీక్షణం బొనర్చు మొగమ్మునఁ దిత్తిరి పక్షులును గలుద్రావువక్త్రమ్మునఁ
గలవింకమ్ములును బొడమె నంత నింద్రుండు దన్నుం గృతకృత్యునిఁగా నెంచి
కొని బ్రహ్మహత్యం బాపికొన నెంచునంతఁ ద్వష్టృప్రజాపతి తనపుత్రుమరణమ్ము
విని యింద్రునియెడ నగ్గలపుటలుకవొడమి యిట్లను. 52

క. కనుఁగొనుఁడు సురలు నాదగు, తనయు నిరపరాధు మౌనతత్పరునిం జం
పిన యింద్రుని గీటడఁగిం, ప నొకమహాబలునిఁ బుత్రుఁ బ్రసవింతు నొగిన్. 53

వ. అని కృతనిశ్చయుండై యథర్వణోదితమ్ములగు మంత్రమ్ముల నగ్ని నారాధించి

వ్రేల్చినఁ దత్కుండమ్మునందు పావకుండునుం బోని యొక్క జాజ్వల్యమానశరీరుండు సుతుండు పుట్టిన వానిం గాంచి త్వష్ట యిట్లను. 54

క. ఆవిర్భవింప నేమగుఁ, గేవలమింద్రుని బలమ్ము గీటడఁగింపం
గా వైరి వగుచు నిప్పుడ, వే వృద్ధింజెందు మన దివిజులు వడంకన్. 55

గీ. అంతలోఁ బర్వతాకారుఁడై యతండు, కాలమృత్యువునాఁ దండ్రిఁగాంచి పలుకు
నాదుపేరేమి ? యేకారణమున నన్ను, సృష్టిచేసితి ? నీకేల చింత చెపుమ. 56

## వృత్రాసురోత్పత్తి.

క. నీమదినిఁ గలుగుకోరిక, సామాన్యము గానిదేని సాధించెద, వాఁ
డేమిటికిఁ దండ్రికింగల, కామము నెఱవేర్పలేని కాపురుషుఁ డిలన్ ? 57

చ. సురలహరింతునో ? జమునిచొప్పడఁగింతునొ ? యింద్రుఁద్రుంతునో ?
వరుణు నడంతునో ? శశిదివాకరులన్ వధియింతునో ? ధరా
ధరముల ముక్కముక్కలుగ దంతునొ ? యీ జలరాసులన్ సము
ద్ధురగతిఁ ద్రావనెంతునొ ? సుతున్నను(బంపు మనంగ నాతఁడున్. 58

వ. కొమరున కిట్లను నీవు వృజినమ్ముకతన రక్షింప నుద్భవించుటం జేసి వృత్రుండవఁ బరఁగి త్రిశిరస్కుండును దపోనిష్ఠాగరిష్ఠుండును వేదవేదాంగతత్త్వజ్ఞుండును నగు నీయన్న ననపరాధు వధించిన బ్రహ్మఘ్ను నింద్రు వధియింపుమని చెప్పి. 59

గీ. తనయశోకాకులుం డయి త్వష్ట వివిధ, గతుల నాయుధములు చేసి యతులబలున
కాత్మజాతున కిచ్చి యింద్రాదిసురలఁ, బొరిగొనెడి పూన్కిమైఁ బంచెఁ ద్వరయెలర్ప.

వ. పదంపడి వృత్రుండు శుభదినమ్మున బ్రాహ్మణాశీరవపూర్వకంబుగఁ బితృదత్తంబగు రథం బధిష్ఠించి తద్దత్తమ్ములగు ఖడ్గశూలగదాతోమరపరిఘపట్టిసాద్యాయుధమ్ములును సహస్రారంబై సుదర్శనంబునుంబోని చక్రమ్మును దివ్యంబగు కవచమ్మును నక్షయతూణీరమ్ములను ధనుర్బాణమ్ములును ధరియించి మున్ను దేవతలచే ధిక్కృతులగు రక్కసులతోడుగా శక్రహననార్థమ్ముగా వెడలుటయు దూతలు వైశంబచని యింద్రునితో నిట్లనిరి. 61

గీ. పుత్రశోకాతురుఁడు త్వష్ట పుట్టఁజేసె, నినువధించుటకై వృత్రుఁ డనెడికొమరు
మేరుమందరతుల్యుఁ డమ్మేటి వచ్చె, బలియురగు రక్కసులు చుట్టు బలిసి కొలువ.

వ. ఆలోనన వృత్రసైన్యదర్శనమాత్రపలాయమానులై కొందఱు దేవత లచ్చటికి వచ్చి యిట్లనిరి. 63

క. దేవా! దేవపురమున, భావింపఁగరాక ప్రబలభయజనకంబై
యావిర్భవించె దుశ్శకు, నావళి దైవగతి కేమి యనఁదగు నకటా. 64

సీ. కాకగృధ్రమ్ములు కంకముల్ శ్యేనముల్ • "చీచికూచి" ధ్వనుల్ సేయఁ దొడఁగె
వాహనమ్ములు నీరు వర్షింపఁగాఁ జొచ్చె • నేత్రాంచలమ్ముల నిళలయందు
భవనమ్ములకుఁ బయిపై నుండి రాక్షసు • లఱవఁ జొచ్చిరి. వాతహతినెనయుక
ధ్వజములు పడఁజొచ్చెఁ దరుణులు గొందఱు • నీలవస్త్రమ్ముల నోలిఁ దాల్చి

గీ. వికృతిమెయి నిల్లిలుఁజరంతు. రకట స్వప్న
మందుఁ గాంతల రక్కసు లడఁచి కొప్పు
లీడ్చినట్లగు. భూకంప మెనయు. నక్క
లఱచు, సరటలు పుట్టు గృహమ్ములందు. 65

వ. అని దివిజులు పల్కిన విం(ద్రుండు భయాతురుండై బృహస్పతిం గని యిట్లనె. 66

క. ఇల మల్కాపాతమ్ములు, వొలుచు నభస్థలమునుండి బోరిఁబోరి వాతం
బులు దారుణగతిఁదగు నిఁకఁ, గలతెఱఁగుం దెలిసి శాంతి గావింపఁగదే. 67

వ. నావుడు గురుం డిట్లనియె. 68

గీ. నెట్టపంటఁగఁ జంపితి విరపరాధుఁ, డైన మునివర్యు నీకు నద్దాన నేమి
ఫలము సమకూరె! నిప్పు డప్పాపకర్మ, మేల నిమ్ముఁగట్టి కుడుపక తేలవిడుచు. 69

క. ఏపనినైనను దగఁ దా. నోపి విచారించి చేయు టొప్పగుఁ, గాదే
నాపదలకు మూలంబై, కాఁపురమగు వాపిత్రబుకు గష్టమ్ములకున్. 70

గీ. మోహలోభమ్ములం జేసి మొదల బ్రహ్మ. హత్య మెడఁగట్టికొంటి వేమందు నిన్ను
"ఫలము వైళమ కనుపట్టు నంఘపుణ్య, పాపముల" కను పెద్దల పలుకు వినవె?

క. అరయన్ విను పరపీడా. పరాయణుఁడు సౌఖ్యములను బడయఁడు నీకుం
బరిభూతికిఁ దలియయ్యెం. గరము నవధ్యుండు వాఁడఖండుఁడు బలిమిన్. 72

ఆ. వె. త్వష్ట యిచ్చె నాయుధములు వానికి నీదు. వజ్ర మొక్కదావి పాటిగాదు
వేయిమాట లేల ? వృత్రుండు మీపాటి. వాఁడు గాఁడు మేటి వానిపాటి. 73

క. దేవేంద్ర ప్రళయమ్మున, కై వచ్చుచునున్నవాఁ డహంకృతిమై నాఁ
గా విని మునులును యక్షులు, దేవతలును బరుగులిడిరి దిగు లెదఁగదురన్. 74

వ. సదనమ్ములన్ విడిచి పలాయనం బొనర్చు నమరులం గని యింద్రుండు చింతా
పరుండై సేవకుల కిట్లను. 75

క. పిలువుఁడు రుద్రులను దినక, రుల వసువుల ధనదయమవరుణులన్ "మీరల్
దలరక విమానములపై, నెలకొని సన్నద్ధులై యనికిరం" డనుచున్. 76

వ. ఇట్లు నియోగించి యతండు బృహస్పతి పురస్సరమ్ముగా గజారూఢుండై సంగ
రమ్మునకుం జనియె నంత దేవతలును దమతమ యాయుధమ్ములతోఁ బిఱుంద
చనిరి. 77

గీ. వృత్రుఁడును దానవులతోడ వేడ్క మెఱయ, నడుగుడెంచెను మానసోత్తరసమీప
మునకు నప్పర్వతమ్మున మొనసె రెండు, సేనలును వృత్రదానవుల్ చెలఁగియచట.

గీ. ఒకరొకరిఁ జంప నుంకించి యుత్కటముఁగ, బరిఘ పట్టిసకరవాలపాశబాణ
శక్తిముఖసాధనమ్ముల సంగరమ్ము, సలిపి రొకనూఱువత్సరమ్ము లోకరీతి. 79

వ. ఇట్లు మానుషప్రమాణమ్మున శతవత్సరమ్ములు సంగరం బభంగురమ్ముగాఁ బ్రవ
ర్తిల్లిన నది సర్వలోకభయంకరం బయ్యె నంత. 80

చ. వరుణుఁడు పాఱె నాపయిని వాయుగణంబు చలించె వెన్కకుం
దిరిగె జముండు పావకుఁడు దీప్తికిఁ దక్కెఁ గ్రమక్రమమ్ముగా
సురపతికిం బలాయనము చొప్పడె నందఱ నిట్లొనర్చి ని
ర్జరమథనుండు వృత్రుఁడు వెసం జని తండ్రికి మ్రొక్కి యిట్లనున్. 81

మ. వరుణుం దోలితి వాసవుం గెలిచితిన్ వంచించితిన్ వాయువున్
సరసీజాప్తు నడంచితిన్ జ్వలనుపై సంరంభముం జూపితిన్
సురలన్ రేఁపితి 'భీతమారణ' మటంచుం జంప విం దొక్కనిన్
హరిభీతిం బడు నేన్గులై రిపులుద్యద్భీతి నాధాటికిన్. 82

గీ. ఇంద్రుఁ డరిగెఁ బదాతియై యేన్గుఁ బట్టి, కానుకగఁ దెచ్చితిని దీనిఁ గనుము దేవ
యేమి యొనరింతు వివరించి యెఱుఁగఁజెపుము, దుష్కరంబేనిఁ జేయుదుఁ బొడరిదాని.

వ. అను కుమారునకుఁ ద్వష్ట సంతుష్టుండై యిట్లను. 84

గీ. కన్నవారలలోనఁ బొగడ్తకెక్కి, మానసజ్వరమును వీడి మనుటగల్గె
నీ పరాక్రమమహిమ వర్ణింపఁ దరమె, జీవితమ్ము ఫలించె సుస్థిరుఁడనైతి. 85

వ. ఇంక నీకుఁ గర్తవ్యంబు వినుము మెప్పటికినిఁ బాకశాసను విశ్వసింపఁ దగదు గావున

నతని దురుపాయమ్ములకుఁ దలరక చతురాననుం గుఱించి తపంబొనరించి యవ
ధ్యుండవై యింద్రు నడంపుము. 86

గీ. తపము యశమిచ్చు బలమిడుఁ దాపసదఁచు
లచ్చి నొడఁగూర్చు రాజ్యవిలాస మొసఁగుఁ
దప మిడని దొక్కటియులేదు దాని సలుపు
మయ్య! యవధానివై శత్రు నడఁపుమయ్య. 87

ఉ. కంటికి నిద్రరాదు సుతఘాతుకుఁడైన బలారిచేత నా
కంటికి బిడ్డ వీ వెకట కల్మష మించుకయేవి లేక మి
న్నంటుగతిఁగా మహాతపము నంది తనంత వసించు పుత్రకున్
గంటకుఁడై హరించె నిఁకఁ గల్గునె శాంతి కుమార నామదిన్. 88

వ. అను తండ్రి యానతిం గొని వృత్రుండు క్రోధావేశమ్మున గంధమాదనమ్మున కరిగి.

చ. అమరధునిన్ మునుంగుచుఁ గుశాసనమందు వసించి వారిపా
నము మొదలన్నియున్ విడిచిన్యాయగతిన్ బొలుపొంది యోగమం
దు మనము నుంచి యయ్యజునిఁ దోరపుశ్రద్ధమెయిం గుఱించి చే
పెముమలుమెచ్చఁగాఁదపముచిత్తమునన్ భయమందెనింద్రుఁడున్. 90

వ. అట్లు తనితపమ్మునకుఁ దలంకి దివిజేశ్వరుండు యక్షకిన్నరపన్నగ విద్యాధరసహిత
మ్ముగా నచ్చరలం బవిచిన వార లొనరించు విఘ్నకృతుల కతండు చలింపక సుస్థి
రుండై యుండె నంత వారలును నింద్రుకడ కరిగి యతండు మాకు వచించుపాటి
వాఁడుగాఁడని మిన్నకుండి రట్లు తప మొక్కనూఱువత్సరమ్ములొనర్చినఁ బితా
మహుండు హంసారూఢుండై యతనికిఁ బ్రత్యక్షమై యిట్లనియె. 91

ఉ. నీదు తపోవిశేషమున నెమ్మది నమ్మద మందెఁ ద్వష్టృదా
యాద! సుఖమ్ములం జెలఁగుమయ్య యిఁకఁగా దపముం ద్యజించి నీ
కేది యభీప్సితంబు తగ నిచ్చెదఁ గోరఁగదయ్య నా, నతం
డాదరమేదురత్వమటితాంజలియై రచితప్రణాముఁడై. 92

క. ఇంతకుఁ బూర్వమ ముదిత, స్వాంతుఁడనై దేవపదయు సాధించితినేఁ
డంతకు నెక్కుడుగాదే, చింతితఫలదంబు నీదుసేవ లభించెన్. 93

వ. ధర్మ్యండ నైతి నాకు వరంబు నొసంగ నిచ్చయేని లోహకాష్ఠశుష్కార్ద్రవంశ
విచయమ్ములచేతను నపరమ్ములగు శస్త్రమ్ములచేతను మృతి లేకుంటయు సంగర

మ్మున మద్వీర్యమ్ము నానాఁటికి వృద్ధినొందుటయు ననుగ్రహింపుము నావుడు
విరించి యట్లయగుఁ గాక యని తన భువనమ్మున కరిగె. వృత్రుండును సంత
సమ్మునఁ దనతండ్రికడ కరిగి కడచిన దెల్ల నుడివిన నతం డిట్లను. 94

గీ. భద్రమగుఁగాక నీకు విప్రాయుఁడవగుచు, నగ్రజాతుఁ ద్రిశీర్షుని ననపరాధు
నెట్టపంటఁగఁ జంపినయట్టి యింద్రు, బ్రహ్మఘాతుకు వధియించి ప్రబలు మయ్య.

గీ. బ్రతికియున్నప్పు మాటను బాటి చేసి, మృతిగనిన తద్దినమున విస్తృతముగఁగ
నన్నదానం బొసంగి పిండాదికంబు, గయ నొసఁగువాఁడు పుత్రుఁడు గాఁగలాఁడు.

క. కావున నాయానతిఁ గొని, వేవేగ వధింపుమీ దివిజవల్లభుఁ బా
పావహుఁడై నీయన్నన్, గేవల సుకృతప్రచారు గీటడగించెన్. 97

వ. ఇట్లానతిచ్చిన వృత్రుండు దుందుభిఘోషమ్ములు చెలంగ శంఖారావంబు లలర
మహాబలసంయుతుండై రథారూఢుండై బయలు వెడలి తనసైనికులఁ గని తప్పక
యింద్రుని వధించి సురరాజ్యంబు గైకొందునని పల్కుచు నమరావతిం దన సేనాని
వదనమ్ముల వదల్చుచుఁ జనునంతట నింద్రుండును నెఱింగి యుద్ధసన్నద్ధుండై లోక
పాలసహితమ్ముగా మొగిసి గృధ్రవ్యూహంబు పన్ని నిలిచె. 98

క. ఇరువురకుఁ బరస్పరవిజ, యరమాలోలురకు శస్త్రహతిగళదురర
క్తరుచిఖచితదేహాలకున్, బరమాద్భుతరీతి రణము వఱలె నృపాలా. 99

క. దివిజులు దైత్యులు రణపై, భవ మెల్లరు మెచ్చఁ బరశుపరిఘాదుల సు
తుక్కు వెలయఁగఁ గొట్టుకొని రొ, క్కవిధమ్మున నక్కజమ్ముగా జయకాంక్షన్.

## వృత్రుం డింద్రుని మ్రింగుట.

వ. ఇట్లు సంగరంబు జరుగునెడ వృత్రుండు క్రోధదీప్తుండై యింద్రుం బట్టుకొని
వక్త్రమ్మునం దిడికొనుటయు దేవతలు పరమార్తులై శక్రునికి వాక్రోశించుచు బృహ
స్పతికడ కేగి తద్విముక్త్యుపాయంబు వచింపుమని వేఁడుదు నతం డిట్లను. 101

క. ఏ నేమి, సేయఁగల! వ, వ్వావిముఖాంతర మను పెనుబంధనమున స
ప్రాణుండై యిప్పటికివి, దీనుండై యున్నవాఁడు దేవపతి దగన్. 102

వ. నావుడు సురలందఱును యోజించి జృంభికయను నొకశక్తిం బుట్టించిన నయ్యది
యవ్వావియం దావేశించి యావులింతం గలిగించె. 103

క. వివృతాస్యుఁ డయ్యె వృత్రుఁడు, దివిజపతియుఁ దత్క్షణంబ తెలి పఱుఁబడెం
గవిసి సురలెల్ల నానం, దవిభవమున మునిఁగి తేలి తనిసిరి మిగులన్. 104

వ. నాఁటంగోలె జృంభిక సర్వప్రాణిసంస్థితయై యిప్పటికిం జొప్పడెడిఁ బదంపడి వృత్రుం డొక్కఁ డొకకెలనను నింద్రాదులందఱు నొకవైపునను నిలిచి ఘోర యుద్ధంబొనర్పఁ బదివేలవత్సరమ్ములు గతించె. 105

క. వరమదగర్వితుఁడగు నా, సురవైరికి నోడి పాఱి సురపతి చింతా
భర మడర నుండె నంతట, నరుదెంచెన్ దివిజవైరి యమరావతికిన్. 106

గీ. వచ్చి ప్రాసాదములు నుపవనము లేన్గు, లచ్చరలుఁ గామధేనువు నది యిదియన
నేల స్వర్లోకమునఁగల యెల్లరత్న, సంచయము తాన కైకొని మించె నెలమి. 107

వ. వృత్రుం డిక్కరణి దేవపదం బేలుటకుఁ దండ్రి యానందించె సురలు స్థానభ్రష్టులై యజ్ఞభాగమ్ములు లేక తత్తద్గిరివరమ్ములపాలై యరిగి యచ్చటిమునీంద్రులతోఁ గర్జం బేమని యోజించి తదనుమతమ్మునఁ గైలాసమ్మున కేగి మహాదేవుం బ్రార్థించి ప్రసన్నుఁ డగునాతని కిట్లనిరి. 108

గీ. దేవనగరంబు రాక్షసదేశమయ్యె, నప్సరఃకాంత లాదిగ నఖిలమునకు
వృత్రుఁడధినేత యతనికి వెఱచి పీడు, శరణుఁ జొచ్చితి మిఁకఁ గృప సలుపు మీశ!

క. స్థానభ్రష్టులమై చిం, తావియతులమైనమమ్ము దరిఁ జేర్చి కృపా
ధీనమతిఁ బ్రోవవే యనఁ, గా నతఁ డిట్టు లను దివిజగణములతోడన్. 110

గీ. కంజజపురస్సరమ్ముగాఁ గదలి మనము, హరికడకుఁ బోద మాతఁ డెట్లైన వీనిఁ
జంపుఁ గపటప్రచారవిశారదుండు, కరుణ గలఁడు మహాత్ముఁ డఖండబలుఁడు. 111

వ. అని చెప్పి బయలువెడలిన నందఱును వైకుంఠమ్మున కరిగి యద్దేవుం బురుష సూక్తవిధానమ్మున యజించిన భక్తవత్సలుం డతండు ప్రత్యక్షమై వారలఁ దగు గతి మన్నించి యిట్లనియె. 112

క. ఏమిది! మీరలు శంకర, తామరసోద్భవులతోడఁ దరలి నముఁ గనన్
బ్రేమించి వచ్చితి రనన్, దామోదరుతోడఁ బలుకఁ దలఁపఁ డొకరుఁడున్. 113

వ. అట్లు చింతాదంతురులై ప్రత్యుత్తరం బొసంగనేరని సురలకు జగన్నాథుండు గరుణార్ద్రుండై యిట్లను. 114

గీ. చెప్పుఁడీ మీకు వచ్చినవేగి యెట్టి, దైన నద్దానికి నొనర్తు యత్నమనుడు
సురలు ముకుళితకరు లయి హరికి ననిరి, నీవ యెఱుఁగుదు వన్నియు దేవదేవ.

గీ. వామనాకారమున బలి బద్ధుఁజేసి, యింద్రుని సురాధిపతిఁ జేసి యెల్లలోక
ములను త్రిపదమ్ములుగఁ జేసి మున్నుమమ్ముఁ, గాచితివి దైత్యులెల్లపు కలఁకచెంద.

వ. తదపహృతంబగు నమృతమ్ము మరలం గొని సుఖవర్తనులమై నాఁటనుండి నాక
మ్మున నుంటి మనునంత విష్ణు విట్లను. 117

గీ. తెలిసికొంటివి మీదగుకలఁకతెఱఁగు, వాఁడు దెగునదుపాయంబు వంచనాది
కముల యోజించి మీకు హితము నొనర్తు. నెట్లయిన దుష్టుల హరింపుటే మతంబు.

వ. యోగ్యులయెడలనైన సామాద్యుపాయమ్ములు ప్రయోజ్యంబు లగుచుండ నయోగ్యు
లకు నివి యనర్హంబు లెట్లగు ? నీవృత్రుఁడు బ్రహ్మదత్త వరదర్పితుండగు కతన
సర్వభూతావధ్యుండై నిరంకుశమ్ముగ వర్తించుచున్నవాఁడు. 119

క. సామోపాయమ్మున మన, మీ మానవభక్షకుని జయింపవలయు లే
దా, మనకీతఁ డవధ్యుఁడు. సామాన్యుఁడె వృత్రుఁడన నసాధ్యుఁడుకాఁడే. 120

వ. కావున నెట్లైన నితనితోఁ గపటమైత్రి నొనర్చి విశ్వాస్యమ్ములగు శపథమ్ములం
జేసికొని పిదపఁ బరిమార్పవలయును. 121

గీ. చనుఁడు గంధర్వులార వంచన యెఱర్పు. నాతనికి నింద్రునకు మైత్రి యలవరింపుఁ
డేను బవిమధ్యమునుండి యేరికిని న, గోచరుఁడ నయి సాహాయ్య మాచరింతు.

క. ఏకపటం బొనరించిన, నాకుటిలుఁడు మైత్రి కొప్పు నయ్యది మీరల్
గైకొనుఁడు కపటకృత్యము, కాక కుటిలహరణమునకు గతి వేఱున్నే. 123

వ. మీర లెవ్విధమ్మననైనఁ బాపమనక విశ్వాస్యం గావించునది పిమ్మట మతిసాహాయ్య
మ్మున శత్రుఁ డద్దురాత్ముఁ వధియించుఁ బాపాత్ములయెడ నధర్మవర్తనంబుకతన
దోషంబుగలుగ దని చెప్పి మఱియును, 124

ఉ. వామనరూపమంది బలి వంచనచేసితి దైత్యులన్ వృథా
కాముల మోహినీత్వమునగాదె ప్రతారితులంఁ బొనర్చితిన్
నేమముగా వధింప నగునే ? రిపు దుస్సహతేజు బుద్ధిని
ద్యామహిమమ్మునన్ దగినయట్టియుపాయము పూనకుండినన్. 125

వ. ఇది యిట్లుండ సర్వకామప్రదాత్రియగు జగజ్జననిం బ్రార్థించిన నాపె యోగమాయా
స్వరూపమ్మున సాహాయ్యకం బాచరించుఁ దన్మాయాబద్ధుండై వృత్రుండింద్రునకు
వధ్యుండగునని పెండియు, 126

ఆ. వె. ఆపెకరుణగల్గ నఖిలకామమ్ములు, సిద్ధిచెందు నెరుసు చేసెనేవిఁ
గలుగదేరికేనిఁ గార్యసాఫల్యంబు, గొలువుఁ డంబికను నకుంఠభక్తి. 127

క. మును మధుకైటభవధ క, జ్జనని నుతియించి యాకె సాహాయ్యమ్ముం
గొని గాదె వధించితి మీ, రును నయ్యంబన్ భజించి త్రుంపుఁడు వృత్రున్. 128

వ. అని విష్ణువు బోధింప సుర లందఱును మందారద్రుమమండితమ్మగు మేరునగ
మ్మున కరిగి ధ్యానపరాయణులై యయ్యంబ నిటు సన్నుతించిరి. 129

గీ. దేవి! వృత్రునిబాధచే దీనులైన, దేవతలఁ బ్రోవఁగదవమ్మ దిక్కులేక
నీకు శరణంటిమమ్మ మన్నింపుమమ్మ, పుత్రుల ననాదరించుట పోలునమ్మ! 130

గీ. నీదు భ్రూభంగవశమున నిలిచి హరియు
హరుఁడును విరించియును గృతులాచరింత్రు
నిన్ను మించిన దైవ మెందేనిఁ గలదె
శరణమొందిన దివిజుల నరయుమమ్మ. 131

ఉ. "ఇమ్ముగ మత్పదమ్ము భజియించి మహావిభవమ్మునొంది దా
న మ్మద మెక్కి నాదుభజనమ్ము త్యజించినమీరు మత్కటా
క్షమ్మున కెట్లు పాత్రు" లనఁగాఁ దగదమ్మ త్వదీయమాయయే
మ మ్మిటుచేసె, లేకునికి మత్తత మా కెటు లబ్బు శాంకరీ! 132

క. మము బాధించుచు మున్ను గ్ర, మము దప్పి చరించునట్టి మహిషాసురునిన్
జముబారి కనిచి యేలితి, వి మహేశ్వరి! యెంతనీకు వృత్రుం డనినన్. 133

క. శుంభున దదనుజుఁడైన ని, శుంభున్ దదనుచరులన్ విసువ కవలీలన్
గాంభీర్య మెసఁగఁ జంపవె, శాంభవి! వృత్రుండు నీ కసాధ్యుండగునే. 134

ఆ.వె. అంబ! నీ వనాదరం బొనర్చితివేని, దైత్యకతన దీనదశకు వచ్చి
నట్టి సురలఁ గరుణ నరసి స్వశక్తిచేఁ, గాచువాఁడొకండు గలఁడె యెందు? 135

ఆ.వె. కరుణ యగ్గలమ్ముగా వృత్రునందు నీ, కలరుఁగాక, దుష్టుఁడైనకతన
శత్రుహతులఁ జేసి జనని! పవిత్రత, గూర్పఁబొంచె నీవిఁ గూల్పుమమ్మ. 136

గీ. వెనుక రణరంగమున నీదు విశిఖపాత, ములమ జెందియు వృత్రుని బలముకలిమి
దైత్యు లమరవనంబు మద్దవిడిఁ గొనిరి, నీదుభయ మేని వారు మన్నింపరొక్కొ.

క. వృత్రుఁడు నీకును మిగులన్, శత్రుఁడ భక్తుండయేని జనని, త్రిజగతీ
నేత్రి! మము నీదుభక్తికిఁ, బాత్రుల నిప్పాట బాధపాల్సేయుదొకో. 138

కి. నిను( బూజింప( గలేదని, యనుకొనకుము పూజ సేయు నఖిలము నీచే
తనకాదె యుద్భవించుట, ప్రణతుల మహేశ్వరమ్మ భవభయహంత్రీ! 139

క. వారలు వస్త్వలు విను మె, వ్వారు ధియాంభోధిపోతపై ఖరి( దగి యు
న్యారాధితమగు తత్త్వర, నీరేజాతమ్ము గొల్చి నెగడుదురౌ వెసన్. 140

గీ. యాజ్ఞికులు వేదవిదులు స్వాహాస్వధాస్వ, రూపములనొప్పు నిన్నెంత్రు హవిషమ్ములు
హోమకాలమ్ములందు నీయోగమునను, సురలు( బితరులు ముక్తిని బొరయు రెదియ(గి.

ఆ.వె. తల్లి మేధ నీవ దయ నీవ శాంతివి, నీవ కాంతి నీవ నిఖిల మీవ
సకల మీవొనర్చ సద్భక్తులకు నను, గ్రహముకల్మి నీ(గ( గద(గుచుందు. 142

చ. అని సురలెల్ల( దన్ను( గొనియాడకు మెచ్చి విభూషితాంగియున్
ద్రిణయనయున్ జతుర్భుజయు దివ్యతరాయుధయుఖా సురక్త చం
దనవసనాఢ్యయున్ గుసుమదామసమంచితయుఖా బ్రసాదశో
భినియునునై పరాంబ మృదుభాషిణి దా( బొడకట్టె వారికిన్. 143

గీ. సర్వవేదాంతరూప యజ్ఞనని ప్రణతు, లైనసురలకు నిట్లను నమరులార
యేమి కార్యమ్ముగల్గె మీ కెల్లరకును, సుఖముకద వచ్చుటేమి నం జూపపొందె! 

వ. నావుడు దేవత లిట్లనిరి. 145

శా. అంబా! వృత్రునిబాధ కోర్వ(దర మౌనా! వాని నెత్తైన వే
గం బాలోకము చేర్చి మమ్ము సుఖులం గావింపు మేరీతి శం
కం బాటి(పక విశ్వసించి హితులంగా( జూచి మాతోడ మై
త్రిం బూనుఖా సురవైరి యట్టివిధ మేదేనొండు గల్పించుమా. 146

క. ఏబలమున వృత్రు(డు మా, చే(బడు( దత్త్వాదృశంపు( జేవ గొలిపి బల్
ప్రాబల్య మాయుధములకు, రా( బాటింప(దగదే యరాతివిహంత్రీ. 147

వ. అనవుడు జగదంబ యంగీకరించి యంతర్ధానంబు నందె సురలును సంతుష్టాంత
రంగులై ఋషిసహితమ్ముగా నరిగి త్రిలోకమ్ముల నదలించువడువున( దమ్ము
నందర మ్రింగుభంగి( దీక్ష్ణతేజమ్మునం బొల్చు వృత్రుం గని సామర్థ్యంబు మునుల
నతనియెడకుం బనిచిన( జని వారలిట్లనిరి. 148

## మునులు వృత్రవాసవులకు మైత్రిగొలుపుట.

ఉ. వృత్ర! త్రిలోకభీతికరవిక్రమ! శక్రముఖామరావళీ
జైత్ర! యజాండమెల్లను వశంబయి యొప్పెనునీకు, యోగ్యతా

పాత్రుఁడ వీవు శక్రుఁడును బండితమాన్యచరిత్రుఁ డిర్వురికా
మైత్రి నెసంగినన్ భయము మాకు జగమ్ముల, కింత యొప్పదే। 149
ఆ వె. వీకు నిదుర లేదు విర్జరపతిభీతిఁ, జేసి, నీదుభీతిఁ జేసి యింద్రు
నకు సుఖమ్ములే, దనారతమును మీదు, సంగరమ్ము లోకసంకటంబు 150
సీ. యుద్ధమొనర్చెడి యోధుల కింతయు • సుఖము గల్గదు దీని శూరవరులు
మెచ్చికొందురు గాని మేటిగ శృంగార • భావజ్ఞులగు మహాపండితులు ర
ణమ్మునఁ బెక్కుదోషమ్ములు నొడువుదు • రాయాన మవసరమందు పాన
పానముల్లే మియు భార్యాసుఖవియుక్తి • యింద్రియార్థగ్లాని యిది యిటుండ
గీ. జయము దైవానుకూలత జరుగుఁ బూల • చెండ్లతోనైన యుద్ధంబు చేటునకగు
ననిన శితశరములబాధ లడుగవలెనె • సంసృతిసుఖాపహరణంబు సంగరంబు. 151
చ. అనిమొనఁ జచ్చువారలకు నబ్బుఁ దుదిన్ ద్రిదివం బటంద్రు శ
స్త్రనిహతి నొచ్చి నేలఁబడి తాపముచెందుచు నక్క లంగముం
దినఁ గనువారు లేక కడుదీనతఁ జచ్చినమీఁద స్వర్గ మొ
క్కనికిఁ బ్రియంబె? ప్రేరణకుఁ గా కిది నిక్కపు ధర్మవాక్యమే। 152
ఆ. వె. వీకు నింద్రుతోడ నీతోడ నింద్రున, కెలమి సఖ్య మింక నెసఁగుఁగాక
దాన మీకు సుఖ మొదవు యక్షగంధర్వ, కిన్నరాదులకును గీడు దొలఁగు. 153
చ. శపథములం బొనర్చి దివిజప్రభుఁ డిప్పుడ నీదుచెల్మి వి
ష్కపటముగా నొనర్చు నటు లైకొను మీవును; మధ్యవర్తులై
తపసులు గూర్చువారఁట ప్రతారణ మిం దొదఁగూడు టెట్లు న
త్యపరతఁజేసి కాదె జగమంతయు నిల్చుట యెన్నిభంగులన్. 154
చ. ధరణి ధరించు నత్తరణి దాఁ దపియించు సుఖప్రచారియై
కరువలి వీచు నంద్రములు కట్టునకుం జవదాఁట కుండు స
త్యరతిన కాదె మీరలు యథార్థ పరత్వము నంది మైత్రి వి
ర్వురును సుఖమ్ములం గొనఁగఁ బోలదె మౌను లసత్యవాదులే. 155
వ. కావున మీరలు బద్ధసఖ్యులరై శయనాసన క్రీడాదికమ్ముల నొక్కెడన సలుపుచు
వర్తించునది నావుడు వృత్రుండు మునులం గాంచి మీర లవశ్యమును నాకు మాన
నీయుల రెల్లభంగులను మీమాట పాటింపందగు నైనను శత్రువువందును శఠుని
యందును గాముకునందును విర్లజ్జునందును విశ్వసింపఁ దగదు గాన నింద్రుండు

పాపాత్ముండును బ్రహ్మఘ్నుండును నగుట నాకవిశ్వాస్యుండు నావుడు మునులు మరల నిట్లనిరి. 156

గీ. ఎవఁ డొనర్చిన ద్రోహంబు నెవఁడు గుడుచు
బ్రహ్మహత్యయుఁ గలుద్రావుపాతకంబు
నిష్కృతిం బోవ నేర్చు, నెందేని మిత్ర
ఘాతుకుని పాతకమునకుఁ గండె శాస్తి! 157

వ. అట్లగుట మిత్రద్రోహంబొనర్చి యతఁ డెందుఁబోయెడి? నీ యభిమతంబగు శపథమ్మున కతండియ్యకొను, నయ్యది మా కెఱిఁగించి యింద్రునకు మైత్రినొసంగుము నావుడు వృత్రుం డిట్లను. 158

గీ. ఆర్ద్రమున శుష్కమునఁగాని యశ్మమునను
గాని దారువుచేఁగాని కఠినవజ్ర
నిహతిచేఁగాని పగటఁగాని నిశిఁగాని
నను సురలుఁ దత్పతియుఁ జంపఁజనదు నిమరు. 159

వ. ఇందులకు సమ్మతం బేని మీ చెప్పినచొప్పున నొనర్తు నను మునులు సురపతి కాచందం బెఱింగించిన నతండు వల్లె యని యతనికడకు వచ్చి. 160

గీ. అగ్నిసాక్షిగ మునులెల్ల నరయుచుండ, నొప్పితివి పీడపల్కుల కుభయులము మిత్రులమటంచుఁ బల్కు నావృత్రుఁ డతని, మాటలకు విశ్వసించుచు మైత్రిగొలిపె.

క. వారలు మిత్రు లనందగు, వారలు సహచర్య నలపువార లదధిరా
ద్రిరమ్మున నందనమునఁ, గూరిమిఁజరియింతు రిచ్చ గొలిపినయెడలన్. 162

వ. ఇట్లిరువురకు మైత్రి గలుగుటకు వృత్రుండు సంతసించె నింద్రుండు తద్వధోపాయమ్ము చింతించుచు రంధ్రాన్వేషణతత్పరుండై యుండె నిప్పాటఁ గొంతకాలమ్ము గతించె. 163

గీ. తన కుమారుండు వృత్రుండు దనుజవైరి, యైన యింద్రునితో మైత్రి నాచరించె ననుచుఁ ద్వష్టృప్రజాపతి వినికితన, వృత్రుకడ కేగుదెంచె నివ్వెఱఁగు గదుర.

వ. వచ్చి మంతనమ్మునఁ గొడుకున కిట్లనియె. 165

చ. అరి పరదారలంపటుఁ డహంకృతిశాలి పరప్రతారకుం
డరయుచునుండు రంధ్రముల నన్యులపేగికి సంతసించు దు

ర్భరమగు మాతృగర్భమును భంగము సేయఁడె లోనఁజొచ్చి నీ
విరహితుఁ బాకశాసను మదిం గన కేమని విశ్వసించెదో. 166

గీ. అందఱును మనయట్టిరే యనఁగరాదు. విశ్వసింతురె వైరుల వెఱ్ఱులైన
నంచు దొరకినయేని విశ్వాసఘాతు. కుం డితఁ డధర్మవర్తి గాకుండు నెట్లు? 167

వ. ఇట్లు నానావిధముల బోధించిన నాసన్నమరణుండగు కతన వృత్తుఁ డప్పలుకులు
చెవిఁబెట్టఁ డంత నొకనాఁడు సముద్రతీరమ్మున విరువురుం జరించుచుండ సంధ్యా
కాలమ్ము సంప్రాప్తం బగుడు నియ్యది రాత్రిగాని పగలుగాని కాకుంట నిప్పుడ
వధించుట మేలు. నదియునుంగాక యేకాకియై యున్నవాఁడని యెంచి యింద్రుండు
హరిం దలంచిన. 168

## వృత్తుండు చచ్చుట.

గీ. అరుగుదెంచి యగోచరుఁడై పవిం బ్ర. విష్టుఁడై యుండె, నంత దివిజపతియుఁ ద
నమది నేలీల వీని వినాశమంచుఁ, జింతగొనువాఁడు ఫేనమ్ముఁ జెంతఁ గాంచె. 169

వ. సముద్రమ్మునఁ బర్వతోపమమ్ముగాఁ బెచ్చుపెరుఁగు నురుఁగుం జూచి యిది శుష్క
మ్మను నార్ద్రమ్మునుం దక్కంగల శస్త్రమ్ములును గానేరదని నిశ్చయించి దేవిం
దలంచుకొని యద్దానిం గ్రహించునాలో నాపెయుఁ దనయంశమ్మందు నిమిడ్చె. 170

క. హరిసంయుత మగువజ్రము, హరిహయుఁడు నురువునఁ బొదివి యసురపయి మహో
ద్ధురగతిఁ బఱపిన వృత్రుఁడు, గిరినాఁ బడె దాని హతికిఁ గీటడఁగి నృపా. 171

వ. ఇట్లింద్రుండు విగతశత్రుండై మునులు సన్నుతింప నమరావతి కరిగి శోకహారిణి
యగు నజ్జగదంబ కుత్సవం బొనరించి పూజించి దేవోద్యానమ్మున నొకప్రాసా
దమ్ము నవరత్నకుట్టిమంబుగ నొనర్చి పద్మరాగమయమ్మగు దేవీ విగ్రహంబు
నిర్మించి యందుం బ్రతిష్ఠించె. 172

క. అలరెడువేడుక నదియు మొ. దలుగఁ ద్రికాలములయందుఁ దద్దయుఁబేర్మిన్
గొలుతురు సుర లాయంబన్, గులదైవతముగ నొనర్చి కువలయనాథా. 173

క. "అరి యగు వృత్రాసురునిన్, హరియించెఁగా బవిని డాఁగి హరి" యని హరి యా
హరిఁ బూజచేసె నానం, దరసాబ్ధి మునుంగు వేల్పుతండమ్ములతోన్. 174

గీ. దేవియును హరియును హరి తివిరి ముగురు, వృత్రు నడఁచిరి శ్రీదేవి వృత్రహంత్రి
యయ్యె నక్కారణమ్మున; నమరపతి ప్ర, థానుఁడగుఁగానఁ గీర్తి యతనికి వచ్చె.

వ. పదంపడి విష్ణుండు దనపురమ్మున కరిగె నింద్రుండును మిత్రద్రోహభయమ్మున దండడిఁ గొనుచు నొకభంగి నుండ మును లీద్రోహంబు తమకతనఁ గలుగుటం జేసి పాపభయత్రస్తులై. 176

గీ. అకట విశ్వాసఘాతుకుండైన యింద్రు, సంగతిం జేసి మనము విశ్వాసఘాతుకులమ మునిశబ్దమునకుఁ బంకిలత గలిగె, హరియుమనయట్టిఁడాయెనేమనఁగవచ్చు.

వ. మంత్రకృత్తును బుద్ధిదాతయుఁ బ్రేరకుండును బశకర్తయు నను వీరలు పాపకారులతో సమఫలభాక్కులని చెప్పంబడుదురు. 178

గీ. ఆలరు నాల్గు పదార్థమ్ము లందు నాది, యంతము నశించి నడిమిరెండలరుచుండె ధర్మమనుమాట కేవలదంభ మకట, యెంతమహనీయులందేవి యింత నిజము.

గీ. హరి హరినిఁగూడి పాపకృత్యంబటంచుఁ
దలర కీద్రోహ మొనరింపఁదగునె యెఱిఁగి
వంచనఘటించు టేరికి మంచిపనియె
యరయ రవివేకము స్వార్థ మరయువారు. 180

వ. ఇట్లుపశ్చాత్తప్తులై మునులు తమతమ యాశ్రమమ్ముల కరిగిరి. పిదప వృత్రుని మృతికిఁ ద్వష్ట శోకించి యతని కుత్తరక్రియలు నిర్వర్తించి "సురపతి వంచనం జేసి మత్పుత్రకు హరించెఁ గావున దుఃఖమొందెడి" నని శపియించి మేరుశిఖరమ్మునకుఁ దపమ్మున కరిగె నావుడు జనమేజయుం డిట్లనియె. 181

క. తాతా! యింద్రుం డీగతిఁ, బాతకకృత్యం బొనర్చి ప్రబలెనొ దుఃఖావీతుఁడయి వన్నె దఱిఁగెనొ, చేతము రంజిల్ల నాకుఁ జెప్పంగదవే. 182

వ. నావుడు వ్యాసుం డిట్లనియె. 183

గీ. చెప్పనేటికిఁ దా నెంత శ్రేష్ఠుఁడైనఁ, గృతశుభాశుభకర్మముల్ గెంటఁగలఁడె కొంచెమో గొప్పయో తాము గొలుపుకర్మ, మనుభవింతురు మనుజులు నమరవరులు.

గీ. శక్రునకు నిట్టి దుర్బుద్ధి సంతరించి, హరి సహాయము చేసె మున్నార్తివేళఁ దా నెచటి కేగె సమయమ్ము దవులనపుడు, స్వజను లందఱు సంసారవరణి యిదియ.

ఉ. దైవబలమ్ము లేనితఱిఁ దల్లియుఁ దండ్రియు భార్యయున్ సుతుల్
సేవకులున్ సహోదరులు స్నేహితు లొడ్లు వొకించుకేని సం
భావనచేయ రాఫలము పాల్పడుఁ గర్తకు, వృత్రుఁ జంపి య
ద్దేవవిభుం డొకండ తనతేజము గోల్పడె నెన్నిభంగులన్. 186

వ. తక్కుంగల దేవత లందఱును నింద్రునిఁ గృతఘ్నుం డని గేలిచేసి నిందింపం జొచ్చిరి. 187

మ. ప్రకటనంజేసి యథార్థతత్పరత విశ్వాసమ్ము గైకొన్న వ్వే
హితునెవ్వాఁడువధించు నింద్రుఁడిటుదుష్కృత్యమ్ముచేసెన్ బ్రమా
ణత వేదమ్ముల నుజ్జగించి మునులన్ దౌదవ్యులఁగా డించి సౌ
గత సిద్ధాంతము పూనునే, తనకువేడ్కల్ సేయునే యాకృతుల్. 188

ఆ.వె. హరికిఁదక్క నొక్కహరిహయునికిఁదక్క, గపటకృత్య మిట్లు గడలుకొల్పి మిత్రుఁ జంపఁ గల్గు మేటి జగమ్ములఁ, గానరాఁడటంచుఁ గథలు బలిసె. 189

క. నరపాల! దేనికతమున, నసులునుఁ దనుఁ గాంచి నగుదు రట్టి యపయశ స్స్ఫురణం బింద్రుని మానము, హరియించె నపయశ మెంతకైనం జాలున్. 190

సీ. కీర్తిక్షయమ్మునఁ గెరలి యింద్రద్యుమ్నుఁ • డఘు మెఱుఁగకయును నాక మెడలె
స్వల్పాపరాధి యయాతియుఁ బతితుఁడై • కర్కటత్వమ్మును గాంచెఁ బదియు
నెనిమిదియుగములు; భృగుపత్నితలఁ ద్రెళ్ళ • నేసిన హరియుఁ బెంపేది తుచ్ఛ
యోనులఁ బడె మఱియును వామనుం డయి • తిరిపమెత్తుకొనె నెందేని యొందు

గీ. కలదె యింతకుఁ గష్ట మక్కట! దశరథ
రాముఁడై భార్యపీడ దుఃఖామయమునఁ
గ్రుంగెఁ వృత్రాసురునిఁ బొరిగొనినకతన
నింద్రుఁడును బ్రహ్మహత్యఁ బెంపేదె నిపుడు. 191

వ. అట్లు తేజోహీనుండై కొలు వుండక యేకాంతమ్మునఁ జింతించు తనపతికిఁ బౌలోమి యిట్లను. 192

గీ. రిపునిఁ బ్రబలుని వృత్రు హరించి తింక
వంత గొననేల? సుఖములఁ బడయకున్న
కారణం బేమి? మఱియు నొక్కరుఁడు రిపుఁడు
ప్రబలుఁ డెందును లేఁడుగా, భయము గొనఁగ! 193

గీ. అనుడు శచి కిట్టులను హరి వనజనయన, శత్రుఁడును లేఁడు సుఖమును శాంతిలేదు బ్రహ్మహత్యాభయమ్మున బడలుచుంటి, నిట్టి నా కింక విశ్రాంతి యెట్లు గలుగు. 194

వ. అని వెండియు. 195

గీ. నందనవనమ్ము సురయు గంధర్వగాన, మప్సరఃస్నృత్యములు నీవు నన్యయువతి
చేష్టలను గామధేనువు శ్రీ నెసంగు, కల్పవృక్షమ్ము నాకు సుఖమ్ము నిడవు. 196

వ. అని చింతావిష్టుండై మానససరోవరమ్మున కరిగి భయంబు పెంపునఁ బద్మనాళమ్ముం బ్రవేశించి ప్రచ్ఛన్నుండై పరాభూతుండగుకతన నేరికిం గనుపడక నీటిపాము చందమ్మున నజ్ఞాతమ్మునఁ జరించుచుండె సురలును దమపతిం గానక శోకకర్శితులైరి మఱియును. 197

గీ. జగ మరాజక మయ్యె వర్షములు దక్కెఁ, బాఁడిపంటలు నశియించెఁ బ్రబలమైన
నదులు కృశియించె వృక్షములు నవక మెడలె, రాజు లేకున్న నొక్కటి రాణ గనునె.

వ. అంత మునులును సురలును యోజించి నహుషునిఁ దమకుఁ బతిగా నొనర్చికొని సుఖమ్ముండిరి. 199

## నహుషుండు స్వర్గమ్ము నేలుట.

గీ. ధర్మమతియయ్యు నహుషుఁ డత్తఱిని రాజ్య, మత్తుఁడై యచ్చరలఁ గూడి చిత్తజాత
కేళులం దేలి సౌఖ్యముఁ గింవదంతి, గా వినియె నింద్రుభార్య చక్కందనంబు.

వ. విని తద్గతహృదయుండై యొక్కెడ ఋషులం గాంచి యిట్లను. 201

గీ. దేవపతి నైతిఁ గద యేను దివిరి నాదు, సేవ కింద్రాణి రాదేల? చెప్పుఁడ సుర
వరుల నంపించి పిల్పింప వలయు నిపుడ, హితము నా కిచ్చగింతురయేని మీరు.

వ. అనవుడు దేవర్షులును దేవతలును జింతాక్రాంతులై శచికడకుం జని వినమ్రులై యిట్లనిరి. 203

క. వినుమమ్మ నహుషు నమరుల, కినుఁగా నొవరించికొంటి మే, మాతఁడు నిన్
దనమనమునఁ గామించెన్, "గోరి రం" దనె నెదురుచెప్పఁ గోపించు నిఁకన్.

వ. నావుడు శచి చింతించి బృహస్పతిం గాంచి "మహాత్మా నహుషునికతన భయంపడి నిన్ను శరణంబు సొచ్చితిఁ గాపాడు" మనవుడు నతం డభయం బొసంగి యిట్లనియె.

ఉ. కేవలకామమోహితుఁ డకించనుఁ డున్మదుఁ డట్టివానికై
దేవి! మహాపతివ్రత నధీనగ ని న్నొనరింతునే? భయం
బీవు త్యజింపు మన్నిటికి నేఁ గలుగన్ నహుషుండు దుష్టుఁ డిం
కేవిధి నిన్నుఁ బొందు? మన మెక్కెడె రాజ్యముకల్మి వానికిన్. 206

వ. పదంపడి యింద్రాణి బృహస్పతి శరణంబు చెందె నని విని నహుషుండు కోపించి సురలంగాంచి, 207

క. సురలార చంపవలె న, గ్గురునిన్ దుష్టాత్మ నాదుకోరికయు వృథా
గ రచించునె ? నావుడు ముని, వరులు సురలు గలిసి యిట్లుపలికిరి కడఁకన్. 208

క. కోపము విడువుము దేవా!, పాపమునన్ బుద్ధిచొనుపఁ బాడియె ? వినలే
దా ? పరదారాగమనం, బాపవలకుఁదా వధర్మ్య మనియును శ్రుతులన్. 209

ఆ. వె. శక్రపత్ని మిగుల సాధ్వి మహాభాగ, తనదుభర్త జీవితగతినుండ
నిన్నుఁ బొందు టెట్లు నీవు త్రిలోకవి, భుండ వయ్యు ధర్మము విడఁ దగునె.

గీ. రాజు ధర్మమ్ము విడిచినఁ బ్రజల ధర్మ, వర్తనలు గారె శాస్త్రముల్ వమ్ము గావె
శచికిఁ దలదాఁటఁగల్గిన చక్కఁదనము, గల్గువేశ్యలు లేరె నీకామమునకు. 211

క. రతి శృంగారమ్మునకున్, గతి రతియన భోగకాంక్ష కాంతకుఁ బతికిన్
మతిగల్గిన రసము బలా, త్కృతియైన విరసము దాని నెనయరు రసికుల్. 212

గీ. ఉత్తమపదంబు గైకొనియున్న నీకు, బాపములకెల్లయగు లాఁతిపడఁతిపొందు
తగద యాయుఃక్షయం బగుదానికతన, గలుగు నధమాధమమ్ముగుగతి నరేంద్ర.

ఉ. నా, నహుషుండువల్కెఁ బరనారులఁ బొందఁగ రాదె ! గౌతమ
స్త్రీ నెటుపొందె నింద్రుఁడు ? హరించెఁ గదా, గురుభార్యఁ జంద్రు ! డ
ప్డీవియమమ్మలం బలుకు నెల్లరు మీరెటఁబోతి ? రొద్దకుఁజా
దా నెటుపల్కె నప్పగిదిఁ దానయిచేయఁగఁ జాలఁడొక్కఁడుఁజా. 214

క. మతినొప్పకయున్నబలా, త్కృతినైనం దెందు పొందు దేవపతిసతిన్
బ్రతిచెప్పకుఁ డిట్లయినన్, హితమగు నిరువురకు సుఖములెసఁగుఁ గ్రమమునఁజా.

వ. ఇట్లు మదనాతురుండగు నన్నహుషునికి మాఱాడ నోడి మంచి దని వారలు బృహస్పతిపాలికిం జని కృతాంజలులై యిట్లనిరి. 216

క. అనఘ ! నిను శరణుఁ జెందిన, దని యెఱుఁగుదుమైన నీపె నాతనికడకున్
గొనిపోవలె నింద్రునిఁగా, నొనరించి తదాజ్ఞదాఁటుటొప్పునె మనకుఁజా. 217

ఆ. వె. ఇంద్రుఁడైన యతని కెల్లరయట్ల యి, త్తరుణి ధవముకానఁ దనకుఁదాన
యగుచు వలచెనేని యది సరసంబగు, నట్లొనర్పఁజేయుమయ్య నీవు. 218

ఆ. వె. అనుడు గురుఁడు పల్కె నతిపతివ్రత నన్ను, శరణుఁజెందె నిట్టి సతిని విడిచి.
పాపమంద నాకుఁ బాడియె శరణాగ, తుల విడుచుటకన్న దోసమున్నె ? 219

క. అనవుడు దేవత లిట్లని, రనఘా! యేదేని నొక యుపాయమ్మున నా
తనికోప మడఁపఁగావలె, నన గురుఁడిట్లనియె దేవతాపఙ్క్తితోడన్. 220

వ. అట్లేని యామె యతనిసన్నిధికి వచ్చి యొక సమయం బొసఁగు, "నాపతి మృతుం డయ్యెనని తెలిసిన యపుడ నిన్ను వరింపగల దాన నట్లు కానినాడు జీవద్భర్తృక నగు నే నిన్నెట్లు వరింతుఁ గావున మత్పతి నన్వేషింపఁ బొంచె జనియెద" నని యాగతి నతని వంచించి నా యనుమతి నింద్రాన్వేషణమునకుం గడఁగు నసుడు బృహస్పతిపురోగములై దేవతలందరు నహుషునికడ కరిగిన నా కృత్రిమ వాసవుండు వారింగని సంతసించుచు శచి నుద్దేశించి యిట్లనియె. 221

క. తక్కు సురలెల్ల నన్నున్, మక్కువ నాథునిఁగఁ జూచి మన్నింతురు నీ
విక్కృతికి సమ్మతించిన, నిక్కపు వాసవుఁడ నగుదు నీరజనయనా. 222

ఉ. నావుడుఁ గంప మంది లలనామణి యిట్లని పల్కె నార్తియై
"దేవ, సురేంద్ర! మత్పతిగతిం గనరామిఁ గృశించి యుంటి స
ద్భావ మభావముం దెలియవచ్చెడిదక్కను దాళుమయ్య నా
కీవర మి"మ్మనంగ నతఁ డియ్యకొనెన్ విడిచెన్ శచీపతిన్. 223

వ. ఇట్లతనిచే విడువం బడి యామె సురలం గాంచి యిట్లను మీరందఱును మదాజ్ఞం జేసి ప్రయత్నపూర్వకమ్ముగ నింద్రునిగతి నన్వేషింపుఁ డనవుడు వారలందఱు నొక్కెడఁ గూడి యోజించి విష్ణులోకమ్మునకుం జని యతని సన్నుతించి యిట్లనిరి.

ఆ. వె. దేవ! బ్రహ్మహత్యఁ దేజమ్మునకుఁ జెడి, యెల్లభూతములకదృశ్యుఁడగుచు
వేదనో యడంగె నింద్రుఁ డాతనికి మా. కును మహాత్మ! గతివగుము కడంగి.

క. నీ యానతిఁగొని మాయో, పాయమ్మున వృత్రుఁ జంపి బ్రహ్మఘ్నుండై
యేయెడ డాఁగెనొ సురపతి, పాయక కనఁజేసి మమ్ముఁ బాలింపు హరీ. 226

వ. నావుడు విష్ణుండు హయమేధం బొనర్చితిరేనిఁ దత్పుణ్యమ్మునఁ బావితుండై యింద్రుండు మీకుం బతియగు. 227

గీ. అశ్వమేధమ్ముచే జగదంబ ప్రీతి, నంది హరియించు బ్రహ్మహత్యాద్యఘముల
శచియుఁ బరశక్తిపూజలు సలుపఁగాకఁ, లబ్ధభర్తృక యగుబొంచె లలితగతుల.

వ. నహుషుండును మాయామోహితుండై స్వయంకృతాపరాధమ్మున వైశమ పదభ్రష్టుం డగుఁ బొందవిన సురలు బృహస్పతి సమేతమ్ముగా నతని చెప్పిన చొప్పున నరయుచు నింద్రుఁ డున్నెడ కరిగి వానిం గాంచి హయమేధం బొనర్పఁ జేసిన నంతఁ

బాధితుండై యతండు బ్రహ్మహత్యాపాతకమ్మును విభజించి నదులయందును
వృక్షమ్ములయందును స్త్రీలయందును బృథివియందును గిరులందును జొనిపి నన
యమ్ము వరయుచుఁ ఓజ్జలమ్మునను వసింపుచుండె నంత దేవతలును తమతివ
బొందుపట్ల కరిగిరి పిదప నొక్కనాఁడు. 22

క. విరహాకుల యయి శచి య, గ్గురువరుతోఁ బల్కె "నేలొకో రాఁడు సురే
శ్వరుఁడు హయమేధ మొనరిచి, పరిపూతుండయ్యుఁ జెపు మపాయము నాకుజా."

వ. నాపుడు బృహస్పతి యిట్లను భక్తిమై జగదంబిక నారాధించితివేని నీపతి యచి
రంబ నీకుం బొడకట్టు నంతియకాక నహుషుండు తన్మాయామోహితుండై పద
భ్రష్టుండును నగునని మంత్రం బుపదేశించిన, 231

క. తాపసివేషము గొని స, ర్వాపద్ధారిణిఁ బరాంబ నర్చించినఁ దా
నాపడఁతి కొక్కనాఁడు ద, యాపరతన్ దర్శనంబు నాపె యొసంగెన్. 232

సీ. కోటిసూర్యులఁ బోలి కొమరారుకాంతితోఁ • జంద్రకోటుల నేలు శైత్య మొలయఁ
గోటివిద్యుత్తుల మీటుబల్ తళ్కుతో • వేదముల్ నాలుగు వెంటరాఁగ
స్వచ్ఛముక్తాదామసంభూషితాంగియై • కనులు మూఁడును గాంతి గడలుకొనఁగఁ
బాశాంకుశాదులు బాహులఁ దనరఁ బ్ర • సన్నవక్త్రాంభోజశాలిని యయి

గీ. జనని ప్రత్యక్షమై శచీసతికిఁ బల్కె • నబల నీపూజ నానందమబ్బె నాకు
వరము గోరుము నా, నామె పతిసమాగ • మంబు నహుషునికిన్ వినాశంబుఁ గోరె.

వ. అవిన జగదంబ యొక్క దూతికం జూపి దీనివెంబడి నరుగు మియ్యది నీపతిం
జూపు నని వెండియు. 234

గీ. విశ్వకామాఖ్యచేతను వెలయు నాదు, మూర్తి వొల్పెడి మానసమున సురేంద్రుఁ
డున్నవాఁ డట కేగు మీయువిదతోడఁ, గనుఁగొనుము మోదమందుముకమలనయన.

## శచి యింద్రునికడ కరుగుట.

వ. నహుషుండును మన్మాయామోహితుండై స్వల్పకాలమ్మునఁ బదభ్రష్టుండు కాఁగలఁ
డని చెప్పి యాపె యంతర్ధానమ్ము నొందె. 236

ఆ.వె. అంబదూతి శక్రునంగనఁ గొనిపోయి, మానసాంతరమున మగ్నుఁడైన
యింద్రుఁజూపెఁ; శచియు నింతింతనఁగరాని, సంతసమ్ము నొందె జనవరేణ్య. 237

వ. ఇట్లు సంతసం బందియుఁ బతి దుర్గతికిం జింతించు నక్కమలాక్షిం గని యింద్రుం
డిట్లను. 238

క. కమలేక్షణ యిచ్చటి కే, క్రమమున వచ్చితివి భూతగణములకు నస్పృ
శ్యమగుగతి నున్న నావా, సము నీకెట్లెఱుఁగనయ్యె జయ్యనఁ జెప్పుమా. 239

వ. అనిన శచి యిట్లను జగజ్జననికరుణం జేసి నిన్నుం జూడఁగంటి నీకు నొక్క విశే
షంబు వినుము. 240

క. సురలందఱు నహుషుని దే, వర యాస్థానమున నిల్పి వైభవమెసఁగఁగా
బరిచర్యసలుపుచుండిరి, మరియాదకుఁ దక్కి వాఁడు మమతయెలర్పఁగా. 241

క. 'వరియింపుము నన్నుఁ బతిగా, సురేశ్వరుఁడ నే' నటంచు సొలవక కామా
తురుఁడై ప్రతిదినము నన్నుం, బరిపరి మోమోట పెట్టి బాధించు నొగిన్. 242

క. నావుడు దేవేంద్రుం డను, దేవీ వగవకుము నేఁ బ్రతీక్షించెద మో
దావహమగు కాలమునకు, నేవానికి దాఁటఁజెల్లునే కాలగతుల్! 243

వ. నీవును ననుకూలకాలంబు ప్రతీక్షించుచు స్వస్థచిత్తవై యుండుము బొమ్మనవుడు
శచి దీనాననయై యతని కిట్లను. 244

చ. ఎటు నిలువంగ నేర్తు? సురలెల్లరు మౌనులఁ గూడి రాగలం
పటు వరదానగర్వితు నాయుస్తనయున్ బతిగా వరించి య
క్కటా! నను వానిఁ బొందుమనఁ; గాచెడివాఁడు గురుండు దక్క లే
కిటు చనుదెంచితిన్ మరల నేఁ జనిన న్నను బల్మిఁ బట్టఁడే. 245

క. అరయఁ బాలుఁడు విమలా, చారుఁడు విద్యాధికుండు సత్తముఁడు గుణం
డేరీతిఁ గావఁ గలఁడక, టా! రాజగు నహుషు బారి కందక యుండఁగా. 346

ఆ. వె. కులటనైన వానిఁ గొని సుఖమ్ముల నంద, నిచ్చగింతు, నకట! యీ పతివ్ర
తాత్వ మెంత దీనదశ దెచ్చెఁ! నని వగ, నగడు చెందు శచికి ననియెఁ బతియు.

వ. నీ కుపాయం బొండు చెప్పెద నాలకింపుము. 248

క. శీలమున మానరక్షణ, మేలగు నని యొనర్చు నద్దియే సతి, భర్తల్
పాలింపఁ బతివ్రతలగు, లీలావతు లెందఱేని లేరె జగమునన్! 249

క. కావున శీలము తోడుగ, నీ వుండుము బొమ్మ వాఁడు నిన్ను బలిమిమై
నేవేళఁ బట్టఁ దివురునొ, యావేళం బలుకు మిట్టు లాఘూర్ణనితోన్. 250

వ. "నీవు ఋషియానమ్మున నాయెదకు వచ్చితేని నీయందు బద్ధానురాగనై యే విన్ను వరించెద" నంటివేని గామాంధుం డగువాఁడును మునులఁనియోగించి క్రోధకులు లగు వారి శాపమ్మునఁ బదభ్రష్టుండగు నిదియునుగాక. 251

ఆ. వె. నిర్నిమిత్తకరుణ నెగడెడిజగదంబ, భక్తి మీఱఁ గొల్చి భద్రదాత్రి
యైన యాపెకతన నందును సంసిద్ధి, గురుని వాక్యమందు గుఱుతుగలిగి. 252

వ. అను నాతని పల్కులకియ్యకొని శచియు నహుషునిపాలికింజనఁ గామాంధుం డగునాతఁ డాపె కిట్లను. 253

చ. కుశలమె నీకు? సత్యమునకుం జవదాఁటని దాన! నీయెదన్
వకు నను దాను సత్యగతిఁ బాలన చేయఁగ వచ్చితే? చతు
ర్దశభువనమ్ము లేలినముదం బొకపా లిదియొక్కపాలు దు
ర్దశఁ దొలఁగించి నన్ మదనదగ్ధునిఁ జల్లనిదృష్టి నేలుమా. 254

ఆ. వె. నీ యభీష్టమెద్ది? నే నిర్వహింతు ని, క్కమ్ము నొడువు లజ్జగాంచనేల?
యనుడు దేవదేవి "యఖిలంబు సిద్ధంబ, లేదు కోర నొండు లేశమేని. 255

వ. ఐనను నాకొక్క మనోరథమ్ముగల దయ్యది నిక్కువమ్ముగ నెఱవేర్చెదేని నొడి వెద" నావుడు నహుషుం డెంత యసాధ్యంబేని నిర్వహించెద నొడువుమన శచి యాతనికిట్లనియె. 256

ఉ. చెప్పుటకేమి ప్రత్యయము చేకుఱ దేమన రాజు లాడియే
తప్పుదు రెయ్యెడన్ విను వృథా వచియింపఁగనేల? నామనం
బొప్పెడియంతయొట్టునకు నొప్పితివేని వచింతు నా; నతం
డప్పగిదిం బొనర్ప మనమందు విశిష్ఠ్రియ మంది యిట్లనున్. 257

వ. తరుణీ! నే నాడినదానికిఁ దప్పితినేని యజ్ఞ దానతపోజన్యం బగు మత్సుకృతమ్ము వమ్మగు ననుడు నాపె యిట్లనియె. 258

సీ. వాహనమ్ములు దేవపతికి గుఱ్ఱమ్ము లే, నుఁగు రథమ్మును, హరికి గరుడుండు
యమునకు మహిషంబు హరునకు వృషభంబు,హంస బ్రహ్మకు నెమ్మి హరసుతునకు
నెలుక విఘ్నేశున కలరు; నీ కిప్పు డ, పూర్వవాహనము నద్భుతము గాఁగ
వాంఛింతు నిను మునివరులు శిబిక మంచి, యేగింపఁజూచి దేవేంద్రుకన్న
గీ. నధికునిఁగ నెంచి నీవృద్ధి ననుమతించి
కొందఁ గోరెద నావుడు మందబుద్ధి

యంబికామాయకతన మోహాంధుఁ డగుచు
నగుచు నయ్యబ్జముఖి కనె నహుషుఁ డెలమి. 259

గీ. సత్య మగుమాట చెప్పితి జలజనయన!, సదృశమగు వాహనము నాకు సంతరించి
తనఘులు మునీశ్వరులు మోయునంతకన్న, ఘనత గల్గునె యెందులోకముల నెందు.

క. మును లీశ్వరు మోయఁగఁద, క్కన ఋషులం దోడ రా నొగిన్ శిబికారూ
ఢుఁడ నన్నుఁ జూడఁ గలవో, వనజానన నిన్నుఁ బొందవచ్చినవేళన్. 261

వ. అని శచికిం బ్రియంబు వల్కి యచ్చోటు విడిచి మునులంగని స్మరాతురుండు
నహుషుం డిట్లనియె. 262

ఉ. ఏను సురేంద్రుఁడన్ శచియు నింతటిపన్కను నన్నుఁ బొందదో
మౌనివరేణ్యులార! యవమానముగాదె? యనుగ్రహించి నా
మానము నిల్పఁగాఁ దగినమార్గము మీర లొకించుకేని యు
మ్మానిని మానసం బలర మారుఁడు విల్వఁగఁ బీడు నన్నిఁకన్. 263

క. ఆ నెలఁతపొందు యుష్మద, ధీనంబై యున్నయది విధించె న్నను స
న్మౌనివరేణ్యులు మోసెడి, యానముపై నెక్కి పొందనగుదె మ్మనుచున్. 264

వ. ఇయ్యది మీర లనుగ్రహింపకున్కి నెట్లు సమకూడు మీకు శరణాగతుండ నన్ని
మదనబాధితంబువలన రక్షింపవలయునన నగస్త్యప్రముఖులగు మునులందఱును
భావికార్యానుసరణమ్మున దయామతులై యంగీకరించుటయు నహుషుండును బౌలో
మీగతమానసుండగుచు తన దివ్యమునివాహకంబగు శిబిక నధిష్ఠించి. 265

చ. స్మరపరిపీడితుం డతఁడు చయ్యన నచ్చెలిఁ జూచువేడ్క స
త్వరమతియై యగస్త్యమునివర్యు సముద్రము మ్రింగినట్టియు
ద్ధురుఁ దనకాలఁ దన్ని కశతో నదలించుచు "సర్ప సర్ప" నాఁ
గరము కశాహతిం గనలి గ్రక్కున సర్పముగా శపించుచున్. 266

## ఇంద్రుఁడు స్వర్గమ్ముఁ నొందుట.

క. మరల నిటుపల్కె "నహుష, త్వరము లరణ్యమున నుండి సత్త్వముకల్మిన్
దిరుగుచు నుండ యుధిష్ఠిరుఁ, డరుదెంచున్ శాపముక్తి నతఁ డిడు నీకున్.

వ. ధర్మపుత్రుండు నీ ప్రశ్నంబుల కుత్తరం బిచ్చువాఁడు తచ్ఛ్రవణమాత్రమ్మున
నీ శాపమ్ము దొరఁగి స్వర్గమ్మునకు రాఁగల" వని నొడివె. 268

ఆ. వె. నహుషుఁడంతఁ బడియె నాకమ్మునుండి తా, నహియు నగుచుఁ గాననాంతరమున
నుండెఁ; బాసవుం డఖండ ముదమ్మున, జెందె దీని వినికిఁ జేసి యధిప. 269

వ. అంత సురలును మునులును నింద్రునికడ కరిగి మానపూర్వకమ్ముగా నాశ్వాసించి
యథాప్రకారమ్ముగ స్వస్థానమ్మున నిలిపి యభిషేకమ్మొనరింప నతండును జిరవిర
హిణి శచింగూడి నందన వనమ్మున విహరించుచు సుఖంబుండె. 270

చ. అనఘుని విశ్వరూపుని మహాత్ము మునిన్ దనుజున్ వధించి దుః
ఖనియతుఁడయ్యె నింద్రుఁ; డిటుక్రమ్మఱ దేవి యనుగ్రహింపఁగై
కొనె ముదమున్; సమస్తమునకున్ దనకర్మమ కారణంబు దా
నివి విడఁజెల్ల దేరికిని నిక్క మెఱుంగుము భూపః నావుడున్. 271

చ. వరవరుఁ డిట్లువల్క మునినాథ శతక్రతుకర్తయై సుఖో
ద్ధురమగు స్వఃపదంబుగొని దుఃఖితుఁడయ్యె సురేశుఁడంటి త
క్కొరులకు నస్మదాదులకు నొక్కెడ సౌఖ్యము చిక్కునేః కృతా
దరునకు నాకు శిష్యునకు దాఁపక సర్వము దెల్పు నావుడున్. 272

## కర్మ విశేషములు.

గీ. వ్యాసుఁ డిట్లనుఁ గర్మము వర్తమాన
మనియు సంచితమనియు నో యవనినాథ
తెలియఁ బ్రారబ్ధమని మూఁడు దెఱఁగులగును
గారణం బియ్యదియ సర్వకార్యములకు. 273

వ. అందు నానాజన్మ సంపాదితంబు సంచితంబు, మఱియు సాత్త్విక రాజస తామస
భేదమ్ముల నాకర్మంబు త్రివిధంబు. 274

క. వినుము శుభాశుభరూప, మ్మునఁ దగు సంచితము భోగమునఁ దీఱ నొకిం
తన నో దనేక జన్మము, లనుభవమున కెత్తవలయు నది ఘనమగుటన్. 275

గీ. జననమందినదాదిగ సలుపుకర్మ, మరయ నది వర్తమానవిఖ్యాతి నెసఁగు
సంచితమ్ముల నడిమికి సగముపేయ, నమరుఁ బ్రారబ్ధమై జననాది కదియ. 276

గీ. వీరు వారననేల యెవ్వారికేని, జనదు ప్రారబ్ధ మనుభవమునకుఁ దక్క
కర్మమున్నంతదనుక నిక్కమ్ము జన్మ, మది యడఁగుమీద జన్మంబు నడఁగు నిజము.

క. హరియును హరుఁడును సురలును, విరించియును గర్మవశులు వితయేని నరే
శ్వర ! దేహధారులై యి, క్కరణి శుభాశుభము లందఁగా నేమిటికిన్. 278

వ. దేహి తనకు సుఖదుఃఖానుభవ కారణంబగు కాలపరిపాకమ్మువలన సంచిత
కర్మానుభవావసరమ్మున సుకృతంబొండె దుష్కృతంబొండె నలుపుచుండు నట్లు దేవ
తలును నని యెఱుంగుము. 279

క. నారాయణాంశజులు నర, నారాయణ మునులు ధర్మనందనులు భువిన్
ధీరులు కృష్ణార్జునులై, పేరందుట దీనఁగాదె పృథ్వీరమణా. 280

వ. ఇయ్యది పురాణపీఠిక యని మునులచే వ్యవహరింపం బడునని మఱియును. 281

గీ. అధిప ! విభవాధికుండు దేవాంశభవుఁడు
కవిత గలవాఁడు ఋష్యంశ కలితుఁ, డెవఁడు
రుద్రు నర్చించు నవ్వాఁడు రుద్రునంశ
మవని పాలించువాఁడు విష్ణ్వంశభవుఁడు. 282

వ. మఱియు నన్నదాతయు దేవాంశభవుండగు నింద్రాగ్నియమ విష్ణుధనదుల వలనఁ
బ్రభుత్వప్రభావకోపపరాక్రమంబులను సంగ్రహించి శరీరంబు నిర్మింపంబడెడి. 283

క. బలవంతుఁడు ధనవంతుఁడు, కలావిదుఁడు భోగశాలి ఘనభాగ్యము లం
దులఁదూఁగువాఁడు వీరలు, తెలియుము దేవాంశభవులు తెల్లముగనృపా. 284

వ. పాండవులును విట్టిరగుట విఖ్యాతులైరి దేవాంశజుండగు కతన వాసుదేవుండును
నారాయణనముండై వఱలె. 285

గీ. ఏది యెట్లైనఁ బ్రాణులకెల్ల దేహ, మపరు సుఖదుఃఖములకుఁగానట్టిదేహి
స్వవశుఁడొక్కరుఁడును లేఁడు జననమరణ, కష్టములు దైవవశమునఁ గాంచుచుండు.

వ. మఱియుఁ బాండవులు వఖంబొదముటయుఁ బిదపఁ బురమ్మున కరుగుటయు బాహు
బలమ్ముకలిమి రాజసూయం బొనర్చుటయుఁ గ్రమ్మఱ వనవాసదుఃఖం బనుభవించు
టయు నర్జునుండు తపంబు చేసి సురలవలన వరమ్ము గొనుటయు నమనవి
యన్నియుఁ గర్మఋణంబులకా నెఱుంగునది. 287

క. నరదేహమ్మున మున్నుబ, దరికాశ్రమమందుఁ జేయుతప మర్జునతం
బొరపిన యప్పుడు ఫలదం, బరయఁగఁ గాకున్కి గర్మ మతిగహనంబో. 288

వ. అని వెండియు. 289

సీ. కారాగృహమ్మునఁ గంజాక్షుఁడుదయించి • యంతట గోకులమందుఁ జేరి
యేకాదశాబ్దమ్ము లెలమి నచ్చటనుండి • మధురకు నేగి దుర్మార్గుఁ గంసు
నడఁచి యాతనితండ్రి నధిపునిఁగాఁ జేసి • తల్లిఁ దండ్రులకు బంధనము వాపి
మ్లేచ్ఛాధిపునిభీతి మేకొన ద్వారవ • తీపురమ్మున కేగి కాఁపురమ్ము
గీ. చేసి సకుటుంబముగను బ్రభాసమున ధ • రాదితిజశాపమునఁ దెగి యంత మందెఁ
గర్మగతి యెట్టిదేనియుఁ గానయున్న • వ్యాధుఁడా కృష్ణుఁ జంపెడివాఁడు తలఁప.

వ. నావుడు జనమేజయుం డిట్లను మునీంద్రా! భూమి భారమ్ము సహింపక గోరూప ధారిణియై కమలజు శరణమ్ము వేఁడిన నతఁడు జనార్దనుఁ బ్రేరేపించి భూభారహరణమ్మునకు వసుదేవగృహమ్మునఁ బుట్టు మన విష్ణుఁడును నట్ల జనియించి బలరామసహితుండై యర్జునుండు తోడ్పడ ననేకుల దుర్మతుల నడంచెనని చెప్పితివి దానంజేసి భూమికేమి భారంబు దఱిఁగె? ఇది యిట్లుండ భీష్మద్రోణ విరాటద్రుపదబాహ్లీకసోమదత్తకర్ణాదులం జంపెఁ గాని తన యనంతరమ్మున భార్యలంగొట్టి దోఁచికొన్న దొంగల మునుమున్న యేల వధింపఁదయ్యె? ఆభీరశక మ్లేచ్ఛనిషాదులు కోట్లకొలఁది మిగుల నేల? వారలు భూమికి నేల భారకారులు గాకుండి? రని వెండియు. 291

క. కలుషావృతమై తగుసీ, కలియుగమున నొక్కఁడేనిఁ గలఁడే యోగ్యుం?
డిల కిది భారముకాదే, తెలుపుమనా మౌని భూపతికి నిట్లనియెన్. 292

గీ. ప్రజలు యుగములఁ బట్టి పాపమ్ముఁ బుణ్య
మాచరింతురు యుగధర్మ మాఁగఁగలరె
ధర్మమున రెంట మూఁటఁ దత్పరతఁ గలరు
క్రమముగా మూఁడు యుగములఁ గలుగు ప్రజలు. 293

వ. కలియుగమ్మున నర్థకామరసికులు దక్క నొండొరులు జనింపరు; ధర్మాధర్మములకుఁ గర్త కాలంబ యని యెఱుంగుము నావుడు నృపతి యిట్లనియె. 294

క. కృతమున ధర్మము త్రేతను, మితిమీఱినదానమున్ యమితులై నానా
వ్రతములు ద్వాపరమున నా, మృతిఁ జేసినవారికేది మనికి యిపుడగున్? 295

క. ఈ కలియుగమునఁ బాప, వ్యాకులులై దేవనింద యాదిగఁ బగు నా
నాకృతు లొనర్తు దుర్జను, లాకృతయుగమందు నెచటఁ గరుగుదురు మునీ. 296

వ. నావుడు వ్యాసుం డిట్లనియె. 297

క. కృతయుగమున మనుజాలు వి, స్తృతముగఁ బుణ్యము లొనర్చి దివిజనగరమున
స్థితిఁ గాంతురు వర్ణాశ్రమ, గతు లించుకయేనిఁ జ్యుతినిఁ గనకున్కి నృపా. 298

గీ. దయయు సత్యంబు దానంబు తనమభార్యఁ
గూడియున్కియు ద్రోహమ్ము గొనిమి సర్వ
భూతసమబుద్ధియును సతిమ్ములు సమస్త
జంతువులకుఁ గృతమ్మున జనవరేణ్య. 299

వ. ద్విజకాదివర్ణమ్ములును నయ్యుగమ్మున స్వధర్మనిరతిం జరించుటంజేసి స్వర్గమ్మున
కరిగెడిఁ; త్రేతాద్వాపరమ్ములను నట్లగా నెఱుంగునది 300

క. నయహీనులు మానవులు క, లియుగమ్మున సుకృతబుద్ధిలేమిగా యుగప
ర్యయ మంజడుదన్కను వి, శ్వయముగ నరకమున నుంద్రు జననాథమణీ. 301

క. కలికృతసంధిన్ స్వర్గ, స్థులు పుడమి జనింత్రు మిగుల దుష్టులు నరక
స్థులు జనియింతురు ద్వాపర, విలయమ్మునఁ గలియుగంబు వెలయంజేయగా. 302

క. కలియుగమున సుజనులనుం, గలిగిన నవ్వారు సుకృతకర్మమగతిగా
వెలయుదురు ద్వాపరమ్మున, నల త్రేతగా గృతమునందు నధిపవతంసా. 303.

క. విను మట్లుల కృతయుగమున, ననయతఁ బాపములు పేసినట్టి జనులు దు
ర్జనహితమగు కలియుగమున, జనియించి యపాత్రకృతులు సబపుడు రెందున్.

## యు గ ధ ర్మ ము లు.

క. యుగరీత్యనుసరణమ్మునఁ, దగు ధర్మజ్ఞులకుఁ బాపతత్పరత, ప్రశ
స్తగుణుండగు నీతండ్రికిఁ, దగునే ముఖియలుతఁ బాము దగులంజేయన్? 305

వ. యుగబలంబ కాదేవి యయాతికులసంభవుండగు రాజన్యున కిట్టి బుద్ధి యెట్లు
బొడము నని చెప్పి వెండియు. 306

చ. కృతయుగమందు బ్రాహ్మణులు కేవల వేదరతుల్ పరాంబికా
మతులు దయాయుతుల్ శుచిసమన్వితు లట్లలె క్షత్రియుల్ సుసం
గత పరిపాలనాదరు లఖండయశుల్ మతి వైశ్యులున్ సమం
చితకృషిగోగణావనవిశిష్టవణిక్క్రియనిత్యతత్పరుల్. 307

వ. మఱియు శూద్రులు సేవాతత్పరులై యుండిరి సకలవర్ణమ్ములయందును దేవీపద

భక్తి విశేషించి యుండెఁ బ్రతిగ్రామమ్మున జగదంబాలయమ్ములు మెండుమనై
యుండె. 308

క. కృతయుగమునకన్నఁ ద్రేతన్, మితమగు ధర్మమ్ము మిగులమితమగు ధర్మ
స్థితి ద్వాపరమునఁ గలియుగ, గతి చెప్పఁగ నలవి కాదు కలుషిత మగుటన్. 309

క. మును రక్కసు లిక్కలియుగ, మున విప్రులుగా జనించి మూర్ఖ లసత్యం
బున ఘనులును బాషండులు, జనవంచకు లనఁగఁ బరఁగి చరియింతు రొగిన్.

గీ. వేదనిందాపరులు లోకవిదులు శూద్ర, సేవనాసక్తులు నధర్మజీనులును
భ్రష్టులును గాఁగలరు క్రమక్రమమునఁ గలి, వృద్ధిచెందిన కొలఁదిగ విప్రవరులు.

క. కలియుగము వృద్ధిఁ జెందిన, కొలఁది బుకోద్భవము ధర్మగుణము నశింపగా
గలుషమ్ము వృద్ధి నొందుఁ బ్ర, బలమగు నన్యాయరీతి ప్రజలందు నృపా. 312

గీ. క్షత్రియులు వైశ్యులును శూద్రసంతతులును, ద్విజులయట్లస్వధర్మముల్ దిగవిడుతురు
ద్విజులు శూద్రులరీతి వర్తించి దుష్ప్ర, తిగ్రహమ్ము లొనర్తురు తేజ మెడల. 313

చ. అనృతము పల్కుదుర్ పరులనంటుదు రిచ్చకు వచ్చినట్లు వ
ర్తన మొనరింత్రు ధర్మములు తారయి చెప్పుదు రాత్మభర్తృవం
చన మొనరింతు రంగనలు సాధ్వి యొకర్తుక గాని కానరాఁ
జనదు కలిన్ జగమ్ము కడు సంకరరీతిఁ బొల్చు భూవరా. 314

గీ. శుద్ధ మాహార మైన విశుద్ధమగు మ, నంబు దాన నెసంగు ధర్మంబు వృత్త
సంకరతఁజేసి ధర్మంబు సంకరమగు, దాన వర్ణసాంకర్యం బొదవు నృపాల. 315

క. కలియుగమున విప్విధమునఁ, దొలఁగున్ వర్ణములపద్ధతులు విజ్ఞానం
బలవడు మహాత్ములును జం, చలులై దుష్కృతులు సేయఁజాలుదు రనఘా. 316

వ. ఇయ్యది యుగస్వభావం బగుట నేరికిని నవార్యం బనుదు జనమేజయుండు. 317

క. కలుషప్రధానమై తగు, కలియుగమునఁ బొదము ప్రజకు గతికలదేవిన్
బొలవక చెప్పు మనఁగ న, య్యలఘున కిట్టులను వ్యాసుఁ డాదర మెనయన్. 318

చ. కలిఁ గలుషంబు వాపికొనఁగా మదిఁ గోరునరుండు సర్వముం
దొలఁగఁగఁ ద్రోచి శక్తిపదతోయజ మెప్పుడు సంస్మరింపఁగా
వలయుఁ దదీయనామరసపాన మొకప్పుడుఁ గావి చేయువా
రల కగు సౌఖ్యముల్ హరిహరప్రముఖుల్ గనలేరు భూవరా. 319

క. తగుపుణ్యక్షేత్రమ్మున, నగణితమహిమాఢ్యమైన యంబాపద మె
ప్పగఁదలఁచెడివారలు పా, పగతిం గన రిది రహస్యపద్ధతిసుమ్మీ. 320

క. పాయక యజపాఖ్యం బగు, గాయత్రి జపింత్రు ద్విజులు గనఁజాలరుగా
మాయావిభవము వారలు, ధ్యేయం బంబాపదంబు తెలియుము నీకున్. 321

వ. యుగధర్మవ్యవస్థయందు నీ వడిగినప్రశ్నంబున కుత్తర మిచ్చితి నింక నీకభీష్టం బెద్ది యనవుడు దేవమానవులకు గమ్యమ్ములును బుణ్యమ్ములునగు క్షేత్రమ్ములును నదులును స్నానదానాది విశేషమ్ములును విస్తరించి నా కెఱింగింపు మనినఁ వ్యాసుం డిట్లనియె. రాజేంద్రా ! యెల్లనదులలో జాహ్నవి యుత్కృష్టంబు మఱియు యమునా సరస్వతీ నర్మదా గండకీ సింధు గోమతీ తమసా కావేరీ చంద్రభాగా వేత్రవతీ సరయూ ప్రముఖమ్ము లగు నదులు నూర్లకొలఁది గలవు. 322

## తీర్థవిశేషములు.

గీ. ఈ నదులలో సముద్రమ్ము వెనయునవి వి, శేషపుణ్యప్రదమ్ములు సింధుగతము
లందు జల మెప్పుడును గలయవి ప్రశస్త, ములు నదులు వర్షముల రజస్వలలు చూప.

వ. శ్రావణ భాద్రపదమాసమ్ముల నానావిధ కలుషిత ప్రవాహమ్ములకలిమి రజోదోషమ్ము వాటిల్లునని యెఱుంగునది. వెండియుఁ బుష్కరమ్మును గురుక్షేత్రమ్మును ధర్మారణ్యమ్మును ప్రభాసమ్మును బ్రయాగమును నైమిశారణ్యమ్మును నర్బుదారణ్యమ్మును నివి పుణ్యక్షేత్రమ్ములు; శ్రీశైలమ్మును సుమేరుపర్వతమ్మును గంధమాదనమ్మును నను నివి పుణ్యధరాధరమ్ములు; మానసమ్మును బిందు సరస్సును నచ్ఛోదంబును ననునివి పుణ్య సరోవరమ్ములు. 324

క. నరనారాయణ మును లా, దరమున నెచ్చోటఁ దపము దాల్చిరి దానిం
బరమోత్తమ మనదఁగదె బ, దరికాశ్రమ మనఁగ విశ్రుతంబది యధిపా. 325

వ. మఱియు వామనాశ్రమమ్మును శతయూపాశ్రమమ్మును మొదలుగఁ బుణ్యాశ్రమమ్ము లనేకమ్ములు గలవు. 326

క. మునిజనములు తపములు తా, మొనరించినచోటు లెల్ల నొగిఁ దన్నామం
బున విశ్రుతి గని పుణ్య, మ్మునకుం దానకము లగుచుఁ బొదలె నృపాలా. 327

వ. నా చెప్పిన స్థానమ్ములలోఁ గొన్ని దేవీస్థానమ్ములు గల వయ్యవి దర్శనమాత్రఫల దంబులు వాని నగ్రమ్మునం జెప్పెదఁ దీర్థమ్ములును దానమ్ములును యజ్ఞములును

దపమ్ములును వ్రతమ్ములును లోనగు పుణ్యకర్మమ్ములు సాపేక్షమ్ములని యెఱుంగు మది యెట్లంటేని. 328

క. శుద్ధంబగు ద్రవ్యమ్మువి, శుద్ధంబగు మనము శుద్ధిఁ జొప్పడు క్రియ స న్నద్ధంబు గాక యున్న న, బద్ధం బగు నిఁడుఁ జెందు పలము నృపాలా. 329

క. క్రియయును ద్రవ్యము శుద్ధ్యా, శ్రయము గ నొక్కప్పుడెన యుఁ జంచలము మనం బయవిష్ణుకాంతణముల వి, షయముఁ బడుకతన బుద్ధి చన దెప్పట్లన్. 330

వ. కామక్రోధలోభమదాహంకారమ్ములు తీర్థాధ్వరవ్రతతపోనియమమ్ములకు నంతరాయ ప్రదమ్ములు మఱియు నహింసయు సత్యాస్తేయశౌచేంద్రియనిగ్రహస్వధర్మపాల నమ్ములును దీర్ఘఫల ప్రదంబులు. 331

గీ. దారి సంసర్గదోషమ్ము దవిలి నిత్య, కర్మ మెడలినకతన నిక్కముగఁ దీర్థ గమన మది వ్యర్థమగు స్నానకలన దేహ, శుద్ధి దగుఁగాని మనమును శుద్ధమగునె.

క. విను తీర్థస్నానమ్మున, మనమును శుద్ధంబయే నమరనదికిం దా పున వసియించి తపంబుల, బొనరించెడి మునులు ద్రోహబుద్ధులగుదురే. 333

వ. చిత్తశుద్ధిమయంబగు గంగాదితీర్థసేవనం బతిపావనంబగుకతన నాంతరమలక్షాళ నంబు నొనరింప సమర్థంబయ్యెనను నంతశ్శుద్ధికి నొక్క సత్సంగంబుదక్కఁ దక్కఁగల యజ్ఞదానాదికర్మములు నిమిత్తమ్ములు గాఁజాలవు. మున్ను బ్రహ్మ పుత్రుండగు వసిష్ఠునకును విశ్వామిత్రునకును నాడీబకంబను ఘోరయుద్ధమ్ము విరుద్ధ కమ్ముగ హరిశ్చంద్రు కతమునఁ గలిగె నందు వసిష్ఠశాపమ్మున విశ్వామిత్రుండు బకంబును విశ్వామిత్రశాపమ్మున వసిష్ఠుం డాడియునైరి. 334

క. వా రాడీబకరూపము, లీరీతిం దాల్చి రణము నెనసిరి మిగులన్ దారుణగతి వర్షాయుత, మారయ మానసపస్తతూరాధిఁదగఁగా. 335

వ. అన జనమేజయుం డక్కత వినవలతు ననుడు సాత్యవతేయుం డిట్లనియె. 336

క. రవివంశజుండు రఘురా, మవిభునకుం బూర్వుఁ డనఘమతియున్ స్వర్గా ధవిభవుఁ డయిన హరిశ్చం, ద్ర విభుండు త్రిశంకురాజతనయుం డలరున్. 337

వ. అతం డనపత్యుం డగుకతన వరుణుం గుఱించి తనకు సంతానం బొదవిన నర మేధం బొనర్చెదనని ప్రతిజ్ఞయొనర్చెనంత. 338

## ఆ డీ బ క యు ద్ధ ము.

క. అతని సుందరి గర్భో, పేత యయి కుమారుఁ గాంచెఁ బ్రియమంది తనూ
జాతునకు జాతసంస్కృతి, నాతం డొనరించి చేసె నధికోత్సవమున్. 339

వ. పుత్రోత్సవ సమయమ్మున బ్రాహ్మణులకు నపారంబగు హిరణ్యమ్మును గోవులను
నొసంగి తనిపె నట్టియెడ వరుణుండు విప్రవేషమ్మున నరుదెంచి కృతసత్కారుండై
యాగమనకారణం బడుగు నృపతిం గాంచి యిట్లను. 340

ఆ. వె. సుతునిఁ బశువుఁ జేసి సొంపక యాగంబు
సలిపి నీదు ప్రతిన నిలుపుమనుడు
విహ్వలాత్ముఁ డగుచుఁ బృథ్వీశ్వరుండు ధై
ర్యంబు కొంత గాంచి యతని కనియె. 341

క. ఓ సదయ! యిత్తఱోదరి, మాసమునకు శుద్ధిఁ జెందు మానక నీకై
చేసెద యాగం బప్పుడు, నా సత్యము చూడు మనఁ దనయెడకు నరిగెన్. 342

వ. పదంపడి హరిశ్చంద్రుండు సంతుష్టుం డయ్యును గించిచ్చింతాభరమ్మున నుండె.

క. మాసము పూర్ణంబగుడు ధ, రాసురరూపమునఁ బాశి రాజేంద్రుఁ బరీ
క్షసము పేతు నొనర్పఁగ, నాసించి రయమున రాఁగ నా నృపవరుఁ డుర్వ్యా. 344

వ. ఉచితసత్కారం బొనర్చి యాతని రాకకుం గతం బెఱిఁగినవాఁడు గావున వినయ
మ్మున నిట్లనియె. 345

క. బాలుం డసంస్కృతుం డిఁక, దేలా యజ్ఞార్హుఁడగు? సహింపు ముపనయ
శ్రీలక్షితుఁ డగు దనుకఁ గృ, పాళుఁడవై యనుడుఁ బలికె వరుణుం డలుకన్. 346

క. కొడుకుపయి నదరు నీ ప్రే, ముడి నా కెఱుఁగంగ నయ్యె మును పలికి యిటుల్
దడఁబడఁ జెల్లునె నమ్నుం, గడకొని వంచింప నెంచఁగాఁ దగునె నృపా. 347

వ. అయినను నీవచనగౌరవమ్మున నిప్పటి కరిగి సమావర్తన కర్మానంతరమ్మున
నేతెంచువాఁడ సత్యమ్మునకుం దప్పితివేని నిన్నవ్వు డవశ్యము శపింతు నని యతఁ
డరిగెఁ బిమ్మట హరిశ్చంద్రుండు గొమరునకు లోహితాక్షుండను నామమ్మునిడెఁ;
నా రాజసుతుండును దినదినప్రవర్ధమానుండై సర్వవిద్యావిశారదుండై, 348

గీ. తనకు జన్నంబు కతన నంతంబు గలుగు, టెఱిఁగి పరుగిడి యేరికి నేగరాని
యద్రిగహ్వరమున డాఁగె నధికభీతి, లోహితాక్షుండు బ్రదుకంగ లోఁదలంచి. 349

వ. పిదప వరుణుం డరుదెంచి జన్నం బొనర్పుమనుడు నరవరుండు ప్రమ్లానవదనుండై మహాత్మా, మత్పుత్రుం డదృశ్యుండై యెటకేనియుఁ బోయె నేనేమిసేయుదు ననుడు వరుణుండును. 350

క. నను వంచించి యసత్య, మ్మనకున్ లోనైతి కాన భూవర నీకుం
బనుపడు జలోదరంబను, ఘనతరమగు వ్యాధి యనుచుఁ గనలి శపించెన్. 351

వ. ఇట్లు శపించి యతండరిగెఁ బదంపడి హరిశ్చంద్రుండు వ్యాధిపీడితుండై పుత్రా దర్శనమ్మునకు వగచుచున్నంత. 352

క. ఒక పాంథుండు హరిశ్చం, ద్రకుమారుం గాంచి పలుకు "దయమాలి కటా
ప్రకటవ్యాధిపరీతు జ, నకు విడిచి యిటుండ నీకు న్యాయ్యంబగునే. 353

క. నీకై కుందెడి జనకుని, శోకము గణియింపలేవి సుతుఁడవు నీకుం
గాకొరుల కిట్లు చెల్లనె, తేఁకువ యొక్కింత వలదె ధీరున కెందున్. 354

క. జనకునకుఁ గాఁగఁ దన జీ, వనమైనఁ ద్యజించునట్టివాఁడు గుమారుం
డనఁదగుఁగాని వినుంబలెఁ, దనప్రాణము దాఁచికొనినఁ దనయుం డగునే." 355

వ. ఇట్లు దర్మసంయుతంబుగ బోధించు పాంథుని వచనమ్ములఁ ద్వరితుండై తండ్రిం గన నరుగ నుంకించు నాతనికడకు నింద్రుండు విప్రవేషమ్మునవచ్చి కృపాళుండు నుంబలె నిట్లను. 356

చ. చన మది నెంచఁబోకు కడు సాహసివై తనరోగబాధ దీ
ర్ప నెదఁ దలంచి విన్నుఁదగఁబట్టి మఖమ్మునఁ బెట్టి చంపు, ము
న్నినుఁ గనుపొంచె నవ్వరుణునిఁ బెన నిట్లు యజింతు నంచు నీ
జనకుఁడు నేమమూనె విను చావఁగనేటికి నాదుపల్కులన్. 357

వ. ఇట్లతని వచనమ్ముల నిషిద్ధగమనుండై లోహితాక్షుండు మాయామోహితుండై యటఁ గొండొక కాలంబుండి మరల నొకని కతనఁ దండ్రి దురవస్థ విని గమనో ద్యమ్ముఖుండగుడు నింద్రుఁ డెప్పటియట్ల వారించె; నిట్లతం డెప్పుడు చనమద్యమించు నప్పుడు తప్పక యింద్రుండు వచ్చి వారించుచుండుఁ బదంపడి యొక్కనాఁడు హరిశ్చంద్రుండు దుఃఖార్తుండై కులగురుఁడగు వసిష్ఠుం గాంచి మహాత్మా! జలో దరవ్యాధిపీడితుండనగు నన్నుఁ గరుణింపుము నావుడు వసిష్ఠుండు కరుణార్ద్రుండై యిట్లను. 358

గీ. కల దుపాయం బొకండు పుత్రులు త్రయోద
శవిధముల నొప్పుదురు ధర్మసమ్మతులయి
యందుఁ గ్రీతుని గొని జన్నమాచరించి
వరుణుని యజించి వ్యాధిని బాపికొనుము. 359

ఉ. నావుడు మంత్రులంగని జనప్రవరుం డిటు పల్కె, నెవ్వఁడే
నీ విధికిం దనూజు నిడునేని ధనౌఘమెయిం గొనుండు భూ
దేవకుమారునిన్ వెదకి తెండు ధనం బది యెంతయేనియుఁగా
బ్రోవిడుఁ డిందు లోభమును బూనకుఁ డేగుఁడు శీఘ్రగాములై. 360

క. అని యనుపన్ సచివులు చని, జనపదములు పట్టణములు సదనం బొక్కం
డును వదలక కనువెద ని, ర్ధనుఁడు నజీగర్తుఁ డను ధరాసురుఁ డొకటన్. 361

క. కనుపట్టి ధనౌఘమెయిం, దనమూఁడురుతనయులందుఁ దా మధ్యము న
జ్జనవరుమంత్రుల కొసఁగెన్. ధనలుబ్ధుల కెట్టిపనులు తగవు నృపాలా! 362

వ. మంత్రులును దత్ప్రార్థితంబగు ధనం బొసంగి శునశ్శేపుండను నవ్విప్రకుమారుం
గైకొని హరిశ్చంద్రునకుం జూపిన నతండు సంతసించి యజ్ఞార్థంబగు సంభారం
బొనరించి ఋత్విక్కుల రావించి జన్నమ్మున కారంభించె; నంత యూపబద్ధుం
డయి రోదనం బాచరించు నాశునశ్శేపుఁ గాంచి విశ్వామిత్రుండు కరుణాకరుఁడై
హరిశ్చంద్రుని కిట్లను. 363

చ. జనవర! సాహసించి ద్విజసత్తముఁ జంపఁగ నేల? విప్రు రో
దన మొనరింప నామనము తద్దయు నీరయిపోయె మున్ను మీ
జనవరు లాత్మదేహమును జయ్యన నిచ్చి పరాంగరక్షణం
బును బొనరింతు రిట్టివని వోలునె ప్రాంగము రక్షసేఁతకున్. 364

గీ. నీకు సౌఖ్యంబు గల్గఁగా నే నొనర్తు, దయగలిగి దీను నీ విప్రతనయు విడువు
మందఱకు నొక్కటే దేహమందుఁ బ్రీతి, బాలకుం జంపె దీ వెంత పాపమతివొ!

వ. అని పలుతెఱంగుల నొత్తిచెప్పిన నత్తాపసుపలుకులు చెవిఁ బెట్టక వ్యాధిపీడితుం
డగుకతన హరిశ్చంద్రుండు క్రతూద్యముండై శునశ్శేపు విడువనొల్లఁడ. దానం
జేసి గాధిజుండు క్రోధాకులుండై యవ్విప్రకుమారునకు వరుణదేవతా ప్రీతిదంబగు
మంత్రం బుపదేశించె. 366

క. అతఁ డమ్మంత్రోత్తమముం, బ్లుతస్వరముగా జపింపఁ బూర్ణకృపాసం
గతుఁడై వరుణుం డయ్యెడ, కతిరయమున వచ్చి విడిచి యధిపున కనియెన్. 367

వ. రాజా! నీ కింక వ్యాధిబాధ లేకుండెఁ గృతప్రతిజ్ఞుండ వైతివని యరిగె దాన హరిశ్చంద్రుండును సంతసించె. 368

క. మునిసుతు నిటు విడిపించియుఁ, దనమాటన్ వినని నృపు నెదన్ మఱవక న
మ్ముని గాధిపుత్రుఁ డున్నం, త నరిగె నొకనాఁడు వని కతఁడు వేఁటకునై. 369

వ. అట్లరిగి కౌశికీతటమ్మున నొక్క సూకరముం బడనేయఁ గ్రుమ్మరువాఁడు మధ్యాహ్నకాలమ్మున వృద్ధబ్రాహ్మణా కారుండగు కౌశికుచే వంచింపఁబడి తన రాజ్యంబాది నిఖిలంబును గోల్పోయె. 370

క. అంత నొకనాఁడు కౌశికుఁ, గాంతారమ్మున యదృచ్ఛగాఁగ విక్రుద్ధ
స్వాంతుండు వసిష్ఠుం డను, నంతయు నృపువలన వినిన యట్టిండగుటన్. 371

ఉ. నా యజమానుఁడైన నరనాథు వృథా కపటంబు పూని నీ
వేయపరాధమున్ గనకయే కడు వంచనచేసి తక్కటా
నీయవినీతి కేమి యన నేర్తు బకక్రియ నీతపంబు దం
భాయిత, తాపసాధమ! యహంకృతి నమ్మగ నేల తాల్చెదో. 372

క. ఆ నరనాయకుని బక, ధ్యానపరత నిట్లొనర్చి తవినీతివి బకం
బై నెగడుమింక నని తా, పానుగతిన్ బలుక నాతఁడలుక నొదమగన్. 373

వ. వసిష్ఠుంగాంచి యే నెంతదనుక బకంబనై యుండుదు నందాఁక నీ వాడివై యుండుమని ప్రతిశాపంబిచ్చె; నిట్లన్యోన్య శాపమ్ముల నిరువురు నాడీ బకమ్ములైరి. 374

క. ఇరువురును మానసతటీ, తరువుల వేర్వేఱయుండి తఱఁగని కోపం
బురహిన్ నఖచంచుపుటో, ద్ధురప్రహారములఁ బోరుదురు ప్రతిదినమున్. 375

గీ. పక్షిరూపమ్ముగొని మునివరు లిరువురు, రుధిర ముట్టిపడంగ నీ రూఢి నెదిరి
పోరునల్పుచు బహువర్షములు చెలంగి, రఖిలలోకమ్ములును భయమందుచుండ. 376

వ. నాపుడు జనమేజయుండు వారికి శాపం బెటు తొలంగె ననుడు ముని యిట్లనియె.

క. నరులు సురలు భయ మందఁగ, నిరువురు నిట్లుండ బ్రహ్మ యేతెంచి పర
స్పరశాపమ్ములు తీర్చి త, గురహిన్ మిత్రతను గొల్పి గొనకొని యరిగెన్. 378

వ. పిమ్మట వారలును దమ తమ యాశ్రమమ్ముల కరిగి సుఖంబుండి; రెట్టిమహర్షి

లేవియు నహంకారంబు విడనోపరు; తద్దోషమ్మునన కదా మైత్రావరుణ
నితో నిట్లు చిరకాలంబు పోరుగల్గె. 379

క. మానవుల సురల నరులన్, దానవులం గావి యెంతదనుక నరసినం
గానంగరాఁ దొకండును, మానససంశుద్ధి గల్గు మాన్యుం డధిపా. 380

ఆ. వె. మనము శుద్ధిలేని మనుజుం డొనర్చుతీ, ర్థమ్ము జపముఁ దపము దానయజ్ఞ
ముఖ్యకృతులు వ్యర్థములు వాసనారహి, తునకుఁ దత్ఫలంబు దొరకు నిజము.

క. శ్రవణాదికమున మానస, ము విమలముగఁ జేసి తీర్థముననుండి సదా
భవహర మగు దేవీనా, మవిభవముజపించువాఁడు మాన్యుండుకలిన్. 382

వ. నావుడు జనమేజయుండు మహాత్మా! మిత్రావరుణియని చెప్పితి వీనామంబు వసిష్ఠ
నకు గుణప్రయుక్తమో కర్మప్రయుక్తమో నొడువు మనుడు వ్యాసుం డిట్లనియె.

## వసిష్ఠునికి దేహాంతరప్రాప్తి.

క. వరనాయక నిమిశాపము, బొరసి వసిష్ఠుండు దేహము విడిచి మిత్రా
వరుణులకుఁ బొడిమి మిత్రా, వరుణియనం బరఁగెనన నృపాలుండనియెఁగా. 384

క. ముని నవవరాధుఁ జతురా, ననతనయు వసిష్ఠు భూమినాథుఁడు శపియిం
చిన నెట్లు తవిలెఁ గారణ, మును వచియింపు మన మౌని భూపతి కనియెఁ 385

క. కారణము మున్న చెప్పితిఁ, గా రాజవరేణ్య! యెట్టి ఘనులైనను సం
సారమున గుణపరీతులు, ప్రేరేపించు నవి యెట్టి పెనుదుష్కృతికిన్. 386

గీ. రాజు లొనరించునట్టి ధర్మములుగాని, పరమమును లాచరించు తపములుగాని
యమరు మాయాగుణప్రేరణమునఁజేసి, కామలోభమయమ్ము లోకమ్ము నిజము.

క. మొదల వసిష్ఠం డానిమి, కదయుండై శాప మిచ్చె నాభూపతియుఁగా
బదపడి మునిని శపించెన్, విధి దాఁటఁగ నేరితరమె పృథ్వీనాథా. 388

వ. అజగజ్జనని యనుగ్రహమ్ము వడయరేని హరిహరాదులైనను విముక్తులు గాఁజా
లరు. తదనుగ్రహంబు గల సత్యవ్రతాదులు పామరులయును విముక్తులగుట
తెల్లంబ యని మఱియును. 389

క. ఆ యంబిక హృదయం బది, యేయెవ్వారలును గాన రిది నిక్కము కా
సీ యూపె భక్తజనుల న, పాయవిముక్తుల నొనర్చి భరియించు నృపా. 390

వ. కావున నయ్యంబ యందలి భక్తి దోషనిర్మూలనకారణంబగు, నది రాగదంభాది యుక్తంబగునేని ప్రత్యవాయదాయకంబని యెఱుంగుము. 391

క. అమలతరవర్తనుండు, త్తము( డిక్ష్వాకుతనుజుండు ధర్మాత్ముండు భూ
రమణశిరోభూషణ మన, నిమి యను నొకచక్రవర్తి నెగడు నృపాలా. 392

గీ. అతఁడు బ్రాహ్మణహితము దా మతిఁ దలంచి
గౌతమాశ్రమమునకుఁజక్కటి జయంతు
పుర మనెడిపేర నొకపురమును నఖండ
సంపదల కాకరముగ నిర్మింపఁజేసె. 393

వ. పదంపడి యొక్కయెడ నానృపతివరుండు దీర్ఘకాలంబగు నొక జన్నంబు సేయఁ దలంచి తండ్రియగు నిక్ష్వాకునాజ్ఞఁ గొని మహామున్యుపదిష్టప్రకారంబున సంభారం బులు సంగ్రహించి భృగ్వంగిరోగౌతమపులస్త్యఋచీకపులహక్రతుప్రముఖులగు మునుల నామంత్రించి కులగురుండగు వసిష్ఠుం గాంచి యిట్లనియె. 394

గీ. ఐదువేలవత్సరము లయ్యంబ నర్థి, గుఱిచి జన్నం బొనర్చెద గురువరేణ్య
సకలయజ్ఞ సంభారంబు సంగ్రహించి, నాఁడఁ జేయింపు మన నృపున కతఁ డనియె.

వ. అంబామఖం బొనర్ప నుద్యుక్తుండై పాకశాసనుం డింతకుమున్న నీవలె నన్నుం బ్రార్థించె; నాజన్నంబును బంచశతవర్షాత్మకంబ దానినెఱవేర్చి పిదప నీజన్నమ్ముస కరుదెంచువాఁడ నంతదనుకఁ దాళుమనుడు నిమి యిట్లను. 396

క. మునులం బిలిచితి జన్న, మ్మునకున్ సంభారమెల్లఁ బూరించితి మా
యినకులమునకున్ గురుఁడవు, నను వంచన చేసి యరుగ న్యాయ్యమె నీకున్.

వ. ధనలోభమ్మునం జేసి నీ విట్లొనరింపఁదగదని మాటిమాటికి నివారితుండయ్యు వసిష్ఠుండు గణియింపక సురపతి మఖమ్మునకుం జనియె. 398

ఉ. పిమ్మట నైమనస్యమున వేగమె లర్చ నిమిప్రభుండు న
త్స్మృతు గౌతముం గురుపదమ్మున నిల్పి తుషారభూధ్రపా
ర్శ్వమ్మున దేవికిన్ మిగుల సమ్మతిగాఁగ మఖంబొనర్చి ప్రే
మమ్మున నెల్ల ఋత్విజుల మాన్యులఁ జేసె నపారదక్షిణన్. 399

వ. ఇంతకుమున్న వసిష్ఠుం డింద్రమఖంబు సంపూర్ణంబొనరించి తత్కృతపూజలందు నిసి యజ్ఞదీక్షామధ్యమ్మున నిమి గనవచ్చిన నతండు నిద్రావశుండై దర్శనం బొసంగఁడాయె దానం గోపించి వసిష్ఠుండు. 400

చ. కులగురు నన్ ద్యజించి మదిఁ గొంకక వేఱొకనిన్ వరించి నా
యలఘుపదమ్మున న్నిలిపి యాగ మొనర్చుచు నంతఁ బోక యి
వ్వల నినుఁ జూడ రాఁగ నిటు వంచన చేసితి నీదు దేహ మీ
యిలఁ బడెడిన్ విదేహగతి నిప్పుడ చెందుము శాపమిచ్చితిన్. 401

వ. అను నమ్మౌని వచనమ్ములకుఁ దలఁకి భృత్యులు నృపుని లేపిన నతండును జను
దెంచి శాపంబిచ్చుట యెఱింగినవాఁడు గావున గురున కిట్లను. 402

శా. పంకేజాసను నాత్మసంభవుఁడవై పాపమ్ము లెక్కింపకే
హంకారమ్మున శాపమిచ్చితివి నాయందింతయున్ లేదుగా
పంకం; బక్కట లోభబుద్ధివయి భూపాలు న్ననున్ శిష్యు ని
శ్శంకన్ వీడితి సిగ్గెఱుంగవు ధనాశాలోలపత్వమ్మునన్. 403

క. నీదోషము నాయందుం దా, పాదించి శపించి తింతపాపపుఁగోపం
బూఁదిన నీదేహమునకు, నాదశయ ఘటిల్లు నిదియు న్యాయ్యమ్మగుటన్. 404

వ. ఇట్లిరువురును బరస్పర శాపోపహతులైరి. పదంపడి వసిష్ఠుండు చతురాననుకడ
కరిగి యిట్లనియె. 405

క. నిమి యను రాజన్యుఁడు కా, యము వడఁగ శపించె దేహ మన్యము జ్ఞానా
ఢమహిమ మియ్యది పోకుం, డ మహాత్మ యనుగ్రహింపు నావుడుఁ దేమ్మజా. 406

క. చతురాననుఁ డిట్లను స, మ్మతి మిత్రావరుణదేహమహితాంశసమ
న్వితుఁడ వయి పొడమి జ్ఞాన, స్థితి గని పూజ్యత్వ మంది చెలఁగెదు తపసా.

వ. నావుడుఁ దండ్రికి నమస్కరించి తత్క్షణము వరుణాలయమ్మున కరిగి దేహత్యాగం
బొనరించి జీవాంశమ్మున మిత్రావరుణులయందుఁ బ్రవేశించె నంతఁ గొంతొక
కాలమ్మునకు, 408

క. అచ్చటికి నరిగె నూర్వశి, యచ్చపలాక్షిఁ గని వార లతికాముకులై
యచ్చర కిట్లని రెంతయుఁ, బొచ్చెమునకుఁగాని కూర్మి పొసఁగి యెసంగన్. 409

చ. చెలి నినుఁ జూచి మామనము చిక్కెను జక్కరవింటిజోదుకో
ల్తలకుఁ; దలంకుమాన్చి దయదాఁపక యిచ్చకు నచ్చినట్లు దా
నుల మముఁగూడి కేళికలఁ జొక్కుము నావుడు వారియందు ని
శ్చలమతియై వసించె నటఁ జారువిలోచన కూర్మి పెంపునన్. 410

మ. కో. వారితేజము కుంభమందు నవారణంబ బడె నంతలోఁ
జారుదేహులు మౌను లిర్వురు సంభవించిరి దాన న
వ్వారిలోఁ బ్రథముం డగస్తి ప్రభావశాలి వసిష్ఠుఁడున్
ధారుణీశ ! ద్వితీయుఁ డింతయు దైవపాక మెఱుంగుమీ. 411

వ. అం దగస్తి బాల్యమ్మునన తపమ్మునకు వనంబున కరిగె వసిష్ఠుని నిక్ష్వాకుండు గైకొని కులార్థమ్ముగాఁ బాలించుమండె నిది వసిష్ఠదేహాంతరప్రాప్తి నావుడు జన మేజయుండు నిమి యేమయ్యె నుడువుమన వ్యాసుం డిట్లను. 412

క. కవియె మఱియొక్క దేహం, బును వైశమ యవ్వసిష్ఠముని; నిమిభూపా
లున కట్లు కలుగదాయెన్, విను జనవర దీని విధము విస్తృతఫణితిన్. 413

వ. అట్లు వసిష్ఠుండు నిమికి శాపంబిచ్చినఁ గ్రతువ్వర్థం బేతెంచిన ఋత్విజులెల్లరుం గలసి యిట్లు యోజించిరి. 414

క. విపరీతమయ్యెఁ గార్యం, బపూర్ణదీక్షుండు నృపతి యన్యాయముగా
శపియింపఁబడియె దేహం, బపగత మగు నింక దీని నాఁగఁదరంబే. 415

వ. అవశ్యమ్ముగఁ గాఁదగు కార్యమ్ముల నొకం డాఁగనేర్చునే ? యని చింతించి మంత్రశక్తిచే నతని దేహంబు కించిచ్ఛ్వసన యుక్తంబగునట్లు కాపాడి క్రతు సమాప్తి యొనరించుటయు. 416

## నిమికి దేహాంతరప్రాప్తి.

ఆ.వె. క్రతుసమాప్తి యందుఁ గ్రతుభుక్కు లరుదెంచి, జీవమాత్రశిష్టు భూవరేణ్యుఁ
గాంచి పలికి "రధిప కావించె నీజన్న, మెంతయేని మాకు సంతసంబు. 417

క. వరమీఁగ వచ్చినారము, వరదేహమునందు వాంఛనాటునొ లేదే
సురదేహము వాంఛింతువొ, నుఁవర తెల్పు" మన నిమియు నాకుల కనియెన్. 418

క. కాయం బెన్నఁటికేని న, పాయముఁగను దాని గోరః నఖిలదిగద్ర
ష్ట్ర్యాయతనమ్ముల నెప్పుడు, వాయువనై యుండుపొంౘు వాంఛింతునొగిన్. 419

వ. అని పలుకు నిమి యాత్మం గుఱించి దేవతలిట్లనిరి. రాజా ! సర్వేశ్వరి యగు జగ దంబం బ్రార్థించితివేనిఁ దృత్కృతమఖసంతుష్టయగు నప్పరశక్తి నీ వాంఛితం బొసంగు. 420

చ. అని సుర లానతిఁగ నిమి యాత్మ జగజ్జననిన్ విశేషభ
క్తి నెగడ గద్గదస్వరము గీల్కొన సన్నుతి చేయఁ గోటి సూ
ర్యనిభసురూప మొప్ప జగదంబిక గోచరమై వరంబు గై
కొను మన నెల్ల దేవతలకున్ ముద మబ్బురముం జెలంగఁగన్. 421

వ. అంత నిమియు నిసయమ్మున నిట్లను. 422

క. ఈ నెంచెదేని వరమును, జ్ఞానం బప్రతిహతమ్ముగా నొసఁగియు దృ
క్స్థానమ్ములు వాసమ్ములు, గా నిడుమీ సకలభూతగణముల యందున్. 423

వ. నాపుడు జగదంబ యిట్లను. 424

ఆ.వె. జ్ఞాన మబ్బునీకుఁ గర్మావశేషప, ర్యంత మఖిలభూతరాశినేత్ర
వాస మొదవు నిమిషవర్తన నీనిమి, త్తముగ నేత్రములకుఁ దగు నృపాల. 425

క. విను పశుపక్షులు మనుజులు, ననిమిషు లనిమిషులు సుర, లొసంగితి నీ కో
రిన వరము జగదంబిక, చనియెం దనయంత నిమియు సంతసమందెన్. 426

వ. పదంపడి మును లందఱును నిమిదేహ మ్మొక్కెడ నునిచి పుత్త్రోత్పత్తికై యొకక్క
యరణిం దెచ్చి మథించిన నవ్వారి మంత్రబలమ్మున సమస్త లక్షణముల నిమి
కెనయగు నొక్క కుమారుం డుద్భవించి యతం డరణి మథనమ్మున నుద్భవిల్లుటం
జేసి మిథియనియు జనకునివలనఁ బొడముకతన జనకుండనియు నెగడె. 427

క. నిమి దేహంబెడలు నిమి, త్తముగఁ దదన్వయమునందుఁ దగిమె విదేహా
ఖ్య మనుజపతుల కనూచా, నముగ నపార్థకముగాక నరపాలమణీ. 428

వ. పిమ్మట నిమిసుతుండగు జనకుండు ప్రథితుండై గంగాతీరమ్మున మిథిల యను
నొక పురంబు ధనధాన్య గోపురాట్టాలాది నిఖిలసంపత్సమృద్ధంబు రచింపంజేసి
యందు సుఖంబుండె. 429

క. జనకుని యన్వయమందున్, జనన మ్మందిన యశేషజనపాలకులన్
జనకులనఁ బరఁగి జ్ఞాన, మ్మునకుం దానకములగుచుఁ బొలిచిరి పేర్మిన్. 430

వ. ఏతద్వంశజుల కెల్లరకును విదేహజనకనామంబులు చెల్లుచుండు నిది నిమిచరిత్రం
బనవుడు జనమేజయుండు వ్యాసుం గాంచి మహాత్మా! వసిష్ఠుండు గురు వగు
కతనఁ దన్ను శపించినం జెల్లుఁ గాక తాను శిష్యుండును శుభప్రదమ్మగు దేవీమఖ
మ్మునకుఁ గర్తయునై క్షమ దలంపక బ్రహ్మపుత్త్రునకు వసిష్ఠునకు శాపం బీఁదగునే
యనినఁ దా నాత్యవతేయుం డిట్లనియె. 431

క. తెలిపితి నజితేంద్రియులకుఁ, గలుగదు దేహులకు శాంతి, క్షమగల మహనీ
యులు దుర్లభు లిల సన్న్యా, సులయందేనియును శాంతి చొప్పడ దనఘా. 432

ఉ. ఆఁకలి దప్పియు న్విడిచి యన్నిసుఖమ్ములు వీడి యోగియై
తేఁకువ నొప్పుఁగాక తెగఁద్రెంపఁగలేఁడు మనోగతంబులౌ
ప్రాకృతశత్రువర్గముల బార్థివసత్తమ ! యట్టివాని నీ
లోకమునంద కాదు సురలోకమునందును గానరాదుగా. 433

వ. బ్రహ్మపుత్రులైన మహామునీంద్రులును గుణత్రయావిద్ధులై యున్నపు డన్యుల నెన్ననేల ? మున్ను యోగాభ్యాసరతుండును సాంఖ్యవేత్తయు నగు కపిలుండు దైవయోగమ్మున సగరాత్మజుల దహించెః నొక్కండన నేల ? హరిహరబ్రహ్మలాదిగ సకలమ్మును నహంకార కలితంబని యెఱుంగు మహంకారోత్పన్నంబగు జగమ్మునఁ దద్యోగమ్ము దుర్లభమ్ము. 434

క. ఒకవేళ సత్త్వవృద్ధియు, నొకవేళ రజోధికతయు నొకవేళఁ దమః
ప్రకటతయుఁ గలుగు గుణముల;, కకలంకత నొక్కరీతి యలవడ దనఘా. 435

వ. అగుణుఁడును నవ్యయుఁడును బరముఁడును నిర్లేపుఁడును సర్వభూతాలక్ష్యుఁడును నగువాఁడొక్కఁ పరమాత్మ, మఱియుఁ బరశక్తియు నట్టిద. ఈ యిరువురకు నెల్లప్పుడు నైక్యంబని యెఱుంగునది. 436

క. పరమాత్మకుఁ బరశక్తికి, నఁయు నభేదంబు నెవ్వఁ డాతఁడు ముక్తిం
బొరయు నఖండజ్ఞాన, స్థిరుఁడగు నిది యెఱుఁగు వేదసిద్ధాంతముగా. 437

క. జ్ఞానంబు రెండుదెఱఁగులు, గా నెఱుఁగు మొకండు శాబ్దిక స్మృది వేదా
దీనమ్మును శాస్త్రార్థా, ధీనంబు ననై జనించుఁ దెల్లం బధిపా. 438

వ. శాబ్దజ్ఞానమ్మున మతికల్పితమ్ములగు వికల్పమ్ము లనేకమ్ములు వొడము నిఁక రెండవది యనుభవం బనంబడు నిట్టిజ్ఞానం బేరికి దుర్లభంబు. 439

క. ఘనుఁడైన వేత్త దొరకిన, జనునకు ననుభవముగలుగు సకలతమమ్మున్
మునుకొని యడంచు నయ్యది, జనవర ! తమ మడఁపలేదు శాబ్దమ్మెందుఁజా. 440

ఆ.వె. అదియ కర్మ మెద్ది యడఁచు బంధమ్ముల, నదియ విద్దె ముక్తి కమరునెద్ది
శాబ్దికంబు తమము పంహరింపదు దీప, మన్నమాత్రఁ దిమిర మడఁగు నెట్లు ? 441

క. పరహితమును గోపమ్మున్, బొరయమి ధృతి యోర్పు శీలమును సంతోషం
బరయఁగ విద్యకు ఫలములు, నరవర ! ఫల మనఁగరాదు నైపుణి యెందున్. 442

వ. యోగాభ్యాసమ్మున నొందెడి విద్యాభ్యాసమ్మున నొందెఁ గామాదివశం బలవ
దయ్యెవి మనోజాలంబులగుటఁ దజ్జయమ్మునఁ గాని లోఁబడవు. 445

క. మనము జయింపని కతమున, మునిపై నిమిభూవరునకు మొనసెను శాప మ
య్యనఘుఁడు యయాతి మును ఘ, క్రునకున్ బ్రతిశాప మీఁడు క్రూరుఁడు గామిన్.

క. భృగుపుత్రుని శాపమ్మునఁ, దగ జర గ్రహియించె నెంత సాత్త్వికుఁడో యయా
తి గణింప నొక్కఁ డొక్కం, డగపడు సౌమ్యుండు క్రూరు లందఱు జగతిన్.

## హైహయకృత విప్రవధ.

చ. ఒకనిస్వభావ మొక్కగతి నొప్పెడి దీనికి వింతయేల? ము
న్నకరుణులై ధనాశమెయి హైహయు లాత్మపురోహితుల్ కలా
ప్రకటితు లుత్తమోత్తములు భార్గవులన్ బరిమార్ప రేదె? పా
తకములు క్రోధమూర్ఛితు లెదన్ గణియింప రొకించుకేనియున్. 446

వ. నావుడు జనమేజయుం డిట్లనియె. 447

గీ. బ్రహ్మహత్య గణింపక భార్గవులఁ బు, రోహితుల నుక్కడంచిరి హైహయు లవి
పలికితివి వార లెవ్వనికులమునందుఁ, బొడమి రేకారణము కోపమునకుఁ? జెపుమ.

క. కారణము లేనికార్యం, బారయ మగ్రజుల రాజు లఘుమెన్నక సా
ధారణముగఁ జంపుదురే!, వైరం బెంతేని నుండవలయు మహాత్మా! 449

క. బలవంతులయ్యు రాజులు, బలహీనులఁ బూజ్యులైన బాడబవరులన్
గలుషభయమ్మును జెందక, తలదఱుగుట పాడియగునె ధర్మము చెడదే! 450

వ. నా కీ సందియం బెడఁబాపు మనుడు వ్యాసుండు పురాతన కథ స్మృతికిం దెచ్చికొని
యిట్లు చెప్పందొడంగె. 451

చ. కలఁడు సహస్రబాహుఁ డధికంబగు శౌర్యము వొల్చువాఁడు ని
స్తులబలశాలి హైహయుఁడు దుర్జయతేజుఁడు కార్తవీర్యభూ
తలపతి ధర్మతత్పరుఁడు దానమునన్ గడుమేటి యాతఁ డ
గ్గలముగఁ జేసె జన్నము లగణ్యముగాఁ దగు భూరిదక్షిణన్. 452

వ. అతండు హరి యపరావతారంబగు దత్తాత్రేయుని శిష్యుండు; భృగువులకును నట్లె
యాజ్యుండగు కతనఁ దా నొనర్చిన జన్నమ్ములం దొసఁగిన ధనమ్మున వార లతి
ధనికులై హయాదిసంపన్నులై చెలంగుచుండిరి. పదంపడి కార్తవీర్యార్జునుండు

కొండొక కాలమ్మునకు దివంబేగుటయుఁ దద్వంశ్యులగు హైహయులు ధనహీనులై తదర్థంబు తమ గురువులగు భృగువుల యాచింపం జనిన వారలు ధనలుబ్ధులగుకతన నీ నొల్లక కొందఱు పాఁతిపెట్టియుఁ గొందఱు బ్రాహ్మణుల కొసంగియు మఱికొంద ఱెచ్చటేనియు డాఁచియు రాజభయమ్మునఁ బలాయితులై యొక్కపెట్ట దుర్గమంబులగు గిరిగహ్వరమ్ము లాశ్రయించి; రంత హైహయులు వారల గృహములన్నియు వెదకి యొక్కరునేనిం గానక ధనార్థంబు ఖాఖనసం బొనర్చుటకు నుంకించిరి. 453

క. భృగువులయుఁ జుట్టుపట్లన్, దగు విప్రులయు సదనములు త్రవ్విన ద్రవ్యం బగణితముగఁ గన్పడె భీ, తగతిన్ శరణంబు గొనిరి తద్గత విప్రుల్. 454

ఆ. వె. శరణుఁ గనినవారిఁ, జని గిరిగహ్వర, మ్ములను డాఁగువారిఁ బొలియఁజేసి
రెల్ల భార్గవుల నహీనకోపమ్మునఁ, బట్టి దొరకినంతవట్టు నధిప. 455

శా. ఆగర్భమ్మును ధారుణిం బొలిచి ద్రవ్యం బంతయుం గూర్చి భూ
భాగంబెల్లెడ గర్తముల్ గొలిపి చంపంజొచ్చి రాబాలమున్
శ్రీగర్భమ్ములు పాడుచేసి భృగులన్ దీవ్రాస్త్రముల్ చొన్పి రెం
తే గగ్గోలుగ నేడ్చి రంగనలు కన్నీ రేఱులై పాఱఁగన్. 456

వ. అట్టి ఘోరకృత్యమ్మునకు సహింపక సమీపతీర్థవాసు లగు మును లేతెంచి హైహయుల కిట్లనిరి. 457

చ. విడువుఁడు బ్రహ్మజాతి విటు వీరులరై పొలియింపఁ జెల్లునే?
యుడుకుమెయిన్ గటా! వనిత లూరక తల్లడిలంగ గర్భముల్
వొడుచుటపాడియే? నృపులపోఁడుములే యివి! యింత పాపముం
దడఁబడ కాచరించెదరు తప్పక తత్ఫల మిష్ట కన్పడున్. 458

వ. అను మునులకు హైహయు లిట్లనిరి. 459

ఉ. మీరు మహానుభావులరు మిన్నక వీరలు మాదుపూర్వులం
జేరి ఛలమ్మునన్ ధన మశేషము గైకొని డాఁచిపెట్టి రీ
చోరులఁజంపఁ బాతకము చొప్పడునే బకవృత్తులన్? ఋణం
బీరఁట పాదవృద్ధి? కిపు డేమొక కార్యము చేయఁగోరినన్. 460

క. దాత యగు కార్తవీర్యుఁడు, పాఁతుల వైచుకొన ధనము పంచి యిడెనే? మీ
కేతాదృశ మగు కృత్యము, చేతఃప్రీతికర మగునె? చెప్పుఁడు మౌనుల్. 461

చ. క్రతువు లొనర్చి యెక్కుడగు కార్యములం బొనరించి విత్తరి
క్తతతికి నిచ్చి సౌఖ్యమునఁ దా భుజియించి ధనంబు విప్రుఁ డే
గతిఁ దగ వెచ్చఁబెట్టవలెఁ గాకుపికిన్ నృపచోరవహ్నిసం
గతమయి పమ్మగుణా; విడుచుఁగా యది రక్షకు నెన్నిభంగులన్ ? 462

గీ. అట్లు కాదేని దాఁ దాఁచినట్టిధనము, నొరుల కీక భుజింపక యున్న కతనఁ
జచ్చి పరలోకమున కేగి జముని యాజ్ఞ, నరకసంగతుఁ డగు ధననాయకుండు. 463

క. దానము భోగము నాశము, నా నెగడున్ మూడు గతులు నరు లా రెంటిఁ జా
మానిన మూడవగతిచేఁ, దా నడఁగు ధనం బదెంత దాఁచిననైనన్. 464

గీ. ఏము పాదవృద్ధి నీ నెంచి మాపుకో, హితుల విజయమెసఁగ బుజము నడుగ
నీఁ దలఁప రిట్టిహీనులు రాజుల, మైన మాకు దండ్యులగుట తప్పె ? 465

క. కృపణు లదాత లభోక్తలు, నెపమున నార్జించువారు నేఁ డిదె కిరా
రుపకారరహితులు ఘో, మిపతులకుఁ దండ్యులనుట మీ రెఱుఁగనిదే. 466

వ. అట్లగుట వంచకులును బ్రాహ్మణాధములును నగు మీరల దండించుటకు మహాత్ము
లగు మీరలు క్షమియింప వలయునని యమ్మాముల నెట్టకేలకు నొప్పించి భృగు
పత్నుల గర్భమ్ములు పగుల్చుచుండ నయ్యంగన లందఱును దుఃఖార్తలై హిమవ
త్పర్వతమ్మున కరిగిరి. 467

గీ. హైహయులచేత ధనలోభ మమర విప్రు, లిట్లు హతులైరి, యెవ్వారికేని లోభ
మెక్కుడగుశత్రు, వద్దాని నెనయువాఁ డొ, వర్పఁగారానిపములు భూనాథ ! లేవు.

చ. కులము నడంచు ధర్మమునకుం జెడు, దల్లినిఁ దండ్రి నాత్మజా
తుల హితులన్ గురూత్తములఁ దోఁజవియించిన యన్నదమ్ములన్
బలనలఁ జుట్టలన్ మది దలంకక చంపగఁజాలు లుబ్ధుఁడౌ
తులువకుఁ జేయరానిపని లేదు ముజ్జగమందుఁ జూచినన్. 469

గీ. కామమునకన్నఁ గ్రోధమ్ముకన్న నెక్కు, డైనశత్రు వహంకృతికన్న లోభః
మదిగలుగువాఁడు ప్రాణమ్ములైన విడుచు, నన్న నవ్వాఁ డొవర్పని దన్య మున్నె ?

ఉ. నా జనమేజయుండను మునమ్మగు నీవచనామృతంబు నెం
తేఁ జవిగొన్న నింతకయుఁ దృప్తి యెసంగదు భార్గవాంగనల్
రాజభయమ్మ పీడుటయు బ్రాహ్మణవంశము వృద్ధియున్ మునీం
ద్రా ! జనవంద్య, నాకుఁ గృప నానతి యిచ్చి కృతార్థుఁ జేయవే. 471

వ. నావుడు వ్యాసుండిట్లను, రాజేంద్రా ! హైహయపీడితలై భృగువనితలట్లు హిమవం
తమ్మున కరిగి యచ్చట మృణ్మయంబగు గౌరీవిగ్రహం బొనర్చి సరిత్తటమ్మున
నిల్పియు ఘోషణపూర్వకమ్ముగఁ దత్పూజల నొనర్చుచు మరణమ్మునకుఁ గృత
నిశ్చయలై యున్నంత, 472

క. ఒక రాత్రికాలమున దే, వి కృపావతి యగుచుఁ జారువేషిణియై వా
రికి స్వప్నమందు "మీలో, నొకతెకు నూరుజుఁడు పురుషుఁ డుద్భవమందున్. 473

క. వినుఁ డతఁడు మామకాంశం. బునవాఁ డగుకతన శక్తిపూర్ణుండై మి
మ్మును బ్రోవఁగలఁడు నమ్ముం", డని చెప్పి తనంత నరిగె; నంతట వారల్. 474

వ. మేలుకాంచి సంతోషదంతురితాంతరంగలై యున్నంత నందొక్క వనిత యూరు
వుచే గర్భమ్ము ధరియించి క్షత్రియభయమ్మున నెందేఁ బోఁ దలంచి పలాయనం
బొనర్చుచున్న యది రాజులచేఁ జూడంబడి ఖడ్గపాణులై తమ్ము వెన్కొనుసవ్వ
రికిఁ దలంకి గర్భరక్షణార్థం బాక్రోశించుచు నిరాధారయై సింహగృహీతయు గర్భి
ణియు నగు హరిణింబోలి కుందుచున్నంత, 475

## ఔర్వోత్పత్తి.

క. తనతల్లి దీనదశఁ దాఁ, గని సైఁపక యూరువుం బెకల్చుకొని తటా
లున శిశువు వెలికి వచ్చెఁగా, దిననాథుంబోని మేటి తేజము వెలయఁగా. 476

క. ఆచిన్నిశిశువు తేజము, చూచినతత్క్షణమునంద చూడ్కులు పెడి యా
రాచజనమ్ములు గిరులన్, ధీచెడి జన్మాంధులనఁగఁ దిరిగిరి భూపా. 477

వ. అట్లు తిరుగుచు వారలందఱు నొక్కెడకుఁ జేరి తమమనమ్ముల నాశ్చర్యంబును
దైన్యమ్మునుం బొడమ నిట్లు యోజించిరి. 478

క. బాలకుఁ జూచినయంతన, యేలొకొ నేత్రములు వోయె నిందఱకుం ద
ద్బాలకు మహిమమొ లేకా, లీలావతివ్రతముపెంపో లేక మతేమో. 479

వ. అని చింతించి బ్రాహ్మణప్రభావం బగణ్యం బని యెంచి హైహయులు మెల్లమెల్లన
నామె యున్నెడకరిగి తమభయమ్మున వడంకు నాబ్రాహ్మణికిఁ గృతాంజలులై
శరణంబు వేఁడుచు నిట్లనిరి. 480

ఉ. అమ్మ ! నిమం గనుంగొనినయంతన కన్నులు వోయె నీచరి
త్రమ్ము సహింపఁగా వశమె గ్రక్కున మమ్ము ననుగ్రహించినే

త్రమ్ముల నీఁగదమ్మ దయ దప్పుట పాడియటమ్మ దృగ్విహీ
నప్రగుజీవనమ్ము మరణమ్మున కెక్కుడు గాదె యేరికిన్. 481

ఆ. వె. ఇంక నిట్టికర్మ మేమొనర్పము భార్గ, వులకు సేవకులము తెలిసి తెలియ
కాచరించినట్టియఘము క్షమించి క, న్నుల నొసంగు మమ్మ నెలమి మాకు.

వ. ఇది మొదలు భృగువులయెడ హైహయు లందఱును వైరంబు విడిచి వర్తింప నట్లు శపథం బొనరింతుము. నీవును బుత్రుండును సుఖం బుండం గలరు మమ్ము ననుగ్రహింపు మనుడు వారలకు నాబ్రాహ్మణి విస్మయంబు గదుర నిట్లనియె. 483

ఉ. మీనయనమ్ము లే నెఱుఁగ మీపయిఁ గోపము లేదు నాకు మ
త్సూనుఁడు బంధుఘాతకుల దుష్టుల మిమ్ముటు చేసె నక్కటా!
కానక మంచిపెద్దల నకారణ మర్థపరత్వ మూని వి
ద్యానిధులైనతాపసుల నట్లొనరించిన రిత్త వోవునే? 484

క. గర్భగతులైనశిశువుల, నర్భకులన్ వృద్ధులన్ దయాశూన్యత సం
దర్భ మెఱుంగక చంపిన, నిర్భాగ్యుల మిమ్మడఁప జనించె నితఁడొగిన్. 485

ఆ.వె. ఊరుగర్భుఁ డగుచు నుండెను శతవత్స, రమ్ము లితఁ డాగమమ్ములెల్ల
నపుడు సంగ్రహించె వంశాకటాక్షమ్ము, కతన నాకుఁ గొడుకుగా జనించె. 486

గీ. పితృవధమ్మున మిగులఁ గోపించియున్న, వాని మత్పుతు నౌర్వు నవంధ్యశక్తి
వేఁడికొని వేఁడి మాన్పుఁడు వేగ మీకు, నేత్రములు గల్గ వింతయు నిక్క మనుడు.

వ. వార లందఱును వినయసంభ్రమమ్ము లిగురొత్త మునిపుత్రుండగు నాయౌర్వు సన్ను
తించినఁ బ్రసన్నుండై యతం డంధులగు హైహయుల కిట్లనియె. 488

గీ. దేవనిర్మితములు తప్పవోవు వెట్లు, వాని కొక్కింత తజ్జ్ఞుఁడు వగవఁబోఁడు
ఋషుల కిఁక సౌఖ్య మబ్బెడి దృష్టి లెప్ప, టిగతి మీకుఁ జెలంగు, నరుగుఁడు కదలి.

వ. అని యౌర్వ్యం డనుగ్రహించుటయు. 490

ఉ. ఆతనియాజ్ఞ నొంది నృపులందఱు నెప్పటియట్ల లోచనో
పేతత నేగి, రక్కొమరు నెంతయుఁ బేర్మి గడల్కొనంగఁ ద
న్మాత గ్రహించి యాశ్రమమునన్ దగఁబెంచుచునుండె, వర్ధకా
మాతురులైన హైహయులకైనపరాభవమున్ గ్రహించితే. 491

వ. నావుడు జనమేజయుం డిట్లనియె. 492

గీ. భారతులకెల్ల భరతునివగిది యాద, వులకు యదునృపునట్ల వీరల కులమున
హైహయుం డనునొక్క రాజలరెనే? ము, నీంద్ర! లేకున్న హైహయు లెట్టులైరి?
వ. నావుడు వ్యాసుం డిట్లనియె, రాజేంద్రా! సూర్యపుత్రుం డగు రేవంతుఁడనువాఁ
డొక్కనాఁ డుచ్చైఃశ్రవమ్ము నధిష్ఠించి భగవద్దర్శనాకాంక్షియై వైకుంఠమ్మున
కరిగె. 494

## హై హ య వం శ ము.

క. లచ్చియు నన్నయయినయు, యుచ్చైఃశ్రవమున్ గుమారు నూరక కోర్కెల్
పెచ్చుపెరుఁగ సంస్తంభన, మచ్చుపడం జూచుచుండె నాలో హరియుఁ. 495
ఆ.వె. హయము నెక్కి వచ్చునతిమనోహరుని రే, వంతుఁ గాంచి విస్మయాంతరంగుఁ
డగుచు భార్య కిట్టు లనియె "నో చార్వంగి! యెవ్వఁ డొక్క గుఱ్ఱ మెక్కి వచ్చె!
వ. భువనత్రయ మోహనుండగు నివ్వాని నెఱుంగుదే" యని మాటిమాటికి నడిగినఁ
దన్మయచిత్త యగు నక్కోమలి ప్రత్యుత్తరం బీనేరదయ్యె; నంత నతండు
మోహితఁగా నాపె నిశ్చయించి కోపాకులుండై యిట్లను. 497
చ. వినుమిఁక నేమి చూచెదవు? వేఁదుఱువట్టినదానిభంగి; నీ
మన మవశత్వముం బొరపె మానిని! యీ హయదర్శనమ్మునన్;
జనువున నెల్లెడన్ రతి నెసంగుటచే రమవై చలత్వ మూ
నినకతనన్ జలాఖ్యవయి నెట్టన నీ వపకీర్తి నొందుమా. 498
గీ. ప్రాకృతాంగనవోలె ధైర్యమ్ము విడిచి, హయముఁ గామించి చంచలవైతికాన
బడబవై మర్త్యలోకసంభవము చెందు, మనుచు శాపమ్మునకు భీతినంది రమయు.
ఉ. శోకము పెల్లుగాఁగ మధుసూదను పాదయుగంబు శీర్షమున్
సోఁకఁగ మ్రొక్కి దీనదశ చొప్పడ నిట్లను "దేవదేవ! న
న్నీకరణిన్ శపింతె? కృప యించుక లేదె? స్వభావసిద్ధమై
నాకడ నుండుపేర్మియు వినాశము చెందెనె? యింతమాత్రలో. 500
క. ఎన్నండుఁ గోప మెఱుఁగక, వెన్నవలెఁ జెలంగునీదువిధ మింతటిలో
సన్నగిలి క్రొత్తయగునే?, చన్నె? న న్నిట్లు శాపసంగతఁ జేయన్. 501
క. నిను విడనాడి బ్రతుక నే, ర్తునె ప్రాణము లిపుడ దొరఁగుదు నీశాప
మ్మున కంతమ్ము గృపామతిఁ, గని చెప్పు" మనంగ నతఁడు కరుణార్ద్రుండై.

ఆ.వె. వినుము నీదుగర్భమున నాకు నెన యగు, పుత్రుఁ డొక్కఁడుండు పుట్టనెప్పు
డపుడ శాపమోక్ష మగు నన్నుఁ బొందంగ, నబ్బు నీకు నిక్క మబ్జనయన. 503

వ. అనవుడు జనమేజయుం డిట్లనియె. 504

గీ. కాలయోగమ్ముకతన నిక్కరణి శాప, మంది ప్రోషితభర్తృకయై యుండి యొంటి
బడబయై యెంతదనుకఁ దా విడుమవడసె, నెట్లు సంతానమును గని మేగెఁ జెపుమ.

క. నావుడు వ్యాసుండిట్లను, దేవంతుం డబ్జనాభువీతిం గని కో
పావిష్టుండని భయపడి, వేవేగ నమస్కరించి వెలువడి యంతన్. 506

క. తనతండ్రి సన్నిధికిఁ జని, వినయమునన్ గడచినట్టి వృత్తాంతమ్ముల్
మనుకొని నుడివె రమయు న, వ్వనరుహలోచనుని యాజ్ఞ వడసి చనఁదగన్. 507

సీ. చని మున్ను రవిభార్య ఘనతపమ్మున నున్న • చోటునఁ దపసయి సూర్యపుత్రి
గలసినయెడ సర్వకామప్రదస్థాన • మున సుపర్ణాక్ష సంజ్ఞను బొగడ్త
దవిలిన దానికుత్తరమున శోభన • కాననమ్ముల నొప్పుగన్న యెడల
బడబయై శంకరుఁ బంచాస్య దశభుజుఁ • జంద్రశేఖరు గజచర్మవసను

గీ. నీలకంఠుఁ ద్రిలోచను నిఖిలకాము • దాత నవదాతవిగ్రహు ధరసుతార్ధ
దేహు గుఱిచి తపమ్ము మదీర్ణవృత్తి • దివ్యవర్షసహస్రమ్ము దివిరిచేసె. 538

వ. తత్తపమ్మునకు మెచ్చి యద్దేవుండు పార్వతీసహితమ్ముగ వృషభవాహనుండై
ప్రమథగణమ్ములు గొలువఁ బ్రత్యక్షంబై బడబారూపిణియగు హరిపత్నిఁ గిట్లనియె.

ఉ. ఏల తప మ్మొనర్తు జగదీశ్వరి నన్ను గుఱించి దేవి ని
న్నేలెడివిష్ణు వన్నియును నీఁదగునట్టి సమర్థుఁ డక్కటా
బేలవె? భర్తఁ దక్కియు వివేకిని కింకొకదైవ ముందునే
స్త్రీలకు నెట్టిదైన పతిఁ సేవ్యుఁడ కాఁడె త్వదీశుఁ దల్పుఁడే? 510

చ. అనవుడు లచ్చి యిట్టులను నంతయు దథ్యము, శాప మిచ్చె వ
వ్వనరుహనేత్రుఁ డయ్యది కృపామతినై యెడఁజేసి యుద్ధరిం
ప నిను యజించితిన్ దగఁ దపమ్మునఁ; "బుత్రుఁడు గల్గమీఁదఁ బో
వు" ననియె శాప, మెక్కరణిఁబుట్టు సుతుండు మహాత్మ! చెప్పవే. 511

క. వైకుంఠమ్మున నాపతి, యీకాననమందు నేను నిరువురకును నే
లా కల్గుఁ గూడియుండుట, యేకత లేకున్నఁ బుత్రుఁ డెట్లుదయించున్. 512

ఉ. నాదు తపమ్ము పేఁతకు మనమ్మున మెచ్చితివేవిఁ గామితం
బీఁదగు నీకు నాపతికి నించుక భేదము లేదు దీని ము
న్నాదరరీతి నాదయితుఁ డానతియిచ్చెఁ దదాది మీకు నే
భేదము చూడ నిట్టి విను వేఁడుట యాతని వేఁడుటే కదా. 513

సీ. అతఁడ నీవు నీవ యతఁడని యెఱిఁగిన, దానఁగాక నిన్నుఁ దలఁతునేని
నా సతీత్వమునకు దోసమ్ము గల్గు న, నంగ మెచ్చి యయ్యనంగరిపుఁడు. 514

ఉ. జ్ఞానులు వేదవేదులు సకల్మషులౌ మునులుగా నిలింపులన్
గానఁగ లేక తప్పుమునం గాలము వ్యర్థమొనర్తు రేక్రియం
దీని నెఱింగి తీపు వినుతింపఁ దగుగా గదు నీ వివేక మెం
దేనియు నంగనాజనులఁ కింతటి బుద్ధివిశేష మొప్పునే. 515

క. హరిభక్తులు నను నిందిం, తురు మద్భక్తు లతినిందితుం జేయుదు రా
హరి; నింపకేవి మాయం, తర మెఱుఁగఁగరా దదెట్టి తత్త్వజ్ఞులకున్. 516

గీ. కలియుగమ్మున మాయుభయులకుఁ గల్గు. నేకత నెఱుంగ లేక దుర్గీకు లజ్ఞ
లింతకన్నను వాదమ్ము లెనయుచుంద్రు, తెలియుదురు మేటివిజ్ఞాన మొలయువారు.

వ. నీ కీయభేదజ్ఞానం బెట్లు చొప్పదె నెఱిఁగింపు మనుడు శంకరునకు లక్ష్మి యిట్లను,
మహాత్మా మున్నొకనాఁడు మన్నాథుండు మంతనమ్మున ధ్యానపరుండై పద్మాసన
గతుండై యున్నయెడ విస్మితనై యే నిట్లంటి. 518

ఉ. మున్ను సురాసురుల్ దగ సముద్రము ద్రచ్చునెడగా జనించి నే
నెన్ని నినున్ వరించితి సురేంద్రులకెల్లను మేటి వంచు; నీ
కు న్నళినాక్ష! ధ్యాన మొనఁగూడుట కేమి నిమిత్త, మెందునే
వి న్నిను దాఁటువేల్పులు గణింపఁగ లేరుకదా వచింపుమీ. 519

చ. అనవుడు నాథుఁ డిట్టులనె, నంబుజనేత్ర యొకప్పు దేమ న
య్యనిమిషవంద్యుఁడైన గిరిజాధిపుఁ గొల్తు వొకప్పు డాతఁడు
న్ననుఁగొనియాడు నాతఁడు మనఃప్రియుఁడెంతయు నాకు నేను నా
తనికిని నట్టివాఁడ విను తత్త్వము భేదము లే దొకింతయున్. 520

గీ. ఎవ్వఁడేవియు నా భక్తుఁ డెఱుక లేక, శంకరుని నిందఁజేయు నాజడుఁడు నరక
మందుఁ బడువాఁడు తద్భక్తుఁ డట్లనన్ను, నిందఁ జేసిన నగు నింత నిక్కమనుచు.

వ. నాకుఁ బోధించెఁ దదాదిగ నేను మీ యిరువుర యభేదంబు నెఱుంగుదాన నన్నను

గ్రహించి నాకు మద్వల్లభుతోడి కూడిక యెట్లొనఁగూడు నట్లొనర్పుమని ప్రార్థించు
లచ్చికి మహేశ్వరుం డిట్లనియె. 522

క. చింతింపనేల ? నీ తప, మెంతే సంతోస మొసఁగె నిఁక నీమెద సు
స్వాంతుం డగు నీపతి యో, దంతిగమన నీకు నొక్క తనయుఁడు పుట్టున్. 523

క. హయరూపమ్మున శ్రీహరి, దయగలఁడై యిటకు వచ్చి తన్విరో ! నీకుం
బ్రియుఁడగు నా ప్రేరణ న, మ్మ యథార్థమ్ముగను నీకుఁ బుత్రుఁడు పుట్టున్. 524

ఉ. ఆ కొమరుండు లోకులకు నందఱకుం దలదాఁటి ఘనుఁడై
యేకముగా జగం బఖిల మేలెడివాఁ డయి యేకవీరుఁడన్
ప్రాకటమైన నామమునఁ బ్రాభవ మొప్పఁ జరించు హైహయా
ఖ్యాకము వంశము న్నెగడఁగాఁ గల దాతఁడు కారణమ్మగన్. 525

వ. ఇమ్మెట నీవును భర్తంగూడి వైకుంఠమ్మున కరిగి సుఖం బుండఁ గల దని చెప్పి
మఱియును, 526

గీ. హృదయగతయైనపరశక్తి నెఱుకఁ గలిగి, గొలువ నేరక యుత్తరఁ గొలనకతన
నీకు నిట్లప్ప శోకంబు నిజము దీని, శాంతి కిప్పుడ యుద్దేశించు హేతువు. 527

చ. అని వరమిచ్చి శంభుఁడు తనంతఁ జనెన్, గమలాక్షి సజ్జగ
జ్జననియు నంతరాత్మ విలసత్సుదృఢైక్యశిరోవిరాజినా
తసమణికాంతిరంజితపదద్వయభాసినఖా మహేశ్వరిన్
వినయమునం దలంచుచును వేశ్క్యమెయిం బతిరాక గోరుచున్. 528

వ. ఉన్నంత శంకరుండు కైలాసమ్మున కరిగి ప్రమథులయందు నొక్కరుఁడగు చిత్ర
రూపునిఁ జూచి యిట్లను. 529

క. వైకుంఠమ్మునకుం జని, శ్రీకాంతునితోడ నిట్లు చెప్పుము "పత్నీ
శోక మ్ముడుపు" మనుచు మై, త్రికలనం దనకు నేను దెలిపితి ననుచున్. 530

చ. అని యనుపంగ నేగె నతఁ డంచితవైష్ణవభాసురంబు సు
స్వనశుకహంససంయుతము చారునరాకలితంబు నృత్తగీ
తనినదవాసితంబు వితతద్రుమభూషిత మప్రమేయసౌ
ధనిచయమండితంబు నగు తామరసాక్షుపురంబు వేడుకన్. 531

క. హరిసదనద్వారమ్మున, స్థిరులై వర్తించు సుప్రసిద్ధుల వేత్రో
ద్ధురపాణుల జయవిజయుల, నరసి హరికిఁ జెప్పుఁడనుచు సంతట జయుఁడున్. 532

ఆ.వె. హరివిగాంచి యిట్టులనుఁ "చిత్రరూపుఁ డనఁ, దూత శంకరాజ్ఞ చేత వచ్చి
తివిరి దర్శనము ప్రతీక్షించి యుండె రాఁ, దగునొ తగదొ" యన నతండు పేర్మి.

క. వైశమలోనికి రమ్మని, కాలగళునిదూతఁ బిలువఁగాఁ దగునన స
చ్ఛీలుఁడతఁ డట్లొనర్పఁగ, నాలో నా చిత్రరూపుఁ డంజలిగొనుచున్. 534

క. ఎదుటికిఁ జని మ్రొక్కిడఁ బే, ర్మిదగ "గిరీంద్రునకు సేమమే ? నీ విటకుం
గదలి యరుదెంచు టెందుల, కొదవమగా దేవకార్య మొక్కఁడొ ?" యనుడున్. 535

క. దేవా ! సంసారమ్మున, నీ వెఱుఁగని దొకఁడు గల్గునే ! నన్ను మహా
దేవుం డనుపఁగ వచ్చితి, దేవరతో నొక్క మనవి దెల్పి చనంగన్. 536

వ. ఆతండు చెప్పుమనిన తెఱంగు విన్నవించెద నాకర్ణింపుము. 537

క. నీతరుణి లచ్చి కాళిం, దీతమస్తాసంగమమున నేమమ్ము మెయిన్
జేతము ధ్యానాయత్తం, బై తగ మన్నది తురంగమాకారమునన్. 538

చ. సురముఖసేవ్యయై సకలలోకవినాశినియైన యేసిరిన్
వరుఁడు త్యజించి దుఃఖకలనం బడు నట్టిచెలిం ద్యజించుఁ నీ
కరయఁగ సౌఖ్యమున్నె ? సతి నల్పుఁడునున్ విడ నిచ్చగింపఁ డె
క్కరణి నదోషయంచు మదిఁ గాంచియు భార్యను నీడితో హరీ. 539

ఉ. ఎవ్వనికాంత కస్తిపను నెగ్గను నాతనిజీవితం బిసీ
నవ్వుదు రెల్లశత్రువులు; నాపలుకుల్ విని వైశ మబ్ధిజన్
నెవ్వగఁ బాపి కైకొనుము నెమ్మది నమ్మద మంద నక్కటా
జవ్వనిఁ బాయుదుఃఖ మది శక్యమె యిట్టి దటంచుఁ దెల్పఁగన్. 540

మ. మను నామావిని దక్షయాగమున వమ్ముం జేసె దేహమ్మునో
వనజాతాక్ష ! తదంగనా విరహసంప్రాప్తంబు దుఃఖంబు నా
కనుభూతంబగుటన్ మతొక్కనికి భార్యాఽయోగమన్నన్ మనం
బనమోదింపదు కష్ట మింతకును నన్యం బేది సంసారికిన్. 541

ఉ. పిమ్మట నద్రిజం దపముపెంపునఁ గొంటి నగాత్మజాతయై
నమ్మతి దక్షపుత్రికయె జన్మమునందుటఁజేసి: మేటి క
ష్టమ్ములకెల్ల గష్టమకటా తరుణిం ద్యజియించి యెట్లు ప్రా
ణమ్ముల నిల్పితో యెఱుఁగ ! న్యాయమె నీకిటు లొంటినుండుటల్. 542

గీ. వేయి సంవత్సరములాయె వెలఁది వీడి, యేమి సౌఖ్యముఁ గొంటి నీ వింతకాల
మరుగుమిఁక జాగుసేయక యశ్వరూప, మపర నీ కాంత వసియించునట్టిచెరకు.

వ. అట్లు చని కొపమంగని భార్గవీసహితుండవై స్వస్థానమ్మున సుఖయింపుమని
శంకరుండు విన్నవింపుమనియె నను చిత్రరూపుని పలుకులఁ బ్రేరితుండై యశ్వ
రూపమ్ము దాల్చి. 544

గీ. బడబ యగు సింధుజాత యున్నెడకు నరిగి
కని మనమ్మున విస్మయమ్ము నతఁడొందె
నతని హయరూపుఁ గని విస్మయంబు నందె
లచ్చి; సంగతి యిరువుర కచ్చపడియె. 545

## ఏ క వీ ర జ న న ము.

క. మదనార్తు లగుచు నిరువురు, పదపడి యిటు లెనయ గర్భభర మధరఁగఁ జే
ర్మిఁ దనూజుఁ గనియె రెండవ, మదనుం డనఁ దగిన వాని మరి ముద మెనయఁగా.

వ. పిదప బడబాకృతి యగు సిరికిఁ దాదృశుఁడగు హరి యిట్లనియె. 547

క. బడబారూపం బిప్పుడ, విడువుము వైకుంఠమునకు వేగమ చనఁగాఁ
గడఁగుట యొప్పదె విడువం, బడుఁగాక తనూజుఁ డిచటఁ బంకజనయనా. 548

వ. నావుడు లచ్చి కరుణంబున నిట్లను. 549

క. తనువునఁ బుట్టిన కొడుకున్, వనమున విడువంగ మనము వచ్చునె యేయం
గనకైన? విన్నదీతట, మన వీ శిశువునకు దిక్కు ముందెవ్వరొకో. 550

క. అనునాలో నిరువురకును, ననువయ్యెన్ దివ్యదేహ మంతవిమాన
మ్మును నేగుదెంచె దానిం, గని సిరి హరి కిట్టు లనియెఁ గడుఁ గరుణమునన్. 551

గీ. సర్వలక్షణముల నీకు సదృశుఁ డైన
శిశువు నిట దిగవిడువ నేఁజెల్ల నెత్తి
కొనుము మూగురమును వేగు టనువుగాదె
యనుడు హరి యిట్లులనె సింధుతనయ కెలమి. 552

వ. ఇక్ష్వాకులకు నే నొక్కకార్యార్థంబు నిర్మించితి నది యెట్లంటేని, యయాతికిఁ దుర్వ
సుం డను నొకపుత్రుండు గలఁ డతనికి హరివర్మ యని పితృదత్తంబగు నామాంత
రంబు విశ్రుతంబగు నారాజన్యుండు పుత్రకామియై తపం బొనరించుచున్నవాఁడు

మత్స్ప్రేరణమ్మున నతం డిత్తనయుఁ బరిగ్రహించి పోషింపఁగలఁ డతఁడు వచ్చు
దనుక నాయానతిం జేసి యీతని కొండు భయంబు లేకుండునని యాపె నాశ్వా
సించి తత్సహితుండై వైకుంఠమ్మున కరిగె నావుడు జనమేజయుండు వ్యాసున
కిట్లనియె. 553

గీ. జాతమాత్రునిఁ గొమరుని శంకఁ దక్కి, విజన మగు కాననమ్మున విడిచి చనిన
పిదప సింహాదిమృగములం బీడ యతని, కబ్బకుండునె? గతి యెవ్వరైరి చెపుమ.

వ. అనిన వ్యాసుం డిట్లనియె నట్లు లక్ష్మీనారాయణులు విమానం బధిష్ఠించి చనిన
పిమ్మట మదాలస యను తన భార్యం గూడి ముచ్చటించుచుఁ జంపకుండను నొక
విద్యాధరుండు విమానమార్గమ్మున దైవవశమ్మున నచ్చటికి వచ్చి నిరుపమానతేజః
పుంజంబై యొప్పు నా శిశువు నాలోకించి విమానమ్ముదిగ్గి మదనసన్నిభుం డగు
నక్కుమారుఁ గైకొని మదాలస కిచ్చిన నత్తన్వియు నిధి గన్న పేదంబలె నసమం
దానందంబు నంది శిరంబు మూర్కొని యాలింగనం బొనర్చి కన్నవానింబలె నెంచి
యుత్సంగమ్మున నిడికొని పతి కిట్లను నాథా! యీతఁ డెవ్వఁడు? నీకెట్లు దొరకె?
నిక్కాననమ్మున నెవ్వరు డించి చనిరొకో? యనుడుఁ జంపకుం డిట్లనియె. 555

క. వనితా! యీతం డెవ్వఁడొ, చని యడిగెద శక్రు; నతనిసమ్మతి యేనిం
దనయునిఁగాఁ బెంపందగు, నని వైళమ యింద్రునొద్ద కాతం డరిగెన్. 556

గీ. అరిగి సంతోషసంతరితాంతరంగుఁ, డగుచుఁ బుత్రునిఁ జూపి యిట్లను మహాత్మ
యెవనిబాలకుఁడో యితఁ డెఱుఁగ రాదు, దొరకెఁ దమసాతటంబునందు వనమునందు.

క. తమసాకాళిందీసం, గమమున నేవనిత డించి కామునిపైఁ బ్రే
మము వీడి చనియెనో ని, క్కము నీసమ్మతినిఁ బుత్రుఁగాఁ గైకొందున్. 558

వ. ధర్మశాస్త్రమ్ముల నిట్టిండు గృత్రిమతనయుండుగాఁ జెప్పంబడుఁ గాదే యనుచంపకు
నకు నింద్రుం డిట్లనియె. 559

చ. ఇతఁడు హయస్వరూపు లగువిందిరకున్ హరికిన్ జనించె న
ప్రతిముఁడు హైహయుం డనఁగఁ బాటిలునీశిశువున్ సృజించె శ్రీ
పతియు యయాతిపుత్రునకుఁ బంపొనరింపఁగ; వేగ విద్వ భూ
పతి హరిప్రేరణంబు గొని బాలునికై యటకేగు నింతలో. 560

వ. అతఁ డరుగునంతకు నీ విబ్బాలు నచ్చట విడువవేని యారాజు దుఃఖితుండగు
నబ్బాలుం డేకవీరుండను నామమ్మునఁ బృథివీతలమ్మున నెగడువాఁ డగునని యని

దలంచికొని యాఅవమానమ్మున నన్నప్రాశనంబును మూఁడవయేటఁ జూడాకర్మ
మ్మును బొనరించి విప్రుల ననేకవిధదానమ్ముల సంతుష్టులంజేసి. 571

క. ఏకాదశాబ్దమందు శు, భాకారున కాసుతునకు నా నృపవరుఁడ
స్తోకము మౌంజీబంధ, శ్రీకము సంస్కార మొప్పఁ జేసి కడంకన్. 572

వ. వేదమ్మును ధనుర్వేదమ్మును నభ్యసింపఁజేసి పట్టాభిషేకయోగ్యుండగు నాతనికిఁ
బుష్యార్క యోగసంయుక్తంబగు శుభదినమ్మునఁ దదనుకూలసంభారంబు లొనరించి
వేదశాస్త్రతత్త్వజ్ఞులగు విప్రుల రావించి సాగరమ్ములయుఁ దీర్థమ్ములయుఁ బవిత్ర
జలమ్ములు దెప్పించి స్వయముగా నభిషేకం బొనరించి విప్రులకు ధనంబు లొసంగి
స్వర్గకాముండై భార్యాసహితమ్ముగ నరణ్యమున కేగి మైనాకశిఖరమ్మున వాన
ప్రస్థుండై యుండి పత్రపలాశాహారనియతిం బార్వతిం గుఱించి తపం బొనరిం
చుచుఁ జిరకాలం బటనుండి దైవికమ్మున నిరువురును దేహత్యాగం బొనరించి
యింద్రలోకమ్ము నొంది సుఖం బుండిరి. పదంపడి యేకవీరుం డీ యుదంతంబు
విని యౌర్ధ్వదైహికమ్ములు నిర్వర్తించె. 573

క. పితృదత్తమ్మగు రాజ్యము, హితగతి నొనరించి భోగ మెనయుచు నొకనాఁ
డతఁ డరిగె మంత్రిపుత్రా, న్వితముగ నమరాపగకు సమీక్షాపేక్షన్. 574

వ. కోకిలాలాపముఖరితమ్ములును బుష్పఫలభరితమ్ములును షట్పదవిరాజితంబులును
నగు పనసచంపకవకుళతిలకతాలతమాలజంబూచూతకదంబకంబులును వేదధ్వని
మనోహరమ్ములును హోమధూమావృతగగనమ్ములును మృగశాబసమన్వితమ్ము
లునవగు ఋష్యాశ్రమమ్ములును గోపికాసురక్షితమ్ములును శాలిసంపక్వమ్ములును
బ్రఫుల్లపంకజారామమ్ములునగు కేదారమ్ములును, మనోరంజకమ్ములగు నికుంజ
మ్ములును వేర్వేఱ యరయుచు నన్నదియొడ్డునఁ దిరుగువాఁడు ముందట, 575

ఉ. ఆ యమరాపగాజలమునందు శతచ్ఛదమైన యబ్జమ
త్త్యోయజదక్షిణమ్మున విధుప్రతిమాననఁ గాంచనాంగిఁ బ
ద్మాయతనేత్ర దీర్ఘకచ నద్రికుచ స్నవకంబుకంఠి నే
దో యొకచింతమై నొగులు నుగ్మలి నొంటరిఁ గాంచె నొక్కటన్. 576

క. కని శోకకారణం బడి, గి నరేంద్రుం డిట్లు వల్కెఁ గేవలమనుజాం
గనవో? గంధర్వివో? యీ, వనిమిషసుందరివో? తెల్పుమా పే రెవరో? 577

క. ఏకాకినివై రోదన, మేకతమునఁ జేయుదాన? వెవ్వఁడు జనకుం?
డీకాఱడవి న్నిను నెవఁ, డీక్రియఁ ద్యజియించె నాథుఁ డెవ్వఁడు పికవాణీ? 578

ఆ.వె. చోర బాధ గాని క్రూరమృగమ్ముల, బాధ గాని నాదుపాలనమున
లేశమాత్రమైన లేదు శోకనిమిత్త, మేమొ తెల్పు దాని నేనడంతు. 579

క. మానవులో, దేవతలో, దానవులో పేరు గ్రుచ్చి తరుణీ! నాతో
మానక తెల్పుము నీదుః, ఖానుగతికి మూల మగిన నచ్చెరి యనిమెన్. 580

క. విను నృపవర నాదుఃఖ, మ్మునకు నిమిత్తము విపత్తి మొనయునిదో నె
ట్లనువగు శోకము ప్రాణికి, మనుకొని వచియింపు దీనిమూలం బెల్లన్. 581

వ. భవద్దేశమ్మున కన్యం బగు దేశమ్మున రభ్యుఁడను మహీనాయకుండు గలఁ డతం
డతిధార్మికుం డయ్యనఘు భార్య రుక్మరేఖ యనఁ బరఁగు నాపె సంతానహీన యగు
కతన దుఃఖితయై యొకనాఁడు తన కాంతున కిట్లనియె. 582

## ఏకావళీవృత్తాంతము.

క. తనయరహితమగు మజ్జీ, వనముమృథా యని తలంతు వంధ్యాత్వమునక
న్నను నంగనలకు దోసం, బనఘా! పేర్పొందు గలదె యరయఁగ నెంచన్. 583

వ. ఇట్లు భార్యచేఁ బ్రేరితుండై యానృపాలుండు బ్రాహ్మణుల రప్పించి సంతానార్థం
బగుక్రతు వొనర్చునెడ. 584

ఉ. చారుశరీర శీతకరసామ్యమువం దగుమోము వొల్పు భ
వ్యారుణనేత్ర రక్తచరణాంచిత శోభనకేశి కాంచన
శ్రీరుచి నొప్పుకన్నె మృదురీతి నెసంగెడివన్నెలాఁడి యిం
పారఁగ నగ్నికుండమునయం దుదయించె నఖండితప్రభన్. 585

వ. పరంపడి హోత యక్కన్నియఁ దనకరమ్మున గ్రహియించి నృపునకుం జూపి
యిట్లను విప్రాలి * యేకావళినా బిలిపించుటఁ జేసి యేకావళీనామమ్మున నెగడుఁ
బుత్రతుల్యయగు నీపుత్రికం గొని సుఖితుండవగుము విష్ణుఁ డిద్దాని నొసంగె నావుడు
రభ్యుం డత్తలోదరిం గొని సంతుష్టాంతరంగుండై తనభార్య యగు రుక్మరేఖ
కొసంగిన నాపెయుఁ బుత్రుంగన్నదానివలనమ్మున నామోదించె నంత నృపతి జాత

* ఏకావళి, ముక్తావళి.

కర్మాదికం బొనర్చి జన్నంబు సమాప్తినొందించి ఋత్విక్కులంబూజించి తన గృహమ్మున సుఖంబుండె. 586

గీ. పుత్రవృద్ధి నెసఁగుచు నప్పువ్వుబోఁడి, తల్లిదండ్రుల కతులముదమ్ముగూర్చు నానృపు నమాత్యునకు నేను నాత్మజాత, పేరు వినుము యశోవతి ధారుణీశ. 587

గీ. మా యిరువురకు పీడు సమాన మగుట, నృపుఁడు నన్నొనరించె నచ్చపంనేత్ర కనుఁగునెచ్చెలి గాఁగ; మే మదియుఁగోలె, నొక్కటిగనాడికొనుచుందుమొప్పిదముగ.

క. పరిమళవాసితములు మేల్, సరసీజము లెచట నుండు నమ్మతి నచటన్ నరవరపుత్రికిఁ గ్రీడా, దర మెక్కుడు దానఁజేసి తద్దయు నెమ్మిన్. 589

వ. ప్రతిదినమ్మును నన్నుంగూడి తక్కఁగల నెచ్చెలులు గొలువ గంధవంతంబులగు పంకజంబులం బొల్చు గంగానదికిం జని యయ్యేకావళి క్రీడించు నియ్యది యతి దూరంబని యే నెంతవారించిన నాపె చెవిఁబెట్టకునికి నొక్కనాఁడు తజ్జనకునితో నిట్లంటి. 590

క. నీకొమిరె ప్రతిదినము కమ, లాకరములయందు వాంఛ నంది సఖులతో నేకతమ వనములందు ని, రాకులతం దిరుగు నదుల కరుగు నృపాలా! 591

వ. నావుడు రత్న్యుండు తననగరున భ్రమరమనోహరములును బుష్పితమ్ములునగు కమలంబులం బొల్చుతటాకమ్ము లనేకమ్ములు పొందుపఱచి యేకావళిం గాంచి బుజ్జగించి యిట్లను. 592

క. అమ్మా! నీకుం గమలవ, నమ్ములయం దిచ్చయేని నవసారసయు క్తమ్ములగు నిచ్చటి తటా, కమ్ములఁ గ్రీడింపు మరుగఁగాఁ బోకు మెటన్. 593

వ. అని తండ్రి నియమించినను గమలాసక్తచిత్తయగు నక్కన్నియ యథాపూర్వమ్ముగ దూరస్థమ్ములగు నదులయెడఁ గ్రుమ్మరు నయ్యది వీక్షించి నృపాలుండు పుత్రిక యెడఁ గల్గు కూర్మి పెంపున శస్త్రపాణులగు భృత్యుల రక్షార్థంబు నియోగించె. 594

క. ప్రతిదినముం బితృసమ్మతి, నతివలతో నన్నుఁ గూడి యబ్బాలిక ని ర్గతయై గంగానదికిం, గతాగతములం బొనర్చుఁ గౌతుక మెనయున్. 595

వ. అంత నొక్కనాఁడు ప్రాతఃకాలమ్మున సఖీసమేతయై రక్షకులు వెంటనరుదేరఁ గ్రీడాపరాయణయై యిమ్మెయిడ కరుదెంచి యింతకుమున్న యచ్చరలతో వచ్చియున్న కామపత్నితోఁ గమలక్రీడ నొనర్చుచుండె, నయ్యెడఁ గాలకేతుండను నొక్క రక్కసుండు బహురాక్షసగణపరివృతుండై యరుదెంచువాఁడు పంకజక్రీడ నొనర్చు

మత్సఖి నేకావళిం గాంచి తద్రూపమ్మున కచ్చెరువడి హరింప నెంచి దగ్గఱకు వచ్చు
నాలో నాలోకించి యే నిట్లంటి. 596

క. రక్కసుఁ డెవ్వఁడొ యిచ్చటి, కుక్కుమెయిగా వచ్చె నసన ముపతిమఁ దానా
దిక్కు మొగంబై యెద భయ, మెక్కు వనుం గలసి పొమ్మె ప్రకల్పనమునన్.

వ. పదంపడి కాలకేతుండు గదం గైకొని సత్వరగతి నేతెంచి రక్షకులం దటిమి జగ
న్మోహిని యగు మత్సఖిం గైకొని యరుగుచుండ నే వనానమున నుపత్రస్తమానసనగు
నా నెచ్చెలి రోదనంబు విని చేయునది లేక యేను వాని కిట్లంటి. 598

క. అక్కట! మత్ప్రాణం బగు, నిక్కలికిం గొనఁగ నేల? నే వచ్చెద నీ
విక్కమలాక్షిఁ ద్యజింపుము. చక్కఁగ నన్ గొనుము కరుణ సల్పుము పేర్మిన్.

వ. అను నావచనమ్ములు గణింపక యరుగు నారక్కసుని కడ్డుపడి రక్షకులు సంగరం
బొనర్ప వాని పరిచారకులగు రాక్షసులు స్వామికార్యతత్పరులై యెదిరి యోధించిరి.

ఆ. వె. కాలకేతు విట్లు గండున రక్షకా, వళిని దునిమి నాదు ప్రాణసఖిని
గొనియు వేగ దన్నుఁ గొలువ గఁ దనపురి, కరుగునంత నేను నతవివెంట.

వ. తీవ్రగమనమ్మున రోదనం బొనర్పుచు నరుగునంత నన్నుం గాంచి యేకావళి కొంత
స్వస్థచిత్త యయ్యెఁ, బదంపడి యెట్టకేలకు దగ్గఱ కరుగుచు నన్నుం గౌఁగిలించి
కొని స్తంభస్వేదసమాకులయై కన్నీరు కాలువఁగా నేడ్చుచుండఁ గాలకేతుఁడు ప్రీతి
పూర్వకమ్ముగ నాకిట్లనియె. 602

గీ. నాకలోకమ్మునకు సరి నాఁగవచ్చు, మత్పురం బయ్యది యకనుమా మృగాక్షి
బెగడుమై నగడుపడు నీ ప్రియసఖీమ, ణికి వచింపుము ధైర్యమ్ము నెమ్మిఁ గ్రమ్మ.

క. ప్రీతిమెయి మీకు దాసుఁడఁ, గాతరతం గుందనేల? కడు మోదమునన్
జేతము స్వస్థముగాఁగ వి, రాతంకత నుండుఁడని సహాదరమెసఁగన్. 604

వ. నన్ను నమ్మృగాక్షి కెలన రథమ్మునఁ గూర్చుండఁ బెట్టికొని శీఘ్రగమనమ్మునఁ
దనపురి కరిగి సంతసం బెసఁగ నొక ధవళగృహమ్మున మమ్ము రయమున నుంచి
చుట్టును ననేకుల రక్కసులఁ గావ నియమించి మఱునాఁ డట కరుదెంచి యంత
నమ్మున నన్నుం గాంచి యిట్లనియె. 605

క. శోకముఁ ద్యజించి నీ చెలి, నాకుం బత్ని యగునట్లొనర్పుము రాజ్య
శ్రీ కధికారిణి తా నను, మేకోరికయైనఁ దీర్తు నే సేవకుఁడన్. 606

వ. నావుడు వానికే నిట్లంటి నీకుం బ్రియం బొనర్చునంత సమర్థత లేదు నన్ను మగ్ర

హించి నీవై యిక్కన్నె బోధింపుమనుడుఁ గామాతురుండు కాలకేతుండు మత్స్యాక్షి
కిట్లనియె. 607

ఉ. మానిని నన్ గలంచుటకు మంత్రము నొక్కఁడు పంచి దాన మ
న్మానసముం గా గ్రహించి నిను నమ్మిన దాసుని వీనిఁ బ్రోవఁగాఁ
బూనక యుంట పాడియె? సముజ్జ్వల మీ నవయౌవనంబు ని
త్యానుగతంబు గామి వినవా? సఫలం బొనరింపఁ జెల్లదే. 608

వ. నావుడు "మజ్జనకుండు నన్ను రాజపుత్రున కీ నెంచె మన్మనంబున హైహయుం
డను రాకొమరు వరించి యున్నదాన సనాతనమగు ధర్మమ్ము వమ్ముఁజేసి తక్కొ
రుల నెట్లు కైకొందుఁ దలిదండ్రుల యిచ్ఛ కనుగుణుండగు వరు వరింపఁదగు
వారలు గావి కన్యకలు స్వతంత్రలే!" యను నక్కలికియందుఁ గరుణింపక పాపా
త్ముండగు నద్దానవుం డయ్యుద్యమంబు విరమింపఁడ, అవ్వాని పురంబు పాతాళ
వివరమ్మున ననేక రక్షోగణరక్షితంబై యేరికిఁ జొరరాకుండు ననుడు నేకవీరుండు
యశోవతి కిట్లనియె. 609

క. నిను నీ నెచ్చెలితోడం, దనపురమున నుంచె నంటి దానవుఁడు మనం
బున సంశయంబు దోఁచెడిఁ, జనుదెంచితివెట్టు లిటకుఁ జంచలనయనా. 610

గీ. హైహయుండను రాజన్యు నాత్మఁ గోరి, యున్నదాన నటంచు మీ వన్నెలాడి
పలికె నంటివి నను దక్క పార్థివుండు, హైహయుడు లేడు నన్ఁ గోరెనా లతాంగి?

క. మీ నెచ్చెలి జనకుండగు, మానవనాథుండు నన్ను మన్నించి యిడం
గా నీ కన్నియఁ గనియెనె?, మానక నాతోడఁ జెప్పుమా వెలిపేలా. 612

వ. అట్లేని యా రక్కసు నడంచి యిప్పుడ యప్పడఁతిఁ దోడ్తెచ్చి నీవంతం బాపఁ
గలవాఁడ నప్పట్టణంబునకు మార్గమ్ము నాకెఱింగింపుమని వెండియు. 613

ఉ. దానవుఁ డాత్మజాత నిటు దారుణరీతిని గొన్న సంగతిన్
మానవ నాయకుండు వినెనా? యటులేని ప్రయత్నమేమియుం
దానొనరింప కుండునె? సుతాహరణమ్మునకన్న దైన్య మెం
దేనియుఁ గల్గనే? యతఁడు హీనబలుండె? మృగాక్షి! తెల్పుమా. 614

వ. నీ పక్కన్నియ గుణమ్ములు చెప్పినదిగోలె మన్మనంబు తదధీనంబై యెప్పు డయ్యై
తివ విడిపింతునని సంరంభమ్మునఁ బొదలుచున్న యది. నాకుం గమనోపాయమ్ము

నాడివి నీవెట్లు వానిఁ గికురించి వచ్చితో తెలుపుమను నయ్యేకవీరునకు యశోవతి యిట్లనియె. 615

గీ. చిన్నతనమున నొక మంత్రసిద్ధుఁ డిచ్చె, నాకు మంత్రంబు నరనాథ! వ్యాకులత్వ
మదర నా రక్కసుని పురమందు నుండు, నెడలఁ దన్మంత్రరాజంబు స్మృతికివచ్చె.

క. ఆ మంత్రమ్మున దేవిన్, గామప్రదఁ గొలుతునేనిఁ గలుగును మోక్షం
బేమెయి నని యోజించి స, దా మనమున నంబ నిలిపి తత్పర నగుచున్. 617

వ. రక్తాంబరయు రక్తనయనయు సృష్టిస్థిత్యంతకారిణియు సౌమ్యయు విశ్వేశ్వరియు నగు నప్పరశక్తి గురించి మంత్రంబు జపియించిన నాపె యనుగ్రహించి నాకు స్వప్నమ్మునఁ బొడకట్టి యిట్లనియె 618

ఉ. వైళమ లెమ్ము పొమ్ము సురవైరిభయమ్మును వీడి గంగ కో
బాలరో! యేగుడెంచెడి నృపాలుఁడు హైహయుఁ డేకవీరుఁ డెం
తే బలితుండు మచ్ఛరణనీరజబంభరితాంతరంగుఁ డీ
లో బలి నన్నదీతటికి ఉంతితిశత్రుఁ దతండు పేర్మిమై. 619

క. దత్తాత్రేయమహాముని, దత్తంబై యెంతకేనిఁ దగియెడివానిం
జిత్తమున మహావిద్య న, మత్తుండై పఠన చేయు మత్ప్రీతికినై. 620

వ. లక్ష్మీపుత్రుండగు నన్నరవరుండు విహారం బొనరించుచు నిన్నుం గాంచి శరణంబై రాక్షసుం జంపి యేకావళి విడిపింపఁ బిమ్మట నీ నెచ్చెలి కారాజసుతుం బతిగా నీ వొనరించునది యని చెప్పి యాపె యంతర్ధానం బగుడు మేల్కాంచి స్వప్నవృత్తాంతంబు వచించిన నేకావళి ప్రసన్నవదనయై నా కిట్లనియె. 621

గీ. అప్పరాంబిక వచనంబు తప్ప దిద్ద, మేగు మతిరయమున గంగ కీవు నాకుఁ
బ్రీతి యొనరింపు మనిన నాపె వచనమున, నిటకు వచ్చితిఁ బరశక్తి కృప నృపాల.

వ. జగజ్జననియు నాకు శీఘ్రగమనంబును మార్గజ్ఞానంబును నొసంగె నియ్యది యస్మదీయోదంతం బింక నీ వృత్తాంతమ్ము నుడువుమను నయ్యశోవతి కేకవీరుం డిట్లనియె. 623

గీ. సంపదలనిచ్చు చెలి నాకు జనని హైహ, యుండ నన్నేకవీరుఁ డటండ్రు, మన్మ
నంబు పరతంత్రమయ్యె ననంగజనక, మైన మీ చెలి వృత్తాంత మానుకతన. 624

చ. మొదల సమస్తలోకముఁ మోహము గొల్పెడి దాని సుంద మిం
పొదవ వచించి తంత మదనోదయమయ్యె, గుణమ్ములన్ వచిం

ప దొరఁకొనన్ మనంబు వశమై ఖరి నొప్పె "నినుఁజావరించె నా
సుదతి" యటంచుఁ జెప్పి నను సుందరి! దాసునిఁజేసి తింతికిఁజా. 625

ఉ. ఏమి యొనర్చువాఁడఁ గమలేక్షణ! మీ కుపకార; మెట్లు నా
కా మహిళాజనాభరణ మాయనవద్యవిలాస యాకన
త్కోమలగాత్రి యున్నయెడకుం జననౌ? నెటు వానిఁ జంపి యా
సామజయానఁ దేరనగు? జన్మము సార్థకమై చెలంగఁగన్. 626

క. ఆపురిమార్గము చెప్పుద, యాపద లెవ్వారు? నీవ యనుకంపఁజా సం
తాపపరీతుని నను సౌ. ఖ్యోపేతు నొనర్పు మింత యొప్పదె నీకుఁజా. 627

చ. నడిచితివేని వైశమ మనోగమనమ్మున నేగి రక్కసుం
బొడిచి నృపాలపుత్రిక సముజ్జ్వలతేజ మెసంగఁ దెచ్చి పెం
పడరఁగ నిన్నుఁ గూర్చి రయమారఁగఁ దత్పురిఁజేర్చి పేర్మిమీ
యొడయనికిం బ్రమోద మిడ నోపుదు నొక్కత్రుటిన్ దలోదరీ. 628

వ ఇట్లు సల్పుట నీకును నాకును మనఃప్రియంబగుఁ బిమ్మటఁ దజ్జనకుండు వివాహం
బొనర్చి నన్నాదరించుఁ బరదారాపహర్తయగు నవ్వాని వధించు నుపాయంబు
నీయధీనంబై యున్నయది తత్పురంబుచూపి మత్పరాక్రమంబు గనుఁగొందుగాక
నావుడు యశోవతి ప్రియకారియగు నన్నరేంద్రువచనంబులకు సంతసించి గమనో
పాయం బిట్లు వచించె. 629

క. జననాథ! మంత్ర మిచ్చెదఁ, గొను మాపై సేనతో నకుంఠితవృత్తిన్
జని యా రక్కసు ననిలోఁ దునిమెదు తేనేర్తువా విధువదన నెలమిన్. 630

వ ఆవి యుత్తలోదరి దత్తాత్రేయునికతనఁ దనకు లభించిన త్రిలోకీ తిలకంబను
మంత్రం బుపదేశించినఁ దత్ప్రభావమ్మున సర్వజ్ఞతయు సర్వాంతశ్చారితయుఁ గలి
గిన నన్నరవరుండు సైన్యసమేతుండై యయ్యంగనతోఁ బన్నగావిష్టంబగు పాతా
ళంబుపగిది రక్షోగణరక్షితంబగు తత్పురమ్మున కరుగుటయు, 631

గీ. వచ్చుసైన్యమ్ము వీక్షించి పెచ్చుపెరుఁగు, దుడుకుమైఁ గాలకేతుని దూతలెల్ల
నరిగి యేకావళీకన్యకాంతికమున, వినయము లొనర్చు తమపతిఁ గని భయమున.

వ. ఇట్లనిరి. 633

ఉ. సైన్యము చుట్టురా నెగడు చక్కని రాచకొమారుతోడ ని
క్కన్యకుఁ దోడునీడయగు కామిని వచ్చుచునున్న దవ్వరా

జన్యభయంకరుం డతఁడు శక్రతనూజుఁడొ । కార్తికేయుఁడో ।
యన్యుఁడొ । చెప్పఁ జొప్పడ దహంకృతి కాకృతి నాఁగఁవోఁచెడిన్. 634

వ. యోజనత్రయమ్ములోఁ దత్సైన్యం బున్నయది, యిటకు వచ్చునంతలో సన్నద్ధుండ వగుము కాదేని యిమ్మృగాక్షి విడిచి శరణమ్మేనిఁ గొనుము నావుడుఁ గాలకేతుండు క్రోధమూర్ఛితుండై సబలంబుగా రక్షోవీరుల బనిచి మరల నేకావళీకటమ్మునకు వచ్చి ప్రణయమ్మున నమ్మదిత కిట్లను. 635

ఉ. వచ్చెడివానిఁ దెల్పు మనవద్యచరిత్రుఁడు నీదుతండ్రి దాఁ
బొచ్చెములేనికూర్మిఁ గనుపొంచె వెసం జనుదెంచెనేని నే
హెచ్చగుపేర్మి నెద్ద యెదురేగి రణం బొనరింప కింటికిం
దెచ్చి బహూకరించెద ననిం దెగటార్చెద నన్యుఁడైనచోన్. 636

వ. నావుడు నేకావళి యిట్లను, నీబంధనమ్మున నున్ననా కతం డెవ్వఁడో యెఱుంగ రాదు. మజ్జనకుండొండె మత్సహోదరుండొండెఁ గామి విక్రమంబు, మఱియెవ్వఁడో మహాబలశాలియై యుండనోపు నిందుల కతం డేమిటికతమ్మున వచ్చెనో యని శంకింతు నావుడు దైత్యుం డిట్లను. 637

క. దూతలు "యశోవతియ యిట, కేతెంచెఁగా సేనగొలువ నెవ్వఁడొ తనతోఁ
బ్రీతిమెయి రాఁగ" ననిరి య, రాతులు నాకితరు లెవరు ? రాకేందుముఖీ. 638

వ. అతండు నీజనకుండకా యని తోఁచెడి. యశోవతి యిటనుండి యెట్లరిగె ? నీ వెఱుంగుదే ? యని పలుకునాలో మరల దూత లేతెంచి యిట్లనిరి. 639

క. దగ్గఱకు వచ్చె సైన్యము, నగ్గగు నిఁకఁబురము వేగ నుంగొని చనుమీ
ప్రెగ్గడలతో రణమ్మున, కెగ్గుఁ దద వాచరించితే నిఁక మనకున్. 640

వ. నావుడుఁ గాలకేతుండు తూర్ణంబుగ రథ మెక్కి సేనాయుతుండై చనునంత నేక వీరుండును హయారూఢుండై కామినీవిరహసంజనితక్రోధుండై తలపడియె. నిట్లిరువురును దలపడి వృత్రవాసవుల విధమ్మున ఘోరంబగు సంగ్రామం బొనర్చునెడ,

గీ. అస్త్రశస్త్రములెల్ల దిగంతరములఁ, నాక్రమించెఁ దమంబు భూచక్రమెల్లఁ
బొంచెఁ, గాతరులకు భయం బొదవె నంత, నేకవీరుండు గదఁగొని యేసె నతని.

క. వ్రేటువడి రక్కసుఁడు శత, కోటిహతిం దెగిన మేటికుధరంబన ను
త్పాటితజీవనుఁడై పడె, నాటోపశఁటక్కి సైన్య మటునిటుఁ జెదరెఁగా, 643

వ. పడఁపడి యశోవతి సత్వరమ్మున నరిగి యేకావళికిట్లను. 644

చ. పనిగొని యేకవీరనరపాలకుఁ డుక్కడఁగించి రక్కసుం
దునిమె లతాంగి! నెవ్వగలఁ దొల్లుము వే చనుదెమ్ము నిన్నుఁగా
వినినకతమ్మునన్ గనఁగ వేడుకచెందు నృపాలునిం గృపా
ళుని సదయాంతరంగమున లోఁగొని యాతని యప్పు దీర్పుమా. 645

క. మున్ను నిను విన్నదాదిగఁ, దన్నెఱుఁగక విరహవార్ధిఁ దవిలిన నృపునిక్
మన్ననఁ జేయుటకన్నను, బున్నెముఁ బురుషార్థ మొకఁడు పుడమిం గలదే. 646

వ. నావుడు లజ్జితయై యే నస్వతంత్రనై యాతని నెట్లు వీక్షింతుఁ గామార్తుండగు కతన నన్నతం డెట్లు గ్రహింపకుండునని చింతించుచు యశోవతీసహితమ్ముగ నరయానమ్మున నేకవీరు వికటమ్మున కరుగుటయు, 647

క. మలినాంబరధారిణి న, న్నళినాక్షిం గాంచి పలుకు నరపతి "నేత్రం
బుల తృష్ణదీఱ నొకపరి, తిలకింపవేఁడిరా! యొసంగు దర్శన" మనుచున్. 648

వ. సిగ్గునక్రమ్మగ్గు నగ్గజగమనయై ఖరియుఁ గామార్తుండగు నన్నరనాథు చిత్తమ్మును గాంచి సీతకోవిదయగు యశోవతి యిట్లనియె. 649

ఉ. ఈ వశినాక్షిఁ దండ్రి తగ సీదలఁచెక్ మదినీకుఁ ; ద్వద్వశం
బై నెగడుక్ లతాంగి హృదయం; బొకయించుక నైఁచితేని శా
స్త్రానుగతిక్ వివాహమగు నందఱకున్ హృదయంగమంబుగా
నా, నతఁ డిర్వురంగొని ఘనమ్ముగఁ దత్పురమేగె నేగినన్. 650

వ. నృపాలుం డెదురేతెంచి కుమారిక నాలోకించి సంతసించి యశోవతినివేదితవృత్తాంతుండై యేకవీరుం గలసికొని గారవించి గృహమ్మున కరిగి విధివిధానమ్ముగ దైవజ్ఞనిర్ణీతంబగు నొక్క సుముహూర్తమ్మున నతనికి గన్యాదానమ్ముచేసి వివాహంబొనర్చి పారిబర్హం బొసంగి యశోవతీసమన్వితమ్ముగ నత్తింటి కనిచె. 651

గీ. అట్లు భార్యాసమేతుఁడై యరిగి పురికి
నేకవీరుండు భోగమ్ము లెనయుచుండె
నతని తనుజుండు కృతవీర్యుఁ డతనికొడుకు
కార్తవీర్యుండు వంశ మిక్కరిణి నెగడె. 652

వ. నావుడు జనమేజయుం డిట్లనియె. 653

చ. అనఘ! భవన్ముఖాంబుజమునం దుదయించెడి సత్కథామృతం
బును దగఁ గ్రోలునాకుఁ దుదముట్టదు తృష్ణ: విచిత్రమై మనం

బెనసెను హైహయాధిపుల యెల్లచరిత్రము, దేవదేవుఁ డ
బ్జనయనుఁ డన్నియుఁ గా నలఁపువాఁడు స్వతంత్రత లేక యశ్వమై. 654

వ. కొమరుంగన్నవార్త యత్యాశ్చర్యం బయ్యెడిననిన వ్యాసుం డిట్లనియె. 655

## వ్యాసుని పశ్చాత్తాపము.

సీ. విను జనమేజయ! మును నారదుఁడు బ్రహ్మ • పుత్రుఁడు దా నెల్లపుడమిఁ జూచు
వాంఛమై సామములఁ బాడుచుఁ జదువు వీ • ణానినాదమ్ము మోదానుభవము
నొసఁగంగ నొకనాఁడు వెస సరస్వతి యాత్ర • మందును మునినివాసంబు శస్త
దంబు పావనమునై తనరు శమ్యాప్రాశ • మునకు నేతెంచిన మొనసి యేను

గీ. నర్ఘ్యపాద్యాది సత్కృతు లాచరించి • యాసనస్థితుఁడైన యయ్యనఘునొద్ద
భక్తిమై నుండి యిట్లంటి "భవ్యతేజ! • కలదె! సంసారమున నించుకయు సుఖంబు.

ఉ. ద్వీపమునన్ జనించితిని దెంపరినై యట పిదెఁ దల్లి య
య్యాపదకోర్చి కర్మమున నయ్యటవిం బెనువొంది యాత్మజా
శాపరిపూర్తికిన్ దపము సల్పితి నెక్కుడు కాలమంత న
త్తాపసగమ్యుఁడిచ్చె సుతుఁ దత్త్వవిదుం గిరిశుండు నాకొగిన్. 657

గీ. వాఁడు వేదంబు పఠియించి పండితప్ర, వరుఁడయి యశంబుగొని పిదు వచనము విని
సంసృతిఁ ద్యజించి నాదు విచార మెన్న, కరిగె లోకాంతరంబు వేమసఁగవచ్చు.

చ. పదపడి హా! శుకా! యనుచుఁ బావనుఁడౌతనయుంగుఱించి దుః
ఖదశ నడంగి మేరుగిరిఁ గాతరతం ద్యజియించి మాత నె
మ్మదిఁ దలపోసి యేగి యట మజ్జనవిన్ దగ శంతనుండు మే
లొదవ గ్రహించెనంచు విని యుంటి నిటం దపమాచరించుచున్. 658

వ. అంతఁ గొండొకకాలమ్మునకు శంతనుండు దివం బనుగుటయుఁ బుత్రద్వితయ
సంయుతయగు మజ్జనని విధురయై భీష్మునిచే రక్షింపఁబడు చుంటయుఁ జిత్రాంగ
దుండు రాజగుటయుఁ బదంపడి యతండు మృతుండగుటయు విని పుత్రదుఃఖ
మ్మునఁ గుందుతల్లి నూఱార్పనేగి భీష్మసహితుండనై యోదార్చితి. మీదఁ భీష్ముండు
విచిత్రవీర్యునకు రాజ్యం బొసంగి కాశిరాజతనూజల నిరువురం దెచ్చి సత్యవతికి
సమర్పించిన శుభకాలమ్మున వారి నిరువురఁ దన చిన్నకొమరునకుఁ బెండ్లిచేసె.
నియ్యది విని యేను సంతుష్టుండనైయుండ సంతట నతండును మత్కర్మవశ

మ్మున ననపత్యుండై రాజయక్ష్మవ్యాధికతన మృతుండయ్యె. దాన సత్యవతి దుఃఖాతురయై యున్నెడఁ గోడండ్రరైన యంబికాంబాలిక లాపెంజూచి సహగమనంబున కాజ్ఞ యిమ్మని ప్రార్థించిన నాపె యొసంగక నన్ను స్మరియించిన నాపె మనోభావంబు గుర్తెఱింగి యే నటకరిగి యాపిన్నతమ్మునికౌర్ధ్వదైహికమ్ము లొనర్చి తల్లి నోదార్చి హస్తినగరమ్మునన యుండి యొక్కనాఁడు కృతాంజలినై తల్లీ! న న్నేలరప్పించితి వచింపు మనవుడు సత్యవతి "పుత్రా! నీసహోదరు లిర్వురును ననపత్యులై పరలోకమ్మున కరిగిరి. వంశచ్ఛేదమ్మునకుఁ గొంకి నిన్నుఁ దలంచితి. మదాజ్ఞం జేసి గాంగేయు ననుమతమ్మునఁ గురుకులాభివృద్ధికై కడంగి కాశి రాజ సుతలయందు సంతతిం బడయు మిద్దాన దోషంబు వాటిల్ల" దన నేను జింతాలజ్జా మగ్నుండనై యమ్మహాభాగ కతివినయమ్మున నిట్లంటి. 660

ఉ. ధర్మ మెఱింగి యేను బరదారసమాగమ మెట్లొనర్తు? దు
ష్కర్మ మొనర్చి వంశమును గాచిన దానఁ దరించి యెంతయున్
శర్మగతిం బితృప్రతతి సంతస మందునె? న్యాయశాస్త్ర స
న్మర్మములం బురాణములు మత్కృతముల్ జననీ యెఱుంగవే. 661

ఉ. నావుడు నన్నుఁ జూచి వదనమ్మున విన్నఁదనమ్ము దోఁపఁ బు
త్రా! విను పుత్రశోకము కతమ్మున దైన్యము నందియున్న నా
భావ మెఱింగి యిట్లొనరుపంగదవయ్య! తమంతఁ బెద్ద లే
యేవిధులాచరింతు రవియే మన కుత్తమధర్మశాస్త్రముల్. 662

క. ఈవిధి దోషం బయ్యును, నావచనంబును నీకు న్యాయ్యంబగు దో
షావహమయ్యును బెద్దల, చే విహితంబైన దానిఁ జేయుదు రనఘుల్. 663

క. అని పలుకునంత గంగా, తనయుఁడును దదనుసరణము దగ నిట్లను నో
యనఘా! జననీవాక్యము, గొని విహరింప కిటులేల కొంకెదు చెపుమా. 664

క. అని యాతండును జననియు, నను బురికొల్పిన విచారణంబుడిగి జగ
జ్జనవింద్యమైన యా కృతి, కనుమోదించి రతిఁగొంటి నమజాంగనతో. 665

వ. అంత నయ్యంబిక నాయెడల విముఖత్వమ్మునం బొదలి కనుమూయుటకుఁ గనలి "నీ కంధుం డుద్భవించు" నని శపియించి మఱునాఁడు రహస్యమ్మున శాపకారణంబు తల్లికెఱింగించిన నాపె కోపించి నన్ను శిక్షించి మరల నిట్లానతిచ్చె. 666

ఆ. వె. కాశిరాజతనయ కడుజవ్వనమ్మునఁ, బొలుచు పగుల యంబచెలియ ననఘ
దానిఁ గొని మఱొక్కతనయునిఁ గను మంధుఁ, డగునె రాజ్యమునకు నర్హుఁ డనుచు.

వ. జనని యానతిఁ జేసి విచిత్రవీర్యు ద్వితీయభార్య ఋతుమతియగు దనుక నట వసించి
యుక్తకాలమ్మున లజ్జితాననయై శయనాగారమ్మున నున్న నాకడ కరుదెంచిన
యత్తన్విం గలయ నుంకించితి. 668

క. ఘనహీనుని జటిలునిఁ దా, పనుఁ గేశిలోలు నన్నుఁ బరికించి ఘనం
బెనఁగమి స్వేదవదనయై, యసమంజసబుద్ధిఁ బాండుతానుగయగుచుఁ. 669

వ. పార్శ్వమ్మున వేపమానయగు నామఱఁదలిం జూచి కోపించి "గర్వమ్మున నన్నుఁ
గాంచి పాండురవైతి గాన నీకొమరుండు పాండుండగు నని శపించి యా రేయి
నెట్లో యాపెతోఁ గడపితిఁ, బిమ్మట యుక్తకాలమ్మున విరుప్రకను సంధుండును
బాండుండును గ్రమమ్మున నుద్భవించి ధృతరాష్ట్ర పాండునామమ్ములఁ బ్రసిద్ధులైరి,
వారలం జూచి సత్యవతి వైమనస్యమ్మున మునుమెదలి సంవత్సరాంతమ్మున
నన్నుం జూచి యిట్లనియె. 670

క. పాయక నా యానతిచే, దాయాదులఁ గంటి వంశతాపాంకుత్వా
పాయనము పేతు లేగతిఁ, జేయఁగనగు రాజ్య మేమి పేయుమఁ బుత్రా. 671

వ. కావున రాజ్యార్హుండగు తనయు నొక్కరుఁగని నన్నానందింపఁ జేయుమని యంబా
లికం గని పురల నా వొందున కియ్యకొల్పుటయు నాపె యత్తకుత్తరంబీక శయనా
గారసంగతుండనగు నా యొద్దకు రూపయౌవనసంపన్నయు విచిత్రాంబరాభరణయుఁ
జందనదిగ్ధగాత్రియుఁ బుష్పమాలాలంకృతయు సుకేశియు హంసగామినియు హావ
భావసంయుక్తయు నగు తనదాసిం బనిచె. 672

ఉ. నారద! యేమి చెప్పుదు, మనంబున కాచెలి వచ్చె దాని బల్
నేరుపుఁ జెయ్వులున్ సురతలీలలు నా కమకూలరీతిఁ జె
న్నారెఁ దదీయసంగతు లనంగకలానుమతమ్ములయ్యె సా
ధారణరీతి నిర్వురకుఁ జారసమై తగెఁ గూర్మి యొప్పగన్. 673

వ. దానికిఁ బ్రీతిం జెంది పరవశంబైన చిత్తమ్మున. 674

గీ. సత్యవాది కళాశాలి సర్వలక్షణములఁ దొల్చెడివాఁడు విన్నాణమైన
రూపెనఁగువాఁడు నీ కొక్కరుఁడు సుతుండు, కలుగునని వరమిచ్చితిఁ గాంత కంత.

వ. విదురుం డుద్భవించె నిట్లు మాయావశమ్మునఁ బరక్షేత్రమ్మున మూగునఁ గొమ

రులం గని శుకవిరహజనితమ్మగు శోకమ్ము వాసి సంతుష్టాంతరంగుఁడనైతి; నరూ
పయు నిరాలంబయు జ్ఞానులకు సయితము మోహకారిణియునగు మాయ యకృ
తాత్ముల కేరికిం ద్యజింపరాదు. 676

గీ. తల్లియెడఁ గల్గు బంధంబు దవులఁజేసె, నాత్మజాతులయందుఁ దదాది నాకు
మనము డోలాయమానమై కనదు శాంతి, యనఘ యొక్కెడ నిశ్చయం బందకుండు.

చ. కరినగరాధివాస మొక కాలమునందు: సరస్వతీ తట
స్థిరత యొకప్డు; వేతౌకగతిన్ జరియించుట యొక్కవేళఁ; గా
ని రహి నొకప్డు నిశ్చలత నెక్కొనుమై ఋరి గాన రాదు జ్ఞా
నరతి నొకప్పు డెప్పుడొ మనమ్మున నీ గతిఁ దోఁచు నారదా. 678

చ. కొమరులఁ గంటిమూఁగు రను గొంకక; యొక్కనిఁ గాని నాకు శ్రా
ద్ధము నొనరింప నర్హుఁగ ధర్మము లొప్పవు పారదారిసం
గమమునఁ బుట్టు పుత్రకులుగర్మమొనర్పఁగ యోగ్యులే ? వృథా
క్రమమున మాయలోఁ బడితిఁ గర్మవిదుల్ బహిపెట్ట కుందురే. 679

వ. అని మంతనమ్మునఁ బశ్చాత్తాపమునఁ గుందుచుండఁ బదంపడి మత్పుత్రుండగు
పాండుండు బలవంతుండగు భీష్మననుమతమ్మున రాజ్యము వడసె; దానంజేసి
యానందించితి. 680

గీ. శూరసేనుని యాత్మజ సుగుణ కుంతి, మద్రరాజకుమారిక మాద్రి వీర
లిరువురును నాత్మపత్నులై యెసక మెసఁగఁ, బాండుభూపాలకుఁడు రాజ్యభారమూని.

వ. ఒక్కెడ ద్విజశాపమ్ము నంది నిర్విణ్ణుండై రాజ్యమ్ము విడిచి యరణ్యమ్మున కరిగె
నవ్వార్త వినుకతన నాకు మరల దుఃఖం బనుసరించె. 682

క. సతులిరువురు గొలువఁగ నా, సుతుఁడున్నెడ కరిగి కొన్ని సూక్తుల మోదా
న్వితుఁ జేసి కరినగర సం, స్థితు ధృతరాష్ట్రుఁ గని యరుగుదెంచితి నిటకుఁ. 683

వ. పిమ్మటఁ బాండుండు సతీయుగ్మమ్మునందు ధర్మానిలేంద్రాశ్వినుల కతన ధర్మసమ్మ
తమ్ముగ క్షేత్రజులఁ బంచపాండవుల యుధిష్ఠిరభీమసేనార్జుననకులసహదేవు లను
వారింగవియెఁ; బదంపడి యాతండొక్కనాఁడు రహస్యమ్మున మాద్రిం గౌఁగిలిం
చినకతన శాపదగ్ధుండై మృతుండై పరలోకమ్మున కరిగెఁ బదంపడి మాద్రియుఁ
బతివ్రతయణయై యగ్నిముఖమ్మునఁ దదనుగత యయ్యెఁ; బిదప శోకమగ్నయగు
కుంతి మాతార్పి యచ్చటి మునుల సుతసహితమ్ముగ గజపురమ్మునకుఁ దోడ్తోవి

వచ్చి భీష్మునకును ధృతరాష్ట్రునకును నొప్పఁ జెప్పి; రీవృత్తాంతమ్ము విని యేను
హర్షశోకమ్ముల కాధారంబ నైతి. అంత నప్పాండవులు భీష్మవిదురధృతరాష్ట్రులచేఁ
బ్రీతిపూర్వకమ్ముగఁ బోషింపం బడుచుండఁ గ్రూరమానసులగు ధృతరాష్ట్ర కొమ
రులు దుర్యోధనాదులు వీరలతోఁ బెన్పు వైరమ్ములఁ బొదలుచుండిరి. పిదప
ద్రోణాచార్యుం దేగుదెంచి భీష్మునిచే సన్మానితుండై యక్కుమారులకు విద్యలఁ
గఱపుచుండె. 684

గీ. మున్ను గనినప్డ కుంతిచే ముక్తుఁడైన, కర్ణుఁడును సూతునింటఁ బెక్కుఁగను వృద్ధి
నంది దుర్యోధనప్రియుఁడై యెసఁగె, దాన దుర్యోధనుండు తద్దయుఁ గడంగి.

వ. భీమాదులయెడ నధికవైరమ్ము గనుటకుఁ జింతించి ధృతరాష్ట్రుఁడు వికోభశప
నమ్మునకై పాండవులకు వారణావతమ్మున నివాసం బేర్పఱిచె నంత నప్పట్టణమ్మున.

గీ. కుటిలుఁడు సుయోధనునియాజ్ఞఁ గొని పురోచ
నుండు నిర్మించె జతుగృహమండలంబు
నచటఁ జిచ్చునఁ బాండవు లడఁగి రనుచు
విని మనమలైనకతన దుఃఖనిధి నైతి. 687

వ. అట్లు దుఃఖించుచు వనమ్మునఁ గుంతీసహితమ్ముగఁ బాండుపుత్రులు గన్పట్టిన
నఖండానందభరితుండనైతి. 688

క. పిమ్మట మత్ప్రేరితులై, సమ్మతి ద్రుపదునిపురంబు చని రేపును వీం
కమ్మగు భూదైవతవే, షమ్ముల నప్పార్థు లతికృశత్వము దొడరన్. 689

చ. నరుఁడు పరాక్రమక్రమమునన్ ద్రుపదాత్మజ గెల్చి తెచ్చె వే
పురకును సాధ్వియయ్యె నలపుష్పసుగంధియు గొంతియాజ్ఞఁ; ద
త్పరిణయముం గనంగొని ముదంబు నెదం గనివాఁడ మీఁద న
త్తరుణియుఁ బార్థులుం గలసి దంతిపురమ్మున కేగి రిమ్ముగన్. 690

వ. ధృతరాష్ట్రుండును వారలకు ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముగాఁ గల్పించె నటఁ గృష్ణ
సహాయుండై యర్జునుండు పావకు సంతృప్తుఁ జేసె. 691

క. వారలు లోకోన్నతులగు, శూరులు పాండవులు రాజసూయ మొనర్పం
గా రహి తద్వైభవమును, నారసి యెంతేని మోద మందితి నాత్మన్. 692

వ. మయనిర్మితంబగు తత్సభావిశేషంబు వర్ణింప నలవిగాదు తద్వైభవమ్మునకు
సైఁపక దుర్యోధనుం డసూయాగ్రస్తుండై వారలతో దురోదరం బొనర్చి దుర్ద్యూత

కుశలుండగు శకునికతన ధర్మజు నోడించి రాజ్యమ్ము గైకొని యంతఁ బోక ద్రోవది నవమానించె. 693

క. వనమునఁ బంద్రెండేడులు, మనుమలు పాండవులు ద్రుపదమహిపాత్మజతో
వెనసిరి కష్టమ్ముల నా, మన మది హేతువుగ దుఃఖమగ్నుతఁ గాంచెన్. 694

క. ఈక్రియ సుఖదుఃఖమ్ముల, కాకరమగు భవమునందు నడుగంటితి ధ
ర్మాకలన మెఱిఁగి భ్రాంతిం, జేకొనునా కొక్కతెరువు సెప్పు మహాత్మా. 695

## నా ర ద వి వా హ ము.

క. ఎక్కడిసతు లెక్కడిసుతు, లెక్కడితలిదండ్రు లకట! యే విక్కరణిం
జిక్కితి సంసారమ్మున, మక్కువ మెయి భ్రాంతి మిగుల మఱపించుటచేన్. 696

క. దోలారూఢంబై మది, వాలాయము ముదము దక్క వంతంబడు నా
కేలీల సౌఖ్యమబ్బు? జ, టాలాగ్రణి దెల్పవే! కటాక్షము పేర్మిన్. 697

వ. ఇట్లు మాటికిం బ్రార్థించునాకు నారదుం డిట్లనియె. 698

క. పారాశర్య! పురాణా, ధార! యిటుల్ సారెసారె దర్కింపకు సం
సారమున మోహరహితుం, డారయ లేఁడొక్కరుండు నని యెఱుఁగవొకో. 699

గీ. హరిహరవిరించులను గపిలాదిమునులు, మాయలోఁ బడి సంసారమార్గమందుఁ
బొరలువారల నగా మునుల్ వొగడుచుండ్రు.జ్ఞాని యని;నేను పట్టఁడఁగను మొకింత.

గీ. మోహసంగతిఁజేసి యోమునివరేణ్య, భార్యనై మును నాపడ్డపాటులెల్ల
విస్తరించి వచించెద వినుము దాన, నడఁగు నీసంశయములెల్ల ననఘచరిత. 701

వ. ఒక్కనాఁడు నేను బర్వతుండును గలసి భరతఖండంబు చూడంజని యందంద తిరుగుచుఁ బుణ్యక్షేత్రమ్ము లాలోకించుచు మున్యాశ్రమమ్ములు దిలకించుచు నొక్క సమయమ్మున నొక సమయం బొనర్చికొంటిమి. 702

క. మంచియుఁ జెడ్డ యనుచులో, నెంచక మనయాత్మఁ బొడమునిచ్చల మనలో
నించుకయు దాఁపఁగా జన, దంచితగతి నొక్క రొకరి కది చెప్పఁ దగున్. 703

వ ఇట్లు పరస్పరమును సమయం బొనర్చికొని మైత్రి యొనంగ స్వర్గలోకమ్ము విడిచి భూలోకమ్మునఁ గ్రుమ్మరుసంత గ్రీష్మాంతం బరుగుదెంచె. 704

క. చాతుర్మాస్యవ్రతమును, బ్రీతిన్ సంజయుఁడను నొక పృథివీశుపురం
బేతెంచి సలుపుకొంటిమి, యాతని సదనమ్మునన్ గృతావాసులమై. 705

ఉ. నాలుగుమాసముల్ దగు ఘనంబగు వర్షము లానెలల్ సుఖ
శ్రీ లలిఁ గోరుమానవులు సేయఁగ రాదు ప్రవాస; మాపయిన్
బోలునొనర్ప నంచుఁ దలపోసి సుఖమ్ముగ సంజయుండు స
చ్ఛీలుఁడు గొల్వఁ దత్పురి వసించితి మెంతయు సంతసమ్మునన్. 706

వ. అన్నరనాయకుండు మాకుఁ బరిచర్య యొనర్పఁ దనకూతు సునందిని యనుదాని నియోగించె. 707

గీ. స్నాన మొనరింప జలము భోజన మొనర్ప, నిష్ట మగువస్తువులు శయ్య యెద్దిమేని
గోర నయ్యవి మా కిడుఁ గొసరి కొసరి, హెచ్చుతగ్గులు లేకుండ నిగుడఁబోఁడి.

వ. ఇట్లక్కన్నియ మమ్మిరువుర సేవింప వేదాధ్యయనమ్ములను గానవినోదమ్ములను గాలంబు పుచ్చుచుంటిమి. 709

మ. అనుకూలమ్ముగ వీణ సుస్వరయుతం బౌనట్లు పాఠించి నె
మ్మన మానందరసామృతార్ణవమునన్ మగ్నమ్ముగా సామవే
దవినాదం బొనరింప దాని విని యత్తన్వీశిరోరత్న మె
క్కునమోహంబునఁ బేర్మి నాయెడలఁ దాఁగీలించెఁ గామార్తయై. 710

క. ఆతరుణీరత్నం బిటు, చేతోభవుబారిఁ దవిలి చేసెడిచెయ్వుల్
ప్రీతి గలిగించె నాకుఁ బు, రాతనకర్మములు దాఁట రాదెవ్వరికిన్. 711

వ. ఇట్లు నాయందు లబ్ధానురాగ యగుకతన నక్కలికిమిన్న స్నానపానాద్యుపచారములయందు మాయిరువుర కొక్కింత భేదంబు సల్పుచుండు. 712

సీ. స్నానమొనర్ప నుష్ణజలంబు నాకిచ్చు • శీతలోదకమిడుఁ జెలియ యతని
కింపైనపెరుఁగు నా కింతి వడ్డనసేయుఁ • దక్రంబు వోయు నత్తపసి కతివ
శయ్య గల్పించుఁ బ్రశస్తమ్ముగా నాకు • నాతని కొకచింగి నలవరించు
సొగసుమేల్ చూపుఁ జూచు నన్ బేర్మిమైఁ • జూడ దారీతిగా సుదతి యతని

గీ. నెల్లయుపచారముల నిట్టు లేకరీతి
మాని తనుఁ గొంచెపఱుచుట మౌని గాంచి
సందియము నెమ్మనమ్మునఁ బొందుపడఁగ
నన్నుఁ గని యిట్టులను మంతనమ్మునందు. 713

ఉ. భోజనమజ్జనాదుల నపూర్వపుఁగృత్యములన్ మనోభవ
శ్రీ జనియింపఁజేసెడి విశిష్టవిలాసముల న్నిమం గనున్

రాజతనూజ యక్కరణి నన్ గనకుండెడి నిన్ వరింపగాఁ
నాజలజేక్షణామణికి నాస్థ జనింపఁగఁ బోలు నద్దిరే. 714

వ. నీ మనమ్మును నత్తలోదరియందు లగ్నంబకాఁ గనుపట్టెడి. 715

క. మనమనములఁ గలసంగతు, లనయము చెప్పికొనవలయు నం చప్పు డొన
ర్చిననమయము మఱవంగాఁ, జనునే ! సత్యము వచింపు నందియు మేలా ? 716

ఉ. నావుడు లజ్జపెంపు వదనమ్మును వంపఁగ నెట్టకేలకున్
భావము దాఁపరామి నిటు పర్వతుతో వచియించితిణ్ మునీం
ద్రా ! విను మీ లతాంగి నను నాథునిఁగా మదిఁగోరె నట్లనా
కీవిరిబోడియందు రమియించె మనం బిఁక దాఁప నేటికిన్. 717

వ. అనుమాటలకుఁ బర్వతుండు గోపాకులుండై నన్నుం గాంచి సమయోల్లంఘనం బొనర్చి నన్ను వంచించితివి గాన వానర వక్త్రుండవు కమ్మని శపించె నను పదంబ యేనును నోర్పులేమిఁ దాదృశుండనై యిట్లు ప్రతిశాపం బిచ్చితి. 718

గీ. స్వల్పమగు నపరాధంబు నైఁప కిట్లు, శాప మిచ్చిన నీ కిఁక స్వర్గవాస
మెడలి మర్త్యమ్మునన వసియించుటబ్బు, ననుడు శాపోపహతి నేగె నతఁడు దరలి.

క. వానరవక్త్రుఁడనై నీ, జానినవం బొప్పఁ జేయు నన్నుంగని యా
మీనేక్షణ గానాదర, మూనుటఁ దా నైమనస్య మూనదు వింటే. 720

గీ. అనిన నిట్లంటి నేను నో మునివరేణ్య, సుందరాస్యుండ వెట్లైతి సుదతి నిన్ను
నేగతి వరించెఁ బర్వతుఁడేడకేగె, సంగమం బెట్టులెల్లఁ జెప్పంగఁదగదె. 721

క. నావుడు నారదుఁ డను వ్యా, సా ! విను మాయాచరిత్ర మతిగహనము కా
దే వారింపఁ దరంబే, యేవారికినైన నెందునేవియుఁ దలఁపన్. 722

వ. అట్లు మద్భాగినేయుండగు పర్వతుండు శప్తుండై యరిగిన నేనత్యంతదుఃఖితుం డనై యటనుంటి; నక్కన్నెమిన్న యథాపూర్వమ్ముగ మత్సేవాపరాయణయై యుండెఁ బిదప నత్తలోదరికి వివాహంబొనర్ప నెంచి నంజయుండు మంత్రి కిట్లనియె. 723

ఆ.వె వరుని రూపవంతు వరగుణసంపన్ను, సుకులజాతు ననఘు శూరునొకని
జూడు మీ లతాంగి సొగసున కనుగుణుఁ, డైన వానిఁ బెండ్లి యాచరింతు. 724

వ. నావుడు మంత్రి "రాజా ! తాదృశులగు రాకొమరు లనేకులుగల రందు నీ కెవ్వండు నచ్చు నక్కుమారుం దెచ్చి కన్యాదానంబు విధిచోదితంబుగ నొనర్చి కృతార్థుండ

నగు" ననుడు సంజయుండు తదన్వేషణాయత్తచిత్తుండై యున్నంత నవ్వలం దమయంతి యంతయు ధాత్రీముఖమ్మున విని తనమనోరథం బద్దానికిం దెలిపిన నయ్యాది నృపాలు పాలికిం జని తద్వచనమ్ములుగా నిట్లనియె. 725

మ. జనకా! నారదునిన్ వరించి యితరేచ్ఛాహీనమ్మనై నన్ను న
న్యుని కీ నెంచకు నక్రహీనమ్మయి సంతోషప్రసన్నుండై రసం
బున నక్షీరత నొప్పి మీనముల కిమ్ముం గాక నిర్దుష్టతం
దనపన్ దన్మహతీవినాద మనుసంద్రం; బందు నే నుద్గతిన్. 726

వ. అని దమయంతి విన్నవింపు మనిమె ననుడు నృపాలుండు సమీపమ్మున నున్న తన భార్యయగు కైకేయిం జూచి, 727

గీ. ధాత్రి చెప్పినమాటలు తరుణి వింటె, వరుని గా నెట్లుగోరె నవ్వానరాస్యుఁ
గోరెఁగా కెట్టి లీలదగుఁ గుటిలరూపుఁ, డాతఁ డెటువంటి మన దమయంతి కకట.

వ. బుద్ధిహీనతం జేసి కన్నెమలకుఁ గార్యాకార్యమ్ములు తెలియకుండినఁ బాలింపుట మనకుఁ గర్జంబగుట నీవు శిక్షకుం దతఁడని చెప్పి బోధింపు మనవుడుఁ గైకేయి యంతనమ్మనఁ బుత్రి కిట్లనియె. 729

చ. లత కెనవచ్చి యెక్కుడు తళత్తళఁబొల్చెడి మీసమేసు, దూ
షితమఁ దతండు భస్మమును సారెకు మెత్తుటఁజేసి సుందరం
బతివ! భవమ్ముఖం, బకట! యాతఁడు గోతిమొగమ్ముఁవాఁడు న
మ్మతుఁడెటులాయె నారదుఁడు? మాటలవొందిక క్రోతికొప్పునే. 730

క. నమలకు వానరులకు నె, క్కురణిగా మాటలు పొసంగు? గాకతఁడు సదా
తిరుగున్ భిక్షుకుఁడై యా, దర మెటు నీ కబ్బె నిట్టి తాపసు మీఁదన్. 731

ఉ. అందము గోరుఁ గన్నె: నృపులందది వొల్చు లతాంగి యిట్టి నీ
మందత కేమి యందు! మతిమాలిన నీకయి కుందె రాజా, సొం
పుందగు మాలతీలత బుబూలనగోపరి లగ్నమైన దా
నిం దిలకించి ఖేదముల నెక్కొనకుండెడి వార లుందురే. 732

క. మృదుతాంబూలీవళముల, నెద నుష్ట్రమ్మున కొసంగ నెవఁ డొప్పెడి? నా
రదుచేతఁ బడ్డ నినుఁగని, ముదితలు నవ్వరె వివాహమున నాతల్లీ. 733

వ. అని పలుతెఱంగుల బోధించు తల్లికి గానరసకోవిదయగు నమ్మదయంతి నాయెడఁ గృతనిశ్చయయై యిట్లనియె. 734

■■

క. మొగమును సామ్రాజ్యమ్మును, సొగసును ధనమేల శుద్ధకుంతకుఁ దల్లీ!
మొగమును సామ్రాజ్యమ్మును, సొగసును ధనమేల రసవశుం డీతనికిన్. 735

క. గానరసమ్మున హరిణులు, మే నెఱుఁగక ప్రాణ మిచ్చి మేల్వడయ నిసీ
మానవులు గొంద ఱీరస, మానంగాలేరు జన్మమది యెందులకో. 736

గీ. అరయ సప్తస్వరాత్మిక యైనవిద్య, నెఱుఁగు నారదమునిచంద్రుఁ, డెఱుఁగుహరుఁడు
వ్రేలు మడఁచి వచింపఁగ వేఱొకండు, గానఁగా రాఁడు మూడులోకముల నెందు.

చ. ధనమును రూపమున్ మిగుల దర్పము గల్గి రసజ్ఞ భిన్నుఁడౌ
జనవరు గర్వధూర్వహు వెసన్ వరియించి తదీయమైత్రి నె
క్కొను చెలికిం బ్రతిక్షణ మగున్ మరణంబు; రసజ్ఞుఁడైన ని
ర్ధనుని వరించి తాఁ బ్రతిపదమ్ము ముదమ్మున నుండ నయ్యెడిన్. 738

గీ. మూర్ఛనాజ్ఞాన భేదమ్ము మొట్టమొదటి, కరసి స్వరవేదియై గ్రామ పరిచితిఁ గని
యష్టరసవేత్తయగు నరుం డంగవికలుఁ, డయ్యు నానంద మొనఁగూర్చు నంగనలకు.

క. స్వరవేత్త యైన గాయక, వరుఁ డిడుఁ గైలాససుఖము వమ్ముగ మూర్ఖుల్
సురనదికి సరస్వతికిం, దిరుగుడు రీరస మొకింత దెలియనికతనన్. 740

క. స్వరభేద మెఱిఁగె నేనియు, నరుఁ డయ్యును నతఁడు దేవనాథుఁడు దానిం
బరిశీలింపఁడయేనిన్, సురనాథుం డయ్యుఁ బశువు సుమ్మ తఁ డంబా. 741

గీ. మూర్ఛనాతానసమ్మోహమున మనమ్ము, గరఁగు హరిణులు పశువులు గావు సూవె
దాని విని సంతసంబునందని నరుండు, తల్లి! ప్రత్యక్షపశువు తథ్యముగ వినుము.

క. వినఁ జెవులు గలిగి మోదం, బెనయని యరసికులకన్న నెంతే మోదం
బును గానరసముకతనన్, గను నశ్రోత్రములు మేలు కాకోదరముల్. 743

క. గానంబువినికి పశువుల, నానందరసాబ్ధి నోలలాడించెడి న
ద్దాని వినఁ బెద్ద లాదర, మూననిచో వారిజన్మ మొకజన్మంబే. 744

చ. తెలియఁడు గాక వారదు సుదీర్ఘగుణమ్ములు రాజు; ముజ్జగం
బులఁ గలఁడే యొకం డతనిఁ బోల్పఁగ గానమునందుఁ; బూర్వమే
వలచినదాన నమ్మువిని; వానరవక్త్రము శాపకారణం
బలవడి నేఁడు వచ్చె నెటులైన నతండు ప్రియుండు నాకగున్. 745

క. తురగాస్యులు గారే కి, న్నరులెల్లరు వారిఁగాంచి నరుఁడెవ్వఁడు గా
నరసజ్ఞుఁ డాదరింపఁడు!, మురువందియు విద్దెలేని మొగమేమిటికిన్. 746

వ. అమ్మని యెట్టిదైన నాకుం బ్రియుం డతవిఁదక్క వేఱొక్కని మదనుండైన నేనొల్ల ననియు నాగ్రహమ్ము ద్యజియించినన్నమ్మని కిచ్చి వివాహం బొనర్పు మనియు నీ వరిగి మజ్జనకునకు బోధింపు మనుడుఁ గైకేయి భర్తకడ కరిగి కడచిన వృత్తాంతమ్ము విన్నవించిన నతండును నా కొసఁగ నంగీకరించి వివాహ సంభారమ్ము లొనర్చి విధివిధానంబుగఁ బెండిలియొనర్చెఁ; బిమ్మట వాసరవక్త్రుండ నగు కతన దందహ్యమానంబగు మనమ్ముతో నప్పటస యుంటి నక్కన్నియ నన్ను సేవింప నేతెంచి నప్పుడెల్ల మన్మనంబు శోకమగ్నంబగు. నా వైరూప్యమ్ము నకు మదయంతి యించుకేనియు శంకింపక సంతసమ్మునం బొదలు నిట్లు కొంత కాలం బరుగుమీఁదఁ బర్వతుండు నానాతీర్థమ్ములు సేవించుచు ధరణినెల్లెడఁ గ్రుమ్మరి మగుడ నన్నుఁ జూడ నేతెంచి నాచే సన్మానితుండై యాసీనుండై నన్నుం గృతదారు వానరాస్యుఁ జింతావిష్టుఁ గాంచి యత్యంతదుఃఖితుండై మేనమామసగు నాయెడ దయ గలిగి యిట్లనియె. 747

గీ. కోపమున మున్ను శాపమ్ము గొంక కిడితి, నిపుడు నిష్కృతి నొనరింతు నీ నృపాల పుత్త్రికై కరుణించితిఁ బూర్వరీతి, సుందరాస్యుండ వగుము మత్సుకృతపటిమ. 748

వ. అంత నేనును నతని కిట్లంటి నీ శాపమ్మునఁ గలుషితచిత్తుండనై శపించితి విపుడు ప్రసన్నుఁడవై నీకు శాపమోక్షం బొనర్చెద నెప్పటియట్ల నీకు స్వర్గగమనం బల వడుఁగాక నావుడుఁ బర్వతుండు సంతుష్టుండై తనంత నరిగెఁ, బదపడి రాజపుత్త్రి పట్టరాని సంతోషమ్మునఁ దల్లికడ కరిగి యిట్లు విన్నవించె. 749

గీ. మాత ! నీదుజామాతకు మగుడ సుంద, రాస్యత మటిల్లెఁ బర్వతుం డాగ్రహంబు విడిచి శాపమ్మునకు ముక్తి నుడువుకతన, ననుడు భర్తకుఁ జెప్పె నయ్యతివయరిగి.

వ. పిమ్మట సంజయుండు తద్వచనశ్రవణంబున సంతుష్టుండై సమంత్రిపురోహితమ్ముగా నాకడ కరుదెంచి పారిబర్హంబొసఁగి మద్భాగినేయునకుఁ దగుధనంబిచ్చి గౌరవించె.

క. పేరకినైనఁ గలదె సం, సారమ్మున సౌఖ్య మెట్టి జ్ఞానులకున్ మా యాచన దాఁట శక్యమె, యారయ నిది యెల్ల నాకు ననుభవమయ్యెన్. 752

గీ. కామమును గ్రోధమును నహంకారము మద
మత్సరంబులు లోభంబు మమత యివి య
హీ బలములు వీని జయించు నెవఁడు
త్రిగుణహేతుకమై యొప్పు దేహ మొంది. 753

వ. వినుము మున్నొక్కనాఁడు విష్ణువుతో వనమ్మున నేగుచు హాస్యవినోదమ్మున నమ్మహాత్ముకతన నేను స్త్రీరూపమ్ముగని మాయాబలమోహితుండ నగుటఁజేసి యొకరాజునకుఁ బత్నినై యనేకులఁ గొమరులఁ గంటి నావుడు నే నిట్లంటి. 754

ఉ. నారద సంధియం బొకఁడు నామదిఁ దోఁచెడి జ్ఞాని వైన నీ
వే రహి నారివైతి? సుతు లేన్నృపసంగతి నుద్భవించి? రీ
పూరుషభావ మెక్కరణిఁ బొందితి విమ్మట? మాయ యెంతకు
న్నేరదె! తన్మహత్త్వము గణింపఁ దరంబె వచింపు నావుడున్. 755

## నారదుడు స్త్రీ యయి సంతతిం గనుట.

వ. నారదుండిట్లను దేనికతన బ్రహ్మాది స్తంబపర్యంత మీజగంబు పరిభ్రమింపుచుండు నమ్మాయ దుర్విభావ్యయు నజయు యోగి దుర్జ్ఞేయయు నని యెఱుంగుము. 756

గీ. సత్యలోకమ్మునుండి సుస్వరము సామ, గానము నొనర్చికొంచు నేఁ గదలి విష్ణు
దర్శనాకాంక్ష నెమ్మదిఁ దవిలి యరిగి, సకలలోకమ్ములను బేర్మి సంచరించి. 757

శా. శ్వేతద్వీపమునందుఁ గౌస్తుభమణి శ్రీరాజితోరస్స్థలున్
బీతద్యోతిపటున్ మహాత్ము గరుణాబ్ధిఁ శంఖచక్రాదికో
పేతున్ బాహుచతుష్కభాసుర జలస్ఫీతాంబుదశ్యాము ల
క్ష్మీతన్వీసహచారిఁ గంటి నతులక్రీడాపరున్ శ్రీహరిన్. 758

ఉ. ఆతవిభార్య రూపవరయౌవనగర్విత సింధుజాత భూ
షాతతిభాసమాన ననుఁ జక్కటిఁగాంచి గృహమ్ములోనికిన్
వే తరలెన్ బదంపడి కవిప్రవరేణ్య రమేశు మ్రొక్కి శం
కాతిగమైన చేతమున నమ్మధువైరికి నిట్లు వల్కితిన్. 759

క. విటుఁడనొ ధూర్తుండనొ నే, జటిలుఁడ జితమాయుఁడన్ బ్రశస్తహృదయుఁడన్
దటుకున ననుఁ గని చనె నీ, కుటిలాలక యిట్లొనర్పఁ గూడునె యెందున్. 760

వ. నావుడు గర్వధూర్వహమ్ములగు మద్వచనమ్ములకుఁ గనలక వీణాలాపమధురమ్ములగు వచనమ్ముల నద్దేవుండిట్లనియె. 761

క. పతిఁ దక్క నన్యసన్నిధి, సతి నిలువందగదు నీతిచందం బిది యే
మతిమంతులైన మాయా, గతికిన్ లోఁబడక యుండఁగాఁ గలరె మునీ. 762

క. జితమారుతులన్ సాంఖ్య, స్థితివేత్తలు నైన మునులు దేవతలును ద
ద్గతులగుచు నుండ మాయా, గతి గీతజ్ఞనకు నీకుఁ గనఁబడకుండే. 764

గీ. ఏను బ్రహ్మయు శివుఁడును విద్ధతేజు, లైన సనకాదులును దక్షీను లకట
దేవతిర్యఙ్మనుష్యాది దేహధారు, లం జెపఁడుదాఁటు నహ్మాయ నెఱ నమేయ. 765

వ. వేదవిదులొండె యోగవిదులొండెఁ ద్రిగుణమయ దేహధారుల కాని యస్మ్యులకారు. తాద్మ్రుల కేరికిని నస్యాది జయింప వశము కాదని యెఱుఁగుము, మఱియు రూప హీనమ్మును స్వరూపకారియునగు కాలమ్మగూడఁ దదాత్మకమ్మకా నెఱుఁగునది.

ఉ. కాలవశమ్మునన్ వలయు జ్ఞానియు మూర్ఖుఁడు మధ్యముండు న
క్కాలము సేయు ధర్మరతుఁగా వికలాత్ముఁడుగాఁ దనమ్ముఁగా
శీలమొ కర్మమో యటులుచేయుటకున్ మఱి యన్య మెద్దియో
మూల మెఱుంగరా దఖిలమోహనమై తగుఁ గాల మెమ్మెయిన్. 766

వ. అని చెప్పి యమ్మహాముఁడు విరమించుటయు నేను విస్మయా విష్టుండనై మహాత్మా! మాయ యనఁగ నెట్టిది? దాని బలం బెంత? రూపం బెట్లుండు? నది యెట వసించు? దేనికాధారంబగు? నానతిచ్చి నాకు సద్భావ మగుపఱచి యనుగ్రహింపు మనవుడు రమేశుం డిట్లను, "నయ్యది త్రిగుణమయి యఖిలాధారయు సర్వజ్ఞయు సర్వసమ్మతయు నజేయయు ననేకరూపయునై జగం బఖిలంబును వ్యాపించి యుండు. 767

ఆ.వె. దానిఁ జూడ నఖిమతంబేని గరుడు నా, తోడ నెక్కి మిపుడ తొలఁగి చనుచ
మఱలనాజ! మాయ నరయంగఁ జేసెద, దానిఁ గాంచి త్రేవ మూన వలదు." 768

వ. అని వినతాసుతుని సంస్మరించిన నతండు సన్నద్ధుండై యరుగుదెంచెఁ, బదంపడి యిరువురము నాని నధిష్ఠించిన నాగరుత్మంతుండు వాయువేగమ్మునఁ గదలి హరిప్రేరితుండై వైకుంఠమ్ము విడిచి, 769

క. పురములు వనములు నదులున్, ధరములు మునిపల్లెలున్ బ్రాంతమ్ములు మాకుం
గర మానంద మొసంగఁగఁ, దిరిగితిరిగి యాతఁ డొక్క దేశము చేర్చెన్. 770

మ. అటఁ గన్గొంటిమి కాన్యకుబ్జ మనుపేఁ డాప్రోలికిం జేరువన్
దటరాజద్వివిధాగమంబు కమలాధారంబు నానావిధో
త్కటవర్ణస్వర భాస్వరాండజసముద్యన్మధ్యభాగంబు సం
ఘటితానందము స్వచ్ఛనీరము తటాకం బొందు గానంబడెన్. 771

వ. అయ్యెడ శ్రీహరి నా కిట్లనియె. 772

క. నారద! కనుఁగొంటివె క, ల్హారచ్ఛన్నంబు సారసారావరవో
దారంబు స్వచ్ఛనీరం, బై రంజిలు నీతటాక మప్రతిహతమై. 773

వ. అని పల్కుచు మందస్మితకంపశీతముఖారవిందుండై నా చిటికెనవ్రేలు పట్టికొని స్నిగ్ధచ్ఛాయంబగు తత్తటమ్మునకు డిగి సరోవరంబు పొంత దృష్టి నిగుడ్చి మరల నిట్లనియె. 774

క. అరసితె సాధుజచిత్తము, కరణిన్ స్వచ్ఛమ్ము అగుచుఁ గ్రాలెడిఁ గంజా
తరజస్స్పర్శపరిచితి, సురుచిరములు జలము లిందుఁ జూపఱ వొగడన్. 775

వ. ఈ సరోవరమ్మున స్నానం బొనర్చి పిదపఁ గాన్యకుబ్జపురమ్ము వీక్షించి యరుగుదము. మొదల నీవు స్నాతుండవు గమ్మను వచనంబ యేనును నొనర్చెద నావుడు వీణయు మృగాజినమ్మును నొక్కెడ నుంచి తీరమ్మునకుం జని పాదప్రక్షాళనం బొనర్చికొని కరంబులు గడిగి శిఖాబంధం బొనర్చి కుశలు ధరించి కృతాచమనుండనై లోనికిందిగి స్నానంబు సలుపునంత. 776

క. హరి చూచుచుండ నాకుం, బురుషాకారంబు వోయి భూషణకాంత్యు
ద్ధురమై స్త్రీరూపము కఁ, మరుదుగ సంప్రాప్తమయ్యె నదియే నెఱుఁగన్. 777

వ. అంత హరి నాకృష్ణాజినమ్మును వీణయుం బుచ్చుకొని గరుడు నెక్కి యొక్కక్షణమ్మునన తనభవనమ్మునకరిగె. 778

క. వ్యాసా యేమని చెప్పుదు, నాసంగతి వీణయున్ మృగాజినమున్ శ్రీ
వాసుఁడును స్మృతికిఁ దగులరు, కాసారము వెడలి తటము గనుఁగొను నాకున్.

శా. ఆలీలన్ వెలినై సరోవరతటంబందుండి నల్దిక్కులున్
బోలం జూచెడివేళ భృత్యులు గజమ్ముల్ గుఱ్ఱముల్ తోడ రా
వాలస్యం బొకయింత లేక యరదం బాదిక్కు రా నిచ్చి నన్
దా లౌల్యం బడరన్ గనుంగొని యనున్ దాలధ్వజుం డొప్పగన్. 780

క. నరసుందరివో? సురపం, కరుహాక్షివొ? నాగకన్యకామణివో? కి
న్నరమత్తకాశినివొ? యెం, టరివై యిట్లుంటి వక్కటా! గజగమనా. 781

క. బాలవు యౌవనరూపవి, శాలవు నినుఁజూచి మనము చంచలమై రా
గాలోలమయ్యెఁ బెండిలి, కాలేదే నీకు నిజముగాఁ దరళాక్షీ. 782

ఉ. ఏమిటి కీ సరోవరము నెల్లెడఁ గన్గొనె దోలతాంగి? నీ
కై మరు లూనినాఁడ నను నారసి చేకొని పేర్మి మీఱ నీ
స్నేమసుఖమ్ము నం బడయఁ జెల్లదె యింత యనాదరంబె నా
గా మహిపాలసూను నటఁ గాంచి వచించితి లజ్జ పెంపునన్. 783

క. నీ యిచ్చవచ్చినట్టుల, న్యాయగతి న్నన్నుఁ జూచు నావుడు నృపుఁ డ
త్యాయతమగు ప్రేమమ్మున, నాయనురాగం బెఱింగి వరయానమ్ముగా. 784

వ. తెమ్మని భృత్యుల నియోగించిన వారలు చతుర్వాహ్యమ్మును మృద్వాస్తరణ సంయుతమ్మును గౌశేయాంబరవేష్టితమ్మును ముక్తాజాలవిభూషితమ్మును జతురస్రమ్మును సువర్ణఖచితమ్మును విశాలంబును మనోహరంబునునగు శిబిరం దెచ్చిన నద్దాని నధిరోహించి యా రాజమన్మథు వెనువెంటఁ దత్పురమ్మున కరిగి శుభలగ్నమ్మున నగ్నిసాక్షికంబుగ నతనిచే వివాహితనై సౌభాగ్యసుందరి యను నామమ్మున నొప్పి యతనికిఁ బ్రాణమ్ముల కెక్కుడై సంభోగసుఖమ్ము లొనఁగూర్చుచుంటి. 785

ఉ. ఆ నృపుఁ డెల్ల కార్యములయం దపరక్తి వహించి మించి యు
ద్యానములందు దీర్ఘికలయందు గృహమ్ములయందు వారుణీ
పానమనమ్కుఁడై రతులతోఁ దులఁదూఁగుచు రాత్రియుం బవల్
తా నెఱుఁగంగలేక పరతంత్రత వర్తిలు నా కధీనుఁడై. 786

శా. వ్యాసా! యేమని చెప్పవచ్చు విను మాయాచాకచక్యంబు క్రీ
డాసక్తిన్ దగులొందునా కడఁగె బ్రహ్మజ్ఞానపుంభావవి
శ్వాసంబుల్ మఱి "యేన పట్టమహిషిన్ సర్వంబు నాసొమ్మ నా
కేసాధ్వీమణు లీ" డటంచు మది నెంతేఁ దాల్తు గర్వాంధతన్. 787

గీ. ఇటు లహర్నిశ మాయాపు వెనసి ద్వాద, శాబ్దముల్ కామకేళివిహారములను
గొనఁగ నతంట వేఁకటి యనుఘటించె, బార్థివోత్తముఁ డానంద వార్ధి మునుఁగ.

క. చూలాలినైన నను భూ, పాలుఁడు దగ బుజ్జగించి "బాలరో! నీ కెం
దే లోలత" నాఁ జెప్పం, జాలగా లజ్జాభరం బశక్యమ్మగుటన్. 789

క. పదినెలలు నిండఁ గంటి శు, భదినమ్మున నొక తమూజుఁ బార్థివుఁ డానం
దదశఁ దగి యుత్సవం బ, భ్యుదయంబునఁ జేసె నింగి భూమియు మట్టన్. 790

వ. బ్రాహ్మణానుమతమ్మున నక్కుమరునకు వీరవర్మ యనునామమ్ము వెట్టి యానంద సాగరమ్మున నోలలాడుచుండఁ బిదప రెండు సంవత్సరమ్ముల కింకొక్కరుఁ

గంటి, భూపాలుండు వానికి సుధన్వుండను నామం బిడియె. అట్లు క్రమక్రమమ్ముగ
ద్వాదశ పుత్రులం గని మోహవశమ్మున వారల లాలించుచున్నంత మరల నెన
మండ్రు కొమరు లుద్భవించిరి. 791

క. నృపతికి నాకును గార్హ, స్థ్యపదవి సఫలంబటంచు దానం దోఁచెన్
రిపుశాసకు లీ కొమరుల, కుపయమ మొనరించె భూపుఁ డొక్కొక్కరికిన్. 792

క. కొడుకులు కోడండ్రురు న, క్కొడుకుల కొడుకులును వారి కులకాంతలు నే
ర్పడ నధికమై కుటుంబపు, గొడవ విశేషించె మదికిఁ గుతుకం బొదవఁగా. 793

గీ. అంత నొకయెడ నైశ్వర్య మమరు, దుఃఖ
మొక్కయెడఁ గల్గు సౌఖ్యంబు నొక్కయెడల
నెసఁగు నొకఁడు గృశించుఁ బెంపెనయు నొకఁడు
పెద్దగేస్తుల కియ్యది విహితమకద. 794

ఆ. వె. కొడుకులందు నల్లి కోడండ్రురందు మ, నుమలయందు వారి ప్రమదలందుఁ
గలుగు నొక్కతఱిని గలహంబు లయ్యవి, తీర్పలేక నాకు దిగులు దగులు.

క. బలవంతులు నాపుత్రులు, కులసంభవలెల్ల నాదుకోడండ్రురు నా
కలిమికి వేఱొక కలుకుల, కలుములు సరియే యటంచు గర్వము ప్రబలెన్. 796

గీ. ఇట్లహంకారమున మున్గి "యేను నార, దుండ నన్నిట్లు చేసె నప్పుండరీక
లోచనం" డని యొక్కింత లోనఁ దలఁప, కెలమి సంసారసాగర మీఁదుచుంటి.

వ. అంతఁ గొంతకాలమ్మున దూరదేశంబునుండి యొక్కనృపాలుండు సైన్యసమేత
మ్ముగ నక్కన్యకుబ్జపురం బరికట్టిన నాకొమరులును మనుమలును రథవారణతురం
గమపదాతిసమేతమ్ముగ రాజుతోడ నతని నెదుర్కొనినఁ దుములంబగు సంగ
రంబు ప్రవర్తిల్లె. 798

క. ఆసంగరమున శత్రుల, చే సమసిరి కొమరులెల్లఁ జేయునదియులే
కాన యెడలి నరపాలుఁడు, తా సదనమ్మునకు వచ్చెఁ దద్దయు నార్తిన్. 799

వ. నన్నుం గాంచి పుత్రపౌత్రులెల్ల శత్రునిహతు లగుటఁ దెల్పిన నేనును శోకంబు
పట్టఁజాలక రణభూమి కరిగి. 800

ఆ. వె. "కొడుకులార నాదుకడుపునఁ జిచ్చిడి, యడవి నిల్లుగట్టి యాత్మజాతు
లెల్లఁ దోడరాఁగ నేగంగఁ దగునె దు, ర్వారమైన దైవవశముకతన." 801

వ. ఇట్లొదలెఱుఁగక నానావిధమ్ముల విలపించు నాకడకు మధుసూదనుండు వృద్ధవిప్ర
వేషమ్మున వచ్చి నన్నుం గాంచి యిట్లను. 802

ఉ. ఏల విచారమంద వినుమీ! భ్రమ గాక మఱెవ్వ రీసుతుల్
పోలఁగఁ జూడు నీవెవతెవో! యొక రొండ్లకు నేమిగావలెన్!
గాలవశమ్మునన్ మృతిని గాంచినవారల కింత యేల! యీ
జాలము మాని స్నానమును సల్పి నివాపకృతిం బొనర్పుమా. 803

క. పరలోకగతులకొఱకై, వ్వరు నింటం దానమాడవలవదు తీర్థం
బరిగి యటఁ గ్రుంకులిడుటయ, మరియాద సమస్త ధర్మమార్గములందున్. 804

వ. అని పలికి బంధుసహితమ్ముగా నన్ను వెంటఁ బెట్టికొని యమ్మహామహుండు
పుంతీర్థంబను నొక్క సరోవరమ్మునకుఁ జేర్చి యోదార్చి యిట్లనియె. 805

ఉ. స్నాన మొనర్పు మిచ్చట మనమ్మున నెవ్వరి కేడ్చెదవ వో
మానిని! యెన్నిజన్మములు మాటికి నెత్తితొ! భర్త లెందఱో!
సూనులుఁ దండ్రులున్ మఱియు సోదరు లమ్మలు నెందఱైరొ! స్వ
ప్నానుగతిం జెలంగు భవమందిటు భ్రాంతి వహించు టొప్పునే. 806

వ. అను నాతని ప్రేరణమ్మున నప్పురుషతీర్థమ్మున మునిఁగి తల యెత్తునంతకుఁ బురు
షాకారుండనై తటంబున మహతియుఁ గృష్ణాజినంబును బూనియున్న కమలలో
చనుం గాంచి, 807

క. "ఏనారదుండ నన్నున్, శ్రీనాథుం డిట్లొనర్చె స్త్రీగా" నని నా
లో ననుకొనియెడి యాలోఁ, దా నిట్లను "రమ్ము నారదా తడవేలా." 808

క. అను నాతని పలుకుల నొ, ద్దునకుం దగ వచ్చి చూచుచుండఁగ వెనుకటి య
వ్వనితాత్వం బప్పటి పుం, స్త్వనిరూఢియు మఱపువచ్చె సకలము ననఘా. 809

వ. అట్లు స్వస్వరూపంబు ప్రాపించి బ్రాహ్మణుండనై యున్న నన్నుం జూచి యానృపా
లుండు విస్మయావిష్టుండై నాభార్య యిట్లు ముని యగుట కేమికతం బని
యోజించుచు, 810

ఉ. హా! యను, నన్ను వీడఁ దగునా వగవాఁడనె యోమృణాలబా
హా! యను, నెట్టులాఁగఁదగుఁ బ్రాణము లిమ్మెయిఁ గాంచనాభదే
హా! యను, రాజ్య మేల నిను నంచక వాక్యజితాంగజాతవా
హా! యను, మాట కుత్తరమునైన నొసంగవు నిన్ప్రహా! యనుఁగా. 811

ఉ. వెనుకటిప్రీతి నాయెడల వెక్కసమాయెనె యిష్టఁ లేక యి
వ్వనమున మున్గి మత్స్యముల పాలయితో ? వరుణుండు నాయదృ
ష్టనియతి నిన్ గ్రహించెనొ ? విశాలవిలోచన । కృత్రిమంబు గా
దనఁదగు నీదుపేర్మి సుతుఁడు; దటుగామి నిటుల్ ఘటించునే. 812

క. దీనుఁడగు పతిని విడిచియు, సూనులయెడఁ దేఱ్చి మిగులఁ జొప్పడుకతనన్
బోనేగితి భార్యప్రాణగతికిఁ జెడితి నేటి యనుకొందు నిఁకన్. 813

క. ఇటులైనను మృతి నాకుఁ, ఘటియింపదు దుఃఖ మెవరికడఁ జెప్పుదు న
క్కటా ! రాముఁడైన లేఁడు, స్ఫుటభార్యావిరహదుఃఖభర మతఁడెఱుఁగున్.814

క. సమవర్తులు దంపతు లౌ, కక్క మొగిఁ బ్రమృతిఁబొందునట్లుగా సల్పఁడ దై
వము; ముదలొసర్పి రుపకా, రము శాస్త్రముఁగు సహమరణము సతులకున్.

వ. అని బహుప్రకారంబుల విలపించు తాలధ్వజునకు మధుసూదనుండు సయుక్తి
కమ్మగు వచనమ్ముల నిట్లనియె. 816

గీ. ఏల దుఃఖించెదవు నరపాల ? నీదు
భార్య యేమాయె ధర్మింపుఁ బద్ధతులను
వినవె ? యెవపేవ లేదె ? యా వెలఁది యెవ్వ ?
రీ వెవరు ? యోగము వియోగమెట్లు మీకు. 817

గీ. అధిప సంసారమను ప్రవాహంబునందు, నెవరి కెవ్వరు ? రోదన మింతయేల
యింటి కరుగుము నౌకపై నెక్కి దాఁటు, వారి చందంబకాదె సంసారరీతి. 818

క. నీకా లతాంగితోఁ దగె, నేకతమున యోగ, మెఱుఁగుదే నీవు నృపా !
యా కలికి తల్లిదండ్రుల, శోకింపకు దైవచర్య చోద్యము కాదే. 819

గీ. కాకతాళీప్రసంగ మక్కలికిఁ బొందు, గాన శోకంబువిడిచి వేగ గృహమేగి
కాలచోదితమైన భోగంబు గొనుము, వచ్చినట్టులయేగె నవ్వనరుహాక్షి. 820

క. రోదనమొనర్చి నీ వీ, మేఁదం దేఁగలవె దాని; మేకొను యోగం
బేదియు దైవాధీనతఁ, గాఁదగు నద్దాని నాఁగఁగా శక్యంబే ? 821

గీ. కాలవశమునఁగల్గు భోగంబు దాని, కతనన యడంగు నద్ది యొకానొకప్డు
విష్ఫలంబగు సంసార విధివిధి ము, వింగి శోకింతురే ? యిది నీకు తగెనె. 822

క. ఘటికాయంత్రము వడువున, నటు నిటు సుఖ దుఃఖములకు నగుభ్రమణ మ్మొ
క్కటి నవిఁ జొప్పడదు నం, కటపడకుము పురికి నేఁగఁగాఁదగు నింకన్. 823

వ. కాదేని రాజ్యమ్ము దాయాదాధీనం బొనర్చి వనమ్మున కరుగుము ప్రాణులకు మానవదేహంబు దుర్లభంబు క్షణభంగురంబగు నద్దాని నొందినవానికి నెట్లైన నాత్మసాధనం బావశ్యకంబగు. 824

క. పరికింపఁగ జిహ్వోప, స్థసంబు సమస్తజంతుసాధారణమౌ
నరుల విశేషం బేమిఁక, సురుచిరమగు జ్ఞానగరిమ చొప్పడదేనిన్ ? 825

క. కాంతావిరహోద్భవమగు, వంతికా విడనాడి గృహము వేరుము జగమ
త్యంతము మాయామోహిత, మింతయు నద్దానిఁ దననే నీకబ్బెన్. 826

వ. అను శ్రీహరి వచనంబుల నతండు గృహంబరిగి జ్ఞానసంపన్నుండై సుఖంబుండె. నట్లు నృపాలుండేగిన పిదప నమ్మునింగాంచి మాటిమాటికి మందస్మితం బినుమ డింప మధుసూదనున కే నిట్లంటి. 827

క. దేవా వంచన చేసితి, పీ వమ్మాయాబలంబు నెఱిఁగితి, నిపుడున్
భావమునఁ దోఁచు నవిలా, భావమ్మున నే నొనర్పునను లవియెల్లన్.. 828

చ. మునిఁగితి నత్తటాకమున మున్గిన యంతన యెట్లు నాకుఁ గ
ల్గెనొ వచియింపు విస్మృతిః పృగిననునాకృతి చెందినప్పుడున్
మనమును దేహలింగములు మాఱెనె, యయ్యవికాక జ్ఞానహా
శన మగుటెట్లు ! నాకుఁ గల సందియమియ్యది వాపు మచ్యుతా. 829

చ. నృపవరునిన్ వరించి యొకనేమము లేక యనేకభోగముల్
తపయు నహం బటం చెఱుఁగఁ జాలక పొందుచు మీఁద మద్యపా
నపుఁ గృతి నల్పుచుఁ జా మెలఁగినాఁడ నతీమణినై మహాత్మ ! నేఁ
డిపనిని నారదుండ నను తత్త్వ మొకింతయుఁ దోఁప దక్కటా ! 830

క. ఇయ్యెడ స్వప్నము తెలియఁగ, నయ్యెడిఁ గత మేమి చప్పు దటు లౌటకు ? నేఁ
డొయ్యలినై సలిపిన కృతు, లయ్యారే ! తలఁచికొనిన నత్యద్భుతమౌ. 831

వ. నావుడు జగదీశ్వరుం డిట్లను. మునీంద్రా ! యిది యంతయు మాయావిలాసంబ కాఁ దెలియుము. సర్వజంతువులకును జాగ్రత్స్వప్నసుషుప్తితురీయంబు లను నాలుగవస్థలు కలవు; దేహాంతరప్రాప్తి యగునపుడు పూర్వజ్ఞానంబు నశియించుట కేమి సందియము. 832

క. నిదురం జెందిన మనుజుఁడు, పవపకి యొక్కింత యెఱుక వడయఁడు వలుకం
డెది వచియించినఁ దెలియం, దచి యొదలినమీఁద నెఱుఁగు నఖిలం బనఘా. 833

వ. మఱియు నిద్రావస్థయందు మనోభావమ్ము లనేకగతుల మాఱుచుండు నెట్లం చేని,

గీ. మృతుఁడయిన తాత తనయింటి కేగుదేర, నతనితోఁగూడి భోజనం బాచరించి
తగు ప్రసంగం బొనర్చు నిద్ర నొకయప్డు, స్వప్నవశమున నిది యెంత సత్య మగునొ.

ఆ.వె. స్వప్నమందుఁ దనకు జరిగిన దంతయు, మేలుకాంచి మదువు మిథ్యయనుచు
నెవఁడుగాని యప్పు డెఱుఁగంగ నేర్చునే, భ్రమ యటంచు నింత పలుకుమయ్య.

క. మాయాగుణవిలసన మది, యే యయ్యల కెఱుఁగవచ్చు? నిది దుర్ఘట మ
త్త్రోయజభవుఁ డేనును దు, ర్జేయమ్ముగఁ దలఁతు మగ్గిరిఖుఁడున్ మౌనీ. 837

గీ. తలఁప జగమంతయును గుణత్రయకృతంబు, లేదు సంసారమున లవలేశమేని
గుణవిహీనపదార్థంబు గుణివరేణ్య!, యేను సత్త్వప్రధానుఁడ నెఱుఁగు మింత.

వ. తక్కిన రెండును నాకు ననసర్జనమ్ములగాఁ దెలియు మొకప్పుడును గుణవిర
హితుఁడనై యుండ; నట్ల బ్రహ్మకు రజంబు ముఖ్యంబు, సత్త్వతమము లప్రధా
నంబులు; హరునకుఁ దమంబు ప్రధానంబు సత్త్వరజంబు లముఖ్యమ్ములని చెప్పి
వెండియు, 839

చ. అగుణుఁడు నాకు నెయ్యెడల నారయరాఁడుమునీంద్ర! మోహముం
దగులకుమయ్య వాదుకతవన్ గనుఁగొంటివికాదె మాయ, దా
ని గణవచేయ శక్యమగునే? యది చేసెడి వింతచేష్ట లొ
క్కగతి నెనంగ నద్భుతముగాఁ గనుపట్టు ననేక భంగులన్. 840

గీ. అని హరివచించె నని చెప్పెననఘ నాకు, నారదుం డంత నేను నానంద మెసఁగ
మరల నాతని నడిగితి మాధవుండు, మగుడ నీకేమి చెప్పి యరిగెనొ చెపుమ. 841

వ. అనవుడు నారదుం డిట్లను నట్లు బోధించి గరుడు నెక్కి తన నివాసమ్మున కరు
గుచు నమ్మం గాంచి యిట్లనియె. 842

క. నాతో వైకుంఠమ్మున, కేతెంచెదొ? లేక నీ యథేచ్ఛ నరిగెదో?
నే తెలుపుమన్న నరిగితి, నాతని యాజ్ఞ గొని నరపిజానమకదకున్. 843

గీ. అరిగెఁ దనయంత వైకుంఠ మబ్జనేత్రుఁ, డేను జరిగిన వృత్తాంతమెల్ల దలఁచి
కొంతఁ జింతాతురతఁ దలపంచియుండఁ, దండ్రి యిట్లనె నమఁగాంచి దయదలిర్ప.

క. ఎక్కడి కేగితి? చింత, న్నెక్కొనఁ గతమేమి? తెల్పు నీ కస్వాస్థ్యం
బెక్కడిది? యెవరి వంచనఁ, దక్కితి? వేయద్భుతం బొదవె నేమాయెఁజా. 845

వ. నావుడు నే నిట్లంటి, మహాత్మా! విష్ణునిచే వంచింపంబడి స్త్రీత్వంబంది యందు

ననేకవర్షమ్ములు పుత్రశోకాదిదుఃఖమ్ము లనేకమ్ము లనుభవించి మరల నతనిచే బోధింపఁబడి సరోవరస్నానం బొనరించి వృషపుంగ సైతి విమ్మాయాబలం బెట్టిదో యెఱుంగ నలవి కాకున్నయది. తజ్జన్మమ్మున నాకుఁ బూర్వజన్మవిజ్ఞానం బింతయుఁ గనుపట్టకుండె, దీని నెట్లు జయింపనగు నని యోజించు నీవె ట్లీద్దాని జయించి యించితో నా కాయుపాయంబు తెలుపుము నావుడుఁ జతురాననుం డిట్లనియె. 846

చ. హరిహరులున్ సురాసురులు నన్యులు మౌనులు నేను మాయపై
గరి నొకయించుకేనిఁ గనఁగాఁ దగువారము కాము శోకముం
బొరయకుమయ్య యయ్యది విమోహితులం బొనరించు నందఱా
గరము సృజించి పెంచును జగం బడఁగించు నొకింతలోపలన్. 847

క. జనకుండిటు బోధించినఁ, జనుదెంచితిఁ దీర్థయాత్ర సలుపుచు విట కీ
వును గౌరవనాశన సం, జవితము దుఃఖంబు మఱచి స్వస్థతఁగనుమా. 848

క. కృతకర్మము లనుభవగతి, న తఱుఁగు నీ కేల మనమునన్ జింతఁగొవన్
ధృతిఁ గాల మిచటఁ గడపుము, గతమునకుం జింత పేయఁగాఁ దగ దేరుఁజా.

వ. ఇట్లు నాకు బోధించి నారదుం డరిగెఁ; బిమ్మట నే నాసారస్వత కల్పమ్మునఁ దత్సరస్వతీతీరమ్మున నుండి యీ భాగవతమ్ము గాలక్షేపార్థం బొనర్చితి. 850

క. ఇది నానాఖ్యానయుతం, బిది సంశయనాశకారి యియ్యది మోక్ష
స్పద మిది వేదప్రామా, ణ్యదమై తవరారు వినుము నరనాథమణీ. 851

గీ. దారుమయమైన పాంచాలిఁ దనదుకరము
నందుఁ గొని యైంద్రజాలికుం డద్భుతముగ
న ర్తనంబొనరించుచందమున జగము
నెల్ల నాడించు మాయ యోనృపవరేణ్య. 852

వ. సదేవాసురమానుషంబగు నీ జగంబు బ్రహ్మాదిస్తంబపర్యంతమ్మును బంచేంద్రియ యుక్తమ్మును మనశ్చింతానువర్తనంబును నని యెఱుంగునది. సకలమ్మునకును మాయాసముద్భవమ్ములగు గుణమ్ములు కారణంబు లయ్యెవి భిన్నభిన్న స్వభావమ్ములు. కారణగుణమ్ములు కార్యమ్మున సంక్రమించుట శాస్త్రసమ్మతం బగుటఁ బురుషుండెల్లప్పుడును దద్యుక్తుండ కానెఱుంగుము తంతు రహితంబగు పటమ్మును మృద్విరహితంబగు ఘటమ్మునుంబోలె దేవతిర్యఙ్మనుష్యాదుల నొక్కండ నేనిఁ ద్రిగుణరహితుండు కల్ల. 853

క. శ్రీనాథహరవిరించులు, భూనాయక ! త్రిగుణయోగమునఁ బ్రీత్యప్రీ
త్యానందదుఃఖతలఁ దా, మానుదు రెల్లప్పు డింతయును విక్రమగున్. 854

వ. బ్రహ్మ సత్త్వగుణసంపన్నుండగు నేని శాంతుండై సమాధిమంతుండై సర్వభూత
ములయెడఁ బ్రీతిగలిగి వర్తించు, నంత సత్త్వం బెడలి రజం బావరించిన నెల్లె
డలఁ బ్రీతిమాని ఘోరరూపుండై యుండు, నట్లె తమోగుణావిష్టుండై విషాద
యుక్తుఁడును మూఢుఁడును నగు; హరిహరులను నిట్టిదయని యెఱుంగుము. 855

ఆ.వె. చంద్రసూర్యవంశసంభవులగు రాజు, వసువు మనువు లెల్ల సురలు నరులు
గుణము లనుసరించి గొనకొని చరియింత్రు, మాయఁ బడనివాఁడు మహిని లేఁడు.

క. భూనాథ ! దేహి మాయా, ధీనతఁ బరతంత్రుఁడగుచుఁ దిరుగున్ సంవి
త్తై వెలిగెడి పరతత్త్వం, బే నెల వమ్మాయ కనుచు నెఱుఁగుము పేర్మిగా. 857

వ. సంవిద్రూపిణియగు పరమేశ్వరి స్వాయత్తంబగు నమ్మాయ నెల్లప్పుడు జీవం
బులపైఁ బ్రేరేపుచుండు. 858

క. కావున మాయాయుత న, ద్దేవిని ధ్యానించి మ్రొక్కి తేఁకువకలిమిగా
భావించి పూజ చేసిన, కోవిదులకు ముక్తి గల్గుఁ గురుకులతిలకా. 859

క. తనుఁ గొల్చెడివారలపై, నెనరునఁ దనమాయ నడఁచి నిఖిలేశ్వరి ము
క్తి నొసంగఁ జాలు శుభదృ, ష్టిని నిగుడఁగఁజేసి ప్రోచు శీఘ్రముగ నృపా. 860

క. భువనంబు మాయ దానికి, శివదాయిని శక్తి రాజ్ఞి, చెల్లం దానన్
భువనేశి యనెడి నామం, బవితథముగ నప్పరాంబ కాగ మహితమై. 861

ఆ.వె. ఆపెయందుఁ జిత్త మమరినవారికి, నవనినాథ సుసదాత్మకంబు
మాయకతన నేయపాయంబు గల్గ న, ద్దాని వదలవలయుఁ దవిలి మొదల. 862

గీ. సచ్చిదానందరూపిణి సకలజనని, దక్క మాయ నడఁప నితరులు గారు
సూర్యచంద్రవిద్యుత్ప్రభాళులఁ దక్కఁ, దమ మడంగునె తమముచేత నరనాథ.

క. మాయేశ్వరియై సంవి, త్తై యలరుచు స్వప్రకాశ మలవడునంబన్
బాయక కొలువందగు న, మ్మాయాగుణ మాగుడించు మానవనాథా. 864

క. ఇది వృత్రాసురహననము, మొదలుగ నీ యడుగు ప్రశ్నముల కుత్తర, మి
య్యది యీ పురాణమునకుం, బొదలున్ బూర్వార్థమగుచు భూపవతంసా. 865

క. ఇం దెల్లయెడల నప్పర, సుందరి మహిమమ్ము వొలుచు సొలవక దీనిన్
మందమతి కిడఁ దగ దియ్యది, విందగుఁ బరశక్తి భక్తి వివశుల కెల్లన్. 866

వ. ఇయ్యది భక్తునకును శాంతునకును శిష్యునకును జ్యేష్ఠపుత్రునకును నొసంగఁదగు రహస్యమ్మును వేదతుల్యమ్మును సకలకథాసారమ్మును సత్పురుషాజ్ఞానుసిద్ధమ్మును నగు పురాణంబు దీని భక్తియుక్తుండై పఠించు నపుడు జ్ఞానియు భవిష్యుం గాఁగలఁ డని వ్యాసుండు జనమేజయునకుఁ జెప్పెననుటయు. 867

## స్కంధాంత పద్యములు.

చ. అనుపమశాస్త్రవిత్త్వవినయాదివిభాసుర। భూసురాగ్రగ
ణ్య। సముపనేకశిష్యజననందనచందనవృక్ష। ధర్మవ
ర్ధనచరితాలవాల। విబుధప్రకరస్తవనీయకీర్తిశా
జన। జననాథమౌళివిలసత్పదపద్మ। మహామహోన్నతా। 868

క. అంగజవైరిశిరస్పం, సంగిదుపీభంగభంగసంధానచణా
భంగురవాగ్విజితప్రా, సంగికజనసార్వభౌమ। సన్నుతనామా. 869

మాలిని. వితరణగుణశాలీ। విద్వదంభోజహేళీ।
కృతసుకృతవిశేషా। కేవలాద్వైతభూషా।
నతదురితవినాశా। నవ్యకీర్తి ప్రకాశా।
ధృతిపతతశరణ్యా। ధీరవారాగ్రగణ్యా। 870

### గద్య.

ఇది శ్రీ........తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను
మహాపురాణంబునందుఁ షష్ఠస్కంధము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీ భాగవతము



## సప్తమస్కంధము.

పరతత్త్వాదర ! విస్తుల, తరపాండిత్యప్రకర్ష ధర్మోత్కర్షా
భరణ ! కలుషాపహరణ ! వి, తరణగుణనివాస ! బ్రహ్మాత్మతత్త్వవిహారా ! 1

వ. అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుం గాంచి యవ్వలికథ నొసఁగు
మనుడు నక్కథకుం డిట్లను నట్లు పురాణకథనోత్సుకుండగు వ్యాసునకు జనమే
జయుం డిట్లనియె. 2

చ. హిమకరుఁడుం దివాకరుఁడు నేరికి వంశకరుల్ క్రమమ్ముగా
నమలినకీర్తులై వెలయు నమ్మహిపాలుర యోగ్యతల్ వినం
గ మనముపుట్టె శక్తిపదకంజరతుల్ గద వీర, లిట్టి యు
త్తములచరిత్రకన్న శుభదం బిఁక నెయ్యది మౌనిసత్తమా. 3

వ. అనవుడు వ్యాసుండు ప్రీతమనస్కుండై, నరేంద్రా ! సూర్యచంద్రవంశజులగు
వారలయు జన్మమ్ము లాదిగ నఖిలంబును విస్తరించెద నాకర్ణింపుము. 4

## బ్రహ్మోత్పత్తి.

గీ. అబ్జలోచను నాభియం దవతరించి, మించితపమున దేవి మెప్పించి వరము
గైకొని జగంబు సృష్టింపఁగాఁ గడంగి, మనుజుల సృజింపలేక యప్పద్మభవుఁడు.

వ. మనమ్మున బహువిధంబుల యోజించి మరీచ్యంగిరోఽత్రివసిష్ఠపులహక్రతుపులస్త్యు
లను మానసపుత్రుల నేడ్వురఁ బ్రథమమ్మున నొనరించె, నంత రోషమ్మువలన
రుద్రుండును నుత్సంగమ్మువలన నారదుండును నంగుష్ఠమ్మున దక్షుండును నుద్భ
వించిరి. తక్కుఁగల సనకాదులును బ్రహ్మమానసపుత్రులకా నెఱుంగునది, వామాం
గుష్ఠమునుండి దక్షపత్నియగు వీరిణి జనియించె. 6

గీ. పఠియును నసిక్ని యనఁగ నిమ్మగువ కింక
నొక్క నామమ్మ గల దీపె కుద్భవించె
మరల నారదుఁ డనుడు సమ్మౌని కిట్టు
లనియె జనమేజయుఁడు సంశయంబు గదుర. 7

క. వీరిణికి దక్షునకు స, న్నారదుఁ డేకారణమ్మునఁ జనియించెన్
ధీరుం డతనికిఁ బూర్వశ, రీరం బెటు వోయె నెట్లు మృత్యువు దొడరెన్. 8

ఉ. నాపుడు వ్యాసుఁ డిట్లను జనస్తుత! ధాతయనుజ్ఞ దక్షుఁడుం
జేవ గలట్టి పుత్రుల సృజించెఁ గళత్రమునందు నైదువే
లావిమలాత్మ లందఱును నాత్మజులన్ సృజియించి సృష్టి నెం
తే వెలయించు వయ్యెడల నిట్లనె నారదమౌని వారికిన్. 9

వ. భూప్రమాణం బెఱుంగక యున్న ప్రజాసృష్టిం జొనర్చు బాలిశులగు మీర లపహాస్యత
నొందుట నిక్కం బనవుడు నా హర్యశ్వులు తమలోఁ దమరు మునివచనంబు
విశ్వాసార్హం బని యెంచికొని భూప్రమాణం బరయ నందఱును బయలువెడలి సకల
దిక్కులకుం జనినంత దక్షుండు పుత్రు లేగుటకుఁ జింతించి మరల గొందఱ
నక్కార్యంబునకుఁ బుట్టించిన వారలు తదాజ్ఞంజేసి సర్గంబున కుద్యమించునెడ
నారదుండు యథాపూర్వమ్ముగ వారలం జూచి పల్కుడు వారలును దద్వచన
మోహితులై భూప్రమాణం బరయ నరిగిన దక్షుండు తత్పుత్రవిరహమ్మున శోకా
ర్తుండై నారదుని గాంచి, 10

క. నాకొమరుల నిటు చేసిన, నీకయ్యెడి గర్భవాసనిష్ఠురదశ నా
కే కొమరుఁడ వగు మనుచున్, వేకనలి శపింపఁ బుట్టె వీరిణి కతఁడున్. 11

వ. పిమ్మట దక్షుం డఱువదిమంది కన్నియల సృష్టించి యందుఁ బదుమూగురఁ
గశ్యపునకును బదుగుర ధర్మునకును నిరువదియేడ్వుర సోమునకును నిరువుర
భృగువునకును నల్వుర నరిష్టనేమికిని నిరువురఁ గృశాశ్వునకును నిరువుర నంగి
రసునకును నిచ్చిన నవ్వారల కందఱకును సంతానం బుద్భవించె. 12

క. వారల కుదయించిన య, వ్వారలు నవ్వారిసుతులు బలియురు శూరుల్
ధీరులు పరస్పరమ్మును, వైరులు సుర లసురు లగుచు వర్ధిలిరి నృపా. 13

క. నాపుడు జనమేజయభూ, మీవిభుఁ డిట్టులను దెల్పుమీ రవికులముం
ధావిర్భవించి ధర్మ, శ్రీ వెలసిన నృపవరుల చరిత్రము నాకున్. 14

వ. వ్యాసుం డిట్లను, నరేంద్రా! మున్ను నారదుండు నాకెఱిఁగించిన తెఱంగునఁ దెల్పెద నాలింపు మొక్కనాఁ డతండు నేను దపం బొనరించు సరస్వతీతీరంబునకుఁ నరుదెంచిన నమ్మహామహు నర్ఘ్యపాద్యాదికృత్యంబుల సత్కరించి యాసనస్థితుఁ గావించి యిట్లంటి. 15

గీ. పావితుఁడనైతి నీరాకఁబట్టి యేను, సప్తమం బగు మనువంశమునఁ బుట్టి
జగతి పాలించురాజులచరితములను, వినవలంతు నవిఁ గరుణించి మునివరుండ.

వ. నన్నుం గాంచి యిట్లు చెప్పం దొడంగె. 17

క. విను సత్యవతీసుత య, వ్వనజాక్షునినాభిఁ బుట్టెఁ బ్రథమంబున న
వ్వనజాసనుఁ డీజగమున, కనఘుం డాతండ కర్త యఖిలవిధములన్. 18

వ. సర్వశక్తియుక్తుండును సర్వజ్ఞుండును నగు నన్నలువ పదివేల వత్సరంబులు తపం బొనర్చి పరదేవతానుగ్రహంబు వడసి శుభలక్షణలక్షితులగు మానసపుత్రుల ననేకుల సృజించెఁ; నందు మరీచి యధికుండై సృష్టియందు నేర్పరియై మించె. నతని కొమరుండు కశ్యపుఁ డతనికి దక్షసుతలు పదమూగురు భార్యలైరి. 19

## సూర్యవంశవిస్తారము.

గీ. కశ్యపున కుదయించి రకాంతలందు, సురలు నసురులు యక్షకిన్నరు లురగులు
మనుజులును బశువులుఁ బక్షులును గ్రమముగ, దాన నీ సృష్టి కాశ్యపినా నెసంగె.

వ. అందు దేవతలలో సుప్రసిద్ధుండగు వివస్వంతుని కొమరుండు వైవస్వతమనువు. తత్పుత్రుం డిక్ష్వాకుం డతనివలనన సూర్యవంశంబు విస్తరించెఁ; నితనికి నెనమండ్రు తమ్ములు గలరు. వీరి నామమ్ములు నాభాగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యంతుండును బ్రాంశుండును నృగోద్దిష్టుండును గరూషుండును బృషధ్రుండునని చెప్పంబడు వీరలు మానవు; లిందు జ్యేష్ఠుండగు నిక్ష్వాకునకుఁ బుత్రశతకంబు వొడమె నందు మొదటివాఁడు వికుక్షి యనంబడు నాభాగునకుఁ బుత్రుం డంబరీషుండు మఱియు ధృష్టునివలన నుదయించిన క్షత్త్రంబు బ్రహ్మభూతమ్మును బ్రహ్మకర్మరతమ్మును సంగ్రామకాతరమ్మును నాయె. 21

క. అనఘుండగు శర్యాతికిఁ, దనయుం డానర్తుఁ డనఁగఁ దనరున్ దరుణీ
జనరత్నంబు సుకన్యా, వనజముఖి తనూజ యగుచు వఱలె నరేంద్రా. 22

వ. శర్యాతి యక్కొమరితె నంధుండగు చ్యవనున కిచ్చి వివాహం బొనర్చిన నాపె శీలం
బెట్టిదని యశ్వినులవలన నతండు సులోచనుండయ్యె నన జనమేజయుం డిట్లనియె.

క. చ్యవనునకుఁ జూడ మునీంద్రునకు నంధున కేగతి నిచ్చె నా నృపా
లవరుఁడు రూపశీలగుణలక్షణముల్ గలయట్టి కన్య ని
క్కువలయమం దపూర్వయుఁ గుణాన్వితశీలయు నైనపుత్రినే
ని వనున కంగహీనునకు నిక్క మొసంగెడి తండ్రు లుండిరే.

వ. అన నతం డిట్లనియె. 25

క. అయ్యెడ నై వైవస్వతసుతుఁ, డయ్యమహోత్రుండు సంపదాఢ్యుం డగునా
శర్యాతికి నాలుగు వేల్, భార్యలుగల రందఱు ననవద్యచరిత్రల్. 26

క. అందఱుఁ బ్రేమము గలవా, రందఱు రూపమున మేటు లంద ఱతనికిన్
విందులు వారలకెల్లను, నందన యొక్కర్తు దగుఁ గనందగు పేర్మిన్. 27

వ. అక్కన్నియ సుకన్యయను పేరుగు నత్తలోదరియందుఁ దండ్రికిని దల్లులకును
బ్రేమం బధికం బగుటఁ జేసి యాపె యెక్కుడగు గారాబమ్మునఁ బెరుఁగుచుండె.

ఉ. మానససన్నిభం బనుపమానజలంబు సమస్తపక్షిసం
తానవిరాజమాన సముదంచితపంచవిధాబ్జసంగతం
బై నిఖిలాగమాకరతటానుగతంబు తటాక మొక్కెడిం
పౌ నలఘూమిపాలు నగరాంతికమం దళిరాజిసేవ్యమై. 29

క. అవిరళపాదపవ్యాప్తత, నవివిధవిషయమందు విజనసంస్థితుఁడై భా
ర్గవుఁడు తప మాచరించెన్, జ్యవనుం డనుమౌని యంబ సంతసమందన్. 30

క. మౌనము గొని జలపానం, బేనియు నొనరింపకే జితేంద్రియుఁడై యొం
డే నేమమూని యంబన్. ధ్యానించు నతండు నాకు వయ్యెఁ గ్రమముగన్. 31

క. తనగాత్రం బెటు వల్మీ, కనికృతమై మేటిమంటిగడ్డ విధమునన్
దనరి లతావేష్టితమై, పనుపడియుఁ బిపీలికాదిభాజన మగుడున్. 32

వ. ఒక్కింతయుఁ జలింపక యమ్మహానుభావుం డుగ్రతపమ్మునమునుండెఁ: గొండొక కాల
మ్మునకు శర్యాతి సుందరీబృందసహితుండై యక్కాసారమ్మునఁ గ్రీడ లొనరింప
నేతెంచి యిష్టవిహారమ్ము లొనరింపుచుండఁ దోనేగిన సుకన్యయుఁ దననెచ్చెలులం
గలసి యందంద పుష్పాపచయంబు సలుపుచుఁ జంచలయుంబోలె సవ్వనమ్మునం
గ్రుమ్మరుచునది యొక్కెడఁ జ్యవనునివల్మీకంబు దిలకించి క్రీడాసక్తిం జేసి తత్సమీ
పమ్మున కరిగి. 33

క. తెలియక మత్పుత్రిక ని, న్నలయించినపనికిఁ గోప మందక తగు నీ
కలదృష్టి మనుపఁగోరెద, నలఘునె కోపంబు తాపసాగ్రణులందున్. 43

ఉ. నావుడు మౌని పల్కు జననాథ! యొకింతయు నేనిఁ గోపమున్
బాపమునందుఁ జేర్ప నొకపట్టున నైన, భవత్తనూజ నా
కీవిధి నేత్రఘాత మొనరించిన దానికిఁగా లభించె నీ
కీవికలత్వ; మేను శపియించితి నంచుఁ దలంపఁబోకుమీ. 44

క. అపరాధం బొందెఱుఁగక, తప మొనరుచు శక్తి భక్తతతి కెవ్వారే
నపకారం బొనరించిన ను, ఖపడుట చొప్పడునె హరుఁడు కనలకయున్నే. 45

క. మునుపటి గ్రుడ్డివాఁడ న, నద నోరాజేంద్ర! యెవరు నా కిఁకఁ బరిచ
ర్యాఁ దగం జేయుదు రని దీ, నదశ వగఁజెందు మునికి నరపతి పలికెన్. 46

క. మునిసత్త్వ! బాలసుందరు, లనిపెద సేవకుల నీకు ననుగుణముగ నే
ని నొసఁగెదఁ; గాన నైనన్, మనమునఁ గోపమ్ము విడిచి మన్నింపుదయన్. 47

చ. అనవుడు మౌని పల్కు, నకటా కడు గ్రుడ్డికి నాకు నే గతిన్
బనుపడు నిష్ఠ యే మొనరుపం దగువా రగుదుర్ త్వదీయులౌ
సహచరు లింతయేల? విను మాత్మజనిమ్ము మదీయసేవకున్
దపసి తపమ్ము చేసికొనెదన్ సుఖ మబ్బెడి దీన నీ కొగిన్. 48

క. నీకొమిరె సేవచేయ న, నాకులగతి నేఁదప మ్మొనర్చు కొనెద నీ
కే కాదు నీదు సైనిక, లోకమ్మున కెల్ల సుఖములు గలుగు దీనన్. 49

క. జనవర! క్షమాపణన్ గో, రినవాఁడవయేని న్యాయరీతిని నీ పు
త్రి నొసంగి పెండ్లిసేయుము, మునినగునా కిడఁగ శంక మొనయుట తగవే. 50

క. అనవుడు శర్యాతియు న, మ్మునివాక్యము వినియు మిగుల మునుకొను చింతన్
మునిఁగి యెడతెగని యోజన, గొని యిటు నటు చెప్పఁడాయెఁ గువలయనాథా. 51

చ. మునలికి గ్రుడ్డికిన్ మిగుల మోటునకున్ సురకన్యవోని నా
దుసుత నొసంగి సౌఖ్యమునఁ దూఁగఁగ నిచ్చ యొనర్చుటెట్టు? లా
త్మసుఖముగోరి యెవ్వఁడును మంచియుఁ జెడ్డయు నేర్చువాఁడు పు
త్రిసుఖము వాపి కాఁపురము ద్రెళ్ళఁగఁజేయునె కీర్తి రోయునే. 52

గీ. అక్కటా! కడు వృద్ధుని నంధు నెడ్డి, నితనిఁ బతిగా వరించి పంచేషుబాణ
వివశయై యొప్పు మత్పుత్రి వేగునెట్లు, బ్రతికియున్నంతకాలంబు ప్రభకుఁ దక్కి.

చ. తన కనురూపులౌ పతుల తారసమైనను మేటియందచం
దములు గలట్టికామినులు దక్కొరులన్ గవఁగూడ నెంత్రు దు
ర్గమమగుజవ్వనమ్మున నొకం డిటువంటికురూపి భర్తగా
నమరినఁ జెప్ప శక్యమె యహల్య సురేశ్వరుతోడఁ గూడదే. 54

క. సురపతిచే వంచితయై, తరుణిం గౌతముఁ డెఱింగి తా శపియింపఁగా
బరమార్తిఁ జెందె నాడుకొ, మిరె నీయందున కొసంగ మేలెటు లబ్బున్. 55

వ. కావున ననుగుణదాంపత్యమువకన్న హేయంబు వేఱొండు లేదని నిశ్చయించి
యమ్మని కీబుద్ధి రాక విమనస్కుండై తన గృహమ్మున కరిగి మంత్రులం బిలిచి
యిట్లను. 56

క. అరయఁడు మత్సుత నమ్మని, వరునకు నీవలయుఁ గానిపక్షమునం దా
తురత నిడుమలం బడవలె, నిఁకదెఱఁగుందక్క నన్య మిం దొకఁ డున్నే. 57

వ. నావుడు మంత్రులు రాజేంద్రా! దుర్భగుండగు నమ్మని కిక్కన్య ననన్యసామాన్య
లావణ్యగణ్య నొసంగుట మాకును నసభిమతంబయని చెప్ప నాసమయమ్మున
వారి యింగితం బెఱిఁగి సుకన్య యట కేతెంచి యిట్లనియె. 58

ఉ. నాకొఱ కింతయాపద గనందగునయ్య, నరేంద్ర! నేన య
వ్యాకులలీల నేగి మునివర్యుని మత్కృతదుష్కృతక్రియా
పాకృతనేత్రు నుద్ధరకృపాయుతుఁగా నొనరింతు నాత్మదా
నాకలనమ్మునన్ సుఖము లందుము స్వస్థత చెంది నావుడున్. 59

చ. అవనిపుఁ డిట్లు పల్కు సచివానుచరుల్ వినుచుండఁ గన్యకా,
శివశివ! యెట్లొనర్చెదవు సేవన మవ్వనమందు నిల్పి యా
చ్యవనుని శక్తిహీనునకు సంతతకోపికి వృద్ధమూర్తికిన్
గువలయనేత్ర! మత్సుఖము గోరి నిమగ్న ముదిమౌని కిత్తునే.

క. ధనధాన్యసమృద్ధునకుఁగా, ఘనశీలమగు వయసుగల్గు సుందరునకు సం
దని నీఁదగు జనకుఁడు ని, ర్ధనునకు ముదుసలికి నిచ్చుట ధర్మంబగునే. 61

క. ఉటజమ్మునఁట కాఁపుర, మఁట ముదునలి కోపియగు వరుఁడఁట య
క్కట! నాతని యుకుఁ బతియఁట, పటియించిన నాకుఁ బుట్టగతు లెట్లుండున్. 62

క. అమ్మా! విను మేమును రా, జ్యమ్మును నమ్మైనఁ గాని జంకుగొనక ని
న్నమ్ముదునె దీనికై నే, త్రమ్ములులేకున్న ముసలితపసికి నేనై. 63

వ. అవశ్యమ్మును గాఁదగు కార్యమ్ములు కాకమాన వప్పట్ల నేను ధైర్యంబు విడువ
నని పల్కి తండ్రికిఁ బ్రసన్నవదనయగుచు సుకన్య యిట్లనియె. 64

## సుకన్యాచ్యవనవివాహము.

ఉ. జనవర! యిట్టులాడుటయు నమ్మత మెట్లగునయ్య లోకపా
వనుఁడు మహామహుండు మునివర్యుఁడు వృద్ధననేల? నిత్యసే
వన మొనరించుదాన సుఖవాంఛ యొకింతయు నాకు లేదు భూ
జనులకు నెల్ల నాకతన సౌఖ్యము గల్గుట యొందు చాలదే 65

క. వనమున నమ్మునివరు సే, వనమునఁ దగులొంది భక్తిపరవశనై యా
తనిమాట కడ్డుసెప్పక, జనవర నీకుఁజా యశంబు సంపాదింతున్. 66

వ. అను పల్కుల నిశ్చయమ్మునకు మంత్రులును నృపాలుండును బరమాశ్చర్యంబు
నొందిరి. పదంపడి శర్యాతి యమ్మునిపాలికిం జని నమస్కరించి, మహాత్మా!
మత్పుత్రి నొసంగెద ననుగ్రహించి గ్రహింపుమని విధివిధానంబుగ వివాహంబొన
రించిన నతండు సంతుష్టాంతరంగుండై పరివారంబు గ్రహింపక కేవలకన్యాపరి
గ్రహం బొనరించె నంత సైనికులకును రాజునకును సౌఖ్యంబు వాటిల్లె నిట్లు
మునికిఁ దన్నొసంగి జనకుండు గృహంబే తెంచు నయ్యవసరమ్మున నతనికి
సుకన్య యిట్లనియె: నయ్యా! నా యీ భూషణంబులు గొని నాకు నజినంబును
వల్కలంబును నొసంగుము. 67

క. మునిపత్ని వేషమ్మును, గొని నీకుఁజా సద్యశంబు గూర్చఁజా మతి నా
కును బరమగూర్చ నిచ్చా, వనిపతికి వచ్చునట్లు వర్తింతునిటన్. 68

క. అనసూయ యత్రికి వసి, ష్ఠునకు నరుంధతియుఁబోలె సుగుణుండగు ని
మ్మునికే నను ప్రీతిగొల్చెద, జనపా! నీ వింకఁ జింత నందకు మాత్మన్. 69

వ. నావుడు శర్యాతి యశ్రుపులు కన్నుల నురల నక్కన్నియకు నజినంబును వల్క
లంబును నొసంగె. 70

గీ. భూషణములెల్ల విడిచి యప్పువ్వుబోఁడి, యంత మునివేషధారిణి యగుటఁ గాంచి
జనవరుని భృత్యులెల్ల రోదన మొనర్చి, రధిప యక్కన్నె శీల మే మనఁగవచ్చు.

వ. ఇట్లు మునివేషధారిణియగు తనయ తనకుం జెప్పలేక చెప్పి సపరివారమ్ముగ శర్యాతి
నగరంబున కరిగె, నంత నమ్మగువ పతిసేవా పరాయణ గావున, 72

సీ. సమిదిక్కులకు నేగి నానావిధమ్ములౌ • ఫలమూలములు దెచ్చి పక్వమంచి
యగ్నుల వలరింప ననుగుణంబగు సమి • ద్భారంబు కుశకాంబు సంతరించి
తిలలను గుశలను దెచ్చి తోమిన కలశం • దలపుతో జల గూర్చి తెలన సలిపి
యుష్ణోదకస్నాన మొనరింపఁగాఁజేసి • యజినంబు పఱచి యం దల్ల నిలిపి
గీ. యనఘ! యిఁక నిత్యకర్మమ్ము నాచరింపు
కొను మని వచించి కర్మాంతమునఁ గరమ్ము
పట్టికొని సంస్తరణమున నట్టె నిల్పి
మునికి ననుగుణమైన భోజనము వెట్టు. 73
శా. నీవారాన్నముఁ గందమూలఫలముల్ నీరేజపత్రాక్షి యొం
తే వేడ్కన్ భుజియింపఁజెట్టి తగుతృప్తిం జెందఁగాఁజేసి పైఁ
గావించున్ గరపాదశుద్ధిఁ బిదపన్ "గైకొమ్ము తాంబూలమో
దేవా" యంచు నొసంగు వాసనము పొందించుచాగరాధారమై. 74
క. పిమ్మటఁ దదాజ్ఞఁ గొని దే, హమ్ము న్నిలుపంగఁదగు ఫలాహార మ్మొ
క్కొక్కమ్మ గొని సత్వరమ్ముగ, నమ్ముని సన్నిధికి వచ్చి యతివినయమునన్. 75
క. పాదమ్ము లొత్తుదునె యని, యాదర మొప్పఁగ నడిగి యమ్మునిపతి కా
మోదమ్ము సంతరింపుచు, దాఁ దదయుక యట్లొనర్చుఁ దగియుపకృతిన్. 76
వ. అంత సాయాహ్నంబగుడు హోమమ్మునకుఁ దగిన సంభారమ్ములు సంతరించి మధురమ్ములగు ఫలమ్ములం దెచ్చి భుజింపఁ బెట్టి తద్భుక్తశేషమ్ము గుడిచి పుష్ప ర్యాస్తరణం బొనరించి యందు శయనింపఁ జేసి పాదసంవాహనంబు సలుపుచుఁ గులస్త్రీ ధర్మమ్ముల నడిగి తెలిసికొనుచు నతఁడు నిద్రించిన తెలుంగెఱింగి తచ్చరణనికటమ్మున వల్లనొరగి నిద్రించుచు నప్పుడప్పుడు మేల్కాంచి తగు నుపచారమ్ము లొనర్చుచుఁ బ్రేమయుక్తమ్ముగ భక్తిపరాయణయై సేవించు.
గీ. తన్వి వేసవిఁ దాలవృంతమ్ము విసరి
నిమురపట్టెడిరీతి ననిలము గొల్పు
మగువ హేమంతమునఁ జలిమంటవైచి
యడుగు "సుఖమగునే" యని యమ్మునీంద్రు. 78
వ. బ్రాహ్మముహూర్తమ్మున మేల్కాంచి జలపాత్రమ్ముగొని శౌచార్థమ్ము నిజాశ్రమ మ్మున కనతిదూరమ్మునకుఁ గొనిపోయి యట డించి తానొక్కకమమునఁగనువెత

మండి పదంపడి సన్నిధికిఁ జని కేలువట్టికొని యాశ్రమముఁ బొందించి యాస
నమ్మున నుపవేశించి మృజ్జలమ్ములచే నతని పాదమ్ములు యథావిధిగఁ గడిగి యాచ
మనమ్మునకు జల మ్మొసఁగి యథోక్తంబగు దంతకాష్ఠమ్ము దెచ్చి యిచ్చి యంత
నుష్ణజలమ్ము సన్నద్ధం బొనర్చి యిట్లను. 79

ఆ. వె. "ఏమి యాజ్ఞ తెల్పు మిఁక దంత ధావనం
బాయెనే మహాత్మ ? యమలమైన
యుష్ణజలము లివియు యొనరింపు స్నానంబు ;
హోమసమయ మింక నొక్క త్రుటికి" 80

క. ఈరీతి ననుదినమ్మును, నారాజతనూజ మౌని కాయాసేవల్
గూరిమి నొనరించు సతిశి, వారము దనియించు నెల్లవారును మెచ్చఁగా. 81

వ. అంత నొక్కనాఁడు తదాశ్రమమ్మున కనతిదూరమ్మున నున్న తటాకమ్మునఁ గృత
స్నానయై యేతెంచు నయ్యతివ నంతకుమున్నె క్రీడార్థం బట కేగుదెంచిన యశ్వి
మలు గనుంగొని తద్రూపమ్మున కచ్చెరువడి నికటమ్మున కరుదెంచి ప్రీతిపూర్వక
ముగ నిట్లనిరి. 82

క. ఒక్కింత వినవు మోజల, ముక్కుచ ! యశ్వినుల మేము మోదమ్మున ని
న్నొక్కటి యడిగెద మిక్కడ, కెక్కతమున వచ్చి తేద కేగెదు చెపుమా. 83

గీ. పంకజాక్షిరొ నీకు నెవ్వాఁడు భర్త, యెవని కాత్మజ వకట రెంతవ సిరి యనఁ
గలుగు నీ మృదుపదము లిక్కర్కశంపు, నేలఁ బోరసిన మామది జాలి వొడమె.

## అశ్వినులును సుకన్యయు సంభాషించుట.

క. కమలాక్షీ ! విమానమునకు, నమరెడి నీ కిట్టి యటవియం దంఘ్రిచర
త్వము వొల్చునెట్లు ! దాసీ, సముదాయముతోడ నేల చనుదేరవాకో. 85

గీ. రాజపుత్రికవో ? యచ్చరవొ ? వచింపు, మేమహాభాగ నినుఁగన్న దిందువదన ?
నిన్నుఁ గైకొన్న భర్త వర్ణింపఁదగఁడె, యవని నీ కల్మి దేవలోకాధికంబు. 86

క. నిను నిత్యము గనుఁగొను నీ, వనమృగముల భాగ్యదశయుఁ బఖిలపుణ్యం
బును నెన్న శక్యమే ! పా, వనమయ్యెఁగా భూమి నీదు పాదరజమునఁగా. 87

క. స్తుతిగాదు నీకు నెవ్వఁడు, పతి ? జనకుండెవఁడు ? పద్మపత్రాక్షిరో ? యా
కృతకృత్యుల దర్శింపఁగ, మతివొడమెన్ జెప్పు వారిమనికి సదయతఁగా. 88

వ. అని సశ్వినులకు సుకన్య లజ్జాక్రాంతయై యిట్లనె. 89

గీ. ఏను శర్యాతికూఁతుర మానవీయుఁ, దైన చ్యవనమునీంద్రున కనుఁగుభార్య
సంధుఁడును ముదుసలి యగునట్టి భర్త, కెల్లపుడు సేవసేయుదు నిచటనుండి. 90

క. నను నా యనుమతిఁ గొని మ, జ్జనకుం డమ్మునికి నిచ్చె సద్వ్రతమునఁ దా
యనఘుని యాశ్రమ మల్లది, చనుఁడేఁ దగు మీరలెచటికొ సచ్చరిత్రుల్. 91

ఉ. నావుడు దస్రు లిట్లనిరి నాతిరొ! విన్నెటులిచ్చెఁ దండ్రి దు
ర్భావుఁడు గ్రుడ్డివా ముసలివానికి! భూషణరాజిరాజితం
బై వరవస్త్రభాజనమునై వెలయందగు మేను వల్కల
ప్రావృత మయ్యెనే విధికిఁ బాపముఁ బున్నెము లేదె యక్కటా. 92

ఉ. నీ సరివచ్చు లేమ సురవీరజనేత్రలయందు నేవి లే
దో సరసీరుహాక్షి యెటులో మెదు గ్రుడ్డికి భార్యవై? కటా!
నీ సొగసున్ వయస్థితియు నేర్పును నమ్ముగ నిట్టులుండ నే
లా? సమకాంతియుక్తుఁడగు నన్ను వరింపఁగరాదె యుగ్మలీ. 93

గీ. అంధు వరియించి జవ్వనం బపనయించి, జన్మమును నిష్ఫలంబుగ సల్పనేల?
వల్కలములేల, నీవేల, వనమిదేల!, కొనఁదగదె మా యిరువురం బొకానిని వలెను

గీ. అట్లు వరియించి నందనమందు చైత్ర, రథమునం దెల్లపుడు మనోరథము వెలయఁ
గ్రీడసల్పఁగ రాదె! యీ ప్రౌఢగాని, వృద్ధు నంధుని సేవించి యేమిఫలము. 95

క. నరపాలపుత్త్రికవు నీ, కరయంగా రావె తగు విహారంబులు, సం
సరణసుఖ మిట్టివానికి, బొరపినఁ జెడకున్నె యెట్టిపొలఁతికి నైనన్. 96

గీ. ఫలజలాహారణమ్ముల బడలి మృదుల, మైన నెమ్మేనివాసి యింతైనఁ గనక
విజనమగు నివ్వనమ్మున వృద్ధుఁ దాపి, పగుల మేలని తోఁచెనే యంబుజాక్షి. 97

క. అను నాసత్యులవచనము, లను విని యక్కన్య లోఁదలంకుచు ధైర్య
మ్మును జెంది దర్మ్యమగు రీ, తిని మెల్లన నిట్టులనియెఁ దేఁకువపేర్మిన్. 98

ఉ. మీరలు సూర్యపుత్త్రులరు మీకు సమస్త మెఱుంగవచ్చు ని
ష్కారణ మన్యకాంతనగు సాధ్విని నన్నిటులాడు టొప్పునె
య్యా! రవి కశ్యపాత్మభవుఁ డారయఁగా కథిలంబు సాక్షియై
ధీరులు మిమ్ము బోటులిటు తేఁకువఁదక్కుడురయ్య యెయ్యెడన్.

క. కులకన్యఁగాని నేఁ బుం, శ్చలిఁగా నధికప్రసంగసంగతికిం బో
వలపదు మాటాడిన మీ, మ్ముల శపియింపఁగల రాజపుత్రికఁ జుండీ. 100

వ. అని సక్రోధమ్ముగఁ బల్కి నా సుకన్య వచనమ్ములకు భీతిల్లి యాపెం బ్రసన్నఁ జేయవెంచి వినయమ్మున నిట్లనిరి. 101

క. శీలము గల బాలలలో, నే లీలావతియు నీకు నీ డగునే ? యో
లోలాక్షి ! వరమొసంగెద, మోలింగై కొమ్ము సౌఖ్యమొందుము దానన్. 102

ఉ. మమ్ముఁ గవీశ్వరుల్ మిగుల మన్ననసేయుదు రెల్లయందు నం
దమ్మున మేటులంచు విను తన్విరో ! నీ హృదయేశు నిట్టి రూ
పమ్మును బ్రాయమ్ముం గలుగువానిఁగఁ జేసెదమిందు నొక్కరున్
సమ్మతిమై వరించెదవె చాతురి మీఱఁగ వంచుఁ బల్కినన్.

వ. సుకన్య విస్మయంబంది యాశ్రమమ్మున కరిగి పతింగాంచి "మహాత్మా! యశ్వినులనుసూర్యపుత్రు లిరువురు తటాకంబుపొంతనున్న నన్నుంగాంచి కామాతురులై యిట్లనిరి. 104

క. జరయును నందత్వము న, త్వరముగ నెడఁబాపి యస్మదాకారముతో
సరియైన రూప మిప్పుర, తరళాక్షిరో పొసఁగఁజేసెదము నీ పతికిన్. 105

క. కోమలి యేకాకృతిఁదగు, మామూగురయందు నీదు మన మెవ్వరియం
దే మరగు వాతనిఁ బతిం, గా మోహింపు మని రిందుఁ గపటంబేమో. 106

వ. ఇయ్యది నీకు నెఱిఁగింప వచ్చితి భవదాజ్ఞ యెట్టుల లట్టు లొనరించెద" నావుడుఁ జ్యవనుండు సంతుష్టాంతరంగుండై యిట్లను. 107

క. దేవత లసత్యవాదులు, గా వలవదు వారియాజ్ఞఁ గావింపఁగ నెం
తే వేగ మేగి యిటకున్, రా వెఱ వొనరింపుమా సురభిషగ్వరులన్. 108

వ. అనవుడు పతివ్రత యశ్వినులకడ కరిగి మీ రొనర్చిన సమయమ్మునకు మత్పతి యంగీకరించె నయ్యెడ కేతెంచి యట్లొనర్పుఁడనిన నయ్యిరువురును దదాశ్రమమ్మునకు వచ్చి యాపె కిట్లనిరి ; నీ పతివయఃప్రాప్తికై యుదకమ్మున మునుఁగవలయు ననుడుఁ జ్యవనుండు సమ్మతించి యట్లొనర్ప వారిరువురును నతనితో నత్తటాకమ్మున మునిఁగిరి. 109

## చ్యవనునికి యౌవనప్రాప్తి

ఉ. మూగురు నేకరూపులు సముజ్జ్వలభూషణు లత్యుదారతే
జోగతులై సుకన్య కడఁ జోద్యము నందఁగ నిరు వాని తా
రా గజయాన కిట్టులని రంబుజలోచన! యెవ్వఁ డిందు నీ
రాగము గ్గువాఁడు మగఁడన్ గని యేరికొనంగఁ జెల్లదే. 110

క. ఏకాకారుల నేక, శ్రీకుల నేకస్వరానుకృతులఁగా మగఁడన్
రాకొమిరె గాంచి యెంతే, నాకులపాటొదవ భర్తకై చింతించఁగా. 111

ఉ. చక్కఁదనమ్మునన్ వయసుచందమునన్ మగు లొక్కరూప యుం
డక్కట! భర్త యెవ్వఁడని యారయనౌ, మరణంబుఁ దక్క వే
ఱొక్కయుపాయ మియ్యెడల నున్నదె? దస్రులరాకకల్మి నీ
చిక్కు తటస్థమయ్యె నెడసేయఁగ వచ్చునె యింద్రజాలమున్.

క. పతివిడిచి యన్యునిన్ స, న్మతి వరియించితి నయేని మహి నరకము దు
ర్గతి పరలోకమునందగు, బతిరత లెల్లరును నవ్వఁ బాలగుదుఁ గదా. 113

వ. అని బహుప్రకారమ్ములఁ జింతించి యందు జగదంబ దక్క శరణంబు లేదని
నిశ్చయించి మనమ్మున నప్పరశక్తి న్నిల్పి యిట్లు ధ్యానించె. 114

గీ. సరసిజోద్భవి! శంకరసాధ్వి! విష్ణు
సతి! సరస్వతి! యాగమజనని! త్రికృతి
కారిణి! త్రిమూర్తిజనని! వికారశూన్య!,
ప్రకృతి! పురుషస్వరూప! నిన్ బ్రస్తుతింతు. 115

ఉ. ఎల్లర భుక్తిముక్తు లిడి యేలెద నీ వఖిలేశ జ్ఞానులన్
జల్లఁగఁ బ్రోతు జ్ఞానమిడి సౌఖ్య మొసంగెదు సిద్ధి నిత్తువో
హల్లకపాణి! కీర్తి, జయ మన్నియు నీ విడునట్టి వజ్ఞ లా
పల్లవమైనఁ బాయుటకుఁ బాల్పడ రంబరో? ని న్నెఱుంగమిన్. 116

ఆ. వె. ముగురు నొక్కరీతి మొనసి రిం దెవ్వఁడు, చ్యవనుఁ డతనిఁ దెలిపి సకలజనని
మత్పతివ్రతాత్వమహిమంబు నిల్పి కా, పాడుమమ్మ నిన్నుఁ బ్రస్తుతింతు. 117

వ. ఇట్లు తన్ను మాటికిని సన్నుతించుచు మ్రొక్కులిడెడి యా పరమపతివ్రత నను
గ్రహించి పరాంబ తన్మనోంబుజమ్మునందు నెలకొని దివ్యజ్ఞానంబు నొసంగె;
నంత రాజపుత్రియు, 118

గీ. నవవయోరూపముల నొక్కసరణి నొప్పు, మగుర వీక్షించి తనపతి నొగి నెఱింగి
కైకొనియె నశ్వినులు మోదకలితులైరి, రాచకన్నియ శీలమర్యాద కెలమి. 119

వ. భగవతీప్రసాదమ్మునఁ దనకాంత తన్ను వరించినందులకుఁ జ్యవనుండు సంతుష్టాంతరంగుండై కన్నులారఁ దన నెచ్చెలిం జూచుచు గమనోన్ముఖులగు నశ్వినులకుఁ బ్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 120

మ. నయనశ్రీ చెడి వార్ధకంబు గొని విన్నాణంబు లేకుంట చేఁ
బ్రియురాలిం గరఁగింప నేరక వనిన్ బెంపేది యున్నట్టి నా
దయ కల్గ్రన్ గని కన్నులన్ వయసు సౌందర్యంబు చేకూర్చి పె
ద్దయు సంసారసుఖార్హుఁ జేసితిరి మిత్రత్వంబు దైవారఁగన్.

క. ఉపకారులైన మిత్రుల, కుపకారము సేయకుండు నొగి నెవ్వఁడు వాఁ
డపకీర్తికిఁ దావకుఁడగు ను, ణపరీతుఁడు వాని జీవనము విఫలమగున్. 122

వ. కావున మీకుఁ బ్రత్యుపకారం బేమియొనర్తు భవద్వాంఛితంబు వెలువరింపుఁడు నావుడు మునివరునకు నాసత్యు లో మహాత్మా మాకు నస్మత్పితృప్రసాదమ్మున నఖిలమ్మును గలయదియు మా మనోరథమ్ము పూరింప నిచ్చయేని యొక్కండు గలదు వినుము. 123

గీ. అమరు లెల్లరు సోమపానావసరము, నందు బహివెట్టి రనఘ మమ్మద్వయముల
భిషజులను నొక్క మిషమునఁ బ్రీతిఁగగ్గి, నేని మాకది సాధింపు మిద్ధశక్తి. 124

వ. కనకాచలమ్మునఁ జతురాననుఁ గుఱించి శక్రుండు జన్నంబొనర్చిన తఱి మా కీయవమానంబు ఘటించె నియ్యది యొదవ నీవ సమర్థుండ వను నాశ్వినేయులకుఁ జ్యవనుండు ప్రీతుండై యిట్లను. 125

క. మీకతన వయసుఁ గన్నులు, నాకారము గలిగె నాకు ననఘులు మీకున్
బాకారిన్ వారించి వి, రాకులగతి సోమపాన మది నేనిత్తున్. 126

వ. ఇయ్యది మహామహుండగు శర్యాతి నృపాలు మఖమ్మున నవశ్యమ్మును నగు ననుడు వారలు సంతుష్టాంతరంగులై స్వర్గమ్మునకు నరిగిరి. చ్యవనుండును మనోహారిణి యగు సుకన్యం గూడి యాశ్రమమ్మునకుఁ జనియె; ననుడు జనమేజయుండు, మహాత్మా! దేవబలమ్మునకును మనుష్యశక్తికిని దారతమ్య ముండెడిఁ గదా చ్యవనుండు దేవాధిపునెట్లు వారించి యాశ్వినేయులకు సోమం బిప్పించె ననుడు వ్యాసుం డిట్లను. నట్లు మునివరుండు సుకన్యాసహితుండై స్వాశ్రమమ్మున

సకలసంసారసుఖమ్ము లనుభవించుచున్నంత నొక్కనాఁ డక్కన్నియతల్లి చింతా
తురయై తనపతి కిట్లను. 127

క. ముని బంధునకు నొసంగితి, వనవద్యాంగి యగుసూఁతు నక్కట ముది య
వ్వనమున మృతిఁజెందెనొ? జీ, వనమున నున్నదియొ చూడవలదె యొకింతన్.

గీ. కందమూలఫలమ్ములఁ గాలమెల్లఁ, గడపు మునివేషధారిచేఁ గన్నకూఁతుఁ
బ్రాణ మవశేషముగనుండు పరమసాధ్వి, నొక్కపరి చూడకున్న నే నోర్వ నెట్లు?

వ. నావుడు శర్యాతియు సంశ్రితవ్రతుండగు నమ్మానినీవల్లభుఁగొలిచి సుఖంబున్న
కొమిరెం గని మన మిరువుర మయ్యెడ కేగుటయు కర్జంబని తత్సహితుండై రథం
బెక్కి చ్యవనాశ్రమమ్మునకుఁ జనువాఁడు మందట, 130

క. కనుఁగొనియె రూపమున జ, వ్వనమున నవ్వనము శోభ వడయఁగ నొనరిం
చు నితాంతకోమలాంగుని, ననఘునిఁ జ్యవనమునిఁ దనకు నల్లునిఁ గూఁతున్. 131

క. కనుఁగొని విస్మితుఁడై "యే, మనఁదగు? మౌనివరుఁ జంపి యఘ మొదిఁగట్టన్
బనుపడితి నకట! యెంతటి, పనిచేసె మదీయపుత్త్రి పాపాత్మకయై! 132

గీ. మదనవేదన సైఁపక మమత పెచ్చు, పెరిఁగి పుత్త్రి యంధుని వృద్ధు పతినిఁ
జంపి యన్యుని వరియించె, శక్యమగునె, జవ్వనంపు మదం బెట్టి సాధ్వికైన! 133

క. మనుకులమున నేఁటికి మ, త్తనయకతనఁ గందు గలిగెఁ దద్దయు నింద్యం
బనఁదగదె పుత్త్రికం గను, జను జన్మము; కొమిరె బల్ దొసంగగు గృహికిన్.

గీ. ఎన్నియో పాపములు చేసెనేని వాని, కుదయమందుఁ గుమారిక; యొల్ల నవఁగ
నేల? వృద్ధున కంధున కెఱిఁగి యెఱిఁగి, కన్నె నిచ్చితి నాత్మసుఖంబు గోరి. 135

క. ఏవానిపుత్త్రి కుత్సిత, యై వెలిఁబడు వానిజన్మ మధమాధమ మెం
తే వెదకి కొమిరె నిడఁదగుఁ, గోవిదునకు ధనికి రూపగుణసహితునకున్. 136

గీ. ఎఱిఁగి చేసినఫల మిప్డ యెదురుకొనియె, మనుకులంబను శశికిఁ గందనువుపడియెఁ
గులమునకు హాని దెచ్చితి, నొలవ కేగి, తెంపరినిఁ గూఁతు దుర్మతిఁ ద్రుంపవలదె."

వ. అని మఱియును, 138

గీ. "పాతకమ్ముల కెల్లను బాతకంబు, స్త్రీవధము దానికన్నఁ బుత్త్రిక వధించు
టెక్కుడగు నింత కెక్కుడై పొక్కుఁగాదె, లోకనింద యనీ! యెంతశోక మొదవె.

గీ. స్నేహశృంఖల తెగఁద్రెంప సాహసంబు
పడయఁగానేర, లోకాపవాద కెట్లు

లోర్చి తలమెత్తికొందు ? నెట్లోర్వు దొడరు"
ననుచుఁ జింతించె మిగుల శర్యాతినృపుఁడు. 140

వ. అట్టియెడ సుకన్య దౌదష్యుల జనకుంగాంచి యెదురు చని చింతాదంతురితాంతరంగుండగు నమ్మానవపతి చిత్తం బెఱింగి యతని కిట్లను. 141

క. శతపత్రనేత్రు రూపసి, నతులితమగు జవ్వనమ్ము నందియొలయు మ
త్పతిఁగాంచి చింత నొందక, పతి శంకజా విడిచి వే సమస్కృతులిడుమా. 142

వ. పైశంబ రా దమ్ము నందియుం బేల యను పుత్రివచనమ్ములకు సక్రోధుండై శర్యాతి యిట్లను. 143

క. జరఠుం డంధుఁడుఁ దాపసి, యరయఁగ నీభర్త, యీతఁ డతియౌవనము
ర్వరుఁడు మదోన్మత్తుఁడు నుం, దరుఁ దేగతి నమ్మవచ్చు ధవుఁడని నీకుజా. 144

క. మరుబారిఁ జిక్కి యమ్మని, వరు నెట్లేవియును జంపి పాపినివై నుం
దవు నొక్కని నాథునిఁగా, వరియింపవుగా కుమారి ? వంగడ మడఁగజా. 145

క. అని నీకై శోకమ్మున, మునిఁగెద నెటఁబోయె నకట ! మునివరుఁ డీమా
తవపురుషుండిట కేమి క, తన వచ్చెన్ దెల్పుమనుఁడుఁ దగునగవొలయజా. 146

వ. సుకన్య జనకునికరంబు పట్టికొని సత్వరమ్మునఁ దనపతియున్నెడకుఁ గొనిపోయి చూపి యిట్లను. 147

క. అయ్యా ! నీ యల్లుం డితఁ, డియ్యెడ నందియము వలన డింపకయును బల్
నెయ్యమ్మున నశ్వను లిటు, చయ్యనఁ గమలాయతాక్షు సలిపిరి నుమ్మీ. 148

క. నీతిదురంధరుఁడగు శ, ర్యాతికి నీ కాత్మజాతనై యే నకటా
పాతకమున కొడిగట్టుదు. నే ? తడయక మ్రొక్కు మతని కెంతయు భక్తిన్. 149

వ. వదంపడి నీ వడిగెదేని నీ కామూలాగ్రమ్ముగ నమ్మునివరుండె వచియించువాఁడనుడు శర్యాతిత్వరితుండై యమ్మహాభాగునకునమస్కరించి, మహాత్మా! నీకెట్లు నయనమ్ములు గలిగె ? దివ్యసుందరంబగు నీ విగ్రహంబు సంప్రాప్తం బగుటెట్లు ? వృద్ధత్వం బెటకరిగె ! యున్నది యున్నట్లు వచింపుము నావుడు మామ కల్లుం డిట్లనియె. 150

గీ. దైవవశమున నొక్కెడ దస్రులిటకు, వచ్చి కరుణించి యీ రూపమిచ్చి రెలమి
నుపకృతి నొనర్చు నవ్వారి కొక్కవరము, ప్రత్యుపకృతి కొసంగితిఁ బార్థివేంద్ర,

క. "మారాజగు శర్యాతిమ, హారా జొనరించు మేటి యజ్ఞమ్మున మి
మ్మారాజువంక్తి నిడి పెం, పారన్ సోమరస మొసఁగు నట్లొనరింతున్." 152

వ. విస్మృత మద్దత్తంబగు వరంబుగ్గైకొని వారు స్వస్థానంబున కరిగి రంతసత్యంబు లవ లేశంబును లేదు విశ్వసించి నిర్మలాంతఃకరణుండవై యీ పీఠమ్మువఁ గూర్చుం డుము నావుడు రాజు సంతుష్టుండై యట్లొనర్చె. ఇట్లు భార్యయుం దాను సముద్రని నికటమ్మునఁ బుణ్యకథాశ్రవణమ్ముల నుండునెడ శర్యాతికిఁ జ్యవనుండిట్లనియె. 153

శర్యాతి యజ్ఞం బొనర్చుట.

చ. నరవర ! జన్నమొక్కటి యొనర్పుము సన్గొని యమ్మఖమ్మునన్
సురపతి ధిక్కరించి వెస సోమరసంబు నొసంగువాఁడ నా
వర మనివార్యమై తగ నవారణ దస్రులకుం, సురల్ మునుల్
ధరణిసురుల్ నరేంద్రులు ముదమ్మున నాదగుశక్తి మెచ్చఁగన్. 154

వ. నావుడు శర్యాతి యంగీకరించి తనపురమ్మున కరిగి శుభదినమ్మున మఖయత్నం బొనర్చి వసిష్ఠాదిమునులం బిలిచి చ్యవనపురస్సరమ్ముగాఁ గ్రతు వొనర్చుచుండె; నయ్యెడ నింద్రపురోగములై సుర లమ్మఖమ్మునకు వచ్చుటయు నశ్వినులు వారి వెంబడిన వెడలి యట కరుదెంచి యొక్కెడ నుండినవారింగాంచి శక్రుండు సురలంగూర్చి. 155

క. అకలంకము క్రతు విధి యే, మికతమ్మున భిషజు లిచట మెలగుట ? సోమం
బకటా, వీరికినర్హం, బొకో ? పిల్చినవార లెవ్వరో ? తెంపరులై. 156

వ. నావుడు నమరులు నిరుత్తరులైరి. పదంపడి సోమపానావసరమ్మునఁ జ్యవనుం డశ్వి నులభాగంబు తనకరమ్ముల నిడికొనుడు నింద్రుండతని వారించి వీరలు చికిత్సకు లగుట సోమపానానర్హులు వీరల కీగ్రహం బీవలవదు నావుఁడు జ్యవనుం డెదు ర్కొని శక్రునకిట్లను. 157

గీ. సంకరులుగా రహర్పతిసతికిఁ బుట్టి, నట్టి కొమరులు వీర లేయఘముచేసి
రనఘ యెట్లగ్రహార్హతనంది రీవు, ఖమునఁ దెలియంగవలయు నిక్కమ్ము మాకు.

క. ఈమహిపతి నాప్రేరణ, చే మఖ మొనరించె నిందు సిద్ధంబుగ నే
నీ మహితుల కిప్పించెద, సోమరసము నీవు నెల్ల సురలును జూడన్. 159

క. ఈ రవిపుత్రులు మిగుల మ, దారులు ముదిమి నెడపినమఁ దరుణవయస్కున్
గా రచియించిరి ప్రత్యుప, కారము నొనరించి ఋణము గడతేర్పవలెన్. 160

వ. నావుడు శక్రుండో మునీంద్రా ! వీరలు దేవతలచేఁ జికిత్సకులగు కతన సోమపానా

వర్షులని నిందింపఁబడిరని నొడివితిఁగాదే యింతేల? గ్రహంబు వీరికి సంతరింపకు మనుడు నక్రోధుండై చ్యవనుం డిట్లను. 161

క. ఏఁ జెప్పనేర్తు వీరిం, భోజాస్త్రని సుతుల సోమమున కర్షులహ
ల్యాజార! వృతహర! ని, ర్బీజం బికోఁ్కవమింక విడువందగదే. 162

వ. అని యింద్రునకు సాకూతంబుగ నుత్తరంబొసఁగి యాశ్వినేయుల భాగంబు తపోబలమ్మునఁ గైకొను నమ్మని నొక్కండును వారింపకుండెఁ, బదంబడి యింద్రుం డతికుపితుండై చ్యవనుంగాంచి పరుషమ్ముగ నిట్లను. 163

గీ. ఎన్నఁడును లేని మర్యాద నేర్పరించు, పాటివాడవె? యోరోరి, బ్రహ్మబంధు!
విశ్వరూపుని బలె నిన్ను వేగ చంపి, శత్రుహీనుండనగుదు విష్కంటకముగ. 164

వ. నావుడుఁ జ్యవనుండిట్లను. 165

గీ. తేజమున రూపమున ధనాదికమున నిరు, పుర వఖండులు వీకనాదరము వలవ
దెంతవారలుగాకున్న వృద్ధు సంధు, నమరతుల్యునిఁ జేయ నేర్పమరు లెట్లు! 166

వ. మహామభావులగు వీరలు తక్కుఁగల దేవతలకు లొచ్చుగారని విశ్వయించికొను మిట్టి పూజ్యుల నెడచేసి నీవును నమరులను నెట్లు సోమంబు గ్రహించెదరు నావుడుఁ గోపోద్రేకమ్మున నింద్రుండతని కిట్లను. 167

క. ఎన్నివిధమ్ముల వీరలు, జన్నమున కనర్హు లీవు సాహస మమరన్
బన్నితివయేని భాగము, గ్రన్నన నీశిరము ద్రెళ్ళఁగా ఖండింతున్. 168

వ. అను నింద్రువచనమ్ములకుఁ దలరక చ్యవనుండు సోమపాత్రంబాశ్వినేయుల కొసఁగిన వారలును బానాసక్తులగుట వైళమ గ్రహించి రంత వాసవుండు వెండియు నిట్లను. 169

క. ఈవలవదు స్వార్థమ్మున, కై వీరికి సోమపాత్ర మల్లేనియు నీ
పై వైచెద వజ్రమ్మును, జా వొదవెడు విశ్వరూపు చాడ్పున నీకున్. 170

క. నావుడుఁ గోపాకులుఁడై, దేవేంద్రుని లెక్కగొనక తివిరి చ్యవనుఁ డ
శ్వావనులకు సోమమిడి య, థావిధి గ్రహియింపఁజేసె ధార్ష్ట్యముకలిమిన్. 171

క. కడుఁగవలి యింద్రుఁ డమ్మని, గడతేర్పఁగ నెంచి సురలు గనుఁగొనుచుండన్
విడిచె శతకోటిసూర్యుల, నెడపెడి శతకోటి నృపతి కెద దిగులొదవన్. 172

క. తనపైకి నుఱుకు వజ్ర, మ్మును జ్యవనుఁడు తపముచేవ మొగిపించి జగ
మ్మున కాశ్చర్య మొదవ స్తం, భనచేసెఁజా మునులకెంత వాసవుఁడనఁగన్. 173

వ. అట్లు వజ్రమ్ము నాఁగి కృత్యచే నింద్రు సదంపనెంచి యగ్నియందు సమంత్రకమ్ముగ
హోమం బొనరించుటయు. 174

ఉ. క్రూరుఁడు దారుణోగ్రపమునకున్ సరివచ్చెడి మేనివాఁడు బల్
దారుణదంష్ట్రి లొప్పెడి యుదగ్రభుజాబలశాలి ఘోరుఁడున్
పేరుఁడు రక్కసుం డొకఁడు వెల్వడియెన్ మదనామకుండు ని
ర్ధారణ సేయ రా దతని దర్పము చిత్వ్రజేనికేపియున్. 175

సీ. నాలుగుదంష్ట్రి లున్నతములై నూఱేసి, యోజనమ్ముల నిడుపొలయువెలయుఁ
దక్కిన దంతముల్ దశయోజనమ్ములు, ప్రత్యంతపర్వతాభములు బాహు
లాకసం బంటు భయానకంబగు జిహ్వ, కంఠంబు గోత్రశృంగంబుఁబోలు
గాటుకకన్నను గడునల్ప దేహంబు, వక్త్రంబు భయదంబు వానికమల

గీ. దావదవతుల్యముల్ కేశతతులు మిగుల, నక్షజములొక్క హనువు భూష్యంతరమువఁ
దక్కినది యంబరమ్మునఁ దనరునిట్టి, మహితరీతిఁ జెలంగు మద్రముఁడు మదుఁడు.

క. వదనమున వజ్రమిడికొని, కదనమ్మున కభిముఖమ్ముగాఁ దగు నా ము
ర్మదుని మదునిఁగని సురలుఁజా, దదధిపతియు భీతభీతదశ నున్నయెడన్. 177

ఉ. ఘోరత దృష్టులం గొలిపి కుంభిని యంబర మొందు గాఁగ గం
భీరరవం బొనర్చి మెయి పెంచి జగత్త్రియ మొక్కపెట్ట నా
హారము చేయురీతిఁ గననై సురనాథునిఁ జేరి కేగె నా
హారవ మాచరించి సుర లంచలు చిందఱవందలై తగన్. 178

వ. అట్టియెడ స్తంభితబాహుండగు నింద్రుండు కాలసన్నిభు నప్పాపిం గాంచి భయ
మ్మున బృహస్పతిం దలఁచికొన నతండు స్మరణమాత్రమ్మున నరుదెంచి యతని
కిట్లనియె. 179

గీ. చ్యవనుని తపోబలమ్ము దుస్సాధ మతని
కతన నుదయించె నీతఁ డఖండబలుఁడు
మదుఁ డనెడి రక్కసుఁడు వీఁ డమరులకుబలె
వాతమ నజేయుఁ డెట్టి మంత్రములకేని. 180

గీ. శక్తిభక్తుల కోపమ్ము సంహరింపఁ,
దరమె యెవ్వారికేనిఁ? దత్తఱముమాని

శరణు గొనుమయ్య చ్యవనుని ; సంహరింప
నేర్చునాతండు దనకృత్య నెమ్మిగ్రమ్మి. 181

వ. అను గురువచనమ్ముల వినమ్రుండై శక్రుం డత్తపోధనునికి నమస్కరించుచు
భయమ్ము పెంపున నిట్లను. 182

క. క్షమియింపుమయ్య నీవా, కృపను దప్పనె యశ్వినులకు నయ్యెడి నిఁక నో
పను నీదు తపముశక్తిని, హిమ మూడఁగ నాయొనర్చు టిది నిక్కముగన్.

చ. అనవుడు నమ్మహాముని "భయంపడనేల" యటంచుఁ బేర్మి న
య్యనిమిషనాథుఁ బల్కి మృగయామధుపానదురోదరాంగనా
జనములయందు నమ్మదుని సంతతసుస్థిరుఁగా నొనర్చి య
శ్వినులకు నింద్రునమ్మతినిఁ జేసి యొసంగె గ్రహం బవార్యతన్. 184

వ. తపోబలసంపన్నుండగు చ్యవనుం డివ్విధమ్మున నశ్వినులఁ గృతకృత్యుల నొనర్చె
నంత శర్యాతి సమాప్తవ్రతుండై మంత్రులం గలసి యతని మహత్త్వమ్మున కద్భుత
మందుచు నగరమ్మున కరిగి రాజ్యమ్మొనర్చుచుండె. 185

గీ. అతని కానర్తుఁ డుదయించె వనఘమూర్తి
తత్పుతుఁడు రేవతుఁడు సముద్రమ్మునందుఁ
దగ వినిర్మించెఁ బురి కుశస్థలి యనంగ
నతని కొక నూఱుగురు పుత్రు లవనినాథ. 186

వ. అందుఁ గకుద్మి జ్యేష్ఠుండు మఱియు నారేవతునకు రేవతియను నొక్క కొమ
రితయుం బుట్టెఁ బుట్టి, 187

## రేవతుఁడు బ్రహ్మలోకమ్మున కరుగుట.

క. అనుపమలక్షణలక్షిత, సునిశిత యౌవనవిశేషశోభాస్పదమై
తనరఁగ నక్కూఁతుం గని, జనపాలుఁడు పెండ్లిసేయ సమకట్టె వెసన్. 188

వ. అతండు స్వపరిపాల్యంబులగు నానర్తదేశంబుల నెల్లెడల నన్వేషించి తగిన వరునిఁ
గానక పదంపడి యొక్కనాఁడు బ్రహ్మనడుగువాఁడై తనపుత్రిక వెంటఁబెట్టుకొని
సత్యలోకమ్మున కరిగె. నావుడు జనమేజయుండు మహాత్మా! బ్రహ్మవేత్తయగు
బ్రాహ్మణునకుఁ గమ్యంబగు సత్యలోకంబు రాజునకెట్లు పోనయ్యె. ఇది యిట్లుండ
మృతులకు స్వర్గం బలవడునని శాస్త్రనిర్ణయంబుకదా! మరల స్వర్గస్థులకుఁ జ్యోతి

గల్గెనేవి మర్త్యమ్మునం గతి యగుట కేమి నిమిత్తము ? నావుడు వ్యాసుండు, నరేంద్రా ! యింద్రలోకమ్మును వహ్నిలోకమ్మును సంయమనీపురమ్మును వరుణలోకమ్మును గైలాసమ్మును వైకుంఠమ్మును నను నీ లోకములన్నియును మేరువునం దెసంగెడి. 189

ఉ. నాకము మానవుల్ చనుట యబ్బురమే ! విజయుండు మానవుం
డేకద ! శక్రుసన్నిధికి నేగఁడె ? యింతకుఁబూర్వ మెందఱో
రాకలు వోకలుంగలుగు రాజులు దైత్యులలేరె ! వారిలో
నీ కెఱిగింతు నొక్కరు ననింద్యచరిత్రు నృపాల శేఖరా. 190

వ. మున్ను మహాభిషుండనురాజు బ్రహ్మలోకమ్మున కరిగి యచ్చట శ్రీరూపధారిణియై యుఁగించిన్న గన్నయునగు గంగం గాంచి కామార్తుండై స్మితం బొనర్ప నాపెయు నట్టిద యయ్యె. వారి నిరువుర బ్రహ్మ మర్త్యమ్మునఁ బుట్టుటకు శపించె నిదియిట్లుండ,

క. దానవుల బాధకోర్వక, శ్రీనాథునితోడ నెఱుఁగఁజేయ సురలు వోఁ
గా నేరరె వైకుంఠము !, దీనికి సందియమువలదు ధీనవతంసా. 192

క. అనిమిషలోకం బాదిగఁ, జననగు లోకమ్ములెల్ల జనులకు బుణ్యం
బునఁబొల్పు తాపసులకున్, ఘనులగు మఖకర్తలకు నగణ్యస్ఫూర్తిణా. 193

క. అనవుడు జనమేజయుఁడీ, ట్లను రేవతుఁడిట్లు నరసిజాసనుకడకుణా
దన తనయం గొని చనమీఁ, ద నైన వృత్తాంతమేమి తత్త్వజ్ఞనిధీ. 194

చ. అని యడుగణా నృపాలునకు వ్యాసమునీంద్రుఁడు పల్కె, నీరజా
సనుఁ గన రేవతుండు తనుజాసహితంబుగ నేగి యంత వా
తనిసభ గానమెంతయు ముదమ్మున నొప్పుచునుండఁ గొంత ద
న్కము విని సంతసించి తదనంతర మంజలిమోడ్చి యిట్లనుణా, 195

ఉ. దేవ ! నమస్కృతింగొని మదీయము విన్నపమాలకింపు మీ
పావనశీల నాకొమిరె బహ్వనీకుల నేతదర్థమై
భూవలయమ్మునణా వెదకి పొందఁగ నేర నదృష్టి ; మీఁద నిం
కేవరుఁడీ వధూమణికి నీడగువాఁడు వచింప వేఁడెదణా. 196

క. బలవంతునిఁ గులవంతుని, సలలితశీలుని మనోజ్ఞుఁ జాతుర్యమునన్
వెలసెడి వాని వచింపుము, పొలవక యొక్కరుని రాజసూనుఁ గుమారున్. 197

వ. అనవుడుఁ జతురాననుండు, రాజా ! నీ వెందఱు రాకొమరుల వరసియుంటి నింతకు

వారలందఱును గాలగ్రస్తులై మృతినొంది రియ్యది సప్తవింశతమంబగు ద్వాపరంబు భవద్వంశజాలము నట్లు విహతు లగుట నీపురంబును దైత్యలుంఠితంబయ్యెనని వెండియు, 198

క. శీతకరవంశతిలకుఁడు, నీతిఖ్యాతుఁడు యయాతినృపకులజుం డు
ద్గీతయశుఁ డుగ్రసేనుఁడు, భూతలపతి మధుర యనెడిపురి నేలెనొగిన్. 199

గీ. అతనికొమరుండు కంసుఁ డత్యధికబలుఁడు, తండ్రిఁ గారాగృహమ్మునఁ దగులఁజేసి
యెల్లలోకమ్ములకు నార్తి యెసఁగ రాజ్య, మేలె దైత్యాంశభవుఁ డెంతయేని జడుఁడు.

క. ధరణియు భారంబోర్వక, సురపతి నను వేఁడ వేల్పుతండంబులకుం
బరికొల్పిన నాయాజ్ఞ న, మరు లంశంబులను బుట్టి మహి వెలసిరొగిన్. 201

ఉ. ఆయతపుణ్యుఁడై బదరికాశ్రమమం దమరాపగాకన
త్తోయపవిత్రకాయుఁడయి తొల్లి దపశ్చరణం బెలంగె నా
రాయణమౌని ధర్మసుతుఁ, డమ్మహనీయుఁడ దేవకీసుతుం
డై యలరారె యాదవులయందుఁ గృతార్థుఁడు కృష్ణమూర్తి నా. 202

క. ఆకృష్ణమూర్తి దుష్టుని, నీకంసునిఁ జంపి రాజ్య మిచ్చెన్ గరుణా
వ్యాకులత నుగ్రసేనున, కాకంసునిమామ యధికుఁ డఖిలవిభవములన్. 203

వ. జరాసంధుండను వాఁ డల్లునిమరణమ్మునకుఁ గోపించి మధుర నరికట్టి సంగరం బొనర్చి కృష్ణునిచేఁ బరాజితుండై యరిగి కాలయవనుం బుత్తెంచిన మహాబలుండగు వానిరాక నెఱింగి శ్రీకృష్ణుండు యాదవుల నంపఁ ద్వారక కనిపి తానును బిఱుం దనవలె యిప్పటికి నచ్చట వసించుచున్నవాఁడు. 204

చ. అరిపదహారి శేషఫణియంశమునన్ జనియించినట్టి యు
ద్ధురుఁడు హలాయుధుం డతనితో నెవఁడీడు ? మహానుభావుఁ డా
హరికిని నగ్రజుండు విను మాత్మజ నాబలభద్రమూర్తి కా
దరమున నిచ్చి పెండిలి ముదమ్మునఁ జేయుము కీర్తిశాలివై. 205

వ. అట్లొనర్చి నీవు తపఃకాంక్షివై సురారామంబగు బదరికాశ్రమమ్మున కరుగుము, నావుడు రాజర్షి తనయం దోడ్కొని ద్వారక కరిగి బలరామున కక్కన్నియ నిచ్చి వివాహం బొనరించి పిదపఁ దపమ్మున కరిగి కొండొకకాలమ్మునకు నయ్యమరాపగా తటమ్మున, గాయమ్ము విడిచి దివం బలంకరించె నావుడుఁ బారీక్షితుం డిట్లను.

ఉ. ఎంతయు నక్కజంబు వచియించెద వోషుసినావ ; యాధరా
కాంతుఁడు మాటయెన్మిది యుగమ్ములు సత్యమునందుఁబుచ్చెఁ దా
నంతకు నత్తలోదరికి నబ్బదె వార్ధక ; మింతకాల ము
య్యెంతికి నాన్నపాలునకు నేగతి నాయువుగల్గెఁ బల్కుమీ. 207

వ. అనిన వ్యాసుం డిట్లను. 208

క. జర లేదు క్షుత్పిపాసలు, మరణము గ్లానియును భయ మసుసకుండెడి నా
సరసీజాసనపదను, స్థిరులగు పుణ్యులకు నృపతిశేఖర యెప్పుడున్ ; 209

వ. అని వెండియు, 210

గీ. మేరుగతుండైన శర్యాతిధారుణీశు, సంతతినిఁబట్టి దానవుల్ సమయఁజేసి
రధిప ; కొందఱు భయభీతు లగుచు పరిగి, యిచ్చటచ్చటి కెంతయు నేగ లగుచు.

గీ మనువునకుఁబుట్టె నిక్ష్వాకు వనెడినృపుఁడు
తుమ్మకారణమున ; నా సుతునికతమున
సూర్యవంశంబు వర్ధిల్లె నార్యుఁ డతఁడు
నారదోపదేశమున వనమున కరిగి. 212

వ. అనవరత దీక్షాపరుండై వంశవృద్ధికై దేవి నారాధించి తత్ప్రసాదమ్మున నూర్వురఁ బుత్రులంగనియె. నందు వికుక్షి జ్యేష్ఠుండిట్లు ప్రాప్తసంతానుండై యమ్మహీపాలుం డయోధ్య రాజధానిగ రాజ్యంబేలుచు శకునిప్రభృతులగు నేఁబదుండ్రఁ గొమరుల నుత్తరాపథమునకు నలువది యెనమండ్ర దక్షిణదేశమ్మునకును ప్రభువులంజేసి యిరువుర నాత్మసేవనార్థంబు సన్నిధి నుంచికొనియె. 213

## శశాదచరిత్ర.

గీ. సకలజనులకు సుఖము లెసంగ రాజ్య
పాలనంబొనరించు నప్పార్థివుండు
వనమునకుఁ బంపెఁ "బలము దె" మ్మని వికుక్షి
నష్టకాశ్రాద్ధమునకుఁ దా నంతఁ బిదప. 214

క. జనకుని యాజ్ఞంగొని వన, మునకుజని శశములను సమున్నతరీతిన్
దనుపదు సూకరములఁ హరి, ణనికాయములఁ బడనేసి నరవరుడంతన్. 215

వ. పరిశ్రాంతుండై యాఁకొని యష్టకావృత్తాంతమ్ము నేమఱి యందొక్క శశమును భక్షించి నగరమ్మున కరిగి తక్కిన మాంసంబు తండ్రికి నొప్పజెప్పెఁ, బిదపఁ

బ్రోక్షజార్థంబు తనకడ మంచినదానింగాంచి కులగురుండు వసిష్ఠుండు గోపించి యిట్లను. 216

క. ఇది భుక్తశేష మేగతి, విదితంబుగ శ్రాద్ధమున నివేదింపగ నొ
ప్పిదమగు నొక శశమున్ దీ, నం దినె వ్నికొమరుండనుడు నరపతి యలుకన్.

వ. వికుక్షిం గని విధిలోప మ్మొనర్చిన వీవిట నుండందగవు పొమ్మనుడు నతం డపి మొదలు శశాదుండను నామమ్మున నరణ్యమ్ములం గ్రుమ్మరుచుండె. 218

క. పదపడి యిక్ష్వాకుండు న, ద్విదితయశుండు చనియె దేవవిభు నిలయం బం
తం దన జనకురాజ్యము న, మ్మద మలర శశాదనృపతిమణికైకొనియెన్. 219

వ. అతండు ధర్మంబు దప్పక యయోధ్యానగరంబు పాలించుచుం గొండొకకాలమ్మునకుం గకుత్థ్సుం గనియె నితని కింద్రవాహుండనియుం బురంజయుం డనియును నామమ్ములుగలవు. నావుడు జనమేజయుండు నామభేదం బెట్లుగలిగెననుడు వ్యాసుం డిట్లనియె. 220

గీ. ఆ శశాదుని తనుజాతుం డవనిభర్త, యగుచుం బాలించునెడ సుర లసురవిజితు
లగుచు వైకుంఠమునకేగి యబ్జనాభు, శరణుం జెందిననాతండు సదయుండగుచు.

చ. కలడు పరాంబికాచరణకంజనిరంతరభక్తి సంపదా
కలితవిశేషశక్తియు నఖండయశుండు శశాదపుత్రుం డా
వలలిత వేడంగాం జనుండు సత్వరులై ధర ; కమ్మహామహుం
దెలిమిని మీకుం దోడయి జయింపంగలాం డమరారిసంఘమున్. 222

వ. అను నద్దేవు నానతింగొని యమరులు వైళంబుగ నయోధ్యకుం జనిన శశాదతనుజుండు వారల వందంబు బూజించి వినయమ్మున నిట్లనియె. 223

గీ. ఎంత యత్న మొనర్చినయేని దక్క, నం బొనంగని మీరిటు నా గృహంబు
కడకు విచ్చేయుటను స్వర్గగణ్యమయ్యె, జన్మము సురేంద్రులార ! విస్పంశయముగ.

వ. దుస్సాధంబేనియు మీరలాజ్ఞాపించిన కార్యంబు నొనరించెద నావుడు వార లిట్లనిరి.

క. హరి ప్రేరేపంగ నీకడ, కరుదెంచితి మింద్రునకు సహాయుండవై ని
ర్జరవైరులం ద్రుంపుమునా, నరపతి యిట్లనియెం బేర్మి నాకులతోడన్. 226

వ. మీరాజగు నింద్రుండు నాకు వాహనంబయ్యేనేని నేను దప్పక పార్ష్ణిగ్రాహుండనై సంగ్రామం బొనరింతు ననుడు, సురలు తమపతి కెఱింగించిన నాతండును లజ్జ

తుండై హరిప్రేరణమ్మున నతనికి వాహనంబయ్యెఁ, బిమ్మట నమ్మహీపతి యుద్ధం
బొనరించి దైత్యపుంజమ్ము జయించె; నాఁటఁగోలె నితనికి నింద్రుండు వాహనంబగుట
నింద్రవాహుండనియుఁ బురములు జయించుకతనఁ బురంజయుండనియుఁ గకుద
మునఁ గూర్చుండుటం జేసి కకుత్స్థుండనియు నామత్రయంబు విఖ్యాతంబై నెగడు.

గీ. దైత్యుల జయించి వారల ధనములెల్ల, సురలకు నొసంగి యన్నరపతుఁడు సురప
తికి సఖిత్వము నెఱపి వర్ధిష్ణుఁడయ్యె, నతనికుజజులు గాకుత్స్థు లనఁబరఁగ. 228

వ. వారల వివరించెదఁ గకుత్స్థునికిఁ గాకుత్స్థుండును, వానికిఁ బృథుండును, వానికి విశ్వ
రంధియు, విశ్వరంధికిఁ జంద్రుండును, జంద్రునకు యువనాశ్వుండును, నారాజునకు
శావంతుండునుం గలిగిరి. 229

క. శావంతి యనెడి నగరం, బావిభుఁ డాత్మాభిధాన మలరఁగఁ బృథుల
శ్రీవెలయఁగఁ గట్టించె ధ, రావలయమ్మునను నెల్ల రత్నంబనఁగన్. 230

వ. శావంతునకు బృహదశ్వుండును, నతనికిఁ గువలాశ్వుండును బుట్టి రీతండు ధుంధు
వను రక్కసు జయించినకతన ధుంధుమారుండను బిరుదనామమ్ము నొందె; నమ్మహీ
పతికి దృఢాశ్వుండును, నతనికి హర్యశ్వుండును, వానికి నికుంభుండును, నయ్యన
ఘునకు బర్హణాశ్వుండును, విన్నరపతునకుఁ గృశాశ్వుండును, నవ్వానికిఁ బ్రసేన
జిత్తును, నతనికి యౌవనాశ్వుండును, నమ్మహామహునకు మాంధాతయు నుద
యించిరి. 231

క. ఆ మాంధాతృమహీపతి, శ్రీమంతముఁ గుచు మిగులఁ జెలువొందెడి స
ద్ధామములు నూటయేనిమిది, దా మహిఁ గట్టించె శక్తితత్పరమతియై. 232

## మాంధాతృ చరిత్ర.

వ. ఇమ్మహీపతి యెల్లరంబోలి మాతృగర్భమ్మునం గాక పితృుదరమ్మునుండి యుద్భ
వించె, నావుడు జనమేజయుండది యెట్లనుడు వ్యాసుం డిట్లను. 233

గీ. యౌవనాశ్వునకును భార్య లనఘమతులు
నూర్వు రిందొక్కరితకైనను జనింప
దయ్యెసంతాన, మానృపుఁ డాత్మజాతు
లకు మనమ్మునఁ జింతించి యొకఁడు నొకట. 234

వ. వనమ్మున కరిగి ఋష్యాశ్రమమ్ముల సేవించుచు వచ్చుట నిశ్వాసమ్ముల విడువ

వారును నతని దుఃఖితుఁగా నెఱిఁగి కరుణించి రాజా! నీమనమ్మునఁ గల చింత యెయ్యది? నొడువు మద్దానికిఁ బ్రతీకారం బొనరింతము నావుడు నృపాలుం డిట్లను.

మ. ధనధాన్యమ్ములు మేటి గుఱ్ఱములు భృత్యవ్రాతముల్ నాగముల్
ఘనరాజ్యమ్ము సుఖమ్మునుం గలదు చక్కంగన్ ముదంబిచ్చు జ
వ్వనులు న్నార్వురుభార్యలా కలరు తద్వామాక్షులం దొక్క యుం
గనకైనన్ సుతలబ్ధి లే దిదియ శోకం బెప్పుడు న్నామదిన్.

వ. అపుత్రునకు గతి లేమి నన్ననుగ్రహించి సంతానార్థినగు నాచే నెద్దియే నొక యిష్టిం జేయించి కృతార్థుం జేయ వేఁడెద. నావుడుఁ దాపసు లింద్రదేవతాకంబగు నిష్టిం జేయించి యజ్ఞశాలయందు సంతానార్థమ్ముగా వేదమంత్రసమ్మంత్రితంబగు నొక కలశంబునిచిన నన్నరవరుం డానాఁటిరేయి తృషితుండై తద్గతంబులగు జలమ్ములం గ్రోలె. నంత మునులు మఱునాఁ డక్కలశంబున జలమ్ములు లేకున్న "నీ భార్యకునై యునిచిన జలమ్ము నీ వుపయోగించితివే" యనుడు నతండును పిపాసచే నట్లొనర్చితిననియె వారలును దైవబలమ్మునకు శంకించుచు నిష్టిని సమాప్తి చేసి తపమునకుం జనిరి. 237

గీ. అంత మంత్రబలమ్మున నన్నృపాలు, కునకు గర్భోదయంబయి ఘనతఁ జెంది
పూర్ణ మగుడు జనించె సత్పుత్త్రుఁడొకఁడు, కుడికెలనమంది గర్భంబు వొడిచి చించి.

వ. పిమ్మట దేవతల యనుగ్రహమ్మున నయ్యవనీపతి మృతుండుగాక జీవించెఁ బిదపడి మంత్రు లమాత్యకుండగు నా శిశువునుద్దేశించి *"కంధాస్యత్యయ"మ్మని విచారించుచుండ నింద్రుం డేతెంచి తన తర్జనినా శిశువు నోట నిడుచు "మాంధాతా" యని పలికె. నక్కతన నతఁడు మాంధాతృ నామమ్మునఁ బ్రసిద్ధుండయ్యె. 239

చ. అతఁడు జయించి భూవలయ మంతయుఁ; బిమ్మటఁ జక్రవర్తియై
యతులితరీతి నేలె జగ, మయ్యవనీపతి భీతిఁ జేసి ద
స్యుతతి గిరీంద్రకందరలఁ జొచ్చెట, నింద్రుఁడొసంగెఁ బేరు పా
ర్థత నలరారి యొప్పఁ ద్రసదస్యుఁ డనంగ ననుగ్రహమ్మునన్. 240

చ. విమల మనోహరాంగి శశిబిందుతనూభవ బిందుమత్యభి
ఖ్య మెఱయు పత్పతివ్రత నఖండయశుండు వివాహమాడి యు

* ( ధేట్ పానే, ధాతా. )

త్తముఁ బురుకుత్సు భూరిగుణతత్పరునిగా మునిసంఘ మెన్నఁగా
గ్రమముగఁ గాంచెఁ బుత్రుల జగద్ధితబుద్ధి నతం డతంద్రుఁడై. 241

క. పురుకుత్సున కుదయించెను, నరణ్యుఁ డతిధార్మికుఁడు మహాభాగుఁడు త
న్నరవరునకు బృహదశ్వుం, డరయఁగ నాతనికిఁ బుట్టె హర్యశ్వుండున్. 242

వ. ఆ హర్యశ్వునకుఁ ద్రిధన్వుండును వానికి నరుణుండును, వానికి సత్యవ్రతుండును. బొడమి రితం దొక్కనాఁడు, వివాహసమయమ్మున నొక విప్రకన్య నపహరించిన నద్దురాచరణంబున కోర్వక తత్పితృ లొక్కమొగి నార్తులగుచుఁ జనుదెంచు నతని తండ్రియగు నరుణుండు నృశంసుండగు తన కొమరుం డెద్దియేని నొక దుష్కృత్యమ్మున వీరలఁ జెనకం బోలునని శంకించి వారల కిట్లను. 243

క. నాకొమరుఁ డెఱిఁగి యెఱుఁగక, మీకేమి యొనర్చె వచుడు, మేలెంచక తా
మాకన్నియను బలాత్కృతిఁ, జేకొనియెన్ బెండ్లివేళఁ, జెనఁటివిధమునన్. 244

## సత్యవ్రతోపాఖ్యానము.

ఉ. నావుడుఁ గ్రుద్ధుఁడై నృపతి నందనునిన్ గని యిట్లు పల్కె, దు
ష్టా! వృథ నీదునామ, మకటా! యిది పాతకకృత్య మేమిగా
భావమునం దలంచితివి, పార్థివజన్మము నెత్తలేదె! నా
కీవు సుతుండ వన్నయళమే! యెటకేనియుఁ బొమ్ము దుర్మతీ. 245

వ. సత్యవ్రతుండే నేయెడ కేగుదునని యెదిరించి మాటికివి బల్కుడు నతం డిట్లను.

చ. శ్వపచులనేనిఁ జేయని యసత్కృతిఁ జల్పిననీకు నా శ్వపా
కపరిచయంబు న్యాయ్యమగుఁగాన నటుల్ పొవరింపు మెంతయే
నవయశమిచ్చు నీకతన నౌదునె యేను గృహార్థుఁడన్! గులం
బు పతితమయ్యె నీజననముగా గని యింతకు వంశపాంసనా. 247

వ. ఇట్లు వసిష్ఠ ప్రేరితుండగు జనకునిచే నిష్కాసితుండై సత్యవ్రతుండు వనమ్మున కరిగి శ్వపాకులంగూడి దనుర్ధరుఁడై వర్తించుచు వసిష్ఠునియందుఁ గ్రోధమ్ము గలిగి యుండెఁ, బదంపడి నరుణుండు పుత్రార్థమ్ముగాఁ దపంబొనరింప వనమ్మున కరిగె నీ యధర్మమ్ము కారణమ్ముగ నింద్రుం డారాజుదేశమ్మునఁ బండ్రెండు సంవత్సరమ్ములు వర్షాభావం బొనర్చె నట్టియెడ. 248

క. ఆ నృపతిదేశమునఁ దన, సూనుల నర్ధాంగి విడిచి నొలవక తపముం
బూనఁజనెఁ గౌశికి యనం, గా నెగడెడి యేటికడకు గాధిజుఁ డెలమిన్. 249

క. ఆ కౌశికునర్ధాంగి క్షు, ధాకులురై శిశువు "లన్నమన్న" మనుచుఁ దా
నేకరుఁ బీడింపఁగ బల్, శోకముపాలై మనమ్ము గ్రుక్కి కలంగన్. 250

చ. పతి ధనహీనుఁడైన నను బాలకులన్ దృజియించి యేగె భూ
పతియును లేఁడు మామటకుఁ బట్టణమందు; క్షుధార్తులై వనం
బ్రతుకఁగ నీరు తిండికయి బాలకు; లెవ్వఁడు రక్షకుండు? దు
ర్గతి నెటు లీఁగుదాన? బ్రతుకంగలరే సుతు లన్నహీనులై? 251

ఉ. పిల్లల జంపుకంటె మఱి యింకొకవిధ మెగనమ్ముదాన నే
మల్లము దాయి చేసికొని; యోమఁగ నమ్ము విక్రయార్తనం
బల్లవ మొక్కమాపలకుఁ బ్రాణము నిల్పఁగఁ గొంతదక్క; నే
తల్లికి నేనిఁ బోష్యతని దర్మము ఫాత విధించె నాకటా. 252

క. అని దైవగతికిఁ జింతన్, గొనుచున్ మధ్యముని యతఁ గొంకక దర్భల్
బొనిపిన పజ్జాఫు దగిలిచి, తనగృహమున్ వీడి చనియెఁ దరుణి వగ దగన్. 253

క. పలుమల మఱుఁగుచు నమ్ముని, లలనామణి సుతులు వెఱఁగు లాగుచురా నెం
దులకేనిఁ బోవునది యి, మ్ముల సత్యవ్రతుని మార్గమునఁ గనుఁగొనియెన్, 254

వ. సత్యవ్రతుండును నామె వీక్షించి యిట్లనియె. 255

క. అకటా! యేడ్చెడి పుత్రకు, నకు నళుతం బ్రాడుగట్టి వారీమణి! మి
న్నక యరిగెద వెందుల కే, మికతం బెవ్వతెవు? తెల్పుమీ సత్యముగన్. 256

క. అనవుడు నల్లలనామణి, యను విశ్వామిత్రుఁ డనెడి యనఘాత్ముఁడు న
న్ననుఁ సుతులన్ డించి తపం, బున కరిగెన్ నన్నెఱుంగు మువివరు సతిగా. 257

క. ధనహీననైన కతమున, ననదనగుచు సుతుల పోషణార్థముగా నం
దనులం దొక్కరుఁడగు వీ, నిని విక్రీతునిగఁ జేయనేర్పితి ననఘా. 258

చ. అనవుడు నా నృపాలసుతుఁ "డమ్మరో! యేమిటి కిట్లొనర్ప నే
ననుదినము బవత్సుతుల యాఁకటికిన్ దగినట్టి భక్ష్యముం
గొని యరుదెంతు నత్యమునకుం జవదాఁటక తావకాశ్రమ
మ్మున నొక చెట్టునం దిడుదు మూటగఁగట్టి గృహమ్ము చేరుమా. 259

వ. పదంపడి నీ భర్తయును రాఁగలఁడు" నావుడు నమ్మునివనిత సంతసించి తన

యాశ్రమమ్మున కరిగె నక్కొమరుండు గళబంధమ్ము కారణమ్ముగ గాలవుం
డనఁబరఁగె. 260

క. ఆసత్యవ్రతుఁడును వి, శ్వాసమ్మును భక్తియును గృపయుఁ గలిగి సదా
దానుండై మునివనితకు, గ్రాసంబిడు సుతసహితము గా భుజియింపఁగా. 261

గీ. మృగముల వరాహములను మహిషశశముల, ననుదినమ్మును గొట్టి సత్యవ్రతుండు
గాధిసుతు నాశ్రమముపొంతఁ గట్టుఁ జెట్టు, కొమ్మ కొకములకైగాఁ జేసి కూర్చుపెట్టె.

వ. విశ్వామిత్రునిభార్య తన్మాంసంబునఁ దన సుతులఁ బోషింపుచుఁ గాలమ్ము గడపు చుండె, నిట్లుండ నట సత్యవ్రతునితండ్రి తపమ్మునకరిగినది మొదలుగ నా పురమ్మును నంతఃపురమ్మును వసిష్ఠుండు గాపాడుచు రాజకార్యమ్ముల నెఱవేర్చుచు నయోధ్యయం దుండె; నయ్యెడ నప్పురమ్మునకు సమీపమ్మునఁ దండ్రియానతిం జేసి దుర్గతిం బడియున్న సత్యవ్రతునకు నొక్కనాఁడు మృగమ్ము లెవ్వియుం గానరాక వసిష్ఠధేనువు పొడకట్టె; దానింగాంచి యతండు పూర్వక్రోధమ్మున వధించి తన్మాంసమ్ము కొంత దిని తన యాఁకలిం దీర్చికొని తక్కుంగల పలలమ్ము నప్పాదపమ్మున నెప్పటియట్ల బంధించె. 263

క. ఆ ఋషిపత్నియుఁ దనదు కు, మారులకుం బెట్టి గోవుమాంసం బని తా
నారయ నేరక యెంతేఁ, గూరిమి భుజియించె మిగులఁ గుతుకం బెసఁగన్. 264

వ. అంత వసిష్ఠుండు తన ధేనువుమృతి నెఱింగి కోపాకులుండై పరుషమ్ములగు సత్య వ్రతున కిట్లనియె. 265

ఉ. ధేనువుఁ జంపి యెంతటికృతిన్ బొనరించితి వోరిదుష్ట! దో
షానుగతుండవై మును ధరామరదారహరింపుటన్ జగ
న్మానితుఁడైన తండ్రి యవమానము గైకొనుటన్ మృషాగతిన్
ధేనువు నిష్ఠ చంపుటకు నిన్నుఁ ద్రిశంకుఁడనంగ నొప్పెడిన్. 266

వ. నేఁడు మొదలీ నామమ్మునం బొదలి జనులకుఁ బిశాచాకారమ్మునం బొడకట్టుచుండు మని శాపంబిచ్చిన నతం డా రూపమ్ముదాల్చి యయ్యాశ్రమమ్మున వసియించుచు నొక్క మునిపుత్రుని కతన నుపదేశంబు వడసి జగజ్జననిం గుఱించి యఖండతప మ్మొనరించుచుండె నావుడు జనమేజయుండు మహాత్మా! త్రిశంకునకు వసిష్ఠశాపం బెట్లుతొలఁగె నొడువు మన నతం డిట్లనియె. 267

గీ. ఆతఁడు పిశాచమై దేవినాత్మ నిల్పి, తన్నవాక్షరమంత్రతత్పరమనస్కుఁ
డగుచుఁ దప మాచరించి హోమార్థి యగుచు, నర్థి విప్రులకడ కేగి యడిగె నిట్లు.

వ. నాయొనర్చెడి పురస్కృతులంగాని మత్ప్రార్థనంబు సఫలంబొనర్పఁ గోరెద, నేను చిరమ్మునుండి నవాక్షరమంత్రరాజంబు జపియించితి నిపుడు జపదశాంశమ్ముచే హోమంబు సలుపవలయు మీరలు ఋత్విజులరై యిక్కార్యంబు నెరవేర్చి కృతార్థుం జేయ వేఁడెద న న్నృపజాపుత్రుండగు సత్యవ్రతుఁగాఁ నెఱుంగుఁడు నావుడు వార లిట్లనిరి. 269

క. వెలిపుంగ నయ్యె నీవా!, కులగురుఁడు వసిష్ఠమౌని గోపించి విమలా
జలిపెఁ బిశాచముగా నీ, కలవడునే? వేదవిహితమగు కృతిసేయఁగా. 270

చ. అని తనుఁ దూలనాడుటయు నా నృపనందనుఁ డేల నాదు జీ
వన? మిఁక నేమి సేయుదు? నపాత్రుఁడ రాజ్యములేమి చేసె మ
జ్జనకుఁడు దేశికుండిదెఁ "పిశాచమవై చెడు" మంచు శాప; మె
వ్వనికి నవస్థ నింతొనసి పాతకినై బ్రతుకంగఁ జెల్లునే. 271

వ. అని కృతనిశ్చయుండై శుష్కమ్ములగు కాష్ఠమ్ములు పేర్చి చితినేర్పరచి యగ్ని జొనిపి యందుం బ్రవేశింప నెంచి స్నానం బొనరించి జగజ్జనని నాత్మ దలంచు కొంచుఁ దక్షిణీపమ్మునఁ గృతాంజలియై కూర్చుండునంత నజ్జగదంబ కరుణా శాలినియై యాకసమ్మున నాతనికి దర్శనంబొసంగి వారించి యిట్లను. 272

గీ. సాహసింపఁగ నేల యోజనవరేణ్య!, వినుము నామాట నీతండ్రి వృద్ధుఁడయ్యె
నీకు రాజ్య మ్మొసంగి యెందేనిఁ దపము, చేయబోనున్నవాఁడు నిశ్చింతుఁడగుచు.

వ. మదనుగ్రహమ్మునంజేసి రేపు నిన్నుఁ బట్టాభిషిక్తుం జేయ నీతండ్రి యనుమతమ్మున మంత్రు లరుదెంతురని చెప్పి దేవి యదృశ్యమయ్యెఁ, బదంపడి త్రిశంకుండు మరణోద్యమమ్ము విడిచి సుఖంబుండె నంత నారదుండరిగి వృత్తాంత మ్మెల్ల నృపాలునకుం జెప్పిన నతండు పుత్రు మరణోద్యోగమ్మునకు దుఃఖితుండై మంత్రులం బిలిచి యిట్లను. 274

ఉ. పొమ్మనినంత న వ్విడచి పోయి వనమ్మున భాగ్యహీనుఁడై
గ్రుమ్మరుచుణ్ గురుప్రవరుకోపము తన్నలయింపఁగాఁ బిశా
చమ్మయి దేవి గొల్చి విలసన్మతియై తుద కెంతయుణ్ విరా
గమ్మున నగ్నిలోనఁ దనకాయము వైవఁగ నెంచె నక్కటా. 275

గీ. కృప గలిగి దేవి వారింపదేని సుతుఁడు, మృతిఁ బొరయుఁగాదె, వైశస మేగి నాఁడు
జ్యేష్ఠపుత్రునిఁ డెందు విశ్రాంత వావి, కిచ్చి రాజ్యమ్ము తపమున కేగువాఁడ. 276

వ. నాఁపుడు మంత్రులు సత్యవ్రతునిపాలి కరిగి యనునయ వచనమ్ముల నోదార్చి పుర
మ్మునకుఁ దీసుకొనివచ్చి తండ్రికిం జూపిన నతండు జటాజూటధరుండును గ్రాసం
డును జింతాక్రాంతుఁడును నగు కొమరుం గాంచి పశ్చాత్తప్తుండై రాజ్యార్హుండును
మేధావియునగు తనయు ధర్మం బెఱింగియు పిక్లాంతరింపతి నను సిగ్గువడు నావంగ
వం బొనరించుకొని తనసింహాసనమ్మునఁ గూర్చుండబెట్టుకొని ప్రతిష్ఠాదికమ్ముగ
నిట్లనియె. 277

## రాజనీతి

క. తనయా! ధర్మమ్మున బు, ద్ధిని నిలుపన్ వలయు నెపుడు ద్విజవర్యుల మ
న్నన పేయవలయుఁ బ్రజలన్, దనుజులవలెఁ బ్రోవవలయుఁ బరినాథునకున్. 278

గీ. ధనము న్యాయాగతంబయి తనరుటొకటి
యనృతమునఁ గాలుపెట్టమియును సమార్గ
గామి గాకుంట తపసుల నోముటయును
బరమధర్మమ్ము లియ్యవి పార్థివునకు. 279

గీ. ఇంద్రియజయంబు పూజ్యుల నెఱుఁగుటయును,
మంత్రగుప్తియు జోరుల మద మడఁచుట,
శత్రుశేషంబు వైఁపమి, సచివు నన్య
సక్తుఁ జేర్పమి పతికి యశస్కరంబు. 280

గీ. శత్రుమిత్రుల కృత్యముల్ చారముఖము
వలన నెఱుఁగుటయును శుష్కవాది గామి
దుష్టసంగంబు దొలఁగుట యిష్టులకును
బూజ్యులకు వీఁగియును విధి భూపతులకు. 281

క. యోగముల నొనర్చుట మృగ, యాగతి వతిరక్తి లేమి యంగనలం దు
ద్యోగముల విశ్వసింపమి, యోగమవిహితము నృపతులగు వారలకున్. 282

గీ. ద్యూతమున దాని నాడెడి నీతిరహితు, నందు పద్యమ్ము సంను వారాంగనాజ
నమ్మునందును దఱచు గానమ్మునందు, విముఖుఁడై ప్రజ నల్లొనర్పింప వలయు. 283

గీ. అరసి బ్రాహ్మముహూర్తమునందు లేచి, స్నాన మొనరించి నియతుఁడై శక్తిపూజ
భక్తి నొనరింపఁగావలెఁ బ్రతిదినమ్ము, జన్మసాఫల్యమును గోరు చతురమతికి. 284

క. ఒకసారియైన నప్పర, మకృపానిధి నంబఁ గొలిచి మన్ననఁ దత్పా
దకమలజలంబు గ్రోలిన, సుకృతికి జన్మమ్ము లేదు సూ నిక్కముగన్. 285

గీ. ద్వైతమునకు జగమఖిలమ్ము దేవదేవి, జీవుఁ డీశ్వరుఁడునుగూడ దేవదేవి
యనెడి, విశిష్టాత్మకంబగు ఘనమతికి, నతులితానంద మెల్లప్పు డనుభవించు.

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితగతిం బాటించి కొల్వుండి వి
ద్యాతంత్రజ్ఞుల విప్రులన్ బిలిచి శాస్త్రార్థమ్ము లవ్వారిచేఁ
బాగుం బైకొని పాత్రులై తనకు నా భూదేవతాశ్రేష్ఠులన్
ప్రీతిన్ దానము లిచ్చిపుచ్చవలయున్ బృథ్వీశుఁ డెల్లప్పుడున్. 287

క. వినుఁ మాన్యులైన ద్విజులకు, ధన మీవల దిచ్చెనే నుదరపోషణకుం
గనిపెట్టి యీవలయు నం, ఘన మొనరింపగఁ దగదుగా ధర్మపులన్. 288

చ. అనఘుల భూమిదేవతల నత్యమలాత్ముల నెన్నఁ దేవియుఁగా
జన దనమానసుం గొలుప క్షత్రకులమ్మున కమ్మహామహుల్
జనకులు ; వారి యగ్నికిని, క్షత్రియజాతికి విప్రజాతి లో,
మానిధులకుఁగా శిఖల్, జనకతాస్పదముల్ విధిచోదితమ్ముగన్. 289

ఉ. వారల తేజమెంతయు నవారితమై యలరారు భూపతుల్
వారలలోన ధీమలగు వారల నెన్ని యఖండదానస
త్కారములన్ మహావినయ గౌరవసంపదలన్ మహోన్నతిం
గోరుచుఁ బూజసేయుదు రకుంఠితవైభవముల్ చెలంగఁగన్. 290

గీ. ధర్మశాస్త్రానుసరణంబు దప్ప కెపుడు
దండనీతి యవశ్యంబు ధరణిపతికి
కోశసంగ్రహ మెల్లెడఁ గూర్పవలయు
ననుచు బోధించెఁ బృథివీంద్రుఁ డాత్మజునకు. 291

మ. తనవాక్యమ్ముల సమ్మతించినసుతుఁగా దత్తన్మహాతీర్థపా
వనవీరమ్ములచేత మంత్ర్యమమతిఁగా బాడుల్ శ్రుతుల్ చెప్ప దీ
వనలం జేయఁగ మంచికాలమున దివ్యద్భంగిఁ బట్టాభిషే
చనముం జేసి యతం డరణ్యము తపస్సంసక్తి నేగెఁగా దగన్. 292

వ. అట్లు నృపాలుండు గాంతారమ్మునఁ గాంతాసహితమ్ముగఁ దపంబొనర్చి కొండొక కాలమ్మునకు దేహంబు విడిచి దివం బరిగి యచ్చట సింహాసనసమీపమ్మున రెండవయింద్రుండై యుండెననుడు జనమేజయుం డిట్లను. 293

ఉ. మున్ను వసిష్ఠధేనువును ముష్కరుఁడై వధియించి శాపమున్
గొన్న త్రిశంకుఁ డేగతిని గుంభినికిన్ ధవుఁ డయ్యె? నెందునే
ని న్నృపతిత్వ మూనఁదగునే మునివర్య! పిశాచముల్? గృపన్
దన్నృప శాపమోక్షణకథన్ వినిపింపుము నాకు నావ్రమున్. 294

వ. వ్యాసుండిట్లనియె. 295

చ. అతఁడు పిశాచమయ్యు జగదంబిక నాత్మఁదలంచి తత్కృపా
మృతమున దివ్యదేహము ధరించె వసిష్ఠమహామునీంద్రు స
మ్మతికి విధానమయ్యెఁ బితృమాన్యతఁ గాంచె నృపాల! లోకవం
దితయగు నప్పరాంబిక నుతించిన నెయ్యది గల్గకుండునే. 296

గీ. అనఘుఁడై పేర్మినిట్లు సత్యవ్రతుండు, రాజ్యమును జెంది జన్మముల్ రమణఁజేసి
యెన్నఁదగు కీర్తి గాంచి లోకోన్నతుండు, సర్వలక్షణయుతు హరిశ్చంద్రుఁ గనియె

వ. పదంపడి యనుగుణవయస్కుండగు కొమరునకు యౌవరాజ్యం బొసంగి శరీర మ్ముతో దివమ్మున కరుగఁదలఁచి వసిష్ఠాశ్రమమ్మున కరిగి కృతాంజలి పుటుండై యిట్లను. 298

## వసిష్ఠుండు త్రిశంకునకు శాపంబిచ్చుట

మ. అనఘా! యీతనువుం ద్యజింపకయ నే నాసింతు స్వర్లోకసం
జనితానందము లప్సరోవిధుముఖీసంసర్గముల్ దివ్యనం
దనసంచారముఁ గర్ణపేయమగు గాంధర్వంబుఁ; దత్తాదృశా
భినవోద్యత్ఫలదాయి యాగమును సంప్రీతిం దగం దెల్పుమా. 299

చ. అనవుడు నవ్వసిష్ఠుఁ డను నాకనివాసము మర్త్యదుర్లభం
బనఘ! కృతాధ్వరుండు మృతుఁడై దివ మేగుట సుప్రసిద్ధ మే
మనఁదగు నీ మనోరథము యాగ మొనర్చితివేని వచ్చు త
త్తమవున నప్సరస్సతులఁ దద్దయుఁ గూడి సుఖింతు విమ్ములన్. 300

వ. అంతియ కాని బొందితో నాకమునకుం బోవఁగూర్చుట నాకశక్యం బనవుడుఁ, బూర్వ

రోషసంయుక్తుండగు నమ్మహామునికిఁ ద్రిశంకుండిట్లను, నీవు గర్వావేశమ్మున నన్నుఁ గ్రతువు చేయింపవేని వేఱొక్క పురోహితుఁ కతనఁ దాదృశంబగు జన్నం బొనర్చువాఁడ ననుడుఁ గోపోద్రేకమ్మున నిట్లు శపించె. 301

ఉ. గోవధపాపదూషితునకున్ ధరణీసురదారహర్తకున్
దేవనివాస మన్యమగు దేహము దాల్చినయేనిఁ గల్గ దో
రా! వెఱపింత లేక నను నాగ్రహయుక్తునిఁ జేయుదే? దురా
త్మా! విను మిప్డ నీకు ననువౌ శ్వపచత్వము శాపహేతువై. 302

చ. గురుఁ డిటు శాప మీఁ దనతనికుండలముల్ శిల లయ్యె, నీలిమన్
బొరసెను బట్టుపట్టము, సముజ్జ్వలమైతగు దివ్యదేహమున్
గరి కెన యయ్యె, మై నలఁదుగంధము విట్సమమయ్యె శక్తికిం
కరుల నెడర్చి యెవ్వఁడు సుఖమ్ములఁ బొందు జగత్త్రయమ్మునన్. 303

శా. గాయత్రీజపతత్పరుండు సురలోక జ్యేష్ఠకల్పుండు దు
ర్జేయుండైన వసిష్ఠుఁడిట్లు తను వంచింపన్ మహంబేది చిం
తాయత్తుండయి యింటికిం జనఁగ నత్యంతమ్ము శంకించి యీ
కాయం బెంతయు హేయ మేలిఁకని తత్కాంతారసంచారియై. 304

క. శ్వపచుండగు పతిఁ గని యెం, త పతివ్రతయేని భార్య తర్కించును, మం
త్రిపురప్పరులగు బంధులు, నెవ మిడి యెడ నుంతు రింత నీచత గలదే. 305

మ. మరణంబే శరణంబుగాక యని యాత్మన్ నిశ్చయం బంది త
న్మరణం బేగతిఁగల్గు, వహ్నివిషసంబంధమ్మునం జేసి యె
వ్వరు గోల్పోత్తురు కాయ మాపతితు లాపై జన్మమందున్ బునః
పరితాపమ్మును గాంచువార లని చెప్పన్ వింద ధర్మమ్ములన్. 306

వ. కావున నాత్మహత్యకన్న నిందన్యంబొండు గన్పట్ట దెట్టిదైన గృత శుభాశుభకర్మమ్ములు కేవలభోగ్యంబు లగుట నేనీ దేహమ్మునన యీశ్వపచత్వమ్ము నిశ్శేషముగా ననుభవించు టొప్పుఁగాదె? పుణ్యతీర్థమ్ములు సేవించుచుఁ బరాంబికాస్మరణమ్మును సాధు సంసర్గమ్మును తోడుగాఁ గాననమ్మున సంచరించెద నెవ్వండేని యొక మహానుభావుండు దొరకకుండునే? యని నగరమ్మువిడిచి గంగాతీరమ్మున కరిగి యట దుఃఖపరీతుండై వసియించుచుండె. 307

క. తనతండ్రి దుర్దశను విని, ఘనుఁడు హరిశ్చంద్రుఁ డాత్మగలఁగ సచివులన్
బనిచెన్ వారలు గంగా, ధుపి యొద్దనకేగి నృపుని దుఃఖితుఁ గృశునిన్. 308

వ. కాంచి వినయమ్మున మహాత్మా! యువరాజగు నీతనయుండు హరిశ్చంద్రుండు నిన్ను సన్మానపూర్వకమ్ముగఁ దోడితెండనిన వచ్చితిమి కటాక్షించి నగరమ్మున కరుదెంచి యథాపూర్వకమ్ముగ మంత్రులను సేవకులను సేవింప రాజ్యభారమ్ము వహింపుము గురుండెట్లు ప్రసన్నుండగు నట్లొనర్పవచ్చునని బహువిధంగుల విన్నవించినను శ్వపచుండగు నా నృపాలుండు గృహంబేగుటకు సమ్మతింపక వారల కిట్లనియె. 309

చ. తనయుఁడు మదాజ్ఞఁజేసి శ్వపచత్వమునన్ బఱఁజూవనోవ పు
త్రనయుచితోడ బ్రాహ్మణహితమ్ముగ యజ్ఞములాదియౌ కృతుల్
బొనరుచుచున్ ధరాభరము పూని ప్రజన్ భరియింపుమంచు నా
పనుపునఁ జెప్పి మీరలును బొల్పడుఁ డాతనికిన్ సహాయులై. 310

వ. ఇట్లు కృతనిశ్చయుండైన త్రిశంకునకు నమస్కరించి దుఃఖావేశమ్మున నంచలును వాయాశ్రమంబు విడచి పురికరుదెంచి, 311

క. అనవద్యమగు దినమ్మున, ఘనుని హరిశ్చంద్రు భూమికాంతునిగా స
జ్జనహితు నభిషేకించిరి, మునిజనముంతోడ మంత్రిముఖ్యులు పేర్మిన్. 312

వ. హరిశ్చంద్రుం డిట్లు కృతాభిషేకుండై మనమ్మునఁ దండ్రిం దలఁచుచు న్యాయ్యం బుగ భూపాలనం బొనరించె నావుడు జనమేజయుండు. 313

మ. జనమాన్యుండు త్రిశంకుభూపతి హరిశ్చంద్రున్ జగ
ద్వినుతుం బట్టము గట్టఁజేసి పిదపన్ దేహమ్ము చాలించెనో!
మునిచే శాపవిముక్తి చెందెనా! వనిన్ మున్నెట్టు లప్పాట మా
లని భంగిన్ జరియించెనో నాడువు మెల్లన్ వృత్తము న్నాకొగిన్. 314

వ. నావుడు వ్యాసుండు, రాజేంద్రా! త్రిశంకుం డట్లు హరిశ్చంద్రునకు రాజ్యంబొసంగి జగజ్జనని నాత్మనిల్పి యవ్వనమ్మున గంగాతీరమ్మునఁ దపమ్ముకలిమిఁ గాలయాపనం బొనర్చుచుండె, నంత మున్ను తపమ్మున కరిగిన విశ్వామిత్రుండు సమాప్తవ్రతుండై దారపుత్రాదుల వీక్షించుటకొంతె నరుదెంచి సుతసహితమ్ముగ నెదురువచ్చి విర్వర్తిత సపర్యయై యున్న భార్యంగాంచి ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 315

క. తరుణీ! దుర్భిక్షమ్మున, నరిగితి నేఁ దపమొనర్ప నాత్మజులను వి
న్నారు లెవ్వరు పోషించిరి, తరమె కుటుంబమ్ము గడప ద్రవ్యములేమిన్. 316

గీ. కఱ వతిశయించె నను వార్తకతన నిమ్ముఁ
దలఁచి శోకించి నిర్ధనత్వమునఁ జేయు
తెరు వెఱుంగక యిటకరుదేరనైతి
నాకు నప్పటి దురవస్థ నాతి వినుము. 317

క. ఆఁకలిఁ బట్టఁగ లేక శ్వ, పాకుని గృహమేగి చోరభావమ్మున భాం
డాకలితపక్వకుసక వ, లాకాంక్ష యొనర్చునంత నా శ్వపచుండున్. 318

వ. తత్తఱమ్మున నడిఁగట్టి మేల్కాంచి వంటింట నున్న నన్నుంజూచి నీవెవ్వరేకత
మ్మున మద్గృహమ్మునకు వచ్చితి, భాండంబేల తడవెదు? నావుడు నేను భయత్ర
స్తుండనయ్యు ధైర్యం బవలంబించి వాని కిట్లంటి. 319

ఉ. తాపసుఁడన్ క్షుధార్తిమెయిఁ దాళఁగ లేకిటు చోరభావమున్
జూపుచు నీగృహమ్మునకుఁ జొచ్చితి నే నతిథిన్ గృపన్ మదా
శాపరిపూర్తిసేయఁగ నొసంగుము మాంసమొకింత; భాండమం
దీపనికై కరంబిడితి నేటికి నాఁగెదు క్రోధమూర్తివై. 320

వ. నావుడు శ్వపాకుండు నా కిట్లనియె. 321

చ. ఇది శ్వపచాలయంబు విను మేను శ్వపాకుఁడ మాంసమున్ భుజిం
పఁ దగునె యగ్రజాతికిటఁ; బాతకకృత్యము చూడనేరవ
య్యెద మనవేమి చెప్పె వినవే? శ్వపచుల్ మఱియేడుజాతులన్
విధిగ వసర్షు లెందులకు విప్రకులోత్తమ! విడ్వు భాండమున్. 322

గీ. వీఁడు లోభావృతుండని చూడఁబోకు, మకట! మానవజన్మ మప్రాప్య మందు
విప్రతయు దుర్లభం బిట్టివిధికిఁదగుదు, వే? ద్విజన్ముఁడవై వర్ణవిధము చెడదె.

వ. నావుడు వాని ధర్మమ్మునకు సంతసించియే నిట్లంటి. 324

క. తగుగతిఁ బల్కితి విది ధ, ర్మగతికిఁ దగుభంగి సూక్ష్మమార్గము విను మె
వ్వగనైన దేహమును ని, ల్పఁగఁదగు శంకింపఁ దగదు పాపమ్మునకున్. 325

గీ. తనువు గల్గినమీఁదఁ బాతకము నడఁచు
నిష్కృతి సేయంగ వచ్చు నేరికిని నాప
దలు ననాపదలని చూడఁదగదు దోష
మెడయఁ జేయకయున్నఁ బాల్పడు నరకము. 326

చ. మరణము జిత్తుచేఁ గనిన మానవుఁడెట్టిదునే నవశ్యమున్
నరకము చెందుఁగావ మరణమ్మునకున్ భయమంది చోరతన్

బోరసి శ్వపాకగేహమని బుద్ధి నెఱింగియు నీ మహానసం
బరయఁగ వచ్చినాఁడ విను మాకలి యొందు నెఱుంగనిచ్చునే. 327

క. అదియునుఁగా కీ చౌర్యము, తుద కాపద్ధర్మ్యదేవు దోషాత్మునిఁ జే
యఁదగు నవర్షణ మాతం, డొదవించినకతన నింతయు న్నిజమనుమనుష్. 328

శా. ఆపద్ధర్మ్యుఁడు నేస్గుతొండముఖలావై ధార లొప్పార స
ర్వాపన్నాశకుఁడై పటత్పటరవంబై భూనభోభాగ మి
బ్భాభూర్తిన్ విలసిల్లఁగాఁ గురిసె గాంచత్కాంచనోదంచితం
బై పాటిల్లెడి వృష్టి విద్యుదుదయం బంచందుఁ గన్పట్టఁగన్. 329

వ. ధనమును గాంచి సంతసము దాల్చి తదీయగృహమ్ము వీడి ని
న్నును సుతులన్ గృహమ్మును గనుంగొన వచ్చితి నింతకాల మి
వ్వనమున నిమమందుఁ బసిబాలుర నేగతినోమి? తెట్లు జీ
వనమున మంటి? తెల్పుమన వారిజలోచన మౌని కిట్లనున్. 330

క. నీచనుట మొదలుఁ గఱవు పి, శాచముగతిఁ బ్రబలి క్షుత్తు పైఁపడ సుతులన్
మై చాకచక్య మెదలిన, యాచింపఁగఁ బ్రతిగృహంబు నరిగి నయమునన్. 331

క. అడుగుచు నీవారమ్ముల, నడవులలో నేరికొనుచు నాయాదీతిన్
గడిపితిఁ గొండొకకాలము, బడలంగానీక చిఱుతపాపల నెల్లన్. 332

ఉ. పిమ్మట నింద్లకుం జనిన బిచ్చమువెట్టరు గేస్తు, లేయర
ణ్యమ్మునకేగి చూచినను వారయ రా దొకగింజ, కందమూ
లమ్ములుగాని చెట్టుల ఫలమ్ములుగాని లభింప వట్టి కా
లమ్మునఁ గుల్లలన్ గని తలంకితి నాఁకలి దీర్పరామికిన్. 333

వ. అంత నందఱం జంపుటకంటె నిందొక్కతనయు నమ్మి తత్క్రయప్రాప్తంబగు ధనమ్మునఁ దక్కటిపుత్రులఁ బోషించుట లగ్గనియెంచి క్రంపమామందగు కొమరునఱత రజ్జువుం దగిల్చి వెంటఁ బెట్టికొని యొందేనిఁ జనునప్పుడ సత్య వ్రతుండను రాకొమరుఁడుచూచి "యేమీబాలకుం దేచ్చుకతం" బనవుడు నేనిట్లంటి. నీశువు నాచే విక్రయార్థంబుగాఁ గొనిపోవంబడువాఁడు నావుడు నతండు గరు ణించి "నీవు గృహమ్మరుగుము నీకుటుంబమునకుఁ బ్రతిదినమ్ము చాలినంత యామిషముఁ దెచ్చి యే నిచ్చువాఁడ నద్దాన జీవింతువుగాక యిట్లు నీపతియగు మునీంద్రుండు వచ్చుదనుక నా చేయుట" యనిన నేను ముదంబంది యింటికరిగితి

నతండును బ్రతిదినమ్మును నట్లొనర్పువాఁ డన్నన్ని మిత్తమ్మున వసిష్ఠుచే శపింపం బడియె నది యెట్లంటేని, 334

క. ఒకనాఁడు మృగములెచటఁ ద, నకుఁ గానఁగరాక యీ వనము నెల్లెడ మి
న్నక తిరిగి విసివి యతఁడు తు, దకుఁ జంపె వసిష్ఠుగోవుఁ, దన్మునివరుఁడుకా,

క. అలిగి త్రిశంకుండను పే, రలవడఁగ శపించె మాలఁడై కుందఁగ నా
వలనఁగదా యాతని కీ, కలుషము ఘటియించెనని వగచెద మునీంద్రా. 336

వ. కౌశిక మునిసత్తముఁగు నన్నుఁ వనుఁ దేగతినైనఁ దపోబలగరిష్ఠుండవగు నీకుప
కావ్యుండని వేఁడిన నతికిఁ బతి యిట్లనియె. 337

క. నే దప్పై యున్నప్పుడు, నీడైన యవస్థ చూచి నెఱిఁ బ్రోచిన దా
నూనాదనిఁ దన్నృపవర్యుని, సాదరమతి శాప మెడలు నట్లొనరింతున్. 338

వ. అని చెప్పి యతనిదుఃఖం బెట్లు విముక్తంబగునోకో! యని యెంచుచుఁ ద్రిశంకుం
డున్న పక్కణంబున కరుగుడు నతండు మునినాక యెఱింగి యెదురై విస్మయం
బొదవఁ బాదమ్ములంబడి నమస్కరించినఁ గరుణార్ద్రుండై కౌశికుండు లేవనెత్తి
యిట్లనియె. 339

క. జననాథ! నీవు మిక్కిలి, యనఘుండవు నాకదర్థమై శాపంబుం
గొని చండాలుఁడ వైతివి, చమనే నా కూరకుంట శక్తుఁడ నయ్యుకా. 340

వ. ప్రత్యుపకారం బొనర్చి ఋణవిముక్తి జెందనుంటి నీ యభీష్టంబేమనుఁడుఁ ద్రిశం
కుఁడు మహాత్మా! మున్ను మత్కులగురుండగు వసిష్ఠుని సశరీరస్వర్గదంబగు జన్న
మ్మవ నన్నుఁ గృతార్థుఁ జేయుమని వేఁడిన నతం డొల్లఁడాయె. 341

క. ప్రీతి న్నాకోరిక విన, నేతువమేని వినుమయ్య! నియమమ్మున నా
చేత పశరీరనాకద, మై తనరెడి జన్నమును దయఁగా జేయింతే. 342

వ. కులగురుం డొల్లనవిన నేనన్య గురువిఁగాఁగొని యీయాగంబు నిర్వర్తింపిం
చెద, ననుడు నతండుఁ "నన్నవమానింప నుంకించితివి గానఁ జండాలుండవై
నవయు" మనియె. వియ్యది శాపకారణంబు నావుడుఁ గౌశికుండు దద్యాపంబు గ్రమ్మ
రించి యుపకృతిం బొనర్పనెంచి యజ్ఞసంభారమ్ము లార్జించి మునులం బిలిచిన వా
రలు మఖయాథార్థ్యంబు గుఱుతెఱింగి వసిష్ఠనివారితులై యొక్కరును రాకుండిరి.
దానికిఁ గ్రుద్ధుండై కౌశికుండు త్రిశంకుకడ కరిగి వసిష్ఠదౌర్మంత్ర్యమ్మున మును
లొక్కరును విటకురారు. 343

మ. ద్విజు లేతేరక యున్న జన్న మెటు సంధిల్లంగనౌ నిన్ దివం
బిజయద్రాదులు మెచ్చ నంపెదను రాజా! నాతపశ్శక్తి పే
ర్చఁ జనుగా గైకొను మిద్ద నీ కొసఁగువాఁడన్ బెద్దకాలంబు చే
యు జపం బంతయు ధారవోసెఁ దన మా యర్కీశుహస్తమ్మునన్. 344.

క. తనగాయత్రీజపసం, జనితంబగు సుకృతమిచ్చి జనవర! చను మిం
కను స్వర్గంబున కెవ్వం, డును నిన్నడ్డంగఁజాలఁడు జగత్త్రయిలోన్. 345

## త్రిశంకుండు స్వర్గమ్మున కరుగుట.

చ. అని యనుపన్ త్రిశంకుఁడు రయమ్మునఁ బక్షియుఁబోలె నాకసం
బునకుఁ దపోబలమ్మున సముద్గతుఁడై చన మేఘసంత వ
య్యనిమిషు లంతరంబున జనాధిపతిన్ శ్వపచాకృతిం గనుం
గొని శ్వపచుండు నాకమునకుం జనుదెంచెడి దేవవల్లభా, 346

ఉ. నావుడు దేవనాథుఁడు మనమ్మున విస్మయమంది వేగి యా
భూవిభునిన్ శ్వపాకునిఁ దపోవిభవమ్మున నాక మేగు దు
ర్భావునిఁ దాఁ త్రిశంకునిఁగ భావనచేసియు "పొమ్ము పొమ్ము పో!
దేవనివాస మేదఁ! జనుదేర శ్వపాకుఁడు నేఁడ! దుర్మతీ." 347

వ. అని తోలంగం ద్రోచినఁ ద్రిశంకుండు క్షీణపుణ్యుండగు పతితుండునుం బోలె భూమిం బడువాఁడు గాధిజుంగూర్చి యిట్లాక్రోశించె.

చ. చను మనినంత నేగి సురసద్మము చేరెడి నన్ను దేవతల్
కని సురనాథుతో నడువఁగా నతఁడీగతిఁదెచ్చె నోమునీం
ద్ర! వమఁ గనుంగొనందగదె? ధరణిపైఁ బడుచుంటి వాఁగ వ
మ్మని విని "నిల్వు" మంచు నృపముఖ్యునిఁ నాఁగెఁ దపమ్ము పెంపునన్. 349

వ. గాధిజుండట్లు త్రిశంకుని గగనమ్మున నిలువరించి పిదప నుదకంబు స్పృశించి సువిస్తరంబగు విష్టి నొనర్చి మాతనసృష్టిగా వేతొండు స్వర్గమ్ము నిర్మింపననంత సంభ్రమం దెఱింగి సత్వరమ్మున నయ్యెడ కరుదెంచి వినయమ్మున నిట్లను. 350

క. కోపించి నూత్నసృష్టిన్, బ్రాపింపఁగనేల? మౌనివర! భావత్కా
జ్ఞాపరిపూర్తి యొనర్చెద, నాప్రార్థన పాటిపేయు నా మునివరుఁడున్. 351

ఉ. సురపతి కిట్లు పల్కె "బలసూదన! త్వద్భువనమ్మునుండి యీ
ధరఁబడు మా త్రిశంకుని మఱమ్మునఁ దోడ్కొని స్వర్గలోక సు
స్థిరునిగఁ జేయు మిట్లయిన సృష్టికి మా కొనరింపనే" యనన్
గరము మునీంద్రుదార్ఢ్యమునఁ గంపితుఁడై సురనాథుఁ "డో" యనెన్. 352

క. తపమునిధిచే నీగతి, నొప్పి విరప దివ్యదేహ మొసఁగి త్రిశంకుం
గొప్పగఁ దన పార్శ్వమునన్, జొప్పడఁగాఁ జేసి యరిగె సురపతి దివికిన్. 353

వ. ఏకవిమానసంగతులై యట్లింద్రత్రిశంకులు దివమ్మున కరిగిన స్వస్థుండై గాధిజుం
డాశ్రమమ్మున నుండె. 354

గీ. స్వర్గగతి తండ్రి కబ్బినవార్త నెఱిఁగి
సంతసంబంది యా హరిశ్చంద్ర నృపతి
పుడమి నేలుచుఁ దనకూర్మి సతిఁ గూడి
యిష్టభోగమ్ము లనుదిన మెనయుచుండె. 355

క. సంతానము దప్పుటకుఁ, జింతించి వశిష్ఠమౌని సేవించి మహా
మంత్రజ్ఞ! నాకు సంతతి, యింతకు లేకుంట కేమి హేతువు చెపుమా. 356

మ. కలవింకమ్ములు సంతతిం గని సుఖాఖండస్థితిం బొల్చున
వ్వల వీక్షింపు ముపాయశాలి వయి దైవజ్ఞుండవై మంత్రవే
త్తలకుం బ్రాపయియున్న నీదు పదపద్మమ్ముల్ దగం గొల్చువా
రలకున్ మాకిటు లొంటకుం గతము ప్రారబ్ధమ్మనాఁ జెల్లదే. 357

వ. అని శోకమిశ్రమ్ముగఁ బల్కునజ్జనవరునకు వసిష్ఠుండిట్లనియె. 358

చ. కనఁగ నపత్యహైన్యమునకన్నను దుఃఖము లేదు సంసృతిం
బనుపడువారికిం ధరణివల్లభ! సంతతి నీఁగ నెంతయుం
ఘనుఁడని విందు వర్వరుణుఁ గ్రక్కున నాతనిఁ బూజచేసి నం
దనుఁ గొనవచ్చుఁ దత్కృతికి దైవము తోడగునాఁడు తత్కృపన్. 359

గీ. దైవపురుషకారమ్ములు దవిలి కార్య, సిద్ధిఁ బొనరించు నుద్యమస్థితికి నరుఁడు
గడఁగ దైవంబు తోడగుఁ గాని, లేని, నాఁడు కేవలదైవ మొనర్పునెట్లు? 360

వ. అని గురుం డుపదేశించి వీడ్కొల్పినఁ గృతనమస్కారుండై యరుదెంచి హరి
శ్చంద్రుండు గంగాతీరమ్మున ఘోరతపంబొనర్చె. 361

క. అతనినిజపమున కెరఁగఁ బ్ర, చేతుం డానంద మొంది చెచ్చెరఁ గనపై
ప్రీతిన్ గోరుము వరమన, భూతలపతి కేలు మొగిచి పులకితతను డై. 362

క. అనపత్యుఁడనై దుఃఖం, బున మునిఁగెడినాకు బుణవిముక్తిప్రద నం
దనుఁ గరుణింపుము నావుడు, జనపతి కతఁ డనియె దరహాసముఖుఁ డగుచున్.

ఉ. నందను నీ కొసంగెదఁ గనంబగు సందము వొల్చువాని మి
న్నందెడి సద్గుణంబులకు నాకరమై తగువాని భూమిసం
క్రందన! తత్సుతుం బశువుగా నొనరించి యజించెదే? మహా
నందము గోరి; నావుడు మనమ్మున భూపతి గొంకి యిట్లనన్. 364

వ. మహాత్మా! వంధ్యతకన్న నిట్టిది కొంత మేలగుట విప్పాట నొనరించువాఁడ సుతుఁ బ్రసాదింపు మనవుడు వరుణుండు నీకు నవశ్యమ్మను గొమరుండు పుట్టు గృహం బరుగుము నావుడు సంతుష్టుండై యతఁడు పురమ్మునకుఁ జని భార్యకు నాడిన నామెయు సంతసించెఁ దక్కఁగల భార్యాశతమ్మును ముదమ్మునఁ బొందె. 365

## రోహితోత్పత్తి.

గీ. అతని భార్యాశతమ్మునయందుఁ బట్ట
రాజ్ఞి యగు శైబ్య యంత గర్భమ్ముదాల్చి
పదినెలలు నిండఁ గనియె శుభదినమందు
సుతునిఁ గందర్పసుందరుఁ బతిహితముగ. 366

వ. హరిశ్చంద్రుఁడు జాతకర్మం బొనరించి యఖండోత్సవం బాచరించె, నట్టియెడ వరుణుండు విప్రవేషమ్మున నట కరుదెంచి స్వస్తివచనపూర్వకముగఁ దన్నెఱిఁగించి యిట్లనియె. 367

ఉ. నా వరదానకారణమునం దగె వంధ్యత లేమి నీకు, న
ద్భావుఁడ వేని యీసుతునిఁ బార్థివ! యజ్ఞపశుం బొనర్చి సు
శ్రీ వెలయన్ యజింపుమనఁ జింతమెయి న్నరపాలుఁ డక్కటా!
యేవిధి నిక్కుమారకుని యీఁదగు నీకెటు లోమఁగాఁదగున్. 368

చ. వరుణుఁ డితండు విప్రుఁడయి వచ్చె మఱొక్కట వీడఁ బోవఁడె
వ్వరికిని దేవహేళనము భావ్యము గా దతికోమలాంగు నం

బహుహసమానసున్ మఖముపొంపె వధించినఁ బుత్రశోకముం
దరసి భరింపఁ దక్కుటి విధమ్మున నీతఁడు ప్రీతిచెందునే. 369

క. పెక్కగు జాములఁ బడి తుద, కొక్కరుఁ గని నందులకు సుఖోదయమునకుం
దక్కితి నదిగాకయుఁ దై. మిక్కిలి శోకింపవలెనె మితిలేనివగన్. 370

వ. అని చింతించి ధైర్యం బవలంబించి వినయమ్మున నతని కిట్లను. మహాత్మా! పుత్రుం డుదయించిన పదిదినమ్ములకుఁ దండ్రి కర్మయోగ్యుఁడగుఁ దల్లి మాసమ్మునకు శుచియగు యాగమ్మునకు దంపతులు ముఖ్యులగుట సర్వసమ్మతం బనవుడు వరుణుండు మాసానంతరమ్మున వచ్చెదనని చెప్పి చనియె; నంత హరిశ్చంద్రుండు పరమానందమ్మున విప్రులకుఁ గోట్లకొలఁది గోవులను దిలపర్వతమ్ములను హేమరాసులను నొసఁగి యాత్మజునకు రోహితుండను నామంబిడి పుత్రవదనసందర్శన జనితానందపరవశుండై యుండునంత మాసమ్ము పూర్ణంబగుడు, వరుణుండెప్పటి యట్ల విప్రుఁడై యరుదెంచి యజింపుమనుడు నృపాలుండు దుఃఖసాగరమగ్నుండై యతనికి నమస్కరించి కృతాంజలియై యిట్లనియె. 371

క. పావనమయ్యెన్ వదనము, దేవర రాఁబట్టి మఖవిధికిఁ బసిబాలుం
దేవిధి నర్హుఁడు దంత, శ్రీవెలయని పశువు శ్రుతినిషిద్ధముకాదే. 372

వ. కావున దంతోదయంబుగా వేగమ క్రతువొనర్తు ననుడు నంగీకరించి యతం డరిగెఁ; బిమ్మట నంతసమ్మునఁ గొంతకాలంబు గడపి నృపాలుం డున్నంత దంతోదయం బగుట యెఱింగి వరుణుండు యథాపూర్వకమ్ముగఁ గ్రతు వొనర్పుమని వచ్చె; నంత హరిశ్చంద్రుండు నిర్వర్తిత సత్కారుండై యతనికిట్లను. 373

గీ. అకృతచౌలుండు గర్భకేశాన్వితుండు, సమ్మతుఁడు గాఁడనుట వృద్ధసమ్మతంబు
గావఁ దత్కృతి నెరవేర్చి క్రతు వొనర్తు, నీ వెఱుంగని ధర్మ మెందేనిఁ గలదె.

వ. అనుటయు. 375

క. తెలిసి వరుణుండు వన్నుం, బలుమఱు ద్రిప్పెదవు కపటభావంబడిపీ
కలవడియె నాత్మజాని యం, దలి మోహము వి న్నసత్యతత్పరుఁ జేసెన్. 376

వ. కేశఖండానంతరమ్మునఁ గ్రతువొనర్పవేని దారుణంబగు శాపమ్మునాచే నీ కిఁబడు నింత నిక్కువ మని చెప్పి మఱియు నిట్లనియె. 377

క. జనవంద్యుం డిక్ష్వాకు నృ, పుని కొలమునఁ బొడమి వ్యర్థపుం బల్కులు గ
ల్గినవాఁ డితఁడనియెడి కీ, ర్తిని జెందకు పోయిపత్తు నృపతివతంసా. 378

వ. అనిచెప్పి యప్పటికతం డరిగె. భూపాలుండును సంతుష్టాంతరంగుండై యుండెఁ బదింపది కొండొకకాలంబునకుఁ గొమరుండు జాతకరణయోగ్యుం డగుడు దత్కార్యార్థంబు గృతప్రయత్నుండై. 379

క. తానును భార్యయుఁ బొదపై, సూనుని నెంకొల్పి మిగుల సోషప్పెంతన్
శ్రీ నెగడ నున్నతఱి వి, ప్రానుగతిన్ వరుణుఁ డచటి కరుదెంచి యనున్. 380

వ. రాజేంద్రా! జాతకరణంబు నిర్వర్తింపుమంటివి వికఁ గొఱఁతచేయుచున్నయది; మఖం బొనరింపుము నావుడు హరిశ్చంద్రుండు గృతనమస్కారుండై యతని కిట్లను. 381

చ. ఇపుడ యొనర్పు టర్హమని యేను నెఱుంగుదు నప్లానస్తు యా
గపశువుగా నొనర్పఁగఁ దగం డితఁ డాగమసంస్కృతిన్ ద్విజ
త్వపదవి నొందకుండిన కతమ్మున; మూఁడగుజాతకుం డెయుఁ దా
రుపనయనంబు లేమిఁ జరణోర్వప్రతుల్యులు కర్మబాహ్యులున్. 382

వ. కావున శూద్రప్రాయుండగు నిక్కుమారుని యాగపశువుగా నొనర్పుటకు శంకింతు నుపవీతుం డగునాఁడు నీయభీష్టంబు నెరవేర్తు రాజుల కేకాదశవర్షమ్మునను బ్రాహ్మణుల కష్టమవర్షమ్మునను వైశ్యులకు ద్వాదశాబ్దమ్మునను నుపనయనంబు విధిచోదితం బనుగ్రహించె దేవిఁ దత్కాలాన్తరమ్మున యాగంబు విధియుతంబుగ నొనరింతు నా వచనంబు సత్యమ్ముగ నమ్ము మిప్పటికి పెంచేయుమనుడుఁ బ్రసన్నవదనుండై వరుణుండు దనపురమ్మున కరిగె; నంత నృపాలుండును బుత్రుని కతనఁ బరమానందమ్మున గాలయాపనం బొనర్పుచుండె. 383

క. వదపడి యబ్బాలునకున్, బదియేడులు వోవ దెంతెఁ బార్థివుఁడు మ్మె
మ్మదిఁ జింత గదలుకొనఁగాఁ, బదునొండవయేటఁ దగు శుభదినమునందున్. 384

వ. ఉపనయనంబు యథోక్తంబుగ నొనర్చి యున్నంత వరుణుం డరుదెంచి మఖం బొనర్పు మనుడు రా జిట్లనియె. 385

క. దేవా కొమరుం డుపనయ, పావితుఁడై యొప్పె మఖము పచరించెదఁ గా
నీ వేఁడికొనెద నిమ్మ న, మావర్తనకర్మ మొలయునంతకుఁ దాళన్. 386

క. అప్పుడు నీ మాటకుఁ బ్రతి, చెప్పన్ దయచేసి పాదసేవకునిఁ గా న
న్నిప్పాట గారవింపుము, యప్పతి! యన నతఁడు కోపియై యిట్లనియెన్. 387

గీ. ఆమయనివృత్తి పొందె నిన్నడఁప నెంచు
తండ్రిఁ గననేగ నేల ? యతండు మృతిని
జెందు విమ్మట నరిగి యానందమెసఁగ
రాజ్యభారమ్ము వహియింపరాదె నీకు. 394

వ. అని బహుభంగుల వాసవుండు నిషేధింప నివర్తితగమనుండై రోహితుండు మఱియు నొకవత్సరమ్ము దమక నవ్వనమ్మునన యుండి పదంపడి తండ్రియుత్కంఠ దుఃఖమ్మున మున్నవాఁడని విని మరణమ్మునకుఁ గృతనిశ్చయుండై గమనోన్ముఖుం డగుడు బ్రాహ్మణరూపమ్మున వాసవుండు యథాపూర్వముగా నేతెంచి యుక్తివచనమ్ముల వారించెఁ బిమ్మట. 395

క. భూతలపతి రోగమ్మున, నాతురుఁడై గురు వసిష్ఠుఁ బ్రార్థించినఁ దా
నాతఁడు చెప్పె నుపాయము, క్రీతునిచే సుఖము జెందు కృతకృత్యుఁడవై. 396

వ. వేదవిదు క్రీతుని దశవిధపుత్రులలో గణియింతురుగావున వరుణుం డిక్రతమునఁ బ్రీతుండై శాపమోక్షణంబొనర్చునని వెండియు, 397

క. తపములు వ్రతములు దానము, లపరిమితముగా నొనర్చి యాత్మజుఁ గని లో
భపరీతుండై యెవ్వడు, కృపలేక వ్వాని మఖము నెనయ వధించుఁగా ; 398

వ. పదంపడి వల్లెయని నృపాలుండు క్రయక్రీతుండగు కొమరుం దెమ్మని మంత్రిని నియోగించిన నతం డెల్లెడ నరయునంత నజీగర్తుండను బ్రాహ్మణుండు ధనహీనుం డొక్కరుండు పొడగట్టె : నతనికి శునఃపుచ్ఛ శునశ్శేఫ శునోలాంగూలు రనువారలు మూగురు కొమరులు. 399

ఉ. అతనిఁ జూచి మంత్రివరుఁ "డగ్రకులోద్భవ ! మానృపాలకుం
డాతురుఁడై రుజాపహృతికై వరయాగము సేయ నీతనూ
జాతులలోన నొక్కరు నొసంగెదె ? గోశతమున్ గ్రహించి వి
క్రీతునిఁ గాఁగ" నా ; నతఁ డొగిన్ ధనహీనతఁ జేసి ప్రీతుఁడై. 400

వ. లోభమ్మున నొక్కరు నమ్మం దలఁచి యంతఁ గార్యాధికారియగు కతన జ్యేష్ఠ నీనేంక కనిష్ఠు నీనెంచుకఁ దల్లి "నాకు వీనియందుఁ బ్రేమం బగ్గలం" బనియె, నంత మధ్యముండగు శునశ్శేఫు నొసంగిన మంత్రి యతని గొని నృపాలున కిడియె. 401

మ. తనదేహమ్మున కన్యదేహమున విత్తం బిచ్చి పాపాత్ముఁడౌ
జనకుం డీఁగొని వమ్ముచేసి యశమున్ సాధింపఁగా నేల ? యీ
జననింద్యమ్మగు కృత్యమున్ విడు హరిశ్చంద్రావనీపాల ! యెం
దును బుణ్యం బనుకంప, హింసమిగులన్ దోషమ్ము మున్నాటికిన్. 413

గీ. సర్వభూతములందును సమత గలిగి
యింద్రియోపరమమ్మున నెసఁగువాని
కఖిలసుఖములు నొసఁగు నద్యంతరాత్మఁ
డిట్టి దుష్కృతి సౌఖ్యమొందేని యిడునె ? 414

చ. బ్రతుకుట యిష్టమెల్లరకుఁ బార్థివ ! నీవలె నీనికిన్ స్వకీ
యతనువునందుఁ బ్రీతియగు టబ్బురమే ! సకలంబు నాత్మవ
న్మితముగఁ జూచు పూరుషుఁడు మేటి ; పురాతనవైరమేమి నీ
కితనికి లేదు నిక్క, మితఁడే యపకారమొనర్చె నక్కటా. 415

క. జనుఁ డెవ్వఁడు విపరా, ధుని దున్మన్ వాఁడు పాపిలొల్లిటి కృత్యం
బును మఱవక రాఁబోవు జ, ననమునఁ బలపట్టి చంపు న్యాయ్యంబగుటన్. 416

క. అకటా ! యెంతటి దుష్టం, బౌకదా ! ద్రవ్యంబునన్ గతున్ శోకము పూ
వి కపినసుతుఁ గనికరము గ, నక చంపఁగ నొప్పుఁ దజ్జనకుఁడు ద్విజుఁడై. 417

క. పలువురఁ బుత్రులఁ గనఁదగు, నెలమిన్ గయ కేగు నొక్కఁడేనియు యాగం
బులు సేయు, వృషము విడుచున్, సలలితమగు గతిని తనకు సంపాదింపన్. 418

క. అను ధర్మమ్ములు వమ్ముగ, జనకుం డిటు సేయు బొప్పె ? జనవర ! దుష్టా
త్ముని నీతని శిక్షింపఁగఁ, జనదే ? పాపంబు సైప జనపతి తగునే. 419

ఉ. ఏ నృపుదేశమందూ వసియించుజనుం డొనరించుఁ బాప మ
ద్దానను షష్ఠభాగమును దన్నరనాథుఁడు వొందు ; నుత్తముం
డైన త్రిశంకుభూమిపతి కాత్మభవుండవు పుత్రుఁ జంపు ని
వ్వానికి ద్రవ్య మిచ్చి రవివంశమునం దపకీర్తి గూర్తువే. 420

క. మ విప్రసుతుని విడువుము దు, ర్జనుని నజీగర్తు శిక్ష సలుపుము వాడై
న నియోగం బొనరింపుము, మనుపతు నీదేహమం దపారసుఖమ్ముల్. 421

చ. జనవర ! నీదు తండ్రి గురుశాపము చెంది శ్వపాకుఁడయ్యు నా
పనువున బొందితోఁ జనె దివంబున, కాయుపకారకారణ

జనకత తంత్రియం దెడలి సంగతమయ్యె నృపాలునందు ; యా
పవియతుఁగా నొనర్చుటను బార్థివుఁ డట్టిఁడ నాఁగఁ జెల్లెడిన్. 442

ఉ. వరుణుఁడు దమ్మ మాటికి న్తవంబొసరించుటఁజేసి వీని నా
దరమునఁ గాచె నాతఁడును దండ్రి యనం దగఁ, దెవ్వనిన్ మతిం
తురు మతి వాఁడొసంగు ధనతోషపశుప్రభుతాది సంపదల్
పరమను బ్రాణమున్ దన కపారముగా ముద మబ్బెనేనియున్. 443

గీ. ప్రాణసంకటమునఁ గృపాపరత వీర్య, వంతమగు మంత్ర మిచ్చి కాపాడె నెవ్వఁ
డతఁడు కౌశికుఁ డీతనిపిత ; సుమతుల, సమ్మతం బిది నావుడు సభ్యులెల్ల. 444

క. ఇది ధర్మం బని మదివిన, సదయుండై గాధిజుండు జనకుండై "ర
మ్మిది మొదలు నాగృహమ్మున, బొదలుము నాపుత్రులందుఁ బుత్రుఁడ వగుచున్".

వ. నావుడు శునశ్శేపుండు గౌశికువెంట నరిగెఁ, బదంపడి వరుణుండు తనభువనమ్ము
నకుఁ జనియె, ఋత్విజులును సభ్యులును దమతమ యిండ్లకు నేగిరి. 446

గీ. ఆ హరిశ్చంద్రభూపాలుఁ డామయంబు, వాసి కృతకృత్యుఁడై ప్రజాపాలనం బొ
సర్చె రోహితుఁడు విని జనకునికడకు, వచ్చె దుర్గమమైన యవ్వనము విడిచి.

ఉ. తనయుని రాక చారులు ముదమ్మునఁ జెప్పఁ ద్రిశంకుపుత్రుఁ డం
త నెదురు వచ్చె, రోహితుఁడుఁ దండ్రికి దండము వెట్టి దండరీ
తిని బదయుగ్మసన్నిధి నతిప్రతిపత్తిని లేవకున్న నం
దను నొగి లేవనెత్తి ప్రమదమ్మునఁ గౌఁగిటఁజేర్చెఁదండ్రియున్. 448

క. మలినెత్తుని బాష్పమ్ములఁ, దలఁ దడుపుచు మూర్కొనుచున్ ముదమ్మున నంక
స్థలమున నిడికొని మోమున్, బలుమఱుఁ గనుఁ గుశలమడుగుఁ బార్థివుఁడు సుతున్

క. నరమేధయాగవృత్తం, బరిదిగఁ బుత్రునకుఁ జెప్పి యన్నరవరుఁ డా
దరమేదురుఁడై రాజ్య, స్థిరుఁడై జగ మేలుచుండె ధీయుత మెచ్చన్. 450

వ. పదంపడి హరిశ్చంద్రుండు. వసిష్ఠుండు హోతగా రాజసూయం బొనర్చి యతని
నెక్కుడు పూజనమ్ముల గారవించె. 451

ఆ. వె. యాగపరిసమాప్తి యగుచోఁద నొకనాఁడు, శక్రసదనమునకుఁ జనె వసుంధ
రీమనోహరుండు తవిరి గాధిజుఁడును, నటకు వచ్చె సిం దు వరయువింతె.

## వసిష్ఠవిశ్వామిత్ర సంవాదము.

వ. ఇట్లిరువురును నొక్కెడఁ గూర్చుండి యుండునంత విశ్వామిత్రుండు హరిశ్చంద్ర దత్తబహుమానభాసురుండగు వసిష్ఠుం గాంచి విస్మయమ్మున నీ కీ యద్భుతంబగు పూజ యెవ్వం డొనర్చె నాడువు మన నతండు సంతోషపూర్వకంబుగ నిట్లనియె.

ఉ. చంద్రసమానసద్యశుఁడు సత్యవచోనిరతుండునౌ హరి
శ్చంద్రుఁడు మాకు శిష్యుఁడు ప్రశస్తగుణుం డతిదాత యస్యరా
జేంద్రులు సాటి రా రతని యాగికి మున్న యొనర్చె దక్షిణా
సాంద్రము రాజసూయమను సత్క్రతు వట్టిదె నిట్టిసత్కృతుల్. 454

గీ. సత్యవాదుల దాతల శౌర్యపరుల, ధర్మవంతుల నెంచ భూతంబు మొదలు
మూఁడు కాలమ్ములందు నీరేడుభువన, ముల హరిశ్చంద్రునకు సాటిగలరె నృపులు.

వ. ఇట్లు వసిష్ఠుండు హరిశ్చంద్రు గుణాతిశయం బుగ్గడించిన నసూయాగ్రస్తుండై గాధి జుండు కోపసంరక్త లోచనుండై యిట్లనియె. 456

క. కపటప్రియు మిథ్యావా, దపరాయణుఁ బెద్దఁజేసి తద్గుణ మతి చే
సి పలుకఁ దగవే యాతఁడు, నెవఖుని వంచింప లేదె పీరాధిపునిన్. 457

చ. పలుకుల కేమి! యానృపునిఁ బందెముపెట్టి యసత్యవాదిగా
బలునిఁగ దాతగామిగ నికామ మొనర్పఁగలాఁడ నిట్లు నే
పలుపనయేని నాదయిన సంచితపుణ్యము రిత్తవోవు ని
ట్లలవడఁ జేయఁ జాలవపు డల్లగునే భవదీయ పుణ్యమున్? 458

వ. ఇట్లన్యోన్య సంభృత సుకృతమ్ములు పణమ్ముగా వివదింపుచు వమ్మునివరులు నాకమ్ము విడిచి వ్యాశ్రమమ్ములకు వచ్చి యున్నంత నొక్కనాఁడు హరిశ్చంద్రుండు వనమ్మునఁ గ్రుమ్మరువాఁ డొక్కెడ, 459

క. ఘోరవ నేడ్చెడి యొక యం, భోరుహపత్రాక్షిఁ జూచి పొడమిన కరుణా
ఘోరవనమ్మున నిటు లే, కారణమున నిరికి యెవఁడు కాంతుఁడు పీకుణా. 460

క. క్రూరుండు రాక్షసుండుణా, నారాజ్యమునందు లేఁడు వాతిరో! నీ దుః
ఖారంభమ్మున కెవ్వఁడు, కారణము వచింపు వాని గండడఁగింతున్. 461

చ. ... ను నరపాలువాక్యముల కచ్చెలి యుత్తర మిచ్చె నిట్లు రో
దవజనితాశ్రువుల్ వదనతామరసమ్ము వలంకరింప "నో

జనవర ! గాధిజుం డనెడి సంయమి నన్నును గాన వెట్టి నా
తని తపమున్ మదర్థ" మనఁ దన్నుఁ బాపెఁడు వాని కిట్లనన్. 462

వ. నీవు స్వస్థచిత్తవై యుండుమని, యేను భవత్ప్రాణాయత్తుండనై తపంబొనర్చు నమ్మౌని నిప్పుడ వారింపవాఁడనని యారాత్రి విశ్వామిత్రు నాశ్రమమ్మునకరిగి నమస్కరించి వినయమ్మున నిట్లనె. 463

ఉ. ఏల తపం బొనర్చెదు మునీంద్ర ! వృథాగతి దేహపీడయుం
బోఁడిమి సంయమీంద్రులకుఁ బొంకక తెల్పుము నీ మనోర్కె ! భూ
పాలన మే నొనర్పు తఱిఁ బాపము లిద్దఱి లోకపీడ కీ
లీలఁ దపం బకార్యము మగు టెమ్మది నెన్నుమ. పూరుషార్థమా ! 464

వ. హరిశ్చంద్రుం డిట్లు వారింప నప్పాటు విడిచి విశ్వామిత్రుండు తపం బుడిగి సంభృతక్రోధుండై యుండెను గడుగుచు, 465

క. దినమునఁ దాను వసిష్ఠుఁడు. వినిపించుటయును దపంబు విఘ్నంబును హే
మనృపులఁగఁ గోపము హెచ్చఁగ, నవనీపాలునకు వంచనాధాయకుఁడై 466

వ. ఒక్కదానవుని సూకరంబుగా నొనర్చి పనిచిన నదియును హరిశ్చంద్రు నుపవనంబు జొచ్చి రక్షకుల భయపెట్టి కదంబమాలతీ యూథికాదులం గవలంజేయుచుఁ బుడమికి దంతాఘాతంబు లొనరఁ జంపక కేతకీ మల్లికాదుల నున్మూలించుచుఁ గనవీరో శీరంబులం ద్రవ్వుచు మునుకుందాశోక తిలక వకుళంబుల రూపుమాపుచుఁ గదనం బొనర్చునంత మాలాకారులు గొండొక పోరాడి శరంబుల పఱఁగించినఁ దలంక కున్కి యిది కేవల సూకరంబు గాదని యుఁ గాలరూపమ్మున నిట్లెవ్వండేని రాఁ బోలు నని యుశంకించుచుఁ బలాయనం బొనర్చి శరణాగతులైన నృపాలుండు వారల కిట్లను. 467

ఉ. ఏమి భయమ్ము చెందుటకు హేతువు ? దేవతలో, మనారులో !
భూమి నెవండు నాకును రిపుండు వచించుఁడు వాని నింతలో
నేమముమై వధించెద నవిన్ వధ నొక్కఁడె దెబ్బవాఁడె ! త
ద్ధామము రూపుఁ దావునగుణమ్ములు నన్ వివరింపుఁడింతకున్. 468

వ. నావుడు మాలాకారు లిట్లనిరి. 469

చ. దివిజుఁడు గాఁడు రక్కసుఁ డుదీర్ణబలాఢ్యుఁడుఁ గాఁడు దేవ ! పు
ష్పవనములెల్లఁ గూల్చె నొకపంది తదీయబలంబు చెప్పఁగా

నప్పుడె? యెదిర్చి పై విడుచు నమ్ముల క్రొచ్చియు నార్చి పేర్చి ధీ
తి వడఁగఁజేసె మమ్ముఁ; జని తీర్పుము దానికడంబు నాపుడా. 470

వ. హరిశ్చంద్రుండు వాహనంబునెక్కి సైన్యావృతుండై పరంబున కరిగి మున్ముట్టించు నక్కోలంబు దొడవృంలంగాంచి దానిచే విశీర్ణంబులై పడియున్న యారామపుంజ మ్ముల నరసి సంజాతక్రోధుండై. 471

క. కడుకొని ధనువున బాణము, వొడిగి యెడపు నమ్మువాపి దుడు కడఁపఁగ నె
క్కుడు రయమున విడిచిన నది, తడయక పరుగిడియె మదిఁ భయపడి దలఁపన్.

క. ఈగతి నాఱుగమునకున్, లోఁగక గికురించి వనములోఁ జొచ్చెను మ
ర్యాగడపుటడవిపందిన్, రాఁగని కోపించి చేసెఁ దర్పము నృపుఁడున్. 473

ఉ. కొండొకపేపు గన్పడును గొండొకపే పెడమై యదృశ్యమై
గండునఁ గ్రుమ్మరుం దదయుఁ గ్రాలఁగనొకానొకచోట నార్చుచు
ద్దండముగాఁగ నొక్కమెద; దాని పిఱుందన వాజి నెక్కి భూ
మండలనాయకుం డరిగె మానని కోపభరంబు పెంపునన్. 474

క. రయమునఁ బఱచెడి కోలము, నెయిదఁగ నరపాలుఁ డిట్టు లేగినఁ దవ్వే
న యదా యదలు పడాపడ, నయి యాహాపాల నెయిక నటునిటు చెదరెగా. 475

ఉ. ఆనరపాలమూర్తి యిటు లక్కిటి వెంట సదిజ్జుబాపుఁడై
సేనకుఁ బాపి యేగి వనసీమలు పెక్కులు దాఁటి సంగత
గ్లానివిదూనమానసుఁ డఖండపిపాసకుఁ దంతఁ గాంచె న
క్కావనమధ్యమం దతులకాంత మనోహరమైన యేఱుగన్. 476

వ. కాంచి తత్తీరమ్మున వాహనమ్ము డిగి జలమ్ముల ద్రావి శ్రమించి యికఁ గోలమ్ము నరయరాదని కృతనిశ్చయుండై దిగ్భ్రమంబు దొడరఁ నగరంబున కెట్లు లేగుదునని యోజించుచున్నంత వృద్ధబ్రాహ్మణరూపమ్మున విశ్వామిత్రుఁ డటకరుదెంచిన నతనికి నమస్కరించుటయు నతండు స్వస్తివచనపూర్వకముగ నిట్లనియె. 477

క. ఏమిది యొక్కఁడవై యీ, భూమికిఁ జనుదెంచితివి నృపుఁడవయ్యును నీ
కేమి పని యిబ్బె విచట న, యోమయ మివ్వనము మనుజు లుండరు దీనన్. 478

వ. అని యడిగిన హరిశ్చంద్రుం డిట్లనియె. 479

ఉ. కోల మొకండు వచ్చి సుమకుంజములం బడఁగొట్టె వేడ్తెఱఁగా
బాలవనమ్ములోఁ దిరుగఁ బోణిమి దక్కి యెదిర్చి రక్షకుల్

దోంగ లేక నాకడకుఁ దోరపుభీతిని నేఁగుదేర నే
నోలి వధింప వచ్చి శరమొందు విగుర్వితి నంత నద్దియుఁగా. 480

## విశ్వామిత్రుండు హరిశ్చంద్రుని వంచించుట.

వ. పరుగిడిన దానివెంటఁ జటితెంచి యిట కరుదెంచితి సైన్యం బెటకేగెనియుం
జనియెఁ గోలం బెటకేగెనో యెఱుంగరాదు క్షుత్పిపాస లధికంబుగ బాధించుటఁజేసి
నగరమ్మున కరుగ నెంచిన దిగ్భ్రమణం బొదవి మార్గంబుఁ దెలియదు. కరుణించి
తెరువెఱింగింపుమని మఱియు నిట్లనియె. 481

మ. అదియా నన్నెఱుఁగంగఁ జెప్పెద నయోధ్యానాయకుండఁగా నత
త్కీర్తిమాన్యుఁ డగ రాజసూయము మొదల్ జన్నమ్ములంజేసి ధా
త్రీకీర్తిఁగా జగమెల్ల నేలెడి హరిశ్చంద్రుండ నా తోడ నా
పురి కే తెంచితివేని నిష్టధనంబుఁగా నీకు నే నిచ్చెదన్. 482

వ. తద్వచనంబు నంజేసి జన్నంబొనరింపఁ గొంకువుగాక నావుడు విశ్వామిత్రుండు నగి
హరిశ్చంద్రున కిట్లనియె. 483

చ. ఇది యొక పుణ్యతీర్థము మహీశ్వర ! యిం దవగాహనం బొన
ర్పఁదగుఁ బితృప్రియం బొనరఁ బంపగుఁ దర్పణ మాచరించి యీఁ
గఁదగు స్వశక్తి కిట్లుఁ త్రిజగంబులు మెచ్చఁగ దానధర్మముల్ ;
"సనిఁగని యూఱఁబోయిన జనంబులు చెందు దురాత్మహంతృతన్." 484

వ. అను మునివచనంబు వినవే ? యమ్మేర స్నానంబు సలిపి నీకుఁ దోఁచినయది నా
కిచ్చితివేని దాన సంతుష్టుండనై కొంకోకనేఁ వచ్చి మార్గంబుఁ గనఁజేయువాఁడ,
ననవుడు నృపాలుండు దక్కపట వచనంబుల గల తెఱంగెఱుంగక కృతోద్యముండై
యన్నదినిఁ గ్రుంకి పితృతర్పణంబు సలిపి కపటాకారుండగువావృద్ధున కిట్లనియె.

ఉ. దాన మొసంగువాఁడ విదితంబుగఁ గైకొనుమయ్య నీకు నే
దేని యభీష్ట మయ్యదియు నిచ్చెదఁ గాంచనమో గజాశ్వసం
తానమొ భూమిఖండమొ ధనంబులొ భూషలొ గోవులో మహో
ద్యానములో సతీమణులొ తక్కిన వెయ్యవియేని దేయముల్. 486

క. మును రాజసూయమున సమ్మునిసన్నిధియందు సకలమును గోరిన లే
దన కిత్తు ననుచు వ్రతముం, గొనియుంటి మహాత్మ ! నీదుకోరిక చెపుమా. 487

క. అనఘుఁడవు నీవు తీర్థం, బను బావన మిది, యొసంగఁబోలదె నీకో
రిన కోర్కె, నాదు ప్రతినన్, మునిజను లెల్లరును సత్యముగ గణియింపన్. 488

చ. అన మునినాథుఁ డిట్లను నరాధిప! యంతటివాఁడవౌదు స
జ్జననుతమైన నీయశము చాటుదు రెల్లరు సూర్యవంశసం
జనితుఁ డుదారధీరుఁడు త్రిశంకుని పుత్రుఁడు తాదృశుండు లే
డనుచు వసిష్ఠమౌనియును నాడఁగ వింటి నతండు బొంకునే. 489

క. దాతవు సకలధరిత్రీ, నేతవు నీకొండు కోరదమె నృప! నాదుతనూ
జాతునకుఁ బెండ్లి సేయు మ, నేతాదృశమైన కీర్తి నెనయుము పేర్మిన్. 490

వ. అని గాంధర్వమాయావశమ్మున దశవార్షికి యగునొక కన్నియను, సుకుమారుం
డగు నొకకుమారుని దెచ్చిచూపి వీరివధూవరు లిక్కార్యమ్ము రాజసూయాదిక
పుణ్యప్రదమ్మనిచెప్పిన రాజట్లకాక యని యంగీకృతిం దెలిపి యవ్విప్రప్రదర్శిత
మార్గమ్మున స్వపురమ్మున కరిగె, మునియు నటనుండి ప్వాశ్రమమ్మునకుఁ జని
కృతోద్వాహుండై వచ్చి యగ్నిహోత్ర శాలాస్థితుఁడగు హరిశ్చంద్రుంగని యిమ్మది
మంటపమయ మ్మీ వేదీమధ్యమ్మునన నాకు మున్నిచ్చెదనని చెప్పినదానం బొసంగ
వలయు నని కోరుటయు వదాన్యశేఖరుండగు నాన్నృపాలుం డిట్లనియె. 491

ఉ. ఆరయ నీవు బ్రాహ్మణుఁడ వంతయు నేలెడిరాజ నేను సం
సారికి నెంతయుండిన యశంబునకుం గొఱగాకయున్న ని
స్సారము కాదె దానిదగు జన్మము? ద్రవ్యము శాశ్వతంబె? నీ
కోరిన దేదియేనియును గొంకక యిచ్చెదఁ గోరుకొమ్మిగిన్. 492

మ. అన విప్రుండను నట్టిదాతవె నరేంద్రా! నీయశం బింతక
న్నను నందందుఁ బొగడ్త కెక్కి జగదానందంబు నందింప నీ
ఘనరాజ్యం బఖిలంబు నేస్గుల తురంగంబుల్ మొదల్ సంపదృ
ద్ధి నొసంగం గదవయ్య నీవిటులె వేదీమధ్యమందుండఁగన్. 493

వ. అని కోరిన హరిశ్చంద్రుండు మాయామోహితుండై నీయడిగినట్లె యిచ్చితిననియె
గాధిజుం డయ్యది గ్రహించి యిట్లను. 494

క. దానం బిచ్చితి దానన్, మానక ముప్పొంగె "దక్షిణారహితంబౌ
దానము వ్యర్థం" బనియెడి, మానవధర్మంబు వినవె మానవనాథా. 495

క. మన మూఁడుకాయములు గా, క నిఖిలరాజ్యంబు వివిధకరితురగములన్
ధనధాన్యములను నిమ్ముని, జనమౌళికి నిచ్చినాఁడ సంతోషముగన్. 507

వ. కావున నిఁక మనమిచ్చోట నుండు టనుచితంబు వెడలుండని నిర్గమించు నమ్మహీ
పాలునివెంటఁ గొమరుండును భార్యయును జింతాక్రాంతులై సప్రపవనమ్ములతో
నరిగి, రళ్లు కట్టుగుడ్డలతోఁ గదలు వారల యవస్థం గాంచి. 508

ఉ. పౌరజనమ్ములెల్లరు నపారకృపారస మొల్క "నక్కటా!
ధీరుఁడవయ్యు నించుకయుఁ దేఁకువ లేక మునీంద్రుమాయయన్
దారుణపాశముం దవిలి దైన్యము నొందఁగ నయ్యెనే? దురా
చారుఁడు ధూర్తుఁ డెంతపని సల్పె ధరామరుఁ" డంచు బోరనన్. 509

వ. అమ్మునీంద్రు నిందించుచు దుఃఖాక్రాంతులై యున్నెడ భార్యాపుత్ర సహితమ్ముగఁ
గదలి పురంబు వెలువడినఁ బిఱుందన చని నిలువరించి గాధిజుండు నిష్ఠురమ్ముగ
నిట్లనియె. 510

చ. జనవర! దక్షిణం దగ నొసంగు మొసంగుట కిచ్చ లేనిచో
"నన" యనిపల్కు మట్టులయినన్ నిను నేనడుగన్ సమస్తముం
గొనుటకు నిచ్చయేని యదిగోఁ గొను మిచ్చెదఁ గానిచోఁ బ్రతి
జ్ఞను జవదాఁట కిమ్ము కనకమ్మును దక్షిణకై యథామతిన్. 511

వ. అని ప్రాణగొడ్డమ్ముగఁ దవిలిన యమ్మునీంద్రునకు నమస్కరించి దీనాస్యుండై
యంజలి ఘటించి హరిశ్చంద్రుఁ డిట్లనియె. 512

ఉ. వారక దక్షిణం బది యవశ్యము నీఁదగు, నిచ్చికాని యం
భోరుహమిత్రువంశమునఁ బుట్టియు మెచ్చుగ రాజసూయమున్
పారగతిం బొనర్చియు యశమ్మున మించిన దాతనయ్యు నే
నేఁటి వన్నముం దినఁగ నిచ్చమొనర్తు జగంబు నవ్వఁగన్. 513

వ. దక్షిణంబు దీఱుదనుక నే భుజింపనొల్లమియు నిశ్చయంబు కొంతకాల తాళితివేని
దైవానుకూల్యమ్మునంజేసి ధనంబు చేకుఱునది దక్షిణార్థంబుగఁ బ్రతిశ్రుతం బొన
ర్చిన కనకమ్మునకుఁగా నొసంగెద నావుడు ముని యిట్లను. 514

ఉ. వెడవెడ మాటలాడెదవు వీడఁడివే నరపాల! నీకు నె
క్కడ దొరుకున్ ధనంబు? ధనకారణమైన సమస్తరాజ్యమి

క. ఒకమాసమాత్రమె. నను మి, న్నికమాటలు చెప్పి త్రిప్పు న్యాయమె భూపా
లక ! పక్షిణ యిడి కదలుము, సకలంకంబైన కీర్తి సంపాదింపన్. 523

వ. నావుడు హరిశ్చంద్రుండు మహాత్మా ! మాసం బిప్పటికిని బూర్ణమ్ముగాలేదు దినా
ర్థం బింకను వ్యవధి యున్నది. యింతక ప్రతీక్షింపవలెనని ఋణవిముక్తుండ
నయ్యెదనని నమ్మిరి యిట్లను. 524

క. ఇపు డరిగి వచ్చెదను స. త్యపరత నపు డింకలంచ్చ సందకయున్నన్
శపియించెదనని యరిగెన్, గపట బ్రాహ్మణుఁడు నృపతి కళవళమందన్. 525

ఉ. అంతఁ ద్రిశంకుపుత్రుఁ డకటా ! యెటుచేయుదుని యప్పుడవిత్త ? శ్రీ
మంతులు మిత్రులందినను మానసుపక్కి వివుందనయ్యె నౌ
క్కింతకుఁ జేయిచాఁపుదునె ? వృత్తులు మూఁడు విధించె క్షత్రతా
క్రాంతులకెల్ల బ్రహ్మ ; యవిగాక మతొక్కటి ద్రొక్కఁజెల్లునే. 526

వ. ఇతని ఋణంబు దీర్పకయున్న మృతిచెందితినేని బ్రహ్మస్వాపహరణజనితదోష
మ్మున నధమాధమంబగు క్రిమిజన్మంబు సంప్రాప్తంబగుఁ, గాదేనిఁ బ్రేతత్వంబు
చేకూఱునట్లుం గాన నాత్మవిక్రయణం బొనర్పుటయ వరంబని యెంచి చింతాకులత్వ
మ్మున నధోముఖుండై దీనుండైయున్న పతికి సతి యిట్లనియె. 527

ఉ. జనవర ! సత్యవంతులకు సాటి మఱొక్కఁడు గాఁడు, సత్యవా
క్యనియతి దప్పి ప్రేతసముఁడై వెలిఁజెందు నరుండు ; వాని స
ర్వనియమముల్ వృథా, ఋతము పాలనసేయుము స్వర్గలోకసా
ధనమగు నెట్లు సత్య ; మనృతంబగు దుర్గతి కట్లహేతువై. 528

వ. నాథా ! యయాతి శతాశ్వమేధంబులొనర్చి పిదప రాజసూయకర్తయై స్వర్గమ్మున
కరిగి యొక్కపరి యసత్యంబాడి యథోగతికి వచ్చెనని వింటు మనుజులా జిట్లనియె.

గీ. యెద్దియో చెప్పఁదలఁచితి విందువదన !, వలుకుమయ్యది కొంకక బాలకుం డి
తండు వంశంబు వెగడింపఁ దగినవాఁడు, కలఁడు వెనుదీయ నెయ్యది కొఱఁతందు.

వ. నావుడు రాజపత్ని యిట్లనియె. 531

క. నరవర ! సంతానమ్మున, కరయఁగ సతి యట్టిఫలము నందితి వీఁక న
న్నౌరులకునమ్మి ధనామరు, ని ఋణము దీర్పంగఁ జనదె నిక్కలముద్ధిగా. 532

వ. అను శైబ్యవచనమ్ములకు దుఃఖాకులుండై. 533

చ. చెలి! దరహాసనంగతినిఁ జెన్నలరారెడి పల్కులెల్ల ని
మ్ములవిడనాడి నాహృదయముం గలఁగింపఁగ నిట్టివాక్యముల్
పలుకుట చెల్లునే? మృదులభాషము గల్గినదానవయ్యు న
న్నలయఁగఁ జేయుదే? విధికి నన్నెముఁ బున్నెము లేకపోయెనే. 534

వ. అని కరుణంబుగఁ బల్కు నన్నృపాలుంకు దారవిక్రయమ్మున కధీరుండై దుఃఖాతిరేకమ్మున మూర్ఛంజెందినంగాంచి యప్పతివ్రతయు. 535

ఉ. హా! నరనాథ! దైవమున కంతగ నెల్లిదమైతిమే? జగ
న్మానితులైన భూపతులు మన్ననఁజేయఁ జతుస్సముద్రము
ద్రానుగతంబు భూవలయ మంతయు నీమహనీయుఁ డేలు న
వ్వానికి నీకు స్థండిలముపై నిటు నెవ్వగఁ గూరు టొప్పునే.

ఆ. వె. కోట్లకొలది విప్రకోటులకిచ్చియు, క్షమము చేసి సత్యసంధుఁ డనఁగ
నెగడు నాదుపతికి నీకు నీదురవస్థ, యెట్లు గల్గె? నాకు నెఱుఁగఁ జెపుమ. 537

క. అనఘము నింద్రోపేంద్రుల, కెన యాతఁ డనంగఁ బుడమి నేలెడి ధర్మా
త్మున కీదుర్దశ గూర్పఁగఁ, జనునే! దైవమున కింతశంకయు వలదే. 538

క. అని పలుమఱుఁ గుందుచు న, వ్వనజానన మూర్ఛగూరి భర్తదరిన్ గ్ర
న్ననఁబడియె నిట్టికష్టము, చన దిఁక నెవ్వానికేని శత్రుండైనన్. 539

వ. ఇట్లిరువురును మూర్ఛం జెందియున్నయెడఁ గొమరుండు రోహితుండు క్షుధాకులుండై. 540

క. నాలుక యెండెడి నాక, బ్బా! లలి భోజనము నిడక ప్రాణము నిలువం
జాలదు, క్షుద్బాధకు నేఁ, దాళ ననుచు మొత్తుపెట్టుఁ దలిదండ్రులకున్. 541

గీ. అంతలో నంతకుఁడు వోలె నధికకోప, మడర గాధిజుఁ డేతెర నవనిపతికి
నధికమై తగె దుఃఖ; మట్లగునుగాదె, ఋణికి ఋణదాత క్రుద్ధుఁడై యెనయుపట్ల.

వ. విశ్వామిత్రుండును మూర్ఛంగూరిన యన్నరపాలునిపై శీతలోదకంబు చిలికి. 543

క. నరపాల! నీకు తాదిఁక, నఱలకు నెల్లరకునున్ ఋణము నీఁదెరువున్
బొరయనివారికిఁ గలయది, య రయముమై లెమ్ము వంచనాదృతిమేలే. 544

వ. అని లేపిన హరిశ్చంద్రుండు శీతలోదకసేచనమ్మున లబ్ధసంజ్ఞుండై క్రోధావిష్టుండును నంతకాపరాపతారుండును నగు నమ్మునింజూచి మగుడ మోహాయత్తుండగుడు ద్విగుణితక్రోధుండై తపసి నృపున కిట్లనియె. 545

ఉ. సత్యము దప్పవేనియు నొసంగుము దక్షిణ; సత్యహేతువా
దిత్యునితేజ, మియ్యవని తెల్లము సత్యమునంద నిల్చు, నా
దిత్యులలోక మియ్యెడఁ బ్రతిష్ఠితమైచను, సర్వధర్మముల్
సత్యమునంద పొల్చు, నొక సత్య మగుఁ శతవాజిమేధముల్. 546

ఆ. వె ఇంతయేల నాకు నిను దక్షిణకేగు, నంతలోన దక్షిణార్థమైన
కనక మిచ్చి పుచ్చుఁగా నేరవేని శా, పం బొసంగువాఁడఁ బార్థివేంద్ర. 547

## హరిశ్చంద్రుండు భార్య నమ్మికొనుట

వ. ఇట్లు పుయిలోదక నిష్ఠురమ్ముగఁ బల్కి యతండు సనిసపిష్టట దుఃఖాక్రాంతమగ్నులై దంపతు లిరువురును గుందుచున్నంత వేదపారగుండగు నొక్క బ్రాహ్మణుండు బహు విప్రసహితుండై యెటకేనియుం బోవుచుండ రాజపత్ని యాతనిం జూపి పతి కిట్లనియె. 548

ఉ. ఎక్కఁడు విప్రులం గలిసి యిట్లరుదెంచుచున్నవాఁడు దా
నొక్క మహీసురుం; దతనియొద్దకునేగి ధనంబు గోరినన్
దక్కక యిచ్చుఁ బుత్రులకుఁ దండ్రిధనంబు గ్రహించు టొప్పదే?
తక్కిన మూఁడుజాతులకుఁ దండ్రులకారె మహీసురోత్తముల్. 549

వ. అను సతికిఁ బతి యిట్లనియె. 550

గీ. క్షత్రియుఁడనయ్యు నేఁ బ్రతిగ్రహముకొఱకుఁ
జేయిచాఁపుట యెట్టు లిస్పీ! ప్రతిగ్ర
హంబు విప్రులసొమ్ము వర్ణంబులకును
వారు గురువులు పూజ్యులు వారిజాక్షి. 551

క. గురువుల యాచింపం దగ, దరయఁగ దానంబు యజన మధ్యయనంబున్
శరణాగతరక్షణముఁ, బరమంబులు క్షత్రియులకుఁ బరిపాలనముఁ. 552

గీ. "దేహి" యనుమాట పలవదు దేవి నాకుఁ
గలుగుఁగాక "దదామి" యఁ పలుకు, తెచ్చి
యెట్టులైనను నిమ్ముని ఋణము దీర్తు:
నడుగుటకు నొండు గలదె యెందైనఁ గస్తి? 553

వ. నావుడు రాజ్ఞి యిట్లను. 554

క. సమవిషమకాలముల యో, గమునఁ జూనం బమానకతయుఁ దాతృ
త్వము యాచకత్వమును నివి, క్రమమున నొదఁగూడుఁ గాలగతి వాఙ్యంచే. 555

క. కాదేని ధర్మలతకున్, బాదులు బ్రాహ్మణులు ద్రోహపరులై క్షత్రిఁ
ద్వాదృశుఁ ద్రోయుదురే? మ, ర్యాదాస్థాలిత్యములు సమయుచోఁ జితముల్. 556

చ. అనుసతి కిట్లు వల్కె "జలజాననః వాఁడి కరాసిఁ బూని గ్ర
క్కున రసఁ జా సుఖం బలరఁ గోసికొనం దగుఁగాని యొక్కనిం
గని ధనలోభమూని యడుగంగమకింతునె "దేహి" యంచు, రా
జునకుఁ ద్రిశంకుపుత్రునకు శూరున కింతటిదైన్య మొప్పునే. 557

వ. కావున నెట్టైన భుజవీర్యార్జితంబగు ధనమ్మొరుల కీయన యభిలషింతుంగాని యాచ్ఞాదైన్యం బొల్ల" నమదు నప్పతివ్రతాశిరోమణి యిట్లనియె. 558

ఉ. అమ్మిన నార్పినఁ జా మఱియు నంచల మెక్కఁగఁ జేసినఁ జా వివా
హమ్మునఁ గొన్నభార్య దగు నన్నిటికిన్ నరపాలః యాజ్ఞకుఁ జా
సమ్మతి లేనిచో నను యశమ్మునకై తెగనమ్మి వచ్చు మూ
ల్యమ్మును నిమ్మువీంద్రుని ఋణార్థముగానిడు మింత యొప్పదే? 559

క. అను సతిపలుకులు విని యా, జననాథుఁ డఖండదుఃఖసాగరమునఁ గ్ర
న్నన మున్గి యింతకష్ట, మ్మనకుఁ జా నే నొప్పు చెట్లు పూర్ణేందుముఖీ. 560

వ. అవిన నోదార్చి యమ్మగువ మరల నిట్లనియె. 561

గీ. ద్యూతహేతువు మద్యహేతువును రాజ్య, హేతువును భోగహేతువు నెఱుఁగ కకటః
సత్యసంరక్షణమునకు సాధ్వి నమ్మఁ, దగదె నీవంటి యుత్తమోత్తమున కధిప.

క. అని మాటిమాటికిని న, వ్వనితామణి యుక్తియుక్తవచనమ్ములఁ ద
మ్మును ద్రేరేపఁగఁ దుద కి, ట్లను నంగీకార మాత్మయం దిగురింపన్. 563

ఉ. ఎవ్వరుఁ జేయరాని పని యే నొనరించెద నీదుమాటచే
జవ్వనిః భార్య నమ్మెడి నృశంసులు గల్గిరె యేయుగమ్మునం,
దెవ్వగ నిట్టి దుష్కృతికి నిచ్చ యొనర్తు? నభాగ్యమూర్తినై
నవ్వుల కాకరంబ నయి నవ్వారలోఁ దలవంపు వింపఁగన్. 564

వ. ఇట్లు చింతించుచు నెట్టకేలకు హరిశ్చంద్రుండు రంగమ్మునఁ బత్ని నవతరింపఁ జేసి గద్గదకంఠుండై యెడనెడ వడుచు నాగరికుల కిట్లనియె. 565

గీ. నాగరికులార ! కరుణాసనాథులార !, యీ తలోదరి నాభార్య యెవరికేని
దాసిగా విక్రయించెదఁ దగినధనము, నీఁగఁగలుగు దాత గలఁడె యిందెందుఁ జెప్పుఁడ.

వ. నావుడు వారలందఱుఁ బరమాశ్చర్యసంభృతమానసులై మంతలాకారమ్ముగఁ
జుట్టువారి నిలిచి నీవెవ్వండ, విట్లు పత్నీవిక్రయణం బొనర్ప నేమివచ్చె నావుడు
వారల కతం డిట్లను. 567

క. సగపాలు వచ్చి యీ మ, ర్త్యగకార్యము చేయువాఁడఁ బాపాత్ముఁడ దుం
దగుఁడగు రక్కసునిన్ బో, లఁ గలుగు కఠినుండ నన్ దలంప నఘ మగున్.

వ. ఇట్టి నావృత్తాంతమ్ము మీకేల. వంసిన నిర్ముంగనం దగిన ధనమ్మిడి దాసిగాఁ
గైకొనుఁడని యుచ్చైస్స్వరముగ నొడువు నప్పటానవపతిపచనంబులు విని కౌశికుండు
వృద్ధబ్రాహ్మణరూపంబు ధరియించి యయ్యెడ కరుదెంచి యిట్లనియె. 569

చ. ధన మతులంబుగాఁ గలదు తద్దయునున్ సుకుమారి యస్మదం
గన పనిసేయరామిఁ గడుఁగష్టము చెందుచునుండు నీకుఁ గో
రిన ధనమిచ్చి పుచ్చెదను బ్రేయసి నమ్ముట నిక్కువంబె నాఁ
గను బ్రతి చెప్పఁడయ్యె క్షితికాంతుఁడు వారినవంత పెంపునన్. 570

వ. అట్లు నిరుత్తరుండగు నన్నరపాలున కతండు మరల నిట్లను. ధర్మశాస్త్రముల
ద్వాత్రింశల్లక్షణోపేతయు శీలవతియునగు తరుణికి మూల్యంబు కోటి యనియుఁ
బురుషునకు నప్పదంబనియుఁ జెప్పంబడుఁ గావున, 571

క. నీ తరుణి కనుగుణంబగు, నేతన్మూల్యంబు గొనుము గృహమేగెద నే
నీతన్విం గొని యనవుడు, నాతఁడు ప్రతి చెప్పఁజాలె నతిదుఃఖమునన్. 572

గీ. అంత నావృద్ధవిప్రుఁ డహంకరించి, ధనము నృపునగ్రమునఁ బోసి "దాసివైతి
రమ్ము తడవేల" యనుచుఁ గరమునఁ గొప్పు, వట్టి యీడిచె నారాజపత్ని నకట.

వ. అట్లు కఠినుండై లాగికొని పోవుచున్న యమ్మునికి నప్పరమపార్థి యిట్లను. 574

చ. అకట ! మునీంద్ర నన్ విడువుమయ్య సుతున్ వినవాడ నోప నే
నకలుషనౌ పతివ్రత నయం బొకయించుక లేక నన్ను ము
ట్టకు మని, పుత్రుఁ గూర్చి యకటా నృపపుత్రక ! దాసినైన నా
వికలత చూడుమయ్య నను వీడఁగదయ్య యిఁకేటికూరుముల్. 575

చ. అనినను వస్త్రమున్ విడువ కన్నృపపుత్రకుఁ 'డంబ యంబ' యం
చనుగతుఁడై యఖండగతి నశ్రువు లొల్కఁగ నేడ్చుచున్ బునః

ఉ. హా పతి! యెల్లఁ బోయినను ధైర్యము వీడ; సుతున్ గుణాకరున్
ధీరమతున్ వ్యజింపుమటె? చెల్లఁగదమ్మ ద్విజేంద్ర! యింత నా
దూరము నందు విప్రునకు, పూతచరిత్ర! సరోజనేత్ర! న
న్నీరహి డించి దాసిగను మేగెదె? దైవబలమ్ము పెంపునన్. 585

క. నను నిక్ష్వాకుకులోద్భవుఁ, డనియును రాజేంద్రుఁ డనియు నధిపాఘనిఁ గాఁ
గొని నాకారణమున నా, కృనికిఁ గా దాసిపని కుందఁగాఁ దనుపడెనే. 586

క. ఏతాదృశగురుదుఃఖా, ప్రీతుఁడనై కుందుచున్న నెవ్వరు మోదా
ప్రీతు నొనరింతు రని య, త్యాతురుఁడై బాష్పఁ దశలె నవనవిఘనునిన్. 587

వ. అంత నివ్విప్రుం డేతెంచి క్రోధాకులుండై యారాజర్షిసమక్షమ్మున నారాజపత్నిం బట్టి కశాఘాతమ్ములం గొట్టి పుత్త్రసహితమ్ముగ నీడ్చికొని పోవుచుండ హరిశ్చంద్రుం డేమియుం జేయునది లేక యిట్లు దుఃఖించె. 588

చ. తరణిశశాంకవాయువుల తిక్కినమానవుఁడన్ మహెవ్వరే
పరమపతివ్రతం గనఁగఁ బాల్పడ కుందురొ మున్ను; నేఁడు భా
గ్యరహితయై యకారణము నువ్వనితామణి దాసి యయ్యె దు
స్తరమగు దైవపాక మది దాఁటఁగ రాదు విరించి కేనియున్. 589

ఉ. మారుని గేరువాఁడు సుకుమారుఁడు నాదు కుమారుఁ డీతఁ డం
భోరుహమిత్త్రవంశజుఁడు పూజ్యతఁ దక్కి యభాగ్యుఁడైన నా
నేరమి కారణంబుగ ననింవితుఁ డొక్కని చేతఁ గ్రీతుఁడై
బోరన నేడ్చుచుం జనుట పోలునె? పుత్త్రులు లేరె ధాతకున్. 590

ఉ. హా సతి! హా తనయ! యక్కట! దుష్టుఁడ నైన నాదు దు
ర్మానము కారణంబుగఁ గ్రిమింబున దైవబలమ్ము దక్కియొం
దేనియుఁ బోతిరే? ఋణము తీరెనె? మీకును నాకునేఁటితోఁ
బూనిక నింత చేసియును బోవనిపాపఋణము నాకుఁ గల్గెనే. 591

వ. అని మిన్ను మన్ను నొక్కటిగా విలపించు నాసత్యసంధుని కడకు విశ్వామిత్త్రుండు సశిష్యుఁడై వచ్చి కోపమ్మున నిట్లను. 592

క. అనృతం బాడక సత్య, మ్మునకుం గట్టువడె దేని మును విన్నిచ్చెద నీ
కని పల్కిన దక్షిణఁ గ్రి, మ్మన నా కిమ్ము మనుకుల ధరణీశాఘుఁడ పేర్మిన్. 593

వ. మునిహృదయం బెఱింగి యితండు రాజ్యదానదక్షిణయుం గాకయున్న నే నితనికి

"యాగార్థంబు ధనం బిచ్చెద నయోధ్యకు ర" మ్మని నొడివిన ధనముంగూడ దెమ్మనుచున్నవాఁడు; కాని మ్మీధనంబున సార్ధహేమభారద్వయంబ కాక మఱి కొంత మిగిలియే యుండుఁ గావున నుభయమ్మునకుం బర్యాప్తం బగుంగాకేమి యని కెలన మున్న ధనముం జూపి యుందు రాజసూయ దక్షిణయుం గలదు దీనిన్ గ్రహించి నన్నుం గృతార్థుఁ జేయు మ నావుడు గాధిజుం డీధనం బెట్లుసంగ్రహిం చితివి నొడువు మనుడు నతం డిట్టు లను. 594

క. మునివర ! ద్రవ్యంబును గై, కొను మంతియకాని వేఱు గోరకు మదినే వినిచిన పీకను నాతను, బనుపడు శోకంబు పట్టఁబగ్గము లేమిన్. 595

క. నావుడు ముని యట్లను నో, భూవల్లభ ! ద్రవ్య మెట్టిపోఁడిమిచే నీ తావుకు వచ్చె ? శస్త్రం, బై పెంయక యున్న మాకు నది గ్రాహ్యంబే. 596

చ. అనవుడు రాజు పల్కు వినుమయ్య మునీంద్ర ! పతివ్రతాంగనా జనమణియైన మత్సతిని సద్గుణశోభిత నమ్మినాఁడ ని ష్కవిచయ మొక్కకోటిగొని ; కన్నకుమారకు నమ్మినంబు కై కొని యిడినాఁడ వీనము గొంకక కైకొనుమయ్య మ్రొక్కెదన్. 957

వ. అని ప్రార్థించుటయు నమ్ముని యాధనముం జూచి యియ్యది యల్పంబు రాజసూ యమ్మునకు దక్షిణ యింత స్వల్పం బెట్లు ? మఱి కొంత తెచ్చి నా కొసంగు మట్లొనరింప వేని, 598

గీ. నాతపోవీర్య మధ్యయనంపుఁజేవ, మత్ప్రభావంబు నాదగుమహిమ మగుప దంగఁ జేసెద విప్రు లసంగ నంత, నెల్లిదమె ? యిమ్ము తక్కిన దిపుడ నాకు.

వ. అనవుడు హరిశ్చంద్రుండు కొంచొక కాలితివేని మఱియుం గొంత ధనంబిత్తునను టయు, గాధిజుండు రాజా ! యింక దినమ్మున నాలవభాగంబు మాత్ర మవశేష ముగా నున్నయది యంతదనుకం గాచుండెదఁ బిమ్మట మఱుమాట చెప్పిన నే నొప్పెడి వాఁడఁగానని యాధనంబు గొని యరిగెఁ; బిదప హరిశ్చంద్రుండు దీర్ఘనిశ్వాసం బొనరించి యధోముఖుండై యుచ్చైస్స్వరమ్మున నిట్లనియె. 600

క. నష్ట విత్తకీతువిగా, నొవరిది ప్రేతత్వ మందియుండిన నాచేఁ బను వెవ్వని యార్తి యతం, డనుగతుఁడై యిటకు వచ్చు నక్కుండుండన్.

వ. అపవం ! వొక్క చాండాలుండు దుర్గంధదూషితశరీరుండు వికృతోరస్కుండు

శ్మశ్రులుండు లంబోదరుండు శవమాల్యాలంకృతుండు హస్తజర్జరయష్టి యగుచు నేతెంచి యిట్లను 602

క. విను మేఁ జాండాలకులం, బ్మునఁ బుట్టి ప్రవీరుఁ డనఁగఁ బొల్పెదు వాఁడన్
జనవర! నాయానతి మృత, జనచేలాపహృతి సలుపఁ జనుము కడంకన్. 603

వ. నావుడు రా జిట్లనియె. 604

గీ. బ్రాహ్మణక్షత్రియులఁ గూర్చి పలికియుంటిఁ, గాని తక్కొరులకుఁ గింకరుండఁ గాను; జగతిఁ
దనరు నుత్తమవర్ణమాధ్యముల కనుగు, ణంబయిన ధర్మమునకు విహితంబు లగుట.

వ. కావున నీవు నన్నుఁ గొన నసహ్యంబు వన వాఁడను నరేంద్రా! నీవు సామాన్య
మ్ముగ నాయెడలఁ బల్కినకతనఁ గొన సువ్యయమందితి, సత్యమునకుఁ దప్పనేని
యట్లాసరింపు మిప్పు డీయమ్ముల చెప్పుట పాడి గా దని పలికియును. 606

క. అవిచారితమతివై తా, నెవఁడును సత్యంబు దప్ప నెఱుఁగఁడు నీవో మున్
దు వచింపవా దసత్యముఁ, దవిలెడివాఁ డెట్టివాఁడొ తగుఁ బలుకంగన్. 607

క. అను నమ్మాలవి పలుకులు, విని జనపతి సత్యమునకు వెలియై పరక
మ్మునఁ బడుటకన్నఁ జాండా, లునియతి నుండుటయ కొంత లగ్గగుఁ గాదే. 608

క. అని యోచించెడి యాలో, నన గాధిజుఁ డటకువచ్చి నరవర! నీ కో
రినధన మిచ్చెద నను మా, లనికిన్ దాసుండ వగుట లాఘవమగునే. 609

## హరిశ్చంద్రుండు చాండాలునిచేఁ గ్రీతుండగుట.

వ. అట్లేని నా కీఁదగు దక్షిణ యేవిధమ్మునఁ బూర్ణం బగునని క్రోధతామ్రాక్షుండై
యరుగు నమ్మునివరునకు జనవిభుం డిట్లను. 610

క. అనఘుండగు సూర్యుని కొలం, బున నొదవిన క్షత్రియుండ మునివర! నాకుం
జన నే? చాండాలుని సే, వనమును నొనరింప నసముచితని దురాళన్. 611

వ. అనిన ముని యిట్లను. 612

ఉ. మాలని కెల్లు సేవయ సమర్థునిచందముఁ దలంకెదేని నిన్
జాలినద్రవ్య మిచ్చి కొనుసత్పురుషుం గనఁ జేయు మింక నేఁ
డాల, శపించి యేగెదను దాశరథాప్తుఁడ నోపఁ డెంతె నా
కేల విచార మెట్లయిన నీవలె దక్షిణ కైకొనన్ వలెన్. 613

వ. నీ వెట్లేని ధనమిమ్ము మెటయు నాకుఁ బ్రధానం బని ప్రాణగొడ్డమ్ముగ ఘూర్ణితాంతం
బొనర్చు నమ్మునికి నంజలి ఘటియించి పాదమ్ములం బడి నృపాలుం డిట్లనియె.

ఉ. ఓమునినాథ! కొంత కృపయుంచి ప్రసన్నుఁడవై భవత్పదం
బే మదినమ్మియున్న ధరణీంద్రుని దీను ననాథు నార్తు న
న్నోమఁగదయ్య! యంత్యకులయోగముకన్న యినున్ భజించి నీ
ధామమునందు పేరికపదమ్మును నేఁ బడిగొందు నమ్రతన్. 615

వ. నీ వేది పంపిన నయ్యది యొనర్పువాఁడ నని పదమ్ముల నుండి లేవని యన్నర
నాథున కతం డిట్లను. నీకోరినయట్లు నాకు దాసుండ వగుము నేనెద్ది చెప్పిన
నయ్యది యొనరింతువే? నాపుడు హరిశ్చంద్రుండు కొంత సంతసించి పునర్జాతు
డగాఁ దన్నెంచికొనుచు నమ్మునికిట్లను. 616

క. ఓమునిజనమణి! నన్నెఁక, నేమి యొనర్పుమను మంచిదే నీపాదం
బే మదిని నమ్మి నీపను, నేమైనన్ జేయువాఁడ నెల్లపుడుఁ దగన్. 617

వ. కావున నీకేమి యొనర్త నిప్పుడ నా కానతిమ్మనుడు నమ్ముని చాండాలుం బిలిచి
యిట్లను. 618

గీ. ఓరి చాండాల! వీఁడు నాయొద్ద దాసుఁ, డయ్యె ద్రవ్యంబు నాకు ముఖ్యంబు గాని
వీనితోఁ బనిలేదు నాయానతిని ధ, నంబు నిచ్చి వీనిఁ గైకొ మ్మసంగ వాఁడు. 619

వ. గాధిజుం గని మహాత్మా! ప్రయాగమండలంబున దశయోజన విస్తీర్ణంబగు
భూమిని రత్నమయమ్ముగా నొనర్చి నీకు మూల్యమ్మునకుఁగా నొసంగువాఁడ
నాకు నిప్పాటికతన నిర్యూర్తి యగుంగు నియ్యది నీవొనర్చిన యుపకారంబని చెప్పి,

క. రతనములు మౌక్తికమ్ములు, నతులితమగు పైఁడియున్ సహస్రపు సంఖ్యన్
మితిమీఱ నిచ్చె లమ్ముని, పతికిచ్చెఁ బ్రవీరుఁ డెంతభాగ్యము గలఁడో. 621

చ. అటు మునిచేత విక్రయము నంది త్రిశంకుసుతుండు "నాకు వి
జ్జటిలుఁడు చేయ్యఁ డీతని వశమ్మున నెయ్యదియేనిఁ జేసినన్
గుటిలత నమ్మఁ బొంద దనుకూలము యిమ్మునియాజ్ఞచేత యిం
కెటులయినం గృతార్థుఁడ మునీంద్రు ఋణమ్ము దీర్పనేర్చితిన్. 622

వ. అని విక్రీతపదనుండై యానందించునెడ నశరీరవాణి యిట్లను. 623

ఉ. ధన్యుఁడవైతి సత్యమును దప్పక భూమిలకోర్చి యెల్ల రా
జన్యులు దేవతల్ వినుఁ బ్రశంస యొనర్ప నగణ్యకీర్తిన
మాన్యుఁడవై మునీంద్రుని ఋణంబు తృణంబుగ నిచ్చి పుచ్చి యా
దైన్యము లెక్కపెట్టక ముదమ్మునఁ బొల్చెద వింత యొప్పునే! 624

ఆ. వె. మేలు మేలు నీవు మేదినికెల్లను, భూషణుడవు నిక్కఁ బోలదాడు
సత్యమున మఱొక్కజనునకు నని సుతులఁ, గొలిచి సురలు పూలు గురిసి రపుడు.

వ. వదంపడి హరిశ్చంద్రుం డు ద్విగుణితానందుండై కౌశికునకుఁ గేలు మొగిచి యిట్లను. 626

క. తల్లియుఁ దండ్రియు దైవం, బెల్లరు నాకీవ నన్ను బుజముకృపఁగాఁ
దెల్లము చేసితి వో ముని, వల్లభ! నీయాజ్ఞ నే నవశ్య మొనరుతున్. 627

వ. నీవెయ్యది చెప్పినను నాశ్రేయమ్మునకుఁ గాని యొండుగాదు నిక్కమ్ముగ నేను యొనర్తు నాన తిమ్మనుడు నమ్మౌని యిది మొదలు చాండాలుని పనుపున జాగరూకుండవై వర్తింపుము, నీకు శుభమ్మగునని చెప్పి యరిగెఁ; నాపుడు జనమేజయుండు మహాత్మా! యతండు చాండాలసేవకుండై యవ్వానిగృహమ్మున నెట్లు వర్తించె ననుడు వ్యాసుం డిట్లను. 628

గీ. అట్లు కౌశికుఁ దరుగుడు నా నృపాలుఁ
గని శ్వపచుఁడిట్లు పల్కు "దొంగవయి పాఱు
దువో, మఱిమొకో! యిందు బద్ధుండవగు" మ
టంచుఁ గట్టించె రజ్జుల నంటఁదీసి. 629

వ. అట్లంటఁగట్టి యసత్యుండవై పలాయనం బొనర్పకుండునట్లు దండమ్మునం దాడించుచుఁ దనపక్కణమ్మునకుఁ గొనిపోయి. 630

గీ. ఇష్టబంధువియోగార్తు నష్టతేజు, వ్యాకులేంద్రియు నా నృపవర్యు నిగళ
బద్ధునిఁగఁజేసి నిద్రకుఁ బడియె శ్వపచుఁ, డకటా! యాతని గని యాతఁడాయె పరవశ.

వ. అట్లు నిగళబద్ధుండును క్షుద్వ్యాకులుండునునై భార్యాపుత్రులఁ దలంచికొని యిట్లు విలపించు. 632

ఉ. దీనముఖుఁగా సుదుఃఖితునిఁ దేజము దక్కినవానిఁ బాలుఁ దా
నానతవక్త్రయై కని 'మహా! బెగడొందకుమయ్య యింతలో
మౌనిఋణంబుఁ దీర్చి నృపమౌళి కృపన్ మన కీయవస్థ యీ
శ్లైవియుఁ బాపు' నంచు స్మరియించు సతీమణి నన్ను మాటికిన్. 633

గీ. 'అయ్యయొద్దకు నేగెద' ననుచు నేడ్చు, సుతుని నోదార్ప నక్కటా! సుదతి 'యల్లె
యేగుదువు గాని' యనిచెప్పి యెలమి గల్గఁ, జేసి మఱపించు నేనియుఁ జేయరాను.

గీ. అంతియే కాని యకట! యయ్యతివ నేఁడు, నూఁడి గృహమ్మునం దసామాన్యనిగళ
బంధమున నిట్టు లున్న స-బంధ మెఱుఁగ, దెటఁగె నేనియు మృతిచెందు విధియ మేలు.

చ. రమణ నెసంగునట్టి ఘనరాజ్యము పోవుట బంధుమిత్రసం
ఘముఁకు దూరమేగుట జగమ్మునకెల్ల మహాపతివ్రతా
త్వముగల భార్యయున్ సుతుఁడు దాస్యము నొందుట నాకు మాఁగే
హము గతియౌటయుం దొరకె నావ లాపవలంద పైఁబడుగా. 636

వ. ఇట్లు ప్రతిహాలంబగు విధికిఁ దలంకుచు భార్యాపుత్రుల స్మరించి కొమము నొక్క-
నాఁగువినమ్ముల గరవుఁడు నా వవీరుం దక్షని బంధనిర్ముక్తుఁ జేసి వరుష
దుర్భాషణంబులఁ దర్జించుచు మృతచేలాపహరణమ్మునకై యిట్లు నియోగించె. 637

క. ఈ నగరిదక్షిణమున శ్మ-శానము గల దచట నుండి శవవస్త్రనమూ
దానము పనిగా వ్యాయ్యం, బై నెగడెదివృత్తి మెఱఁగు మనవరతంబుగా. 638

వ. అద్దరంబగు వీరదండంబు గైకొని యియ్యది వీరబాహుం డిచ్చెనని యెల్లరకుఁ
దెలియ నుద్ఘోషింపుమది యని చెప్పి పనిచినఁ దదాజ్ఞంగొని దండమండితకరుండై,

ఉ. అనేకనాయకుండు చితమై శవమాల్యయుతంబు ఘాతిగం
ధానుగతంబు ధూమమయ మామిషలోలపగృధ్రకంకదు
ర్ధ్వానము నర్ధదగ్ధశవవర్ధనసంగతమై మనస్యసం
ధానము నౌ శ్మశానము సదాప్రబలమ్మునకంబు గన్గొనెన్. 640

చ. పెలిమిటి కేశ్ము భార్యలను వేయసి కేత్వెదిక ర్తలుగా దనూ
జాన కదలొందు తిల్లులను సోదరికై వగచెందునప్పులన్
మనుమల కేశ్ముతాతలను మామల కేడ్చెడిభాగినేయులై
పనపను వా శ్మశాన మతిభైరవశబ్దసమాకులంబునై. 641

వ. ఇట్టి మహాఘోరాకారమ్మునఁ గల్పాంతకాలనన్నిభంబును జ్వలన్మాంసవసామేద
"ఛ్ఛాడ్, చూడ్" ధ్వనిసంకులంబును నగు నమ్మహాశ్మశానంబున కరిగి యాహరి
శ్చంద్రుండు, 642

చ. వెనుకటిరాజ్యమున్ సుతుఁడు భృత్యులు మంత్రులు భార్యయుం దలం
పునఁ బొడకట్టఁ దన్మయతఁ బొంది ధృతిం గవలేక "ప్రేయసీ!
నను విడనాడితే? కులమ, న న్నెడచేసితె? పుత్రకా, ననుం
గనుఁగొనరావుగా?" యని యఖండగతిన్ విలపించు ఖిన్నుఁడై. 643

క. కోపమునఁ దగు నావిప్రుని, శాపమున మీ రెట్టిపాట్లు పడుదురొకో ? మీ
యాపదలు నే నెఱుఁగ నా, యాపత్తును మీకు నెఱుఁగ నయ్యెడినె కటా. 644

## హరిశ్చంద్రుండు శ్మశానమ్మున నుండుట.

క. అని చింతించుచు ధర్మం, బును దప్పిన నరుఁడు కీర్తి బొందఁడు ధర్మం
బున నది రక్షించిన న, జ్జనునకు సుఖమును యశంబు సమకూరు నొగిన్. 645

వ. కావున నెప్పాటనేని ధర్మరక్షణంబు కర్తవ్యంబని తనకు వీరబాహుం డాజ్ఞాపించిన చందమ్మున వస్త్రశేషమ్ములఁ గైకొనుచుఁ దత్తన్మూల్యగ్రహణంబుల కటు నిటు నడుగుచుఁ దత్తత్కృత్యమ్ముల జాగరూకుండై రజోవిధ్వస్తాంగుండై మెలఁగుచు, 646

ఉ. ఈ శవమూలమై మనకు నింతధనం బొదఁగూడె మీఁద నా
యా శవకారణమ్మున శతాధిక మూల్యము వచ్చు దీన భూ
మీశున కింత, యింత మనయేలిక మూలని, కింత నా కటం
చాశ మెయిన్ జరించు నొకఁడై దృఢజీర్ణపటైకకంథుఁడై. 647

క. నానాశవరోదనాదన, దూనానూనక్షుధార్తికోఁ దన్మాల్యా
ధానశిరస్కుఁడుఁ దద్భ, స్మానుగతాంగుండు నగుచు నవనిపుఁ డపుడున్. 648

చ. పవలును రాత్రియున్ నిదురఁ బాసి వహ్నిదికలిప్తపాణియై
శవములరాక చూచుచు విషక్తవిలోచనుఁడై శ్వపాకజా
తి వలుకురీతిఁ బల్కుచు మదిన్ మఱియొండు నెఱుంగ కొక్కయేఁ
డవశత నిట్లు వుచ్చె, నృపుఁ డా శతవర్షసమంబు ప్రాప్తిగా. 649

వ. అంత నొక్కనాఁడు రోహితుండు సవయస్కులగు విప్రబాలురం గూడి పురమ్మున కనతిదూరమ్మున కేగి యచ్చటఁ గొండొక క్రీడించి రాఁబోవువాఁడు పు-దట. 650

గీ. అల్పమూల్యమ్ములను మఱి యగ్రసహిత, ములును గోమయములను వర్ప్యలను జూచి
యార్యునకు నివి యుక్తమ్ము లనుచుఁ గట్టి, కట్టి సమిధాదికమ్ములు దొట్టి భక్తి. 651

వ. ఇట్లు తన యేలిక యగు విప్రునకుఁ గూర్పువాఁడై పాలాశాది కాష్ఠమ్ములకోఁ గట్టిన మోపొకటి శిరమ్మున నిడికొని భారంబైనమెత డింపికొని ఖేదంబు నొందుచు జలంబు సంప్రాప్తంబైనఁ ద్రావుచు వచ్చువెడ నొక్క వల్మీకమ్మునఁ గాష్ఠభారంబు

దింపి మరల నెత్తికొనునంత విశ్వామిత్రప్రేరితంబై యొక్క సర్పం బతిఘోర
విషదూషితం బవ్వల్మీకంబు నిర్గమించి, 652

క. ఆనృపసుతుని గఱచిన, మేనెఱుఁగక పడియెఁ దోడ మెలఁగెడి బాలుర్
దీనులయి వేగ చని రా, ట్పాపజననిఁ గాంచి కొంత శోకము గదురన్. 653

ఆ.వె. వినుము విప్రదాసి! తనయుండ నీసుతుఁ, డరుగుదెంచె నాటలాడ నెంచి
యచటఁ బాము గఱచె నంతట భీతిల్లి, వచ్చినార మిటకు వార్తఁ దెలుప. 654

క. అను పలుకు వజ్రపాతం, బున కెనయై రాజపత్ని పొరిఁబొరి మూర్ఛా
జనుపడి నఱకిన కదళీ, ఘనతరువుం బోలెఁ బడియెఁ గష్టముపాలై. 655

వ. అంత నవ్విప్రుం దరుదెంచి శీతలోదకంబు చల్లిన లబ్ధసంజ్ఞయై విలపించు నాశైబ్యం
గని యతం డిట్లను. 656

ఆ.వె. ఈ ప్రదోషవేళ నేడ్చుట లక్ష్మికి, రంబు గాదనుచుఁ గఱంబు నెఱిఁగి
నా గృహమ్మునందు నాతిరొ! యేడ్చెదు, సిగ్గులేదె యిదియుఁ జెప్పవలెనె. 657

వ. అని నిష్కరుణుండై తన్నుం దిట్టు నవ్విప్రుని కుత్తరం బీనేరక తన్మయచిత్తయై,

క. కన్నీరు కాల్వగట్టంగఁ, దన్నెఱుఁగక కరుణ మొలయఁ దద్దయు శోకా
త్యున్నతి వెలుఁగెత్తుచు నే, డ్పె న్నందనుఁ దలఁచి "యెంత చేసితి" వనుచున్.

## శైబ్య పుత్రమృతికి శోకించుట.

వ. ఇట్లు విక్లబచిత్తయై యొక యెఱుఁగక మిన్ను మన్ను నొక్కటిగా నేడ్చుచున్న
రాజపత్నికి దురాగ్రహంబు పాఱ నిట్లను. 660

క. ధనము తగినంత యిచ్చితి, నినుఁ దెచ్చితి నింటిపనికి నీవీగతి న
మ్మను మోసపుత్తె? దాసికిఁ, జనునే యీ రీతి? నిన్నుఁ జంపెద మొండీ! 661

వ. అని తన్నుఁ గొట్టఁ దలంచు నక్కఠినాత్ముఁ గాంచి రాజపత్ని మహాత్మా! నన్నుం గొట్ట
కుము నాసుతుండు సర్పదష్టుండై మృతుండయ్యె. 662

క. కరుణించి యాజ్ఞ యిచ్చిన, నరిగెద నాపట్టి నాకులాభరణము తా
నురగవిషమ్మున నెట్టుట, మరణము గనె నటకు; నన్ను మన్నింపు మొగిన్. 663

క. ఇఁక నీ జన్మమునకుఁ బు, త్రకుమోహముం జూపు భాగ్యదశ గల్గదు నేఁ
టికి ఋణము తీఱె నొక్కం, త కరుణ నన్నటకుఁ బంపఁ దగదె మహాత్మా. 664

వ. అని కన్నీరు వఱ్ఱుగా రోదనం బొనర్చు నమ్మానినికిఁ గ్రుద్ధుండై వృద్ధుం డిట్లనె. 665

గీ. ఓసి దుర్మార్గురాల ! నావాసివయ్యు, నింటిపనులను దీఁడి నీ వేగితేని
యెవఁడు నీతాత యిప్పని నెల్లఁజేయు, స్వామికార్యవిఘాతము సమ్మతమగునె. 666

వ. ఎవ్వండేని వేతనంబుగొని స్వామికార్యం బొనర్పఁ డవ్వాఁడు మహారౌరవనరకమ్మునం బడి యొక్క కల్పంబుండి పదంపడి కుక్కుటుండై జనియించు. 667

గీ. జన నాకేల నీయెడ సఖీంధర్మ, మునుపు వమ్ముగ వచియింప, మూర్ఖురాల
నీమఱందును వ్యర్థమై నెగడు నీతి, చౌటనేలను జల్లు బీజంబు పగిది. 668

వ. నీ కించుకేనిఁ బరలోకభయంబు గలదేని వచ్చి యింటి కార్యమ్ములఁ జక్కఁబెట్టుమని నిష్ఠురమ్ముగఁ బల్కు నద్దురాత్మునకు నమ్ముగుద వేదనాన యగుచు నిట్లను.

క. ఒకయింతలోన మృతపుత్రకుదేహము చూచివత్తుఁ దదయక నాపై
సకరుణదృష్టిం జూపుము, ప్రకృతిం బొనరింపు మింత పాటిగనేనిన్. 670

వ. అని చరణమ్ములం బడి యతికరుణమ్ముగ వేడ్కు నమ్ముగుదం గని కోపోద్రేకమ్మున నతం డిట్లను. 671

గీ. కొడుకు చచ్చిన మా కేటిగొడవ? యింటి, పనులు తక్కక చేయుము గొనము గలిగి
కానిచో మత్కశాఘాత మూని వీఁపు, బ్రద్దలగు మున్నె యింగవే పడఁతి నమ్ము.

వ. అని పుయిలోడక పల్కునప్పాపాత్మునకు మాఱాడక ధైర్యం బవలంబించి తత్తద్గృహకృత్యమ్ము లొనర్చి పాదసంవాహన మ్మొనరించునంతకు నర్ధరాత్రంబు గతించెఁ, బిమ్మట నాపె కాతఁ డిట్లను. 673

క. ఇఁకఁ జనుము నీదుపుత్రకు, నకు దాహాదికము నే యొనర్చి గృహమునొద్దకుఁ బ్రొద్దువొడుచునాయిం, తకుఁ బను లొనరింప నిమ్ము తడసెను మిమ్మె. 674

వ. ఇట్లు తదనుజ్ఞాతయై యేకాకినియై విలపించుచు యూథభ్రష్టయగు కురంగివలెఁ దప్పిన వత్సరహితయగు గోవు విధమున నరిగి పురమ్మునకు నవల ననతిదూరమ్మున నొక్కెడ మృతుండై పడియున్న పుత్రుంగని హాహానినదమ్ము దనర దరికేగుచు,

గీ. పలికినమ్మను నెదురేగువాఁడ విప్పు
డేల రా? వింత కోపింప నేల నీకు,
"నంబ"! యని పిల్వరాదె నాయన్న? యనుచుఁ
దొట్రుపాటొప్ప నేగి సుతుపయిఁ బడియె. 676

వ. అట్లు పడి మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలివి బాష్పమ్ము లొలుకుచు నర్భకుని బాహా

పులం బట్టి కౌఁగిలించుకొనుచు నతని మోమున మోమిడుచుఁ గరమ్ములచే నురమ్మును
శిరమ్మును మోదుకొనుచు, 677

క. హా పుత్రా! హా పుత్రా!, హా పుత్రా! యనుచు మిగుల నార్తస్వనయై
యాపడఁతి యడలి యెంతయు, వాపోవఁ దొడంగెఁ దీర్పువారలు లేమిన్. 678

వ. వదంపతి పతిం దలంచికొని, 679

క. ఓవరపాలక! నీసుతుఁ, డీనాఁటికి నిట్టు లాయె నిప్పుడ చనుదే
వే, నేఁడు దక్కెనఁట నీ, సూనుని వక్త్రంబు మరలఁ జూడం గలవే. 680

వ. అని వెండియుఁ బరిపూర్ణరాకాసుధాకరుం గ్రిందువడిన వన్నెచెడిన మొగమ్ము జీవిత
శ్రాంతిం జూచి యట్టి నాటికి మరలఁ జెప్పఁబెరుఁగు దుఃఖాతిరేకమ్మున మూర్ఛి
తయై కొంతవడికిఁ దెలిసి యవ్వాఁడని మొగమ్ము కరమ్మునం దిడికొని యిట్లను.

చ. శయనము నుండి లెమ్మిది నిశాసమయం బిటఁ బ్రేతభూతసం
చయము చరించుచుండెఁ బెడచం గడు నాద్భుతమండె నక్కటా! ల
య్యయొ! వినుచీచి మిత్రులు రయమ్మున పిండ్లకు నేగిరయ్యొ! వి
ర్భయమున నీకు నిట్టినిఁ బాడియఁటయ్య! నృపాలపుత్రకా! 682

క. వే యనుదాగమ్మున లే, వే! యను మన విప్రునింటికేగన్వలె రా
వే! యనుఁ దల్లిని పిలిచెద, వే! యనుఁ బ్రతివచన మొసఁగవే! యను నార్తిన్.

ఉ. తల్లిని గాన వేమి? నను దక్కఁడు లంబలెఁ జూడనేల? నా
యుల్లము చల్లఁజేయుటకు నుద్భవ మంది యనాదరింతె? సం
వల్లభ మేమి లేక పురిఁ బాసియు నొక్కనియింట దాసినై
చెల్లియు నిన్నుఁ జూచికొని జీవము దాల్చితిఁగాదె పుత్రకా. 684

ఉ. ఆయువు దీక్షపై పృథివి కంతకు నేలికవై నిరంతర
శ్రీయును విద్యయున్ యశముఁ జేపడు పెంగియు విప్రపూజయున్
బాయక తల్లిదండ్రులకుఁ భక్తుఁడవై యొతిఁ దొప్పఁ బుత్రపౌ
త్రాయతి పొందఁ బుట్టినవు దగ్రజులాడుట కల్లయే సుతా. 685

గీ. చక్రమత్స్యాదిరేఖలు స్వస్తికధ్వజాదిరేఖలు నీదు కరాంబుజమున
నాయురారోగ్యదంబులై యలరు నవియు, నమ్ముచేసితె నాదుపాపమ్ము కతన. 686

శా. నీరాజ్యమ్ము ను నీ ధనంబు మఱియున్ నీ మంత్రులున్ నీదు ది
వ్యాగారమ్ములు నీమహాత్మ్యములు నీదౌ నాతపత్రంబు ను

దొనరుచు నీకు నాకకసముద్ధృతి యెన్నఁటికేనిఁ గల్గనే
ర్చునె ? తగుపేతసంబు గొని ద్రోహము సేసెదె దుష్టబుద్ధివై. 706

చ. అన నరపాలకుండను మహాత్మ ! జగదీశ్వర నీకు నా కీఁ డుం
డిన సనుఁ బంపు మింద్రుఁడు కడిందిబలమ్మునఁ బోయి పట్టినా
దునిమెద వాని నొక్క పెనుతూపున ; మేదినికెల్ల నిప్డు నా
ఘనిఁగ నొసర్తు నిష్కలఁ ద్రుంపుట నాపని గాదు నాకుఁ బన్. 707

ఉ. "కూళికివచ్చి పాలికిటు కూయఁగ" వచ్చెనె ; న్యాయమేది ; వాం
డాళునియింట దాసుఁడు హాటాహాటి యూడిపడ్డ్ లాడఁగాఁ
బోలునె ? బాలుఁ జాల నసిపూని కడమ్మున నష్టచెప్పకే
బాలకహంత్రిశీర్షము చివాలునఁ ద్రుంపుము నిర్దయాత్మతన్. 708

వ. అని ఖడ్గం బొసంగుటయు స్వామికార్యార్థి గావునఁ గైకొని దగ్గఱ జని యనన్యాస్త్ర
జ్ఞానంబు లేమి నాపె కిట్లను. 709

క. ఓవనిత ! నాదు హస్తము, చేవం గతఁకొనుచేని శీర్షచ్ఛేదం
జేవడిఁ జేసెదనని స, ద్భావం దన్వినిఁ జూచఁ దత్పరుఁ డగుచున్. 710

చ. తనమరణంబు నెమ్మదిని దద్దయుఁ గోరుచుఁ బుత్రశోక మా
త్రి విగుడఁజేయ నిట్టులను దీనత నోఁపగ, నో శ్వపాక ! నా
తనయుఁడు ద్రెళ్లె నక్కటఁ దత్తనువున్నది దానిఁదెచ్చి పీ
వనుపున నియ్యెడన్ జితమ బన్ని దహించెదఁ దాఁపమంతకున్. 711

వ. నావుడు హరిశ్చంద్రుండు ధర్మాత్ముండు గావున "నట్ల యొనర్పుము పోయి ర"
మ్మని యాజ్ఞ యిచ్చిన, హా పుత్ర ! హా బాలక ! హా తనూజ ! యని మాటిమాటికిఁ
గుందుచు నరిగి యబ్బాలకుం దెచ్చి శ్మశానమ్మున నునిచి యాక్రోశంబుదానిఁ బాంసు
ధ్వస్త శిరోరుహ పతితఁ లనఁ గృశాంగి జవ్యాంతరసంగతవాఁ దగువాని నప్పుడు
పతివ్రత నాత్మపత్నిగాఁ జిరవిరహసంగతుండగు కతన నెఱుంగక యా నృపేం
ద్రుండు కెంపు కరిగి శవమ్మున మన్న వస్త్రమ్ము లాగికొమటయు నయ్యతియు
వగ్రమ్మున నున్న యతివి పతికృశాంగు నన్యరూపు నాత్మధవునిఁగా నెఱుంగదయ్యె.

క. జంకమున బాలు నిడికొని, కొంకుచుఁ బలుమాఱు దలఁచికొని యేడుచు న
ప్పంకజముఖి దరిఁ కరిగిన, జంకె హరిశ్చంద్రు మనము సంశయహతమై. 713

## హరిశ్చంద్రుండు తనపత్ని నెఱుంగుట.

సీ. చంద్రుని గాదనఁజాలు వక్త్రముసొంపు • గండముల్ దర్పణఖండములగుఁ
గుంచితాగ్రమ్ములు కోమలంబులు నీల • ములు దీర్ఘములు పెన్నెఱులు దలంపఁ
గనులు రాజీవముల్, ఘనబాహులున్నతాం • సములు, వక్షము విశాల, మధరంబు
బింబమ్ము, పాదముల్ పృథులము, లంగుళుల్•సూక్ష్మముల్, నాభి యసూక్ష్మబిలము

గీ. మఱియు లక్షణముల వీఁడు మానవేంద్రు • నింటఁ బుట్టినకొడుకగు నింతనిజము
కాలవశమున నిట్టి దుర్గతికిఁ బాలు • పడియె నదిదాఁట లేఁడుగా బమ్మరమైన. 714

వ. అని కొండొక విచారించి పునఃపునరాలోకనం బొనర్చుచుఁ గ్రమక్రమమ్మున, 715

చ. వెనుకటి రీతులెల్ల స్మృతివీథిఁ దగుల్కొని చేరవచ్చి నం
దనుఁ డని నిశ్చయించి పరితాపము పట్టఁగలేక పుత్రకా!
యని విలపింపఁ గన్నుఁగవ నశ్రులు కాల్వలు గట్ట "నాతనూ
జునకె తటస్థ మాయె నిటు శోకము నెట్లు భరింతు నక్కటా." 716

వ. అని పలుతెఱఁగుల శోకించు నజ్జనపాలుని భర్తగా శంకించి శైబ్య యిట్లను.
మహాత్మా! నీకియ్యెడ నిట్టిదుష్కార్యమ్మున నుండు టెట్లు కలిగె మ మ్మెట్లు మఱ
చితి వనుచు దుఃఖావేశమ్మున విధి నుద్దేశించి, 717

క. ఓవిధి! యేవిధిఁ జేసితి?, భూవిభునిఁ ద్రిశంకుపుత్రుఁ బూతచరిత్రున్
శ్రీ వెలువరించి సుతభా, ర్యావిక్రయమునకుఁ జొనిపి యంత్యజకులుఁగాన్. 718

వ. అను నాకె నాత్మపత్నిగా నిశ్చయించి యీదుఃఖ మంతయు విధిప్రేరితంబై నాకై
వచ్చిన యది యని వగచుచు, 719

క. ఈ తరుణి నాతలోదరి, నాతనయుం డీశవంబు నా పాపమ యీ
యాతనకు హేతువని సం, జాతార్తిన్ మూర్ఛఁబొందె జనవరుఁ డంతన్. 720

వ. రాజపత్నియుఁ దనపతిదురవస్థచే ద్విగుణితశోకయై మూర్ఛిల్లె నంత గొంతవడికి
దెలిసి వరపాలుండు పుత్రుఁజూచి యిట్లు విలపించు. 721

క. అన్నా! దీనంబై కదుఁ, జెన్నుదఱిఁగి యున్న నీదు చిన్నిమొగము గ
న్గొన్నంత మన్మనము పగు, ల న్నేరక యుండె నిది శిలయొ వజ్రంబో, 722

ఉ. హాసుత! హాకుమార! తనయా! వినయాకర! "తాతతాత" యం
చాసమెయిఁ జా నను బిలుచు నన్మదదృష్టమ! యేమిదోసముం

జేసితినోయి! నన్నుఁగని చెచ్చెర మున్వలె వచ్చి పేనిపై
ఖాసిలుపంక మంటుగతిఁ బ్రామికొనంగదవోయి నవ్వుచున్. 723

మ. అకటా రాజ్యము బంధుసంతతియు దవ్వైపోయెఁ జాండాలవా
టికి నేతెంచితి వల్లకాటి నిటు లొంటిన్ వాసముం జేసి పే
వకవృత్తిన్ మనుచుంటి నియ్యదియు దైవం బోర్వఁగాలేక పు
త్రక! పాముం గఱపించెనే నిను? నపాఘ్యంబెద్ది యద్ధాతకున్. 724

క. ఘోరవిషవహ్నిఁ బంచత, గూరిననిఁ గనులఁజూడఁగూడెనె నా కం
ఠారాజర్షి విచారా, ధీరుండై యక్కుఁ జేర్చె తెగనివగ సుతున్. 725

క. మృతసుతుఁ గౌఁగిట విడుకొని, సుత సుత సుత యనుచు నెగడు శోకభరమునన్
స్మృతిచెడి మూర్ఛితుఁడై పడె, సుతశోకముకన్న నొండు శోకం బున్నే. 726

వ. ఇట్లు తేఁకువ చెడి మూర్ఛితుండై పడియున్ననరపాలు నీక్షించి శైబ్య సద్వ్రలక్ష
ణమ్ముల నీతండు విద్వజ్జనమనశ్చంద్రుండగు హరిశ్చంద్రుండకా నిశ్చయింపనగు
నని వెండియు, 727

ఉ. ఉన్నతిమై తిలప్రసవమో! యన నొప్పెడి నాసతీరు, సం
పన్నశిరాక్షికిం దగిన వక్త్రము, చారురదాళిసౌరు, పే
రెన్నిక నొప్పు వాక్పటిమ మిన్నిటికిం బయివచ్చు నీతఁ డౌ
నన్నరనాథుఁ డెవ్వని యుదారయశంబు త్రిలోకపూజ్యమౌ. 728

గీ. ఆ హరిశ్చంద్రుఁ డీతండ యైన నీ శ్మ
శానమున నుండు టేలొకో! సత్యసంధుఁ
డనుచు సుతశోక మడిగి యయ్యతివ సంత
సమును విస్మయదైన్యముల్ సనఁగఁ జూచె. 729

గీ. భర్తృపుత్రశోకమ్ముల భార మెక్కు
డై సహింపఁగరాని నయ్యతివమిన్న
మూర్ఛపడి కొంతవడి లేచి మొనయుసంత
మరల నరనాథుపై దృష్టి మాసనముగ. 730

చ. విలపి "నృపాల! యెంతకును నిందుఁడ కాఁడె విధాత వానికిం
గలదె జుగుప్సయున్ దయయుఁ గార్యమకార్యమునాఁగ నక్కటా!

యిల సకలంబు ధర్మగతి నేలెడి దేవసమాను నిన్ను వం
తల కెఱచేసి మాలఁకికి దాసునిఁ జేయునెకీ ర్తి కోయునే. 731

గీ. రాజ్య మెడచేసి పుత్రదారక్రయంబు
నకుఁ జొనిపి యంతఁబోక యంత్యకులుఁగా నొ
నర్చియును నీడఁబోవఁడు నాథ ! యేమి
తప్పొనర్చితి వవ్విధాత యెడ నీవు. 732

మ. అకటా ! యిట్యేడఁ గానరావుకద నీదౌ నాతపత్రంబు, ల
చ్చికిఁదావై రతనంపుఁ గూర్పుగల నీ సింహాసనంబున్, యశః
ప్రకటంబై తగు చామరద్వయము, పార్శ్వస్థాయి మంత్ర్యాది సే
వక బృందమ్మును, మంగళధ్వనులు, దీవ్యద్వాజి సంఘంబులున్. 733

శా. ఏ నీ వేగెడివేళ రాజమణులున్ భృత్యత్వముంబూని ముం
దై నేర్పొప్పఁగ నాత్మవస్త్రముల రథ్యాపాంసుసంశుద్ధిసం
ధానంబుం బొనరింతు రిట్టి ధరణీనాథుండవై నీవు నీ
కౌనే దుర్గమహా శ్మశానమున నిట్లావాసమున్ జేయఁగన్ ! 734

వ. వెండియుఁ గపాలసంకులంబును ఛటీపటనిరస్తరమ్మును మృత నిర్మాల్యసూత్రాం
తర్లగ్నకేశసుదారుణమ్మును వసావిస్పంద సంశుష్కమహాపటలమండితంబును
భస్మాంగారార్ధదగ్ధాస్థిమజ్జాసంఘట్టభీషణఁబును గృధ్రగోమాయునాదార్తమ్మును బుష్ట
క్షుద్రవిహంగమమ్మును చితాధూమాయతపటనీలీకృతదిగంతరంబును గుణపాస్వా
దనసంప్రకృష్టనిశాచరఁబునునై దూనంబగు నీ శ్మశానంబున దుఃఖితుండవై
యెట్లుంటివని శోకపరవశయై యతని నాలింగనంబు చేసికొని, 735

చ. నరవరమౌళిమానితకనత్పదపీఠ ! మహీమహేంద్ర ! యి
క్కరణి ఘటించుటెల్లఁ గల గాదుగదా ? నిజమేని ధర్మత
త్పరునకు నీకు నిట్లయిన ధర్మముతోఁడిక నేరికౌ ? ఋతా
దరు లెవ ? రెవ్వ రార్జవవిధమ్మున నుండెడివార ? లెట్యేడన్; 736

క. అని యెదగలఁగని దుఃఖ, మ్మున నేడ్చెడిదాని కవ్విభుండు తనకు మా
లని దాస్యము గల్గిన మే, టి నిమిత్తము చెప్పె బల్ కడింది వగ దగన్. 737

## చంద్రమతి పుత్రుండు మృతియైన చందము పతికిఁ దెల్పుట.

చ. ఇటు దనపాటు చెప్పి కడుహెచ్చిన శోకము పేర్మి నార్తిలం
పటుఁడగు ప్రాణనాథునకుఁ బట్టిఁ మృతింగను చందమెల్ల దు
ర్ఘటమగు వంతపెంపునఁ బరంపరగా వచియించె నాపె యం
తట నృపుఁ డాత్మజాతు వదనమ్మున వక్త్రముచొన్పి ఖిన్నుఁడై. 738

వ. తన్మయుండై యేమియు నెఱుంగక శోకించుచుండె నట్టి భర్తంగని శైబ్య
యిట్లను. 739

క. స్వామిద్రోహము సేయకు, మో మానవనాథ! సత్యమడిగెదె? నాపైఁ
బ్రేముడి నెడచేసి శిరం, బీమెయి నఱకుము విధాత కెదముద మొదవన్. 740

చ. అనవిని రాజు మూర్ఛఁగొని యంతనలేచి 'మృగాక్షి! యింతమా
టనఁదగునే? యశక్యకృతి కాదునె చేతులు? నాక కాక యె
వ్వనికిని" నాఁగ నమ్మగువ వల్కెఁ "బునర్భవమందునిన్ను నా
థునిఁగ నొనర్ప దేవికి నతుల్ పచరించితి నెమ్మనమ్మునన్. 741

క. ఇఁకఁ దడయనేల సత్యం, బకలంకము గాఁగఁ బ్రేమ మఱఁజేసి శిరం
బొక వ్రేటునఁ దున్మము మి, న్నక వెనుదీయంగ నేల నరనాథుఁడవై. 742

వ. నావుడు నరపాలుం డఖండంబగు దుఃఖావేశమ్మున మూర్ఛితుండై యంతన తెలిపి
పుత్రు మొగంబు చుంబించుచు భార్య కిట్లను. 743

ఉ. ఓనలినాక్షి! యింక భువినుండఁగ నోప శరీరధారినై
కానఁ గృశానుసంగతినిఁ గ్రాఁగి పరమ్మున కేగుదెంతు నన్
బ్రాణసమంబుగాఁ గను శ్వపాకునియానతి చెంద కిప్పువిన్
నేనయి చేయుచో నివట నిందయు నచ్చట హానియుందగున్. 744

క. చచ్చియు నీపాపమ్మున, వచ్చెదిజన్మమ్మునన్ శ్వపాకునిదాస్యం
బచ్చుపడఁ గాంచు టొప్పునె, విచ్చలవిడి లేనిబ్రతుకు వృథ యెవ్వరికిన్. 745

గీ. ఏది యెట్లైన, దుఃఖమ్ము నెనయుకంటె, మేనిసంబంధ మెడలుట మేలుకాదె
లేక శోకాకులుఁడు పుట్టి లేఁతవయసు, నంద మృతిచెందఁ బాప మేమాచరించెఁ

క. కులము వెగడించు నీతం, డలఘుం డని నమ్మియుంటి నకటా! జగదే
కలలితుఁ బుత్రకుఁ బాసియు, నిలపై మనఁగంటినొకని భృత్యుఁడ నగుటన్. 747

గీ. లేనిస్వాతంత్ర్యమును బూని లేమ యిపుడు
ప్రాణములు వాసి యేగినఁ బరమునందు
వైతరణియందు నసిపత్రవనమునందుఁ
గలుగు దుఃఖంబు దీనికిఁ దులయుఁ గాదె. 748

చ. లలనరొ యెట్టులైనను జ్వలజ్జ్వలనమ్మున మత్కుమారుతోఁ
గలసి శరీరమున్ విడుతుఁ, గాదనినన్ మరలింప కాఙ్క్ష నా
వలన రయమ్మునం గొనుము బ్రాహ్మణునింటికి నేగి దాసి వై
యలయక యమ్మహామహునియాజ్ఞ మెలంగుము జాగరూకతన్. 749

క. దానములు చేసి యగ్న్యా, ధానమ్ము లొనర్చి గురులఁ దనిపితి మేనిన్
మానిని! మన మూగురకున్, దానగు సంబంధ మమరధామమునందున్. 750

వ. అట్టి సంబంధమిఁక నీలోకమున దుర్లభం బదియునుంగాక యెన్నండేని రహస్య
మ్మునఁ బరిహాసమ్మునకుఁగా నిన్నవమానించి యుండుదునయ్యది క్షమింపు మిఁకఁ
బునర్దర్శనాకాంక్షిణివై ధర్మమ్మునకుఁ గట్టువడి యవ్విప్రునింట నుండి రాజపత్ని
వను గర్వమ్మున వారి నవమానింపక యెద్ది పంచినను సలుపుట నీకుఁ బరసాధనం
బని బోధించుపతికిఁ బతివ్రత యిట్లను. 751

క. నరనాథ నాకమైనన్, నరకం బయినన్ హితంబు నాతికిఁ బతితో
మరణంబు, నేను నిప్పుడ, యరుదెంచెద నీపిఱుంద నవహితమతినై. 752

వ. నాపుడుఁ బరమ పతివ్రతాశిరోమణివగు నీకు నియ్యది యొప్పదే! యిట్లొనర్తువు
గాకయని సహగమనం బంగీకరించి చిత నేర్పఱచి యందు సుతకళేబరం బమర్చి
భార్యాసహితుండై, యంజలిఘటించి పరమేశ్వరియు శతాక్షియు జగదీశ్వరియుఁ
బంచకోశాంతరగతయుఁ బుచ్ఛబ్రహ్మస్వరూపిణియు రక్తాంబరపరీధానయుఁ గరుణా
రససాగరయు నానాయుధధరయు జగత్పాలనతత్పరయునగు జగదంబ నాత్మం
దలంచుచు నగ్నిసంధానం బొనర్పునయ్యెడ. 753

## బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షంబగుట

ఉ. వాసవుఁ డాదిగాఁగల సుపర్వు లఖర్వరయం బెలర్ప న
గ్రేసరుఁగాఁగ ధర్ము నిడి ప్రీతి మెయిం బొడసూపి "మేలుమేల్
నీసరివారు లేరు ధరణీధవ! సత్యసహాయ! నాకసం
వాసుల మేము కిన్నరులు వారలు నీరలు సిద్ధచారణుల్. 754

వ. అనునంతఁ బితామహుం డిట్లను. 755

గీ. ధర్మరూపుఁడ నేను బితామహుండ, వీర లందఱు సురలును జారణులును
గిన్నరులు రుద్రు లశ్వినుల్ నిన్నుఁ జూడ, వచ్చినారు మహారాజ ! వైభవమున.

వ. ఇతండు విశ్వత్రయమైత్రీకారణుండగు విశ్వామిత్రుండు నీకుం బ్రియం బొనరింప
నరుదెంచి యున్నవాఁడు విలోకింపుము. 757

గీ. నీ తితిక్షాదిగుణముల నెమ్మి గొలుప, వచ్చితిని ధర్ముఁడను నేను సచ్చరిత్రు
లందు నెవ్వరికెక్కుడై యనఘమూర్తి, వైతి పదునాల్గులోకములందు భూప. 758

వ. అంత నింద్రుఁ డిట్లనియె. 759

క. వాసవుఁడ నేను నాపైఁ, గైసేయుము కొంతదృష్టి కొంతయు నీవుం
నీసుతుఁడును సుగుణమ్ములఁ, జేసి జగత్త్రయజయమ్ము చేసితిరి నృపా. 760

క. కొమరుఁడు నీవును భార్యయు, విమానసంగతుల రగుచు విచ్చేయుఁడు దే
హముతోడ స్వర్గమున కని, యమృతమయుం బైనవృష్టి నాతఁడు గురిసెన్. 761

గీ. దుందుభులు మ్రోయఁ, బూవులు దొలకరింప,
నచ్చరలు మెచ్చుగా నాడ, నా చితాంత
రమున శయవించియున్న భూరమణపుత్రు
పై నమృతవర్ష మప్పుడు పాదుకొనియె. 762

క. సుకుమారంబగు దేహం, బకలంకంబైన వదన మలరఁగ నా రా
జకుమారుఁడు రోహితుఁడు మ్ర, తికిఁ దక్కి తనంత లేచె దెసలు వెలుంగన్.

చ. నరపతి పుత్రువింగని మనం బలరం దగఁ గౌఁగిలించి సు
స్థిరుఁడయి భార్యఁజూచి సురసేవ్యములైన యలంకృతుల్ వరాం
బరములఁ బుష్పమాలికలఁ బట్టియు భార్యయుఁ దానుఁ దాల్చిమే
దురతర మోదవారినిధిదోఁగుచుఁ బూర్ణమనస్కుఁడై తగెన్. 764

వ. అయ్యెడ నింద్రుం డతని కిట్లను. 765

చ. పరమపతివ్రతామణియు భాసురశీలయునైన భార్యతో
సురుగుణుఁడైన పుత్రకు మహోత్తము నంకమునందుఁ జేర్చి పూ
ర్వరచితమైన పుణ్యము కరంబు తిరంబుగ నిర్వహింప నె
వ్వరికి నగమ్య మైన త్రిదివమ్మున కీ వరుదెమ్ము భూవరా. 766

క. అన సత్యహరిశ్చంద్రుం, డను దేవాధిప! శ్వపాకు ననుమతి గొని పైఁ
జనుదెంతు నాకు నాతం, డు వియోగము సేయఁదగు ఘనుండు విభుండుఁ. 767

వ. నావుడు ధర్ముం డిట్లనియె. 768

గీ. ఓయి నరనాథ! నాదగు మాయకలిమి, నేన చాండాలరూపమ్ము నూనినాఁడ
భావిసంగతి నెఱిఁగి నిన్ బనిగొనంగఁ, బక్కణమ్మున నుంటి నప్పాట నపుడు.

వ. పిమ్మట నింద్రుం డిట్లను. 770

క. రాజాధిరాజ! దినకర, తేజ! హరిశ్చంద్ర! పుణ్యతేజస్వులు వి
భ్రాజిత తపముల దేనికి, భాజను లా నాకపదము వడయఁగ రమ్మా. 771

చ. అన నరనాథుఁ డిట్లను సురాధిప! మత్పురవాసులెల్ల స
న్నను విడనాడి కుందరె? తనుం గని కొల్చెడివారి వీడువాఁ
డును ద్విజుఁజంపినట్టి యతఁడున్ మధుపాయియు స్త్రీని హంతగో
హననపరాయణుండును సము లౌట వచించెడిఁగాదె ధర్మముల్. 772

క. వారలతో స్వర్గమ కా, దారయ నరకంబయేని యది గమ్యమ నా
కోరాజ! తన్నుఁగొల్చెడి, వారల నేమని త్యజింప వలనగు ననుడుఁ. 773

క. జనవర! పురవాసుల కె, ల్లను స్వర్గమెసంగుటె ట్లలవదెడి? వారల్
పొనరిచిన పాపపుణ్యము, లన వేఱుగనుండుఁ దుల్యమగునే యెందుఁ. 774

వ. నావుడు రా జిట్లను. 775

గీ. వినుము సురనాథ! సేవకజనులకతన
రాజు రాజ్యం బొనర్చు ధర్మములు సేయు
జన్నముల కియ్యకొమనిందు సంభవించు
సుకృతము సమంబు నృపతికిఁ బ్రకృతితతికి. 776

వ. కావున మదనుష్ఠితంబులగు పుణ్యంబులు వారలకును ననువగు నిది యిట్లుండ నిం
కొక్కటి వచింతు నాదగు సుకృతమ్మున బహుకాలోప భోగ్యంబగు నాకపదంబ
వారలం గలసి యొకదిన మనుభవించినం జాలు నట్లగుట మత్సుకృతంబు విభజించి
యిట్లొనరించుటకు నినుఁ బ్రార్థించెద నావుడు నింద్రుం డట్ల యగుననిసమ్మతించి
ప్రసన్నహృదయుండై ధర్మవిశ్వామిత్రాదిపురస్సరమ్ముగ నయోధ్యకరిగి హరిశ్చంద్రు
సమక్షమ్మున వారలకిట్లను. 777

క. శర్మదమై యజ్ఞాదిను, కర్మము లొనరించువారు గాంచెడి స్వర్గ
మ్మర్మిలి మీకెల్లరకును, ధర్మానుగ్రహముకలిమిఁ దనరారెఁ దగన్. 778

వ. కావున నెల్లవారును నరుదెంచునది యనునెడ హరిశ్చంద్రుండు వారల కిట్లను. 779

క. దివమునకు వచ్చుటకు మీ, కెవరెవరికి నిచ్చ వొడము నెల్లరు నాతో
నవిరళగతి రాఁదగు నీ, దివిజాధిపుఁ డట్లు తనమదిం గరుణించెఁగా. 780

## హరిశ్చంద్రుండు కొడుకునకు రాజ్యంబిడి పౌరులతో స్వర్గమ్మున కరుగుట.

చ. అను తమ భూపునానతి సురాధిపునానతి యొండుగాఁగ బో
రనఁ జనుదెంచిరప్డు నగరమ్మున వారలు కొంద ఱా దివం
బునకు విమానమెక్కి తమపుత్రులపైఁ దగ నాత్మసంస్మృతిం
జొనిపి మనమ్ము స్వర్గమును జూచెడి వేడ్కల మిన్నుముట్టగఁన్. 781

వ. హరిశ్చంద్రుఁడు తక్కుంగల బంధుమిత్రులను దగు గౌరవమ్ములఁ దనిపి తన
కొమరుండగు రోహితునకు సాధుజనసమ్మతమ్మున విధివిధానమ్ముగఁ బట్టాభిషేకం
బొనర్చి. 782

క. తనకాంతామణియును దా, నును స్వర్గమ్మునకుఁ జనిరి నూతనఘంటా
నినదమ్మునఁ బొలుపొందెడి, యనూనపుష్పకము నెక్కి యమరులు వొగడన్. 783

వ. అట్లు సత్యనిధియైన హరిశ్చంద్రుండు స్వర్గమ్మున కేగుదెంచునెడ నాలోకించి దివి
జకవీంద్రుం డిట్టియర్థముగల శ్లోకంబు పఠియించె. 784

క. ఎంతటిదానం బెంతటి, శాంతిగుణం బెంతసత్యసంధత తగుఁ దా
నెంతకునైనను నీ భూ, కాంతుఁడు స్వర్గమొక హెచ్చుగా దితనియెడన్. 785

మ. జనలోకైక విశుద్ధచర్యుఁడు హరిశ్చంద్రావనీనాథు వ
ర్తనముం జెప్పితి దీని భక్తిగరిమన్ దానెవ్వఁడే విన్న ని
మ్మున వాఁడెయ్యదిగోరు నయ్యది సుఖమ్మో రాజ్యమో విద్యయో
ధనమో సంతతియో సురాలయమొ సందర్భించుఁ బారిక్షితా. 786

క. నావుడు జనమేజయుఁ డో, దేవా! దేవతలకన్నఁ దేజమ్మునఁ దె
ద్దై వెలయు శతాక్షీపద, భావు హరిశ్చంద్రు వింటి భావంబలరన్. 787

ఆ.వె. ఈ శతాక్షి యనఁగ నెట్లుదయించె ? నే, తన్మహత్త్వమెట్లు తనరు నాకుఁ
దెలుపు, మెద్ది వినిన యలఘుల కశ్వమే, ధశతఫలము ప్రతిపదమునఁ దొడరు.

గీ. ఎంత పీఱిఁడియైనను నెంత పాపి, యైనఁ దానెంత నిర్భాగ్యుఁడైనఁ బావ
నమ్ము శ్రోత్రపుహారి యిహమ్ముఁ బరము, నిచ్చు దేవీచరిత్రపై నిచ్చఁగొనఁడె.

క. అనవుడు వ్యాసుం డిట్లను, జనమేజయ ! నీకు దాఁపఁజన దెద్దియు స
జ్జనుఁడ వగుకతనఁ దెల్పెద, వినుము శతాక్షీమహత్త్వవిధ మదియెల్లన్. 790

క. దుర్గముఁడను పేర్వాఁడు ని, రర్గళబాహాప్రతాపుఁ డతిలోకుఁడు దు
ర్మార్గుండు హిరణ్యాక్షుని, వర్గీయుఁడు రురునికొడుకు వఱలున్ జగతిన్. 791

వ. అతండు దేవతలకు బలంబగు వేదమ్ములు హరించిన వారును నశింతురని తలంచి
హిమాలయమ్మునకుఁ జని వాయుభక్షుండగుచు సహస్రవత్సరమ్ములు విరించి
గుఱించి తపమ్ము సేయు చున్నంత, 792

## శా తా క్షీ మ హి మ.

గీ. క్షోణి యంతయుఁ గంపించెఁ గులమహీధ, రమ్ములు చలించె నతని తేజమ్ముకతన
నంతఁ జతురాననుఁడు ప్రసన్నాననాబ్జుఁ, డగుచు హంసము నెక్కి ప్రత్యక్షుఁడయ్యె.

వ. ఇట్లెదుటం బొడకట్టి సమాధిగతుండగు నా దుర్గముంగాంచి నీ తపమ్మునకు మెచ్చి
భవదభీప్సితంబు నొసంగవచ్చితి నను నలువకు మ్రొక్కి, దేవా ! జగతీసురుల
యందును సురలయందునుగల వేదమ్ములును మంత్రమ్ములును నా సమీపమ్మున
నుంటయు సురలకుఁ బరాజయంబు సేయఁగలుగుటయు నా కనుగ్రహింపవేయనిన
నట్లె యని యవ్విరించి తనవివాసమ్మునకుఁ జనియె నంత, 794

సీ. వేదశాస్త్రమ్ములు విప్రులు మఱచిరి • స్నానసంధ్యాహోమ జపతపమ్ము
లన్నియు నడఁగె, హాహాకార మవనియం • తయు నిండె, సురలును నాకమందు
యజ్ఞాదికమ్ముల హవ్యమ్ము దొరకమి • సౌఖ్యమ్ము విడనాడి సజరులైరి,
దుర్గముండును రణోద్యుక్తుఁడై వెల్చన • నమరావతీపురి నాక్రమించె,

గీ. వజ్రమయదేహుఁడైన యవ్వానితోడ • బోరఁగాలేక యమరులు భూమిధరగు
హాంతరంబులయెడకుఁ బలాయమాను • లైరి శరణమ్ము గానక ప్రాణభీతి. 795

వ. ఇట్లు దేవతలు గిరిగుహాంతరవిలయులగుచు జగదంబం గొనియాడుచున్నంత. 796

గీ. జన్నములు మాసి ధర్మంబు సున్నయైన, కతన నూతేఁడు లేకప్రకారముగ జ
గతి ననావృష్టిదోషంబు గలిగె; దాన, నేళ్ళఁ జెఱువులు నూతులు నెండిపోయె.

వ. దానంజేసి పశుపక్షిమృగాదులయందును మనుజులయందును శవసంగ్రహంబు విస్త రించె, నిట్లు జగదుపద్రవంబు సంభవించినఁ బదంపడి శాంతచేతస్కులగు కొందఱు విప్రులు హిమాలయంబు పజ్జకుంజని జగదీశానింగూర్చి సమాధిధ్యానపూజాయోగ మ్ములఁ నిరాహారులగుచుఁ దదేకాయత్తచిత్తమ్మున నారాధించుచు నిట్లు వినుతించిరి.

గీ. ఓమహేశాని! యపరాధయుక్తులైన, పామరులయెడ దయలేమి పాడియగునె!
కోప ముపసంహరింపుము, పాపు మీ య, నర్థమింకెవరు శరణమమ్మ! మాకు.

వ. అనంతకోటిబ్రహ్మాండనాయికయుఁ గూటస్థరూపిణియుఁ జిద్రూపయు భువనేశ్వ రియునగు నీకు నమస్కారము, "నేతినే" తీతివాక్యమ్ములచే బోధ్యమానవగుచు సర్వకారణంబవగు నీ కంజలిఘటింతు, మైతత్కాలికంబగు దురవస్థంబాపి మమ్ముం గటాక్షింపవే! యనువారి యెలుఁగు లాకర్ణించి యప్పరాంబయు నొక్కెడఁ బ్రత్య క్షంబయ్యె. 800

సీ. నీలాంజనముఁ బోలఁజాలు దేహమ్మును • బీనసమోత్తుంగవృత్తకర్క
శపయోధరములును శతనయనంబులు • భాస్కరకోటిప్రభాసమృద్ధి
జగదతీతమ్మగు సౌందర్యమును లవ • ణిమయును గలదాని విమలమధుర
రసయుతక్షుత్తృడ్జరాఘ్నశాలోదన • శాకఫలయుతహస్తములదానిఁ

గీ. జాప మాయుధములును హస్తములఁ దాల్చు • వెల్గుదానిని నప్పరాంబికను జూచి
స్తవ మొనర్చిన నాపెనేత్రముల నుండి • వారిధారలు గురిసె నవారితముగ. 801

వ. ఇట్లు నవరాత్రమ్ము లొక్కటంగి సకలౌషధీజాలసంతర్పకంబగు నేత్రజలాసారంబు వెల్లివిరిసిన దానంజేసి నవనదీనిర్ఝరమ్ము లనూనమ్ములయ్యె; సురలు గిరిగుహాంత రమ్ములనుండి వెలువడి భూసురులంగలసి యంబిక నిట్లు సన్నుతించిరి. 802

సీ. నిత్యసంతృప్తవు నిరుపమనిఖిలాగ • మాంతవేద్యవు భువనాధిపతివి
బ్రహ్మస్వరూపవు భక్తకల్పాగమ • మవు దేవి! నీవ యీ భువనమెల్ల
మాయచే సృష్టింతు వే యవతారమై • నను నెత్తుదువు భక్తజనులకొఱకు
నమితలోచనముల నలరారు నీరూప • మంబ! నిర్జరనిమిత్తంబ కాదె

గీ. యెత్తితి శతాక్షి యనుపేర నెసఁగుమింకఁ • దివిరి మా యాగమమ్ములు తెచ్చి యిచ్చి
కరుణఁ జూడుము మమ్ము నాఁకటికిఁ దాళ • లేమి నిన్ను నుతింపఁగ లేము తల్లి.

వ. అంత నప్పరాంబ తాను దెచ్చిన భోజ్యమ్ము లా సురల కిచ్చి యక్కాతమ్మున శాకం
భరి యనుపేర నెగడి యిట్లు వారల యుమ్మలికమ్ము వాపెఁ; బదంపడి దుర్గముం
డును దూతముఖమ్మున నిది యెల్ల నెఱింగి సహస్రాక్షౌహిణీపరిమితసేనాసము
పేతుండగుచు హిమాలయమ్మున కరిగి యద్దేవినికటమ్మున నున్న దేవతల నరికట్టి
విప్రులఁ బీడించిన, 804

క. ప్రోషము ప్రోవు మనుచు భూ, దేవత లొకపెట్ట నఱచ దేవియుఁ గరుణా
భావమ్మున నొక ఛత్రము, గా వర్తిలఁజేసె మీఁదుగాఁ జక్రమ్మున్. 805

## శతాక్షి దుర్గముం బరిమార్చుట.

వ. ఇట్లు బహిస్థిత యగుచు నొక్క శరంబేవియు నవ్వారిపైఁ బడకుండ సంరక్షించు
నద్దేవికిని దుర్గమునకును శరపరిచ్ఛన్నసూర్యమండలమ్మును బాణసంఘర్షణసము
ద్భూతపావకమ్మును గఠోరజ్యారణత్కారబధిరీకృతదశదిశాతటమ్మును నగు ఘోర
సంగరమ్ము కరమ్ము ప్రవర్తిల్లుటయుఁ దచ్ఛతాక్షీదేహమ్మునుండి కాళికయు దారి
ణియు బాలయుఁ ద్రిపురయు భైరవియు రమయు బగళయు మాతంగియుఁ ద్రిపుర
సుందరియుఁ గామాక్షియు జంభినియు మోహినియు మున్నగు ద్వాత్రింశచ్ఛక్తులును
ననుపదంబ చతుష్షష్టిశక్తులును దొడమి యసంఖ్యాతప్రకారంబున నడరి సాయుధ
హస్తలై మృదంగవీణాశంఖనాదనాదితంబగు రణాంగణమ్మున విజృంభించి శతా
క్షౌహిణీపరిమితంబగు రక్షస్సైన్యమ్ము రూపుమాపుటయు దుర్గముం డగ్రేసరుండై
శక్తులతోఁ బదినాళ్ళు పోరొనర్చి పదునొకండవనాఁడు, 806

సీ. అరుణచందనమును నరుణసరమ్ములు • దాలిచి గొప్ప యుత్సవముచేసి
పెంపారఁ ద్రిజగతీవీరునిగతి విక్ర • మించి శక్తుల నుక్కడంచి సోఁకు
మూఁకలతోడ వీరైకనియత మగు • తే రప్పరమశక్తి తేరి యెదుట
నిల్పిన వారి కనల్పంపుఁ బోరయ్యె • యామద్వయంబు భయప్రదముగ

గీ. రక్కసునిపైఁ బదేనునారసము లేసి
రెంట లోచనములను నాల్గింట గుఱ్ఱ
ములను నొక శరమున ధ్వజమ్మును భుజముల
రెంట సారథిఁ గొట్టె నొక్కింట దేవి. 807

వ. తక్కంగల యేనిట నవ్వానివక్షమ్ము చీల్చిన వాఁడును నెత్తురుగ్రక్కుచు నజ్జగ

దంబు పుష్పోభాగమ్మునం బడియె, నంత వాని కాయమ్మునుండి యొకతేజమ్ము వెడలి యాపెయందు సంక్రమించె. 808

మ. ఇటు లక్కంటకుఁ ద్రెళ్ళనేసిన జగమ్మెల్లన్ బ్రశాంతత్వసం
ఘటితంబయ్యె సమస్తదేవతలు నోంకారాత్మ ! యోదేవి ! య
క్కటికం బీదృశ మేరికిం గలదె ! దుఃఖగ్రస్తులకా మేల్మిఁ బ్రో
చుటకంచు న్నుతియించుచున్ గరముఁ బాకాజోడించి రొక్కుమ్మడిన్. 809

వ. ఇట్లు నుతించు హరిహరాదుల కాజగదంబ సంతోషకారిణియై కెలన నంజలిఘటించి యున్న విప్రుల కిట్లనియె. 810

క. ఈ నామే నధికమ్ముగ, మానింపం దగిన దేను మాటికిఁ బూజా
గానాదికములఁ గొలిచిన, మానిసులకు నిహముఁ బరము మానకయిత్తుకా. 811

గీ. దుర్గముండను రక్కసుకోడఁ బోరఁ, బెక్కుకన్నులతో నుద్భవించి వాని
హతముచేసినకతన శతాక్షి యంచు, దుర్గయంచును నన్నుఁగొల్వ దొనఁగు లడఁగు.

క. అని యుపదేశం బొనరిచి, కనుమొఱఁగెకా దేవి; యిట్టికత విన్నను వ్రా
సినఁ జదివినఁ జదివించిన, జనులకు నా దుర్గయే యొసంగును శుభముల్. 813

వ. ఇది పరమరహస్యమ్ముగా గోపనీయంబని మునుపు వ్యాసుంగాంచి జనమేజయుండు పరశక్తిభక్తులగు చంద్రవంశ్యుల చరిత్రమ్ము వినవలతు నాపుడు నాతం డిట్లనియె.

క. అంబిక దయచేత మహ, త్త్వంబుం గొనినట్టి చంద్రవంశ్యుల చారి
త్రంబును వచియించెదఁ ద, త్త్వంబుగా దగ విశ్వయించి ధరణీనాథా. 815

క. ఎంతయు నూర్జితమును శ్రీ, మంతమ్మును గడు విభూతిమంతమునగు నీ
యంతయు దేవీమయ మా, వంతయుఁ దదితర మొకింతయగుపడ దరయన్. 816

వ. సంసారవృక్షమ్మున కప్పరాంబికాపాదసేవనంబు దక్క మఱియొండు కుఠారంబు గానము; ధాన్యార్థియగువాఁడుముకం ద్యజియించునగిది నీసర్వంబును బోవిడిచి భువనేశ్వరీ పాదమూలంబు సేవించునది యని మఱియును. 817

సీ. ప్రాఁబల్కులను నకూపారమ్ము మథియించి • యప్పరశక్తిపాదారవింద
మను రత్న మరసి నే నతిధన్యుఁడ నయితిఁ; • బంచబ్రహ్మాసనయంచు విమతిఁ
గన్న యప్పరశక్తి కన్న నన్యము గాన, • మైదింటి కన్నను నధికమైన
వస్తు వవ్యక్త, మావస్తువునం దోత • ము మ బ్రోతమును జగ మనుచుఁ దెలియు

తే.గీ. వలయు, భువనేశ్వరీపదవాచ్యమైన • యప్పదార్థమ్ము దెలియని యజ్ఞు లొందు
వారు దుఃఖంబు, తజ్జులు దారసౌఖ్య • భాజనులటంచు నెఱుఁగుమో పార్థివేంద్ర!
వ. శ్వేతాశ్వతరశాఖీయులు స్వగుణనిగూఢయగు నాత్మశక్తిని దేవతలు ధ్యానయో
గమ్మునంజేసి కాంచిరచి నొడివిరి. వేయేల, జన్మసాఫల్యమ్ము కొఱకు సర్వ
సంగంబు పరిత్యజించి మనమ్మును హృదయమ్మున నిరోధించి లజ్జాభయభ్రష్టులం
దెద్దానిచే నైనను దన్నిష్ఠుండగుచుఁ దత్పరత్వంబు గాంచునది యని వేదాంత
సిద్ధాంతంబు. 819
క. నడుచుచు నిద్రం బోవుచుఁ, గుడుచుచుఁ గూర్చుండుచున్ సుగుణ సద్దేవిఁ జా
గడుభక్తిఁ గొలుచు నా మ, ర్త్యుఁడవో ముక్తుండు తదితరుఁడు గాఁడు నృపా.
వ. కావున విరాడ్రూపయు, సూత్రరూపయు, నంతర్యామిరూపిణియు, బ్రహ్మస్వరూపి
ణియు, సచ్చిదానందలక్ష్మీర్థరూపయుఁ, బ్రపంచోల్లాసవర్జితయునగు సప్పరశక్తిని
సక్రమమ్ముగ భజించి ముక్తుండవు కమ్మను వ్యాసునకు జనమేజయుం డిట్లనియె.
గీ. హరిహరబ్రహ్మలకు మును పంబ రమను, గౌరిని సరస్వతి నొసంగెఁ గావ్కగాఁగ
నంచుఁ జెప్పితి వందుఁ బద్మాలయకును, గౌరికిని నన్యకన్యాత్వఘటన యెట్లు? 822
వ. నావుడు వ్యాసుం డిట్లనియె. 823
క. మును హాలాహలనామక, దనుజులు వరజాతమైన దర్పముచే ను
ర్విని దేవలోకములఁ దమ, యనయమ్మున ముట్టడించు నవసర మందున్. 824
వ. హరిహరు లిరువురును నఱువదివేల వత్సరమ్ములు సంగరంబొనరించి రక్కసుల
నుక్కడంచి, తమ తావులకుం జని, తమ తమ శక్తులయొద్దఁ దమతమ పరాక్రమ
క్రమమ్ముల నుగ్గడించుకొనినవారును ననాదరసూచకంబుగ మందహాసం బొనరిం
చుటయు, నాదిమాయామోహితులగు కతనఁ గనలి వారల దురుత్తరావమానితలం
జేసిన నాశక్తులు తత్క్షణంబ కనుమొఱఁగి చనుటయుఁ బడంపడి హరిహరులు శక్తి
శూన్యులై తత్తత్కృతులయెడ నసమర్థులగుడు విరించి కొండొక చింతించి కారణం
బరసి హరిహరుల కార్యంబుల పైతము తాన నిర్వర్తించుచుఁ గొంత కాలమ్ము
గడపి పదపడి మన్వాదులను సనకాదులునునగు తనకొమరులం దలఁచి మీరు దేవి
నారాధించి తత్కరుణాపాత్రులరై హరిహరులకు మరల శక్తిప్రసాదంబు సంపా
దింపుఁడు, నావుడు వారలును హిమాలయతటమ్మునకుఁ జేరి మాయాబీజంబు జపిం
చుచు లక్షహాయనంబులు తపమ్మొనర్చునంత, 825

మ. తనవేదంపుగతిన్ ద్యజించి యనిమిత్తంబొందుఁ బాషండవ
ర్తన మెవ్వాఁ డతనిన్ భటుల్ కశలచేఁ దాడించుచున్ నిత్యదుః
ఖనివాసం బసిపత్రకాననము నెక్కంజేతు రద్దాని బా
ధను లెక్కింపఁ దరమ్ముగాదు తమువింతల్ కండతుండెమ్ములౌ. 197

తే.గీ. ధర్మ మెఱుఁగక శిక్షించు ధరణిపతియు
నతని యధికార మూనిన పతితుఁడును, ద్వి
జునకు శారీరదండమ్ము జొనుపు కష్టుఁ
డును బడుదురు సూకరముఖమున నరేంద్ర! 198

వ. ఆ సూకరముఖమ్మున నిక్షుదండంబుంబలె బిండిపిండియగుచు నార్తస్వరమ్మున మూర్ఛిల్లుచు ననేకగతుల వందురుచు రని పెండియు, 199

క. ఒరులను బాధింపని యా, త్మరతుల కెవ్వాఁడు పీడఁ దగఁజేయు నతం డురుతరదుఃఖస్థితులను, బొరయుటకై యంధకూపమునఁ బడు నధిపా. 200

వ. ఆయ్యెడఁ గ్రూరమ్ములగు పశుపక్షిమృగాదులచేతను సర్పమ్ములచేతను మశక యూకామత్కుణమ్ములచేతను నానావిధమ్ములఁ బీడింపఁబడునని మరియును, 201

గీ. పంచయజ్ఞవిహీనుఁడై పశువుపగిది, నెవఁడు భుజియించు నాదుష్టుఁ డేగెడి క్రిమి భోజనమ్మను నరకమ్ముఁ బురువునగుచు, లక్షయోజనములు దాని కుక్షి తనరు. 202

చ. అరయఁగ బ్రాహ్మణోత్తములదైన దదన్యులదైనఁగాని బం
గరు రతనంబు లియ్యవి పొగర్మిగులన్ హరియించెనేని య
న్నరున కయోమయమ్ములు కనద్ఘనవహ్నియుతమ్ములైన యు
ద్ధురతరపిండముల్ చొనిపి తోంపుబాధఘటింతు రచ్చటన్. 203

గీ. ఎవఁ డగమ్యాగమనమును నెఱిఁగిచేయు, నెవతె తాదృశపూరుషు నెఱిఁగి పొందు వీరలకు లోహమయ మతిదారుణంబు, నైన సూర్మితో నుపగూహ మమరు నచట.

గీ. మఱియు సర్వాభిగమన మ్మమరిన పురుషుఁ, బట్టి యమభటు లతిశోకభర మెసఁగఁగ వజ్రకంటకశాల్మలీపాదపంబు, మొదలఁ దా మంటదీసి కట్టుదురు పెలుచ. 205

వ. పాషండమతానుయాయులై ధర్మసేతువు నతిక్రమించు రాజులును దదనుగతులగు నమాత్యులును నిరయదుర్గపరిఖయగు వైతరణియందుఁబడి యాదోగణమ్ములచే

భక్షింపంబడుచుఁ జచ్చియుంజావక కర్మపరిపాకమ్మునఁ దద్గతమేదోవసాసిక్తకేశా
స్థినఖమాంసవిణ్మూత్రమ్ముల గ్రుంగుడువడుచు నవయుదురని వెండియు. 206

మ. తగు నాచారము శౌచముం ద్రపయు సంత్యక్తమ్ము లెవ్వారిచే
నగు నాయావృషలీపతుల్ పశుకృతిప్రారంభు లత్యంతదు
ష్పగమౌ నీనదియందు కూలి మలమూత్రశ్లేష్మముల్ కూడుగా
నెగడంగాఁగల రెన్నినాళ్లయినఁగానీ శోకముంగాంచుచున్. 207

గీ. శశకగర్దభజాతుల నెనయు దుర్మ, దులను మృగయారసికులను వలఘువిశిఖ
తాడనమ్ముల నింతలింతలుగఁ గోయఁ, బడుదురు పరమ్మునను యమభటులచేత.

గీ. దంభగతి జన్నములొనర్చి దారుణముగఁ, బశులఁ జంపెడి దుష్టులౌ బ్రాహ్మణులను
వైశసమ్మునఁ బడవైచి భటులు కశలు, కేలఁగొని కొట్టుదురు మేని తోలువదల.

క. తనభార్య నేద్విజుండు మ, దన మోహితుఁడై యొకింత తగవెఱుఁగమి నె
క్కొని శుక్లపానమును జే, య నొనర్చునో వాని కదియ యాహారమగుగా. 210

గీ. దస్యు లగ్నిదులును విషదాతృసార్థ, ఘాతుకులును గ్రామమ్ములఁ గలుగు ధనము
దోఁచురాజులు వీరు దుర్దుఃఖదంబు, శ్వానఖాదనమును బొందఁజనెడివారు. 211

వ. ఆయ్యెడ ననేకమ్ములగు పారమేయమ్ములు వీరల భక్షించు నిక్కాతమ్మున దీని
కీ వాసంబు గలిగె నని వెండియు, 212

చ. అనృతపుసాక్ష్య మిచ్చు జనుఁ డయ్యెడఁ బొందు నవీచినామకం
బను నరకంబు దావివిధమున్ విను మొక్కగిరిం దగంగ నె
క్కొనటులొనర్చి పిమ్మటను గుంభినికిన్ బడఁద్రోయుచుండ్రు యో
జనశత మంతరమ్మున నెసంగెడు నగ్గిరికిన్ ధరిత్రికిన్. 213

వ. ఆగ్గిరినుండి యధోముఖమ్ముగాఁ బడు నవ్వానికి జలము లేకయ తరంగసంగతం
బగుభంగి స్థలంబు గన్పడుట నయ్యది యవీచినాఁబరఁగు; నయ్యెడం బడుమీఁదఁ
దిలలవగిది దేహంబింతింతలయ్యును మృతిచొప్పడకుండెడి బదంపడి యథాపూర్వ
మ్ముగ నగ్గిరిశిఖరం బధిరోహించి యట్లన వొనర్చుచుందురు. 214

గీ. బ్రాహ్మణుండొండె రాజొండె వైశ్యుఁడొండె, సోమపానంబొనర్చియు సురనుగ్రోలఁ
గ్రాఁగెడి యయోరసమ్మును ద్రాగు నిరయ, మందుఁ బడి కాలదూతలు తందరింప.

వ. వీరల కళత్రంబేనిఁ బ్రమాదమ్మున సురాపానం బొనర్చినఁ బూర్వోక్తంబగు
గతియ యలవడు నని వెండియు, 216

క. ఘనులగు విద్యానిధులన్, దనకన్నఁ గొప్పవారిఁ దాఁ గని సంభా
వనచేయని మత్తుని దు, ర్మనస్కునిఁ క్షారకర్దమమ్మున ద్రైతుర్. 217

వ. అయ్యెడఁ దలక్రిందుగనుండి దుఃఖ మ్మనుభవింపవలయునని వెండియు, 218

క. నరమేధము లొనరించిన, దురాత్ములను మున్ను తాము దునిమిన పశువుల్
విరయమ్మున సౌనికముల, కరణిన్ బీడించి పెలుచఁ గడతేర్చు మునీ. 219

శా. హేలన్ గ్రామమునఁ వనమ్మననుగానీ యొద్దఁ బీడింపకే
కాలమ్మం దగుభంగిఁ బుచ్చు పశులన్ ఖండించి భక్షించు దు
శ్శీలుల్ కంకబకాదు లెల్లెడల హింసింపఁ క్షుధాత్యార్తులై
శూలప్రోతమునందుఁ గూలి మిగులఁ శోకింత్రుశూలక్షతిన్. 220

గీ. సర్పములఁబోలె జనుల హింసలను గొలుపు
కఠినహృదయులు దందశూకమునఁ గూలి
సప్తముఖములు పంచాస్యసహితములును
నైన పాములచేఁ బీడనందుచుంద్రు. 221

వ. ఎవ్వారేని గోతులయందును బొఱకలయందును గుహలయందును నొరుల నిరోధిం
తురో వారల నాయాయెడలన చొనిపి యందు విషయుక్తమగు వహ్ని నూల్కొల్పి
బాధింతురని వెండియు, 222

చ. సమయగతాతిథివ్రతతిఁ జాలఁ గఠోరపు దృష్టిఁ జూచు దు
ష్టమనుజుఁ గాకకంకముఖజంతువు లాగ్రహమూని తీక్ష్ణవ
జ్రమయములైన చంచువులఁ జక్షువులం బెకలించి పారె దు
ర్గమమగు ఘోరశోకమునఁ గ్రాఁగఁగఁజేయు ననేకభంగులన్. 223

క. తానార్జించిన ద్రవ్యం, బేనియు భక్షింప కొరుల కీక గ్రహమునాఁ
గా నెవఁడు గాచు విను మ, వ్వానికి సూచీముఖాభిపాతం బొలయుఁ. 224

వ. ఇయ్యవి నరులకు యాతనాభూములగు నరకమ్ము లింకను నిట్టివి వేలకొలఁది
గలవు. 225

క. తన ధర్మమ్మును విడువక, మనుజుం డెవ్వాఁడు లోకమాన్య చరిత్రన్
దనరెడి జగదంబం దా, గొనియాడున్ వాఁడు నరకగుఁడు గాఁడనఘా. 226

వ. నావుడు నారదుం డిట్లను. 227

క. జగదంబాపూజావిధి, దగుఁ దా నెఱ్ఱంగి దానిఁ దగ నానతి యి
మ్మొగి నెద్దాని నొనర్చిన, సుగుణులు నరకంపుఁద్రోవఁ జూడ రొకప్పుడున్. 228

వ. నావుడు నారాయణుం డిట్లనియె. 229

## జగదంబార్చనావిధానము.

క. పారమ్ము లేని యీ సం, సారమ్మున శక్తిపాదసంసక్తి మహా
ఘోరాఘూపయసులఁ గడు, దూరముగాఁ జిమ్మి సుఖము దొరకొనఁజేయున్.

సీ. ప్రతిపత్తిథిని నేయి పాయస కిడి దేవిఁ • బూజింప రోగముల్ వోవు, శర్క-
రను విప్రునకు ద్వితీయ నొసంగి యద్దేవి • నారాధనము సేయ నాయువొదవు,
ద్విజునకుఁ బాలుఁ దృతీయయం దిడి పూజ • చేసిన దుఃఖముల్ చెదరిపోవుఁ,
ఋడమిపేల్పునకు నపూపమ్మునిడి చతు • ర్థిని గొల్వ విఘ్నముల్ జనని యడఁచుఁ

గీ. పంచమి జగజ్జననికి రంభాఫలంబు • దగ నివేదించి యద్దాని ధరణిసురున
కిచ్చి కడుబుద్ధిమంతుఁడౌ, నెవఁడు మధువుఁ షష్ఠి నిటు సేయు వాని కెసంగుఁ గాంతి.

వ. మఱియు సప్తమియందు గుడంబు నివేదించి బ్రాహ్మణున కొసఁగి శోకహీనుం డగు; నష్టమియందు నారికేళఫలంబుల నివేదించి భూసురార్పణంబొనర్చి తాపమ్ములం బాయు; నవమియందు లాజల విప్లొనరించి యిహాముత్రసుఖాధికుండగు; దశమియందుఁ గృష్ణతిలల నంబార్పణంబొనర్చి పదంపడి బ్రాహ్మణాధీనంబొనర్చు వారికి యమలోకభయంబు లేకుండు. 232

క. ఏకాదశి నంబికఁ బా, జాకలితంజేసి పెరుగు సద్ద్విజునకుఁ దా
నేకాంతభక్తినిడు వాఁ, డా కామవిధాయినికిఁ బ్రియతముఁడు మౌనీ. 233

గీ. ద్వాదశి నెసందు పృథుకముల్ బరమభక్తి
నంబికాసన్నిధిని భూసురాగ్రగణ్యు
నకు నొసఁగు వానియెడ దేవి కధికముగను
బెలఁగు సంప్రీతి యది యెంతసేయ దనఘ! 234

క. పెవగలు త్రయోదశి జగ, జ్జననికి నర్పించి విప్రసత్తమునకు ని
చ్చిన వానికి సంతానం, బనూనముగ నొదవు మునికులాగ్రణి వింటే. 235

క. సక్తు నివేదనమున పర, శక్తి చతుర్దశినిఁ బూజసలిపి యదియు బల్
రిక్తునకు విప్రునకు నిడి, వ్యక్తముగ శివప్రియత్వ మందు మునీంద్రా. 236

గీ. పాయసము పూర్ణిమను నయ్యపర్ణ కొసఁగి, దాని బ్రాహ్మణాధీనంబుఁ దగనొనర్పఁ
బితరులకుఁ బ్రీతిగల్గు నో యతివరేణ్య!, హవన మాడినమందుఁ జేయంగవలయు.

వ. హోమంబొనర్చునెడ ప్రతిపదాదిపూర్ణిమాంతతిథ్యుక్త పదార్థంబులు వలయు; వెండియు నాదిత్యవారమ్మునఁ బాయసమ్మును సోమవారమ్మునఁ బాలును భౌమవారమ్మునఁ గదళీఫలమ్మును బుధవారమ్మున నవనీతమ్మును గురువారమ్మున ఖండశర్కరయు శుక్రవారమ్మున సితయు శనివారమ్మునఁ గోఘృతమ్మును దేవీప్రీతికరమ్ము; ఇంక నక్షత్రక్రమమ్మున నైవేద్యమ్ముల వివరింతు. ఘృతమ్మును దిలలును ఖండశర్కరయు దధియు దుగ్ధమ్మును గిలాటకమ్మును దధికూర్చియు మోదకమ్మును ఫేణికయు ఘృతమండకమ్మును గంసారమ్మును వటపత్రమ్మును ఘృతపూరమ్మును వటకమ్మును గోకరసకమ్మును బూరణమ్మును మధుసూరణమ్మును గుడమ్మును పృథుకమ్మును ద్రాక్షయును ఖర్జూరమ్మును రాజకమ్మును నపూపమ్మును నవనీతమ్మును ముద్గమ్మును మోదకమ్మును మాతులుంగమ్మును ననునివ్వివి నక్షత్రనైవేద్యమ్ము; ఇఁకవిష్కంభాదియోగమ్ములకు వివరింతు; గుడ, మధు, ఘృత, దుగ్ధ, దధి, తక్రాపూప, నవనీత, కర్కటీ, కూశ్మాండ, మోదక, పనస, కదళీ, జంబూ, చూతఫల, తిల, నారంగ, దాడిమ, బదరీఫల, ధాత్రీఫల, పాయస, పృథుక, చణక, నారికేళ, జంబూఫల, కశేరుసూరణమ్ములు క్రమమ్ముగఁ దెలియునది; మఱియుఁ గరణమ్ములకు వినుము; కంసారమ్మును మండకమ్మును ఫేణియు మోదకమ్మును వటపత్రమ్మును లడ్డుకమ్మును ఘృతపూరమ్మును దిలమ్మును దధియు ఘృతమ్మును మధువును ననునివి తత్ప్రీతికరమ్ములగు నైవేద్యమ్ములు; మఱియు నొండు విధానమ్ము సెప్పెద నాకర్ణింపుము. 238

గీ. చైత్రశుద్ధతృతీయ నిచ్చలు మధూక, వృక్షము యజించి మఱియు నైవేద్యములనునొసంగఁదగుఁ బంచఖాద్యసుసంగతముగ, వెండియు వచింతు వినుము సవిస్తరముగ.

వ. వైశాఖమాసమ్మున గుడమ్మును జ్యేష్ఠమ్మున మధువును నాషాఢమ్మున నవనీతమును శ్రావణమ్మున దధియును భాద్రపదమ్మున శర్కరయు నాశ్వయుజమ్మునఁ

బాయసమ్మును గార్తికమ్మున క్షీరమ్మును మార్గశీర్షమ్మున ఫేణియుఁ బౌషమ్మున దధికూర్చికయు మాఘమ్మున గోఘృతమ్మును ఫాల్గునమ్మున నారికేళమ్మును శుద్ధ తృతీయార్చితంబగు మధూకమ్మునకు నైవేద్యమ్ములు మఱియు మంగళయు వైష్ణవియు మాయయు మహామాయయుఁ గాళరాత్రియు దురత్యయయు మతంగియుఁ గాళికయుఁ గమలవాసినియు శివయు సహస్రచరణయు సర్వమంగళరూపిణియు నను నీనామమ్ములఁ గ్రమమ్ముగ నమ్మధూకమ్మున దేవి నర్చింపవలయు బదంపడి వ్రతంబు సంపూర్ణంబగుపొంటె నమ్మధూకగతయగు నంబికంగూర్చి. 240

గీ. "అంబ పుష్కరనేత్ర లోకైకజనని, మంగళాకార భక్తసమ్మాన్య పాప
హారిణి మహేశి దుర్మార్గహంత్రి పరగ, త్రివదాత్రి ప్రజోత్పత్తి ధీవిదాత్రి. 241

గీ. మదవిధాత్రి మదోన్మత్త మానగమ్య, పరపురుషరూప పరమేశి ప్రళయకాల
మేఘసదృశ లోకేశి యమేయ యమని, వాసహారిణి యమపూజ్య తాపసేవ్య. 242

గీ. వీరజాతా వ్రతసహచారిణీ మహావి, మోహనాశిని యమవిగ్రహోహప్రథిత
సర్వసంగవివర్జిత సంగనాశ, కరి యమాగ్రజ కామాక్షి కామ్యరూప. 243

గీ. మర్మభేదిని మీనాక్షి మధురశీల, మంత్రగమ్య మహామంత్రమండితాత్మ
దేవి కంకాలఘోర సుధీజనాళి, వంద్య మధురస్వరార్చిత వందనములు. 244

గీ. అంబ యశ్వద్ధవటకపిత్థామ్రనింబ, బదరికాలయ క్షీరార్కపనసకుజక
రీరరూపిణి దివ్యశరీర దుర్గ, వల్లివాసిని నీకిదె వందనంబు. 245

వ. ఇట్లు వ్రతాంతమ్మున మతించినవారలకు సమస్తకామప్రపూర్తియగు; నీస్తోత్రమ్మెవ్వాఁడు నిత్యము పఠించు వాని కగు ఫలంబు వినుము. 246

సీ. బ్రాహ్మణుఁడు శృతిసంపన్నుఁడౌ, రాజు వి • జయమందు, వైశ్యుఁడు సంపదగను
శూద్రుఁడు సుఖమందుఁ, జొప్పడకుండు నా • ధివ్యాధిభయమరాతిభయమేని;
శ్రాద్ధకాలమ్మున జపియింపఁ బితరుల • కక్షయమ్మగు తృప్తి యలరు నిట్లు
పరశక్తి నర్చించు పక్కిఁకఁ దెల్పితి • నిది చేసి నరుఁడు లోకేశకోద

గీ. నైక్యమునుజెందు నొక్కఁడే యనఁగ నేల
యంబ నర్చించువారల కఖిలకామ
ములను సిద్ధించు నరకమ్ము మొదలనడఁగు
స్వప్నమునవేని భయము జొప్పడదు మౌని. 247

## స్కంధాంతపద్యములు.

క. ఆశీర్వాదప్రాపిత, పేశలకవితాప్రభావవిశ్రుతశిష్యా
దేశితసర్వత్రమహో, రాశీకృతకీర్తిసాంద్ర! బ్రహ్మసుధీంద్రా! 248

విచిత్రవృత్తము. ధరాపాలసేవాపరీతాంఘ్రిపద్మ
స్ఫురచ్ఛాత్రలోకస్థిరాత్మప్రకర్షా! 249

రథోద్ధతము. పూర్వజన్మకృతపుణ్యసంచితా
ఖర్వశాస్త్రచయకల్పితప్రభా
దూర్వహత్వపరితుష్టశిష్యహృ
త్పర్వచంద్రనిభ! పండితప్రభూ! 250

### గద్య.

ఇది శ్రీ.........తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన దేవీభాగవతంబను మహాపురాణంబునందు అష్టమస్కంధము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరదేవతార్పణమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## నవమస్కంధము.

### పీఠిక

శా. శ్రీనాథుండు సరస్వతీవిభుఁడు గౌరీభర్త యమ్మవ్వరున్
దానొచ్చం బమనాళ్లలోకముల కాధారంబుగానుండి తన్
ధ్యానింపం దలకొన్న భాగవతసంతానంబు వర్ధిల్ల వి
జ్ఞానం బిచ్చెడు నాదిశక్తిని ముముక్షం గోరి మ్రొక్కందగున్. 1

చ. అతులితకావ్యనాటకరహస్యవిధిజ్ఞుఁడు వేదవేది సం
స్తుతమతి శిష్యవత్సలుఁడు సూనృతవాగ్రుచిరుండు జ్యోతిషా
ప్రతిహతుఁ డుప్పులూరికులవారిధిచంద్రుఁడు రమ్యకీర్తివి
శ్రుతుఁడగు రామజోగన గురుప్రవరున్ స్మరియింతు మెంతయున్. 2

వ. అని యిష్టదేవతాభివందనంబును గురునమస్కారంబును గావించి యెద్దియే నొక్క విధూతభవబంధంబగు ప్రబంధంబు నాంధ్రీకరింపం దలంచుచుండ నొక్కనాఁడు. 3

క. యోగీంద్రవందితము విగ, మాగమసారార్థభూత మఖిలముముక్షు
స్వాగతమార్గము దేవీ, భాగవతము వ్యాసమౌనివరవిరచితమున్. 4

శా. ప్రజ్ఞావంతులు శాబ్దికుల్ కవులు విద్వాంసుల్ శతావధా
నజ్ఞుల్ శ్రీపతివేంకటేశ్వరు లమందప్రీతిఁ దెల్గించుచున్
విజ్ఞానాఢ్యుల రామకృష్ణుల మమున్ వీక్షించి యస్మన్మనీ
షాజ్ఞత్వంబున నిచ్చి రందు నవమస్కంధంబు దెల్గింపగన్. 5

వ. తత్సమావేశ ప్రకారంబెట్లనిన. 6

#### సీసమాలిక.

తారకమంత్రచింతకుఁడు భైషజ్యవి • ద్యాతత్వవేత్త రామయ్య తాత
తృష్ణావిదూరుం డతిప్రశాంతుఁడు తత్వ • వేత్త యౌ నారప్ప పిన్నతాత

ధాతుపరీక్షణదక్షుఁ డౌషధమర్మ • విదుఁడు నా కొమన్న పెద్దతండ్రి
నిత్యక్రియాసక్తి నిర్మలాంతశ్శక్తి • కలుగు రామస్వామి కన్నతండ్రి
సుందరదేహుండు సుజనప్రియుండు నా • నల రాజగోపాల మనుఁగుతమ్ముఁ
డమలచిత్తులు సర్వసములు సీతారామ • సుబ్బరాయాంకభాజులు పితృవ్యు
లన్నదానాదర యగు లచ్చమాంబాభి • ధానవ్యసాధ్వీమతల్లి తల్లి
శ్వశ్రూపరాయణసచ్చిత్త సుబ్బమ • తతదయాంసగుణోదార దార

గీ. గలుగువాఁడను నాకొండికులభవుండ • కోవిదప్రియుఁ డాత్రేయగోత్రజుండ
ప్రథితచరకాదివైద్యశాస్త్రప్రవీణుఁ • డమలమతి రామమూర్తినామాంకితుండ. 7

క. తిరుపతివేంకటకవులం, దిరువురిలో నొకఁడు వేంకటేశ్వరకవికిన్
జిరజీర్ణకృచ్ఛ్రరుజమును, సరసౌషధముల నొసంగి సాధించె వడిన్. 8

గీ. శ్రీ లలితమైనయట్టి మా వోలవరము
నందు మాసద్వయం బుండి యౌషధంబు
పుచ్చుకొనియెను వెంకటబుధుఁడు; మాకు
మువ్వురకు నేస్తమయ్యె నప్పుడు దృఢముగ. 9

క. నీరుజుఁడై విశ్వాసము, ప్రేరేపన్ జెళ్ళపిళ్ళ వేంకటకవి మా
లో రామమూర్తి గుణనం, భారము వాక్రుచ్చె నొక్క మత్తేభమునన్. 10

వ. అది యెట్లంటేని. 11

మ. కవిత నైపుణిగాంచి చక్కఁ జతురంగంబాడఁగా మించి గా
నవిధిన్ బద్యములం బఠింపఁదగు విన్నాణంబు నార్జించి వం
శవశంబై యెడఁబాయకున్నదగు భైషజ్యంబునం జక్రవ
ర్తివినై యొప్పితి రామమూర్తి! శమితార్తీ! కీర్తికిన్ మూర్తివై. 12

ఉ. ఈవును గృష్ణమూర్తియును నేకముగా నొకచోఁ బఠించుటన్
భావము కబ్బ మొక్కగతి భాసిలు మిత్రులు మీర లిర్వురున్
గావున నిచ్చవచ్చు నొకస్కంధముఁజూచి తెలుంగుఁజేయుఁడీ
దేవిచరిత్ర మందు భవదీయగుణోన్నతి వెల్లడిల్లెడున్. 13

క. అని యనురాగాతిశయం, బున వాక్రుచ్చుటయు దీనిఁ బూరింపంగా
వను వగునే నిహపరసా, ధన మబ్బునటంచుఁ జెప్పఁదలఁచితి మంత్రిన్. 14

సీ. శివకేశవాలయస్థిరకార్యకరుఁ డన్న • దాత వెంకనమంత్రి తాతగారు
అతిథిపూజానక్తి యపరార్చనాభక్తి • బరఁగిన జనకుండు బాపిరాజు
అఁకలిగొన్నవా రగపడ్డ సంతృప్తి • గఱపుమహాలక్ష్మి కన్నతల్లి
పరదారపరధననిరసనశీలుఁడై • వెలయు నెజ్జుమరాజు పిన్నతండ్రి
గీ. కలుగువాఁడను నిశ్శంకకులుఁడ నన్ను • కృష్ణమూర్తి యటందు రీకృతివరంబు
దెలుఁగుపేయుచు రామమూర్తియును నేను • రామకృష్ణు లైనవారము కలయిక.
వ. ఇట్లని వితర్కించితిమి. 16
శా. పర్లిప్తుండు సదాన్నదాత బహుళాంతేవాసి ధీరాశియౌ
చర్లబ్రహ్మయశాస్త్రి పేరఁ గృతిగా సర్వంసహామండలీ
స్వర్లోకాఢ్యము దేవిభాగవతమున్ శ్రద్ధాసమున్నద్ధులై
నిర్లక్ష్యంబుగఁ దెల్గుపేయుఘను లెందేఁ బూజ్యతం జెందరే. 17
గీ. అట్టి తిరుపతివేంకటేశాఖ్యకవులఁ, గలసి చెప్పుటకన్న భాగ్యంబు కలదె!
చందనంబుల నడుమ వృతంబు లెవ్వి, యున్నఁ దత్పరిమళ మబ్బకున్నె కొంత.
వ. అని దృఢనిశ్చయులమై. 19
క. ఈరామకృష్ణకవులము, ప్రారంభించితిమి దేవిభాగవతమునం
బేరగు నవమస్కంధము, నారసి తెలిఁగింపఁ బండితాహ్లాదముగా. 20
తే. గీ. తివిరి యీనవమం బేము తెలుఁగుసేయఁ
బూను టరయ నిదెల్లెనఁ బూజ్య మనియు
ముక్తిదాయకమనియు నాసక్తి గాని
కవితయందలి వేడ్కచేఁ గాదుసుండు.

## కథారంభము.

క. నిరతాన్నదానకృత్య, స్ఫురదాత్మతపోవిశేషభ్రాంతకళా
పరిపాలితశిష్యయశః, పరివర్ధితకీర్తిసాంద్ర! బ్రహ్మసుధీంద్రా! 22
గీ. ఆవధరింపుము సృష్టిక్రమాంతరముగ, లలి గణేశాంబ దుర్గయు లక్ష్మి రాధ
యును సరస్వతి సావిత్రి యనఁగ నైదు, విధములా బ్రకృతి జగాన వెలసె ననుచు.
వ. పశివగర్భుఁడెఱింగించుటయు నారదుండు. 24

గీ. ఏమి రూపమ్ములందాల్చె నేల ప్రకృతి?, యెవరి కేలకణమ్ముల నవతరించెఁ?
దత్తదీయపూజావిధుల్ తత్తదీయ, మహిమము వచింపుమనఁ, జెప్పె మధువిరోధి.

చ. ప్రకృతికి లక్షణంబు నుడువంగ సమర్థుఁడు లేఁడొకండు పీ
సకలమహామహీస్థలిని; జక్కఁగ ధర్మునివల్ల వింటి నే
నొకతఱి పత్స! కొంత యది యోపినరీతిగ నీకుఁ దెల్పు పూ
నికఁ గయిగొంటిఁ గాన మదినిల్పి వినందగుఁ దద్విశేషముల్. 28

వ. "ప్ర" యనఁ బ్రకృష్టవాచకంబును 'కృతి' యన సృష్టివాచకంబు నగు; సృష్టియం దేదేవి ప్రకృష్టయో యామె ప్రకృతి యనంబడు. 'ప్ర' సత్వగుణాత్మకంబగు 'కృ' రజోగుణాత్మకంబును 'తి' తమోగుణాత్మకంబును గావున నద్దేవియుఁ ద్రిగుణాత్మికయయ్యె. 'ప్ర' ప్రథమవాచకంబును 'కృతి' యన సృష్టివాచకంబును గావున సృష్టికి నాదికారణమైన యాదేవికిఁ బ్రకృతినామము సిద్ధించినది. సృష్ట్యాది నాత్మ రెండు విధములయ్యె నందుఁ గుడిని బురుషుండు నెడమఁ బ్రకృతియు నందు నదియె బ్రహ్మరూపము; నిత్యము సనాతనమునై యలరారు అగ్నిదాహికలకుఁ బోలె నాత్మశక్తులకు భేదమసదు. 27

ఉ. నారద! యందుచేతనె సనాతనులైన ముకు ల్తలోదరీ
పూరుషభేదమున్ గనఁగఁబూనరు బ్రహ్మమె యెల్లవారికి
తీరునఁ బొల్చు నప్రకృతి దేవియుఁ గృష్ణ సిసృక్షచే ముదం
బారఁగఁ బుట్టి యావెనుక నందిన దీగతి నైదురూపముల్. 28

సీ. శివ శివప్రియ సిద్ధి శివరూప బ్రహ్మాది • విబుధవందితశీల విష్ణుమాయ
నారాయణి మహేశి నవయశోమంగళ • కీర్తిద సర్వశక్తిస్వరూప
తేజోమయి జగదధిష్ఠాత్రి దీనార్త • శరణాగతత్రాణపరచరిత్ర
బ్రహ్మస్వరూపిణి పాపవిమోచని • మోక్షదాయిని మునిపూజితాంఘ్రి

గీ. సిద్ధరూప సిద్ధేశ్వరి బుద్ధి నిద్ర • దయ పిపాసయు నాకలి దాంతి శాంతి
కాంతి తుష్టియుఁ బుష్టియు భ్రాంతి యనఁగ•నెలమిఁ జరియించుచుండు గణేశమాత.

సీ. సర్వసంపద్రూప సత్యస్వరూపయు • సర్వమంగళదాంతి శాంతియుక్త
భగవంతునకుఁ బ్రేమపాత్ర ప్రియంవద • ప్రాణతుల్యయుఁ బతివ్రత శుభాంగి
కామలోభములు రుషామోహములు వీడి • మమతకు దవ్వైన మంజుశీల
సర్వసస్యాత్మిక సర్వజీవనమార్గ • భక్తానురక్త సర్వప్రపూజ్య

గీ. పాపుల వివాదబీజమ్ము, ప్రభువుల ప్రభ, • వర్తకులకు వాణిజ్యమై వఱలుచుండు
సతతవేదోక్త మార్గసమ్మతి వహించి • శ్రీమహాలక్ష్మి వైకుంఠసీమయందు. 30

సీ. వాగ్బుద్ధివిద్యల వఱలు నధిష్ఠాత్రి • హిమకుందచందన సమశరీర
సందేహభంజని సర్వవిద్యారూప • సంగీతకారిణి సత్వశీల
విమలయు మేధయు విద్య కవిత్వంబు • ప్రతిభయుఁ దానెయై పరఁగు దేవి
మునులకు ద్విజులకు మూకత్వ మెడలించి • ఫలము లొసంగు తపస్స్వరూప

గీ. కేల వీణెయుఁ బొత్తమ్ము లీలఁబట్టి
రత్నమాలను దాల్చి పఃపరుడయిన
కృష్ణు యజియించుకొనుచుఁదాఁ గెరలుచుండు
శ్రుతిశిరోమార్గముల సరస్వతి సతంబు. 31

సీ. అమితతేజోవతి యానందదాయిని • శుద్ధస్ఫటికరూప శుభగుణాఢ్య
బ్రహ్మతేజోమయి బ్రహ్మస్వరూపిణి • బ్రహ్మలోకప్రద బ్రహ్మవిద్య
నాల్గువర్ణముల జననియు సనాతని • యాత్మశుద్ధిప్రద యఖిలసేవ్య
ఛందస్సులకు వేదశాస్త్రమ్ములకు మంత్ర • తంత్రావళులకు సంధ్యకును దల్లి

గీ. సర్వసంస్కారరూపిణి సత్వమూర్తి • జపతపఃఫలదాత్రి ద్విజాతికొఱకు
వెలసె గాయత్రియగుచు సావిత్రి జగతి • నీమె ప్రకృతి నాల్గవరూప మోమునీంద్ర!

ఉ. ఐదవరూపమై యలరు నామెకు రాధ సనాతనస్వరూ
పోదయభాగ్యయుక్తిమెయిఁ బొల్పగు కృష్ణుని పక్షమందునా
మోదమునొందుచుండు సతమున్ మునిమానసగోచరంబు నా
పాదిత సర్వలోకచయ పాపవినాశకర ప్రభావయై. 33

చ. సురలు సురేశ్వరుల్ మునులు జూడఁగలేరు తదీయరూప మం
బరమునఁ గోటిచంద్రుల ప్రభావిభవం బుదయించినట్లు సం
బరమగు వహ్నిశుద్ధమగు వల్కలరాజము భూషణావళుల్
పరఁగెడు నామెదేహము వెలుఁగనిపించును లక్ష్మి కున్కియై. 34

చ. అఱువది వేల వత్సరములామె గుణించి తపంబొనర్చె ను
ద్ధురనియమవ్రతుండగుచుఁ దోయజగర్భుఁడు పూర్వకాల మా
హరియు వరాహమైనయపు డామె తమిన్ వృషభానుపుత్రియై
ధర నలరారెఁ దత్పరిచితంబులు పాపము లాఱిపోవఁగన్. 35

సీ. పంచవిధప్రాణపరిపాలనాశీల • యఖిలభక్తజనభాగ్యానుకూల
నిఖిలలోకారాధ్య నిర్గుణ నిర్లిప్త • నిరహంకృతి నిరీహ నిత్యహర్ష
ప్రథితగోపీవేష భాగ్యవిధాయిని • గోలోకవాసిని గోపపూజ్య
రాసమండలజాత రాసేస్వరేశ్వరి • రాసలోకనివాసరంజితాత్మ
గీ. రాసకేళీవినోదవిరాజమానుఁ • డైన కృష్ణున కేలికసాని రాధ
సుందరులలోన సుందరి బృందయందు • నాఁటివారలకెల్ల నానంద మొసఁగె. 36

వ. మఱియుఁ బ్రధానాంశ కళాంశ కాలాంశ జాతలై త్రిభువనంబుల యందలి సర్వ యోషిత్తులును దేవీరూపధారిణులై యుందు, రందుం బూర్ణతమలు పంచవిద్యాధిదేవత లనంబడుదురు. వారియందుఁ బ్రకృతిప్రధానాంశరూపంబులఁ దెల్పెద నాలకింపుము. 37

సీ. జగములు తరియింప జలజాక్షుపదమందుఁ • బుట్టువుఁగాంచిన పూతచరిత
యందంబునకు మెచ్చి యభవుండు తనశిర • మ్మునఁ దాల్చినమేటి సుందరాంగి
తాఁకినమాత్రానఁ దనుకల్మష మెడల్చి • పతితులఁ బ్రోచు కృపాస్వభావ
గోలోకమునకు భక్తులు వోవ సులభమౌ • సోపానపంక్తి గానొప్పుదేవి
గీ. కలుషపూరితమౌ కలికాలమందు • మహిమ తగ్గని తటిని, సప్తనదుల
కగ్రచారిణియైన జాహ్నవి తదీయ • మౌ ప్రధానాంశసంజాతయై యొసంగు. 38

క. ఇంకొక ముఖ్యాంశముగనా, సంకటములఁ బ్రోవ దివ్యసాధన మగుచున్
బంకేజాక్షుని వక్షో, లంకారంబై నెగడు తులసి జన్మించెన్. 39

క. నారాయణు నర్ధాంగి యు, దారంబగు వర్తనంబు తనరంగా, లో
కారాధితయై జనులకుఁ, దీఱని దుఃఖమ్ములైనఁ దీర్పు మునీంద్రా! 40

గీ. సర్వపుష్పసారసంభూతయై భూమి, నవతరించి జనుల యఘము ద్రోచు
కల్పవృక్షమన నవల్పమౌ తులసికి, మ్రొక్కనట్టి నరుఁడు పొందు నఘము. 41

ఆ.వె. ఒక్కదళము దెచ్చి యుదకంబులో నుంచి, త్రాగునెడల నెచటి పాపమైన
నడఁగిపోవు నయ్య! యల్లగంగాజలం, బేవి తులసినీటి నెనయలేదు. 42

చ. తులసికిఁ గేలు మోడ్చి వినతుల్ పచరింపని వాని జన్మ మెం
దులకునుగాదు సుమ్ము పరితోషము నొంది సహస్రలాభము
ల్సలుపుచునుందు నాలుగుదళమ్ములుదెచ్చి యజించు వారి కా
వల ఘటియించు స్వర్గసుఖవాసము నిత్యముగాఁ గుమారకా. 43

క. తులసియె పరదేవత ని, ర్మలభక్తిన్ గొల్చు వారి మన్నించుచుఁ దాఁ
గలికల్మషశుష్కేంధన, ములఁ గాల్పఁగ దావవహ్నిపోలిక నెసఁగున్. 44

వ. జ్ఞానవిశారదయు, శంకరునకుఁ బ్రియశిష్యయు, నాగేశ్వరుండగు ననంతునకు భగినియు, నాగపూజితయు, నాగేశ్వరియు, నాగమాతయు, నాగభూషణయునగు కశ్యపాత్మజయు దేవీప్రధానాంశ సంజాతయె. మూఁడులక్షల వత్సరంబులు విష్ణుంగూర్చి తపంబొనర్చి మంత్రాధిదేవతయై బ్రహ్మతేజస్వరూపిణియై జరత్కారునకుఁ బత్నియు మునిప్రవరుఁడైన యాస్తికాఖ్యునకుఁ దల్లియు నగు నాపె ప్రభావం బనన్యము. మాతృకలయందుఁ బూజ్యతమురాలైన దేవసేనయు నద్దేవీప్రధానాంశమె. జగజ్జనులకుఁ బుత్రపౌత్రదాయినియై షష్ఠియను పేర నొప్పు వృద్ధయోగిని ప్రకృతి షష్ఠాంశ సంజాత. సర్వకామదయై జలస్థలంబులయందును సూతికాగారంబులయందు నధివసించి శిశుక్షేమకారిణినా నీమె ప్రసిద్ధిఁ గాంచినది. ప్రకృతిముఖసంభూతయైన మంగళచండికను బ్రతిమంగళవారమును బూజించు సువాసినులకుఁ బుత్రపౌత్రాభివృద్ధియు సర్వవాంఛాపూర్తియు సిద్ధించు. కోపించిన జగములన్నియు క్షణములోఁ గూల్చుటకును రక్షింపఁదలఁచిన రక్షించుటకు నీమె సమర్థురాలు. శక్తి దేవీప్రధానాంశ సంజాత. కోటిసూర్యప్రభాజాజ్వల్యమానవిగ్రహయు, సర్వశక్తి ప్రధానయు, సర్వసిద్ధిప్రదయుఁ, గృష్ణరూపిణియుఁ, గృష్ణునకు భక్తురాలును, నిశ్వాసమాత్రమున సర్వబ్రహ్మాండమండలంబును సంహరింప శక్తురాలును, ధర్మార్థకామమోక్షచతుర్విధఫలదాయినియునై శుంభనిశుంభుల విజృంభణ మడంప నుద్భవించిన దుర్గ దేవీలలాటసంజాత. సర్వాధారభూతయు, సర్వసంపత్ప్రదాత్రియు రత్నగర్భయు సర్వరత్నాకరాశ్రయయు బ్రహ్మాదిసురాసురసకలమనుజలోకసంస్తూయమానయునగు వసుంధరయును దేవీప్రధానాంశమునఁ బుట్టినది. ఇఁక దేవీకళామాత్రమున జన్మించిన చంద్రాననలెవ్వరెవ్వరి భార్యలో వారల మాహాత్మ్య మెట్టిదో తెల్పెద నాలకింపుము. 45

గీ. అఖిలపూజితయై స్వాహా యన నెసంగు, వహ్ని హవిర్భుజు భార్యగా నలరు సాధ్వి
యమరులకు యజ్ఞభాగమ్ము లమరునెట్లు ?, లామె కృప సుంత లేదేని, నమరమౌని!

గీ. యజ్ఞపూరుషు తరుణిగా నలరుచుండు, దక్షిణాదేవి సర్వత్ర దీక్ష పూజ్య;
వీరలిర్వురు లేకుండ వెలయు కర్మ, నిచయములు మేదినీస్థలి నిష్ఫలములు. 47

గీ. ఎవతె లేకున్నఁ బితృదానమెల్ల వ్యర్థ, మా స్వధయుఁ బితృదేవుల కంబుజాక్షి;
స్వ[illegible] గాలికి భార్య నిష్ఫలము లీమె, విడిచి చేయు దానాదానవిధులు జగతి. 48

గీ. ఏది లేకుండునెడల నీయెల్లజగము, లందుఁ బురుషులు స్త్రీలుఁ గార్యమ్ము గాంతు
రాయమయుఁ బుష్టి గణపతి యర్ధదేహ, మన్నివిధముల సేవ్యురాలై యెసంగు. 49

గీ. అయ్యనంతుని పత్నిగా నలరు నట్టి, తుష్టి లేకున్న జగములు తూలిపోవు
నీశ్వరుని లేమ సంపత్తి యీమె లేక, యెల్లయెడల నిప్పచ్చర మేడిపించు. 50

గీ. సర్వలోకమ్ములకు ధైర్యసాధనమయి, గడనకెక్కిన సతి ధృతి కపిలపత్ని
సకలజనులను బాంధవ్యసరణి నంపఁ, జాలినట్టి సతీదేవి సత్యదార. 51

గీ. మోహపత్నిగ నెగడెను ముగ్ధయె దయ, ఆమె లేకున్న సృష్టియే యాఁగిపోవుఁ
బుణ్యదారప్రతిష్ఠను బూజసేయ, పలయు లేనిచో జగము జీవన్మృతంబు. 52

గీ. లోకులకుఁ గీర్తి మృగ్యంబు ప్రాకటముగ, సుకృతి యిల్లాలు కీర్తిని జూపకున్న
జగతి నుద్యోగభార్యయై నెగడు క్రియను, గన్మొఱంగిన కర్మయె గాసిజెందు. 53

గీ. అర్ధదేహమ్ము ధర్మున కల్లమిథ్య, విధి వినిర్మితమైన యీవిశ్వ మఖిల
మీమె లేకున్న విచ్ఛిన్న మెల్లధూర్త, లంజలిఘటింతు రీపెకు నన్వహంబు. 54

గీ. కపటుఁ డీమెకు పైదోదుగాఁ జరింప, నెల్ల గృహములలో వసియించుచుండుఁ
గలుషకలికాలమందు నీకలికి సేవ, నాచరింపనివారల నరయలేము 55

చ. ఒరుల కదర్శనీయయయి యుండుఁ గృతమ్మునఁ, ద్రేతయందు ను
ర్వర నతిసూక్ష్మరూపము సెలంగఁగఁ దాఁ జరియింపసాఁగు, ద్వా
పరమున నర్ధదేహమున బాసిలుచుండు, సతిప్రగల్భయై
తిరుగుఁ గలిన్ సరాసరిగ దేహబల మ్మడివోవకుండఁగన్. 56

గీ. త్రపయు శాంతి సుశీలని ధర్మపత్ను, లవి వినా లోకు లున్మత్తులగుట నిజము
బుద్ధియును మేధ ధృతియన ముగురుకలరు, జ్ఞానదారలు మౌఢ్యమ్ము పదమడింప.

గీ. కాంతి రూపమునన్ గనంగనగు మూర్తి, ధర్మునకు ధర్మపత్నియై తనరుచుండు
నామె లేక నిరాధారమై కృశించు, నఖిలలోకమ్ములం బరమాత్మతోడ. 58

ఆ. వె. మూర్తిరూపయగుచుఁ గీర్తింపఁబడియెడు, నిద్ర రుద్రదేవు నీరజాక్షి
యోగసిద్ధి యీఁతగాఁగ రాత్రులయందు, నన్నిజగము లీమె యావహించు.

ఆ. వె. దినము రాత్రి సంధ్య యనఁగ నొప్పారుచుఁ, గాలమునకు ముగురు కలరుసతులు;
వీరు లేనియెడల విశ్వవిర్మాతయుఁ, గాలమునకు లెక్కగట్టలేఁడు. 60

గీ. ఎవరిసేవకొఱకు నీవిశ్వమఖిలంబు, చింతచేతఁజిక్కి చివుకుచుండు
నట్టి క్షుత్పిపాస లరయ లోభునిభార్య, లింతమహిమ యుండ దేరికైన. 61

గీ. ప్రభయు దాహిక సతులైరి పావకునకు
వారు లేకున్న నీసృష్టి వలను పడదు
జగము లడఁగింపఁ బుట్టిన జరయు మృతియుఁ
గాలకన్యలు ప్రజ్వాలు కమలముఖులు. 62

గీ. తంద్రయును బ్రీతి నిద్రకుఁ దనయులగుచు
సుఖుని వరియించి జగములఁ జుట్టుకొనిరి
శ్రద్ధయును భక్తివైరాగ్య చానలైరి
జనులకు ముముక్షుమార్గమ్ము లనువుపడఁగ. 63

వ. దేవమాతయగు నదితి దైత్యమాతయగు దితి గోమాతయైన సురభియుఁ గద్రూ
వినతలును బ్రకృతికళాజాతలై సృష్టి కుపయుక్తలైరి. దేవీకళాజాతలైన పూవుం
బోఁడు లింకను జాలమంది కలరు; రిందుం గొందఱఁదెల్పెద నాలకింపుము.
చంద్రపత్నియగు రోహిణి, సూర్యదారయగు సంజ్ఞ, మనువునిల్లాలగు శత
రూప, యింద్రగేహినియగు శచి, బృహస్పతి పెండ్లమగు తార, వసిష్ఠుని
వామాక్షియగు నరుంధతి, కర్దమప్రసూతియు దక్షకామినియునగు దేవహూతి,
పితృమానసకన్యకయు నంబికామాతయునగు మేనక, లోపాముద్ర, కుంతి, కుబేర
కామిని, బలికిఁ జెలియగు వింధ్యావళి, దమయంతి, దేవకీయశోదలు, గాంధారి,
ద్రౌపది, శైబ్య, సత్యవతి, రాధామాతయగు వృషభానుప్రియురాలు, మందోదరి,
కౌసల్య, కౌరవి, రేవతి, సత్యభామా కాళిందులు, లక్షణానాగ్నజితులు, లక్ష్మియే
స్వయమ్ముగా నవతరించె నని చెప్పఁబడు సీతారుక్మిణులు, వ్యాసమాతయగు
యోజనగంధి, బాణపుత్రియగు నుష, ప్రభావతి, భానుమతి, భార్గవజననియైన
రేణుక, రామమాతయగు రోహిణి, ఏకనన్ద, శ్రీకృష్ణ భగినియగు దుర్గ మొదలగు
వారందఱును ప్రకృతి కళాజాతలైన పావనచరిత్రలు. గ్రామదేవతలును బ్రకృతి
కళాసంజాతలె. ప్రకృత్యంశమునఁ బుట్టిన భామినుల నవమానించుట ప్రకృతి నవ
మానించి నట్లయగు. 64

చ. పతియు సుతు ల్గలట్టి యొక బ్రాహ్మణినైనను నెమ్మిదేండ్లు సాం
ప్రతముగ నిండినట్టి యొక బాలికనైనను వస్త్రమాల్యభూ
షితగ నొనర్చి పూజలను జేసిన దేవియు సంతసించు సం
తతమగు పుణ్యలోకములు తప్పవు సు మ్మటువంటివారికిన్. 65

గీ. ప్రకృతిసంభూతలై నవారలు జగాన, నుత్తమాధమమధ్యమ లొప్పుచుందు
రమితసత్వాంశసంజాతలౌ పతివ్రత, తలు నెగడుచుందు రెందు నుత్తమ లనంగ. 66

గీ. అమితముగ భోగనిరతలై యఖిలసుఖము, లనుభవించుచు స్వీయకార్యములయందె
సక్తలగువారు మధ్యమ సతిణినుందు, రల్లప్రకృతి రజోంశమ్మునందుఁ బుట్టి. 67

గీ. దుర్ముఖులు కులనాశిమల్ ధూర్తురాండ్రు, కులట లధమనికృష్టశ్రేణిక నలఘువాచ
స్వర్గమునమందు నప్సరస్సమితిగూడఁ, బ్రకృతికిఁ దమోంశమునఁ బుట్టుచుందినారు.

చ. సురధుని పూజకుఁజా మొదట సొక్కి యనంతరమందు దుర్గ భా
స్కరకులమందు రావణుని జంపఁగఁబుట్టిన రామచంద్రుచే
నురుతరపూజలం గనియె నోపికమై తరువాత నీమె నం
దఋను యజింపసాఁగిరి సనాతనియంచు నుదీరితాఖులై. 69

ఉ. ఆదిని దానవాంతమున కాయమ దక్షునికూఁతురయ్యె నా
సాదితసర్వలోకశుభసాంద్రుని భర్తను బుద్ధిలేక యు
న్మాదముతోఁడఁ దండ్రి యవమానమొనర్పఁగ నైఁపలేక పా
దోదితయోగవహ్నిఁ దన యుత్తమదేహము వీడె నారదా। 70

చ. పిదప హిమాద్రికూఁతురయి పెద్దతప మ్మొనరించి యంత నా
త్మదయితుఁడైన శంకరుని మన్ననగాంచి చరించు సద్గతి
ప్రదయయి కృష్ణవంశగఁ జెలంగు గణేశుఁడు వైష్ణవాంశ యొ
ప్పిదమగునట్టి స్కందుఁడును బేరువహించిరి తత్కుమారులై. 71

గీ. మొదట మంగళభూజాని పూజసేయ, లక్ష్మిసర్వఖాసేవ్యయై రాజకెక్కె
నట్టులే యశ్వపతి భక్తి నాదరింప, వెలసె సావిత్రి జగముల వినుతయగుచు. 72

గీ. బ్రహ్మ సేవించె నలసరస్వతిని మొదట, నంతకంతకు మాహాత్మ్య మతిశయిల్ల
నిమ్మహాదేవి సత్కృప్రవ నెనయులేవి, వాని జన్మంబు చంద్రుఁడులేనిరాత్రి. 73

గీ. రాధ గోలోకమందున రాణకెక్కె, కార్తికమ్మునఁ బౌర్ణమిఁ బూర్తియైన
గౌరవంబును గృష్ణునికతనఁ గాంచె, రాసకేళీ వినోదవిరాజితయయి. 74

గీ. గోకులమ్మునఁ బుట్టిన గోపబాలు, రాది వృద్ధులవఱ కామె కంజలియిడి
సేవజేసిరి కృష్ణపూజితయె గనుక, నఖిలలోకమ్ము లాదేవి నాశ్రయించె. 75

గీ. గ్రామదేవత మొదలుగాఁ గలుగు నఖిల, చంద్రముఖులకు సేవలు నలుపవలయు
నోపినంతగఁ దెల్పితి నొక్కకొంత, యిదియె ప్రకృతిచరిత్ర మోయీకుమార ! 76

## పంచ ప్రకృత్యాద్యుత్పత్తి.

చ. అని వినిపింప నారదుఁ డనంతర మేగతి సృష్టికాద్యయౌ
జనని జనించె నేగతివి స్వాంశము లైదువిధంబులయ్యె వా
రివిఁ యజియించు మార్గముల నిష్ఠయమెట్టిదొ ? విస్తరంబుగా
వినఁగఁదలంతుఁ దెల్పఁగదవే యని కోరఁగ నాతఁ డిట్లనెన్. 77

గీ. గగనమును విశ్వగోళము కాల మాత్మ, యఖిలదిశలు గోలోకము నలరుచుండు
శాశ్వతంబులుగాఁగ నాస్వర్గమందు, నొక్కచక్కని వైకుంఠమొప్పుచుండు. 78

గీ. బ్రహ్మలీల సనాతని ప్రకృతి నిత్య
యగ్నికిని దాహికా శక్తి, కబ్జవైరి
కమలినజ్యోత్స్న. కెండకు నబ్జహితున
కేపగిది నవినాభావ మెసఁగు నట్లె
ఆత్మకుఁ బ్రకృతికి విభేద మరయరాదు. 79

గీ. స్వర్ణకారుఁడు స్వర్ణ ముపాధిలేక, కుండలములట్లె. కుండలఁ గుమ్మరియును
మన్నులేకుండఁ జేయుట సున్న: సృష్టి, కశమ్ముండఁగుఁ బరమాత్మ యామెలేక.80

గీ. జ్ఞానము సమృద్ధి సంపదైశ్వర్యములును, యశము బలము భగమ్మగు; నదియలరెడు
దేవి భగవతి; యామెతోఁ దేజరిల్లు, నాత్మ భగవంతుఁ డను పేర నతిశయిల్లు. 81

సీ. మాలతీమాల్యాతిమాన్యవక్షమువాని • నెమలిపింఛము మౌళినెగడువాని
శరదంబుజాతసుందరనేత్రములవాని • శ్రితజనానుగ్రహస్మితమువాని
మురళిచే శోభిల్లు కరములుగలవాని • మెయినిండ నగలచే మించువాని
కటిసీమఁ బీతాంశుకము గట్టువాఁడని • మంగళప్రదమైన మహిమవాని

గీ. వన్నిజగముల కాధారమైనవాని • సిద్ధికారకు సిద్ధేశు సిద్ధిరూపు
సుందరుని దేవదేవుఁ గిశోరు ధీరు • నాత్మరూపుని వైష్ణవు లాశ్రయింత్రు. 82

గీ. కంటి కగుపడకుండియుఁ గాంచఁజాలు, నఖిలజగముల నాపరమాత్మ నిజము
బ్రహ్మకల్పంబు తత్పరబ్రహ్మమునకు, నిమిషమాత్రంబ కాదె, యవిమిషమౌవిః

గీ. కృషియనంగఁ దదీయభక్తివచనంబు, భక్తిదాస్యప్రదాతయై వఱలుకతన
నాపరాత్పరునకుఁ గృష్ణుఁడనెడిపేరు, శాశ్వతంబుగ నలరారె జగతియందు. 84

గీ. సృష్టియొనరింప మనమునఁ జింతచేసి, యతఁడు తనమేను రెండుగా నలరఁజేసెఁ
గుడిని బురుషుండు నంతట నెడమభాగ, మఖిలసుందరియైన వామాక్షి యయ్యె.85

సీ. శరదంబుజాతసుందరమైనదేహంపు • దీప్తులు దెసలందుఁ దేజరిల్ల
శ్రీఫలమ్ములఁ గేలిసేయు నురోజముల్ • రత్నభూషలతోడ రాయిడింప
విశ్వమోహనలీల వేడుకగల్గించు • చిఱునవ్వు ముఖమునఁ జెంగలింపఁ
గటిబిల్వ మోయఁగాఁగలిగినయూరువుల్ • కదళీతరుస్తంభగతి వహింపఁ
గీ. గలదులేదను నడుమున లలితమైన • వహ్నిశుద్ధాంశుకమ్మును వఱలఁదాల్చి
కృష్ణముఖచంద్రకాంతులఁ గ్రేవగనుల • నానుచున్ నిల్చె నంతట నంబుజాక్షి. 86
సీ. నొసటఁ గస్తురిబొట్టు భాసఁగించి యాక్రిందఁ • జందనసింధూరబిందువులిడి
రత్నేంద్రసారహారముగట్టి కొప్పున • నరవిమ్మవిరజాజి యలరులుంచి
సహజసుందరదేహసౌభాగ్య ముత్సాహ • వివశత్వమును నభివృద్ధిగాంచ
నాఁడురాయంచలకైన వంకలదిద్దు • గమనవిలాసము గ్లానిపింప
గీ. దరికిఁజేరినయట్టి సుందరిని గాంచి • వలచివలపించుకొనఁజాలు చెలువమలర
రాసమండలమున మహారసికుఁడైన • కృష్ణుఁడు జయిష్ణుఁ డామెతోఁ గ్రీడసల్పె. 87
గీ. ఒక్కబ్రహ్మదినంబునం దుచితరీతి, నమ్మెయిం గ్రీడసల్పి యనంతరమున
శ్రాంతుఁడౌచు జగత్పిత చాన యోని, యందు సమధికమైన వీర్యమును విడిచె. 88
వ. ఆమెయుఁ బరిశ్రాంతయగుచు నొక్కనిట్టూర్పు విడిచిన నయ్యదియు మేని ఘర్మోదకంబులను జగమ్ముల నిండినవి. ఆనిశ్వాసమునుండి జగత్ప్రాణుండును తత్పత్నియు వారికుమారులగు ప్రాణాపానవ్యానోదానసమానమ్ములను పంచప్రాణములను జన్మించినవి. ఘర్మతోయంబులనుండి తోయాధిదేవతయగు వరుణుండును దత్పత్నియగు వరుణానియు జన్మించిరి. శతమన్వంతరమ్ముల కృష్ణ గర్భమ్మును ధరించి బ్రహ్మతేజమ్మతో నలరారుచుండఁగృష్ణునకుఁ బ్రాణప్రియురాలును గృష్ణ వక్షస్థితయునగు నా కృష్ణచిచ్ఛక్తికి స్వర్ణదేహచ్ఛాయగల్గిన విశ్వాధారుండగు కుమారుండుదయించె. అంతట నద్దేవియుఁ జీకాకువడి యాబాలకుని మున్నీటిలో విసరివైవఁ గృష్ణుం డదిచూచి హాహాకారమ్ము లొనర్చుచు, "నీయపత్యమును గోపనిష్ఠురవై త్యజించితివి గావున నిది మొదలు నీవును నీయంశచే జన్మింపఁగల సురస్త్రీలును ననపత్యలౌదు" రని శపించె. 89

ఉ. అంతట మద్భవించె నల యంబముఖాగ్రమునుండి భూషణా
త్యంతమనోహరమ్ములగునంగములన్ సితవర్ణ మొప్ప వే
దాంతనమస్తశాస్త్రనిచయాధిపురాలగు కన్య యొార్తు హ
స్తాంతములందుఁ బుస్తకము నచ్ఛతమౌ నొకవీణె దాల్చుచుణ్. 90

వ. ఈ మెయిఁ గొంతకాలంబునకు వామార్ధమ్మునఁ గమలయు దక్షిణార్ధమ్మున రాధికయుఁగా ద్విధారూపయయ్యె; నంతఁ గృష్ణుండును వెంటనే దక్షిణార్ధమ్మున ద్విభుజుండును వామార్ధమ్మునఁ జతుర్భుజుండునై చతుర్భుజుండగు నారాయణునకుఁ గమలారాధికల నొసంగిన నాతండును వారలం దోడ్కొని వైకుంఠమ్మున కరిగె; రాధాంశసంజాతలగు వీర లిర్వురు ననపత్యలై యందున నారాయణాంగమునుండి చతుర్భుజులైన పార్షదులును గమలాంగఁబునుండి తుల్యరూపవయస్కలగు దాసికోటులు జన్మించిరి. ఇదియటులుండ గోలోకనాయకుని రోమకూపంబులనుండి గోపాలురు సమానతేజఃశోభలశాలులును, రాధారోమకూపంబులనుండి రత్నభూషణభూషితురాండ్రును, స్థిరయౌవన లనపత్యలు నగు గోపికలు నుదయించి రీసమయంబున. 91

సీ. ప్రకృతి కాధారయౌ పరమేశి తప్తకాం • చనవర్ణశోభిత శక్తిసేవ్య
కోటిసూర్యప్రభాకోటీర శ్రితభక్త • కల్పద్రుమంబు సంపత్ప్రదాత్రి
వహ్నిశుద్ధాంశుక వరరత్నభూషణ • భూషిత బ్రహ్మాదిపూజనీయ
మాయానవిజ్ఞేయ మహనీయశస్త్రాస్త్ర • ధారిణి సర్వవిద్యానియంత్రి

గీ. వేయిభుజములఁ దాల్చిన విశ్వమాత • మూఁడుకన్నులు గలిగిన మూలశక్తి
కృష్ణదేవత సకలసంకీర్తనీయ • యైన దుర్గ కృష్ణునిమ్రోల నవతరించె. 92

గీ. వైష్ణవులకు వైష్ణవియౌచు వరములిచ్చు, రాజులకు రాజ్యలక్ష్మియై రాణకెక్కు
స్వర్గమున స్వర్గలక్ష్మియై సంచరించు, గేహవాసుల కెల్లెడ గేహలక్ష్మి. 93

గీ. వహ్ని యందున దాహిక, వనజమందు, శోభయు దివాకరునియందు జూడవెలుఁగు
చంద్రముని యందు వెన్నెల సర్వజగము, లందు శక్తియునీమెయై యలరుచుండు.

గీ. సంసృతికి బీజమీమెయె, శాంతిమొదలు, సకలగుణములు నీమెయె, సర్వమూల
మైన జగదంబ తా నిట్టు లవతరించి, కృష్ణు వినుతింపుచున్ నిల్చెఁ గేలుమోడ్చి.

ఉ. ఆనతిఁ గాంచినంత దరహాస మెలర్పఁగ రాధికావిభుం
డాసనమిచ్చె నంతట నయత్నముగాఁగఁ జతుర్ముఖుండు నా
భీసరసీజమం దొదవె వేదవిదుండును బ్రాహ్మణప్రభా
భాసితుఁడై కమండలువు పావనహస్తమునన్ ధరింపుచున్. 96

గీ. ఆతవిశోదనె గోటిచంద్రాతపమ్ము, లలరునట్టులు మేనికాంతులు వెలార్ప
తెల్లచీరెను దాలిచి తేజరిల్లు, నంగనయొకర్తు వినుతించు చవతరించె. 97

వ. అంతటఁ గృష్ణుండు నా మిథునంబు నెదుటనున్న రత్నసింహాసనంబులం దాసీను లం జేసి మఱల దక్షిణభాగంబు యథాపూర్వముగ గోపికాపతియు వామార్ధంబు మహాదేవుఁడుగను ద్విధారూపుఁడయ్యె. 98

సీ. శతకోటిరవికాంతిసమమైనతేజంబు • భస్మభూషితదేహపటిమఁ బెనుపఁ
దప్తకాంచనసమస్తవ్యదేహవిభూతి • భూషణమ్ములచేతఁ బొలుపుగాంచ
జడలుగట్టిన శిరోజముల పెన్మడియందు • నమృతమరీచి నాట్యంబుసలుప
దక్షిణమైన హస్తమునందుఁ దాల్చిన • రత్నహారంబు చక్రగతిఁ దిరుగ

గీ. జన్మమృత్యుజరారుజల్ సంహరించు
నుత్తమునిఁ దన్నుఁ గొల్చి మృత్యుంజయత్వ
మలవడినయంత రత్నసింహాసనంబు
నందుఁ గృష్ణుఁడు తమితోడ హరుని నిలిపె. 99

కృష్ణకృత దేవతావ్యవస్థితి.

గీ. అల్ల బాలుండు మున్నీటియందు నొక్క, బ్రహ్మదినముండి పిదపఁ గాలము నెఱిఁగి
యిర్వురుగ మార్పుజెందె నొకింతయైన, నక్షయంబున్నె కృష్ణమాయకు జగాన! 100

గీ. అణువుగతి సూక్ష్మరూపుఁడై యఖిలవిశ్వ, నాథుఁ డయ్యును బాలుఁ డనాథునిగతిఁ
దల్లిదండ్రులచేఁ బరిత్యక్తుఁ డగుటఁ, గడుపుసుత్తు తెల్పఁగరాని గాసిపెట్ట. 101

ఆ.వె. 'కావుకావు' మనుచుఁ గాకివిధమ్మున, నదలి మింటివంక నరయఁదొడఁగెఁ
బరముఁడైన కృష్ణు పదియునాఱవపాలి, వాఁడితండుసుమ్ము భవ్యకీర్తి. 102

గీ. అతని రోమకూపములందు నద్భుతముగ, నెన్నివిశ్వము లున్నవో యెన్ననేర?
మా పరుండగు కృష్ణునకైనఁ దెలియ, దనఁగ మన మెంతవారల మయ్య వత్స!

క. ప్రతివిశ్వమ్మున నుందురు, పతగతురంగుండు బ్రహ్మ పార్వతివిభుఁడున్
జతనమొనర్చియుఁ దెలియం, దతఁడేవియు వార లెంద రట్లున్నారో? 104

వ. పాతాళంబుమొదలు బ్రహ్మలోకంబు వఱకును బ్రహ్మాండ మనంబడు. బ్రహ్మాండ మునకుఁ బైన వైకుంఠమును దాని కూర్ధ్వముగఁ బంచాశత్కోటియోజనవిస్తీర్ణ మగు గోలోకము కలదు. నిత్యసత్యస్వరూపుండగు కృష్ణునిపగిది నయ్యదియు నవ్యయమైనది. సప్తద్వీపసమ్మితయు సప్తసాగరసంయుతయు సప్తశైల సమన్వి తయునగు వసుంధర కూర్ధ్వముగ స్వర్గలోకము లేడును గ్రిందఁ బాతాళము లేడునుం గలవు. భూలోకమునకుఁ బైన భువర్లోక సువర్లోక మహర్లోక జనలోక

తపోలోక సత్యలోకమ్ములును వానికిఁ బైన తప్తకాంచనసన్నిభమైన బ్రహ్మలోకము నలరారు. జలబుద్బుదమురీతి నీ బ్రహ్మాండభాండము నశ్వరము. ఒక్క గోలోకవైకుంఠంబులు మాత్ర మకృత్రిమంబులు నిత్యంబులునై యలరారు. ఒక్కొక్క రోమకూపంబున నొక్కొక్క బ్రహ్మాండమండలంబును బహ్మవిష్ణు శివాదిదేవతలు దిగీశదిక్పాలకనక్షత్రమ్ములు నుండు. భూమియందలి వర్ణములు నాలుగు. అధోలోకంబుల నాగులు చరింతురు. విరాడ్రూపుండగు నబ్బాలకుండును మాటిమాటికి నేడ్చుచుఁ దుదకు, 105

మ. నవనీలాంబుదతుల్యదేహు శ్రితసంతానాఘనిర్మూలనో
ద్భవమందస్మితుఁ బీతవస్త్రు ముకుళీభాస్వత్కరాంభోజు నా
దివిభుఁ దండ్రివి గాంచి నవ్వె విటులార్తింగాంచి దుఃఖించు పు
త్రు విలోకింపుముఁ గృష్ణుఁ డిట్లనియె సంతుష్టాంతరంగమ్మునన్. 106

చ. జరయును మృత్యువున్ భయవిచారము లాఁకలి దప్పి రోగముల్
వఱలకయుండ నావలె నపారము సాంగమునైన జ్ఞానసం
భరితుఁడవౌచు భక్తజనభాగ్యసమృద్ధు లొసంగుచుఁ మనో
హరమగు విశ్వమందుఁ బ్రళయావధిగా వసియింపు మర్భకా. 107

గీ. అని వరంబిచ్చి యంత షడక్షరమిత • మిష్టసంప్రాపకంబౌచు నెసఁగునట్టి
యొకమహామంత్ర మప్పరమోత్తముండు, బాలు చెవిలోన ముమ్మాఱు పఠనసల్పె.

గీ. ప్రణవ మాదినొప్పఁగఁ జతుర్థ్యంతమలరు, 'కృష్ణ' యను నక్షరద్వయకీలితమయి
వహ్నిజాయాంతమై ధర వఱలునట్టి, మంత్రరాజంబు విఘ్నము ల్మాటుపఱచు. 109

గీ. మంత్రమును జెప్పి యాపైన మహిఁ గలట్టి, విష్ణుభక్తు లొసంగు నైవేద్యమందు
షోడశాంశ మాహారమౌఁ జుమ్ము నీకు, వరము లింకేమిగావలెఁ బల్కు మనిన.

శా. బాలుం డిట్లనెఁ దండ్రితో నపుడు నీపాదాంబుజమ్మందు నా
కేలాగైనను భక్తి నిశ్చలముగా నేర్పాటు గావింపు మ
య్యా! లోకేశ్వర! స్వల్పదీర్ఘతరమధ్యాయుర్విచారంబు నా
కేలా? యయ్యది నీయభీష్టగతిచే నెట్లైన సంతోషమే. 111

క. నీవే బ్రహ్మజ్యోతివి, నీవె సనాతనుఁడ వౌదు నిఖిలమ్మునకున్
నీవే తల్లివి తండ్రివి, నీవే పూజ్యుఁడవు లేరు నీకన్నఁ బరుల్. 112

చ. వ్రతములు తీర్థసేవ, యుపవాసములున్, నియమంబులెన్నిసాం
ప్రతముగ సల్పినన్ నినుఁ గృపామయు పీడిన విష్ణులంబు నం
తతముగ నిన్నుఁ గొల్చు వినుతవ్రతుఁడే యగు సార్థజన్ముఁ డ
చ్యుత! యటుగావిచో బ్రతికియుండియుఁ జచ్చినయట్టులేసుమా. 113

చ. అవివివయవ్రతుండగుచు నమ్మెయి బాలుఁడు వల్కఁ "మందు మీ
వును ననుఁబోలి స్థైర్యమును బొందుము క్షుద్రవిరాట్స్వరూపభా
జనుఁడవు గమ్మ విశ్వము లజస్రము సృష్టియొనర్చ బ్రహ్మయున్
జననముఁ గాంచు నీదయిన నాభిసరోజమునన్ గుమారకా. 114

గీ. అతవి ఫాలమ్మునందు శివాంశవలనఁ, బదియునొక్కండు రుద్రులు నుదయమొందు
రందులో నొక్కరుండు కాలాగ్నిరుద్రుఁ, డఖిలలోకసంహారమ్ము నాచరించు. 115

గీ. జగములన్నియుఁ బాలించు శక్తిగలిగి, యొక్కవెన్నుండు క్షుద్రాంశ నుద్భవించు
నిశ్చలంబౌచు మద్భక్తి నెగడఁగలదు, నే నొసంగిన వరము చే నీకు వత్స! 116

గీ. ధ్యాన మొనరించినంతఁ దక్షణమె నీకు, నెదుటఁ గాన్పించుచుందు నే నెలమిఁ కోర్క
నల్లి మద్వక్షమం దలరారుచుండు, తల్లినిఁ గనం గలాఁడవు తరలు మింక." 117

మ. అని ప్రత్యుత్తర మిచ్చి యవ్విభుఁడు స్వీయావాసముం జేరి బ్ర
హ్మను మృత్యుంజయుఁ జేరఁజేరి సృజియింపన్నాశముంజేయ మీ
ర్జనియింపన్వలె నన్న నంతటఁ దదిచ్ఛాబద్ధులై వారలుఁ
వినతు ల్బ్రహ్మలు సల్పి నీడొక్కనికి తద్విశ్వేశ్వరున్ బ్రీతులై. 118

గీ. అంత నాబాలకుండు మహావిరాట్టు, రోమకూపంబులందు వెలుంగు నొక్క
విశ్వగోళంబులోపల వెలయు జలధి, నలరె క్షుద్రవిరాడ్రూప మొలయుచుండ. 119

గీ. అంబుదశ్యామమైన దేహమ్ముతోడఁ, బట్టుపట్టంబు మొలయందుఁ జుట్టఁబెట్టి
జలధిలో శయనించిన చక్రనయ్య, శ్రీజనార్దనుఁ డీతండె చిన్మయుండు. 120

ఉ. అంతట నాభితామరసమందు జనింపుచు బ్రహ్మ పద్మనా
ళాంతము నారయం దిరిగె నంబుజదండము వెంటనంటి యా
వంతయు దానియంతుఁ గనఁడయ్యెను లక్షయుగంబు లేగ వి
భ్రాంతి వహించి యెప్పటి నివాసముఁ జేరెఁ దపంబొనర్పఁగన్. 121

గీ. ధ్యానమొనరింప జలధిశయానుఁడైన, జనకు నంతట గోలోకమునఁ దదీశుఁ
డైన కృష్ణుని దర్శించి యంజలియిడి, వరములం గాంచి సృష్టి కుపక్రమించె.

గీ. అంత మానసపుత్రులై యవతరించి, రల్ల సనకసనందనాద్యఖిలమునులు
పదియునొక్కరు రుద్రులు ఫాలభాగ, మందు జనియించినారు శివాంశవలన. 123

గీ. పఱలు క్షుద్రవిరాణ్మూర్తి వామపార్శ్వ
మున జననమంది తెల్లదీవిని వసించె
వెన్నుఁడు చతుర్భుజుండయి విశ్వమెల్లఁ
బాలనము సేయుకొఱకుఁ గృపాళుఁ డగుచు. 124

వ. తరువాత బ్రహ్మసంకల్పమాత్రమున సకలచరాచరజగమ్ములును స్వర్గమర్త్య పాతాళంబులు నావిర్భవించినవి. విరాట్పురుషుని ప్రతిరోమకూపంబునం దొక బ్రహ్మాండంబును బ్రతి బ్రహ్మాండంబునందును బ్రహ్మవిష్ణుశివాదిసకలదేవతలును సకల చరాచరజగమ్ములు నెలరారుచుండు; నిది కృష్ణకృతవిశ్వసృష్టిక్రమంబని నారాయణుండు నారదున కెఱింగించె. 125

ఉ. అంతట నారదుండు వినయావనతుండయి పల్కె నిట్టు ల
త్యంతముదంబు గాంచితి సుధామధురోక్తుల నీవుచెప్ప వృ
త్తాంతము సర్వముంగా వినుచుఁ దామరసేక్షణ ! కేలుమోడ్చి ప్రా
ర్థింతును దెల్పు మింకఁ బ్రకృతిం భజియించెడు మార్గమెట్టిదో ? 126

ఉ. ఎవ్వరిపూజ నెవ్వ రొనరించిరొ తొల్లి ? నతుల్ప్రవర్ప వా
రెవ్వరి కెవ్వ రేవరము లిచ్చిరొ ? వారి ప్రభావ మెట్టిదో
యెవ్వరు వారిపేరు వెలయించిరొ ? తెల్పు మనంగ నవ్వుచుం
బువ్విలుకానితండ్రి మునిముఖ్యునిఁ గాంచి వచించె నీగతిన్. 127

చ. ప్రకృతియు నైదురూపముల భాసిలునంచుఁ దదంశగాఁగ నీ
సకలజగంబులం గలుగు చానలు నుద్భవమందిరంచు మౌ
నికులవతంస ! తెల్పితిని నిర్దళితాఖిలపాపజాలముల్
ప్రకటితసర్వమంగళవిభావ్యములం గద తచ్చరిత్రముల్. 128

గీ. ప్రకృతి యంశంబువలన నుద్భవముగాంచి
నట్టి గంగాదులచరిత్ర మరయఁ గొలఁది;
రాధచరితయు, నటులె దుర్గాచరిత్ర
విస్తృతంబులు గావున వెనుకకుంచి. 129

గీ. మూర్ఖుఁ డేదేవి కరుణాసముద్రమందు, మునిఁగి పండితుఁ డౌనొ? యేజననిపూజ
కృష్ణనిర్మితమై తొల్లి కీర్తిఁగాంచె, నల సరస్వతిఁ దెల్పెద నయ్య వినుము. 130

ఉ. రాధముఖమ్మునం దటు సరస్వతి జన్మముఁగాంచి తొల్లి రా
దానవుఁడైన కృష్ణముఖతామరసమ్మును గాంచుచున్ మనో
జాధికబాధ కగ్గమయి యాతనిఁ గాముకియై వరించె బిం
బాధరిఁ గాంచి యిట్లనియె నప్పుడు కృష్ణుఁడు ధర్మనిష్ఠుఁడై. 131

ఉ. ఏమి సుఖమ్ముఁ గాంచఁగలవే నసుఁ గాంతునిఁగా వరించి ? రా
ధామదిరాక్షి నిన్ననిఁ దాల్మివహింపమి, బాధవెట్టు నీ
ప్రేమ సహింపలేక పలురీతులుగా బలవంతురాలు, ని
న్నోమఁగశక్తి చాల కపుడూరక నేను తపింపఁగావలెన్. 132

ఉ. ఈ సకలప్రపంచమున కేలికనై తనిగాని రాధ నా
శాసనముల్ సహింపక కృశానువిధమ్మున మండిపోవు నే
నై సవతిన్ ఘటించునెడ నంగన ! లాభములేనిదే రసా
భాసపు నెయ్యము న్నలిపి పాడయిపోవుట కెంచుదానవే ! 133

ఉ. మానిని ! రూపమందు మహిమప్రచయమ్మున శీలమందు తే
జోనియతిన్ సమానయయి చూరగొనెన్ జుమి మన్మనంబు రా
ధానలినాక్షి ; యేగతిని దావకసఖ్యము నాచరింపుచున్
హానియొనర్తు నామె ? కెటు లాత్మవప్రాణము పీడనేర్చెదన్ ? 134

గీ. కాముకుండు కోటికందర్పరూపుఁడు, నాల్గుభుజములున్న వల్లనయ్యు
నాదు నంశగన్న నారాయణుఁడు నీకుఁ, దగినవరుఁడు సుమ్ము తరళనయన ! 135

శా. వైకుంఠమ్మున కేగు మచ్చట రమావామాక్షి నీతో సమా
నాకారమ్ముగలట్టిదే కల దసూయాలేశమే న్లేక నిజా
నాకన్నేర్చిన; దామెతోఁ గలసి యానారాయణుం గొల్వు మో
రాకాచంద్రనిభాననా ! సతము భద్రంబబ్బు నిర్విద్రమై. 136

గీ. చదువ నారంభమొనరించు సమయమందు, మాఘశుక్లపంచమినాఁడు మౌనివరులు
యక్షరాక్షసగంధర్వు లఖిలసురలు, మానవులు నిన్నుఁ బూజింతు రోసుతాంగి. 137

వ. కణ్వశాఖోక్తవిధిచేతఁ గలశమందును బుస్తకమునందును సువర్ణగుళికను నిల్పి
షోడశోపచారమ్ముల నాచరించి నీకవచమ్మును గంఠంబునంగాని దక్షిణభుజంబు
నంగాని పఠింపుచు ధరింపఁగలరని పల్కి. 138

ఉ. తా నొనరించెఁ బూజలను దామరసేక్షణకుజా సమస్తవి
ద్యావిలయాత్మురాలనుచు నంతట బ్రహ్మ మొద లృరాశియున్
మానవయక్షరాక్షసులు మానక సల్పుచునున్నవారు పూ
జానతులన్ సరస్వతికి సర్వజగమ్ముల నంచుఁదెల్పినన్. 139

గీ. దేవ! పావనమైన పూజావిధాన, మెల్ల సాంగంబుగా వచియింపు మనిన
నారదున కంత సంతసానందుఁడైన, శ్రీవరుఁడు ప్రేమతోడ వచింపఁదొడఁగె. 140

సీ. మాఘశుద్ధమ్మున మహితపంచమినాఁడు • చదువు మొదల్వెట్టు సమయమందు
మదయమ్మునవెలెచి యుచితక్రియ లొనర్చి • యఘమర్షణస్నాన మాచరించి
తొలుదొల్త గణపతి నలరించి యాపైన • శ్రద్ధాళువై కలశంబు నిల్పి
పిదప స్వశాఖోక్తవిధిచేతనైనను • దాంత్రికవిధినైనఁ దగఘటించి

గీ. షోడశోపచారమ్ములఁ జొక్కఁజేసి • యమ్మహాదేవి నర్పింపనగు మునీంద్ర!
భక్తి నామెను బూజించు పరమమూర్ఖుఁ • డైన విద్వచ్ఛిరోమణియై రహించు.141

గీ. పాలు, పెరుగు, లడ్డుకములు, పంచదార
స్వస్తికము, తెల్లబెల్లము, పాయసంబు,
చెఱకు పానకమున్, ఘృతసిక్తమగుచు
వెలయు యవగోధుమల చూర్ణ పిష్టకములు. 142

గీ. నారికేళఫలము, నవనీత, మరటిపం, డ్లపుడుకాలమందు నలరు ఫలము,
లుప్పు నేతు లలరనొప్పు హవిష్యంబు, శ్రీఫలమ్ములు బదరీఫలములు. 143

గీ. ఆమెకు నివేదనమొనర్చ ననువుపడుమ, స్వచ్ఛమౌ శుక్లవస్త్రము చందనంబు
తెల్లపూవులహారము దివ్యభూష, ణావళియుఁ దెచ్చి యర్పింపనగు మునీంద్ర! 144

సీ. కలితవీణాపుస్తకలసత్కరాంభోజ! • సరసిజపత్రవిశాలనయన!
మణిమయనవ్యభూషణభూషితశరీర! • శరదిందుకోటికాంతిరమణీయ!
మందస్మితవిలాససుందరాస్యాంబుజ! • అంబుజసంభవాద్యఖిలసేవ్య
వహ్నిశుద్ధాంశుక వాసితతనువల్లి! • మల్లికావర్ణ సమ్మాననీయ!

గీ. వందనశతంబు లొనరించువాఁడ నమచు
ధ్యానమొనరించి మూలమంత్రము పఠించి
కవచము ధరించి సాష్టాంగ మవనియందుఁ
బడి ప్రణామమ్ము లొనరింపవలయుఁ జుమ్ము. 145

వ. లక్ష్మీమాయాదికంబును, జతుర్థ్యంతమును వహ్నిజాయాంకమును నగు 'శ్రీంహ్రీం సరస్వత్యై స్వాహా' యను శ్రీ సరస్వత్యష్టాక్షరీమహామంత్రరాజము కల్పవృక్ష సమంబై పఠించువారలకు సర్వాభీష్టంబుల నొసంగఁజాలు. 146

సీ. జాహ్నవి యొద్దునఁ జదివించితిన్ దీని • వాల్మీకిచేతఁ బూర్వము మునీంద్ర!
పుష్కరంబున సౌరపుణ్యపర్వమునందు • శుక్రుండు భృగుమౌనిఁ జూచి నేర్చెఁ
జంద్రపర్వమ్మున జలజాతగర్భున • కెలమిమై మారీచుఁ డిది యొసంగె
బదరికాశ్రమమున మదివృద్ధి భృగుమౌని • కిది జరేజాసనుఁ డెలమి నొసఁగెఁ

గీ. గలశవారాశిసన్నిధి నలరి యాస్తి • కాఖ్యున కల జరత్కారుఁ డానతిచ్చె;
ఋశ్యశృంగున కొసఁగినాఁ డిది సువర్ణ • పర్వతాగ్రంబునందు విభాండకుండు.

శా. గౌరీభర్త కణాదగౌతములకున్ గావించె బోధన్ గృపా
పారీణుం డయి యాజ్ఞవల్క్యునకు సప్తార్కుండు కాత్యాయనున్
జేరంజీరి వచించె, సర్వవిభు వాసింగొల్చి యార్జించె నా
భారద్వాజుఁడు శాకటాయనునితోఁ బాతాళలోకమ్మునన్. 148

ఉ. నాలుగులక్షసార్లు మననంబొనరించిన మంత్రసిద్ధిగాఁ
జాలును, సిద్ధియౌ నరుఁడు శారద సత్కరుణార్ద్రదృష్టికిన్
బాలయి దేవతాగురునిభాతి విశారదుఁడై యెలర్చు ధీ
శాలుల పండితోత్తము లజస్రము వానికి దోయిలింపఁగన్. 149

గీ. జగములన్నియు సృష్టించు జలజభవుఁడు, గంధమాదనపర్వతాగ్రమ్మునందు
నానతిచ్చెను భృగువున కఖిలలోక, జయవిధాయక మీ కవచమును వత్స! 150

వ. బ్రహ్మవిదగ్రణ్యుఁడును సర్వజనకుండును సర్వపూజితుండును నగు బ్రహ్మం గాంచి భృగుమౌని విశ్వజయప్రాపకంబగు సరస్వతీకవచంబును నాకుదెల్పవే యని ప్రార్థించినంత నా దేవజ్యేష్ఠుఁ డాతని కిట్లు వచింపఁదొడంగె సావధానుఁడవై యాలింపుము. 151

గీ. నాకు గోలోకమందు బృందావనమునఁ, దెల్పె రాధావిభుండు హృద్వీధియందుఁ
గరుణ మొలకెత్త శ్రుతిసారకలితమైన, కవచమును వత్స! యిది సర్వకామదంబు.

సీ. వాల్మీకి కవిలోకవనజోద్భవుండయ్యె • స్వాయంభువుండు యశమ్ముఁగాంచె
సురగురుండయ్యె భాస్వరుఁడై బృహస్పతి • శుక్రుఁడు దైత్యసంస్తుతుల వడసె

కాత్యాయనుఁడు స్వయంకలితదక్షతఁ గాంచెఁ • బ్రతిభవహించెఁ బరాశరుండు
సర్వజగజ్జయసహితుఁడయ్యె యయాతి • సంవర్తుఁడు మహత్త్వ సంతరించె

గీ. గౌతమకణాదయాజ్ఞవల్క్యప్రభృతులు • పాణినియు గ్రంథకర్తలై ప్రథితులైరి
ఆస్తికవసిష్ఠముఖమౌను లఖిలరాజ • సేవితులు నైరి కవచసంభాషణమున. 153

ఉ. వేదవిభాగముల్ సలిపి విశ్వజనాభ్యుదయమ్ముకోస మ
ష్టాదశసత్పురాణములు చక్కనిశైలి రచింపఁగల్గె నా
మోదముతోడ నీకవచమున్ బఠియించి ధరించెఁ గాన సా
ఖెదవతీర్ణకృష్ణుఁడగు సాత్యవతేయుఁడు మౌనిచంద్రమా. 154

వ. ఈ కవచంబునకుఁ బ్రజాపతి ఋషి; బృహతి ఛందము; శారద యధిదేవత. సర్వ తత్త్వవిజ్ఞాన సర్వార్థసాధనకవితాసామర్థ్యంబులు వినియోగము. 'శ్రీంహ్రీంసరస్వత్యైస్వాహా శిరోమేపాతుసర్వదా' లక్ష్మీమాయాబీజాన్వితయగు చతుర్థ్యంతసరస్వతి వహ్నిజాయం గూడి నాశిరస్సును సతతంబు రక్షించుఁగాక। 'శ్రీంవాగ్దేవతాయైస్వాహా ఫాలంమేసర్వదావతు' లక్ష్మీబీజాన్వితయగు చతుర్థ్యంతవాగ్దేవతయగ్నిదారం గూడి నా ఫాలము రక్షించుఁగాక। 'ఓంహ్రీంసరస్వత్యైస్వాహేతి శ్రోత్రేపాతునిరంతరమ్' ప్రణవంబును మాయాబీజంబును చతుర్థ్యంతసరస్వతియు వనలు నారిం గూడి నాశ్రోత్రంబుల నిరంతరము రక్షించుఁగాక। 'ఓంశ్రీంహ్రీం భగవత్యై సరస్వత్యైస్వాహానేత్రయుగ్మం సదావతు' ప్రణవమును లక్ష్మీమాయాబీజములాదింగల చతుర్థ్యంతభగవతీ సరస్వతీపదంబులు కృశానుపత్నింగూడి నా కనుదోయి రక్షించుఁగాక। 'ఐంహ్రీంవాగ్వాదిన్యైస్వాహానాసాంమేసర్వదావతు' బిందుయుక్త ప్రథమవక్రతమంబును మాయాబీజంబును చతుర్థ్యంతవాగ్వాదినియు స్వాహాదేవింగూడి నానాసిక రక్షించుఁగాక। 'ఓంహ్రీంవిద్యాధిష్ఠాతృదేవ్యైస్వాహా చోష్ఠం సదావతు' ప్రణవంబును మాయాబీజంబును చతుర్థ్యంతవిద్యాధిష్ఠాతృదేవియు వైశ్వానరతరుణిం గూడి నాయోష్ఠంబు రక్షించుఁగాక। 'ఓంశ్రీంహ్రీం బ్రాహ్మ్యైస్వాహేతిదంతపంక్తింసదావతు' ప్రణవంబును లక్ష్మీమాయాబీజమ్ములును చతుర్థ్యంత బ్రాహ్మీపదంబు దహనునారింగూడి నాదంతపంక్తిని రక్షించుఁగాక; 'ఐమిత్యేకాక్షరోమంత్రోమమకంఠంసదావతు' ప్రథమవక్రతమంబును బిందుసంయుతంబునగు నేకాక్షరమంత్రము నాకంఠమును సర్వదా రక్షించుఁగాక। 'ఓంశ్రీంహ్రీం పాతుమేగ్రీవాంస్కంధౌమేశ్రీంసదావతు' ప్రణవమును లక్ష్మీమాయాబీజంబులు నా గ్రీవమును లక్ష్మీబీజము నాభుజమ్ముల నెల్లప్పుడు రక్షించుఁగాక। 'ఓంహ్రీంవిద్యా

ధిష్ఠాతృదేవ్యై స్వాహా వక్షస్సదావతు' ప్రణవంబును మాయాబీజంబును జతుర్థ్యంత విద్యాధిష్ఠాతృదేవీపదంబును వనలుగృహిణిం గలిపి నా వక్షమ్మును రక్షించుఁగాక। 'ఓం హ్రీం విద్యాస్వరూపాయై స్వాహా మే పాతు నాభికామ్' ప్రణవమాయాబీజసహిత యగు చతుర్థ్యంత విద్యాస్వరూప యగ్నిపత్నిం గూడి నానాభిని రక్షించుఁగాక। 'ఓం హ్రీం క్లీం వాణ్యై స్వాహేతిమమహస్తౌసదావతు' ప్రణవమును మాయాబీజమ్మును క్లీంకారమును జతుర్థ్యంతవాణీపదంబును పితృహోత్రాంగనంగూడి నాహస్తంబుల రక్షించుఁగాక। 'ఓం సర్వవర్ణాత్మికాయై స్వాహా పాదయుగ్మం సదావతు' ప్రణవసహిత యగు చతుర్థ్యంత సర్వవర్ణాత్మిక శిఖిచంద్రముఖింగూడి నా పాదంబుల నెల్లపుడు రక్షించుఁగాక। 'ఓం వాగధిష్ఠాతృదేవ్యై స్వాహా సర్వం సదావతు' ప్రణవమును జతుర్థ్యంతవాగధిష్ఠాతృ దేవీపదంబును పితృహోత్రతరుణింగూడి సర్వమును సర్వదా రక్షించుఁగాక। 'ఓం సర్వకంఠవాసిన్యై స్వాహా ప్రాచ్యాం సదావతు' ప్రణవంబును జతుర్థ్యంతసర్వకంఠవాసినియు పావకుని పూవుంబోఁడింగూడి తూర్పున నన్ను రక్షించుఁగాక। 'ఓం సర్వజిహ్వాగ్రవాసిన్యై స్వాహాగ్నిదిశి రక్షతు' ప్రణవంబును సర్వజిహ్వాగ్రవాసినియు వైశ్వానరతరుణింగూడి యాగ్నేయంబున నన్ను రక్షించుఁగాక। 'ఓం హ్రీం శ్రీం క్లీం సరస్వత్యై బుధజనన్యై స్వాహా సతతం మన్త్రరాజోఽయం దక్షిణే మాం సదావతు' ప్రణవంబును మాయాలక్ష్మీబీజంబులను క్లీంకారంబును జతుర్థ్యంత సరస్వతీ బుధజననీపదంబులను వగ్నితరుణింగూడిన మంత్రరాజంబు సర్వదా నన్ను దక్షిణంబున రక్షించుఁగాక। 'ఐం హ్రీం శ్రీం త్ర్యక్షరో మంత్రో నైరృత్యాం సర్వదావతు' బిందుపూర్వకప్రథమవక్రతమంబును మాయాలక్ష్మీబీజమ్ములునుంగల త్ర్యక్షరమంత్రరాజము నైరృతియందు నన్ను సర్వదా రక్షించుఁగాక। 'ఓం ఐం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం వారుణేఽవతు' ప్రణవంబును బిందుపూర్వకవక్రతమంబును జతుర్థ్యంతజిహ్వాగ్రవాసినీపదంబును వైశ్వానరతరుణిం గూడి నన్ను వారుణమ్మున రక్షించుఁగాక। 'ఓం సర్వాంబికాయై స్వాహా వాయవ్యే మాం సదావతు' ప్రణవసహితయగు చతుర్థ్యంతసర్వాంబిక వహ్నిపత్నిం గూడి నన్ను వాయవ్యమ్మున రక్షించుఁగాక। 'ఓం ఐం శ్రీం క్లీం గద్యవాసిన్యై స్వాహా మాముత్తరేఽవతు' ప్రణవమును బిందుసహిత ప్రథమవక్రతమంబును లక్ష్మీబీజంబును క్లీంకారమును జతుర్థ్యంతగద్యవాసినియు శిఖితరుణింగూడి నన్నుత్తరంబున రక్షించుఁగాక। 'ఐం సర్వశాస్త్రవాసిన్యై స్వాహైశాన్యాం సదావతు' బిందుసంయుతప్రథమవక్రతమంబును జతుర్థ్యంత సర్వశాస్త్రవాసినీపదంబును వైశ్వానరగేహినిం గలిపి నన్నీశాన్యంబున

రక్షించుఁగాక। 'ఓం హ్రీం సర్వపూజితాయైస్వాహా చోర్ధ్వం సదావతు' ప్రణవమాయా బీజసహితయగు చతుర్థ్యంత సర్వపూజిత కృశానుతరుణింగలసి నన్నూర్ధ్వమున రక్షించుఁగాక। 'హ్రీంపుస్తకవాసిన్యైస్వాహా ఉధోమాంసదావతు' మాయాబీజ సహిత యగు చతుర్థ్యంతపుస్తకవాసిని ధనంజయగేహినిం గలసి నన్నధోలోకంబుర రక్షించుఁగాక। 'ఓం గ్రన్థబీజస్వరూపాయైస్వాహామాం సర్వతోవతు' ప్రణవసహిత యగు చతుర్థ్యంతగ్రంథబీజ స్వరూపస్వాహాదేవింగూడి నన్నఖిలదిక్కుల రక్షించుఁగాక. 155

గీ. "విశ్వజయ" మను పేరున వెలయునట్టి, కవచమిద్ది జగజ్జయకారకంబు
పసపచందనభూషణ ప్రతతు లొసఁగి, గురుని బూజించి దీనిఁ గైకొనఁగవలయు.

చ. స్థిరతరభక్తి యుక్తుఁడయి సిద్ధివహింపఁగఁ బూర్ణమోదభా
స్వరుఁడయి యైదులక్షల జపం బొనరింపఁగఁ జెల్లు, దానిచే
నురుతరబుద్ధివైభవము నుత్తమకీర్తి కవిత్వరాజ్యవి
స్ఫురణము సర్వలోకజయశోభనముల్ ఘటియించు నారదా. 157

గీ. కణ్వశాఖోక్తమైనట్టి కవచ మిద్ది, మున్ను యాజ్ఞవల్క్యుండు ప్రమోద మలర
పఠనసల్పిన స్తోత్రంపు ఫక్కి యెల్ల, వినుము వచియింతు నఘములు వెడలిపోవు.

## సరస్వతీ స్తోత్రము.

గీ. యాజ్ఞవల్క్యుండు గురుశాపహతినిజేసి, చదువునకు నంతరాయంబు సంభవింప
నేడ్పుచుం బోయెఁ దొల్లి దినేశలోక, మున కహస్కరుఁ డనుకంపఁబూను ననుచు.

ఉ. వచ్చిన యాజ్ఞవల్క్య ననివారితసత్కృప నాదరించి యు
ద్యచ్చరితుండు పొంగముగ నాతనిచేఁ జదివించె వేదముల్
"హెచ్చినభక్తితోడ నుతియింపుము శారద నక్కటాన నీ
మచ్చ లడంగిపోయి జనమాన్యుఁడవౌ" దని తెల్పి యంతటన్, 160

గీ. కనుమొఱంగిన సూర్యున కనఘమతికి
వందనశతంబు లొనరించి డెందమందు,
స్నానమొనరించి శుచియయి శారదాంబ
నతఁడు నుతియించె నమ్రోత్తమాంగుఁడగుచు. 161

క. గురుశాపంబున సంస్మృతి, విరహితుఁడను దుఃఖితుండ విద్యాలేశ
స్ఫురణ మెఱుంగని దీనుఁడఁ, గరుణింపుము తల్లి! దీనకల్పకవల్లీ! 162

ఉ. ఇమ్మ! యధీతవిస్ఫురణ, మిమ్మ! సుశిష్యచయప్రబోధనా
ర్థమ్ముగ గ్రంథకర్తృ కుశలత్వము, నిమ్మ! సభాంతరాళమం
దమ్మ! విచారసూక్ష్మమహాప్రతిభాచరణంబు, నిమ్మ! శా
పమ్మును గ్రమ్మరింపుమ! కృపాళని వందురు నిన్ను శారదా! 163

సీ. దండము నీకు విద్యాధినియంత్రిణీ!, అంజలి నీకు బ్రహ్మస్వరూప!
వినతి నీకు విసర్గబిందుమాత్రానేత్ర!, కైమోడ్పు నీకు వ్యాఖ్యాస్వరూప!
శరణు నీకు సమస్తశాస్త్రాధివాసిని!, అవనతి నీకు సంఖ్యాస్వరూప!
జోహారు నీకు! విస్ఫూర్జత్పరాజ్యోతి!, నతులు నీకు సనాతనస్వరూప!

గీ. వందనంబులు నీకుఁ గావ్యప్రపంచ, సంతతజ్ఞానరూపిణీ! సర్వవేద్య!
భక్తజనమానసప్రతిభాప్రదాత్రి!, అమ్మ! శారద! నీకు సాష్టాంగనతులు! 164

మ. ఘనుఁడైనట్టి సనత్కుమారుఁడు జగత్కల్యాణముంగూర్పు ధీ
ధనమున్ గోరఁగ బ్రహ్మమూకుఁడయి సిద్ధాంతమ్మొనర్పంగఁ జా
లనిచోఁ గృష్ణుఁడువచ్చి నీపదములన్ బ్రార్థింపు మీవంచుఁ దె
ల్పిన యాతం డటుచేసె నీవును మహావిద్యన్ బ్రసాదింపవే. 165

ఉ. అంతములేని జ్ఞానము ననంతుని వేడెను భూమి మున్ను సి
ద్ధాంత మొనర్ప మూకుఁడయి తద్దయుఁ గశ్యపునాజ్ఞఁజేసి నిన్
స్వాంతమునన్ దలంచిన యనంతర మేకద! త్వత్ప్రసాదమా
ద్యంతము దెల్పె ధారుణికి నమ్మహితాత్మకుఁడో సరస్వతీ! 166

ఉ. నీ కరుణాకటాక్షమును నిర్మలభక్తి భజించికాదె వా
ల్మీకి కవీంద్రుఁడయ్యె; ననిమిత్తభవత్కరుణారసంబు న
శ్లోకముగా లభించెను ద్రికుద్దిగఁ బుష్కరమందు వందయేం
డ్లాఁకలి దప్పి లేక నిను నర్చయొనర్చిన వ్యాసమౌనికిన్. 167

చ. నినుఁ గరుణామయిన్ గొలువనేర్చి శివుం దొనరింపఁజాలె విం
ద్రునకును దత్త్వబోధ, తమితో సురనేతకు వేయియేండ్లు వి
న్ననయము గొల్చియేకద బృహస్పతి చెప్పెను శబ్దశాస్త్ర మో
జనని! నినున్ మదిన్ గొలువఁజాలిన సత్ఫద మేర్పఱించుచున్. 168

మ. మతిమన్మఖ్యులకెల్ల మూలమవు నీ మాన్యాంఘ్రిపద్మమ్ము లం
చితభక్తిన్ గొలియాడనట్టి నరు వీక్షింపంగలే మమ్మరో!
చతురాస్యుండును బంచవక్త్రుఁడు సహస్రాస్యుండు నైనఁగానినన్
స్తుతులన్ దన్పఁగనేర రేనెటుల నేర్తున్ దేవి! యేకాస్యుఁడన్. 169

గీ. అనుచుఁ గమలపీఠోద్భవ సమ్మునివతంసు, నెదుట నిల్చి సరస్వతి యింకమీఁద
సుకవివై సద్యశమ్మును జూరగొందు, వని వచింపుచు వైకుంఠమునకుఁ జేరె. 170

గీ. ఈ మహాస్తోత్రమును బఠింపనెడలఁ గల్గు, శారదాదేవి సత్కృపాసాంద్రవృష్టి
జడున కొకయేఁటినాఁటికి జ్ఞానమబ్బుఁ, బండితుండుఁ గవీంద్రుఁడై ప్రతిభఁగాంచు.

## లక్ష్మీ గంగా సరస్వతులకు జన్మప్రాప్తి.

క. వైకుంఠంబున వాణి రి, మాకాంతుని యోలగమున మందాకినిచేఁ
గైకొని శాపమ్మును సరి, దాకారత భరతవర్ష మందుండెఁ గళన్. 172

క. పుణ్యస్వరూప పుణ్యద, పుణ్యాధిక సేవ్యమాన మునిరాజతపో
గణ్యఫలభూత పాపా, రణ్యజ్వలదగ్నియగుచు రాజిలుచుండున్. 173

క. అవనిలో మునుకలుగొని, మేనువిడిచినట్టిజనుల మిక్కిలిదొసఁగుల్
బోనడఁచి విష్ణుసభఁ గృప, చే నుండఁగఁజేయు శౌరి చిరకాలంబున్. 174

శా. చాతుర్మాస్యలఁ బూర్ణిమాతిథి గ్రహేట్చంద్రోపరాగవ్యతీ
పాతాంగారకవాసరంబులను బర్వంబందు నెవ్వాఁడు సు
స్నాతుండౌను సరస్వతీనదిని విన్నాణంబుగా వాఁడు వి
ఖ్యాతింగాంచి ధరిత్రియందు, సురలోకం బొందు నాపిమ్మటన్. 175

క. శ్రీసారస్వతమను వొక, మాసం బట జపముసేయు మనుజుఁడు మూర్ఖా
గ్రేసరుఁ డయినను సత్కవి, తాసంపదగలిగి పొలుచు ధాత్రిని బేర్మిన్. 176

క. అనిశం బానదివారిని, మునుకాడిన నరుఁడు పురుషముఖ్యుండు పున
ర్జనిహీనుండును వైకుం, ఠనివాసుం డగునుజు మ్మనారతము మునీ. 177

క. పాదంబు కామదమునగు, భారతి గుణకీర్తనంబు పచరించితి నో
నారద! యిఁక నేకథ వినఁ, గోరిక మదిఁగలదొ తెలియఁ గోరెద ననఘున్. 178

క. మనసిజజనకుని పల్కులు, విని శాపాయుధవరుండు వీణాముని నె
మ్మనమునఁ గల యనుమానము, వినిపింపఁగఁదలంచె నిండువేడుకతోడన్. 179

ఉ. సౌరతరంగిణీకలహశాపభరంబున స్వాంశచేత నా
భారతి యట్టు లీభరతవర్షమునందుఁ దరంగిణీశుభా
కారముఁ బూని లోకుల యఘంబులు పాఱఁగఁదోలు వృత్త మెం
తే రమణీయమయ్యెనుగదే వినిపింపఁగదే దయామతిన్. 180

క. శ్రుతిసారశ్రవణంబునఁ, గుతుకం బెసఁ బొదలెఁ దృప్తి కుదురదు సుకథా
మృతమందుఁ దలఁప శ్రేయ, స్థితి నెవ్వండేని తృప్తిఁజెందునె ధరణిన్. 181

ఉ. ఆరయఁ బూజనీయ యగునట్టి విధాతృనిఁ రాణి కెట్టు భా
గీరథి శాపమీయఁగడఁగెన్ శుభపుణ్యవిధాత్రి సాత్వికా
కారత లంపఁ దత్కలహకారణమున్ విన వేడ్కయయ్యెడున్
చారుపురాణదుర్లభము సత్కథకాన నెఱుంగఁబల్కుమీ. 182

వ. అనవుడు నారాయణుం డిట్లనియె. 183

ఉ. ఏకథ విన్నమాత్ర నశియించును దోసములెల్లఁ బున్నెమున్
చేకుఱు నట్టి యీ కథను జెప్పెద సన్మతి నాలకింపు; ర
త్నాకరశాయికి న్మువురు దారలు భార్గవి, పల్కునాతి, మం
దాకిని నాఁగ నాహరియుఁ దన్పును మువ్వుర నొక్కపేర్మిచేన్. 184

క. అన్నెలఁతలు మువ్వురు హరి, సన్నిధి సేవింతు రెల్లసమయములందున్
వెన్నుని వదనం బొకతఱి, మిన్నేఱు గనెన్ సకామ స్మితవదనయునై. 185

ఉ. ఆ సమయంబునందు జలజాక్షుఁడు గంగమొగంబుగాంచి సం
తోసముతోడ నవ్వెఁ; నది తోయజగేహిని మేకొనెన్; మదిన్
రోసముఁబూనె భారతి కనుంగొని; భార్గవి బోధజేసినన్
వీసమునేని సైఁప కెదఁ బేరిచె ఏసును సారెసారెకున్. 186

చ. అరుణవిలోచనాంతయు మహారుణభాననయు మ్మహార్మహా
స్ఫురదరుణాధరాధరయు మానశిలీముఖపాతయాతనా
భరపరికంపితాంగియయి వల్లభుఁ గన్గొని పుల్కపుల్కనన్
గరుణము నెమ్మదిం గదురఁగాఁ బలికెం బయి కీసుఁజూపుచున్. 187

క. ధర్మిష్ఠవరిష్ఠులకుం, బేర్మి సమానంబు గలుగుఁ బ్రేయసులందున్
దుర్మతి కిది విపరీతపు, ధర్మంబని యెఱుఁగవలయుఁ ధర్మజ్ఞ విధీ. 188

గీ. గంగపై నీకుఁగల కూర్మిఁ గాంచికూడ, లచ్చి పైరించు టరయ నాలలనగూడ
నట్టి నీకూరిమికి పాత్రమగుట ధ్రువము, నేనె మూగురిలోఁ గడు హీన నైతి. 189

చ. పతి తనకాంతలందు సమభావమునం జరియించెనే జగ
ద్ధితుఁడగు నట్లుగాక నయమేది చరించిన యంత లోకగ
ర్హితుఁడగు సత్వరూపుఁడని యెల్లరు నిన్నునుతించు టెంతయుఁగా
జతురత లేమి నీమనసుజాడ నెఱుంగమిఁగాదె యచ్యుతా! 190

క. నిమిషంబైనను దుర్భగ, త మనంగా నాకు నాన దవులదు; నేఁ బ్రా
ణములను విడచెద, పతి నె, య్యములేని లతాంగి బ్రతుకనగునే జగతిన్. 191

క. అని యిట్లు దీర్ఘకోపం, బునఁ బల్కుచు మన్న పల్కుబోటిం గని నె
మ్మనమున యోచించి వెసం, జనియెన్ సభనుండి వెలికి శౌరి కడంకన్. 192

క. నారాయణుండు చనఁగా, నార క్తవిలోచనాంతయై నిర్భయతన్
భారతి గంగను జెవులకు, పారుష్యము దోఁప నిట్లు పలికెన్ బెలుచన్. 193

క. ఓసి గయాళీ! కదువి, శ్వాసము నాయంద కూర్చు వల్లభుఁ డనుచున్
నీసౌభాగ్యము దెలియం, జేసెదు నిభుతావలేపచేష్టల గంగా. 194

క. వానను బూనక వాగెద, వీ నలినోదరునిచెంత నిప్పుడ నీదౌ
మానంబుఁ గూలఁజేసెద, మానాథుఁడుగాఁడె! శౌరి మగఁడే నీకున్. 195

గీ. ఇమ్మెయి నీమన గంగా, ధమ్మిల్లము వట్టి తివియఁదలఁచెడు పల్కుం
గొమ్మకు వద్దమచని రమ, సమ్మతిఁ గావించె నయము సల్పుచు నంతన్. 196

ఉ. కోపము కెంపు కన్నుగవకుం బొడమంగ విరించి బోటి వే
శాపమొసంగె నిట్లు జలజాతనికేతన కుర్విఁబూనదీ
రూపము లాక్రమించు మిఁక రూపఱ గర్వమటంచు నంతఁ దా
నేపఱకున్వచింప దొకయింతయుఁ దద్విపరీత మెంచుచున్. 197

క. కోపముఁబూనదు క్రమ్మఱ, శాపమ్మొనొసంగఁబోదు జలజజ వాణిం
జేపట్టి భూజముంబలె, ద్వీపినిబలె పెల్లగ దురపిల్లుచు నుండెన్. 198

క. కోపప్రస్ఫురితాధర, యై పలుకక మిన్నకున్న నంబుజనిలయన్
రూపించి పలికె నమర, ద్వీపిని శర్వద్రుషాప్రదీపితయగుచున్. 199

క. ఈలలన యేమిచేయఁగఁ, జాలును వను విడుము దీని చల మడఁచెద దు
శ్శీలయు ంతతమును వా, చాలయునగు రమణి చెడుఁ బ్రశంసలకెడమై. 200

క. ఆదరము పెద్ద పలుకుం, బైదలికిం గలహమందుఁ, బరికింపఁగ నా
తోఁ దడయనేల యిపుడే, వాదం బొనరించుగాఁత బలముకొలందిన్. 201

క. ఈ దుర్ముఖి తనశక్తియు, నాదార్ఢ్యము మీకిపుడ గనంజేయంగా
లోఁదలఁచి యున్న దింకను, మాదృఢతానంతవిక్రమంబులు గనుఁడీ. 202

చ. అని వచియించి గంగ జలజాలయఁ గన్గొని "నీకు శాప మి
చ్చిన పలుకుంబడంతుకకుఁ జెచ్చెఱ శైవలినీస్వరూప మి
ద్ధానరుసుగాత ! కల్మషజనౌఘనికేతనభూతలంబునం
దనిశనివాసియౌ" నని దురంతముగా శపియించె భారతిన్ 203

క. ఆశాపము విని రోషా, వేశంబునఁ బల్కె వెలఁది విబుధతటినికిన్
దా శాపమిచ్చె "ధరణి ని, వేశ మఘప్రాప్తి సంభవించు" నటంచున్. 204

క. అచ్చెదువుపొలఁతి శాపం, బిచ్చిన యవ్వేళ భార్గవీశ్వరుఁడటకున్
విచ్చేసెఁ జతుర్భుజులును, సచ్చరితులు పార్షదులు ససన్మతిఁ గొలువన్. 205

క. అరుదెంచి సరస్వతిఁ దన, కరములతో నెత్తి చక్రకరుఁడు రహిం బే
రురమున ధరియించి పురా, చరితము బోధించెఁ బ్రీతిసతులు మువురకున్. 206

క. కాంత లిటు శాపకలహై, కాంతముఁగావించి యెదలఁ గడు దురపిలఁగా
సంతతసామయమగు వృ, త్తాంతం బిటు లావతిచ్చె దనుజారి వెసన్. 207

ఉ. సారసగేహ ! వాసియె విచారము బూన ? నయోనిజాతవై
ధారుణిలో వృషధ్వజసుతామణి వౌదువు పొమ్ము తన్నృపా
గారముఁ గూర్చి; ధాతకృప గౌరవమొప్పఁగ శంఖచూడబ్రొం
దారకవైరిముఖ్యునకు దారవుకాఁగల వీవు భార్గవీ. 208

క. అవల దైవవశంబున, వే వృక్షత్వంబు సంభవించుమ బిదపన్
దేవేరివి నాకౌదు సు, మీ వచియించితిని సంశయింపకు మింకన్. 209

క. త్రైలోక్యపావనీకర, జాలోలంబైన తులసియన రాజిలుమీ
జాలము పేయకు మిఁకఁ బొ, మ్మా లలన ! పరిత్స్వరూప మందుము కళచేన్. 210

క. భారతి శాపవశంబున, భారతవర్షంబునందుఁ బద్మావతినాఁ
బేరు ధరింపుము వేగ న, దీరూపముఁ దాల్చుమీ మదిం గవలకుమీ. 211

వ. అని కులంగట మెలంగుచున్న గంగం గని నీవును భారతీశాపంబున ధారుణీజన
పాపాపనోదనమువకై భగీరథతపోనీతవై ధాత్రికిం జని భాగీరథీనామం బవధరించి

నాయానతిని మదంశసంజాతుండైన సముద్రునకును గుణసముద్రుండైన శంతను
నకును భార్యవై యుండు మని యానతిచ్చి భారతిఁ గని యిట్లనియె. 212

క. ఏకాంశతోడ పారెకుఁ, బోరొనరించిన ఫలంబుఁ బొందుము చనుమీ
భారతమునకుం బ్రహ్మ, గారంబున నలువచెలివి కాఁగలవు సుమీ. 213

క. గంగాసతిచేఁ గలిగెను, భంగం బా గంగ శూలిపదముం గను నా
చెంగట నుండును భార్గవి, సంగతితోఁ గ్రోధరహిత శాంతయు నగుటన్. 214

క. ఈదాన సుశీలయు ధ, ర్మాచారయు సత్త్వరూపయును నాయెడ స
ద్ధ్రీచీనభక్తి నలుపుట, నాచెంగట నుండుఁ గాత నయమున సతమున్. 215

క. ఈతన్వి యంశమున నీ, క్ష్మాతలమునఁ బుట్టి సతులు సాధ్వులు ధర్మో
పేతాచారలు శాంతి, ఖ్యాతలునై పూజనీయలై యుండురిలన్. 216

క. ముప్వురునెలఁతలు, భృత్యులు, ముప్వురు బాంధవులు మువురుఁ, బొల్పు నతనికిన్
మవ్వపుయశము దొఱంగును, రవ్వయు వాటిల్లు సుగుణరహితుండు నగున్. 217

క. పైదలులు మువురు గలసిన, మోదము రూపఱును ఖేదమును నగు నఘభా
పాదనము గల్గు నిక్కము, వేదవిరుద్ధంబు సేయు వేయేలయిఁకన్. 218

గీ. ఎతని గృహసీమ భామ పుంగతిని బరఁగు, సతివశంబున నెవ్వాఁడు బ్రతుకఁదివురు
నతని జన్మంబు వ్యర్థతాస్థితిని దనరు, నతులమై సంపుటిల్లు దుర్దశలవెల్ల. 219

ఉ. కామన మోర్వలేమి యనృతంబును రాగతనంబు గల్గు వా
కామిని యట్టెనేని కరకం బనుటొప్పును వాఁడు గాన, క
చ్చో మధురంపుఁబండ్లు పరిశుద్ధజలంబు తలంబు లబ్బెడున్
గీములలో లభింప విలు కీడగుఁ గూడును లగ్గు కానలో. 220

ఉ. మేలగు హింస్రజంతునునసేవనికేతనుడౌట, యెంతయున్
మేలగుఁ జిచ్చుఁజొచ్చుటయు, మేకొని దుర్ముఖియైన కాంతతోఁ
గాలముఁ బుచ్చుకంటెను; సుఖంబులు ఘోరహలాహలజ్వల
జ్జ్వాలలు తమ్ముఖాప్పులవి చావున కెక్కుడు సొక్కఁజేసెడున్. 221

గీ. మత్తకాశినీత్రాసితమానసుండు, నిత్యమును జేయు కృత్యముల్ నిష్ఫలములు
కీర్తిదొఱఁగును బరఁగు దుష్కీర్తి యెల్ల, నైహికాముష్మికములు దుఃఖావహములు.

గీ. తరుణి వెరపైన మనుజుఁ డీధరణి కోవఁ, బరఁగు నిందల పందయై నరక మొందు
బిట్టు సౌఖ్యంబు కీర్తి లేసట్టివాఁడు, బ్రతికెనేనియుఁ జచ్చినగతిన యుండు. 223

క. పలువుర సవతుల కొకచో, నిలువంగాఁ గూడ దట్లు నిలిచిన యశమా
నిలువదు; పలువురు చెలువలు, గలిగిన కీ, దొక్కరమణి గల్గిన లగ్గౌ. 224

క. సౌమ్యక గంగా! శర్వప, దమ్మున కీపల్కునాతి తాఁజను విధిగే
హమ్మున కీరమ నా నిల, యమ్మున వసియించు పంజులాశయ యగుటన్. 225

క. పతిరత యనువర్తినియును, సతతంబు సుశీలయు నగు చాన గలుగువాఁ
డతులసుఖవంతుఁడును స, ద్గతిపాత్రుం డౌను ధర్మతత్పరుఁడు నగున్. 226

గీ. ఎవని యిల్లాలు పతిరత యవుచునుండు
ముక్తుఁడును శుచి సౌఖ్యసంయుక్తుఁ డతఁడు
ఎవని యర్ధాంగి దుశ్శీల యవుచునుండు
పాపి దుఃఖియు జీవచ్ఛవం బతండు. 227

ఉ. ఇట్టని మిన్నకుండెఁ గమలేశ్వరుఁ; డంగన లొక్కపెట్టఁ జ
న్గట్టుల బాష్పముల్ దొరఁగి కాల్వలు గట్ట పరస్పరంబునుజా
బిట్టు కవుంగిలించుకొని మిన్నద్రువన్ వెసనేడ్చి; రంతవా
రెట్టు సహింతు రట్టి జగదీశ్వరు శాశ్వతవిప్రలంభముజా! 228

ఉ. కన్నులనీరు కాల్వలయి క్రమ్మఁ జలన్నిజగాత్రవల్లులై
మిన్నదొఱంగి పైఁబడిన మేరను జెయ్యలు దక్కియుండి యా
యన్నులు దేజి కొంతకు భయస్థితి గద్గదభిన్నకంఠలై
విన్నపమాచరించి రిటు వెన్నునితోడఁ గ్రమక్రమంబునన్. 229

మ. "అకటా! యెట్లుభరింతు నాజననశోచ్యంబైన యీశాప? మీ
వె కటాక్షింపుము శాపమోక్షణకథాభివ్యక్తిఁ గాదేని నీ
వికటత్మోతలమందు యోగకలనం దేహంబు చాలింతుఁ బూ
నిక పాఁకందగుఁగాక వీఁకచెడి చన్నే నీ వుపేక్షింపగన్." 230

వ. సరస్వతి యిట్లు వచియింప గంగ యిట్లను, 231

మ. "నను నిర్దోష నిటుల్ త్యజింపఁదగునే నాథా! భవత్త్యక్తనై
మనఁగాఁజాలుదునే! తలంపు మిటు లాత్మప్రేయసీత్యాగముజా
వనితజా జంపిన దోసమున్ సుగతికిజా బాపుంగదా! లోకనా
థునినైనజా; నిరయంబుఁ జేర్చు చెడుగుజా ద్రోవల్ ప్రియంబాయెనే!" 232

ఉ. అంతట లక్ష్మీ నాథుఁ గని యంజలివట్టి "మహాత్మ ! నీకిటుల్
పంతము(బూనఁగాఁ దగునె ? పల్కు-నెలంతయు గంగయున్ రుషా
క్రాంతలు వందలాడుకొనఁగా నవారల జాలిమైఁ గటా
క్షింతురుగాక, శాల్మి విడఁజెల్లునె ! నీవు దయాపయోనిధీ ! 233

క. తెలిసీతెలియక కాంతలు, సలిపెడు కర్జములు తెలిసి సైఁచుటతగు భ
ర్తల కట్లుగాన నీయీ, చెలువల నెటులైనఁ గావఁజెల్లును నీకున్. 234

చ. సెలవిడి నన్నుఁ బంపు మిఁకఁ జెచ్చెర భూమి జనింప నేగఁగా
వలె, నట నెంతకాలము నివాసమొనర్తునొ ? నాజలమ్ముఁన్
గలిపిన పాపముల్ సయిచి క్రమ్మఱ నెప్డు భవత్పదాంబుజ
మ్ములు గొలువంగవత్తునొ ? ప్రభూ ! తెలుపంగదె ! భీతియయ్యెడుఁజా. 235

గీ. తులసి యనియెడు నన్నుచేఁ గళధరించి
ధర్మకేతుధరావేత తనయ నగుచు
ధరణిఁ బరఁగుచు నెప్పుడు తావకీన
చరణయుగ మేను గనుఁగొందు శరణ మనుచు. 236

క. ధరణీజాకృతితో నీ, ధరణిని ద్వ్యదధీనదేవతాత్వముఁ గనుచోఁ
గరుణామతి వగుచు మదు, ద్ధరణం బొనరించు టెపుడు తడయక చెపుమా. 237

క. వాణీశాపవశంబున, క్షోణికిఁ దానేగె గంగ ఘోరతరాంహః
పాణింధమమగు ముక్తివిఁ, బోణిమిమైఁ గాంచి విన్నుఁ బొదఁగను టెపుడో. 238

క. గంగాశాపంబునఁ బ, ల్కాంగుబ్వెత రత్నగర్భకుం జమచో నే
భంగిని దా శాపవిము, క్తిం గొను నీచెంగటను సుఖించుటకు హరీ. 239

గీ. సలువయింటికిఁ బలుకులకలువకంటి, గంగ యాస్మరఘస్మరాగారమునకు
వేగుఁదంచును నానతి యిచ్చినార, లెడఁద నెనరూని యిది క్షమియింపవలయు."

వ. అనిన నెన్నండిట్లనియె. 241

క. నీవాక్య మాచరించెద, నావాక్యము రిక్తగాఁ దనర్చునె యెందుఁజా
భావించిచేయు సామ్యము, నే వచియింతును జగద్వినేయము గాఁగజా. 242

క. వలువయింటికిఁ బలుకులకలువకంటి, గంగ యాస్మరఘస్మరాగారమునకుఁ
జనుదు రీవుందు విచట వాచనవు గల్గి, యన్యథాగతి గలుగఁజేయంగఁ దరమె.

గీ. అభిగీరథనీతయై యవనికరిగి, త్రిభువనంబులఁ బ్రోచి ప్రతిష్ఠఁజెంది
గట్టువిల్కాని యౌదల మెట్టి గంగ, పూతయయ్యును దా నతిపూత యగును.

గీ. కళను ధరియించి నైజసంగతిని బాసి, యవనిఁ బద్మావతి తులసి యనఁగ నొప్పి
ద్వీపినీమేదినీరుహరూపములను, దాల్చియుండుము మదిని ఖేదంబుఁ దొఱఁగి.

క. ఇంతి! పంచసహస్రా, వంతరమునఁ గలియుగంబునం గల్గును శా
పాంతము పిమ్మట నాప, ద్యంతము నేతెంతువు నిశ్చయంబగును జుమీ. 246

గీ. ఎల్లదేహుల సంపత్సమృద్ధులకును, నాపదల హేతుభూతములై తనర్చు;
మహిమ గల్గునె యాపద్విరహితమగుచు, భవునకైనను సారసభవునకైన. 247

వ. మామకమంత్రోపాసనదీక్షాదక్షమునిజనతాక్రాంతవితాయమానస్నానావగాహనదర్శన
స్పర్శనంబులంజేసి యుష్మదీయఘోరాంహోజాలంబు నిర్మూలంబగు మఱియును,

గీ. భూతలంబును దీర్థముల్ పూతములగు, సంతసంబున మద్భక్తజనుల స్పర్శ
దర్శనంబుల నర్థినఁ దక్షణంబ, యదియె పావన మవియ మహానదులగు. 248

సీ. ఏకాదశీవ్రతహీనులు నాస్తికుల్ • గ్రామయాజకవరఘాతకులు లటు
లత్యుగ్రభాషి మిథ్యాసాక్ష్యవక్త మి • త్రఘ్నకృతఘ్నవిప్రఘ్నగోఘ్న
గురుతల్పశయనులు పరదారగమనవి • శ్వాసఘాతుకవృషవాహకులును
పుంశ్చలీపుత్రులు పుంశ్చలీరతులును • దేవలాదీక్షితధావకులును

గీ. దల్లిదండ్రులఁ దమ్ముని దనయుఁ దనయ • భార్య భగినిని దైన్యవద్బంధుజనుల
నత్తమామలఁ బోషింపనట్టి పాపు • లనఘులగుదురు నాభక్తజనులఁగనిన. 250

క. శూద్రశవవాహకులు వి, ప్రద్రవ్యవినాశకరులు రసవిక్రేతల్
భద్రధ్వంసకు లిల న, క్షుద్రులెకా నాదు భక్తుఁజూచినయంతన్. 251

వ. అనిన లక్ష్మి యిట్లనియె. 252

క. హరిభక్తిహీనులైనను, తరియింతురు భక్తజనుల దర్శనమున నం
చరుదుగ వచియించితి దే, వర భక్తు లనంగ నెట్టివారలు చెపుమా. 253

గీ. అనిన భగవంతుఁ డిట్లను వతివతోడ, భక్తలక్షణ మధికగోప్యంబు పాప
నాశనంబును సౌఖ్యసంధానచణము, నైనఁ దెల్పెదఁ బ్రాణతుల్యవగు నీకు. 254

క. గురుముఖమువలన నెవనికి, హరిమంత్రము చెప్పఁబడునొ యాతఁడు చెందున్
సురలోకస్థితుఁడైనను, నరకస్థితుఁడైనఁ దక్షణంబునముక్తిన్. 255

ఉ. మానిని! మద్గుణశ్రవణమాత్రమునం బులకల్ జనించు నె
మ్మేన మనంబులోన మితిమీఱిన సమ్మద మావటిల్లి క
న్గోనల బాష్పముల్ గురియుఁ గ్రొంజెమట న్వెలసిల్లు దేహమె
వ్వానికి వాఁడెపో పరమభక్తుఁడు ముక్తిచతుష్టయార్హుఁడున్. 256

వ. నావుడుఁ గమల యిట్లను. 257

గీ. కలియుగం బైదువేలేండ్లు కడచనంగ, శాపమును బాపుకొని నీదు దాపునకును
నిచ్చ రమ్మని యానతి యిచ్చినారు, పిదప ధారుణి యేగతి వెలయుఁ జెపుమ. 258

వ. అనిన నారాయణుం డిట్లనియె. 259

క. కలిఁ బంచసహస్రాబ్దం, బులు చన ధర్మంబు సత్యమును గర్మంబుల్
గలుగవు క్రమక్రమంబుగ, నిలలో వర్ణాశ్రమములు హీనంబులగున్. 260

చ. అరయ మహాకలిన్ దశసహస్రశరత్తు లతిక్రమింప స
త్పురుషులు ధర్మవర్తనులు పుణ్యులు గణ్యులు వేదవేదులున్
సిరిదొరఁ గోరువారు తులసీవనసేవనపాపనాత్మకుల్
విరళముగా వసింతురు వివేకవిపాకవిహీనచిత్తులై. 261

ఉ. క్రూరులు దాంభికుల్ శఠులు క్రోధమనస్కులు హీనసత్వులా
చారవిదూరు లప్రియు లసత్యవచస్కు లళీకవాదులున్
జోరులు ప్రాణిహింసకులు కుంతలు మూర్ఖులు ద్యూతకారకుల్
జారులు నీతిబాహ్యులు వసహ్యముగా భువి మందు రెల్లెడన్. 262

క. తమతమ యాచారంబులు, క్రమముగ వర్జించి యర్థకాంక్ష యవనశా
స్త్రము లభ్యసింతు రిది యు, త్తమమని విప్రాదు లధమతతిఁ గూడి తగన్. 263

సీ. సత్యముండదు సర్వజనములకడ భూమి • పండకయుండు భూమండలాధి
పతులు ప్రతాపహీనతనుందు రంబుహీ • నంబులై నదులుండు నగరములును
నరశూన్యములు భయానకములై వర్తిల్లు • గోవులు క్షీరముల్ గురియకుండుఁ
బాలలో వెన్న స్వల్పంబేని యుండదు • వికృతాకృతిని జనవితతి వొలుచు

గీ. అన్ని వర్ణంబు లొక్కఁడౌ న్యాయ మన్న • దూరమగు సజ్జనుల మాటఁ జేరకుండు
నదియ్యయో! చెప్పశక్యమే యధమమైన • కలియుగంబునఁ గల్గు దుష్కర్మములను.

క. కొందఱు పొందుదు రర్థులఁ, గొందఱు భ్రాతృసతి గవయఁ గోరుదు రక్కన్
గొందఱు పేమేటికి యెటు, సందర్భం బటుల జరుగు జారత్వంబుల్. 265

క. పదియాఱు వత్సరములకు, ముదిమి యొదవు గుజ్జువాండ్రు బొడముదు రిల వి
ర్వదియేఁడులు గతియించిన, నదియే పూర్ణాయు వందు రఖిలజనులకున్. 266

గీ. వత్సరాంతప్రసూతలై వనితలుండ్రు, జరయు రుజయును వెంటనే సంభవించు
వంధ్యలగుదురు తఱచుగా వనితలెల్లఁ, గలియుగపుఁజర్యఁ జెప్పశక్యంబుగాదు. 267

క. కన్యాధనకుక్షింభరు, లన్యాయపథానుచరు లహంకృతియుక్తుల్
మాన్యక్రేతలునై పౌ, జన్యం బొకయింత లేక జనులుందురిలన్. 268

క. పున్నమ నమవసమాపుల, నన్నముఁ గుడిచెదరు విప్రులదియొకఁడేలా
జన్నిదము లూడ్చి సంధ్యకు, సున్నయిడుదు రవని విప్రశూన్యముగాదే. 269

గీ. బ్రాహ్మణాగారములయందు బాచకాళి, మసలు భగభక్తముల నియమంబు దఱుఁగు
వ్రేలుపొడ వుందురు జనుల్ వృక్షతతియు, హస్తమాత్రప్రమాణంబు విస్తరిల్లు.

వ. ఈ ప్రకారంబు కొంతకాలం బతిక్రమించిన యనంతరంబ. 271

గీ. అవని యవనేశ్వరుల కెల్ల నాటపట్టు, గాఁగ నుండుటకతనఁ బంక మభివృద్ధి
జెందుటయు దాని నశియింపఁజేయ విష్ణు, వవతరించెడు నొక్క విప్రాలయమున.

ఉ. పాటిఁ దొఱంగి సజ్జనులఁ బట్టి తురుష్కులు ముష్కరంబునన్
బాటులఁబెట్టుచుండ నలబ్రాహ్మణపుత్రకుఁడైన కల్కి తా
ఘోటక మెక్కి ఖేటకము క్రూరముగా ధరియించి వే విరా
ఘాటముగా వధించు నలఘాతుకజాతి సబాంధవంబుగన్. 273

క. ఖానుల వధించి యంత, ర్ధానమునొందంగ ధర యరాజక మగుడున్
మానవగృహములు దస్యు, స్థానములై పరఁగుచుండుఁ దాపసవర్యా. 274

ఆ. వె. క్షోణితలము నిండ స్థూణాప్రమాణమా, సార మఖిలజంతుఘోరముగను
గురియు నాఱుదినము లరుదుగా ద్వాదశ, సూర్యు లుదయమగుదు రార్యవినుత.

గీ. అంత గృహవృక్షలోకశూన్యమగు భువన, మర్కతేజంబుకతన ననంతరంబ
ఘోరకలిపోయి కల్మషదూరమైన, కృతయుగం బేగుదెంచు ధార్మికులతోడ. 276

సీ. సకలవేదార్థవిజ్ఞానవిజ్ఞాపన • భాసురభూసురాగ్రేసరులును
బ్రాహ్మణభక్తిసంపాదితైశ్వర్య ప్ర • తాపదిగ్విజయభూమీపతులును
గోకృషివాణిజ్యకులవృత్తివర్ధిత • ద్రవ్యతోషితసుమార్గణవణిజులు
బాడబక్షత్రియవైశ్యసేవాసమా • పాదితధర్మయుక్పాదజులును

గీ. మగనిమాటను దాఁటని మానవతులు, స్వకులధర్మంబు వీడని సకలజనులు
సర్వసస్యసమృద్ధమౌ క్ష్మాతలంబు, నగుచుఁ జెలువొందు నా కృతయుగము మౌని।

క. దేవీభక్తిపరాయణు, లై వేదోక్తప్రకార మాచారంబుల్
గావించి సకలజను లిల, లో వెలయుచు రఘములకును లోఁబడకుండన్. 278

గీ. ధర్మము త్రిపాదములను త్రేతాయుగమున, ద్వాపరంబున రెండుపాదములఁ గలిగి
నేకపాదంబునను నటియించు నంతఁ, గొన్నిదినముల కదియును గోఁలుతయగును.

వ. అమటయు, 280

గీ. భూమి దానంబుచేఁ గల్గు పుణ్యములను, ధరణిహరణంబువలని పాతకము ధాత్రి
దీప మిడుటయు మొదలు ధరాపరాధ, ములను దత్ప్రతికరణముల్ తెలుపు మీశ.

వ. అనిన నారాయణుం డిట్లను. 282

గీ. ధరణి నిమ్ము నెవండు వితస్తిమాత్ర, మాగమజ్ఞున కతఁడు శివాంతికమున
నిలుగు; మర్వర నిచ్చిన హరిపదమున, భూమిరేణుప్రమాణాబ్దములు వసించు. 283

క. భూగ్రామదానములు వి, ప్రగ్రామణులకు నొనంగు వాఁడు విధూతో
దగ్రాఘుండై దేవికి, నగ్రచరుం డగుచు వెలయు ననిశం బనఘా. 284

క. తానొసఁగిన దొరు లొసఁగిన, దైనను భూసురులవృత్తి హరియించెడు వ
మ్మానవుఁడు కాలసూత్రమ, హానరకమునందుఁ గూలు నతికష్టమునన్. 285

క. మతియును నాతని సంతతి, హరియించును భూమి హీనమగు, సంపదలున్
స్మరణీయములగు, రౌరవ, నరకంబును గలుగుఁ బిదప నారదమౌనీ. 286

క. గోమార్గంబుల నుంచక, భూమిని సస్యంబుసేయు మూర్ఖుండును గో
సీమలఁ జెర్వుల దున్నిన, పాముఁడును నరకమునఁ బడకుండుదురే. 287

క. కామియయి వీర్యపతనము, భూమిని గావించినట్టి పురుషుండు పయ
స్సీమల భూములు చేసిన, పామరుఁడును నరకమునకుఁ బాత్రులు కారే. 288

గీ. పంచపిండంబు లీయఁ ద్యజించి స్నాతుఁ, డౌను బరకూపమందు నే మానవుండు
నరకవాసియగు వాఁ డనారతంబు, స్నానమును నిష్ఫలంబగు మౌనివర్య. 289

గీ. దీపము ధారుణి నుంచిన, పాపాత్ముం డంధుఁ డగును; బంచజనులకున్
క్ష్మాపతికిఁ బిండ మీయక, యే పితరుల కిచ్చి నరక మేగును వాఁడున్. 290

గీ. రత్నమౌక్తికహీరహిరణ్యములను, శంఖయంత్రశిలాజలచందనములు
పుష్పజపసరదుర్గకర్పూరములను, ధరణి నిడువాఁడు నరక మొందంగలాఁడు 291

గీ. యజ్ఞసూత్రము కుశలు రుద్రాక్షములును, బుస్తకంబును శివలింగమును నెవండు
భూమియందు సమర్పించు మూఢజనుఁడు, బ్రహ్మజన్మంబుఁ బొందఁ డెప్పటికి వాఁడు.

గీ. గ్రహణకాలంబునందు భూకంపమందు, వసుధ ఖననంబు జేసిన వాఁడు ముందు
జన్మమున నంగహీనకల్యసహితుఁడగుచు, దుఃఖమును బొందునని నారదుడు వచించు.

## గంగోత్పత్తి.

చ. ప్రవిమలమౌచుఁ జిత్తము విభాసిలె నివ్వసుధాసుధాకథా
శ్రవణమున న్మహాత్మ! దివిజస్థలిసుస్థితిఁ గన్న గంగ యీ
యవనికి నెట్టు లేయుగమునం దెపు డెవ్వని ప్రార్థనంబుచే
నవతరణం బొనర్చె నిది యానతి యీవె కృతార్థుఁ జేయవే. 294

క. అని విన్నపంబు సేయుట, యును నారదమౌనితోడ నొగి ననె నారా
యణుఁ డిటు మంధాద్రిజుఁ, బ్ధవీరనిధిభంగభంగివాచాస్ఫుటితోన్. 295

ఉ. రాజకరాంబుజాతభిదురప్రతిభాగతి శాతబాణధా
రాజితవైరిసంచయశిరస్థ్సమణీముకుటీ విభాసినీ
రాజితపాదపద్ముఁడు ధరాసురరాజసమాజదానవా
రాజితనైజసద్ముఁడు ధరన్ సగరుండనురాజు రాజిలున్. 296

గీ. ఆ సగరుఁడు వివాహముఁ జేసికొనియె, భాసమాననిజశరీరభాసమాన
లైన సతులఁ వైదర్భి యనెడుదాని, శైబ్య యనియెడుదానిని సంతసమున. 297

క. ఆరాజవరుఁడు స్మరసుతు, మారుని నసమంజుఁడను కుమారునిఁ గనె శై
బ్యారామాగర్భంబునను, నారాధనఁజేసె శివుని నన్యయు భక్తిన్. 298

క. అంగజసూదనుకృపచే, తం గర్భముతో సమాశతంబు గడపి య
య్యంగన మాంసపుపిండం, బుం గనియెను దాని పూర్వపుణ్య మదేమో. 299

క. ఆమాంసపుఁ బిండము గని, తా మనమునఁ జింతనొంది తరుణేందుధరున్
సోమునిఁ గరుణోద్ధాముని, వేమాఱు నుతించుచు పనివి పనివి యేడ్చెన్. 300

గీ. సూతికాగారమున నున్న సుదతి కడకు, భూసురాకారమున బూని భూతనేత
చేరి మాంసపుఁబిండము జీల్చె నంతఁ, గ్రమత షష్టిసహస్రఖండములు గాఁగ. 301

గీ. ఆశకలములు గ్రీష్మమధ్యాహ్నసమయ, తిగ్మభానుప్రభామృష్టతేజులయిన
రాకొమరులయ్యె రూపలక్ష్మీకుమారు, లీకొమరు లంచుఁ జూపఱు వాకొనంగ. 302

వ. ఇట్ల య్యఱువదివేవురు పుత్రులు దినదినాభివృద్ధి గాంచుచున్నంత. 303

మ. హయమేధం బొనరింపనెంచి సగరుం డాత్మోద్భవశ్రేణినా
హయమున్ రక్షయొనర్పఁ బంప నది యన్యావార్యమై భూమిలో
రయమొప్పం జరియించి నాగసదనప్రాంతోర్వి నిల్చెం దపో
నియతిన్ గాలముబుచ్చు నాకపిలమౌనిశ్రేష్ఠు పాశ్చాద్దిశన్. 304

ఉ. సాగరు లాహయం బరుగు జాడఁ గనుంగొనలేక నీక భూ
భాగము లెల్లెడ న్వెదకి వాహముఁ గానక ధాత్రిఁ ద్రవ్వి యా
భోగవతీపురంబు దరిఁబోవుచుఁ గన్గొని రొక్కచోటన్ సమ
స్తాగమవేదియౌ కపిలు నాతనివెన్కఁ దురంగమంబునున్. 305

క. వైతానాశ్వహరుండగు, నీతాపసియంచుఁ జేరనేగి తపోదీ
క్షితత్పరుఁడగు మౌనిని, నీతి నదలి పరిభవింప నెలకొనుకతనన్. 306

చ. అతులతపఃప్రభావుఁడగు నమ్ముని కోపదవాగ్ని భస్మసా
త్కృతులయి రా కుమారు లదియెల్లను జారులుదెల్ప నాలకిం
చి తతవిషాదుఁడై యెరియుచిత్తముతో సగరుండు దాపసాం
చితమగు నొక్క పేరడవి చెంతకు నేగెఁ దపోభిలాషయై. 307

గీ. అతని యాత్మజుఁ డసమంజుఁ డనెడియాతఁ, డభ్రగంగను భూమికి నవతరింపఁ
జేయఁదలపోసి నిష్ఠమైఁ జేసెఁ దపము, లక్షయేఁడులు పిదప కాలగతిఁగనియె.308

గీ. అతని తనుజాతుఁ డంశుమదాఖ్యుఁ డభ్ర, నదిని ధరణికి నవతరణం బొనర్ప
లక్షయేఁడులు గురుతపోదీక్ష సల్పి, కాలయోగంబు కతన సద్గతినిగనియె. 309

చ. అతనిసుతుండు ద్రాక్షఫలితార్యమనోరథుఁ డబ్జవాసినీ
పతిపదనీరజాతయుగభక్తివిహారధి శాంతిదాంతిసం
స్తుతగుణరత్ననీరధి యశోనిధియైన భగీరథుండు దీ
క్షితుఁడయి నిష్ఠమైఁ దపముసేసె వియన్నదిఁదెచ్చు బుద్ధితో. 310

ఆ. వె. జరయు రుజయులేక జలపర్ణమారుతా, శనత దేహయాత్ర జరపికొనుచు
నూఱువేలయేం డ్లనూనతపంబు నొ, నర్చుచుండి యొక్కనాఁ డతండు. 311

సీ. హరినీలమణివిభాస్వర శరీరమువాని • మురళి మ్రోయించు కెమ్మోవివాని
గ్రీష్మసహస్రోష్ణకిరణతేజమువాని • బట్టుపుట్టము మొలఁగట్టువానిఁ

జతురాననాదినిర్జరనుతాంఘ్రులవాని • మునిమునినగవుల మోమువాని
భక్తసంత్రాణసంభ్రమమానసమువాని • తోయజమేలు కన్దోయివానిఁ
గీ. ప్రకృతిపరు సాక్షిరూపు గోపాలవేషు • వహ్నిశుద్ధాంశుకాధాను వరచిరత్న
రత్నభూషణభూషితుఁ బ్రణుతిపాత్రు • బాలకృష్ణునిఁ గనె నేత్రపర్వముగను. 312

క. కాంచి హరిపాదములకు న, మంచితమతి మ్రొక్కి మాటిమాటికి నుతి గా
వించుచు నిటు విన్నప మొన, రించెఁగా మది భక్తిగదురఁ గృష్ణునితోడన్. 313

శా. దేవా! సాగరు లాదటన్ సగరు మేధీయాశ్వముం గోయ బ
ల్యావాసంబున కేగి యాకపిలురోషాగ్నిచ్ఛటం గ్రాఁగుటన్
దేవద్వీపవతిన్ భువిన్ దిగిచి తద్వీచీస్మృతి న్వారి నెం
తే పీతాఘులఁ జేయనెంచితిఁ దపోనిష్ఠాగరిష్ఠుండనై. 314

క. నావుడు నాళీకాక్షుఁడు, ద్యోవాహినిఁ గాంచి యవియెఁ దొయ్యలి! సగర
క్ష్మావరసుతులను వేగమ, పావనులను జేయఁ జనుము భారతమునకున్. 315

క. నీవాయుస్పర్శనమున, బావనతం బరిఢవిల్లి వారందఱు నా
యావాసమునకు వత్తురు, దేవస్యందనవిహారదీపితులగుచున్. 316

క. నామూర్తిఁ దాల్చి సతతని, రామయతం దనరుచుండి యనిశము నాదౌ
ధామంబునందు భక్త, గ్రామణులై యుందు రెల్లకాలంబు రహిన్. 317

క. గంగావాయుస్పర్శము, నం గోటిభవార్జితవృజినంబేని వెసన్
బ్రుంగు నటంచును వేదము, నం గానఁగనయ్యె నదియు న్వ్యాఖ్యము గాదే. 318

వ. దేవీదర్శనస్పర్శనంబులనం గలుగు పుణ్యంబుకంటె సామాన్యదినసంబున మను
జుండు జేయు మౌసలస్నానంబు పదిగుణంబు లధికంబై యుండు. 319

గీ. కోటిజన్మంబులందుఁ దాఁగొనినయట్టి బ్రహ్మహత్యాదిఘోరపాపంబులైనఁ
బంచబంగాళమై చనుఁ బర్వమందు, మౌసలస్నానముసు జేయుమాత్రమునను. 320

క. అనిపలికి మిన్నకుండిన, వనజవిలోచనునిఁ గాంచి భక్తివినమితా
ననయై వినయముతోడన్, జనవున నిట్లనియె గంగ సంయమివర్యా! 321

మ. అల రాజన్యతపఃప్రభావమున నీయాజ్ఞాప్రకారంబునం
బలుకుంగోమలి శాపకారణమునన్ క్ష్మాలోకముం జేరి పా
పుంచేఁ బ్రాప్తములైన పాపనికరమ్ముం బాపి నే నెప్పు దే
వలనం దేవరపాదము ల్గనుదు దేవా! యానతీవే కృపన్. 322

క. నామనమునఁ గోరిక లేఁక, నేమేమందిన సమస్త మెఱుఁగుదువుగదా
యేమని దెల్పుదు నాకుం, గామితములఁ నొసఁగి వేగఁ గావు మనవుడుఁగా. 323

చ. ఎఱుఁగుదు నీ మదింగల సమీహితముల్ లవణాబ్ధి నాథుఁడై
యతిముదిఁ గారవించు నిను నాతఁ డనంగ మదంశజాతుఁ డ
ప్పురముగ లక్ష్మియంశమునఁ బుట్టితి వీవును గాన మీకు ని
ర్వురకును దంపతిత్వ మమరున్ జగతీత్రయసుప్రసిద్ధమై. 324

క. ద్వీపవతు లెన్నియుండిన, నీపై మోహంబు మిగుల నెలకొల్పి దయన్
గాపాడుచుండు వారిధి, ప్రాపించున్ వారికంటె బలుసిరులు నినున్. 325

గీ. వరభగీరథకృతనుతిఫణితిచేతఁ, గణ్వశాఖేరితధ్యానకలనచేత
భారతం బందలి జనం బవారతంబు, పూజఁ గావింత్రు మది భక్తి రాజిలంగ. 326

ఆ.వె. నూఱుయోజనముల దూరమం దుండియు, "గంగ గంగ గంగ గంగ" యనుచు
నుడువు నతఁడు బాసి చెడుగులవలనను, బాయకుండు విష్ణుపదము లలన! 327

క. పాపిసహస్రకృతస్నా, నాపాదితపాపజాల మంతయు మన్మం
త్రోపానకదర్శనమున, రూపఱు నిక్కంబు జాతరూపనిభాంగీ. 328

గీ. పాతకిసహస్రకుణపసంస్పర్శనమున, నీకుఁ గల్గిన కిల్బిషావిక మెల్ల
వాదు భక్తుం డొకండు స్నానంబు చేయ, నంతమాత్ర నిష్పచ్చర మగును దరుణి!

గీ. ద్వీపినీ! వినుము సరస్వతీప్రముఖన, దీచయసమక్షమం దఘమోచన మనఁ
గా వసింతువు త్వద్గుణగణవ మెచట, నగు నపుడ యౌను నదియె పుణ్యస్థలంబు.

గీ. సుదతి! నీవగు రేణువు సోఁకినట్టి, నరుఁడు పాతకియైన నాతఁ డణమునందుఁ
బావనుండగు నిక్కంబు దేవిపవని, భూమిరేణుప్రమాణాబ్దములు వసించు. 331

ఉ. దెందమునందుఁ గోర్కులు కదిందివిచారము వోవనాడి మీ
యందలి భక్తిమామకమహామనువుల్ స్మరియించుచున్ మృతిం
జెందిన మానవావళి వసించును శౌరిపదంబు చేరి యా
నందమువొంది పార్షదజనప్రభుతాప్రతిభాప్రసిద్ధమై 332

క. జ్ఞానవిహీనుం డేనియు, నీ నీరస్పర్శనమున నీగుణనుతితో
దా వసువులు విడిచిన నా, స్థానంబున పార్షదప్రధానుని జేతున్. 333

క. ఏయెడనైనను నీనుతిఁ, జేయుచుఁ బ్రాణంబులను ద్యజించు నరునకున్
సాయుజ్య మిచ్చి పార్షద, నాయకుఁడై యుండఁగా నొనర్తును గొమ్మా! 334

మ. ఇదితీర్థం బిదిగాదనాఁగఁ బనియే మెచ్చోటనే నిచ్చతో
మదిలోఁ దావకనామసంస్మరణముం బాటించుచున్ జీవమున్
వదలం ధాత్రి నెవాఁడు వాఁడు మణిదివ్యస్యందనారూఢిఁ బా
ర్షదసంసేవితుఁడై మదీయపదవిన్ సారూప్యముం బొందెడున్. 335

వ. ఇట్లు గంగ నామంత్రణంబు సేసి. 336

గీ. ఓభగీరథ! వినుము నీయుల్లమందు, గలుగుకోర్కులు ఫలియించు కాలమిదియ
చిత్తమునఁ బాదుకొల్పిన బత్తితోడ, గంగఁ గీర్తింపఁ బూజింపఁ గడఁగు మింక.

ఉ. నా విని యా భగీరథుఁ డనంతముదంబును బొంది యజ్ఞభు
క్సైవలినిం గనుంగొని వెస న్నుతి సేయుచు శీర్ష మూర్విపై
మోవ నమస్కరించి యఘమోచను సారసపత్రలోచనున్
వే విధులన్నుతించెఁ దనవెంటనె గంగ చనంగ నంతటన్. 338

వ. అనిన నారదుండు గంగాపూజావిధానం బనుగ్రహింపుఁడన నారాయణుం డిట్లనియె.

క. స్నానమ్ము సేసి విహితవి, ధానమ్ములఁ దీర్చి సుపరిధానంబుల్ దాఁ
బూని మది దేవషట్క, ధ్యానం బొనరింపవలయు ధర్మజ్ఞుఁ డిలన్. 340

ఉ. గణపతి విఘ్నశాంతి, కల కల్వలదాయ రుజాప్రశాంతికిన్
ద్రిణయను జ్ఞానసిద్ధికి, హరిన్ సిరికి, న్శుచియుక్తి కాశుశు
క్షణిని, హిమావనీధ్రతనుజాతను ముక్తికిఁ గోరి యే రవా
రణమగు భక్తిఁ గొల్తు రలప్రాజ్ఞుల కెల్లశుభమ్ము లయ్యెడున్. 341

గీ. అట్లుచేయక పూజ సేయంగడంగు, వానిపూజన మగును నిష్ఫలము గాన
దేవషట్కంబుఁ బూజించి తివిరి యిష్ట, దైవతసమర్చనము సేయఁదగునటన్న.

గీ. కలియుగం బైదువేలేండ్లు గడవనంగ, గంగ యెచ్చోటి కేగె నేనంగ మిగుల
వేడ్క బొడమెదు నెదఁ జెప్పవే యనంగ, నాతఁ డిట్లని చెప్పె సంప్రీతితోడ. 343

ఉ. అత్తఱి నవ్విలాసిను లహంకృతి లోఁ బొడమం బరస్పరో
పాత్తములైన కోపము లవశ్యము భోగ్యములౌటఁ జిత్తముల్
తత్తఱమందఁ దద్గతుల దాల్చి యీ యవధిన్ ధరించి య
త్యుత్తమమైన దేహములతోఁ జనుదెంచిరి శౌరిచక్కికిన్. 344

వ. అనిన నారదుండు, మహాత్మా! విష్ణుపాదాంబుజంబున నుద్భవంబందిన మందాకిని
బ్రహ్మకమండలు వనియు శివప్రియ యనియుం బేర్కొనంబడుచుండ నారాయణు

వకుఁ బ్రియపత్ని యగు చెట్లనవుడు: మునీంద్రా! తొల్లి గోలోకంబున రాధా కృష్ణాంగసముద్భూతయయి తదంశంబయి యనన్యకన్యకాజనసామాన్యలావణ్యం బగు ద్రవరూపం బవధరించి నిరతంబు వెన్నునికి సన్నికృష్టయై యుండ నొక్క నాఁడు, 345

క. గోపికలు గొలువగా రా, ధాపతి కొలువుంబొనర్చుతఱి గంగ హరికా
జూపు నిలిపి కని మోహో, ద్దీపితయై యచ్చటన్ స్తుతిం గావించెన్. 346

గీ. హరిని గనులారఁ గనుగొన్న యంతఁ బొడమె
నెడఁదఁ గడలేనిమోహ మీపడఁతి కపుడు
లజ్జయును దోడఁ జనుదెంచె నిజ్జగమునఁ
దరుణి కెందులకేని స్వాతంత్ర్యము న్నె. 347

ఉ. ఆదరశబ్జనేత్ర మది నాపఁగరాని తమిన్ గడంగి దా
మోదరునిం గనుంగొనుచునుండెను దువ్వలువ న్మొగంబు నా
చ్ఛాదనమాచరించి విహసన్ముఖచారువిలాసయై; ధరన్
మీఁదుఁ దలంప రంగనలు మిక్కిలి మోహము గల్గుపట్టునన్. 348

గీ. తెప్పవేయక మదిలోన నుప్పతిల్లు, కామమును లజ్జయును నతిగౌరవంబు
వెల్తిపేయంగ మూర్ఛలోఁ బెనఁగొనంగఁ, జేష్టలఁ దొఱంగి నిల్చె రాజీవనేత్ర.

సీ. ఒకచక్కి గోపికానికరమ్ము మణివేత్ర • పాణులౌచును బరాబరులు సేయ
నొకయోర కిన్నరీనికురుంబము బలసి • సాహోవినాదముల్ సల్పుచుండ
నొకచాయ నప్సరఃప్రకరంబు కవగూడి • చెలువార నాట్యముల్ పేయుచుండ
నొకవంక నిర్జరీవికచాంబుజాక్షులు • ప్రమదంబుతోఁ జామరములు వీవ

గీ. మంజులానంతరత్నవిన్మాణమైన • రథమునందు వసించి యారాధ యటకు
రమణనేతెంచి హరిఁ గాంచి రథము డిగ్గి • నాథుకడ కేగె మందయానంబు గదుర.

ఉ. శౌరిపదాంబుజంబులకు సాగిలిమ్రొక్కి తదుక్తనర్మవా
చారస మారగించుచును సంభ్రమ మొప్ప నమస్కరించు నా
భీఃకులాంగనాతతిని బ్రేమగడల్కొన సర్గపద్ధతిన్
గారవమాచరించి యట గద్దియఁ దా వసియించె నొయ్యనన్. 351

క. భయమున్ సంభ్రమము నతిని, వ ఱుము న్మిగులన్ మనమ్మునం బొదలఁగ గం
గయును వెడలి తచ్చరణ, ద్వయుకిం బ్రణమిల్లి శౌరివలపట నిల్చెన్. 352

వ. కలికి తదాననాంబుజవికాసముం గనుంగొంచు నాత్మ మి
క్కిలియగు మోహభావమునఁ గీడ్పడి యోఁదలవాంచి యవ్వడిం
తలు దిగఁద్రావి యుండె నటఁ దద్గత మానసయై నితాంతముగా
వలపుగలట్టిచోట ప్రతిబంధము గల్గిన నట్టులేకదా. 353

క. అంతట రాధికయును వ, త్సాంతంబున నుంటఁజేసి యాపైదము ల
త్యంతముఁ జూచుచు మదికి, న్వింతగఁ గన్పట్టి కోపవిహ్వలమతియై. 354

ఉ. మోవి చలింపఁ జిర్నగవు మోమున నొప్ప నితాంతకాంతవా
చావిభవంబుదోఁప హరి చక్కని దృష్టి నిగిడ్చి పల్కె ని
ట్లావల కొల్వులోపలి వయస్య లహో యన గంగ హా యనన్
దేవతలెల్లఁ దల్లడిల దీపితకోపకషాయితాక్షియై 355

ఉ. దేవరపార్శ్వమందు భవదీయముఖాంబుజ మాస్థఁ జూచుచున్
భావములోనఁ బుట్టు తమి పైకి వెలార్చుచు నవ్వుమోముపై
తీవి యెసంగఁ బయ్యెద ఘటించుచుఁ గంటకితాంగియౌచు మూ
ర్ఛవశయయ్యె నీయువతి సంశయమేటి కెఱుక చెప్పుమా. 356

క. ఈ వేదికపై నిప్పుడు, పీవిత్రము మిగుల మోహనీతం బనియే
సూచింపఁబడియె వినవా, లోచన యేటికి నిజము బలుకుము బిరాసన్. 357

ఉ. కాతఁటా స్థితిలేక దరిగా వసియించిన నన్ను గోపయో
షాతతినేఁ జూడక యసంగతమంచుఁ దలంపఁబోక యీ
నాతికిఁ జిక్కఁజేసితి మనం బవురా! యిదియెంత జంతరా!
ఘాతుకవృత్తి కిట్టు లొడిగట్టిన నీవును సమ్మతింతువే. 358

ఉ. ఈతని సిద్ధకొత్తయన నేటికి నెప్పటి కైపై యిట్టి నీ
చేఁతలు వేసవేల్ గని విశేషము నీయెడఁ గల్గినట్టి సం
ప్రీతిఁ దొలంగఁజాల కురీకృతనై సహియించుచుంటి స్త్రీ
జాతికి నీకుఁబోలెఁ దగు సాహసముం గనె మాతనప్రియా 359

క. ఈకామిని దోడ్కొని గో, లోకంబున నుండి యొందులోకంబులలో
నేఁడకైనను బొమ్మా, నాకడ వసియింపఁ గిదంటిము సుమ్మా. 360

ఉ. చందనవాటికంబు విరజానదిఁ గూడి రమింపుచునాఁటి నీ
చందముఁ గాంచు నావఱకుఁజాడనె నీవు తిరోహితత్వముగా

జెందిన యంత నాకమ ప్రసిద్ధము గాదె నదీస్వరూపమున్
బొంది భవద్విశస్థితిఁ బ్రబోధము చేయుచునుండె నేఁటికిన్. 361

వ. కోటియోజనవిస్తీర్ణంబును, చతుష్కోటియోజన దైర్ఘ్యంబును గలిగి విరజానదినాఁ
బ్రసిద్ధంబగుట యెల్లరకుం దెల్లంబుగాదె. 362

చ. ఇరవున కేగు నన్నుఁగని యియ్యదిసూ యద నంచునెంచి చె
చ్చెఱ నదిఁ జేరనేగి తమిచే " విరజా! విరజా! " యటంచు బోగిన్
మొఱయిడు నీదు మొఱ్ఱవిని పూర్వపురూపము సిద్ధయోగమున్
దొరసినయంత నాచెలువతో రమియించితిగాదె యచ్చటన్. 363

క. ఆరమణితో రమించిన, కారణమున వార్ధిసప్తకం బాత్మజులై
ధారుణి విలసిలుచుండును, రారయఁ బ్రత్యక్షసాక్షులై యిప్పటికిన్. 364

చ. తతకుసుమాంచితం బయిన తల్పమునం బవళించి నీవునుఁగా
గుతుకముమీఱ శోభ యను గోపికతో రమియించుచున్ దిరో
హితుఁడవుగావె నన్నుఁ గని? యింతి తటాలున చంద్రమండల
స్థితిఁ గొనదే? మదిం గనరుఁజెందితివే? యపుడైన నచ్యుతా. 365

వ. శోభాసంత్యక్తంబగు శరీరం బతిస్నిగ్ధ ప్రభాన్వితంబై యుండంగాంచి డెందంబు
నందు వందురి యద్దేహంబు పైకంబు పైకంబుగ విభజించి రత్నంబులకును
స్వర్ణంబునకును రమణీమణి ముఖంబులకును జంద్రునకును గిసలయంబులకును
సుమంబులకును బక్వఫలంబులకును రాజగృహంబులకును దేవాలయంబులకును
నూతనపత్రంబులకును దుగ్ధంబులకును నీవిచ్చితి. మఱియును, 366

మ. మను బృందావనవాటిలోనఁ బ్రభయన్నాఁటోఁడితోఁ గూడియుం
డినచో నచ్చటికేగుదెంచిన ననువీక్షించి యంతర్ధివిం
గనవే! యాప్రభ దేహముం బొఱఁగి శోకంబూరఁగాఁబోయి యా
వనజాప్తుని మండలంబునవె యావాసంబుఁ గావింపదే. 367

వ. ప్రభావిసృష్టంబైన దేహంబు తేజస్సముజ్జ్వలంబై తీవ్రంబై యుండుటం గాంచి
యారమణి యందలి ప్రేమాతిశయంబునఁ దోడెంబుగా విభజించి కొంత హుతాశను
నకును యక్షులకును దేవతలకును విష్ణుభక్తులకును సర్పంబులకును బ్రాహ్మణుల
కును మునులకును రమణులకును బంచియిచ్చుట లిప్పటి కయినను మఱవ
వచ్చునే. 368

చ. అలరు వసంతకాలమున నందు మనోజ్ఞమణీగణప్రభో
జ్జ్వలమగు హర్మ్యమం దలరుశయ్యపయిం దమి నీవు శాంతియున్
లలనయు ముచ్చటందవిలి నాదగుశబ్దము విన్నమాత్ర నా
వల కరుదెంచినా వెఱుఁగవా? చెలి వీడెను దేహమయ్యెడన్. 369

వ. వసంపది యాసతి శరీరంబు విసర్జించి విపినంబులందును నదవనంబుల నుద్ధ
సత్త్వస్వరూపిణివగు మహాలక్ష్మియందును దానకమంత్రోపాసకులయందును శాక్తే
యులయందును తపోనిరతులయందును ధర్మతత్పరులయందును నివసింపంజేసి
తిరిగియుండంగాక. 370

మ. క్షమతోడఁ గ్రమియించి యామెలకు నెజ్జఁ జేసి యశ్రాంతవి
శ్రమలై మున్నొకనాఁడు పైమఱచి నిద్రం జెంది యున్నట్టియా
సమయంబుం గని నెచ్చెలుల్ దెలప నిశ్శబ్దంబుగా వచ్చి నే
నిను మేల్కొల్పుట నీవెఱుంగనిదియే, మేల్మేలు నీచెయ్దముల్. 371

ఉ. అచ్చట నిద్రఁ జెందునపు డల్లనఁ బూవులసెజ్జపజ్జకున్
జొచ్చియు కౌస్తుభంబు మణిశోభితకుండల యుగ్మకంబునున్
బచ్చని మేల్మివల్వ వనమాలయు ముచ్చిలి మీరు మేల్కొనన్
నెచ్చెలిపిండు దెల్ప గరుణించి యొసంగవె? నీ వెఱుంగవే. 372

వ. అప్పటి పాపంబును బాపికొననోపక కాదె కృష్ణవర్ణుండవైతి; క్షమయును దేహంబుఁ
ద్యజించి పుడమికిం బోయినఁ దత్తనూ విలాసంబు లతిరమణీయంబు లగుటం జేసి
వాని విభజించి వైష్ణవులకును దుర్బలులకును దేవతలకును బండితులకును బంచి
యొసంగితి; వింకను నీదౌష్ట్యంబులు దెలుప ననంతంబులైన గాథలై చనునని పలికి
లజ్జావనతాననయై యున్నగంగ కభిముఖియై క్షణక్షణప్రవర్ధమానకోపరూక్షేక్షణయై
యెద్దియే నొక్క నుడి వల్కు సమయంబున. 373

ఉ. గంగయు సిద్ధయోగమును గైకొని "ప్రోవు మనాథనాథ" యం
చుం గమలాక్షపాదమునఁ జొచ్చెను; రాధయు రోసమెత్తి యు
త్తుంగమహీధరంబులను దోయధుల న్నిధు లుర్విఁ గల్గు త
క్కుంగలచోటులన్ వెదకి కోరికఁ దీర్చక యాగ్రహంబునన్. 374

క. వైకుంఠంబున ద్రుహిణుని, లోకంబున యందు స్వర్గలోకంబున వా
యాకడలన్ వెదకియు మం, దాకినిఁ గన్గొనక విసిగెఁ దత్కాలమునన్. 375

ఉ. ఇలయెల్లన్ జలమిల్లయయ్యెః మృతదేహిప్రాత దేహభృటా
కులమై యెల్లెడఁదు మానవుఁడయాక్రోశంబు మిన్ముట్టఁగా
జలజప్రోద్భవచంద్రశేఖరులు నాశాపాలురుం గృష్ణతోఁ
దెలుపంగాఁజనెఁ జచు వేఁచపరి తద్వీక్షనముత్సాహులై. 376

క. గోలోకంబున గోపిక, లోలిన్ భజియించు రాధయు న్మణిపీఠికా
గ్రాలఁగఁ గొలుపుండిన గో, పాలుని దవుదవులఁ గని రవారితభక్తిన్. 377

వ. కని కరకమలంబులు నిటలతటంబున ముకుళించి యనేక ప్రకారంబుల వినుతించిన నమ్మహాత్ముండు వారల వీక్షించి యాదరంబున నిట్లనియె. 378

ఉ. వ్యాళశయాన ! స్వాగతమె, వారిజసంభవ ! సేమమే, దిశా
పాలకులార ! మీకును శుభంబకదా, భయసంభ్రమంబు లి
ట్లేల మదంఘ్రియందు వసియించె భగాంబున గంగ: దీనికై
చాలశ్రమంబుఁజెందితి రొసంగెదఁ దోడ్కొనిపొం డటం చెప్పెంగాఁ. 379

ఉ. తోకొనిపోయి దీని నకుతోభయుగా నొనరింపుఁ డన్నఁ జా
మీకరగర్భుఁ డాత్మ మిక్కిలి యత్ని సంతసమంది రాధ న
స్తోత్రపుడిక్తితో ముఖచతుష్టయనిర్గత వేదఘోష మా
శాకుహరంబుల న్వెలయ సంస్తుతిఁజేసి నతోత్తమాంగుఁడై. 380

ఉ. శౌరియు నీవు గొల్లయెలచాపలనుం గుమిగూడి రాసకే
ళీరతి నున్నవేళఁ గడకేని శ్రమాంబుధి మీకు మేనులన్
పారెకు నుద్భవించి యొకచాయ నమేళనమొంది గంగయై
చారువిలాసమొప్పఁగ నిపప్రకృతింగనెఁ జూమ్మ రాధికా. 381

గీ. యుష్మదంగంబువలన సముద్భవించెఁ, గాన నీగంగఁ గూఁతుముగా వసుగ్ర
హింపు టుచితంబుగాని కోపింపఁదగదు, గప్పవైరంబు తల్లి కక్రమముగాదె 382

చ. పిరితము నీ పదాబ్జములు నెమ్మి భజించుచు నీమె మత్రసం
స్మరణము చేయుచున్ లవణసాగరు మున్వఁ జరించువేళలన్
పరిగ్రహము యాదరించుము కృపామతితోడ జనార్దనుండు నిన్
గురుతగు ప్రేమఁ జూచును వికుంఠపురంబున నీకు నాథుఁడై. 383

గీ. ఎచటికేతెంచినను గంగ కిరుగారె, తల్లిదండ్రులు పతియు సద్గతియు నవిన
ధాతపలుకుల కులికి రాధాతరుణియుఁ, గృష్ణుఁ గీర్తించె నంత రోవిష్ణుభణితి. 384

ఉ. అంతఁ దదంతరంగమున నం బతికాంతిఁ జూచి రాధికా
కాంత పదాగ్రభాగమునఁ గ్రాలెడుగంగను బ్రేమఁ గన్గొనఁగా
స్వాంతమునం దనంతమగు సంతసమంది విధాత తజ్జలం
బింత కమండలంబున మహేశుఁ దొకింతయుఁ దాల్ప రాపఁగా. 385

వ. మఱియు నా గంగకు రాధికవలన నేభయంబును గలుగకుండ రాధామంత్రం బుప
దేశించి యామనుమంత్రంబునకు సామవేదోక్తం బగు పద్ధతిని స్తోత్రకవచపూజా
విధానధ్యానావాహనాది సమస్తంబును జెప్పె; నంత గంగయు రాధామంత్రోపాస
నంబుఁ గావించి వైకుంఠంబునకుం జనియె. తదనంతరంబ గోవిందుండు పద్మ
భవాదులంగని సస్మితాననుండై యిట్లను మీరిచ్చటి కరుదెంచిన కార్యం బి
ప్పడియెఁగదా కాలగమనంబు నెఱుంగుట శక్యంబు కా దదెట్లంటేని. 386

మ. కుతలంబెల్ల జలప్లుతంగనియె వైకుంఠంబునం దక్కం జగ
త్త్రితనానావిధజీవరాసులు నశించె న్మత్పురోభాగమ
గతిఁ గావించిన మీరు దక్క నిదె యేకల్పాంతమై తోఁచె నీ
వతివేగంబున సృష్టిచేయు మిఁక బ్రహ్మాండంబుఁ బ్రాగ్వైఖరిన్. 387

క. గంగయును బిదప నేనే, రంగన దీక్ష నన్యలోకాచరణం బొనరిం
పంగఁ దగుదు నేనని చని, యెం గృష్ణుం దంతిపురికి నెంతయుఁ బ్రీతిన్. 388

వ. విష్ణుపాదనిర్గతయగుట గంగ విష్ణుపది నాఁబరఁగె. 389

క. ఇది గంగోపాఖ్యానము, చదివిన వ్రాసినను వినిన సకలైశ్వర్యా
భ్యుదయములు గలిగి తుది మో, క్షదమై తగు పవన మౌని సంతసమందెన్. 390

## గంగా విష్ణు సంబంధకారణ కథనము.

క. కలికిజవరాలు వాణీ, నళినాక్షియు గంగ తులసినాఁ జను భార్యల్
నలువురు కలరని వింటిమి, వలమురితాల్పునకుఁ దొల్లి వారలలోనన్. 391

క. వైకుంఠంబునకున్ మం, దాకిని యొక్కరితె చనియె నని వింటిని దా
నేకరణి భార్యయయ్యె హృ, షీకేశున కద్ది తెలియఁజెప్పు మహాత్మా! 392

వ. అనిన నక్కథకుం డిట్లని చెప్పందొడంగె. 393

క. మిన్నేరు మున్ను చనియెను, వెన్నునిపదమునకు నలువ విదప నపుడే దా
వెన్నుఁడు వాణీజాక్షుల, తన్నెలకొనియున్న యత్రివాహిని గాంచెన్. 394

క. కాంచి సతీయుతుఁడగుచు వి, రించి మురారికి నమస్కరించి వినుతిఁ గా
వించి నెఱి నిల్చినను వచి, యించుట కుత్సాహమందు నీసమయమునన్.

క. తేజస్విని యతిమానో, ద్వేజితయగు రాధవలని భీతిన్ గంగాం
భోజాక్షి విష్ణుచరణాం, భోజమునన్ డాఁగె నాత్మఁ బొదలెడు నార్తిన్.

క. అప్పు డెల్ల భూమిభాగము, లుపగతనీరమ్ములగుట నాత్మ నెఱిఁగి త
ద్వ్యపదపనోదార్థము నే, నపరిమితానంద మెనసి యరుద నిది యనుచున్.

ఉ. సరసిజనేత్రు సన్నిధిని సాంకముగా వివరించిచెప్పఁ ద
చ్చరణసరోజమం దణఁగి శాంతివహించిన గంగఁ దా బహి
ష్కరణమొనర్చె విష్ణు వపి సర్గాని రాధికమంత్ర మిచ్చి స
త్వరముగఁ జేసితిన్ ధరణిభాగములన్ జలపూరితంబుగన్.

క. ఈగతి సమస్తగోళక, భాగంబుల నీరు నించి వనజాక్షునకున్
సాగిలి యీసతవోద్వా_ని, యాగతుఁడునునైతి నీ సమక్షమ్మునకున్.

వ. అని యిట్లు పలికి కృతాంజలియై.

చ. సరసుల నగ్రగణ్యుఁడవు జాణవు నీవును నీమెయిన్ బర
స్పరమనుకూలమౌను జెలువం బనఘం బది యట్టులుండ నీ
తరుణిని వాదరించు మిది తద్ద మరులొ్కనివచ్చెఁ గాన నే
కరణిని గాని యీసతిని గాదన కీవు పరిగ్రహింపుమా.

క. తనయంత వలచివచ్చిన, వనితామణిఁగూడి భోగపరుఁడై యుండన్
జనుఁగాని యొల్లననుచో, ఘనతరసౌఖ్యంబు లెట్లుగలుగుం జెపుమా.

క. నూతనయౌవనరేఖో, పేతశుభాకారయైన యీసతిని గృపా
ప్రీతుఁడవై యిపుడ జగ, త్ఖ్యాతిగ వరియింపు మీవు గాంధర్వవిధిన్.

చ. అని వచియించి గంగను సమర్పణఁజేసి సరోజసూతి దాఁ
జనియె; ననంతరంబ హరి సంతసమంది ప్రఫుల్లపుష్పచం
దనసమలంకృతంబయిన తన్వికరాంబుజముల్ గ్రహించినం
తన జనియించెఁ గాంతకు నితాంతము సాత్త్వికభావముల్ మెయిన్.

చ. అది యదనంచు నెంచి యసురారి సురాపగఁ గౌఁగిటన్ ముదం
బెసఁ గదురంగఁ దార్చుచు నహీనశుభోన్నతిఁ బొందుచుండె నిం

పొందలేడు వాడ్పున నవ్రతత ; మర్వికిఁ బోయినగంగ యీగతిన్
బడపడి పద్మనేత్రునకు భామినియై సుఖమందె నారదా ! 405

గీ. తోయజాతాక్షపదనఖోద్భూతయగుట, విష్ణుపది యన్న పేర్జగద్విదితమయ్యె
సరసనంభోగసౌభాగ్యగరిమ నెనసి, యురుతరానంద మొందుచునుండె గంగ 406

ఉ. ఈగతి కొన్నివాసరము లేగినపిమ్మట గంగ భర్తృసం
యోగము గల్గియుండుటకు నోర్వక వక్క పెలంది లోన నీ
ర్ష్యాగరిమంబునం గడుగయాశితనంబున నుండెఁ; గొంతలే
లాగునసహింతు రాత్మపతిలాలితమానవతీ సమున్నతిన్. 407

క. ఇలకుం బోయిన కలుముల, చెలితోడ నవ్రతులు మువురు శ్రీవిష్ణునకున్
దులసీసతితోఁ గడుకొని, నలువురు సతులందు రుర్వి నారదమౌనీ. 408

వ. అనిన నారదుం డిట్లనియె. 409

క. శ్రీమన్నారాయణప్రియ, కోమలి తులసి యగుటెట్టు ? కులమెద్ది ? హరిం
గామించుటకై తానే, మేమి తపమొనర్చెనో వచియింపు మహాత్మా ! 410

వ. అనవుడు నారాయణుం డిట్లను. తొల్లి భగవదంశసముద్భూతుండగు దక్షసావర్ణి
యను మనువుగలండు. అతనికి బ్రహ్మసావర్ణియు నతనికి ధర్మసావర్ణియు నత
నికి రుద్రసావర్ణియు నతనికి వృషధ్వజపాదసేవనాపరాయణుండగు వృషధ్వజుండును
జన్మించిరి. 411

ఉ. అద్రిసమానధీరుఁడగు నావృషకేతుఁడు శర్వభక్తిని
ర్నిద్రమనఃప్రమోదము గణించుచుఁ దత్కరుణాసమాగతా
క్షుద్రసమస్తభోగముల శోభితవైభవుఁడై చెలంగుచున్
భాద్రపదంబునందు నలువందు రమాపదపూజనావిధిన్. 412

ఉ. శర్వమయంబు సర్వమని స్వాంతమునం దలపోసి తత్కృపా
గర్వితచిత్తవృత్తి నొకకాలమునందును గొల్వఁబోఁడు పా
పర్వచయంబు వాణిఁ గొలువం డొనరింపఁడు జన్నముల్ సువ
ర్ణార్చ్యవిపూజయన్నఁ బరిహాసముఁజేయును బుద్ధిహీనుఁడై. 413

క. ఒండుఁ దలపోయఁ డెద బ్ర, హ్మాండం బఖిలంబు నిందుమయంబ నతం డు
ద్దండత నుండుటఁ గని మా, ర్తాండుం డురువిలయభీకరాకారుండై. 414

ఉ. లోకవిలోచనమ్ము మదిలోపల మాటికి బుట్టు కన్యకై
"నో కలుషస్వభావ ! వినరోరి సుదంబున సర్వదేవపూ
జాకలనంబునన్ దొలఁగి జాల్మవికై వడి నంచుటన్ హత
శ్రీకుఁడవై చరింపు" మని చెప్పిరి శాపమొసంగె నంతటన్. 415

ఉ. శివుఁ డత్రాంతవివర్ధమానగురుకోపపస్ఫురద్దీప్తభై
రవుఁడై శూలము కేలఁ దాల్చి నలినీప్రాణేశు ఖండింతునం
చు వెసంబోవుడు నేఁడుగాదె తుదియంచుం గశ్యపోపేతుఁడై
రవి వెన్నిచ్చి సరోజసూతి సదఁ జేరం బోయె భిన్నాత్ముఁడై. 416

మ. విధుజాటుండు పలాయితుండగు రవి న్వీక్షించి తర్జించుచు
న్విధిగోష్ఠిస్థలిఁ జేరె; ధాతయుఁ గనున్ భీతిల్లి తద్వీక్షణ
వ్యధితస్వాంతసమేతకశ్యపసదీయాత్మోద్భవోపేతుఁడై
మధువిద్వేషణు దర్శనంబుఁ బొనరింపం బోయి కాంచెన్ హరిన్. 417

మ. భయమున్ భక్తియు సంభ్రమం బెనలఁ బద్మగర్భపుండున్ హరి
ద్దయుఁడుగా బంకజసూతియు న్మకరంధరత్నాభూషణున్ దత్పద
ద్వయికిన్ హారతులిచ్చి మ్రొక్కులిడి సంత్రాసంబుతో సంహృత
స్మయులై తెల్పిరి దుర్గకోపగతి బీజం బెల్ల నాద్యంతమున్. 418

ఉ. కాంచనచేలుఁ డయ్యమవి కాతరవృత్తినివానమెల్ల నా
లించి యభీతముద్రనిడి లేనగ వొప్ప వచించెనిట్లు "చ
క్రాంచితపాణినై కడునరయంబున నచ్చటికేగి వన్ను పే
వించినవారి కార్తి ప్రశమించిన పట్టున ద్రోచివచ్చెదన్. 419

మ. పలుమోములఁ బెల్పువేల్పునై జగముల్ గల్గింతు, శిక్షింతు న
య్యళికాక్షాకృతి, సర్వలోకములు నేనై యుందు; నాకుక్షిలో
పల డాఁగు న్జగముల్ లయాంతమున సర్వవ్యాపినౌదు న్వని
శ్చలసచ్చిత్సుఖాత్మకంబయిన తేజంబూని వర్తించెదన్. 420

ఉ. ఇందుకు భేదమెన్నఁగలరే శివుఁ డన్నను నేనన న్వివ
ర్జింపఁజూచి? శివుం డనఁగ గేవలుఁడే యవిషహ్యవిక్రమా
క్రాంతతేజుఁడే దొడ నొకఁడైన సహాధ్యముఁ దత్తండ దృ
ష్టిం జను సూర్యకోటిఁ బ్రకటించు విరించనకోటి నొక్కటన్. 421

చ. అతఁ డతిలోకశక్తియుతుఁడై నను నాంతరవృత్తిమద్గుణ
స్తుతి నొనరించు మన్మనువు చూచుచు నాదృతిమై దివానిశం
బతులితభక్తిఁ బంచపదనాబ్జములన్ వచియించు వాని కే
వతులొనరింతు వానికిని నాకును లేదు ప్రభేద మెంచినన్. 422

క. నను సేవించెదు మనుజుల, కనుపమభోగంబు లీయ నాకాంక్షింతున్
జనుఁ డింక మద్వరంబున, ననిహతభయులగుచు వేగ స్వేచ్ఛావృత్తిన్. 423

వ. అని బ్రహ్మాదుల నూరార్చె నట్టి సమయంబున, 424

మ. శయకంజంబున శూలమున్ త్రిపురరక్షఃకాల మొప్పఁగా జగ
త్త్రయసంక్షోభనిలానుధావనకళాధౌరేయముం గాహముం
రయమారం దుమికించుచుం గమలినీప్రాణేశు నిర్జింపఁగా
లయకాలాకృతిఁ జొచ్చె రుద్రుఁడు మహాలక్ష్మీపతిస్థేమముం గా. 425

ఉ. వాసుకిభూషణుండు వృషవాహముఁ జయ్యన డిగ్గి భక్తిసం
వాసితచిత్తుఁడై కనకవాసునకున్ నతులాచరించె వా
ణీసఖుఁ డట్లు గశ్యపుఁడు నీరజబంధుఁడు భక్తియుక్తిసం
త్రాసితులై యొనర్చిరి కృతాంతవిరోధికి వందనంబులన్. 426

ఉ. బాలశశాంకశేఖరుఁడు వాసవరత్నచిరత్నకాంతులం
గ్రాలెడు గద్దెయం దసురఖండనపార్శ్వ దపాణిచామరాం
దోళనజాతవాతపరిశోషితుఁడై వసియించియుండ నా
వ్యాళశయానుఁ డర్యమసమానరుచుండై హరుఁ గాంచి యిట్లనెన్. 427

మ. "నిటలాంతస్ఫుటదగ్నివీక్షణ! భవానీనాథ! నీ విప్పుడె
చ్చొటికిం బోవఁదలంచి, తేమిపని యిచ్చోనున్నదే! రోష ము
త్కటమై మోమునఁ దోఁచుచున్నయది దైత్యశ్రేణి దర్పంబునన్
జటిలోకంబున కెగ్గుఁజేసిరొకా రోసంబున నీకేటికిన్." 428

ఉ. శ్రీపరుఁ డెగ్గి యుండియు వచించిన పల్కుల నాలకించి యా
భూధరధన్వి యిట్లనియెఁ బూజ్యుఁడు భాగవతుండు నాకుఁ బ్రా
ణాధికుఁడైన వాఁడు కలఁ డావృషకేతుఁడు వానిఁ గాంచి భా
యాదవుఁ డాదరింపక దురంతముగా శపియించెఁ గావునన్. 429

ఉ. వాని వధింపనెంచి యనివార్యముగా నిటువంటి కోపముఁ
బూనితి నేఁడు; వాఁడు కితవుండయి తావకసన్నిధానమం
దే వసియించుటం గని వధింపఁ దలంపక యుంటిఁగాని త
న్మానము ప్రాణముం గొనక మానుదునే మఱియెందు నిల్చినన్ ॥ 430

ఉ. ధ్యాననిరూఢినైన హృదయంబుననైనను స్తోత్రశక్తిచే
నైనను నాపద ల్గలుగునప్పుడు నిన్ శరణన్నమాత్ర ద
న్నైనను పోయి ప్రోతువు జరామయమృత్యువివర్జితాంగులం
గా నొనరించి సన్నిధిని గల్గెడివాండ్రఁ బ్రోవకుందువే ॥ 431

క. నాభక్తుఁడు వృషకేతువన, కీ భానుఁడు గడఁగి శాపమిచ్చెను "నిహత
శ్రీభాగ్యుండవు" కమ్మని, యా భూపతి కింక బ్రతుకనగునే ధరణిన్. 432

వ. అనినఁ జిఱునవ్వెలయ నారాయణుండు హరున కిట్లనియె. 433

క. అరగడియ యయ్యె నిచ్చట, తెరగంటులమానమున నదిం గన ధరలో
నిరువదియొక్క యుగంబులు, జరిగెను జను మింక హర ॥ నిజనిలయమునకున్.

గీ. చచ్చి చిరకాలమయ్యె వృషధ్వజుండు, నాతనికిఁ బుత్రుఁడగు రథకేతుఁ డీల్గెఁ
ధర్మకేతుండు మఱి కుశధ్వజుఁ డనంగఁ, గలరు పుత్రకు లిద్ద రాత్మోద్భవునకు. 435

ఉ. వారును సూర్యశాపమున భాగ్యవిహీనతచే రమాతప
స్సారతులై సదాసుజనసంగతులై మునివృత్తులైరి త
ద్దారలలోన నొక్కతెకు దారుణి లక్ష్మి జనించి దుఃఖని
స్తారక మాచరించు వసుధావరులం దగఁజేయు ధీరులన్. 436

మ. మృతుఁడయ్యె న్వవదీయదాసుఁడిఁకఁ బొమ్మీ ॥ కోపమేలంచుఁ బ
ల్కి తిరోధానమొనర్చె మాధవుఁడు; పంకేజోద్భవుండుం దిరో
హితుఁడయ్యెన్; రవికశ్యపుల్ సనిరి; భూభృద్దన్వయుఁ శాంతిపూ
ర్ణతముఁడై తపముం బొనర్పఁజనియెన్ గైలాసశైలంబునన్. 437

వ. అనిన మహాత్మా ॥ ధర్మధ్వజకుశధ్వజుల చరిత్రంబు వివిరింపుమనిన నారాయణుం
డిట్లనియె. 438

ఉ. ధర్మకుశధ్వజాఖ్యవసుధావరు లుగ్రతపంబొనర్చి యా
ధర్మదుకూలు ప్రేయసిక్రుపన్ ధనధాన్యసుతాదిలాభము

ల్పేర్మి గ్రహించి యెల్లపృథివిం బరిపాలన మొప్పఁజేసి దు
ష్కర్మవిదూరులై సకలసంపద లందుచునుండి రిర్వురున్. 439

క. అందుఁ గుశధ్వజభూపతి, సుందరి గర్భంబుఁదాల్చి శుభదినమున న
య్యిందిరకళచేఁ దానొక, నందని సుజ్ఞానలక్షణం బ్రసవించెన్. 440

వ. అబ్బాలామణి వేదవతినాఁ బేరొంది దినదినప్రవర్ధమానయై శ్రీనాథుండు తనకుం బ్రాణనాథుండు గావలయునని తలంచి, 441

మ. ఒకమన్వంతర మంబునం దపము నత్యుగ్రంబుగా సల్పి నొ
క్కొక రూపప్రతిభావయఃకలనఁ బక్కన్మించుచున్నట్టి బా
లికతో నయ్యశరీరవాణి తగఁబల్కెన్ "నీకు శ్రీవిష్ణు విం
కొకజన్మంబున భర్తయౌ" నని వ్రతోద్యోగంబు మాన్పింపఁగన్. 442

క. ఆనాదము విని తపముఁ, మానక ముదమంది గంధమాదనశైల
స్థానంబునందుఁ బిదప న, నూనముగాఁ దపముసేయుచుండఁగ నంతన్. 443

క. రావణుఁ డేతెంచుటయును, భావమునం గలఁగి యర్ఘ్యపాద్యాన్వితునిం
గావించిన బాలామణి, తో వాఁ డిటుపల్కె నెదఁగుతూహలమొదవన్. 444

చ. కలకలనవ్వునెమ్మొగము గొమ్మగుబ్బలు దులకించు పెన్నెరుల్
తళతళ లీను మేను దెలిదామరల న్నిరసించు కన్నులున్
గలిగిన ముద్దులాడి విటు కౌఁగిలిన్ బడదారితీరుగా
నెలకొని యొంటిమై నిలువ నీకిది యేకత మంబుజాననా. 445

క. ఈరీతిం బలికి తిర, స్కారము గొంపయును విడువఁ జాలక వే శృం
గారక్రియ కతఁడు బలా, త్కారంబున దాని కేలుఁదమ్మి గ్రహించెన్. 446

గీ. మానవతి దానఁ గోపంబుఁబూని వాని
స్తంభితునిచేయ హస్తపాదంబు కదల
కుండుటయుఁ జేయునంతలేక యువిద కపుడు
నతులొనర్పఁగసాఁగె నన్నరభుజుండు. 447

ఉ. నీదు మహత్త్వ మేనెఱుఁగనేరక యూరక తెచ్చికొంటి నీ
ఖేదము ఖేదమెంచక యకృత్రిమబుద్ధిఁదలంచి కావు ము
న్మాదిని నన్నుటంచుఁ బలుమాఱు నుతించెడు రాక్షసాధమున్
మోదముతోడ బంధనవిముక్తునిఁజేసి యనుగ్రహించియున్. 448

క. నను స్పృశియించిన ఫలముం, గనుఁగొనుము సబాంధవంబుగాఁగ మదర్థం
బున నీవు ద్రెళ్ళుదువు ముం, దని యోగముకతన దేహ మప్పుడ విడిచెన్. 449

గీ. వెలఁది దేహంబు గంగ నర్పించి నిజని, వాసగృహమున కేగి రావణుఁడు మిగులఁ
దా నొనర్చినపనికి సంతప్యమాన, మానసుండయి యాశ్చర్య మూనియుండె. 450

క. ఆమగువ జనకధరణీ, స్వామితనూజయయి పూర్వజన్మకృతతప
స్సామర్థ్యంబున దశరథ, రాముని వరియించి సుఖతరంబుగ నుండెన్. 451

ఉ. కోమల విగ్రహుండు రసికుండు మనోహరుఁ డుత్తముండు ను
ద్దాముఁడు శాంతిదాంతిగుణధాముఁడు లోకవిభుండునైన శ్రీ
రామునితోడఁగూడి యనురాగముతో సుఖియించుచుండె నా
భూమిజ మున్ దపంబునను బొందినపంతఁ దలంప నెప్పుడున్. 452

సీ. జనకాజ్ఞ రామలక్ష్మణు లరణ్యమునకు • సీతతోఁగూడి వేంచేయుటయును
విప్రవేషమున హవిర్భుజుం డెదురుగాఁ • జనుదెంచి యోరామచంద్ర! యింక
జనకజాహరణమౌ సమయ మేతెంచెను • గాన సురకల్పంపఁగా రయమున
వచ్చితి నన్ను వైశ్వానరుం డంద్రు నా • యంద సీతను దాఁచి యగ్నిశుద్ధిఁ

గీ. జేయుతఱి మీకు నర్పింతు ఛాయ దీనిఁ
గొనుమనిన రఘువరుఁ డియ్యకొని తదీయ
కృత్రిమావనిపుత్రి గ్రహించి నైజ
సీత వాతవిలో నివసింపఁజేసి. 453

క. జనవాధుఁ దరుగ నొకయెడఁ, గనకమృగం బొకటి యెదుటఁ గాన్పించిన దా
నిని సీత తనకుఁ దెమ్మని, కనికర మొదవంగ రాముఁ గని పల్కంగన్. 454

చ. జనకజఁ గావ లక్ష్మణుని శ్రద్ధమెయి న్నియమించి శాంబరీ
కనకమృగంబుఁ బట్టుకొనఁగా నతిదూరము వోయి మాయగా
మనమున యోజచేసి యొకమార్గణ మేసిన దాన 'లక్ష్మణా'
యని మొఱవెట్టి చచ్చెఁ జనకాత్మజకున్ హృదయంబు జల్లనన్. 455

క. భూమిసుతాచోదితుఁడై, సౌమిత్రి రఘూద్వహుని వెనం గమఁగొనఁబోఁ
గామాంధుఁడు రావణుఁ డ, కోమలి గ్రహియించి లంకకుం గొనిపోయెన్. 456

క. చనుదెంచిన లక్ష్మణుఁ గని, మనమున శంకించి యాశ్రమస్థలికి వెనం
బని కనికర మొదవించుచు, జనకజ లేకున్న పర్ణశాలం గాంచెన్. 457

గీ. చూచి మూర్ఛిలి యంత నచ్చోట సీతc, గానక విచారమంది యక్కాననమునc
దిరిగి తిరిగి గోదావరీతీరమందు, వానరాధిపుతో సహవాసమంది. 458

ఉ. సేతువుcగట్టి వీరకపిసేనయు గొల్వcగ లంకకేగి యా
ఘాతుకుని న్సబాంధవముగా ఐనిc ద్రెళ్ళcగనేసి లోకవి
ఖ్యాతయశస్కుcడై జనము లచ్చెరువంద సురల్ నుతింపcగా
సీత కృశానుకీలల వసింపcగcజేసినc దత్క్షణంబునన్. 459

క. అనలుcడు నిజసీతను రా, ముని కర్పణసేయ ఛాయ మునుకొని "యే నే
పని యొనరుతు" నన దానిం, గనుcగొని రామాగ్ను లనిరి కరుణాన్వితులై. 460

క. దుష్కృతహరమగు దేవీ, పుష్కరమునc దపమొనర్చి పుణ్యఫలం బా
విష్కృతముగ స్వర్లక్ష్మివి, నిష్కర్ష న్గాcగలవు వివిశ్ర్వయ మనినన్. 461

గీ. వారి వీడ్కొని ఛాయ దివ్యంబులగు త్రి, లక్షవత్సరములు తపోదీక్ష నుండి
స్వర్గలక్ష్మియై మరలc దపంబుసేసి, యగ్నికుండసముద్భవయయ్యె నంత. 462

క. ద్రౌపది నాc బేరొందిి పృ, థాపుత్రుల కేవురకును దార యగుచు ను
ద్దీపించుచుండె జనులు మ, హాపతిరత యంచు దాని నభినుతిసేయన్. 463

గీ. వరుస కృతయుగమునc ద్రేత ద్వాపరమున, వేదవతి సీత కృష్ణనా వెలcదులై కు
శధ్వజ జనక ద్రుపదవిశ్వంభరాధి, పుల గృహమ్మున జన్మింపcగల రనంగ. 464

క. అంగన యొక్కతె పాండవ, పుంగవు లేవురకుc దా నపూర్వంబుగ న
ర్ధాంగ మగుటెట్టులొకొ యా, సంగతి వివరింపుమనిన జటిలున కనియెన్. 465

క. ఓమునివర! నిజసీతకా, రాముcడు గ్రహియింపc జాయ రామాగ్నా ళ్ఞన్
గామహరు గురిచి తపమును, నేమముతో సల్పి యాతనిం గని పెలుచన్. 466

క. "పతి పతి పతి పతి పతి" యని, యతికామాతురతc బల్కc బతివం గని స
స్మితముఖుcడై శితికంఠుcడు, పతిపంచక మొనcగితి నని పలికెన్ ప్రేమన్. 467

క. అది కారణముగ నా ద్రౌ, పది పాండవు లేవురకును భార్యామణియై
పొదలెః విదియెల్ల వీకుం, బదిలంబుగc జెప్పవలసెc బ్రస్తావముగన్. 468

సీ. లంకయందలి యచలాకన్య రాముcడు • పేర్మిగ్రహించి విభీషణునకు
లంక నొసంగి చెలంగుచుc దనయయో • ధ్యాపురి కేతెంచి ధారుణీశు
లెల్లరుc గొలువంగ వేకాదశసహస్ర • వత్సరంబులు రాజ్యమై భవమున
వఱలి సర్వంబుతో వైకుంఠమునకేగె • నలవేదవతి లక్ష్మి యందుc గలసె

గీ. వేదములువాగ్గు జిహ్వపై వెలయునట్టి • వేదవతి పుణ్యకథనంబు వీను లలర
వినినవారికిఁ బాపనాశనము గాదె • మంజుగానవినోద ! యోమౌనినాథ. 469

క. ఆజపుత్ర ! వినుము ధర్మ, ధ్వజభూపతి న్యాయమతియు దారుణరణరం
గజితాభియాతియై తన, విజయాంకము లెల్లయెడల వెలయించె రహిన్. 470

ఉ. అర్ణవమేఖలాధిపతు లందఱుఁ దా మరిగాపులౌట సం
పూర్ణమనోరథుండునను ముద్దియతోఁ జని గంధమాదనా
భ్యర్ణసమంచితోపవనవాటికలోనఁ బ్రఫుల్లపుష్పసం
కీర్ణనికుంజపుంజములఁ గ్రేవలఁ దావులదీవులం గనెన్. 471

చ. ప్రియుఁడని హాళితో నచటఁ బేశలకోకిలకాకలీరవా
స్పదపదము ల్గనుంగొనుచు భామినిఁగూడి రతాభిలాషముల్
మదిని దిఁటంబులౌచుఁ బొదమంగ సుగంధిలపుష్పశయ్యపై
ప్రియులవివేక్క లప్పతిలఁ బెక్కువిధంబులఁ గేళిసల్పుచున్. 472

సీ. కాసారముల మరందాసారములయందు • నారజంబున నోలలాడి యాడి
పొంపిరిగాఁ బూచి యింపుమిరింపు సం • పెఁగల మాటునఁ గేళిఁ దగిలి తగిలి
మేలిమిజాళువాడాలచేఁ గ్రాలిన • గట్టులపట్టునఁ గలసిమెలసి
చాలుగాఁ బ్రాలిన యేలాలతల లాగి • తూఁగుటుయ్యేలల నూఁగి యూఁగి
గీ. యిట్టులాదంపతులు కుసుమేషుకేళి • కేళిదంపహ్యామానులై కేళులందు
సంతతామోదసంభృతస్వాంతులగుచు • వెలపి రజ్ఞాతదిననిశాభేదు లగుచు. 473

క. ఒకల నఱఁది గంధము మణి, తొకవులను బూని హాయులు దూఁగఁగ నచటన్
బడఁతుకలమిన్న మాధవి, కడుముదమొనరించెఁ బతికిఁ గలయికలందున్. 474

చ. పసవొకయింతలేక యలివేణియుఁ దాను మనోజకేళి దు
ర్వ్యసనమనస్కులై తనర నామరవర్షశతంబు జాతె; మా
నస మెరియంగ మన్మథరణంబునఁ దృప్తినిజెందె దూపుఁ; దా
ఘనలసరోజకున్ రతులఁబాయనికోర్కెలు పేరె సారెకున్. 475

క. వనితతోఁ జిరకాలము, సురతంబున మెలఁగి తృప్తిఁ జొప్పడకుండెన్
బురుషులకిన్నను మోహము, తరుణుల కష్టగుణ మన యథార్థముగాదే. 476

క. ఈలీల మండ సద్యః, కాలమ్మన విధివశమునఁ గాంతామణి చూ
లాలై శతవర్షమ్ములు, దాలిచె శుభలక్షితమ్ముఁ దద్గర్భమ్మున్. 477

మ. అకలంకగ్రహయుక్తయోగశుభలగ్నాంశక్షణంబైన కా
ర్తికపుం బున్నమ శుక్రవారమునఁ బుత్రీరత్న మొక్కర్తు బో
టికి వారాశితనూభవాంశమునఁ బుట్టెన్ దుందుభిధ్వానముల్
ప్రకటంబయ్యె దివంబునందు సుమముల్ వర్షించి రద్దేవతల్. 478

సీ. శరదిందుబింబమైన చక్కని మోముతోఁ • గంజంబు నవ్వఁబోలు కనులతోడఁ
బక్వబింబప్రభాభాసురోష్ఠంబుతో • మించుఁ దులకించు మించుతోడఁ
బల్లవారుణకరపాదయుగ్మంబుతో • భాసమాన త్రివళులతోడ
నిండుచిందంబుసీను పెన్నెరులతో • వస్త్రలతరనికరంబుతోడ

గీ. సీతున సుఖోష్ణమై, సుఖశీతలంబు • తపమునందున నై యొప్పు తనువుతోడఁ
బరిఢవిల్లుచునున్న యబ్బాల సోయ • గమ్ము నిరుపమ మనియె జగజ్జనమ్ము. 479

క. అచ్చుపుతతోడఁ బోల్ప వి, యచ్చరసతులైనఁ దగరటంచు ననువుమై
నచ్చెంతనున్న మౌనులు, వచ్చి తులసియనుచుఁ బేరుఁ బలికి చని రొగిన్. 480

వ. తదనంతరంబ కాంతలతులమానికంబగు తులసి భూమిఁ బడినంత శ్రీప్రకృతిం జేసి సర్వజననిషిద్ధయై మునిజనావాసపావనంబగు బదరికావనంబునకుం జని నారాయణుండు తనకుఁ బ్రాణేశ్వరుండై మన్నింపుత మని తా మానసంబున భావించుచుఁ దదేకాయత్తచిత్తయై దేవమానంబున లక్షహాయనంబులు ఘోరంబగు తపంబుఁ జేయంగడంగి. 481

సీ. గ్రీష్మంబునం దతిభీష్మపంచాగ్నిమ • ధ్యస్థయై ఫలజలాహారయగుచు
వర్షర్తువునయందు వానపంగుళ్ళలో • నాసీనయై దళాహార యగుచు
వడవడ వడఁకించు వలిగాడ్పులో సీతు • వంచున మారుతాహారయగుచు
నేకపాదమునఁ దదేకనిష్ఠమనోజ్ఞ • ధారిణియై నిరాహారయగుచుఁ

గీ. దివిరి పది యిర్వదియు ముప్పదియును నల్వ
దియును వేలేండ్లు వరుసగా స్థిరతఁ బూని
రాత్రియు దివమ్ము నాక ఘోరంపు కంగిఁ
దపమొనర్చఁగ సాఁగె సంతప్తయగుచు. 482

క. ఈరీతి నట తపోధీ, శ్వరతయై యున్నతులసిఁ గన్గొని రహి వా
ణీవరణీపతి సాక్షా, త్కారముఁ గావించె వరము దయ నీయంగన్. 483

క. ఆ జేజేపెద్దం గని, తా జేజే జేయఁగా నతం డనె సతి యే
యోజను డుపమోనరించెద, నే జడియక యెడఁదనున్న వితముం జెపుమా. 484

క. హరిభక్తియైన నిచ్చెద, హరిదాస్యంబైన నిత్తు నజరామరతన్
వరియించెదేని యొసఁగెదఁ, దరుణీ! మదిలోని వాంఛితముఁ గైకొనుమా. 485

మ. అనుచుం బల్కిన ధాత కిట్లనుఁ దులస్యబ్జాక్షి "యో హంసవా
హన! సర్వజ్ఞుఁడవయ్యు నన్నడుగ న్యాయ్యంబౌనె! లజ్జింప నా
కనువౌనే, యిదియెల్ల నీవెఱుఁగవే యైనం గాక నీయానతిన్
వినిపింతు న్వినుమయ్య నాదగు పురావృత్తాంత మాద్యంతముగా. 486

సీ. తులసి యందురు నన్ను తొల్లి గోజగమున, గోపికనై కృష్ణుకూర్మిచెలిని
రాసకేళిని శౌరిరతిభుక్తను నతృప్త, మూర్ఛితనగు నన్ను మురవిరోధిఁ
గని రాధ హరిఁ దిరస్కారంబు గావించి, కోపంబు నాయందుఁ గూర్చి మిగుల
మానవయోనిసంభవవు గమ్మని శాప, మిచ్చిన హరిదయ నెడఁదఁ దాల్చి
గీ. భీతిఁ బొందకుము మదంశజాతుఁడైన
వానిఁ జతుర్భుజు భరతవర్షమందు
బ్రహ్మవరమునఁ దపముచేఁ బతిగఁ బొందఁ
గల వటంచుఁజెప్పి చనియె నాగరుడహయుఁడు. 487

క. ఆదేవివలన భయమున, నే దేహము విడిచి ధారుణిఁ జనించితి వ
బ్జోదరు నారాయణుఁ బతి, గాఁ దలఁచుచు నుంటి నిచటఁ గరుణింపు ననున్. 488

క. కాంతుని సుందరవిగ్రహు, శాంతుని నారాయణుని యశస్కరుఁ బతిగా
నెంతయుఁ గోరితి వరమి, మ్మంతఃకరణంబునన్ దయంగొని" యనఁగన్. 489

ఉ. అండజవాహనుం డనియె నా హరివంశభవుండు మున్ సుదా
ముండను గోపకుం డొకఁడు పుట్టిన రాధికశాపయుక్తి మా
ర్తాండసమానతేజుఁడు ధరాస్థలి భారతమందు శంఖచూ
డుండను మాధవాంశభవుఁడున్ ఘనుఁడున్ దనువంశజుండునై. 490

ఉ. వాఁడు చతుర్భుజుండు మగువా! మును గోభువనంబునందు నీ
పొందిమిఁ గాంచి మారశరపుంజవిభిన్నమనస్కుఁడయ్యు నిన్
గూడఁడు రాధికాపతి గనుంగొని తన్నదలించు వీని కీ
రేడుజగంబులందు సరి యెందును లేరు జనిష్మరుల్ భువిన్. 491

క. నీవును జాతిస్మరవై, యీ వృత్తాంతంబు నెఱుఁగు దివ్య దశనికిన్
దేవేరి వగుదు విస్మిత, గోవిందు వరింపఁగా వగు నిది ధ్రువంబౌ. 492

ఉ. శ్రీవసుశాపయోగమునఁజేసి మహీరుహతా ప్తి నీకగున్
నీ వెలియైనపూజ కడునిష్ఫలమౌను సుమంబులందు నెం
తో వరమౌదు, ప్రాణములతోఁ దులగాఁదలఁచు మ్మురారి బృం
దావనియందు నిమ్నధజనంబులు మ్రొక్కుదు రిచ్చ నిచ్చలున్. 493

క. నీపత్రంబులఁ జేతురు, గోపాలకదేవపూజ గోపకులు త్రిలో
కీపావనివై నెగడుదు, దీపించెదు హరికడఁ దరుదేవ్యాకృతితోన్. 494

గీ. నావరంబున నిన్నియు న్గలుగు నీకు
ననుచుఁ బల్కిన సంతోష మావహిల్ల
మోముఁదమ్మిని చిఱునవ్వు మొలకలెత్త
హంసహాయునకు మ్రొక్కుచు వనియెఁ దులసి. 495

చ. మనమునఁ దాఁకియున్న యనుమానము దెల్పక మిన్నకుండరా
దని వివిపించెదన్ ద్విభుజునందలి నెయ్యముఁబోలె నాకు నే
యనువునను జతుర్భుజునియం దొనగూడదు మున్నశక్తనై
తివి శుచిభంగమొంది యదుదేవునిఁ గూడి రమించి సారెకున్. 496

ఉ. నాలుగుబాహువు ల్గలిగినన్ వరియించెద శంఖచూడునిన్
బోలునె శౌరియాన తలఁబూనక యేరికినైన; రుక్మిణీ
లోలునిఁ బెండ్లియాడుటకు లోఁగుదు నీవరయుక్తి రాధికా
శీలభయంబుఁజేసి యది వేగమె వాయ ననుగ్రహింపుమా. 497

క. అనవుడు నలినోదరుఁ డి, ట్లను గడుమోదమున షోడశాక్షరయుతమై
చను రాధామంత్రము గై, కొనుమా యనుమానమేల కొమ్మ! యొసఁగితిన్. 498

క. రాధకు నీకుం గలుగు న, సాధారణమైన పేర్మి; జలజాక్షునకున్
రాధాసమాన వగుదువు. రాధకెఱుఁగఁబడవు మీదు రతిమర్మంబుల్. 499

క. అని యానతిచ్చి రాధా, మనువు నొసంగి కవచక్రమంబును స్తోత్రం
బును బూజాదికముఁ దెలిపి, చనియెన్ మేల్దీవనల నొసంగుచు నంతన్. 500

క. ఆ మంత్రోపాసనమున, నామానిని తులసి సిద్ధురాలయ్యెఁ గడున్
దామరసావాసినిబలెఁ, దామరసోదరునిమహిమఁ దద్దయుఁ జెలఁగెన్. 501

మ. త్రిజగద్దుర్లభభోగభాగ్యములచే దీపించి నిర్ధూతహో
రజపక్లేశయుఁ బ్రాప్తయౌవనయునై రాజర్షిమృష్టాన్న మిం
పుజనింప న్భుజియించి మై మలయజమ్ముం దాల్చి మల్లీసుమ
వ్రజశయ్యాంతరమందు సౌఖ్యమున నిద్రంజెందెఁజూ, నారదా! 502

మ. నిదురింప న్మదిరాక్షిగాంచి యపుడా నీరేజబాణుం డిదే
యదనంచుం బదునైనసాయకము లేయ న్వంఖచూడాఖ్యు ము
న్మది నెల్లప్పుడుఁ గోరుచున్నకతన న్నారీవతంసంబు స్వ
ప్నదశం గాంచెను తత్పురారివిభు రూపశ్రాసితానంగునిన్. 503

క. కాంచినయంతన మోహ ము, దంచితగతిఁ బొదమునటయు నతం డద్దానిన్
బంచాయుధకేళిని దే, లించెన్ స్వప్నగతిఁ దెలియలే రెవ్వారున్. 504

ఉ. అంతట మేలుకాంచి హృదయాధిపుఁ గాన కొకింతవంతయున్
సంతసముం బెనంగొనఁగ సారసలోచన మాటిమాటిక
త్యంతవిషాదముంగొను "వహో" యను మెచ్చుచునుండు; నంతలో
వింతఘటించిపోయెఁ గుసుమేషుఁ డిఁకేమనవచ్చు నారదా! 505

వ. అంత నక్కాంతామణి కంతు దురంతచింతాభరంబు సహింపంజాలక పరాధీన
చేతస్కయయి. 506

సీ. ప్రాణేశుఁ డెపుడు గన్పట్టునం చూరక • గ్రుక్కిళ్ళుమ్రింగుఁ దాఁ గొంతసేపు
అంతలో వల్లభుం డగపడెననిబయల్ • కూరిమితోఁ జూచుఁ గొంతసేపు
అటుపైఁ బరిరంభ మాచరించె నటంచు • గుబ్బ లుబ్బొంగించుఁ గొంతసేపు
తరువాత సంభోగదశఁ దేల్చెననుచు నె • క్కొను పరాధీనతఁ గొంతసేపు

గీ. ఏగెనని తాపమందు నొక్కింతసేపు • చింతగొను సంతసంబందు కొంతసేపు
కామకల్పిత మోహాంధకారమందు • సంచరించుటఁజేసి యాసారసాక్షి. 507

ఉ. ఒంటిగమన్న నాకడ కయో! చనుదెంచునె వాఁడు? వచ్చి న
న్నంటునె? యంచునేని మునుమందరు దూఱరె? దూరకుండినన్
గంటికిదోఁచు వాఁడిపుడుఁ గల్గిన మోహము మేలె? యైన నీ
తుంటరియౌ నవంగు ననతూపుల తీపుల కోపవచ్చునే. 508

చ. తితిప్పభమమల్లికాకుసుమతల్పముఁ గాంచినమేని కంటకాం
చితముగఁ దోఁచుఁ, జెంపెరము చిచ్చుగఁ గన్పడు, నాలయంబు న

ర్వతగుహఁ బోల్కిఁ గాంచుఁ, దనవస్త్రము బర్వఁగ నెంచు; నెద్దియుఁగా
వితయగుఁ గాదె కూర్మివిభునింగనఁ జిత్తముగల్గు చానకుఁగా. 509

చ. అటు చటులాక్షి నెమ్మనము నంటిన మోహము నిల్పలేక తా
నటమటఁ బొందుచుండఁగఁ దదంతికశైలచరత్సురాంగనల్
తటుకున వచ్చి కొంతపరితాపము డింపుపడంగ నాతఁ డి
చ్చోట కరుదెంచుటల్ దెలిపి సుందరిఁ దేరిచి యేగిరంతటన్. 510

క. యోగియయి శంఖచూడుఁడు, జైగీషవ్యాఖ్యమౌనిసత్తమువలనం
దాఁ గృష్ణమంత్రముం గొని, యేగెం బుష్కరమునకు సమీహితబుద్ధిఁగా. 511

క. అచ్చట విధాత కృపచే, నిచ్చిన వరములనుఁగొని ద్రుహిణునానతి నాఁ
డచ్చోటు విడిచి ముదమునఁ, గ్రచ్చఱ విచ్చేసె బదరికావనమునకున్. 512

వ. అంత నావనంబునఁ దులసీలలామంబు తపంబు సేయు వనాంతరంబునకుఁ జను
దెంచె నప్పుడు. 513

ఉ. సుందరవిగ్రహుండు పరిశోభితరత్నవిభూషణుండు సం
క్రందనవైభవుండు రసికప్రవరుండు మనోహరుండు శ్రీ
చందనచర్చితాంగుఁడు హసన్ముఖుఁడౌ నలశంఖచూడు నా
నందముతోడఁ గాంచె లలనామణి మోహరసాబ్ధి ముగ్ధముగా. 514

క. కని ఘనలజ్జావనతా, ననయై చెలువొందుచున్న నారీమణి న
ద్దనుజోత్తముఁ డప్పుడు గ, న్గొని యిట్లనిపల్కె లో ననూనప్రీతిన్. 515

ఉ. వారిదరాజివేణిముఖవైభవ మొందక కంజపుంజ మె
వ్వారినిఁ గాంచ సిగ్గుపడి వారికి మధ్యమునఁగా వసించియున్
వారిధిపుత్రునాక నలవారిజనేత్రముఖం బటంచొకో
వారితగంధమై ముకుళవైఖరిఁ బొందుచునుండు నెప్పుడున్. 516

చ. రమణిముఖాంబుజాతమకరందముఁ గ్రోలెడు నిచ్ఛ నేగి భ్రా
ణమను సువర్ణసూనము గనంబడ భీతినిఁజెంది యుత్తమాం
గమున వసించి తచ్చరణకంజములంగవి వెన్కనుండి సం
భ్రమమున నేగుదెంచు భ్రమరంబులనాఁ దగి వేణి చెల్వగున్. 517

ఉ. తమ్ములసూను మోము, కుముదంబులఁ జోడు కనుల్, మెఱుంగుట
ద్దమ్ములకీడు చెక్కుఁ లదిదంబుల గోడునడంచు వారు, చిం

దమ్ములతేఁడు కుత్తుక, పదమ్ముల కోడు ప్రవాళ, మిట్టియం
దమ్ములప్రోడ పూర్వసుకృతమ్మున నాకుఁలభించె నేఁడిటన్. 518

వ. అని యనేకభంగులఁ గొనియాడి తత్సమీపంబునకుం జని జిఱునగ వంకురింప మెల్లన నిట్లనియె. 519

ఉ. ఎక్కడిదానవీవు ? కులమెయ్యది ? నీతలిదండ్రులెవ్వ ? రీ
విక్కడ నొంటిమై నిలువ నేమిప్రయోజన ? మెట్టిచోటు నీ
యిక్క ? దరిం జరించు చెలు లెవ్వరు లేరదియేమి కారణం ?
బిక్కతయెల్లఁ దెల్లముగ నింతయు డాఁపక తెల్పు మంగనా. 520

క. అన సాధ్వి యిట్లనియె "దను, జనాథ ! ధర్మధ్వజాఖ్యజగతీపతికిఁ దనయను నారాయణుని బ, తినిగాఁ దలపోసి చేసితిని దపమిచటన్. 521

క. భూమీశుఁడవని పలికితి, మోమోడక యింతవట్టు పురుషులతోడన్
రామామణు లేకతమున, నేమాటలు పల్కనేర్తురే, యిదితగునే ! 522

ఉ. కోమలి సత్కులీనయగు కొమ్మ నివి క్తతలమ్మునన్ గుల
గ్రామణియైన పూరుషుఁడు గన్గొనఁబోవునె ? పోయెనేని యా
భామినితోడ నేతొక నెపంబిడి పల్కునె ? దుష్టపంశజు
ల్గాముకులైనయట్టి పలుగాకులఁబోలె, సురారిసత్తమా. 523

వ. ఇదియునుంగాక, స్త్రీజనం బతిగర్హితంబు: ప్రాజ్ఞుండగువాఁడు స్త్రీ జనాధీనుండు కానేరఁ" డని పలికి మఱియును, 524

ఉ. మంతనమందు మానినుల మచ్చికసేయఁగరాదు, చేసెనే
నెంతయు భీతిమాలి పతి హేళనసేయు దురాత్మకార్యము
ల్చింతనసేతు, రెప్డు నిరసింతురు కాంతులమాట, వింతలే !
యింతులకున్ మగండు చనవిచ్చినతోడనె నెత్తికెక్కుటల్ ! 525

ఉ. కామిని పొందులేనియెడ గ్రొర్యముఁ గోపముఁజూపు; విస్ఫుట
త్తామరసాక్షి సూక్ష్మసురతంబున మిక్కిలి దుఃఖమందుఁ; గాం
తామణి గాఢమౌ నిధువనంబున సంతసమందు; నద్దిరా !
భామల కెద్దియు న్సురతభాగ్యముకన్నను దక్కువేకదా. 526

క. ఎలఁప్రాయము సౌందర్యముఁ, గలిమియు రసికతయు సురతకౌశలముఁ గళల్
గలిగిన మగనిని ప్రాణం, బులతో సరిఁజూచెదరు ప్రఫుల్లాబ్జముఖుల్. 527

క. ముదుసలి, సురతాశముఁ గని, ముదితలు నెపముంచి కలహమును బెంచి సదా
వదరుదురు; నరుల కింతుల్, గన కష్టసుఖంబులీయఁ గారణభూతల్ ; 528

క. సారసగంధికి మిత్రులు, వైరులు గలరే ! వినూత్నవరు ననుదినముం
గోరుచునుండ్రు సతీత్వా, చారంబులు వెలికిఁ ద్రోఁప సంప్రీతిమెయిన్. 529

ఉ. జవ్వని కాత్మలో నితఁడు చక్కనివాఁడని తోఁచెనేని తా
నెవ్విధినైన వాని వరియింపఁదలంచును గాని బంధువుల్
నవ్వుదురో, మరేమను నొనాథుఁడు, లాఁతులుదూఱరొక్కొ, యే
నెవ్వము గల్గునో ? యని గణింప దొకించుక రాక్షసోత్తమా. 530

క. కార్యముగలయప్పుడు పరి, చర్యలుగావించి విటుని సమ్మతిగా సౌం
దర్యము ధరించి తలఁచిన, కార్యంబగుఁబిదపఁ దృణముగాఁ గంద్రు చెలుల్."

వ. అనవుడు. 532

ఉ. ఇందునిభాస్య నీవు వచియించిన పల్కులవెల్లఁ గల్లగా;
వందువిశేషముండె జనులందఱు మోహపడంగ ముఖా శతా
నందుడు సృష్టిఁజేసె లలనాజనరూపము రెండురీతులన్
బొందుగ మంచిచెడ్డలను బోల్చి గ్రహించిన యుక్తి మిమ్మహిజా. 533

గీ. రాధ సావిత్రి లక్ష్మి సరస్వతియును, దుర్గ మున్నగునట్టి సతులు విధాత
చేత నిర్మింపఁబడి రాదిసృష్టియందు, అఖిలమంగళసంధాత్రులగుచుఁ దరుణి. 534

క. వీరలకళచేఁ బుట్టిన, స్త్రీరూపము మంచిదని వచింతురు విబుధుల్
వారల వేర్వేఱుగ నే, వారసి చెప్పెదను విను సమాహితబుద్ధిన్. 535

సీ. తార మందోదరి దమయంతి మేన వే • దవతి కౌశిక యరుంధతి యహల్య
శతరూప దక్షిణ స్వాహ ఛాయావతి • శచి దేవహూతి యక్షవతి యదితి
వరుణాని తులసి లోపాముద్ర కోటభి • దితి రోహిణియు పతివ్రతలు; మఱియు
గంగ ధరిత్రి మంగళ చండి స్మృతి మేధ • ప్రభ శోభ కీర్తి సంపత్తి శాంతి

గీ. క్షాంతి నిద్దుర క్షుత్పిపాసలు దినంబు • పుష్టి తామసి కాంతి సంతుష్టి శ్రద్ధ
యనెడు వివియెల్ల స్త్రీరూప మందినవఖు•యుగయుగంబున జరియించు నుత్తమగతి

వ. అది గావున. 537

ఉ. పండితుఁ డుత్తముండు పరభామను గోరునె యెన్నఁడైన నో
యండజయాన ! యానలువ యానతి వచ్చితి, నేను శంఖచూ

దుండను రాక్షసేంద్రుండు; గడు న్మోదమారంగ విన్నువిచ్చుటం
జెందిలియాడంగోరితిం జూమీ। మది సంశయ ముజ్జగింపుమీ. 438

క. తొలిపుట్టువున న్విష్ణువు, కలచేత సుదాముండనంగ గణుతింపంగా
వలరితి గోపకులంబునం, బొలతిందిని రాధశాపమున నిపుడైతిన్. 539

క. మును నీవు తులసి వా కృ, ష్ణునిచే సంభుక్తవగుటం జూచి మనమునం
గినుక వొడమ రాధిక భువి, జనియింపంగ శాప మపు డొసంగెను నీకున్. 540

వ. అపుడు నీయందు బద్ధానురాగుండనయ్యును రాధికాభయంబున నిన్నుం గలయనైతి; విదియెల్లం గృష్ణమంత్రప్రభావంబ; యే నెఱుంగుదు నీవును జాతిస్మర వగుటంజేసి యీ వృత్తాంతంబంతయు నెఱుంగు దనవుడు, 541

గీ. మగువ విన్ననవ్వు నగి యిట్లనియె దాన. వేంద్ర। కామవశత నివ్విధమునం
దెలివికల్గువాండు స్త్రీజితుం డగునయ్య।, యైన శుద్ధిం డందురయ్య వాని। 542

చ. అమలమనస్కు। విప్రుండు దశాహమునన్, క్షితిభర్త ద్వాదశా
హమునను, మారుజాండు పదునైదవ ప్రొద్దునం, బాదజుండు మా
సమునను శుద్ధిజెందుదురు జాతమృతమ్ముల; నంగనాజితుం
డమలిమండౌం జితాదహనమందని పెద్దలు చెప్ప విన్నదున్. 543

గీ. స్త్రీజితంబగు నెవ్వనిచిత్త మాతం, డిడిన పిండోదకంబుల నిచ్చంగొనరు
పితరు; లమరులు పూజాదివిధులం గొనరు, జపతపోజ్ఞానవిద్యాయశంబు లున్న.

ఉ. హీనున కంగహీనునకు వృద్ధున కామయదుష్టదేహి క
జ్ఞానునకుం దరిద్రునకు షండున కంధునకుం బరాంగనా
ధీనునకుం బ్రకోపికిని దీనునకుం దనకన్య నిచ్చి న
మ్మానవుం డొందు సర్వ నవమానము రౌరవముం బరంబునన్. 545

క. శాంతునకున్ వర్ణికి గుణ, వంతున కనురూపవైభవునకు ధీ
మంతున కాత్మజ నిచ్చిన, సంతసమున వాండు గను దశక్రతుఫలమున్. 546

మ. మనుజుం డెవ్వండు కూంతు నమ్ముకొని సంపాదించు విత్తంబు వాం
డపశంబున్ యమకింకరాహతుల హాహాకారముం జేయుచు
న్వెనువంతంబడు భీకరంబయిన కుంభీపాకమందుం బున
ర్జని దుష్టామయపీడితాంగుండయి మాంసం బమ్మి జీవించెడున్. 547

వ. ఈ ప్రకారంబున నొండొరులు వివాదంబుచేయు చక్కటికి వేల్పు పెద్ద విచ్చేసి
వారలం గనుంగొని, 548

మ. దనుజాగ్రేసర ! వాదమేటి కిఁక గాంధర్వంపుఁ జందాన నీ
వనితం బెండిలియాడు మిర్వురకు దాంపత్యంబు మేలౌ సతీ
జనరత్నంబగు నాలతాంగి పురుషశ్లాఘ్యుండ వీవున్ హితా
జ్జవితంబైన ఫలంబుఁ బోవిడిచినన్ సౌఖ్యంబు చేకూరునే. 549

క. ఏల పరీక్షించెదవో, బాలామణి ! యిట్టి సుగుణవంతునిఁ బతిగా
నేలోకంబునను గనం, జాలవు వరియింపు మితనిఁ జాఁమిఁకేలా. 550

చ. గణపతిపుష్టి, యయ్యదితి కశ్యపుఁడున్, జ్వలనుండుస్వాహ, రో
హిణి శశియున్, శచీసతి మహేంద్రుఁ, డహల్యయుగౌతముండు, ధా
రుణియు వరాహమూర్తియు, నరుంధతి మత్సుతుఁ డట్ల మీరలుం
గణనవహింత్రు నీకు పతి కాఁగలఁ డాహరియుం బునర్జనిన్. 551

గీ. వనిత యీతఁడు నింక శోభనముగల్గు, నాదు వచనంబు వితథమగునా యటంచు
దీవనల నిచ్చి చనియె వాణీవరుండు, భావజార్తి దైత్యభావంబు జెందె. 552

క. అందముల ప్రోదయగు తుల, సిం దానవచక్రవర్తి చిత్తములో నా
నందముమీఱఁగ నప్పుడు, గాంధర్వవిధి వివాహకౌతుకమెసఁగెన్. 553

క. ఆసమయంబున నాకని, వాసులు గురిసిరి ప్రసూనవర్షము గంధ
ర్వీసముదాయము నాట్యము, చేసెను దుందుభులమ్రోఁత చెలఁగెను దిక్కై. 554

ఉ. అంతట శంఖచూడదనుజాధిపుఁ డంగన చేయిపట్టి త
త్కాంతకిసాలజాలకలితాంతనితాంతవిభాసిబంభరా
క్రాంతవితాయమానహృదయంగమగానవిలోలవృక్షవా
ట్యంతరభాసమానమగునట్టి లతాగృహసీమఁ దారిచెన్. 555

క. తారిచి యందులఁ దత్సుమ, వారంబుల నొక్కసెజ్జ భద్రముగాఁగన్
వే రచియించి తటాలున, నారీమణిఁ జేసెఁ గురువున న్వసియింపన్. 556

చ. కురువునఁ జేర్చి యంత నెఱికొప్పునయి న్నవరించి కమ్మపూ
సరులు ఘటించి చెక్కులఁ బసంపుగ లేవెలవంకలుంచి మో
విసపము గ్రోలి సిబ్బితిని ప్రీలిచి మైపులకింపఁగాఁ గళల్
కరముల నంటుచుం బడఁతుకం గరగించెను మించుపక్కెనన్. 557

ఉ. పమ్మిన కూర్మి దానవుఁడు పార్వణచంద్రముఖిం బిరాన గా
ఢమ్ముగఁ గౌఁగిలించి ప్రకటంబుగ వాతెఱ ముద్దొనర్చి యా
కమ్మనివింటివాని బలుకయ్యమున న్సుఖియించె నెద్దకున్
సమ్మతియైనపోల్కి నెఱజాణతనంబునఁ గోర్కి దీఱఁగన్. 558

ఉ. అత్తఱి నత్తపస్విని రతాంతమునం గనుమూసి యెంతయున్
జిత్తము రిత్తయైతనరఁ జెందెను మూర్ఛ నతండు లేచి యా
బిత్తరి తాళవృంతములఁ బీవఁగ మెల్లన మూర్ఛఁ దేఱి తాఁ
జిత్తహరుం గనుంగొని వసించె పునారతి కిచ్చగించుచున్. 559

మ. అపుడా, గాఢరతిన్ శ్రమంపడఁగఁజేయం గాంత ! వన్నించు నా
నవలారత్నము ధీరత న్మనములోన న్మీఱి పుంభావకే
ళి వొనర్చెన్ చలదున్నతస్తనచలల్లీలామణీహారకాం
తవదర్పోజ్జ్వలనేత్రకోణయయి యాత్మ న్నాథుఁ దగ్గింపఁగన్. 560

వ. ఇటు లవ్వీరాయిత మ. కుటిలాలక తానొనర్చి కొండొక వడికిన్
దటుకున వ్రాలెను తామ, స్యటు పేరురమందు మాలికాకృతి దోఁపన్. 561

ఉ. ఆతరుణీలలామయు సురారియు నవ్వనవాతపోతవి
ర్ధూతరతిశ్రమాంబులయి తోరపుఁబ్రీతి మనంబు లూరఁగా
ద్యోత మొకింత సోఁకని మధువ్రతకోకిలమంజుగీతికా
స్వీతరసాలసాలసరణిందగు గొజ్జఁగిపీటికాలుపన్. 562

చ. కనుఁగొని లేచి యయ్యసుర కామినికిం గయిదండ యిచ్చి మె
ల్లన నడిపించుచో వనివిలాసము లెల్లను గానిపించి క
మ్మని వలిపెంపుఁదెమ్మెర సుమాళముగా శ్రమ మార్చ నాసర
మ్మమ దఱియంగవచ్చి దరి బోటిని నిల్పి ముదాన నిట్లనెన్. 563

క. కొమ్మా ! యల్లది కాంతే, తుమ్మెద యాతమ్మిలో మధువు నాని వెసన్
గొమ్మని యళి కందిచ్చుట, జుమ్మని తా రొదనుజేయుచుం బ్రియమారన్. 564

క. అదె జక్కవఁ గనుగొంటే, పదముల నొకతమ్మిమొగడపై నిడి మోదం
బెదఁగదురఁగ నొకతమ్మిం, బదిలంబుగ మధువు నానుఁ బద్మదళాక్షీ. 565

క. లలనా ! యీనదిలోపల, జలకం బాడుదమె మధురసలిలాంతరకే
ళిలద్భృంగీవిరచిత, కలనాదంబులు వినంగఁ గడుఁ బ్రియమయ్యెన్. 566

ఉ. ఆవలినాక్షి వల్లెయని యప్పుడు తామరపాకు గోరఁ బూఁ
దేనియ యించి తెచ్చి కరదీపితమంజులరత్నకంకణ
ధ్వానము వీనుదోయికి ముదంబొదవన్ సిర సంటి యంత నె
మ్మేను సరోజపాంసువుల మెల్ల నలుంగిడి ప్రేమమీఱఁగన్. 567

క. జానగు గొజ్జఁగి నీటం, దానం బాడించి నెరుల తడియొత్తి సుగం
ధానూనధూపమున నా, మానిని దా నొంపిక సుమంబులఁ జూటెన్. 568

క. కిస్తురిఁ దిలకము నుదుటను, గస్తురిచే నుంచి మేనఁ గలప మలఁది మే
ల్దిస్తులు కట్టఁగ నిచ్చి ప్ర, శస్తమణీభూషణములు చక్కఁగ నునిచెన్. 569

గీ. లలన యీగతి మగని నలంకరించి, యొక్క యెలమావిక్రిందఁ గూర్చుండఁజేసి
మజ్జన మొనర్చి తానును మరలివచ్చె, అంగజుఁడు సానఁబట్టిన యమ్మవంగ. 570

సీ. తడియార్చి నెఱుల క్రొమ్ముడివైచి వాసించు • మొగలిపూరేకుల ముడిచి చుట్టి
కులుకుచన్గొండలఁ గలపంబుఁ దాలిచి • జిలుఁగుపైఠాణికంచెలము దొడిగి
హారంబు మెడ నంగహారంబు మేన కే • యూరముల్ రెండు బాహువుల నుంచి
బంగారు రంగారు చెంగావిపుట్టంబు • సింగారమూర వాసిగ ధరించి

గీ. తళుకుఁజెక్కుల మకరికల్ కులుకఁజేసి • కనుల కాటుకయును దిలకంబు నుదుట
నడుగుఁదమ్ముల లాక్షయు నవధరించి • సరసిజముఖి సామని సరస కరిగె. 571

చ. చని హృదయేశు నంఘ్రులకు సాఁగిలిమ్రొక్కి ప్రియంబెలర్ప నీ
వనమున నున్న తేనెయును బండ్లును దెచ్చెద నారగింతువే
యనవుడు వల్లెయన్న జలజాయతలోచన యవ్వవస్థలిం
బనుపడి పూవుఁదేనియలుఁ బండ్లును దెచ్చి యొసంగెఁ జెచ్చెరన్. 572

క. తెచ్చియొసంగిన పండ్లును, నచ్చపుఁదేనెయును వారిజాక్షియుఁ దానున్
మచ్చికతో ధుత నచ్చట, ముచ్చటదీఱంగ నపుడు భజియించి రోగిన్. 573

వ. అనంతరంబ శంఖచూడుండు తులసీమణీమణితో. 574

ఉ. ఓచపలాక్షి! యింక నిట నుండఁగ నేటికటంచుఁ బల్కి వే
లేచి ముదాన దారము లేఖభుజంబున నుంచి చూచితే
లోచనపర్వ మయ్యె వనిలోఁగల చోద్యములంచు దట్టమై
పూచిన పూవుటీరములపొంతనె పోవుచు నేర్పుమీఱఁగన్. 575

సీ. పరభృతత్రోటీవిపాటితపాటలీ • కోరకంబులఁ దేనె కురియునెడలఁ
గమ్మనితావులు గ్రుమ్మరించుచు వలి • తెమ్మెరల్ వీతెంచు తెఱవులఁ జని
మదముమీఱిన తేటికాదమల జిలిబిలి • రొదల నింపగు పూవుఁబొదలు దూఱి
కపురంపుటనఁటి చొక్కపుదుమారంపుమొ • క్కలపుఁదిప్పల సరాగమున నెక్కి
గీ. కలువరామానికంపుఁ జెక్కడపుఁబసుల • విద్దమైయొప్పు పావడియొద్దఁ జేరి
చివురుకైదువుపాదుషా చెయ్వుఁలంయు • సుదతి సరించె నాశంఖచూడుఁ డనఘ.

క. ఇటులే దినదిన మట న, చ్చటులాలకఁ గూడి సురతసౌఖ్యాబ్ధిసము
త్కటమతితో మండఁగ నం, తట నొక మన్వంతరంబు తటుకున దాఁటెన్. 577

ఉ. వెండి యనంతవిక్రమము పేరిచి యావిలిదిండి దండియై
ఖండనమాచరించి బుధవల్లభుఁ బాఱఁగఁద్రోలి మౌనిమా
ర్తాండవితాయమానసవనాగ్నుల నాఱిపి హవ్యముల్ సము
ద్దండగతిన్ హరించి మునితల్లజులన్ వడిఁ జెండి యార్చుచున్. 578

ఉ. ఆకలుషాత్ముఁ డాత్మఁ గొలయంచుఁ దలంపక క్రొవ్వియేర్చి నా
నాతులకాంతలన్ బలిమునం గొనితెచ్చి తదీయబాంధవుల్
శోకముపెల్లున న్వనరుచుం బఱువం జెఱసాలనుంచి చీ
కాకుపడంగఁ జేసెను జగంబును బెల్లగుదుండగంబునన్. 579

చ. మనమున నించుకేని నెఱి మాని మగంటిమి దిక్కులెల్లెడన్
గనుఁగొనఁ దానయౌచుఁ ద్రిజగంబుల నేచుచునుండఁగా సురల్
దనుజు జయింపలేక ధృతి తద్దయుఁదూలి హృతాధికారులై
వనరుచు ధాతఁ గన్గొన జవంబున నేగిరి పాదచారులై. 580

చ. చని యనిమేషు లవ్విధిహజారము ముంగిట ద్వారపాలురన్
గనుఁగొని ధాతయానతిని గైకొని లోనికి వేగఁబోయి ధా
తను బొడఁగాంచి తచ్చరణతామరసంబులకున్ జొహారు జే
సి నిలిచి భక్తిదోఁపఁగ వచించిరి వారు విషణ్ణచిత్తులై. 581

మ. ప్రమదాడంబరుఁడు శంఖచూడుఁడను దేవద్వేషి క్రూరుండు దు
ర్దమదోర్దర్పమెలర్పఁ గయ్యములఁ గోదండోరుశింజాధ్వనిన్
సుమనస్సంఘము పీఁచమాఱిచి బిడౌజున్ వీఁక నిర్జించి తా
నె మహారాజయి మాఱులేక మెలఁగు న్నీరేజసింహాసనా. 582

సీ. చరియించు నొకవేళ సురరాట్తరంగిణీ • పరిసరవాలుకాపదములందు
విహరించు నొకమాఱు వివిధరత్నప్రభా • స్వరహిమ శైలకందరములందుఁ
గ్రీడించు నొకతూరి బృందారకీగాన • బంధురనందనోపవనసరణిఁ
ద్రిమ్మరు నొకసారి ఋత్విగ్వషట్కార • కలనాసవనవాటికలకుఁ జెంత
గీ. అచ్యుతుఁ జరించువారు వెన్నిచ్చి పాఱఁ • ద్రోలి కంటికింపగు వెలంగులను గడిమి
బట్టుకొనితెచ్చి చెఱపాలఁ బెట్టిపొంచుఁ • గఱకు రక్కసి యెదఁ గనికరము మాలి.
ఉ. అమ్మయి మక్కుమీఱి సకలావనిభాగములందు హాళిమై
ద్రిమ్మరుచుండి జన్న మొనరించెడిచోటికిఁ బోయి బల్మి హ
వ్యమ్ముహరించి యడ్డపడువారల బమ్మెరవోవఁ గ్రుమ్ము వాఁ
డెమ్మెయిఁ దాఁకవార మీఁక నెద్ది యుపాయము పద్మసంభవా. 584
చ. కఱదల నెన్నియేఁ గఱచి క్రాలెడు నాపొలదిండిఘాటికిన్
వెఱచి కడిందియౌ నతని వేరముఁ దక్కి వినుం గనుంగొనన్
బరచి యిటేగుదెంచితి మపారకృపామతిఁ బ్రోవకున్న నె
త్తెఱఁగున నుందు మింకెవరుదిక్కు మహాత్మ! వచింపు నావుడున్. 585
చ. చిఱునగ వాననాబ్జమునఁ జెన్నువహింపఁగ నజ్జ పల్కె. నే
నెఱుఁగుదు శంఖచూడు నతఁ డేచి బుధావళి నొంచుచుంట యే
నెఱుఁగుదుఁ గాని యాదనుజునిన్ వధియింపఁగఁజాల మాయలం
గఱచినవాఁ డనేకము లఖండపరాక్రముఁ డాహవంబులన్. 586
చ. వెఱవకుఁ డీరు డెందముల వేరముఁ దక్కకుఁ డుక్కుమీఱి యె
త్తెఱఁగువనైన వానిని వధింపఁగ నాత్రిపురాంతకుండ పో
నెఱిగలఁ డాతనిం గనిన నెవ్వగ లన్నియుఁ దీర్పఁజాలు నే
డ్తెఱఁ జనుఁ డింక నేను జనుదెంచెద శంకరుపాలి కింతలో. 587
వ. అనవుడు, 588
క. "దేవరతోఁ జనుదెంతుము", నా వల్లె యటంచుఁ బల్కి నానాపుణీకో
భాసిభాజితమగు తన, యావాసము వెడలె నిర్జరాగ్రేసరుఁడై. 589
వ. ఇట్లు కృత్తివాసోదిదృక్షితత్పరుండై. 590
మ. జలజప్రోద్భవుఁ డంతఁ గన్గొనియె శశ్వచ్ఛర్వవీక్షారతా
హలనిస్తంద్రగణాగణాఖిలమునీంద్రావళ్యవన్యాసమున్

పలితోత్ఫుల్లకిసాలితావనిజనంవాసంబు విద్యాధరీ
లలితాంగీక్రియమాణన ర్తనసముల్లాసంబుఁ గై లాసముఁ. 591

శా. పీరేజాతభవుండు తద్గిరి బుధానీకంబుతో మెల్లనఁ
జేరంబోయి తదగ్రభాగమున నక్షీణప్రభాభాసుర
గ్లౌరత్నోరువితర్దికాంతమున లీలం గౌరితో నమ్మహా
చారంభం బొనరించు నీశ్వరుని విశ్వారాధ్యునిఁ గన్గొనెన్. 592

ఉ. కాంచి విరించి నిర్జరనికాయముతోఁ దనమోడ్పుకేల్నిటా
లాంచితముం ఘటించి శివు నంఘ్రియుగంబులకుం జొహారు గా
వించి నుతించి నిర్జరుల వెగ్గలపాటును విన్నవింప నా
లించి విరించితో ననియె లేనెలదాల్పు ముదంబుమీఱఁగన్. 593

క. సారససంభవముఖ్యం, దారకవరులార! దనుజు దండింపంగా
నేరము; నేమను వచ్చెద, నారాయణు దర్శనం బొనర్పఁగఁ జనుఁడీ. 594

లయగ్రాహి.

వార లటులేగి ముదమార హరిపత్తనపు, ద్వారమును జేరి యటఁ జారుమణిమాలా
హారులను స్మేరముఖసారసులఁ జక్రదర, ధారులను ధీరుల నుదారుల మనోజ్ఞా
కారులఁ జతుర్భుజుల మేరుధరణీధ్రనమ, ధీరులను శ్యామలశరీరులను రమ్యా
చారులను శౌరి ప్రతిహారులను జూచి విధి, జేరి తవరాకకును గారణము దెల్పెన్.

గీ. తొడరి వారల యనుమతి వడసి యచట, కడచు పవియారు గవకుల గడచిచనియె;
భూతపతిముఖ్యదేవసమేతుఁడగుచు, ధాత వారల కభయప్రదాత యగుచు. 596

మ. శతపత్రప్రతిపక్షరత్నమయకక్ష్యాభాగముఁ గాంచనాం
చితసోపానపరంపరాకలితరాజీవాప్తమాణిక్యముం
దతవిస్ఫూర్జితపీలరత్నఖచితస్తంభంబుఁ జంద్రాభముం
జతురశ్రంబును బూర్ణకుంభయుతమౌ సౌధంబునం దొక్కచో. 597

సీ. పొందమ్మిరుచిఁ బోలి యందమైతగు పద • ద్వంద్వంబు సిరి కేలఁ బట్టియొత్తఁ
బు ·ఁగుఁగా రా కడెంబులు ఘల్లుఘల్లుమోయ • వలచేత గంగ వీవనలు వీవ
వెలనవ్వు మోమున మొలకలెత్తఁగఁ బల్కు • బోటి కవ్రంపుఁదాంబూల మొసఁగ
వవనూపుఁ వ్వుసల్ పొదల నప్పరంబోంట్లు • న ర్తనాదికములొనర్పుచుండ

గీ. నవ్యమాణిక్య సింహాసనంబునందు • వేడ్కమీఱఁగఁ గొలువున్న వేదవేద్యు
భక్తలోకసంరక్షణభద్రదీక్షు • శౌరిఁ గన్గొనె విధి బుధనహితుఁ డగుచు. 598

చ నలువయు వేల్పులన్ శివుఁడు నైజవిమాత్నకిరీటరత్నకాం
తులు జలజాక్షునంఘ్రులకుఁ దోరపుఁ గన్కలుగా నొసంగి మై
పులకలు గ్రమ్మ బాష్పజలపూరితలోచనులై నగద్గదా
పలితశిరోధులొచు విఱవంబడి రందఱు విన్నబాటుతో. 599

క. పలుకంగ నేమి తోఁచక, నిబవంబడియున్న వేల్పునికరముఁ గని యా
జలజాతోద్భవుఁడు కృతాం, జలియై వచియించె నిట్లు శౌజఙధరునితో. 600

శా. పాపారణ్యకుఠారదంష్ట్రినలినా ! భావత్కకారుణ్యపీ
జాపీయూషరసంబు మారజము నిష్పారంబుగా నాఁటెపెన్ ;
నీపాదాబ్జనఖేందవప్రభలు ఖండించెన్ దమంబున్ సుఖం
బాపూర్ణంబగు నింక నీమధురవాచారూఢి విన్నంతటన్. 601

క. అని సన్నుతించి తా మా, దనుజునిచేఁ గన్న దీవదశ వెతఁగింపన్
విని సర్వజ్ఞుండగు హరి, వినిపించె న్సురల కసురవిధ మతికరుణన్. 602

క. ఉరుబాహుబలుండగు క, ర్బురనాథుఁడు చేయుక్రౌర్యముల నెఱుఁగుదు నో
సురలార ! యైన వానిం, బరిభవమొనరింప నాదు భక్తుండగుటన్. 603

ఉ. ఆరజనీచరేశ్వరుఁ డనన్యవిజేయుఁడు గాన వాని నీ
మారహరుండు ద్రుంపఁదగు మామకశూలముచేతఁ గావున
న్మీరిఁక దుఃఖమందకుఁడు మేల్పమకూరు నటంచు వారిఁ దా
నూఱడిలంగఁజేసి హరి యుగ్రువకిచ్చెఁ ద్రిశూలమత్తఱిన్. 604

గీ. ఇచ్చి సురలార ! వేగమ యేగుఁడింక, నేమ బ్రాహ్మణవేషమ్ము నూని వాని
నడిగి కొనితెత్తు మున్ను నే విడిన కవచ, మంత వధ్యుండు మీకగు వద్దమఱఁడు.

వ. అదియునుంగాక వానిభార్య కెన్నండు సతీత్వహాని సంభవించు నప్పుడ వాని మర
ణంబు ఘటిల్లుఁ గావున మదీయంబగు తేజంబు తద్గర్భంబున విక్షేపింపవలయు.

గీ. అనుచుఁ బల్కిన సంతోషమంది కృత్తి, వాసుఁ డాశూలము గొని వనజసంభ
వాదిసురసంఘములతోడ నరిగె దైత్య, నాథు నాశంబుకై జతనము లొనర్ప. 607

ఉ. దానవు సంహరింపఁ బ్రమథప్రభుని న్నియమించి తా యథా
స్థానముఁ జేరె ధాత దివిజప్రవరు ల్గని రంత పుష్పభ

ద్రానదియొడ్డున న్వటధరాజముక్రింద వసించి శంఖుఁడా
దానవనాథుఁడజ్జ కుచితంబుగఁ బంపెను దూత నొక్కనిన్. 608

వ. వాఁడు నతిత్వరితగమనంబునఁ దత్పట్టణంబుఁ జేరం జని. 609

సీ. దశపంచయోజనదైర్ఘ్యవైశాల్యంబు • విపులస్ఫటికయానవేష్టితంబు
నతిదుర్గసప్తఖేయాసమంచితమును • సముదగ్రతరవప్రసప్తకంబు
తతరత్నవీథీశతకభాసమానంబు • సద్వస్తుయుతవణిక్స్నోపచయము
సింధూరసన్నిభోచితరత్నఖచితది • వ్యాశ్రమకోటిసమన్వితంబు
గీ. సతతఫలభూరుహవితానసంయుతంబు • లలితవిహగాళికూజితకలకలంబు
నయుతకింకరరక్షితం బగుచు మిగుల • దంబుమీఱిన తత్పట్టణంబు నందు. 610

సీ. పూర్ణేందుమండలస్ఫూర్జితాకారంబు • పరిఖాచతుష్కవిభ్రాజితంబు
సుహృదావళిమహాసుముఖప్రవేశంబు • దుర్హృత్ప్రవేశసుదుర్గమంబు
రమణీయశృంగవిరాజితాభ్రతలంబు • ద్వాదశద్వారవిభాసితంబు
మాణిక్యకాంచనమండలీమండిత • మందరతరలక్షమందిరంబు
గీ. రత్నసోపానసంచయరంజితంబు • మణిమయస్తంభశతకసమన్వితంబు
నగుచుఁ జెలువొందు నారాచనగరి కరిగి • ద్వారపాలకు నాజ్ఞ లోపలకుఁ జనియె.

మ. తనరారందగు భృత్యుఁ డొక్కరుఁడు శ్వేతచ్ఛత్రముంబట్టి పీ
వనల వీవఁగఁ బార్షదు ల్బుధులు విద్వాంసుల్ ప్రవేష్టింప వీ
ర నికాయంబులు క్రేవలం గొలువఁ దోరం బొప్పఁగా రత్నకాం
చనపీఠంబున నున్న దైత్యపతి పజ్జం బోయి వాఁడిట్లనెన్. 612

క. దానవనాయక యే నీ, శానుని యానతి గ్రహించి చనుదెంచితి నా
పై నేరముంచ కిప్పుడు, మానుగ వినవలయు నాదు మాటలు గూర్మిన్. 613

శా. హరికిన్ శూల మొసంగి రక్షణముకై యాజ్ఞాప్తి నీయంగ నీ
శ్వరుఁ దేతెంచెను బుష్పభద్రకడకున్ స్వారాజ్య మీ విప్పుడే
సురసంఘంబుల కిచ్చి వర్ధిలుము రక్షోనాథ। కాదేని సం
గరరంగంబున నీయెద ల్జిదిమి ఱక్కంజేయు నిక్కంబుగన్. 614

గీ. అనిన దూతపల్కు లాలించి నవ్వుచు, వెల్లి వేగ నే మహేశుకడకు
వదుగుదెంతుఁ జనుమి యనఁగ వాఁ డంతట, వేగ శంఖుఁడున్న యేటికడకు. 615

వ. ఆ సమయమున. 616

మ. అల సేనానియు వీరభద్రుఁడు విశాలాక్షుండు బాణుండుఁ బిం
గళనేత్రుండు వికంపనుండును మహాకాయుండు భద్రుండు బా
ష్కలుఁడుం దుర్జయుఁడుం గుటీచరుఁడు దుర్గమ్యాఖ్యుఁడున్మున్నుగాఁ
గల యోధప్రవరుల్ వడిన్ విజయకాంక్ష న్వచ్చిరచ్చోటికిన్. 617

చ. స్ఫురదురుభీషణంబగు త్రిశూలము దారుణవర్తులంపు క
ర్పరము శరాసచక్రశరపద్మగదాముసలోజ్జ్వలాసిము
ద్గరములు రక్తమాల్యపరిధానముఁ దాల్చి విమానమెక్కి భీ
కరతరమూర్తియై తనరఁగాళికవచ్చె ససంభ్రమంబుగన్. 618

వ. మఱియు శస్త్రాస్త్ర సముదయంబులు వచ్చి మహాదేవు సన్నిధి నిల్చె నంత నక్కడ.

క. సంతసమున దనుజాధిపుఁ, డంతఃపురి కరిగి మాత యరుదెంచిన వృ
త్తాంతం బంతయుఁ దన ప్రియ, కాంతకు వినుపించెఁ బ్రథనకౌతుకమతియై. 620

క. వినిచిన రణయత్నము విని, కనుఁగవ నశ్రువులు నిండఁ గంఠం బెండన్
బెనిమిటిఁ గౌఁగిటఁ జేరిచి, యనియెం దులసీవధూటి యతివినయముతో. 621

శా. "ప్రాణేశా! శితికంఠుతోఁ జనునె వైరం బెన్నఁడే భక్తసం
త్రాణప్రౌఢుఁడు లోకసంహరణవిద్యాపారగుం డాతనిన్
బాణాదుల్కడుభక్తిఁ గొల్చి పిదపం ద్రైలోక్యసామ్రాజ్య మ
క్షీణప్రక్రియ నొందరే, యటుల సంసేవింప నీ కొప్పదే! 622

వ. అదియునుంగాక, 623

చ. అమరవిరోధులైన త్రిపురాసురుల న్వధియించినాఁడు సం
యముల నడంచు రాక్షసచయంబుల గర్వ మడంచినాఁడు మృ
త్యుముఖము జొచ్చు బాలునకు కోరయుఁగా నొనరించి లీలమై
జము మద మేర్చినాఁ డతని సంగరమందు జయింపవచ్చునే." 624

ఉ. ప్రేమదలిర్ప నయ్యసురుఁ గ్రేయసి పల్కుల నాలకించి వె
మ్మోమున మొల్క నవ్వొలయ ముద్దియఁ గన్గొని యో వెడంగుకాం
తా! మహి కాలకర్మగతి దప్పునె యేరికినైన దీనికై
వేమఱుఁ జింతనొందెదు వివేక మెఱుంగని దాని కైవడిన్. 625

ఆ. వె. భూమిరుహములెల్లఁ బుష్పఫలాదికం, బులను గొంతదనుకఁ బొదలుచుండి
కాల మగ్గలింపఁ గాలిచేనైనను, చిచ్చుచేతనైనఁ జేటుగనవె. 626

క. జనములచే జనసంతతి, జనియింపఁగఁ జేయు నెవఁడు జనుల జనులచే
హననంబొనరుచు నెవఁ డా, తని నీ మదిలోన నెపుడుఁ దలఁపుము తరుణీ. 627

సీ. ఎవ్వని దయచేత నీరేడు భువనముల్ • నిరుపద్రవంబుగా నిలువఁబడియె
నెవ్వని యానతి నిందుసూర్యులు శీత • తిగ్మప్రభలచేతఁ దేజరిలిరి
యెవ్వనియాన వహ్నియు వేఁడిమిని జిల్కు • గాడుపు తా శీఘ్రగామియయ్యె
నెవ్వని యాజ్ఞచే నింద్రుండు వర్షించె • నెల్లజంతులమీఁద మృత్యు వేగె

గీ. అట్టి యాద్యంతరహితు సర్వానుగమ్యు • గాలకాలు నణూపము స్థూలదేహు
సతతసృష్టిస్థితిలయప్రసక్తశీలు • నాయుహోమహుఁ దలఁపు మో కోమలాంగి. 628

క. పొలతిండివి నేనెక్కడ ః, విలావతి కుమారివైన యీవెక్కడ ః హా
తలపోయఁగ మన కలయిక, కలికీ ః జలకాష్ఠరీతిగాదే తలఁపన్. 629

గీ. తొల్లి గోలోకమున శౌరితోడ నుండి, రాధికాశాపమున విర్వురము నింత
దనుక నుండితి మిచట, బృందావనమున, కింకఁ బోవుద మీదుఃఖ మేల యనుచు.

క. పలువిధముల బోధించినఁ, దులసి తెలియలేక వగపుతోఁ బ్రియువక్ష
స్థ్సలిపైఁ బడి పెల్లగు ను, వ్వలికం గొన నపుడు గృష్ణమంత్రము నెప్పెన్ 631

గీ. అఖిలదుఃఖహరంబగు నట్టి కృష్ణ, మంత్ర మాతఁడు దెల్పిన మాత్రముననె
దివ్యవిజ్ఞానబుద్ధితో ధీరయగుచు, వెలఁది సంతోషమున నుండె విభుని మ్రోల. 632

ఉ. అత్తటి నయ్యనంగుజెలి నాదటఁ గౌఁగిట నాదరించుచుఁ
మెత్తని పూలపెజ్జపయి మించిన వేడుకతోడ గాఢమౌ
చిత్తజుకేళిఁ దేలి సతి చీరచెఱంగున వీవఁగాఁ బరా
యత్తమనస్కుఁడై నిమరనందె సురారి విచారదూరుఁడై. 633

శా. ప్రాతఃకాలమునందు విష్ణువినుతిప్రారంభుఁడై లేచి సు
స్నాతుండై తెలిపట్టుపుట్టములు విన్నాణంబుగాఁ దాల్చి ని
ర్ధూతామంగళహేతువై తనరు చారుస్వర్ణ మాణిక్యసం
జాతంబు ల్దాసీనువయస్యలకు విద్యావృత్తి నిచ్చెం దగన్. 634

మ. గజరత్నంబుల నశ్వరత్నముల సద్గ్రామంబులన్ భూములన్
ద్విజసంఘంబులకున్ దరిద్రులకుఁ బ్రీతి న్వే సమర్పించి భూ
ప్రజఁ గావన్ సుతు రాజుఁ జేసి ప్రియభార్య న్వాని కొప్పించి తా
విజయోత్సాహవివర్ధితాంగవితతావిర్భూతరోమాంచుఁడై. 635

ఉ. లక్ష మతంగజంబులు త్రిలక్షతురంగమముల్ రథంబు లా
ర్లక్షలు వీర్యవిక్రమబలప్రథితుల్ ప్రధనప్రసిద్ధులౌ
రాక్షసనాయకుల్ శతపరంపరఁగా దనతోడఁగూడి రా,
రాక్షసభర్త భార్గవపురస్సరుఁడై నగరంబు వెల్వడెన్. 636

వ. ఇట్లు వెడలి పశ్చిమసముద్రప్రాంతంబునందలి భద్రవటీతటంబున నొక్క వటవిటపి
సమీపంబునకుం జేఁనరిగి, 637

శా. భక్తాభీష్టవరప్రదాయకుని శుంభద్వ్యాఘ్రచర్మాంబరున్
తిక్తాభీలహాలాహలాసితశిరోధిన్ గోత్రనాథాత్మజా
సక్తున్ శాంతు సహస్రసూర్యనిభతేజశ్శాలి వీక్షించి స
ద్భక్తిన్ సాఁగి నమస్కరించె నల దేవద్వేషి సైన్యంబుతో. 638

గీ. వామభాగంబునందున్న భద్రకాళి, కగ్రమందున్న యట్టి షడాననునకు
వందనము లాచరించి దీవనలు గాంచి, నిలువఁబడియున్న నందిముఖ్యుల స్పృశించి.

వ. భయభక్తుల నిలువంబడియున్న శంఖచూడుం గనుంగొని చంద్రచూడుం డిట్లనుః
వో దనుజేంద్రా! జగత్సృష్టికారణుండగు పద్మనాభు నాభిపద్మంబున విధాత జన్మించె
నతనికి మరీచి పుట్టె నతనికి వైష్ణవుండు నతనికి కశ్యపుండు నతనికి ధర్మిష్ఠుండు
నతనికి దనువును నతనికి విప్రచిత్తియు నతనికి దంభుండును గ్రమంబున జన్మిం
చిరి. విష్ణుసేవాపరాయణులై బహుకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి పిదప
వైకుంఠంబున కరిగిరి. తొల్లి నీవా దంభునకుఁ బుత్రుండవై సుదాముండను నామం
బున నతిధార్మికుండవై యుండి రాధికాశాపంబున నిప్పుడు దానవేంద్రుండ వైతివి.
భగవత్సేవాపరాయణులైన వారీయఖిలంబుఁ దుచ్ఛంబుగాఁ దలఁచి ముక్తిచతుష్ట
యంబును జులకనగాఁ జూతురు. ఇదియునుంగాక, 640

మ. హరిభక్తుండగు నీకు నాకపతి దాయాదుండు తద్రాజ్యమున్
హరియింపందగునే? స్వరాజ్యమున సౌఖ్యంబందఁగాఁ జాలదే!
దురితం బెద్దియుఁ దత్ప్రతిక్రియల నిర్ధూతంబగుం గాని సు
స్థిరమై వీడకయుండు నెప్పటికి జ్ఞాతిద్రోహపాపం బిలన్. 641

క. కావున నసురాపతి నా, దేవతల కొసంగి హితమతి న్నీవెపు డీ
భూవలయంబున రాజ్య. శ్రీ వెలయఁగఁ బాలనంబు సేయఁగ రాదే. 642

గీ. సంపదకు హాని గలదని సంశయింప, వలవ దది కాలవశమున వచ్చుఁ బోవుః
హరహరిహిరణ్యగర్భులకైనఁ గాని, కాలమార్గంబు దాఁట శక్యంబు గాదు. 643

సీ. కాలవశంబునఁ గాదె ధాత తిరోహి • తత్వంబు మరల నుద్భవముఁ గనుట
కాలవశంబునఁగాదె చంద్రుఁడు కలా • వంతుఁ డౌటయుఁ గృశత్వంబుఁ గనుట
కాలవశంబునఁగాదె సూర్యుండు ప్ర • తాపహీనుండు సంతాపి యగుట
కాలవశంబునఁగాదె ధామణి సర్వ • సస్యార్థ్యయగుట యూషరయు నగుట

గీ. కాలవశమున విశ్వంబు గానిపించుఁ • గాలవశమున సర్వంబుఁ గలయు నీటఁ
గాన సమరీతి నెవ్వండు గానఁబోఁడు • అక్షయం బొక్కఁ డాపరమాత్మదక్క.

వ. నేను దదీయధ్యానపారీణుండ నగుటంజేసి ప్రాకృతయుగంబు లనేకంబులం గనుఁగొంటి నింక ననేకయుగంబులఁ గనుఁగొందుఁ దదాజ్ఞా ప్రకారంబున బ్రహ్మ విష్ణులు సృష్టిస్థితు లొనర్చుచుండ నేను సంహారకారణుండనై యుందు ననిన శంభుఁడుం డిట్లనియె. 645

గీ. శమనదమన ! భవత్కథితములలోన, నన్యథాలాపములు గల్గనయ్యెఁ దైన
నించుక యథార్థమును వచియింతు మీర, లాదరంబున వినుఁడు సమాహితముగ.

శా. జ్ఞాతిద్రోహము పాప మంటి; బలి రాజ్యభ్రష్టునింజేసి యీ
పాతాళంబునఁ ద్రొక్కఁడే ? యసురులన్ వంచించి వారాశిసం
జాతంబౌ సుధ గ్రోలదే ? యెపుడు రక్షశ్శ్రేణిఁ బీడించు నీ
నీతుల్ మున్గలనైనఁ జూచెనె ! సుధాపీకంబు శ్రీకంధరా. 647

క. కీడును మేలును వరుసం, గూడంగావలయు ధాతకును వశమగునే
పీడంగొన నీవిశ్వముఁ, క్రీడాభాండంబెకా ప్రకృతిపరున కొగిన్. 648

వ. కావున మున్ను దేవతాపీడితుల మయ్యును కాలక్రమంబున నిపుడుద్ధతుల మైతిమి. మరలకును మాకును సహజశత్రుత్వంబున నిన్నిమిత్తంబుగా నాలంబులు జరుగు చుండు; జయాపజయంబులు మేము యనుభవింతు; మట్లుండ శత్రుమిత్రసమభావు లగు మీరలరుదెంచుటయె నా కరుదుగాఁ దోఁచుచుండె; నింతియకాని మీవలన జయ మొందెఁ బరాజయమొందె నాకు కీర్తి హేతుకంబ కాని వేఱొండు కాదనినఁ ద్రిలో చనుండు ప్రహసితాననుండగుచు నిట్లనియె. 649

ఉ. రాక్షసనాథ ! తొల్లిటి మరద్విపులౌ మధుకైటభుల్ హిర
ణ్యాక్షహిరణ్యదైత్యులు వినాశముఁబొందు టెఱుంగవే పరో
జాక్షునిచేత నీవటుల నాలములోపలఁ గూలనేల సం
రక్షణసేతు నిర్జరులరాజ్య మొసంగి సుఖంబుఁ గాంచుమీ. 650

వ. అది కాదేని, 651

క. ఆహరి యానతిచేఁ ద్రిప, రాహితుఁడగు నేన యిప్పు డరుదెంచితి ను
త్సాహంబు మీఱఁగొని ర, మ్మాహవమున కోహటిలక యని పల్కుటయున్. 652

క. హరునకు వందన మొనరిచి, యరదముపై నెక్కి దానవాధీశుఁడు సం
గరధరణి ధీరుఁడై స, త్వరముగ నెలకొనియె దనుజవర్గముతోడన్. 653

వ. అత్తఱిఁ గృత్తివాసుండును దత్తఱంబున వేల్పుమొత్తంబుల రావించి యున్నంత నుభయసైన్యంబులకుఁ దుములసమరంబు జరిగె; నట్టియెడ మహేంద్రుండు వృషపర్వుని, భాస్కరుండు విప్రచిత్తిని, జంద్రుండు దంభుని, గాలుండు కాలస్వరుని, హుతాశనుండు గోకర్ణుని, గుబేరుండు కాలకాయుని, విశ్వకర్మ మయుని, మృత్యువు భయంకరుని, మయుండు సంహారుని, వరుణుండు వికంకణుని, హయుండు చలుని, నేకాదశరుద్రులు నేకాదశభయంకరులను, నందీశ్వరముఖ్యు లఖిలదానవగణంబులం దాఁకి యుద్ధంబు సేయ నొండొరుల సింహనాదంబులు భువనభోంతరాళంబు నిండె నంత, 654

ఉ. వేలుపులెల్ల దానవుల వేఁడిమి కోర్వఁగలేక భీతిచే
నాలముఁదక్కి పర్వఁగ షడాననుఁ డాగ్రహవృత్తితోడఁ దాఁ
గోలుమసంగి యద్దనుజకోటుల యేపడఁగించి సేన గ
గ్గోలుపడంగఁ జేసె నవికుంఠితసాహసవిక్రమంబులన్. 655

ఉ. దారుణలీలతోఁ బ్రధనధారుణి యెల్లెడఁ గాళియు న్మహో
మారియు ఘోటకంబులను మత్తగజంబుల వీరయోధులన్
ఘోరనఁ జంపి తద్రుధిరముం దగఁ గ్రోలుచునుండ రాక్షసుల్
ధీరతఁ దక్కి పర్విడిరి దిక్కులు పిక్కటిలంగ నార్చుచున్. 656

ఉ. అట్టి భయంకరంబయిన యాహవరంగమునందు దైత్యు లి
ట్టట్టుఁ జనంగలేక వెఱపందుచునుండ సురారిభర్త తాఁ
గట్టువకాపియై తనదు కట్టెదుటం గల క్రౌంచభేదితో
నెట్టుకొనె న్వడిం దన యనీకము పొంగి చెలంగి యార్వఁగన్. 657

ఉ. వచ్చిన దానవాధిపుని వక్షమునం బలువాలుతూపులం
గ్రుచ్చి భయంబుతో రిపువరూధిని బాఱఁగ నార్చె నంత, కా
ర్చిచ్చునుబోలి మండిపడి చెచ్చెర సేనల ముట్టడించి క్రో
ధోచ్చలితాక్షుఁడై శరవణోద్భవు తే రొనరించె రూపఱన్. 658

మ. తెగువ న్వి ల్దునుమాడి ఘోరమగు శ క్తి న్నుగ్గు గావించి తే
జిఁ గడుం జర్జరితంబుఁజేసి శరవృష్టి న్ముంచి పిహారము
ద్ధ్యగతుండౌ దినవాధుఁ బోల్పఁదగు క్రౌంచారిన్ లలాటంబు చె
మ్మగిల న్వైచినఁ జిమ్ముటంపఱస్మృతిం బొపెన్ క్షణం బంతలో. 659

చ. తెలిసి మహేశనందనుఁడు దివ్యవిచిత్రమణిప్రభావళీ
కలితరథంబు నెక్కి పటుకాండయుతంబగు నొండువిల్లు దా
ల్చి లయకృతాంతుపోలిక విశేషరుషాజ్వలనార్చు లొల్క న
జ్వలదనలాస్త్ర మప్పుడు నివారణ జేసెను వారుణంబుచేన్. 660

చ. దనుజాని విల్లు సారథి రథంబుఁ దురంగమముల్ సిడంబునుగా
దునిమి మఱొక్క విల్గొనినఁ దుత్తుమురై చనునట్లు జేసి కాం
చనవరరత్నకీలితలసన్మకుటంబును నుగ్గునూచగా
నొవరిచి యొక్కశ క్తిని మహోగ్రత వైచె మరంబువ్రయ్యఁగన్. 661

చ. అది యశనిప్రపాతము క్రియం బడ మూర్ఛనుజెంది యంతలో
మదమున లేచి కొండొక విమానము నెక్కి మఱొక్క విల్లు స
మ్మదమునఁ బూని ఘోరతరమార్గణపంక్తులఁ గప్పి యంత నా
రద! మఱియేమిచెప్పుదు సురప్రముఖు ల్భయమంది చూడఁగన్. 662

క. అత్యుగ్రఁబు సహస్రా, దిత్యసకాశంబు శౌరితేజోవృతమున్
భీత్యావహమగు శక్తిం, దైత్యుఁడు గుహు నేసెఁ గ్రోధదర్పోజ్వలుఁడై. 663

క. ప్రళయజ్వలనజ్వాలా, వళివలె వది మండిపడుచు వచ్చి మహోర
స్థ్సలముం దాఁకుడు నతిదో, ర్బలుఁడు కుమారుండు మూర్ఛపడియెఁ గుమారా.

క. బోఁడిమిచెడి కయ్యంబునఁ, గాడుపడు కుమారుఁ గాంచి కాళిక తనదౌ
క్రోడంబున విడుకొని శశి, చూడుని సన్నిధికి నేగె శోకముతోడ౯. 665

గీ. తూలిన కుమారు జూచి మృత్యుంజయుండు, జ్ఞానమున జీవవంతునిగా నొనర్చి
యగ్గలంబగు బలమిచ్చి యతనితోడఁ, గాళి నంపించె యుద్ధరంగమున కపుడు.

వ. అంత కార్తికేయుం డపూర్వబలసమన్వితుండై వెడలిన నందీశ్వరాదులును దేవ
గంధర్వకిన్నరకింపురుషులును బఱతెంచి సింహనాదంబులు సేయుచుండ శాకినీ
శాకిన్యుగ్రదంష్ట్రోగ్రదండలు రణమధ్యంబున మాధ్వీకపానంబు సేయుచున్న దైతే
యులు భీతచేతస్కులై పలాయితులైనం దానవాధిపుం డోడకుం డని యభయం
బిచ్చి కద్దెదుట నిల్చిన. 667

సీ. అంత కాళిక విలయాగ్నిసమానమై • పరఁగిన యాగ్నేయబాణమేయ
శంఖచూడుండు పార్జన్యశరంబుచే • దానినడంచిన మానకపుడు
వారుణాస్త్రంబేయ వారించె గాంధర్వ • విశిఖంబుచే జగద్విదితముగను
మాహేశ్వరంబును మంత్రించి వైచిన • వైష్ణవాస్త్రంబుచే వ్రయ్యునట్లు
చేసిన పీసుతోఁ జెచ్చెర నారాయ • ణాస్త్రంబు విడచిన నతఁడు సూచి

ఆ. వె. యాన మపుడు డిగ్గి యతివినయంబుతో • నన్నుతింప మగిడె సాధువగుచు;
మరల బ్రహ్మశిరము మంత్రపూర్వకముగ • నేయ దానిచేతనే యడంగె. 668

క. నృపుచేత నన్నియస్త్రము, లపహృతవీర్యంబు లగుట కచ్చెరువడి పా
శుపతాస్త్రం బరివోసిన, నపుడా వినువల్కు వొలఁతి యనియె మునీంద్రా. 669

క. "పాశుపతంబున మృత్యువు, లేశం బితని దరిఁజేరలేమనుచు; యో
హో! శాంకరి! తద్భార్య గు, ణాశయ యద్దానిఁ జెఱుప నాతఁడు త్రెళ్ళున్. 670

క. హరిమంత్ర కవచమును సు, స్థిరముగ నద్దనుజపతి సతీత్వముగలుగన్
హరిహరుల కజేయుండును, జరామరణరోగముల కసాధ్యుండు నగున్. 671

వ. అని యిట్లశరీరవాణి పలికిన నయ్యస్త్రంబు నివారించి ప్రళయాగ్నికలోపమానంబగు శూలంబువైచిన దాని వక్రమంబున వామహస్తంబునఁ బట్టుకొనుచుఁ గోపఘూర్ణమానసయై యొక్క ముష్టిఘాతంబు వేసినఁ దత్క్షణంబున మూర్ఛంజెందె, 672

ఆ. వె. అంతఁ దెలివినొంది హర్షసమేతుఁడై, భద్రకాళి కెఱఁగి దానవాంత
మగుడు విశ్రమింప నానతిఁగైకొని, రథమునంద యుండె రాక్షసుండు. 673

తరళ. కదనభూపతితామరారినికాయకాయచయంబులన్
చిదిమి నెత్తురుఁ గ్రోలుచున్ హతశేషులం బరిమార్చి లోఁ
బొదలు రోసముతోడఁ బ్రేవులప్రోవుల న్మెడఁ జుట్టి తా
నవయస్ఫూర్తిఁ జరించె లోకభయంకరంబగు నాకృతిన్. 674

వ. ఇట్లనర్గళపరాక్రమంబున విహరించియు దానవేంద్రు సంహరింపనేరక బ్రహ్మణి శంకరుపాలి కరుదెంచి యిట్లనియె. 675

ఉ. శంకర నీ ప్రసాదమున శత్రువులం బరిమార్చితి న్నిరా
తంకముగా నిశాచరులు తప్పిరి యింకొకనూఱువేలు ని
శ్శంకగ దైత్యనాయకుఁ డసాధ్యుఁ డహంకృతు లెన్నిచూపినన్
జంకఁ దొకించుకేని యొక శస్త్రభయంబును లేదు వానికిన్. 676

వ. వాఁ డనన్యశస్త్రసాధ్యుం డగుటంజేసి పాశుపతం బభిమంత్రించి వైచునసమయంబున.

క. "పాశుపతంబున నితనికి, లేశంబును మృత్యుభయము లేదనుమీ యో
హో! శాంకరి తద్భార్య గు, ణాశయ యద్దానిఁ జెఱుప నాతఁడు త్రెళ్ళున్. 678

క. హరిమంత్రకవచమును సు. స్థిరముగ నద్దనుజుసతి సతీత్వము గలుగన్
హరిహరుల కజేయుండును, జరామరణరోగముల కసాధ్యుండు నగున్" 679

వ. అని యిట్లశరీరవాణి వల్కిన నయ్యస్త్రంబు నివారించి తనవుడు. 680

మ. నిటలాక్షుండు నిజం బెఱింగి ప్రమథానీకంబు గొల్వంగ న
త్కుటకోషంబున భూనభోంతరము లాక్రందింపఁగా వెల్వడెన్
బటుసంరంభ మెలర్ప సంగరధరాభాగంబుఁ జేరంగ నం
తట దైత్యోత్తముఁడున్ రథంబుడిగి యానందంబుతో మ్రొక్కెడెన్. 681

ఆ. వె. మరల వేగమున విమానం బధిష్ఠించె, నపుడు విలయసమయయమువికరణి
శూలి యొప్పె నంత చోద్యంబుగా సంగ, రంబు నూఱువత్సరములుజరిగె. 682

వ. అయ్యవసరంబున. 683

క. వడవడ వడఁకుచుఁ బదములు, తడఁబడఁగాఁ గేల నొక్కదండముఁ గొని సం
దడిచేయుచు పాఱుని కై. వడి వేసముఁ దాల్చి శౌరి వచ్చె నిజేచ్ఛన్. 684

మ. "కులజుండ ద్విజుఁడ వృద్ధుఁడను రక్షోనాథ! పాత్రప్రియా!
చలిచే దప్పి వినుం గనుంగొనెడి యాసంజేరితింగాని యే
వలకుం బోవఁగఁజాల నింకఁ గడు స్వల్పంబైన, నీ మేని క
త్తళమున్ నాకిడి ప్రాణదాతవయి సంధానింపు మానందమునన్. 685

ఉ. కాసరుజల్ జనించు, వడఁకందొడఁగు న్మెయియెల్ల వీసమున్
గ్రాసము బోదు లోనికి, నర ల్గాయివెట్టెడు, నెమ్మనంబునం
దీపొక కొంత పెచ్చు, తలయేరు ఘటిల్లు, ధనంబునందు పే
రాసలు గల్గు; నక్కట! జరావ్రతుపాటుల నేమి చెప్పుదున్. 686

గీ. అధిగుణుఁడవంచు నిన్ను నే నడిగివాఁడఁ, గాని వేవే లొసంగిన హీనమతికిఁ
జేయి చాఁతునె! నీ వి డిచ్చినను జాలు, సున్నజుట్టిన నా కంతకన్న మేలు". 687

మ. అన నొక్కించుక సంశయించి మది నాహా! ధారుణీదేవుఁడ
గవిసంతి ద్వినయంబుతో నెపుడు సన్మానింతు నే నిట్టిపృ
ద్ధుని కీఁగాంచుటకన్న వేఱొకటి యెందుంగల్గునే మోద మిం
కనుమానం బదియేల మైమరుపు నే యర్పింతెద న్వీనికిన్. 688

వ. అని తలఁచి, 689

క. ప్రాణసమం బయిన తన, త్రాణంబును దీసి సమ్మదంబున మహిఁగీ
ర్వాణున కొసంగె దివిజ, శ్రేణులు కురియంగఁ గుసుమవృష్టి తనపయిన్. 690

గీ. దాని గ్రహియించి యతఁడు మోదంబుతోడ, శంఖచూడుని పోల్కిఁ దజ్జాయకడకు
వచ్చి దాని పతివ్రతాత్వంబుఁ గలఁచె, చక్రధరునకుఁ గలదె యసాధ్యమెందు. 691

వ. అంత నక్కడ. 692

క. దానవనాయకు మందటి, పేనల నన్నింటి నల్పశేషముగా వి
శామం దొనరిచి నిహతుని, జావికము జీవవంతమౌగతిఁ జేసెన్. 693

ఉ. కాలము వేచి యంత శితికంఠుఁడు వైచె సురారిభర్తపై
శూలము గ్రీష్మకాలశతసూర్యనిభప్రభ ముద్గతజ్వల
జ్జ్వాలము వజ్రతుల్యము నవార్యము లోకభయంకరమ్ము లీ
లాలులితాబ్జజాండముఁ బలాయితశాత్రవసైన్యజాలముఁగా. 694

గీ. దానిఁ గన్గొని యతఁడు శస్త్రములు విడిచి
యచ్యుతు భజించుచుండె యోగాసనమున
నపుడు శూలంబు పైఁబడి యురదమును న
తండు చూపట్టకుండ దగ్ధంబుపేసె. 695

ఉ. అంతట శంఖచూడుఁడు నిజాకృతి వీడి కిశోరరూపుఁడై
వింతగఁ దోఁచి యప్పుడ నవీనము గోభువనాగతంబు న
త్యంతమనోహరం బయిన యానముపై వసియించి యేగెఁ గృ
ష్ణాంతికమున్ ముదంబుఁ గొని రచ్చట రాధయు వాసుదేవుడున్. 696

చ. ఇల నల శంఖచూడదనుజేంద్రుని యెమ్ములు శంఖజాతులై
వెలసి సురార్చనంబులఁ బవిత్రతఁ గాంచె ననేకభంగులన్
గలుముంబోటి తద్ధ్వనులు గల్గినచోటుల నుండుఁగాన భూ
ద్రులకును శ్రీలకున్ సుఖముమూఢిగ నెక్కుడు గూర్చుఁ దద్వనుల్. 697

క. హరుఁ డద్దానవపతి నం, హరణం బొనరిచి వెస వృషారూఢుండై
'యరిగెఁ దనలోకమునకున్, సురలు న్నిజపురికిఁ బోయి సుఖియించిరొగిన్. 698

వ. అనిన నారదుం డిట్లను. 699

## తులసీసంగమ వర్ణనము

ఉ. మామక శంఖచూడునకు మానినియౌ సతియందు విం(ద్రియా
ధాన మొనర్చె నప్పు డలదానవహారి యటంచుఁ బల్కెఁ దీ;
వానలినాక్షిఁ గూడునెడ నాకృతి యెట్టిదిదాల్చె? నేక్రియన్
గానఁగఁబోయె? దాని నెఱుఁగ న్వచియింపు మహాత్మ నావుడున్. 700

శా. వీణాసంయమి! యాలకింపుమల గోవిందుండు గీర్వాణసం
త్రాణార్థంబుగ విష్ణుశాంబరిని తద్దైత్యాకృతిం దత్తను
త్రాణంబుంగొని తత్సతీగృహబహిర్ద్వారంబున న్నిల్చి ని
స్సాణంబేత్తైఱ మ్రోయఁజేసె జయముంజాటించు చందంబుగన్. 701

చ. ముగుద పతివ్రతానియమముం జెఱుపన్ రజనీచరు న్నశిం
పఁగ నొనరింప లోఁదలఁచి మాధవుఁడాగతి దుందుభి స్వరం
బుగ వినదంబుఁజేయ ననఁబోటి మనంబున మోదమంది సౌ
ధగతగవాక్షమార్గమునఁ దప్పక కన్గొనె రాజమార్గమున్. 702

ఉ. పైదలి వానిఁ గాంచి తనభర్త యటంచుఁ దలంచి పొంగుచున్
బీదలకున్ ద్విజావళికి భిక్షులకున్ ధనవస్త్రముఖ్యముల్
సాదరవృత్తి నిచ్చి వినయంబున నుండె; రథంబుడిగ్గి దా
మోదరుఁ డాసతీమణిసముజ్జ్వలసౌధముఁ జేరె నంతటన్. 703

క. దానవుఁడంచును బ్రత్యు, త్థానం బొనరించి తత్పదంబులఁ గడిగెన్
మానిని జలములఁ దనపరి, ధానముచేఁ దడియు నార్చెఁ దత్తఱపడుచున్. 704

ఉ. ఆలలితాంగి తా మణిమయాసనమందు మురారి నుంచి తాం
బూలమొసంగి యిట్లనియె ముద్దులుగుల్కుచుఁ "బ్రాణనాథ! నేఁ
డాలఁ గృతార్థ నైతి నిఁక జన్మము సార్థకమయ్యె నాకు ని
ప్డాలము పేయఁగా జని రయంబున వచ్చిన నిన్నుఁ గాంచుటన్." 705

క. స్మితవదన యగుచు సతి శ్రీ, పతిఁ గని యతిశూరులైన బర్హిర్ముఖసం
తతితో జరిగిన యుద్ధ, స్థితి విన మతివొడమెడు న్వచింపుము కరుణన్. 706

క. నానాసేనాయుతసే, నానియు బలవంతుఁడై తనరినట్టి శచీ
జానియుఁ దక్కుంగల సే, నానికరము గల్గఁగా రణము భరముగదా. 707

ఉ. అందఱు నొక్కయొద్దు నిటలాంతరవిస్ఫురదుగ్రహేతికా
స్పందకృశానులోచనుఁడు శర్వుఁ డొకం డొకయొద్దు; వారితోఁ
గ్రందెటులయ్యెఁ జెప్పుమనఁగా విని శౌరి స్మితాననాబ్జుఁడై
సుందరితోడ నద్దనుజుచొప్పునఁ బల్కెను నేర్పుమీఱఁగన్. 708

మ. దళదంభోజదళాక్షి! విన్ము సమరోదంతంబు వాక్రుత్తు నే
జలజాతాప్తవిరోధి పోరనెడ వర్షంబయ్యెఁ బూర్ణంబు సం
కులయుద్ధంబున భ్రమించి రయ్యఖిలరక్షోనాయకు ల్లోక మా
కులమయ్యె న్విధి చేసె మమ్ము విగతక్రోధాత్ములం జెచ్చెరన్. 709

ఉ. ధాత యనుజ్ఞఁ బూని విబుధప్రభురాజ్య మొసంగితిన్: శివా
నేత యథేచ్ఛగాఁ జనియె, నే నరుదెంచితి నిన్నుఁ జూడ సం
ప్రీతి మెయిం బనింగొనిరి వేల్పు లటంచు లతాంతగంధవి
ఖ్యాతివిశాలమై తనరుచోఁ దలిమంబునఁ బండెఁ గాంతతో. 710

క. అతఁడు నాతరుణీమణి, యాతనితోఁ గూడి కలయునప్డు సుఖము పూ
ర్వేతరముగఁ గని వెఱికి, త్పాతురతం బలికె విట్టులంచుచున్ హరితో. 711

చ. మతకరి చంద మేర్పడియె మానుగ నీయెడ నాపతివ్రతా
వ్రతమును కొల్లపుచ్చితి వెవండవు నీ వెఱుగంగఁజెప్పు మం
చతికఠినంబుగాఁ బలుక నప్పుడు శాపభయంబుచేత నై
జతనువు పూని మాధవుఁడు చానకుఁబొంగట విల్చె నంతటన్. 712

సీ. వచ్చనివన్నెదువ్వలువపై వలెవాటు • మదుటఁ గస్తురిబొట్టు పొదలువాని
రహిమించు కౌస్తుభరత్న మురంబున • నొడలెల్లఁ దొడవులు దొడరువాని
నల్లని మొగులుల మల్లసంబాడెడు • మైచాయ మిఱుమిట్లు మలయువాని
మొలకన వ్వొలపెడు మోముదమ్మియు వన • మాల గళంబునఁ గ్రాలువాని

గీ. దేవదేవునిఁ గాంచి సందేహ మెడలి • మూర్ఛఁగొని చేతనత్వంబుఁ బొంది మరల
శౌరిఁ గన్గొని పల్కె నాసారసాక్షి • కోపపరితాపములు మదిఁ గుందఁజేయ. 713

మ. కృప యొకింతయులేక యుండు టిది చన్నే! నీకు నొక్కింతయే
నపరాధంబు నొనర్పఁ డట్టిఁడు మదీయాత్మేశుఁ డన్వర్థమై
కపటోపాయముఁ బూని వాని ననిలోఁ గాఁజేప తీ వక్కటా
యుపలప్రాయమొ నీహృదంతరము? మేలోర్వంగఁ జాలోవదో; 714

క. దోషం బెఱుఁగని నాపతి, రోషముతోఁ జంపితీవు క్రూరుఁడ వగుటన్
బాషాణత్వముఁ బొందుము, భాషలు వేయేలయంచుఁ బల్కెన్ బెలుచన్. 715

క. తరుణి శపియించి యిట్లతి, కరుణము దోఁపంగ నేడ్వఁగడఁగిన విని యా
కరుణారససాగరుఁ డగు, హరి యిట్లని యానతిచ్చె నాసతితోడన్. 716

మ. ముముదాఁ జేసెను శంఖచూడుఁడు తపంబు న్నిన్నుఁ గామించి నీ
వును నన్గూర్చి తపంబొనర్చితివి పూవుంబోఁడి యద్దాన నీ
దనుకన్ దానవుఁ డిచ్చ నిన్గలసి మోదంబంది యీల్గెఁ; సమ్మదం
బున నీదేహముపీడి నిశ్చలసుఖంబుం బొందు నిశ్చింతతో. 717

క. నీ వొనరించిన తపమున, కీవును ఫలమందు టొప్పు నెట్లును సతి యీ
మై వీడినంతటనె నా, దేవివి కాఁగలవు నీవు దివ్యతనువుతో. 718

క. చిరకాలము నాతో సు, స్థిరభోగము లొందవు నీవిసృష్టమగు కళే
బరమది గండకి యనఁగాఁ, బరఁగును బుణ్యప్రదప్రవాహిని యనఁగన్. 619

వ. నీ పెన్నెఱిగుంపు తులసినా దవరి త్రిలోకీజనతామనతాపత్రయలతాలవిత్రంబగు పత్రలతాంతంబులనొప్పి తత్పత్రసుమంబుల దేవతారాధనం బొనర్చినవానికి సర్వకామదంబై యొసంగు; గోలోకవిరజాతీరరాసబృందావనంబులను, చందనచంపకమాధవకేతకీమాలికామాధవీకుందకురువకవకుళముఖానేకలతాపరివేష్టితంబైన యావాసంబు నీకగుఁ; దులసీతరుమూలంబున సమస్తదేవతీర్థంబులు నెలకొనియుండుఁ; దులసీదళసంస్పర్శనమాత్ర నరుండు ఘోరదురితక్షయసిద్ధిం బొందుఁ; దులసీపత్రతోయసేవనంబువలనఁ గోటితీర్థంబులఁ గ్రుంకులిడిన ఫలంబు దొరకొనుఁ; దజ్జలంబుల నిష్టదేవాభిషేచనంబు లొనర్చిన సుధాఘటసహస్రాభిషేకంబున కెక్కుడు ఫలంబు వెక్కొనఁజేయు. కార్తికియం దొక్కతులసీదళంబు పాత్రున కీగి మాత్రంబున గోసహస్రదానఫలంబు లభియించు; మృతికాలంబునఁ దులసీపత్రతీర్థం బించుక సేవించు నరుఁడు నిరస్తసమస్తకిల్బిషుండై శాశ్వతవిష్ణులోకనివాసుండగు. నిరతంబుఁ దులసీతీర్థంబు సేవించువాఁడు లక్షాశ్వమేధఫలంబు లనుభవించు; దులసీదళధారులును దత్కాండనిర్మితమాలికాధారులును నిరతవైకుంఠనివాసులై నీరోగంబులగుభోగంబు లనుభవింపగలరు; తులసీదళంబిరుపై దొలంగం ద్రోఁచిన నరుండు కాలసూత్రంబునంబడి యాచంద్రార్కంబుగా యాతనలం బొందుచుండుఁ; దులసి ముంగల మిథ్యాశపథంబులు పలికినవాఁడు కుంభీపాకంబునఁ గూలుఁ; బూర్ణిమా

మాద్వాదశీ సంక్రమణములఁ దైలాభ్యంగనం బొనర్చునేని త్రిసంధ్యలందులసీపూజా పరతంత్రుండగు నరుండు హరిపార్శ్వవర్తియై యుండు. నీవు ద్వీపినీరూపంబున లవణాంభోరాశికి దేవివై యుండుతతి నీ శాపంబునఁజేసి నేనును భరతవర్షంబున శైలరూపధారినై గండకీతీరంబున వసియింతునని చెప్పి యంతర్ధానంబు నొందె నవపుడు, 720

## సావిత్రీ పూజాది కథనము.

క. పావనమై మీఱిన తుల, సీవృత్తాంతంబు వింటిఁ జెప్పు లలరారన్
సావిత్రికథను విన నెం, తే వేడుక వొడమె దానిఁ దెల్పు మహాత్మా. 721

గీ. ఎవనిచేత సావిత్రి యుద్భవముఁజెందె, వేదమాతృక యను వార్త వెలయనేల
మొదల నెవ్వాఁడు పేసెఁ దత్పూజనంబు, బిదపఁ దత్పూజనంబుఁ గావించిరెవరు

క. నా విని నారదమునికిం, దా వినుపం గడఁగె నిట్లు నారాయణుఁ డా
సావిత్రిచరితమును విను, మా వేదసవిత్రి యన యథార్థము వత్సా. 723

చ. మొదలను దత్త్రయీజనని పూజనముం బొనరించె భక్తిలోఁ
గుదురఁగ ధాత ప్రాఁత పలుకు ల్వచియించె; నటన్ సమస్తకో
విదులు భజించి; రశ్వపృథివీపతికొల్చె నవంతరమ్మునన్
బదపడి నాల్గువర్ణములవారు భజించిరి ప్రేమమీఱఁగన్. 724

క. అన నారదుఁ డానారా, యణునింగని యిట్టు లనియె నశ్వపతి యనం
గ నెవం, డతండు సావి, త్రిని బూజించుట యదెట్లు? తెలుపు మహాత్మా. 725

వ. అనవుడు నారాయణుం డిట్లు వచించెఁ దొల్లి భద్రమండలమ్మున నశ్వపతి యనురాజు ధర్మనిరతుండును రిపుశాసకుండును నై రాజ్యం బొనరించువాఁడు. 726

క. మాలతి యనఁగా నొప్పెడు, లీలావతిఁ దొల్లి శౌరి లిబ్బులచెలియకా
బోలి వరించెను నాసతిఁ, బోలిన పువ్వారుఁబోఁడిఁ బొడఁగన మెచటన్. 727

క. ఆసతికి దైవయోగము, చే సంతతి గలుగదయ్యెఁ జిత్తములోనకా
దా సంతతిఁబొంకెను నెం, తే సంతాపింపఁదొడఁగె దేహము దఱుఁగకా. 728

ఉ. పుత్రులు లేరటంచు మది పొక్కుచునుండి వసిష్ఠునాజ్ఞ సా
విత్రిని భక్తిఁ గొల్చియును బిడ్డలఁ బొందఁగలేక తా నహో
రాత్రము మానసంబున భరంబుగఁ జింతవహింపుచుండె నీ
ధాత్రిని బుత్రులం గనని తన్వికిఁ జింతయనంగ నద్రిమే. 729

చ. నిరతము చింతచేఁ జివుకు నీరజలోచనఁ గాంచి యశ్వభూ
వరుఁ డను నీరమేది తగవా మగువా నెగు లూవః నింక నే
వెరవుననేవియుఁ గా శ్రుతిసవిత్రిని గొల్చినఁ గల్గు పుత్రుఁ డం
చురువడి బోధ చేసెను జయోన్నతి మీఱఁగ పారసాక్షికిన్. 730

క, సావిత్రీపూజనమును, గావింపఁదలంచి బుధనికాయంబులతో
దేవేరితోడఁ జనియెను, భూవరుఁడు తపంబుసేయఁ బుష్కరమునకున్. 731

మ. సతితోడన్ శతవర్షము ల్నియతిమై సావిత్రిఁ బూజించియున్
సుతులం గాంచఁగలేక యాతఁడు కడు న్శోకించుచున్నంత నీ
పతిభక్తిం బదిలక్ష లెక్కరణి గాయత్రిన్ జపింపంగ వాం
ఛితముల్ పేకుఱునంచుఁ బల్కొకటి దోఁచెన్ వ్యోమమార్గంబునన్. 732

క. అచ్చోట తయ్యవసరమున, విచ్చేసెఁ బరాశరుండు పృథివీపతి యా
సచ్చరితుని కర్ఘ్యాదిక, మిచ్చి శుభప్రశ్న లడిగె నేచినభక్తిన్. 733

వ. అంత నాపరాశరుండు సంతసించి రాజున కిట్లనియె. 734

క. రాజర్షీ ! వినుము నీవీ. యోజను సంకల్పసిద్ధి నొందెదు గాయ
త్రీజపముం బదిలక్షలు, గాఁ జేసిన నరున కెల్ల కామ్యము లబ్బున్. 735

సీ. ఒకమాఱు గాయత్రి నచ్చరించినచో న • హర్భవంబగు పాప మణఁగిపోవుఁ
బదిమార్లు గాయత్రి పఠియించినంతనే • పాపం బహర్నిశాభవ మడంచు
వేమార్లు జపియింప వృజినంబు వత్సరా • ర్జితమైన నపుడ నశించిపోవు
లక్షగాయత్రి దలంచిన జన్మకృ • తంబగు బలుదురితంబుఁ దొఱఁగు

గీ. అన్యజన్మజమగు పాప మణఁగును దశ • లక్షలు స్మరింపఁగా శతలక్ష లాత్మ
నెలకొలుప సర్వజన్మసంకలితమైన • పాతకం బపనీతమౌ భూతలేంద్ర. 736

చ. అనుదినమందు సంధ్య విడనాడక భక్తిని మూఁడువేళలం
బనిగొనిచేయుమీ వది శుభంబగు సంధ్యఁ ద్యజించువాని శూ
ద్రునివలె విప్రకార్యముల దూషితుగాఁ గనఁగొందు రట్టివాఁ
డొనరుచు పున్నె మానవుని నొందదుసూవె తురంగభూవరా. 737

క. యాజ్ఞింబున సం, ధ్యావందన మెవఁడుసేయు నాతం డుర్వీ
జీవన్ముక్తుండై తే, జోవంతుం డగుచు వెలయు క్షోణీనాథా. 738

మ. హరిమంత్రాహితుఁ డప్రజీవియును సంధ్యాహీనుఁ డజ్ఞానియున్
హరిపూజారహితుండు క్రూరుఁడు ఋతుస్నాతాన్నపీఠాన్నత
త్పరుఁడు న్వార్ధుషికుండు ధావకుఁడు విద్యాకన్యకావిక్రేతయౌ
ధరణీదేవుఁడు దర్పమేది విషరిక్తంబైన సర్పం బగుజా. 739

గీ. బ్రాహ్మణుండయ్యు సంధ్యను వార్పఁడేని, వాఁ డొసర్చిన పిండతర్పణముఁ గొనవు
పితరుః లవ్వాఁడు పూజఁగావించెనేని, సురలు గైకొన నొల్లరు ధరణినాథ. 740

క. ఇనుఁ డుదయంబును గాంచుట, యును నిద్దుర వీడనట్టి యుర్వీదేవుం
డనుపమకళాఢ్యుఁడైనను, విను కోఱలేని పాము విధముగ నుండుజా. 841

క. ఈవిధి గాయత్రీపూ, జావిధి యంతయును భూమిజానికిఁ దెలియం
గా వివరించి వెసం దన, యావాసంబునకు మౌని యరిగె మునీంద్రా. 742

ఉ. తాపసుఁ డేగునంతట ముదంబు ఘనంబుగఁ జెంది యశ్వధా
త్రీపతి మూఁడువేళల సరిత్తటమందు వసించి వేయివే
తేపలు సంజపూజనము దీక్షితుఁడై నెరవేర్చి లోనినం
తాపము వాయఁగా నభిమతంబును బొందె జగద్ధితంబుగన్. 743

వ. అది యెట్లన్న. 744

క. మిత్రప్రభాన్వితను సా, విత్రిని భక్తిప్రపత్తి వినుతించిన యా
ధాత్రీరమణునిఁ గని సా, విత్రియు దయమీఱఁ దల్లి విధమునఁ బలికెన్. 745

మ. క్షితిపాలోత్తమ ! నేనెఱుంగుదును మీచిత్తంబులం బొల్చు వాం
ఛితముల్ కూఁతును బొందఁగాఁదలఁచి చేసె న్నిష్ఠ నీకాంత స
త్ఫ్రుతుఁ బొందం దప మీ వొనర్చితివి సంతోషంబు వాటిల్లె వి
స్ఫుతనూజాతను బొందుమా, కడపటం బుత్రుండునుం గల్గెడుజా. 746

క. అని దీవించి చివాలునఁ, జనె నాసావిత్రి ధాతజగమునకు నృపుం
డును వనఁబోఁడియు నంతటఁ, జని రాత్మనివాసమునకు సంప్రీతిమెయిన్. 747

మ. చని యాదంపతు లిద్ద్వ రత్యధికనిష్ఠం బూని సావిత్రిపూ
జనముల్ సల్పుచునుండ నొక్కతఱి నాచంద్రాస్య గర్భంబునన్
వనితారత్న మొకర్తు పుట్టె శుభలగ్నంబందు సావిత్రి పేం
పున రాజిల్లుట నట్ల నామకరణమ్ముంజేసె రాజన్యుడజా. 748

క. లాలన మొప్పఁగ దాదులు, బాలికనుం బెనుచుచుండ వర్ధిల్లె శర
త్కాలాదిపక్షశశికల, పోలిక నంతంతకు న్రముజ్జ్వలకలలన్. 749

ఉ. మానవనాథు కూఁతు రసమానవిలాసవిభాసిరూపరే
ఖానవమోహనాంగియయి గానకళ న్నెఱిఁగల్గి సర్వధా
త్రీవరనాథమౌళిమణిదీధితిదీప్తపదాబ్జునిన్ రతీ
మానవతీమనోహరసమానవిలాసు వరింపనెంచుచున్. 750

మ. సరసాళీజనసేవ్యమానయయి యిచ్ఛాగోష్ఠి నుండంగ స
ర్వరసామండలిఁ బొల్చు రాసుతులలో రమ్యుండు కారుణ్యశాం
తరసామానమనస్కుఁ డంగభవసౌందర్యాన్వితుండౌ ధరా
వరసూనుండెవఁడొక్కఁ డొక్కఁ డరయుఁడు మీప్రజ్ఞల్ విచారింపుఁడున్. 751

మ. అని సావిత్రి వచింపఁగా నొక వయస్యారత్న మూహించి యి
ట్లనియె న్సర్వదిగంతరాఖిలధరాధ్యక్షాత్మజాతాళిలో
ననఘుం డాకృతిమీనకేతనుఁడు విద్యావంతుఁడు వీరుఁడున్
దినవాధప్రతిమానతేజుఁడు ద్యుమత్సేనాత్మజుండొఁ జుమీ. 752

చ. అతనికి సత్యవంతుఁడను సార్థకనామ మెసంగు వాని కె
వ్వతె సతియై నిరంతర మపారసుఖంబులఁ బొందనున్నదో
మతి కెఱుఁగంగరా దనిన మానవనాథతనూజ యెంతయున్
గుతుకముఁబొంది తండ్రికడకుం జని చెప్పెను దచ్చరిత్రమున్. 753

శా. భూమీశుండు తదీయజల్పముల కామోదించుచుం బుత్రికన్
ద్యుమత్సేనికి నిచ్చి పెండిలి శుభోదర్కంబుగాఁ జేసి యా
జామాతం గడుసత్కరించి వివిధాజానేయగాణిక్యనా
నామాణిక్యము లాదిగాఁగలుగు కానుక్ల్ పెక్కు లిచ్చెంగృపన్. 754

చ. కొమిరెకు నట్లుకామకలు కొల్లలుగాఁగ నొసంగి భర్తృదే
శమునకుఁ బంపఁగాఁ దలచు సందడినుండఁగ లేకలేక య
బ్రముగను గాంచి పెంచి యచిరంబుగఁ బెద్దగఁజేసినట్టి ప్రే
మముగల తల్లి ముద్దులకుమారిక నంకముఁ జేర్చి యిట్లనున్. 755

ఉ పుత్రులు లేకలేక తలఁపుల్ మునుముట్టఁగ నెట్టకేని సా
విత్రిని గొల్చి కాంచి నినుఁ బెంచియుఁ బెద్దగఁజేసి యిందిరా
పుత్రునిబోని నీమదికిఁ బోలినవానికిఁ బెండ్లిజేసి లో
కత్రయమాన్యుఁడై వెలసెఁగాదె భవజ్జనకుండు నేటికిన్. 756

ఉ. మానితవైఖరి న్మగనిమాటలకుం జవదాఁటకుండి యా
జ్ఞానుగుణప్రచార మది సద్వ్రత మంచుఁ దలంచి భర్తృసే
వానిరపాయవై సకలబంధుసుహృజ్జనకోటిఁ బ్రోవు మా
నౌనని లోకము ల్పొగడ నబ్బెడు దాన యశంబు పుత్రికా. 757

క. భావిశ్రేయఃపికకే, శీవనములు కలుషపవనలేలిహానముల్
జీవనములు జన్మత్రయ, పావనములు ప్రాణనాధుపదసేవనముల్. 758

శా. ఏపుణ్యంబు నెఱుంగ వింతకును బ్రాణేశుండు దైవంబు సు
మ్మీ! పుట్టింటికి మెట్టినింటికిఁ గదున్మేల్పేరు దేవమ్మ! సే
వాపారీణత నత్తమామలయెడన్ బాటింపు మాయమ్మ! నిన్
జేపే క్రమ్మఱఁ దోడితెచ్చెదఁ గుమారీ! చింతిలంబోకుమీ., 759

చ. అని విహితప్రకారమున నాత్మజకు న్మతిచెప్పి యంత జా
లిన నెఱిమించు గోట నవరించుచు ముద్దిడి వీడుకొల్పినన్
ఘనతరతూర్యరావము లఖండములై చెలఁగంగ నాథుతో
ననుదివసప్రయాణమున నాత్మపురి న్వసియించి యచ్చటన్. 760

ఉ. సంతత మాశుభాంగి పరిచర్యల నెంతయు నత్తమామలన్
సంతసమందఁజేసి పరిచారకులం దయఁబ్రోచి రేపగల్
కాంతునకున్ ముదం బొదవఁగా నతిభక్తిఁ జరించుచుండె ని
శ్చింతత సత్యవంతుఁడును జేడెను గూడి సుఖించెఁ బ్రేమతో. 761

మ. యువరాజై కవిరాజులన్ మనుపు నత్యుత్కృష్టకార్యంబులన్
భువి విష్కంటక మాచరించి యతులాభోగంబులం బొంది కా
లవిధిన్ రాజ్యముఁ గోలుపోయి పురివిల్వన్ సిగ్గుచేఁ దాపసా
టవికిన్ వృద్ధులు తల్లిదండ్రులకుఁ దోడ్పాటై చనెం గాంతతో. 762

క. వన్యాహారమొనర్చు చ, నన్యాదృశభక్తిఁ బితల నరసికొనుచు సా
మాన్యప్రక్రియ హాయగా, టక్కన్యామణిఁగూడి దినముఁగడపుచునుండెన్. 763

క. ఈరీతి సత్యవంతుఁడు, నీరజసఖుఁ డుదయశిఖరి నెలకొనుచుం గాం
తారమున ఫలసమిత్కుశ, లారసి తెచ్చుటకు జనకునానతిఁ జనుచో. 764

చ. అరవిమనంబు నాథువిరహంబు సహింపనిదౌటఁ గాంతుతో
నరిగెఁ దదీయపత్ని; యతఁడట్లు వనంబునకేగి యొక్కెడన్

మిరుహాముమండి జాతిపడి మేనుదొఱంగినఁ జిత్తమందు న
త్తరుణియుఁ జింతనొందక కతిధైర్యమున న్వసియించె ముంగలన్. 765

ఉ. కాటుకకొండఁబోలి తనుకాళిమదిక్కులఁ జిమ్మ చీఁకటుల్
దీటుకొనంగఁ బెల్లెరగలి న్వెవఁజల్లెడు కన్నుదోయియై
మాటికి మెల్కువారి విషమంబగు దంష్ట్రలు దీటుకొంచు న
చ్చోటికివచ్చెఁ గాలుఁ డొకశూలము కేలధరించి యుగ్రుఁడై. 766

క. మృతినొందిన రాసుతు నం, చితమతి నంగుష్ఠనిభునిఁ జెచ్చెరఁ గొనుచుం
బితృపతి క్రమ్మఱఁజనుఁచో, వెతఁగొనకయె తరుణి యముని వెనువెంట జనెన్.

క. తనవెంబడిఁ జనుదెంచెడు, వనిత న్వీక్షించి మధురవాక్యముల యముం
డను నిట్లు పాంచభౌతిక, తనువున నీవెందుఁబోవఁ దలఁచితి వబలా. 768

చ. మగనిని గూడివచ్చుటిఁక మానుము, మానుము పాంచభౌతికం
బగు తనువున్ విరాన హృదయాధిపుతోడఁ జనందలంతువే
మిగుల నశాశ్వతంబయిన మేనున నాపురి కిట్లు వచ్చుటల్
వగవగుఁగాదె నాపుర మనశ్వరమంచును నీవెఱుంగవే. 769

క. ఆయువు పిండిన నీపతి, కాయంబుఁదొఱంగె నిఁక స్వకర్మఫలములన్
నాయింట ననుభవించుట, కై యరుదేరఁగలఁ డింకఁ గలఁగకుము సతీ. 770

సీ. కర్మంబులనుజేయఁ గల్గును జన్మంబు • మఱిజనంబు బూరిసంపదలు గల్గు
నిడుమలు సంధిల్లఁ బొడవగుదుఃఖంబు • లడఁగును సౌఖ్యముల్ దొడరుచుండు
బౌరందరపదంబుఁ జూఱఁగాఁ గొనఁటబ్బు • బ్రహ్మపుత్రత్వంబు బడయనగును
హరిదాసుఁ డగును జన్మాదిహీనుండగు • నమరును సర్వకామ్యములసిద్ధి

గీ. పొనఁగు విష్ణుసాలోక్యాదిముక్తులెల్ల • విబుధమునిరాజమనురాజవిప్రరాజ
రాజశేఖరతావాప్తి రాజిలంగఁ • జెలఁగు నెయ్యెడలను జూడ జీవునకును. 771

క. ఇమ్మహిఁ జేసిన కర్మవ, శమ్మున సుఖదుఃఖములు యశమ్మపయశమున్
బమ్మెరయగు రూపము స, ర్వమ్మును గర్మమున ననుభవంబగుఁ దరుణీ. 772

చ. కడమయొకండు లేదిఁక జగంబున జీవునికర్మమూలమై
బడిబడి సర్వభాగ్యములఁ బ్రాప్తములొను నశించు దాన నీ
యొడయఁడు ధాత్రిలోనఁ దదనొంది చరించి గతించె; దీనికై
యడలఁగనేల గోలవయి యంగన! యూఱడుమింక నావుడున్. 773

క. కాలుని వచనం బాసతి, యాలించి ముదంబుతోడ నప్పుడు తనదౌ
గోలతనంబున వతనికి, జాలిం బుట్టించి యొక్క నందియు నడిగెన్. 774

వ. మహాత్మా! కర్మ మనునది యెద్దాన జనించు? దానికి హేతువెద్ది? తత్కారణం బెవ్వండు? ప్రాణంబులు బుద్ధియు జ్ఞానంబు నింద్రియంబులు ననునివి యెట్టివి? తద్దేవత లెవ్వి? జీవాత్మకుఁ బరమాత్మకుం గల్గిన తారతమ్య మేమి? యనుగ్రహింపవే యనుచు దండధరుంతు వెండియు నిట్లనియె. 775

చ. పరమపతివ్రతామణి శుభంబగు ప్రశ్నముఁజేసి తిట్టు లె
వ్వరు నను( గోరఁబోరు విను వారక కర్మఫలానుభావిమై
హరిపదభక్తిగల్గి తృణహాటకముల్ సరిగాఁగఁజూచు నే
నరుఁ డతఁడాధిమృత్యుజననప్రతిపక్షుఁడు ముక్తుడుం జూమీ. 776

గీ. వేదచోదితకర్మంబు విహితమగును, శ్రుతిరహితకర్మ మెపుడు సంగతముగాదు
హేతురహితంబు సంకల్పహీనమైన, దేవసేవయే పరమభక్తిప్రపంచబు. 777

వ. ఓసతీమణీ! భగవంతుండగు పరమాత్మయే కర్మస్వరూపుండు హేతుభూతుండు నగు. సదసద్భేదరూపంబగు జ్ఞానంబు నానావిధంబై పరఁగుచుండు; బుద్ధియు జ్ఞానబీజంబు; దేహికి బలరూపంబులు ప్రాణంబులు; రూపంబును జ్ఞానభేదంబై పరఁగుచుండుఁ; బ్రకృతిపరంబు సర్వవ్యాపకంబును నిర్గుణంబు నగునదియే పరమాత్మ యనంబడుఁ; బ్రాణదేహాదుల భరించునదియే జీవాత్మ యనఁబడు; నోపతివ్రతారత్నమా! దీన నీసంశయము దొలంగెఁగదా! యింక యపేక్షం బొమ్మనుడు సావిత్రి యిట్లను. 778

ఉ. ఎచ్చటికేగుదాన హృదయేశ్వరుఁడుం దగు జ్ఞానసింధువీ
విచ్చటమండఁ; జెప్పఁదగునే నొకప్రశ్నకు నుత్తరంబు వా
క్రుచ్చి యనుగ్రహింపుము వియాధిగ నావుడు దానిమాటకు
నెమ్మెచ్చి సతీమణీ! యడుగుమీ మది సంశయమంచు నిల్చినన్. 779

సీ. జీవుఁ డేకర్మంబు సేసి యేయేజన్మ • లందు దా మద్భవం బందుచుండు
నెట్టికర్మంబుచే నింద్రత్వముంగొను • నరక మెద్దాన సందర్భమగును
ఏ౹ ౹మమున ముక్తి చేకొనఁదగియుండు • గురుభక్తి యెద్దానఁ గుదురవగును
సుఖదుఃఖములఁ జేయఁజూచు నేకర్మమ్ము • లామయ మెద్దాన నావహించు

గీ. అంధుఁడును కాణుఁడును పంగు వంగహీనుఁ । డల్పజీవుండు దేనిచే నగుదు రిలను
పదవు లెద్దానివలన సంప్రాప్తమగును । దెల్పవే నాకు దయతోడ ధీవరేణ్య. 780

మ. సదయుండౌచుఁ గృతాంతుఁ డిట్లనియె నోసాధ్వీశిరోరత్నమా
పదుమూఁడేడుల ప్రాయపుంగలికి విద్వద్ జ్ఞానియోగీంద్రులకా
మదినూహింపనిప్రశ్నఁజేసె దిదియానందంబు చేకూర్చె నీ
కెది యిష్టం బది దెల్పు మిచ్చెదను నీయాత్మేశుఁబింగాకిఁకన్. 781

గీ. భర్తలేఁడటంచుఁ బరితాపమందకు, మఖిలసాధ్వులందు నగ్రగణ్య
వై నుతింపఁబడుదు వా రతిపోల్కి మాం, గళ్యసిద్ధి నీకుఁ గలదుసుమ్మ. 782

వ. అనవుడు సంతసిల్లి సావిత్రి యిట్లనియె. 783

ఆ.వె. సత్యవంతువలన సంతతి నాకును, నాదుమామకు నయనములు మఱియు
రాజ్యలాభమును దిరఁబుగ నాతండ్రి, కాత్మజనులు గలుగునట్లుగాఁగ. 784

వ. అనుగ్రహింపవలయు. 785

క. అనవుడు నట్లయ్యెడు నీ, మనమునఁ గలకోర్కు లని శమనుఁ డనఁగా దే
వనరులకర్మవిపాకము, వినిపింపుమటంచుఁబల్కె వినయముతోడఁగా. 786

ఉ. జీవుఁడు కర్మశేషములచే సుఖదుఃఖములఁగా భరించి నా
నావిధయోనులందు జననంబయి సంచితకర్మలోలతన్
దేవవిభుత్వము న్నరపతిత్వము భోగము రోగమందు రా
జీవదళాక్షి ! సూక్ష్మముగఁ దెల్పితిఁ దత్క్రమమెంచి చూడుమా. 787

వ. అనవుడు, 788

ఆ.వె. ధర్మరాజ ! యెట్టి కర్మంబు లొనరించి, త్రిదివలోకముఖ్యపదవులెల్ల
ధరణిజనులు గాంత్రు దయనానతీఁగదే, యనిన నతఁడువలికె నతివతోడ. 789

క. దానంబులందు నుత్తమ, దానము లోకమున నన్నదానముసుమ్మా
దానికిఁ గాలక్రమమును, న్యూనాధికవర్ణభేద ముండదు సుదతీ. 790

సీ. అన్నదానంబుచే నలవిష్ణులోకంబు । వస్త్రదానంబుచే వాయుపదవి
తల్పదానమునఁ జంద్రజగన్నివాసంబు । యానదానమునఁ దోయపతిజగము
దీపదానమున స్వాహాపాలువాసంబు । ఫలదానమునఁ ద్రిదివస్థలంబు
తిలదానమున పార్వతీధవావసథంబు । దంతిదానమున నింద్రత్వమబ్బు

గీ. కన్యకాదానమునను నక్షత్రనాథ, లోకమున పదునల్గురు నాకపతులు
దనుక స్వర్వైశ్యతోడ మోదమునమండి, ప్రియసతింగూడి జన్మము ల్వేయి గడపు.

గీ. ఉభయతోముఖమగు గోవు నొసగువాఁడు, హేమరత్నాదికంబుల నిచ్చువాఁడు
సప్తసంతానవిధులను సల్పువాఁడు, కోర్కి దీరంగ నిల్చు వైకుంఠమందు. 792

గీ. అశ్వమేధంబు రాజసూయంబుఁ జేయు, నరుఁడు సురపతి యర్ధాసనమున కర్హుఁ
డేమనుజునకు నేని దేవీమఖంబు, ముఖ్య మన్నిటికన్నఁ బ్రపుల్లనేత్ర. 793

మ. విమలోమాసుందరి! సర్వయజ్ఞముల దేవీయజ్ఞమే మేటియై
చనుఁ గావ న్సరసీజగర్భుఁడును నీశానుండు పద్మాక్షుఁడున్
మనువుం దక్షసనత్కుమారులును సన్మానించి కావించి రెం
దును దేవీమఖ ముత్తమంబనుచు నుద్ఘోషించు వేదంబులున్. 794

క. కావున ననుదినమందుం, దేవీపాదార్చనంబుఁ దీరిచి తగఁదగ
నైవేద్యము భుజియించి వి, జావాసముఁజేరి పుగనియాన విడువుమా. 795

వ. అనిన మహాత్మా! నరకకుండంబులు నానావిధంబుల మందునని వింటి వాని వేర్వేఱ
నెఱింగింపు మనవుడు నోసతీమణీ! దుష్కర్మంబు లొనర్చువారేగు నరకకుండం
బులు వహ్నితప్తవిణ్మూత్రదుస్సహాదులను నఖువదికుండంబులు గలవు. అచ్చట
భయంకరులును శక్తిహస్తులు దయాశూన్యులు పింగలోచనులునగు మదీయకింకరు
లనేకులు గలరు. అట్టి యాకుండంబులు విష్ణుభక్తులు యోగులు స్వధర్మనిరతులు
మున్నగువారు గన్గొనకయె యుత్తమలోకంబుల కరుగుదురు. 796

క. హరిసేవాపరతంత్రులు, వరయోగవిశుద్ధమతులు వ్రతులు తపస్విల్
ధర బ్రహ్మచారులును నీ, నఃకంబునఁ బడరువారు నాతివృజినుల్. 797

మ. బల మొక్కింతయులేని బంధువుల దుర్వారావిధి న్బాధితా
త్ములగాఁ జేసిన వహ్నికుండమునయందుం ద్రుంగి మైనెన్నియున్
గలుగున్ రోమము లన్నివర్షములదాఁక న్నిల్చి యామీఁద ను
చ్చలితుండై పశుయోనియందుఁ బొడమున్ జన్మంబులన్ మూడిటన్. 798

ఉ. ఆతపతప్తుఁడై కడుక్షుధాతురుఁడై ద్విజుఁడేగుదెంచెనే
నాతనిఁ గొంచుఁబోయి కడుపారఁగ నన్నముఁ బెట్టనట్టి యా
పాతకి తప్తకుండమునఁ బాల్పడి పెక్కుయుగంబు లుండి యా
భూతలమందు పక్షితనువుం గొని పొల్పును నేడు జన్మముల్. 799

చ. అమవసలందు శ్రాద్ధదినమందు నహస్కరువారమందు సం
క్రమణములందు వస్త్రములు క్షౌరయోగముఁజేయు మానవా
ధముఁ డలక్షౌరకుండమునఁ దాపముఁ జెందుచునుండి పెక్కుక
ల్పము లరుగంగ ధావకకులంబునఁ బుట్టును సప్తజన్మముల్. 800

చ. హరిహరహేమగర్భులఁ దదంగముల న్మతి వారిమంత్రముల్
పరిభవ మాచరించు నరపాలసుఁ డెంతయు శూలకుండమం
దఱువదివేలయేండ్లు పెను యాతనలం బడి కుంది పిమ్మటన్
ద్విరసనమై జపించి పరివేదనఁ బొందుచునుండు నుర్విలో. 801

గీ. దీవిఁ బోలి పాపార్తిదమైన కుండ, మింక నొక్కటిలేదు లే దిలను ; దేవిఁ
బరిభవించిన జనులకుఁ బాచితంబు, పాపముల కెల్ల మొదటిదై పరఁగుకతన. 802

చ. సుతులను దల్లిదండ్రులను సోదరులన్ గురువు న్పతి న్సవో
షితులను జేయనట్టి కొలచే గరికుండములోపలన్ శర
చ్ఛృతమగునంతకు న్నిలిచి తద్గరమున్ భుజియించుచుండి యం
చితగతి భూతమై షోడమి చేద్పడుచుండు నిరంతరం బిలన్. 803

మ. అతిథిన్ గాంచి తిరస్కరించునరుఁ డయ్యావేళలం దా నొసం
గు తిలాంబుల్ గొననొల్లకుంద్రుపితరుల్ క్రూరవ్యథంగుందుచున్
శతవర్షంబులు దూషికాంతమునఁ బైశాచాకృతిం దాల్చియున్
శతవర్షంబులు ధాత్రి ద్రిమ్మరి తుదిన్ ధన్యత్వముం బొందెడున్. 804

మ. మును దా నొందొక యర్థికిచ్చిన ధనంబుం గ్రమ్మఱన్ లాతికిన్
గొనుమం చిచ్చిన భీకరంబగు వసాకుండంబునం గూలి దు
ర్జవవం బొప్ప శరచ్ఛతంబు కృకలాసత్వంబుమం బొంది పె
వ్వవటం జెందఁగ మానవుండగుఁ గడున్ దారిద్ర్య మేపారఁగన్. 805

క. సురభూసురమాన్యంబులు, హరియించినయట్టి మర్త్యుఁ డఱువదివేల్వ
త్సరములు మలకుండికఁ బడి, పురువై జనియించి వగలఁ బొగులుం బిదపన్.

క. తనకై యన్యుని జంపిన, మనుజుఁడు వేవేలయేండ్లు మజ్జాకుండం
బునఁ బడి శశికిటికుక్కుట, తనువుల ధరియించు మూఁడుతడవలు పిదపన్. 807

గీ. బధిరుఁ గన్గొని కడుపరిభవముఁజేయు
నతఁడు కర్ణవిట్కుండము నందుఁ గూలి

పెక్కువేలేండ్లు పొక్కుచుఁ బిదప నంగ
హీనుఁడుం బధిరుండునై యిలను బొడము. 808

క. వ్రతముల నుపవాసములం, బితృదినముల ముండనంబు విధువనము ననం
గతముని వీడని మనుజుం, డతఁడల నఖకుండమందు నార్తింజెందున్. 809

చ. పదఁతిరో కేశయుక్తమగు పార్థివలింగముఁ బూజసేయువాఁ
డదలుచుఁ గేశకుండమునయందు వసించి దురంతచింతలన్
బడిపడి భూరి కోపగరిమన్ శతవర్షము లేగునంతఁ దాఁ
బొడముచు మ్లేచ్ఛుఁడై పిదపఁ బుట్టును రాక్షసయోనియందిలన్. 810

గీ. విష్ణుపదమునఁ బిండ మర్పించనట్టి. మానవుం డాత్మలోమప్రమాణవత్స
రమ్ము లయ్యస్థికుండనరకమునఁ బడి, కుక్కుటంబయి పిమ్మటఁ గుంభజుఁ డగు.

క. వేఁకటియగు తనసతి ను, ద్రేకంబున నెవఁడు రతులఁ దేల్చు నతం డ
స్తోకవ్యధ నూతేండ్లు భ, యాకరమగు తామ్రకుండమందు వసించున్. 812

గీ. కృష్ణసర్పంబులను జంపు నెవ్వఁ డాతఁ, డయుతవర్షము లహికుండమందు సర్ప
మలము దిని మఱి సర్పజన్మంబుఁ బొంది, పిదప దానవుఁడై సంభవించు ధరణి. 813

చ. జడియక తేనెటీఁగలను జంపి తదార్జితమైన తేనె గ్రో
లెడు జడు మద్భుటాళి యవలీల విషహ్రదమందుఁ ద్రోయఁగా
నడలుచు దంశభక్షితుఁడు నౌచు ననేకశతాబ్దముల్ చనన్
పుడమిని మక్షికాకృతిని బొల్చు యనంతరమందు శుద్ధుఁడౌ. 814

ఉ. నేరములేనివాని నవనీసురు దండ్యులఁజేయువాఁడు దు
ర్వారణవజ్రదంష్ట్రికల భక్షితుఁడౌచు క్షణక్షణం బహో
కారముఁజేయుచుం గ్రమముగా వనసూకరకాకజన్మముల్
ధారుణి నెత్తిపిమ్మట నతండు శుచిత్వముగాంచు మానినీ. 815

చ. విసమిడి నిర్దయత్వమున విప్రుని ప్రాణముఁ గొన్నయట్టి పా
లసుడు నిరంతరం బిడుమలం బడుచుం గరకుండమధ్యమం
దసుదుసురంచుఁ గూలి శతహాయనము ల్పన వేదుమార్లు మా
నిసియయి కుష్ఠరోగమున నెవ్వగలం బడి శుద్ధుఁడౌఁ దుదిన్. 816

ఆ. వె. నరము నొద్దునందుఁ జరియించువక్రాది, జంతువులను గడిమిఁ జంపువాఁడు
వజ్రకుండమం దనంతవత్సరములు, మసలిమసలి యంత మొసలియగును. 817

ఉ. పాపపుబుద్ధిఁజేసి పరభామను సంగవ నెమ్మొగంబు శ్రో
ణీపటిమంబుఁ బ్రేమ మది నెక్కొనఁ గాంచినవాఁడు ఘోరసం
తాపదకాకకుండమునఁ దద్దయుఁ గుందుచుఁ గాకలోకచం
చూపుటచూర్ణితాక్షుఁడగుచుం బదియౌనుగ్రమక్రమంబునన్. 818

శా. దేవద్రవ్యము దొంగిలించునరుఁ డార్తి న్వజ్రకుండంబునన్
దా వజ్రాగ్నులఁ గ్రాఁగి మిక్కిలి క్షుధాదాహవ్యథం గుంది రో
షావేశోద్ధతకింకరోత్కరకరవ్యాలోలవేత్రాహతిన్
వేవర్షంబులు బాధనొంది పిదప న్వీతాఘుఁడై ద్రిమ్మరున్. 819

క. ధర మ్లేచ్ఛుల సేవించెడు, ధరణీసురుఁడెంతకేనిఁ దఱుఁగనిచింతన్
బొరలును పసికుండంబున, నిరతము మద్భటుల దండవిహతులఁ బడుచున్. 820

ఉ. ధేనుగణంబు బ్రాహ్మణుల ధిక్కృతిఁజేసినయట్టి పాపపు
న్మానిసి వక్రకుండమున బ్రూన్పడియుండి దరిద్రుఁడు న్పతీ
హీనుఁడు నన్నపాయపరిహీనుఁడు నంగవిహీనుఁడు న్నవి
జ్ఞానవిహీనుఁడై మనుజజన్మముఁ గాంచును మానినీమణీ. 821

క. తిలజఘృతాదికముల మ్రుచ్చిలు మనుజుఁడు జ్వాలకుండశిఖల శతాబ్దం
బులు నిలిచి పిదప మూషక, జలచరజన్మములఁ బొంది చను శుద్ధుండై. 822

క. పరిమళమగు ద్రవ్యంబుల, హరియించిన దగ్ధకుండమందు న్వేవ
త్సరములు పడి దుర్గంధము, భరియించును మర్త్యుఁ డగుచుఁ బదిజన్మములన్.

మ. దొరలం దిట్టిన నన్యుఁగొట్టిన దరిద్రు న్నిందఁగావించినన్
బరదోషంబుల మెచ్చిన న్విబుధులం బ్రార్థింపకున్న న్నరం
తరసూచీముఖవిద్ధుఁడై త్రియుగముల్దాఁక న్వ్యథంజెందుచు
న్దర ముమ్మాఱులు సర్పవృశ్చికములై ధన్యుండగుం బిమ్మటన్. 824

గీ. గోవు దప్పిని జలములఁ గ్రోలునపుడు
విఘ్న మొనరించు మనుజుఁడు విపులతప్త
జలముగల గోముఖంబున లులితుఁడగుచు
నొక్కమన్వంతరం బట్టులుండవలయు. 825

వ. వరుం డిట్లు తన సుకృతదుష్కృతకర్మంబుల కెట్లును ఫలం బనుభవింపక పోరాదు సూవె; ఇంక నీవేమి యడిగెదు ? చెప్పుమనిన సావిత్రియు. 826

గీ. ఓ మహాభాగ ! సర్వజ్ఞ ! యొక్కఁడింకఁ, బ్రశ్నఁ గోరెద నానాపురాణసార
మఖిలసమ్మత మభయంబు, సుఖకరంబు, కర్మవిచ్ఛేదకం బెద్ది కలదొ చెపుమ. 827
వ. అనవుడు,
గీ. ధర్మశాస్త్రాదికముల వేదంబులం ద. దంగములను బురాణేతిహాసములను
పారమగు పంచదేవతార్చనము మఱియు, జన్మమృత్యుజరాదినాశనకరంబు. 829
గీ. పరమపదసౌధమునకు సోపానపంక్తి, భక్తిభూజంబునకు నాలవాల మఖిల
సిద్ధులకు కారణంబు సంసృతిపయోధి, తారణము పం దేవతాతర్పణంబు. 830
మ. పరదేవీపరిపూజనంబు మదిలోఁ బాటించువాఁడు న్నిరం
తరము న్విష్ణుపదాబ్జయుగ్మ మెదలో ధ్యానించువాఁడు న్వినా
నరకద్వారముఁ జూడకుండఁ దొఁకఁ దెన్నం గల్గనే ధాత్రిలో
నరసంఘంబులకు న్మదీయపురము స్సన్గోకపోవ న్సతీ ! 831
క. దేవీభక్తుల శ్రీహరి, సేవాసక్తుల గిరీశసేవకులఁ గనం
గా వైనతేయుఁగను మర, గావళిపోలికను మవ్వటాళి యడఁగెడున్. 832
చ. క్షితిని దదీయభక్తుల స్పృశించిన వారల పాపజాలముల్
హతమగు దావపావకమునంటిన శుష్కతృణాళిపోల్కి నం
తతమును వారిఁగొల్చెడి జనంబులు శాశ్వతపుణ్యమండల
స్థితిఁ గొను టబ్రమే ! యది త్యజించిన మత్పురిఁ జేరకుందురే. 833
క. నావిని సతి యిట్లను పిత్ర. దేవా ! పాపాత్ము లెట్టిదేహంబులతోఁ
దావకపురి కేతెంత్రు మ. రేవిధమునఁ గష్టములు సహింతురు చెపుమా. 834
వ. అనవుడు, 835
చ. కృతమగు పాంచభౌతికశరీర మశాశ్వత మగ్నిభస్మసా
త్కృతమగు జీవు డంత బొటవ్రేలు ప్రమాణముగల్గినట్టిసూ
క్ష్మతనువుతోడ నెమ్మెయిని సంశయమందక దుఃఖియై పురా
కృత మనుభూతిఁగాంచు నసికీలిశరాదికబాధ్యమానుఁడై. 836
క. ఓసాధ్వీమణి ! నీవు బ్ర. యాసంబున నింతదనుక వరుదెంచితి వో
మ్మీ నదనమునకు నాయా, వాసం బికఁ జేర రెట్టివా రిబ్బంగిన్. 837
వ. అనవుడు, 838
గీ. భర్త యెచ్చోటి కేగిన భార్య యచటి. కరుగు టుచితంబ కావి యన్యాయమగునె
హరిహరబ్రహ్మలకు దానినడ్డగింపఁ, దరమె నీవు నెఱుంగవె ధర్మరాజ. 839

మ. అనుచు న్వార్ధి గభీరతన్ బ్రబలధైర్యంబు న్మహాసాహసం
బునుగాఁ బల్కినఁ జూచి దండధరుఁడుం బూర్ణానుకంపాఢ్యుఁడై
చనమీ పీ పతితోడ నిచ్చితననన్ సంతుష్టయై భర్తతోఁ
జనియెన్ స్వాశ్రమ మత్తమామలఁమహాశ్చర్యంబుతోఁజూడఁగన్. 840

వ. అవి వచించుటయు. 841

మ. అల వైకుంఠమునందు శౌరి యురమం దక్రాంతవిక్రాంతి నొం
దు లతాంతాయుధుతల్లి కల్మిచెలి పాథోరాశిగర్భంబునం
గలుగం గారణమేమి చెప్పుమనఁగా నారాయణుం డాదటన్
జలజప్రోద్భవసూతి కిట్లనియె నానందంబు సంధిల్లఁగన్. 842

శా. దుర్వాసోమునిదత్తశాపమున సద్యోభ్రష్టలక్ష్మీకుఁడౌ
గీర్వాణాధిపుఁ బాసి లచ్చి హరిచక్కంజేరె బృందారకుల్
స్వర్వాసంబులు వీడి శోకమెదఁ బర్వన్ ధాతతో పీతిమై
సర్వంబు న్వినిపించి రచ్యుతదిదృక్షాసక్తచిత్తాబ్జులై. 843

ఉ. ఎల్లసురల్ విరించియు వహింప సహింపఁగరాని నెవ్వగన్
మెల్లనఁబోయి శౌరిఁగని మించినభక్తి నమస్కరించి మో
మల్లనవాంచియున్న చతురాస్యుఁడు వీనవవోనివంత లో
పెల్లియొనర్ప నింద్రుగతి చెప్పనకు న్వినిచె న్నయంబునన్. 844

ఉ. అవనజేక్షణుండు జవితాదరుఁడై సిరి బిల్వఁబంచి యా
దేవి విజాంశమాత్ర జలధిం బొడమ న్నియమించి ధాత సం
భావితుఁ జేసిపుచ్చిన నమందరయంబున వార్ధిదచ్చి దై
త్యావళి గెల్చి లక్ష్మిఁగొని నాకమునన్ సుఖులైరి దేవతల్. 845

వ. అవిన నారదుం డిట్లనియె. 846

మ. చతురామ్నాయరహస్యవేది శమితస్వాంతుండు దుర్వాసుఁడా
శితిభృద్భేదికి శాపమేమిట నొసంగె న్వేల్పులుం దైత్యులే
గతి వారాశిని ద్రచ్చి రాసిరి గొవంగా వేల్పు లెట్లోపి రా
వతియీవే వినవేడ్కయయ్యెడు నన న్నారాయణుం డిట్లనెన్. 847

క. జంభారి మద్యపానవి, జృంభితుఁడై వెండికొండశిఖరంబున సం
రంభముమీఱఁగ విచ్చలు, రంభాసంభోగకేళిరతుఁడై వెలసెన్. 848

ఉ. వాసవుఁ డంగజజ్వరనిబాధితుఁడై యలరంభ గూడి కై
లాసమున న్సదారతికళాకుతుకంబున దంతినెక్కి యు
ల్లాసమెలర్పఁ దద్గిరివిలాసములం గను నొక్కవేళ దు
ర్వాసుఁడు కృత్తివాసుఁ గను వాంఛయెలర్పఁగఁబోవుచుండఁగన్. 849

ఉ. పీతిదలిర్ప నవ్విబుధనేతయు నేనుఁగు డిగ్గి శిష్యసం
ఘాతసమేతుఁ డమ్మునికి గారవమొప్ప నమస్కరించినన్
బ్రీతినొసంగె మౌని నగభేదికి ఘోరరుజాజరాంబుభృ
ద్వాతము నిత్యసంశమితపాతకజాతముఁ బారిజాతమున్. 850

ఉ. మౌని యొసంగినట్టి కుసుమంబును దా నయపేది యాశచీ
జానియు హస్తిమస్తమున జాఱఁగవైచె సుమప్రసక్తి న
య్యేనుఁగు తేజుచేతఁ గమలేశసమాకృతియై రయంబునన్
గాననవాటికిం జనియెఁ గానఁగరాక బలాసురారికిన్. 851

శా. హాలాస్వాదనసంప్రమత్తుఁడగు నయ్యాఖండలుం డెంతయే
నాలోచింపక పారిజాతకుసుమం బాహస్తిహస్తంబునన్
గూలన్వైచినఁ జూచి లేచి మునియుం గోపస్ఫురద్భ్రూకుటీ
వ్యాలోలాననుఁడౌచు నిట్లనియె జంభద్వేషిఘూర్ణిల్లగన్. 852

ఉ. కానవు వైభవాంధ్యమునఁ గావరమెత్తినతంబు మద్యమున్
బానముజేయు చొక్కి వెలభామినిగూడి రమించుచుండి దు
ర్మానము పేర్మి నమ్ము నవమానితుఁ జేసితి పూవొసంగినన్
దానిని హస్తిమస్తకమునం బడవైచితి దేమి దుర్మతీ. 853

ఉ. వెన్నున కాదరంబుగ నివేదితమైన పదార్థ మద్దినే
ని న్నయమూని దానిని గణించి భుజించిన నెట్టివాఁడు శుభా
భ్యున్నతి గల్గఁగాని కొని యూరక పాఱఁగవైచెనేని ని
ర్భిన్నసుఖస్థితుండు నవివేకియునౌ నిల బ్రహ్మహాండగున్. 854

క. హరి నైవేద్యాస్వాదన, నిరతుండగు నరుఁడు విష్ణునిభుఁడై వెలయున్
ధరయుఁ బవిత్రతఁ గనుఁ ద, చ్చరణాబ్జరజం బొకింత తను సోఁకినచోన్. 855

క. ఏయెడ హరి నైవేద్యముఁ, జేయక భుజియింపఁ దలఁ భుజించినమేనిం
బాయును సిరియును సతతా, పాయంబును గల్గు రోగబాధితుఁడు నగున్. 856

వ. వేయేల హరికి ననివేదితంబయిన పదార్థంబు యథార్థంబుగ మాంసతుల్యంబు; పుంశ్చ ల్యన్నవీరాన్నశూద్రాన్నంబులును జికిత్సకద్విజాన్నంబును దేవలాన్నంబు యోని జీవులయన్నంబును కన్యావిక్రయి లయన్నంబును నుచ్ఛిష్టాన్నంబును, శవదాహ కాన్నంబును నదీక్షితాన్నంబును మంత్రద్రోహులయుఁ గృతఘ్నులయు విశ్వాస ఘాతుకులయు మిథ్యాసాక్షులయు నన్నంబు హరికి నివేదితంబయినఁ బదపడి భుజిం పందగు; విష్ణుసేవాపరుఁడైనవాఁడు శ్వపచుండైనను వంశశతం బుద్ధరింపగలండు: హరిసేవాహీనుఁడు బ్రాహ్మణుండయ్యును స్వరక్షణోపాయాపాయుండగు నజ్ఞానం బున నెయ్యనవిష్ణునిర్మాల్యంబు కొండొక దాల్చినచో నిరస్తసమస్త కిల్బిషుండగు: నిది నేరక, 857

క. సుమనోవరుఁడ నటంచును, సుమనోహరమైన యట్టి సుమనోవరమున్ బ్రమదంబున నొసఁగంగాఁ, గుమతీ! విడిచితివి కుంభికుంభమునందున్. 858

మ. వయమొప్పన్ హరిపూజఁజేసి హరికి న్నైవేద్య మర్పించి స
న్నియతిం గాలముఁబుచ్చువాఁడను నను న్వీక్షించినన్ మిత్తియున్
భయముంజెందు జరాయుజ ల్వెఱచు నావైవస్వతుండున్‌గత
స్మయుఁడై పాఱెడు నన్ను నేల గణియింప న్నాకు నో దుర్మతీ. 859

క. పీతాత కశ్యపుండని, ఖ్యాతచరిత్రుఁడు గురుఁడు బృహస్పతి యనియున్ బోతరమునఁ జరియించెద, వే తాపసినంచు నెఱుఁగవే దుశ్చ్యవనా. 860

ఉ. ఎందఱు పీకుఁ బ్రాపయిన నింతయులేదు భయంబునాకు న
న్నిందు నవజ్ఞఁజేసితి వహీనతపోబలశాలినంచు నా
యందు నయంబుఁజేర్ప కటులౌటను మిమ్మల జేరదింక నా
యిందిరయుం దిరంబ కమలేశ్వరు మందిరమందు నిల్చెడున్. 861

ఉ. పారెకుఁ గోప మేపుగని శాపమొసంగిన యట్టి యానిరా
బారులరాయనిం గని యపారభయంబున మ్రైఁజెమర్పలోఁ
గూరిన వంతలం బొగిలి కుందుచుఁ దాళఁగఁజాల కప్పు డు
ద్వైరవమొప్ప మొఱ్ఱయిడె శైలవిహారులు తత్తఱింపఁగన్. 862

క. డెందము వగలంగ వానం, క్రందముఁ దామౌనిశాప రచనాగతి నా
క్రందన మొనరించుచు సుర, వందితుఁడయ్యును మునీంద్రుపదములఁ బడియెన్.

ఉ. పోయినకల్మిఁ గోరుటలు పోలదు నాకిఁకఁ గల్మి బుద్ధ్యప
ప్రాయము దానిచేఁ గడు నపాయము గల్గుచునుండుఁ గాన నే
నీయెడ నిట్టిశాపము సహించితి నెంచితి బంధమోక్షమున్
జేయఁగ నాయెడం గరుణఁజేయుము చేయుము జ్ఞానదానమున్. 864

వ. మహాత్మా! సమస్త విపత్పరంపరాకారణంబై యపవర్గమార్గకంటకంబై భక్తిలతామూలచ్ఛేదంబై జ్ఞానవినాశననిదానంబైన వైభవంబున నొక్కండు ప్రయోజనంబు గాన ననిన, మునీంద్రుండు సురేంద్రుంగాంచి సంపన్మత్తుండు సురాపానమత్తునిం బోలి బంధుపరివేష్టితుండయ్యును నవిశ్వసనీయుండగు; సంపన్మత్తుండు విషయాంధుండై రాజసతామసగుణోపేతుండై సత్వమార్గంబుం గనుంగొననేరండు; జీవలోకంబు ప్రకృతి పరంబయి దుఃఖార్ణవంబులఁ గర్మగతి మునుఁగుచుఁ దేలుచు నిర్మాణంబుం బొందనేరక మృత్యుశోకామయకారణంబులయిన జన్మంబుల ననేకయోనులందు మఱలమఱలఁ బుట్టుచు గిట్టుచు భక్తిమార్గంబున హరికరుణ వడసి కొండొకకాలంబునకు సద్గతిం బడయు శతసహస్రంబుల గణియింప నొక్కరుండు సంసారార్ణవతారణైకదక్షుం డగపడు సజ్జనుండు సత్వప్రధానుండై ముక్తిమార్గవిరోధంబైన రాజసతామసంబుల బారింబడక యనుదిన సేవ్యమానపరతత్త్వుండై యనశ్వరంబైన యపవర్గసుఖంబుం బొందఁగలండు; జీవుండెన్ని విధంబులను సంసారబంధమోక్షణోపాయంబుఁ జింతించుట లెస్సయగు; జన్మయోగంబునం జేసి యనశనుండై నిర్విఘ్నంబైన తపం బొనర్చినచో ముక్తిగలుగు ననిన సంతసించి మునీంద్రు వీడ్కొని వర్ధితవైరాగ్యుండై వృత్రవైరి యమరావతికిం జని యందు నెల్లకడలు దైత్యావృతంబులై విషమోపప్లవంబులై దుష్ప్రవేశంబులై యుండుటకు వెఱఁగుపడి భాషాకాంతున కయ్యుదంతం బంతయు నివేదింతునని పయనంబై చనుచుండి మందాకినియం దస్పందహృదయారవిందుండై యరవిందబాంధవున కభిముఖుండై సమాధినిష్ఠుండై యున్న బృహస్పతింగని కొంతవడి నిలిచిన. 865

ఉ. ఆగురుఁ డబ్జబాంధవున కర్ఘ్యము మొసంగి ప్రతీరభూమికిన్
రాఁగనె వాసవుండును ధరాస్థలి ఫాలము సోక మ్రొక్కి త
త్స్వాగత మాలకించి తనశాపవిధంబును దెల్పినన్ రుషా
వేగమనస్కుఁడై గురుఁడు వేలుపుఱాయని గాంచి యిట్లనెన్. 866

ఉ. అంతయు నే నెఱుంగుదు సురాధిప! యింతఁగ జెప్పనేల జ
న్మాంతరకర్మభాజనములై రథచక్రము వోవుభంగి న

త్యంతము చంచలంబులు శుభాశుభము ల్వేరవేది దీనికై
చింతిలనేటి కీగతిని జిత్తము చేర్పడఁ గాతరుండవై. 867

క. క్షితి నెల్లభూతములకుం, గృతమనుభో క్తవ్య మని త్రయిం గన వొప్పున్
గతజన్మభు క్తశేషము, వితయగునా దాని ననుభవింపఁగ వలదా. 868

గీ. జీవుఁ డొనరించు కర్మమే చేయఁజాలుఁ, గష్టసుఖములు దైన్యంబు కలిమి చెలిమి
స్వర్గలోకాధిపత్యంబు క్ష్మావిభుత్వ, ములును; దానికి నడలంగవలదు జనుఁడు. 869

క. దానము పాత్రున కీవలెఁ, గాని యపాత్రునకు నీయఁగా నశుభంబుల్
గానఁగ నగు దాత కడున్, న్యూనాధికభేదములు గనుంగొనవలయున్. 870

వ. నరుండు దేశకాలపాత్రానుసారంబుగా దానంబు లాచరింపవలయుఁ: దత్తదను రూపంబులగు ఫలంబులం బొందుచుండు చవుటినేలం జల్లిన బీజంబులు మంచి వైనము గేదారంబునుంబోలె సస్యాభివృద్ధినిం గొననేరనట్లు లపాత్రున కొసంగిన యీఁగియును ఫలహీనంబగుఁ గర్షకుండు సుక్షేత్రంబునుంబోలె దాతయు పాత్రు నన్వేషింపవలయు; సామాన్యదివసంబుల నొసంగెడు దానంబుననగు ఫలంబుకంటె నమవసలందును రవిసంక్రమణంబునందు నొసంగిన దానంబున ఫలంబు నూఱు మణుంగు లధికంబు; చాతుర్మాస్యలఁ బౌర్ణముల నొనర్చిన దానంబున ఫలం బనంతంబు; సూర్యచంద్రగ్రహణంబులఁజేసిన దానఫలంబు గణింప నలవికాదు; కుంభకారుండు మంటిచేఁ గడవలంజేయుగతి ధాతయు జీవుల కర్మసూత్రంబున ఫలంబు లొసంగుచుండు; సృష్టిస్థితిలయకారణంబయిన విధి హరిహరాకారంబుల బ్రకృతి పరుండై పరమాత్మ వెలుంగుచుండు. 871

క. ఆపద గలిగినయెడ లం, క్ష్మాపతి సేవించెనేని మేలగు భవసం
తాపము వాయు నటంచును, రూపించి వచించె తొల్లి రుద్రుఁడు నాకో. 872

క. అని పలికి శక్రు నాలిం, గన మొనరిచి సర్వసౌఖ్యకలితుఁడ వగుచున్
మనుమని దీవన లిడిన, న్మనమున హరిఁ బ్రణుతిఁజేసి మానితభ క్తిన్. 873

క. పురుహూతుండును కమలా, వరునకు వందనముఁజేసి భ క్తి గురుపుర
స్సరుఁడై వెడలెను వాణీ, శ్వరునిం దర్శింప విబుధసహితుం డగుచున్. 874

చ. గుఱవు విధాతలోకమునకుం జని కాంచనగర్భుఁ గాంచి త
చ్చరణసరజం బొకింత తపశంఖతలంబునఁ దాల్చి గోత్రభి

చ్చరితము విన్నవింపఁగ హసన్ముఖుఁడౌచు విరించి వల్కెనా
సురవరుతోడ నిర్మలవచోగరిమంబు తదార్తి వాయువన్. 875

శా. నావంశంబున జన్మమంది యమృతాంధస్స్వామినై యుండి యెం
తే వైదుష్యము నాబృహస్పతికి నంతేవాసినై కాంచి యి
ట్లావృత్తిఁ జరియించు నీవిటుల రోషం బూనఁగానేల కో
పావిష్టుండు విపత్పరంపరలచే నత్యాంతముం గుందఁడే. 876

క. జనని పతివ్రత జననీ, జనకుండు మ్మాతులుంచు ఛాంతులు జనకుం
డును విజితేంద్రియుఁ డగుచో, మనుజుం డెటు క్రోధి యగును మదిలోనైనన్.

వ. నరుండు పైతృకంబయిన దోషంబునను మాతామహదోషంబునను గురుదోషంబు
నను నిజంబుగ హరికి దోషియగు; సచ్చిదానందస్వరూపియగు పరమాత్మ భూత
దేహంబునందుండి వెడలునప్పుడు తత్కళేబరంబు శవంబునాఁ బరఁగు; జ్ఞాన
రూపుండగు శివుండును పరమాత్మకుఁ బ్రతిబింబంబు; జీవుండును విష్ణుప్రాణం
బయిన ప్రకృతియగు; నింద్రాదులు శక్తులు; పరమాత్మ జీవిశరీరంబు దొరంగునప్పు
డన్నియును జీవుని దొఱంగు; శివుండును శేషుండును నేనును విరాట్స్వరూపుఁడగు
విష్ణునకు ననువర్తులమయి యుండుదుము; మీరలు విష్ణుభక్తులయ్యును బరమ
భక్తుండగు దుర్వాసుం డొసంగిన కృష్ణపాదమ్యుతంబయిన పుష్పంబును కరిమస్త
కంబున వైచితివి. దైవోపహతుండ వగుట నాగజంబు నమదినంబును బూజింప
వలయు; భాగ్యహీనుండగు జనుండెవ్వరికిని రక్షింప సనర్హుండు. 878

క. హరి నిర్మాల్యము దొఱఁగిన, దురితంబున కల్మిబోటి దొలఁగెను జనుఁడీ
సరగున వైకుంఠమునకు, హరి నందర్శింపఁగా బృహస్పతితోడన్. 879

చ. అని సురనాథుఁ డూఱడిల నంబుజగర్భుఁడు వల్కి తానుమున్
జని జలజాక్షుఁ గాంచి యవిశంకటవృత్తి నమస్కరించినన్
వనజవిలోచనుండు హతభాగ్యుల శోకవిభిన్నచిత్తులన్
వినయవిచారులన్ బుధవీరులఁ గాంచి కడంక నిట్లనెన్. 880

ఉ. ఏఁగలుగంగ మీకు భయమేటికి దేవతలార సర్వసౌ
ఖ్యాగతి హేతుకంబయిన యట్టి సిరిం గడుఁబ్రీతి నిత్తు ని
చ్చాగతి నుండుఁ డింకఁ బురుషార్థనిదానము సారభూతమౌ
లాగువచింతు నొక్కముదలన్ వినుఁ డీరలు శోభనంబగున్. 881

చ. ఇలఁ గల రెండతేని మదధీనులు భక్తిపరాయణుల్ స్వతం
త్రులు సకలార్థసాధకులు రూఢిగ వారిఁ దిరస్కరించినన్
గలుగవు భోగము ; ల్గలుగుఁ గాని దరిద్రత : నేను లక్ష్మితో
నిలువను వానియింట నతనిం గని రోయుదు రెల్లసజ్జనుల్. 882

శా. దుర్వాసుండు హిమాంశుశేఖరకలోద్భూతుండు మద్భక్తిచే
హుర్వ్యా మర్త్యునిబొందువాఁడతనికే నశ్రాంతముం గూర్చెదన్
గర్వాభ్యున్నతిఁజేసి యాతనిఁ దిరస్కారంబుఁ గావింప నే
నోర్వంజాలక యిల్లు పేరితి రమాయుక్తుండనై యీ గతిన్. 883

సీ. మంగళాస్పదమైన మధురశంఖధ్వని • వఱలుచుండద దెవ్వానియింట
హరివాసరమునందు నన్నంబు భుజియించు • మానవులందు రెవ్వానియింట
వాభక్తులను గాంచి నయమేది దూషించు • వారు వసింతు రెవ్వానియింట
అభ్యాగతబ్రాహ్మణాభ్యవహారముల్ • మాని భుజింతు రెవ్వానియింట
గీ. బాలికను విక్రయించిన వానియింట • విమసమయినను లచ్చి తా నిలువనొల్ల
దాత్మకింపైనయెడకుఁ దా నరుగుఁ గాని • కలిమిచెలి నెఱుఁగవె బహూచ్ఛ్రళ యనంగ.

క. కరణములఁ దృణముఁ ద్రుంపినఁ, బొరిఁబొరిఁ దత్కరజములను బుడమినిరాయన్
సిరిపడఁతి వాని యింటన్, జరణంబుల నిలువ దొక్కక్షణకాలంబున్. 885

చ. ఇనుఁ డుదయించువేళ భుజియించుఁ బవల్ మరులూను నెమ్మిమై
ధువరతిఁ బూను వస్త్రరహితుండును స్నిగ్ధపదుండునై ముదం
బున శయనించుఁ దా ననృతముం బచరించును నవ్వు మాటికిన్
గొనకొని పల్కు వానయని గొబ్బునఁ బాయును కల్మి వాసవా. 886

క. తైలవిలిప్తాంగుండై, తా లాఁతుల యెడ లోకింత తాఁకినయేనిన్
బోలదు సిరినిలువంగా, వాలాయం బాపదలకు వాఁడె యిరవగున్. 887

క. తనయెడలందున వాద్యము, లొనరించనివాని భర్తృ నుర్వీసురునిం
గని నిందింపఁగఁ దివిరెడు, మనుజునిఁ గని దొలఁగు సిరి యమాన్యఁ దటంచున్.

క. చింతిల్లుట యభియాతుల, కెంతయు నెల్లిదముగాన వీరలు ధైర్య
స్వాంతులరై క్షీరనదీ, కాంతుని వెసఁ ద్రచ్చుఁ డందుఁ గమల వొడమెడున్. 889

క. జలనిధిఁ ద్రచ్చినచో నటఁ, గలుములచెలి వొడము మిమ్మఖండవిభవసం
కలితులఁ జేయును బొండని, పలికి సనెన్ శౌరి లోవిభవనంబునకున్. 890

మ. అమరు ల్గొండొకవాసరంబులకు బాహాగర్వ మేపార సం
భ్రమ మొప్పంగఁ బయఃపయోనిధిని జేరంబోయి మంథాద్రిక
వ్వము నాగాధిపు రజ్జుఁజేసి తరువ న్వారాశిఁ జూపట్టె నం
దమృతం బశ్వము గోవు లచ్చి వనమాలాదుల్ శుభాభ్యున్నతిన్. 891

క. వనమాల నిచ్చి రమరులు, వనజాతాక్షునకుఁ గల్మిపడఁతుక సవియోగా
ఘనపథకేశుని ముదలం, గొని నాకంబునకు సురలకోరిక దీరన్. 892

మ. మును గోల్పోయినలక్ష్మి గ్రమ్మఱఁగ వేల్పుల్పొందియానందులై
చని నాకంబున సౌఖ్యమందిరి యథేచ్ఛన్; లక్ష్మివృత్తాంతమున్
ఘనపాపాంతము దీని విన్న జనము ల్కల్యాణము ల్గాంతు రిం
కను నీవెద్ది వినంగఁ గోరితి వనం గా నారదుం డిట్లనెన్. 893

మ. సకలామ్నాయరహస్యవేదివగు నీచంచత్కృపాలబ్ధిచే
వకలంకంబగునట్టి పెక్కులు మహాఖ్యానంబుల న్వింటి నే
నిఁక నామ్నాయపురాణగూఢముగ నేయేసత్కథల్గల్గు మా
మకచిత్తంబు ప్రమోదమంద వచియింపం జెల్లదే నావుడున్. 894

చ. కలవు శ్రుతిస్మృతిప్రథితగాథ లనేకము లప్రకాశ్యముల్
కలుషనివారకంబు లటుగావున నెద్ది వినంగ నీమనం
బలవడుఁ జెప్పు మద్దియె రహస్యము నైనను నానతిత్తు వా
జలజభవాత్మజుండనెఁ బ్రశంస యొనర్చుచు నమ్మునీంద్రుతో, 895

క. దేవా! యగ్నికి దారలు, మూవురు గలరనుచు విందు ము న్నలస్వాహా
దేవియు స్వధ దక్షిణ యనఁ, గా వారి చరిత్రఁ జెప్పఁగాఁదగుఁ గరుణన్. 896

క. ఖ్యాతచరిత్రుండగు నా, సూతుఁడు నారదుని గాంచి శ్రుతిసంకలితం
బై తగు స్వాహోదంతముఁ, గౌతుకమునఁ బలికె నిట్లు గారవమొప్పన్. 897

క. అజుఁడు జగత్త్రయమును మును, సృజియించిన పిదప నెల్ల జేజేలు క్షుధన్
గజిబిజిబొందుచు రహి నం, బుజగర్భుని గనఁగొనంగఁ బోయిరి కడఁకన్. 898

క. పోయి విధాతృని యడుగుం, దోయికిఁ బ్రణమిల్లి నయముతో క్షుద్బాధా
పాయముఁ జేయు మటంచును, వేయోజల మతులుసేయ విధ్యుక్తముగాన్. 899

క: లోకేశుఁడు విబుధులతో, వైకుంఠునికడకుఁ బోయి పల్కెను విబుధా
నీకము నాఁకలి యుడుపఁగ, దే కరుణామతి యనఁగ రమేశుం డనియెన్. 900

గీ. అబ్జసంభవ ! వినుము బ్రాహ్మణులు మఱియు
క్షత్రియులు సంతతముఁ జేయు జన్నములను
వ్రేల్చు హవ్యంబుఁ గొనఁగ నీవేల్పులకును
జనదె యడియాస లేటికిఁ జనుఁడు వేగ. 901

వ. అనిన విని వాణీకాంతుండు హరిని శరణంబు వేఁడి తదాజ్ఞానుసారంబునఁ దన్మా యాస్వరూపిణియగు ప్రకృతిని ధ్యానపూర్వకంబుగా సాక్షాత్కారంబుఁగావించి వైశ్వానరునకు దాహకశక్తివి కమ్మని "నినుఁదొలంగి యతండు హవ్యంబుఁ దహియింపంజాలఁడు; నరులు నీనామం బుచ్చరించుచు నగ్నియందు హవ్యంబు వ్రేల్చుచుందురు; నీవా హవ్యంబు సురలకుఁ గొనసగు వట్లనుగ్రహింపుము. ఇది మొదలు సమస్తదేవతలచేఁ బూజింపంబడు చుందు"వనిన విని ప్రకృతి విషణ్ణ చిత్తయై నలువం గని మహాత్మా ! నే నెట్లును వీతిహోత్రునకు దాహకశక్తినై యుండనేరఁ బ్రకృతి పరుండగు పరమాత్మంగూర్చి తపంబొనర్చెద, దానికంటెఁ బ్రయోజనం బొక్కండును గాన నని చెప్పి యద్దేవి శ్రీమహావిష్ణువుంగూర్చి లక్ష హాయనంబులు తపంబునల్పుటయు, నారాయణుం డొకనాఁడు బ్రత్యక్షంబగుడు నొడలెఱుంగక మూర్ఛితయైయున్నఁ దదభిప్రాయంబు నెఱింగి తపోదీక్షాక్షీణాంగి యగు నాలతాంగిఁ గరంబులనెత్తి యూరుభాగంబున వసియింపంజేసి కవితరంబు దోఁప నిట్లనియె. 902

మ. పువుఁబోఁడీ ! చిరకాల మీగతి తపోముద్రావినిర్నిద్రవై
పవలున్ రేలును బెక్కుకష్టములకుం బాల్పడఁగా నీయొడల్
దవునే ! వగ్నిభిదుర్విభాధునకు మోదంబొప్పఁగా నాత్మసం
భవవై నాకును బత్నివౌదువు సుమీ వారాహకల్పంబునన్. 903

క. స్వాహా యనఁగ వగ్నికి వరారోహవగుచు
'దాహికా' శక్తివగుచు మత్స్వాహి వగుచు
మోహవంవతఁ దగుచు నారోహిణాఖ్యఁ
దహరహంబును వినుఁగూడి యలరుచుందు. 904

ఉ. నీరజలోచనుం డిటు లనేకవిధంబులఁ గాంత యుమ్మలం
బాఱఁగ మాఱించి చనె; నగ్నియు దాతయుమజ్ఞ వంత లోఁ
గూడ సతీసమీపమునకుం జని ప్రీతిఁ దదీయపాణిపం
కేరుహముం గ్రహించెఁ గడుఁ గేవలమర్త్యగతిన్ యథావిధిన్. 905

ఉ. దాఁపగరాని మోహపరితాపముచే ననిలాప్తుఁ డొక్క ర
మ్యోపవనస్థలంబునకు నగ్మలితోఁ జని యంగజాతకే
ళీపరతంత్రుఁడై తనర తేజశ్చ్యుతమయ్యె నంత మ
ద్దీపితమయ్యెఁ జూలు సుదతీమణికిం గడు నబ్బురంబుగన్. 906

వ. అంత ద్వాదశాబ్దంబులు గడచిన నొక్కనాఁడు ఆహవనీయము గార్హపత్యము దక్షిణాగ్నియు జన్మించిరి. 907

క. భూమిఁ గల నృపులు మహిసు, రాములు నతిభక్తి హవ్యదానంబుల స్వా
హామంత్రంబుల ప్రేల్చిరి, కామితసంసిద్ధి గలుగుఁగాత మటంచున్. 908

క. పతిసేవ లేని మానిని, గతి ఫలములులేని ప్రమానికైవడి స్వాహా
యుతిమంత్రహీనమగు నా, హుతియును విఫలంబుసుమ్ము యూహింపంగన్. 909

క. స్వాహాకరుణాభరమున, నాహారము గలిగెనంచు నఖిలవిబుధు లు
త్సాహముతోడను ద్విజద, త్తాహుతులను బొంది స్వస్థులైరి మునీంద్రా. 910

వ. అంత నాపితృసప్తకంబు తర్పణసహితంబైన శ్రాద్ధంబు నాహారంబుగా విధిచేఁ బడసియును బ్రాహ్మణులవలన నలవడక క్షుధాతురులై బ్రహ్మసభకుం బోయి ధాతకు నివేదించిన వాణీకాంతుండు కరుణాంతరంగుండై యనన్యసాధారణలావణ్యరేఖా మాన్యయగు నొక కన్యను మానసజన్యం గావించి పితృసప్తకంబున కొసంగి వారల భార్యగాఁ గైకొన నియమించి పుచ్చి స్వధాంత మంత్రపూర్వకంబుగా శ్రాద్ధంబు దాతవ్యంబని బ్రాహ్మణుల కాజ్ఞాపించె; నంత బ్రాహ్మణులు స్వధామంత్రోచ్చారణపూర్వకంబుగఁ బితృసప్తకంబునకు శ్రాద్ధదానంబుఁ జేయుచుండిరి; దేవదానంబున స్వాహాదేవియుఁ బితృదానంబున స్వధాదేవియు నన్నింట దక్షిణయును బ్రధానదేవతలై యుందురు. 911

క. పితృసప్తకంబు దేవ, ప్రతతియు మనువులును మౌనిరాజులు కుతుకా
న్వితులై స్వధాసపర్యా, మతులై రదిమొదలు తుష్టిమానితు లగుచున్. 912

మ. అవధానంబున వింటివే ప్రకృతిషష్ఠాంశంబె యీషష్ఠివాఁ
డవి సేనానికనుంగుబోటియయి పౌత్రత్రాణధౌరేయయై
చవగండంబుల రూపుమాపి శిశుపార్శ్వస్థాయియై వాని కా
యువు పెంపొందఁ నొసంగు మాతృకలలో నొక్కర్తు జుమ్ము మునీ. 913

గీ. తత్ప్రపద్యావిధానంబు ధర్మవ క్త్రి, గదితమై తొల్లి యెయ్యది విదితమయ్యె
వద్ది వినుపింతు మిగుల సౌఖ్యదము పుత్ర, పౌత్రసంవర్ధనంబు సంపత్ప్రదంబు. 914

క. వినియుందువు స్వాయంభువ, మనువనఁగా వెలయు విబుధమానితయశునా
తనికిం గాదిలికొడుకై, యనఘుఁడు జనియించె తాఁ బ్రియవ్రతుఁ డనగన్. 915

మ. అతఁ డన్వర్థత నావహించుమను రాజ్యత్రాణసంర క్తి మా
ని తపస్యావిశర క్తిఁ బూని మనము న్నిత్యంబు నాత్మైకసం
గతి యోగైకవిచార మూని మునిమార్గ మ్మాని యెందే నవా
హతభోగైకవిదాన మిద్ధమని యన్యంబొల్లఁ డావంతయుఁ. 916

క. యోగరతి నైహికమ్ములఁ, లోఁగక పరమాత్మ నెడఁదలో గొని కాంతా
యోగం బాముష్మికమున, కాగడమని మానెఁ బరిణయముఁ జేసికొనన్. 917

క. భవ ముజ్జగించి గురుపై, భవము న్మది నేవగించి పరమతపోదీ
క్ష వహించియున్న ధరణీ, ధవుపై గనికరముగల్గి తడయక యటకుఁ. 918

క. వేంచేసె నలువ నృపతియు, నంచితగతి లేచి కరము లౌదలపై జో
డించి ప్రణమిల్లుటయును వి, రించియుఁ గృప యంకురింప నృపుకో ననియెన్.

గీ. ఎందుఁజూచిన సర్వసమృద్ధి నొప్పు, రాజ్యరమ గల్గె నింత కొఱంతలేదు
యేమి తలపోసి యొదలింత యింకఁజేయు, తపము జేయఁగడంగితి ధరణినాథ.

వ. అనిన వాతం డిట్లను. 921

మ. అవధారయ్య, విధాత! తొల్లిటి ధరాధ్యక్షు లెవ్వఁడున్ దుర్దశా
వ్యవగీతంబగు పీఠవార్ధిఁ బడి మోహభ్రాంతులై రాజ్యపై
భవలోభంబున దుష్క్రియల్ సలుపఁగాఁ బాలైరి! గాకొక్కఁడే
నవినాశంబును గాంచనేరఁ డిహసౌఖ్యం బెట్లు నమ్మందగుఁ. 922

మ. అపవర్గంబున కంతరాయమగు జాయాపుత్రమిత్రాదు ల
న్యపదార్థంబులయం దహర్నిశము మోహభ్రాంతిచే నున్నచో
నెపుడో కాలముపెల్లి కాలుషురిలో నిక్కట్టులం గుందుచు
న్నపు డండొక్కఁడుగూడ నావనుశ్రమం బాలింపఁగా వత్తురే. 923

క. ఎంత శ్రమమొందినను "రా, జ్యం తేనరకం ధ్రువం" బటందురు పెద్దల్
వంతలకు నాలయంబు చు, రంతంబగు భవము నొల్ల రాజీవాక్ష. 924

మ. అతిమోహంబున మానసంబు విషయవ్యాసక్తమై నిశ్చలా
మృతసంధాయకమైన యాత్మ మనికధ్యేయం బటంచు న్నృపా
హితవృత్తిం జరియింపదిట్లు మది నెంతేనిన్ వితర్కించినన్
వితయేకా కొకయింత సత్యమగునే నీరేజసింహాసనా. 925

చ. నలినదళాంతరోదకకణంబు లనందగు నెల్లప్రాణముల్
జలధరచక్రవాళవిలసచ్చపలామగుణంబు లీసిరుల్
లలితవయస్సమాగతవిలాసము లన్నఁ దరంగచంచలం
బులు క్షణభంగురంబు తనువు న్మది నమ్మి చరింపనేటికిన్. 926

వ. అనిన మందహాససుందరవదనారవిందుండై యరవిందోదరుం డిట్లనియె. 927

శా. ధీరోదాత్తులు తొల్లి రాసుతులు ధాత్రీపాలనోల్లాసులై
నారీరత్నముల న్వరించి విపులానందంబుతోఁ గీర్తివి
స్తారోదారత పుత్రులందుఁ దుదిరాజ్యంబుంచి విశ్రాంతులై
స్వారాజ్యంబును గొల్లపెట్టరె మహీశా సత్త్వోనిష్ఠమై. 928

ఉ. ఆరయ నెల్లభోగముల కాస్పదమై తగునట్టి నిండునం
సారసుఖంబు నొల్ల కిటు మౌనిసుదుర్లభమైన ముక్తికిఁ
బారలు సాఁచుటెల్లఁ గనఁబుబ్బులలో నుదకంబు నమ్మి కే
దారము గట్టుద్రెంచిన విధంబుగదా వివరించినన్ నృపా. 929

మ. తలిదండ్రాయపు ముద్దుగుమ్మలమ మోదంబొప్పఁ బెంపొదఁ గా
వలె నిష్కంటక మట్ల సర్వధరణీభాగంబు పాలింపఁగా
వలె సత్కీర్తిని దిక్కులెల్లెడల నింపంగావలెంగావి నీ
వలె నే రెంటికిఁజెడ్డ రేవడక్రియం బాటింపఁగా నొప్పునే. 930

ఉ. ప్రాయము రిత్తపుచ్చుచు జపంబు నెపంబునఁ బూజ్యరాజ్యమున్
పేయక వైరుల న్వధముపేయక వైదికకర్మనిష్ఠలన్
గాయము స్రుక్కఁగా నిహసుఖంబుల నింతగ రోయనేల తే
జోయుతమూర్తివై ఘనయశోధవళంబుగఁ జేయు మూర్వరన్. 931

ఉ. నీవును వారి కైవడి ననింద్యగుణోత్తరయైన యట్టి లీ
లావతి నొక్కతెం బ్రియమెలర్పఁగఁ బెండిలియాడి సాగర

వ్యావృతభూతలం బవనిపాలురు ప్రోవనిబంటులౌచు నీ
కైవసమొందఁ బాలన మఖండదపక్రమ మొప్పఁజేయుమా. 932

క. అని యానతిచ్చి యాతని, ఘనమునఁ గల సందియంబు మానిపి దీవిం
చి నలినభవుఁడు యథేచ్ఛగా, జనియెం గలహంస నెక్కి సత్వరగతితో. 933

ఉ. సారససూతియేగ మను పందియు సంతయు నుజ్జగింగి యా
భూరమణుండు చక్కఁదనమున గుణముంగల మాలతి న్మహో
దారగుణాఢ్య నొక్కరిత దానుగా వరియించి రాజ్యల
క్ష్మీరతుఁ డయ్యె నెల్లరును మేలని సంతస మందుచుండఁగన్. 934

మ. చతురంభోనిధివేష్టితోర్వీతలరక్షాదక్షత న్మాలతీ
రతిసామ్రాజ్యసమాధురంధరత ధూర్తవ్రాతవిధ్వంసనో
ద్ధతశౌర్యోన్నతిఁ బండితావనకళాధౌరేయతన్ దర్మన
మ్మతి గావించుచునుండె నెందును నధర్మం బింత లేకుండఁగన్. 935

క. కృతదారుం డయ్యుఁ బ్రియ, వ్రతుఁ డొకపుత్రకునినైనఁ బడయఁగలేమిన్
హితమతి కశ్యపసంప్రే, రితుఁడై పుత్రేష్టియాచరింపఁగ నందున్. 936

క. క్రతుచరు వొక్కఁడు కశ్యప, యతి యొసఁగ మహాప్రసాద మని కొంచుఁ బ్రియ
వ్రతుఁ డయ్యది సతి కిచ్చిన, సతియున్ భుజియించి చూలు చయ్యనఁ దాల్చెన్.

ఉ. సౌరశరచ్ఛతంబు నొకచాయ్పనఁ జూలు ధరించి యొక్కనాఁ
డారమణీలలామ సకలాంగమనోహరుఁ బుత్రుఁ గాంచె న
త్తారకలోచనున్ మృతుఁ బదంపడి దుఃఖితులై రి బంధువుల్
బోరన బాష్పవారిపరిపూర్ణవిలోచనులై రి చూపఱుల్. 938

ఉ. మాలతియు న్మనంబునను మల్లడిఁగొన్న తనూజశోక
ముద్వేలముగాఁగ మూర్ఛిలె మృతించిన పుత్రునిఁజేఁదుమూపునం
దాలిచి దుఃఖవేగమున దైవము దూఱుచు నేగె భూతబే
తాళపిశాచఘోరవినదప్లుతధాటికి వల్లకాటికిన్. 939

వ. అట్టి సమయంబున, 140

ఉ. కానఁబడె న్విచిత్రరుచిగంధమనోహరపుష్పమాలికా
మానము శశ్వదుచ్ఛలితమూతసరిత్నవిధాన మచ్ఛవా

యోనిచయప్రధానము ఘనసొంపులనింపు విమానమందు భ
క్తానుగుణాఖిలార్థఘటనైకసమాదరియౌ లతాంగియున్. 941

వ. ఇట్లు గనుంగొని రాజతనయుం డప్రతిహతనయుండు గావున. 942

క. క్షోణిని డించి కుమారుని, బాణిద్వయ మాత్మశిరముపై నిల్పి నమ
త్త్రాణపరాయణయగు గుహా, రాణికిఁ బ్రణమిల్లి భక్తిరంజిలఁ బలికెన్. 943

ఉ. మానినులందు ధన్య వతిమాన్యము నీదుమహత్త్వ మెన్న నె
వ్వానికి శక్య? మీవెవనిపట్టివి? నిర్జనమైన యువ్వాన
స్థానములో విహారము సల్పఁగనేల యనంగ నామదు
త్సేనయు నిట్లు పల్కెను క్షితిప్రవరుంగని యార్తి దీఱగన్. 944

ఉ. ధాత నమున్ సృజించి యల దానవబాధితులైన నిర్జర
వ్రాతము బ్రోచుపొంటె శిఖివాహను దారను జేసె మాతృకా
ఖ్యాతిని జెందితిన్ బ్రకృతిషండను షష్ఠియనంగఁ బొల్తు నో
భూతలనాథ! నాచరితము న్వివరించితి నింతవట్టునన్. 945

క. ధనహీనున కర్థంబును, వనితాహీనునకు ముద్దుపడఁతుల ననప
త్యునకుం బుత్రు నొసంగుచు, మనుజులయెడఁ గొంగుపసిఁడిమాడ్కిఁ జరింతున్.

గీ. కర్మమూలంబు లెల్లసుఖములు దుఃఖ, ములును గర్మమె క్షితిమూలంబువను మేటి
యంచు వినఁబడుచుండు ధరాధినాథ!. జ్ఞానివై యిట్లు చింతింపఁ గర్జమగునె 947

ఉ. ఈ విసువుంగుఱించి యటులేటికి వంతర సంపఁ బల్కె వి
జ్ఞానము పేర్మి నానృపతినందనునిం గయిదాల్చి జీవితుం
గా నొనరించికొంచు నరుగం గని గద్గదభిన్నకంఠుడుం
డై నుతియించుచుండఁగఁ బ్రియవ్రతుతో దయతోడ నిట్లనెన్. 948

ఉ. భక్తిదలిర్ప నియ్యవనిపైఁ గల మానవకోటితోడ వే
దోక్తవిధి న్మదర్చనము నోలి నొనర్పుము నీవు యోగసం
రక్తుని సద్గుణాన్వితుఁ బురందరసన్నిభు సువ్రతాభిధా
వ్యక్తుని బాలు నిచ్చెద నుపాయముఁ జెప్పితి భూమిపాలకా. 949

శా. ఏకచ్ఛత్రముగాఁగ భూమివలయం బీతండు పాలించు ను
శ్లోకుండై చరియించుఁ బండితులఁ బ్రోచున్ ద్రవ్యమర్పించి యు

ల్లోకోదగ్రగజప్రతాపమునఁ గూల్చున్ శాత్రవశ్రేణి నా
కౌతస్సంచయముల్ ముదంబుగనఁ జేయు న్నాఱు జన్నంబులన్. 950

క. వీనిఁ గుమారునిఁగాఁ గనుఁ, గో నోఁచితి వితఁడె వీడు కొమరుఁడు గొనుమం
చూనిన వెనరున సుతు ధా, త్రీనేతకు నిచ్చి షష్ఠి దివికిం జనియెన్. 951

ఉ. ఆసుతుతోడఁ గూడి ప్రియమందు చమాత్యులు వెంటరా నిజా
వాసముఁ జేరి పుత్రసముపార్జనరీతిని జెప్పుచున్ సమా
శ్వాసితబంధుమిత్రజనసంచయుఁడై పురివారిఁ గూడి కాం
తాసముపేతుఁడౌచు జతనంబున సల్పెను షష్ఠి కర్చనల్. 952

మ. తనయోత్పత్తిమహోత్సవంబున సమస్తబ్రాహ్మణశ్రేణికిన్
ధన మర్పించెను మాసమాసమున శుద్ధంబందు షష్ఠీదినం
బున షష్ఠ్యర్చన మాచరించి విపులామోదంబుతో రాజ్యపా
లనముం జేయుచునుండెఁ గీర్తిమనుఁడై శ్లాఘ్యాత్మశీలుండునై. 953

వ. మఱియు నాఁడాదిగా బాలుర సూతికాగారంబుల నాఱవనాఁడును నేకవింశతివాస
రంబునను అన్నప్రాశనసమయంబునను షష్ఠీపూజనంబు సేయుండవి నగరంబున
నెల్లెడఁ గట్టడిఁగావించెఁ దానును దదర్చనాపరుండై యుండెఁ; దత్పూజావాహనాది
విధానంబు కౌదుమోక్తంబైయున్న యది యద్ధానంజేసి వటమూలంబున నొండె
ఘటకుడ్యసాలగ్రామంబుననొండె షష్ఠీప్రతిమం గావించి యర్చింపవలయు. 954

మ. ఇదిషష్ఠీచరితంబు పుణ్యచరితం బెవాఁడు పుత్రార్థియై
పదిలంబొప్పఁ బఠించెనేని సుతుఁ డొప్పంబుట్టెడి న్వంధ్యకే
మదయించున్వినుమాత్రఁ బుత్రుఁడుచిరాయుష్మంతుఁడేఁడాదికెం
త దురాపార్థములైన సులబ్ధములగుఁజా షష్ఠీప్రసాదంబునఁజా. 955

క. బాలురకు రోగ మడరిన, వేళం దలిదండ్రు లిద్ది వినఁగలిగినచో
బాలగ్రహపీడలుడిగి, మూలుకొను న్నెలకు దేవ్యనుగ్రహగరిమఁజా. 956

## మంగళచండ్యుపాఖ్యానము.

చ. అమరమునీంద్ర ! వింటివికదా ! దురితాపహమైన షష్ఠ్యుదం
తము పిఁక నాలకింపు మవధానత మంగళచండికాచరి
త్ర మహులతాలవిత్రమును దక్షతగల్గినదేవి చండినా
నమదురుమంగళార్థఘటనానిపుణాత్మకయై ధరిత్రిలో. 957

గీ. మనుకులోద్భవుఁడైనట్టి మంగళాఖ్య, భూవరుం డిల చండికాదేవి భక్తి
నిష్టదైవంబుగా భజియించుకతన, నామె మంగళచండిక యనఁగఁబరఁగె. 958

గీ. మూర్తిభేదము దుర్గకు మూలప్రకృతి, తరుణులకునెల్లఁ బ్రత్యక్షదైవతంబు
అధికకరుణాతరంగితాపాంగ నామెఁ, దొలుతఁ బూజించె నీశ్వరుం డఘుమతివి.

వ. త్రిపురంబు ల్దహియించునాఁడు రథభ్రాంతిచక్ర ముద్వృత్తదై
త్యపసంపాతితమై వియద్విగదితంబైన న్విశస్కంధి హ
ర్యుపదిష్టుండయి చండికంగొలిచె నయ్యుగ్రుండు మునా చండి భ
క్తపరాధీనమనస్క గావున సముక్షంబంద ప్రత్యక్షమై. 960

ఉ. ఓయి మహానుభావ ! యిటు లూరక భీతిలనేల యిప్పుడేఁ
బాయక యుద్ధశక్తినటు బాసటనై నెలకొందు నింతిరా
నాయకు మాయఁజేకొని రణస్థలిలోన దురాత్ముఁడైన దై
తేయుని ద్రుంచి వేల్పుల కతిప్రమదం బొనరింపుమీ వెసన్. 961

మ. ప్రతిఘాటోప మెలర్పి శైలతనయాప్రాణేశుఁ డజ్ఞాకథా
వితమౌ శస్త్రముఁ గేలఁ దాల్చి విజగంభీరాట్టహాసప్రఘూ
ర్ణితదిక్కందరుఁడై సురారి తల ఖండించె న్సురల్ శంకరున్
స్తుతిఁగావించిరి పుష్పవర్షము సుధాంధుల్ ప్రీతి వర్షింపఁగన్. 962

ఉ. మానితరీతి శంకరుఁడు మాధవపద్మభవోపదిష్టుఁడై
స్నానమొనర్చి తాల్చి పులిచర్మము మంగళచండికార్చనా
ధీనమనస్కుఁడై శ్రుతివిధిన్ కృతసర్వవిధోపచారుఁడై
మానసవీధి నిల్పె నతమంగళదాయిని చండికాసతిన్. 963

గీ. కడఁగి మాధ్యందినోక్తమౌగతి శివుండు, ధ్యానమొనరించి భక్తిపూర్ణాత్ముఁ డగుచు
వాద్యసంగీతనర్తనోపక్రమముల, నామసంకీర్తనంబు లొనర్చె మిగుల. 964

ఉ. ఆది శివుండు పిమ్మట గ్రహంబగుమంగళుఁ డంత మంగళో
ర్వీదయితుండు కన్య లటుపిమ్మట మంగళవారమందు నా
పై దిగధీశు లిద్ధరణిపైఁ గలవార లభీప్సితార్థసం
పాదనశక్తిఁ గొల్చి రలమంగళచండిక భక్తిమీఱఁగన్. 965

మ. మును ధాత్రీవలయంబునం గల జనంబు ల్నిత్యమక్షీణవో
జనితోపప్లవబాధ్యమానలగు యోషాబంధుమిత్రాదులన్

గని యీయాపదఁ బాపలేక యతిశోకవ్యాకులస్వాంతులై
చని నిష్ఠానిధియైన కశ్యపుసమక్షంబున దెలింగించినన్. 966

క. మౌనియు ధీశాలి శ్రుతిబీ, జానుగుణంబయిన మనువు లల్లన వెలయం
గా నొనరించెను బద్మజా, నానతిచే నృపుఁడు తత్సమన్వితుఁ డగుచున్. 967

వ. అమ్మంత్రమ్మున కధిష్ఠాన దైవతంబుగా మనసయను నొక్క రమణిం గూడ
సృజియించెఁ బదంపడి. 968

శా. ఆలీలావతి జన్మమందఁగనె దివ్యజ్ఞానసంపన్నయై
కైలాసంబున కేగి యందుఁ గడు దీక్షంబూని వేయేఁడు లా
శైలాధీశశయానుఁ గూర్చి తపమున్సల్పె న్నమల్పాలన
వ్యాలోలుండగు శంభుఁ డారమణికిం బ్రత్యక్షమై ప్రీతితో. 969

వ. అష్టాక్షరసమ్మతంబయిన కృష్ణమంత్రంబును సాంగంబుగ నొసంగి తదుపాసనా
విధానం బెల్ల తెల్లంబుగ నానతిచ్చి కనుమొఱంగుటయు నా రమణియుఁ దదాజ్ఞా
ప్రకారంబునఁ దపంబుఁ జేయంగడఁగి పుష్కరంబున కేతెంచి యథాపూర్వంబగు
నియమంబున నారాయణు డెందంబున నిల్పి తపంబు సేయుచున్నంత నారాయ
ణుండు ప్రీతుండై దుస్తరతపశ్చర్యాకృశాంగియగు నా లతాంగిం గాంచి వరంబు
లొసంగి యథేచ్ఛం జనియె. 970

ఉ. పాటవగర్వునాజ్ఞ మనస న్వరియించి ముదంబునన్ జర
త్కారుఁడు స్వాశ్రమంబున సదా తన కాసతి యాచరించు న
య్యే రుచిరోపచారముల కచ్చెరువొందుచు నైష్ఠికత్వ మే
పార సమస్తసంయమిసమన్వితుఁడై తపమాచరించుచున్. 971

వ. ఒక్కనాఁడు. 972

క. మనసాఘనజఘనస్థల, మున తనశీర్షమ్ము నుంచి ముని గాఢసుషు
ప్తిని జెందియుండ నంతట, నినుఁ డపరపయోధిఁ జేరె హీనస్ఫురణన్. 973

వ. కని యక్కాంత యిట్లని వితర్కించె. 974

ఉ. కాంతుఁడు నేఁడు మైమఱచి గాఢసుషుప్తిని జెందియుండె భా
స్వంతుఁడు నిప్పుడే చరమశైలము వెన్కకు వేగుచుండె సా
యంతనకృత్యము ల్వెలుపడయ్యెను బ్రాకృతునట్లు దీనిచే
నెంతయు బ్రహ్మఘాతియును హీనతపోవిభవుండు నౌఁగదా. 975

వ. కావున నిమ్మునివరేణ్యుఁ బ్రబోధితుం జేయకున్న సంధ్యోపాసనాహీనతచేఁ బ్రాపించుపాపం బగణ్యంబని యెందు; మేల్కొల్పిన నిద్రాభంగంబునకుఁ గోపంబు గదుర శపియించునో కో! మునుల మనంబులు నవనీతప్రాయంబులుగదా! యేమి చేయుదు? నెవ్వరు దిక్కని కొంతదోకవడి యోజించి యెట్లయినం గానిమ్ము నిద్రాభంగంబునకు శాంతుం జేయుట సుకరంబు; సంధ్యాహానికిఁ బ్రాయశ్చిత్తంబు లేకునికి తెల్లంబని నిశ్చయించి మెల్లన మెయితట్టి మేల్కొల్పిన నమ్ముని కోపోద్దీపితమానసుండయి యమ్మదవతిం గనుంగొని. 976

ఉ. ఓసి యిదేమె నిద్రఁగొనియున్న నను గొఱమాలి మేల్కొనఁగా
జేసితి వింతయాగడము జెల్లునఁటే మగనాలికిం దను
గ్రాసముఁ జేసి చేసిన యఖండతపంబును బుణ్యతీర్థసం
వాసములుఁగా ఫలంబిదువె భర్త నవజ్ఞ నొనర్చియుండినన్. 977

క. వినయవివేకము లొదవఁగఁ, దనమగనికి సేవచేసి తపియించో దే
వనికరమెల్ల మునంబుం, గనునంచు బుధు ల్వచింపఁగా వినలేదే. 978

క. అంగనచే సుఖనిద్రా, భంగంబుం గన్నయతడపావృతలక్ష్మీ
సంగుఁడయి కాలమాత్రము, నం గూడునటంచు ము న్వినంబడదొక్కో. 979

వ. అని కోపాటోపంబున నమ్మునిపుంగవుండు ప్రస్ఫురితాధరుం డగుటయు, 980

చ. గడగడలాడుచు న్మగనిఁ గన్గొని పల్కె. మహానుభావ! నీ
వెడపక నిద్రఁజెందుటయు నిప్పుడె భాస్కరుఁ డస్తమించుటన్
బొడఁగని సంధ్యవార్చఁదగు ప్రొద్దది మెల్లఁగ దాఁటిపోవ నే
గొడవలు వచ్చునో యనుచుఁగొంకుచు నిన్నిటు మేలుకొల్పితిన్. 981

క. ఏ దుష్టనయితి నాకిఁక, లే దొక పాచిత మటంచు లేమయు బాష్పాం
భోమూషితాక్షియై ముని, పాదంబులఁ బడియె శోకపరవశయగుచున్. 982

ఉ. పాయని దుఃఖ మాఁపికొనఁబాటి యెఱుంగక యేడ్చుచుండఁగా
నామెలనాఁగఁ గన్గొని దయామతిఁ గౌఁగిట గ్రుచ్చియెత్తి యా
తోయజమిత్రుపై వలుకతో శపియింపఁ గడంగునంత సం
ధ్యాయుతుఁడై పతంగుఁడు మహర్షికడంగట నిల్చి యిట్లనున్. 983

శా. ఈపద్మేక్షణ సంజవేళ యని తానీక్షించి ధర్మక్రియా
లోపం బొనను భీతిచేత నిను మేల్కొల్పంగ నీ నీగతిన్

నాపైఁ గోపముఁబూని పిచ్చుకపయిం బ్రహ్మాస్త్రమింటోలెఁగా
శాపంబీఁదగునయ్య! యోర్వఁగలనా? శాపాయుధాగ్రేసరా! 984

మ. సరసీసంభవసంభవుల్ ప్రథిత తేజశ్శాలు రుద్యత్తపో
నిరతుల్ విప్రులు వారలల్గినయెడ స్పర్ధామధామంబుఁ జే
తురు కారుణ్యముగల్గి క్రమ్మఱ సృజింతు ర్వారు లోకంబులన్
ధరణీదేవుల మానసంబు నవనీతప్రాయ మౌనేకదా. 985

ఉ. ఎంచకు నేర మీవు భజియింపుము కృష్ణుని బాపమెల్ల మా
యించు నతండు మ్రొక్కెద నిదే శరణం బను పద్మబంధు సై
రించి శపించకే విడిచి రేఁచిన కోపమునన్ వడి న్విస
ర్జించెను గశ్యపాత్మజ; వచించెడి దేమిఁక మౌని చిత్తముల్! 986

వ. అంత వశ్కాంతామణి చేయునదిలేక యిట్లని విలపించె. 987

చ. కటకట! యట్టికశ్యపుని కన్నియనై తపమాచరించి యీ
జటివరు నాలినై మిగుల సన్నుతులంగొని భాగ్యహీననై
పటుతరశోకవార్ధిఁబడఁ బాల్పడితిం దుద కేను నన్ను నేఁ
డెటువలెఁ గాతువో యనుచు నింతి విచారముతోడ వేఁడుచున్. 988

*క. ననుఁ గన్నతండ్రి రారా!, వినుసిగదయ్యంబ రార! విధి రారా! నే
మనసను వాతవిస్పష్టను, ననుఁ గాచెడి భరము మీ దనాథనుజుండీ. 989

వ. అని యెలుంగెత్తి యేడ్వం దొడంగిన. 990

ఉ. ఆయెలుఁ గాలకించి గుహానయ్యెయుఁ గశ్యపమౌని యంచతే
జీ యొడయందు నత్తపసిచెంగట కేగినయంత మౌని చే
దోయిని దోయిలించి ప్రణతుల్ వినుతుల్ ఘొనరించి యిందువేం
చేయుట కేమిహేతువు వచింపుఁడు మీరు మహాత్ము లారయన్. 991

వ. అని యిట్లు ముని పల్కిన సరోజసంభవుండు సమయానుకూలంబుగాఁ గొన్ని
వాక్యంబు లుగ్గడించి వెండియు నిట్లనియె. 992

ఉ. తొల్లి కృశామపాశిగ వధూమణి నీవె వరించి ప్రేమ లో
వెల్లిగొనంగ నేలి తగవే! యనపత్యను నేరమెంచ కే
నొల్లను బొమ్మనంగ; విటు లుగ్మలిని న్విడనాడువారికిఁ
జల్లెడలోని నీరు దిగజాటివలైవడిఁగావె పున్నెముల్. 993

మ. కమలప్రోద్భవుఁ డిట్టులాడ, మనసాగంభీరవాభీప్రదే
శము డాచేత సమంత్రకంబుగను సంస్పర్శించి యమ్మౌని "యో
రమణీ! గర్భముగల్గు నీకఖిలశాస్త్రజ్ఞానసంపన్నుఁ డు
త్తమతేజస్కుఁడు ధార్మికుండును సముత్పన్నుం డగున్ బుత్రుఁడై. 994

చ. ఇతఁ డుదయించుమాత్ర సవితృప్రకరంబు ముదంబుగాంచు ని
ర్జితరుజుఁడై సదా తపముజేయును గోలతనంబు మాన కీ
గతి విలపింపనేల ? చలిగట్టుపయిం దొలిమాద్కినే ధృతా
మృతకరు శంకరుం గొలువ నేగుము నెవ్వగలెల్లఁ దీఱెడిన్. 995

ఉ. ఏనును బుష్కరంబునకు నేగి తపంబొనరింతు నం దజ
ధ్యానవిరూఢి నోజలరుహానన ! యోగవియోగముల్ వ్యవ
స్థానుభవైకభాజనము లారయ నీవనితానుషంగముల్
కానలనుండి యాకలముల న్భుజియించెదు మాకు నర్హ మే". 996

చ. జటివరుఁ డిట్టులాడ మది ఝల్లనఁ గన్నుల వేఁడిబాష్పముల్
జొటజొటరాలఁగా వగచుచు న్వనఁబోఁడి మునీంద్రుఁ జూచి తొ
ల్లిటి తపమెల్ల నీగతి ఫలించె నిఁకెట్లు సుఖంబు లబ్బు నె
వ్వటికొకలాగు నానుదుట వ్రాసెనబో విధి మూఁడుపంక్తులన్. 997

ఉ. జారిణి కాముకాశిని, బ్రసాదము నాఁకలిగొన్నవాఁడుమఱి,
నీరములం దృషార్దితుఁడు, నేత్రము నంధుఁడు, వన్యవిత్తమున్
జోరుఁడు కాముకుండు రతిసూక్తుల సంగముఁ గోరుభంగి నీ
ధారుణిలోఁ బతివ్రతలు తద్దయుఁ గోరుదు రాత్మనాథునిన్. 998

చ. అని మునినాథుఁ గాంచి వినయంబున నిట్లను బ్రాణనాథ ! నే
మనమున నెప్డు నిన్ దలఁతు మావక దర్శన మప్పుడిత్తువం
చును వరమీయఁగావలయుఁ జూ యవిపెద్దమెలంగు రాల్పదన్
వనరుమఁ గాళ్ళపైఁబడియెఁ; బైదలు లొత్తురె నాథు నీడఁగన్. 999

వ. అనిన వల్లియవి యమ్మునిపల్లభుండు నిజవల్లభ మెల్లనఁ దనకరంబుల లేవనెత్తి యుల్లంబునఁ జేర్చుకొని సమయామకూలంబులగు కొన్ని యనునయాలాపంబుల డెందంబునందలి కొందలం బుడిపికొని ధైర్యం బవలంబించి శ్రీకృష్ణుఁగీర్తించు నాజంత్కుండు తపంబునకుం జనియె. 1000

ఉ. ఏమ్మట ముమ్మరంబయిన బిమ్మిటిచే శితికంఠురాణివా
సమ్మున కేగి యందు దివసంబు యుగంబుగనుండి యొక్కనాఁ
దమ్మనికొమ్మ మంచిసమయమ్మునఁ గాంచె మృగాంకమౌళియం
శమ్మునఁ దేజరిల్లు నొక చక్కని పుత్రుని జ్ఞానపాత్రునిన్. 1001

క. ఇది మనసోపాఖ్యానము, చదివిన వ్రాసినను వినిన సకలైశ్వర్యా
భ్యుదయములు కల్గి దేవీ, పదమందు వసింతు రెపుడు పదపడి మౌనీ. 1002

## సురభ్యుపాఖ్యానము

క. మనసోపాఖ్యానము విని, మనమున నానందరసనిమగ్నుఁడ నైతిన్
వినిపింపుము సురభియనన్, జను దేవిచరిత్ర మింక సత్కృపతోడన్. 1003

వ. అని ప్రార్థించిన నారదునకు నారాయణుఁ డిట్లు వచించె. 1004

ఉ. గోవులలోఁ బ్రధానయయి గోవులకున్ జనయిత్రియై సదా
గోవులఁ బ్రోచుదేవియయి గోభువనమ్మున జన్మమొందె బృం
దావనపుణ్యభూముల వినందగుఁ బాపవినాశకంబు మో
దావహమైన తచ్చరిత మంతయుఁ దెల్పెద నీకు నారదా. 1005

ఉ. క్రేవల గోపికల్గొలువఁ గేళివిలాసమనస్కుఁడౌచు రా
ధావిభుఁ డామెతోఁ గలిసి తా నొకనాఁడు చరింపనేగె బృం
దావనభూమి కందు విజనమ్ముగఁ బ్రేయసితో రమించుచోఁ
బావనమూర్తి కాతనికిఁ బాలనుద్రావఁగఁ గోర్కెపుట్టఁగన్. 1006

గీ. వామపార్శ్వమ్మునుండి విశ్వప్రభుండు, సృజనమొనరించె నంతటఁ జిన్నదూడ
పొదుఁగులో నోరువెట్టి సమ్ముదముగాంచు, నట్టి సురభిని గోమాత నఖిలపూజ్య.

గీ. జన్మమృత్యుజరావ్యాధిసంహరముల, క్షీరధారలఁ గుండ నిండారఁబితికి
త్రావినన్నియుఁ ద్రావి రాధావిభుండు, భాండమును బాలతో భూమిఁ బాఱవైచె. 1008

ఉ. అచ్చట నూరుయోజనము లాయతిగల్గి కనుంగొనంగఁ బె
న్మచ్చటగొల్పు చేర్పడియెఁ బొల్పయి క్షీరసరమ్ము చుట్టునన్
బచ్చలు కెంపులున్ మెదిపి బాగుగఁగట్టిన మెట్లతోడఁ దా
వెచ్చెలిపిండుతోఁ గలిసి నిత్యము రాధయుఁ గేళిసల్పఁగన్. 1009

గీ. కామధేనుసహస్రంబు రోమకూప. ముల జనించెను సురభికి మోదమలరఁ
బరదినంబున దీపము ల్వెరగుచుండ, నామెఁ బూజించె శ్రీకృష్ణుఁ డంచితముగ.

వ. సురభీధ్యానస్తోత్రంబులును మూలమంత్రంబును బూర్వము ధర్ముని వలన వింటి.
'ఓంసురభ్యైనమః' అను నీ మంత్రము లక్షజపంబున సిద్ధియై భక్తులకు బుద్ధివృద్ధి
ముక్తుల నొసంగి సర్వ కామంబుల నొడఁగూర్చు. 1011

క. శ్రీరూపిణి రాధాసహ, చారిణి గోమాత సర్వసంచితపాపా
పారారణ్యదవానల, మై రహి నలరారు సురభి నర్చింతు మదిన్. 1012

గీ. కలశమునఁగాని ధేనువు తలను గాని, ఆవులం గట్టు స్తంభంబులందుఁ గాని
సాలశిలఁగాని శిఖిఁ గాని జలమునందుఁగాని సురభిఁ గొలువఁజెల్లుఁ గడఁగిద్విజుఁడు.

గీ. పరదినంబున దీపము ల్వెరఁగుచుండ, నతిధృఢంబగుభక్తిఁ బూర్వాహ్ణమందు
సురభిఁ బూజించునరుఁడు విశ్వరమణీయ, మైన సంపదఁగాంచి పూజ్యత వహించు.

ఉ. పాఁడి యడంగె మాధవు నభంగురమాయకు నొక్కయప్పుడీ
మూఁడుజగమ్ములన్ సురలు మ్రొక్కుచుఁ బద్మజునొద్ద కేగి యీ
కీడు దొలంచుమా యనుచుఁ గేల్మొడుపన్ సురభిన్ భజింపుచో
మూఁడిన యాపద ల్తొలఁగిపోవు నటం చతఁ డానతిచ్చుటన్. 1015

ఉ. పాకనియంత పద్మజుని పల్కులు నెమ్మనమందు నూని య
స్తోకవినమ్రశీర్షుఁడయి దోయిలిపట్టి సురస్రవంతికా
శ్రీకమనీయవాక్యములఁ జిత్తము మెత్తవడంగఁజేయుచున్
వీఁకమెయిన్ నుతించె సురభిన్ సురలోకము బాగుకోసమై. 1016

సీ. పద్మాంశవలన నుద్భవము గాంచినయట్టి • రాధికాసాహచర్యకు నమస్సు
శ్రీకృష్ణదేవుని చెల్మి నార్జించిన • వితతగోమాతృదేవికి జోహారు
క్షీరధారలచేత సిరియు బుద్ధి యశమ్ము • జేయు గోలోకవాసినికిఁ బ్రణతి
ఆశ్రయించిన వారి కమరవృక్షంబౌచుఁ • బాలించునట్టి యంబకు బ్రణామ

గీ. మనిన యింద్రుని స్తోత్రంబు నాలకించి • యంత బ్రహ్మలోకమ్మున నవతరించి
కోరికొన్న వరంబులఁ గూర్మి నొసఁగి • మోదమునఁ బోయె స్వస్థానమునకుసురభి.

ఉ. నారద ! క్షీరపూర్ణమయి నాలుగుమూలల విశ్వమెల్ల శో
భారమణీయమయ్యెఁ బిదపన్ జనియించెను నేయి యజ్ఞ వం

భారములందు ముఖ్యమగు వస్తువు తద్రక్కతుభుక్కులెల్లరా
హారము గల్గుటన్ హరుప మందిరి డెందములందుఁ బిమ్మటన్. 1018

గీ. ఈసురభి స్తోత్రరాజంబు నెవ్వరేని, బఠనసల్పినఁ జేకుఱు బహుళధనము
గోసమృద్ధియు శాశ్వతగురుయశస్సు, పుత్రపౌత్రాభివృద్ధి సంపూర్ణసుఖము. 1019

క. సర్వనదీస్నానమ్మును, సర్వక్రతుదీక్ష గొన్న సత్ఫల మలరున్
నిర్వాణ మబ్బి పిమ్మట, ముర్వగ బ్రహ్మైత్మ్యజత్వమును ఘటియించున్. 1020

## రాధా దుర్గా పూజావిధానము

క. ప్రకృతుల చరితమ్ముల వీ, వకలుషమౌ ప్రేమఁ దెల్ప నాలించితి మా
మకకిల్బిషసంఘమ్ములు, వికలములై చెదరిపోయె విశ్వేశావా! 1021

క. నాకున్ రాధా దుర్గల, ప్రాకటశుభపూజనంపు పక్కి వినంగన్
లోకోత్తర! మనసయ్యెడు. వీఁక మెయిన్ దెల్పు మింక వినతు లొనర్తుల్. 1022

చ. అతితరమంచు వారల మహామహిమమ్మును దెల్పియుంటి వా
యతమగు నీజగమ్మున నియంత్రిణు లంటివి వారిఁ గొల్వ సం
గతమగుఁ బుణ్యలోకములఁ గాఁపురమంచు వచించినావు నా
కుతుక మడంగునొక్కొ యదిగూడ నెఱుంగకయున్నచోఁ బ్రభూ! 1023

క. అను వీణామునిప్రార్థన, మునకుల మనమొగ్గినట్టి మురహరుఁడు కృపా
ఖనియై తెల్పంగడఁగెను, వినుమంచు మరందధార వీఁగు మృదూక్తిన్. 1024

గీ. మూలప్రకృతిరూపిణులౌచుఁ బుట్టినారు, వారలిర్వురు నల విరాట్రూపముఖసకల
దేవతలుగూడ వారియధీనులగుట, వారి పదపద్మముల సేవ వలయు. 1025

గీ. అందు రాధామహామంత్ర మాదియందుఁ, దెల్పెద రహస్యమియ్యది దీనిమహిమ
వేయి నాలుక లుండియు వినుతిసేయఁ, దరముగాదయ్య యెట్టి తత్పరునికైన.

గీ. శ్రీయుతంబు చతుర్థ్యంతచిహ్నితమయి, రాధపావననామము రాణకెక్క
ననలు నారినిగూడి షడక్షరముగ, నర్థిజనవాంఛితప్రదమై నతంబు. 1027

ఉ. మూలసనాతనప్రకృతిమూలమునన్ గొనెఁగృష్ణదేవుఁ డు
ద్వేలసుభక్తిపూర్ణుఁడయి దీనిని గోభువనంబునందు గో
పాలునిచేత విష్ణునకుఁ బావనుఁ డాతనివల్ల బ్రహ్మకున్
గీలితమయ్యె బ్రహ్మ పలికించెను ధర్మునిచేతఁ బిమ్మటన్. 1028

ఉ. ధర్మనివల్ల నేనును బదంపడి గాంచి పరంపరాగతా
యుర్మహనీయ భాగ్యవిభవోదయకారకమైన మంత్రమున్
మర్మ మెఱింగి పల్కెదసుమా! నిరతంబును దానిచేత నే
శర్మముగల్గెఁ దజ్జపముశక్తినె నే ఋషినైతి నారదా. 1028

చ. జలజభవాదిదేవత లజస్రము దీని జపించుచుందు ర
గ్గలమగు భక్తితోడ నధికారము నుంతయుఁ గృష్ణపూజకున్
గలుగదు రాధ నేమరినఁ గావున వైష్ణవులైన ధీవరుల్
సలుపఁగఁజెల్లు రాధ కనిశమ్మును బూజల నప్రభావులై. 1030

వ. కృష్ణున కామె ప్రాణాధిదేవియు నామెకుఁ గృష్ణుఁ డధీనుండునై యుండును. సకల కామంబులను రాధించుటంబట్టి రాధానామ మామెకుఁ బ్రసిద్ధమైనది. రాధామహా మంత్రంబునకు నేను ఋషిని; గాయత్రి ఛందము; రాధ యధిదేవత; తారమును శక్తియు బీజంబులు; శక్తిమూలావృత్తిచే షడంగంబులు సేయవలయు; సామవేదోక్తరీతి నమ్మహాదేవిని ధ్యానింపఁజెల్లు. 1031

సీ. మల్లికామాలతీమహితకైశ్యముదాని • నవరత్నమయభూషణములదాని
తెల్లసంపెఁగపూలఁ దెగడు దేహముదాని • శరదిందుసుందరాస్యంబుదాని
కోటిచంద్రులకాంతి గోట మీఱెడుదాని • రక్తాంబుజాతనేత్రములదాని
కుందసన్నిభదంతకుట్మలంబుల దాని • రమణీయబింబాధరమ్ముదాని

ఆ.వె. కుంభికుంభసదృశగురుకుచంబులదాని • పృథునితంబయుగళమునకు శోభ
గలుగఁజేయునట్టి కాంచి గల్గినదాని • స్థిరవయఃప్రసిద్ధి జెలఁగుదాని. 1032

సీ. ఏవేళఁ బదియురేండేండ్ల ప్రాయముగల్గి • శృంగారలహరియై చెలఁగుదాని
వహ్నిశుద్ధంబైన వసనంబు దాల్చిన • లావణ్యయుతదేహలతికదాని
వేదవేద్యంబైన విభవంబుతోఁ గృష్ణు • నసువుల కసువుగా నలరుదాని
దాస్యలేశముచేత దయగల్గి భక్తుల • సకలేష్టపూర్తిని సలుపుదాని

గీ. రాసమండలమందున రత్నసింహ • పీఠమున నున్నదానిని విశ్వమాత
యైన దేవిని సేవింతు ననుచుఁ బల్కి • ధ్యానమొనరింపవలయు నయ్యా! మునీంద్ర.

గీ. ధ్యాన మొనరించుమన్ బహిస్థలమునందు, నైన సాలశిలాపుటమందునైన
నష్టదళపద్మయంత్రంబునందునైన, దేవి నావాహనమొనర్చి తిపురజేసి. 1034

ఉ. ఆసన మిచ్చి యంత ముఖమందుఁ ద్రివారము మూలవిద్యచే
నాసకలేశ్వరేశ్వరికి నాచమనీయ మొసంగి పాద్యముం
బోసి పదంబులందు శిరమున్ సరిదర్ఘ్యముచే స్పృశించి యా
పై సవరింపఁజెల్లు మధుపర్కము తర్కములేని భక్తితో. 1035

ఉ. స్నానవిధానముగా సలిపి చందన మిచ్చి విభూషణంబులన్
గానుకవెట్టి వస్త్రములు గామితసుందరపారిజాతనా
నానవపుష్పదామములు నాల్గు విదిక్కుల మధ్యయందు నా
పై నొనరింపఁగావలయుఁ బావనురాలికి వంగపూజలన్. 1036

గీ. అంతటఁ బ్రదక్షిణంబుగ నగ్రదళము, నష్టదళపద్మమునఁ బూని యధికభక్తి
నామె పరివారమునుగూడ నర్చసేయ, వలయు మునివర్య! తత్క్రమం బలవరింతు.

సీ. ప్రాగ్దిశయందు మాలావతిం బూజించి • దహనుకోణమున మాధవిని గొల్చి
కాలుదిక్కున రత్నమాలను సేవించి • నైరృతిని సుశీల నతులునల్పి
పడమట శశికళన్ బ్రస్తుతిఁగావించి • శ్వసనుదిక్కునఁ బారిజాత మ్రొక్కి
రాజరాజాశఁ బరావతి భజియించి • హరకాష్ఠమందు సుందరిని దలఁచి

గీ. బాహ్యసీమఁ జతుర్ముఖప్రముఖదేవ • తలకు దిక్పాలురకుఁగూడ నెలమిఁగొల్చి
శంఖచక్రాయుధమ్ముల సంతరించి • సకలరాజోపచారము ల్సలుపవలయు. 1038

గీ. పాపనాఖ్యానహస్రంబు బల్కుచుండి, మంత్రమును వేయిసారులు మననసేయుఁ
బ్రతిదినం బెవ్వఁ డాతఁడు పాప మెడలి, యెనయు గోలోకమును విష్ణువనఁ బరంగి.

గీ. కార్తికమ్మునఁ బూర్ణిమఁ గడఁగి యెవఁడు, రాధజన్మోత్సవ మొనర్చు రహియెలర్ప
నతనిమ్రోలఁ రాసేశ్వరి యనుదినంబు, నిలిచి వాంఛాప్రపూర్తిని గలుగఁజేయు.

వ. మఱియు గోలోకవాసినియగు నమ్మహాదేవి యేదే నొకకారణంబున వృషభాను
తయై బృందావనమ్మున జన్మించినది. ఇందు దెల్పఁబడిన మంత్రంబుల వర్ణసంఖ్యా
విధానంబులు చెడనీయక పురశ్చరణక్రియాయోగ్యంబగు దశాంశంబు హోమముఁ
గావించి తిలలచే వేల్చునది; నావుడు రాధాస్తోత్రవిధానం బానతిమ్మనిన నారదునకు
నారాయణుం డిట్లనియె. 1041

క. భాసితమా గోలోకని, వాసిని! కరుణాప్రపూరవాసితహృదయా
భ్యాసితభక్తజనావని!, రాసేశ్వరి! మమ్ముఁ బ్రోవు రాధాదేవీ! 1042

క. శ్రీకృష్ణప్రాణప్రియ, కాకలితసమస్తసృష్టి కాదిజననికిఁ జా
లోకేశ్వరికిఁ జతుర్ముఖ, పాకారిప్రముఖవంద్యపాదకు జేజే। 1043

క. నీవే గౌరివి మనసవు, నీవే భారతివి లక్ష్మి నీవే మఱి ప
ద్మావతియును సావిత్రియు, నీవె తులసివియును నీవె నీకు నమస్సుల్. 1044

క. మంగళచండిక షష్ఠియు, నంగన్ జను దుర్గ నీవె నాకప్రవలి
ద్పుంగవు గంగవు నీవే, సంగతమగు మమ్ముఁ బ్రోవఁ జయ్యన రమ్మా। 1045

క. మూలప్రకృతివి నీవే, జాల మొనర్పంగనేల? సంసారమహా
భీలాంభోనిధిమగ్నుల, మేలంజను మమ్ము నుద్ధరింపుమఁ దల్లీ। 1046

క. అను నీ రాధాస్తోత్రం, బనుదినమును బఠనసల్పు ననఘుండు పున
ర్జనిహీనత గోలోకం, బునఁ గాఁపురముండు నిత్యమోదంబలరన్. 1047

క. సరిగానము దీనికి సం, స్మరణీయ మనంతమోక్షసాధనము నీ
వౌరులకుఁ దెల్పందగ దిది, పరమరహస్యంబుగానఁ బాలింపు మునీ. 1048

సీ. ఏదేవినామంబు నెలమిమై వినుమాత్ర • నఖిలాపదలఁగూడ నంతరించు
నేమాత కరుణతో నీ సర్వలోకమ్ము • లందు నంతర్లీనయై వసించు
నేతల్లి శైవులకేని వైష్ణవులకు • నేని సంసేవ్యయై యెసఁగుచుండు
నేరాజ్ఞి శక్తుల కేలికసానియై • ప్రకృతిరూపంబునఁ బరిఢవిల్లు

గీ. దుర్గమముల సంకటములఁ దొలఁగఁజేయు • కతన నేదేవి దుర్గాఖ్య గాంచిమించె
నామె పూజావిధానంబు నధికభక్తి • నింక వచియింతు నీకు మునీంద్ర! వినుము.

వ. వాగ్భవంబును శంభువనితయుఁ గామబీజంబును బిదపఁ 'చాముండాయై' పదంబును 'నమః' పదంబునుంగూడి దుర్గానవాక్షరమంత్రరాజంబయ్యె; నియ్యది భక్తులపాలిటి కల్పపాదపము; దీనికి ఋషులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు; ఛందంబులు గాయత్ర్యుష్ణిగనుష్టుప్పులు. అధిదేవతలు మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతులు. బీజంబులు రక్తదంతికాదుర్గాభ్రామరులు. శక్తులు నందాశాకంభరీ భీమాదేవులు. వినియోగము చతుర్విధ పురుషార్థములు. మౌళియందు ఋషులను, వక్త్రంబున ఛందములను, హృదయంబున నధిదేవతలను స్తనంబుల శక్తిబీజంబులను న్యసింపవలయు. బీజత్రయంబుచేతను బీజచతుష్టయంబుచేతను బీజద్వయంబుచేతను షడంగంబుల జాతియుక్తంబుఁ గావించి శిఖాలోచనద్వంద్వశ్రుతినాసావదనగుదంబుల విన్యాసమొనర్చి మంత్రవర్ణంబుల సర్వవ్యాపకంబు గావించునది. 1050

క. అసితోమరచక్రగదా, ముసలమ్ములు శంఖశూలముద్గరములు పా
శసుదర్శనచాపమ్ములు, నెసలారిన యట్టి దుర్గ నెంతుఁగా మదిలో. 1051

క. నానాభూషణభూషిత, యై నీలాంజనసమానమగు సుప్రఖ్యా
మానితయగుచున్ దశపా, దాననములు గల్గు దేవిఁ దలఁతుఁగా మదిలో. 1052

క. మధుకైటభులను నసురుల, వధియించు నిమిత్తమై విపన్నుం డగుచున్
విధి యేకాళి నుతించెనొ, ప్రథితాత్మకురాలి నామెఁ బ్రార్థింతు మదిఁగా. 1053

క. ఒకచేత సురాపాత్రయు, నొకచేతను నక్షమాల యొప్పెడుదానిన్
బ్రకటితమాయాబీజఁగా, సకలేశ్వరియైనయట్టి శక్తిన్ దలఁతున్. 1054

క. అరుణాంబుజవాసినియై, యరుణంబగు దేహకాంతి యలరఁగ మహిషా
సురదైత్యనిహంత్రిణియై, పరఁగు మహాలక్ష్మి నెంతు భావమునందున్. 1055

క. శుంభనిశుంభుల యధికో, జ్జృంభణము నడఁపఁ బుట్టి శోభిలుదానిన్
జంభారిప్రముఖనుతఁగా, శాంభవిఁ ద్రినేత్ర నెంతుఁ జక్కఁగ మదిలో. 1056

క. వాణీబీజాత్మికయౌ, నేణాక్షిని సర్వవిద్య లేలెడు సర్వ
ప్రాణాధికయైన సరస్వతి, నాణెంబగు భక్తితో మనమ్మునఁ దలఁతున్. 1057

వ. అని ధ్యానించి షట్కోణసంయుతంబగు యంత్రంబును నిర్మించి చతుర్వింశతిపత్ర కంబగు నష్టదళపద్మంబును భూగృహంబున నిర్మించునది. సాలగ్రామంబునగాని ఘటంబునంగాని యంత్రంబునంగాని బాణమునఁగాని లింగంబునంగాని సూర్యునం దుంగాని దేవిని యజింపవలయు. పూర్వకోణంబున సరస్వతీసహితుండగు పద్మ జుని, నైరృతంబున లక్ష్మీసహితుండగు శ్రీహరిని, వాయుకోణంబునఁ బార్వతీ సహితుండగు శంభుదేవు, నుత్తరంబున సింహమును, వామంబున మహిషమును బూజింపవలయు. నందజారక్తదంతాశాకంభరీశివాదుర్గాభీమాభ్రామరులను షట్కోణం బులఁ బూజించి వసుదళంబుల బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి నారసింహి యైంద్రి చాముండికల శక్తులకు దత్వపత్రంబులఁ బూర్వక్రమంబుగ విష్ణుమాయ చేతన, బుద్ధి, నిద్ర, క్షుధ, ఛాయ, శక్తి, తృష్ణ, క్షాంతి, జాతి, లజ్జ, శాంతి, శ్రద్ధ, కీర్తి, లక్ష్మి, వృత్తి, శ్రుతి, స్మృతి, దయ, తుష్టి, పుష్టి, భ్రాంతి మొదలగు వానిం బూజింపవలయు. పిదప భూపుర కోణంబులయందు గణేశుని క్షేత్రపాలుని వటుకుని యోగినులను నర్చింపవలయు; నాపిమ్మట సాయుధులగు నింద్రాది దిక్పా లుం బూజింపఁజెల్లు; నిట్లు సావరణయగు దేవిం బూజించి సమస్తరాజోపచారం

బులఁ గావించి నవాక్షరమంత్రమును జపించి సప్తశతీస్తోత్రంబును దేవ్యగ్రంబునఁ బఠించునది. 1058

క. సప్తశతిం బోలినయది, ప్రాప్తించుట దుర్లభంబు పావనము శుభా వాప్తికి హేతువు దేవియు, నాప్తునిగతిఁ గాంచుఁ జదువునతని మౌనీ. 1059

క. ఏవిధిఁ గృతకృత్యత్వము, భావింపఁగఁగల్గు నరుఁడు; పావనమౌ నా దేవీపూజాప్రక్రమ, మావంతయు మిగులకుండ నంటి మునీంద్రా. 1060

చ. సురలు మునీశ్వరుల్ నరులు సూరులు రాక్షసయక్షకిన్నరే
శ్వరులుఁ ద్రిమూర్తులున్ సిరియు శాంకరి భారతియుం సమస్తది
గ్వరులును మంగళప్రదను గామితదాత్రిని లోకపూజ్య నెం
తురు మదులందు నిత్యమును దుర్గను దుర్గతిలేమికోసమై. 1061

గీ. తచ్చరణపద్మసేవావిధానమందు, నాటితేరుట నా భాగ్య మందినారు పదియునల్గురు మనువులు నదితిసుతులు, నిశ్చలముగ స్వస్థలముఁ నిల్పినారు. 1062

ఉ. ఐమవిధంబులం బరఁగు నాప్రకృతిన్ వివరించియుంటి సు
శ్రీదము తచ్చరిత్రము నెఱింగితి పూర్తిగ నామె యంశదే
హోదయమైన దేవతల యుత్తమవృత్తములం వచించితిన్
గాదనఁబోక గోప్యమును గాంచిన నీదగు పుణ్యమేమియో. 1063

క. ఇది విను పుణ్యచరిత్రుల, కుదయంబగు భాగ్యవృద్ధియున్ సకలవిధా భ్యుదయంబులు వంతమునఁ, సదమలమైనట్టి మోక్షసంపద యనఘా! 1064

మ. ఒకయధ్యాయము చొప్పునన్ బ్రతిదినం బుత్సాహియైగాని పూ
ర్వికతోడన్ నవరాత్ర్యహంబులనుగానీ చేయఁగా వేర్పునే
యకలంకాత్మకుఁ డీచరిత్రపఠనం బాద్యంతముంగూడ వా
నికి నాదేవియు దాసియై యలరు మౌనీ! సానురాగంబునన్. 1065

ఉ. పుత్రులఁగోరు మానవుఁడు పుత్రుల, విద్యలఁగోరునట్టి స
ద్ఛాత్రకుఁ డన్ని విద్యలను, సాంగవివృద్ధియుఁ గాంచనేర్చు నే
మాత్రము లోటు గల్గదు సుమా! యెది గోరిన నద్ది కల్గు స
ర్వత్ర శుభావహం బిదియుఁ బాపవిమోచకముం గుమారకా. 1066

చ. శకునపరీక్ష సేయనగు స్నానమొనర్చుచుఁ జేయిమోడ్చి దే
వికి నొకపీటఁ బొత్తమును బెట్టి తమిన్ శిరసంటికొన్న బా

లిక కరమందో, స్నానమొనరించికడుఁ శుచియైన బ్రహ్మచా
రి కరమునందొ భక్తి నలరించిన ధర్భశలాకచే మునీ. 1067

క. బంగారు శలాకఁ జో, న్నంగను విడిపడినయట్టి పత్రమునందున్
సంగతమగు నంశముచే, తం గలుగు శుభాశుభములు తర్కింపవలెన్. 1068

## స్కం ధాం త ప ద్య ము లు.

క. ఆరామభద్రామిదకుల, వారాన్నిధి పూర్ణచంద్ర ! వరగుణసాంద్రా !
సూరిస్తవనీయ యశః, పూరితభువనాంతరాళ ! బుధజనలోలా ! 1069

క. అకపటహృదయాంతర్ని, త్యకలితవిద్యాస్వరూప ! దాతృత్వశ్రీ
ప్రకటితనిజగేహోత్సవ !, సకలజగద్వంద్యకీర్తి ! సత్ప్రథవర్తీ ! 1070

క. వైయాకరణ శిరోమణి !, పాయంనటదీశమౌళిసంభృతగంగా
ప్రాయచ్ఛలదూర్మినిభ, శ్రీయుతకవితాగురుత్వచిహ్నితనామా ! 1071

## గ ద్య.

ఇది శ్రీ........తిరుపతి వేంకటేశ్వర కరుణాప్రసాదితరామకృష్ణాంధ్రీ
కృతమ్మగు దేవీభాగవతమ్మునందు
నవమస్కంధము సంపూర్ణము.



శా. సాకల్యం బొనరింప నేర్చియును విశ్వశ్రేయముం గూర్చు సు
శ్రీకళ్యాణదమైన కృత్యములఁ బాసిఁ బున్నెముల్ బంచఁగా
నాకాంక్షించియు ఆదినైదు తుది రెండధ్యాయముల్ పేర్మిమై
నాకుఁ పీడిన రామకృష్ణులకు సంధానింతుఁగ్రై మోడ్పులఁ.

క. తిరుపతి వేంకట కవిగురు, చరణాంబురుహప్రభావసంజనితకవి
త్వరమాయుతుఁడను నన్నం, దఱుఁ బిల్లూరు వేంకటావధాని సమాఖ్యన్.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః



# దేవీభాగవతము

## దశమస్కంధము

తిరుపతివేంకటవిద్వ, ద్వరకవితారసవిశేషవర్ధితకీర్తీ!
పరమార్థనియతమూర్తీ!, స్వరచితధర్మప్రవృత్తి! బ్రహ్మయశాస్త్రీ! 1

వ. అవధరింపు మట్లు పురాణకథనోన్ముఖుండగు వ్యాసునకు జనమేజయుం డిట్లనె.

క. పైకతవచియింపుము ము, శ్లోకం బఘహరము సకలశోకహరణమౌ
నేకత దాని వినఁగ నే, నేకతమున నింతమాత్రఁ దృప్తింగాంతున్. 3

వ. నావుడు వ్యాసుం డిట్లను, నట్లు నారదుండు. 4

క. ఓ నారాయణ! పాపా, జ్ఞానహరంబయిన దేవిచరితము వింటిన్
గానీ మన్వంతరముల, నా నిఖిలేశ్వరి స్వరూప మది యెటులుండున్. 5

గీ. ఎట్టి యాకారమునఁ బుట్టె నెట్టి లేరి
చేతఁ బూజింపఁబడియె నమ్మాత యెవరి
కోర్కులెటు తీర్చె? నది వినఁ గోరుచుంటిఁ
గానఁ గరుణించి తెల్పు మక్కథల ననుడు. 6

ఉ. నారద! యాలకింపు మఘనాశకము న్నిఖిలేష్టసిద్ధి కా
ధారమునైన దేవిచరితంబు, జగమ్ములతాత ధాత దై
త్యారికి నాభిపద్మమునయం దుదయించెను మానసేచ్ఛచేఁ
బూరుషు నొక్కనిన్ దలిరుబోణి నొకర్తు నతండుచేసినన్. 7

క. ఆయిరువురునున్ దంపతు, లై యలరిరి లోకవిదితమైన యభిఖ్యన్
స్వాయంభువమనువన నతఁ, డామెన్ శతరూపయనఁగ నాపె లసద్భువ్. 8

గీ. ఆ మనువు క్షీరసాగరప్రాంతమందు, జగదధీశ్వరిఁ గొల్చె నచలితభక్తి
నెద్దియును లేమి మృత్తుచే నెసక మెసఁగ, నప్పరాంబిక రూపంబు ననువుపఱిచి. 9

సీ. వాగ్భవమంత్రం బవాగ్భవంబుగఁ జేసి, యాహారమం దిచ్చ నాహరించి
శ్వాసద్వయస్థవిశ్వాసమ్ము విడనాడి, కామప్రసక్తి నికామమడఁచి

యతిరమ్యకాంత్యలంకృతమైన దేహమ్ము • సతతోపవాసకర్శితము చేసి
స్థిరయంద విరతమ్ము స్థిరుఁడయి యొక్కపా • దమ్ముచే విలిచి క్రోధమ్ము గెలిచి

గీ. స్థావరతఁదాల్చి మాఱువత్సరము లతుల
తపమొనర్చిన నతని కాతల్లి దర్శ
న మ్మొసఁగి 'రాజ ! కోరు వరమ్ము' లనఁగ
నమ్మహాదేవి కీగతి నతఁడు వొగడె. 10

ఉ. నీ కరుణారసమ్మునన నీరజసూతి సృజించుచుండు ర
మాకరుఁడౌఁ జతుర్భుజుఁడు శంభుఁడు నాశనముం బొనర్చు స్వ
ర్లోకము నింద్రుఁడేలు నవలుం డనిలుండును నాదిగాఁగలా
రో కరుణాస్వరూపిణి ! త్వదుద్భవులుం ద్వదుపాసకుల్ గదా. 11

గీ. తల్లి ! వరము లొసంగెది దావవేవి
నాయొనర్చెడి సృష్టి విఘ్నమ్ములేక
ప్రబలునటు లొనర్చుము వాగ్భవమ్ము జపము
సేయు వారలకు హితమ్ము సేయుమెపుడు. 12

గీ. ఎవ్వ రివ్వాదముం బఠియింతురో మ
ఱెవ్వ రిది విందురో వారి కెల్లరకును
భుక్తిముక్తులు వక్తృత్వము దయసేయు
మమ్మ ! వినువేఁడెద నటంచు నతఁడు వలుక. 13

క. మనుజాధిప ! వాగ్భవజప, మునకున్ మెచ్చితిని రాజ్యము నకంటకమున్
బొసరించి వంశకరులగు, తనయులఁగని పిదప మత్పదము చేరవగుణా. 14

గీ. అమచు నవ్వింధ్యవాసిని యరిగె వింధ్య, గిరికి నెయ్యది మును పల తరణిమార్గ
మునకు నడ్డగి కలశోద్భవుని కతమునఁ, గ్రుంగె; నన మునిజనము లకుంఠభక్తి. 15

చ. జననిమహత్వముం దెలుపు నద్భుద ! సూత ! భవద్వచోమృతం
బును గొనఁగాఁ గొనంగ రుచిపుట్టుచునున్నది. వింధ్యపర్వతం
బనవెది ? యద్ది సూర్యునకు నడ్డుగ నేగతివచ్చె ? నెవ్విధ
మ్మునఁ గలశోద్భవుండు నగమున్ బ్రకృతిస్థముచేసెఁ నావుడున్. 16

చ. వివిధలతావితానపరిపేల్లితమై బహుచిత్రపుష్పజా
తివిలసితమ్మునై వదనదీహ్నదయుంగమమై సుధాశనా

దివిహారణోచితంబయి ప్రదృష్ట మృగాకులమై మహీధర
ప్రవర మొకండు వింధ్యమన రాజిలు సర్వమహీధ్రపూజ్యమై. 17

గీ. అన్నగము కడ కొక్కెడ నమరమౌని, యరుగ నదియును సర్వ్యపాద్యాదులిచ్చి
యతని నొక యుచితాసనమందు నిలిపి, యిట్టులు వచించె గౌరవం బెసక మెసఁగ. 18

ఉ. ఎచ్చటినుండిరాక, మఱి యేమివిశేషములో వచింపుమో
సచ్చరితాగ్రగణ్య! యనిశమ్ము దివాకరురీతి సర్వలో
కోచ్చయలోలతన్ దిరుగుచుండు మహాత్ముఁడ వీవకావె నీ
వచ్చట యెల్లవేల్పులును వచ్చుట నావుడు నాతఁ డల్లనన్. 19

గీ. హేమగిరినుండి వచ్చితి నామహీధ్ర
మందుఁగల లోకముల నాలయములఁ గంటి
నవి యఖిలభోగముల నిచ్చు నవియటంచుఁ
బలికి యొకయూర్పు నిగిడించెఁ గలహభోజి. 20

వ. అంత నప్పర్వతం బీ విట్టూర్పునకేమి కతంబు వచింపు మనుటయు. 21

చ. శివునకు మామగారగుటచే హిమవంతుఁడు పూజ్యుఁడయ్యె; న
ట్లవసథమౌటఁ దానధికమై కొలువంబడు వెండికొండ; య
వ్వవివృతి చేయనేల? నిషధాద్రియు నీలము గంధమాదనం
బవియును బేరుగాంచినవియే యవిరాజ! యిదిట్టులుండఁగన్. 22

ఉ. నాకు దివాకరుం డనుదినంబు ప్రదక్షిణ మాచరించు నే
నేకద పేరు గాంచితి నిఁ కే నగముల్ నమఁబోలఁజాలు? ము
ల్లోకములందు నంచు మదిలోఁ గనకాద్రి యఖండగర్వమున్
జేకొని దేవిఁజెప్పినమ జేయ దొకించుకయేని లక్ష్యమున్. 23

క. అన్నగము బొగడు దలఁచి కొ, న న్నాకుట్పావన మడరె; నగ్గర్వ మ్ము
చ్ఛిన్నముసేయఁ దపంబున, నన్నియు నిడనెంచు మా కనర్హ మకాదే. 24

వ. ప్రసంగవశమ్మున నింతవట్టుఁ జెప్పవలసివచ్చె నిఁక నేగుదునే యనుచు వింధ్య
మాత్మఁ జింతించి, 25

క. అందఱు నాబల మధికం, బందురు మేరువు జయించి యాయాయశమున్
బొ దకయుండిన నాకీ, బొంది మఱెందులకు నిడుపఁబోలదె యింకన్. 26

చ. తనకు దినాధినాథుఁడు ప్రదక్షిణముగా బొనరించునంచుఁగా
కనకనగ మ్మఖర్వమగు గర్వము దాల్చుట మత్కరమ్ములం
దినకరమార్గరోధము విధించిన నాతఁడు తత్ప్రదక్షిణం
బొనరుపనేరఁ డగ్గిరికి నుండెడి గర్వము తప్పు నప్పుడున్. 27

క. అని తన భుజముల నాకస
మున ముట్టుచు దీర్ఘశృంగములు గలయదియై
యినుఁడెపు డుదయించునొ యా
తని నెపు డడ్డుదునొ యనుచుఁ ద్వరపడుచుండన్. 28

ఉ. రాతిరి వోవునంతఁ దిమిరంబు గనంబడదయ్యె వేగఁ బ్ర
ద్యోతుకరమ్ముల న్నభము ద్యోతితమయ్యెఁ గుముద్వతుల్ వికా
సాతిశయమ్ముఁ బద్మములు కర్పణసేయుటకగ్గె స్వీయకా
ర్యాతురులై జనుల్ మసలుటబ్బెఁ బ్రపంచకమందు నెల్లెడన్. 29

గీ. అంతఁ బ్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నభేద, ముఁదెలిపి హవ్యకవ్యముల్ భూతబలులు
దేవతల కీ నొనర్చుచు దినకరుండు, ప్రాచి నాగ్నేయి విడిచి సత్వరతదనర. 30

సీ. యామ్యదిక్కునకుఁ బ్రయాణంబుగా ననూ • రుండు 'మార్తాండః మేరువుజయింప
మీప్రదక్షిణము గామించి వింధ్యాద్రి యా • కస మావరించి ముంగల నిలిచెను
గాన విఁకేగ శక్యముగా ' దనినవిని • భానుఁ డాశ్చర్యమ్ము వడుచు గొప్ప
పదవి చెందిన శౌర్యవంతునకుం జేయ • రాని కార్యము లెవ్వియేని గలవె

గీ. అనుచు నొనరించు పనిలేక యట్లెయుండె • రాహు వరికట్ట క్షణము పర్యంతమేని
యాగని యినుండు వింధ్యరుద్ధాత్ముఁడగుచుఁ • జిర మటుండె విధి బలవ త్తరమకాదె·

గీ. ద్యుమణి యటులైనకతన లోకములు లోక, పతులు తల్లడమంది విఫలతగనిరి
యలరు స్వాహాస్వధాకారములు నశించె, నష్టతుల్యంబ యగుచుఁ గన్పట్టె జగము.

క. పరమట దక్షిణమున మం, దెడివా రది రాత్రియనుచు నిద్రంగొని ర
ప్పుడ ప్రాచ్యోత్తరాహులు, కడుఁ గడుఁ బీడింపఁబడిరి ఖరకిరణములఁగా. 33

గీ. ప్రజలు కొందఱు మడిసిరి బాధపడుచుఁ, గొందఱుండిరి జగములయందు, బయలు
వెడలె 'హాహా' రవంబు దివిషదు లింద్రుఁ, జేరి 'కింకరణీయ' మన్వారలైరి. 34

క. అంతట వారెల్ల శచీ, కాంతున్ వాక్కాంతు ముందుగా నిడికొని య
త్యంతార్తులగుచు గౌరీ, కాంతుని గనుఁగొని నుతింపఁగాఁ దొడఁగిరటుల్. 35

సీ. ఆర్తార్తిహరణాత్తకీర్తివిశేష ! కైలాసపర్వతకృతావాస ! విష్ణు
హృత్కంజవాస ! సంపత్కరా ! కరుణాకర ! సాలయా ! జగదీశ ! కాలకాల !
కాలస్వరూప ! మాయాలవాలా ! మహా దేవ ! వృషధ్వజ ! దీనరక్ష
అక్షీణవిభవ ! పరేశ ! విరూపాక్ష ! యోగగమ్యా ! మహాయోగనిరత !

గీ. యనుచు నొకమాటగా నెల్లరును నుతింప
విని మహేశుండు నగుచు "దివిషదులార
స్తుతిఁ బ్రసన్నుండనైతి మీహితము సేయు
వాఁడఁ దెల్పుండు" నాఁగ దేవతలు ననిరి. 36

గీ. దేవ ! వింధ్యాద్రి మేరువిద్వేషి యగుచు, భాను నరికట్టఁ గాల మేర్పడక యుండెఁ
గ్రియలు సేయుట తప్పె; నీ కిఁకను మాపి, ప్రోవుము సమ్మునఁ గ్రతుభుజులు వేఁడ.

చ. క్రతుభుజులార ! మీ నుడువు కార్య మశక్యము నాకుఁ జేయ; న
చ్యుతుఁ డఖిలక్రియాకృతిఁ బ్రయోజకుఁ డస్మదధీశుఁ డౌటచే
నతనికి దెల్పఁగన్ మనకు నబ్బిన పేగిఁ దొలంగు నం చుమా
పతి యనఁ దత్సమేతులయి బ్రహ్మముఖుల్ సని రచ్యుతున్ గనన్. 38

క. చని దేవదేవు భువనా, వనదీక్షితు వనరుహాక్షు వైకుంఠవిభున్
గని గద్గదస్వరము పెం, పున నిట్లు నుతించి రధిక మోదంబలరన్. 39

క. జలచరమ వగుచు సోమకు, జలనిధ్యంతర్విలీనుఁ జంపియు వేద
మ్ముల నుద్ధరించితివిగా, జలజాక్ష ! భక్తపక్ష ! శక్తకటాక్షా ! 40

క. కూర్మంబవై పయోధ్యం, తర్మగ్నము నగమునెత్తి త్రావించి సుధన్
నిర్మృతుల నమ్మఁ జేయవె, ధర్మావనపక్షపాతి ! దైత్యారాతీ ! 41

క. ధర నుద్ధరించుటకు సూ, కరరూపము స్వీకరించి గర్వబలాను
త్తరుఁడైన హిరణ్యాక్షు న, సురహితు నణఁపవె ! మురారి ! శోకవిదారీ ! 42

క. నరసింహరూపమున్గొని, ఖరనఖరమ్ముల హిరణ్యకశిపున్ లోకాం
తరగతుఁ జేయవె ! జగదు, ద్ధరణసమాసక్తచిత్త ! దానాయత్తా ! 43

క. వామనుఁడవై బలి న్నిజ, ధామము లీగంగఁ జేసి తద్ధామము సు
త్రాముం గొసంగవే ! యు, ద్దామపరాక్రమవిశిష్ట ! తాడితదుష్టా ! 44

క. జమదగ్నిసుతుఁడవై శౌ, ర్యమదసముత్సృష్టదుష్టరాజావళి నా
శము నొనరించి యమేయయ, శము గొనవె ! మహానుభావ ! జగతీదేవా ! 45

క. దశరథునకుఁ దనయుఁడవై, దశముఖముఖదితిజమారణతతిఁ ద్రుంచి విప
ద్దశ మాకుం దొలఁగింపవె ?, విశదబలాత్యమపమాన ! విష్వక్సేనా ! 46

క. నందతనూజుఁడవై కం, సుం దునిమి యధర్మ మెందుఁ జొరనీక మహా
నందమ్ము ధరణికీవే ?, వం దార్యానందదాయి ! ఫణిపతిశాయీ ! 47

క. పశుహింస మాన్పుటకు బౌ, ద్ధశరీరము దాల్చి గర్హితమఖవిఘాతా
తిశితవచనములు సెప్పవె ?, నిశితప్రజ్ఞావిచిత్ర ! నిఖిలచరిత్రా ! 48

క. జగమెల్లఁ దుచ్ఛరాజ స, శగమై మ్లేచ్ఛానుకారిజనయుతమై పా
డుగనుండఁ గల్కివై బా, గుగఁ జేయవొకో ? ముకుంద ! గుణగణకందా ! 49

గీ. ఎట్టి గర్భ్యస్వరూపమ్ము లేవి దాల్చి, యార్తులగు భక్తుల భరింప, నపశదులగు
దైత్యుల హరింపఁగద ! యిట్టిదయ మతేరి, కైనఁ గల్గునె ? దేవదేవా ! యనంత.

వ. అని ప్రార్థించుటయు, 51

సీ. దేవతలార ! నుతిం బ్రసన్నుఁడనైతి • దుస్సహంబైన మీదుఃఖమిపుడ
పోనాసర్చెదఁ దాపముం బొందవలదు దు • ర్లభమైనదేవి వరంబుప్రీతి
నిచ్చెదఁ గొనుఁ డెవ్వ రీ స్తోత్రమును భక్తిఁ • బెంచి ప్రొద్దుటఁ బఠియించువారొ
వారికి దుఃఖసంబంధంబు గలుగదు • గ్రహబాధ మొదలగు కష్టములు మ

గీ. తెవ్వియుం గల్గవు సుఖమ్ము లెన్నియేని • గల్గు సంతతిగల్గు నకాలమరణ
మమట పుట్టదు రోగముల్ గనుటయేని • సంభవింపదు లక్ష్మిప్రసాద మొదవు. 52

గీ. పలుపలుకులేల భుక్తిముక్తుల నొసంగు
నట్టి దీ స్తోత్రమే మీకు నడరు దుఃఖ
ముమ వచింపుఁడు పరిహరింతు నన ముదిత
హృదయులై దేవతలు హరి కిట్టు లనిరి. 53

క. దివకరమార్గవిరోధ, మ్మును వింధ్య మొనర్చె దాన భోగమ్ములు వొం
దనివారమై విమం గనుఁ, గొన నేతెంచితిమి రక్షకుఁడ వీవగుటన్. 54

చ. అనుటయు లోకకర్తయగు నంబికఁ గొల్చుచుఁ గాశికాపురిన్
దవరు వగస్త్యుఁడ ప్మవిపతంసుఁడు వానిన వేఁడికొండు విం
ధ్యనగము ప్రద్ధి పెంచన యొనర్చు సమర్థుఁ డతండనన్ క్షణ
మ్మున సురాలెల్లఁ గాశికకుఁ బోయి యటన్ మణికర్ణికన్ దగన్. 55

క. స్నానప్రముఖసమస్తవి, ధానములం దీర్చికొని మదకలితమృగవ్యా
ళానీక శ్రీరమ్యం, బైన యగస్త్యాశ్రమమున కరిగియు నచటన్. 56

వ. లోపాముద్రాన్వితుండై యున్న యమ్మునికి సాష్టాంగం బెఱఁగి. 57

సీ. కుంభసంభూత! విశ్వంభరాసురనేత!, వాతాపిహననవిఖ్యాత చరిత!
మిత్రావరుణపుత్ర! స్మృతిపురాణాదివి, ద్యానవద్యప్రతిభానిరూప్య!
నహుషసముత్పాటనక్రియాదక్షహుం, కరణ ప్రభావ! సత్కార్యనిరత!
ఉదయమాత్రవినిర్మలోదకీకృతిసమ, స్తనదీక! ఋషివరిష్ఠ! యగస్త్య!

గీ. శైలకృతశోకవహ్నిజాజ్వల్యమాన, హృదయులమగుచు నీవు గాచెదవటంచు
వచ్చినారము మమ్ముఁ గాపాడుమయ్య, యనుచు నమ్ముని మందహాసాన్వితుఁడయి.

సీ. నిగ్రహానుగ్రహోదగ్రశక్తులగు మీ, రానరింపలేకుండు పనియుఁ గలదె
వజ్రాయుధము దాల్చు స్వర్నాథునకుఁ జేయ, శక్యమ్ముగాని కర్జమ్ము గలదె
క్రతుభుగావళికి ముఖమ్ము గదా! వహ్ని, యతనిచేఁ గాని కార్యమ్ము గలదె!
ద్రష్టుమశక్యప్రతాపశాలియగు భా, స్కరదేవునకును దుష్కరము గలదె!

గీ. దండహస్తునకును నసాధ్యంబు కలదె!, యైన నాచేతనగు కార్య మబ్బెనేనిఁ
జెపుడు నిస్సంశయమ్ముగఁ జేయువాఁడ, ననుడు సంతసమంది యిట్లనిరి సురలు.

క. అంబరమాణిమార్గము విం, ధ్యం బరికట్టఁగ జగమ్ములన్నియుఁ గడుఁ గ
ష్టం బొందినయవి యవివ్వృ, ద్ధిం బోఁగొట్టుము తపఃప్రదీపితశక్తిన్. 60

గీ. నిజముగ నగమ్ము నమ్రమౌ నీదుమహిమ
నీవు చేయంగఁదగు కార్యమిదియ యనుడు
ఋషి యొనర్చుట కంగీకరింప సురలు
చని రతం డిట్లు లవెఁ దనచావ గుఱిచి. 61

మ. నృపపుత్రీ! యిచటన్ వసించుటకు నిప్డేతెంచె విఘ్నమ్ము విం
ధ్యపరిస్తంభన చేయు నక్కృతిన, మోక్షాపేక్షకుల్ గాశి నో
క్కపుడున్ వీడఁగఁ గూడదంచు మఱిఁ గాశ్యావాసులౌ వారికే
యెపుడున్ విఘ్నము గల్గునంచు'ననరే! యిందిందిరాభాలకా! 62

క. అని యమ్మణికర్ణిక న, మ్ముని స్నానముచేసి కుతుకమున విశ్వేశుం
గని దండపాణికిం బూ, జన మొనరిచి కాలరాజసమ్ముఖమునకున్. 63

మ. చని కాశీపురవాసివిఘ్నహర! దాసస్వాంతవాసా! ననుం
జను లీ దుష్కృతి చేసినాఁడనుచు నెంచన్ బో, రిఁకే కర్మవా
సనచేఁ గాశిని వీడఁజేసెదవు దోసంబెద్దియే నుండెనే!
యనుచుం బ్రార్థనచేసి సాక్షిగణపత్యభ్యర్చనల్ సేసియున్. 64

గీ. దక్షిణపు దెసపట్టి యతండు సారె, సారెకుం గాశిఁ దలఁచుచు క్షణములోనఁ
దన తపమ్మను రథము నెక్కిన విధానఁ, జనియె సస్త్రీకుఁడై వింధ్యసవిధమునకు.

శా. అంతన్ వింధ్యనగమ్ము గన్గొని స్వకీయోద్ధత్యమున్ వీడి య
త్యంతాల్పంబయి దండరీతిఁబడి సాష్టాంగప్రణామంబు శు
ద్ధాంతర్వృత్తి నొనర్పఁగా నతఁడు వత్సా! గండశైలమ్ములం
దెంతేఁ గష్టము గల్గు నెక్కుటకునై యే దుర్బలుండన్ జామీ. 66

గీ. కావ నే వచ్చు సందనుకను నిటులనె, యుండుమని చెప్పి యయ్యగస్త్యుండు దాని
శిఖరములఁ గ్రమముగ నధిష్ఠించి దక్షి, ణగతిగాఁ జని శ్రీశైలము గనుఁగొనియు.

క. మలయాద్రిఁ గృతాశ్రముఁడై, నిలిచెన్; వింధ్యాద్రి యట్టె నిలిచెన్; మనుపూ
జలఁగొని దేవియు దాసన, నిలిచెన్ దా వింధ్యవాసినియనఁ దనరుచున్. 68

సీ. శత్రునాశకము పవిత్రంబునగు నీ య • గస్త్యవింధ్యాద్ర్యుపాఖ్యానము విన
విప్రులకును జ్ఞానవృద్ధి నిచ్చెడు రాజు • లకు నిరాహతజయలక్ష్మి నొసఁగు
ధనధాన్యముఖసమస్తపదార్థవృద్ధి వై • శ్యులకుఁ గల్గించు శూద్రులకుఁ బాడి
పంటల సుఖముల భద్రమ్ములం గూర్చు • నర్థకాంక్షుల కధికార్థ మిచ్చుఁ

గీ. గామికి హితమ్ములిచ్చు విక్కరణిదేవిఁ • గొలిచి స్వాయంభువమనువుగొనియె రాజ్య
మిదియ మన్వంతరాశ్రయవిదితమౌ ప • రాంబిక చరిత్ర మిఁక నేమి యడుగుదురని.

వ. సూతుం డనుటయు శౌనకాదులు మహాత్మా! యాద్యుండగు స్వాయంభువుని చరిత
వింటిమి. క్రమమ్ముగఁ దక్కంగల మనువుల చరిత్రంబులు వినఁ గుతూహలాయ
మానమానసులమై యుంటిమి తెలుపుమనుడు నతండు నిట్లుపలుకు నట్లు నారాయ
ణుండు నారదుంగాంచి, 70

గీ. ప్రథమమనువగు స్వాయంభువవిభునకు సు, తులు ప్రియవ్రతోత్తానపాదు లనఁగలరు
వారు భూపాలనం బనిర్వారణగతిఁ, గా నొనర్చి యఖండ విఖ్యాతిగనిరి. 71

సీ. రెండవ మనువు ప్రచండబలుండు ప్రి • యవ్రతసుతుఁడు సత్యవ్రతుండు
స్వారోచిషాఖ్యుఁడవ్వాఁడు కాళిందీత • టమ్మున సర్వసత్త్వమ్ములకుఁ బ్రి

యమ్ము సేయుచు నివాసమ్ము చేసికొని జీ • ర్ణమ్ములై తనరు పర్ణములు తినుచు
దేవిరూపమ్ము మృత్తికచే నొనర్చి త • త్పూజ సేయుచు భక్తితోఁ దపమ్ము
గీ. ద్వాదశాబ్దమ్ము లొనరింప దళశతార్క • సమనిజద్యుతిరూపయి జగజ్జననివక్త్ర
నమ్మొసఁగి నుతిచేఁ బ్రసన్నయయి యాద • రమున మన్వంతరాశ్రయ రాజ్యమిచ్చె.
క. తారణియనఁ దాఁబరఁగెన్, స్వారోచిషమనువు తత్కృపన్ బుత్రులతో
ధారుణి నేలి సుఖాతి, శ్రీరాజిలి స్వర్గమునకుఁ జేరెన్ బిదపన్. 73
గీ. మూఁడవ యతని పేరుత్తముఁడు ప్రియవ్ర
తతనయుఁ డతఁడు మూఁడు వత్సరము లుపవ
సించి గంగాంతికమున జపించె నంత
దేవి ప్రత్యక్షముగ నరుదెంచుటయును. 74
క. స్తుతిఁదనిపి రాజ్య మప్రతి, హతగతిఁగొని సుతులఁగని సుఖాన్వితుఁడై సం
గతధర్మవర్తనుండయి, యతఁడుగా రాజర్షిసేవ్యమగు పదమందెగా. 75
సీ. తామసుండను పేరఁ దనరు ప్రియవ్రత • తనయుండు నాల్గవ మను వతండు
నర్మదానది దక్షిణపుఁ దీరమునఁ గామ • రాజకూటజపపరాయణుఁడయి
చైత్రమ్మునందు నాశ్వయుజమ్ము నందును • నవరాత్రిపూజ యొనర్చుచుఁ బర
మేశ్వరికిం బ్రీతి నెంతేఁ గలుగఁ జేసి • తదతిపూర్ణ ప్రసాదమ్ము కలిమి
గీ. శత్రువిరహితమైన రాజ్యమ్ము నొంది • పదిః సుఖమంది శౌర్యబలాధికులగు
పుత్రులఁ బదుంద్రఁ గని యంత భూమి విడిచి• యంబరమ్మును బొందె ననంతసమున.
గీ. అతని యనుజుండు రైవతుఁ డైదవమను
వతఁడు కాళిందితటిని గామాఖ్యబీజ
మును జపించి స్వారాజ్యార్థమునకు నధిపుఁ
డయి సుతులఁగాంచి పొందె లోకాంతరంబు. 77
క. చాక్షుషుఁ డాఱవ మను వం, గక్షితినాథు సుతుఁ దతఁ డఖండతరతపో
ధ్యక్షుఁ బులహు బ్రహ్మర్షిగా, వీక్షించి మహాత్మ! నిన్ను నే శరణంటిగా. 78
గీ. నీకుఁ గింకరుఁడను ధరణీప్రభుత్వ, మద్దులేని భుజబల మ్మనంతసంత
తియుఁ జిరంజీవితయును ముక్తియు లభింప, నెద్దియే నుపదేశింపవే యనవుడు.
క. పుహాండు దేవదేవున్, గొలువుము తత్కృపను నీవు కోరుకులెల్లన్
ఫలియించు ననుటయును నె, ట్టులు గొలువఁగ వలయు ననవుడు నతండనియెగా.

సీ. దేని జపించుటచే నంబుజభవుండు • జగముల సృజియించు జాణయయ్యె
దేని జపించుటచే నుపేంద్రుఁడు రక్ష • కత్వమ్మునందుఁ బ్రకాశతగనె
దేని జపించుటచే మహాప్రియుఁడు ల • యమ్ము సేయఁగ శక్తినంది మించె
దేని జపించుటచే నెల్ల దిక్పతుల్ • రక్షింప శిక్షింప దక్షులైరి

గీ. దేని జపియించు వారి కెందేని హాని • పుట్టదో యట్టి వాగ్భవమున్ జపింపు
మదియ నీకోర్కు లొనఁగూర్చు నన నతండు • తత్క్షణమ విరజానదీతటికిఁ బోయి.

వ. పల్లవాహారుండై యొక్కయేఁడును జలాహారుండై మఱియొక వత్సరమ్మును బవనభక్షకుండై యిఁక నొక యబ్దంబును నిరాహారుండై స్థాణువుంబోలెఁ దొమ్మిది వత్సరమ్ములును వాగ్భవమంత్రంబు జపించుటయు నజ్జగజ్జనని యెదుటం గనుపట్టి 'నీకోర్కి చెప్పు' మనుడు. 82

గీ. తల్లి ! యెల్లర కంతరాత్మవగు నీవె. యెఱుఁగని నాకోర్కిగలదె యైనఁ గృప ! దర్శ
నం బొనఁగి యడిగితివిగాన వచియింతు. నఖిల మన్వంతరవిభుత్వ మభిలషింతు.

ఛ. అనవుడు నట్లు యిచ్చితి మహామహంలో సుతు లుద్భవింత్రు నీ
వొనరుచురాజ్యమం దెపుడు నుండదు లోపము మోక్షమబ్బు నం
చును వరమిచ్చి యంబ చనె; కూరులఁ బుత్రులఁగాంచి సార్వభౌ
మనియతసౌఖ్యమంది మనుమాన్యుఁడునై యతఁడొందె ముక్తియున్. 84

క. వైవస్వతుఁ డేడవ వాఁ, డైవలుజా శ్రాద్ధదేవుఁడనఁ బరమానం
దావహుఁడన వాతండున్. దేవీకృప రాజ్యమున్ దుదిన్ ముక్తిగొనెన్. 85

గీ. ఎనిమిదవవాఁడు సావర్ణి యనఁగఁ దనరు
నతఁడు జన్మాంతరమునఁ బరాంబఁగొలిచి
యొసఁగె కృపకల్మి మన్వంతరాశ్రయాధి
నాథుఁడయ్యె ననంగ నన్నారదుండు. 86

వ. సావర్ణి జన్మాంతరమున నెట్లు పూజించెఁ దెలుపుమనుటయు, 87

ఉ. యాచకులకా గఱించెడి మహాత్ముఁడుఁ జైత్రకులోద్భవుం డనం
కోచవరాక్రమక్రముఁడు గోవిదుఁడుం గవియుకా నయాశ్రవి
ద్యాచతురుండునైన సురథాఖ్యుఁడు మానధనుం డొకండు స్వా
రోచిషకాలమందుఁ దనరున్ ధనధాన్యసమృద్ధిమంతుఁడై. 88

గీ. అతని నగరమ్ము నరికట్టి యరులు ధనము
పుచ్చికొని యప్పురమునుండి పోదలుమంగ
వాజినెక్కి యొక్కండయై భ్రాంతచిత్త
వృత్తి నాతం డరణ్యమ్ములెల్లఁ దిరిగి. 89

క. అతిశాంతం బతిరమ్యము, యతియుతమగు దీర్ఘదృష్టి యాశ్రమముం గాం
చి తదభిమతహృదయతఁ గొం, త తడ వటన్ గడపి కృతవిభాను మునీంద్రున్.

ఉ. కాంచి నమస్కరించి తన కష్టములెల్ల వచించి పూర్వమం
దించుక జ్ఞానముండె నది యిప్పుడు రాజ్యమునున్ హరించి నకా
వంచితుఁజేసినట్టి వరపాలురచేత హరింపఁగాఁబడెన్
గొంచెము యేనియున్ మమతగ్రుంగదు పోయినరాజ్యలక్ష్మిపై. 91

గీ. ఏమిచేయుదు నాదుఃఖమెట్లుతప్పుఁ, జెప్పుమయ్య నీదయ నపేక్షించువాఁడ
ననఁగ ముని యను దేవిమాహాత్మ్య మమ్ము, తకరము సకలాభీష్టప్రదమ్ము సుమ్ము.

సీ. బ్రహ్మవిష్ణుశివోద్భవయు జగన్మయియు నౌ • మాయ మోహమ్ము సమస్తజంతు
వులకును గలిగించుఁ దలఁప నద్దియ సృష్టి • సేయుఁ బాలించు నశింపఁజేయు
నదె కాళరాత్రి దురత్యయ కాళి మ • హాలక్ష్మి కామద యనఁగనొప్పు
దానియందె జగమున్నవమౌఁ బ్రతిష్ఠిత • మౌ లయమ్మునుబొందు నక్కతమున

గీ. నది పరముకన్నఁ బరమగు నట్టి దేవి
కరుణ యెవ్వనిమీఁదఁ గలుగునో య
తండు మోహమ్మువొందఁ డన్యుండు తాదృ
శుండు గానేరఁడనఁగ రాజు ముని కనియె. 93

గీ. అమ్మహాదేవి యెవ్వరో యాపెరూప, మెట్టిదుండునొ పుట్టుట కేమికార
ణంబు జంతుసంతతికి మోహంబు గలుగఁ, జేయఁగాఁ గారణంబేమి చెప్పుమయ్య.

గీ. అనుటయు ముని వచించు నారాయణుండు, విశ్వము హరించి యోగరాడ్వృత్తిశేష
నాస్తరణసేసికొని సంద్రమందు నిదుర, వొందఁ దత్కర్ణమలమున నుద్భవించి.

క. మధుకైటభులను దానవు, లధికభయంకరశరీరులగుచు విధాతన్
వధియింపఁగడఁగ నాతం, డధిగతనిద్రు హరిఁ గాంచి యత్యార్తుండై. 96

శా. నాకై యెంతటికష్టముల్ గలిగినన్ దానే నివారించు ల
క్ష్మీకాంతుండు సుషుప్తిఁ జిక్కువడె నక్షీణప్రతాపోగ్రులీ

రాకాసులల్ నిలువంగనీ రెటులహో ప్రాణంబులిప్డాఁగునో
యీకష్టం బెటుదాఁటునో యనుచు నెంతేఁజింతమై నంతటన్. 97

క. ఏనిద్రాధిష్ఠాత్రికి, శ్రీనాయకుఁడు వశముపడి చెందె విన్నిదురఁ కా
దానిఁ బరాంబ శరణుఁ గొన, నౌను హితాప్తియని నిశ్చయముగొని పిదపన్. 98

గీ. దేవి పీగతిఁ బ్రార్థించె దేవదేవి!, దానశివదాయినీ! జగత్కారి! పరాత్మ
శయన! నీయాజ్ఞకు వశపడియకద తమ, కృత్యములఁ దీర్చికొనియెద రెల్లవారు.

వ. మఱియుం గాళరాత్రి మోహరాత్రి ప్రముఖనానాస్వరూపమ్ములనొప్పు నీకు నమస్కారమ్ము; నీచే గృహీతుండగు భగవంతు రమేశు మేలుకొల్పుము. వన్నిదురాత్ములగు రక్కసులు పీడించుచున్నవారని వేఁడుటయు నయ్యంబ దయార్ద్రయై హరిని విడిచి రాక్షసుల మోహపయుల నొనర్చె; నంత హరియును నవ్వారలఁ బూర్వోక్త క్రమమ్మున వధియించె; నారక్కసుల మెదడు భూమియయ్యెఁ; నియ్యది మహాకాళీ జన్మప్రకారం బింక మహాలక్ష్మ్యుత్పత్తి నాకర్ణింపుము 100

క. మహిషీగర్భోద్భూతుఁడు, మహాబలపరాక్రముండు మదగర్వితుఁడౌ
మహిషాసురుండు దేవవి, పహముగెలిచి లోకములకుఁ బ్రభువై యుండెన్. 101

గీ. తత్పరాజితులయి దేవతలు పురముల, విడిచి బ్రహ్మను ముందుగా నిడికొని హరి
హరులుగల లోకమున కేగి యతితరార్తి, కలితవచనులై వారితోఁ బలికిరిట్లు.102

సీ. అస్మత్ప్రభువులార! యసురశిక్షకులార! • యవధరింపుఁడు మహిషాసురుండు
బలపరాక్రమగర్వకలితుఁడై మమ్ము జ • యించి మా స్థానమ్ములెల్ల ననుభ
వించుచున్నాఁడు వేగవాని వధింప • వలను యోజింపఁగావలయు ననుడుఁ
గోపమ్ము గలిగిన శ్రీపతి మొగమున • నుండి సహస్రసూర్యోపమాన

గీ. మైన తేజమ్ము పుట్టెఁ గ్రమానుగతిని • గోపదీపితరుద్రవాణీపతిముఖ
దేవతల దేహములనుండి తేజము లద • యించె నెల్లర కానంద మెసక మెసఁగ.

వ. అందు శంభుసంభూతమ్మగు తేజమ్మున మొగమ్మును, యామ్యతేజమ్మునఁ గేశమ్ములును, వైష్ణవమ్మున బాహువులును, సౌమ్యమ్మున స్తనమ్ములును, మాహేంద్రమ్మున మధ్యమ్మును, వారుణమ్మున జంఘోరువులును, భౌమ్యమ్మున నితంబంబులును, బ్రాహ్మమ్మునఁ బాదమ్ములును, సౌరమ్మునఁ బాదాంగుళులును, వాసవమ్మునఁ గరాంగుళులును, గౌబేరమ్మున నాసికయుఁ, బ్రాజాపత్యమున దంతమ్ములును,

పావకమ్మున నేత్రత్రయమ్మును, సాంధ్యమ్మున బొమముడియును, వాయువ్యమ్మునఁ గర్ణమ్ములునుగా నెల్లర తేజఃపుంజమ్మున మహిషాసుర మర్దని యను నంబ పుట్టుటయు. 104

సీ. శివుఁడు శూలమ్ము విష్ణువు చక్రమును వరు • ణుండు శంఖము ననలుండు శక్తి
యనిలుండు చాపసాయకముల నింద్రుఁ డై • రావతఘంట వజ్రమ్ము జముఁడు
దండఖడ్గముల శుద్ధమగు చర్మమును బ్ర • హ్మ కమండలువు నక్షమాల నినుఁడు
కిరణమాల సరిత్పతి రుచిరహారము • నంబరమ్ములఁ గుండలమ్ముల మణి

గీ. కటకముల నూపురమ్ములఁ గంఠభూష • ణమ్ము నర్ధచంద్రుని యక్షనాయకుఁడు సు
రాకలశ శేషుఁడు ఫణిహారమును ద్వష్ట • యుంగరము హిమవంతుఁడు సింగమునిడి.

క. వారెల్లరు నచటంగల, వారెల్లరు నతులొనర్పఁ బరమేశ్వరి దు
ర్వారబలుఁడు మహిషుని సం, హారం బొనరింపఁగా మహాధ్వని చేసెన్. 106

గీ. అంతమాత్రన భయమంది యద్దనుజుఁడు, సైనికులఁ దీసికొని యాకసమ్ము నస్త్ర
శస్త్రములఁ గప్పుచును జగజ్జననితోడ, నెదిరికొని యుద్ధమునొనర్పఁ గదియునంత.

వ. దేవి రోషరూషితాక్షియై చిక్షురదుర్ధరదుర్ముఖబాష్కలబిడాలవదనప్రభృతియోధాగ్ర గణ్యుల నుక్కడంచుటయు. 108

క. మహిషుండు కనలి మాయను, బహురూపమ్ములనుఁ దాల్పఁ బరమేశ్వరి దా
ని హరింపఁజేయఁ దుదకున్, మహిషాకారమ్ము గొనియు మార్కొనునంతన్. 109

గీ. పాశమునఁగట్టి తలఁగొట్టి భగ్నపఱచె
మఱియుఁ దత్సైనికుల రూపుమాపె దేవ
తలు ప్రమోదమ్ము నంది రిట్లెలమి లక్ష్మి
మహిషమర్దనియై పుట్టె మనుజనాథ! 110

వ. ఇంక సరస్వతి యావిర్భవించిన తెఱం గెఱింగించెద నాలింపుము. 111

చ. సురల మదంబుపెంపుమెయి శుంభనిశుంభులు పీడవెట్ట స
త్వరగతి వారలెల్ల హిమవన్నగమేగి పరాంబఁగూర్చి "శాం
కరి! విజభక్తసౌఖ్యకరి! గర్వితరాక్షసనాశకారిణీ!
హరిహరపద్మజాదిదివిజాత్మిక! యంచు నుతించి యంతటన్. 112

గీ. తల్లి! శుంభనిశుంభబాధల సహింప, లేక నిను శరణంటి మేలీలనేని
మమ్ము రక్షింపు మన జగన్మాత కతము, దెలుపుఁడనునంతఁ గోశమ్మువలనఁబుట్టి.

క. కౌశికియను నొకశక్తి సు, ధాశనులార! వరమిడుదు నడుగుఁడనఁగా దే
వీ! శుంభనిశుంభాసుర, నాశనమొనరింపఁ బ్రార్థన మొనర్తుమనన్. 114
క. రాకాసులఁ బోకార్చెద, శోకము మీకేల యింక సుఖముండుఁ దటం
చా కె యదృశ్యయగుటయు, న్నాకౌకసు లేగిరి సుఁనగగుహ కంతన్. 115
ఉ. సుందరమైన రూపు పడుచుందనముం గలదై నిశుంభు శుం
భుం దగఁగొల్చు చండునకు ముండునకున్ బరశక్తి కన్పడం
గం దమరాజు శుంభు సముఖమ్మునకున్ జని వాండ్రు చెప్పి రా
క్రందితశత్రులోక యొక కామినిఁ గంటిమి లోకమోహినిన్. 116
క. మనుజాంగనలున్ మన యం, గనలుగా గంధర్వరాజకాంతలు త్రిదశాం
గనలున్ నాగాంగనలుగా, గనఁదగ రా పువ్వుఁబోఁడిఁ గను కన్నులతోన్. 117
గీ. దాని యొయ్యార మదియు వింతయని చెప్పఁ
దరమె! తద్భోగమున కర్హతగలవాఁడ
వీవె కావున దాని నెట్లేని రా నొ
నర్చికొని మేటి సుఖము లందంగఁ దగదె. 118
క. అనుటయు విని శుంభుఁడు దూ, తను సుగ్రీవుఁడనువానిఁ దక్షణమునఁ బం
ప నతం డంబిక సముఖ, మ్మునకుం జని శుంభు మహిమముఁ దెలిపి పిదపన్.
గీ. అతఁడు నీకుఁ జెప్పుమనిన యట్టిది విను, మసురసురనరరత్నము లనుభవించు
వాఁడ నీవు రత్నమవౌటఁ ద్వత్పుణాను, భూతి నాయది రతులఁ దన్పుము మృగాక్షి.
చ. అనవుడు శుంభుఁడాడు విధమంతయుఁ దెల్పితి వస్లెకాని యే
నొనరిచికొంటిఁ జిన్నపుడ యొక్కప్రతిజ్ఞ "యెవండు యుద్ధమం
దు నను జయించు వాని కగుదున్ సతి" నం చది తప్పరాదు గా
న నటులొనర్పఁ జెప్పుము మనమ్మగునే? మఱి వాని కిద్దియున్. 121
గీ. ప్రతినవట్టుట యిట్లంటి బలియుఁడతఁడు
ప్రతిన నెఱవేర్చి ననుఁ జెట్టఁ బట్టఁ గలఁడు
చను మనుడు దూత దేవి వచనము శుంభు
నకుఁ దెలుప రోషరూషితాననుఁ డతండు. 122
వ. ధూమ్రాక్షునకుఁ దన కెదురాడిన దానిఁ గొప్పుం బట్టి యెదుటికిం దెచ్చుటకు నాజ్ఞ యిచ్చుటయు నవ్వాఁ డఱువదివేల రక్కసుల వెంటఁబెట్టికొని యంబిక సమక్ష మునకరిగి యుచ్చైస్స్వరమ్మున. 123

క. నీయంత నీవ శుంభు న, మేయ బలం బొంది సుఖసమృద్ధిఁగొమకు లే
దా యేఁ గచమ్ముగొని కొని, యోమెదఁ దత్పన్ని ధానమునకు వనవృకున్. 124

గీ. నిక్క మీ వట్టివాఁడ వనియుఁ బరాంబ, నీ ప్రభువు సీవు చేయుపనిఁ దెలుపుమని
హుంకృతిన వానిఁ జంపుటయుఁ దదితరులఁ, వాహనమ గాసివెట్టి నవ్వారలెల్ల.

సీ. అర్భుచ నలుదెసలందు నిండఁగ శుంభుఁ • డాప్రవృత్తి నెఱింగి యార్తకోష
కుటిలితభ్రుకుటియై పటుతరుఁ జంకు ముం • దుని ర క్తబీజునిఁ బంపఁ గ్రమము
గా మూగురును నేగి యామహేశ్వరి గ్రహిం • పఁగదంగి నేలపైఁబడఁగ నంత
శుంభనిశుంభు లుజ్జృంభతత్పరాక్రమ • మ్మున మిక్కుటపు యుద్ధము నొనరించి

గీ. అంబకు వశమ్ము పడి మరణంబు చెంద • విబుధులెల్లరు నానందవివశులైరి మ
తించి రియ్యదియ సరస్వతీచరితము • శ క్తియు సృజించుఁ బాలించు సంహరించు.

వ. కావున మహామాయయు మోహనివారిణియునగు నయ్యంబ నారాధించితివయేని
మోహమ్ము విన్నంటదు రాజ్యంబు వొందెదవని పులహుండు దెల్పుటయు వప్పార్థి
వుండు విసృష్టాహారుండై తనర క్తము బలియిచ్చుచు మృణ్మయంబగు దేవీమూర్తిని
యథోచితమ్ముగఁ బూజించుటయు నయ్యంబ ప్రత్యక్షంబై. 127

క. వర మడుగుమనుడు మోహము, హరియింపఁగ మరలరాజ్యమందఁగ నిడు మీ
శ్వరి! యన నట్లగు నీఁకనొక, వరమిచ్చెద దాన దీనిపై ష్టపువవన్. 128

గీ ప్రభుఁడవగుదువు మన్వంతరమున కఖిల, సంపదలు గల్గునని జగజ్జనని చనియె
నతఁడు మన్వంతరప్రభువయ్యె నీద, రితముఁ జదివిన వినిన నీప్సితములబ్బు. 129

క. వినుమిఁక మిగిలిన మనువుల, జననముల స్మరించుమాత్ర జగదీశ్వరిపై
జనియించుఁ బత్తి చిత్త, మ్మునఁ దనకెఱుఁగంగరాని ముదము జనించున్. 130

వ. వైవస్వతునకుఁ గరూష పృషధ్ర నాభాగ దిష్ట శర్యాతి త్రిశంకులను నార్వురు
తనయు లుద్భవించి రవ్వారు. 131

సీ. కాళింది తటికేగి కలితమృణ్మయమూర్తి • భ్రామర్యఖిదదేవి బహువిధోప
చారమ్ములిడుచు వేర్వేఱఁ గొల్చుచుఁ బర్ణ • పవనభక్షకుల త్యానవిరహితుల
నుదకధూమ్రాంశుకృతోదరశోషణు • లై యుపాసనబల్మి నాత్మయంద
జగముగాంచుచు నెక్కుడగు తపమ్ముఁ బదిరెం•డేండ్లు సేయఁగ దేవియెదుటఁగాన

గీ. ఎచ్చుట యు "వాగ్భవప్రీత! వాగ్భవోక్త!
యూశి! క్లీంకారవిగ్రహ! హ్సౌదయదుఃఖ

హారిణి! కృపార్ద్రదృష్టిప్రసారిణి! యప
రోక్షకారిణి! యనుచు నార్గురు నుతింప. 132

క. భూపతిసుతులార! తపో, దీపితులార! మదికోర్కి దెల్పుఁడనుడు మ
ర్వీపాలకత్వముగా దను, జోపేతశ్రీయు మాకు నొసఁగుము తల్లీ! 133

వ. అనుటయు. 134

క. మీ కోర్కి దీరు నింతియు, కాక క్రమమ్ముగ మనువులు కాఁగల రధిక
శ్రీకీర్తినంతతులమన్, గైకొనియెద రని పరాంబ కను మొఱఁగె వెసఁగా. 135

వ. అట్లయ్యార్వురు నప్పుట్టువున రాజ్యసంతత్యాది వైభవమ్ము లనుభవించి పైపుట్టు
వునఁ గ్రమమ్ముగఁ గరూషుండు తొమ్మిదవ మనువగు దక్షసావర్ణియు, నాభాగుండు
పదునొకండవ మనువగు సూర్యసావర్ణియు, దిష్టుండు పదిరెండవ మనువగు చంద్ర
సావర్ణియు, శర్యాతి పదమూఁడవ మనువగు రుద్రసావర్ణియు, త్రిశంకువు పదు
నాల్గవ మనువగు విష్ణుసావర్ణియునై భ్రామరి యనుగ్రహమ్మున నెల్లభోగమ్ముల
నంది లోకవంద్యులై రనుటయు నారదుండు. 136

క. దేవీకథామృతమ్మం, ద్రావఁగఁ ద్రావఁగఁ దలంతు భ్రామరి యను న
ద్దేవి యెటు పుట్టె రూపం, బే విధమున నండుఁ దెలుపు మిక్కుత యనుడుఁగా.

వ. నారాయణుండును. 138

గీ. తల్లింకుఁ బ్రీతి యేరీతిఁ బిల్లలపయి, నుండు జగదంబకును నట్లయుండు జగము
నందు నిర్వ్యాజమగు పేర్మి యతివిచిత్ర, మంబ చారిత్ర మెఱుఁగ శక్యంబుగాదు.

సీ. అరుణుం డనఁగ నొక్క యమరారి యమరులఁగెలువ వలవఁగూర్చి వలిమలదరిఁ
బండుటాకులు దిని పదివేల వత్సర ♦ మ్ములు, జలశీకరమ్ములుగొని పది
వేల వర్షమ్ములు, పిదప మారుతభుక్తిఁ ♦ బదివేల యేఁడులు శ్వాసబంధ
నమ్ము గాయత్రీ జపమ్ము సేయుచుఁ దామ ♦ సమ్ము గ్రమ్మకొనఁ దపమ్మొనర్చు

గీ. నంత వాని శరీరమ్ము నందు నుండి ♦ పుట్టి యగ్గి జగమ్మెల్ల ముట్ట భయము
నంది యెల్లరు విధి శరణొంది తెలుప ♦ నతఁడు గాయత్రితో నేగె నంచనెక్కి.

గీ. ఏగి ప్రాణావశిష్టు నాడీగరిష్టు, నక్షిమీలనపూర్వకధ్యాననిష్ఠ
నగ్ని తేజోవిశిష్టు గాత్రాపకృష్టు, నతికృతతపస్సముత్కృష్టు నరుణుఁ గాంచి. 141

క. ఏవినంత సంతసింపఁగ, ననియె "వరమ్మడుగు" మని సుధాధికమధురం
బనఁదగు నప్పలుకున్ విని, కనుఁన్ విప్పి విధిఁ గాంచి కడు వినయమునన్.

గీ. నతి మతి నొనర్చి "మృత్యువు నాకు లేక
పోవు నటు సేయు" మన మృత్యువు హరిహరుల
కేవి దప్ప దొరుల మాటయేల ? యే నొ
సంగఁ దగునది యడుగు మనంగ నతఁడు. 143

వ. యుద్ధమ్మునఁ నొండె నన్యనిమిత్తమ్ములనొండె నాకు మృత్యువులేమిఁ గటాక్షింపుము. మఱియు దేవతల జయించు నంతటి బలమ్ము నా కలవడవలయు నావుడు నతం డట్ల కాక యని చనుటయు నతండును. 144

సీ. దనుజులఁ బిలిపింపఁ దమకు నాతని బ్రభు • వుగఁ జేసికొని వాండ్రు నగవిరోధి
కడకు యుద్ధ మొనర్పఁగా దూత నంప నా • తఁడు భీతుఁడై ధాత కడకుఁజనుడు
నతఁడు శ్రీపతిఁ బురోగతుఁ జేసికొని శూలి • గనుఁగొని యెల్లరుఁ గలిసియరుణుఁ
జంపఁగ యోజించు సమయమునన వాఁడు • సర్వాధికారముల్ సంగ్రహించి

గీ. తాన నానాస్వరూపముల్ దాల్చి యేలు • చుండ సూర్యేందుయమవహ్ను లొక్కపెట్ట
వచ్చి తమపాటు చెప్ప నప్పట్టునందు • గొప్ప యాలోచనము సేయఁ గుందునంత.

క. అంబం గొలువుఁడు మీకా, ర్యంబుం బొనరించు నాపె యరుణుఁడు గాయ
త్రిం బెడబుద్ధి విడిచిన మృ, తిం బొందున్ దజ్జపంబ దృఢబలుఁ జేసెన్. 146

వ. అనుచు నశరీరిణి వలుకుటయు నింద్రుండు బృహస్పతింబిలిచి యే మెల్లర మంబ నారాధించెద మాపె నీకుసాహాయ్యకంబాచరించు నీ వరిగి యరుణుండు గాయత్రి విడుచు నట్లొనర్చు మని యెల్లరం గలిసి పరమేశ్వరిం గొలువ నరుగుడు బృహ స్పతియు, 147

గీ. అరుణు సన్నిధి కరుగ "నమరగురూ ! య, రాతినైతి యుష్మత్పక్షపాతి విపుడు
గానుగద; యిట్లు రానేమి కారణ"మ్మ, నంగ మనకు సంబంధ మున్నయది కాదె.

క. ఏదేవి నేము గొలిచెద, మాదేవి న్నీవు గొలుచుటది లేదె యనం
గా; దానిఁ గొలువనని మా, నాదానమ్మునఁ ద్యజించె న మ్మంత్రంబున్. 149

క. గాయత్రీప్రతిపాదక, మై యొప్పెడు మంత్ర మెప్పు డతఁడు విడిచెనో
పోయెం దేజ మ్మప్పుడ, గాయత్రిదికాక తేజ కాయజమగునే. 150

క. అతఁ డట్లుగా బృహస్పతి, కృతకృత్యుం డగుచు వచ్చి యింద్రున కానం
గతి దెల్పఁగ నతి కుతుకా, న్వితులై నుతియించి రంబ నెల్లరుఁ బిదపన్. 151

వ మఱియు బహుకాలమ్ము మాయాబీజ జపం బొనర్చునంత, 152

సీ. చిత్రవస్త్రద్వయాంచితయుఁ జిత్రానులే • పనపుష్పమాలికాపరిలసితయు
హ్రీంకారతుల్యశబ్దాంకితభ్రమరనం • వృతయుఁ గోటితపనద్యుతిసహితయు
నతిసుందరాతిశాంతాకారకలితయుఁ • గరుణార్ద్రదృక్ప్రసంగతయునై ప
రాంబ గన్పడ సంభ్రమంబున నెల్లరు • "సృష్టిస్థితిలయకారిణి ! మహోగ్ర !
గీ. యుగ్రతార ! యనుగ్రహోదగ్ర ! సర్వ • జనని ! సర్వజ్ఞ ! సర్వాత్మిక ! నిగమప్ర
శంసిత ! దురాత్మసత్త్వనాశకరి ! 'నేతి • నేతి' వాక్యబోధ్య !" యని యెంతే నుతించి.
వ. మఱియుఁ దదవతారభేదమ్ములఁ దత్తద్రాక్షసచ్ఛేదమ్ములఁ బ్రశంసించి, "యీవ
గాయత్ర్యాదిరూపమ్ములఁ దాల్తు. నీ రూపమ్మ యెల్లరూపమ్ముల నెసంగు. విశ్వ
తైజసప్రాజ్ఞవిరాట్సూత్రాత్మిక వీవ" యని యెల్ల భాగమ్ముల నమస్కరించి "యో
తల్లీ ! మమ్ము రక్షింపు" మనుటయు, 154
గీ. "చేయఁదగు కార్య మెయ్యది చెప్పుఁ" డన న
రుణుఁడు శ్రుతిదేవవిప్రవిరోధియై క
డుంగడుఁ గీడు సేయుఁ జంపంగవలయు
ననుడుఁ బుట్టించెఁ దుమ్మెదల నధికముగ. 155
క. తనచుట్టుఁ దనరు తుమ్మెద, లనువానిఁ జంప నక్రమఁ ద్రుమంబుల నిం
గిని మిడుతలదండు విధ, మ్మున నవిగ్రమ్మఁగఁ దమంబు వొడమెఁ బుడమిన్.
ఆ.వె. తేనెఁ దీయువానిఁ దేనెటీగలు కుట్టు, నట్ల కోపమున సురారియ్యా నోవి
దారణమ్ము తుమ్మెద లొనర్ప వారించు, కొనఁగఁ జాలరైరి దనుజులెల్ల. 157
గీ. అస్త్రములఁ బట్టు చేవి, యాహవము సేయు
చేవి, యొకని దుస్థితి నొకఁ డెఱుంగు చేని
గలుగకయె యెవ్వఁడెచ్చోటఁ గలఁడొ యాతఁ
డచ్చటన చచ్చె; నంతఁ గార్యమ్ము తీర. 158
క. తుమ్మెద లంబికపామీ, ప్యమ్మున కరుగంగ విస్మయమ్మందిరిలో
కమ్మునఁ గల వారెల్లరు, "నిమ్మాయ యదీయ" యంచు నెంచు మనములన్. 159
గీ. అంత బ్రహ్మాదిదేవతల్ హర్షమొంది, యంబ కఖిలోపచారమ్ము లాచరించి
కొప్పలిడి జయశబ్దసంకలితులై సు, మములు గురిసిరి మఱియు స్వర్గమున నపుడ.
వ. దుంఘుభిధ్వానమ్మందికొనియె; నచ్చర లిచ్చవచ్చిన కొలందిని నృత్యమ్మొనర్చిరి.
గంధర్వాదులు గానంబులఁ బ్రశంసించిరి. మృదంగాదివిరావంబు ఘానభోంతరాళ
మ్మునఁ గరాళమ్ముగ నావరించె నంత. 161

క. శిరములఁ గరము లలర "జయ, పరమేశ్వరి" యనుచు నెల్లవారు నుతింపన్
వరము లొసఁగి "త్వద్భక్తిన్, గరమి" మ్మనుడు నిడి యంబ కనుమొఱఁగె వెసన్

గీ. పాపతాపహరము మనుబ్రామరీ చ, రిత్ర మియ్యది చదివినఁ బ్రీతి వినిన
నఖిమతార్థసిద్ధియగు భవాబ్ధి భీతి, నొందుగతి తప్పు నంబ సాయుజ్య మొదవు 16

## స్కంధాంత పద్యములు.

క. విద్యావైశద్యాప్రతి, పాద్యావేద్యాతిశాంతభావవిభావా
భిద్యోతితచరితాప్రతి, వాద్యార్జితకీర్తిసాంద్ర। బ్రహ్మసుధీంద్రా। 16

క. భాష్యాంతపాఠకత్వా, దూష్యకవిత్వప్రశస్తిదుస్సాధలస
చ్ఛిష్యప్రశిష్యకలితమ. పీష్యన్వేషాత్మశక్తి। నిరుపహతోక్తీ। 16

పంచచామరము. నిరంతరాన్నదానమానిత। క్షుదర్వితప్రజా
పరంపరాకృతస్తుతిప్రసిద్ధ। శుద్ధబుద్ధి బ
ద్ధరమ్యసౌమ్యసౌమ్యవర్తనా। ధనాఢ్యనావరా।
ధరాధరాలయీకృతార్థతత్త్వవిత్త్వ। సత్త్వగా। 16

## గద్య.

ఇది శ్రీ చర్లబ్రహ్మంతర్యాణిమణిప్రశిష్య తిరుపతివేంకటేశ్వరకవిశిష్య
వేంకటేశ్వరకనిష్ఠపితృవ్య శ్రీ వేంకయార్యపుత్ర సుబ్బమాంబా
గర్భశుక్తిముక్తాయమాన సుకవి విధేయ వెంకన నామ
ధేయ ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతంబను మహా
పురాణమ్మునందు దశమస్కంధము.
శ్రీమత్పరదేవతార్పణమస్తు.
సమస్తసన్మంగళానిభవంతు.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీ భాగవతము



## ఏకాదశస్కంధము

అతివిమలచరిత ! నిత్య, స్తుతవిద్యాన్నప్రవాన ! సుగుణమణీసం
తతిభాస్వదన్నపూర్ణా, పతివ్రతానాథ ! బ్రహ్మవందితవేధా. 1

వ. అవధరింపుము నారదుండు నారాయణుం గాంచి, 2

గీ. దేవకార్యార్థ మమ్మహాదేవి వొడమ, టాదిగాఁగల యఖిలమ్ము నానతిచ్చి
తవఘ ! యెద్దానికతన నయ్యంబ ప్రీతిఁ, జెందు నట్టి యాచారమ్ము చెపుమ నాకు. 3

క. అనవుడు నారాయణుఁ డి, ట్లను నో మునివర్య ! యే సదాచారము చే
యు నరుల కంబాకృప గ, ల్గునొ దాని వచింతు వినుము గుణరత్ననిధీ ! 4

గీ. ఉదయమున లేచినది మొద లుత్తమద్వి, జులు సదాచారమునఁ బుచ్చవలయుఁ బ్రొద్దు
ధర్మ మొక్కఁడు దక్క నాత్మకు సహాయ, మాచరింపఁగలేదు దారాదికంబు. 5

క. కావున ధర్మవిధానం, బేవిధిఁ జేయంగవలయు నెల్లరుఁ; దమముం
బోవిడువ నింతకన్నను, జేవగల విశేష మొండు చిక్కదు జగతిన్. 6

గీ. ధర్మములకెల్ల ముత్తమధర్మ మెందు
నరయ నాచార మదియుఁ జెన్నారు రెండు
దెఱఁగులుగ శ్రుతివాక్యకథితము స్మృతి
విహితమును నయి ద్విజు లందు వెలయవలయు. 7

గీ. ఆయువును సంతతియు శుభ మన్న మఘవి
ముక్తియును గల్గు నాచారసక్తులకు వి
హంబు పరమును మేలగు వర్ణులకును
ముక్తి నొడగూర్చు విది నిక్కముగ మునీంద్ర. 8

క. ఆచారమ్మున శ్రేష్ఠ్యం, బాచారమ్మువన గర్మ మలవడు మఱి త
త్ప్రాచుర్యమ్మున జ్ఞాన, శ్రీ చెలఁగున్ దాన ముక్తి చెందు నరుఁ డొగిన్. 9

క. ఆచారము పరమ తపం, బాచారము జ్ఞానదాయి యది లేని ద్విజా
ధీచతురులు శూద్రునిఁగాఁ, జూచుచు బహివెట్టవలయు సుగుణాభరణా. 10

వ. అదియును శాస్త్రీయలౌకికభేదమ్మున రెండు దెఱఁగు లుభయమును శుభార్థుల కావశ్యకంబు దేశాదిధర్మములును నిట్లు కానెఱుంగునది. 11

క. ఎవఁడు దురాచారుఁడు వాఁ, డు పదయు నింవన్ సదా గడుఁగా దుఃఖంబుగా దెవులున్ వానిన్ వదలక, పవలని నిశియనక పట్టిపాలార్చు మునీ. 12

గీ. ధర్మవర్జితమైన యర్థమును కామ, మును విసర్జింపవలె సుఖమ్మునకుఁ గాక యన్యవిద్వేష మొసరించునట్టి ధర్మ, మునకు నొడఁబడవలదన మునియుఁ బలుకు.

క. వివరింప నశక్యంబు బ, హువిధము శాస్త్రంబు దాని యుక్తు లెఱుంగంగ వశమె దేనికతన ధ, ర్మవు నిర్ణయ మెఱుకపడు నరులకు మహాత్మా. 14

వ. నావుడు నారాయణుం డిట్లను, 15

చ. వినుము పురాణముల్ హృదయవీధి శ్రుతిస్మృతులట్లు లేతదీ
యనియతి ధర్మ మీత్రితయమందు విరోధము గల్గెనేనిఁ గై
కొనవలయున్ శ్రుతిగా మఱియుఁ గొండొకచోట శ్రుతిస్మృతుల్విరో
ధిమలగునేని రెంటను శ్రుతిగా గొనఁగాఁదగుఁ బూర్వరీతిగన్. 16

గీ. శ్రుతి ద్విధాబోధకత్వ మెచ్చోటను జెందు
నుభయము ప్రమాణమని యట నొప్పవలయు
స్మృతియు నిట్లయ్యెనేని నయ్యెడఁ బృథగ్వి
షయత గల్పించు టది ధర్మసమ్మతంబు. 17

గీ. మఱి పురాణతంత్రోక్తధర్మములు శ్రుతివి, రుద్ధములు గాకయుండిన రూఢిగను గ్రహింపఁదగు వేదము ననుసరింపదేని, యదియు ధర్మంబె? తత్కర్త యనఘుఁడగునె?

క. స్మృతియుఁ బురాణము తంత్రం, బికరములగు శాస్త్రములు మతెయ్యవియేనిగా మతము లగునె ప్రత్యక్ష, శ్రుతిరుద్ధము లయ్యెనేని శుద్ధమవస్కా. 19

గీ. ఎన్ని తెఱఁగుల వేదంబ యెయ్యెడలఁ బ్ర
మాణ మది చెప్పు బహుధర్మమార్గములఁ ద
దుక్తధర్మవిహీనుల కొలయుచుండు
జముని లోకమునందుఁ గుండములఁ గములు. 20

చ. పలువచనమ్ము లేల శ్రుతపద్ధతిగా వెలిగాని ధర్మముల్
సంలితముల్ స్మృతి ప్రభృతిశాస్త్రము లాగమమూలకమ్ములై

చెలఁగనివోఁ బ్రమాణగతి చెందవు; దుర్వచనో క్తధర్మక
ర్తలు వరకమ్మునం బడి కరమ్ము భరమ్ముగ నుందు రంధులా. 21

గీ. అనఘ! వైఖానసమతానుయాయు లగుచుఁ, ద ప్తముద్రాంకనమ్ములఁ దాల్చు జడులు
లింగధారులు దుర్గతికిం గడంగు, వారు వీ రుభయులు వేదబాహ్యు లగుట. 22

క. ప్రతిదివసము ప్రతిపదమును, గృతమగునొకొ యించుకేని గిల్బిష మనుమా
మతి జంకుచు ధర్మమును ను, కృతు లొనరింపుదురు పుణ్యకీర్తులు వసుధా. 23

వ. రాత్రి యామంబు కడచినమీఁద యథోచితమ్ముగఁ బ్రాణాయామం బొనరించి యద్దే
వివి యథోక్తమ్ముగ ధ్యానించి పదపడి గురువుంగూర్చి. 24

క. గురువే బ్రహ్మయు విష్ణువు, గురువే దైవమగు శివుఁడు గురువె పరుండన్
బరమామ్నాయము చెప్పున, గురువునకే భక్తి మ్రొక్కు గొల్చెద నెదఁదన్. 25

క. అని చెప్పి మఱియు నారా, యణుఁ డిట్లను వేదములు తదంగము లాచా
రవియతిశూన్యుఁ బవిత్రుం, బొనరుప వీమాట నిక్కముగఁ దెలియనగుణా. 26

క. తనచదివిన వేదమ్ములు, తనకున్ మరణంబు దొడరుతఱి తెక్కలు వ
చ్చిన గూడు విడుచు పక్షుల, యనువునఁ దమ్మూణా త్యజించుసని యెఱుఁగుమునీ.

వ. అవి యెండియు, 28

తే. గీ. అనఘ! బ్రాహ్మముహూర్తమ్మునందు లేచి
సకలమును విధియుతముగ సంధ్యవలయు
నాచరించుట యొప్పు వేదాధ్యయనము
రాత్రి నాల్గవజామున రమణమెఱయ. 29

తే. గీ పిదప నిష్టదేవస్తుతి మదినొనర్ప
వలయు; మఱి యోగియేని యయ్యలఘుఁ డాత్మఁ
బూర్వమార్గానుగతిఁ బరపురుషు ధ్యాన
మాచరించుట యొప్పగు ననఘచరిత. 30

క. తగ బ్రహ్మధ్యానం బీ, వగ నాసనయమ్మునం దెవఁడు సల్పు నతం
డగు జీవన్ముక్తుఁడు సుక, రగతిణా బ్రహ్మైక్య మపుడు రంజిలుకతనన్. 31

వ. ప్రాతఃకాలమ్మున లేచి యథోచితమ్ముగఁ గృత్యమ్ములు దీర్చికొనదగు. 32

క. తల కొక వస్త్రము చుట్టి శు, తలమునఁ దృణమువిడి వా కొదవనీక సువి
శ్చలవిశ్వాసుండై శా, నొలయఁగవలె మమియుటుడిగి యొగి నవ్వేళన్. 33

సీ. జలమునఁ జిత మల శాద్వలమ్మునఁ బుట్టఁ • బాడు దేవళమునఁ బథమునందు
జంతుగర్తములందుఁ జనదు విణ్మూత్రవి • సర్జనం బొగి రెండు సంజలందు
జపదంతశుద్ధిభోజనపితృదైవకా • ర్యముల విణ్మూత్రవిసర్గమనిధువన
కృతుల యాగమ్మున వితరణబ్రహ్మయ • జ్ఞమ్ముల దేశికసన్నిధాన

తే. గీ. మందు మౌనమ్ము వహియించు టభిమతంబు
మఱియు దేవర్షిముఖుల సమగ్రవినయ
కలన సచ్చోటు విడుచు నట్లవరించి
శౌచమొనరించు టది వేదసమ్మతంబు. 34

క. అనలానిలార్కద్విజ, వనముల నాలఁ గనుఁగొంచు వలవదు విణ్మూ
త్రవిపాతన మొనరించుట, ఘనమగు శ్రేయమ్ము గోరు కర్మరమణికిన్. 35

తే.గీ. పవ లుదఙ్ముఖతయు రాత్రిభాగమందు, దక్షిణాభిముఖత్వంబు దవులఁ దొప్పు
పర్ణలోష్ఠతృణాదులు వైచి కప్పి, వలయు విణ్మూత్రములు బయల్వడకయుండ. 36

చ. పదపడి కేల లింగమును బట్టి జలమ్ములు గల్గు నయ్యెడన్
గదిసి జలంబు పాత్రమునఁ గైకొని కొందొక నేల యేగి తె
ల్పొదవెడి కూలమృత్తికను నొయ్యన శుద్ధియొనర్పు టొప్పు న
య్యది సమకూరకున్నఁ గొననౌ నెదియేని ద్విజుండు మృత్తికన్. 37

వ. మఱియుఁ దదితరులు గ్రమమ్ముగ రక్తపీతకృష్ణమృత్తికలు గ్రహింపనగు. దేవగృహవల్మీకాదులందు మృత్తిక గ్రహింప దొప్పు; దన్యశౌచశిష్టమ్మును నగ్రాహ్యంబు. మూత్రమ్మున కన్న శౌచమ్మున ద్విగుణమ్మును నంతకన్న మైథునమ్మునఁ ద్రిగుణమ్మును మృత్తిక వలయు. ఇదియంతయు గృహస్థున; కింతకు ద్విగుణంబు బ్రహ్మచారికిని నంతకు ద్విగుణంబు వానప్రస్థునకుఁ జతుర్గుణంబు యతికి నని యెఱుంగునది. శౌచకర్మమ్మున నొక్కొక్కసారి కొక్కొక్క యుసిరికకాయయంత మృత్తిక గ్రహించుట విధివిహితం; బీయది యెల్ల దివాశౌచమ్మునకు, రాత్రియేని యేతదర్ధమ్మును, నాతురునకుఁ దదర్ధమ్మును, మార్గస్థునకు దాన సగమ్మును జాలెడి.

క. స్త్రీలకును శూద్రజనులకు, బాలురకు నశక్తులకును బరమావధి నే
లీలనగు దుష్టగంధం, బోలిన్ లేకుంట యంత యొనరుపవలయున్. 38

క. గంధలేపక్షయావధికంబు శౌచ, మఖిలవస్త్రమ్ములకు నొప్పు ననియె మనువు
మఱియు దక్షిణకరము వామకరమును వి, శుద్ధముగఁ జేయవలయు నోసుగుణరాశి.

తే.గీ. నాభి కూర్ధ్వప్రదేశమ్మునఁ గుశిచేయఁ, గ్రింద దేశమ్మున కెడమకేలు శౌచ
కర్మమున సమ్మతమ్ములు కర్మ లిటు, దక్షిణేతరోక్తగతి నల్పఁదగదు మౌని.

క. విను విణ్మూత్రోత్సర్జన, మున జలపాత్రమ్ము విప్రముఖ్యులు గొనఁగాఁ
జన దక్షిణమ్మునఁ గొను, జనులకుఁ బ్రాచితము సర్వసమ్మత మనఘా. 42

క. అలసత్వాజ్ఞానమ్ముల, వలనన్ శౌచంబు మానువాఁడు త్రిరాత్రం
బులు నీరాహారుండై, సలుపవలెన్ జపము పిదప సంశుద్ధికినై. 43

తే. గీ. దేశకాలోపపత్తి శక్తిప్రసక్తి
ననుసరించి శౌచం బిటు లాచరింప
వలయు విట్శౌచమున నొకపదియు రెండు
పార్లు గండూషము లొనర్పఁ జను మునీంద్ర. 44

క. నాలుగు గండూషమ్ములు, పోలుగ మూత్రంపుశౌచమునఁ దన్నీరం
బోలి నధోముఖుఁడై తా, వాలాయము విడువవలయు వామంపుదెసన్. 45

క. పదపడి కృతాచమనుఁడై, రదనమ్ములు దోమవలయు రహిఁ గంటకసం
పదయుగ క్షీరస్రుతియుగ, బొదలెడికాష్ఠమున నేమనమున మునిచంద్రా.

క. పదపడి నద్యాదికమున, సదమలతాసిద్ధిఁ బొంద సలుపఁగవలెఁ గో
విదులౌవారలు స్నాన, మ్మది ప్రాతఃకాలమందు యేర్పడియె మునీ. 47

క. మలినమ్మగు దేహమునకుఁ, గలవు నవద్వారములు నికామస్రావం
బొలయించు వీని శుద్ధికి, వలయు నుషస్స్నాన మెట్టివారికినేనిన్. 48

తే. గీ. తెగు నగమ్యాగమనదుష్ప్రతిగ్రహాదిన, దోషములు చాటునందగు దొనఁగు లెవ్వి
యేనిఁ బ్రాతఃకృతస్నానులైన వారి, కన్యు లెయ్యది చేసిన నగు విఫలము. 49

తే. గీ. ఏడు దినము లుషస్స్నాన మెనయఁ దేని
మూఁడు దినములు సంజకు మొనయఁ దేని
పదియు రెండు దినము లగ్నిఁ బడయఁ దేని
నగ్రజుఁడు శూద్రభావమ్ము నధిగమించు. 50

క. విను స్నానము సంధ్యావం, దనమును బొనరించు నరుఁడు దర్పయుతుండై
చను వొలయఁగఁ దద్వ్రహం, బున నొనరిచె నేని నదియుఁ బొలివోవు మునీ. 51

తే. గీ. స్నానకర్మం బమానమై చనెడి హోమ
కాల మత్యల్పమై యొప్పుఁ గానఁ బొద్దు

టను యథోక్తమ్ముగను స్నానమును మొదలిడ
కప్పటికిఁ దగుగతి సల్పు టభిమతంబు. 52

తే. గీ. వ్యాహృతిత్రయసంయుతమై ప్రణవస
హితమగుచు నొప్పు గాయత్రి నెనసి ప్రాణ
వాయుసంయమనం బొనర్పవలె మూఁడు
మార్లు; గాయత్రి కెనయగు మంత్రమున్నె! 53

క. స్తుతిసేయు భక్తునకుఁ బర, గతిదాయకమగుచు సర్వకాలమ్మును ర
క్ష తగన్ సల్పుట దీనికి, సతమగు గాయత్రి యనెడి సదభిఖ్య మిపీ. 54

తే. గీ. ఆత్మవర్మనిరతుఁ డైన యగ్రజుండు, వైదికమ్మగు మంత్రమ్ము వదలక జప
మొనరుపన్వలె లౌకిక మూన వలవ, దుభయపక్ష సముద్ధృతి యొలయు దీన.

వ. పదపడి దేవర్షి పితృతోషకంబగు స్నానాంగతర్పణం బాచరించి జలమ్ము వెడలి
శుద్ధవస్త్రధారణపూర్వకముగ విభూతి బూయవలయు. 56

తే. గీ. జపమునకు సాధకములుగ సతతమును వ, నంతభక్తిప్రపూర్తి రుద్రాక్షమాల
లేనరుఁడు దాల్పు వాఁడు మహానుభావుఁ, డపరనీలకంఠుండవి జపిత లంద్రు. 57

క. కనకమునఁనొందె రజత, మ్మనఁనొందెన్ ఉచితములుగఁ బొసఁగించి సికణ
జనుఁ గర్ణములను ధారణ, మనయము రుద్రాక్షలకు సమాహితచిత్తా. 58

తే. గీ. జందెమున హస్తమున గళమందుఁ దుంద
మందుఁ బ్రణవమంత్రమ్మునవైనఁ దాల్ప
వలయుఁ బంచాక్షరీమంత్రకలననైన
నతులితమ్మగు భక్తిసంతతము చెలఁగ. 59

క. విను రుద్రాక్ష దరించుట, చను శివవిజ్ఞానమునకు సాధనమై వి
న్నునువుగ పిగఁ దాల్చిన దా, ని నెఱుంగుము పారతత్వనియతి నృపాలా. 60

తే.గీ. కర్ణములయందు జగదంబగాఁగ జందె
మందు వేదమ్ములుగ హస్తమందు దెసలు
గాఁగ గళమున వాగ్దేవిగా ధవంజ
యుఁడిఁగ స్మరియింపఁదగు చావి నూనునెడల. 61

తే.గీ. అఖిలవర్ణమ్ములకును రుద్రాక్షధార, ణంబు విహితమ్ము ద్విజులు మంత్రంబుతో ధ
రింపవలెఁ దక్కొరులఁ కట్టిరీతి చనదు, దీని ధరియించువాఁడె యీశానుఁ డధిప.

క. ఇన్ని యననేల మఱి తా, నెన్నెని యకృత్యములను నెఱిఁగి యెఱుఁగక తు
ద్యన్నియతి విడిచి సలిపియుఁ, బన్నుగ నివి దాల్చువాఁడు పాపరహితుఁడౌ. 63

తే.గీ. ఎవఁడు రుద్రాక్షలను ధరియించు వాఁడు
తినుట కర్హని దినుట, యయ్యనఘు పాన
కృతియు సల్పిన: మఱి ధరియింప సిగ్గు
నెవఁడు గను వాఁడు గనఁ డెన్నఁడేని ముక్తి. 64

క. మునివర! రుద్రాక్షలఁ దా, ల్చినవారిం గాంచి వాదుచేసెడి వానిన్
మనమున నూహింపుము జన, ఖపికిన్ బొడమని యపాత్రకుండని యెపుడున్. 65

తే. గీ. రుద్రుఁ డెద్దానఁ గైకొనె రుద్రతను గ్ర
హించె బ్రహ్మ బ్రహ్మత్వమ్ము నెక్కటి తమున
మునులు సత్యసంకల్పు లేమూలమున న
యిరొ వచింపఁదరమె తన్మహిమ మొరులకు! 66

క. రుద్రాక్షధారిఁ గని శుం, భద్రక్తిగా ద్రవ్యధాన్యవస్త్రాదులఁ దా
భద్రార్థి యగుచు నిడి యా, రుద్రుని లోకమ్ము గను నరుఁడు మునితిలకా. 67

తే. గీ. మఱియు రుద్రాక్ష ధరియించు మహితు శ్రాద్ధ
మందు భుజియింపఁజేసిన యనఘుఁడు పితృ
లోకమున కేగు నతిభక్తిలోలుఁ డగుచుఁ
గాళ్ళు గడిగి త్రాగినవాఁడు గాంచు ముక్తి. 68

క. హారాదికమును రుద్రా, క్షమయము గాఁగఁ దాల్చు ననఘుఁడు రుద్రుం
డై రాజిలు నెట్లేనియు, ధారణ మొనరించు వారు ధన్యులు మౌనీ. 69

ఉ. హారము లేల భూషణము లన్యము లేటికి దోడు గేవలం
బై రహిమీఱ నియ్యది మహామహుఁ డెవ్వఁడు దాల్చు మంత్రసు
శ్రీరుచిరంబుగా నయినఁ జెన్నగ మిన్నకయైన లజ్జనొ
ప్పారియునైన వాఁ డఘము నందఁడు జ్ఞాని యగుం గ్రమమ్ముగన్. 70

క. నారద! వేయేటికి నా, కౌనపి రుద్రాక్షమహిమ మంతయుఁ జెప్పం
గారాదు యత్నమునఁ ద, ద్ధారణ మొనరించువాఁడు ధన్యుం డెందున్. 71

క. అనవుడు ముని యిట్లను నో, యనఘా రుద్రాక్ష యిట్టిదై పూజ్యత్వ
మ్మునుగొనిన కారణమ్మును, వినిచి ననున్ ధన్యుఁ జేయవే నా నతఁడున్. 72

క. వలికె నిటు లో మునీశ్వర!, యల షణ్ముఖుఁ డిట్లు మున్ను హరు నడిగినఁ దాఁ
దెలిపె నతఁ డయ్యదియె నీ, వలుకున కుత్తర మొసర్తుఁ బరమప్రీతిన్. 73

వ. శివుండు కుమారుం గాంచి పుత్రా! త్రిపురుండను నొక్క రక్కసుండు బ్రహ్మాదుల నుక్కడంచి దుర్జయుఁడై నెగడునెడ నసురుల నాకుం గుయివెట్టిన నేను నఘోర నామకంబగు నొక్క దివ్యాస్త్రమ్మును దివ్యవర్ష సహస్రపరిమితమ్మగు కాలమ్ము చక్షురున్మీలనంబొనర్చి చింతించితి; నయ్యెడ నాకులమ్ములగు మన్నేత్రములనుండి బిందువు లుత్పన్నములై యయ్యవి రుద్రాక్షవృక్ష జనకమ్ములయ్యెఁ; బదపడి యయ్యవి ముప్పదియెన్మిది భేదమ్ముల లోకహితార్థంబు వ్యవహృతమ్ములయ్యె; నందుఁబదిరెండు సూర్యనేత్ర సముద్భూతంబులు కపిలవర్ణమ్ములు. సోమనేత్రోద్భూతమ్ములు పదాఱు శ్వేతవర్ణమ్ములు, వహ్నినేత్రసంభవమ్ములు పది కృష్ణవర్ణమ్ములు మఱియు నిందు శ్వేతంబు బ్రాహ్మణజాతియు రక్తంబు క్షత్త్రియంబును మిశ్రంబు వైశ్యజాతియుఁ గృష్ణవర్ణంబు శూద్రజాతియు నగు; నిం దేకముఖము సాక్షాద్రుద్రస్వరూపమ్మును బ్రహ్మహత్యాతారకంబును నగు; ద్విముఖంబు దేవీ మహాదేవాకారమై ద్వివిధాఘనాశకం బగుఁ; త్రిముఖం బనలాత్మకంబై స్త్రీహత్య నడంచుఁ; జతుర్వక్త్రంబు బ్రహ్మస్వరూపంబును నరహత్యామారకంబునునై తగుఁ బంచాననంబు రుద్రాత్మకంబును గాలాగ్నినామకంబునునై యగమ్యాగమనా భక్ష్యభక్షణసంభవమ్ములగు ననేకదోషమ్ముల వారించు; షణ్ముఖంబు భవత్స్వరూపంబు దక్షిణకరమ్మునఁ దాల్ప నియ్యది బ్రహ్మహత్యాద్యఘమ్ముల నడఁచు; సప్తముఖం బనంగాత్మకం బది స్వర్ణస్తేయాద్యఘమ్ముల రూపుమాపు; నష్టవదనంబు వినాయకస్వరూపం బియ్యది గురుతల్పగత్యాద్యనేక పాపమ్ముల నమయించుచు విఘ్నములవారించి సర్వకార్యమ్ములు నెగడించుటయ కాక తుదకుఁ బరమపదం బొదఁగూర్చు; నవముఖంబు భైరవాత్మకం బియ్యది వామభుజమ్మున ధరించు వారలకు భుక్తిముక్తులును మత్తుల్యబలమ్మును బ్రహ్మహత్యాదిమహాపాతకనివృత్తియు నొదఁగూర్చు; దశముఖంబు జనార్దనస్వరూపమ్ము భూతబేతాళబ్రహ్మరాక్షసపన్నగాద్యుపద్రవమ్ము లిద్దాని బూనువారల కుపశమించు నని వెండియు. 74

క. ఏకాదశవక్త్రం బది, యేకాదశరుద్రరూప మిది సిగఁ గొను సు
శ్లోకులకు నశ్వమేధస, మాకనన్ గలుగు పుణ్య మబ్బుఁ గుమారా. 75

తే.గీ. పరఁగి ద్వాదశవక్త్రంబు కర్ణమందుఁ, దాల్చువాఁ డశ్వమేధవిధానఫలము
నంది ద్వాదశాదిత్యుల దెందమునకుఁ, బ్రీతిదాయకుఁ డగు భీతివిముఖుఁ డగుచు.

వ. మఱియు నిది ధరించువారలకు హస్త్యశ్వాదిజంతుహననజన్యంబగు పాతకం బొకిం
తప సమయు. 77

సీ. పదునూఱు మొగముల భాసిలు రుద్రాక్ష • లభ్యంబుగా దది లభ్యమయ్యె
నేని భవత్తుల్యమై నెగడెడి సర్వ • కామార్థసిద్ధియుఁ గలుగు దాన;
నది ధరించెడివాని కఖిలభోగమ్ములు • జేకూరుఁ బాపముల్ జెంద వెందుఁ
బదునాల్గు ముఖములఁ బరఁగెడి రుద్రాక్ష • దొరకదు దొరకుట దొడరెనేని

తే.గీ. దాని శిరమున నెప్పుడుఁ దాల్పవలయు • నింత వర్ణింపనేల వాఁడెవఁడు గాని
యెలమి రుద్రాక్షలను ధరియించెనేనిఁ • బొందుఁ బరగతి గీర్వాణపూజ్యుఁ డగుచు.

క. జపమాలాలక్షణమును, విపులగతి వచింతు వినుము విధిముఖ్యులు భూ
తపతియు బిందువు విష్ణుం,డు పుచ్ఛమగు మాలికకుఁ గొడుక ! నిగ్రహముగఁగా 79

వ. రుద్రాక్ష లెట్టివియేనియు నిరువదియైదు సంగ్రహించి గోపుచ్ఛ వలయాకారమ్ముగ
మాలికచేయనగు; గ్రుచ్చు నెడలఁ బుచ్ఛమ్ము బుచ్ఛమ్ముతోడను వక్త్రము వక్త్రమ్ము
తోడను గూర్పవలయు; నీసంఖ్య కధికంబయ్యెనేని నయ్యది నాగపాశనామంబునఁ
బొదలు; నీక్రమంబునఁ గూర్చిన మాలిక మంత్రసిద్ధి నిచ్చు. 80

తే.గీ. కంఠమునఁ గాని శిరమునఁగాని కర్ణ, మునను గాని ధరించి యముద్రభక్తి
జప మొనర్చెడి వారికి సంభవించు, భుక్తియును ముక్తియును గురుశక్తియుక్తి. 81

తే.గీ. స్నానమున దానమున హోమజపసురార్చ, నముల వైశ్వదేవాదికసమయముల న
రుండు రుద్రాక్షధారణం బొందు నిడిచె, నేని నరకమ్మునకు నేగు నింత నిజము.

సీ. రుద్రాక్షభూజాతరూఢవాతోద్ధూత • తృణజాతమేని యొకింత మేను
సోఁకినవారు సుశ్లోకులై పుణ్యలో • కమ్ములు గాంతురు; కడఁగి యెవఁడు
దాల్చు రుద్రాక్ష నాతఁడు పాతకము లెన్ని • యే నొనర్చియు శుద్ధి నెనయు ననుచు
జాబాలశ్రుతి పల్కు; జ్ఞానశూన్యంబగు • పశువేని రుద్రాక్ష పరఁగఁ దాల్చి

తే. గీ. రుద్రతను గాంచు ననిన నరుఁడు ధరించి
ఛిద్రములు గాంచకున్నె ! పల్కులకు లేల
యొక్క రుద్రాక్ష శిరమున నూనువాఁడు
పాపరహితుండు చిరపుణ్యభాజనుండు. 83

తే. గీ. ఎవఁడు మన్నామమును జపియించు మఱియు
నెవఁడు రుద్రాక్షలను ధరియించు వాఁడ

పరమభాగవతుఁడు శుభపరత గలుగు
వాడు రుద్రాక్ష ధరియింపవలెఁ గుమార. 84

క. సరసిజసంభవముఖసుర, వరులును దేవర్షులును శివప మగుటను దా
మరసి ధరియించి శుచులై, చరియింతురు దీనిమహిమ శక్యమె పొగడన్. 85

తే. గీ ఎన్నియో జన్మముల నెత్తినేని నరుఁడు, వానిపై మత్కృపాలేశవైభవంబు
వఱలు సద్గాన రుద్రాక్షవాంఛ యొదవు, నంతియే కాని సహజమై యలవడదిది.

క. కరమున గళమున నురమున, శిరమునఁ గర్ణముల నెవఁడు శివపదయుగభ
క్తిరతిన్ రుద్రాక్షలఁదా, ధరియించునొ శివుఁ డతండు తథ్యము తనయా. 87

క. గళమున రుద్రాక్షగా దా, నెలమిన్ ధరియించి కుక్కయేనియుఁ బ్రాణం
బులు వీడి ముక్తిఁ బొరయు న, రుల కయ్యది గల్గు టెల్లరుదు షడ్వదనా. 88

క. జపమును ధ్యానమ్మును లే, క పశువుచందానఁ దిరుగుఁగాక నరుఁడు ము
క్తిపదంబు గాంచు రుద్రా, క్షపూస ధరియించు మాత్ర జ్ఞానియుఁబోలెన్. 89

తే. గీ. కాన రుద్రాక్ష యొండైన మానవుండు, యత్నముఁ దాల్పనగు వాని కఖిలపావ
ముక్తి యట్లుండ వంశసముద్ధరణను, కృతమునుం గల్గుఁ బరగతి యొసఁగుఁ దనయ.

తే. గీ. ఫాలమున భూతి రుద్రాక్షమాల గళము, నందు లేకున్నఁ జండాలుఁ డన్నరుండు
వాని కించుకయునుఁ బూజ వఱలద మ్మ, హేశ్వరుని లోకమున విను మింతనిజము.

క. నురఁ దావియుఁ బలలం బా, దరమునఁ దిని యంత్యజాతిఁ దవిలియు నఘముం
బొరయఁడు రుద్రాక్ష యొకటి, శిరమునఁ గల మానవుండు సిద్ధం బిదియుగా. 92

తే. గీ యజ్ఞదానతపోనియమాధ్యయనన, ముల్పవంబగు నాఫలము లభియించు
భక్తి రుద్రాక్ష ధరియించు పాపములకు, నహహా వర్ణింపఁదరమె రుద్రాక్షమహిమ.

తే. గీ. నాల్గు వేదమ్ములను బురాణములు చదివి
తీర్థసేవ లొనర్చి విద్దెలు పఠించి
యెట్టి సుకృతంబు మహనీయు లెనయుదురో కు
మార! రుద్రాక్షపలనఁ జేకూరు నదియు. 94

క. నరుఁ డంత్యకాలమున నా, దరమున రుద్రాక్ష యొకటి ధరియించిన మా
త్ర రిహన్ రుద్రత గను న, ప్పరమునకున్ బుట్టు వెపుడు వఱలదు తనయా. 95

తే.గీ. కంఠమునఁగాని బాహాయుగ్మమునఁ గాని
యెవఁడు రుద్రాక్ష తా ధరియించి ప్రాణ

ములఁ ద్యజించునో వాఁడు బాములకుఁ దక్కి
తన కొలముతోడ శివలోకమునకు నరుగు. 96

తే. గీ. పాఱుఁడైనను లేక శ్వపాకుఁడైన. గుణయుతుండైన లేక నిర్గుణుఁడు నైన
శుచియునైన నశుచియైన బొఱ గెసంగ, భస్మరుద్రాక్షధారి శివత్వ మొందు. 97

క. విను తన్మాలిక కంఠ, మ్మున భక్తియులేక తాల్చి మొగిఁ బాపకృతుల్
బొనరించు నెవఁడు ముక్తిం, గను నవ్వాఁడు నన వేతొకనికిం గలవే. 98

క. అనయము రుద్రాక్షార్పిత, మనస్కుఁ డగు నెవ్వఁ డట్టి మహనీయుఁడు తా
ల్చినవాఁడె యాతఁ డెల్లర, కు నమస్యుం డగుచు రుద్రుఁ గొల్చుచు నెగడుఁగా. 99

తే. గీ. వినుము విద్యావిదుండని విద్యలేని. వాఁ డనవలవ దెవ్వఁడు భక్తిదీని
ధారణమ్మునఁ దగు వాఁడు తప్ప కేగు, భవుపదము కీకటగగర్దభంబుభాతి. 100

చ. అనినఁ గుమారుఁ డిట్టులను నక్కట ! కీకటమందు గర్దభం
బున కెవఁడిద్ది తానొసఁగె ? మున్నది తానెటుతాల్చె ? మన్మనం
బున కొగివచ్చునట్లుగఁ బ్రమోద మెలర్ప వచింపుమయ్య నాఁ
గ నతఁడు వల్కె నాదరవికాసవిభాసురవక్త్రుఁడై తగన్. 101

వ. కుమారా ! వింధ్యమ్మున నొకగాడిద యొకపథికునిచే రుద్రాక్షభారమ్ము వహింపఁ
బడుచు నత్యాయాసమ్మున నసమర్థంబై యయ్యది మోయఁజాలక భువింబడి యసు
వులవీడి త్రినేత్రమ్మును శూలపాణియునై మత్ప్రసాదమ్మునఁజేసి మదంతికమ్మునకు
వచ్చెనని వెండియు, 102

తే.గీ. అనఘ ! తా ధరియించు రుద్రాక్ష కెన్ని
మొగములుండునో వాఁ డన్ని యుగములయు స
హస్రములు నాదులోకము నందు భోగ
భాగ్యములు వొందు నిరపాయుడై భవమున. 103

వ. ఇయ్యది ముఖ్యశిష్యునకును భక్తునకును దక్క నితరులకుఁ బ్రకాశింపఁ దగదనిదని
వెండియు, 104

తే.గీ. భక్తుడు నభక్తుఁడని యెంచి పలుకనేల, నీచుఁడని నీచతరుఁడని నిర్ణయింప
నేల రుద్రాక్ష తాదరియించు నెవఁడు, వాఁడు పాతకములు వీడు నదయు ముక్తి.

## రుద్రాక్షధారణ మహిమము.

క. తనయా! రుద్రాక్షలఁ బ్రతి, దినముగా ధరియించువాఁ డతిశ్రీకుం డ
మ్మనుజుని సుకృతమ్మున కీ, డును గల్గునె యిదియసూ కడున్ వ్రతమెందున్.

సీ. వేయిరుద్రాక్షల నేయనఘుఁడు తాల్చు • వాఁ డెల్ల సురలకు వంద్యుఁ డగుచు
రుద్రుని యట్టిఁడై భద్రమ్ములనుగొను; • నన్నియు రుద్రాక్ష లబ్బవేని
పదియాఱు పదియాఱు బాహుయుగ్మమ్మున • సికయం దొకండును జేతులందు
బంద్రెండు పంద్రెండు పరఁగఁ గంఠమ్మున • ముప్పదిరెండు నిమ్ముగ శిరమ్ము
నందు నాలుగువదు లట్ల కర్ణమ్ముల • నాఱాఱు వక్షమ్మునందు నూట

గీ. యెనిమిదియుఁ దాల్పనేని వాఁ డెల్లయెడల
రుద్రునింబోలెఁ బూజ్యతారూఢి మెఱయు;
ముత్తెము ప్రవాళమును రౌప్యమును మొదలగు
నవి యమర్చి ధరించువాఁ డగు శివుండు. 107

క. అలసతచే నైనను గే, వలముగ రుద్రాక్షలే నెవఁడు దాలుచు నే
కలుషములు వానిఁ బొరయవు, తలమె విభావసునిఁ జెనక తమమున కెంచన్!

గీ. పేర్మి రుద్రాక్షమాల జపియించువాని, కబ్బు పున్నెం బదింతయు నంతగాదు
ఒక్క పూసేని నెమ్మేన నూనఁ డేని, వాని జన్మంబు వ్యర్థంబు వాఁడు పశువు. 109

క. శిరమున రుద్రాక్షన్ దా, ధరియించి యెవండు పేర్మి దానము సల్పుగా
సురనద్యుదకస్నాన, స్ఫురణంబునకైన ఫలమువొందు నతఁ డొగిన్. 110

వ. మఱియు నేకముఖపంచముఖదశముఖచతుర్దశముఖమ్ములు విశేషించి యర్చ్యర్హి
తమ్ము; లింతియేల యెద్దియేని రుద్రాక్షమదాత్మకం; బియ్యది దరిద్రునేని రాజుం
జేయఁజాలు నియ్యర్థమున నొక కత కలదు వినుము 111

క. కోసలదేశమ్మున నొక, భూసురుఁ డతిధార్మికుండు పూతుఁడు నిగమ
వ్యాసంగి ద్రవ్యవంతుఁడు, భాసిలు గిరినాథనామభాస్వరుఁ డగుచున్. 112

గీ. అపరమన్మథుఁ డతినూత్నయౌవనుండు
గుణనిధిసంజ్ఞుఁ డాతని కొమరుఁడు సుధి
షణుఁ డనెడి తన గురుపత్నిసతిప మదము
కలిమి ముక్తావళిని మోహకలితఁ జేసె. 113

ఉ. ఏమని చెప్పువాఁడ ! నిటు లిట్టిమెయిన్ గురునింతిఁ బొంది తా
నామెయి దేశికోత్తముని యడ్డఁ యించుక లేక యుండ దు
ష్కామతఁ బిమ్మటన్ వెస పదమ్మిడి నిర్భయుఁడై నిరంతరం
బామధుకోష్ఠిఁ గూడి మదనాగమచర్య యొనర్చు షణ్ముఖా. 114

తే. గీ. అంతఁ దలిదండ్రు లిదియేమి యనుదు వారి, కింత విషమిది కాఁజేసి యెల్లవేళ
భోగపరుఁడయి ద్రవ్యమ్ము పుచ్చివైచి, పిదపఁ జౌర్యమ్మునకు డిగి పేదయయ్యె.

తే.గీ. అంత నాయూరి బ్రాహ్మణు లరసి వీఁడ
పాత్రుఁడని బహివెట్టి యప్పల్లె వెడలఁ
గొట్టుటయు నవ్వేళం దుకఁ గూడి వాఁడు
వనమునకుఁ బోయి బోయ నాఁగను జరించె. 116

క. నిరతమ్ము సురాపానా, దరుఁడై పథికులను జంపి ద్రవ్యమ్మును దా
గర మూర్జించు నకట ! చ, చ్చిరి యెందఱొ విప్రు లట్టి చెనఁటి కతమునన్. 117

గీ. ఇవ్విధమ్మున బహుకాల మేగునంత, నంతమునఁగనె నయ్యధమాధముండు
వానిఁ గైకొన యమభటవర్గ మొకట, నొకట మద్భృత్తులును మూఁగి రో కుమార.

ఉ. వారికి వాదుగల్గె నది వారక దెల్పెద నాలకింపు మం
భోరుహమిత్రపుత్రభటపుంజము వీరలఁ జూచి "యక్కటా !
ధీరహితుం డపాత్రకుఁడు దేశికదారహరుండు మీర లె
క్కారణ మాత్మ నెంచి యిటు కైకొనవచ్చినవారు" నావుడున్. 119

తే.గీ. వీఁడు దేహమ్ము విడిచిన పృథివి త్రవ్వఁ
డచట దశహస్తములలోఁతు నందు లోక
పూజ్యమైయొప్పు రుద్రాక్షపూస యొక్క
డుండెఁ దన్మహిమం బిది యొందుగాదు. 120

వ. ఇక్కృతమ్మున వీఁడు మహానుభావుం డని చెప్పి విమానసంగతుగ నొనర్చి మత్స
న్నిధిం బొందించి రిట్టిది రుద్రాక్షమాహాత్మ్యం బిది వినువారికి సర్వపాపక్షయ
మ్మును సకలశ్రేయోభివృద్ధియును గలిగెడి: నని తండ్రి యానతిచ్చిన విని కుమా
రుండు కృతార్థుం డయ్యె. 121

క. వవిగొని గిటు నికినచో, గనకమ్మున కీకువచ్చు కాంతినెగడు దా
నివి పరమంబు బుధుల నె, క్కొని శైవులు దాల్తు రదియు కుతుకమున మునీ.

తే.గీ. వేయి ధరియించు టుత్తమవిధి తదర్ధ
ధారణము మధ్యమంబు నధమము మూఁడు
పదులు ధరియించు టోమునివర! సమస్త
కాలములఁ దాల్పవలె వీడఁగా వలవదు. 123

గీ. ఏకవక్త్రంబు పరతత్వ మింత నిజము, దాని ధరియింపఁగల్గు దజ్ఞాన మనఘ!
ద్విముఖ మర్ధనారీశ్వరతేజ మది ధ, రింప నద్దేవునకుఁ గలుఁ బ్రీతి మఱియు. 124

గీ. గ్రహణమున విషువమున సంక్రమమునఁ నయ
నమున దర్శమ్మునందుఁ బూర్ణిమను బుణ్య
దివసములయందు రుద్రాక్ష తివిరి ధార
ణం బొనర్చెడి వారి కఘంబు లడఁగు. 125

వ. యథోక్తమ్ముగ భూతశుద్ధినొనర్చి మూలాధారగతయగు నయ్యంబిక ధ్యానించి సమస్తకర్మకరణాధికారకంబగు భస్మోద్ధూళనం బొనర్పవగు; నేతద్ధారణంబ శిరోవ్రతంబని శ్రుతిస్మృతులు చెప్పెడి నీవ్రతంబు విద్యాదాయకంబును నవిద్యాభంజకంబునుగా నెఱుంగుము. 126

## శిరోవ్రతమహిమము

ఆ.వె. తగిన శ్రద్ధ గలిగి ధన్యత నీశిరో, వ్రత మెవం డొనర్ప దలఁపఁడొ
వాని కెల్లకృతులు వమ్మగు బ్రహ్మకు, లిక్కృతమునఁ గాదె యేపు గవిరి. 127

గీ. అగ్నియను మంత్ర మాదిగా నలరు నాఱు
మంత్రముల శుద్ధమైన భస్మమ్ము దేహ
మెల్లఁ బూయంగవలయు మునీంద్ర! యిది శి
రోవ్రతం బని వచియింతురు మునివరులు. 128

క. వినుమీ శిరోవ్రతము ప్రతి, దినమును నంజల నొనర్చు ధీరుఁడు విద్యం
గను విద్యోదయ మొదవెడి, దనుక నిది యొనర్పవలయుఁ దత్వజ్ఞనిధీ. 129

సీ. అనఘ! ద్వాదశాబ్దము లొండె నబ్ద మొండె
నాఱు నెలలొండె మఱియునం దర్ధ మొండెఁ
బది యిరెండు దినములొండెఁ బరమభక్తి
నీ శిరోవ్రత మొనరింప నెసఁగు విద్య. 130

గీ. విను శిరోవ్రతమున స్నానమును బొనర్చి. పూతుఁడగువాని కుపదేశమును బొనర్పఁ
కుందు నెవ్వఁడు వాఁడు దుష్టుఁడు వాని. విద్య నశించునని తత్త్వవేత్తలంద్రు.

గీ. భస్మము పవిత్రపీఠసంపర్కశుద్ధ, ముగ నలిపి నిత్యము లలాటమును దిర్య
గంచితమ్ముగ ధరియించు టభిమతంబు. బ్రహ్మజాత్యుద్భవునకని పలుకు శ్రుతులు.

క. శ్రుతిసిద్ధభస్మధారణ, మతులితశివలింగపూజ యను నియ్యవి తా
మతిమంతుఁ డెప్పుడును మా, ని తగన్ మానితవిభూతి నెగడఁడు మౌనీ. 133

క. తెలుపగు భస్మమ్మున నొడ, లలమిన మనుజుండు వేగ మఘ మెడలి రజః
కలనంబు వీడి శుద్ధిన్, జెలఁగున్ సంశయ మొకింత చేయకు మిచటన్. 134

వ. అగ్నిహోత్రాగ్నిజమ్మును విరజానలజమ్మును నౌపాసనసముత్పన్నమ్మును బచ
నాగ్నిసముత్పాదితమ్మును దావానలసముద్భవమ్మును, సమిదగ్నిసంజనితమ్మును నై
భస్మ మ్మాఱుదెఱఁగులు గలయది. ఇందుఁ ద్రైవర్ణికులకు మొదటిరెండును ధార్యం
బులు. గృహస్థు లౌపాసనసముద్భవంబగు భస్మంబు ధరియించు టభిమతంబు. సమి
దగ్ని సంజనితంబు భస్మంబు బ్రహ్మచారులు ధరియించుట సమ్మతంబు. శ్రోత్రి
యాగారపచనాగ్ని సముత్పాతంబగు భస్మంబు శూద్రులకు ధరింప నర్హంబు. తది
తరులకు దావానలోద్భవంబు శాస్త్రచోదితంబని వెండియు, 135

గీ. అనఘ ! పూర్వత్రయోదశి యందు స్నాతుఁ
డగుచు సుకృతాహ్నికుండయి యార్యుఁడైన
గురుని పూజించి యీవ్రతము రహిఁ జేయు
వాఁడ నంచు సంకల్పింపవలయు వినుము. 136

సీ. తను వుండునంతకంచును నొండెఁ బదియు రెం, డేఁడు లవియు నొండె నెలమి నాఱు
సంవత్సరము లొండె సగమొండె సద్దాన, వత్సరం బొండెఁ దద్వత్సరమున
సగమొండె నొక్క మాసం బొండెఁ బదియు రెం, డహములు నొండె నాఱహము లొండె
సద్దాన సగమొండె నహ మొక్కఁ డొండెను, సంకల్పమున కవసానముగను

గీ. నిశ్చయించియు మఱియు నగ్ని నతిభక్తి
నఖల విరజాహవనమున నలయుఁ దృప్తిఁ
జేయు నాహోమసత్కృతి సేయు నపుడు
మూలమంత్రస్మరణ మతిముఖ్య మనఘ. 137

గీ. మఱియు నయ్యగ్నియందు గోమయము నుంచి
నాఁటికి హవిష్యభోక్తయై నవసి తాఁ జ
తుర్దశిని మదయమ్మునఁ దొల్లిటి కృతు
లాచరించి నిరాహారుఁడయి పదపడి. 138

వ. పూర్ణిమయందు నిర్వర్తితకృత్యుండై యగ్ని నుపశమింపఁజేసి యందలి భస్మమ్ము గ్రహియించి నియతుండై తత్తదవయవమ్ముల యథావిధి భస్మోద్ధూళనం బొనర్చి జపియింపవలయు. 139

గీ. మూఁడు సంజల నీగతి మూఢుఁడేని, పాశుపతమగు వ్రతము మ భక్తిజేసి
తనపశుత్వమ్ము విడనాడి గనెడి భుక్తి, ముక్తుఁను నిక్క మియ్యది మునివరేణ్య.

ఉ. ఆయు వొసంగు సౌఖ్యముల నంద నొనర్చు బలమ్ము నిచ్చు ను
శ్రీయును బుష్టియుఁ గా శుభసమృద్ధియు రోగనివృత్తియున్ సదా
చేయు మఱింత యేమిటికిఁ జెందదు మారిభయమ్ము భక్తిమై
నే యవయుల్ ధరింతు రిటు లెప్డును భస్మము వారి కెయ్యెడన్. 141

క. స్నానంబొనర్చి భస్మ, మ్మూనంగా వలయు శక్తి యొలయని మమజుం
డీ నియతి విడిచి కరచర, ణాననములు గడిగియైన నది గొను టొప్పున్. 142

క. కరచరణావనావం, తరమునఁ దగ నాచమించి తాల్చిన యయ్యం
బరము విడిచి పరిశుద్ధాం, బరమున్ ధరియింపవలయు పరమమునీంద్రా! 143

క. శిరము లలాటమ్మును గం, ధరమును గర్ణమ్ములును హృదయమును బాహుల్
ధరియింపం దగు చోట్లని, పరమమునీంద్రులు వచింత్రు భస్మమ్మునకున్. 144

క. సరసిజభవసరసిజనయ, నరుద్రులై మూఁడునుం దనర్చును రేఖల్
ధరియించునెడ నిగమ ము, చ్చరించు టతిగర్హితము ద్విజమ్ములు దక్కన్. 145

క. పదివేలు సెప్ప నేటికి, నదమలమగు భస్మ మెవఁడు స్నాతుండై తా
ను దరించు నమ్మహాత్ముఁడు, మదనాంతకుఁ బోలఁజాలు మహిమము కలిమిన్ 146

గీ. వైదికోత్తములొండె శైవరులొండె
నొసఁగు భస్మమ్ము భక్తి పెంపెసఁగఁ గొనఁద
గును తిరిశరు లిడిన దాని గొనఁగఁ దగ ద
టంచుఁ బెద్దలు పచియింతు రమలచరిత 147

క. కరణమ్ము లెన్నియే శం, కరుపూజకు సంగ్రహించుఁగాక నరుఁడు భ
స్మరహితుఁ డగునెడ నన్నియుఁ, బరమమునీ! వ్యర్థములయి పాడగుఁజుమ్మీ.

చ. జపము తపమ్ము హోమమును శ్రాద్ధము నన్యము సర్వముఁ గావృథా
త్వపదవిఁ గాంచు భస్మమును దాల్పనిచో నది తాల్చి విప్రు లె
ట్టిపను లొనర్చిరేనియుఁ గడింది పవిత్రత కాకరమ్ములై
యపగతరోగులై విగళితైనసులై చరియింతు రెప్పుడున్. 149

గీ. సర్వవర్ణమ్ములకును భస్మము ధరించు, టతిహితమ్మని చెప్పుట యనవసరము
హరిహరాదులు దేవత లఖిలమునులు, దీని ధరియింతు రెల్లప్డు దేవమౌని. 150

క. ఎవని లలాటమ్మున భ, స్మవిలేపన మొప్పువాఁడు చతురాస్యుని దు
ర్వ్యవసాయాక్షరపంక్తుల. నవలకుఁ ద్రోచి సుఖము లందు మునీంద్రా! 151

క. వాతము శ్లేష్మము పైత్యము, హేతువుగాఁ గల్గు వ్యాధు లెల్లను భస్మో
పేతశరీరులఁ జెనకం, గాతరతం జెందు హరినిఁ గను కరులగుచున్. 152

క. విను భస్మస్నానమ్మున, కనఘా! వేతొండు తుల్య మనుకొనకుము భు
క్తి నిడుఁ గా ముక్తినిడున్ బా, వనతం గలిగించు నెట్టి పాపాత్ములకున్. 153

క. మణికన్న నెక్కుడుగ బ్రా, హ్మణుఁ డెవ్వఁడు భస్మసంగ్రహము సేయు ద్విజా
గ్రణి! యాతం; డితరుఁడు బ్రా, హ్మణేతరుఁడు పాపకర్ముఁ డపవిత్రుండుగా.

క. జందెములు లేక సంధ్యా, వందనము లొనర్ప నెట్టి ఫలముబ్బునో భూ
తిం దాల్పని యాక్రియ యా, చందమ్మున వమ్మగున్ ద్విజప్రవరులకున్. 155

క. దానమ్ములొండె భోజన, పానాదిక మొండె నెవఁడు భస్మరహితుఁడై
తా నొనరుచు నింద్యం బ, మ్మానవుఁ డవ్వానికంటె మాలఁడు లగ్గా. 156

గీ. శ్రౌతభస్మమ్ము స్మార్తభస్మమ్ము నేవి, లౌకికంబేని మేన నుండవలయు
జపము వేళ భస్మపుష్టాగరిష్ఠుఁ, జేరఁగారావు ఘోరవృజినచయములు. 157

వ. ఇయ్యెడ నొకపురాతనేతిహాసమ్ము గలదు వినుము. 158

మ. అనిపై యొప్పు విభూతిశోభ ధృతరుద్రాక్షసూత్రమ్ముతో
ముని దుర్వాసుఁ డొకప్డు పైతృకజగమ్ము న్గాన నేగెఁ జగ

జననీ! శాంకరి! శంకరా! త్రిజగదీశా! శర్వ! యంచున్ మహా
నినదం బొప్పఁగఁ గల్యవాలముఖమౌని శ్రేష్ఠుఁడా దవ్వులన్. 159

క. వచ్చెడి మౌనికి నెదురుగఁ, జెచ్చెరఁ జని వందనములు చేసి విడిదికిఁ దా
దెచ్చి రహి నర్ఘ్యపాద్యము, లిచ్చి మహార్హాసనమ్ము లిచ్చిరి భక్తిన్. 160

క. ఆకాలమ్మునఁ గుంభీ, పాకనరకవాసులైన పాపాత్ముల హా
హాకారంబులు పెల్లుగ, నాకాశము వ్రయ్యలైన యటులు వినఁబడెన్. 161

క. మునిమణియును నాకరుణా, నినదంబుల నాలకించి నెగులొదవ మనం
బున నూఁటడిల్లి పితరుల, కనియె నిదెవ్వారి రోదనారావమొకో. 162

చ. అనవుడు మౌని కిట్టులని రయ్యది సంయమనీపురంబు దు
ర్జనులను శిక్షసేయు యమరాజట భీకరరూపు లెందఱో
యనుచరవర్గముల్ దను నిరంతరము న్గొలువంగ నుండు యా
తన బహుభంగులన్ గొలుపు తావులటంచ షడశీతి చొప్పడున్. 163

క. ఆకుండమ్ములఁ గుంభీ, పాక మ్మతిదుస్సహం బపారం బచటన్
వ్యాకులత దానఁ గలిగెడి, శోకం బిదమిద్దమనఁగఁ జొప్పడ దనఘా! 164

సీ. విష్ణునిందకులును వేదదూషకులును • గణపతిద్రోహులు గమలబాంధ
వద్వేషులును విప్రవంచకులును దప్త • ముద్రాంకితులు శూలమునుధరించు
వామకామాచారపరులు స్మృతిపురాణ • ధిక్కారకులును బితృగురువైరు
లును ధర్మవిరహితులును భ్రాతృగర్హకు • లును మాతృపూజానులోమమతులు

గీ. కూలుదురు వీరలెల్ల నక్కుండమందు • శ్రవణదారుణమైన యాశబ్దజాల
మనఘ! యవ్వార లొనరించు నట్టి దెద్ది • వినినమాత్రన వైరాగ్య మనుఘటించు.

క. అనవిని దుర్వాసుఁడు కుం, డనికటమున కరిగి కటకటా యను నాలో
నన వారికెల్ల స్వర్లో, కనివాసముగల్గె నతని కారుణ్యమునన్. 166

క. కొందఱు నగుదురు నాట్యము, కొందఱు సల్పుదురు వీణ కొందరు వాయిం
పం దలకొంచు రమందా, నందమ్మది మానసమ్మునఁ దా వెలివిరియఁగా. 167

చ. అదిగని మౌని యక్కణమునందె యమానుచరుల్ మహాద్భుతా
స్పదులయివేగ మయ్యెడ నిసన్నిధికేగి యుదంతమంతయున్
విదితముచేయ నవ్విభుఁడు విస్మయమంది కలాయవాహుఁడై
మునమలరంగ నమ్మెడకుఁ బోయి కనుంగొని శంకితాత్ముఁడై. 168

క. ఆవార్త దూతముఖమున, నవ్వాసవున కెఱిఁగింప నయ్యనఘుండున్
దవ్వవక చిత్తమెంతయు, నువ్విళ్లూరంగ నచటి కొయ్యనఁ జనియెన్. 169

క. హరియు విరించియు దిగ్పా, లురు నట కరుదెంచి యచటిలోకుల సౌఖ్యం
బరసి నిమిత్తాన్వేషణ, పరతఁ జా హృదయంబు మిగుఁ బరువుగ వారల్. 170

క. ఈ కుంభీపాకం బతి, శోకదమై పాప పరవశుల కొఱ కేర్పా
టైకద! యున్నది దీనన్, నాకాధిక సుఖము గల్గు టత్యద్భుతమౌ. 171

క. ఇఁకఁ బాపమ్ముకతన భయ, ము కలదె యకటకట! వేదపుణ్య మర్యాదల్
వికలమ్ములయ్యెఁ బరమే, శకృతమగు వ్యవస్థ కీ దశయుఁ గల్గెనే. 172

క. తన చేసిన సంకల్ప, మ్మునకు ముధాత్వమ్మునర్పు మోదించునె య
య్యనఘాత్ముఁడంచు నెల్లరు, మనమున యోజించుచుండ మాధవుఁడంతన్. 173

చ. రయమునఁ బార్వతీశ్వరు పురమ్మున కేగి గిరీశుఁగాంచి మ్రొ
క్కి యనఘ! యిట్టి చిత్రము నొగిఁ గనుఁగొంటిమి నేఁడటంచుఁ బ
ల్కి యఖిలవృత్తముం దెలుప లీలమెయిన్ నగి యవ్విభుండు సం
శయహరణమ్ముగాఁ బలికె పాంసలోచనుతోడ నీగతిన్. 174

సీ. అనఘ! దుర్వాసుఁ డొక్క నిమిత్తమున దారిఁ, జనుచుఁ గుంభీపాక సంగతులగు
జీవుల వీక్షింపఁ జెచ్చెర భస్మాన, కుంఠితమగు మోము కొంతవంచె
నయ్యెడ వాయుదేవాధూతమై భస్మ, మొక్కింత పడియెఁ గుండోదరమున
నక్కతమ్మునఁ బాపులయ్యును గతపాపు, లై వారలట్టి సుఖాతిశయము
గీ. నెనసి రియ్యది భస్మమహిమము నేఁడు, మొదలుగా నద్ది పితృలోకమున వసించు
వారలకునెల్లఁ దీర్థమై వరలు నచట, స్నానమొనరింప నత్యంత సౌఖ్య మొదవు.

క. పితృతీర్థనామమున న, ద్ది తనరు నిదిమొదలు నన్ను దేవిని నట స్థా
పితులుగఁ జేయందగుఁ ద, త్పితృలోకనివాసులెల్లఁ దివిరి యజింపన్. 176

వ. ఇయ్యది త్రిలోకమ్ముల నుత్తమతీర్థమ్ము నాపుడు హరి యమ్మహేశు నమజ్ఞవడసి మున్నుండుచోటకరిగి కడచిన వృత్తాంతమ్ము నొడువుటయు వారలెల్ల శిరఃకంపమ్ము లొనర్చుచు భస్మమహిమమ్ము ప్రశంసించిరి. పితరులును దీర్థలాభమ్ముకతన సంతుష్టులైరి. పదపడి యయ్యెడఁ బరమేశు నాజ్ఞవడసి వారి నిరువుర స్థాపించి యమరుల యజించుచుండిరని మఱియును, 177

క. ఏపాపాత్ము లచట మును, పాపానుభవమున నిడుమ వడుచుండిరొ వా
రే పూతులగుచు హరుని స, మీపమ్మున నిత్యపదవి మేకొని రనఘా. 178

వ. వార లిప్పుడును గైలానమ్మున భద్రగణనామమ్మున నొప్పుదురని వెండియు. 179

క. ఆకారణమునఁ గుంభీ, పాకము మఱియొక్కచోటఁ బాపాత్ముల కా
లోకమున నేర్పరుపఁబడె, నీకతమున శైవు లచటి కేగరు మరలన్. 180

క. ఇది భస్మవిశేషం బి, ట్టిదియని యెవ్వాఁడు చెప్పెడిఁ భస్మం బె
ట్టిదియైనను నగు దానికి, సదృశముగ వచింప నొందు జగమునఁగలదే. 181

వ. ఇంక నూర్ధ్వపుండ్రవిధానం బాలింపుము. 182

గీ. శ్యామమిడుఁ గాంతి, యెఱుపు వశ్యమ్మొనర్చుఁ, బీతవర్ణంబు శ్రీకరమై తనర్చు
ధర్మవృద్ధికరమ్ము శ్వేతిమ్మ యంచు, మును లనుటఁ గోర్కె కనుగుణముగఁ గొనఁదగు

వ. పవిత్రతరస్థలమ్ములందలి మృత్తు గ్రాహ్యంబని యెఱుంగునవియని వెండియు. 184

గీ. వర్తి వెలిగించినట్టి దీపమ్ముపగిది
వెదురుటాకుకరణి శంఖవిధమున నర
విజముకుళభంగి మత్స్యంపు సిరిని గూర్మ
సామ్యమున నూర్ధ్వపుండ్రమ్ము సలుపవలయు. 185

సీ. ఇమ్మగుగతి లలాటమ్మునఁ గేశవు, రహి నుదరమున నారాయణు హృద
యమున మాధవుని గళమున గోవిందునిఁ, గుడిప్రక్క విష్ణుని నెడమప్రక్క
వామను దక్షిణవామబాహులఁ మధు, సూదను శ్రీధరు నాదికర్ణ
మునను రెండవకర్ణమునఁ ద్రివిక్రము హృషీ, కేశు నళిననాభుఁ బృష్ఠమునఁ గ

గీ. కుత్తునందు దామోదరు నెత్తి వాసు, దేవుని స్మరించి పుండ్రముల్ దీర్పవలయు
వీనిఁదాల్చిన నశుచియునేని శుచియు, వానికి మదీయలోకమ్ము వచ్చు నిజము. 186

చ. ఇకఁదగు నూర్ధ్వపుండ్రముల నించుక యంతర ముండునట్లు లె
వ్వఁ డెడనిడండొ దుర్గతికి భాజనమాతఁడు పుండ్రమధ్యమం
దెడపక లచ్చియున్ హరియు నెప్పుడు నొప్పుచు రంతరాలమున్
విడువని మూఢమానవుఁడు విష్ణునికిన్ మఱి శ్రీకి ద్రోహియౌ. 187

క. సిగయు నుపవీతమును నె, వ్వగ ముఖ్యములౌను విప్రవర్యుల కటు లొ
ప్పగుఁ బుండ్రధారణము దీ, నిఁ గడచి కర్మమ్ము సేఁతనిష్ఫలమనఘా. 188

గీ. అర్ధచంద్రాది చిహ్నము లాగమజ్ఞు, లైనవారలు ధరియించు టనభిమతము
గాన బ్రాహ్మోక్తపుండ్రముల్ గాక యెట్టి, దేని మఱియొండు దాల్చుట హితముగాదు.

గీ. వేదసిద్ధదేవతలకు వేదవిహిత, చిహ్నములు న్యాయ్యములుగాన శ్రీపతిపశు
పతులు తత్సిద్ధులగుటఁ దత్పద్ధతిరహి, తముల వారెట్లు ధరియింతురు మునినాథ!

క. తత్తద్వ్యక్తజనములకుఁ, దత్తచ్చిహ్నములు ముక్తిదమ్ము లగుట వా
రి త్తెఱఁగు తెలిసి తాల్చుట, యుత్తమగతి నొసఁగు నన్యమొందుగతి నిడుఁగా. 191

## సంధ్యోపాసనా మహాత్మ్యము

వ. ఇంక సంధ్యోపాసనమ్ము వినుము. 192

గీ. అక్కడక్కడ నొలసెడి రిక్కగముల
నగు మొదటిసంధ్య రెండవయది యహస్క
రుండు గగన మధ్యమ్మున నుండువేళ
మూఁడు సూర్యాస్తమయకాలముగ నెఱుంగు. 193

గీ. తారకోపేతమైన నుత్తమము తద్వి
రహితమైన మధ్యమము సూర్యయుతమైన
నధమ మీరీతిఁ ద్రివిధమై యలరుఁ గల్య
సంధ్య యీమూఁటికిని దాఁటఁ జనదుమౌనీ! 194

క. తరణియుత ముత్తమము త, ద్విరహితమగు మధ్యమమ్ము విస్ఫురదుడుకం
బరయ నది యధమ మీగతి, నరయుము సాయంపుసంజ యనఘవిదారా! 195

గీ. ద్విజుఁడు వృక్షము, సంజ వే, ర్వేదములు వి
టపము, లాకులు ధర్మకర్మపటలములు;
మూలవిరహితమగు చెట్టు నేలఁగూలుఁ
గాన నతియత్నమున సంజఁ గావవలదె. 196

క. తెలియమియుఁ దెలిసినటపమి, యలవడు ద్విజుఁడెట్టిఁదేనియగు శూద్రుం డ
మ్మలిమిందు చచ్చి శ్వాన, మ్మలలోఁ బడుఁగాన సంజ ముఖ్యమ్మనఘా! 197

గీ. ఉదయమున కస్తమయమున కూర్ధ్వమొక్క
మూఁడుగడెలలోఁ దదుపాస్తికూడు నట్టి
కాలము నతిక్రమించి యర్ఘ్యమ్మొకఁ డధి
కముగ నీఁదగుఁ దత్పాతకము హరింప. 198

క. కాలాతిక్రమ మొనరుచు, బాలిశులకు నింక నొక్క ప్రాయశ్చిత్తం
బాలింపు మెన్మిదియు మా. తోలిన్ మొదలన నమజప మొనరింపవలెఁగా. 199

క. ఏకాలమ్మున మనుజుం, డేకర్మము సేయఁ బూను నేకాగ్రతఁ దా
నాకాలమున కధీశ్వరి, నాకర్మమునకు మొదల నుపాసింపఁదగున్. 200

గీ. ఇంట సామాన్యమగు గోష్ఠమేని మధ్య, మమగు నదియొద్దునం దుత్తమము విశేష
మంతకన్నను దేవాలయమ్మునందు, బ్రాహ్మణుల కింతకన్న దైవమ్ములేదు. 201

క. గాయత్రికన్నవన్యం, బేయెడ విప్రులకురే దిదే బ్రహ్మాదుల్
సేయుదురు జపము శ్రుతులుగా, గాయత్రిజపించు సాటిగలదే మౌనీ! 202

క. శివవిష్ణూపాసన ల, య్యావి గాయత్రివిధమున నియతములుగా మిగా
భువినెల్లరు శాక్తులుకా, రెవరుగా వైష్ణవులుశైవు లెఱుఁగుము మౌనీ! 203

వ. గాయత్రిం జపించి ముద్రాప్రదర్శనంబు గావించి పదపడి హోమాదికంబు నిర్వ
ర్తించి పంచాయతన పూజగావింపవలయు.

గీ. మొదల శ్రీదేవి నర్చించి పిదపఁ దక్క, దేవతల కర్చలిడఁదగు దేవిపూజ
కన్న నెక్కుడు పున్నెముగాన మక్క, తనఁగదా! సంజలనది నిత్యమును నొలయు

గీ. భుక్తిముక్తిప్రదము దుఃఖమూలహరము, శక్తిపూజన మది యనురక్తి విస్త
రించి వచియింతు వినుమెవ్వరేని వినిన, సల్పినను నెల్లయాపదల్ సమయు దాన.

క. ఆచమనమ్మును సంకల్పాచరణము భూతశుద్ధి యామీఁదను న్యా
సాచరణము శంఖస్థితి, యాచార్యనతియును సల్పి యవహితమతియై. 207

వ. సామాన్యార్ఘ్యమిమ్మడి పూజాద్రవ్యమ్ముల ప్రోక్షించి పీఠమ్మునర్చించి దేవిని ధ్యానించి
నామోపచారమ్ము లర్పించి పంచామృతస్నానమ్ము సమర్పించి. 208

సీ. పుండ్రేక్షురసపరిపూర్ణ కుంభములను • గోస్తనీరసలసత్కుంభములను
కర్పూరకాశ్మీరకస్తూరికాగురు • పంకిలాంభఃకుంభపటలములను
బాలకుండలఁ బెర్గు భాండమ్ములను మధు • ఘృతశర్కరాఘటతతుల నెవ్వ
రంబకు స్నానమ్ము నమఘటింతురు వారు • స్వకృతార్చనకు సదృశమగు ఫలము

గీ. గందు రిహమునఁ బరమున క్షౌమవస్త్ర, యుగ్మమిడి వాయులోకమ్ము నొందుదురు సు
రత్నభూషల నిడి నిధిరాజు లగుదు, రింద్రు లగుదురు గంధమ్మలిడి మునీంద్ర!

క. వివిధములగు పుష్పములిడి, శివలోకము వడయుదురు మన్నుణబిల్వదళ
ప్రవరప్రవాత దుఃఖం, బెవఁడెన్నం డెచటనొందు డెఱుఁగ మునీంద్రా! 210

క. ఎవఁ డొక కోటిదళమ్ములు, భవాని కర్పించు నధికభక్తిరతుం డా
సువిమలశీలుఁడు బ్రహ్మం, డవిభుండై నెగడు లోకనాయకి కరుణా 211

గీ. కోటి మాలతీసుమములఁగొని పరాంబ, పూజనముపు నతఁడు చతుర్ముఖుఁడగు దళ
కోటి తత్పుష్పముల పూజఁగొలిపి విష్ణు, వై నెగడు సర్వదేవతావంద్యుఁడగుచు.

క. ఒకఁ డనఁగనేల నానా, వికచసుమమ్ములను భక్తివివశుండై యం
బికఁ బూజసేయనగుఁ ద, త్సుకృతము వర్ణింపఁ దరమె శూలికినేనిఁ. 213
గీ. అగురు కర్పూర ధూపమ్ము లధిసియుతి, నంబ కిడఁదగుః దాన నత్యధిక మోద
మంది భువనేశి భువనత్రయంబు నన్పు. ఇనకుఁ బ్రతిఫల మిచ్చు నో మునివరేణ్య!
క. కర్పూరఖండముల దీ, పార్పణ సేయంగ నంబ యవ్వాని మన
స్తర్పణ మొనరుచు నిక్కమ, హర్పతిలోకమున వాస మమరించి మునీ. 215
వ. పదపడి భక్ష్యభోజ్యాదియుతమ్ముగ నైవేద్యమ్ము సమర్పించి,
గీ. పిదపఁ బానీయమిడి మరి ముదము బొదలఁ, జేయు తాంబూలమిడి మహాగాయకులును
గాయనులు నాలపించెడి గానములును, వేదపారాయణములును విస్తరించి. 217
గీ. ఛత్రచామరములు నిడి సకలరాజ
సదృశగతి నుపచారముల్ సంతరించి
చేరువఁ బ్రదక్షిణము నమస్కారము నిడి
తన్ను క్షమియింపుమంచు నెంతయు నుతించి. 218
క. ఏతాదృశోపచారము, లేతం దొనరించు వాని నీశ్వరి ప్రోచుఁ
మాత స్వతస్సిద్ధకృపా, న్వితగదా! పూజసేయునెడఁ గొదువేలా. 219
సీ. ఇయ్యెడ నొక పురావృత్తము వచియింతుఁ ; గలదొక చక్రవాకము హిమగిరి
నది దేశములయందు నటునిటుఁ దిరుగుచుఁ ; గాశికి నేగి యొక్కటను నన్న
పూర్ణ గుడికిఁజని భక్తికై యేదేని ; దొరకునే యని కొంత తొట్రుపాటు
దనర నొక్కింత ప్రదక్షిణ మొనరిచి ; తనయంతఁ జని పిమ్మటను భవాంత
గీ. రమున స్వర్గము నవియు భోగములు రెండు
కల్పములు గాంచి పిదప భూఖండమందు
క్షత్రియకులమునఁ బొడమి జన్మ సంస్మృ
తి విదక ప్రజాధిపత్యమ్ము దీర్చుచుండె. 220
క. నృపతి యొకఁడు పూర్వజ్ఞా, నపరీతుఁడు గలఁడటంచు నానామునిరా
జ పటలి విని చని కని పూ, జపడసి కూర్చుండి పలికె జననాధునితో. 221
క. ఓ నృపవర! పూర్వజ్ఞా, నానుభవము నీకుఁ గలిగెనని విని కనఁగా
మౌనుల మే మరుదెంచుట, గానఁ దెలుపు మదియు నీకుఁ గలిగినవలనుఁ. 222
గీ. అన నృపుఁడు చెప్పె బూర్వమం దన్నపూర్ణ
కొనరిచితిఁ బ్రదక్షిణము పక్షినయి తత్ప్రి

భావమున స్వర్గమందుఁ గల్పద్వయంబు
నిలుచు. టిప్పు డీ జ్ఞానమ్ము గలుగు టబ్బె. 223

క. జగదంబచరిత మెవ్వఁ డె, ఱుఁగును బదస్మృతిఫలమ్మెఱుఁగువాఁ డున్నే
యగణితమది దావిం దల, పగ నాకానందబిందుపతనము గల్గున్. 224

చ. పలుకులు వేయునేల జనిపావనకారణమైన యంబికన్
గొలువక విష్ణునిన్ శివునిఁ గొల్పెదమంచు వృథా భ్రమించువా
రల జననమ్ము న మ్మఘకరమ్ము పరమ్ము నిహమ్ములేక చం
చల మయిపోవు నిక్క-మిట సందియమందకుఁ డించుకేనియున్. 225

క. అను పల్కు-లు విని మును లా, ననములు తెలివొందఁ జనిరి నారద ! యే నెం
తని యాదేవిని వర్ణిం, తును నుతియింతును నతులిడుదును వినుమొకటన్. 226

క. జననము సఫలమ్మగ నె, వ్వనికిన్ గానందు గల్గు వానికిఁ దద్భ
క్తినిదానమ్మగు శ్రద్ధ త, దనిచ్ఛ జనిసంకరతకు నగుఁ గారణమై. 227

వ. అయ్యదియు సంధ్యాత్రయమ్మున నయ్యంబ నర్చించుట పరమ తపంబై యొప్పెడి.

క. తపమున దేహమ్మును దా, పపరీతముసేయనగుఁ దపమ్మనఁ బిత్రుస
త్కృప గననగుఁ దపమిడు స్వ, ర్గపదవి ము క్తియును దపము గనఁజేయు మునీ!

క. నృపతికి భుజబలమును ద్ర, వ్యపటిమ వైశ్యాంఘ్రిజులకు నాపత్తరణం
బు వొనరుచు నుపాయమ్ములు, జపహోమాదికము విప్రజాతికిఁజుమ్మీ. 230

క తపములలో నుత్తమమగు, తప మంగతనుత్వ మది యొదవఁదగుఁ గృచ్ఛ్రా
దిపరిశ్రమమున వేతొం, డుపములఁ దనుశోషణము గడున్ గర్హితమౌ. 231

గీ బిచ్చమెత్తి యన్నమ్మను దెచ్చి నాల్గు
భాగములుచేసి యందొక భాగము ద్విజు
లకు నిఁకొక్క-టి యాలకు నొకటి యతిథు
లకు నొకటి తనకుఁ దన భార్యకును దగును. 232

క. ఒక టికువమంత గ్రాసము, నకు మాన; మ్మవియు గేస్తునకు నెన్మిది, వ
ర్ణిం గు యతీష్టం బార, ణ్యకునకు గ్రాసములు నాలుగవిరి మునీంద్రుల్. 233

వ. ఇట్లు నియమితాహారుండై గాయత్రీపు శ్చరణం బొనర్పవలయు. నయ్యది ప్రారంభిం
చుటకు యథోక్తకాలంబు వెదుకఁదగునని వెండియు, 234

క. అనఘాత్ములు విప్రులు మం, త్రనిధులు స్వస్తిని పఠింప నాందిశ్రాద్ధ
మ్మును సలుపవలయు భోజన, మున వస్త్రమ్ములను ద్విజులు ముదమందంగన్.

వ. పదపడి శివక్షేత్రమ్ముల నయ్యది గుర్వానుజ్ఞానుసరణమ్ముగ జపింపవగునని వెండియు

క. ప్రారంభదినము మొదలుగ, నైరంతర్యముగఁ దుదిదినముదనుక నొకం
దారీతి హెచ్చుతగ్గులఁ, గూడనిగతి జపముసేయఁ గూరెడి సిద్ధుల్. 237

క. ప్రాతఃకాలము మొదలు వి, రామించుండగుచు రెండు యామములు జపం
బేత్రీతిఁ బ్రతిదినము, చేతము నిశ్చలముచేసి చేయఁగవలయున్. 238

ఆ. వె. పాలవంటకమ్ము పత్రసుమమ్ములు, యవలు తిలలు గొనియు నధిక నియతి
తనరఁ దద్దశాంశమున హోము మొనరింప, మంత్రసిద్ధి యత్రమమునఁ గలుగు.

చ. అకుటిలబుద్ధి నిమ్మనువు నాత్మ మతెయ్యదిగోరి చేసినఁగా
వికలముగాక కోర్కె యది వేగమ వానికిఁ జేకుఱున్ సమ
స్తకృతులు సిద్ధినొందు నిది పారె జపించెడి వారి; కిట్టి దిం
కొకఁడు జగత్త్రయిన్ దొరక దొప్పెడి దీన నశేషసౌఖ్యముల్. 240

క. ప్రతిదినము సహస్రము పరి, మితిగా జపియించు నరుఁడు మేలున్ ధనమున్
సుతులన్ బరమాయువరో, గతయున్గని సుఖ మిహమునఁగాంచుఁ బరమునఁగా.

క. వినిఁతమాత్ర దారి, ద్ర్యనివారకమైన దీనిఁ దత్పరుఁడై యే
మనుజుఁడు జపించు వానికి, ధనకనకసమృద్ధి యొందుఁ దఱుఁగుట కలదే. 242

వ. ఇంకవైశ్వదేవప్రకారమ్ము వినుము. 243

గీ. వైశ్వదేవమ్ము నలుపక బ్రాహ్మణుండు
భోజనము సేయునేని యష్మూర్ఖు కాల
సూత్రమనిమెడి నరకముఁ జొచ్చెడిఁ దల
క్రిందుగాఁ గాళ్ళుమీఁదుగాఁ గ్లేశమొలయ. 244

క. తానెయ్యది దిను జనుఁ డ, ద్దానిని వ్రేల్పంగనగు విధానమ్మున నో
మౌనిజనవర్య ః శాకం, బేని ఫలమ్మేని పత్రమేనియు హితమౌ. 245

గీ. వైశ్వదేవమ్మునకుమున్న వచ్చెనేని, భిక్ష యయ్యెడ నతనికిఁబెట్టివంప
వలయు వైశ్వదేవమునకు వలసినంత, వేఱుగాఁ దీసికొని యది ధీరులండ్రు. 246

ఆ. వె. వైశ్వదేవమందు వచ్చెడి దోషమ్ము, పఱప భిక్షువగు సమర్థుఁ డట్టి
భిక్షుకులను గారవింపమినగు కలి, దీర్పలేదు వైశ్వదేవ మనఘ. 247

క. యతియును వర్ణియు వీ రధి, పతులగుదురు సిద్ధమైన పంటకమునకే
పతితుఁడు వీరి నెడపి తిను, నతఁడగుఁ జాంద్రాయణమున శుద్ధుఁడు మౌనీ. 248

వ. పదపడి గోగ్రాస మొసంగఁ దగునని మఱియును, 249

క. అతిథి యతి యెవని గృహమును, గతాశుఁడై విడుచు నతని కాలుష్యము త
త్ప్రతితాత్మ జుట్టికొను దు, ర్గతి దాటఁదరంబె నతిథిఁ గసరినయేనిన్. 250

క. తల్లియుఁ దండ్రియు గురువును, బిల్లలు నన్నయును శ్రితులు భృత్యు లతిథులో
నెల్లరు నభ్యాగతులును, జెల్లుదురు గృహస్థపోష్యజీవులఁగుచుఁగా. 251

గీ. సోమయాగమొనర్చు భూసురున కెట్టి, ఫలము లభియించుఁ దాదృశఫలము పంచ
యజ్ఞములొనర్చు రిక్తులు నందఁగలరు, గృహికి నింతకు ముఖ్య మెందేనిఁగలదె.

క. ఇదియెల్ల నెఱిఁగియును బె, న్మదమున నేగేస్తు తాఁ బ్రమాదముగను న
య్యదమునకు నిహపరములం, దొవవదు సుఖ మతఁడు నింద్యుఁ డోమునిచంద్రా.

క. ఇది యాచారక్రమ మి, య్యది సంక్షేపముగ నారదా! తెల్పితి భు
క్తిదమును ముక్తిదమును ని, య్యది దీని నెఱుంగువారి నంబిక ప్రోచున్. 254

క. ఆచారమిచ్చు సుఖముల, నాచారము పూతుఁజేయు నవఘు నొనర్చుకా
శ్రీఁజేర్చు విద్య నొసఁగెడి, నాచారమ్మునకు రాజ్ఞి యాయంబ జుమీ. 255

## స్కంధాంతపద్యములు.

ఇంద్రవజ్రా. నిత్యాన్నదానోన్నత! నిర్వికారా!
పీత్యాశ్రయా! సర్వమనీషిముఖ్యా!
సత్యాదరా! ధర్మవిశాలశీలా!
మత్యున్నతా! సూరిసమాజనుత్యా! 256

క. అస్మదవధానవిద్యా, విస్మితపండితసమాజవివిధస్తోత్రా
పస్మృతచిరకీర్తీ! శ్రౌ, తస్మార్తపథప్రవర్తి! దర్శనమూర్తీ! 257

మాలిని. సుకృతమయచరిత్రా! సూరిసంస్తోత్రపాత్రా!
అకలుషపథవర్తీ! అన్నదానప్రపూర్తీ!
ప్రకటమృదుతరోక్తీ! భావితామానభక్తీ!
సకలనిగమచారీ! సద్గురుబ్రహ్మసూరీ! 258

గద్య

ఇది శ్రీ.............తిరుపతి వేంకటేశ్వరప్రణీ
తంబగు దేవీభాగవతంబను మహాపురాణ
మ్మునందు ఏకాదశ స్కంధము.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## ద్వాదశస్కంధము.

పరిపూర్ణకీర్తితేజ, స్ఫురితాష్టదిగంతరాళ। పుణ్యసుశీలా।
కరుణాకర। సాక్షాద్భ్రమరాంబా, ప్రసాదర। బ్రహ్మలోకమాన్యచరిత్రా। 1
వ. అవధరింపు మట్లు పురాణకథనోన్ముఖుండగు వ్యాసునకు జనమేజయుం డిట్లను. 2

## సురగర్వాపహరణము.

క. మునినాథ। ద్విజులందెల్లర, కును శక్తి యుపాస్యయంటి కొందఱక యాశ
క్తిని విడిచి యితరులను గొ, ల్వనేల మతిగొంద ఱిడియు వచియింపఁదగున్. 3
వ. వైష్ణవులమనియు, గాణపత్యుల మనియుఁ, గాపాలికులమనియు, బౌద్ధులమనియు,
ననేకు లనేకవిధమ్ములఁ బ్రవర్తింతురని వెండియు, 4
తే. గీ. బుద్ధిమంతులు పండితుల్ శ్రద్ధగలుగు, వారలే తర్కతత్పరత్వము వహించి
వేదముల నాస్థవిడిచి పల్విరములైన, మతముల మెలంగఁ గతమేమి। మౌనివర్య। 5
వ. ఇది యిట్లుండ మణిద్వీపమహిమంబు విశేషించి వినవలతుఁ బ్రసన్నులగు గురువు
లకు శ్రద్ధగలుగు శిష్యులయెడ దాఁపఁదగు రహస్యముండదుగదా యన రాజునకు
ముని యిట్లను. 6
తే.గీ. శ్రద్ధగలవాఁడ వెక్కుడు బుద్ధి గలుగు
వాఁడ వగుటను నీకుఁ జెప్పని దొక విష
యమ్ము గలుగదు వచియింతు నమ్మదమున
వినుము రాజేంద్ర। యద్దానఁ గనుము శుభము. 7
క. మును రక్కసులను సురలును, బెనఁగిరి నూఱేండ్లు అందు విజయమ్మమరుల్
గొనిరి పరశక్తికరుణను, జని రసురులు దివము డిగి రసాతలమువకున్. 8
చ. పిదపసురల్ మనమ్మున వివేకము దక్కి "పరాక్రమమ్ము లే
మి దనుజాలెల్ల దీనత గమించిరి స్వర్గము వీడి నవ్వనం
పదలుమ సన్మదీయమనబాహుపరాక్రమమే గడించె" నం
చుఁ దరితమత్వమున్ మఱచి సొక్కుచు సోలుచు విఱ్ఱవీఁగుచున్. 9

క. పరశక్తి శక్తి కలిమిని, స్వరీశత లభించెనంచు స్వాంతమున నొకిం
తరయక మైమఱచి యిటుల్, దిరిగెని తఱి నంబయున్ మదిం దలపోసెకా. 10

క. అకటా! వీరలు మచ్చ, క్తికతన స్వర్భోగమంది తేఁకువపెసి యి
ట్లొక కొంతయేని నను దలఁప, దక చెడిపోవంగ నన్నవారు వివశులై. 11

క. అని యెంచి సహజకరుణా, ఖనియగు నయ్యంబ వారిఁ గరుణింప నొకిం
తనరాని యక్షమను పే, రునఁ బొల్చెడి తేజమై నిహూధి మెఱయుచున్. 12

క. కనుపట్టిన నత్యద్భుత, మును గాంచరాని హితమును విస్మితో
టనిఖమ్ము నదృష్టచర, మ్మనఁ నగు నత్తేజ మొకసముదయము గనియెకా. 13

క. కని విస్మయ మెంతయు ఘన, మునమొనఁగ నేను మొక్కొ మున్నెన్నఁడుఁ జూ
చిన యదియున్ వినినట్టిది, యును గాదని యొకరిమొగము లొకరు గనుచున్.

క. ఇది దైత్యుల వైనమొ, లే, క దురుద్ధరమైన మాయ గావలయునో, యి
య్యది యెవరు పంపవచ్చిన, యదియో! యని యెల్లరును మహాశ్చర్యమునన్. 15

వ. కొండొక విచారించి నిశ్చయమ్మున కరిగి యడిగినంగాని నిర్ణయ పనశక్యమ్మని
యింద్రుండు వహ్నిం బిలిచి. 16

క. మాకెల్లరకును మొనగ మీ, వేకద, యటుగాన నీవయేగి యదియేఁ దా
నేకతన నిటకు వచ్చెనొ, వే కనుఁగొని రమ్ము నాఁగ వేగ నకంచుకున్. 17

క. చని యెదుట నిలువఁబడు నం, తన యక్షం బనినిఁ గాంచి తగనిట్లను, నో
యనఘా! నీవెవ్వఁడ వే, పని నీయది తెల్పు నాఁగఁ బలుకు ననలుఁడున్. 18

క. "ఏ నగ్నిని సర్వదహన, మే నాపని" నాఁగ, నొక్క తృణ మటనిడి "యి
ద్దాని దహింపుము చూతము, కానీ నీశక్తి" యనఁగఁ గనలుచు నతడున్. 19

క. తన యాఖ్యశక్తియు నలు, వినియోగముచేసి తుదకు విముఖుండై, ల
జ్జను గొని సురేంద్రు సన్నిధి, కిని జని వృత్తాంత మతనికి నొడివె నెల్లన్. 20

వ. ఇంద్రుండును విస్మయాకులుండై, వాయువుంగని నీవరిగి తత్తేజో నిర్ధారణం బొన
రింపుమనుడు, నరిగిన, యక్షం "బెలవచ్చితి? వేశక్తియది?" నావుడు. 21

క. ఏ నఖిలబాలనమ్మును, బూని యొనర్పంగ నేర్తు భూతమ్ములు న
న్నూని యె వ్యాపారమ్ముల, లో నొలపెకి నేన సర్వలోకహితుండన్. 22

క. అనుడుఁ దృణం బయ్యదియే, యనిలుని మ్రగముస నిడియు యక్షం బవు "డో
యనఘా! యిది చలియింపఁ, గ నొనర్పుము నీదు శక్తి గన్పట్టు" ననన్. 23

క. తనయావచ్ఛక్తియు నట, వినియోగము చేసి తుదకు విముఖుండై, ల
జ్జను గొని సురేంద్రు సన్నిధి, కిని జని వృత్తాంతమతనికి నొడివెనెల్లన్. 24

గీ. అంత సురలెల్ల "నీవు దేవాధిపతివి, గాన నీరిని వారినిఁ గనుఁగొనుఁడని
పంపనేటికి నీవేగి పరమచిత్ర, మైన యాతేజమెట్టిదో యరయుమొప్ప." 25

క. అనునంత నింద్రుఁడయ్యెడ, ఘనగర్వాంధత్వ మొలయఁగాఁ జని కనులో
నన యాతేజం బంత, ర్ధినిగనె వాసవుని మది విఱిగె లజ్జితమై. 26

క. ఏనేమని వెలవెలమను, నాననమున సురలఁజూడ నర్హంబగు నె
వ్వానికిఁ బ్రాణముకన్నన్, మానం బధికంబు దాని మాసిన మృతియౌ. 27

క. అని గర్వముడిగి చిత్త, మ్మున 'నియ్యది దేవికి తన మొనపెనో, మఱి నా
కును శరణ మదియె యగుఁగా', కను నాలో నభ్రవాణి యాతని కనియెన్. 28

క. మాయాబీజ జపమ్మును, జేయుము సుఖమబ్బ జగదజేయుఁడవై సు
శ్రీయుతుఁడవగుచు నెగడెద, వో యమరాధీశ! యనఁగ నొగి నతఁడంతన్.

గీ. ధ్యానమీలితలోచనుఁడయి నిరశనుఁ, డగుచు నొక లక్ష వర్షమ్ము లా జపమ్ము
సలుప నయ్యంబ కరుణావిశాలయగుచు, మధువమినాఁడు రెండు యామములవేళ.

క. వెనుకటి తేజోరూప, మ్మువనే పూర్వప్రదేశమునవే కన్ప
ట్టిన నంత వాసవుం డ, త్రువయముఁడై కాంచి కలితరోమాంచుండై. 31

గీ. బాలశీతాంశురేఖావిశాలమకుట, బాలకోటిరవిప్రభ బాల దివ్య
శీల నవయౌవనోద్ధతఁ జిత్రతరవి, భూషణాంచిత మసృణకపోలయుగళ. 32

క. చేలాంతర్వ్యంజితకుచ, నాలోలకృపావిశాల నంచితఫాలన్
మాలాభిరామ వేద, శ్రీ లాలితవిచపమానశృంగారాఢ్యన్. 33

క. తవదంతకాంతు లొలయు క, తన భూమికా బద్మరాగధామమ్ముగఁ జే
యు నొయారిన్ భక్తులు గో, రిన వరముల నొసఁగు కల్పవృక్షము నంబన్. 34

క. తత్తేజో మధ్యమ్మునఁ, జిత్తమ్ము వశమ్ముదప్పఁ జెచ్చెరఁగని యు
ద్యత్తరభక్తి నమస్కృతు, లత్తల్లికి నొసఁగి నుతుల నలరించి యమున్. 35

క. "ఆతేజం బెక్కడిది? య, వేతాదృశమహిమ గలుగు నెక్కటితమునఁ దా
నేతెంచు నంపె దానిఁ గృ, పాతత్పరవగుచుఁ దెలియఁ బలుకుము తల్లీ." 36

## అంబ యింద్రునకుఁ దన మహిమ దెలుపుట

క. అన నంబ వల్కె "నిది లో, కనివాసము బ్రహ్మము నవషము మాయకుమం
గని సర్వసాక్షియునునై, తనరెడి మద్రూప మిది యథార్థం బింద్రా! 37

గీ. దేని వేదమ్ము లెప్పుడుఁ దెలియఁదివురుఁ, దపము లెద్దాని వచియించుఁ దపసు లెద్ది
గోరి బ్రహ్మచర్యమ్మునఁ గోర్కె నింతు, లప్పదము సంగ్రహమ్ముగఁ జెప్పెదవిను.

గీ. బీజములు రెండు మన్మంత్రరాజమునకు, రెండు భాగములుగల నాసృష్టి యెల్ల
జగమగుటఁ గల్గె ద్వైవిధ్య మగణిత ప్ర, భావమునఁ బోల్చు నా రెండు భాగములను.

క. ఒకఁ డలరు సచ్చిదానం, దకందమై ప్రకృతి సంజ్ఞఁదగు నొక్కఁడు చం
ద్రికకుం జంద్రునకుం బలెఁ, బ్రకృతికి నా కైక్యమొలయు వాసవ! యెపుడున్. 40

ఆ. వె. శక్తిమత్తునన్న శక్తి వేఱుగ లభ్య, మగుట యనమభూత, మట్లు గాన
దగు నభేద మెల్ల జగమును బ్రళయమ్ము, నందు నేన యగుచు నలరుదాన 41

క. అవ్యక్తమైన రూపమె, యవ్యక్తంబగుచుఁ దోఁచు సురనాథ! సదా
భావ్యమగుఁ బ్రాణి బహుక, ర్మవ్యాపారమ్ము కతనఁ గ్రమపరిపాటిన్. 42

వ. అంతర్ముఖ బహిర్ముఖభేదమ్మున మాయకును ద్వైవిధ్యంబొలయు, నందు రెండ
వది తమ శబ్దంబున వాచంబడు, దానికతనఁద్రిగుణమ్ములుపుట్టె, బ్రహ్మాదులెల్ల
రును దదాత్మకులని దెలియుము. 43

క. అజునకు గుణత్రితయమున, రజమెక్కుడు హరునకుం బరఁగుఁ దమ మ య్యం
బుజనయనునకున్ సత్వం, బు జగత్త్రయనాథ! యధికముగఁ బొల్పుఁజూమీ. 44

క. స్థూలమజుఁడు సూక్ష్మము హరి, శూలియుఁ గారణమునేన సూ! తుర్యావ
స్థాలీల నాదు రూపం, బాలింపుము రెండు దెఱఁగులై యొప్పారున్. 45

గీ. అందు సగుణంబు మాయతో నంటియుండు, నిర్గుణంబు తద్రహితమై నెగడువినుము
సర్వజగ మేర్పఱచి తదంతర్విలసిత, నగుచుఁ బ్రేరేపుదాన జీవగణమేన. 46

గీ. కాలకర్మములను బట్టి కంజజాదు
లను దదుచితకార్యమ్ములకు నియమింతు;
పీమ నవిలుఁడు, వవలుఁడు వేచు, రవియుఁ
దోఁచు, హరి బ్రోచు, మదృయోద్భూతిగరిమ. 47

క. సురనాథ! కట్టిబొమ్మల, కరణిన్ మిముఁ ద్రిప్పుచుందుఁ గమమీ జయమున్
బరఁగింతు మీకొకప్పు డ, మరలకు నది యొక్కపేళఁ జొప్పడ వినుమున్. 48

గీ. కాలకర్మానుసరణమ్ముగా సమస్త, కార్యములనే స్వతంత్రనై గడపుదాన
నట్టి సకలాత్మనగు నను నరయఁజాల, కిపు డహంకారము మీఱి లెనఁగఁజూచి.
కం. కరుణింప నెంచి మీమీ, శరీరముల నుండి యుక్తిసంజ్ఞదనం నే
నరయంగనైతి. నిప్పయి ని, తర తేజము గాదు. దానిఁ దరిమే తెలియుఁడా. 50
కం. ఇది మొదలు గర్వమెల్లను, గుదియించి విశేషభక్తి గొనసాగఁగ మీ
హృదయముల నన్ను శరణము, గఁ దలఁపనగు వేఱుతలఁపు గాఁదగదింకన్. 51
కం. అని పలికి యంబ యంత, ర్హితగనె సురలదియు మొదలు తేఁకువ గాయ
త్రిని మూఁడు సంజలను భ, క్తిని జపియింతురు నియతవిధిన్ శుభఫణితిన్. 52
గీ. ఆదియుగమున నీగతి నఖిలసేవ్య. యగుచు గాయత్రి యొప్పారె నంతకన్న
పిమ్మటను ముఖ్యమెందును వెదక దొరక, దది విడువారలకుఁగల్గు నధమగతులు.

## గౌతమకృత గోవధ.

వ. రాజా! వినుము. మున్ను పదునేను వత్సరమ్ము లేకరీతి ననావృష్టిదోషమ్ము కలన క్షామం బొండుగలిగె. నప్పటి యుపద్రవమ్మిట్టిది యని చెప్పనలవిగా: దేగృహమ్మునఁ జూచిన శవమ్ముల సంఖ్య యపారమ్ము; కొందఱాకలిపట్టఁజాలమిఁ దద్వృక్షణమ్ములన పొట్టను నించికొందురు. కొంద ఱశ్వమహిషవరాహాది మృగమ్ములను మెట్టికొం దఱు మఱికొన్ని వస్తువులను యథాప్రాప్తమ్ముగ భుజించుచుఁ బ్రాణమాత్రావశేషమ్ముగ నుండిరి 54
గీ. ఇంత చెప్పఁగనేల తానెంత జాతి. గుండెకల తల్లి మేనియుఁ గుక్షిపొంటెఁ
బదినెలలు మోచికన్నట్టి బాలుఁ దనుట. వింటిమే! నాఁడుదక్కనో విభువతంస!
కం. పురుషులు తరుణులఁ దిందురు, తరుణులు సిసువులను దినఁగదలఁతురు క్షుత్తి
వ్వరి నెవ్వని సేయింపదు!, మఱియావ యెఱుఁగునె. యదయు మనుజాధిపా! 56
గీ. అట్టి యిక్కట్టుకాలమున బ్రాహ్మణులు గొంద
ఱంతయేని యుపాయము నెంచవెదకి
తుదకు గౌతమముని మహాత్ముఁడు సుభిక్ష
మతని యాశ్రమమున నున్నదనుచుఁ దెలిసి. 57
కం. గాయత్రీజపతత్పరుఁ, డై యేవేళఁ గృతదీక్షఁ దగు నతనిఁగనన్
దోయము వారము దారుస, తీయుతులై యరిగి రట కతిథులై యొకటన్. 58
గీ. దెసలు నాల్గిటినుండి యతిథులు వేవేలు స్వకుటుంబగోధనభృత్యసహితు
లై యరుగుదేర దవ్వులనరసి యామ. ముంచు సంతోషమంది 'హరం' దలంచు.

క. తగఁ గుశలం బడిగియుఁ గా, ళ్లు గడిగి యవ్వారినెల్ల లోకోత్తరరీ
తిగ గారవించి "యిటరాఁ, గఁ గతముదెల్పుఁ" డని ఘటితకరకమలుండై. 60

క. అడుగుటయు వారు తమపదు, నికుమలు తుదముట్టఁజెప్ప "నిది మీ గృహం, మీ
రొడయలు నాకిఁక నూరక, తడఁబడఁగానేల యిట్టిదాసుం డుండన్. 61

క. మీరాకకతన ధన్యత, గూరెన్ నాకింతకన్నఁ గొండొకసుకృతం
బేరును జేయరు మజ్జ, న్మాంతమము సార్థమయ్యె నధికుఁడనైతిన్." 62

క. అని యనున యపూర్వకముగ, మను లిట్టిప్రులకు నభయకారకుఁడై, యొ
య్యన గాయత్రిని దాఁ బ్రా, ర్థనసేయుఁగ నంబ యిచియె దర్శనమెలమిన్. 63

గీ. అట్లు ప్రత్యక్షమై సకలాతిథులను, దనపఁదగునట్టి పూర్ణపాత్రమ్ము నొసఁగి
'యెద్దిగోరిన నిచ్చునది యిచ్చు నీ' క, టంచు వచియించి యంతర్థి ననుగమించె.

క. ఎవటం జూచిన నన్నం, బెవటంగనుఁగొన్న సూప మెటఁగన్న నని
ర్వచనీయుష ద్రసమ్ములు, రుచులం గనుపట్టెఁ దన్నిరూఢప్రౌఢిన్. 65

క. నగలఁట, వస్త్రములఁట యి, న్నఁగలమె యావస్తుసంఖ్య నగములనఁగఁది
న్నఁగ నెచటఁ గనినఁగనఁదగు, నగణితమనఁదగదె తన్మహామహిమమ్ముల్ 66

గీ. గౌతముఁడు భూమిసురులను గాంచి యివియు
యన్నరాసులు, కూరలయ్యవియు, యాజ్య
మల్లదిగో! తక్రమియ్యది, యదియు దధి, య
థేష్టముగ నారగించి సంతృప్తిఁగనుఁడి. 67

క. పదపడి వారెల్లరు నె, మ్మదు లానందరసనింపుమగ్నమ్ములుగా
నది సుఖమున భుజియించుచుఁ, గదలక యచ్చోటన యుండి కడుశ్రద్ధమెయిన్.

గీ. ఎన్నియో జన్మములు మఱి యెన్నియేని, బ్రాహ్మణారాధనమ్ములు వ్రతములును బొ
నర్చుచును దీర్ఘకాల మన్నమ్ము నవ్వు, ముఖము సంపూర్ణగతినొప్పఁజెలఁగిరచట.

క. వారిపలన వీరును మఱి, వీరిపలన వారును విని వేలును లక్షల్
గా రా మొదలిడిరఁట! సం, సారమ్ములతోడ నెల్లజనులమ్యేడకున్. 70

గీ. రత్నభూషలు దొడుగని రమణి, పట్టు, పుట్టములు దాల్పని సతి యప్పుడమి నెందు
వెదకినను గానరాదఁట! కొదువ యొకఁడు, గలుగనేర్చునె యదియు స్వర్గముగనుండ.

క. మనుజులెల్లరు స్రగ్విం, దనభూషితులగుచు దేవతలఁ గాదన, న
మ్మనుజసతులు దివ్యభూషా, ఘనులై సురసతుల గేలిగావింపనొకో! 72

గీ. ఆమ్మునీంద్రుని యాశ్రమ మంత నూఱు, యోజనమ్ముల విస్తృతి నొందె నచట
నెప్పు డుత్సవములకెల్ల యెసఁగు, రోగ, భయము దైత్యాదిభయము నెప్పటికి లేదు.

క. ఆయాశ్రమమున విప్రులు, పేయు మహాయజ్ఞముల నశేషసురల మో
దాయత్తులగుచుఁ దనిసి మ, హాయశుఁ డొక గౌతముండె యని పొగడిరొగిన్. 74

గీ. అహహ, యేమంచు దేవేంద్రుఁ డంతవాఁడు, తనకుఁ గల్పనగమ్ము గౌతముఁ డటంచు
నొక్క యెన్నివిసార్లు పేరెక్కినట్టి, యల సుధర్మను గొలువుంచి పలికె నుతుల.

క. ఈగతిఁ బంద్రెండేం డ్లను, రాగము మెయి గర్వగంధరహితుండై స్వ
ర్భోగం బొసఁగుచు గాయ, త్రీగాయకుఁ డమ్మునిమణి దేల్చెన్ వారిన్. 76

గీ. అప్పు డయ్యెడ మునియు గాయత్రి కొక్క
యాలయముఁ గట్టె మునివరు లచట నెపుడు
నలుపుచుండ్రు పురశ్చర్యః సమృశమొందు
గాదు తత్స్థానమునకు విక్కము నృపాల. 77

క. అటఁగన్పడు నంబిక యి, ప్పటికిని బాలికయుఁ దా యువతి వృద్ధయునై
జటిమండలికిఁ ద్రిసంధ్యల, నటనము గావించుచుఁ గనద్భూషణయై. 78

గీ. అంతనొక్కెడ నారదుం డటకువచ్చి, యర్చితుండయి "గౌతమ! యహహ! నీయ
శమ్ము వేమఱు పొగడుదు సత్యలోక, మందు స్వర్గమ్మునందుఁ దానెందు నిండె. 79

క. మొన్న సురేంద్రుఁడు సభ ని, న్నెన్నిన నేనాలకించి యిటకు వినుఁగనన్
గ్రన్న నరుదెంచితిని నీ, కన్నన్ గలఁదే యొకండు గౌరవమునకున్". 80

క. అని పొగడి పిదప గాయ, త్రి నికేతమ్మునకు నరిగి దేవికి హర్షా
శ్రునయనుఁడై మ్రొక్కిడి నుతు, లొనరిచి దివమేగె నంత నొక్కెడ విప్రుల్. 81

గీ. గౌతముని వారదుండింతగా మతింపఁ, జనునె యమృసీర్ష్య నెమ్మనమును గలంప
నతని కపయశమును గూర్ప నాత్మనెంచి, రకట! యేమనవచ్చు బ్రాహ్మణుల చెయ్ది.

గీ. అంతఁ గొంతకాలమునకు నఖిలలోక, సౌఖ్యదాయకమగుచు వర్షమ్ము గురిసె
దానఁ గల యెల్లదేశముల్ తాన విరిసెః, నట్టి వార్తను విని బ్రాహ్మణజనమ్ములు.

మ. విని యేదేని నిమిత్త మేర్పఱచి యవ్విప్రేంద్రునిన్ శాపద
గ్ధునిఁ జేయన్ సమకట్టిరక్కట! మహాత్ముల్ గారె! తాదృఙ్మహా
జనుఁ బొంగించిన తల్లిదండ్రు లిడియున్ సామాన్యమే! తిన్నయిం
టను వానమ్ముల లెక్కపెట్టుట విహారం బెంచ విప్రాళికిన్. 84

గీ. అంత నొక వృద్ధగోవు మాయ నొనరించి
గౌతముని యజ్ఞశాల వంకకును దఱుమ
నది యచ్చటను తపమొనరించు నట్టియెడకుఁ
జన నతఁడు ద్రాఁకఁబోలె 'హా' యనుచు; నదియు. 85

క. ప్రాణమ్ములు త్యజియించిన, మౌనులు గుమిగూడి గౌతమ మునికిఁ దగునే
యీ నియతి నెట్టవంటగ, ధేనువు నిటుచంపె నకట! తేఁకువ వలదే. 86

క. అను పలుకులు విని గౌతముఁ, డనుకంపాకంపితాంతరంగుండై క్ర
న్ననఁ దపము విడిచి మృతగో, వును గని యెంతయును నశ్రుపూర్ణాక్షుండై. 87

గీ. గతమునకుఁ జింతచేసినఁ గలదె ఫలము
కారణం బేమొ యూహింపఁ గడఁగు టొప్పు
టంచు యోజించి నేత్రమ్ము లట్టె మూసి
జ్ఞానదృష్టిని గాంచె నిక్కమ్ము నెల్ల. 88

క. కను గొని యిది విప్రుల చే, సిన పని యని మనమునందుఁ జింతించి కటా!
యని లోనఁ గసలు గమురఁగఁ, గనుల ననలకణము లురులఁ గలుషితమతియై.

## గౌతముఁడు బ్రాహ్మణుల శపియించుట.

గీ. బ్రాహ్మణాధములార! యిప్పట్టునందు, నెట్టవంటగ నయశంబుఁ గట్టనెంచి
యట్టి దుష్కృతిచేసిన యఘము గలదె, యైన క్షమియించితిని మిమ్ము నతిథులగుట.

ఆ. వె. వేదమాత యగుచు వెలసిన గాయత్రి, జపము మీకు నింక సఫల మగుచుఁ
బొదలకుండుఁ గాక! పొసఁగదు వేదమ్ము, లందు శ్రద్ధ, పొసఁగ వధ్వరములు.

క. శివుని యెడ శివము నవునెడ, శివశాస్త్రము నెడల మీకు సేవకభావం
బు వృథా యగు మీరిఁక నె, ల్ల విధమ్ములఁ గం దధము లిలఁ శూన్యులరై. 92

గీ. దేవియందుఁ దత్కళలను దేవి నిలుపు, చోటులను దేవి సద్భక్తకోటులందు
దేవి యుత్సవముల సూడఁ, దివురు నెడల, మీకు నధికార మీమీఁద లేకపోవు. 93

క. శివకల్యాణదిదృక్షయు, శివభక్తార్చనయు మఱియు శివభక్తులు దా
ల్చు విభూతిఁ రుద్రాక్షల, సు విముఖులై మీ రధమత మూల్కొనుఁ డింకన్. 94

గీ. జ్ఞానమున శాంతి దాంతిని జన్మములను, నగ్నిహోత్రమ్మునను నిగమాధ్యయనము
నందు నుత్తమదానమ్ములందుఁ బితృపు, కర్మముల మీరు వింతని గాంతురింక. 95

క. శ్రీదేవీతరులగు నా, యాదేవతలందు భక్తినంది యుదరచ
క్రాదికచిహ్నితులై పొలు, పేది యధమభావ మందుఁ డెల్లరు విప్రుల్. 96
క. కొందఱు కాపాలికులై, కొందఱు పాషండులగుచుఁ గొందఱు బౌద్ధా
నందులయి వేదవిద్యా, మందతగని చెడుదురు నాదు మాటకతమునన్. 97
క. పితృమాతృసుతభ్రాతృ, త్మతనూజాభార్యలను వృథాద్రవ్యాస
క్తతఁజేసి వేదముల ధ, ర్మతతుల విక్రయమొనర్చు మతియెకబ్బుఁగా. 98
గీ. మాతృకన్యానుగాములౌ మందమతులు, భగినుల రమించునట్టి దుర్భగులు పరయు
వతులఁ జెఱపట్టు దుర్మార్గవర్తనులును, గాఁగలరు మీకొలమ్ములఁ గలుగు జడులు.
క. ఏనిడిన శాపమిది మీ, కీనాఁటనకాక మఱియు నెల్లయుపుడు మీ
మీ నామరూపములు వం, శానుసరణ మొలయ నాశమందఁగఁ జేయున్. 100
క. పలుమాటలేల మీకుఁ గ, నలి గాయత్రి యెడఁబొందు, నరకము మీవా
రలకెల్ల వాసమగు" నని, పలికి యతం డంబ గుడికిఁ బయనము సేసెన్. 101
క. చనియంబకు మ్రొక్కెడ న, జ్జనియు ద్విజగణమొనర్చు చర్యకు నాశ్చ
ర్యనిమగ్నచిత్త యయ్యెన్. గనఁదగు నిప్పటికి నట్టికళ యామెయెడన్. 102
క. జనని యిటు నవ్వుచును నా, తనిఁగని శాంతింపు మెందుఁ దగదే భుజగ
మ్మునకిడు పాల్విషమగుట ము, జనత తదన్యతయుఁ గర్మజన్యము లనఘా. 103
వ. అనుటయు. 104
గీ. గౌతముఁడు శాంతిఁజెందె; ద్విజాతులెల్ల, శాపమున శ్రుత్యపేతత సంభవింప
వెంతయేనిఁ బశ్చాత్తాప మినుమడింప, సిగ్గుగొని గౌతమముని సతుఁజేసి పిదప. 105
క. కరుణింపుము కరుణింపుము, కరుణింపుమటంచు నైకకంఠమ్ముగ నె
ల్లరు వేఁడిరి; తత్క్షణమునఁ, గరుణార్ద్రుండయ్యె నధిప! గౌతమమునియున్. 106
క. హరి కృష్ణుండై యెపుడవ, తరించునంతదాఁక మీకు దప్పదు నరక
స్థితి వాసమ్మటుపైఁ గలి, ధరపై జనియించి శాపదగ్ధుల గుఁడీ. 107
క. నా శాపము ద్రిప్ప కొనెడి, యాశయమదిం గలదయేని యుర్విన గాయ
త్రీశక్తిఁ గావింపుఁడు. నాశక్యమె త్రిప్పఁగ నాశాపమ్ముల్. 108
క. అని వారి విడిచి గౌతమ, ముని యిది ప్రారబ్ధమని సుముఖుండై శాంతిం
గనెఁ దత్కారణమున భువి, జనియించిరి వంతగుల ద్విజాత్యాకృతులన్. 109
సీ. పంక్తిభులయ్యును బరదారలంపటుల్, గాయత్రి నెఱుఁగని కష్టమతులు
తప్తముద్రాంకితుల్ ధర్మవిహీనులు, పాషండవర్తనుల్ పరమపాత్రు

లాచారభూమ్యు లనూచానవృత్తవ • ర్తితులు తలోదరీజితు లహితులు
కాపాలికరతులు కౌలాచరణమతుల్ • భక్తిభూమ్యులు పరశక్తి నెఱుఁగ
గీ. నేరని కుమతులగుచు వనేకదుర్వి • దగ్ధమార్గముల మెలఁగి తరణమునకుఁ
గాక తిరిగియు నరకానుగతికిఁ బాలు • పడుచు రెన్నటికిని వీరు పరము గనరు. 110
క. అదిగాన సద్విజవరులకు, మునమిము జగదంబ సేవ్య భూవర! యాయం
బ దగు మణిద్వీపమ్మున, నది యిదమిద్ధమని తెలుప నలవియెయెందున్. 111

## మణిద్వీపవర్ణనము.

క. బినను వచించెదను విను, నా నేరుమ కొలఁది లోకనాయకిచే స
న్మానింపం బడియెడి త. త్స్థానము విధిలోకమునకుఁ దగు మూర్ధ్వమునన్. 112
చ. అదిదగు సర్వలోకమను నాఖ్యను దానికి నీడు చూడ నీ
వనియును నాల్గు లోకములఁ బొల్పడ దొండును; సృష్టికాది నం
బ దనకుఁగా యదృచ్ఛమెయి మాధవుఁడాదిగ వేల్పులుండు నా
స్పదముల కన్న మిన్నయగు భాతిని దాని సృజించె భూపతీ! 113
క. కైలాసము కన్నను మఱి, గోలోకముకన్న నదియ గొప్పయగుటఁ గా
దే! లోకప! సర్వమనం, గా లోకులు దానివాదఁగాఁ దివురుట యున్. 114
గీ. అదియ బ్రహ్మాండముల కెల్ల నాతపత్ర
మన నడరు దనిచుట్టును సుధాజలధి
పరఁగ, యయ్యెడ గల రత్నవాలుకలును
దక్కఁగల వస్తువులు దెల్పఁ దరమె నృపతి! 115
గీ. ఒలయు నట నొక్కకోట యయోమయముగ
నెత్తె యేడామడ యొనరంగ వింత దాని
విస్తృతి యటంచు వచియింప వెజ్జినే! నృ
పాల! యెల్లెడ నట ద్వారపాలు రుంద్రు 116
క. నలుదెసల ద్వారముల బురు, జుల నలరెడి రక్షకులమ జూడఁగవలెఁగా
కిల నొకని శక్యమే! ల, క్షలు కోటులు ననుమఁ జెప్పఁగా విని తెలియగా. 117
క. జనవిదన్న నచకని, దను వేల్పులఁ దేఁడు లచట నమమ్ముబనా
నవిరము విల్తుని తద్వా, హనమంటాస్వనము దిక్కులన్నియు నిండగా. 118
క. అట నొప్పెడి రత్నద్రుమ, పటలసమావృతములైన వనములుమ నము
త్కటమధురవారిపూరిత, తటాకములు మునమొనరంగఁ దగు నెవ్వరికిన్. 119

గీ. మితి నతిశయించి కాంస్యనిర్మితమయి గగ
నము స్పృశించుచు నాపైని నమరు పింక
నొక్క ప్రాకార మయ్యెడఁ బెక్కు గోపు
రములు వనములు నిఁ పమానములు గలవు. 120

క. అట నొలసెడు పూలును ఫల, పటలములును గోకిలాది పక్షులును మృగీ
పటలములును మదికింపున్, ఘటియించుచుఁ గా వానిఁ బొగడఁగా నాతరమే. 121

వ. ఇయ్యది వెనుకటిదానికన్న శతిగుణతేజంబు గలిగియుండు నిద్దాని కవలఁ దామ్ర
సాలమ్ము వొల్చు; నియ్యది చతురస్రమ్మును సప్తయోజనోన్నతమ్మునై యభేద్య
గతి వలరు. 122

క. ఈసాలములకు నడుమఁగా, భాసిల్లున్ గల్పవాటి బంగరుకన్నఁగా
భాసురములైన పూవుల, రాసులు జివురులును నచట రాజిలు నెపుడున్. 123

క. ఫలముల నెల్లెడ బీజ, మ్ములు రత్నములై తనర్చు భూమిశఁ బరీ
మళ మేతదీయ మెల్లెడ, నలమున్ బదియోజనముల యంతటిమేరన్. 124

గీ. పుష్పసింహాసనమ్మున బూలగొడుగు, బూలతొడవులుగలిగి యెప్పుడు వసంతుఁ
డవ్వనమునందుఁ బుష్పాసవాతఘూర్ణి, తాక్షుఁడై భార్యలఁగూడి యాడుచుండు.

వ. మధుశ్రీయని మాధవశ్రీయని యతనికి నిర్వురుభార్య లవ్వారల సౌందర్యం బనుప
మము; మఱియు నయ్యెడ. 126

క. అంగనలు దండమెఱయ మ్మృ, దంగధ్వను లొలయఁగా మహాంగాది రవం
బంగములఁ బరవశత్వం, బుం గొలుపన్ బాడికొం డ్రెపుడు గంధర్వుల్. 127

వ. దీని కవల సీసపాలంబు వఱలు; నియ్యదియు నెత్తున నట్టిదియ. మఱియు వీరెంటికి
నడుమ సంతానవృక్షవాటిక యలరు. 128

క. ఆయెడఁ గాంతలు వీవన, లే యెడలఁగా వీవఁ దనకు విరుదెనల శుక
శ్రీయు శుచిశ్రీయును దగ, నాయకుఁడై గ్రీష్మఋతువు నంవర పొల్చున్. 129

వ. దీని కవ్వల నిత్తడికోట యలరు; నియ్యదియు మున్నతి నట్టిదియ. ఈరెంటి నడుమ
హరిచందనవనంబు వొల్చు: దీనికి నాథుండు వర్షర్తువు నభశ్శ్రీ మొదలుగాఁగల
పండ్రెండుగురు భార్యలతో నలరెడి. 130

క. నవపల్లవముల నెప్పుడు, నవనిజములు లతలు నలరు హారితతృణసమా
జవృతమై మెరదర యొలయున, దవిశేష నదీతటాకతతు లొప్పు నటన్. 131

వ. పతులతో నియ్యెడ దేవత లెప్పుడును విహరింతు; రిద్దాని కవలఁ బంచలోహమయ

మ్మగు సాలమ్ము వెలుఁగు; నిట మందారవృక్ష వాటిక తనరు; నియ్యెడ నిషలక్ష్మియు నూర్జలక్ష్మియు నను తనసఖులతో శరదృతువు వర్తించు; నీమీఁద వెండికోట యొక్కఁడు సప్తయోజనోన్నతంబగుచు నొప్పు. 132

గీ. పారిజాతవనం బిట వఱలుఁ దన్పు, మునుల గంధమ్ము దశయోజనములు చెలఁగు నగణుఁడై, సాయుధుండయి సర్వరాగి, హితకరుం డట హేమంతఋతువు వొల్చు.

వ. ఇతనికి సహశ్రీయును, సహస్యశ్రీయును భార్యలు; లీకోట కనంతరమున బంగారు కోట కలదు: 134

క. కలవు కదంబకతరువు లటఁ, గలుగున్ మదిరారసమ్ము కడపలకొలఁదిన్ తలమే తత్పానమ్మునఁ, గలిగెడి యానందమదియు గణుతింపంగన్. 135

వ. అటఁ దపశ్రీ తపస్యశ్రీలతో శిశిరర్తువు నిలుచు; మఱియు సిద్ధులనేకులు సకుటుంబ సపరివారులై సుఖం బనుభవింతు రిద్దాని కవలఁ బుష్యరాగమయమ్మగు ప్రాకా రమ్ము వొల్చు; నయ్యెడ నుండు భూమియుఁ దక్కుంగల పదార్థమ్ములును దన్మణి మయమ్ములు కానెఱుఁగునది. ఇయ్యది తేజమ్మునఁ బూర్వసాలమ్మునకన్న లక్ష గుణితంబగు; నియ్యెడ నష్టదిక్కులను నింద్రాది దిక్పాలురు వసింతురు. ఈమీఁదఁ గుంకుమారుణంబగు పద్మరాగప్రాకారంబుగల దయ్యది పదియామడ వొడవుగలిగి యుండు. ఇచ్చట భూమియును దత్తత్పదార్థమ్ములును బద్మరాగమణి మయంబులై యొప్పు; నిట గోపురమ్ములును మండపమ్ములును ననేకమ్ములు తనరు; మఱియుఁ బింగళాక్ష్యాదినామ ప్రసిద్ధచతుష్షష్టికళల కియది నెల; వక్కళలు. 136

క. అనలము గ్రక్కుచు సంభ్రమము, లను మ్రింగుదుమో జగత్తులను ద్రుంతుమొ సూ ర్యు వడంతుమొ వాయుస్తం, బన మొనరుతుమో యటంచుఁ బలికెడి వెపుడున్.

క. ఏకై కాక్షౌహిణి త, ప్పేకాలము చుట్టుఁ గొలవ నేపనియేనిఁగా జేకొని యొనరుతు మనుచుగా, గేకలు వేసెడిని సముదకేళీరతిమై. 138

క. ఒకలక్ష బ్రహ్మాండము, లొకత్రుటిలో నమయఁజేయు నొకశక్తియు శ కికలిగి యొప్పెడి భూపా, లక సర్వైక్యఁబు గల్గ లక్ష్యమె యెంచన్. 139

వ. దీని కవుల గోమేదమణిమయమగు సాలమ్ము గల దయ్యదియును నౌన్నత్యమ్మున నిట్టిదియ; భూమ్యాది తత్తత్పదార్థమ్ములును యథాహార్యమ్మునం దన్మణిమయ మ్ములు. మఱియు నీయెడఁ బిశాచవదనలును యుద్ధోత్సుకలును విరుపమబల స న్నలును నగు విద్యాదిశక్తులు మువ్వదిమువ్వురు ప్రత్యేకముగఁ బదేసి యక్షౌ హిణులు సేనలు గొలువ వసింతురు. 140

క. దీనికవుల వజ్రమయ, మ్మై నెగడెడి భిత్తికలను నలరెడి దుర్గం
బానందదాయకంబై, భూనాయక! వొలుచు వజ్రభూములతోడన్. 141

వ. ఔన్నత్యాదికంబు సర్వమును యథాపూర్వంబు; యీయెడ ననంగ రూపాదిక భువనేశ్వరీ పరిచారికలు కొందఱు ప్రత్యేకంబుగ నొక్కొక్కరి నొక్కొక లక్షచేటికలు గొలువ వసింతురు. 142

క. ఈ సాలమ్మున కావల, భాసిలు వైడూర్యజాలభాసురమై యెం
తే పొగడగు ప్రాకారము, కాసారములును వనులును గల వయ్యెడలన్. 143

వ. ఔన్నత్యాదికంబు యథాపూర్వంబు; యీయెడ బ్రాహ్మ్యాది మాతృకలు స్వస్వసేనా పరివృతలై జగత్కల్యాణదాయినులై యొలయుదురు. 144

గీ. అమరు నయ్యెడ నాల్గు ద్వారములయందు
నేనుఁగులు గుఱ్ఱములును ననేకములగు
వాహనమ్ములు సింగముల్ సాహసమునఁ
బొల్పెడి పదాతులు నగణ్యముగ నృపాల. 145

వ. దీని యనంతరమ్మున నింద్రనీలమణిమయమ్మగు ప్రాకారంబుండు నిమ్మదియు యథాపూర్వోన్నత్యాదిభాసురంబు యని యెఱుంగునది. 146

క. నానాయోజనవిస్తృత, మై నెగడున్ షోడశారమగు పద్మ మొం
డానెడవున శక్తులు మఱి, దానన్ బదియాఱుగురు సదా యుంద్రు నృపా. 147

వ. ఈ కరాళ్యాదిశక్తుల దేవీసైన్యములు నడుపువారిలో నెల్ల ముఖ్యమగు వారలు; దీని కవుల ముక్తామయమ్ము దశయోజనపరిమితమ్మునగు సాలంబు పూర్వోక్త లక్షణలక్షితంబై యొప్పు; నీయెడ దేవీసదృశాకారులగు ననంగకుసుమాదు లెన మంత్రు మంత్రిణులు గలరు. 148

క. జ్ఞానవతులు సుందరులు స, దానందలు నెల్లవార్త లరసెడి జాణల్
శ్రీనిధు లమానభోగని, దానలు శిచ్ఛక్తి పొగడఁ దరమే రి కగునా. 149

వ. వీర లెల్లవుకు నంబికుఁ బ్రపంచవార్తలఁ దెలుపుచుందు; రిద్దానికవుల మరకత సాల మ్మలరు; నిమ్మదియుఁ బూర్వోక్తలక్షణ లక్షితంబు. ఇట షట్కోణయంత్రంబుగల దద్దాన గాయత్రీసావిత్రులు బ్రహ్మ విష్ణు రుద్రాగ్ని కుబేర వరుణమదన విఘ్నేశాదులు స్వపరివార సహితమ్ముగ నాయాకోణమ్ముల నివసింతురీ యెడలన వేదమ్ములును స్మృతులును బురాణమ్ములును మూర్తిమంతమ్ములై వెలింగెడి।

నిద్దాని కవుల శతయోజనోన్నతమగు ప్రవాళసాలమ్ము వఱలు. నియ్యదియుఁ దక్కఁ
గల లక్షణమ్ములఁ బూర్వోక్తసాలతుల్యంబు. 150

గీ. అచటఁ బంచభూతములకు నాధిపత్య
మలరు నొకయైదుగురు శక్తు లలరుచుండ్రు
తనరు హృల్లేఖగగనరక్తయుఁ గరాళి
కయు మహోచ్ఛుష్మ యనియు నాఖ్యలు నృపాల. 151

వ. వీర లందఱును దేవీతుల్యవేషమ్ములు గలవారు; దీని కవ్వల బహు యోజనవిస్తీ
ర్ణమ్మగు నొకరత్నమహాసాలమ్ము గలదు; దియ్యదియుఁ బూర్వోక్తలక్షణలక్షితం,
బీయెడ నామ్నాయదేవులు వసింతురు. 152

క. శ్రీదేవ్యవతారమ్ముల, నాదిమహావిద్యలును మహాతేజఃపుం
జాదీప్యమానముగ న, చ్చోఁ దనరారెదు నృపాల! సొంపులగుంపై. 153

వ. సప్తకోటిమహామంత్రమ్ము లిటఁ దనర్చు; నీసాలమ్మునకావలఁ జింతామణిగృ
హమ్ము గలదు; దిట నుండు వస్తువులన్నియుఁ దన్మయమ్ములుగా నెఱుంగఁదగు. 154

క. ఇందూద్గారోపలముల, మందారోత్కృద్గారశిలల మఱి విద్యుత్కాం
తం దన్నెడి ఱాలును జెలు, వొందందగుఁ గంబములట నున్నతదీప్తిన్. 155

గీ. అదియు దేవీసదనమున నందు వేయి, కంబములఁబొల్చు చెక్కడపు కాంతిగలిగి
మండపము లొక్కనాలుగు మలయువాని, యందచందమ్ములను దెల్ప నలవికాదు.

వ. అయ్యవి క్రమమ్ముగ శృంగారముక్తిజ్ఞానైకాంతనామమ్ములఁ బ్రసిద్ధమ్ము; లాయా
మండపమ్ములఁ గాశ్మీరవనమ్ములాదిగ ననేకవనమ్ము లలరు. 157

క. అయావనముల తావుల, నేయెడలఁగా క్రీడసల్పి యేతెంచెడి య
వ్వాయువుచే నాద్వీపం, బేయెడ గమ్మరను తావి నెసఁగు నృపాలా! 158

క. శృంగార మండపమ్మునఁ, బొంగారెడి వేడ్కఁ దామెపుడు దేవు లహో
సంగీతమ్ములు పాడుదు, రంగీకారమున నంబ యట నథ దీర్పన్. 159

గీ. ముక్తిమండపమున నంబ ముక్తినొసఁగు
జ్ఞానమండపమందు విజ్ఞాన మొసఁగు
నిరయు నేకాంతమండపమందుఁ గార్య
తంత్రములు మంత్రిణులు చుట్టుఁ దనకు దనర. 160

వ. మఱియు నియ్యెడ శక్తితత్త్వాత్మకమ్ములగు పదితొల్లుగల వద్దానబ్రహ్మయు

విష్ణుండును రుద్రుండును బ్రహ్మలై సదాశివుండు పలకయై యొప్పుదురు. దీనిపైఁ గోటికందర్పసుందరుండగు భువనేశుండు షోడశహాయనుండు మహాదేవుండు విలసిల్లు. 161

క. అనుపమ వామాసక్తి స్థాయినియై భోల్పు నంబ సంతతభూషా శ్రీయుతయై వర్ణింపఁగ నే యయ్యల కేనిగాని యెనకంబెనఁగన్. 162

క. చెలికత్తియ లెందఱో తన గొలువంగ నిచ్ఛాశక్తికూటసహితయై వెలసెని విలాసమ్ముల నఁరు జగన్నేత్రిఁ బొగడు నట్టిరు గలరే। 163

వ. మఱియు లజ్జాది పీఠశక్తులును, శంఖాది నిధులును నమ్మంబికకు సన్నిధియందలరెడి 164

క. ఆసదులవలనఁ బొడమిన మహానది లోకియేడు కలియు నమృతాబ్ధిని నా యానదులు కాంచనమ్మున పీఠము రతినములు నెల్లమెడ వంనధా. 165

గీ. ఆగృహమ్మున నద్దేవి నంతికమున వామభాగమ్మునం దట్లు వలును నంబ యతఁడు సర్వేశుఁడగుట కీసతియు చుమ్ము కారణంబు బొందులేమ నిక్కముగ వినుము.

వ. ఈ గృహమ్ము సహస్రయోజనాయామమ్ముగలిగి యంతరిక్షమ్మున నిరాధారమ్ముగ నుండు; విద్దానికిఁ బ్రళయమ్మున సంకోచమ్మును సర్గమ్మున వికాసమ్మును గలుగుచుండు. 167

క. మనుజుల దివిజుల వాగుల ననిమిషులం దెవ్వ రెవ్వ రధికోపాస్తిన్ మును వలిపి సిద్ధిగాంచిరో యనఘులు వారిచట నుందు రారీతి దగన్. 168

క. ఘృతకుల్యలు మధుకుల్యలు సతతము దధికుల్యలును బ్రళ స్సగతి నటన్ శతముంకోటఁదగఁ బాలు న మృతకుల్యలు నొక్కఁడే లనేకములుండన్. 169

క. ఏకోరికఁ గోరిన నిను లోకాతీతమగు తమవులున్ గల వెప్పుడున్ శోకము రోగము జరయును నాకమునం దేవి గలుగు నటలేవు నృపా. 170

క. అందఱు యౌవనవంతులు నందఱు కాంతాసమేతు లందఱు మిగులన్ సుందరులు నచటఁ గలవా రిం దని యేమే యెన్న నెంత కృతిపతకేనిన్ 171

వ. కొందఱు సాలోక్యముక్తులును, గొందఱు సామీప్యముక్తులును, గొందఱు సారూప్యముక్తులును, గొందఱు సాయుజ్యముక్తులును నై యుందురని వెండియు, 172

గీ. మూర్తిమంతమ్ములగుచు నెప్పుడును సప్తకోటిమంత్రమ్ము లగ్గుణపేటి నంబ నుతులు సల్పుచునుందు మన్నతుల కతుల గతులు గల్గ నెయ్యపి తగుగతి జపింప.

గీ. ఇది మణిద్వీప వర్ణన మెవ్వఁడేని దీని స్మరణంపఁ బాపముల్ మాయుఁ బ్రాణ మెడలునెడ స్మృతికిఁ దగుల విది గతియగు సకలశుభములు విద్దాన సంభవించు.

వ. ఈమణిద్వీపవర్ణనమ్మును నిత్యమ్ము పఠింపవగు; విశేషించి యియ్యది నూతన గృహనిర్మాణమ్ములఁ బఠించిన నట వసించు వారలకు భూతాది బాధలు దగులక కళ్యాణసమృద్ధి సులభం బగునని వెండియు. 175

జనమేజయుఁ డంబామఖ మాచరించుట.

క. నారాయణముని మున్నల, నారదునకుఁ జెప్పెనిట్లు నరనాయక! యా
ధోరణి వచించితిని నీ, కారయ ధన్యుండవైతి వఖిలవిధములన్. 176

క. అంబామఖమొనరించి సు, ఖంబుగా నీ జనకున కిఁకఁ గావింపుము సా
రంబైన యంబికామం, త్రంబుం గొను మిచ్చెదను యథావిధిగ నృపా! 177

క. అని యాతఁ డొసఁగు మంత్రం, బును దీక్షాపూర్వకముగ భూపతి గొని ధౌ
మ్యుని నన్యులైన మునులను, బనిగొని పిలిపించి మఖము ప్రారంభించెన్. 178

క. నవరాత్రకాల మందిటు, లవనీసురవరులు జపము నదిగా శ్రీ భా
గవతము పఠియింపఁగ నై, భవమున మఖ మాచరించె భాగ్యాన్వితుఁడై. 179

క. ఎందఱ నేనియు బ్రాహ్మణు, లం దనియించెన్ మఖమున లక్షల కొలఁదిన్
విందులగు దక్షిణల నిడి, యుం దగుగతి భోజన మిడియున్ దత్పరుఁడై. 180

గీ. అంత నారదుఁ డరుదెంచి యధిపుచే న, మర్చితుండయి వలుకు నో మానవేంద్ర!
నరకగతుఁడైన నీతండ్రి సురలుగొలువఁ, జనె మణిద్వీప మంబికాసదనమునకు.

క. కృతకృత్యుడఁవైతివి నీ, కతనఁ గులంబెల్ల సుకృతఖని యయ్యె యశ
మ్ము తతంబై స్వర్గమ్మునఁ, బ్రతిలేని వికాసమునకు భాజనమయ్యెన్. 182

గీ. అనెడి నారదు వచనము లాలకించి, వ్యాసు పదములఁ బడి గద్గదారవముగఁ
బలికె జనమేజయుండు నీవలన నింత, సుకృత మలవడెఁ దండ్రి సుగతికిఁ జనియె.

క. నతియొకటి దక్కఁ బ్రత్యుప, కృతి నే నేమాచరింతుఁ గృపఁజూడుఁమటం
చతివినయమ్మున వేఁడు నృ, పతికిన్ వ్యాసుండు వల్కె బహుకృపయొనఁగన్.

క. విను మంబామఖ మెల్లపు, డొనరింపుము దేవిగొలువు మొందొకచింతన్
గన శ్రీభాగవతమ్మున, మనమిడు మిది సర్వలోకమాన్యం బధిపా! 185

వ అని యిప్పురాణమాహాత్మ్యంబు వేనోళ్ళ వక్కాణించి వ్యాసుండు చనియెఁ బిదప ధౌమ్యాదులును దక్షిణతబహూకృతుల నలరుచు స్వనికేతనమ్ముల కరిగి రని వెండియు. 186

క. జనమేజయుండు రాజ్యం, బొనరించెఁగా బ్రజలకెల్ల నున్నతసౌఖ్యం
బును గూర్చుచు భాగవతం, బును దఱచుఁ బఠించుచున్ బ్రమోద మెలర్పఁగా. 187

క. శ్లోకార్ధరూపముగ మును, లోకాంబిక మొగమునుండి లోకాతిగమై
యేకత వెలువడెఁ బదపడి, శ్రీకాంతున కేది లభించెఁ గృతకృత్యతకై. 188

గీ. దాని శతకోటిపరిమితి తనర బ్రహ్మ, విస్తరించి రచించె నప్పుస్తకంబు
వ్యాసుఁడు పఠించి సారంబుదీసి పిదప, శుకునకై సంగ్రహమ్ముగా బ్రకటపరచె.

క. పదునెన్మిదివేలగు ని, య్యది బ్రహ్మ రచించినట్టి యయ్యది దేవా
స్పదమున బహువిస్తృతము గ, నదు దీని మహత్త్వముం దలమె వర్ణింపఁగా. 190

క. పౌరాణికముఖమున నిది, గౌరవమలరార విని తగఁగా వ్యాసునిఁగా
వారసి యాతనికిన్ బూ, జారచనన్ సలుప జననసఫలత గలుగున్. 191

వ. ఆప్పౌరాణికునకు దక్షిణయు, హేమమాలాలంకృతంబగు గోవునుసమర్పించి యేతదధ్యాయసంఖ్యాపరిమితమ్ముగ బ్రాహ్మణులను నట్లన సువాసినులను గుమారీపటుసహితమ్ముగ భోజనమ్మలిడి దేవీబుద్ధిచే వస్త్రాలంకారాదులఁ బూజించి యఖండఫలమ్ముల నందవచ్చు; నిప్పురాణంబు దానం బిచ్చువారలకు భూదానంబంతియ ఫలమ్ము చేకుఱుటయకాక యిహపరసుఖమ్ములు లభించు నిది నిత్యమ్మును వినువారికి దుర్లభం బుండదు. 192

క. కనుఁ బుత్రు నపుత్రుఁడు, ని, ర్ధనుఁ డందు ధనంబు, విద్య రాఁ గోరెడి వాఁ
డును దాని నంది తన కీ, ర్తిని లోకం బందు నెల్లదెసల న్నించున్. 193

వ. వంధ్యయుఁ గాకవంధ్యయు మృతవంధ్యయు నియ్యది విని తద్దోషముక్తి నగు; నెవ్వనియింట నిది పూజింపబడు నట లక్ష్మీసరస్వతులు వైరంబు విడిచి సంతతంబు నిలుతురు; పిశాచాది బాధలట లేకుండు; జ్వరపరీతు నొకనరి స్పృశియించి యిది పఠించిన నలువది దినములకది యెట్టిదియేని నిర్మూలంబగు; నూఱుమాఱులిది పఠించిన క్షయరోగం బడఁగు. 194

గీ. ప్రతిదినము సంజవార్చి తత్పరత దీని, యందు నొకఁడేని యధ్యాయముం దగుగతిఁ
బఠనచేసెడి వారికిఁ బ్రబల జ్ఞాన, మతిశయించు విరక్తి యున్నతియుఁ గలుగు.

వ. ఇయ్యది శకునమ్ములకును నుపచరించుఁ; జతుర్వర్ణాశ్రమ్ములను సకలమతస్థులిది పఠించి కోర్కెలు వడయుదురు. స్త్రీ శూద్రులు మాత్రమిది పఠింపక ద్విజముఖమ్మున వినుట లగ్గగు; నిది వేదసారమ్మను బుణ్యమ్మునగు పురాణంబు. 196

గీ. సచ్చిదానందరూపిణి సకలజనని, హ్రీంమయి మహానుభావ లోకేశి యఖిల
శుభవిధాయిని బుద్ధిప్రచోదనకరి, నాశ్రయింతు నుతింతు నే నహరహంబు. 197

క. అని సూతుఁడు చెప్పిన విని, ముని లెల్ల రతని విశేషముగఁ బూజలచేఁ
దనియించి నతులు సల్పియు, వినయం బలరార నిట్లు వినుతించి రొగిన్. 198

క. ధీరుఁడవై సంస్కృతియను, వారిధికిం దెప్పవై శివప్రదుఁడవునై
సారంబగు భాగవతం, బారసి వినుపించితివి కృతార్థత గలిగెన్. 199

క. అను మునుల యాదరమ్మునఁ. దనిసి చనియె సూతుఁ డంబఁ దన హృదయమునం
దనుపదముం దలఁచుచు; నిది. వినినన్ సుఖమబ్బుఁ గడు వివేకము గలుగున్.

## స్కం ధాం త ప ద్య ము లు.

క. నిరుపమసాహిత్యరసా, భరణా ! దోషజ్ఞమౌళివందితచరణా !
శరణాగతశిష్యజనో, ద్ధరణైకవిలాసలోల ! ధార్మికశీలా !

ఇంద్రవజ్రా. ధీరాగ్రగణ్యార్పితధీవిలాసా !, వారాశిగంభీర ! కృపాప్రవాహా !
శ్రీరాజితోర్వీధవశీర్షరోచి, ర్నీరాజితాంఘ్రిద్వయ ! నిర్వికారా !

క. అనవద్యశశర్వాణీపద, కిసలయభసలాయితాత్మ ! కిల్బిషహరణ
ప్రసితానవద్యవర్తన !, కుసుమితసంతోష ! బ్రహ్మగురుపరమేశా !

## గ ద్య

ఇది శ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వత్యాది బిరుదాంకితులగు శ్రీ తిరుపతి వేంకటే
శ్వరులచే రచింపబడిన శ్రీ దేవీభాగవతము మహా
పురాణమ్మునందు ద్వాదశస్కంధము
సర్వమును సమాప్తము.

సమస్త సన్మంగళాని భవంతు.

శ్రీ శ్రీ శ్రీ



# ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 10 | స్తుల్య | స్తుత్య | 140 | 8 | సుభా | శుభా |
| 14 | 4 | ముద్దుకో | ముద్దులకో | 143 | 4 | నగర | నగ |
| 20 | 25 | దాపి | దావి | 150 | 22 | భయనా | భయదా |
| 20 | 28 | గొట్టు | గొట్టు | 151 | 21 | మ్మకే | మ్మనకే |
| 26 | 2 | సక్తక | సక్షత | 156 | 26 | మాదిరి | మాది |
| 26 | 6 | లారా | లార | 157 | 22 | కవి | కవి |
| 26 | 8 | కార | కారు | 158 | 9 | పంచచా | పంచబా |
| 28 | 7 | క్షుఁదే | క్షుఁడే | 168 | 12 | జ్యాతు | జ్యాత్మ |
| 31 | 16 | పఘా | పఘూ | 182 | 20 | ములను | గతులఁ |
| 32 | 9 | య్యుద | య్యువిద | 187 | 14 | గారిణి | కారిణి |
| 35 | 27 | డింద్రు | డిందు | 193 | 19 | చముల | చనముల |
| 38 | 26 | జిపిం | జపిం | 194 | 12 | క్షప్ర | క్షుప్ర |
| 50 | 18 | మలో | ముతో | 218 | 9 | విత్వ | న్విత |
| 55 | 15 | వని | నవి | 227 | 20 | శ్రీ | క్రీ |
| 63 | 28 | గాలిని | గానిలి | 227 | 21 | తా | దా |
| 67 | 19 | వ్యాఁడు | వ్యాసుఁ | 230 | 20 | గ్రితు | గితు |
| 72 | 22 | అట్లు | ఇట్లు | 235 | 27 | సుభ | శుభ |
| 93 | 15 | రవ్వ | వర్వ | 248 | 2 | మతినె | మతియునె |
| 104 | 25 | త్రవ | తప్ర | 253 | 18 | సుము | సము |
| 105 | 18 | యయ్యో | యయో | 256 | 13 | విష్ణు | విష్ణు |
| 108 | 12 | యథా | యాథా | 257 | 26 | చాణూవ | చాణూదు |
| 109 | 25 | విదుర | విదుర | 271 | 5 | గర్భియ | గర్భిణియ |
| 110 | 15 | బాహూ | బహూ | 276 | 21 | పఁదే | పఁడే |
| 111 | 11 | యడగి | యడిగి | 276 | 26 | దుఁన | దుఁడ |
| 115 | 23 | రాలా | లారా | 281 | 5 | ఆంత | అంత |
| 118 | 10 | త్రవిథా | త్రథా | 286 | 26 | దుష్ట | దుష్ట |
| 126 | 20 | విష్ణుం | విష్ణుం | 288 | 22 | నొక్కి | నొక్క |
| 126 | 27 | త్వము | త్వమేము | 301 | 8 | న్పేదున | నేర్పున |
| 133 | 12 | కార్యం | కారం | 303 | 12 | మిలిగి | |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 306 | 18 | లని | లన్ని |
| 310 | 16 | వతి | పతి |
| 325 | 5 | కుంజగదంజ | కుజగదంబ |
| 331 | 21 | నష్ట | యష్ట |
| 352 | 7 | యో | యా |
| 352 | 15 | గత | గద |
| 354 | 17 | మన | మను |
| 356 | 8 | వటి | వడి |
| 369 | 25 | పోలి | పొలి |
| 371 | 27 | ర్తు ఎ | ర్తునెవ్వ |
| 376 | 25 | దయు | దము |
| 397 | 4 | గొని | గొన |
| 398 | 7 | జీన | జీవ |
| 408 | 22 | లదీ | లజ |
| 418 | 17 | యల | యుల |
| 421 | 11 | మది | పది |
| 424 | 6 | ష్కార్య | ష్యార్క |
| 433 | 11 | ద్విప | ద్వీప |
| 433 | 25 | చిత | చిత్ర |
| 434 | 19 | బును | బునను |
| 440 | 25 | సప | సంప |
| 443 | 27 | హీబ | హీనబ |
| 445 | 26 | రంబు | రంబు |
| 447 | 22 | నతం | నంత |
| 449 | 22 | నృసా | నృపా |
| 450 | 6 | వంతన్ | చింతన్ |
| 452 | 2 | విలో | వితో |
| 452 | 11 | దద్దై | దన్నై |
| 461 | 23 | నిస్మ | విస్మ |
| 467 | 20 | పర | పల |
| 468 | 5 | బాలు | బాల |
| 469 | 18 | మూన్య | ఋాన్య |
| 470 | 6 | నయిన | నయన |
| 472 | 6 | మన్మ | మన్కృ |
| 488 | 12 | పగ | పంగ |
| 491 | 18 | ద్రున్జ | ద్రున్దనూజాన్జ |
| 493 | 1 | పి | పీ |
| 500 | 13 | వయ్యో | వయ్యే |
| 501 | 12 | విలు | విదులు |
| 505 | 12 | లారా | లార |
| 512 | 12 | ద్దతి | ద్ధతి |
| 526 | 3 | బదు | బందు |
| 529 | 24 | పతి | ప్రతి |
| 546 | 4 | రచి | రవి |
| 547 | 12 | యు, యి | యు, జనవియి |
| 547 | 14 | కతద | కతన |
| 550 | 19 | టత | తట |
| 553 | 15 | ష్టు | ష్ఠు |
| 560 | 9 | తత్వ | త్వత్వ |
| 564 | 2 | ఖము | ఖమ్మ |
| 568 | 18 | టియ | టియు |
| 571 | 20 | వినం | వివానం |
| 578 | 8 | రులజా | రుజున్ |
| 581 | 27 | సుంబా | స్యుంబా |
| 583 | 13 | నాయ్యా | నయ్యా |
| 590 | 19 | త్రాఁకు | తాఁకు |
| 600 | 19 | ర్చురు | ర్చుచు |
| 606 | 28 | ఘువి | ఘువి |
| 607 | 27 | పిపు | పిప |
| 610 | 18 | బను | బుమ |
| 613 | 23 | లనునో | జనో |
| 617 | 1 | విదుఁదు | విదుఁడు |
| 620 | 18 | దయు | దయ |
| 621 | 4 | పేన్వ | పేశ్వ |
| 621 | 8 | యందు | యుందు |
| 626 | 4 | రివి | వివి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 637 | 25 | శ్రీక్లీం | శ్రీం క్లీం |
| 642 | 10 | యోచించి | యోజించి |
| 643 | 9 | విఘ | విబు |
| 643 | 24 | పరి | నరి |
| 644 | 9 | యుళ | యుంళ |
| 644 | 16 | నతులపై | బ్రతుకున్ |
| 647 | 2 | ల్కావి | ల్కాని |
| 647 | 6 | ర్యంము | ర్యంతము |
| 647 | 12 | దమ్మ | దర్మ |
| 657 | 26 | గిడ | గీడ |
| 658 | 23 | జాప్తు | జాతా ప్తు |
| 673 | 22 | మత్ర | మంత్ర |
| 481 | 22 | భజి | ఖజి |
| 683 | 17 | జావిన్ | జా సే |
| 684 | 25 | ల్లావి | ల్లరని |
| 689 | 15 | ష్ఠుండు | ష్ఠుండు |
| 714 | 3 | విక్రి | విక్ర |
| 724 | 5 | గింగి | గించి |
| 727 | 9 | మహ | మహా |
| 731 | 27 | డెంంబు | డెందంః |
| 731 | 27 | త్రించు | త్రించుః |
| 735 | 20 | రేం | రెం |
| 738 | 23 | లకు | ఁను |
| 746 | 7 | జప | జవ |
| 747 | 16 | మాణి | మణి |
| 758 | 20 | ఱంగు | ఱఁగు |
| 764 | 14 | మనము | మము |
| 765 | 26 | చాని | దాని |
| 771 | 15 | పియించు | పించు |
| 773 | 10 | ర్వద | ర్వమతిద |
| 785 | 5 | రున | రుల |
| 785 | 21 | నప | నప్ర |
| 789 | 8 | చ్చినా | చ్చిదా |
| 789 | 28 | సుర | సురు |
| 792 | 27 | దండు | దంష్ట్రు |
| 794 | 15 | నవ్వ | నవ్వు |
| 795 | 16 | అది | అది |

518 పేజీ 4 వ పంక్తిలో కందపద్య చతుర్థ చరణమునందు "మ, ర్యాదాప్తాలిత్యముల్ గదా కాలగతుల్" అని సవరించుకోవలెను.

తక్కుంగల - అర్థబిందు స్వల్పాక్షర వ్యత్యాసములు యథాన్వయముగా సవరించుకొనఁ గోరెదము.

